# తెలుగు నాటక వికాసము



డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు

నాట్యమాలా ప్రచురణము – 3



ప్రథమ ముద్రణము : 23, డిసెంబరు, 1967
ప్రతులు : 2000.

వెల : రు. 20.00



ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి
డాక్టరేట్ పట్టమును పొందిన
పరిశోధనావ్యాసము



యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
సమాదరమున ప్రకాశితము.

ప్రతులకు :
డా. పి. సాంబశివరావు,
306–307, సీమ్‌కర్ బ్లాక్సు,
చిక్కడపల్లి, హైదరాబాదు–20.



ముద్రణము :
శివాజీ ప్రెస్,
సికిందరాబాదు.



# అంకితము

సహృదయులు, విద్యాసంపన్నులు, కళావేత్తలు,

సౌమ్యాగంభీరులు

రాజా శ్రీ మేకా రంగయ్యప్పారావు బహద్దర్ వారికి.



కృతికర్త : డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు, ఎమ్.ఏ.;పి.హెచ్.డి.

జననము : 21-7-1923.

జన్మస్థలము : బందపురం (కొవ్వూరు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా.)

తల్లిదండ్రులు : శ్రీమతి లక్ష్మీనరసమ్మ; శ్రీ రామమూర్తి.

విద్యాభ్యాసము : కొవ్వూరు జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో,
విజయవాడ శ్రీరాజారంగయ్యప్పారావు కళాశాలలో,
ఆంధ్రవిశ్వవిద్యాలయములో,

పరిశోధనము : ఉస్మానియా విశ్వవిద్యాలయములో డాక్టరేట్ పట్టముకొరకు.

ఉద్యోగము : భీమవరం, రాజమహేంద్రవరం, మద్రాసు, కడప, శ్రీకాకుళం ఆర్ట్సు కాలేజీలలో, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో – ఉపన్యాసకుడు.
ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టర్ కార్యాలయములో – పాఠ్యగ్రంథ జాతీయకరణ ప్రత్యేకోద్యోగి.
ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వములో–సాంస్కృతికశాఖ ప్రత్యేకోద్యోగి.

సమ్మానము : మార్చి, 1961 లో కేంద్రసాహిత్య అకాడెమీవారి జాతీయ బహుమతి (నేషనల్ అవార్డు) గ్రహీత.

రచనలు : తాజ్‌మహల్ (నాటిక), విశ్వభారతి (నవల), వేణువు (పద్యాత్మక గద్యము), నాట్యశాస్త్రము (గుప్తభావప్రకాశికాసహితము – జాతీయ బహుమతి పొందిన గ్రంథము), నాటకరచనాప్రయోగములు (సిద్ధాంత గ్రంథము), తెలుగునాటక వికాసము (డాక్టరేట్‌పట్ట పరిశోధనావ్యాసము),

# కృతజ్ఞతలు

పితరౌ_జగతః పితరౌ వందే.

చిన్ననాడే నాలో నాటకకళాబీజములను నాటినవారు మా బందపురం 'పిచ్చుకకుంట్ల భాగవతులు' (కూచిపూడి సంప్రదాయమునకు చెందినవారు). ఉత్సాహమే ప్రధానముగా విద్యార్థిగా ఉన్నప్పుడే పెక్కు నాటికలు రచించి, ప్రదర్శించియున్నాను — నాటి ప్రధానోపాధ్యాయులు శ్రీ పొక్కునూరి సాంబశివరావుగారి ప్రోత్సాహ ఫలమది.

ప్రాచ్యపాశ్చాత్య కావ్య - నాట్యమర్మవివేచనాశక్తిని ప్రసాదించిన ఆచార్యపాదులు — శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ జి. జె. సోమయాజి గారు, శ్రీదువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు.

రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాలలో పని చేయుచున్నప్పుడు, ఆ కళాశాల లలిత కళాసమితి కుపాధ్యక్షుడనై, పెక్కు నాటికా_నాటకములను ప్రదర్శింపజేసినాను : ఆ విధముగా రంగస్థలప్రయోగవిజ్ఞానమున అపూర్వానుభవమును గడించెడి సదవకాశమును లభింపజేసిన వారు శ్రీ ఎమ్. ఎస్. ప్రకాశరావుగారు, శ్రీ కె. వి. పున్నయ్యగారు. పిమ్మట మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు ఎమ్. ఏ. విద్యార్థులకు 'నాటక విమర్శ' ను పాఠముగా చెప్పెడి అవకాశమును కల్పించిన వారు ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావుగారు.

'తెలుగు నాటకవికాసము' పై పరిశోధన చేయగోరిన నన్ను ఆశీర్వదించి, అవకాశము కల్పించినవారు ఆచార్య జి. జె. సోమయాజిగారు, ఆచార్య కె. వి. గోపాలస్వామిగారు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, శ్రీ ఎల్. బుల్లయ్యగారు, ఉస్మానియా విశ్వవిద్యాలయములో పరిశోధకుడుగా చేరుటకు అనుమతించి, ఉపకారవేతనము నొసంగినవారు డా. సూరి భగవంతం గారు. పిమ్మట కేంద్రప్రభుత్వమువారి ఉపకారవేతనము లభించుటకు కారకులైనవారు డా. వి. ఎస్. కృష్ణగారు, డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, డా. పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు, డా. డి. ఎస్. రెడ్డిగారు.

పరిశోధనాసమయములో ఎందరో నటులు, నాటకకర్తలు, కళాభిమానులు నాయందాదరాభిమానములు చూపి, అనేకవిధములుగా సాహాయ్యము చేసినారు. మరియు మిత్రులు, శ్రేయోభిలాషులు ఆయాసమయములలో పెక్కు విధముల సహాయపడినవారు — ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ఆచార్య కె. సుబ్బరామప్పగారు, డా. బి. రామరాజుగారు, శ్రీ మడిపడిగ బలరామాచార్యులుగారు, శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు, శ్రీ పి. హనుమంతరావుగారు, శ్రీ ఎమ్. ఎల్. నరసింహారెడ్డిగారు, శ్రీ మామిడిపూడి ఆనందంగారు, శ్రీ ఏ. ఆర్. కృష్ణ గారు, చి॥ పి. యస్. ఆర్. కృష్ణారావు, చి॥ మన్నవ ఉపేంద్రరావు. ఇంక వ్యాసరచనా కాలములో నిత్యసహచరులై, నా రచనను ప్రత్యక్షరమును పరిశీలించి, మార్పులు, కూర్పులు చేయించినవారు శ్రీ మొదలి నాగభూషణశర్మగారు.

ఏకకాలమున నేను రెండు బృహద్గ్రంథములను (నాట్యశాస్త్రము ; తెలుగు నాటక వికాసము) రచించెడి అవకాశమును కలుగజేసిన సరసహృదయులు ఆచార్యపాదులు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు.

ఈ గ్రంథము ముద్రణభాగ్యమును పొందుటకు ప్రధానకారకులు నాటి సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు. గ్రంథముద్రణమునకు ధనసాహాయ్యము చేసినవారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు, యూనివర్సిటీ గ్రాంట్సు కమీషనువారు. ఆ ధన సాహాయ్యముతో ఈ గ్రంథమును నేను ముద్రించుకొనుటకు అనుమతి నొసంగినవారు డా. డి. ఎస్. రెడ్డిగారు.

ఈ గ్రంథము చివర ముద్రించిన చిత్రములలో కొన్నింటి బ్లాకులను అందజేసినవారు శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారు, ఆంధ్ర నాటకకళా పరిషత్తువారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారు.

ఈ గ్రంథమును అందముగా ముద్రించినవారు శివాజీ ప్రెస్ అధినేతలు శ్రీ ఎస్. బడే సాహెబ్‌గారు, శ్రీ బి. ఆర్. కోటీశ్వరరావుగారు.

అందరికిని నేను కృతజ్ఞుడను.

—పోణంగి శ్రీరామ అప్పారావు.

# విషయసూచిక

# నాంది

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్.

# ప్రస్తావన

తెలుగు భాషలో సుమారు రెండు వేల వరకును నాటకములును, సుమారు నాలుగు వేల వరకును ఏకాంకికలును, నాటికలును కలవు; సుమారు వేయిమంది ఏకాంకికా - నాటికా - నాటక - ప్రహసన కర్తలు కలరు. ఆధునికాంధ్రనాటకచరిత్ర ఒక శతాబ్దముపాటిదే అయినను తద్వికాసముమాత్రము అపూర్వమైనట్టిది; ఏతత్స్వరూప నిరూపణమునకు ఇంతవరకును తెలుగులో సమగ్ర ప్రయత్న మేదియును జరుగలేదు. తొలినాళ్ళలో వెలువడిన కొన్ని నాటకముల ప్రతులు ఇప్పుడు లభించుటయేలేదు. కొందరు నాటకరచయితలను గూర్చి ఎవ్వరికిని ఏమియును తెలియదు. కాగా, ఆధునికనాటకముల ఆరంభ మెప్పుడో, ఎవరుముందో, ఎవరు వెనుకయో, ఏతద్వికాస మెట్లు జరిగినదో తెలిసికొనుటకు తగిన ఆధారములు సంపూర్ణముగా లభించుటలేదు. ఇట్టిస్థితిలో నేను తెలుగు దేశము నలుమూలలును తిరిగి, పలువురు వృద్ధ నటులను, నాటకకర్తలను, నాటకకళాభిమానులను సందర్శించి, తెలుగు నాటక - రంగ చరిత్ర సమగ్రనిర్మాణమునకు వలసిన సామగ్రిని చాలవరకు సేకరించియున్నాను. మరియు, శక్తివంచన లేకుండ ప్రయత్నించి, దానికి, ఈ పరిశోధనావ్యాసరూపమున, ఒక సంక్షిప్త స్వరూపము నొసంగి యున్నాను.

నిజము చెప్పవలెనన్నచో ఒకే ఒక పరిశోధనావ్యాసమున తెలుగులోని అందరు నాటక కర్తలను గూర్చియు, అన్నిరచనలను గూర్చియు కూలంకషముగా అటుంచి, స్థూలముగానైనను చర్చించుటకు సాధ్యపడదు. ఒక్కొక్క జాతి రూపకములను (స్వతంత్రనాటకములు, అనువాదములు, ఏకాంకికలు మొ॥) గూర్చికాని, ఒక్కొక్క రచయితను గూర్చికాని (కందుకూరి, కోలాచలం, పానుగంటి మొ॥) ప్రత్యేక ప్రత్యేకముగా పరిశోధనములు చేసి, విపులములగు పరిశోధనావ్యాసములను వెలయించుటకు తగినంత విషయవిస్తృతి యిందున్నది. ఇక ముందట్టి ప్రయత్నములు జరుగ గలవనియు, అట్టి భావి పరిశోధనలకు ఈ నా పరిశోధన పునాది కాగలదనియు విశ్వసించుచున్నాను.

ఈ సందర్భమున, సరళభాషలోనేను కావించిన నాట్యశాస్త్రసమగ్రానువాదమును గూర్చి కూడ కొంత చెప్పుకొనవలసియున్నది. శ్రీఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు పేర్కొన్నట్లు ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్, హిందీ, బెంగాలి, గుజరాతి, ఆంధ్రము మున్నగు భాషలలో ఇంతకు ముందు నాట్యశాస్త్రమందలి కొన్ని కొన్ని అధ్యాయములకు మాత్రమే పరివర్తనములు వెలసినవి. కాగా, ప్రపంచమునందలి యే భాషలోనికిని సమగ్రముగా ననువదింపబడని ఈ నాట్యశాస్త్రమునకు సమగ్రానువాదము నొనర్చి, ప్రకటించిన అదృష్టము నాకే లభించినది. కేవలము మూలము ననువదించుటతోమాత్రమే తృప్తిపడక, ప్రతి అధ్యాయము చివరను ప్రాచీనాధునాతన నాట్యసిద్ధాంతసమన్వయరూపములైన విశేషాంశములను 'గుప్తభావప్రకాశిక' యనుపేర సమకూర్చియున్నాను (గుప్తభావ ప్రకాశికా సహితమగు నా నాట్యశాస్త్రానువాదము 'జాతీయ బహుమానము' ను పొందినది). ఇట్లు నాట్యశాస్త్రానువాదరూపమున ప్రాచీన భారతీయ నాట్యశాస్త్ర

విజ్ఞానమును, ఈ పరిశోధనావ్యాసరూపమున ఆధునికాంధ్ర నాటకరచనా - ప్రయోగ విజ్ఞానమును తెలుగు వారి కందించి యున్నాను. ఇట్టి ప్రథమావకాశములు నాకు లభించుట నా యదృష్టము.

రచనాప్రణాళిక :

ఈ నా పరిశోధనావ్యాసము నంతటిని ఐదు భాగములుగా విభజించి యున్నాను. ప్రథమ భాగమున నాలుగు అధ్యాయములు కలవు ; ఈ భాగము తెలుగు నాటక చరిత్రకు పూర్వరంగ ప్రాయము. ఇందు తొలి అధ్యాయము నాట్యకళావిశిష్టస్వరూపనిరూపణాత్మకము : రెండవది ప్రాచ్య-పాశ్చాత్యరూపకస్వరూపనిరూపణాత్మకము. మూడవ అధ్యాయములో ప్రాచీనకాలమున తెలుగు దేశములో సంగీత - నృత్య - నాట్యములు పొందిన వికాసమును, నాలుగవ అధ్యాయములో ప్రాచీనాంధ్రదేశమునందలి దృశ్యకళా స్వరూపములును నిరూపితములైనవి.

ద్వితీయభాగము ఆధునికాంధ్రనాటకముల ఆరంభవికాసములకు సంబంధించినది ; ఈ పరిశోధనావ్యాసమునకు ఈ భాగము హృదయస్థానము. ఇందు తొలి అధ్యాయము (1860-1886) ఆధునికాంధ్ర నాటక రచనా-ప్రదర్శనముల ఆరంభములను విశదీకరించుచున్నది. రెండవ అధ్యాయము (1886-1900) తెలుగు నాటకరచన బహుముఖములుగా వికసించుటను విశదీకరించుచున్నది. మూడవ అధ్యాయము (1900 - 1920)న ఆధునికాంధ్రనాటకముల రచనా-ప్రయోగముల విస్తృతియును, నాలుగవ అధ్యాయము (1920 - 44)న నాటకరచనకు సంబంధించిన నూత్న ప్రయోగములును, ఐదవ అధ్యాయము (1920-44)న నాటికల ఏకాంకికల వికాసమును, ఆరవ అధ్యాయమున సమకాలీన రచనలును అనగా 1944 తరువాతి రూపకచరిత్రయును దిఙ్మాత్రముగా నిరూపితములైనవి.

తృతీయభాగమున మూడు అధ్యాయములు కలవు. ఈభాగము తెలుగు నాటక చరిత్రకు సింహావలోకన ప్రాయము. ఇందు తొలి అధ్యాయమున ఇతి వృత్త - రచనా స్వరూపములను బట్టి నాటకరచనా సమీక్షయును, రెండవ అధ్యాయమున ఆధునికనాటక ప్రయోగముల వివిధ దశలును నిరూపితములైనవి. ఇంక మూడవ అధ్యాయమున తెలుగులోని నాటక విమర్శయొక్క చరిత్రయును, నేటికిని సమస్యలుగా నిలిచియున్న కొన్ని అంశముల సమీక్షయును కలవు.

ఈ మూడు భాగములందును, అధోజ్ఞాపికలు పుటల అడుగున కాక, ఆయా అధ్యాయముల చివర ముద్రింపబడినవి. పాఠకులు ఈ మార్పును గమనింతురు గాక !

చతుర్థభాగమున ఐదు అనుబంధములు కలవు. తొలి అనుబంధమున 'రచనలు' అనగా పెక్కు నాటికా - నాటక - ప్రహసనములు అకారాదిక్రమములోను, విమర్శలు కాలానుపూర్విగను కలవు. రెండవ అనుబంధమున రచయితలు అకారాదిక్రమములో పేర్కొనబడిరి. మూడవ అనుబంధమున కొందరు ప్రసిద్ధనటుల, కొన్ని ప్రసిద్ధనాటక సమాజముల పేర్లు జిల్లాల క్రమములో పేర్కొనబడినవి. నాలుగవ అనుబంధము ఉపయుక్తగ్రంథసూచి. ఇంక ఐదవ అనుబంధమున ముఖ్యపదానుక్రమణిక అకారాదిక్రమములో కలదు.

ఇంక పంచమభాగమున కొందరు ప్రసిద్ధ రచయితల, విమర్శకుల, పోషకుల, నటీనటుల చిత్రములు కలవు.

ఇంక చివరిమాట —

ఈ పరిశోధనావ్యాసము 1960 లో వ్రాయబడినది. అందుచేత ఈ సంక్షిప్త ఆధునికాంధ్ర నాటకచరిత్ర సుమారు ఒక శతాబ్ది (1860–1960) కి పరిమితము కాబడినదని తెలియవలెను. అందున 1929 తరువాతి చరిత్ర మరింత సంక్షిప్తమైనది. అసలు, 1929 నుండి నేటివరకు జరిగిన తెలుగు నాటక వికాసమును గూర్చి ప్రత్యేకముగా ఒక పరిశోధనా వ్యాసమును వ్రాయ వలసియున్నది. అందులకు జిజ్ఞాసువు లెవరేని పూనుకొందురు గాక.

—పోణంగి శ్రీరామ అప్పారావు.

*

ఈ ప్రథమ భాగమందు నాలుగు అధ్యాయము లున్నవి.

మొదటి అధ్యాయము—'నాటకవిశిష్టత' అనునది—నాటకస్వరూప నిరూపణాత్మకము. సర్వకావ్యరూపముల యందే కాక, సర్వకళల యందును నాటకము విశిష్ట మెట్లయ్యెనో ఇందు నిరూపింపబడినది.

రెండవ అధ్యాయము—'ప్రాచ్య-పాశ్చాత్యనాటకములు' అనునది—విశ్వసాహితి యందలి నాటకావిర్భావ - వికాసములను వివరించుచున్నది. ప్రాచ్య-పాశ్చాత్య నాటకముల అనువాదములు, అనుసరణములు తెలుగు భాషలో పెక్కులు వెలయుటచేత వీనిచరిత్ర దిఙ్మాత్రముగా ఇందు వివరింపబడినది.

మూడవ అధ్యాయము—"ప్రాచీనాంధ్రదేశము : సంగీత-నృత్య-నాట్యముల వికాసము" అనునది—తెలుగు దేశమున, బహు ప్రాచీనకాలము నుండియు, సంగీత - నృత్య - నాట్యములు వికసించిన రీతిని వివరించుచున్నది. ఇందు ఆ యా కాలములందు వెలసిన మహనీయుల, వారి రచనల ప్రశంస చేయబడినది.

ఇంక నాలుగవ అధ్యాయము—"ప్రాచీనాంధ్రదేశము : దృశ్యకళారూపములు" అనునది—తెలుగు దేశమున, బహు ప్రాచీనకాలము నుండియు, వర్ధిల్లిన దృశ్యకళారూపములను వేర్వేరుగ నిరూపించుచున్నది. ఇందు ముఖ్య ప్రాచీన దృశ్య కళారూపముల స్వరూప స్వభావములు నిరూపితము లగుటయే కాక మార్గనాటకాభావాది విషయములు కూడ చర్చింపబడినవి.

ఈ ప్రథమభాగము 'తెలుగునాటకచరిత్ర'కు పూర్వరంగప్రాయము.

*

## ప్రథమాధ్యాయము

# నాటక విశిష్టత

## నాట్యోత్పత్తి

తొలి మానవులు అనాగరికులై, అసంస్కారులై అడవులలో జీవించుచున్నప్పుడు ప్రకృతి సహజములైన విషయములెల్ల వారికి విచిత్రములుగానే కన్పట్టెడివి. సూర్యచంద్రుల ఉదయాస్తమయములు, వర్షము, ఉఱుములు, మెఱపులు, జనన–మరణములు, భూకంపాగ్నులు మొదలగునవి అన్నియును వారికి ఆశ్చర్యావహములే. ఆకలి దప్పులు ప్రాణికి సహజములు. మరి వానిని తీర్చుకొనుటలో ప్రకృతి తోడ్పడుచుండుటచేత వారికి ఆయా ప్రకృతి శక్తుల యెడ కృతజ్ఞతయు, భక్తియు కుదురుకొనెను. అంతియే కాదు. ఆ ఆకలిదప్పులు తీరుట కవకాశము లేనప్పుడు ప్రకృతిశక్తుల యెడ భయమును కలిగెను. ఏ ప్రకృతి శక్తికి తమయెడ దయతప్పిన దని తలంచెడివారో ఆ శక్తిని భక్తిశ్రద్ధలతో పూజించుటకు వారు మొదలు పెట్టిరి. అందువలన ఆహారము లభించియో, వర్షములు కురిసియో తమ ఆకలి దప్పులు తీరినప్పుడు ఆ శక్తి తమ యెడ ప్రసన్నమైన దనెడి భావముతో ఆనందించి, స్తుతించెడివారు. ఆ పూజలు, ఆ స్తుతులు కూడ ఆట–పాటలతో కూడియుండుట సహజము. అసంస్కారులైన, అనాగరికులైన ఆ ఆటవికుల ఆట–పాటలే నేటి నాట్య – సంగీతములకు బీజములు.

అనగా తొలిమానవులు తమకు కష్టము కలిగినప్పుడు దానికి తట్టుకొనలేక చేయు ఆక్రోశమును, ఆ కష్టము తొలగినప్పుడు ఆనందోత్సాహములతో చేసెడి ఆలాపములును సంగీతమునకు తొలిరూపములు. మానవులు తమకు కష్టము కలిగినప్పుడు దానిని తొలగించు కొనుటకు చేయు ప్రయత్నములయందలి క్రియావిశేషములును, ఆ కష్టము తొలగి ఆనందము చేకూరినప్పుడు చేసికొనెడి ఉత్సవములందలి పరిభ్రమణములును నాట్యమునకు తొలి రూపములు అని తెలియవలెను. అట్లే తమకు గలిగిన ఆనందమునుగాని, దుఃఖమునుగాని వ్యక్తము చేయునప్పుడు వారి నోటివెంట వాక్యసముదాయము—బహుశః తాళ–లయలకు ఒదిగి యుండి— వెలువడుట సహజము. అట్లు గేయరూపమున వెలువడెడి ఆ వాక్యసముదాయమే కవిత్వమునకు మూలరూపము. చిన్నపిల్లలు కోరినవస్తువు చేతికి లభించినంతనే ఆనందముతో రాగములు తీయుచు, జిలిబిలి పలుకులతో అందముగా చిందులు త్రొక్కుచున్నప్పుడు కూడ పై మూడిం టిని—అనగా నాట్య–సంగీత–కవిత్వములకు బీజరూపములను—గుర్తింపగలము.

మానవుడు పుట్టుకనుండియు అనుకరణశీలి. చిన్నపిల్లలు పెద్దలను అనుకరించుట చేతనే జ్ఞానవంతులగుచున్నారు; పెద్దలు కూడ ప్రకృతిని అనుకరించియున్నారు. సంగీత-నృత్యముల పుట్టుకను పరిశీలించిన ఈ విషయము మరింత స్పష్టము కాగలదు. మేఘముల ఉఱుములు, పక్షుల కిలకిలారావములు అవనద్ధవాద్యోత్పత్తికి కారణములైనవని భరతముని నాట్యశాస్త్రమందు పేర్కొనియుండుట గమనార్హము (నా నాట్యశాస్త్రానువాదము-పుట 829). సంగీతమునకు ప్రాణవభూతములైన సప్తస్వరములను పశుపక్ష్యాదుల అఱపులను అనుకరించియే మానవుడు సువ్యవస్థితము చేసికొనెననెడి సత్యము స్మరణీయము. పురుగులు తొలచిన రంధ్రములందు గాలిపోసికొని వెదురు గడలు ధ్వనించుట, వెంటనే—నాగస్వరమనుకొని కాబోలు—పాములు పడగలెత్తి ఆడుట, ఆకాశము మేఘావృతమై చిటపట చినుకు లారంభమైనంతనే మయూరములు పురివిప్పి నృత్తమొనరించుట విజ్ఞులకు తెలిసిన విషయములే.

పై విధముగా ప్రకృతిలో కన్పట్టు వాద్య-గాన-నృత్తముల కనుకూలములగు సందర్భములను గమనించి, తొలిమానవులు వానిని అనుకరించిరి. మానవుడు తొలినుండియు సంఘజీవి. సుఖ-దుఃఖ సమయములలో కులమువా రంద రేకమై, గుమిగూడి యుండుట సహజము. అట్లు చేరిన జనసంఘము—ముఖ్యముగా ఉత్సవసమయములలో—ఆనందోత్సాహములతో త్రుళ్ళింతలు కొట్టుచు ఆట-పాటలు నెరపెడివారు. ఆ అనాగరిక ఆటవికుల ఆట-పాటలందలి పాట-మాట-అంగవిన్యాసములే సంగీత-సాహిత్య-నృత్యములకు బీజరూపములనుట చర్విత చర్వణము. "వివాహము, పుత్రజననము, ప్రమోదము, అభ్యుదయము మున్నగు సమయములందు వినోదము కొఱకు నృత్తము ప్రవర్తితమైనది" అని భరతముని మహర్షుల ప్రశ్నకు సమాధాన మొసంగుట ఇప్పట్ల స్మరణీయము.[1] ఇట్లు తొలిమానవుల వివాహాది సంతోష సమయములందే నృత్య-గానాదులకు నాందీపూజ జరిగియుండుననుట నిర్వివాదము.

కాగా, తొలిమానవుల ఆట-పాటలనుండియే నృత్య-సంగీత-సాహిత్య-నాట్యాదికళ లుత్పన్నములైన వనునది సారాంశము. ఈ అంశమునే గ్రహించి, తొలి మానవుని 'ఆటపాట' (ballad dance) నుండియే సర్వకళలును ఉత్పన్నములైనవని ప్రొఫెసర్ ఆర్. జి. మౌల్టన్ సిద్ధాంతరూపమున ప్రతిపాదించెను.[2] గ్రీకు విషాద నాటకోత్పత్తి-వికాసములను గూర్చి వివరించుపట్ల ప్రతిపాదింపబడిన సిద్ధాంతమిది. కాని ఇది సర్వభాషా నాటకములకును వర్తించునని ఆధునిక విమర్శకుల విశ్వాసము.

భారతీయ నాటకకళా విషయమున విజ్ఞానసర్వస్వముగా వెలసిన మహాగ్రంథము భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రము. ఇది క్రీస్తుశక ప్రారంభ ప్రాంతములందు రచింప బడినదని పేర్కొనవచ్చును, 'నాట్య' మనగా ప్రదర్శించుచున్న నాటకము; లేదా నాటక ప్రదర్శనము. కావున నాట్యమనునప్పుడు నాటకరచన, నాటక ప్రయోగము - అను రెండంశములును ప్రధానములగుచున్నవి. కావుననే నాట్యశాస్త్రమందు కవి దృష్టితో నాటకరచనా విధానమును, ప్రయోక్త దృష్టితో నాటక ప్రయోగ విధానమును విపులముగా వివరింపబడినవి. ఈ నాట్యశాస్త్రమునకు అభినవగుప్తుడు (క్రీ. శ. 10 వ శతాబ్ద ప్రాంతము) 'అభినవభారతి' అను పేర ప్రామాణిక

మగు వ్యాఖ్యానమును రచించెను. నాటకరచనా – ప్రయోగములందు ఛందో – వ్యాకరణ – అలంకార–నృత్త–గీత–వాద్యాదుల జ్ఞానము కవి–ప్రయోక్త లిరువురకును ఆవశ్యకము. అందు చేత ఆయా విషయము లన్నియును నాట్యశాస్త్రమందు అనుషంగికముగా వివరింపబడినవి.

"ప్రణమ్య శిరసా దేవౌ పితామహమహేశ్వరౌ ।
నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా య దుదాహృతమ్ ॥"

అని ప్రతిజ్ఞచేసి, నాట్యశాస్త్ర ప్రవచనమునకు పూనుకొన్న భరతముని నాట్యశాస్త్రము (లేదా నాట్యవేదము) బ్రహ్మప్రోక్తమని నిర్దేశించి, దానికి దివ్యయోనిత్వము నాపాదించెను. నాట్య శాస్త్రకథన సారాంశము క్రింది విధముగా నున్నది :

యుగసంధిలో కామ – లోభ – మాత్సర్యాదులకు వశులై గ్రామ్యధర్మ ప్రవృత్తి నవలంబించియున్న ప్రజలను స్వధర్మనిరతులను కావించుట కొరకు దృశ్యమును, శ్రవ్యమును అయిన క్రీడనీయకమును సృజించుమని ఇంద్రాదులు బ్రహ్మను ప్రార్థించిరి. అంతట బ్రహ్మ సమాధిస్థితుడై, చతుర్వేదముల సారమును గ్రహించి, 'నాట్యము' అనెడి లలితాత్మకమైన పంచమ వేదమును సార్వవర్ణిక మగునట్లుగా సృష్టించెను. పిమ్మట ఇంద్రుని కోర్కె ననుస రించి, బ్రహ్మ తాను సృష్టించిన 'నాట్యవేదము'ను భరతమునికి బోధించెను. భరతు డంతట కుశలులును, విదగ్ధులును, ప్రగల్భులును, జితశ్రములును, సంశితవ్రతులును, గ్రహణ–ధారణ–జ్ఞాన – ప్రయోగసమర్థులును అయిన తన శిష్యులు నూర్గురకును నాట్యవేదమును సాకల్య ముగా బోధించి, వారిని వారి వారి యోగ్యతలకు తగిన భూమికలందు నియోగించి, ప్రయోగ విధానమును నేర్పెను. సుకుమార ప్రయోగార్థమై (కైశికీ వృత్తి నిర్వహణమునకై) మంజుకేశి మున్నగు ఇరువది నలువురు అప్సరసలను సృజించి, బ్రహ్మ వారిని భరతమునికి అప్పగించెను; అంతియేకాదు శిష్య సహితుడగు స్వాతి యను మునిని ఆతోద్యవిధానమునందును, నారద గంధర్వులను గానక్రియ యందును నియమించెను. భరత శిష్యులు నాట్యవేదమును సాకల్య ముగా నేర్చిన పిమ్మట, ఇంద్రధ్వజోత్సవ శుభసమయములో 'అసురపరాజయము' అనెడి ప్రథమ నాట్యప్రదర్శనము జరిగెను. అంతట విఘ్నకరులగు విరూపాక్షాదులు రాక్షసప్రేరితులై, నటుల వాక్–చేష్టాదులను స్తంభింపజేసి, ప్రయోగమునకు విఘ్నమును కలిగించిరి. ఇంద్రుడు వారిని తన ధ్వజముతో దండించెను. హతశేషులగు వారిని బ్రహ్మ సామపూర్వకముగా శాంత పరచెను. అయినను, బ్రహ్మ ఆదేశము ననుసరించి, నిర్విఘ్నముగా నాట్యప్రయోగము జరుగు టకు దేవశిల్పియగు విశ్వకర్మ నాట్యగృహమును నిర్మించి యిచ్చెను. దేవతలందరును, విఘ్న నివారణార్థము నాట్య గృహమందలి ఆయా విభాగములను, నటీనటులను, నాట్యోపకరణములను రక్షించుభారమును వహించి, ఆయావిభాగాదులకు అధిష్ఠాన దేవతలైరి. "ఎల్లరును ఆయా అధి ష్ఠానదేవతలను ముందుగా పూజించి, పిమ్మట ప్రయోగమును ప్రారంభించవలెను" అని బ్రహ్మ అనుశాసించెను.[3] ఈ రంగదేవతా పూజనమునే 'పూర్వరంగవిధి' అందురు.[4] నాట్య ప్రయోగ పరితోషితుడైన శివుడు ఈ పూర్వరంగము ఆకర్షణీయముగా ప్రయుక్తమగుట కొరకు 'తాండవము' (నృత్తము)ను ప్రసాదించెను.[5]

నాట్యప్రయోగ పరితోషితులైన దేవదానవు లందరును భరత శిష్యులను ఎక్కువగా గౌరవింపసాగిరి. ఇది వారికి గర్వవర్ధన మయ్యెను. క్రమముగా వారు నాట్యవేద మదాన్వితులై నాట్య సంశ్రయములైన ప్రహసనములను ప్రదర్శించుచు, సర్వలోకమును బాధింప సాగిరి. ఇట్లు అవమానితులైన మహర్షు లొకనాడు కోపావేశముతో "మీరు శూద్రాచారులు, అపాంక్తేయులు, ఇతరులను కొలిచి జీవించువారు, శాస్త్రమును అమ్ముకొని జీవించువారును అగుదురుగాక" అని భరత శిష్యులను శపించిరి. శాపోపహతులైన భరత శిష్యులు, భరతుని ఆదేశము ననుసరించి, నాట్యమును యథాతత్త్వముగా అప్సరసల కొసంగి, ప్రాయశ్చిత్తము చేసికొనిరి. అటుపిమ్మట నహుషుని అభ్యర్థనమును పురస్కరించుకొని, భరతముని ఆదేశాను సారముగా భరత శిష్యులు భూలోకమునకు వచ్చి, స్త్రీలతో కూడిన పెక్కు ప్రయోగములను కల్పించి, యథాక్రమముగా ప్రదర్శించిరి. అంతియేకాదు, భరత శిష్యులా మనుష్య స్త్రీలయం దనురక్తులై, వారితో భోగము లనుభవించి, పుత్రవంతులైరి. ఇట్లు కలిగిన సంతానము యొక్క జీవనోపాధి నిమిత్తము వారు వివిధాశ్రయములైన పెక్కు ప్రయోగములను నిబంధించిరి. పిమ్మట బ్రహ్మచే అనుజ్ఞాతులై, శాపవిముక్తులై, భరత శిష్యులు స్వర్గమును చేరిరి. ఈ విధముగా బ్రహ్మ సృష్టియగు నాట్యము భూలోకము నవతరించినది. భరతవంశ మొకటి మర్త్యలోకమం దేర్పడినది (భరతు డనగా నటుడని ఇచ్చట అర్థము)[6].

తొలిమానవుని ఆట – పాట నుండి సర్వకళలును విలసిల్లిన వని విశ్వసించువారు భారతీయ నాట్యమునకు దివ్యయోనిత్వము నంగీకరింపరు. ధర్మశాస్త్రముల, స్మృతుల కాలము నాటికి నటులు, గాయకులు, నర్తకులు పంక్తిబాహ్యులైనారు; వారియెడ లోకమున ఒక నిరసనభావ మేర్పడినది. ఈ అభిప్రాయమును పోగొట్టి నటజాతికి ప్రతిష్ఠను కలిగించుటకై నాట్యకళకు దివ్యయోనిత్వము కల్పింపబడిన దని వీరు తలంచుచున్నారు. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను నాట్యశాస్త్ర మొక మహనీయ శాస్త్రమనియు, తత్కర్త ఒక మహనీయవ్యక్తి అనియు పేర్కొనుట కెట్టి సంశయమును ఉండరాదు. అంతియేకాక నాట్యశాస్త్ర కథనమునందు వ్యక్తము లయ్యెడి కొన్ని సార్వకాలిక సత్యములను గ్రహించుట ఆవశ్యకము.

1. గ్రామ్యధర్మ ప్రవృత్తికి లోనైన యుగసంధిలోని ప్రజలను స్వధర్మ నిరతులను కావించుటకు దృశ్యమును, శ్రవ్యమును, లలితాత్మకమును అయిన కళగా నాట్య మవతరించినది. అనగా అధర్మమార్గమందు సంచరించు ప్రజలను ధర్మమార్గప్రవృత్తులను కావించుటకు నాట్య ముద్దిష్టమైనదన్నమాట. అంతియే కాదు. నాట్యము సార్వవర్ణిక మైన కళ – అనగా సర్వజనోపభోగ్యమైన కళ అన్నమాట. కావుననే ఇది ''సాంఘిక కళ'' (Social Art) అగుచున్నది.

2. నిర్విఘ్నముగా నాట్యప్రయోగము జరుగవలయు నన్నచో "నాట్యగృహము" ఆవశ్యకము. ఇందు పాఠ్యగేయములు శ్రవ్యతరములై యుండును, గ్రంథాంతమున, పాలకుల ధర్మము లన్నింటను ప్రేక్షణీయ (నాట్య) ప్రదానము శ్రేష్ఠముగా కీర్తింపబడినది.

3. నాట్యమనగా నాటకప్రదర్శనము కావున నాటక రచనా ప్రయోగములకు సంబంధించిన పెక్కుకళలు — సాహిత్య - నృత్త - గీత - వాద్య - చిత్ర - శిల్పాదులు — ఇందు ప్రయుక్తములగుచున్నవి. కావుననే నాట్యము "సమాహారకళ" (Comprehensive Art) అగుచున్నది. ఇట్టిది సమాహారకళ అగుటచేతనే, తక్కిన కళలకంటె గుణాధికమై నాట్య గృహమందు చేరిన భిన్నరుచులుగల వ్యక్తులందరకును ఆనందదాయక మగుచున్నది.

4. సుకుమార ప్రయోగమునకు స్త్రీలే సమర్థులు. కావున సుకుమారోద్ధత భావసమ్మిశ్రితమగు నాట్యము స్త్రీ పురుషు లిరువురి చేతను చక్కగా ప్రదర్శింపబడవలయును. అనగా స్త్రీ భూమికలను స్త్రీలును, పురుష భూమికలను పురుషులును ధరింపవలయును. అంతియే కాదు నటీనటు లందరును ఏకకుటుంబమునకు చెందినవారుగా కలిసిమెలిసి ఉండవలయును.

5. భరతశిష్యుల తొలి ప్రదర్శనములను రెండింటిని బ్రహ్మయే రచించి, అభ్యాస సమయమందును, ప్రయోగకాలమందును వారితో కూడ నుండెను. కావున కవి బ్రహ్మసమానుడై, నటీనటులకు సన్నిహితుడుగా నుండవలెను. ఆచార్యుడు భరతమునివంటివాడు కావలయును. పురుషనటులు భరతశిష్యులవంటి వారును, నటీమణులు అప్సరసలవంటివారును, వాదకులు స్వాతిమునివంటివారును, గాయకులు నారద-గంధర్వసములును కావలయును. అంతియే కాక ప్రేక్షకులు ప్రశాంతరాగద్వేషులైన సహృదయులు కావలయును. ప్రయోగవిజయమునకు ఇన్ని విధములుగా ఇంతమంది కళావేత్తల, సహృదయుల సమ్యక్సహకారము కావలయును కావుననే నాట్యము "సహకారకళ" (Co-operative Art) అగుచున్నది.

6. నాట్యమును ప్రదర్శించుటకు యోగితుల్యులైన నటీనటులు కావలయును. ఈసందర్భమున కుశలాది పదములకు నాట్యశాస్త్రవ్యాఖ్యాత యగు అభినవగుప్తు డొసంగిన అర్థములు గమనింపదగినవి—కుశలులు = గ్రహణ - ధారణయోగ్యులు; విదగ్ధులు = ఊహ - అపోహ సమర్థులు; ప్రగల్భులు = సభాకంపము లేనివారు; జితశ్రములు = వ్యాయామాభ్యాసాదులచేత అలసటపొందని సముచిత దేహముకలవారు; గ్రహణము = గురుముఖతః గ్రహించుట; ధారణము = గ్రహించిన దానిని మరచిపోకుండుట; జ్ఞానము = ఊహాపోహవిచారము; (ఊహము = కవిచెప్పని దానిని కల్పించుకొనుట; అపోహము = చెప్పకపోయినను అనుసరించుట) ; ప్రయోగము = సభలో కావించెడి ప్రయోగము ; సంశితవ్రతులు = అభ్యాసదక్షులు.

7. నాట్యప్రయోగమంతయును యజ్ఞతుల్యమైనది. "ఈ శాస్త్రప్రయోగమును అవధానముతో ఆచరణలో పెట్టునతడును, ఆ ప్రయోగమును సహృదయముతో దర్శించునతడును వేదవిదులు, యజ్ఞయాజులు, దానశీలురు పొందెడి ఉత్తమగతిని తప్పక పొందుదురు." అని గ్రంథాంతమందు భరతముని పేర్కొనెను. అనగా నాట్యప్రయోగమందు సిద్ధిని పొందువారు యథావిధిగా యజ్ఞమును నిర్వర్తించినవారు పొందు సత్ఫలమును పొందుదురు. (కావుననే కవికుల గురువగు కాళిదాసు నాట్యమును "చాక్షుషక్రతువు"గా పేర్కొనెను.)

## నృత్త - నాట్య - నృత్యములు

నృత్త-నాట్యములలో ఏది ప్రాచీనము? వాని ఆవిర్భావక్రమ మెట్టిది? నాట్య-నృత్త-నృత్యపదములకు మూలములైన నట్ - నృత్ అనునవి సంస్కృత ధాతువులా? లేక ప్రాకృత ధాతువులా? అనెడి చారిత్రక విచారణమును ప్రాచీన భారతీయాలంకారికు లెవ్వరును చేసినట్లు కన్పట్టదు. ఇట్టి చర్చలను ఆధునిక విమర్శకులే - అందున సంస్కృత పండితులైన పాశ్చాత్య విమర్శకులే - ఆరంభించినారు. "నట్" ధాతువునుండి "నాట్యము" అను పదమును (నటనము, నటుడు, నటి అనెడి పదములుకూడను), "నృత్" అను ధాతువునుండి "నృత్తము" అను పదమును (నర్తనము, నర్తకి, నర్తకుడు అను పదములు కూడను) ఏర్పడినవి. "నృత్" అను ధాతువునకు "క్యప్" ప్రత్యయముచేరి "నృత్యము" అనెడి పదము నిష్పన్నమైనది. పై రెండు ధాతువులలో "నట్" అనునది ప్రాకృతధాతు వనియు, "నృత్" అనునది సంస్కృత ధాతు వనియు ఆధునిక విమర్శకుల అభిప్రాయము. "నృత్" నకు "నట్" అనునది ప్రాకృత రూపమని కొందరు పాశ్చాత్య విమర్శకులు తలంపగా, "నట్" నకు "నృత్" సంస్కృత రూపమని కొందరు తలంచినారు. ఈ "నట్" ధాతువు అనార్య భాషలనుండి సంస్కృతమున చేరియుండునని మరికొందరు తలంచినారు. "నాట్" అను ధాతువునుండి "నాట్యము" అను పదము వచ్చినదని ప్రాచీన భారతీయాలంకారికులలో నాట్యదర్పణకర్తలు (క్రీ.శ. 1100-75) మాత్రమే తెల్పియున్నారు.[1]

నృత్, నట్ ధాతువులు రెండును ఋగ్వేదకాలమునుండియు కలవని తెలియుచున్నది. కాని, అందు "నట్" అనునది "వ్యాపించు" అను నర్థమునందు మాత్రమే ప్రయుక్తమైనట్లు కన్పట్టుచున్నది.[2] ఇంక "నృత్" అను ధాతువుమాత్రము "నృత్తము" అను నర్థమునందే ప్రయుక్తమైనది.[3] యజ్ఞయాగాదు లొనర్చునప్పుడు ఋత్విజులును, కన్యలును నృత్తమొనర్చెడి వారని ఋగ్వేదమును బట్టి తెలియుచున్నది. వివిధ రూపములలో "నృత్య" మనెడి పదము వేదము లన్నింటను కలదు. కాని, ఎల్లెడలను "నృత్తము" అను నర్థమునందే అది ప్రయుక్తమైనదని విమర్శకులు అభిప్రాయ పడినారు.

కావున, ఋగ్వేదకాలమునాటి "నృత్" ధాతువునకు (నృత్త, నృత్యపదములకుకూడ) అర్థము కేవలము గాత్రవిక్షేపమాత్ర మని తలంచుటయే సమంజసముగా కన్పట్టుచున్నది. ఈ గాత్రవిక్షేపవిద్యతో మాత్రమే తృప్తిపడనివారు క్రమముగా రూపారోపణమును, సంవాదమును కల్పించుకొని యుందురు. దీనితో ఒక క్రొత్త కళ ఆవిర్భవించినది. ఇట్లేర్పడిన క్రొత్త కళను సూచించుటకు క్రొత్తపదము అవసరము కాగా, అందుకు "నట్" ధాతువు ఉపయుక్తమై యుండును; ఈ యూహకు "నటన్నృత్తౌ" (సిద్ధాంతకౌముది - తింజతభ్వాదిగణము - 781 సూ.) అనెడి సూత్రము కూడ బలమునొసంగుచున్నది. ఇంతమాత్రమున నృత్తమునుండి నాట్యము జనించినదని అర్థముచేసి కొననక్కరలేదు. నాట్యము ప్రత్యేకకళగానే ఆవిర్భవించి, అభివృద్ధిచెందియుండును.

'నట్' ధాతువు నాట్యము, నటుడు అనునర్థమున మొట్టమొదటిగా పాణినీయమందు కన్పట్టుచున్నది.[4] ఇందు పాణిని (క్రీ. పూ. 5 వ శతాబ్ది) పేర్కొనిన 'నటసూత్రములు' నటులకు సంబంధించినవే అనియు, నర్తకులకు – నృత్త – నృత్యములకు సంబంధించినవి కావనియు పాణినిచేసిన వివరణమునుబట్టియే తెలియుచున్నది.[5]

పతంజలి కాలమున (క్రీ. పూ. 2 వ శతాబ్ది) నటులు సకుటుంబముగా ప్రదర్శనములం నొనంగుచున్నట్లు తెలియుచున్నది. పాణినీయ షష్ఠాధ్యాయ ప్రథమపాద ద్వితీయ సూత్రమును వాఖ్యానించుచు పతంజలి క్రింది విధముగా వ్రాసెను—"వ్యంజనములు నటభార్యల వంటివి అగుచున్నవి. ఎట్లనగా, నటులయొక్క స్త్రీలను 'నీవెవరిదానవు?', 'నీవెవరిదానవు?' అని రంగస్థలమున ఎవరుప్రశ్నించినను 'నీదాననే', 'నీదాననే' అని వారు సమాధానము చెప్పుచుం దురు. ఆ విధముగానే వ్యంజనములు కూడ, ఏ యే అజ్విధులు విధింపబడుచుండునో వానినన్నిం టిని అవి పొందుచుండును."[6] నాట్యశాస్త్రమందు నృత్తము (తాండవము), నాట్యము అను పద ములు మాత్రమే కలవు; 'నృత్య' మను పదమందు ప్రయుక్తము కాలేదు.

మాళవిక 'ఛలిత' మనెడి 'నాట్యము'ను ప్రదర్శించినట్లు కాళిదాసు (క్రీ. శ. 4 వ లేదా 5 వ శతాబ్ది) మాళవికాగ్నిమిత్రమందు వర్ణించెను. ఇది రూపకముకాదు; యథారసమభిన యింపబడినదని కూడ అందే పేర్కొనబడుటచేత ఇది కేవలము అంగవిక్షేపాత్మకమైన నృత్త మునుకాదు. ఇంక ఇది అభినయపూర్వకమైన నృత్తమన్నమాట; దీనినే 'నృత్య' మందురు. కాని, నృత్యపదమిచ్చట ప్రయుక్తము కాలేదు. అదే గ్రంథమందు నృత్యమను నర్థమందే కాక నాటకప్రదర్శన మనునర్థమునందు కూడ కాళిదాసు నాట్యపదమును ప్రయోగించుట గమ నార్హము— "నాట్యం భిన్నరుచేః జనస్య బహుధాప్యేకం సమారాధనమ్." ఇట్టి ప్రయోగ ములే తరువాతికాలములో ఈ పదముల అర్థవిపర్యాదులకు కారణములై యుండును. ఈ పదము లను నిర్వచించుటలో ఆలంకారికులు భేదించుటకు కూడ ఇది యొక కారణమని చెప్పవచ్చును.

నిఘంటు కారుడగు అమరసింహుడు (క్రీ. శ. 4 వ శతాబ్ది) "తాండవం, నటనం, నాట్యం, లాస్యం, నృత్యంచ నర్తనే" (అమరకోశము – ప్ర.కాం. – నాట్యవర్గము – 9 సూ.) అని పేర్కొనుటను బట్టి నాడు తాండవ–నటన–నాట్య – లాస్య – నృత్యములు సమానార్థకము లుగా ప్రయుక్తము లగుచున్నవని తెలియుచున్నది. కాని, ఇందలి నృత్య పదము ఏ యర్థమందు ప్రయుక్తమైనదో తెలియదు; అంతియేకాక దీనికి 'నృత్త' మనెడి పాఠాంతరమున్నట్లు గురు బాల ప్రబోధికనుబట్టి తెలియుచున్నది (పుట 147).

క్రీ. శ. 15 వ శతాబ్దికి చెందిన విప్రదాసుడు తన 'సంగీత చంద్రము' నందు "నాట్యము నృత్యమునకు పర్యాయపదముగా కన్పట్టుచున్న" దని స్పష్టముగా తెలిపియుండెను; అట్లే "నృత్య శబ్దము నృత్తమునకు పర్యాయపదముగా వర్తించుచున్న" దనియు తెలిపెను.[7]

నాట్య – నృత్య – నృత్త పదములను మూడింటిని ఒండొంటితో పోల్చి నిర్వచించు టకు పూనుకొనిన వారిలో ధనంజయుడు (క్రీ. శ. 10 వ శతాబ్ది చివరిభాగము) ప్రథముడని

చెప్పవచ్చును—"అవస్థానుకరణము నాట్యము...రసాశ్రయమైన ఆ నాట్యము పదివిధములు. నృత్యము భావాశ్రయము; నృత్తము తాళ-లయాశ్రయము...పదార్థాభినయమైన నృత్యము 'మార్గ' మనబడును, నృత్తము 'దేశి' అనబడును. మధుర-ఉద్ధత భేదములచే నృత్య-నృత్తములు రెండును రెండేసి విధములు. మధురము (మధురనృత్య-మధుర నృత్తములు రెండును) 'లాస్య' మనబడును. ఉద్ధతము (ఉద్ధత నృత్య-ఉద్ధత నృత్తములు రెండును) 'తాండవ' మనబడును. ఇవి నాటకాదుల కుపకారములు."[8]

దీనిపై తద్వ్యాఖ్యాతయగు ధనికుడీ క్రిందివిధముగా వ్యాఖ్యానించెను—"కావ్యమందు వర్ణితులైన ధీరోదాత్తాది నాయకులయు, తదితరులయు అవస్థలను అనుకరించుట 'నాట్య' మనబడును.[9] అనగా చతుర్విధాభినయములచే నటులు నాయకులతో తాదాత్మ్యమును పొందుట 'నాట్య' మనబడును, నాట్యము రసాశ్రయము కాగా, నృత్యము భావాశ్రయమగుచున్నది. గాత్ర విక్షేపమనెడి అర్థముకల 'నృత్' అనుధాతువునుండి పుట్టినదగుట చేతను, ఆంగికాభినయ బాహుళ్యము కలదగుటచేతను, దీనిని ప్రదర్శించువానికి 'నర్తకు'డను వేరు పేరుండుటచేతను, లోకమున దీనికి 'ప్రేక్షణీయ' మను పేరు వచ్చుటచేతను నృత్యము నాట్యముకంటె భిన్నమగుచున్నది. కావున నృత్యభేదములైన డోంబీ-శ్రీగదితాదులు[10] నాట్య భేదములైన నాటకాదులకంటె భిన్నములగుచున్నవి. వెనుక చెప్పినట్లు నాటకాదులు రసవిషయములు. పదార్థభూతములైన విభావాదుల యొక్క సంసర్గము కల వాక్యార్థము రసనిష్పత్తి హేతువు. అట్టివాక్యార్థాభినయ రూపమైన నాట్యము రసాశ్రయమగుచున్నది. 'అవస్పందనము' (కించిత్ చలనము) అను నర్థముకల 'నట్' అను ధాతువు నుండి నాట్యపదము నిష్పన్నమగుటచేతను, ఇందు చలనము తక్కువై సాత్త్వికాభినయ బాహుళ్యము ఉండుటచేతను, దీనిని నిర్వర్తించువాడు 'నటుడు' అనబడుటచేతను ఈ నాట్యము నృత్యము కంటె భిన్నమగుచున్నది. ఇంక చచ్చత్పుటాదితాల-ద్రుతాదిలయాశ్రయ మాత్రమగు అంగవిక్షేపము కలదై, అభినయ శూన్యమగునది 'నృత్త' మనబడును. నృత్త-నృత్యములు రెండును గాత్ర విక్షేప విషయమున సమానములే (రెండు పదములును 'నృత్' అను ధాతువునుండి పుట్టినవే) అయినను అనుకరణాత్మకమైన నృత్యము నృత్తముకంటె భిన్నమగుచున్నది. నృత్య-నాట్యములు రెండును అనుకరణ విషయమున సమానములే అయినను రసాశ్రయమైన నాట్యము నృత్యముకంటె భిన్నమగుచున్నది......కించిదవాంతర పదార్థాభినయముచే నృత్యమును, శోభాహేతువగుటచే నృత్తమును నాట్యమునకు ఉపకారకము లగుచున్నవి."

ధనంజయ-ధనికుల అభిప్రాయములను క్రిందివిధముగా వర్గీకరింపవచ్చును:

| | నాట్యము | నృత్యము | నృత్తము |
|---|---|---|---|
| 1. | అనుకరణాత్మకము | అనుకరణాత్మకము | గాత్రవిక్షేపమాత్రము |
| 2. | రసాశ్రయము | భావాశ్రయము | తాళ-లయాశ్రయము |
| 3. | సాత్త్వికాభినయబహుళము | ఆంగికాభినయబహుళము | కేవలము ఆంగికాభినయము |
| 4. | నాటకాదులిందలి భేదములు | డోంబీ-శ్రీగదితాదులిందలి భేదములు | — |

| | నాట్యము | నృత్యము | నృత్తము |
|---|---|---|---|
| 5. | దీనిని నిర్వర్తించువాడు 'నటుడు' | దీనిని నిర్వర్తించువాడు 'నర్తకుడు' | దీనిని నిర్వర్తించువాడు 'నర్తకుడు' |
| 6. | వాక్యార్థాభినయము | పదార్థాభినయము | అభినయశూన్యము |
| 7. | 'నట్' ధాతునిష్పన్నము | 'నృత్' ధాతునిష్పన్నము | 'నృత్' ధాతునిష్పన్నము |
| 8. | శ్రవ్యము ; ప్రేక్షణీయము (సంవాదాత్మకము) | ప్రేక్షణీయము | ప్రేక్షణీయము |

తక్కిన అలంకారికులందరును ఈ పదములను నిర్వచించుటలో ఇంచుమించుగా ధనంజయ-ధనికులనే అనుసరించియున్నారు. కాగా, నాట్యము వాక్యార్థాభినయమగుటచేత రసాశ్రయమనియు, నృత్యము పదార్థాభినయమగుటచేత భావాశ్రయమనియు, నృత్తము అభినయ శూన్యమగుటచేత గాత్రవిక్షేపమాత్రమనియు ప్రాచీన మతసారాంశము. కాని, రామచంద్ర-గుణచంద్రులు తమ అభినయదర్పణమునందు నృత్యము "రసభావ వ్యంజనాదియుక్త"మని చెప్పుట గమనింపదగినది. నాట్యము వలెనే నృత్యము కూడ రసస్ఫోరకమే యనెడి సత్యమును నన్నిచోడుడు ఆనాడే (క్రీ.శ. 12 వ శతాబ్ది) తెలిపియుండుట గమనార్హము. (కుమారసంభవము 9 వ ఆశ్వా. 38 ప.)

"అలఁతులు నిల్పహస్తమున, హస్తవిలాసముతోఁ జెనంగఁజూ
డ్కులు, దెలిచూడ్కులం దెలిమిగూడి రమింప మనంబు, తన్మనో
బలమున నుల్లసిల్ల నిజభావము, భావ విశేషసంపదల్
వెలయ రసంబులం, దభినవించె రసంబులు సాంగికంబుగాన్."

శాంతినికేతన అంతేవాసులగు డా. కె. ఎమ్. వర్మగారు నాట్యశాస్త్రమందలి కథనమును పురస్కరించుకొని నాట్య-నృత్త-నృత్యములనుగూర్చి విపులమైన చర్చ చేసియున్నారు.—పరమేశ్వర ప్రయుక్తమగు నృత్తము అనాది. పిమ్మట బ్రహ్మసృష్టియగు "నాట్యము" వెలసినది. భరతముని నృత్త (తాండ)-నాట్యములను సమ్మిశ్రితము చేయగా నృత్యము ఆవిర్భవించెను. కాగా నృత్యము నృత్త-నాట్యములకంటె అర్వాచీనమనియు, నృత్య-నృత్తములుకూడ నాట్యము వలె రసస్ఫోరకములే అనియు, అవి రసహీనము లనుకొనుట పొరపాటు అనియు శ్రీ వర్మ గారు సిద్ధాంతించి యున్నారు.[11] ఆటవికుల "ఆటపాట" సిద్ధాంతమును విశ్వసించువారి దృష్టిలో కూడ నృత్తము అనాదియే. అయినను నృత్తమునకు భావాభినయము తోడై నృత్యము వెలసిన దనియు, దానికి రూపారోపము, కథ తోడై పిమ్మట నాట్యము వెలసినదనియు వీరు విశ్వసింతురు. నృత్త-నాట్య-నృత్యముల ఆవిర్భావ క్రమమెట్టిదైనను, వాని స్వరూప స్వభావములను గ్రహించుట మాత్రము ఆవశ్యకము.

ప్రాచీనాలంకారికుల మతములో వాక్యార్థము రసమునకును, పదార్థము భావమునకును ప్రతీకలు. కావున, వాక్యార్థాభినయ-రసాభినయములు సమానార్థకములు ; అట్లే పదార్థాభినయ-భావాభినయములు సమానార్థకములు. పాండిత్య ప్రకర్షకు సంబంధించిన సిద్ధాంతములజోలికి పోక, పదార్థాభినయ-వాక్యార్థాభినయములకు క్రిందివిధముగా అర్థముచెప్పుట సమంజసము :

నృత్యమునందు సాధారణముగా నర్తకి ఏదియో ఒక గీతమునుకాని, పదమునుకాని, పద్యమునుకాని, అష్టపదినికాని, శ్లోకమునుకాని అవలంబించి తదర్థమును అభినయించి చూపును. అప్పట్ల నర్తకిచే ప్రతిపదము (every word) నకును అభినయము చేయబడును. అసలు కొన్ని పదములకు విపులమైన అభినయ విధానము నిర్దిష్టమై యున్నదికూడను. ఇట్లు ప్రతి పదముయొక్క అర్థమును ఆంగికాభినయ బాహుళ్యముతో ప్రదర్శించి చూపుట నృత్యమందలి విశిష్టత. ఇంక నాట్యమందు ప్రతిపదమునకును అభినయము చేయబడదు; అంతియేకాదు, ప్రతి వాక్యమునకు కూడ ప్రత్యేకమైన అభినయము చేయబడరాదు—మొత్తముమీద వాక్యార్థము సూచితమగునట్లుగా కించిదాంగికాభినయము, సాత్త్వికాభినయ బాహుళ్యము అవలంబింపబడును. నిజమాలోచించినచో నృత్యమందుకూడ నర్తకి సాత్త్వికాభినయమును అధికముగానే చూపునని తెలియగలదు; ఆ దృష్టితోనే నాట్యదర్పణకర్తలు నృత్యమునుకూడ రసాశ్రయమనియందురు.

కావున, ప్రతిపదమును అభినయించి చూపుట పదార్థాభినయమగును; అదియే నృత్యము. ఇందు ఆంగికాభినయమునకు ప్రాధాన్యము. మొత్తముమీద వాక్యముయొక్క అర్థము సూచితమగునట్లు చేయబడు అభినయము వాక్యార్థాభినయమగును; ఇదియే నాట్యము. ఇందు సాత్త్వికాభినయమునకు ప్రాధాన్యము. ప్రతి_పద_అర్థ_అభినయము నాట్యమునకు విరుద్ధము. కాని, నృత్యమునకు ఆవశ్యకము; దానికి అదియే జీవము.

ప్రతి_పద_అర్థ_అభినయము నాట్యమునకు విరుద్ధమనెడి సత్యము శ్రీ కొప్పరపు సుబ్బారావుగారి వాక్యములను పరిశీలించినచో మరింత స్పష్టము కాగలదు[12]— "కాళీయఫణి ఫణాగ్రములఁ దాండవమాడు నడుగుఁ దమ్ములకు జోహారులనుము" అనే పద్యం నాచేత రిహార్సలు చేయించిన పద్ధతి నాటికీ నేటికీ మరుపురాదు. విశేషమేమంటే ప్రతిపదానికి అభినయం ఉండాలి. "ఫణిఫణా" అన్నప్పుడు అరిచేతిప్రేళ్ళు పాముపడగలాగ వంచి ఆడిస్తుండాలి. "తాండవమాడు" అన్నప్పుడు ఒక చెయ్యిపైకి, ఒకటి క్రిందికి గాలిలో ఈదుతున్న ఫక్కీగా ఎగరవెయ్యాలి. "అడుగుదమ్ములు" అన్నప్పుడు అడుగుల్ని నడకద్వారా చూపిస్తూ తమ్ముల్ని హస్తాంజలిద్వారా ఏకకాలంలో సూచించాలి. ఇక "జోహారులనుము" అన్నప్పుడు గరుడాళ్వారు ఫక్కీలో రెండు చేతుల్ని నడినెత్తిమీద పెట్టుకొని, "అడియేన్ దాసోహం" ఫక్కీలో అమాంతంగా వంగిపోవాలి. ఇలాంటి ప్రత్యేక పరిశ్రమతో తయారైన ఆ వేషం నాకు చిరస్మరణీయమే అయింది.[13]

అయినచో తంజావూరు నృత్యమునకు "భరతనాట్యము" అను పేరేల వచ్చినదను శంక కలుగవచ్చును. నిజమాలోచించినచో ఈ నృత్యరీతి నాట్యమును కాదు; భరత ప్రతిపాదితమంతకంటెను కాదు. ఇది కేవలము ఆపాదింపబడిన పేరు; క్రమముగా రూఢిని పొందినది. ఈ రూఢివలననే పలువురు 'నాట్య' మనగా నృత్య' మనియు, 'నాట్యశాస్త్ర' మనగా 'నృత్యశాస్త్ర' గ్రంథ మనియు భ్రమించుచుండుట జరుగుచున్నది. ఈ భ్రమ ఎంతవేగముగా తొలగిపోయినచో, అంత శ్రేయస్సు ఈ కళలకు.[14]

## నాట్యము : తత్సంబంధి పదములు

నాట్యము, దృశ్యకావ్యము, ప్రేక్ష్యకావ్యము, ప్రేక్ష, ప్రేక్షణీయము, రూపము, రూపకము, నాటకము అనెడి పదములు పర్యాయపదములుగా ప్రయుక్తములగుచున్నవి.

నాట్యము ప్రదర్శన ప్రధానమగుటచేత దృశ్యకావ్యము, ప్రేక్షకావ్యము, ప్రేక్ష, ప్రేక్షణీయము అనెడి పదములు వ్యవహారములోనికి వచ్చినవి. "రంగపూజ చేయకుండ ప్రేక్షా ప్రయోగమును చేయరాదు" అని నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయాంతమందును, "సర్వదానములందును ప్రేక్షణీయ ప్రదానము ప్రశస్తమైనది" అని అంతమందును భరతముని ప్రేక్షా-ప్రేక్షణీయపదములను వాడియుండెను. శ్రవ్యకావ్యమునకు భిన్నముగా దృశ్యకావ్యమనెడి పదమును ఇంచుమించుగా ఆలంకారికులందరును వాడియున్నారు; అందులో కొందరు కావ్యపద విరహితముగా "దృశ్యము" అని మాత్రమే వాడినవారుకూడ కలరు. "ప్రేక్ష్యకావ్య" మనెడి పదమును హేమచంద్రుడు తన కావ్యానుశాసనమందు వాడెను.

"నాటకము" దశవిధరూపకములలో ఉత్తమమైన రూపకము. అతి ప్రధానమైన రూపకభేదమునకు పేరు అగు ఈ "నాటక"పదము నాట్యమను నర్థమందు నాట్యశాస్త్రముననే ప్రయుక్తమై యున్నది—19 వ అధ్యాయాంతమున నాటకలక్షణము సంక్షిప్తముగా పేర్కొనబడెను. "ఇచ్చట నాటకమనగా 'అభినేయ కావ్యమాత్ర' మని గ్రహింపవలెను. అనగా నాటకపదముచేత దృశ్యకావ్యములన్నియును గ్రహింపబడినవి" అని అభినవగుప్తుడా సందర్భమున వ్యాఖ్యానించెను. అట్లే పదుమూడవ అధ్యాయమందు ప్రయుక్తమైన నాటకపదమును వ్యాఖ్యానించుచు, "ఇచ్చట 'నాటక' శబ్దము రూపక విశేషపరముగా ప్రయుక్తము కాలేదు; మరి, నాట్యమను నర్థమందే ప్రయుక్తమైనది" అనికూడ అభినవగుప్తుడు పేర్కొనెను. ప్రాచీనాంధ్ర సాహిత్యమందు "నాటక" మనెడి పదము రూపక సామాన్యవాచిగానే ప్రయుక్తమైనది. తెలుగులో ప్రప్రథమముగా రూపక లక్షణమును వ్రాసిన చిత్రకవి పెద్దనార్యుడు (క్రీ. శ. 1550 ప్రాంతము) తన "లక్షణసారసంగ్రహము"లో రూపకములన్నింటిని నాటకపదముతో వ్యవహరించియుండెను—ప్రకరణ నాటకము, వ్యాయోగనాటకము మొ॥ నేడు "నాటక"మనెడి పదము రూపకసామాన్యవాచిగా లోకమందు రూఢమై యుండుట అందరకును తెలిసినదే.

ఇంక రూప-రూపకపదములున్నవి. నాట్యశాస్త్రమందు నృత్యపదము లేనట్లే "రూపక" పదమును లేదు; అభినవగుప్తుడు మాత్రము రూప-రూపకపదములను రెండింటిని వాడెను. భరతుడు నాట్యశాస్త్ర అష్టాదశాధ్యాయమును "దశరూపాధ్యాయ"మనగా ధనంజయుడు తన గ్రంథమును "దశరూపక" మనుట గమనింపదగినది. ధనంజయునకు ముందే వామనుడు (9 వ శతాబ్ది) తన కావ్యాలంకార సూత్రవృత్తిలో "దశరూపక" పదమును వాడియుండెను. అభినవభారతీ-దశరూపకములు రెండును ఇంచుమించుగా సమకాలిక రచనలు. కాగా, 8 వ శతాబ్ది ప్రాంతములనుండియు "రూపక" పదము ప్రచారములోనికి వచ్చియుండునని చెప్ప

గలము. ధనంజయుడు రూపకపదముతో "రూప" పదమునుకూడ నిర్వచించియుండెను. అటు పిమ్మట ఈ పదము నెవ్వరును వాడినట్లు కన్పట్టదు. కాగా ధనంజయుని పిమ్మట "రూప" మనెడి పదము లోకవ్యవహారమునుండి తొలగిపోయినదన్నమాట. ధనంజయుడు రూప_రూపకపదములను క్రిందివిధముగా నిర్వచించెను—

"అవస్థానుకరణము నాట్యము. అది దృశ్యమానమగుటచేత 'రూప'మనబడెను; రూప_ఆరోపము కలదగుటచేత 'రూపక'మనబడును. రసాశ్రయమైన ఈ నాట్యము పది విధములు."[1] ) ఈ శ్లోకముపై వ్యాఖ్యానించుచు ధనికుడు క్రిందివిధముగా వివరించెను—"నీల_పీతాదివర్ణములవలె చూడతగినదికాన 'రూప' మనబడు చున్నది. నటునియందు రామాద్యవస్థల ఆరోపణము ఉండుటచేత ఇది రూపకమనబడుచున్నది. అనగా, ముఖమునందు చంద్రత్వము వలెనే నటునియందు రామాదినాయకత్వము ఆరోపింప బడుటచేత అది 'రూపక' మనబడుచున్నదని తెలియవలెను. ఇంద్ర_పురందర_శక్రశబ్దములు ఏకార్థకములైనట్లే నాట్య_రూప_రూపకములనెడు ఈ మూడు శబ్దములును ఏకార్థకము లగుచున్నవి; ప్రవృత్తి నిమిత్తభేదముచే మూడు పేర్లు వచ్చినవి."

నాట్య_రూపకపదములను సింగభూపాలుడు తన రసార్ణవసుధాకరములో క్రింది విధముగా నిర్వచించెను—"ఇదివరకు చెప్పిన రసమున కాధారమగునది నాట్యము, రూపకమునని చెప్పఁబడుచున్నది. మిక్కిలి నేర్పరియగు నటుని కర్మ అగుటచేత 'నాట్యము' అను పేరు కలిగినది. ముఖాదులయందుఁ బద్మాదుల కారోపమున్నప్పుడు 'రూపకాలంకార'మని చెప్పఁబడినట్లే ఇచ్చటఁగూడ, నటునియందు నాయకారోపమున్నందున (నటుడు నాయకరూపమును ధరించినందున) దీనికి రూపకమనియుఁబేరు."[2]

(రసార్ణవసుధాకరము_శ్రీ బులుసువారి అనువాదము_పుట 653).

పై శబ్దము లన్నింటను, "దృశ్యకావ్య" మనెడి పదమును సంస్కృతాలంకారికులును, "నాటక" మనెడి పదమును తెలుగు కవులును ఆలంకారికులును అధికముగా వాడియున్నారని చెప్పవచ్చును. ఇచ్చట ఒక విషయమును గుర్తించవలసి యున్నది. సాహిత్యమునందలి రచనా ప్రక్రియలనెల్ల భారతీయులు 'కావ్య'పదముతోనే వ్యవహరించియున్నారు. అది పద్యమైనను, గద్యమైనను, గద్య_పద్య సమ్మిశ్రితము (చంపువు) అయినను, రూపకము అయినను, ఉపరూపకము అయినను సరే—అన్నియును "కావ్యము"లే. అట్లే ఆయా ప్రక్రియల రచయితలెల్లరును 'కవి' నామముచేతనే వ్యవహృతులైనారు. రూపక నిర్మాతను తెలుపుటకు 'Dramatist', 'Play-wright' అనెడి ఆంగ్లపదములవలె సంస్కృతమున ప్రత్యేకపదములు లేవు. ఆతడును 'కవి'యే. గ్రీకుభాషలోకూడ నాటకకర్తను 'కవి' (poet) అనియే వ్యవహరించుట గమనార్హము. 'నాటకకర్త', 'నాటక రచయిత' మొదలగు పదములు ఇటీవల కల్పింపబడినవిమాత్రమే.

"డ్రామా" (Drama) అనెడి పదము గ్రీకుభాషాపదము—"A thing done" అని దీనికి అర్థము. గ్రీకులకాలమునుండి ఇంచుమించుగా 18 వ శతాబ్దివరకును 'డ్రామా' అను పద

మునే పాశ్చాత్యులందరును వాడెడివారు. పిమ్మట 'ప్లే' (play) అనెడి పదముకూడ వ్యవహార ప్రసిద్ధినందినది. ఈ పదముయొక్క అర్థము ఎంత విస్తృతపరిధి కలిగియున్నదో క్రింది వివరణము తెలుపగలదు—

"Play, a generic term applied to any word written to be acted, and covering such more limiting terms as tragedy, comedy, farce, drama, &c. It may range from a spirited exchange of backchat between two mountebanks in the market place to a full-length work given in a special building–a theatre–with a cast of highly trained professional actors aided by all the appurtenances of lighting, costuming, and production. The one essential requisite is that it should be entirely or mainly spoken ; if given without dialogue it ranks as mime or ballet, if all the dialogue is sung, as opera. Hybrid forms give rise to Ballad Opera, Burletta, Musical Comedy."

(The Oxford Companion To The Theatre—p. 618).

నేడు ప్లే; ప్లేరైట్ (Play ; Play-wright) అనెడి పదములే అధికముగా ప్రచారమందున్నవి. 'డ్రామా' అనెడి పదము నేడు సామూహికార్థమందు వ్యవహృతమగుచున్నది. (Greek Drama, British Drama, Restoration Drama, Indian Drama, Telugu Drama, etc..) ఈ అర్థమందే ఈ నా 'పరిశోధనావ్యాసము'నకు "ఆంధ్ర నాటక వికాసము" అని పేరుపెట్టినాను.

Stage, Theatre అనెడి పదములనుకూడ మనము నేడు ఎక్కువగా వాడుచున్నాము. Stage అనగా 'రంగస్థలము' అని అర్థము ; ఇంకను సూటిగా చెప్పవలెనన్నచో రూపక ప్రదర్శనముకొరకు తదనుకూలముగా అలంకరింపబడిన రంగస్థలము అని అర్థము. ఇంక 'Theatre' అను పదము చాల విశాలమైన అర్థముకలది. నాట్యశాల అనెడి అర్థమునేకాక ప్రదర్శనమునకు సంబంధించిన సర్వకార్యకలాపములను ఈ పదము వ్యక్తము చేయుచున్నది. బాలే, ఆపెరా, సంగీతకచేరీ మొదలగునవి జరిగెడి స్థలములనుకూడ 'Theatre' అనియే అందురు. అందుచేత కేవలము రూపక ప్రదర్శనములకు పరిమితిమైనదానిని 'Play house' అనుట సమంజసము. 'Theatre' అనునదికూడ గ్రీకుభాషాపదమే ; 'a seeing place' అని దీనికి అర్థము. కాని, ప్రాచీన కాలములో మాత్రము దీనికి 'Auditroium' (రంగమండలము = ప్రేక్షకులు కూర్చుండెడి స్థలము) అని మాత్రమే అర్థము. Audience అనునది లాటిన్ భాషా పదము ; 'Those who listen' (శ్రోతలు) అని దీనికి అర్థము. 'Spectator' అనునదికూడ లాటిన్ భాషాపదమే ; 'one who looks on' (ప్రేక్షకుడు) అని దీనికి అర్థము. అందుచే రూపక ప్రదర్శనమును చూచెడివారిని 'Audience' అనుట సమంజసము కాదు ; 'Spectators' (ప్రేక్షకులు) అనియే అనవలెను.

## నాట్యస్వరూపము

భరతాదుల నాట్యప్రయోగమునకు విఘ్నమాపాదించుచున్న విరూపాక్షాది విఘ్నకరులను సామపూర్వకముగాపిలిచి, బ్రహ్మవారికి నాట్యస్వరూపమును విపులముగా వివరించి చెప్పి, వారిని శాంతచిత్తులను కావించెను. తత్సారమును క్రిందివిధముగా పేర్కొనవచ్చును[1]—

"శ్రవ్యమును, దృశ్యమును అయిన నాట్యము త్రైలోక్య భావానుకీర్తనము. అనగా మూడు లోకములకు సంబంధించిన శుభా-శుభ ఫలముల నొసంగెడి ధర్మాధర్మములయొక్క స్వభావములను ఇది అందరకును ప్రదర్శించును. కాగా, నానాభావోపసంపన్నమును, నానావస్థాంతరాత్మకమును, లోకవృత్తానుకరణమును అగునట్లుగా నాట్యము నిర్మితమైనది. ఇందు కన్పట్టని జ్ఞానముకాని, శిల్పముకాని, విద్యకాని, కళకాని, యోగముకాని, కర్మకానిలేనేలేదు. ఇది హితోపదేశాత్మకమే కాక విశ్రాంతి జనకము, వినోదజనకము కూడను (అనగా మనస్సునకు ఉల్లాసము చేకూర్చి, ఆనందము నొసంగును)."

ఇట్లు, బ్రహ్మ తాను సృష్టించిన నాట్యముయొక్క స్వభావ - ప్రయోజనములను వివరించి చెప్పిన పిమ్మట ఒక శ్లోకములో నాట్యమును క్రిందివిధముగా నిర్వచించెను—"సుఖ-దుఃఖ సమన్వితమైన ఈ లోకస్వభావము ఆంగికాద్యభినయోపేతమగుచు 'నాట్య' మనబడును."[2] అనగా లోకమునందలి సుఖ-దుఃఖములే నాట్యమందును ప్రతిపాదితములగును; కాని, ఆ లోకావస్థ నాట్యమందు చతుర్విధాభినయ సహితమగుచున్నది. కాగా లోకవృత్తమే అభినయ సహితమైనప్పుడు నాట్యమనబడునని భరతముని అభిప్రాయ సారాంశము. దీనినిబట్టి నాట్యమునందు రెండు విషయములు ప్రధానములని స్పష్టమగుచున్నది—1. నాట్యము లోకవృత్తానుకరణము[3] అనుటచేత నాట్యము లోకమునకు సన్నిహితమగుచున్నది. 2. లోకవృత్తము అభినయ సహితము కావలెననుటచేత నాట్యము లోకము కంటె భిన్నమగుచున్నది.

### నాట్యము లోకవృత్తానుకరణము :

లోకమునందలి సుఖ - దుఃఖములే నాట్యమందును ప్రదర్శితములగును కాన నాట్యము లోకావస్థకు అనుకరణమగు చున్నది. కాని, ఈ 'అనుకరణ' మనెడి పదమునకు అర్థమేమో భరతుడు స్పష్టము చేయలేదు.

అనుకరించుట, అనుకృతి, అనుకరణము అనెడి పదములను నాట్యపరముగా భరతుడు ప్రయోగించెను. కాని భరతుడు వివరింప నంతమాత్రమున 'అనుకరణ' మనగా లోకవృత్తమును యథాతథముగా వర్ణించుట లేదా ప్రదర్శించుట అనెడి అర్థమును చెప్పరాదు. లౌకిక మిధునమును చూచునప్పుడు మనకురాగ ద్వేషాసూయాదులు కలుగునేకాని రసప్రతీతికలుగదు. కావున లోకవృత్తము యథాతథముగా 'నాట్య' మనిపించుకొనదు. లోకమునందలి సంఘటనలే నాట్యమందును కన్పట్టుచుండును కాన నాట్యము లోకమునకు అనుకరణమనబడినది; అంతమాత్రమే. ఆ సుఖ-దుఃఖాది సంఘటనలు చతుర్విధాభినయ సహితము లైనప్పుడే అది నాట్యము

కాగలదు. ఇందలి అంగవిన్యాసాదులు లోకమునందు కంటె భిన్నములుగా నుండు ననెడి విషయము అందరకును తెలిసినదే. అభినయములే నాట్యమును లోకమునుండి వేరుపరచు చున్నవి. లోకములో దుఃఖపూరితములైన ఘట్టములనుచూచి మనము దుఃఖింతుము. కాని, ఆ దుఃఖ పూరితములైన ఘట్టములే కావ్యమందు వర్ణింపబడినప్పుడు వినియు లేదా చదివియు, నాట్యమందు ప్రదర్శింపబడినప్పుడు చూచియు ఆనందింతుము. నాట్యము లోకమునకు యథాతథమగు అనుకరణము కాదనుటకు దీనిని ఒక ఉదాహరణముగా గ్రహింపవచ్చును.

భారతీయాలంకారికులు కవికి బ్రహ్మపదవి నొసంగి, ఆతడు తలచుకొన్నట్లుగా కళా సృష్టి అగునని చెప్పియున్నారు. కవిసృష్టిని గూర్చి ఆనందవర్ధను డీ క్రింది విధముగా పేర్కొనెను[4]—

"అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః ।
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥
శృంగారీచేత్కవిః కావ్యేజాతంరసమయంజగత్ ।
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్ ॥
భావా నచేతనానపి చేతనవ చ్చేతనా నచేతనవత్ ।
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా ॥"

మరియు "నానృషిః కురుతే కావ్యమ్" (భట్టతౌతుడు చెప్పినట్లుగా హేమచంద్రుడుదాహరించెను), "కవయఃక్రాంత దర్శినః" అనెడి ఆలంకారిక సూక్తులు కూడ కవితా శిల్పిని సాక్షాద్ద్రష్టయైన వైదికఋషితుల్యునిగా పేర్కొనుచున్నవి. కావ్యప్రకాశ ప్రథమ శ్లోకములో మమ్మటుడు కవిసృష్టి బ్రహ్మసృష్టిని మించిన దనెను.[5] కావున, అనుకరణ మనగా కేవల లోకానుకరణము కాదనెడి సత్యమును భారతీయులు గుర్తించిరనుట స్పష్టము. వారి దృష్టిలో అనుకరణము 'యథాతథానుకరణము' కానేకాదు; ఈ అనుకరణము నూత్న సృష్టితుల్యమైనదే. ఇట్లు కవిప్రతిభావిలసితములైన సృష్టులలో నాట్యము, అనగా రూపక రచన, అత్యుత్తమమైనదనెడి సత్యమును "నాటకాంతం హి సాహిత్యమ్", "సందర్భేషుదశరూపకం శ్రేయః[6] అనెడి సూక్తులు నిరూపించుచున్నవి.

పై విషయమును ధనంజయుడు మరింత స్పష్టముచేసి యుండెను—"అది రమ్యమైనను, లేదా జుగుప్సాకరమైనను, ఉదారమైనను లేదా వికృతమైనను, ఉగ్రమైనను లేదా ప్రసన్నమైనను, గహనమైనను లేదా వికృతమైనను లోకమందలి యే వస్తువైనను, లేదా వస్తువుకాని దైనను కవి—భావకు (సహృదయు) లచే భావ్యమానమై రసముగాకాని, భావముగా కాని పరిణమింపనిది లేదు."[7]

నాట్యవిషయమున ధనంజయుడు పేర్కొన్నట్లే, కావ్య విషయమున షెల్లీ కవి కూడ వివరించియుండుట గమనార్హము[8] :

"Poetry turns all things into loveliness; it exalts the beuty of that which is most beautiful, and it adds beauty to that which is most

deformed; it marries exultation and horror, grief and pleasure, eternity and change; it subdues to union under its light yoke all irreconcilable things…"

కావున కావ్యముకాని, నాట్యముకాని లోకమునకు యథాతథానుకరణము కాదనియు, ఈ విషయమును భరతాదులు స్పష్టముగా గుర్తించియున్నారనియు తెలియవలెను. నాట్యశాస్త్రమున 'ధర్మి' యను నంశము ప్రత్యేకముగా 13 వ అధ్యాయమున వివరింపబడెను. ఇందు నాట్యము లోకమున కెంతవరకు అనుకరణమో లేదా సన్నిహితమో, లోకమునకు ఎంత భిన్నమో స్పష్టముగా వివరింపబడెను. "విమర్శలు; సమస్యలు" అను అధ్యాయమునందు ఈ 'ధర్మి'ని గూర్చి వివరింతును,

పాశ్చాత్య దేశములకు, ముఖ్యముగా గ్రీకుదేశమునకు భరతునివంటి వాడగు అరిస్టాటిల్ (క్రీ. పూ. 384_322) కూడ కళానిర్వచనములో 'పొయెటిక్సు' (Poetics) అనెడి తన గ్రంథము నందు అనుకరణము (imitation) అను పదమును వాడియుండెను.

"Epic poetry and tragedy, as also Comedy, Dithyrambic poetry, and most flute-playing and lyre-playing, are all, viewed as a whole, modes of 'imitation'. But at the same time they differ from one another in three ways, either by a difference of kind in their means, or by differences in the objects, or in the manner of their imitation."[9]

అసలు అనుకరణము రెండు విధములు— 1. ఉన్నదానిని ఉన్నట్లుగా చెప్పుట – ఇది బాహ్యమునకు సంబంధించినది. 2. ఉన్నదానిని ఉన్నట్లుగా కాక ఎట్లు సంభావ్యమో అట్లుచెప్పుట (an imaginative reconstruction of the possibilities of Nature)– ఇది అంతర్యమునకు సంబంధించినది, మొదటి అర్థమును గ్రహించి, అరిస్టాటిల్ గురువగు ప్లేటో (క్రీ.పూ. 427_347) అనుకరణాత్మకములైన కళలను నిరసించి, వానికి 'ఆదర్శరాజ్యమున' అధమ స్థానము నొసంగెను. కాని, ఆయన శిష్యుడేఅగు అరిస్టాటిల్ రెండవ అర్థమును గ్రహించి (నిజమైన అర్థము ఇదియే) కళలు ఉత్తమములైనవని నిర్ణయించెను. పొయెటిక్స్ మీద బృహద్విమర్శను వెలయించిన ఎస్. హెచ్. బుచెర్ క్రిందివిధముగా సిద్ధాంతించెను—

"Imitation so understood, is a creative art. It is the expression of the concrete thing under an image which answers to its true idea. To sieze the universal and reproduce it in simple and sensuous form is not to reflect a reality already familiar through sense perceptions; rather it is a rivalry of nature, a completion of her unfulfilled purpose, a correction of her failures."[10]

అనుకరణ మనెడి పదమునుగూర్చిన అరిస్టాటిల్ అభిప్రాయమును ఎల్. ఏ. క్రాంబీ మరింత స్పష్టముగా పేర్కొనెను—"...... The poet first derives an inspiration from the world by the power of his imagination; the art of poetry then imitates this imaginative inspiration in language."[11]

నాట్యము లోకముకంటె భిన్నము (అనగా 'అభినయప్రధానము'):

అభినయ మనునదియెల్ల నాట్యసంశ్రయమే కాని లోకసంశ్రయము కాదనియు, అభినయములే నాట్యమును లోకమునుండి వేరుపర్చుచున్నవనియు నాట్యనిర్వచనములో భరతుడు స్పష్టము చేసియుండెను. 'అభినయము' అను పదమునందలి 'అభి' అను ఉపసర్గకు 'అభిముఖము'గా అనియు, 'నీ' ధాతువునకు 'పొందించుట' అనియును అర్థములు.[12] కావున, అభినయ మనగా "ప్రయోగమును అభిముఖముగా పొందించుట లేదా ప్రయోగముయొక్క అర్థమును సామాజిక హృదయములకు అందజేయుట" అని అర్థము. ప్రయోగసమయములో నటుడు అభినయముల సాహాయ్యమున రూపకమునందలి అర్థములను సామాజిక హృదయములకు సువ్యక్తము చేయుచున్నాడు. నాట్యము సర్వప్రకృతులను, సర్వభావములను అనగా మానవ వ్యాపారము సంతటిని అనుకరించుచున్నది కాన నటుడు సర్వమానవ వ్యాపారమును రంగముమీద ప్రదర్శింపవలసి యున్నది. మానవవ్యాపార మంతయును మనో – వాక్ – కాయ భేదములచే మూడు విధములని విజ్ఞు లెరిగిన విషయమే. ఈ మూడు వ్యాపారములును నాట్యప్రయోగమందు సాత్త్విక – వాచిక – ఆంగికము లనెడిపేర అభినయము లగుచున్నవి. ఇవియే త్రివిధాభినయములు. నాలుగవది అయిన 'ఆహార్యాభినయము' (వేషధారణము) ఈ మూడింటియం దంతర్గతమై యున్నదని అభినవగుప్తుడు పేర్కొనియుండెను.

లోకమున, చిన్నిపిల్లలు, కావలసినది ఈయలేదను కోపమున కల్లబొల్లి ఏడ్పు లేడ్చుచున్నప్పుడు – సరిగా పరిశీలింపనిచో – వారు నిజముగా ఏడ్చుచున్నారనియే తోచి తల్లిదండ్రులు కంగారు పడుచుండుట మనకు అనుభవైకవేద్యమే. అట్లే, తల్లిదండ్రులు లేని కోపమును తెచ్చిపెట్టుకొని "ఈనాడేదో చేసివేయుదు" రనెడి భయమును పిల్లలకు కలుగజేయుచుండుటయు, కొందరు అసహజములైన వినయాదులు, లేనివిలాసాదులు చూపుచుండుటయు మనము చూచుచుందుము. ఇట్టి పట్టులలో "నాటకమాడుచున్నాడు", "అదంతానాటకములే" అని తటస్థులు అనుచుందురు. ఇట్టి విశేషములే అభినయమునకు మూలరూపములు.

ఇప్పట్టున చతుర్విధాభినయముల స్వరూపములను సంక్షిప్తముగా తెలిసికొనుట ఆవశ్యకము—

సాత్త్వికాభినయము :

అతిగా కోపమువచ్చినచో ముఖము కందగడ్డవోలె ఎఱ్ఱనగును; అతిగా భయాదులు కలిగినచో ఒడలంతయును చెమటపట్టును—అంతరంగమున పుట్టిన భావతీవ్రతవలన శరీరమునందు కన్పట్టెడి ఈ మార్పులే సాత్త్వికాభినయమునకు మూలరూపములు.

రూపకప్రయోగసమయములో నటుడు తనకు అసహజములైన సుఖ – దుఃఖాదులను తనయం దారోపించుకొని ప్రదర్శించుచున్నాడు. హరిశ్చంద్ర నాటకములో హరిశ్చంద్రుడు దారసుతాదులకు దూరుడై, ఒంటరిగా, వల్లకాటిలో గూర్చుండి దుఃఖించుచున్న ఘట్టము నుదాహరణముగా తీసికొందము. హరిశ్చంద్రవేషధారి అయిన ఆ నటుడు నిజముగా అట్టిదుఃఖావస్థలోలేడు;

కాని, ఆ దుఃఖమంతయును నిజముగా తానే పొందుచున్నట్లుగా రంగమునందాతడు గోచరించు చున్నాడు. అట్లే నటుడు తాను నిజముగా ఆ సుఖమును లోకమునందనుభవింపకపోయినను, కథావశమున, రంగముమీద ఆ సుఖానుభూతిని చక్కగా ప్రదర్శించుచున్నాడు. ఈ విధముగా నిజముగా దుఃఖితుడు కాని నటుడు దుఃఖితుడై అశ్రువు మొదలగువానిని, నిజముగా సుఖితుడు కాని నటుడు సుఖితుడై రోమాంచాదులను రంగముమీద ప్రదర్శింపగలుగుటకు హేతువైనది 'సత్త్వము' అనబడును. 'సత్త్వ' మనగా మనస్సమాధి లేక ఏకాగ్రత అని చెప్పవచ్చును. ఇది నటునకు అభ్యాసవశమున సాధ్యమగును. సత్త్వసంబంధమైన అభినయమే సాత్త్వికాభినయ మనబడును. చతుర్విధాభినయములలో ఈ సత్త్వాభినయమే శ్రేష్ఠమైన దనియు, ఈ సత్త్వాభినయమందే నాట్యము ప్రతిష్ఠితమైయున్న దనియు భరతముని కంఠోక్తిగా చెప్పియుండెను.

రససూత్ర వ్యాఖ్యాన సందర్భములో అభినవగుప్తుడు చేసిన వివరణమునందలి ఒక ముఖ్య విషయమును ఇచ్చట గమనింపవలసియున్నది. రసము సహృదయ సామాజికనిష్ఠమే కాని నటనిష్ఠము కాదు; అనగా నటునకు రసానుభూతి ఉండరాదు; నటుడు ఆస్వాదనోపాయము మాత్రమే; కావుననే 'పాత్రము' అనబడినాడు. పాత్రము మద్యాది రసాస్వాదమున ఆస్వాదయితకు తోడ్పడునే కాని, దానికి తదనుభూతి ఉండదు; అది కేవలము సాధనము మాత్రమే. అట్లే నటుడు సామాజికుల రసాస్వాదనమునకు ఒక సాధనము మాత్రమే.

**ఆంగికాభినయము :**

లోకమునందెవరైనను సవిలాసముగా నడచినచో "నాటక మనుకుంటున్నాడు కాబోలు" అని వెక్కిరించుటయో, లేదా "ఆమె నడిస్తే అందంగా ఉంటుంది" అని మెచ్చుకొనుటయో చేయుచుందుము. ఆనందమును కాని, కోపమును కాని, దుఃఖమును కాని పట్టజాలనప్పుడు చిన్నలేకాదు, పెద్దలును చిత్రములైన అంగవిన్యాసములను చూపుచుందురు. ఇట్టివన్నియును నాట్యమందలి ఆంగికాభినయమునకు మూలరూపము.

మానవుని శరీరావయవము లన్నియును అంగ – ఉపాంగ–ప్రత్యంగము లనుపేర త్రిధావిభక్తములై యున్నవి—శిరము, హస్తములు, కటి, ఉరము, పార్శ్వములు, పాదములు అను ఈ ఆరును అంగములు; నేత్రములు, కనుబొమలు, నాసిక, అధరము, కపోలములు, చిబుకము అను ఈ ఆరును ఉపాంగములు; జఠరము, జంఘలు, ఊరువులు, స్కంధములు, బాహువులు, పృష్ఠము అను ఈ ఆరును ప్రత్యంగములు. ఇవి పరస్పరము సంబంధము కలిగియున్నవి. మానవుడు ఏ దేని భావమును ప్రదర్శించినచో, లేదా ఏదేని చలనమును చూపినచో ఈ అంగోపాంగప్రత్యంగము లన్నియును కాని, కొన్ని కాని కలిసియే కదలుచుండును. ఉదా : గ్రీవాకర్మ శిరఃకర్మ ననుసరించి యుండును; ఆస్యకర్మ దృష్టిభేదముల ననుసరించి యుండును : చిబుకకర్మ జిహ్వా–దంత–ఓష్ఠ కర్మల ననుసరించి యుండును. భ్రూకర్మ తారా–పుట కర్మల ననుసరించి యుండును. దర్శనప్రకారములు తారాకర్మకు సంబంధించి యుండును; ఇట్లే ఇతర అవయవములును ఒండొంటికి సంబంధించి కదలుచుండును. ఏదేని ఒక అవస్థలో ఒక వ్యక్తి ఉన్నప్పుడు, ఆ వ్యక్తి నడకలో శిరోహస్తాదులు స్తబ్ధములుగా

నుండవు. స్త్రీ పురుషు లెల్లరును ఉత్తమ - మధ్యమ - అధమ ప్రకృతులుగా నుందురు. వారు సుఖ - దుఃఖముల ననుభవించుచుందురు. దేశ - కాలాది భేదములను బట్టి వారి ఆచార - సంప్రదాయములు, కట్టు-బొట్లు మారుచుండును. కావున, ఆయా వ్యక్తుల అంగవిన్యాసాదులు, గతిప్రచారములు (నడకలు మొ.) పై అంశములకు అనుగుణములుగా ఉండవలెను. ఏ వ్యక్తి ఏ అవస్థలో, ఎచ్చట, ఏవిధముగా ఏ యే అంగవిన్యాసములను చూపునో లేదా ఏవిధముగా నడచునో, కూర్చుండునో, శయనించునో, నిలుచునో అనెడి విషయముల నెల్ల భరతుడు నాట్య శాస్త్రమందు 8, 9 అధ్యాయములలోను (అంగవిన్యాసములు), 12 వ అధ్యాయములోను (గతిప్రచారములు) విపులముగా వివరించెను.

నాట్యమందు ఆంగికాభినయము ఎట్లు జరుగునో 'అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యలో రాఘవ భట్టు నిరూపించియుండెను. శకుంతల సఖులతోకూడి వృక్షసేచనము చేయుట యిచ్చటి ఘట్టము—"వృక్షసేచనమును నిరూపించుటకు అవధూత శిరముతో, అధోముఖ ఆస్యముతో, శరీరమును కొంచెముగా వంచి, భుజములయొద్ద నలినీ - పద్మకోశహస్తములను పట్టవలెను ; 'భ్రమరబాధ'ను విధుతశిరముతో, కంపితాధరముతో, ముఖమునొద్ద పరాఙ్ముఖముగా నుంచిన చంచలమైన పతాకహస్తముతో నిరూపించవలెను............" ఈ నిరూపణ మంతయును కేవలము అభినయము మాత్రమే. చేతిలో నీటికుండ, నేలమీద పూలమొక్కలు, సజీవమైన లేదా యంత్రకృతమైన తుమ్మెద మొదలైనవి నిజముగా రంగముమీద ప్రదర్శింపబడనక్కఱ లేదు. ఆ యా అభినయములను సమర్థులైన నటులు చేసినచో తదర్థములను సంస్కారులైన ప్రేక్షకులు సులువుగా గ్రహింపగలరు. ఈ దృష్టితో చూచినచో 'స్వభావవాదము'నకు నాట్యమున అంతగా స్థానము కన్పట్టదు.

ఆంగికాభినయము ప్రధానముగా మూడు విధములు—ముఖజము, శారీరము, చేష్టాకృతము. 13 విధములగు శిరఃకర్మ, 36 దృష్టిభేదములు, 9 విధములగు తారాకర్మ, 9 పుట భేదములు, 6 నాసాభేదములు, 6 గండభేదములు, 6 అధరోష్ఠభేదములు, 7 విధములగు చిబుక క్రియలు, 6 విధములగు ఆస్యకర్మ, 4 ముఖరాగములు, 9 విధములగు గ్రీవాకర్మ అను నంశములతో కూడిన ముఖజాభినయమును 8 వ అధ్యాయమందు భరతుడు వివరించెను. శారీరాభినయమందలి హస్తాభినయమును, ఉరః-పార్శ్వ-కటీ-ఊరు-జంఘా-పాద-జఠరకర్మలను 9వ అధ్యాయమందు వివరించెను. హస్తాభినయము అసంయుత-సంయుత-నృత్తహస్త భేదములచే మూడు విధములు. ఇందు అసంయుత హస్తములు 24 ; సంయుత హస్తములు 13 ; నృత్తహస్తములు 30. జఠరకర్మ ముత్త్రివిధములు. తక్కినవన్నియును ఐదేసి విధములు. ఇంక చేష్టాకృతము స్థూలముగా రెండు విధములు-మొదటిది రంగప్రవేశ-స్థానక-ఆసన-శయన-గతులకు సంబంధించినది (12 వ అధ్యా.). రెండవది నృత్తమునకు సంబంధించినది ; ఇందలి కరణ-అంగహారములు, చారులు, మండలములు వరుసగా 4, 10, 11 అధ్యాయములందు వర్ణింపబడెను (చూ. నా నాట్యశాస్త్రానువాదము).

నృత్త-నృత్య-నాట్యములందు 'గతి-అవస్థానము' అను రెండు అవస్థాభేదములు కలవు. 'అవస్థాన' మనగా నిలకడ లేదా స్థితి ; 'గతి' అనగా కదలిక లేదా చలనము. అవ

స్థానమందు వైష్ణవ-ఆయతాది స్థానకములును, గతియందు చారులును ఉపయుక్తములగును. 'చారులు' కేవలము పాదముయొక్క చలనమునకు సంబంధించినవి. ఈ చారులవలన మండలము లేర్పడును. గతియందు దేహములోని పూర్వకాయమునకు సంబంధించిన నృత్తహస్తములు, దృష్టులు, రేచకములు ప్రయుక్తములగును. పతాకాది అసంయుత-సంయుత హస్తములధికముగా స్థితియందే ఉపయుక్తములగును. ఇట్లు స్థితి-గతి సమ్మేళనములవలన అనేక కరణము లుత్పన్నములగును. ఆ కరణముల సంయోజనమువలన అంగహారము లేర్పడుచున్నవి. ఇవియెల్ల ప్రయోగవిధాన భేదములతో అవస్థానుసారముగా నృత్త-నృత్య-నాట్యములు మూడింటియందును తరతమభేదములతో ప్రయుక్తములగునని తెలియవలెను.

వాచికాభినయము :

లోకమున, సుఖ-దుఃఖము లతివేలములైనప్పుడు మానవుడు, అవశుడై, తన భావములను సహజస్థితికి భిన్నమైన విధముగా వ్యక్తము చేయుచుండుట మనము చూచుచున్నాము. అప్పుడాతడు వ్యక్తముచేయు మాటలును, భావములును వాచికాభినయమునకు మూలకందములు. తొలి మానవుని సుఖ-దుఃఖముల వ్యక్తీకరణమందే కవిత్వ ముత్పన్నమైనదనెడి సిద్ధాంతము ప్రపంచ భాషలవారందరును అంగీకరించినదే. వాల్మీకిమహర్షి శోకమే శ్లోకత్వమంది రామాయణ మహాకావ్య సృష్టికి హేతుభూతమైన విషయమందరెరిగినదే.

కాగా, సుఖ-దుఃఖ వివశీభూతుడైన వ్యక్తి అంతర్ముఖుడైనప్పుడు, వాని భావవ్యక్తీకరణమందలి వాక్కు వ్యవహారభాషకంటె భిన్నమై, ఒక క్రొత్తగమనమును కూర్చుకొనుచున్నది ; అదియే కావ్యభాషకు పునాది. రూపకముకూడ కావ్యమేకాన అందును కేవల వ్యవహారభాషకంటె కొంత భిన్నమైనభాష ఉపయుక్తమగుట తప్పదు ; మరియు భావభేదమునుబట్టి శైలియును మారుచుండును. అయినను నాట్యము దృశ్యప్రధానము, సంవాదరూపము నగుటచేత అందలి భాష కేవల కథనాత్మకమైన కావ్యభాషకంటె ఎక్కువ ప్రసన్నమై, శ్రుతిమధురమై శిష్ట వ్యవహారభాషకు సన్నిహితముగా నుండవలెననియు, చేక్రీడితాది క్లిష్టప్రయోగములను చేయరాదనియు భరతుడు నిర్దేశించియుండెను.[12] వర్ణనాత్మకములైన ఘట్టములందు మాత్రము అచ్చపు కవిత్వమే ఉండును. ఏ భాషయందైనను, మహాకవుల ఉత్తమరూపకములిట్లే ఉండుననుట నిస్సంశయము.

1. భాషాభేదము, 2. వ్యాకరణము, 3. ఛందస్సు, 4. లక్షణములు, 5. అలంకారములు, 6. గుణములు, 7. దోషములు, 8. సంబోధనపద్ధతి, 9. నామకరణ విధానము, 10. కాకుస్వర వ్యంజనము, 11. విరామము—ఇవి వాచికాభినయమందలి అంగములు. వీనినెల్ల భరతుడు 14, 15, 16, 17 అధ్యాయములందు విపులముగా వివరించెను. వీని స్వరూప స్వభావముల నిర్దుష్ట జ్ఞానము రూపకరచనకు పూనుకొన్న కవికిని, తత్ప్రదర్శనమునకు పూనుకొన్న నటులకును అత్యావశ్యకము—అనగా కవి వీని స్వరూపమెరింగి రూపకమందు సమ్యగ్యోజనము చేయవలెను ; కవిహృదయమును గుర్తించి, నటులు సమ్యక్ప్రదర్శనమునకు పూనుకొనవలయును.

లోకమున అనేక భాషలు కలవు. ఒకే భాషలో అనేక మాండలిక భేదములు కలవు. వ్యక్తుల దేశ-కాల-అవస్థా భేదములను గుర్తించి వీనిని ప్రయోగింపవలెనని భరతుడు నిర్దేశించియుండెను. రూపకములు పాఠ్యప్రధానములు కావున ఆ పాఠ్యమందలి విరామములను చక్కగా పాటించుచు భావ-అవస్థానుకూలముగా స్వరవైచిత్రితో నటులు వాచికాభినయము చేయవలసి యున్నది. అప్పుడే ప్రదర్శనము రక్తిపొందును. హర్షము, శోకము, భయము మున్నగు భావవిశేషములవలన కంఠస్వరమందు ఏర్పడు వికారము లేదా మార్పు లేదా వైచిత్రి 'కాకుస్వర' మనబడును. దీనినే ఆంగ్లమున 'Intonation' or 'Modulation of voice' అని అందురు.

## ఆహార్యాభినయము :

'ఆహార్య' మనగా నేపథ్యసంబంధమైన విధి (Costumes & make-up) అని అర్థము. (నేపథ్య గృహమనగా వేషధారణమున కుపయుక్తమగు నాట్యశాలాభాగము). నాట్యమందలి నేపథ్యజమైన విధి (లేదా నైపథ్యము) నాలుగు విధములు—1. పుస్తము, 2. అలంకారము, 3. అంగరచన, 4. సంజీవము. శైల-యాన-విమానాదులు ప్రదర్శనార్థము నాట్యరంగమందు నిర్మింపబడుట 'పుస్తము'. మాల్య-ఆభరణ-వస్త్రములను నానావిధములుగా అంగోపాంగములందు యథోచితముగా అలంకరించుకొనుట 'అలంకారము'. స్వాభావవర్ణము, సంయోగజవర్ణము, ఉపవర్ణము అను భేదములచే వర్ణములు మువ్విధములు. యథోచితములగు వర్ణములతో నటులు తమతమ రూపములను ఆచ్ఛాదించుకొని, రామాదుల రూపములను పొందుట 'అంగరచన' అగును. పశుపక్ష్యాదుల రంగప్రవేశము 'సంజీవము'.

ఇట్లు నాలుగు విధములగు నైపథ్యమును భరతముని విపులముగా వివరించియుండెను (నా. శా. 21 వ అధ్యా.).

నిజమునకు సాత్త్విక-ఆంగిక-వాచికాభినయములకంటె కూడ ఆహార్యాభినయమే ముందుగా పేర్కొనదగినది. నటుడు రంగస్థలమందు ప్రవేశింపగానే ప్రేక్షకులను ప్రథమముగా, ప్రధానముగా ఆకర్షించునది వాని ఆహార్యమే (వేషమే); పిమ్మట మాటలు, అటుపిమ్మట చేష్టలు, తరువాత భావప్రదర్శనము. నటుని ఆహార్యము సంతృప్తికరముగా నున్నచో నాతడు సగము విజయమును సాధించినట్లే. (ఆహార్యమే లేకుండ పై త్రివిధాభినయములచేతనే రసానుభూతి కలిగింపవచ్చును. కాని, ఉన్నచో మాత్రము అది ఔచితీసహితమై దేశ-కాల-పాత్ర-అవస్థానుకూలముగా ఉండితీరవలయును).

## నృత్య-గానములు :

నాట్యమును లోకమునుండి వేరుపరచెడి మరి రెండంశములు కలవు—అవియే నృత్యగానములు. ఇందు నృత్యము ఆంగికాభినయమునకును, గానము వాచికాభినయమునకు సంబంధించినవి. మానవుడు ఏడ్పును కాని, కోపమునుకాని పద్యములోనో, పాటలోనో వ్యక్తము చేయుట లోకసహజము కాదు. కాని రూపకభాష వ్యవహారభాషకంటె ఎట్లు భిన్నమగుచున్నదో అట్లే నాట్య



మందలి సుఖ-దుఃఖముల ప్రదర్శనమును లోకముకంటె భిన్నమే అగుచున్నది. కాగా, నృత్య-గానములు నాట్యమందు ప్రవేశించి రంజకత్వ సాధనములైనవి. వీథినాటకాదులందివి ప్రాధాన్యమును వహించి, వానిని లోకమునకు మరీ దూరమొనర్చినవి. కాని, సంస్కృతాది రూపకములందివి తగుమాత్రముగా ప్రయుక్తములై జనప్రియములే అయినవి.

ఇన్ని విధములుగా నాట్యము లోకముకంటె భిన్నమగుచున్నది. 'ధర్మి' వివరణమందు దీనినిగూర్చి మరల ప్రసంగింతును.

నాట్యము లోకముకంటె భిన్నమగుటచేతనే, అర్వాచీనకాలములో తత్పర్యాయమైన 'నాటక' పదమునకు క్రీడ, హేల, మోసము, వంచనము, కపటము అనెడి అర్థములు సంభావ్యములైనవి. ఇందులకు తెలుగు కావ్యములనుండి నాలుగు ఉదాహరణముల నొసంగుచున్నాను—

1. "ధర్మమూర్తియనుచు, నిర్మలాత్మకుఁడని, నమ్మినార మిట్టి నాటకములఁ జాల ద్రోహియైన శారదానందుని జంపుమనిన"—(సింహాసన ద్వాత్రింశిక - 1 వ భా.-221 ప.)
2. "నా మొగమాటకై వలని నాటకము ల్గటియించి"—(పారిజాతాపహరణము - 1-89ప.)
3. "నీవేమి సేతు మానిన యీ విధు నాటకముగాక..."—(విష్ణుమాయావిలాస నాటకము 1 వ ఆ. - 181 ప.)
4. "పుండరీకాక్షునకు శౌరి పూజలిచ్చె
సంయములు చూడ బదరికాశ్రమమునందు
నాగవిందు మయ్యిరువుర నాటకంబు
చెవుల పడవేసి పండుగు సేయు మనఘ."

—(ఉత్తర హరివంశము—2 వ ఆ. - 70 ప.)

## నాట్యము ప్రదర్శన ప్రధానము

నాట్యమందు అభినయములు రూపకార్థములను సామాజికులకు సువ్యక్తము చేయునని చెప్పుకొనుటలో నాట్యమనగా వట్టి రూపకరచనామాత్రము కాదనియు, రూపక ప్రయోగమే నాట్యమనియు, అభినయ మనునది నటుని వ్యాపార మనియు స్పష్టమగుచున్నది. దేవతలు బ్రహ్మను "దృశ్యమును, శ్రవ్యమును అయిన క్రీడనీయకము"ను సృజింపవలసినదిగా కోరినారు కదా. అంతట బ్రహ్మ నాట్యమును సృష్టించి, "కుశలులు, విదగ్ధులు, ప్రగల్భులు, జితశ్రములు, సంశితవ్రతులు" అయిన ప్రయోక్తల (= నటుల) కొరకు అన్వేషించెను. కావున ప్రదర్శనార్థమే నాట్యము సృష్టింపబడినదని విశద మగుచున్నది. మరియు 'నాట్యము'నకు పర్యాయములైన దృశ్యకావ్యము, ప్రేక్ష్యకావ్యము, ప్రేక్ష, రూపము, రూపకము, నాటకము అనెడి పదములెల్ల ప్రయోగప్రాధాన్యమునే నొక్కి చెప్పుచున్నవి. కాళిదాసు మాళవికాగ్నిమిత్ర ప్రారంభములో నాట్యమును 'చాక్షుషక్రతువు'గా వర్ణించుట గమనార్హము. 'చాక్షుష' మనుటచే

నాట్యము దృశ్యప్రధాన మనుట స్పష్టము. దృశ్యమే కాక శ్రవ్యముకూడ అయిన క్రీడనీయక మును దేవతలు కోరుటనుబట్టి వాచికాభినయవిరహితమైన ప్రదర్శనమును వారెన్నడును వాంఛింపలేదనుట కూడ నిస్సంశయము.

నాట్యశాస్త్రము కవి శిక్షార్థమే కాక ప్రయోక్తృ శిక్షణమునకుకూడ ఉద్దిష్టమైనదని తెలిపియున్నాను. భరతునకు ప్రయోగమందు దృష్టిలేనిచో ఆతడు 6, 7, 14, 15, 16, 18, 19, 20 అధ్యాయములను మాత్రమే రచించి ఊరకొనియుండెడివాడు. ప్రయోగదృష్టియే లేనిచో నాట్యమండప నిర్మాణవిధానమును, చతుర్విధాభినయములను, నాటక సమాజాదులను గూర్చి వివరింపవలసిన ఆవశ్యకమే లేదు.

ఈ సందర్భమున భరతమునికి తరువాతివారగు వామన–భట్టతోత–అభినవగుప్తపాదా దుల అభిప్రాయములనుకూడ పరికించుట సమంజసము.[1] వామనుడు (క్రీ. శ. 800 ప్రాంత ములు) తన కావ్యాలంకారసూత్ర-వృత్తులలో క్రిందివిధముగా పేర్కొనెను—"సందర్భము లందు దశరూపకము శ్రేష్ఠము. విశేషసమగ్రము కావున చిత్రపటములె నది చిత్రముకదా! దానినుండియే ఇతర భేదములు కల్పితములు."[2] ఈ సూత్రములపై వృత్తి క్రిందివిధముగా నున్నది– "సందర్భములందు అనగా ప్రబంధములందు దశరూపకము శ్రేష్ఠము. చిత్రపటము సందువలె ఇందును విశేషములు సమగ్రములుగా నుండును. కాన ఇది మనోహరముగా నుండును. ఆ దశ రూపకమునుండియే కథా–ఆఖ్యాయికా–మహాకావ్యము లనెడి భేదాంతరము లుత్పన్నము లైనవి."

చిత్రపటము దృశ్యమానమైనది. అట్లే దశరూపకమును దృశ్యమానమైనప్పుడే విశేష సమగ్రము కాగలదు. ఈ విశేష సమగ్రతవలననే దశరూపకమునకు ప్రబంధములందు అగ్ర స్థానము లభించెను. కావుననే 1. దశరూపకము ప్రబంధములలో ఉత్తమమైనదనియు, 2. అది దృశ్యమాన మగుటచేత విశేష సమగ్రమైనదనియు, 3. ఈ దశరూపకమునుండియే కథా–ఆఖ్యాయికా–మహాకావ్యము లుద్భవించెననియు వామనుడు పేర్కొనెను.[3]

## రసాస్వాదము :

పై వామనవాక్యములను అభినవగుప్తుడు అభినవ భారతియందు ఉదాహరించుకొనెను. మరియు తన ఉపాధ్యాయుడగు భట్టతోతుడు 'కావ్యకౌతుక'మందు "ప్రయోగత్వ మనాపన్నే కావ్యే నాస్వాదసంభవః" (ప్రయోగమును పొందని కావ్యమందు ఆస్వాదము సంభవింపదు.) అని చెప్పెనని పేర్కొని స్వీయాభిప్రాయమునుకూడ క్రింది విధముగా వివరించెను— "కావ్యంతావ న్ముఖ్యతో దశరూపాత్మక మేవ. తత్రహి ఉచితైర్భాషా–వృత్తి–కాకు–నైపథ్య ప్రభృతిభిః పూర్యతే రసవత్తా" (అభినవభారతి–1 వ భా–పుట 291). (కావ్యమనగా ముఖ్య ముగా దశరూపాత్మక మైనదే. అందు ఉచితములైన భాషా–వృత్తి–కాకు–నైపథ్యాదులచే రసవత్త సమగ్రమగుచున్నది). పైదానినిబట్టి భట్టతోత – అభినవగుప్తులు 'నాట్యము ప్రయోగ ప్రధాన' మనియే తలంచిరనుట నిస్సంశయము. కాగా రూపకము ప్రయుక్తమైనప్పుడే అది 'నాట్య' మనిపించుకొనును ; నాట్యమందే రసవత్త సమగ్రము కాగలదు.

కావ్యమువలన కూడ రసాస్వాదము కలుగకపోదు ; ఈ విధానమును వాక్యపదీయకారుడగు భర్తృహరి క్రిందివిధముగా పేర్కొనెను.

"శబ్దోపహితరూపాంస్తాన్ బుద్ధేర్విషయతాంగతాన్ ।
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే ॥''

శ్రవ్యకావ్యమునందు కవికృతములైన వర్ణనలచేత కంసాదులు (=నాయకాదులు) రూపుకట్టుకొని, సహృదయుని భావనాబలమున వాని హృదయమును ప్రవేశించి, ప్రత్యక్షముగా గోచరింతురు. అప్పుడు శ్రోత లేదా పఠిత తదభేదమును చెంది, రసాస్వాదము చేయును. కాని, సహృదయులైనవారికే కావ్యమందు రసాస్వాదము కలుగును. ఈ సహృదయత అనునది బహుకావ్య పరిశీలనాది సంస్కారబలమున చేకూరును.[4] అది అందరకును అందుబాటులోనిది కాదు ; అందుచే కావ్యవిషయమున రసాస్వాదనమునకు అందరును అర్హులు కారు. కాని, నాట్యమునందు నటులు భాషా-వృత్తి-కాకు-నైపథ్యములనెడి (వాచిక-ఆంగిక-సాత్త్వికఆహార్యము లనెడి) చతుర్విధాభినయములతో రూపకార్థములను లేదా రూపకగతవ్యక్తులను ప్రేక్షకులకు ప్రత్యక్షము చేయుచున్నారు. అట్లు ప్రయోగార్థములు సుస్పష్టముగా హృదయగోచరములై అనుభూతికి వచ్చుచుండుటచేత ప్రేక్షకులు నాట్యమందు సులువుగా రసాస్వాదము చేయగలుగుదురు. కాగా ప్రేక్షకుల ఈ వ్యాపారమును నటులు అభినయసామర్థ్యముచే సుకరమొనర్చుచున్నారు. ఇట్లు నాట్యము కేవలము సహృదయులకే కాక సామాన్యులకుకూడ ఆనందానుభూతి కలిగించుటకు సమర్థమైయున్నది. అసహృదయులైనవారికి కూడ నాట్యమందెట్లు అభిరుచి కలుగునో అభినవగుప్తుడు వివరించియుండెను—"నిజసుఖాది వివశీభూతులై అసహృదయులైన వారినికూడ నాందీపఠనము, ప్రస్తావనలోనినటీ-సూత్రధారసంభాషణము, ఋతుగానాదులు ఆకర్షించి, రజింపజేసి, వారి హృదయములను ప్రయోగ దర్శనోన్ముఖములనుగా చేయును. అనగా ధ్రువాగీత్యాదుల వలనను, ఇంకను తత్కాలోపస్థితములగు విచిత్రమండపరంగాలంకరణాది కారణములవలనను సామాజిక హృదయములు సంస్కరింపబడి, ఏకరూపములై రసాస్వాదనోచితము లగును."[5] ఇట్లు నాట్యమున, రసాస్వాదన విషయమున అధికారము లభించుటకు అందరకును అవకాశము కలదు.

మొత్తముమీద కావ్యమందైనను, నాట్యమందైనను రసాస్వాదయోగ్యతకు 'సహృదయత' అనునది ఆవశ్యకము, కాని, ఆ సహృదయత కావ్యవిషయమున కష్టసాధ్యమును, పూర్వసంపాద్యమును అగుచుండగా నాట్యవిషయమున సుకరమును, తత్కాల సంపాద్యమును కూడ అగుచున్నది. ఇట్లు సహృదయులకే కాక సామాన్యులకు కూడ రసాస్వాదము సుకరముగా కలిగించెడి నాట్యము సందర్భము లన్నింటను శ్రేష్ఠమైనదని ఆలంకారికుల నిర్ణయము.

## సీనరీ (Scenery) :

ఈ సందర్భమున ఇంకొక విషయమునుకూడ గమనింపవలసియున్నది. నేటి నాటక ప్రయోగమునందు 'దృశ్యము' (Spectacle) అనగా రంగాలంకరణము ప్రాధాన్యమును వహించుచున్నది. మనవారు ఈనాడు ప్రతి రంగమునకును, కన్నుమూసి కన్నుతెరచునంతలో

దృశ్యమును మార్చివేయుచున్నారు; లేదా ఒకే దృశ్యమునందు కథ అంతయును జరిగిపోవు నట్లుగా రచింపబడిన నాటకములను స్వీకరించి, ఒక 'సెట్' (single set) వేసికొని నాటకము నంతటిని అందే నడిపించుచున్నారు. మరియు నేడు సినీమాల ప్రభావము మరింత అధికమై రంగస్థలాలంకరణమునందు ఇంకను క్రొత్త క్రొత్త మార్పులు ప్రచారములోనికి వచ్చు చున్నవి.

కాని, మనపూర్వు లెవ్వరును సీనరీకి ప్రాముఖ్య మిచ్చినట్లు కన్పట్టదు. నాట్యశాస్త్రమును పరిశీలించిచూచినను రంగస్థలాలంకరణము (Painted curtains, sets and Stage decoration), దృశ్యములమార్పు (Change of scenery) అనువానిని గూర్చిన వివరణము కన్పట్టదు. దీనికి కారణ మానాడు అట్టి అవసరము లేకపోవుటయే: (షేక్స్పియరు కాలములో కూడ దృశ్యమునకు ప్రాధాన్యము లేదని తెలియవలెను). సంస్కృత నాటకములను పరిశీలించి చూచినచో అందలి కథలు స్వర్గ-మర్త్య-పాతాళములకు సంబంధించి యున్నట్లు తెలియగలదు. అందలి ప్రదేశములు ఆకాశ-జల-పృథివీ-వన-పర్వత-ప్రాసాద-రాజమార్గాదులై యుండును. వీని నెల్ల రంగస్థలముమీద చూపుటకు మన పూర్వులెవ్వరును ప్రయత్నించి యుండలేదు. అవి యెల్ల కక్ష్యావిభాగముచేతను, అభినయములచేతను నిర్దిష్టము లగుచుండెడివి. నదిని దాటుట, ప్రాసాదము నెక్కుట మొదలగు పెక్కు క్రియలను—నేడు సీనరీ సాహాయ్యముతో ప్రత్యక్షముగా చూపబడుచున్నవానిని—కేవలము అభినయములచేతనే ఎట్లు నిరూపింపనగునో భరతుడు వివరించియుండెను (గతిప్రచారములనెడి 12 వ అధ్యాయమందు). ఇంక ఆయా ప్రదేశములను నిర్దేశించుటకు రంగస్థలమును—ఊహామాత్రముగా—కక్ష్యలుగా విభజించుకొనవలసిన విధానమును 13 వ అధ్యాయ ప్రారంభమందు విపులముగా వివరించెను. ఈ నిరూపణమంతయును రంగమునందు సంజ్ఞామాత్రముగనే జరుగును కాన సంస్కృత నాటకప్రదర్శనములందు కక్ష్యావిభాగమునకును, అభినయములకును ప్రాధాన్య మధికమైనది.

నాటక ప్రదర్శన మన్నంతనే యథార్థత, అసహజత్వము అనునవి కొంత ఉండక తప్పవు. యథార్థ మనిపించెడి 'సెట్'ను ఎంత చక్కగా వేసికొన్నప్పటికిని రంగస్థలము మీది గదికి నాలుగుగోడలను చూపలేముకదా? ఉద్యానవనమనెడి భ్రమనుమాత్రమే కలిగింపగలముకాని యథార్థమగు ఉద్యానవనమును రంగముమీద చూపలేముకదా? ఇంక మరణవిషయమున చెప్ప వలసిన దేమున్నది? "రూపకమందలి ఒక వ్యక్తి చనిపోవుట ప్రదర్శింపవలసివచ్చినచో ఆ వ్యక్తి వేషమును ధరించిన నటుడుకూడ చనిపోవుట లేదుకదా? అట్లెన్నటికిని జరుగదు. ఆ నటుడు, తాను నిజముగా మరణింపకయే, దానిని 'సంజ్ఞామాత్రముగ' ఎట్లు ప్రదర్శించునో అట్లే ఆయా అంశములను అభినయములచేత సంజ్ఞామాత్రముగ నిరూపింపవలెను" అని భరతుడు 13 వ అధ్యాయమందు పేర్కొనెను. కావున రంగస్థలమందు ప్రయోగసమయములో 'భ్రమ' మాత్రమే కల్పింపబడుచున్నదనుట స్పష్టము. అసలు, ఈ 'భ్రమ' (make-believe) యే ప్రయోగమునకు ప్రాణమని చెప్పవలసియున్నది. ఈ దృష్టితో చూచినచో ప్రాచీనులు కక్ష్యావిభాగమునకును, అభినయములకును ఇచ్చిన ప్రాధాన్యమునకు హేతువు స్పష్టపడగలదు.

కొన్ని సంస్కృత నాటకములను, ముఖ్యముగా "మృచ్ఛకటిక"ను యథాతథముగా ప్రదర్శించుటకు "రివాల్వింగు స్టేజి" (Revolving Stage) అనగా పెక్కు దృశ్యములుకలదై గుండ్రముగా తిరిగెడి రంగస్థలము ఆవశ్యకముగా కన్పట్టును. కాని, పై విధముగా కక్ష్యావిభాగముతో, అభినయముతో ప్రదర్శించినచో అట్టి అవసరమే కన్పట్టదు. మనపూర్వులుకూడ "రివాల్వింగు స్టేజి"ని ఉపయోగించి యుందురని ఊహించుటకంటె, వారికి పై విధముగా దాని ఆవశ్యకమే లేదని తలంచుట సమంజసము. సంస్కృత నాటకకర్తలు అంకమునంతటిని ఒకే ఒక రంగముగా రచించెడివారు (గీతరూపకములలో రంగవిభజనముకాని, అంకవిభజనముకాని లేనే లేదు). అందుచే ప్రదర్శనమునందు ఆయా ప్రదేశముల భిన్నత్వమును సూచింపవలసిన అవసరము తప్పినది. ఈ విధముగా వారు ప్రయోగసౌలభ్యమును చేకూర్చుకొనుటయేకాక, స్థూలముగా స్థలైక్యమును పాటించుటకూడ జరిగినది. ఒకే అంకమునందు ఉద్యాన–ప్రాసాద–రాజమార్గాది ప్రదేశ వైవిధ్యము కన్పట్టుచున్నను అవి యెల్ల కక్ష్యలచే, అభినయములచే, వర్ణనలచే సూచితము లగుచుండునని తెలియవలెను.

### కావ్యము : నాట్యము :

నాట్యమువలెనే కావ్యముకూడ లోకముకంటె భిన్నమైనదే. అయినను అవి మరల పరస్పర భిన్నములైనవి. ప్రయోగ విధానముచేతనేకాక రచనా విధానముచేతకూడ రూపకము కావ్యముకంటె భిన్నమగుచున్నది. కావ్యమునందుకాని, కథ–అఖ్యాయికాదులందుకాని కథామధ్యములో కవికి ప్రవేశమున్నది. అనగా పాత్రలను, వారి గుణాగుణములను విమర్శించుటలో, పరిసరములను, వాతావరణములను వర్ణించుటలో కవి స్వయముగా మాటాడును. కాని రూపకమునందిట్టి అవకాశము లేదు. రూపకమందు రచయితగా వాని వాక్యములెచ్చటను కన్పించరాదు. సన్నివేశముల కూర్పులో, రూపకగత వ్యక్తుల ప్రసంగములలో, అర్థోపక్షేపకములలో సర్వమును వ్యక్తము కావలసియున్నది. మరియు రూపక రచయితకు చాల కట్టుబాట్లు కలవు. రూపక రచనకు సంక్షిప్తత (brivity) ప్రాణము. గ్రహించిన రూపక స్వరూపమునుబట్టి, ప్రయోగకాలమును, అంకముల లేదా రంగముల సంఖ్యయును పరిమితములై యుండును. తాను గ్రహించిన కథను బిగువు చెడకుండ రచయిత అందులోనే ఇముడ్చుకొనవలసి యున్నది. నాటకము ప్రదర్శింపబడునది పరిమితమైన రంగస్థలము. కాన, అందు తలచిన దానినెల్ల ప్రదర్శించుటకు వీలులేదు. నీరసములైన సన్నివేశములనేకాక అనావశ్యకములైనవానిని, అనుచితములైనవానినికూడ రంగమునందు ప్రత్యక్షముగా ప్రదర్శింపరాదు. అందుచేత కవి ముందుగానే జాగ్రత్తపడి, అత్యావశ్యకమైనచో, అట్టివానిని అర్థోపక్షేపకములయందు సూచింపవలెను. యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, సేనల ముట్టడి మొదలగువానిని ప్రత్యక్షముగా ప్రదర్శింపరాదు. ఇవి ప్రయోగసాధ్యములు కావు ; అనగా వీనిని ప్రదర్శించుటలో సౌలభ్యము తక్కువ, శ్రమ అధికము, కలిగెడి ఫలము అత్యల్పము లేదా పూజ్యము. అట్లే శయన–చుంబన–ఆలింగన–అవలేపన–గుహ్యకార్య–దంతచ్ఛేద్య–నఖచ్ఛేద్య–నీవీస్రంసన–స్తనాంతర విమర్దన–భోజన–సలిలక్రీడాదులనుకూడ రంగమునందు ప్రదర్శింపరాదు. ఇవి అనుచితములు లేదా జుగుప్సావహములు అగు కార్యములు. వీనిని ప్రత్యక్షముగా ప్రదర్శింపరాదని చెప్పుచు "తంద్రి,

కొడుకు, కోడలు, అత్త కలిసి నాటకమును చూచుచుందురు; కాన అట్టివానిని వర్జింపవలెను"6 అని భరతుడు చమత్కరించుట గమనార్హము. వీనినిగూర్చి రచనాసమయములో కవి ఎంత జాగ్రత్త తీసికొనవలెనో, ప్రయోగ సమయములో నటుడుకూడ అంత జాగ్రత్తయే తీసికొనవలసి యున్నదని మరువరాదు.

ఇంత శ్రమతో, ఇంత ధీశక్తితో రచింపబడినను, కేవల రూపకరచన సమగ్ర కళాస్వరూప మగుటలేదు; చతుర్విధాభినయములలో అది కేవలము వాచికాభినయసంబంధి మాత్రమే అగుచున్నది. ఇంక తక్కినదంతయును, అనగా లోటు అంతయును, నటుల అభినయము, ఆహార్యము, గానము, భావప్రకటనము మొదలగువానివలన రంగస్థలమున ప్రయోగకాలములో పూరింపబడుచున్నది. కావున, రూపకము ప్రదర్శింపబడినప్పుడే అది సమగ్ర కళాస్వరూపము కాగలదనుట నిస్సంశయము; అందుచేతనే నాట్యము ప్రదర్శన ప్రధానమని చెప్పుట. అసలు, రూపకరచనా-రంగస్థల ప్రదర్శనముల కలయికయే నాట్యమనబడునుకదా!

## ప్రేక్షకులు :

ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గమనింపవలసి యున్నది. రూపక ప్రదర్శనమనునప్పుడు రంగస్థలమును, ప్రేక్షకాగారము (= నాట్యశాల = Theatre) ను ఆవశ్యకములు. ప్రేక్షకాగారమున కొన్ని వందలమంది కూర్చుందురు; వారు అనేక చిత్తవృత్తులకు చెందియుందురు. వీరందరికొరకే రూపకము ప్రదర్శింపబడుచున్నది. రూపక రచయిత ఎంత ప్రతిభావంతుడైనను, నటులు ఎంత విదగ్ధులైనను, ఆ ప్రదర్శనము చూడవచ్చిన జనులకు అది రుచింపనిచో, అది విఫలమైనదన్నమాటే. మరియు అన్నిరకముల నాటకములను అందరు నటులును ప్రదర్శింపలేరు; అంతియేకాదు, అన్నిరకముల నాటకములును, అందరు నటులును సమస్త ప్రేక్షకులను మెప్పించుటకూడ కష్టము. అందుచే సమూహముమీద ప్రేక్షకుల అభిరుచులకు తగిన రూపకమును ఎన్నుకొని, తదనురూపాభినయములను నటులు ప్రదర్శింపవలసి యున్నది. కాగా, నాట్యము సిద్ధిమంతమగుటలో కవి-నటులతోపాటు ప్రేక్షకులును భాగస్వాములగుచున్నారు; ఇది మరువరాని విషయము. రసాస్వాదనమునుగూర్చి మన అలంకారికులు చేసిన చర్చలను పరిశీలించినచో వారు ప్రేక్షకులకు (సామాజికులకు) ఎంతటి ప్రాధాన్యము నొసంగినారో తెలియగలదు.

## శ్రవ్యరూపకములు :

ఒకడు ఒంటరిగా కూర్చుండి, కావ్యమునువలెనే రూపకమునుకూడ చదువుకొనవచ్చును; లేదా ఆ ఒకడు చదువుచుండగా పదిమంది వినవచ్చును. కాని రూపక ప్రయోజనమింతమాత్రమే కాదు; అది ప్రదర్శితమైనప్పుడే శబ్దార్థమును, రూపకరచనయును సార్థకములు కాగలవు. ప్రయోగమునందని కేవల రూపకరచన అస్థిపంజరమువంటిదనుట అతిశయోక్తి కాదు. దానికి రంగస్థలము దేహము, నటులు రక్తమాంసములు, సూత్రధారుడు ప్రాణము, ప్రేక్షకులు చైతన్యము అని చెప్పవచ్చును. కావున రంగస్థలమున చక్కగా ప్రదర్శితమైనప్పుడే

రూపకము సమగ్ర కళాస్వరూపము కాగలదని తెలిపియున్నాను. అంతమాత్రమున రూపక రచనము స్వతంత్రముగా నిలువజాలదని చెప్పుటకు వీలులేదు. నిజము చెప్పవలెనన్నచో ప్రదర్శించుటకు వీలుకాని, అసలు ప్రదర్శింపబడని రూపకములు పెక్కులు కలవు. అవి కేవలము పఠన-పాఠనములకు మాత్రమే ఉపయోగపడును : అవి ఇంచుమించుగా కావ్యముల వంటివే. ఇట్టివానిని ఆంగ్లమున "Closet Dramas" అందురు. రోమ్ దేశమందలి సెనీకా (Seneca-c. 4 B. c. 65 A. D.) రూపకములిట్టివే ; అవి ప్రదర్శింపబడినవని తలంచుటకు తగిన ఆధారములుకూడ లేవు. సంస్కృతమునందలి అనర్ఘరాఘవాదులును ఇట్టివే.

రూపకమనగా విధిగా దృశ్యమానము కావలెననెడి సూత్రమునకు రేడియో రూపకము (Radio-Play) అపవాదముగా కన్పట్టుచున్నది. ఒకరే చదువుటకు మారుగా పలువురు చదువుట, కాకుస్వరాదులతో పెక్కు కంఠస్వరములు వినిపించుట, అవస్థానుకూలములైన ధ్వనులను పుట్టించుట అనెడి విశేషములను విడిచివేసినచో దీనికిని, Closet Drama కును వేరు భేదము కన్పట్టదు. దృశ్యత్వమనెడి ప్రధాన ధర్మమునే కోల్పోయిన ఈ ప్రక్రియను "రూపక" పదముతో వ్యవహరించుటకంటె దీనికి వేరొక పదమును కల్పించుట సమంజసము కాగలదేమో.

**నటుడు : కవి :**

"శ్రీహర్షో నిపుణః కవిః, పరిషదప్యేషా గుణగ్రాహిణీ ।
లోకే హారిచ వత్సరాజచరితమ్, నాట్యే దక్షావయమ్ ॥"

శ్రీహర్షుని నాటక ప్రస్తావనలలోని సూత్రధార వాక్యములివి. ఇందు నాట్యమునకు ప్రధానాంగములు నాలుగు పేర్కొనబడెను—1. నిపుణుడైనకవి ; 2. గుణగ్రాహిణియైన పరిషత్తు ; 3. సహృదయ హృదయాకర్షకమైన ఇతివృత్తము ; 4. దక్షులైన నటులు. పై వానిలో ఏది లోపించినను, ఏ గుణము లోపించినను నాట్యము సమగ్రము కాజాలదు. నాట్య సిద్ధిలో కవి-నటులిరువురును సమభాగస్వాములే. ఇరువురును సమాన గౌరవమున కర్హులే. ఈ పట్టున మహిమభట్టు వాక్యములు గమనార్హములు. ఆతడు కావ్య-నాట్యములు రెండును ఉపాయ మాత్రభేదములే అనియు, రెండింటి ఫలమందును భేదము లేదనియు చెప్పుచు, కావ్య-నాట్యములభేద-సాదృశ్యములను వివరించెడి ఒక ప్రాచీన శ్లోకమును ఉదాహరించెను— "అనుభావ విభావముల వర్ణనయే కావ్యమగును. గీతాదులతో గలిపి యాయనుభావాదులను ప్రయోగించుటయే నాట్యమగును."[7]

భారతీయాలంకారికులలో భోజుడు ఒక్కడు మాత్రము పై అభిప్రాయమునకు భిన్నముగా తలపోసెను. "శృంగార ప్రకాశము" నందాతడు క్రిందివిధముగా తన అభిప్రాయమును వ్యక్తము చేసెను. —"రసము, విదగ్ధ శైలూషులచే ప్రదర్శ్యమానములగు అభినయముల వలన సామాజికులచే ఆస్వాదింపబడుచున్నది ; లేదా ప్రబంధములందు కవులచే చేయబడిన వర్ణనములను భావించెడి విద్వాంసులమనీషాబలముచే ఆస్వాదింపబడుచున్నది. ఇందులో వాగ్మియగు వాని వాక్కులచే స్ఫురించుదానివలె ప్రత్యక్షముగా ప్రదర్శింపబడు దానివలన

గోచరింపునది హృదయావర్జకము కావాలడు.[8] కావున అభినేతల (నటుల) కంటె కవులను, అభినయములకంటె కావ్యమును అధికముగా బహూమానింతును."[9]

దీనినిబట్టి బుద్ధికి ఎక్కువగా పని కల్పింపని ప్రదర్శనము, నటుల అభినయము భోజుని ప్రశంసను పొందలేక పోయెనని విశదమగుచున్నది. అనగా ఏకారణముచేత నాట్యము శ్రేష్ఠమైనదిగా తలంపబడెనో ఆ కారణముచేతనే అది విద్వాంసులకు హృదయావర్జకము కావాలదని భోజుడభిప్రాయపడెను ; కాని, ఆతడు చెప్పిన ఆ 'మనీషుల' సంఖ్య అత్యల్పముగా నుండు నని విస్మరింపరాదు. స్మృతులు నటుని, నటకర్మను నింద్యముగా చూచినవి. పైవిధముగా చెప్పుటలో భోజునిపై ఈ ప్రభావముకూడ ఉండియుండును. అందుచేతనే ఆతడు నటులను, అభినయములను చిన్నచూపు చూచినాడు !

భరతాభినవగుప్తాదులు నాట్యము ప్రదర్శనప్రధానమని చెప్పినను వారు కవులను, కావ్య-నాట్య నిర్మాణమును నిరసించినవారు కారు. "ఇతివృత్తము కావ్యశరీర"మని భరతుడును, "ఒక్కొక్క పద్యమునల్లెడి ముక్తకకవి ప్రబంధనిర్మాణ దక్షుడు కాజాలడు. వానికి సంధి-సంధ్యంగ విన్యాస చమత్కారము తెలియనే తెలియదు. ప్రబంధయోజన సమర్థుడగు కవియే సంధ్యంగ సంయోజన యోగ్యతను గుర్తింపగలడు. ఈ సంధి-సంధ్యంగ సంయోజనము రస-భావాపేక్షితముగా సాగవలయును'' అని నాట్యశాస్త్ర ఏకోనవింశత్యధ్యాయమందు అభినవ గుప్తుడును పేర్కొనియుండుట గమనార్హము. కావున భోజుడు తప్ప తక్కిన భారతీయాలంకారికు లందరును అభినేతలను-కవులను, అభినయములను-కావ్యములను సమానముగానే గౌరవించి, తత్తదర్హస్థానముల నొసంగియున్నారనుట పరమసత్యము.

కాగా రూపకములను రచించు కవులకు, వానిని ప్రయోగించు నటులకు సమాన ప్రాధాన్యము నొసంగి భారతీయులీ సమస్యను పరిష్కరించి యున్నారు. కాని, పాశ్చాత్యులలో ఇది నేటికిని సమస్యయే. కేవల పఠనమువలనే ఉత్తమరూపకము అనందమీయగలదని కొందరు తలంపగా, మరికొందరు కవి నిమిత్తమాత్రుడనియు, రూపకము ఉత్తమనటుని వలననే ఆస్వాదయోగ్యము కాగలదనియు తలంచుచున్నారు.

విషాదరూపకములు చక్కగా ప్రదర్శింపబడిన ప్రదర్శింపబడవచ్చుననియు, కాని నటన, ఆహార్యము మొదలగునవి వాని ఘనతను, ఆస్వాదయోగ్యతను ఎక్కువ చేయజాల వనియు, వాని ఘనత అంతయును ఉత్తమమైన కవిరచనలోనే ఉన్నదనియు అరిస్టాటల్ పేర్కొనియుండెను.[10]

"The spectacle has, indeed, an emotional attraction of its own, but, of all the parts, it is the least artistic, and connected least with the art of poetry. For, the power of tragedy, we may be sure, is felt even apart from representation and actors. Besides, the production of spectacular effects depends more on the art of the stage machinist than on that of the poet" (Pp. 29–31).

"........For, the plot ought to be so constructed that, even without the aid of the eye, he who hears the tale told will thrill with horror and melt with pity at what takes place........But to produce this effect by the mere spectacle is a less artissic method......" (P. 49).

"........Tragedy, like Epic poetry, produces its effect even without action; it reveals its power by mere reading" (P. 109)

కాని, అరిష్టాటిల్ అభిప్రాయముతో ఆయన వ్యాఖ్యాతలే కొందరంగీకరింపలేదు. క్రీ. శ. 1570 లో పొయెటిక్సును ఇటాలియన్ భాషలోనికి సవిమర్శకముగా అనువదించిన ఎల్. కాస్టెల్ వెట్రో అనునతడు అరిష్టాటిల్‌తో అంగీకరింపక క్రిందివిధముగా పేర్కొనెను— "1. విషాదరూపక ప్రయోగమును చూచినప్పుడు కలిగినంత ఆనందము దానిని చదువునప్పుడు కూడ కలుగుననుట సత్యసమ్మతము కాదు. 2. ప్రయోగ సమయమున సకల జనులకును అది ఆనందదాయకము కాగలదు; చదువుకొనునప్పుడు విద్వాంసులు మాత్రమే దానివలన ఆనందము పొందుదురు. 3. రూపకమనునది ప్రయోగమునకే ఉద్దిష్టము కావలయును; నాట్య లక్షణ వివేచనమునకు ఇదియే ప్రాతిపదిక కావలయును."

మరికొందరు రచయితలు కవిని నిమిత్తమాత్రునిగా తలంచి, నటుని అందల మెక్కించినారు. అట్టివారిలో నాటక రచయితలు, నటులుకూడ కలరు. డిడెరాట్ (Denis Diderot-1713–84) అనెడి ఫ్రెంచి రచయిత దృష్టిలో "రూపక సిద్ధికి సంబంధించిన కీలకమంతయును నటునిలోనే ఉన్నది." (డిడెరాట్ రూపక రచయితకూడను). మహానటునిగా పేరుపొందిన సర్ హెన్రీ ఇర్వింగ్ (1838–1905) కూడ ఇదే అభిప్రాయమును వెల్లడించెను[11]"—

"Acting is an art as distinct as any other, and, if it be the most fleeting, is also the most vivid......So, on the stage, the accessories which are perfectly attuned to the story must greatly enhance its fascination......Acting, and acting only, can make a play successful; but let us acknowledge that, by the legitimate arts of the stage, history and poetry may be illuminated for the dullest understanding, and a new zest added to the pleasures of refined taste."

నటునకు పట్టాభిషేకము కట్టవలెననెడి అభిప్రాయము పాశ్చాత్య దేశములలో 19 వ శతాబ్ది ఉత్తరార్ధములో బలపడినది. ఈ కాలమును "Age of dramatic materialism" అనినాడు స్పిన్‌గారన్.[12] కాని ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసి యున్నది. ఆ కాలములో దేశమున చెప్పుకోదగిన నాటకరచనయే లేదు. నాటక రచయితలు శక్తిమంతులు కానిచో, నటుడెల్లప్పుడును విజృంభించును. విక్టోరియారాణి కాలములో అదే జరిగినది. అందుచేతనే కవికంటె నటుడే అధికముగా సమ్మానితుడైనాడు. సర్ హెన్రీ ఇర్వింగ్ ప్రసిద్ధికి ఇదియే కీలకము. అంతమాత్రమున అతడు తక్కువరకపు నటుడనిమాత్రము అర్థము చేసి

కొనరాదు. తక్కువరకపు నటుడెన్నడును ఉన్నతస్థితికి రానేలేడు ; ఒకవేళ రాగలిగినను, ఆ స్థితి పరమతాత్కాలికము మాత్రమే.

నటులు రూపకములకు వ్యాఖ్యాతలవంటివారు. వారు తమ అభినయ సామర్థ్యముతో రూపకమునకు ఎనలేని ఖ్యాతిని, శోభను చేకూర్పగలరు. ఒక్కొక్కప్పుడు ఉత్తమ రూపకమును పాడుచేయుటయు, అధమరూపకమును ఉత్తమముగా ఒప్పించుటయునుకూడ కలదు. నటులు రచయిత హృదయమును అర్థము చేసికొలేనిచో అది విజయవంతమగుట చాల అరుదు. మరియు సమర్థులగు నటులు లేకపోవుటచే, ఒక్కొక్కప్పుడు ఉత్తమరూపకము కూడ మరుగున పడియుండవచ్చును. కావున నాట్యసిద్ధిలో నటుడు భాగస్వామియనుటమాత్రము నిశ్చయము ; కాని అతడు కవిని 'త్రోసి రా'జనగలవాడునుకాడు, కవికంటె తక్కువవాడును కాడు.

నాట్యసిద్ధిలో నటునితోపాటు కవియును భాగస్వామియనుట చర్వితచర్వణము. కాని, ఇచ్చట ఇంకొక విషయమును గుర్తింపవలసి యున్నది—రంగానుభవములేని నాటకకర్త నాటకము అంతగా రాణించదు. గ్రీకు విషాదరూపక కర్తలో ఎస్కిలస్ రూపక రచయితయే కాక స్వయముగా దర్శకుడును, నటుడునుకూడ. షేక్స్పియరు అట్టివాడే. కొన్ని సంస్కృత రూపకములందలి ప్రస్తావనలనుబట్టి ఆయా రూపకకర్తలు నటులకు సన్నిహితులనెడి విషయము సూచితమగుచున్నది. భావప్రకాశన కర్తయగు శారదాతనయుడు భావాభినయ కోవిదులైన నటులు ప్రదర్శించిన ముప్పది నాటకములు చూచెనట ! రూపకకర్తలేకాక, లాక్షణికులు కూడ ప్రదర్శనములందు శ్రద్ధవహించినట్లు దీనినిబట్టి గ్రహింపవచ్చును. తెలుగుదేశమున ఆధునికులలో ఆంధ్రనాటక పితామహులు శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులుగారు రచనలో, నటనలో, దర్శకత్వములో సాటిలేని మేటి అనిపించుకొన్న ప్రథములు.

సారాంశము :

నిజమాలోచించినచో అరిస్టాటిల్ ప్రదర్శనమునుకాని, నటుల నటనమునుకాని నిరసించినట్లు కన్పట్టదు. రూపకరచన, కేవలము దృశ్యములపై, నటుల నటనలపై ఆధారపడక స్వయముగా సౌష్ఠవసంపన్నము కావలెనని ఆతడు రచయితలను హెచ్చరించెను. (అరిస్టాటిల్ నాటికి రంగాలంకరణము ప్రాధాన్యము వహించియున్నదనెడి సత్యమును గుర్తుంచుకొనవలసి యున్నది). కాగా, ఇంచుమించుగా భరతాదులవలెనే ఆతడును కవి-నటులను సమానముగా ఎంచెనని తలంచుట అసమంజసము కాజాలదు. ప్రదర్శింపబడు నప్పుడెంతటి ఆనందము నొసంగగలదో, చదివినప్పుడును అంతియే ఆనందము నొసంగగల. రూపకములను రచించుట కవుల కర్తవ్యమనియు, అట్లు రచింపబడిన రూపకములే ఉత్తమ రూపకములనియు, రచన-ప్రయోగము అనునవి పూర్తిగా భిన్నములైన కళలే అయినను అందు హెచ్చుతగ్గులు లేవనియు, అవి రెండును పరస్పర సహకారులనియు, ఆ రెండింటి సమన్వయపూర్వకమైన కలయికయే మనోహరాతిమనోహరమనియు తలంచుట సమంజసము కాగలదు. భాస-కాళిదాసాదుల, షేక్స్పియర్ ప్రభృతుల రూపకము లిట్టివే.

## నాట్య ప్రయోజనము

అధర్మమార్గమందు సంచరించు ప్రజలను స్వధర్మనిరతులను కావించుటకు నాట్యము సృష్టింపబడినదని నాట్యోత్పత్తి కథనమునుబట్టి స్పష్టమగుచున్నది. అయినచో ఇట్టిశక్తి నాట్యమునకు చేకూర్చిన అంశము లెట్టివో పరిశీలింపవలసి యున్నది.

### సాంఘిక కళ :

దృశ్యమును, శ్రవ్యమును, లలితాత్మకమును అయిన ఈ నాట్యకళ సార్వవర్ణికమని చెప్పబడినది. అనగా సర్వజనోపభోగ్యమైనకళ యిది. ఇది ఉపదేశాత్మకము, విశ్రాంతి జనకము, వినోదసహితము అగుటచేత, దేశ_కాల_అవస్థా_వయోభేదములు లేకుండ అందరును చూడదగిన కళ యిది. కాగా ప్రజలందరకును సన్నిహితమైన యీ కళ 'సాంఘికకళ' (Social Art) అగుచున్నది. కావున ప్రజలను స్వధర్మనిరతులను కావించుటలో ఇది ప్రథమాంశ మగుచున్నది.

### సమాహార కళ :

కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, విగ్రహశిల్పము, నాట్యము అనువానిని 'లలిత కళలు' (Fine Arts) అందురు; మరి కొందరి దృష్టిలో వాస్తుశిల్పము (Architecture) కూడ లలితకళయే. ఈ లలితకళ లన్నింటిలోను నాట్యము సమాహార కళయగుటచే ఉత్తమోత్తమ మగుచున్నది. అనగా తక్కిన లలితకళలగు కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, విగ్రహ శిల్పము, వాస్తుశిల్పము అనునవియెల్ల నాట్యమందిమిడి యుండుటచే అది గుణాధికమైనదన్న మాట. రూపక రచనయంతయును కవిత్వము కదా ? ఇంక ధ్రువాగానాదుల విషయమున సంగీతము, ఆహార్యాభినయమందు చిత్రలేఖన_విగ్రహ శిల్పములు, రంగాలంకరణాదులందు వాస్తుశిల్పము ఉపయుక్తము లగుచున్నవి. ఇట్టిది సమాహారకళ (Comprehensive Art) అయి నాట్యశాలయందు గుమిగూడిన, భిన్నరుచులుగల వ్యక్తులందరకును ఆనందదాయక మగుచున్నది. కావుననే కాళిదాసు నాట్యమును "భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్" అని చక్కగా వర్ణించి యుండెను.[1]

నాట్యము సమాహారకళ యను విషయమును Gordon Craig క్రింది విధముగా వివరించి యుండెను[2] — "The art of the theatre is neither acting nor the play, it is not scene nor dance, but it consists of all the elements of which these things are composed; action, which is the very spirit of acting; words, which are body of the play; line and colour, which are the very heart of the scene; rhythm, which is the very essence of dance......One is no more important than the other, no one colour is more important to a painter than another, or one note more important than another to a musician...."

తొలి మానవుని 'ఆటపాట' (Ballad Dance) లోని ఆట, పాట, మాట అనునవి వేర్వేరుగా పెంపొంది నృత్తము, సంగీతము, కవిత్వము అనెడి కళలుగా విస్తరిల్లినవని ఆధునిక విమర్శకులు సిద్ధాంతించి యున్నారు. అట్లు విడిపోయిన ఈ మూడును, వేర్వేరు కళలుగా పరిణతిచెందిన స్థితిలో నాట్యమందు మరల కలిసినవన్న మాట. వీనికి చిత్రలేఖనాదులు తోడైనవి. ఇట్లు నాట్యము 'సమాహారకళ' అగుటచేతనే భరతుడు నాట్యశాస్త్రమందు నృత్త-గానములను కూడ వివరింపవలసి వచ్చెను.

**సహకార కళ :**

నాట్యమనగా రూపక ప్రయోగము కావున అది సమాహారకళయేకాక సహకారకళయును (Co-operative Art) అగుచున్నది. నిపుణుడైన కవి రూపకమును రచించును. దక్షులైన నటులు ఆయా భూమికలను ధరింతురు. ఉత్తముడైన సూత్రధారుడు అభినయాదులను నిర్దేశించును. వేషధరుడు ఆహార్యమును నిర్ణయించును. పాటకులు, వాదకులు తమ తమ విధులను నిర్వర్తింతురు. ఆహార్యమునకు తగిన సామగ్రిని మకుటకారుడు, ఆభరణకారుడు, మాల్యకారుడు చేకూర్తురు. రజకుడు వస్త్రములను శుభ్రము చేయును. కారువు జతు-అశ్మ-కాష్ఠములతో నానావిధద్రవ్యములను చేకూర్చును.[3] ఇందరు ఇన్ని విధములుగా జతపడిన పిమ్మట ప్రయోగమునకు నాట్యశాల కావలయును. అందు రంగస్థలాలంకరణమునకు మరల అనేకులు తోడ్పడుదురు. చూచెడి ప్రేక్షకులు ప్రశాంతరాగద్వేషులై గుణగ్రహణపారీణులు కావలయును. నిర్విఘ్నముగా ప్రయోగమును నడిపించుటకు ఒక యజమాని ఉండవలెను. ఇంతమంది సహకరించినప్పుడే రూపకప్రయోగము ఉత్తమసిద్ధిని పొందగలదు. ఈ విధముగా నాట్యము 'సహకారకళ' యగుచున్నది.

పై విషయమును J. B. Preistly కూడ క్రింది విధముగా వ్యక్తము చేసియుండెను. ("Theatre Outlook"—P. 72.)

"In a good theatrical production we are offered a piece of life so shaped and coloured and contributed that every thing in it, down to the smallest detail significant. In this tiny world, artfully created by the Theatre, chaos and change and the meaningless have been abolished. The shape and colour of a room, the way the light falls through the window, the choice of furnishings, the very relation between a chair and a stool, all mean something. The moment when a man lights a cigarette, the way in which he lights it, his manner of inhaling and blowing out the smoke, all have their places in the pattern. A sudden laugh, a startled look, a cough, a turn of the head, none of these is accidental and each has its own significance. For two or three hours, everything offered to our eyes and ears is exquisitely contrived to achieve meaning and purpose. Now, if God or some infinitely wise being decided to take a sharp look at a group of us for an hour or two,

no doubt this is how he would see us. In the theatre, author and director and players bring to-gether all their knowledge, experience, intuition and imagination and labour for weeks in one of the most delicate pieces of co-operative effort known to man, in an attempt to make us feel that we enjoy for a little time the profound insight and the searching wisdom of that God.''

ఇంతమంది, ఇన్ని వారములుగా శ్రమించి ఇచ్చెడి ఆ ప్రయోగములో ఏ దొసగు దొరలినను కూడదీసికొనుటకు ఇంక వీలులేదు. (సినీమాలలో అయినచో ఆ భాగమును తీసి వేసి మరల చేర్చుటకు వీలుండును. కాని, రూపక ప్రయోగమందు అట్టి అవకాశము లేదు.) కావున, ఇచ్చటి సహకార ప్రయత్నము ఈ నిశితపరీక్షకు తట్టుకొనవలసి యున్నది.

ఇట్లు, నాట్యము సాంఘికకళయును, సమాహారకళయును, సహకారకళయును అగుట చేతనే ప్రజలను స్వధర్మనిరతులను చేయగలుగుచున్నది.

అయినచో నాట్యప్రయోజనము ప్రజలను స్వధర్మనిరతులను చేయుట మాత్రమేనా అను ప్రశ్న ఉదయింపవచ్చును. అంతమాత్రమే కాదని సమాధానము. నాట్యదర్శనము వలన సహృదయసామాజికులకు ఆనందము కలుగుచున్నది (దీనినే ఆలంకారికముగా ''రసానుభూతి'' అందురు).

ప్రబంధము లన్నింటను శ్రేష్ఠమైన రూపకముయొక్క ప్రయోగమును అనగా నాట్యమును చూచుటవలన సామాజికునకు ఎట్టి అనుభూతి కలుగును అను విషయమును గూర్చి ప్రాచ్య-పాశ్చాత్యులు పెక్కుదు చర్చించియున్నారు. నాట్యదర్శనము వలన ఆనందము కలుగు ననెడి విషయములో ఇంచుమించుగా అందరును ఏకాభిప్రాయులై యున్నారు. కరుణరస ప్రధానములైన రూపకములను చూచుటవలన బాధ (pain) కూడ కలుగునని కొందరు వాదింతురు; ఈ విషయమును రూపకరచనను గూర్చి వివరించునప్పుడు చర్చింతును.

'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనెడి నిషేధపరమైన సూక్తి యొకటి ప్రచారమందున్నది. ఈ నిషేధము అసత్కావ్యపరమని వ్యాఖ్యాత లందరును ఖచ్చితముగా నిర్దేశించి యుండుటచేత ఈ నిషేధము పరిగణనీయము కాదు.

నాట్యము "ఉపదేశాత్మక మగుటయేకాక హితమును, ధైర్యమును, క్రీడను, సుఖమును కూడ కలిగించును......దుఃఖార్తులకు, శ్రమార్తులకు, శోకార్తులకు, తపస్వులకు 'విశ్రాంతి'ని కలిగించును" అని నాట్యస్వరూప వివరణములో బ్రహ్మ పేర్కొనియుండెను. దుఃఖార్తులకు విశ్రాంతిని కలిగించును; అనగా వారి దుఃఖమును పోగొట్టి ఆనందమును కలిగించును అని అర్థము. అసలు దేవేంద్రాదులు బ్రహ్మను 'క్రీడనీయకము' (వినోదవస్తువు) కొఱకు అర్థించి యున్నారుకదా! మరియు భరతుడు రసాధ్యాయములో 'హర్ష' పదము

నుపయోగించుట గమనార్హము—"వివిధములగు వ్యంజనములచే సంస్కరింపబడిన అన్నమును భుజించుచున్న సుమనస్కులైన పురుషులు రసములను (రుచులను) ఆస్వాదించుచు హర్షాదులను పొందుచున్నట్లే వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములచే ప్రదర్శితము లగుచు వివిధ భావములచే వ్యంజితములైన స్థాయిభావములను సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదించుచు హర్షాదులను పొందుచున్నారు."

భరతుని తరువాతివాడు అయిన భామహుడు (క్రీ. శ. 600-750 మధ్యకాలము) కావ్య ప్రయోజనమును వివరించుచు 'ప్రీతి' అను పదము నుపయోగించుట గమనార్హము—

"ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ ।
ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్య నిషేవణమ్ (నిబంధనమ్)॥"
—(కావ్యాలంకారము-ప్ర. పరి.-2 వ శ్లో.)

"సాధుకావ్య నిషేవణము (నిబంధనము) ధర్మార్థకామమోక్షములయందును, కళల యందును వైచక్షణ్యమును, ప్రీతిని, కీర్తిని కలిగించును" అని భామహుడు పేర్కొనెను. ('నిషేవణ'మను పాఠము పాఠకపరమైనది; ఇంక 'నిబంధన'మను పాఠము కవిపరమైనది.) పై శ్లోకములో భామహుడు 'ప్రీతి' అను పదమును 'ఆనందము'నకు పర్యాయపదముగా వాడియుండెననుట స్పష్టము.

పైన భరతుడు చేసిన వివరణములో 'హర్షాదులను పొందుచున్నారు' అనుదానిలోని ఆదిశబ్దముచే శోకాదులుకూడ గ్రహింపబడునని కొందరందురనియు, అది యుక్తము కాదనియు, నాట్యము సామాజికులకు హర్షైకఫలమేకాని శోకాదిఫలము కాదనియు, అందుచేతనే కొంద రచ్చట 'ఆది' పదమును తొలగించి 'హర్షమును పొందుచున్నారు' అని పఠింతురనియు అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండుటకూడ గమనార్హము.

భరత-భామహాదులు ఆనందదాయకత్వమునేకాక ధర్మాదిప్రతిపాదకత్వమును గూడ నాట్యప్రయోజనమునుగా గ్రహించియుండిరి. కాని ధనంజయుడందులకంగీకరింపక, ఆనందమును మాత్రమే నాట్యప్రయోజనమునుగా నిర్ణయించి, తద్భిన్నముగా తలంచువారిని అపహాసము చేసియుండెను. (దశరూపకము-ప్ర. ప్రకాశము-6 శ్లో.)—

"ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః ।
యోఽపీతిహాసాదివదాహ సాధు స్తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ"॥

—ఆనందనిష్యందులైన రూపకములకు ఫలము ఇతిహాసాదులందువలె వ్యుత్పత్తిమాత్రమే అని ఏ అల్పబుద్ధి చెప్పెనో స్వాదుపరాఙ్ముఖుడైన అట్టివానికి నమస్కారము.

పై విధముగా భారతీయాలంకారికులందరును నాట్యఫలమానందమని అంగీకరించియే యున్నారు.

'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అను నిషేధము అసత్కావ్యపరమైనదని భారతీయులు వ్యాఖ్యానించుచుండగా, "అసలు ఏ కావ్యమైనను సరియే, అది వర్జనీయమే" అని నిర్ణయించుచు

ప్లేటో కవులను, కావ్యములను, ముఖ్యముగా విషాదరూపకములను 'ఆదర్శరాజ్యము'న నిషేధించెను—"కళలన్నియును మానవునిలో అణగియుండిన ఉద్వేగములను రెచ్చగొట్టుటయే ధ్యేయముగా కలిగియుండును" అని ప్లేటో విమర్శ, కాని ప్లేటో శిష్యుడగు అరిష్టాటిల్ దీనికి అంగీకరింపలేదు. ఆతడొసంగిన సమాధాన సారాంశమును క్రిందివిధముగా పేర్కొనవచ్చును—"కళలు మానవుని ప్రకృతికి అపకారకములు కావు. ముఖ్యముగా విషాదరూపకము మానవునకు సహజములైన భయ-శోకములనెడి ఉద్వేగములను పైనుండి తగినంతగా అందించుట మూలమున వానిని ఆ ఉద్వేగపరిస్థితినుండి తప్పించి, సాధారణమైన స్థితిలోనికి కొనివచ్చుచున్నది. ఇట్లు కళలు మానవునకు మంచినే కలిగించుచున్నవి."

మరియు విషాదరూపక ఫలముకూడ ఆనందమే అని అరిష్టాటిల్ స్పష్టముగా పేర్కొనెను—"The pleasure, however, thence derived is not the true tragic pleasure (P. 47)····We must not demand of Tragedy any and every kind of pleasure, but only that which is proper to it. And since the pleasure which the poet should afford is that which comes from pity and fear through imitation[4] (P. 49)····"etc.

(Butcher's Translation of Poetics).

అర్వాచీనపాశ్చాత్యవిమర్శకులుకూడ కవిత్వపరమావధి ఆనందమే అని నిర్దేశించియున్నారు—

"Poetry is the art of uniting pleasure with truth by calling forth imagination to the help of reason" అని డాక్టర్ జాన్సన్ (క్రీ. శ. 1709-84) పేర్కొనగా "దాని సద్యఃఫల మానందమేకాని సత్యప్రతిపాదనము కా"దని ధనంజయునివలె కోలరిడ్జి (క్రీ. శ. 1772-1834) మొదలగువారు సిద్ధాంతించియుండిరి.

ఇచ్చట ఒక విషయమును మాత్రము గుర్తింపవలసి యున్నది. భారతీయులు కావ్య-నాట్యముల ప్రయోజనమానందమేయని ఏకగ్రీవముగా అంగీకరించినను, అవి 'కాంతాసమ్మితము'గా ఉపదేశముకూడ చేయునని చెప్పియుండుట విస్మరింపదగినదికాదు. నాట్యస్వరూప వివరణములో భరతుడీ విషయమును స్పష్టముచేసి యుండెను. ఈ సందర్భమున మమ్మటుని (క్రీ. శ. 1050-1100) శ్లోకముకూడ గమనార్హము.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే॥"

ఈ సద్యఃపరనిర్వృతి (ఆనందము) కాని, కాంతాసమ్మితముగా ఉపదేశముకాని కావ్యమందుకంటె ప్రత్యక్షదృశ్యమగు నాట్యమందెక్కువ సులభసాధ్యమనుట చర్వితచర్వణము.

## నాట్యోత్పత్తి

1. నా నాట్యశాస్త్రానువాదము—పుట. 121.

2. "The ultimate origin to which Greek Tragedy traces up is the Ballad-Dance, the fundamental medium out of which all varieties of literature have been developed—a sort of literary protoplasm. It consists in the combination of speech, music, and that imitative gesture, which, for lack of a better word, we are obliged to call dancing......

"......Wherever the language of primitive peoples raises itself so that conscious elevation which makes it literature, it appears not alone, but supported by the sister arts of music and dance——a story, or poetical conception is at one and the same time versified, chanted, and conveyed in gesture......such a Ballad - Dance is fitted to be the starting - point of all literary progress, will be easier to understand when it is recognised as the natural parent of the three main divisions of poetry. In epic poetry, where thought takes the form of simple narrative, the speech of the Ballad - Dance triumphs over the two elements. Lyric poetry consists in meditation or highly - wrought description taking such forms as odes, sonnets, hymns——poetry that lends itself to elaborate rhythms and other devices of musical art, here the music is the element of the Ballad - Dance which has come to the front. And the imitative gesture has triumphed over the speech and the music in the case of the third branch of poetry; drama is thought expressed in action"

—"The Ancient Classical Drama" (1898)-Pp. 2 - 5.

3. నా నాట్యశాస్త్రానువాదము—ప్రథమాధ్యాయము (పుటలు 4 నుండి 19 వరకు.)
4. నా నాట్యశాస్త్రానువాదము—5 వ. అధ్యాయము.
5. నా నాట్యశాస్త్రానువాదము—4 వ అధ్యాయము (పుటలు 77—78; 121.)
6. నా నాట్యశాస్త్రానువాదము—36 వ అధ్యాయము (పుటలు 862 నుండి 866 వరకు.)

## నృత్త - నాట్య - నృత్యములు

1. "నాటకమితి నాటయతి విచిత్రరంజనా ప్రవేశేన సభ్యానాం హృదయం నర్తయతీతి నాటకమ్" (పుట. 28)
2. ఒక ఉదాహరణము—"మానోరక్షోఽభినట్...."
రక్షః = రాక్షసజాతిః; నః = అస్మాన్; మా అభి
"నట్ = మాభివ్యాప్నోతు" (విద్యారణ్యవ్యాఖ్య—
ఋగ్వేదము—7 మం. 104 సూ. 23 ఋ)

3. "నృతయే = నర్తనాయ; కర్మణి, గాత్రవిక్షేపాయ"
–(విద్యారణ్యవ్యాఖ్య–ఋగ్వేదము–10 మం. 18 సూ. 3 ఋ)

4. "పారాశర్య శిలాలిభ్యాం భిక్షునట సూత్రయోః —(అష్టాధ్యాయి–4 అధ్యా. 3 పాద. 110 సూ.)
"కర్మంద కృశాశ్వాదినిః" —(అష్టాధ్యాయి–4 అధ్యా. 3 పాద. 111 సూ.)

5. "పారాశర్యేణ ప్రోక్తం భిక్షు సూత్రమధీయతే
పారాశరిణో భిక్షవః. శైలాలినో నటాః."
"కర్మందేన ప్రోక్తమధీయతే కర్మందినో భిక్షవః.
కృశాశ్వినో నటాః"

6. అప్రస్తుతమైనను ఇచ్చట రెండు విషయములను గమనింపవలసి యున్నది—
1. ప్రాచీనకాలమున నటులు, ముఖ్యముగా నటభార్యలు 'నీతిరహిత' అనుటకు తార్కాణముగా పైపతంజలి వాక్యములను డా. ఎ. బి. కీత్ ఉదాహరించెను (The Sanskrit Drama-P. 363). ఈ అభిప్రాయము సరికాదు. నటభార్యలు అడిగిన వారికెల్ల "నీదాననే," "నీదాననే" అని అనుట "రంగస్థలముమీద మాత్రమే." రంగస్థలమున ఏ నటునకు తాను నాయికగా నటించుచున్నదో, వానికి, అప్పుడు, తాను భార్యకాక ఏమగును? కీత్ పండితు డీ విషయమును గమనింపక భిన్నవిధముగా వ్యాఖ్యానించుట విచారకరము.
2. నటసూత్రములను గూర్చి పాణినియు, నట ప్రదర్శనములను గూర్చి పతంజలియు స్పష్టముగా పేర్కొనియుండుట గమనించియున్నాము. ఇట్లు క్రీ. పూ. 2 వ శతాబ్దినాటికే నట ప్రదర్శనములు జరుగుచున్నను ఒక్క రూపకమేని, నాటివి, లభింపకుండుట దురదృష్టము. మనకు లభించిన ప్రథమోదాహరణములు క్రీ.శ. ప్రథమ శతాబ్దివి; లేదా ఇంకను కొంత అర్వాచీనములగు అశ్వఘోషుని శారిపుత్ర ప్రకరణాదులు. శూద్రకుని మృచ్ఛకటికము, భాసుని వివిధ రూపకములు క్రీస్తు పూర్వకాలమునకు చెందిన వనెడి వాదములు కలవు. కాని అవి సిద్ధాంతములు కాలేదు.

7. రసాభివ్యక్తిపర్యంతో (ఆంగికః) నృత్య మిత్యభిధీయతే।
నృత్యాభిధేఽంగాభినయే నాట్యశబ్దోఽపి వర్తతే॥
లోకే హస్తైకదేశేఽపి హస్తశబ్దో యథాయథా।
నృత్తే నృత్తైకదేశత్వా న్నృత్యశబ్దోఽపి వర్తతే॥ —(భరతకోశము–పుటలు. 340–341)

8. "అవస్థానుకృతి ర్నాట్యం..........
...............దశధైవ రసాశ్రయమ్॥
.............................
అన్య ద్భావాశ్రయం నృత్యమ్ నృత్తం తాలలయాశ్రయమ్।
ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాఽపరమ్॥
మధురోద్ధతభేదేన తద్ద్వయం ద్వివిధం పునః।
లాస్యతాండవరూపేణ నాటకాద్యుపకారకమ్॥
–(దశరూపకము – ప్రథమప్రకాశము–సూ. 7. – 10.)

9. దీనినే నందికేశ్వరు డభినయదర్పణములో "నాట్యం పూర్వ కథాయుక్తం" అని పేర్కొనెను. (10 వ శ్లో.)

10. ఇవి రూపకభేదములు. ఈ ఉపరూపకములను రాగకావ్యములు, నృత్తప్రకారములు, గేయరూపకములు అనికూడ అందురు.

11. "Natya, Nrtta, Nrtya: Their Meaning And Relation" by Sri K. M. Varma. PP. 70-71 (Orient Longmans—Nov. 1957)
12. శ్రీ సుబ్బారావుగారు "ఆంధ్రనాటక చరిత్ర'ను వ్రాయ తలపెట్టి, అందు పదియవవంతు అయినను పూర్తి చేయకుండగనే మరణించుట విచారకరము. అందలి ప్రథమభాగములోని వీ వాక్యములు.
13. ఇది వీథి నాటకముల పద్ధతి. ఆ ప్రభావమునకు లోనైనవారు ఆధునికనాటకముల విషయమున గూడ, ఆ కాలములో, ఆ పద్ధతినే అవలంబించెడివారు.
14. "భారతీయనృత్యం" - అఖిలభారత నృత్యోత్సవములకు అధ్యక్షత వహించిన శ్రీ పి. వి. రాజ మన్నార్ ఉపన్యాసము - నవభారతి—జూన్, 1958.

## నాట్యము : పర్యాయపదములు

1. అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే।
రూపకం తత్సమారోపాత్ దశధైవ రసాశ్రయమ్॥
—(దశరూపకము—ప్ర. ప్రకా. 7 వ శ్లో.)

2. "తదీదృశరసాధారం నాట్యం రూపక మిత్యపి।
నటస్యాతిప్రవీణస్య కర్మత్వా న్నాట్య ముచ్యతే॥
యథా ముఖాదౌ పద్మాదే రారోపే రూపకప్రథా।
తథైవ నాయకారోపో నటే రూపక ముచ్యతే॥"

## నాట్యస్వరూపము

1. భవతాం దేవతానాంచ శుభాశుభ వికల్పకః।
కర్మ భావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః॥
త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావాను కీర్తనమ్॥
క్వచి ద్ధర్మః క్వచి త్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః।
క్వచిద్ధాస్యం క్వచిద్యుద్ధం క్వచిత్కామః క్వచిద్వధః॥
నానాభావోప సంపన్నం నానావస్థాంతరాత్మకమ్।
లోకవృత్తానుకరణం నాట్య మేతన్మయా కృతమ్॥
ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్।
హితోపదేశజననం ధృతి క్రీడా సుఖాదికృత్॥
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్।
విశ్రాంతి జననం కాలే నాట్య మేతద్భవిష్యతి॥
న తత్ జ్ఞానం న తచ్ఛిల్పం నసా విద్యా నసా కలా।
నాసౌయోగో న తత్కర్మ నాట్యేఽస్మిన్ య న్నదృశ్యతే॥
(నాట్యశాస్త్రము—ప్రథమాధ్యాయము—శ్లో. 106 నుండి 116 వరకు.)

2. "యోఽయం స్వభావో లోకస్య సుఖ—దుఃఖసమన్వితః।
సోఽంగాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే॥"
— (నా. శా. ప్ర. అధ్యా - 119 శ్లో.)

3. దీనినే ధనంజయుడు "అవస్థానుకృతిర్నాట్యమ్" అనెను.
4. ధ్వన్యాలోకము—3 వ ఉద్యోతము—శ్లో. 41—43.

5. నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్।
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేః జయతి॥

6. వామనుని కావ్యాలంకార సూత్రము—2 వ అధికరణము- 1 వ అధ్యాయము.

7. "రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచం।
ఉగ్రం ప్రసాది గ్రహనం వికృతం చ॥
యద్వాఽప్యవస్తు కవిభావకభావ్యమానం।
తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే॥ —(దశరూపకము—చతుర్థ ప్రకాశము—85 శ్లో.)

8. Shelley—"A defence of poetry"—
English Critical Essays (19 th Century) - Oxford University press, 1950 - Page 134.

9. Aristotle's Art of Poetry - Edited by Fife - P. 3.

10. Aristotle's Theory of Poetry and Fine Art - P. 154.
(Dover Publications, Inc - 4 th edition)

11. Principles of Literary Criticism (1932) - P. 86.

12. "అభిపూర్వస్తు ణీఞ్ ధాతురాభిముఖ్యార్థ నిర్ణయే।
యస్మాత్ ప్రయోగం నయతి తస్మాదభినయః స్మృతః ॥7॥
విభావయతి యస్మాచ్చ నానార్థాని ప్రయోగతః।
శాఖాంగోపాంగ సంయుక్తః తస్మాదభినయః స్మృతః ॥8॥ —(నా. శా. 8 వ అధ్యా.)

12. (పుట-24) నాట్యశాస్త్రము—17 వ అధ్యాయము చివర, 19 వ అధ్యాయము చివర చూడవలెను.

## నాట్యము ప్రదర్శనప్రధానము

1. వివరములకు డాక్టరు వి. రాఘవన్‌గారి "కావ్యము—నాట్యము" అనెడి వ్యాసమును చూడవలెను. (భోజుని శృంగారప్రకాశము—పుటలు 77—86.) (ఆంగ్లగ్రంథము)

2. "సంపర్భేషు దశరూపకం శ్రేయః. తద్ధిచిత్రం చిత్రపటవ
ద్విశేష సాకల్యాత్. తతోఽన్యభేదక్లృప్తిః" —ప్ర. అధి—3 వ. అధ్యా. 30—32 సూ.

3. ఇది ఒక ప్రాయోవాదము మాత్రమే. సత్యము కానక్కరలేదు. కాని, కథా—ఆఖ్యాయికా—మహా కావ్యములందు "నాటకీయత" కన్పట్టుచుండుట గమనార్హము; ఆ గుణము ఉత్తమత్వ చిహ్నముగా పరిగణింపబడుచుండుటయు గమనార్హమే.

4. "యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవనయోగ్యతా తే హృదయ సంవాదభాజః సహృదయాః" అని అభినవగుప్తుడు సహృదయ పదమును నిర్వచించెను. (ధ్వన్యాలోక లోచనము—పుట 11.)

5. "నిజసుఖాది వివశీభూతశ్చ కథం వస్త్వంతరే సంవిదం విశ్రామయేదితి తత్ప్రత్యూహవ్యపోహనాయ ప్రతిపదార్థనిష్ఠైః సాధారణమహిమ్నా సకలభోగ్యత్వ సహిష్ణుభిః శబ్దాది విషయమయైః ఆతోద్యగాన విచిత్రమండప విదగ్ధ గణికాదిభిః ఉపరంజనం సమాశ్రితం యేన అహృదయోఽపి సహృదయ వైమల్యప్రాప్త్యా సహృదయీ క్రియతే." —నా. శా. - ప్ర. భా. - పుట 281.

6. "..............................

ఏవం విధం భవేద్వ్యక్తత్రంగే నకారయేత్ ॥298॥

పితా పుత్ర స్నుషా శ్వశ్రూ దృశ్యం యస్మాత్తు నాటకమ్।

తస్మా దేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః ॥299॥ —(నా. శా. - 22 వ అధ్యా.)

7. "అనుభావ విభావానాం వర్ణనా కావ్యముచ్యతే।

తేషామేవ ప్రయోగస్తు నాట్యం గీతాది రంజనమ్॥

—వ్యక్తి వివేకము—శ్రీ భాగవతులవారి అనువాదము—పుట. 86. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.)

8. ఈ సందర్భమున, తన వాదమునకు బలముగా, "సుకవివచస్సులచే చెప్పబడునవి చిత్త వికాసమును కలిగించినంతగా ప్రత్యక్షవిషయములు చిత్తవికాసమును కలిగింపవు" అనెడి అర్థము వచ్చెడి ఒక గాథ నుదాహరించెను.

9. చూ. డా. రాఘవన్‌గారి "భోజుని శృంగార ప్రకాశము" (ఆంగ్లరచన) - పుట. 80.

10. "Aristotle's Theory of Poetry and Fine Art".

11. Shakespeare on the stage and in the study—

12. "A Note on Dramatic Criticism" (P. 96) by Prof. Spingarn.

## నాట్య ప్రయోజనము

1. దేవానామిదమామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషమ్

రుద్రేణేదముమాకృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా।

త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే

నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్॥

—(మాలవికాగ్నిమిత్రమ్ - ప్ర. అం. - 4 వ శ్లో.)

2. Quoted in the "Report of the Committee for the revival of Dramatic Art" (P-5) —Published by the A. P. Sangeeta Nataka Akademi, Hyderabad (1959).

3. సామాజికులను గూర్చి వివరించెడి నాట్యశాస్త్రమందలి 35 వ అధ్యాయమును పరిశీలింపవలెను.

4. ఇంతకంటె Bywater అనువాదము మరింత స్పష్టముగానున్నది.

"The tragic pleasure is that of pity and fear, and the poet has to produce it by a wok of imitation."

ద్వితీయాధ్యాయము

# ప్రాచ్య పాశ్చాత్య రూపకములు

## యవన (గ్రీకు) రూపకములు

పాశ్చాత్య నాగరకతకు గురుపీఠము గ్రీసు (యవన) దేశమనెడి సత్యము విజ్ఞులకు తెలిసినదే. ఆ గ్రీసుదేశమున, ఆ భాషలో లభించిన ప్రథమరూపకములు క్రీ. పూ. 5 వ శతాబ్దమునాటివి. తెలిసినంతలో గ్రీకు (యవన) రూపకనిర్మాణమునకు—అందున విషాద రూపకము సువ్యవస్థితమగుటకు—మూలపురుషులనదగినవారు మువ్వురు కలరు—ఎస్కిలస్, సొఫోక్లిస్, యురిపిడస్. వీరి జీవితచరిత్రలు, వీరు రూపకములు రచించిన కాలములు, అవి ప్రదర్శింపబడిన కాలములు ఇంచుమించుగా సమగ్రముగా తెలియుచున్నవి. అరిస్టాటిల్ 'పొయెటిక్సు'ను రచించుటకు ఈ ముప్వురి రూపకములే లక్ష్యములని తెలియవలెను. అరిస్టాటిల్ పొయెటిక్సులో సూచించినదానిని బట్టియు, ఇతర చారిత్రకాధారములనుబట్టియు గ్రీకురూపకోత్పత్తి వికాసములను క్రిందివిధముగా వివరింపవచ్చును—

డయొనిసస్ (Dionysus) లేదా బేకస్ (Bacchus) అనునతడు గ్రీకుల ప్రకృతి దేవత ; "ద్రాక్షాసవాధిష్ఠానదేవత" అని కూడ అందురు. ఈయననుగూర్చి ప్రతి సంవత్సరమును రెండుసార్లు ఉత్సవములు జరిగెడివి. ఆ రెండింటిలో మార్చి నెలలో జరిగెడి ఉత్సవము ప్రధానమైనది. అది ప్రజలకు విశ్రాంతికాలము. వారందరును ఒకచోట గుమిగూడి, కలసి, ఆనందోత్సాహావేశములతో డయొనిసస్‌ను గూర్చిన పాటలు పాడెడివారు. ఈ పాటలను డిథీరాంబ్స్ (Dithyrambs) అందురు. ఆదిలో ఎవరికి తోచినది వారు పాడుచుండెడివారు. తరువాత ఒకే పాటను అందఱును కలిసి పాడుచుండెడివారు. ఇట్లీ పాటలను పాడెడివారిసంఖ్య క్రమముగా ఏబదికి పరిమితమైనది. ఈ ఏబదిమందినే 'కోరస్' (Chorus) అందురు.[1]

శిశిర_వసంతములు ప్రకృతి సహజములు. కావున ప్రకృతి దేవతయగు డయొనిసస్ జీవితముకూడ శిశిర_వసంతముల సమ్మేళనమే అగుచున్నది. శిశిరకాలమనగా మరణకాలము. డయొనిసస్ మరణమునకు సంబంధించిన ఉత్సవము మార్చి నెలలో జరిగెడిది. ఈ డయొనిసస్ జీవితము మానవ జీవితమునకు సన్నిహితమైనది. పుట్టుక, పెరుగుదల, వివాహము, కార్యవశమున తెలిసియో తెలియకయో ఏదో దోషమునకు గురియగుట, తత్ఫలముగా దైవశక్తి నెదిరించి తట్టుకొనలేక మరణించుట—ఇది జీవితపరిణామము. డయొనిసస్ జీవితమును ఇట్లే

నిరూపితమయ్యేడిది. శిశిరకాలము గడచినంతనే ప్రకృతి మరల వికసించునట్లే, మరణించినను డయొనిసస్ వెంటనే మరల జన్మించును. కాని, ఇది మానవ జీవితమున అసంభవము ; అయినను మరణించులోపల అన్యాయము నెదిరించుటకు ఆతడు చేసిన ప్రయత్నములవలన ఆతడు మరణించినను వాని జీవితము నిరర్థకము కాలేదను భావమును కలిగించి, చూచువారలకు ఒక విధమైన సంతృప్తి నొసంగును. విషాదరూపకములోని ఆంతర్యమిదియే. ప్రాచీన కాలము నుండియు ప్రతి దేశమందును ఏదో రూపములో రూపకము ఉండనే ఉన్నది. కాని, విషాదాంతత్వమును రూపకపర్యవసానముగా గ్రహించుట ఒక్క గ్రీసు దేశములోనే జరిగినది. అందులకు డయొనిసస్ ఉత్సవమే కారణమనుట నిస్సంశయము.

క్రీ. పూ. 6 వ శతాబ్దినాటికే డిథీరాంబ్స్ ముత్త్రివిధములుగా రూపొందినట్లు కన్పట్టుచున్నది—Tragos-songs (శోక-భక్తి సమ్మిశ్రిత గీతములు), Komos songs (ఆనందోత్సాహగీతములు), Satyr songs (భావావేశగీతములు). ఉత్సవ సమయములో ఒక గొఱ్ఱెను డయొనిసస్‌కు బలియొసంగుట ఆచారము. గొఱ్ఱెను గ్రీకుభాషలో ట్రాగస్ (Tragos) అందురు. ఆ బలిసమయమున సాగెడి ఆటపాటలకు 'Tragos songs or Tragedies' అను పేరువచ్చెను. ఆ తొలి 'ఆటపాట' అయిన 'Tragedy' యే తరువాతికాలములో 'Tragedy' అనబడెడి విషాదరూపకమునకు మూలమైనది. క్రమముగా ఆ పదమునకు మూలార్థము నశించి, సందర్భవశమున విషాదము, విషాదాంతత్వము అనెడి అర్థములుమాత్రమే రూఢములైనవి. డయొనిసస్ పునర్జన్మకు సంబంధించిన గీతములకు Komos songs అని పేరు. Komos అనగా ఆనందోత్సాహములతో చేసికొనెడి ఉత్సవము ; ఇది పైదానికి భిన్నమైనది. ఈ Komos కు gomos (union of sexes or marriage) అనునదికూడ సన్నిహితమైనది. ఈ Komos అను పదమే Comedy అను పదమునకు మూలరూపమని తెలియవలెను. కాగా విషాదచ్ఛాయలులేని ఆనందోత్సాహములే అటు ఉత్సవమునందును, ఇటు రూపకమందును వెల్లివిరియుట జరుగును. ఇంక Satyr Songs అనునవి పై రెండింటియొక్క సమ్మేళనమని చెప్పవచ్చును. Satyr అను పదమునకును నేటి 'satire' అను పదమునకును సంబంధము లేదు. Satyr అనగా మన 'నృశింహరూపము' వలె ఒక విచిత్రమైన రూపమును (మానవాకారము, తోక, అశ్వముఖము కలిగిన అరణ్యదేవతా రూపమును), అతిమానుషమైన శక్తులును కలవాడు. ఇట్టివారు ఉత్సవ సమయములో ఆవేశపూరితులై గణాచారులవలె చిందులుత్రొక్కుచు ఆటపాటలు నెరపెడివారు. వీరి పాటలకే Satyr Songs అని పేరు. కోరస్‌లోని వారందరును వీరే అయి, ఆహ్లాద-విషాదముల సమ్మేళనముతో కూడిన కథగల రూపకము Styr-play అనబడినది. ఇట్లు మూడురకముల డిథీరాంబ్స్‌ను మూడురకముల రూపకముల ఉత్పత్తికి మూలభూతములైనవి.

## విషాదరూపకములు :

తొలిరోజులలో ఈ పాటలు అప్పటికప్పుడే కల్పితములయ్యేడివి. క్రీ. పూ. 7, 6 శతాబ్దములమధ్య ఏరియాన్ (Arion) అనునతడు ఈ పాటలను ముందుగానే వ్రాసియుంచుటను

ఆరంభముచేసెను. (సంగీతమును క్రమబద్ధము చేయుటకు యత్నించిన ప్రథము డితడే). ఇట్టి పాటలను ముందుగా అభ్యసించి, తక్కినవారిచే పాడించుటకొరకు కొందరు శిక్షితులు కావొడగిరి. అంతటితో కోరస్‌నకు నాయకుడేర్పడినాడు. ఏరియాన్‌తో ఇంచుమించుగా సమకాలికుడైన స్టిజికోరస్ (Stesichorus) అనునతడు సంగీతమును గణబద్ధముకూడ చేసెను. మన పాటలు పల్లవి, అనుపల్లవి, చరణము అని త్రివిధములుగా విభజింపబడినట్లే ఈతని వలన నాటి పాటలు (odes)—strophe, antistrophe, epode—అని ముప్విధములుగా విభజింపబడినవి.

తరువాత థెస్పిస్ (Thespis-6th cent. B.C.) అనునతడు కోరస్ నాయకునకు ప్రక్కను ఒక నటుని ప్రవేశపెట్టెను. పురుషుల కృత్రిమముఖము (Mask) లను ప్రవేశపెట్టిన ప్రథముడుకూడ ఇతడే. ఈ కృత్రిమముఖములను మార్చుకొనుచు ఆ నటుడు వేర్వేరు భూమికలను తానొక్కడే అభినయించుచుండెడివాడు. క్రమముగా, డయొనిసస్ కథకు బదులు ఇతర పౌరాణిక-చారిత్రక విషాద గాథలు ఇతివృత్తములు (episodes) కావొడగినవి.[2]

క్రీ. పూ. 534 లో పిజిస్ట్రాటస్ (Pisistratus) అనునతడు విషాద రూపకపు పోటీలను ప్రారంభించెను. దీనితో విషాదరూపకముల రచయితలు వృద్ధిపొందిరి. కొయిరలస్ (Choerilus) అనునాతడు 160 రూపకములను రచించెనట ; ఆతడు కృత్రిమ ముఖముల విషయమున కొంత అభివృద్ధినికూడ సాధించెనందురు. ప్రాతినస్ (Pratinas) అనునతడు శాటిర్ రూపకరచనలో సిద్ధహస్తుడయ్యెనట. ఫ్రినికోస్ (Phrynicos) అనునతడు పెక్కు రూపకములు రచించుటయేకాక స్త్రీల కృత్రిమముఖములను కూడ ప్రప్రథమముగా ప్రవేశపెట్టెనట. పైవారి రచన లేవియును లభింపలేదు ; వారి రూపకప్రదర్శనములకు సంబంధించిన వివరములుకూడ లభింపలేదు.

ప్రతిసంవత్సరమును డయొనిసస్ ఉత్సవ సమయములో జరిగెడి ఈ విషాద రూపకముల పోటీలో పాల్గొనెడి ప్రతిరూపక రచయిత మూడు విషాదరూపకములను, ఒక శాటిర్ రూపకమును రచించి, ప్రదర్శింపజేయవలెను. ఈ విషాదరూపకత్రయమునకు triology లేదా tetralogy అని పేరు. ఇవి వేర్వేరుగా సమగ్రరూపకములే అయినను వానియందలి ఇతివృత్తములు మాత్రము ఏకకథకు చెందియుండును. ఈ రూపకప్రదర్శనము ఉదయ కాలమున ప్రారంభమయ్యెడిది. విషాదరూపకత్రయము ప్రదర్శింపబడినతరువాత అంతమున శాటిర్ రూపకము ప్రదర్శింపబడెడిది. (చాలకాలమువరకును కవులు ఆహ్లాద రూపకములను రచించుట మానివేసిరని తెలియవలెను). రాత్రి అంతయును ఆటలతో, పాటలతో, నృత్యములతో గడిపి అలసియున్నను ప్రేక్షకు లీ నాలుగు నాటకములను అత్యంతాసక్తితో చూచెడివారు.[3]

## ఎస్కిలస్ (Aeschylus-524-456 B.C.):

క్రీ. పూ. 490 లో మారథన్ యుద్ధములో పెర్షియనులను ఎదిరించి పోరాడిన వీరుడితడు. ఈతడు 90 రూపకములను రచించెనట. 13 సార్లు రూపకముల పోటీలలో ప్రథ

ముడుగా గెలుపొందెనట. కాని, వీని రూపకములలో నేటికి లభ్యమైనవి ఏడు విషాద రూపకములు మాత్రమే.[4] లభించినవానిలో తొలిరచనయగు 'The Suppliants' క్రీ. పూ. 490లో ప్రదర్శింపబడెను. ఎస్కిలస్ తన రూపకములందు రెండవ నటునికూడ ప్రవేశపెట్టెను; అంతియేకాక తరువాతి రూపకములలో కోరస్‌యొక్క ప్రాముఖ్యమును తగ్గించుటకుకూడ ప్రయత్నించెను. 'The seven against the Thebes' అను రూపకము బృందగానముతో కాక నటుని మాటలతో ప్రారంభమగుట గమనార్హము. 50 మందికి శిక్షణ యొసంగి తయారు చేయుట కష్టముగాన ఎస్కిలస్ కోరస్ సంఖ్యను 50 నుండి 12 కు తగ్గించినాడు. నటుల ఆహార్యవిషయమున కూడ ఇతడు కొన్ని మార్పులు తెచ్చెను; long-sleeved robes, high soled boots, onkos type of dressing of hair మొదలగునవి ఎస్కిలస్ ప్రవేశపెట్టినవే. ఇతని రూపకములలో మానవులు దేవతలకు సన్నిహితులుగా, దేవతలు మానవ జీవితములలో భాగస్వాములుగా చిత్రింపబడినారు. 'The Persians' అనెడి రూపకములో తాను పాల్గొన్న మారథన్ యుద్ధగాథను వర్ణించి సమకాలీన సంఘటనను అందముగా చిత్రించినాడు. మొత్తమున కాత డానాటి గ్రీకు నాగరికతను తన రూపకములందు సమగ్రముగా చిత్రించియుండెను. విషాద రూపకరచనకు ఒక నిర్దిష్ట స్వరూపము నొసంగిన, కథాగతిని తీర్చిదిద్దిన ప్రథముడుకూడ ఇతడే.[5]

## సొఫోక్లిస్ (Sophocles-496-409 B. C.):

ఎస్కిలస్ వృద్ధాప్యములో సొఫోక్లిస్ ప్రాముఖ్యమునకు వచ్చెను. క్రీ. పూ. 468 నాటి పోటీలలో ఎస్కిలస్‌మీదకూడ ఇతడు విజయమును సాధించెను. గాత్ర సౌష్ఠవమునకును, శరీర సౌష్ఠవమునకును ఈతడు ప్రసిద్ధి చెందెను. మారథన్ యుద్ధవిజయ చిహ్నముగా జరిగిన బాలుర నృత్యప్రదర్శనములో నితడుకూడ పాల్గొనెను. ఇతడించుమించుగా 100 రూపకములను రచించెనట. పోటీలలో 18 సార్లు విజయమును పొందెనట. కాని వీని రూపకములుకూడ ఏడు మాత్రమే లభించినవి.[6] సొఫోక్లిస్ కోరస్ సంఖ్యను 12 నుండి 15 కు పెంచినను, దాని ప్రాధాన్యమును మరింత తగ్గించివేసెను; నాటకకార్యము (action) నకు ఇది దోహదకారియే కాని, అంతర్భాగము కాదు. నాటకకార్యమునకు సంబంధించిన ఘట్టముల (Histrionic scenes)[7] మధ్య భావభేదాదులను సూచించుటకు (to bring out the change of moods and to emphasise the climax) మాత్రమే కోరస్ ఉపయుక్తమైనది. ఈతడు నిర్ణయించిన 15 సంఖ్యయే కోరస్‌కు ప్రమాణమయ్యెను.

సొఫోక్లిస్ కోరస్ ప్రాధాన్యమును తగ్గించుటయేకాక మూడవ నటునికూడ ప్రవేశపెట్టెను. దీనితో నటులకు, కథాగతపాత్రములకు ప్రాముఖ్యము హెచ్చినది. పాత్రమునకు పాత్రమునకు, పాత్రమునకు సన్నివేశమునకు, ఒకే పాత్రయొక్క వివిధమనఃప్రవృత్తులకు – మధ్య సంభవించెడి విషాదసంఘర్షణము (tragic inter-play) లను సృజించుటలో సొఫోక్లిస్ ఎక్కువ శ్రద్ధకలవాడు; కాగా క్రమపాత్రపోషణమందీతడు తన దృష్టిని కేంద్రీకరింపగల్గెను; మరియు ప్రతి చిన్న విషయమును కథలోని ముఖ్యాంశమునకు దోహదకారి యగునట్లు మలచ

గలిగెను. అందుల కనుగుణముగా trilogy రచనను మానివేసి, ప్రత్యేక రూపకములనే రచింప సాగెను. అందుచేతనే ఇతివృత్త నిర్మాణవిషయమున ఇతడు సిద్ధహస్తుడగుటయు, అరిస్టాటిల్ చేత ఉత్తమవిషాదరూపకకర్తగా సిద్ధాంతింపబడుటయు జరిగెను. రంగాలంకరణమును (painted scenery etc.) ప్రవేశపెట్టిన ప్రథముడుకూడ ఇతడే అని అరిస్టాటిల్ పేర్కొనెను.

ఎస్కిలస్ తన రూపకములకు తానే దర్శకుడు; తానే నటులకు శిక్షణ నొసంగి, సంగీతమును సమకూర్చెడివాడు. అవసరమైనచో తానే వేషము ధరించెడివాడు. కాని సొఫోక్లిస్ ఈ పద్ధతికి స్వస్తిచెప్పెను. దీనితో నటుడు కవిమాటలకు వ్యాఖ్యాత అయినాడు; సంగీత దర్శకుడనెడిపేర ఇంకొక కళాకారుడు బయలుదేరినాడు. ఇతని కాలమునాటికి సుశిక్షితులైన నటుల సంఖ్యయును హెచ్చినది; అందుచేత నటనను వృత్తిగా స్వీకరించుట ఆరంభమైనది. దీనితో వృత్తినటులు (professional actors) బయలుదేరినారు. వీరికి సంఘములో అధిక గౌరవముండెడిది. స్త్రీలుమాత్రము రంగస్థలమున ప్రవేశింపలేదు.

సాంప్రదాయిక రూపకశాఖ (Classical Drama)కు సొఫోక్లిస్ ప్రతినిధి అనియు, రూపకపరిణతికి ఇవి ఉదాహరణములనియు అరిస్టాటిల్ సిద్ధాంతము; వాని విషాద రూపక విమర్శకు ఈ రూపకములే ప్రధాన లక్ష్యములు.

## యురిపిడస్ (Euripides-484-406 B. C.):

యురిపిడస్ పై ఇరువురివలె సంఘజీవితములో ఉత్సాహముగా పాల్గొన్నవాడు కాడు; కాని, వాని రూపకములు పై ఇరువురి రూపకములకంటె సంఘజీవితమునకు ఎక్కువ సన్నిహితములు. సొఫోక్లిస్ మానవులెట్లుండవలెనో నిరూపింపగా, యురిపిడస్ మానవులెట్లుండిరో నిరూపించెను. యురిపిడస్ రచనలలో దేవతలకు ప్రాముఖ్యము తగ్గిపోయినది; సాంఘిక సమస్యలకు, మానవుని కష్టనిష్ఠురములకు, ప్రేమ మొదలగు భావముల సఫలతకు ప్రాముఖ్యము హెచ్చినది. కాగా స్వాభావికవాదము (realism) నకు యురిపిడస్ పునాదులు వేసినవాడయ్యెను. ప్రేమప్రవాహములో చిక్కుకొనిన స్త్రీలపాత్రములను శక్తిమంతముగా సృజించుటలోను, వారి హృదయ రహస్యములను నిస్సంకోచముగా చిత్రించుటలోను (ఇది తరువాతి కాలములో చాల విమర్శకు గురియైనది), అన్యాయము కన్పట్టినచోట ప్రభుత్వమును ధనికులను విమర్శించుటలోను ఇతడు ప్రసిద్ధికెక్కెను. ఇతడు 92 రూపకములను రచించెనట; 5 సార్లు నాటక పోటీలలో విజయము పొందెనట. కాని 17 విషాదరూపకములును, Cyclops అనెడి శాటిర్ రూపకమును మాత్రమే లభించినవి.

యురిపిడస్ తత్త్వవేత్తయగు సోక్రటిస్‌నకు సన్నిహితమిత్రుడని చెప్పుదురు. అందుచేతనే కాబోలు వాని రూపకములలో తాత్త్వికములగు సంభాషణములకు కూడ ప్రవేశము లభించినది. సోక్రటిస్ వలెనే ఇతడుకూడ సంఘవ్యవస్థలోని నిగూఢసంప్రదాయముల ఉనికిని ప్రశ్నించి, విమర్శించుట జరిగినది. తన నూత్నదృక్పథమును ప్రేక్షకులకు తెలియజేయుటకై ఆదిలో ప్రస్తావనవంటి 'prologue' ను, అంతమున కథాంతమును సమర్థించుటకై భరత

వాక్యమువంటి 'epilogue' ను ఈతడు ప్రప్రథమముగా ప్రవేశపెట్టెను. యురిపిడస్ కూడ ముగ్గురు నటులనే వాడు కొనెనుగాని, అంతకంటె సంఖ్యను పెంచుటకు యత్నింపలేదు.[8]

ఇంతటితో గ్రీసు దేశమున విషాదరూపకరచన ఇంచు మించుగా అంతమైనదనియే చెప్పవచ్చును.

## ఆహ్లాద రూపకములు :

విషాదరూపకముల చరిత్రను నిక్కచ్చిగా చెప్పగలిగినట్లు ఆహ్లాదరూపకముల చరిత్రను చెప్పుటకు తగిన ఆధారములు లేవు. Comdy అను పదమునకు 'revel-song' అని అర్థము. మూలపదమగు komos రెండు అర్థములందు ప్రయుక్తమగును— (1) It is concerned with fertility-rites; it was a mixture of singing, dancing, scurrilus jesting against by-standers, and ribaldry. (2) It was the masquerade in which revellers disguised themselves as animals or birds.[9] అరిష్టాటిల్ ప్రకారము మొదటి అర్థమే ఆహ్లాదరూపకోత్పత్తి విషయమున అన్వయించును. కాగా ఆహ్లాదరూపకముల ఇతి వృత్తములు గాంభీర్యరహితములై, హాస్యప్రధానములై యుండుట గమనింపవచ్చును. అందుచేతనే ఇవి విషాదరూపకములయంత ఉత్తమములు కావని అరిష్టాటిల్ సిద్ధాంతించెను. విషాదరూపకముల పోటీలలో స్థానములేని కారణముగా ఆహ్లాద రూపకముల అభివృద్ధి కొంత ఆలస్యమైనది. విషాదరూపకముల పోటీలు ప్రారంభమైన 50 సంవత్సరముల తరువాత ఆహ్లాదరూపకముల పోటీలు ప్రారంభమైనవి (క్రీ. పూ. 486 లో). క్రీ. పూ. 450 లో క్రీట్స్ (Crates) అనునతడు ఆహ్లాదరూపకముల పోటీలలో తన ప్రథమ విజయమును సాధించెను. ఇతడు కేవలము హాస్యమునకే కాక, ఇతి వృత్తమునకు ప్రాధాన్య మొసంగిన ప్రథముడు. ఆహ్లాదరూపకముల అభివృద్ధిని విమర్శకులు మూడు దశలుగా విభజించిరి— 1. Old comedy; 2. Middle comedy; 3. New comedy.

## అరిష్టోఫేనిస్ (Aristophanes-c. 448- c. 380 B. C.) :

ఇతడు 40 ఆహ్లాద రూపకములను రచించెనట. కాని, ఇందులో 11 రూపకములుమాత్రమే లభించినవి. సంపూర్ణముగా లభ్యమైన గ్రీకు ఆహ్లాదరూపకములివియే. ఈ పదునొకండింటిలోను మొదటి 9 రూపకములును 'ఓల్డు కామెడీ' అను శాఖకు చెందినవి. వీనిలో కథకు ప్రాముఖ్యము తక్కువ; సమకాలీనాంశముల విమర్శ అధికము. ఇవి అన్నియును "an astonishing mixture of fantasy, unsparing (and often, to our minds, violently unfair) satire, brilliant verbal wit, literary and musical parody, exquisite lyrics, hard-hitting political propaganda and uproarious farces" అని తెలియవలెను.

అరిష్టోఫేనిస్ చివరి రెండు రూపకములును 'మిడిల్ కామెడీ' శాఖకు చెందును— 1. Ecclesiazusae ('Women in parliament'—392 B.C); 2. Plutus ('Wealth-'

388 B. C.). ఇందులో ఇతివృత్తమునకు ప్రాధాన్యము హెచ్చినది. వ్యక్తిగత జీవిత చిత్రణము ప్రారంభమైనది. కోరస్ ప్రాధాన్యము తగ్గిపోయినది. హాస్యము లేదా హేళనము మాత్రము ప్రముఖస్థానమును వహించియే యుండును. అది అయినను సమకాలీనాంశములకు సంబంధించియే యుండును. అరిష్టోఫేన్సు హేళనమునకు యురిపిడస్ ఎక్కువగా గురి అయ్యెను.[10]

మెనాండర్ (Menander- B. C. 342-29.) :

మూడవ శతాబ్ది మధ్యభాగమునాటికి న్యూకామెడీ శాఖ ఆరంభమైనది. (ఈ శాఖ రోమన్ రూపకములకు కూడ ఆదర్శమైనది). మెనాండర్ రూపకములు 4 మాత్రమే లభించినవి. ఈ శాఖనాటకములు 'pure comedy of manners' అనెడి ఆహ్లాద రూపక భేదమునకు చెందియున్నవి. ఇందలి పాత్రలు ఎల్లప్పుడును ఇంచు మించుగా ఒకేరకముగా నుండును. వీని యందు కోరస్ అదృశ్యమైనదని చెప్పవచ్చును. ఈ రూపకప్రదర్శనములందు కొన్ని నాటక సమయములు రూఢములైనవి—జనాంతికములు, స్వగతములు మొదలగునవి ఆచరణలోనికి వచ్చినవి.

ఇట్లు విషాద-ఆహ్లాద రూపకములనెడి రెండు శాఖలును గ్రీసుదేశమున క్రీ.పూ.500-200 మధ్య కాలములో వర్ధిల్లినవి. వీని ప్రభావము రోమను దేశమందు క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 200 మధ్యకాలములో వర్ధిల్లిన రూపక రచనా-ప్రదర్శనముల మీద అధికముగాకలదు. 14, 15, 16 శతాబ్దములలో ఇటలీ యందును; 16, 17 శతాబ్దములలో స్పెయినులోను; 16, 17, 18 శతాబ్దములలో ఇంగ్లాండులోను ; 17, 18 శతాబ్దములలో ఫ్రాంసులోను ఈ రూపకరచనా ప్రదర్శనములు విరివిగా సాగినవి.

## పాశ్చాత్య రూపకభేదములు

ప్రాచీన గ్రీసు దేశమున ముఖ్యముగా విషాద-ఆహ్లాద రూపకములే (Tragedies and Comedics) అభివృద్ధి చెందినవని గుర్తించియున్నాము. తరువాతి కాలములందు, ఇతర పాశ్చాత్య దేశములలో అనేక రూపకభేదములు ఉద్భవించి, వర్ధిల్లినవి. ఈ పాశ్చాత్య రూపకములను రెండు ప్రధానశాఖలుగా విభజించుట పరిపాటి— 1. సాంప్రదాయక రూపకశాఖ (Classical Drama); 2. కాల్పనిక రూపకశాఖ (Romantic Drama).

ప్రాచీన గ్రీకు-రోమన్ రూపకములును; ఇటలీకి( Alfieri), ఫ్రాన్సుకు (Corneille and Racine), జర్మనీకి (Goethe and Schiller) చెందిన నియో-క్లాసికల్' రూపకములును మొదటి శాఖకు చెందినవి. స్పెయిన్ దేశమునకు (Calderon, Lope devega), ఆంగ్లదేశమునకు (Shakespeare etc.), జర్మనీకి (some dramas of Goethe and Schiller), ఫ్రాన్సు దేశమునకు (Victor Hugo and his followers) చెందిన కాల్పనిక రూపకములును; బ్రౌనింగ్, ఇబ్సెన్ మొదలగు వారి రూపకములును రెండవ శాఖకు చెందినవి. వస్తువు, కథాగతి, పాత్రపోషణము, శైలి అనువానియందలి భేదములే పై రెండుశాఖలను వేర్పరచుచున్నవి.

ప్రొఫెసర్ ఎ. నికాల్ విషాద_ఆహ్లాద రూపక భేదములను [1] క్రింది విధముగా స్థూలముగా వివరించెను ("Introductin to Dramatic Theory"—pp 144_45)—

1. The tragedies unrelieved by comic elements (Othello, Oedipus, Tyranus, Ghosts).

2. The tragedies with a slight introduction of mirth, never formed into a regular under-plot, and presented mostly for the sake of relief or of contrast (Macbeth, Hamlet).

3. The tragi-comedies where tragic and comic elements have an almost equal balance (The changeling).

4. The tragi-comedies where a comic under-plot holds a subordinate position (The English Traveller).

5. The tragi-comedies where the comic mirth is the main theme and the tragic forms under-plot (The Winter's Tale, Much Ado About Nothing).

6. The poetic justice plays where good characters are preserved and evil characters are destroyed (The conquest of Granada).

7. The drames which end happily (The Road to Ruin).

8. The drames which have not a completely happy solution (The Merchant of Venice).

9. The drame-comedies, whēre a serious plot mingles with comic elements (Secret love, The Spanish Fryar).

10. The satiric comedies, where the ending may be and usually is, of the poetic justice order (Volpone).

11. The comedies where the ending is happy and where the dialogue and the theme are wholly laughable (The way of the World, The merry wives of Windsor).

పై వానిలో మొదటిది పరిపూర్ణ విషాదరూపకము (pure tragedy). 3, 4 భేదములు విషాద_ఆహ్లాద రూపకముల సంమేళనము వలన కలిగినవి; దీనికి 'mixed tragedy' లేదా 'tragi-comedy' అని పేరు. 5 వ భేదము కూడ మిశ్రమరూపకమే; దీనిని 'mixed comedy' or 'romantic comedy' అందురు, 9 వ భేదము పరిపూర్ణ ఆహ్లాదరూపకము; ఇందు విషాదము ఛాయామాత్రముగా కూడ ఉండరాదు. ఇంక 11 వ భేదము ఆహ్లాద రూపకములలో తక్కువరకము; దీనిని 'low comedy' లేదా 'farce' అందురు. 'drame', 'comedy' అను వాని మధ్యగల భేదములను కూడ నికాల్ వివరించి యుండెను. [2]

**పాశ్చాత్య రూపక వికాసము :**

పాశ్చాత్య రూపక భేదములను వేర్వేరుగా వివరించుటకు ముందు, ఆ రూపకచరిత్రను సంక్షిప్తముగా తెలిసికొనుట ఆవశ్యకము.

గ్రీకు రూపకముల ప్రభావము రోమన్ రూపకములపై కలదని పేర్కొని యున్నాను. గ్రీకులలో సృజనాత్మకశక్తి అధికము. కాని, రోమనులలో అది కన్పట్టదు. అందుచేత వారు సర్వవిషయము లందును గ్రీకులనే అనుసరింప సాగిరి; రూపక విషయమును ఇందులకు భిన్నముకాదు. గ్రీకుల రూపక నిర్మాణ శిల్పమును రోమన్ నాటకకర్తలు యథాతథముగా అనుకరించి, సుస్థిరముచేసిన వారగుటచేతనే అర్వాచీనులు మూలకర్తలను వదలివేసి, రోమనులనే మార్గదర్శకులనుగా భావించుట కూడ జరిగినది. రోమనులు ఇంతగా అనుకరణ శీలురైనప్పటికిని, క్రొత్తపద్ధతులను కూడ వారు ప్రవేశపెట్టక పోలేదు. ఉదా: గ్రీకుల బహిరంగ నాటకరంగమున నేపథ్యగృహము, రంగస్థలము, ప్రేక్షకస్థానము వేర్వేరుగా నుండెడివి. కాని రోమనులీ మూడింటిని కలిపివేసి, ప్రత్యేకముగా నాటకశాలలను నిర్మించిరి.

రోమన్(లాటిన్)నాటకకర్తలలో ప్రథముడైన ప్లాటస్(Plautus-B. C. 254-184) ఆహ్లాదరూపకములలో వాస్తవికతకును, వ్యంగ్య-హాస్యములకును ప్రాధాన్యము కలదు; మరియు నీతడు ప్రజారంజన దృష్టితో కూడ రచన సాగించుటచేత అచిరకాలములోనే సుప్రసిద్ధుడయ్యెను. తరువాతి రచయితయగు టెరెన్స్ (Terence-C 190-159 B.C.) మరల సాహిత్య గౌరవ మునకే ప్రయత్నించెను. ఇతడు ప్రధానముగా మెనాండర్‌ను అనుకరించి, తన రూపకములను రచించెను. "ప్రపంచమునందు క్రొత్తదన్నది లేదు. ఎవరేది చెప్పినను, అది అంతకు ముందు ఎవరో ఒకరు చెప్పివేసినదే" అనెడిభావము కలవాడు టెరెన్స్, హాస్యము, ప్రేమ, వాత్సల్యము, తల్లిదండ్రుల యెడ గౌరవము మొదలగు భావములు టెరెన్స్ రూపకములకు ఆకరములు. ఇవి ప్లాటస్ రూపకముల కంటె నిర్దుష్టములు.

క్రీ. పూ. ప్రథమ శతాబ్దినాటికి రోమన్ దేశమున నాటక రచయితను త్రోసి రాజని నటుడు ప్రాముఖ్యమును వహించెను. నాటక రచన క్షీణదశలోపడెను. కాని, సెనెకా (Seneca-3 B.C.-65 A.D.) రచించిన పది విషాదరూపకములును మాత్రము ఇందులకు అపవాద ములు. పునరుజ్జీవన కాలమందలి ఆంగ్ల రూపక రచయితలపై సెనెకా ప్రభావమనల్పమైనది. సెనెకా రచనలే లేనిచో షేక్స్పియరు కలమునుండి ఉత్తమ విషాదరూపకములు ఆవిర్భవించి యుండెడివి కావని విమర్శకుల అభిప్రాయము. కాని, సెనెకా రచనలన్నియును సంస్కృతము నందలి మురారి అనర్ఘరాఘవాది రూపకములవలె శ్రవ్యరూపకములు (Closet Dramas) మాత్రమే. మరియు సెనెకాకు యురిపిడస్ మార్గదర్శియైనను అతని రూపకములందలి వాస్త వికత ఇందు కన్పట్టదు. రక్తపాతము, బీభత్సము సెనెకారూపకము లందధికము.

టెరెన్స్, సెనెకాలు ప్రారంభించిన కొన్ని క్రొత్త పోకడలు దాదాపు క్రీ. శ. 19 వ శతాబ్ది వరకును అనుకరింపబడినవని చెప్పవచ్చును.

క్రీ. శ. 6 వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యము పతనమైన నాటినుండి క్రీ. శ. 13 వ శతాబ్దివరకును పాశ్చాత్య రూపకచరిత్రలో అంధయుగము (Dark Age) అని చెప్ప వచ్చును. రోమన్ సామ్రాజ్య పతనానంతరము రూపకప్రదర్శనములకు చర్చి అధికారులు విముఖులైరి. కాని, ఆంగ్ల దేశమున, అర్వాచీనకాలములో వారే దానిని ఇంకొక విధముగా చేపట్టి, ఆంగ్ల రూపకావతరణమునకు పునాదివేసినారు. చర్చి పండుగులను, జానపదుల ఉత్సవములను పురస్కరించుకొని, వీరు బైబిలు కథలను ప్రదర్శింప నారంభించిరి. ఇట్లు బయలుదేరినవే 'మిష్టరీ' (క్రీ. శ. 1300–1450), 'మిరకిల్', మొరాలిటీ (క్రీ. శ. 15 వ శతాబ్ది) రూపకములు. ఆదిలో లాటిన్ భాషలోనే ఇవి వ్రాయబడినప్పటికిని, తరువాత దేశభాషకు ఇందు ప్రవేశము లభించినది. క్రీ.శ. 15 వ శతాబ్దిలో బైబిలు మున్నగు మతకథల స్థానములో మానవతాకథలు (Humanist Comedy and Humanist Tragedy) అవతరించినవి. ఆ తరువాత ఈ ప్రదర్శనములు కొన్ని వర్తకసంస్థల పరమైనవి. అదే కాలములో ఫ్రాన్సు, ఇటలీ దేశములలో ఔత్సాహికనాటకసమాజములు వెలసినవి.

క్రీ. శ. 1583 లో ఫిలిప్ సిడ్నీ ఆ నాటి ఆంగ్ల సాహిత్య కృషిని సమీక్షించినప్పుడు పేర్కొనదగిన మంచిరూపకము—సాహిత్యవిషయమున కాని, ప్రదర్శనవిషయమునకాని— ఆతనికి కన్పట్టనేలేదు. కాని, అటుపిమ్మట అనతికాలములోనే విశ్వవిఖ్యాతినొందిన షేక్స్పియర్ రూపకములు వెలయుట విచిత్రవిషయము :

ఎలిజబెత్ యుగమునాటికి ప్రజలలో నాటకాభిలాష పరాకాష్ఠ నందుకొన్నది; అప్పటికి ప్లాటస్, టెరెన్స్‌ల రచనలు బాగా వ్యాప్తిలోనికి వచ్చినవి; రచయితలలో, ప్రజలలో కాల్పనిక కథల మీద ఆదరము హెచ్చినది—ఈ మూడింటి సమ్మేళనమే ఎలిజబెత్ యుగములో ఆంగ్ల నాటకము పరిపూర్ణ స్థితి నందుటకు హేతువు. షేక్స్పియర్‌కు ముందున్న ఆంగ్ల నాటక రచయితలతో తప్పక పేర్కొనవలసిన వాడు మార్లో (Marlowe–A.D. 1564–1563).

పునరుజ్జీవన కాలములో స్వదేశ–భాషాభిమానములు, సాహిత్యమున స్వాతంత్ర్య దృక్పథము బలసినవి. ఈ వాతావరణములో రచన ఆరంభించిన షేక్స్పియరు (క్రీ. శ. 1564–1593) తనకు ముందున్న వారి రచనలనెల్ల పరిశీలించి, ప్రయోగవిషయమున స్వానుభవమును జోడించి, ప్రాత–క్రొత్తలలోని ఉత్తమాంశములను స్వీకరించి, సార్వజనీనములును, సార్వకాలికములును అయిన అపూర్వరూపకములను సృష్టించి, ఉత్తమ రూపకకర్త అయినాడు. ఆతని విషాదరూపకము లొకప్రత్యేక స్వతంత్ర సృష్టి; ఆ రూపకములందు మానవజీవితమున కాతడు చేసిన వ్యాఖ్యానము మహత్తరమైనది. ఈ విషయమున కాళిదాసుతో పాటు పేర్కొనదగిన పాశ్చాత్య రూపకరచయిత షేక్స్పియర్ ఒక్కడే అనుట అతిశయోక్తి కాజాలదు. షేక్స్పియర్ తరువాత పేర్కొనదగిన రూపకరచయిత బెన్‌జాన్సన్. ఇతడు 'కామెడీ ఆఫ్ హ్యూమర్సు' అని పిలువబడు ఆహ్లాదరూపకములను రచించెను.

రెండవ జేమ్సు పదవీ భ్రష్టుడైన కాలమున, ప్యూరిటనుల పట్టుదలవలన ఆంగ్ల నాటక శాలలు మూసివేయబడెను (క్రీ. శ. 1642). కాని, రెండవ ఛార్లెస్ రాకతో మరల నాటక

కాలలు తెరువబడినవి. రచనయందును, ప్రదర్శనము నందును క్రొత్త మార్పులు వచ్చినవి. ఈ 'రెస్టొరేషన్' కాలమున 'కామెడీ అఫ్ మేనర్సు' అని పిలువబడు రూపకముల రచన విరివిగా సాగెను. ఇట్టి రచనలను చేసినవారిలో ప్రసిద్ధులు—కాంగ్రెవ్ (Congreve–A. D. 1670–1720), గోల్డ్ స్మిత్ (Oliver Goldsmith– A. D. 1728-74), షెరిడాన్ (Sheridan- A. D. 1751–1816).

'నియోక్లాసికల్ ట్రాజెడీ' జాతికి చెందిన రూపకములను రచించిన వారిలో ముఖ్యులు కార్నీలి (Corneille- A. D. 1606-1684), రేసిని (Racine- A.D. 1639-1699). ఇంక 'నియో క్లాసికల్ కామెడీ' జాతికి చెందిన రూపకములను రచించినవారిలో ప్రసిద్ధుడు మోలియర్ (Moliere A. D. 1623–1673).

స్పెయిన్ దేశమున రూపకచరిత్రలో స్వర్ణయుగమనదగిన కాలమున లోప్‌డివేగా (Lope de Vega–A. D. 1562-1635), కాల్డెరాన్ (Calderon- A. D. 1600-1681)లు వెలసిరి.

'రొమాంటిక్' జాతి రూపకరచనాప్రదర్శనములకు సంబంధించిన వారిలో ప్రసిద్ధులు గోథే (Goethe- A.D. 1749-1832), షిల్లర్ (Shiller- A.D. 1759-1805), హ్యూగో (Victor Hugo- A. D. 1802-1885). ఇంక 'నియో రొమాంటిక్' జాతి రూపకరచనను ప్రసిద్ధికి తెచ్చినవారు మారిస్ మేటర్ లింక్ (Maeterlinck - A.D. 1862-1919), యేట్సు (W. B. Yeats- A.D. 1865-1939).

'కామెడీ ఆఫ్ మేనర్సు' జాతి రూపకములను రచించినవారిలో ప్రసిద్ధికెక్కిన అర్వాచీనులు ఆస్కార్ వైల్డ్ (Oscar Wilde- A. D. 1856-1900), మామ్ (Somerset Maugham- A. D. 1874-1965). 'రియలిస్టిక్' జాతి రూపక_రచనా ప్రదర్శనములను వెలయింపజేసిన వారు హెన్రిక్ ఇబ్సెన్ (H. Ibsen- A. D. 1828-1906), స్ట్రిండ్ బెర్గ్ (Strind Berg- A. D. 1849-1912), ఛెకోవ్ (Anton Chekhov-A.D. 1860-1904).

'నాచురలిస్టిక్' జాతి రూపక_రచనా ప్రదర్శనములను పెంపొందించినవారు హాప్‌మాన్ (Hauptman - A. D. 1862-1946), గోర్కీ (Maxim Gorky- A. D. 1868-1936), ఓనీల్ (Eugene O' Neill- A. D. 1888-1953). ఓనీల్ ఎక్స్‌ప్రెషనిజమ్ జాతి రూపక రచనలో కూడ అందెవేసిన చేయి.

బెర్నార్డుషా (G.B. Shaw- A. D. 1856-1950) నాటకరచన ఆరంభించు నాటికి ఇబ్సెన్ స్వభావవాద మొకవంకను, ఆస్కార్ వైల్డ్ హాస్యరూపక ప్రభావమింకొక వంకను దేశమున వ్యాపించియుండెను. షావి ప్రధానముగా 'భావరూపకములు' (plays of ideas). షా యొక్క సునిశితమైన హాస్యము, అహ్లాదకరమైన వ్యంగ్యము, తీక్ష్ణమైన సంభాషణాచాతురి, నిర్మాణ శిల్పమునందలి కౌశలము ఆతనికి ప్రముఖ ప్రపంచ నాటకకర్తలలో స్థానమును సంపాదించి పెట్టినవి.

గ్రీకు రూపకములన్నియును కవితారూపకములే(Poetic plays). ఆధునిక కాలములో కవితా రూపకములను రచించిన వారిలో ప్రసిద్ధులు ఫ్రై (Christopher Fry-born 1907), టి.ఎస్. ఇలియట్ (T.S. Eliot-born 1888),ఆడెన్ (W. H. Auden- born 1907). సాత్రే (Jean-Paul Satre-born 1905) క్రీ.శ.1943-46 ప్రాంతముల 'Existentialism' అనెడి వాదమును రూపకరచనలో ప్రవేశపెట్టెను.

పైన పేర్కొన్న వారేకాక ప్రసిద్ధులైన రూపకరచయితలు ఇంకను కలరు. వీరిలో కొందరు— హెచ్. ఎ. జోన్స్ (H. A. Jones- A.D. 1851-1929), టాల్‌స్టాయ్ (Tolstoy-A.D. 1828-1910), టర్జెనెవ్ (Turgenev- A. D. 1818-1893), గొగోల్ (Gogol- A. D. 1809-1852), జోలా(Jola-A.D. 1840-1903), బారీ(Barie- 1860-1937), గాల్స్‌వర్దీ (Galsworthy- A. D. 1867-1933), ఓ' కేసీ (Sean O' Casey-born-1894), షెర్‌వుడ్ (Robert E. Sherwood-born 1896), నోయెల్ కోవార్డు (Noel Coward- born 1899). టెన్నిసీ విలియమ్స్ (Tennesse Williams-born 1914), లిలియన్ హెల్‌మాన్ (Lilian Hellman-born 1905), ఆర్థర్ మిల్లర్ (Arthur Miller-born 1916), ప్రీస్ట్లీ (J. B. Priestly-born 1894). ఇంకను ఎందరో రేడియో, టెలివిజన్ రూపకరచయితలు కలరు.

సర్ హెన్రీఇర్వింగ్ (A.D.1838-1905) గారిక్ (Garrick-A. D. 1717-1779) ప్రభృతులు నటులుగా విశ్వవిఖ్యాతి నార్జించుకొన్నారు. స్టానిస్ లావిస్కీ (Stanislavsky-A. D. 1862-1938), బ్రెఖ్ట్ (Bertolt Brecht-born 1898) ప్రభృతులు నటులు, రచయితలుగానే కాక ప్రయోక్తలుగా కూడ సుప్రసిద్ధులైనారు.

## 1. Tragedy (విషాదరూపకము):

గ్రీకు విషాదరూపక వికాసమునుగూర్చి ఇంతకుముందే వివరించి యున్నాను. ఈ గ్రీకు విషాదరూపకములు 'క్లాసికల్ రూపక' శాఖకు చెందినవి. ఈ శాఖయందలి విషాద రూపకములలో 'ఐక్యత్రయము' (The three unities of time, action and place), 'కోరస్' అనునవి ప్రధానములు. ఐక్యత్రయములో కార్యైక్యమును (unity of action) గూర్చి అరిస్టాటిల్ విపులముగా నిర్దేశించెను. "రూపకేతివృత్తము 24 గంటలలో జరిగినది కావలయు" ననుటలో అరిస్టాటిల్ కాలైక్యమును నిర్దేశించెను. ఇంత 'స్థలైక్యము'ను గూర్చి ఆతడేమియును చెప్పకపోయినను, పై సూత్రములందే ఇదికూడ ఇమిడియున్నదనియు, అది కూడ ప్రధానమే అనియు, పునరుజ్జీవన (Rennaisance) కాలములో కాస్టెల్‌వెట్రో ప్రభృతి విమర్శకులు నిర్దేశించిరి; కార్నీలి, రేసిని ప్రభృతులు ఈ ఐక్యత్రయ సూత్రమునకు విశేష ప్రచారమును తెచ్చిరి. ఈ ఐక్యత్రయమును పాటించుటయును, కోరస్ ప్రయోగమును 'రొమాంటిక్ రూపక' శాఖలో అప్రధానములైనవి; లేదా అదృశ్యములైనవి. ప్రాసంగికేతివృత్తముల కవకాశము కలిగినది. 'ఈ మార్గమున, ఈ విధముగా రచింపవలెను' అనెడి నిర్దిష్ట సూత్రములేవియును లేవు; నాటక కర్తలకు ఇతివృత్త నిర్మాణ విషయమున పూర్తిగా స్వేచ్ఛకలదు. ఈ జాతిరూపకములలో షేక్స్పియరు రూపకములు సుప్రసిద్ధములు.

అరిష్టాటిల్ నిర్వచనమునుబట్టి విషాద రూపకమునందలి పాత్రలు విధిగా ఉత్తమములు కావలయును ; వారి వ్యాపారమును ఉదాత్తమే. కాగా విషాద రూపకేతివృత్తము ఉదాత్తమును గంభీరమును అగుచున్నది. ఇందు సంఘర్షణము (Conflict) ప్రధానము.[3] ఆ సంఘర్షణము దైవశక్తికి, మానవశక్తికి మధ్య; మానవ శక్తికి, మానవశక్తికిమధ్య; మంచికి, మంచికిమధ్య; మంచికి, చెడ్డకుమధ్య; ఒకే వ్యక్తియందలి రెండు విధముల అభిప్రాయములకు మధ్య జరుగు చుండును. ఈ సంఘర్షణము విషాదాంతమునకు దారితీయును. తరువాతి కాలములో నాయకుని యందలి "అసాధారణమగు లోపము" ఒకటి పై సంఘర్షణమునకును, విషాదాంతమునకును హేతువు కాజొచ్చినది. (నేటి విషాదరూపకములందు ఈ 'లోపము' నకు సాంఘిక వ్యవస్థ హేతువుగా నిరూపితమగుచున్నది. కాని, ఇందు విషాద రూపకమునకు వలసిన 'ఔన్నత్యము' మాత్రము లోపించుచున్నది.)

క్రీ. శ. 18 వ శతాబ్దినుండి (డిడెరాట్, జార్జిలిలో, లెస్సింగ్‌లతో) విషాదరూపక నిర్మాణమునందు పెక్కు మార్పులు వచ్చినవి. ఉన్నత వంశీయుడే నాయకుడు కావలెననెడి నియమము సడలినది. ఏ సాంఘిక వ్యవస్థకు చెందినవ్యక్తి అయినను నాయకుడుగా గ్రహింప బడుచుండెను. దీనితో సాంఘికవాస్తవికత పెంపొందె, సాంఘిక సంఘర్షణమును వ్యక్తీక రించు రూపకములు బయలుదేరినవి. ఇవి ఆహ్లాద-విషాద భావములకు మధ్యే మార్గమందుండును. వీనిని విషాదరూపకము లనుటకంటె సాంఘికరూపకములనికాని, సమస్యారూపకములని కాని అనుట సమంజసము కాగలదు.

క్రీ. శ. 19 వ శతాబ్దిలో వాస్తవికతకు వ్యతిరేకముగా సాంకేతిక రూపకములు బయలుదేరినవి ; దీనితో 'fatalism'కు ప్రాముఖ్యము వచ్చినది. ఇట్టి సాంకేతిక రూకపములకు మారిస్ మేటర్‌లింక్ మూలపురుషుడు ; కాని, ఇవి అంతగా విజయమును పొందలేదు.

విషాద-ఆహ్లాద రూపకముల సమ్మేళనము వలన 'tragi-comedy' అనెడి క్రొత్త రూపకము ఉద్భవించినది. ఇది ఇంచుమించుగా సగమువరకును పూర్తిగా విషాదరూపకము ; అటుపిమ్మట పూర్తిగా ఆహ్లాదరూపకము. అనగా ఇతివృత్తము విషాదచ్ఛాయలతో ఆరంభమై సుఖాంతమగును. సింబలిన్, టెంపెస్టు, వింటర్స్‌టేల్ మొదలగు రూపకములిట్టివి. సంస్కృత రూపకములుకూడ చాలవరకు "ట్రాజి-కామెడీ"లే.

భారతీయులు విషాదరూపకములను ఆదరింపలేదు : ఈ విషయమును తరువాత ప్రత్యేకముగా చర్చింతును. ఈ విషాదరూపకమున అనేక భేదములు తరువాతి కాలములో ఉద్భవిల్లినవి.[4]

## 2. Comedy (ఆహ్లాదరూపకము) :

"బాధాకరము లేదా వినాశకరము కాని ఏదో ఒక లోపమును లేదా సహింపరాని విషయమును ప్రతిపాదించి మానవులను నిత్యజీవితమునందలి వ్యక్తులకంటె అధములనుగా (తక్కువ వారినిగా) చిత్రించునది "ఆహ్లాదరూపక" మనబడునని అరిష్టాటిల్ నిర్వచనము.

ఇందలి పాత్రలు వ్యక్తిత్వమును కలిగినవికాక సర్వసాధారణములై యుండును; అవి ఒక్కొక్కప్పుడు వ్యక్తుల వ్యంగ్యచిత్రములను ప్రదర్శించుచున్నట్లు ఉండును. గ్రీకుల ఆహ్లాదరూపకముల ఉత్పత్తినిగూర్చి తెలిపియున్నాను. అరిస్టోఫేన్సు రూపకములు ఒక పరిణత స్థితికి చెందియున్నవి. ఈతని రూపకములందు సాంఘిక సమస్యలు, వ్యంగ్యము, తక్కువ రకపు హాస్యము ప్రాతిపదికలు. అవి అత్యుత్తమ రూపకములని చెప్పలేము. మెనాండర్, ప్లాటస్, టెరెన్స్‌ల రూపకములందు బృందగీతి అదృశ్యమైనది; తక్కువజాతి హాస్యము, వ్యక్తినిష్ఠమైన వ్యంగ్యము తగ్గింపబడినవి. కాని వీరి ప్రభావము ఆంగ్ల రూపకములందు కన్పట్టుటలేదు. అచ్చటి అహ్లాదరూపకములకు స్వదేశీయములైన (మొరాలిటీ, మిరకిల్, ఇంటర్ లూడ్) రూపకములే మాతృకలు. అందు అనేక భేదములు కలవు.[6]

షేక్స్పియర్ హాస్యము కేవలము స్వదేశీయమైనది. రాక్షసత్వము కలిగియుండుటయే స్వభావముగాగల పాత్రలయందుకూడ హృదయపు లోతులలో మానవత్వము దాగియుండునని సూచించుట అతని రూపకములందలి గొప్పదనము. సానుభూతి, అవహేళన అనునవి రెండును కలిసిన హాస్యమే అతని ఆహ్లాద రూపకములందు సర్వత్ర కన్పట్టుచుండును. 'రొమాంటిక్ కామెడీ' శాఖకు షేక్స్పియరు రూపకములు పట్టుగొమ్మలు.

బెన్‌జాన్సన్ తన రూపకములందు ప్రాచీనుల ననుసరించుటకు ప్రయత్నించెను. ఈతనియందు శిల్పనైశిత్యము, భావనిర్మలత్వము విశిష్టముగా నున్నను మానవత్వ నిరూపకమగు సానుభూతి తక్కువగా నుండును. ఇతడు 'Comedy of humours' అనెడి క్రొత్త రూపకభేదమును ప్రచారములోనికి తెచ్చెను. మానవ ప్రకృతిలో ప్రముఖములగు నాలుగు లోపములను సాంకేతికముగా నుంచి, ఆ లోపములను ప్రతిబింబించు పాత్రలను సృష్టించుట ఇందలి లక్షణము.

ఆహ్లాదరూపక రచనలో అన్నివిధముల పేరొందదగినవాడు ఫ్రెంచి నాటకకర్త అయిన మోలియర్ (రచనాకాలము-క్రీ. శ. 1659-73). ఇతడు ప్రహసనములను, సాంఘికవ్యంగ్య రూపకములను ప్రధానముగా రచించెను. ఇందు అవహేళన పూర్వకముగా సాంఘికవ్యవస్థ యందలి లోపములను విమర్శించెను. ఆంగ్లదేశమున రెస్టొరేషనుకాలపు నాటకకర్తలు మోలియర్‌ను అనుసరించి జాన్‌సన్‌కంటె సున్నితమగు హాస్యమును సృష్టించుటకు ప్రయత్నించిరి. నియమితమైన సాంఘికసూత్రములకు కట్టుబడియున్న స్త్రీ-పురుషుల నడతలను, వారి జీవితములను ప్రదర్శించు రూపకములు బయలుదేరినవి; ఇట్టి రూపకమును 'Comedy of manners' అందురు. నైతికమైన విలువలకంటె నాగరకమైన ప్రవర్తన గొప్పదనియు, ఆవశ్యకమనియు ఈ రూపకములు నిరూపించుచుండును.

మానవుని సంపూర్ణత్వమును నిరూపించు రూపకములు ఫ్రెంచి విప్లవము తరువాత అన్ని దేశములందును సాధారణములైనవి. 18 వ శతాబ్ది ఉత్తరభాగమున ఇటలీలో గాల్డోనీ, జర్మనీలో లెస్సింగ్, ఆంగ్లదేశమున గోల్డ్‌స్మిత్ షెరిడాన్‌లును సునిశితములును ఉద్వేగ భరితములును అయిన అహ్లాద రూపకములను రచించిరి. వీరు పై రెండురకములగు ఆహ్లాద

రూపకములలో ఏ ఒక్కదానిని ప్రత్యేకముగా అనుసరింపలేదు ; జీవితమును, కళను సన్నిహిత ములనుచేసి, వానికి గల సామ్య-భేదములను చూపుటకే యత్నించిరి.

పశ్చిమ యూరపుదేశమున వెలసిన విధానములను స్వీకరించి, వానికి స్వదేశీయమగు హాస్యవిధానమును మేళవించి, 19 వ శతాబ్దిలో స్కాండినేవియా, రష్యా దేశస్థులు ఉత్తమ ఆహ్లాదరూపకములను రచించియున్నారు. వీరిలో ముఖ్యుడు హెన్రిక్ ఇబ్సెన్. సాధారణముగా గంభీరములగు రూపకములనే ఈతడు సృజించెను ; ఈతని వ్యంగ్యభాషణములును, పాత్ర లును నేడు అత్యుత్తమములుగా పరిగణింపబడుచున్నవి. మానవప్రకృతికి బీజభూతములైన లోతులకు పోయి, వారివారి మానసిక తత్త్వములను పరిశీలించుటలో ఇతడు అగ్రగణ్యుడు. చెకోవ్ రష్యాలో నశించుచున్న ఉత్తమతరగతి జీవితమును వ్యంగ్యముగా చిత్రించుటలో కృతకృత్యుడైనాడు. ఆంగ్లదేశమున బెర్నార్డుషా తన అపూర్వమైన మేధచేతను, హాస్య దృక్పథముచేతను కొలది కాలములోనే ప్రథమశ్రేణికి చెందిన రచయిత అయ్యెను.

మానవప్రకృతికి అతిసహజమైన హాస్యప్రవృత్తి మానవుడున్నంతకాలమును వర్ధిల్లు ననుటలో సందేహము లేదు.

## 3. Farce (ప్రహసనము) :

సాధారణముగా తక్కువరకపు ఆహ్లాదరూపకమును "ప్రహసన" మందురు. భావ మును, పాత్రలును ఆహ్లాదరూపకమందలి హాస్యమునకు కారణములుకాగా వాక్కును, చేష్ట లును ప్రహసనమందలి హాస్యమునకు కారణము లగుచున్నవి. కేవలము నవ్వించుటయే ప్రహసన లక్షణము ; కాగా ఆహ్లాదరూపకమునకిది ప్రాథమిక రూపమని చెప్పవచ్చును. సర్కసులందు బఫూనులు చేయు చేష్టలు మొదలగునవి ప్రహసనములందలి చేష్టలు మొదలగు వానికి తొలిరూపములుగా కన్పట్టును. భాషావిషయకమగు నియమములుకూడ దీనియందంతగా పాటింపబడవు. దీనిని సామాన్య ప్రజలును, అసంస్కారులును ఎక్కువగా ఆదరింతురు. ("ప్రహసన విషయమున స్త్రీ-బాల-మూర్ఖులధికారు"లని అభినవగుప్తుడు పేర్కొనుట గమనార్హము). "ఫార్సు" అను పదమునకు 'చెత్త' (stuff) అని అర్థము. ప్రాకృతము లైన హాస్య సంభాషణములు ప్రాచీనములైన "మిరకిల్ రూపకము" లందును (ఫ్రాన్సు దేశ మున), "మిస్టరీ రూపకము"లందును (ఆంగ్లదేశమున) కూడ కలవు. అవియే నేటి ప్రహ సనములకు మూలము లనదగును. క్రీ. శ. 1800 వరకును పెద్ద నాటక ప్రదర్శనము చివర ప్రదర్శింపబడు చిన్నిచిన్ని హాస్యరూపకములను "ఫార్సు" లనెడివారు. 19 వ శతాబ్ది చివరి భాగములో ఇవి స్వతంత్ర రూపకములుగా నిలువద్రొక్కుకొనినవి.

## 4. Miracle play (దివ్యలీలారూపకము) :

మధ్యయుగమునాటి మతసంబంధి రూపకములను "మిరకిల్ రూపకము" లందురు. దైవికమైన మహిమను నీతిగా నిరూపించుట ఇందలి ముఖ్యలక్షణము. ఒక్కొక్కప్పుడు దైవభక్తుల జీవితములిందు కూర్పబడుటయు కలదు. కాని, సాధారణముగా సమకాలికమైన ఒక

సమస్యను గ్రహించి, అది దైవమహిమచేత ఎట్లు పరిష్కృతమైనదో నిరూపించుట అను నదియే ఇందు వస్తువుగా నుండును. క్రీ. శ. 14 వ శతాబ్దిలో ఫ్రాన్సు దేశమునందు ఈ మహిమాన్విత రూపకములు సంఖ్యయందేకాక గుణమునందును శ్రేష్ఠములై "మిస్టరీ రూపకము"లకంటె ప్రఖ్యాతి నొందినవి. ఆంగ్లదేశమున మాత్రము మిస్టరీ_మిరకిల్ రూపకములకు అంతగా భేదములేదు.

## 5. Mistery play (అద్భుత రూపకము):

ఈస్టర్, క్రిష్టమస్‌వంటి పర్వదినములలో ప్రదర్శింపబడు మతసంబంధి రూపకములను "మిస్టరీ రూపకము"లందురు. చర్చిపండుగులలోని ఉత్సవములందలి సంభాషణాదులు వీనికి మూలరూపములని చెప్పదగును. క్రీ. శ. 15 వ శతాబ్దినాటికి ఇవి బహుళ ప్రచారమందినవి. ఈ రూపకములందు ప్రదర్శనమున కెక్కువ ప్రాముఖ్యమున్నది. విశాలమైన ప్రదేశములును, విస్తృతములైన దృశ్యములును ఇందు ప్రదర్శింపబడుచుండును. బైబిలునందలి ఏదేని ఒక కథను (ముఖ్యముగా క్రీస్తుకథను) ఆధారముగా తీసికొని, హాస్యసంభాషణములను కూర్చి వీనిని ప్రదర్శించుచుండెడివారు. క్రీ. శ. 16 వ శతాబ్దినాటికి వీనిని ప్రదర్శించు కాలము ఎక్కువ అయినది. క్రీ. శ. 1547 లో ప్రాచీన_నవీన బైబిలు కథలు మొత్తము 25 భాగములుగా ప్రదర్శింపబడినవట.

ఆంగ్లదేశమున ఈ రూపకమందలి హాస్యము సహజమై, ఇతివృత్తమునకు సంబంధించి యుండెడిది. కాని, ఫ్రాన్సు దేశమున అసలు కథకు సంబంధములేని సంఘటనలు, సంభాషణములుకూడ మధ్యమధ్య చేర్పబడుచుండెడివి. ఈ రెండువిధములైన ప్రదర్శనములను (మిరకిల్_మిస్టరీలు) ఫ్రెంచి హాస్యరూపకములకును, ట్రాజి_కామెడీలకును మూలములని చెప్పవచ్చును.

## 6. Pantomime (మూకాభినయ రూపకము):

వాచికాభినయ రహితమై కేవలము అంగవిక్షేపములతో, దృష్టి_ముఖరాగాదులతో కథాగతములగు స్వగత_పరగత భావములను ప్రదర్శించెడి ఆంగికాభినయము "మూకాభినయ రూపక"మనబడును. 18 వ శతాబ్దికి పూర్వము ఆంగ్లదేశమున 'pantomime అను పదమునకు 'player of every part' అని మాత్రమే అర్థము. ఈ పదమునకు ఏడు రకములైన అర్థములు కలవని మారిస్ విల్సన్ డిషర్ వివరించెను. (The Oxford Companion to the Theatre--p. 598-99)--

1. రోమన్ రంగస్థలమందలి ఒక ప్రత్యేక నటుని గ్రీకులు ఈ పేరుతో పిలిచెడివారు. ఆ నటుడు ముగ్గురు ప్రకృతుల ముఖములు అతుకబడిన ప్రతిశీర్షమును ధరించి, ఆ ముగ్గురి సంభాషణములను తానే అభినయించెడివాడు. పై విధముగానే జంతువులను, పక్షులను, తుఫానును, అగ్నినికూడ ఆ నటుడు ప్రదర్శించుచుండెడివాడు.

2. ఇతిహాసములనుండి గైకొనిన కథలు "బాలే" రూపమున 18 వ శతాబ్దిలో ప్రదర్శింపబడినవి; వీనినికూడ ఇదే పేరుతో పిలిచెడివారు.

3. ఆంగ్లదేశమున తరతరములుగా క్రిష్టమస్ పర్వదినములందు ప్రదర్శింపబడెడి వినోదములనుకూడ ఈ పేరుతోనే పిలిచెడివారు. (ఈ వినోదములకు ఫ్రాన్సు దేశమున ఉత్సవములయందును, సంతలయందును ప్రదర్శింపబడెడి హాస్యపూరితములైన ఆర్లెక్విన్స్ నృత్యములు మూలములు).

4. సంభాషణారహితములైన "పియరాట్" (pierrot) రూపకములకుకూడ ఇదే పేరు వర్తించును. (ఫ్రాన్సు దేశమున ప్రదర్శింపబడిన అంగ్గమూకాభినయ రూపకములు వీనికి మూలములు.)

5. మూకాభినయరూపమున ప్రదర్శింపబడు "మెలోడ్రామా"లకు కూడ ఈ పేరు చెల్లును (18 వ శతాబ్దిలో ఇంగ్లండు, ఫ్రాన్సు దేశముల ప్రదర్శనములందు వాచికాభినయ ప్రాధాన్యము తగ్గినది).

6. ఇంద్రజాలాది ప్రయోగములతో కూడిన ప్రదర్శనములు (ముఖ్యముగా సర్కసు ప్రదర్శనములవంటివి) కూడ ఈ పేరుతోనే వ్యవహృతములైనవి.

7. నృత్య-నాట్యములందు ఎడనెడ కన్పట్టు వాచికాభినయ రహితములగు భాగములకును ఈ పేరు చెల్లును.

## 7. Masks (మాస్కులు) :

షేక్స్పియరు తరువాతివాడగు బెన్‌జాన్సన్ ఈ రకపు రూపకములకు విపరీతమైన ప్రచారమును కలిగించెను. జానపదుల వీథినాటకప్రదర్శనములును, ఇటలీ-ఫ్రాన్సుదేశపు రాజాస్థానములందలి ప్రదర్శములును వీనికి మూలము. ఇందు రంగాలంకరణమునకు ప్రాముఖ్యమధికము ; ఇతివృత్త మల్పము. ఒకే రూపకమున పది, పన్నెండు దేశముల మహారాజులనో, రాణులనో లేదా గొల్లభామలనో, గొల్లలనో చూపుచుండుట, రంగమును నరకమునుండి స్వర్గమునకు మార్చుట మొదలగునవి వీని ముఖ్యలక్షణములు. మాస్కులయందు నటులే కాక ప్రేక్షకులనుండి ఆహ్వానితులైన స్త్రీ-పురుషులు (ఒక్కొక్కపుడు రాజును, రాణియునుకూడ) రంగముమీదకు వచ్చి నృత్యముచేయుట ఆచారము. జాన్సన్‌కు పూర్వమునుండియు వచ్చుచున్న ఈ ఆచారము ఈరూపకములందు స్థిరపడిపోయినది. మాస్కులందు ఉత్తమపాత్రలకు బదులు మంత్రకత్తెలు మొదలగు పాత్రలను ప్రవేశపెట్టుటకూడ కలదు. ఇట్టివానిని 'anti-masks' అందురు. ప్రాచీనకాలమున ఈ రెండురకముల పాత్రలును ఒకేరూపకమునందు మిశ్రితముకాలేదు; కాని, జాన్సన్ వానిని కలిపివేసెను. మిల్టన్ తన 'కోమస్' అను రూపకమును 'మాస్కు రూపక' మునగా పేర్కొనెను; కాని ఇది దానికంటె భిన్నమైనదని విమర్శకుల అభిప్రాయము. బెన్ జాన్సన్ ప్రకారము "Poetry was the life and soul of the mask. She was queen ; and music, sculpture and painting must serve her as maids."

## 8. Melodrama (గేయరూపకము) :

1599 లో ఇటాలియన్ నాటకకర్త రినూసినీ ప్రప్రథమముగా ఈ జాతిరూపకమును రచించెను. ఇది వంద ఏండ్ల వరకును 'ఓపెరా' గానే చలామణి అయినది. జి. ఎఫ్. హేండెల్

అనుసతడు తన రూపకములకు 'రెండుపేర్లను వాడెను. అత్యాశ్చర్యకరములైన సంఘటనములు, తీవ్రములైన ఉద్వేగముల ప్రతిపాదనము, సుఖాంతమగుట అనునవి ఇందలి ముఖ్యలక్షణములు. క్రీ. శ. 18 వ శతాబ్దినాటికి ఈ జాతి రూపకములు సర్వలక్షణసంపన్నములై ఆంగ్ల నాటకరంగమున స్థిరపడినవి. ఆహ్లాదరూపకమునకు ప్రహసన మెట్టిదో విషాదరూపకమునకు 'మెలోడ్రామా' అట్టిది. ఇందలి సంభాషణములును వాద్యగీతములును నేటి సినీమాలయందువలె చకచక సాగును. ఉద్వేగముల కనుగుణముగ వాద్యసంగీతము ప్రయుక్తమగుచుండును. అతిలోక విషయములు (super natural element) ఇందు ప్రాధాన్యమును వహించును. సార్వజనీనములైన మంచి-చెడ్డల మూలమున మానవుల ఉద్వేగములను ప్రదర్శించుట ఇందు జరుగుచుండును.

రంగస్థలమందు తప్పక విజయవంతము లయ్యెడి రూపకములలో మెలోడ్రామాను ప్రధానముగా పేర్కొనవచ్చును. హ్యూగో, డ్యూమా మొదలగు పెద్దరచయితలు ఈ లక్షణములను స్వీకరించుటచేతనే ప్రత్యేకతను కలిగినవారైరి. హెన్రీ ఇర్వింగ్‌వంటి ఉత్తమ నటులతో ఈ రూపకముల ప్రాముఖ్య మింకను అధికమైనది. కాని, నేడు వీని ప్రదర్శనములు అపరూపములైనవి.

## 9. Ballet (నృత్యరూపకము) :

నేపథ్యమున ప్రయుక్తములగు జంత్ర-గాత్రముల కనుకూలమైన నృత్యములు కలదై వాచికాభినయరహితమైన రూపకము 'బాలే' అనబడును. క్రీ. శ. 14, 15 శతాబ్దములందు ఇది ఇటలీదేశమున మిక్కిలి ప్రసిద్ధికి వచ్చినది. ఆదికాలమునుండియు రాజాంతఃపురములందలి వినోదములందు నృత్యమునకు ప్రాముఖ్యము కలదు. ఫ్రాన్సుదేశపు చక్రవర్తియగు 14 వ లూయీ ఈజాతి రూపకములను అధికముగా ఆదరించెను; 'బాలే'కి రూపకమర్యాదను తెచ్చిపెట్టినవాడు కూడ ఇతడే. మోలియర్ ఇట్టి రచనలను చేసి, వానికి మరింత విలువ చేకూర్చెను.

ఆచారముగా ధరింపబడెడి ప్రతిశీర్షములను, కన్నుచెదరు రంగాలంకరణములను, ఆహార్యమునందలి వైపరీత్యమును తొలగించి, బాలేను కళాత్మకమైన రూపకవిశేషముగా రూపొందించుటకు 18 వ శతాబ్దిచివర ప్రయత్నములు జరిగినవి; ఇట్టి ప్రయత్న మొనరించిన వారిలో జాజార్జెనావెర్ (Jean Georges Novere - A. D. 1727 - 1810) ప్రముఖుడు. ఈతని నృత్యరూపకములందు ఆహార్యమునకు ప్రాముఖ్యము తగ్గినది; భావ ప్రకటన ప్రధానమైనది. 19 వ శతాబ్దిలో ఈ నృత్యరూపకములు స్వరకల్పనాదులతో సహ గ్రంథరూపమున ప్రజల కందుబాటులోనికి వచ్చినవి. శిల్పదృష్టి అధికమైనది. 19 వ శతాబ్దిచివరకు నృత్యబృందమున పురుషుడు అదృశ్యమై, నర్తకిమాత్రమే ప్రముఖముగా నిలిచినది. ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలలోకంటె కూడ రష్యాదేశములో వీనికి ఎక్కువ ఆదరము కలదు; అచ్చటి ప్రదర్శనములు కూడ విశిష్టములైనవి.

10. Opera (సంగీతరూపకము) :

జంత్ర-గాత్ర సంగీతములు ప్రధానములైన రూపకము 'ఓపెరా' అనబడును. సూటిగా చెప్పవలెనన్నచో ప్రతిమాటను గానముచేయుపద్ధతిని 'ఓపెరా' అనవలెను. నేడు ఇవి రెండు రకములుగా నున్నవి—1. మొదటిరకమునందు సంభాషణము లన్నియును గేయరూపముననే సాగును; 2. రెండవరకమునందు సంభాషణములను ఒండొంటితో కలుపుటకు వచనములు కూడ ఉండును. ఆదికాలములో కేవల సంభాషణములను సంగీతముతో కూర్చి ప్రయోగించెడి వారు. మొదటి ఓపెరాను రినూసినీ (క్రీ. శ. 1562_1621) అనునతడు వ్రాసెను; జకోపొపెరీ (క్రీ. శ. 1561_1633) అనునతడు దానికి సంగీతమును కూర్చెను. గ్లక్ (క్రీ. శ. 1714_87) అనునతడు పాత్రల మనోభావములను మాత్రమే సృష్టించుచు ఉత్తమజాతి ఓపెరాలను ప్రదర్శించెను. తరువాత హాస్యసంగీతరూపకములు రూపొందినవి; వీని జన్మస్థానము నేపుల్సు.

వివిధదేశములందు ప్రయుక్తములగుచున్న రకరకములగు ఓపెరాలు 18 వ శతాబ్దిలో మోజర్టు (క్రీ. శ. 1756_91) అనువానివలన సుప్రతిష్ఠితములైనవి. ఈతడు సాంప్రదాయక మార్గమును వీడక, ఓపెరాకు ఉదాత్తతను, ఉత్తమ అభినయమును, శాస్త్రీయసంగీతమును చేకూర్చెను. తిరిగి 19 వ శతాబ్దిలో రిచర్డ్‌వాగ్నర్ (క్రీ. శ. 1813_83) అనునతడు వీనిని ప్రచారములోనికి తెచ్చెను. ఈతని కృషిఫలితముగా ఓపెరాకు సాహిత్యముసకూడ ఉన్నత స్థానము లభించినది. జర్మనీలో వాగ్నర్ ఎంత ప్రసిద్ధుడో, ఇటలీలో వెర్డీ అంత ప్రసిద్ధుడు.

పైన కొన్ని రూపకములనుగూర్చి మాత్రమే వివరించియున్నాను. ఇంకను పెక్కు విధములగు రూపకవిశేషములు కలవు.

Burlesque, Burletta, Extravaganza, Aquatic Drama, Comedia dell arte, Mime, Monologue, Operetta, Pageant, Revue, Mascrade, Interlude, Marionette, Morality play etc. వీనినిగూర్చి పాశ్చాత్యరూపకచరిత్ర గ్రంథములను పరిశీలింపదగును.[7] నేడు ఏకాంకికలు (One-act plays) బహుళ ప్రచారమందున్నవి. కథానికా రచనవలెనే ఏకాంకికారచనయును ఒక ప్రత్యేకమైన కళ.

## సంస్కృత రూపకముల ఉత్పత్తి

గ్రీకురూపకవికాసమును నిరూపించినట్లుగా సంస్కృత రూపకవికాసమును నిరూపించుటకు తగిన ఆధారములు లేవు. సంస్కృత భాషలో లభించిన ప్రథమ రూపకములు క్రీ. శ. ప్రథమశతాబ్దికో, లేదా క్రీ. పూ. ప్రథమశతాబ్దికో చెందినవిగా తలంపబడుచున్నవి. లభ్యములైన ఆ రూపకములెల్ల రూపకరచన పరిణామస్థితికి వచ్చినతరువాత రచింపబడినవే అగుటచేత, ప్రాథమిక స్థితినికాని, రూపకక్రమవికాసమునుకాని ఊహించుటకుకూడ వీలు లేకపోవుచున్నది. అరిస్టాటిల్ తనకు ముందున్న ముప్వురి రచనలను పరిశీలించియే లక్షణమును వ్రాసినట్లుగా భరతుడుకూడ తనకు ముందున్న పలు రూపకములను పరిశీలించియే ఆ ఉత్తమ

లక్షణ గ్రంథమును రచించియుండును. కాని అతడు ఎట్టి రూపకమునుకాని, రూపక రచయితను కాని స్మరింపనేలేదు. నాట్యశాస్త్రమునకు వేదత్వమును సిద్ధింపజేయుటకు కాబోలు అందు లౌకిక రూపక-రూపకకర్తల నామములు స్మరింపబడలేదు. కాగా, సంస్కృత రూపకోత్పత్తి ఒక సమస్యగా పరిణమించి, పెక్కు వాదములకు గురియైనది.[1]

సంస్కృత భాషలో తొలి గ్రంథమైన ఋగ్వేదమునందు సంవాదసూక్తములు కొన్ని కలవు—యమయమీ సంవాదము (X-10), ఊర్వశీపురూరవసంవాదము (X-95), ఇంద్ర నేమి సంవాదము (VIII-100) మొ॥ వీనికి యజ్ఞయాగాది కర్మకాండతో సంబంధమేమియును లేదని సాయణవ్యాఖ్య. మరియు కొన్ని ఋక్కులకు సాధారణములైన ప్రార్థనలుకాని, కృతజ్ఞతా సూచనలుకాని లేవు. పైగా కొంత పౌరాణికగాథయును, సంవాదాత్మకతయును ప్రస్ఫుటములుగా కన్పట్టుచున్నవి. అందుచేత ఇవి ఋగ్వేదమున సహజభాగములు కావనియు, ఇవి సంస్కృత రూపకోత్పత్తికి బీజప్రాయములనియు, అర్వాచీనకాలములో ఇవి ఋగ్వేదమందు చేరియుండుననియు కొందరు వాదించినారు. వీరి అభిప్రాయము ప్రకారము ఈ ఋక్కుల మధ్య తత్కాలకల్పితములైనవో లేదా కవులచే ముందుగానే రచింపబడినవో అయిన వచన భాగములు చేర్పబడుటయు, యజ్ఞసమయములందు వినోదార్థము ఋత్విజులు రెండు పక్షములుగా చీలి వీనిని పఠించుచుండుటయు జరిగియుండవలెను. కొందరి దృష్టిలో ఇవి ప్రత్యేకముగా రూపకములలోని భాగములే; వచన భాగములు అర్వాచీన కాలములో నశించిపోగా, కేవల ఋక్కులు వేదమందు చేరినవి. ఈ వాదమునుబట్టి గ్రీకు రూపకోత్పత్తికిని, సంస్కృత రూపకోత్పత్తికిని కొంత సామ్యము కన్పట్టగలదు.

## గ్రీకు ప్రాబల్యవాదము :

కొందరు సూత్రధారాది పదములనుబట్టి తోలుబొమ్మలాటలనుండియే సంస్కృత రూపకము ఉత్పన్నమయ్యెనందురు. మరికొందరు మరికొన్ని సిద్ధాంతములను ప్రతిపాదించియున్నారు. కాని, ఇవి అన్నియును ఊహామాత్రములే; తగిన ఆధారములు కన్పట్టవు. ఇట్లు సంస్కృత రూపకోత్పత్తి సమస్యగానే ఉండిపోవుటచేతను, లభ్యములైన సంస్కృత రూపకములకంటె గ్రీకు రూపకములు ముందరివి అగుటచేతను, అలెగ్జాండరు దండయాత్ర కాలములో గ్రీకు సంపర్కము ఏర్పడుటచేతను, సంస్కృత రూపకములు గ్రీకు రూపకములకు అనుకరణములనియు, లేదా వానిచేత బహుళముగా ప్రభావితములైనవనియు వేబరు పండితుడొక వాదమును లేవనెత్తెను; దీనిని సమర్థించుచు గ్రీకుల న్యూకామెడీశాఖ సంస్కృత రూపకముల పరిణతికి మార్గదర్శకమైనదని విండిశ్చ్ పండితుడు ప్రతిపాదించెను. అంక విభజనము, ఇతివృత్త విభజనము, పాత్రల రంగప్రవేశ నిష్క్రమణ విధానము, రంగస్థల సూచనలు, నాటక సమయములు, విదూషక-ప్రతినాయకాది పాత్రలు మొదలగువాని విషయములలో అటు న్యూకామెడీ శాఖకును, ఇటు సంస్కృత రూపకములకును సన్నిహిత సామ్యము కలదు. అచ్చటి ప్రొలోగ్, ఎపిలోగ్ అనునవి ఇచ్చటి ప్రస్తావనా-భరతవాక్యతుల్యములు. తెరకు పేరైన యవనికాపదము గ్రీకుసంబంధమునే సూచించుచున్నది. అయిా కారణముల

వలన పై వాదము నిజమేమో అనెడి భావము కలుగుటకు అవకాశమున్నది ; కాని, అది నిజముకాదు. పై సాదృశ్యములకంటె భేదములే అధికములు. సాదృశ్యములు బాహిరములు కాగా, భేదములు ఆంతర్యమునకు సంబంధించినట్టివి.

గ్రీకు రూపకముల ఉత్పత్తికి ప్రత్యేకముగా డయొనిసస్ ఉత్సవములును, వాని అభివృద్ధికి రూపకముల పోటీలును ప్రేరకములైనవి. భారతీయ రూపకవికాసమునకు యజ్ఞయాగాది క్రియాకలాప మొకవేళ దోహదకారియై యున్నను, భారతీయుల దృష్టిలో "అధర్మ మార్గ" మందు చరించు ప్రజలను ధర్మమార్గప్రవృత్తులను కావించుట కీ నాట్యము ఉద్దిష్టమైనది ; ఆనుషంగికముగా వినోదహేతువుకూడను. రూపకప్రదర్శనముల పోటీలనుగూర్చి నాట్యశాస్త్రమందొక ప్రత్యేకాధ్యాయమున్నను సంస్కృత రూపకముల అభివృద్ధికి పోటీలు ప్రేరకములైనట్లు కన్పట్టదు. పోటీలు కారణముగా ఆ రూపకకర్తలు శతాధికములైన రూపకములను కూడ రచించిరి. కాని, ప్రసిద్ధ సంస్కృత రూపకకర్తలలో మూడు రూపకములకుమించి వ్రాసినవారు చాల అరుదుగా కానవత్తురు, నాట్యశాస్త్రమందు వివిధ నాట్యగృహములు వర్ణితములైనవి. గ్రీకులకు రంగస్థల నిర్మాణమనునదియున్నను ప్రత్యేకమైన నాట్యగృహము లేదు. ఆ రూపకప్రదర్శనములను రాత్రి అంతయును ఉత్సవములో పాల్గొని అలసియున్న 20, 30 వేలమంది ప్రేక్షకులు తిలకించెడివారు. అందరకును కనబడునట్లుగా, వినబడునట్లుగా నటులు కృత్రిమ ముఖాదులను ధరించి, గట్టిగా అరచెడివారు. ఇంక అభినయవిషయము వారికి అసంబితము అని వేరుగా చెప్పనక్కరలేదు. భారతీయుల నాట్య గృహములో 5, 6 వందల మంది కంటె ఎక్కువ పట్టరు ; వచ్చెడి వారందరును కేవలము రూపకదిదృక్షతో వచ్చెడివారే. ఇంక నాట్యశాస్త్రమందు వివరింపబడిన అభినయవిధానము ఆశ్చర్యావహముగా నుండును. అభినయములే నాట్యమును లోకమునుండి వేరుచేయుచున్నవని గుర్తించియున్నాము. గ్రీకురూపక నిర్మాణములో, కోరస్‌యొక్క ఉనికివలన, స్థలకాలైక్యములను పాటింపవలసిన ఆవశ్యకము కలిగినది. భారతీయులకట్టి నిర్బంధము లేదుకాన రూపకకథలు ముల్లోకములకును, అనేక సంవత్సరములకును సంబంధించినదిగా విస్తరిల్లుట కవకాశము కలిగినది. అయినను ఇతివృత్త నిర్మాణవిషయమున భారతీయులకు గల బహువిధనిర్బంధములు గ్రీకులకు లేనేలేవు. రూపక కథ అంతయును ఒక రోజులో జరిగినదిగా నుండవలెనని అరిస్టాటిల్ నిర్దేశింపగా, ఒక అంకమునందలి కథ ఒక రోజులో జరిగినదిగా నుండవలెనని భరతుడు నిర్దేశించెను. నిజము చెప్పవలెనన్నచో గ్రీకుల తొలిరూపకములలో అంకవిభజనమే లేదు.

గ్రీకు రూపకములందు విషాద-ఆహ్లాదరూపకములనెడి రెండే ప్రధానభేదములు కలవు. కాని, భరతుడు పది ప్రధానభేదములను నిర్వచించియుండెను. నాయక-రస-అంక ఇతివృత్త భేదముల ననుసరించి ఈ రూపకభేదము లేర్పడుచున్నవి. మానవజీవితమును, అందలి విషాదత్వమును, సర్వనాశనమును యథాతథముగా నిరూపించుటకే గ్రీకులు ప్రయత్నించిరి. వారు అట్టి దృష్టికలవారగుటచేతనే గ్రీసుదేశమందు విషాదాంతరూపకములే ముందు పుట్టి, వికాసమును గాంచినవి. కాని, భారతీయులు రూపకమును విషాదాంతముచేయుట కంగీకరింప

లేదు. అంతియేకాదు నాయకమరణమును వారు పూర్తిగా నిషేధించియున్నారు. గ్రీకు రూపకములలో నటుల సంఖ్య మూడుకంటె మించలేదు; కాని సంస్కృతరూపకములలో అట్టి నిర్బంధమేమియును లేదు. సంస్కృత రూపకములలో సంస్కృతమే కాక వివిధములైన ప్రాకృతభాషలు, విభాషలు ఉపయుక్తము లయ్యెడివి. ఇన్ని భాషావిభాగములను గ్రీకు నాటకకర్త లుపయోగించినట్లు కన్పట్టదు. అంతియేకాదు భరతుడు పేర్కొనిన నాయికా–నాయక భేద–విభేదములనుకూడ గ్రీకు లెరుగరు. ఇట్టివే ఇంకను పెక్కు భేదములుకలవు. కాగా గ్రీకు ప్రాబల్యవాదము నీరసమైనదనుట స్పష్టము. ఇంత సాదృశ్యములకు "సంవాదిన్యో మేధావినాం బుద్ధయః" అని కాని, ఏ భాషారూపకములందైనను అవి అనివార్యములే అని కాని చెప్పవలసి యున్నది.

## నాట్య వృత్తులు :

సర్వకావ్యములకును వృత్తులు మాతృకలని భరతుడు 18 వ అధ్యాయ ప్రారంభమందు పేర్కొనెను. "అభినేయ–అనభినేయ (దృశ్య–శ్రవ్య) కావ్యములు రెండును కవి హృదయవ్యవస్థితములగు వృత్తుల (చేష్టల) వలన ఉత్పన్నములగుచున్నవి. కావి, ఈ వృత్తులు నటులచే ప్రయుజ్యమానము లగుటవలన అభినేయ (దృశ్య) కావ్యములందు ప్రయోగ (ప్రత్యక్షభావనా) యోగ్యతను పడయుచున్నవి ; ఇది ఇందలి విశిష్టత" అని అభినవగుప్తుడు వివరించెను. 20 వ అధ్యాయమందు భరతుడు భారతి, సాత్త్వతి, కైశికి, ఆరభటి అనెడి నాలుగు వృత్తులను తదంగములను విపులీకరించెను. మధుకైటభులనెడి రాక్షసులతో విష్ణువొనర్చిన యుద్ధమునందు పై వృత్తులు నాలుగును, అదే క్రమములో, ఉత్పన్నములైనవట. ఈ వృత్తుల ఉత్పత్తి క్రమము సంస్కృత నాట్యోత్పత్తి క్రమమును సూచించుచున్నదని శ్రీ ఆర్. వి. జాగీర్‌దార్ ప్రభృతి విమర్శకులు నిరూపించియున్నారు.

మనము ఏ కర్మను ఆరంభించినను అందు వాక్–మనః–కాయ వ్యాపారములుండును (ఈ మూడు వ్యాపారములనే త్రికరణము లందురు). 'వృత్తి'యును, 'వ్యాపారము'ను పర్యాయపదములు. వాగ్రూపమైన వ్యాపారము 'భారతీవృత్తి' అనబడును. మనోవ్యాపారము 'సాత్త్వతీవృత్తి' అనియు, కాయికమైన అనగా చేష్టాప్రధానమైన వ్యాపారము 'ఆరభటీ వృత్తి' అనియు అనబడును. ఇంక ఆయా వ్యాపారములందు కన్పట్టు శోభాదికమంతయును 'కైశికీ వృత్తి' అనబడును. నాట్యము అభినయాత్మకము కావున నటులచే ప్రయుజ్యమానములగు ఈ వృత్తులు నాట్యమునందు ప్రత్యక్షభావనాయోగ్యము లగుచున్నవి. రూపకమందు ఎచ్చట వాగ్వ్యాపార మధికముగా నుండునో, ఎచ్చట కాయికచేష్టలకు ప్రాధాన్యముండదో అచ్చట భారతీవృత్తి ఉండునని తెలియవలెను. అట్లే ఎచ్చట సాత్త్విక – ఆంగికాభినయములకు ప్రాధాన్యము ఉండునో అచ్చట సాత్త్వతీవృత్తి ఉండును. చేష్టాప్రధానమైనచోట ఆరభటీ వృత్తి ఉండును. గీత–ఆతోద్య–నృత్యాది రంజకవర్గ మెచ్చట ప్రయుక్తమగునో అచ్చట కైశికీవృత్తి ఉండును. అభినవగుప్తుని మాటలలో చెప్పవలెనన్నచో భారతి వాక్చేష్ట లేదా వాచికాభినయము లేదా పాఠ్యము ; సాత్త్వతి మనశ్చేష్ట లేదా సాత్త్వికాభినయము ; కాయచేష్ట

లేదా అంగికాభినయము రెండువిధములు—సుకుమారము లేదా ఉద్ధతము. ఇందు మొదటిది కైశికీవృత్తి, రెండవది ఆరభటీ వృత్తి. ఇట్లే వేషధారణము లేదా ఆహార్యాభినయమును రెండువిధములు.

శ్రీ జాగిర్‌దార్ అభిప్రాయము ప్రకారము[2] పౌరాణికసూతుని కథాకథనమునుండియే రూపకము రూపొందినది; ఆ సూతుడే రూపకములందు సూత్రధారుడైనాడు. ఈ క్రమపరిణామములో నాలుగు అవస్థలు కన్పట్టగలవు; ఆ నాలుగు అవస్థలును పై నాలుగువృత్తులకును సంబంధించి యున్నవి—

1. సూతుడు తాను స్వయముగా పౌరాణిక కథను చెప్పుట—భారతీవృత్తి.
2. సూతుడు ఇతర గాయకులతో (కుశీలవులతో) కలిసి కథను చెప్పుట (రామాయణ గానమిట్లే జరిగినది)—సాత్త్వతీవృత్తి.
3. పౌరాణిక గాథలు సంభాషణాప్రధానములు కాగా ఆహార్యాదికమునకును, నటికిని ప్రాధాన్యము వచ్చుట—కైశికీవృత్తి.
4. పౌరాణికేతివృత్తములు రంగములుగా విభజింపబడి, గాన–అభినయములు ప్రాధాన్యము వహించుట—ఆరభటీవృత్తి.

ప్రస్తావనా–విష్కంభ–ప్రవేశకములు సంస్కృత రూపకములందలి ప్రత్యేకతలు. ఈ మూడును పౌరాణికసూతుని కృత్యములను విభాగపూర్వకముగా నిర్వహించుచున్నవని జాగిర్‌దార్ నిరూపించెను. భారతమునే ఉదాహరణముగా తీసికొందము—అతడిట్లు చెప్పెను, ఇతడిట్లు చెప్పెను అనుటకు మూలములో 'భీష్మ ఉవాచ, భీమ ఉవాచ, అర్జున ఉవాచ, సూత ఉవాచ' అని ఈ విధముగా మాటలు కన్పట్టుచుండును. భీమ–భీష్మ–అర్జునాదులు భారతమందలి పాత్రలు; సూతుడు మాత్రము కాదు. ఎవరు ఎవరితో ఎందులకు మాటాడుచున్నారో తెలిపి సూతుడు తాను తప్పుకొనును; పిమ్మట ఆ పాత్రలమధ్య సంవాదము జరుగును. అసలు సూతవాక్యములను మినహాయించినచో తక్కిన దంతయును సంవాదాత్మకమే యగుట గమనార్హము. ఆ సంవాదము పూర్తి అయిన తరువాతనో లేదా ఇంకొక సంభాషణము ప్రారంభమగుటకుముందో సూతుడు మరల ప్రవేశించి, పై విధముగానే వివరించి తిరిగి మరుగుపడును. ఇట్టి ఈ సూతుని కృత్యమునే విష్కంభ–ప్రవేశకములు రూపకమందు నిర్వహించుచున్నవి. అనగా అవి పూర్వాపరకథాసంధానాత్మకములగుట స్పష్టము. ఇంక సూత్రధారుడు–సూతునివలెనే–కథకు ఉపోద్ఘాతము (ప్రస్తావన)ను, అంతమున ఫలశ్రుతిని (భరత వాక్యమును) మాత్రము పలుకుచున్నాడు. సంస్కృత రూపకకథలుకూడ ప్రధానముగా ఇతిహాస–పురాణములనుండి గ్రహింపబడినవియే యగుటయు గమనార్హము. ఈ విధముగా సూతుని పౌరాణిక కథాకథనమునుండియే సంస్కృతరూపక ముత్పన్నమైనదని జాగిర్దార్ సిద్ధాంతించెను. "ఇతిహాససహితమును అగునట్లుగా నాట్యమును నిర్మింతును" అని బ్రహ్మ సంకల్పించుటయు; నాట్యమును సృష్టించిన పిమ్మట "నేను ఇతిహాసమును సృష్టించితిని; దీనిని దేవతలకిమ్ము" అని బ్రహ్మ ఇంద్రునితో చెప్పుటయు; ఇచ్చట "ఇతిహాసమనగా దశరూప" మని అభినవగుప్తుడు వ్యాఖ్యానించుటయు ఇచ్చట స్మరణీయములు.

ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గమనింపవచ్చును. తెలుగులోని కొన్ని యక్షగాన-వీథీనాటకములందు 'సంధి వచనములు' కన్పట్టుచుండును. తక్కినవానిలో ఈ సంధి వచనములు సూత్రధార పరముగా కన్పట్టుచుండును. గ్రీకురూపకములందలి కోరస్‌వలె, పౌరాణిక కథాకథనమునందలి సూతునివలె ఈ సూత్రధారుడును ప్రదర్శన ప్రారంభమునుండి అంతమువరకును రంగస్థలమందే రూపకపాత్రలతో కలసిమెలసి యుండునన్నమాట. సంస్కృత రూపకములుకూడ ప్రారంభదశలో ఇట్లే ఉండియుండుననుట అసమంజసము కానేరదు.[3] సంవాదము ప్రధానమై, అంకవిభాగమేర్పడి, ప్రవేశ-విష్కంభములు కల్పితములైనపిమ్మట అసహజముగా కన్పట్టెడి సూత్రధారగతకథామధ్యప్రవేశము ప్రచారమునుండి తొలగిపోయియుండును. కాలక్రమములో కోరస్ గ్రీకురూపకములందు అదృశ్యమగుట ఇప్పట్ల స్మరణీయము. తెలుగు దేశిరూపకములు మాత్రమిట్టి మార్పును చెందలేదు. సంస్కృతమునందలి నారాయణతీర్థుల 'కృష్ణలీలాతరంగిణి' దేశినాటకముల ప్రభావమునకు లోనైన రచనయగుట గమనింపదగిన విషయము.

ఆదికాలములో సూతాదుల పౌరాణిక కథాకథనము ఒకవంక సాగుచుండగా ఇంకొక ప్రక్క నృత్తము, మూకాభినయము సాగుచుండియుండును. మహాభాష్యకారుడగు పతంజలి ననుసరించి మొదటిశాఖవారిని 'గ్రాంథికు'లనియు, రెండవ శాఖవారిని 'సౌభికు'లనియు పేర్కొన వచ్చును. ఈ సౌభికులు కంసవధ, బలిబంధనములను ప్రత్యక్షముగా చూపినారట. సౌభికులు మరల రెండువిధములుగా నుండియుండవచ్చును—కేవలము ఆంగికాభినయమునే చేయువారు 'నటులు'; ఆంగికాద్యభినయములతోపాటు వాచికాభినయమునుకూడ గ్రహించినవారు 'భరతులు' (భరతుని అనుయాయులు; పౌరాణిక సూతుడు సూత్రధారునిగా పరిణతిచెందిన దశయిది). కాలక్రమమున నట-భరతపదములు పర్యాయపదములు కాగా కేవలాంగికాభినయము చేయువారికి నర్తకపదము స్థిరపడియుండును.

## రూపక-ఉపరూపక భేదములు

భరతుడు పది రూపకములను,[1] నాటికను పేర్కొని లక్షణములను వివరించెను; ఉపరూపకముల ప్రశంసను చేయనేలేదు. అభినవగుప్తుడు 4 వ అధ్యాయమునందును, 18 వ అధ్యాయమందును డోంబికా-భాణ-ప్రస్థాన-షిద్గక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసక-రాసకములనెడి ఉపరూపకములను పేర్కొనెను. కాని, అభినవగుప్తుడు వానిని 'ఉపరూపకము'లనలేదు; గేయకావ్యములనియు,[2] నృత్తప్రకారములనియు, రాగకావ్యములనియు పేర్కొనెను. అంతియేకాక 'నాటికా' భేదమున్నట్లే 'ప్రకరణికా' భేదముకూడ ఉండవచ్చుననియు, భరతుడు నాటికను గ్రహించుటచేత కోహలాది లక్షిత తోటక-సట్టక-రాసకాదులుకూడ గ్రహణీయములే అనియు నిర్దేశించెను. అగ్నిపురాణము 'నాటకములు' అనుపేర 27 భేదములను పేర్కొనెను—ఇందు మొదటి పదియును భరతుడు చెప్పిన దశరూపకములే. ఇంక తక్కినవి

_తోటక_నాటికా_సట్టక_శిల్పక_కర్ణ_దుర్మల్లికా_ప్రస్థాన_భాణికా_భాణీ_గోష్ఠి_హల్లీసక_కావ్య_శ్రీగదిత_నాట్యరాసక_ఉల్లోప్యక_ప్రేక్షణములు.

ఉపరూపకములను పెంపొందించిన ఖ్యాతి కోహలునకు దక్కినది. అతడు ఉపరూపకములందు మార్గ_దేశిభేదములను చెప్పియుండెను—నాటిక, ప్రకరణిక, భాణిక, హాసిక, వ్యాయోగిని, డిమిక, కలోత్సాహవతి, చిత్ర, జుగుప్సిత, చిత్రతాల అను పదియును మార్గభేదములు. వీనియందు నృత్త_గానములుండవు; ఇవి రూపకతుల్యములు. ఇంక డోంబిక, భాణము, ప్రస్థానము, షిద్గకము, భాణిక, ప్రేరణము, రామాక్రీడము, రాగకావ్యము, హల్లీసకము, రాసకము అను పదియును దేశి భేదములు; ఇందులో చివరి ఆరును నృత్త ప్రకారములు.

హేమచంద్రుడు కావ్యానుశాసనమందును, భోజుడు శృంగారప్రకాశమందును నాటికా_సట్టకములను రూపకములనుగానే పేర్కొనిరి; అనగా రూపకముల సంఖ్య 12 అగుచున్నది. నాట్యదర్పణకర్తలు ప్రకరణీ_నాటికలను చేర్చి మొత్తము 12 రూపకములను చెప్పినారు. బోధాయన విరచితమగు 'భగవదజ్జుకీయ' మనెడు ప్రహసనములో "అథతు నాటక_ప్రకరణోద్భవాసు పార_ఈహామృగ_డిమ_సమవకార_వ్యాయోగ_భాణ_సల్లాపక_వీథీ_ఉత్సృష్టికాంక_ప్రహసనాదిషు దశజాతిషు నాట్యరసేషు హాస్యమేవ ప్రధానమితి పశ్యామి" అని సూత్రధారుడు పేర్కొనెను. ఇందు పార_సల్లాపకములు రూపకజాతిలో క్రొత్తగా చెప్పబడినవి. ఇప్పుడు కూడ రూపకములు 12 అగుచున్నవి. 'పార' అనుదాని పూర్తిపేరు 'నృత్తపారము'[3].

ఉపరూపకములనెడి పదమును సుస్పష్టముగా వాడిన ప్రథముడు విశ్వనాథుడని చెప్పవచ్చును. అతడు 18 ఉపరూపకములను పేర్కొనెను. శారదాతనయుడు 20 భేదములను పేర్కొనెను. రూపక_ఉపరూపక భేదములనేకాక 'జన్యరూపకము' లనెడి భేదమునుకూడ కొందరు చెప్పిరి—నాటికాదులిట్టివి. కాగా, రూపకోపరూపకముల మొత్తము సంఖ్య 47 అగుచున్నది—

రూపకములు—భరతుడు పేర్కొనిన పది (10).
జన్యరూపకములు_నాటికా_ప్రకరణీ_తోటక (త్రోటక)_సట్టకములు (4).
కోహలుడు చెప్పిన పది మార్గ ఉపరూపకములు (10).
ఇతర లక్షణకర్తలు పేర్కొనిన ఉపరూపకభేదముల మొత్తము 23.
కాగా మొత్తముసంఖ్య 47 అగుచున్నది (10 + 4 + 10 + 23).

ఉపరూపకములు—1. రాసకము, 2. నాట్యరాసకము, 3. భాణము, 4. డోంబి (డోంబిక), 5. భాణిక, 6. ప్రస్థానకము (ప్రస్థానము), 7. ప్రేక్షణికము (ప్రేంఖణము), 8. హల్లీసకము, 9. కావ్యము, 10. పారిజాతకము (పారిజాతలత), 11. గోష్ఠి, 12. శ్రీగదితము, 13. విలాసిక, 14. ఉల్లోప్యకము, 15. నర్తనకము, 16. ప్రేరణము, 17. సల్లాపకము, 18. శిల్పకము, 19. కల్పవల్లి, 20. షిద్గకము, 21. దుర్మల్లిక (మత్తల్లి), 22. మల్లిక (మణికుల్య), 23. రామాక్రీడము.

భరతుడు చెప్పిన దశరూపకములలో ఐదు ఏకాంకములు (ఏకాంకికలు). ఇంక పై ఉపరూపకములలో మొదటి పదునాలుగును ఏకాంకములు. 'ఏకాంక'మనగా ఒక రోజులో జరిగిన కథ ఇతివృత్తముగా కలిగినదని అర్థము.

## దశరూప పరిణామము

దశరూపములను[1] వివరించునప్పుడు ఆలంకారికులందరును మొదట నాటక-ప్రకరణములను వరుసగా చెప్పియున్నారు. తరువాతి రూపముల వరుసలో కొంత క్రమభేదము కన్పట్టగలదు. 'భగవదజ్జుకీయము'లో బోధాయనుడు పార-ఈహామృగాదులను నాటక-ప్రకరణోద్భవములనుగా నిర్దేశించెను. సింగభూపాలుడు నాటకమును మాత్రమే 'ప్రకృతిరూపమను'గా నిర్దేశించెను——''సాక్షాదుపదేశముచే ధర్మసమన్వయము పొందుటవలనను, అంగాంగి భావరూపమున అన్ని రసములును సంపన్నములై యుండుటవలనను, ప్రకృతులు అవస్థలు సంధులు మున్నగువానితో కూడియుండుట వలనను, ప్రకరణాదులగు దృశ్యముల కన్నిటికిని నాటకమే 'మూల'మని పండితులందురు. అతిదేశబలమున వచ్చిన నాటకపు టంగముల ననుసరించి యుండుటచేత తక్కిన రూపకములన్నియును నాటకము యొక్క వికారములగుచున్నవి'' (రసార్ణవ సుధాకరము-పుట 897). మరికొంద రాలంకారికులును పై విధముగానే తలంచి యున్నారు. కాగా నాటకమునుండియే తక్కిన రూపకములన్నియును జనించినవని చెప్పవలసి వచ్చును. కాని, ప్రతి విషయమున ఉత్పత్తి-వికాసములు (Orgin and Development) నిశితముగా, నిష్కర్షగా నిరూపింపబడుచున్న ఈ కాలములో ఆధునిక విమర్శకులు పై అభిప్రాయమును, అనగా రూపకము లన్నింటిలోను ఉత్తమోత్తమమైన నాటకము మొదట ఆకస్మికముగా ఆవిర్భవించెననియు తక్కిన రూపకములు దాని పరిణామములే అనియు ఆమోదింపరు.[2] అందుచే వారు దశరూపపరిణామమును నిర్ణయించుటకు పూనుకొనినారు; అట్టివారిలో శ్రీ డి. ఆర్. మాంకడ్, డా. వి. రాఘవన్, డా. మన్మోహన్ ఘోష్ ప్రభృతులు పేర్కొన దగినవారు.[3]

ఇప్పట్ల దశరూప పదమునకు అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానము గమనార్హము—— ''దశరూపమనగా కావ్యముయొక్క పది రూపములని అర్థము; అనగా నాటకాదులు పదియును పది రూపములన్నమాట. (ten kinds of dramatic tendencies or ten aspects of Drama). 'నాటక రూపము' (నాటకమునకు చెప్పిన లక్షణములు) దేనియందు ప్రాధాన్యమును వహించునో అది 'నాటక' మనబడును. అట్లే 'ప్రకరణ రూపము' దేనియందు ప్రాధాన్యమును వహించునో అది 'ప్రకరణ' మనబడును. ఇట్లే ఇతర రూపకములకును ప్రధాన లక్షణములనుబట్టి పేర్లు వచ్చినవి. ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలెను. 'నాటక' మన్నంతమాత్రమున సకలప్రబంధమును 'నాటక' లక్షణయుతము కాజాలదు; అందులో ప్రకరణ-ప్రహసన-భాణాది లక్షణములుకూడ ఆయా భాగములందు కన్పట్టుచుండును. కాని, నాటకలక్షణము అధికముగా నుండుటచేత అది 'నాటక' మనబడినది; ప్రకరణ విషయమును

ఇంతియే. ఇట్లే ప్రతిరూపమందును తక్కిన రూపముల లక్షణములు కన్పట్టుచునే యుండును. నట్టకాదులు ఈ దశరూపములనుండి జనించినవేగాన నిజమునకు అవికూడ 'దశరూపము' లోనివే."

ఉత్సృష్టికాంకము కరుణప్రధానమైన ఏకాంకముకదా. అది ఏ పెద్ద నాటకమందైనను ఒక భాగముగా ఇముడగలదు ; అట్లే భాణ-ప్రహసన-వీథులును, మృచ్ఛకటికమందలి 'ద్యూతకరసంవాహకాంకము' నిజమునకు ఒక ప్రహసనమే. వీథ్యంగములలో మూడు (త్రిగత-ఉద్ఘాత్యక-అవలగితములు) నాటక ప్రస్తావనాంగములగుట గమనార్హము ; మరియు లాక్షణికు లందరును నాటక-ప్రకరణములనుండియే వీథ్యంగముల కుదాహరణము లొసంగియుండుట కూడ గమనార్హము. ఇంక భాణము ఏకహార్యమును, ఆకాశభాషిత సంయుతమునుకదా? ఈ లక్షణములు సర్వనాటక-ప్రకరణములందును ఏదో ఒకచోట కన్పట్టుచునే యుండును. ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గుర్తింపవలసి యున్నది. ఈ దశరూపములందును నాటక-ప్రకరణములు ఉత్తమములే కాక సువిశాలములును. అందుచే వీనియందు తక్కిన రూపములెల్ల ఉండుట కవకాశము కలదు ; వ్యాయోగాదులందు అట్లు తక్కిన రూపములుండుట కవకాశము లేదు. మూలమందు భరతుడే వీనికి కొంత పరస్పరసంబంధమును సూచించియుండెను— ఈహామృగము వ్యాయోగతుల్యమనియు, వ్యాయోగము సమవకారతుల్యమనియు, ప్రకరణము నాటకసమ మనియు పేర్కొనబడెను. (వ్యాయోగమును ఏకాంకసమవకార మనవచ్చును).

శ్రీ మాకండ్ దశరూపపరిమాణమును క్రిందివిధముగా ఊహించెను—

1. దశరూపములలోను భాణ-వీథీ-ప్రహసన-అంక-వ్యాయోగములు ఏకాంకములు. ఇందు ఇతివృత్తము స్వల్పము. నిర్మాణ దృష్టితో చూచినచో వీటి రచన చాల సులభము ; ఇందుచేత ఇవి తక్కినవానికంటె ఆదిమరూపములై యుండును.

2. వీనిలో భాణము పూర్తిగా ఏకహార్యము. కేవలము నృత్యప్రకారము కాకుండుటకై ఆకాశభాషితమును చేర్చుకొని, అందుమూలమున ఆభాసముగా సంవాదాత్మకమై, కొంత నాటకీయతను తెచ్చుకొన్నది (నిజమునకిది శ్రవ్యకావ్య తుల్యమే). అందుచే దీనిని ప్రాథమిక రూపమనుట సమంజసము.

3. వీథి ఇంచుమించుగా భాణమువంటిదే. కాని, ఇందు ఇరువురు పాత్రలుకూడ నుండవచ్చును ; నాయకుడు ఉత్తమ-మధ్యమ-అధములలో ఎవరైనను కావచ్చును. అందుచే ఇది భాణముకంటె అభివృద్ధిని సూచించుచున్నది.

4. పాత్ర బాహుళ్యము, ఇతివృత్తవిస్తృతి ప్రజల నాకర్షించియుండును. ఈ స్థితిలో భాణమునుండి ప్రహసనమును, వీథినుండి అంకమును ఉద్భవించియుండును. భాణము నందు అంగిరసమగు శృంగారము ప్రహసనమందు అంగరసముకాగా, హాస్యము అంగిరసమైనది.

5. అట్లే కరుణరసము ప్రాధాన్యము వహించిన 'అంకము'ను ఉద్భవించియుండును.

6. వ్యాయోగము పైవానితో సమానమే అయినను యుద్ధాదులతో కూడియుండుట వలన భిన్నమైనది. ఇది ఇంకొకరకమైన అభివృద్ధి.

7. ఈ ఐదును ఏకాంకములే అయినను భాణమును, వీథిలోని ఒక భేదమును ఏకపాత్రహార్యములును, వీథిలోని రెండవ భేదము ద్విపాత్రహార్యమును కాగా తక్కినవి బహుపాత్రసమన్వితములుగా నుండును. పాత్రబాహుళ్యముతో కథయును పెరిగి, అంకములును అధికము కాజొచ్చినవి. డిమ-ఈహామృగ-సమవకారములు ఈ దశకు సంబంధించినవి.

8. ఈహామృగము సర్వవిధముల వ్యాయోగతుల్యమే; కాని, ఇది స్త్రీ పాత్ర బహుళమైనది.

9. డిమముకూడ ఒక విధమగు వ్యాయోగమే. కాని వ్యాయోగమందలి యుద్ధాదుల కంటె ఇందలి యుద్ధములు చాల భయావహములుగా నుండును. ఇట్లీ రెండును వ్యాయోగము కంటె అభివృద్ధిని సూచించుచున్నది.

10. వ్యాయోగము సమవకార ప్రమాణముకలిగి ఉండరాదని భరతుడే చెప్పుటనుబట్టి సమవకారము వ్యాయోగముకంటె అభివృద్ధిని చెందినదనుట స్పష్టము.

11. ఇన్ని రకములుగా అభివృద్ధిచెందిన రూపకము క్రమముగా ఉత్తమములైన ప్రకరణ-నాటకములుగా పరిణతి చెందియుండును.

దశరూప పరిణామక్రమమును డా. రాఘవన్ ఇంకొక విధముగా ఊహించెను :—

1. వీథి ప్రథమదశ. మొదట ఇది ఏకహార్యము. తరువాత రెండవ నటుడు చేరి ద్విహార్యమైనది. ఏకహార్యమైన వీథినుండియే శృంగారప్రధానమైన భాణము జనింపగా, ద్విహార్యమైన వీథినుండి ప్రహసనము జనించియుండును. ప్రాచీన వీథీ రూపములేవియును మనకు లభింపకపోవుటచేతను, వీథ్యంగములు ప్రస్తావనయందును, నాటక-ప్రకరణముల యందును చేరిపోవుటచేతను అతిప్రాథమికమైన వీథీరూపము అంతరించినదనియే చెప్ప వచ్చును. (లీలావతీ వీథులవంటివి అర్వాచీనములుకూడ రెండు మూడు మాత్రమే కలవు.) భాణ-ప్రహసనముల అంశములుకూడ నాటక-ప్రకరణములందు చేరినవి; కాని, అవి వ్యక్తిత్వమును మాత్రము కోల్పోవలేదు.

ఈ విధముగా సంఘములోని వ్యక్తులను, వారి ఆచారాదులను, అవకతవకలను ప్రదర్శింపవలెననెడి మానవుని అభిలాషయే వీథీరూప మావిర్భవించుటకు హేతువై యుండును. ఈ వీథి ప్రహసనమునకు దారితీసినది; ప్రహసనముమీది సంపూర్ణాభివృద్ధియే ప్రకరణము.

2. సమవకార-ఈహామృగ-వ్యాయోగ-డిమములు ఉద్ధతరూపకములు; అనగా ఇవి వీరతా (heroic element) ప్రధానములు. ప్రప్రథమముగా ప్రదర్శింపబడిన రూపకములు అసురపరాజయ-అమృతమంథనములను (సమవకారములు), త్రిపురదాహమును (డిమము) అని నాట్యశాస్త్రమునుబట్టి తెలియుచున్నది. దేవాసురులమధ్యజరిగిన సంగ్రామములతో

కూడిన ఈ రూపములు ప్రాథమికదశకు చెందినవి. వీటిలో కొన్ని సమానలక్షణములుకలవు. ఈహామృగ - వ్యాయోగ - సమవకారములు పరస్పరము సంబంధించి యున్నట్లు భరతుడే పేర్కొనెనుకదా. ఇవియే క్రమముగా మార్పులుచెందుచు నాటకముగా పరిణతినంది యుండును. ఇంక యుద్ధాదులైన పిమ్మట, వితంతువుల విలాపాదులతో కూడి ఉండునది అంకము. కాన, ఇది సమవకారాదులకు పుచ్ఛభూతమైనదని చెప్పవచ్చును.

పై విధముగా 'Lighter and Heroic themes' వేర్వేరు శాఖలుగా నభివృద్ధిచెందుట చేత క్రమముగా ప్రకరణ - నాటకము లుద్భవించినవి. ఇవి స్థిరపడుటతోడనే వీథ్యాదులు ప్రాముఖ్యమును కోల్పోయి యుండును; కావుననే వానికి ప్రాచీనలక్ష్యములు నశించినవి.

**దశరూప లక్షణములు :**

| రూపకము | ఇతివృత్తము | నాయకుడు | అంకములు | సంధులు |
|---|---|---|---|---|
| 1. నాటకము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడును, ఉదాత్తుడును అయిన రాజర్షి. | 5 నుండి 10 వరకు | 5 |
| 2. ప్రకరణము | కల్పితము. (అనార్షము, లేదా ఆహార్యము కూడ కావచ్చును.) | విప్ర - వణిక్ - సచివ - పురోహిత - అమాత్య - సార్థవాహు లలో ఎవరో ఒకరు. | 5 నుండి 10 వరకును | 5 |
| 3. సమవకారము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతులును, ఉదాత్తులును అయిన 12 గురు నాయకులు. | 3 | 4 (అవమర్శము ఉండదు) |
| 4. ఈహామృగము | ప్రఖ్యాతము | దివ్యపురుషుడు (దివ్య నాయిక) | 1 లేదా 4 | 3 (గర్భ- అవమర్శలు ఉండవు) |

డా॥ ఘోష్ ప్రకారము అంక-పాత్రసంఖ్యల యభివృద్ధినిబట్టి దశరూప పరిణామము క్రింది విధముగా జరిగియుండును— 1. ఏకాంకము, ఏకహార్యము—భాణము; 2. ఏకాంకము, ఏక-ద్విపాత్రహార్యము—వీథి; 3. ఏకాంకములు, బహుపాత్రహార్యములు—వ్యాయోగ-ప్రహసన-ఉత్సృష్టికాంకములు ; 4. (a) అసంబద్ధములైన 3 అంకములు, బహుపాత్రలు—సమవకారము; 4. (b) అంతగా సుబద్ధములుకాని 4 అంకములు, బహుపాత్రలు—డిమ-ఈహామృగములు ; 5. సుసంబద్ధములైన 5 నుండి 10 అంకములు, బహుపాత్రలు—ప్రకరణ-నాటకములు. ఈ క్రమమే అధికసమంజసముగా కన్పట్టుచున్నది. హాళన ప్రధానమైన వీథికంటె శృంగారప్రధానమైన భాణమే ప్రాథమికరూపమై యుండును.

| వృత్తులు | రసములు | విశేషములు | కోహలుడు చెప్పిన మార్గ రూపకములు |
|---|---|---|---|
| 4 | శృంగారము లేదా వీరము అంగిరసము. తక్కినవి అంగ రసములు. | పతాకా - ప్రకరీ నాయకులు దివ్యులు కావచ్చును. నాటక - ప్రకరణము లందలి అంకములు మహాజన పరివారములు కారాదు; నలుగు రైదుగురు కార్యపురుషులున్నచో చాలును. బహువిధములగు సుఖ - దుఃఖములతోకూడిన రాజుల చరితమే ఇందుండవలెను. నాటకమునందు సర్వరూపముల అంశములును ఇమిడి ఉండును. | నాటిక |
| 4 | శృంగారము అంగిరసము | ఇది పెక్కు విషయములందు నాటకతుల్యము. కాని, దివ్యుల చరితము వర్ణితముకారాదు. రాజోచిత సంభోగము ప్రదర్శింపబడరాదు. ఇది దాస - విట - శ్రేష్ఠియుతమును, వేశ్యాస్త్రీకృత శృంగారోపేతమును కావలయును. | ప్రకరణిక |
| కైశికి ఉండదు. | వీరము(శృంగారము అంగము) | 3 కపటములతో, 3 విద్రవములతో, 3 శృంగార చిత్రములతో కూడినదై మొత్తము 18 నాడికల కాలములో ప్రయుక్త మగును. ప్రతి అంకమును భిన్నార్థములను కలిగి ఉండును. | |
| కైశికి ఉండదు. | శృంగాము | వస్తువు సుశ్లిష్టముగా ఉండును. 12 గురు దివ్య చిత్రతాల పురుషు లుందురు. భేదన - అపహరణ - అవమర్దనములచే పొందబడిన స్త్రీకి సంబంధించిన శృంగారము ఇందుండును. | |

| రూపకము | ఇతివృత్తము | నాయకుడు | అంకములు | సంధులు |
|---|---|---|---|---|
| 5. డిమము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడును, ఉదాత్తుడును | 4 | 4 (అవమర్శము ఉండదు) |
| 6. వ్యాయోగము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడగు రాజర్షి (దివ్యుడు నాయకుడు కారాదు) | 1 (ఒక రోజులో జరిగినకథ) | 3 (గర్భ అవమర్శలు ఉండవు) |
| 7. అంకము (ఉత్సృష్టికాంకము) | సాధారణముగా ప్రఖ్యాతము | దేవతలు నాయకులు కారాదు | 1 | 2 (ముఖ-నిర్వహణములు) |
| 8. ప్రహసనము | కల్పితము | శుద్ధమునందు భగవత్తాపసాదులు, సంకీర్ణమునందు వేశ్యా - చేట - నపుంసకాదులు. | 1 | 2 (ముఖ-నిర్వహణములు) |
| 9. భాణము | కల్పితము | ధూర్తుడు లేదా విటుడు | 1 | 2 (ముఖ-నిర్వహణములు) |
| 10. వీథి | కల్పితము | ఉత్తమ - మధ్యమ - అధమ ప్రకృతులు ముగ్గురిలో ఎవరైనను. | 1 | 2 (ముఖ-నిర్వహణములు) |
| 11. నాటిక | ఉత్పాద్యము | రాజు | 4 | 5 |

| వృత్తులు | రసములు | విశేషములు | కోహలుడు చెప్పిన పూర్వ రూపకములు |
|---|---|---|---|
| సాత్త్వతి-ఆరభటి | శృంగార హాస్యములు కాక తక్కిన ఆరు రసములును | కావ్యవస్తువు దీప్తరసమును, నానాభావోపసంపన్నమును, దేవ-భుజగేంద్ర-రాక్షస-యక్ష-పిశాచ చరిత్ర సంయుక్తమును కావలయును. ఇందు 16 గురు పురుషులుందురు. | డిమిక |
| కైశికి ఉండదు. | వీర-రౌద్రములు (ఇవి దీప్తరసములు) | స్త్రీలు తక్కువగా ఉండవలెను. 12 గురు పురుషులుందురు. యుద్ధ-నియుద్ధ-అధర్షణ-సంఘర్షణము లిందుండును. | జుగుప్సిత |
| భారతి | కరుణము | యుద్ధమునుండి మరలినవారు, గాఢముగా గాయములు తగిలినవారు ఇందు ఉందురు. స్త్రీల విలాపములు ఇందు అధికముగా ఉండును. | వియోగిని |
| భారతి | హాస్యము | శుద్ధ - సంకీర్ణ భేదములచే రెండు విధములు. వీని యందు వీథ్యంగములుకూడ ఉండును. లోక వ్యవహార సిద్ధమగు వార్త, దంభము, ధూర్తుల ప్రవిలాపములును ఇందుండును. | హాసిక |
| భారతి | శృంగారము (విస్మయము అంగము) | ఇందు లాస్యాంగములు విధిగా ఉండును. ఏక పాత్ర హార్యము; అతడు తానను భవించిన విషయములను లేదా ఇతరు లనుభవించిన విషయములను ఆకాశపురుషభాషిత యుక్తముగా వర్ణించును. | భాణిక |
| కైశికి అల్పముగా | అన్నిరసములును ఉండును. | ఏకహార్యము కాని, ద్విహార్యము కాని కావచ్చును. 13 వీథ్యంగములు ప్రయుక్తమగును. | కలోత్సాహవతి |
| కైశికి | శృంగారము | ప్రకరణ - నాటకముల సమ్మేళనము వలన కలిగినది. నాయిక అంతఃపురకన్య లేదా సంగీతశాలాకన్య. | |

## సంస్కృత రూపకములు[1]

**అశ్వఘోషుడు :**

మనకు లభించిన ప్రథమ సంస్కృతరూపకము అశ్వఘోషుని 'శారిపుత్ర (లేదా శారద్వతీపుత్ర) ప్రకరణము'. దీనియందలి కొన్నిభాగములు మాత్రమే మధ్య ఆసియాలో లభ్యమైనవి. ఇది నవాంకయుత మనియు, అశ్వఘోష విరచితమనియు రూపకాంతమున కలదు. శారిపుత్ర-మౌద్గల్యాయనులకు బుద్ధుడు ధర్మదీక్ష నొసంగుట ఇందలి ఇతివృత్తము. ఈ ప్రకరణమునందు నాట్యశాస్త్ర సూత్రములు చక్కగా పాటింపబడినవి. అశ్వఘోషుడు క్రీ. పూ. ప్రథమశతాబ్దియందుండెనని విశ్వసింపబడుచున్నది. కాగా, అప్పటికే సంస్కృతరూపకరచన సుప్రతిష్ఠితమైనదన్నమాట. శారిపుత్రప్రకరణము లభించిన వ్రాతప్రతియందే మరి రెండు రూపకముల శిథిలభాగములుకూడ కలవు. బహుశః ఇవియును అశ్వఘోషునివే కావచ్చును. అవి అత్యల్పభాగము లగుటచేత కథాపరిణామము తెలియుటలేదు. ఒకదానియందు బుద్ధి, ధృతి, కీర్తివంటి సాంకేతికపాత్రలు కలవు; ఇది ప్రబోధచంద్రోదయమువంటిది. ఇంక రెండవది ఇంచుమించుగా మృచ్ఛకటికమును పోలియున్నది.

**భాసుడు :**

కాళిదాసాదులచేత ఉత్తమరూపక రచయితగా ప్రశంసింపబడినవాడు భాసుడు. కాని, 1912 లో శ్రీ పి. గణపతిశాస్త్రిగారు భాసనాటకచక్రమందలి కొన్ని రూపకములను ప్రకటించు వరకును భాసకృతులను ఆధునికు లెరుంగరు. కాళిదాసు క్రీ. శ. 4 వ శతాబ్దివాడనునది బహుజన సమ్మతము. కావున, భాసు డంతకుముందే చాల ప్రసిద్ధినందియుండవలెను; అనగా క్రీ. శ. ఏ ప్రథమశతాబ్దికో చెందినవాడు అగును. శ్రీ గణపతిశాస్త్రిగారు ప్రకటించిన భాసనాటక చక్రమందు 13 రూపకము లున్నవి— 1. దూతవాక్యము (వ్యాయోగము). 2. కర్ణభారము (వ్యాయోగము లేదా ఉత్సృష్టికాంకము). 3. దూతఘటోత్కచము (వ్యాయోగము లేదా ఉత్సృష్టికాంకము). 4. ఊరుభంగము (ఉత్సృష్టికాంకము). 5. మధ్యమవ్యాయోగము (వ్యాయోగము). 6. పాంచరాత్రము (సమవకారము). 7. అభిషేకము (నాటకము). 8. బాలచరితము (నాటకము; నాయికలేదు). 9. అవిమారకము (నాటకము). 10. ప్రతిమ (నాటకము). 11. ప్రతిజ్ఞాయౌగంధరాయణము (నాటిక). 12. స్వప్నవాసవదత్తము (నాటకము). 13. చారుదత్తము (ప్రకరణము).

నాట్యశాస్త్రసూత్రములకు విరుద్ధములైన పెక్కుఘట్టములు భాసనాటకములం దున్నవి. అందుచే కొన్నింటిని ఫలాని రూపకములని ఖచ్చితముగా చెప్పుటకు వీలులేదు. ఈ సూత్రోల్లంఘనమును బట్టి భాసుడు నాట్యశాస్త్ర రచనకు పూర్వుడని కొందరును, తెలిసియే ఉల్లంఘించెనని కొందరును వాదించుచున్నారు. ఈ రూపకములందు భాసుడు తన పేరెచ్చుటను చెప్పుకొనలేదు. అందుచే ఇవి భాసకృతములే కావని కొందరును, కొన్నిమాత్రమే భాసకృతములు కావని కొందరును తలంచుచున్నారు. కాని, భాసుడు ప్రసిద్ధరూపకకర్త అనుట నిర్వివాదాంశము.

భాసుని 'ఊరుభంగము' విషాదరూపకమున కొక ఉదాహరణమని నిరూపించుటకు కొందరు విమర్శకులు ప్రయత్నించిరి. భాసనాటకములలో కథాగమనమందలి వేగము, చక్కని పాత్ర పోషణము, సరళమైన భాష, ప్రదర్శనయోగ్యత అనునవి ముఖ్యలక్షణములు. పాంచరాత్రము తప్ప తక్కిన భారతనాటకములన్నియును ఏకాంకములే. భాసునినాటకము లన్నింటిలోను స్వప్నవాసవదత్తమును ఉత్తమనాటకమందురు. భాసుడు దాక్షిణాత్యుడై యుండవచ్చును.

**కాళిదాసు :**

కాళిదాసు కాలమునుగూర్చి పైని వివరించితిని. మాళవికాగ్నిమిత్రము (నాటకము), విక్రమోర్వశీయము (ఔత్తరాహులు దీనిని త్రోటకమనగా దాక్షిణాత్యులు దీనిని నాటకమును గానే పరిగణించిరి), అభిజ్ఞానశాకుంతలము (నాటకము) అనెడి మూడు రూపకములను వరుసగా రచించెను. (ప్రసిద్ధ సంస్కృతరూపకకర్తలలో పెక్కురు మూడేసి రూపకములనే రచించియుండుట విచిత్రవిషయము). పై మూడింటిలోను అభిజ్ఞానశాకుంతలము ఉత్తమోత్తమ రూపకము; ప్రాచ్య-పాశ్చాత్య విమర్శకులందరి మన్ననలను పొందినరూపకమిది.[2] కాళిదాసుని కళాప్రతిభ సాటిలేనిది; 'కవికులగురువు'గా కీర్తింపబడినవా డితడు. ఇత డుజ్జయినీ నగరవాసి యని విమర్శకుల అభిప్రాయము.

**శూద్రకుడు :**

మృచ్ఛకటిక రచయితగా శూద్రకుడు[3] మనకు సుపరిచితుడు. కాని, శూద్రకు డొక కల్పితపురుషుడనియు, ధావకభాసుడనునాతడే మృచ్ఛకటికమును రచించెననియు విమర్శకుల అభిప్రాయము. మృచ్ఛకటికము క్రీ. పూ. 3, 2 శతాబ్దములనాటి రచన అనియు, భాసుని చారుదత్తము దీనికి సంక్షిప్తరూపక మనియు, మనకు లభించిన ప్రథమ సంస్కృతరూపక మిదియే యనియు కొందరు విమర్శకుల అభిప్రాయము. కాని, మృచ్ఛకటికము క్రీ. శ. 6, 7 శతాబ్దములనాటిదని శ్రీ కర్మార్కర్ ప్రభృతులు నిరూపించియున్నారు.

మృచ్ఛకటకము భాసుని చారుదత్తముకంటె చాల విశిష్టమైనది. దీనికి సంస్కృత రూపకములందొక ప్రత్యేక స్థానము కలదు. అభిజ్ఞానశాకుంతలము, ఉత్తమరామచరితము, మృచ్ఛకటికము అనునవి మూడును సంస్కృతరూపక ప్రపంచములో మూడు విశిష్ట స్థానములను ఆక్రమించుకొని యున్నవి. మొదటి రెండింటిలోను అతిలోక విషయములకు కూడ తావున్నది. కాని, మృచ్ఛకటికము కేవలము సాంఘికమైనది. ఉత్తములు, రాజులు, దొంగలు, జూదరులు, ధూర్తులు, విప్లవకారులు, బిచ్చగాండ్రు, రాజోద్యోగులు, సోమరులు, రక్షభటులు, దాసీలు, వేశ్యలు మొదలగువారు స్వేచ్ఛగా విహరించిన విచిత్రప్రపంచమిది ; అయినను నిష్కల్మషమైన ప్రేమ, విశ్వాసము అనునవి మూర్తీభవించిన లలితప్రపంచమిది. 'మృత్ శకటికము' (మట్టిబండి) ఇందు నాయకుని కష్టములకు కారణమై ప్రాధాన్యమును వహించుట చేత ఇది 'మృచ్ఛకటికము' అనబడినది. మృచ్ఛకటికము ఉత్తమమైన కవిత్వమునకు కూడ ప్రసిద్ధికెక్కియున్నది.

**భాణ ప్రహసనకర్తలు :**

'చతుర్భాణి' అనుపేర శ్రీ మా. రామకృష్ణకవిగారు నాలుగు భాణములను ప్రకటించి యున్నారు—1. ఉభయాభిసారిక (వరరుచి విరచితము). 2. పద్మప్రాభృతకము (శూద్రకవిరచితము). 3. ధూర్తవిటసంవాదము (ఈశ్వరదత్త విరచితము). 4. పాదతాడితకము (శ్యామిలకవి రచితము). వరరుచి పాణిని సమకాలికుడనియు, శూద్రకుడు ఆంధ్రభృత్య రాజైన స్వాతి ఆస్థానకవి అనియు, ఈశ్వరదత్తుని కాలము తెలియదనియు, శ్యామిలకుడు క్రీ. శ. 800_900 మధ్యవాడనియు సంపాదకులు పేర్కొనినారు. ఈ నాలుగింటియందును రచనావిధాన మొకేవిధముగా కన్పట్టగలదు. 13వ శతాబ్ది తరువాత బయలుదేరిన పెక్కు భాణములకంటె ఇవి చాల విశిష్టములై, వానికంటె ప్రాచీనములుగా పరిగణింపబడుచున్నవి.

పల్లవరాజైన మహేంద్ర విక్రమవర్మ (క్రీ. శ. 620 ప్రాంతముల) 'మత్తవిలాస' (ఏకాంక) ప్రహసనమును రచించెను. బౌద్ధ_కాపాలిక_పాశుపత మతములవారి అసభ్య వర్తనము లిందు ప్రదర్శింపబడెను. బోధాయన విరచితమని చెప్పబడెడి 'భగవదజ్జుకీయ' ప్రహసనమింకొకటి కలదు. కాని, దీనినికూడ విక్రమవర్మయే రచించి యుండవచ్చునని ఊహించుట కవకాశము కలదు. పాత్రలలోని వైపరీత్యముచేకాక, సన్నివేశములందలి వైపరీత్యముచే హాస్యము సృష్టింపబడుట యిందలి విశిష్టత.

**శ్రీహర్షుడు :**

ప్రియదర్శికా_రత్నావళీ_నాగానందముల కర్తయగు ఈ శ్రీహర్షుడు నైషధకర్తయగు శ్రీహర్షుని (క్రీ. శ. 12 వ. శ.) కంటెభిన్నుడును, ప్రాచీనుడును. రూపకకర్త అయిన ఈ శ్రీహర్షుడు శ్రీహర్షవర్ధన శిలాదిత్య బిరుదాంచితుడై క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రథమ భాగమున స్థానేశ్వర_కన్యాకుబ్జములను పాలించెను. శ్రీహర్షుని నాటకములను నాటి విదేశయాత్రికులు కూడ ప్రశంసించియున్నారు. బాణుడు శ్రీహర్షుని ఆస్థానకవియే. బాణుడే ఈ రూపకములను రచించియుండునని కొందరి అనుమానము ; కాని, ఇది విశ్వసనీయము కాజాలదు. ప్రియదర్శికా_రత్నావళులు రెండును నాటికలు. రెండింటను కథ ఇంచుమించు సమానమే. ఇవి మాళవికాగ్నిమిత్రమును పోలియుండును. నాగానందము నాటకము. ఇది ఉత్తమ నాటకములలో నొకటి. రత్నావళి ఆలంకారిక సూత్రములను తు, చ తప్పకుండ అనుసరించిన రచన. అందుచేత శ్రీహర్షుని యీ నాటికకు రూపకవిమర్శలో విశిష్టమైన స్థానము కలదు.

**విశాఖదత్తుడు :**

విశాఖదత్తుని కాలము సంశయాస్పదము. ఈతని ముద్రారాక్షసమును ధనంజయుడు పేర్కొనియుండుటచేత ఇది క్రీ.శ.10వ శతాబ్దికి ముందరి రచన అనుట స్పష్టము. "కాళిదాసాదుల నాటకములను ఎక్కువగా 'Poetic dramas' అని అనుటకు వీలున్నది; ఇంక ముద్రారాక్షస మొక్కటియే సంస్కృతమందు నిసర్గమైన నాటకము" అని కొందరు పేర్కొందురు. ప్రసిద్ధమైన రాజమార్గమునువీడి శూద్రకుడొక క్రొత్తదారిని త్రొక్కగా విశాఖదత్తు డింకొక క్రొత్త

దారిని త్రొక్కెను. మృచ్ఛకటికములో రాజకీయములు అనుషంగికములే; కాని, ఇందు అవియే ప్రధానము. విశాఖదత్తుడు చారిత్రకమైన కథను స్వీకరించి, పెక్కు క్రొత్త కల్పనలను జోడించెను. మంత్రి రాక్షసుని, అతని ముద్రిక సాహాయ్యముచేతనే జయించుట ఇందు ప్రధాన మగుటచేత ఇది 'ముద్రారాక్షస' మనబడినది. ఇందు నాయిక లేకపోవుట ఒక విశిష్టత. 'దేవీ చంద్రగుప్తము' అనెడి నాటకమునుగూడ ఈతడే రచించినట్లు చెప్పుదురు.

**భట్టనారాయణుడు :**

ఈతని కాలముకూడ స్పష్టముగా తెలియదు.[4] వామన - ఆనందవర్ధనులు భట్టనారాయణుని వేణీసంహారమును పేర్కొని యుండుటచేత ఇతడు నిశ్చయముగా క్రీ. శ. 800 పూర్వుడు. వేణీసంహారమును రౌద్రరస ప్రధానమైన నాటకమునుగా పేర్కొనవచ్చును. ఇందు ఆలంకారిక సూత్రములు చాల జాగ్రత్తగా అనుసరింపబడినవి. కొంత కావ్యధోరణియు, కొంత నాటకధోరణియు కలిగిన దీనిని 'Declematory drama' అని పేర్కొందురు.

**భవభూతి :**

భవభూతి - వాక్పతిరాజులు యశోవర్మ ఆస్థానకవులని కల్హణుడు రాజతరంగిణిలో పేర్కొనెను. వామనుడు భవభూతిని పేర్కొనియుండెను. అందుచే ఇతడు 8 వ శతాబ్ది ప్రారంభ మందుండెనని తలంపబడుచున్నది. ఇతడు విదర్భదేశీయుడని చెప్పబడుచున్నను, ఆంధ్రుడు అయి యుండునని ఊహించుట కవకాశము కలదు.[5] మహావీరచరితము, మాలతీ మాధవము, ఉత్తరరామచరితము అనునవి మూడును భవభూతి రూపకములు. ఇందు రెండవది ప్రకరణము; తక్కినవి నాటకములు. ఇవి మూడును వరుసగా ఒకదానికంటె ఇంకొకటి గుణాధికము. ''ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే'' అనునది ప్రసిద్ధమేకదా. శుద్ధవిషాద రూపకము కావలసిన ఉత్తరరామచరితము నీతడు ఆహ్లాదరూపకమునుగా మలచుకొనెను. ఇందలి కవిత్వము ప్రశస్తమైనది. పవిత్ర దాంపత్యమునందలి తరితీపులను కనుగొనగల్గిన శిల్పి యితడు. కవిత్వముకూడ విశిష్టమైనది.

**మురారి :**

మురారి కాలముకూడ సరిగా తెలియదు. క్రీ. శ. 9, 10 శతాబ్దము లందుండెనని ఊహింపవచ్చును. ఇతడు 'బాలవాల్మీకి' బిరుదాంచితుడు. "గురుకులక్లిష్టో మురారిః కవిః" అని చెప్పుకొనినాడు. ఈతని 'అనర్ఘ రాఘవము' గంభీరతకు ఉదాహరణమని తరువాతివారిచేత పొగడ్తనందినది. ఇందు రూపకత్వముకంటె కావ్యత్వమే అధికము. ఇట్టివానిని 'Closet dramas' అందురు. రూపకకర్తలు తమ్ముగూర్చి పొగడుకొనుట మురారితో ఆరంభమైనదని చెప్పవచ్చును.

**రాజశేఖరుడు :**

ఇతడు కనోజ్ రాజగు మహేంద్రపాలునకు ఉపాధ్యాయుడగుటచేతను, ఆనందవర్ధనుని పేర్కొని యుండుట చేతను క్రీ. శ. 850-920 ప్రాంతములవా డగుచున్నాడు. రాజశేఖరుని

భార్య అవంతిసుందరి. ఈమె గొప్ప విదుషి; అలంకారశాస్త్రవిషయమున ఈమె అభిప్రాయము లను రాజశేఖరుడు తన కావ్యమీమాంసయందు సగౌరవముగా పేర్కొనెను. ఈ కావ్యమీమాంసకు అలంకారశాస్త్రమందొక ప్రత్యేకస్థానము కలదు. రాజశేఖరుని నాలుగు రూపకము లిప్పుడు లభ్యమగుచున్నవి— 1. బాలరామాయణము (నాటకము) – నాటికి రాజశేఖరుడు 'బాలకవి' మాత్రమే. ఇందు ఒక్కొక్క అంకమే ఒక్కొక్క నాటకమంత విశాలముగా నుండును. 2. బాలభారతము (నాటకము) – దీనికి 'ప్రచండ పాండవ' మను నామాంతరము కలదు; ఇందలి 2 అంకములు మాత్రమే లభించినవి. 3. కర్పూరమంజరి – ఇది ప్రాకృతభాష యందు రచింపబడిన సట్టకము. అవంతి సుందరి ఆజ్ఞానుసారముగా ఇది ప్రదర్శింపబడినట్లు ప్రస్తావనలోనున్నది. ఇందు అంకములు 'జవనికాంతరములు' అనబడినవి. 4. విద్ధసాలభంజిక– ఇది నాటిక. కథాకల్పనాదులయందు అంతగా విశిష్టత కానరాదు. మొత్తముమీద రాజశేఖరునిది చక్కని కవిత్వము.

## ఇతర రూపక కర్తలు :

క్రీ. శ. 8, 9 శతాబ్దముల తరువాత రచింపబడిన రూపకములు విమర్శకుల ప్రశంసల నందలేక పోవుచున్నవి. ఇంక క్రీ.శ. 12వ శతాబ్దినాటికి సంస్కృత రూపకరచన క్షీణదశలో పడినదని చెప్పవచ్చును (రచన మాత్రము సాగుచునేయున్నదని మరువరాదు.). ఈ అర్వాచీన రూపకములలో కొంత విశిష్టతకలవి – వామనభట్టబాణుని పార్వతీపరిణయము, అనంగ హర్షమాత్రరాజు తాపసవత్సరాజము, శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి, జయదేవుని ప్రసన్న రాఘవము, దిఙ్నాగుని కుందమాల, రామభద్ర దీక్షితుని జానకీ పరిణయము, కులశేఖరుని తపతీ సంవరణము, రవివర్మ ప్రద్యుమ్నాభ్యుదయము, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము, విశ్వనాథుని సౌగంధికాపహరణము, రాజచూడామణి దీక్షితుని కమలినీకలహంసము, వత్సరాజు రూపకషట్కము మొ॥ భాస్కరకవి ఉన్మత్తరాఘవము, కాంచనాచార్యుని ధనంజయవిజ యము మొదలగునవి చిన్నిరూపకములు. క్రీ. శ. 12 వ శతాబ్ది తరువాత తెలుగు కవులనేకులు పెక్కు సంస్కృతరూపకములను రచించియున్నారు. వీని వివరములను కొన్నింటిని తరువాతి అధ్యాయములో పేర్కొందును.

ఇంచుమించుగా పై రూపకములన్నియును ముద్రితములై లభ్యమగుచున్నవి; ఇంచు మించుగా అన్నియును ఆంధ్రీకృతములైనవి; ఒకే రూపకమును పలువురు అనువదించి యున్నారు కూడాను. ఉదా ; 'అభిజ్ఞానశాకుంతలము'ను నలువదిమందికిపైగా ఆంధ్రీకరించిరి.

అలంకారశాస్త్రములందు పెక్కు రూపకముల పేర్లు పేర్కొనబడుటయే కాక, కొన్నింటినుండి ఉదాహరణ శ్లోకములుకూడ ఉద్ధృతములై యున్నవి; కాని, అవి యేవియును లభింపలేదు.

## యవన (గ్రీకు) రూపకములు

1. కోరస్ ప్రాముఖ్యమును తెలిసికొనుట ఆవశ్యకము. కోరస్‌లో ఎంతమంది యున్నను, వారి నందరిని కలిపి ఒకే ఒక పాత్రనుగా లెక్కింపవలసి యున్నది. దీనినే 'బృందగానము' అనవచ్చును. ఈ కోరస్ రూపకమునందలి పాత్రలతో సంభాషించుచుండును; ధర్మవంతమైన పాత్రయెడ సానుభూతి వహించి, ఆ పాత్ర చర్యలను విమర్శించుచు, ముందు జాగ్రత్త కొరకు హెచ్చరికలు చేయుచుండును. భూత - భవిష్య - ద్వర్తమాన విశేషములను, ఆవశ్యకమునుబట్టి, తెలియపరచుచుండును. ఒక ఘట్టము ముగిసి ఇంకొక ఘట్టము ప్రారంభము కానున్న విషయమును సూచించును. నాటకాంతమును తెలియపర్చును. కాగా ఈ కోరస్‌లోని వ్యక్తులు రూపకములోని పాత్రలుగా, హితోపదేశకులైన పెద్దలుగా, రూపకమునకు సాక్షీభూతులైన ప్రేక్షకులుగా మారుచుందురని తెలియవలెను. తెలుగు వీథి నాటకములందు ఆదినుండి అంతమువరకును ప్రదర్శనమునందు పాల్గొను సూత్రధారుడు ఈ కోరస్ నిర్వహించు పనినే నిర్వహించుచుండును. ఇంక నృత్త - గానములను విడిచివేసినచో ఈ కోరస్ పని సంస్కృత రూపకములందలి విష్కంభ ప్రవేశకాదుల పనివంటిదే యని చెప్పవచ్చును.

2. డయోనిసస్ ఉత్సవములో, డయోనిసస్ గాథతోనే రూపులు దిద్దుకొన్నది ట్రాజెడీ. కాని ఆ డయోనిసస్ గాథకు సంబంధించిన ఒక్క ప్రాచీనవిషాదరూపకము కూడ లభింపలేదట!

3. ప్రాచీన గ్రీకుదేశమున నాట్యశాలా నిర్మాణ మనునదియేలేదు. ఒక కొండలోయలో డయోనిసస్ ఉత్సవము జరిగెడిది. ఆ డయోనిసస్ ఆలయమునకుముందు 'నృత్తరంగము' (Dancing floor) ఉండెడిది. ఇది 64 అడుగుల వ్యాసముకల్గి వృత్తాకారముగ నుండెడిది. ఈ భాగమునే 'ఆర్కెష్ట్రా' (Orchestra) అందురు. దానికిముందు పర్వతము వరకును వ్యాపించి యుండెడి భాగమున ప్రేక్షకులు కూర్చుండెడివారు. ఇది అర్ధవృత్తాకారముగ నుండెడిది. ఇందు 20, 30 వేలమంది ప్రేక్షకులు పట్టెడివారు.

తరువాతి కాలములో దేవాలయమునకును, నృత్తరంగమునకును మధ్య, నృత్తరంగము నానుకొని యుండునట్లుగా నేపథ్యగృహమువంటి ఒక చిన్న గది కట్టబడినది. దీనిని 'స్కేనీ' (Skene) అందురు (ఈ పదమునుండియే Scene అను పదము ఉత్పన్నమైనది). క్రమముగా ఇది రెండంతస్తులుకల గృహముగా మారినది. ఇది వెనుక తెరగాను, దేవతాదులు కన్పించి మాటాడుటకు తగిన ఉన్నతమగు వేదికగాను ఉపయుక్తమయ్యెడిది. అటు పిమ్మట ఈ స్కేనీకి ఇరు పార్శ్వములందును 'పెరాస్కేనీలు' (Paraskneia) అనబడు రెండు వరండాలు ప్రేక్షకస్థానము వరకును వ్యాపించునట్లుగా నిర్మితములైనవి. ఈ మూడింటికిని, ఆర్కెష్ట్రాకును మధ్య రంగస్థలము ఉండెడిది. ఇది ఉన్నతముగా ఉండెడిదని యూహింప వచ్చును. స్కేనీనుండి రంగమును ప్రవేశించుటకు మూడు ద్వారములుండెడివి. పెరాస్కేనీలనుండి రంగస్థలమును ప్రవేశించుటకు మరి రెండు ద్వారము లుండెడివి. వీనిని నటులతోపాటు ప్రేక్షకులును ఉపయోగించెడివారు. వెనుక తెరగా ఉపయుక్తమయ్యెడి స్కేనీ గోడ శిల్ప విశిష్టముగా నుండెడిది. అటుపిమ్మట తెరలు ఉపయోగములోనికి వచ్చినవి (Painted Scenery). విషాదరూపకమున ఒక ఆలయము లేదా రాజ ప్రాసాదము, ఆహ్లాదరూపకమున ఒక గృహము లేదా ఇండ్ల వరుసలతో కూడిన వీథి సాధారణముగా చూపబడుచుండెడివి. కొందరు సహజత్వసంపాదనమునకై యాంత్రికములగు నేర్పాట్లను కూడ చేసెడివారు; నాడు ఇది అంతగా ప్రజలయామోదమును పొందినట్లు కన్పట్టదు.

4. 1. The Suppliants (C. 490 B. C); 2. The Persians (472); 3. The Seven against the Thebes (469); 4. The Prometheus Bound (?C 460); and the trilogy known as the Orestiea (458) Viz. 5. The Agamemnon; 6. The Choephori (libation bearers); and 7. The Eumenides.

5. The normal scheme is the offence, the counter-offence, and the resolution; sin provokes sin, until justice asserts itself.

6. 1. Ajax (c. 450 B. C); 2. Antigone (c. 442); 3. Trachiniae; 4. Oedipus Rex (? c. 425); 5. Electra; 6. Philoctetes (409); and 7. Oedipus Coloneus. ఈ చివరి రూపకమును సొఫొక్లిస్ తన 90 వ ఏటను రచించెనందురు. Eletra అనెడి రూపకము స్త్రీ పాత్ర ప్రాముఖ్యము కలది.

7. గ్రీకు రూపకములలో అంక విభజనములేదు. మొత్తము నాటక కార్యమంతయు 24 గంటలలో (in a single revolution of the Sun) జరిగియుండవలెనని అరిష్టాటిల్ సిద్ధాంతము. అంకము అనెడి పేరు లేకపోయినను కథాగతిని బట్టి ఇతివృత్తములో కొన్ని ఘట్టములుండుట సహజము. ఈ ఘట్టములే ఆర్వాచీనకాలములో అంకములు (acts) అయినవి. సొఫొక్లిస్‌కు సమకాలికుడైన ఎగాథాన్ (Agathon) అను నతడు 'The flower' అను విషాదరూపకములో ప్రప్రథమముగా కల్పిత పాత్రలను ప్రవేశపెట్టుటయేకాక అంకవిభజనమునకు కూడ దారి తీసెను.

8. నటులు ముగ్గురే అన్నంత మాత్రమున నాటకమందు ముగ్గురు పాత్రలే ఉందురని అర్థముకాదు. అంతకంటె అధికముగా ఎంతమందియైనను ఉండవచ్చును. అంతమందియును రంగస్థలము మీదికి కూడ ఒకేసారి రావచ్చును. కాని రంగస్థలము మీద ముగ్గురిని మించి ఎవ్వరును మాటాడరు. తక్కినవారందరును మూకపాత్రలు మాత్రమే.

9. చూ. "The Oxford Companion to the Theatre" – P. 335.

10. అరిష్టోఫేనిస్ రూపకములలో Frogs (405 B. C.) అనునది ఓల్డు కామెడీ శాఖకు, మిడిల్ కామెడీ శాఖకు మధ్యే మార్గమున నుండును. గ్రీసు దేశమున నశించిపోవుచున్న విషాదరూపక రచనాకళ నుద్ధరించుటకు ఎస్కిలస్, యురిపిడస్‌లలో ఎవరిని భూలోకమునకు తీసికొని రావలె ననెడి సమస్యను చర్చించుటకు నరకములో వారిరువురి మధ్య ఒక పోటీ జరుగుట ఇందలి ఇతివృత్తము. డయొనిసస్ తీర్పరి. గెల్చినవారిని తన పక్షమున చేర్చికొనుటకు సొఫొక్లిస్ తీర్పరి ప్రక్కన కూర్చుండును.

## పాశ్చాత్య రూపక భేదములు

1. పునరుజ్జీవనకాలమందలి విమర్శకులు విషాద-ఆహ్లాద రూపకముల లక్షణములను క్రిందివిధముగా పేర్కొనియున్నారు—

   1. Tragedy deals with great and terrible actions; Comedy with familiar and domestic actions.

   2. Tragedy begins happily and ends terribly; Comedy begins rather turbulantly and ends joyfully.

   3. The Characters in tragedy are kings, princes or great leaders; those in Comedy are humble persons and private citizens.

4. The style and diction of Tragedy are elevated and sublime ; while those of Comedy are humble and colloquial.

5. The subjects of Tragedy are generally mythical or historic; those of Comedy are always invented by the poet.

6. Tragedy deals with exile and bloodshed; Comedy deals largely with love and seduction. —Rhetoric Notes - P. 75.

2. "Drame invariably deals with personalities, while true comedy deals with types and with classes .... comedy is seperated from the drame by the substitution of type for individual, insensibility for emotion, moral sentiment (the relating of art to life and the consequent presentation of a problem) for pure artificiality".

3. విషాదరూపక లక్షణము క్రింది విధముగా క్రోడీకరింపబడినది—

1. Tragedy is serious action, ending in calamity.

2. The calamity is due to conflict, external or internal, between spiritual forces ; between iron laws and stubborn will.

3. The calamity rouses emotions of pity and fear, but does not disquiet us ; for these feelings are calmed and purified or ennobled.

4. It does not leave us vanquished, because in spite of the ruin of prosperity, we recognise the greatness of the human spirit and are thus reconciled and exalted.

5. The action and character, to produce the required effect, must be high and illustrious ; thus only can a wide and universal sympathy be aroused.

—Rhetoric Notes - P. 77.

4. "...........the following varieties figure prominently in English dramatic literature ; the Horror tragedy of Webster and Ford, specialising in scenes of violence and cruelty ; the Heroic tragedy of Dryden and Otway, dealing with the exploits of a sublime hero and sometimes in rhyme ; the She-tragedy of Rowe, deriving its title from a central fimale figure who dominates the action ; and the Domestic tragedy of the eighteenth century, aiming at the portrayal of middle-class life and employing prose, not verse.

—"A Background to the study of English Literature"
by Sri B. Prasad (1960) Pp. 92-93.

5. "Comedy is an imitation of characters of a lower type—not, however, in the full sense of the word bad, the Ludicrous being merely a subdivision of the ugly. It consists in some defect or ugliness which is not painful or destructive."

— Butcher's translation - P. 21.

6. "........the Humour comedy of Ben Jonson, satirising eccentricity, which was supposed to be due to an excess of one of the four 'humours' or natural fluids of the body—blood, phlegm, choler, and melancholy or black bile ; the Restoration comedy of Intrigue, specialising in situations arising out of infidelity in love and marriage ; the comedy of Manners, also of the Restoration period, in which the language and behaviour was highly stylised and artificial ; the Genteel comedy of Colley Cibber, rediculing the affectations (the wigs, the shoes, the ribbons, the toilet etc.), of 18th century society; and the Sentimental comedy of the late 18th century, presenting in place of laughter , tears; in place of intrigue, melodramatic and distressing situations; and in place of rogues and gallants and witty damsels, pathetic heroines and serious lovers and honest servants."
—Sri B. Prasad - P. 93.

7. కొన్ని గ్రంథములు :
   1. Sri Kolachalam Srinivasarao of Bellary - "The Dramatic History of the world" (1908).
   2. శ్రీ పురాణం సూరిశాస్త్రి (బందరు) - "నాట్యోత్పలము" (1924).
   3. Sri A. Nicoll — "World Drama" (1949).
   4. Sri Donald Clive Stuart — "The Development of Dramatic Art" (1928).
   5. Sri John Gassner — "The Masters of the Drama" (1954).

## సంస్కృత రూపకముల ఉత్పత్తి

1. ఈ వాదోపవాదముల వివరములకు డా. ఎ. బి. కీత్ రచించిన "The Sanskrit 'Drama' (reprint, 1954 - Oxford University press) చూడవలయును. పుటలు 28-77.

2. "Drama in Sanskrit Literature" by prof. R. V. Jagirdar.

3. సంస్కృత రూపకములందు కూడ సూత్రధారుడు ఆద్యంతము రంగస్థలము మీదనే ఉండియుండు నని ఊహించుటకు అస్సాముదేశమందలి 'అంకీయనాట్' అనునది బలము నొసంగుచున్నది (కాని ఇది క్రీ. శ. 15 వ శతాబ్దికి చెందినది మాత్రమే అని మరువరాదు). అంకీయనాట్ అనునది వైష్ణవ ప్రచారాత్మకమగు ఏకాంకికా ప్రదర్శనము. శంకర దేవుడు (క్రీ. శ. 1449-1568) ఈ రకపు రచనలకు మూలపురుషుడు. ఇందు సూత్రధారుడు నాందిని పఠించి, కథా సూచనము చేయును. అటుపిమ్మట ప్రతిపాత్ర ప్రవేశమును మొదట సంస్కృతములో ఎరుకపర్చి, తరువాత గీతమున గానము చేయును. అట్లే ప్రతి ముఖ్య సంభాషణము మొదట సంస్కృతమునందును, పిమ్మట గేయమునందును వ్యక్తమగుచుండును. ఈ సంస్కృత సంభాషణమును సూత్రధారుడు ప్రాకృతభాష (అస్సాము భాష లేదా బ్రజబూలి భాష)లో వ్యాఖ్యానించి చెప్పుచుండును. ఇది సూతుని పౌరాణికగాథా వ్యాఖ్యానపద్ధతికి సన్నిహితము. కాగా అంకీయనాట్ సంస్కృత రూపకముల తొలి రూపమునకు చిహ్నమని విమర్శకుల అభిప్రాయము.

సంస్కృతమునందలి గీతగోవిందము యొక్క ప్రభావము కొంత ఈ అంకీయనాట్‌లపై కలదని ఊహింపవచ్చును.

## రూపక - ఉపరూపక భేదములు

1. 'నాటకం - సప్రకరణ - మంకో - వ్యాయోగ ఏవచ ।
   భాణః - సమవకారశ్చ - వీథీ-ప్రహసనం-డిమః ॥
   ఈహామృగశ్చ విజ్ఞేయో దశమో నాట్యలక్షణే ।  (XVIII-2-3 శ్లో.)

   (ప్రకరణమునకు ముందుగల 'స' శబ్దముచేత అంక-ప్రవేశక-సంధ్యాది నియమముల విషయమున నాటకముతోడి సామ్యము చెప్పబడినదని తెలియవలెను.)

2. హేమచంద్రుడు ఉపరూపకములను 'గేయకావ్యము' అనెను. అతడు చేసిన వివరణ మిప్పట్ల స్మరణీయము—

   'కావ్యము ప్రేక్ష్య - శ్రవ్యభేదములచే రెండు విధములు. ప్రేక్ష్యము అభినేయము; శ్రవ్య మనభినేయము. ప్రేక్ష్యము పాఠ్య - గేయ భేదములచే రెండు విధములు. నాటక - ప్రకరణ - నాటికా - సమవకార - ఈహామృగ - డిమ - వ్యాయోగ - ఉత్సృష్టికాంక - ప్రహసన - భాణ- వీథీ సట్టకాదులు పాఠ్యములు. ఆది శబ్దముచే కోహలాది లక్షిత తోటకాదులు గ్రాహ్యములు. నాటకాది వీథ్యంతములైన పదునొకండును వాక్యార్థాభినయ స్వభావములు. వీనిని భరతుడే నిర్దేశించెను. సట్టకము నింకొకరు పేర్కొనిరి. డోంబికా-భాణ- ప్రస్థాన - శింగక - భాణికా - ప్రేరణ- రామాక్రీడ - హల్లీసక - రాసక - గోష్ఠి - శ్రీగదిత - రాగకావ్యాదులు గేయములు. ఆది గ్రహణముచే శంపా - ఛలిత - ద్విపద్యాదులు పరిగ్రాహ్యములు....మసృణ - ఉద్ధత - మిశ్ర భేదములచే గేయకావ్యములు మూడు విధములు. పాఠ్యమునందు అంగ-గీతములు అనియతములు; ఇతివృత్తము, సంభాషణము, రూపారోపణము, వ్యుత్పత్త్యభిసంధానమును ప్రధానములు. ఇంక గేయ కావ్యమందు అంగ-గీతములు సుప్రతిష్ఠితములై యుండును; ఇతివృత్తాదులకు ప్రాధాన్యము లేదు. ఇందు కొన్నింటిలో గీతికి ప్రాధాన్యము, కొన్నింటిలో నృత్తమునకు ప్రాధాన్యము, మరి కొన్నింటిలో రెండింటికిని ప్రాధాన్యము. తక్కిన వానిలో వాద్యములకు ప్రాధాన్యము'

   —కావ్యానుశాసనము-8 వ అధ్యాయము.

3. "Nrittapara" by Sri M. R. Kavi (Journal of the Oriental Research, Tirupati).

## దశరూప పరిణామము

1. ఏ అర్థము ప్రత్యక్షముగా చేయబడునో ఆ అర్థము 'రూపము' అనబడునని అభినవగుప్తుడు 'రూప' పదమును నిర్వచించెను. దృశ్యాత్మకమైన కావ్యమునకుకూడ 'రూప' మనియే పేరు. తరువాతి కాలములో ఈ పదమునకు 'క' ప్రత్యయముచేరి 'రూపక' మనెడి పదము ప్రసిద్ధిలోనికి వచ్చెను. భరతుడు 'రూప' మనెడి పదమునే వాడెను.

2. భారతీయ లాక్షణికులు చారిత్రక పరిణామమును గుర్తించి, నిర్దేశించుట చాల అరుదుగా కానవచ్చును. కావుననే వారు ఈ దశరూపముల విషయమునను క్రమపరిణామమును గుర్తింపరేదు. సర్వలక్షణ సంపన్నమైన నాటకమును మొదట వివరించి, తక్కిన వానిలో చూపట్టు ప్రధాన భేదములను మాత్రమే వరుసగా వివరించుట లక్షణకర్తకు సులువు; అలంకారికు లందరును అట్లే చేసిరి.

3. I. Dr. V. Raghavan — "A Note on the name of Dasarupaka" — (Journal of the Oriental Research, Institute. Madras).

2. Sri D. R. Mankad— "Types of Sanskrit Drama" (1936). ఈ గ్రంథము ననుసరించి శ్రీ పల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులుగారు "గీర్వాణరూపకము" అనెడి గ్రంథమును తెలుగులో రచించియున్నారు.

3. Dr. Manmohan Ghosh - "On the origin of Hindu Drama" (1957).

## సంస్కృత రూపకములు

1. పాశ్చాత్య రూపక చరిత్రను పేర్కొన్నంత నిష్కర్షగా సంస్కృత రూపక చరిత్రను పేర్కొనుటకు తగిన ఆధారములు లేవని చెప్పవచ్చును—కర్తృత్వ విషయమున అనుమానము. కాల నిర్ణయము విషయమున అనుమానము. కొన్ని రూపకములను ఎవరు రచించిరో తెలియదు. కొన్ని రూపకములు కేవలము నామమాత్రావశేషములు. అయినను శ్రీ ఎ. బి. కీత్ ఒక సమగ్ర చరిత్రను నిర్మించుటకు ప్రయత్నించి కృతకృత్యుడయ్యెను. అదియే "The Sanskrit Drama" (1924): ఇటీవల డా. ఎస్. కే. డే. ఇంకొక గ్రంథములో సంస్కృత రూపక చరిత్రను రచించెను. అదియే "A History of Sanskrit Literature" (1954). సంస్కృత రూపక చరిత్ర విషయమున ఇవి రెండే ప్రధానఆధారగ్రంథములు.

2. "అభిజ్ఞాన శాకుంతలము" యొక్క అనువాదమును చదివి గోథే మహాకవి ఆనందమును పట్టజాలక క్రింది విధముగా అబ్బురముగా చెప్పెనట—

Would'st thou the young year's blossoms and the fruits of its decline,
And all by which the soul his charmed, enraptured, feasted, fed,
Would'st thou the Earth and Heaven itself in one sole name combine?
I name thee, O Sakuntala ! and all at once is said.

3. శ్రీ ఎ. డి. పుసాల్కర్ వ్రాసిన వ్యాసమును బట్టి శూద్రకుడు ఆంధ్రరాజని యూహించుట కవకాశ మేర్పడుచున్నది—J. A. H. R. S—Vol-XI pts. 1 & 2. Pp. 33-42.

4. భారతరచనలో నన్నయభట్టునకు సాహాయ్యపడిన నారాయణభట్టును, వేణీ సంహార కృతికర్తయగు భట్టనారాయణుడును ఒక్కరే అనెడి వాద మొకటి కలదు. అయినచో ఇతడు తెలుగు కవియే అగును. చూ. (1) శ్రీ గొట్టుముక్కల కృష్ణమూర్తిగారి వ్యాసము "కన్నడాంధ్రములు" భారతి - మార్చి, 1956; (2) శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారి వేణీసంహారానువాదపీఠిక.

5. మాలతీమాధవ పీఠికలో భండార్కర్ పండితుడు వ్రాసిన దానినిబట్టి భవభూతి ఆంధ్రుడేమోయని యూహించుట కవకాశము కలదు. ఉత్తరరామచరితములో అతడు గోదావరిని వర్ణించిన విధమును పరిశీలించినచో అతడు తప్పక ఆంధ్రుడే అని అనిపించును. ఇతడు నటులతో పరిచయము కలవాడని ప్రస్తావనలను బట్టి తెలియుచున్నది. తన ఉత్తరరామచరిత నాటకములో ఇతడు వాల్మీకి భూమికను ధరించి యుండునని శ్రీ బెల్వాల్కర్ అభిప్రాయ పడెను.

## తృతీయాధ్యాయము

# ప్రాచీనాంధ్రదేశము : సంగీత-నృత్య-నాట్యముల వికాసము

## ఆంధ్రరాజుల కాలము

హాలసాతవాహనుని గాథాసప్తశతిని బట్టి క్రీస్తు శకమునకు పూర్వమే ఆంధ్రదేశములో నృత్య-సంగీత-నాటకములును, వాద్యములును ప్రచారమందున్నవని స్పష్టమగుచున్నది. కొన్ని ఉదాహరణములు :

ఖలుడు బోనము అమరిన యంతవరకు మద్దెలవలె మధురముగా పలుకును; ఆ బోనము అమరనిచో వెంటనే మద్దెలవలె విరసముగా పలుకును (III-53). దున్నపోతు స్కంధము మీద వ్రాలి, కొమ్ముదెబ్బలు తిని, పైకివగిరిన దోమలగుంపు మ్రోత మీటివిడిచిన వీణారవమువలె నుండెను (VI-60). పూచిన జనపచేను హరితాళ (అర్ధళ)[1] మండిత ముఖముతో మెరిసెడి నటివలె అందగించు చున్నది (I-9). మదన నాటకమునకు నిబిడోపగూహనము పూర్వరంగమైనది (IV-44).

ఈ హాల సాతవాహన మహారాజు క్రీ. శ. ప్రథమ శతాబ్దికి చెందినవాడని పరిశోధకుల నిర్ణయము. సాతవాహనరాజులు ప్రధానముగా ప్రాకృత భాషను ఆదరించినారు. గాథాసప్తశతి యందలి భాష 'మహారాష్ట్రి ప్రాకృతము'. నాడు ఆంధ్రభాష (లేదా తెలుగు) జనవ్యవహారమందు ఉన్నదో లేదో తెలియదు. కాని, గాథాసప్తశతి ఆంధ్రుల సంస్కృతిని ప్రతిబింబించు చున్నదనియు, అందలి గాథలలో తెలుగు పదములు కొన్ని కలవనియు విమర్శకులు నిరూపించి యున్నారు.[2] ఒక భాషా కవిత్వములో ఇంకొక భాషా పదములు కన్పట్టినప్పుడు, ఆ రెండవ భాషకూడ ప్రచారమునందుండియుండునని యూహించుట అసమంజసము కానేరదు. అయినచో ఆంధ్రభాష ఆనాటికే జనవ్యవహారము నందుండెనని చెప్పుటకు వీలగుచున్నది. ఇందలి సత్యాసత్యములెట్లున్నను సాతవాహనులు ఆంధ్ర రాజులు; వారి రాజ్యమునందు ఆంధ్రులును, మహారాష్ట్రులును ముఖ్యప్రజలు. గాథాసప్తశతియందు తెలుగు గడ్డమీద నివసించిన అనేకకవుల గాథలు కలవు. అందువ్యక్తములైన భావములు మహారాష్ట్రుల సంస్కృతినే కాక ఆంధ్రుల సంస్కృతిని కూడ ప్రతిబింబించు చున్నవి. కాగా పై ఉదాహరణములనుబట్టి క్రీ. శ.

ప్రారంభము నాటికి ఆంధ్రదేశమున వాద్య-గాన-నాటక-నృత్యములు ప్రచారములో నుండుటయే కాక సమ్యగ్వ్యవస్థను పొందియున్నవని కూడ చెప్పగలము.

గాథాసప్తశతితోపాటు పేర్కొనవలసిన గ్రంథము భరతముని నాట్యశాస్త్రము. ఇది క్రీ. శ. ప్రారంభ కాలమునకు సంబంధించిన గ్రంథమని విమర్శకుల అభిప్రాయము. నాట్యశాస్త్రమునుబట్టి, నాటికి దక్షిణాపథము నందును, మధ్యహిందూదేశమునందును చక్కని నాట్యవ్యవస్థ యేర్పడియున్నదని చెప్పగలము.[3] నాడు భారతదేశమున సుస్థిర నాట్యవ్యవస్థ నెలకొన్న రాష్ట్రములలో ఆంధ్రదేశ మొకటియని నాట్యశాస్త్రమునుబట్టి స్పష్టముగా చెప్పగలము. ప్రవృత్తి వివరణములో (13 వ అధ్యా) ఆంధ్రులు దాక్షిణాత్య ప్రవృత్తికి చెందిన వారనియు, దాక్షిణాత్యులు బహునృత్త-గీత-వాద్య-లలితాభినయ ప్రియులనియు భరతుడు పేర్కొనెను. మరియు నాట్యశాస్త్రమున ఆంధ్రుల ప్రసక్తి మరి రెండుచోట్లగలదు—17 వ అధ్యాయమున 'ఆంధ్రి'యను విభాష ఆదేశవాసులకు నాట్యమందుపయుక్త మగునని చెప్పబడెను; జాతిలక్షణమనెడి 28 వ అధ్యాయమున మధ్యమ గ్రామాశ్రయములగు పదునొకండు జాతులలో 'ఆంధ్రి' ఒక జాతి (నేటి రాగము) గా పేర్కొనబడినది. పై విషయములనుబట్టి క్రీ. శ. ప్రథమ శతాబ్దినాటికే ఆంధ్రులు లలిత కళల విషయమున ఎంతయో అభివృద్ధిని సాధించియుండిరనెడి విషయము స్పష్టమగుచున్నది.

నాట్యశాస్త్రము తరువాత చెప్పదగిన గ్రంథము అభినయదర్పణము. ఇది నందికేశ్వర ప్రణీతము. నేడు ప్రచారములోనున్న కూచిపూడి-భరతనాట్యములకు, నాట్యశాస్త్రమునకు పుత్రికయనదగు, ఈ అభినయదర్పణమే ఆధారగ్రంథము. నాట్యశాస్త్రమందు పేర్కొనబడిన తండు మహర్షియును, ఈ నందికేశ్వరుడును ఒక్కరే అని శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారభిప్రాయపడినారు.[4] అభినయ దర్పణము క్రీ. శ. 3 వ శతాబ్ది ప్రాంతములందు కాని, ఆ తరువాత గాని రచింపబడి యుండును. అభినయదర్పణమును గూర్చి ఒక ముఖ్యవిషయమును పేర్కొనవలసి యున్నది. దేశమునందలి అభినయదర్పణపు వ్రాతప్రతులన్నియును తెలుగులిపిలోనే యున్నవి. వంగదేశమందలి విశ్వభారతిలోని వ్రాతప్రతియును తెలుగులిపిలోనే ఉన్నదట. దీనినిబట్టి అభినయ దర్పణము తెలుగు గడ్డమీదనే రచింపబడినదనియు, తత్కర్తయగు నందికేశ్వరుడు తెలుగువాడే అనియు నిశ్చయముగా చెప్పవచ్చును. ముఖ్య నృత్య సంప్రదాయములకెల్ల ఆధార గ్రంథమైన అభినయదర్పణము ఆంధ్రులదగుట గర్వకారణము.

నందికేశ్వరప్రణీతమగు 'భరతార్ణవ' మనెడి గ్రంథమింకొకటి ఈ మధ్యనే ప్రచురింపబడినది.[5] ఇది అభినయదర్పణముకంటె చాల విపులముగా నున్నది; దానికిది మూలగ్రంథమో, లేదా వ్యాఖ్యానమో కావచ్చును. ఇందు శాస్త్రమేకాక సంప్రదాయము కూడ వివరింపబడుట గమనార్హము.

నందికేశ్వరుని నాటినుండి 11వ శతాబ్ది వరకునుగల కాలములోని తెలుగుదేశపు నృత్య-నాటక-సంగీత చరిత్ర మనకు నిర్దిష్టముగా తెలియదు. ఇది ఒక అజ్ఞాతయుగము వంటిది. కాని, అమరావతి, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములందు బయల్వెడలిన బౌద్ధశిల్పాదులుమాత్రము ఆంధ్రుల లలితకళలు నిరంతరముగా అభివృద్ధినందుచున్న వనుటకు తార్కాణములుగ నున్నవి.

ఆ శిల్పము లందలి నృత్యభంగిమలు, జంత్రవాద్యాదులు నాట్యశాస్త్రానుగుణములే యనుట ఆశ్చర్యమును కలిగింపగలదు. నాట్యశాస్త్రప్రోక్తమైన చతురస్రనాట్యశాలవంటిది నాగార్జున కొండ త్రవ్వకములలో బయలుపడినదని తెలియుచున్నది.

## చాళుక్యుల కాలము

చాళుక్య రాజులు వేదములవంటి పవిత్రవిద్యలనేకాక లౌకికవిద్యలను కూడ ఆదరించి ప్రోత్సహించియున్నారు. గుణగవిజయాదిత్యుడు (క్రీ. శ. 848_92) 'గాంధర్వ విద్యాప్రవీణ' బిరుదాంచితుడు: అతడు సౌందర్యపరాజితదేవాంగన యగు చెల్లవ్వకు అత్తిలిగ్రామములో కొంత భూదానము చేసెనని తెలియుచున్నది. ఈమెపట్టవర్ధని కులసంజాత. 'నట్టువరాంగ్రు అనెడి కలువలకు సూర్యకాంతి' గా ఈమెవర్ణితమైనది.[1] వేంగీరాజ్యపాలకుడును, కవిగాయక కల్ప తరు బిరుదాంచితుడును అగు రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945_70) చామెకాంబ యను జైన శ్రావకి ప్రోత్సాహముతో అర్హనందియను జైనాచార్యునకు 'కలుచుంబఱ్ఱు' గ్రామమును దానము చేసెను. ఈ చామెకాంబ అర్హనంది శిష్యురాలు, అమ్మరాజు ప్రియురాలు, పట్టవర్ధని వంశీయు రాలు, నృత్య కళలో మిన్న.[2]

'కుమార శ్రీకంఠు' డను నటుడు 'ఆర్యక్రీడ' అనెడి 7 అంకముల నాటకమును ప్రదర్శించినందులకు భూరిసన్మానము పొందినట్లు 10 వ శతాబ్ది శాసనమువలన తెలియుచున్నది. నానావిధ నాట్యశాలల పోషణమునకై భూవసతు లేర్పాటుచేయబడినట్లు రాజరాజుకాలోత్తుంగుని శాసనమువలన తెలియుచున్నది. ఆనాడు ఆంధ్ర, కర్ణాట సీమలలో పెక్కు దేవాలయములందు నాట్యమండపములు నిర్మితములైనట్లు శాసనముల వలన తెలియుచున్నది.

తెలుగుభాషలో లభించిన ప్రథమగ్రంథము నన్నయ రచించిన భారతము. ఈ భారతావ తారిక రూపకములందలి నాందీ ప్రస్తావనలను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడెనని విమర్శకులు నిరూపించియున్నారు.[3] రాజరాజు నన్నయతో "ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచితి" (ఆదిపర్వము_I_10) అని చెప్పియుండెను. ఇందువలన 'చూచిన' నాటకములు తెలుగు భాషలో ఉన్నను లేకపోయినను 'చూచిన' అను క్రియకు ప్రదర్శనము చూచుట అను అర్థమునే చెప్పుకొన్నచో నాటికి తెలుగుదేశమున నాటక ప్రదర్శనములు జరుగుచున్నవని యూహింపవచ్చును. గరుడోపాఖ్యానమున సముద్రవర్ణనము సంస్కృతమూలమందు క్రింది విధముగా కలదు__(ఆదిపర్వము_16 వ అధ్యా_9 శ్లో.)

"వేలాలోలానిలబలక్షోభ వేగసముత్థితైః।
వీచీ హస్తైః ప్రచలితై ర్నృత్యంత మివసర్వతః॥"

దీనిని నన్నయభట్టు క్రింది విధముగా అనువదించెను__"...... ఉద్యాన వనంబునుంబోలె బహు విద్రుమలతాలంకృతంబైన దాని, నాటక ప్రయోగంబునుంబోలె ఘన రస పాత్ర శోభిత రంగ రమ్యంబైనదాని, దివంబునుంబోలె ననిమిషవరోపశోభితంబైనదాని......" (ఆదిపర్వము_

II–27 వ వచనము). సంస్కృత మూలమందు నృత్యపదము మాత్రమే కలదు. కాని, నన్నయ్య మూలమందులేని రస–పాత్ర–రంగ–నాటక–ప్రయోగములనెడి పదములను వాడియుండెను. ఇది కేవలము లాక్షణికజ్ఞానముతో వ్రాయబడినదని యనుటకంటె రాజరాజుతోపాటు నన్నయ చక్కని నాటక ప్రయోగములను తప్పకచూచియే యుండునని యూహించుట అసమంజసము కానేరదు.

నన్నిచోడుని కుమారసంభవమందు కూడ నృత్య–సంగీతాదుల ప్రశంసలు చాల కలవు. ఓషధిప్రస్తపురమందు 'నట్టిరవులు' (నటుల స్థానములు—నాట్యశాలలు?) కలవట (7 వ ఆ. 121 ప). 9 వ ఆశ్వాసములో (37–38 ప.) రంభ నాట్యాభినయము విపులముగా వర్ణింపబడెను. అందే, తెరవెడలి వచ్చిన నటునితో మన్మథు డుపమింపబడుట గమనార్హము (46 ప.)—

"కామ చిహ్నాలు మెయి సురంగంబుగాఁగ
నెఱయఁగైసేసి జవనిక దెఱచి వచ్చు
చెలువుతో వచ్చి రతిమ్రోల నిలిచె మరుడు"

ఈ వర్ణన నాటి పాత్రప్రవేశపద్ధతిని సూచించుచున్నది.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో—

"స్తుతి మూలమగు స్తోత్ర సూత్రముల
శతకంబు శివతత్త్వసారంబు దీప
కళిక మహానాటకము నుదాహరణ
ములు ... ... ... ... ...
అరుదొంద చదువుచు నంకించువారు..." (పర్వతప్రకరణము. పుట 432)

అని పేర్కొనెను. ఇందలి శివతత్త్వసారము పండితారాధ్యునిది. మరి ఈ మహానాటక రచయిత ఎవ్వరో, దాని స్వరూపమెట్టిదో తెలియదు.

పాల్కురికి సోమనాథుని[4] బసవపురాణ–పండితారాధ్య చరిత్రములలో సంగీత–నృత్య–నాటకాదుల ప్రసంగములు పెక్కులు కలవు. బసవపురాణమున సంగయ్య కథలో (పుటలు 53–54) నృత్య విధానము వర్ణితమైనది—లంజెయికమనగా అదియును ఒక విధమగు లింగార్చన కాబోలునని తలచి ముగ్ధ సంగయ్య భక్తురాలైన ఒక గణిక ఇంటికేగినప్పుడు ఆమె చంద్రోదయానంతరము తనవిలాసినీజనులను రావించి నృత్యము చేయించిన సందర్భమిది. కంచి ఏకామ్రనాథుని గుడిలో నాట్యనిమిత్తండి తాండవమూర్తినిచూచి, ఏకామ్రనాథుడు రోగగ్రస్తుడైనాడని భావించి చికిత్సఘుచేసి, ఫలము కానక, శివుని ప్రార్థింప, ఆయన ప్రత్యక్షమై తాండవ స్వరూపమును వివరించెను. ఆ స్వరూపమును సోమన విపులముగా వర్ణించెను (పుటలు 59–60). సకలేశ్వరుమాదిరాజయ్య శివుని కొల్చిన సందర్భములో విపులముగా సంగీత శాస్త్రప్రశంస చేయబడెను. (పుటలు–78–79). ఒక సందర్భమున నాటకప్రశంస కూడ క్రింది విధముగా కలదు (పుట. 124)—

"కరమర్థి నూరూర సిరియాలుచరిత...
ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల

విస్తారముగజేసి వినుతించువారు
పటుగాక సాంగభాషాంగ క్రియాంగ
పటునాటకంబులనటియించువారు."

ఇంక పండితారాధ్య చరిత్రలో పైవర్ణనలు బహుళముగా కలవు. పర్వత ప్రకరణములో శివరాత్ర్యుత్సవ సమయమున జరిగెడి ఆటపాటల ననేకములను సోమన విపులముగా వర్ణించియుండెను. ఆ సందర్భమున భరతశాస్త్ర (నృత్య_సంగీత_వాద్యాది) ప్రశంస అత్యధికముగా చేయబడెను (పుటలు. 436_465). ఇట్లు నాటి నాటకప్రదర్శనములు, తదితర బహువిధ వినోద ప్రదర్శనములు మొదలగునవి అనగా__వివిధ నృత్యములు, కంబసూత్రముల బొమ్మలాట, చీరమరుగుల బొమ్మలాట, గారడీ వినోదము, గంధర్వయక్ష విద్యాధరాది వేషధారణము, బహురూపము, ఖండితగతి నాటకము, సాంగనాటకము మున్నగునవి అందు వివరింపబడెను.[5] వీనిని గూర్చి తరువాతి అధ్యాయములో వివరింతును. పండితారాధ్యచరిత్రము ఆనాటి లలితకళలలోని దేశి_మార్గ సంప్రదాయముల నెన్నింటినో ప్రతిబింబించెడి విజ్ఞాన సర్వస్వమన్నచో అతిశయోక్తి కాజాలదు.[6]

## కాకతీయుల కాలము

కాకతీయులు లలితకళలలో నృత్యమును, విగ్రహ శిల్పమును అత్యధికముగా ఆదరించినట్లు చరిత్రనుబట్టి తెలియుచున్నది. ప్రథమ ప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1158_1195) 'విద్యాభూషణ' బిరుదాంచితుడు; నీతిసారాది గ్రంథకర్త. పాలకురికి సోమనాథుడు ఈతని సమకాలికుడై యుండవచ్చును. కాకతీయ చక్రవర్తులందరిలోను గణపతిదేవుడు అన్నివిధముల శ్రేష్ఠుడు. అతడరువది సంవత్సరములకుపైగా (క్రీ. శ. 1199_1261) రాజ్యమును పాలించి దేశమును సుభిక్షమొనరించెను. ఈ కాలములో లలితకళలకు ఎనలేని ప్రోత్సాహము లభించినది; రాజులు, మహామాత్యులు, రాజబంధువులు స్వయముగా వివిధ కళావేత్తలగుట జరిగెను. ఈ కాలమున ముఖ్యముగా పేర్కొనదగిన వ్యక్తులిరువురు కలరు__అందులో ఒకరు తిక్కన; రెండవవారు జాయన.

**తిక్కన :**

తిక్కన సోమయాజి తన భారతరచనలో మూలములోలేని కొన్ని క్రొత్తభావములను చేర్చి తన నాటి సంప్రదాయములను సమయోచితముగా వ్యక్తముచేసి యుండెను. మూలమందు అర్జునుడు విరాటనృపతితో తన్నుగూర్చి క్రిందివిధముగా చెప్పుకొనెను (విరాట పర్వము_వావిళ్ళ ముద్రణము_పు. 1262)__

"గాయామి నృత్యామ్యథ వాదయామి భద్రోస్మినృత్యే కుశలోస్మి గీతే।
త్వముత్తరాయై ప్రదిశస్వ మాంస్వయం భవామి దేవ్యా నరదేవ నర్తకః" ॥

ఇంక తిక్కన పై శ్లోకమును తెనిగించిన విధము పరిశీలనార్హము (విరాట పర్వము-ప్ర. ఆ. 239-41 ప.)—

గీ. ఒండు పనులకు సెలవు లేకునికిఁ జేసి । యభ్యసించితి శైశవమాదిగాఁగ
దండలాసక విధమును గుండలియును । బ్రేంఖణంబు తెలుంగును బ్రేరణియును.

క. విశ్రుత వాద్యములను మం । జు శ్రుతి సంభావ్య గీత సుగతులు సద్భా
వాశ్రయములఁ దజ్జ్ఞస్మర । సాశ్రయములు నైన యభినయంబు లెఱుఁగుదున్.

గీ. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర
తావిహీనములైన పాత్రములనైన
నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు
నిపుణనైపథ్య విధులకు నేర్తు నధిప."

పై పద్యములందు ముఖ్యముగా గమనింపవలసినది దండలాసకాదిదేశి నృత్యభేదములు పేర్కొనబడుట. కీచకవధా ఘట్టమున మూలములో నర్తనశాల, నర్తనాగారము, నర్తనాగృహము, నర్తనాలయము అనెడి పదములు మాత్రమే ప్రయుక్తములైనవి. కాని తిక్కన నాట్యమండపము (2-274), నాట్యశాల (2-324, 279), నాట్యమందిరము (4-27), నృత్తశాల (3-4), నర్తనాగారము (2-325), నర్తన మండపము (3-44), సంగీత నిలయము (4-32), నర్తనశాల (పలుసార్లు) అను పదములను వాడియుండెను. ఈ ప్రయోగవైవిధ్యము నృత్యమున కానాడు గల ప్రచురప్రచారమును వ్యక్తముచేయుచున్నది.

కవిత్రయమును గూర్చి చెప్పునప్పుడు తిక్కన సోమయాజిది 'నాటకీయ శైలి' అనియు, అదియే ఉత్తమ కావ్యమార్గమనియు సాధారణముగా చెప్పుచుందురు. ఈసందర్భమున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి వాక్యములు పరిశీలనార్హములు—"తిక్కనార్యుని కథ సచలనంబై, పాత్రలు సచేతనంబులై మనలనంతగా నాకర్షించుటకుఁ గల కారణములలో ముఖ్యమైనవి రెండు. అతని మనోవృత్తి వివరణశక్తి, నాటక కళాచాతుర్యము.........ఎక్కడికక్కడ నాయాపాత్రల కృత్యములను, చేష్ట (action) లను పదములచే నతిస్వాభావికముగ వర్ణించి చూపుచుండుట చేతను తిక్కనార్యుడు తన రచనకు నాటకతాలక్షణ మబ్బునట్లు చేసినాడు" (ఆంధ్ర భారత కవితా విమర్శనము-పుటలు 396-397; 413-427). శ్రీ కోరాడవారి వాక్యములు తిక్కనార్యుని నాటకీయ శైలిని గూర్చి ఆయా విమర్శకులు చెప్పెడి అభిప్రాయములను ప్రతిబింబించుచున్నవని చెప్పవచ్చును. వారు విరాటపర్వమును ఒక నాటకముగా పరిగ్రహించి సంధ్యాదులను కూడ నిరూపించి యున్నారు (పుటలు-425-27). శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు ఉద్యోగపర్వమందలి శ్రీ కృష్ణరాయబారమును 'రసవత్తరమగు నేకాంకిక'గా నిరూపించియున్నారు—"... వివిధ చిత్తవృత్తులఁ బ్రదర్శించు నీ సన్నివేశమును (శ్రీ కృష్ణ రాయబారమును) రసవత్తరమగు నేకాంకిక యనవచ్చును. ఎన్నఁడులేని శాంతినిఁ బ్రదర్శించు భీముని పల్కులను విని, కృష్ణుఁడు చిఱునవ్వుతో నతని రెచ్చఁగొట్టి మేలమాడుటయు నతఁడందులకు 'ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై......' అని సరసంబాడుటయు, నిట్టి నాటకోచితములగు సంభాషణ లెన్నియో

యిందుఁ జూడవచ్చును (పుటలు 61–62)...... ఇట్లు భాషయు, నితివృత్తమును జీవితమున కత్యంతము సన్నిహితము లగుటయు, సన్నివేశములు నాటకోచిత విధానమునఁ బోషితములై యుండుటయుఁ గారణములుగ నుద్యోగపర్వరచన విశిష్టమై యున్నది. "(పుట. 67— "భారతము ; తిక్కన రచన").

## కావ్యమందు నాటకీయత :

కొందరు పై విధముగా తిక్కనను ప్రశంసించు చుండగా మరికొందరు 'కావ్యమందు నాటకీయత యేమి?' అనియు, "అసలు తిక్కనకు పద్యరచనయే తెలియదు" అనియు విమర్శించు చున్నారు. ఈ వాదము పాక్షికమనియు, నవిమర్శకము కాదనియు చెప్పనగును.

దృశ్యకావ్యమును శ్రవ్యకావ్యమునుండి వేరుచేసెడి గుణములలో ప్రధానమైనది సంవాదశైలి; అనగా రచనలలో కవి తానుగా (వ్యక్తిత్వము) కన్పట్టకుండుట. ఇంక రెండవ గుణము సన్నివేశముల కూర్పులోని విశిష్టత. మూడవది కథాగమనములోని వేగము. నాలుగవది ప్రదర్శనార్హత.

ఇచ్చట 'సంవాద' మనగా ఇరువురు కూర్చుండి మాటాడుకొను 'పిచ్చాపాటీ' కాదు; ప్రశ్నోత్తర మాలికకాదు; వాదోపవాదము కాదు; ఇరువురు స్నేహితులు కలియునప్పటి ముచ్చట్లు (Conversation) కావు. ఒక జిగిగల సన్నివేశములో వివిధ మనోవృత్తులకు లోనైన వ్యక్తులు సన్నివేశవశమున (కథా గమనానుకూలముగ) చేసెడి సంభాషణయే నాటకీయ సంవాద మనిపించుకొనును. సన్నివేశముల కూర్పులో విశిష్టత శ్రవ్యకావ్యమందును అచ్చటచ్చట కన్పట్టవచ్చును; కాని దృశ్యకావ్యమందే దానికి అగ్రస్థానము. శ్రవ్యకావ్యము, నవలమొదలగు వాని యందలి కథ చాలతాపీగా సాగును. వర్ణనలు వచ్చినచోట ఇంకచెప్పనక్కఱయేలేదు. కాని దృశ్యకావ్యమందు సంక్షిప్తత, వేగము ప్రధానములు. ప్రదర్శనార్హత యనగా రంగస్థలము మీద ప్రదర్శించుట కనువుగా నుండుట; ప్రదర్శించినచో రక్తికట్టుట. ఈ గుణములబలముచేత శ్రవ్యకావ్యమందు స్పష్టముగా రూపుకట్టని పాత్రలు దృశ్యకావ్యమందు చైతన్యవంతములై మనకనులయెదుట నడయాడుచున్నట్లుండును. ఈ గుణములకుతోడు నటుడు భూమికాధారణము చేయుట అనునది దృశ్యకావ్యముల విషయమందధికముగా కలదు; అది ఈ శాఖకు పరాకాష్ఠ. ఇది కాక, తిక్కన పైనాలుగు గుణములను కవి తన కావ్యమందు సమర్థముగా చొప్పింపగలిగినచో ఆ రచన నాటకీయముగా ఉన్నదనుట అత్యంతము సమర్థనీయము కాగలదు. అనగా అందు అలతి అలతి మార్పులు చేసికొన్నచో నటులు భూమికాధారణముచేసి ప్రదర్శించుటకు అనువుగా ఆ రచన ఉండవలెనన్నమాట.

ఇచ్చట ఇంకొక విషయమును కూడ గమనింపవలసి యున్నది. దృశ్యకావ్యము ప్రదర్శనప్రధానమగుటచేత దాని శైలి కావ్యశైలికంటె అనగా కథాకథనశైలికంటె భిన్నముగా నుండక తప్పదు. అనగా కావ్యశైలిలో ఉన్నంత నిబిడత్వము ఈ శైలిలో ఆవశ్యకముకాదు. వాక్యములందలి ఎత్తుగడలు, విరుపులు మొదలగునవి మామూలుగా సంస్కారులైన శిష్టులు మొదలగువారు మాటాడుకొనునప్పుడు ఎట్లుండునో అట్లే ఉండినచో మఱింత రమణీయముగా

నుండును. మహాకవుల కావ్యముల శైలికిని రూపకముల శైలికిని ఇట్టి భేదమే కన్పట్టగలదు. కావున కావ్యశైలి ఎక్కువ జిగి కలిగి కథనాత్మకము కాగా, నాటకీయ శైలి సంవాదాత్మకమై, అలవోకగా మాటాడుకొను మాటలవలెనుండును. తిక్కన తన భారతరచనలో సరిగా ఇట్టి శైలినే అవలంబించినాడు. నన్నయ కథనాత్మకకావ్య శైలికిని, తిక్కన నాటకీయ సంవాద శైలికిని భేదము కన్పట్టుచుండుట కిదియే కారణము.

ఇట్టి నాటకీయశైలి ఇంతకు పూర్వము నన్నిచోడాదులందుకూడ కన్పట్ట గలదు.[1] కాని అందు, అది క్వాచిత్కము. ఇంక తిక్కన రచనకు అదియే జీవగఱ్ఱ. ఇట్లు కథాకథనము ప్రధానమైన భారతమందు, పూర్వపద్ధతిని విడనాడి, నాటకీయ శైలిన్ని నిండించిన తిక్కన తెలుగు సాహిత్యములో ఒక క్రొత్త మార్గమునకు దారి చూపినవాడయ్యెను.

**జాయప సేనాపతి :**

గణపతిదేవుని మంత్రియగు గుండామాత్యుడు నృత్యశాస్త్రవేత్తయట. గణపతిదేవుడు తనకు బావమరదియును, అభిమానపాత్రుడును అయిన జాయనను గుండామాత్యునకు శిష్యునిగా అప్పగించెను. సుమారు పదేండ్లపాటు గుండామాత్యుని శుశ్రూషచేసి జాయన నృత్యవిద్యా పారంగతు డయ్యెను. గణపతిదేవుడు జాయనను మెచ్చి, వానికి ఆందోళికాతపత్రాది గౌరవ ములను ప్రసాదించి, గజ సైన్యాధిపతిని కావించి, క్రీ.శ. 1213 లో 'తామ్రపురి'ని (గుంటూరు జిల్లాలోని చేబ్రోలును) పరిపాలింప నిచ్చెను.[2]

వరంగల్లు జిల్లా పాలంపేటలోని రామప్ప దేవాలయము అధిక శిల్పకళా సమన్వితమై ఒప్పుచున్నది. ఇది రుద్రేశ్వరుని ఆలయము. గణపతిదేవుని సేనానియును, మంత్రియును అగు రేచర్ల రుద్రదేవుడు క్రీ. శ. 1213 లోనే ఈ దేవాలయమును కట్టించుట గమనార్హము. ఇందలి ప్రతిభాగమును ఒక అపరూప శిల్పకళాఖండము. కాకతీయుల నృత్యకళాభిమానమున కిది పరాకాష్ఠ.ఈనృత్య శిల్పములను తీర్చిదిద్దుటలో జాయన సహాయసహకారములు ఉండియుండును.

అటుపిమ్మట గణపతిదేవుని కోరిక ననుసరించి జాయప సేనాని క్రీ. శ. 1253_54 లో 'నృత్తరత్నావళి' యనెడి ఎనిమిది అధ్యాయముల ఉత్తమ నృత్యశాస్త్ర గ్రంథమును రచించెను. ఇందు మార్గ నృత్యసంప్రదాయమే కాక ఆ కాలమున తెలుగు దేశములో బహుళ ప్రచారమం దున్న దేశి నృత్త - నృత్య పద్ధతులు___పేరణి, ప్రేంఖణము, చర్చరి, రాసకము, నాట్య రాసకము, దండరాసకము, శివప్రియము, కందుకము, భాండికము, చరణము, ఘటిసరి, బహురూపము, చిందు, కోలాటము మొదలగునవి ఎన్నియో వర్ణింపబడెను. తిక్కన సోమ యాజి, మూలమందు లేకపోయినను, బృహన్నల నేర్చిన దంతయును దేశినృత్యమనియే పేర్కొని యుండుట స్మరణార్హము. పాల్కురికి సోమనాథుడు కూడ దేశీ నృత్య భేదములను పేర్కొని యుండుట గుర్తించి యున్నాము. వీరిరువురును జాయనకు సన్నిహిత కాలములోని వారే. నృత్తరత్నావళి 5 వ అధ్యాయములో "స చాస్మాభిః స్ఫుటం గీత రత్నావళ్యాం ప్రపం చితః" అని చెప్పబడి యుండుటచేత జాయన 'గీత రత్నావళి'ని కూడ రచించినట్లు తెలియు చున్నది; కాని అది లభింపలేదు.

**విద్యానాథాదులు :**

రెండవ ప్రతాపరుద్రుని కాలములో (క్రీ. శ. 1290_1323) విద్యానాథుడు[3] ప్రతాపరుద్ర యశోభూషణ మనెడి ఉత్తమలక్షణ గ్రంథమును రచించెను. సంస్కృతమున నాటక లక్షణమును చెప్పిన ప్రథమాంధ్రాలంకారికు డితడే. విద్యానాథుడు తాను చెప్పిన నాటక లక్షణమునకు ఉదాహరణముగా "ప్రతాపరుద్రకల్యాణ" మనెడి సమగ్రాంగమగు నాటకమును రచించెను. అందు ప్రస్తావనలో సూత్రధారుడు "...శ్రీ స్వయంభూదేవుని మహోత్సవమునకు విచ్చేసిన ఓ విద్వాంసులారా ! నాట్యవేదాచార్యుడగు కులార్ణవుని కుమారుడను, 'అభినయ దర్పణ' బిరుదాంచితుడను అగు నన్ను మీకభిమతమగు నొకరూపకమును ప్రయోగింప నియోగించి యనుగ్రహింపుడు" అని పారిషదులనర్థించెను. ఇందు చెప్పబడిన కులార్ణవుడును, వాని కుమారుడగు 'అభినయదర్పణ' బిరుదాంచితుడును కల్పితవ్యక్తులని తలంచుట కంటె వారు ప్రతాపరుద్రాదులవలె చారిత్రకపురుషులే అనియు, ప్రతాపరుద్రుని యాస్థానమున నటశేఖరులనియు తలంచుట సమంజసము. "విద్యానాథ కవీంద్రుఁడు తన నాటివరకును వెలసిన ప్రాచీనాచార్యుల సాహిత్య సిద్ధాంతముల సారమునెల్ల నేకముఖముగ నొనర్చి తన గ్రంథమున 'కలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహ' మను నభిధేయము నన్వర్థమొనరించి, సాహిత్య పిపాసువులకు మహోపకారము చేసెను. ప్రధానవిషయముల విస్మరింపకయును, అనపేక్షితములను జెప్పకయు లలిత సరణిని నిర్మించిన యాకృతి సాహిత్యోద్యానమునకు ఘంటాపథమై వెలయుచున్నది" అని విద్యానాథుని గూర్చి శ్రీ ఈయుణ్ణి వీరవేంకట రాఘవాచార్యులుగారు చేసిన ప్రశంస ఎంతయును సమంజసము.[4] ప్రతాపరుద్రయశోభూషణము ఆసేతుహిమాచల పర్యంతమును పఠన_పాఠన వ్యవహారప్రసిద్ధి నందియున్నది. ఇది ఆంధ్రులకు గర్వకారణము. దీనికి వ్యాఖ్యలు రచించిన కుమారస్వామి సోమపీథియును (మల్లినాథసూరి పుత్రుడు), చిలకమర్తి చిన తిరుమలాచార్యులును (18 వ శతాబ్ది) కూడ ఆంధ్రులే.

ప్రతాపరుద్రయశోభూషణ కృతిభర్తయగు రెండవ ప్రతాపరుద్రుడు 'ఉషారాగోదయము' అనెడినాటికను, 'యయాతి చరితము' అనెడి ఏడంకముల నాటకమును సంస్కృతమున రచించెను. యయాతిచరితము ఒకానొకవసంతోత్సవసమయములో ప్రదర్శింపబడెనట.

అగస్త్యవిద్యానాథుని మేనల్లుడగు గంగాధరుడు మహాభారతమును నాటకీకరించెనట. (గంగాదేవి మధురావిజయము_I_15 ప.). కుముదినీచంద్రుల వివాహమును వర్ణించుచు 'చంద్రవిలాసము' అనెడి రూపకమును, రాఘవాభ్యుదయ మనెడి ఇంకొక రూపకమును గంగాధరకవియే రచించినట్లు కన్పట్టుచున్నది (C. C. II_36). నరసింహ_విశ్వనాథు లిరువురును గంగాధరకవి పుత్రులు. విశ్వనాథుడు వరంగల్లు ఆస్థానపండితుల ఆహ్లాదనార్థము "సౌగంధికాపహరణ" మనెడి వ్యాయోగమును రచించెను. ఇది ముద్రితము. ఇందలి సంభాషణలు చాల పటువులై చురుకుగా సాగినవి. గంగాదేవి ఈ విశ్వనాథుని శిష్యురాలు. ఇంక నరసింహుడు "కాదంబరీకల్యాణము" అను పేర కాదంబరి కథను 8 అంకములుగా నాటకీకరించెను (T. C. III_3489).

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని ఒక నాట్యశాస్త్ర గ్రంథములో క్రింది శ్లోకము కలదు.

"ఇతీవ కథయామాస వీరభల్లాటదేశికః ।
ప్రతాపరుద్రదేవస్య సన్నిధౌ సర్వశాస్త్రవిత్ ॥"

దీనినిబట్టి ప్రతాపరుద్రదేవుని సన్నిధిలో సర్వశాస్త్రవిదుడైన వీరభల్లాటదేశికు డేదో ప్రసంగించెనని తెలియుచున్నది. వీరభల్లాటదేశికుడు 'నాట్యశేఖర' మనెడి లక్షణ గ్రంథమును రచించినట్లు శృంగారశేఖరుడు అభినయభూషణములో పేర్కొనెను (అది లభ్యము కాలేదు). కావున దేశికుడు నాట్యశాస్త్రవేత్తఅయి యుండుననుటకెట్టి సందియమును ఉండరాదనియు, ప్రతాపరుద్రదేవుని సన్నిధిలో దేశికుడు 'నాట్యసిద్ధాంత నిర్ణయము' చేసియుండుననియు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారూహించినారు.[5] దీనినిబట్టి నాడు కాకతీయ రాజాస్థానములందు సాహిత్యగోష్ఠులతోపాటు నాట్యసిద్ధాంత చర్చలు కూడ జరుగుచుండెడివని తలంచుట అసమంజసము కానేరదు.

ఈ కాలములోనే రావిపాటి త్రిపురాంతకుడను నాతడు 'ప్రేమాభిరామ'మనెడి సంస్కృత రూపకమును రచించెను. అది అలభ్యము. కాని, తాను త్రిపురాంతకుని 'ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగు బాస' రచించితినని వల్లభరాయుడు చెప్పుకొనుటనుబట్టి లభ్యమైన క్రీడాభిరామమందలి పెక్కు విషయములు ప్రేమాభిరామములోనివే అయియుండునని చెప్పవచ్చును. కాగా, అందు రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటి వరంగల్లు వర్ణితమైనదని నమ్మవచ్చును.

వరంగల్లులోని వేశ్యవాటిలో మాచల్దేవియనెడు వారాంగన కలదట. ఆమె "సర్వజగత్ప్రసిద్ధ, సుమనోబాణాసనామ్నాయవిద్యోపాధ్యాయి, ప్రతాపరుద్ర ధరణీశోపాత్తగోష్ఠీ ప్రతిష్ఠాపారీణ." ఆమెనుగూర్చి కథానాయకుడగు గోవింద మంచనశర్మ క్రిందివిధముగా పేర్కొనెను:

''లెస్స గాక కిరాట ! యీలేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁ బోదమా యీనెపమున
నరసిచూతము మనకేమి యచట ?..'.....''

దీనినిబట్టి మాచల్దేవిని గూర్చిన కథలు ఆమె జీవితకాలమందే నాటకములుగా నాడబడుచుండెనని తెలియుచున్నది. ఈమెను గూర్చి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రింది విధముగా వ్రాసియున్నారు:[6] ''మాచల్దేవి ప్రతాపరుద్రదేవుని 'గోష్ఠీప్రతిష్ఠా పారీణ' యనియె కలదు కాని, 'యుంపుడుకత్తె' యని స్పష్టోక్తి లేదు. ప్రతాపరుద్రదేవుడు తౌర్యత్రికప్రియుఁడు. ఆయన యాస్థానమునఁ బలువురు నృత్త గీత వాద్యనిపుణులుండెడివారు. మాచల్దేవి తద్గోష్ఠిలో గొప్ప ప్రతిష్ఠనందినది గావచ్చును. ప్రతాపరుద్రనృపసార్వభౌముని నాళ్ళలో నేకశిలానగరమున మహైశ్వర్య సంపన్నురాలై మాచల్దేవియనివేశ్య నిజముగానున్నదో లేదో కాని మన శ్రీనాథకవి సార్వభౌముని నాళ్ళలో బెజవాడనగరమున మహైశ్వర్య సంపన్నురాలై 'మాచల్దేవి' యని వేశ్య యొక్కర్తె గలదు. ఆమె క్రీ. శ. 1437 ప్రాంతముల బెజవాడ పాపవినాశనదేవరకును, రుద్ర

పాదములకును బహుగ్రామములందుఁ దనకుఁ జెల్లివచ్చుచున్న భూములనెన్నింటినో ధర్మము చేసినది.[7] ఈ విషయమునుజెప్పు బెజవాడ శిలాశాసనమున నామె నృత్యము చేయుచున్నట్టు విగ్రహచిత్రము గూడఁ గలదు. ఆమె భాగ్యసంపన్నురాలు, ప్రఖ్యాత నర్తకి, విజయవాటీ నివాసిని, కావున నిట్టియామెను శ్రీనాథ కవిసార్వభౌముఁ డెఱిఁగుండును.''

ఈ మాచల్దేవి రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటిదైనను శ్రీనాథుని కాలము నాటిదైనను ప్రఖ్యాత నర్తకియనుట నిర్వివాదాంశము. ఇందు ఈమెయే కాక గాంధర్వి, ఆమెకుమార్తె మదనరేఖ, కామమంజరి (పునర్భువు), మధుమాపతి, ఆమె చెల్లెలు మదాలస, చిన్నిపోతి (దక్షారామవేశ్య) అను వేశ్యలు కూడవర్ణితులైరి. మఱి వీరును నర్తకులై యుండవచ్చును. మఱియు నిందు వీరకథలను చెప్పెడి స్త్రీ, ఆమె కథ చెప్పునప్పుడు శ్రోతలలో కలుగు వీరావేశాదులు, బవనీలవాద్యగాన విశిష్టత, జక్కుల పురంధ్రిపాట, అక్కదేవతల నృత్యము, మైలార భటుల వీరచేష్టితములు, వారి గొండ్లియాట, గొరగపడుచు మూర్ధాభినయము, విద్దికంచి రామాయణ గానము, తూర్పునాటి గడీని చిందులు, సూర్యాస్తమయ సమయములందు వేశ్యావాటమున మందిరోద్యాన వీథులందు పల్లవాధరలు చేయు పుష్పగంధికా నృత్యములు, మందిర ప్రాంగణంబున వారాంగనాజనులు చేయు లాస్యాభినయములు మొదలగునవి కూడ వర్ణితములై యుండుట గమనార్హము.

క్రీడాభిరామము తెలుగులోని తొలిరూపకము. దీనిని గూర్చి మరల వివరింతును.

క్రీ. శ. 1300 ప్రాంతమువాడగు వెన్నెలకంటి అన్నయ తన 'షోడశకుమార చరితము' ను తండ్రియగు సూరామాత్యున కంకితమొనర్చుచు వానిని ''నాటకముఖకోహళాది నాట్య రహస్యోద్ఘాటన నిపుణప్రజ్ఞాపాటవచాతుర్య నూత్నభరతాచార్యా''[8] అని ప్రశంసించుట గమనార్హము. ఆయాకావ్యములందు నాటి ప్రసిద్ధవ్యక్తులను గూర్చి ఇట్టి వర్ణనలనేకములు మనకు గోచరించుచునే యుండును.

'భావప్రకాశన' మనెడి ఉత్తమ నాట్యశాస్త్ర గ్రంథమును రచించిన శారదాతనయుడు (క్రీ. శ. 1175-1250) ఈ కాలపువాడే. ఇతడు చెంగల్పట్టు జిల్లావాడని విమర్శకుల యభిప్రాయము.[9] అట్టియెడ దక్షిణదేశమందు స్థిరపడిన ఆంధ్రుడైనను కావచ్చును. ఇది కేవలము ఊహగానమేకాదు; అభినయదర్పణపు ప్రతులన్నియును తెలుగు లిపిలోనే ఉండుటయు, పెదకోమటి వేమభూపాలుని 'సంగీతచింతామణి' వ్రాతప్రతి తిరువనంతపురము నందలి ప్రాసాద గ్రంథాలయములో నుండుటయు, రాజపుత్ర రాజైన కుంభకర్ణుడు తన సంగీతరాజ రచనలో నృత్తరత్నావళి నుపయోగించు కొనుటయు పరిశీలించి చూడగా నృత్య-నాట్య-సంగీత సాంప్రదాయిక విజ్ఞానమునకు తెలుగువారే, తెలుగుదేశమే పట్టుగొమ్మలనుట స్పష్టము కాగలదు.

శారదాతనయుడు శారదావరప్రసాద సంజనితుడు. పితృసన్నిధిని వేదవేదాంగములందు పారగుడైనవాడు. శారదోపాసకుడు. గ్రథారంభమునందాతడు చెప్పుకొనిన దానినిబట్టి ఆనాడు నాటకప్రయోగములు బహుళప్రచారమునందున్నవనియు, ముప్పది రకముల రూపక ప్రయో

గములను శారదాతనడుయు చూచెననియు, దివాకరుడను ద్విజుడు 'నాటకశాల'కు అధిపతిఅనియు, అతడు వివిధనాట్యార్థవేది అనియు, నాడు ద్విజులు రూపక ప్రయోగములందు పాల్గొనుచుండి రనియు తెలియుచున్నది. "ముప్పది రకరకముల రూపక ప్రదర్శనములను చూచితి" నని ఆతడు చెప్పుకొనుటయే కాక ఆతడు భావప్రకాశనమందు ముప్పది రూపకములనే (10 రూపకములు + 20 ఉపరూపకములు) వివరించి యుండుట గమనార్హము. దివాకరుని నాట్యశాల తాత్కాలిక నిర్మాణము కాక చక్కని కట్టడమైయుండు ననియు, పురప్రజలకు కూడ అందు ప్రవేశము కలదనియు ఊహించుట కవకాశము కలదు.

13 వ శతాబ్దిమధ్య భాగమునకు చెందిన నాచన సోముని ఉత్తరహరివంశములో కూడ తిక్కన సోమయాజి నాటకప్రక్రియలు కన్పట్టును. ఊర్వశీనరక సంవాదఘట్టము, హంస డిభకోపాఖ్యానము నందలి రాయబారఘట్టము మొదలగునవి ఇందులకు ఉదాహరణములు. నాచన సోముడు నాటకము, సంగీతము, నృత్తము, రంగస్థలము, కీలుబొమ్మలాట, తోలుబొమ్మలాట మొదలగు వానిని గూర్చి సందర్భోచితముగా, భంగ్యంతరముగా వర్ణించి యుండెను. ఇందు చాలవరకు మూలమగు హరివంశమందు లేని వగుట గమనార్హము.

నాచన సోముడు బుక్క, హరిహరుల పోషణములో 'నాట్యచూడామణి'ని రచించి కోలారు దగ్గరకొన్ని గ్రామములను దానముగా పొందెనట.[10] ఈ గ్రంథము లభ్యముకాలేదు.

"ఆడుచు పొతకమూరన్నలుజోల। పాడఁగ నాఁడెల్ల పసిబిడ్డనైతి" అని వేంకటేశ్వరుడు అన్నమయ్యతో చెప్పినట్లుగా అన్నమాచార్య చరిత్రలో కలదు. పొతకమూరన్నలనే పొతకమూరు భాగవతులందురు. వీరు ఆరుగురన్నదమ్ములు—నారాయణయ్య, ఓబళయ్య, అచ్యుతయ్య, అనంతయ్య, లక్ష్మయ్య, శ్రీ చెన్నయ్య. వీరు నాట్యవినోదులు. అహోబలక్షేత్రమున పటముపన్నించి శ్రీ యోబళేశ్వరుని పటము చాటున నాట్యమాడించెడివారట.[11] వీరిది కేవలము పూజా నృత్యము. సింహాచల క్షేత్రములోని సంకీర్తనాచార్యుడగు కృష్ణమాచార్యుల యెదుట సింహాచలేశ్వరుడు బాలుడై ఆడెడివాడట. ఆ మాహాత్మ్యమునువిని, పొతకమూరన్నలు కృష్ణమాచార్యుని సందర్శింప సింహాచలమునకు విచ్చేసి, ఆయనను[12] సందర్శించిరి.

## రెడ్డిరాజుల కాలము

క్రీ శ. 1323 లో రెండవ ప్రతాపరుద్రుడు మహమ్మదీయులకు చిక్కుటతో కాకతీయ సామ్రాజ్యము ఛిన్నాభిన్నమైనది. సామంతులు స్వతంత్రులగుటకు ప్రయత్నించిరి. ఆ సమయములో రాచకొండ, దేవరకొండలలో పద్మనాయక వెలమలు, విజయనగరములో హరిహర దేవరాయాదులు, కొండవీడులో పంటరెడ్లు, కోరుకొండలో మంచికొండ నాయకులు, పిఠాపురములో కొప్పులవారు స్వతంత్రులైనారు. వీరందరును సంగీత-సాహిత్య-నృత్యాది కళా ప్రియులు. అనేకకవిపండితులను పోషించినవారు; కొందరు స్వయముగా కవి-పండితులై ఉత్తమగ్రంథరచనలు చేసియున్నారు.[1]

సురభి వంశమునకు చెందిన ప్రతాప వీరగంగరాజు షట్కళావంతుడనియు, సంగీతజ్ఞుడనియు కీర్తింపబడెను (S. I. I.-Vol. VI-No. 725). పొత్తపితాల వంశమునకు చెందిన కృష్ణదేవుడు 'సంగీతాంభోధిచంద్రస్సకలగుణనిధిః' అని ప్రశంసింపబడెను (S. I. I. Vol. VI-No. 780). కావ్యాలంకారచూడామణి కృతిభర్తయగు చాళుక్య విశ్వేశ్వరుడు 'సంగీత సాహిత్య సరణి' నేర్చినవాడట (కావ్యా. చూ. I-9). పై ముమ్వురిలో మొదటివా రిర్వురును 14 వ శతాబ్దివారు; విశ్వేశ్వరుడు 15 వ శతాబ్దివాడు. మొదటి దేవరాయలు 'సంగీత రత్నాకరుడు'గా కీర్తింపబడెను. (పెగళ్ళపాడు దానశాసనము-1391 A. D.). రాజమహేంద్రవర పాలకుడగు వీరభద్రారెడ్డి సంగీతజ్ఞానమును శ్రీనాథు డధికముగా పొగడెను. అతడు 'సాహిత్య కళా సంగీత లక్ష్యలక్షణభంగిసర్వజ్ఞు' డట. (కాశీఖండము-V. 338). భైరవకవి (1450 ప్రాంతములు) శ్రీరంగమాహాత్మ్య కృతిపతియగు నాగనాథుడు 'వీణాది సంగీతకళా విలోలుడట' (శ్రీరంగమాహాత్మ్యము-II-440). కోరుకొండ పాలకుడగు సింగయ నాయకుడు (క్రీ.శ. 1400 ప్రాంతములు) వీణావాదన నిపుణులును, నృత్యకళా పారగులును అయిన స్త్రీలతో వినోదించుచుండెడివాడట (Ep. Ind -Vol. XII-P.266-Verse 39.). మంచన కేయూర బాహుచరిత్ర కృతిపతియగు నండూరి గుండయామాత్యుడు (1300 ప్రాంతములు) 'కళా విజ్ఞాత సంగీత విద్యా భరతుడ'ట (కేయూరబాహు చరిత్రము-III-348). ఇట్టివారింకను చాల మంది కలరు.

రెడ్డిరాజుల యుగములో ఇంచుమించుగా ప్రథమాంధ్రకవి ఎఱ్ఱాప్రెగ్గడ. ఇతడు తన హరివంశమును ప్రోలయ వేమారెడ్డికి (క్రీ. శ. 1324-53) అంకితము చేసెను. ఎఱ్ఱన ఇంకొక కృతియగు నృసింహపురాణములో నృత్య సంగీతములకు సంబంధించిన పెక్కు ప్రసంగములు కలవు.[2] ఒక ఉదాహరణము (III-78.)

"సురుచిర తారకాకుసుమశోభి నభోంగణ భూమిఁగాలమ
న్గురువపు సూత్రధారి జతనంబున దిక్పతి కోటిముందటన్
సరసముగా నటింపఁగ నిశాసతికెత్తిన క్రొత్తతోఁపుఁబెం
దెరయన నొప్పె సాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్."

ఇచ్చటి సందర్భము సూర్యాస్తమయ వర్ణనము. 'నర్తకి రాకముందు తెరపట్టుట' అనునది కూచి పూడివారి భామవేషమును జ్ఞప్తికి తేగలదు. ఆ తెర ఎఱ్ఱనిదట.[3] ఈ విధముగా అష్టాదశ వర్ణనలను చేయునప్పుడు నృత్య-నాటక-రంగస్థలాదుల ప్రశంసలను పెక్కురు కవులు చేసియున్నారు. ఆ వర్ణన లన్నింటిని కవిసమయములనియు, గతానుగతికములనియు త్రోసిపుచ్చుట సమంజసముకాదు. అవి చాల వరకు నాటి స్థితికి ప్రతిబింబములే. ఇట్లే రాజులకీర్తిని వర్ణించుట లోను, మలయమారుతాది వర్ణనలలోను ముఖ్యముగా హల్లీసాదిదేశి నృత్యభేదములు ప్రసక్తము లగుటయు గమనార్హము.

రెడ్డి యుగములో సుప్రసిద్ధుడైన తెలుగు కవి శ్రీనాథుడు. ఇతడు పెదకోమటి వేముని (క్రీ. శ. 1402-1420) రాజ్యకాలములో 'విద్యాధికారి'; కవిసార్వభౌమ బిరుదాంచితుడు.

శ్రీనాథుని రచనలలో నృత్య - సంగీతముల ప్రసక్తి అధికముగా గలదు. తాను "సంగీత సాహిత్య చాతుర్య కవిత చెప్పనేర్చిన వాడ"నని పలనాటి వీరచరిత్ర ప్రారంభములో చెప్పు కొనెను. సింగామాత్యుని కొలువులో 'భరత మతంగ దత్తిల కోహ లాంజనేయ ప్రణీత సంగీత విద్యారహస్య విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతులగు కళావంతులు' కలరట (శృం. నై. I-11). నలదమయంతుల గృహప్రవేశ సమయమున అంగనలు బయకారు[4] లొనర్చినట్టి 'ప్రావేశిక మంగళధ్రువ'లను పాడిరట (శృం. నై. VII-146). ఈ పద్యమునకు సంస్కృతమూలము లేకపోవుట గమనార్హము. ప్రావేశికధ్రువాగాన ప్రసక్తి హరవిలాసమందుకూడ కలదు. VI-9). మరియు చర్చరీ గీతులను (భీ. పు. V-103), ధవళప్రబంధ గీతకములను (శివ రాత్రి మాహాత్మ్యము-II-58), మంద్రక మహాప్రబంధములను (కాశీఖండము-II-37) ఆయా సందర్భములందు స్త్రీలు పాడినట్లు కలదు. పలనాటి వీరచరిత్రలో గాయనులు జంత్రగాత్రముల 'ఎండినచెట్లు చిగురించునట్లు'గా పాడిన విధము వర్ణితమైనది (పుటలు 17-18).

"కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని శ్రీనాథుడు భీమేశ్వరపురాణమందు (III-65) పేర్కొనుట ప్రత్యేకముగా గమనార్హము. 'యక్షగాన' మనెడి సమస్తపదమును వాడిన ప్రథముడు శ్రీనాథుడు. యక్షగానములను గూర్చి తరువాత వివరింతును.

శ్రీనాథుని గ్రంథములలో నృత్య ప్రసంగములుకూడ పెక్కులు కలవు. పంటమహీశుల నగరులలో అచ్చముగా ఆనాడు జరిగెడి శివపూజాసమయ నృత్యము కాశీఖండమందు వర్ణితమైనది (I-56). ప్రమోదనృత్త ప్రశంస రెండుసార్లు వచ్చినది (శి. రా. మ. I-64; కా. ఖం. II-37). శనివారోత్సవ వేళల దేశిమార్గముల జరిగెడి గంధర్వాప్సరోనృత్తములు కాశీఖండమందు వర్ణితములైనవి (III-19). వాల్మీకి 'చాక్షుషంబైన యోగంబున (నృత్య విద్య చేత) విరూపాక్షుని యజించిన విధము కాశీఖండమందును (VI-40 వచనము), రాజ దర్బారు లోని నృత్యము పలనాటి వీరచరిత్రయందును (పుటలు 17-19) విపులముగా వర్ణితములైనవి. ఇట్టి వర్ణనలింకను కన్పట్టగలవు.

బెండపూఁడన్నయామాత్యుడు కట్టించిన మొగసాల వాకిట మహోత్సవ మండపంబు నందు పేరోలగంబుండి భీమేశ్వరుండు 'కుండలీ దండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధు కందుక ధుమాళి చేల మతల్లీ హల్లీసకాది నృత్యంబు లవలోకించుచు...చంపూ చాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాది ప్రబంధంబులాకర్ణించుచు, వేణు వీణా మృదంగ కాంస్య కాహళ పటహ ఢక్కా హుడుక్కా నక ఝల్లరీ హృద్యవాద్యానుషంగంబు లాదరించుచు, సంగీత భంగీతరంగంబు లంగీకరించుచు...నిఖిలలోక రక్షణార్థంబుగా వివిధ విద్యాకలాపంబుల వినోదించుచుండు"నని భీమేశ్వరపురాణ ప్రారంభములో శ్రీనాథుడు వర్ణించెను (I-118). నిజముగా భీమేశ్వరుడే వినోదించెనో లేదో కాని, ఇది మాత్రము రెడ్డిరాజుల ఆస్థాన వర్ణనయే అని చెప్పవచ్చును. 1375 ప్రాంతమువాడగు జక్కన యొక్క విక్రమార్క చరిత్రకు కృతిపతియగు సిద్ధమంత్రి 'సంగీతకళా దోహలు'డట (విక్రమార్కచరిత్రము-

V-1), వాని ఆస్థానములో 'నవరసోజ్జ్వల కావ్యనాటకాలంకార నికషోపల వివేక సుకవి వరులు... దత్తిల భరత మతంగ కోహళమత ప్రముఖ సంగీతపారంగతులు'ను కలరట (I-19). సిద్ధమంత్రి 'నానా నాటకాలంకృతుల్' పోషించెనట (I-35). మరియు నతడు నాటకావలులు 'రసికజనానందరససుధానిష్యందవిలసితము' లని పేర్కొనుట గమనార్హము (I-27). జక్కన తాత పెద్దనామాత్యుడు నెల్లూరి తిరుకాళవిభుని ఆస్థానములో 'ప్రహసన ప్రకరణ భాణాది బహువిధ రూపకంబులయందు రూఢి మెఱయ' చెప్పనేర్చినవాడట (I-20). (కాని, అందొక్క-టియు లభింపకుండుట దురదృష్టము).

జక్కన తన విక్రమార్క-చరిత్రలో రంభోర్వశుల నాట్యమును విపులముగా వర్ణించి యుండెను[5] (II-88-93). ఊర్వశీ నృత్యమును గూర్చిన క్రింది పద్యము ప్రత్యేకముగా పరిశీలనార్హము—

"శృంగార మేపార నంగవల్లికయందు గీతసామగ్రి యంగీకరించి,
కరతలామలకంబుగాఁగరాంబుజముల నర్థమాద్యంతంబు నభినయించి,
భావింప నరుదైన భావమర్మంబులు మెఱుఁగు జూడ్కులలోన మేళవించి,
తానమానములతోఁ దాళనిర్ణయలీలఁ జరణపల్లవముల సంగ్రహించి
యఖిలమును మెచ్చ, బ్రత్యక్షమైనయట్టి నాట్యవిద్యాధిదేవత నాఁదనర్చి,
భరతశాస్త్ర మర్మజ్ఞతా ప్రౌఢి మెఱసె నూర్వశీకాంత వేల్పుఁబేరోలగమున." (II-91 ప.)

నృత్యము చేయుచున్న నర్తకి లేదా పాత్రయే గీతము కూడ పాడుట అనునది తెలుగు దేశములోని ప్రత్యేకత. తక్కినవారి నృత్యములందిది కన్పట్టదు; లేదా ముఖ్యముకాదు. ఈ విషయమును కవులు కూడ గ్రహించి వర్ణించుట ముదావహము. ఇట్టి వర్ణనములకు మూలము ఈ క్రింది అభినయదర్పణ శ్లోకము—

"అంగేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్"[6]

ఈ కాలములో కొన్ని దేవాలయములందు నాట్యమంటపములు కట్టింపబడినట్లు నాటి శాసనాదులవలన తెలియవచ్చుచున్నది. అట్లు నాట్యమంటపములను కట్టించుటయేకాక గాయక-నర్తకులకు భూవసతు లేర్పరచి యుండుటయు గమనింపగలము (చూ. దక్షిణదేశపు శాసనములు—S. I. I. Vol-I.). ఉదాహరణముగా శక 1172 (క్రీ.శ. 1250) నాటి శాసనము :

"...శ్రీ వీరనరసింహ్వదేవ సంప్రదాయము సానులు ముప్పండ్రును.[7] మద్యలి కాండ్రు ఆఱువురును, నట్టువుం ఒకరుడు, మొఖరి ఆవజకాండు, కరడకాండు, కాహళకాండు మేలి నాయకుంగా సంప్రదాయమునకు మాడలపోలి భోగముగొని ఆచంద్రార్కమము గొల్వంగలారు" (S.I.I. Vol. V. No. 1150-A. R. No. 272 of 1896). ఆనాడు శ్రీ కూర్మాది దేవాలయములందలి నటనర్తకుల పేర్లు కూడ ఈ శాసనముల వలన తెలియుచున్నవి—ఎఱునటువు, వాని కొడ్కు నరసింహ్య మండలికుండు, నట్టువ సోమయ్య, నట్టువుప్రోల, గణికావిభూషణి ప్రోలమ, ప్రోలనట్టువు చెల్లెలు అక్కాసాని మొదలగువారు.

మరికొన్ని శాసనములనుబట్టి ఆయా దైవతముల అంగరంగభోగాలకు దానాదులొసంగబడినట్లు తెలియగలదు. అంగభోగమనునది అలంకరణ_నైవేద్యాదులకు సంబంధించినది. ఇంక రంగభోగమనునది నృత్య_సంగీత సేవలకు సంబంధించినది. శక 1172 నాటి పై శాసనమందలి సానులు, వాద్యగాండ్రు మొదలగువారు రంగభోగమునకు సంబంధించిన వారే. చాళుక్య_కాకతీయ చక్రవర్తుల కాలమునాటి పెక్కు శాసనములందు ఆయా దైవముల 'రంగభోగానకు', 'అంగరంగ భోగానకు', 'అంగభోగ_రంగభోగాలకు' దానము లొసంగబడిన వివరములు కలవు.[8]

ఈ కాలమున అనేక కవి_పండితులు సంస్కృత రూపకములను, సంగీత_నృత్య_నాట్య లక్షణగ్రంథములను రచించియున్నారు. ఇట్టివారిలో ప్రథమముగా పేర్కొనదగినవాడు రాచకొండ ప్రభువగు రెండవ సింగభూపాలుడు (క్రీ. శ. 1384_1399), ఇతడు "రసార్ణవసుధాకర"మనెడి రూపకలక్షణగ్రంథమును, రత్నపాంచాలిక యనెడి నాటికను, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు "సంగీత సుధానిధి" అనెడి వ్యాఖ్యను సంస్కృతమున రచించెను. తాను "కందర్పసంభవ"మనెడి రూపకమునుకూడ రచించినట్లు రసార్ణవసుధాకరములో పేర్కొనెను గాని అది లభ్యముకాలేదు. సింగభూపాలుడు కవి, పండితుడు, నాట్యవేదవిదుడు; అనేక శాస్త్రములందారితేరిన వాడు. అందుచేత అతనికి 'సర్వజ్ఞ సింగభూపతి' అను పేరువచ్చెను.[9] సింగభూపాలుడు యువరాజుగా నున్నప్పుడే 1368 ప్రాంతముల రసార్ణవసుధాకరమును రచించి యుండవచ్చును. ఇందు మూడు ఉల్లాసములుకలవు—రంజకోల్లాసము, రసికోల్లాసము, భావకోల్లాసము. ఇది రూపకచర్చ కుదిష్టమైన గ్రంథము. భరతుని నాట్యశాస్త్ర సంప్రదాయము విచ్ఛిన్నమైనదనియు, సంప్రదాయజ్ఞులు మిక్కిలి అరుదుగానున్నారనియు, అందుచే నాట్యలక్షణమును వివరించుటకు ఈ గ్రంథరూపమగు ప్రయత్నము చేయబడినదనియు ఆతడు ప్రారంభములో చెప్పుకొనెను. మతభేదములను చర్చించి, నిర్ణయముచేయుపట్ల సింగభూపాలుడు అతి స్వతంత్రుడుగా కన్పట్టుచుండుట పరిశీలనార్హము.[10] రసార్ణవసుధాకరము ఉత్తమలక్షణ గ్రంథము.

సింగభూపాలుడు 'నాటక పరిభాష' అనెడి ప్రత్యేక గ్రంథమును కూడ రచించినట్లు తెలియుచున్నది (C. C. I. 284_791); కాని, అది లభింపలేదు. రత్నపాంచాలికకు 'కువలయావళి' అను పేరు కూడ కలదు. రాచకొండలోని ప్రసన్నగోపాలదేవుని వసంతయాత్రా మహోత్సవ సమయమున నిది ప్రదర్శింపబడెనట.సింగభూపాలుని తండ్రి "అభిరామరాఘవము" (అనవోతనాయకీయము) అనెడి రూపకమును రచించెనట. అది అలభ్యము. సింగభూపాలుని ఆస్థాన విద్వాంసుడు విశ్వేశ్వరపండితుడు. ఇతడు 'చమత్కారచంద్రిక' యనెడు అలంకార శాస్త్ర గ్రంథమును రచించెను. "విశ్వేశ్వరు నంతటి పండితునిచే కీర్తింపబడిన సాహిత్య సౌభాగ్యశాలి'నని సింగభూపతి కువలయావళి ప్రస్తావనలో సగర్వముగా చెప్పుకొనెను. విశ్వేశ్వరుని చమత్కారప్రస్థానమునకు అలంకారచరిత్రలో ఒక ప్రత్యేకస్థానముకలదు. చమత్కారమనగా-లోకోత్తరాహ్లాదము (Poetic delight). దీని నాధారముగా చేసికొనియే జగన్నాధ పండితుడు ప్రామాణికమైన కావ్యనిర్వచనము చేసెను. (విశ్వేశ్వర పండితుడే రసార్ణవసుధా

కరమును కూడ రచించి యుండునని కొందరి అభిప్రాయము; కాని, అది విశ్వసనీయముకాదు). విశ్వేశ్వరపండితుని శిష్యుడు పశుపతి నాగనాథుడు 'మదనవిలాస' మనెడి భాణమును రచించెను (T. C. II. 2669). ఇది కళ్యాణనారాయణుని వసంతోత్సవసమయమందు ప్రదర్శింపబడెనట.

ఈ సందర్భమున అమృతానందయోగి 'అలంకార సంగ్రహము' స్మరణార్హము. ఇతడు ఆంధ్రుడే అనియు, క్రీ.శ. 1350 ప్రాంతములవాడనియు గ్రంథసంపాదకులు నిర్ణయించినారు.[11] ఇందు పదునొకండు పరిచ్ఛేదములున్నవి. 7, 8, 9, 10 పరిచ్ఛేదములు నాలుగును రూపకలక్షణమునకు సంబంధించినవి. ఇందలి లక్షణములు సంక్షిప్తములును, సమగ్రములును, సులభములును అయియున్నవి. తెలుగులో అలంకారశాస్త్రగ్రంథములను రచించినవారిలో కొందరు ప్రతాపరుద్రయశోభూషణమునే కాక ఈ అలంకారసంగ్రహమును కూడ అనుసరించియుండుట గమనింపవచ్చును.

శాస్త్రకర్తలైన రెడ్డిరాజులలో కొండవీటి ప్రభువగు కుమారగిరిరెడ్డి (C. 1386-1402) ప్రముఖుడు. ఇతడు రాజ్యభారము నంతటిని స్నేహపాత్రుడును, వీరుడును, బావమరదియును అగుకాటయవేమునిపై ఉంచి తాను నిత్యమును అభినవములగు నర్తనములతోను, మనోహరములగు వసంతోత్సవములతోను, సంతానాభ్యుదయములతోను సంతసించుచుండెడివాడు.[12] కుమారగిరి సంతతవసంతోత్సవప్రియుడగుటచేత వానికి 'వసంతరాయలు', 'కర్పూరవసంతరాయలు' అని పేర్లువచ్చెను. కుమారగిరిరెడ్డి నాట్యవేదార్థవిదులైన భరతాదిమునులయు, భోజాది భూపతులయు శాస్త్రములను చక్కగా పరిశీలించి, తనబిరుదముపేర "వసంతరాజీయ" మనెడి నాట్యశాస్త్రమును రచించెను. అందుచెప్పబడిన మార్గమననుసరించియే, రాజాజ్ఞానుసారముగా, కవులకాశ్రయుడైన కాటయవేమ మంత్రి ప్రజ్ఞాశాలియైన కాళిదాసుచే రచింపబడిన రసనిధులగు మూడు నాటకములకును 'కుమారగిరి రాజీయము' అనుపేర వ్యాఖ్యానములు వ్రాసెను.[13] ఈ వ్యాఖ్యలు మనోహరములు, ప్రామాణికములు అని ప్రాచ్య-పాశ్చాత్య విమర్శకుల పొగడ్తలందినవి. ఇవి ముద్రితములైనవి. కాని ఈ వ్యాఖ్యల కాధారమైన వసంతరాజీయము మాత్రములభింపలేదు. ఇది ఆంధ్రుల దురదృష్టము. ఈ గ్రంథమునుండి ఆయా వ్యాఖ్యాతలు తమతమ వ్యాఖ్యానములందు ఉదాహరించుకొన్న లక్షణ శ్లోకములనుబట్టి దీని స్వరూపమును కొంత వరకు ఊహించుకొనుటకు అవకాశము కలుగుచున్నది.[14] దీనిని బట్టి వసంతరాజీయము కూడ రసార్ణవసుధాకరమువంటి రూపకలక్షణ గ్రంథమని తెలియుచున్నది. కాని శాకుంతల వ్యాఖ్యానప్రారంభములో కుమారగిరిరెడ్డి ఆస్థాన నర్తకియగు లకుమాదేవిని గూర్చి కాటయవేముడు చెప్పిన దానిని బట్టి వసంతరాజీయమందు నృత్య ప్రకరణములు కూడ కలవని యూహింపవచ్చును. లకుమాదేవి కుమారగిరిప్రభువు రచించిన నాట్యశాస్త్రమందలి రహస్యములను అభినయించి వన్నె చేకూర్చెడిదట—

జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవీ యస్యాశ్రియా సదృశీ ప్రియా

నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థా నర్థివ్రజాయ సహస్రశః ॥[15]

కుమారగిరిరెడ్డి తరువాత కొండవీడు రాజ్యపాలకుడైన పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402_1420) సింగభూపాలునివలె 'సర్వజ్ఞ' బిరుదాంచితుడు. ఇతడు 'సాహిత్యచింతామణి'; 'సంగీతచింతామణి' అనెడి లక్షణగ్రంథములను రచించెను. ఇవి ఇంకను అముద్రితములే. సంగీతచింతామణి వ్రాతప్రతులు రెండేకలవు. అవి తిరువనంతపురం ప్రాసాదగ్రంథాలయములో ఉన్నవి (D·C·S·M-Trivendrum–Vol· VII· Nos· 1417 and 1418). ఇందు మొదటిదానిలో 12 అధ్యాయములున్నవి. రెండవది అసమగ్రము, సంగీతచింతామణి యందు నృత్త_నృత్యప్రకరణములు కూడ కలవు. ఇచ్చట ఒక ముఖ్యవిషయమును గమనింపవలసి యున్నది. 'సంగీతకళ'ను గూర్చి లక్షణగ్రంథములను వ్రాసినవారిలో అధికులు తమ తమ గ్రంథములందు నృత్త_నృత్యములను గూడ వివరించుచు వచ్చిరి. అవి రెండును అత్యంత సన్నిహితములగుటయే ఇందులకు కారణము. ఇంక సాహిత్యచింతామణియును అసమగ్రమే (No· 12965 of D. C. of M. L. Madras, Vol. XXII· 1918). 7 వ పరిచ్ఛేదములో ఇది అంతమగుచున్నది.

పెదకోమటి వేమభూపాలుని ఆస్థానకవి వామనభట్టబాణుడు. ఇతడు విద్యారణ్యుల శిష్యుడు; షడ్భాషావల్లభ_గద్యసార్వభౌమ బిరుదాంచితుడు. సుమారు 30 సంవత్సరములపాటు విజయనగరమునందే యుండి హరిహరుని రాజ్యవైభవమును కన్నులారగాంచెను. అచ్చట ఉన్నప్పుడే "శృంగారభూషణ" మనెడి భాణమును రచించెను. ఇది ముద్రితము. ఇది పంపా విరూపాక్షస్వామి చైత్రయాత్రామహోత్సవ సమయమున ప్రదర్శింపబడెనట. నాయకుడగు విలాసశేఖరుని విలాసములను వర్ణించుటలో వామనుడు విద్యానగర నాగరకసంఘమును కనులకు కట్టునట్లు చక్కగా నిరూపించియుండెను. వేమభూపాలుని ఆస్థానమునకు వచ్చిన తరువాత "వేమభూపాలచరితము" (వీరనారాయణ చరితము) అనెడి వచన గ్రంథమును, ఉషా పరిణయము_కనకలేఖాకళ్యాణము అనెడి నాటకములను రచించెను. వేమభూపాలచరితము బాణుని కాదంబరికి దీటుగా నుండవలయునని చేసినరచన. సంగీతచింతామణ్యాదులను కూడ వామనుడే రచించియుండునని కొందరు విమర్శకుల అభిప్రాయము; కాని, ఇది విశ్వసనీయము కాజాలదు.

ఇంతవరకును, సంస్కృతమునందు రూపకలక్షణాదులను చెప్పిన ఆంధ్రులను గూర్చి వివరించి యున్నాను. తెలుగులోనే లక్షణగ్రంథములను వ్రాసిన కొందరు తెలుగువారిని గూర్చి ఇంక వివరింతును___

విన్నకోట పెద్దన "కావ్యాలంకార చూడామణి" యను లక్షణగ్రంథమును వ్రాసి ఎలమంచి రాజగు చాళుక్యవిశ్వేశ్వరున కంకితమొసంగెను (క్రీ. శ. 1410 ప్రాంతముల). ఇందు తొమ్మిది ఉల్లాసములున్నవి; ప్రధానముగా శ్రవ్యకావ్యములకు సంబంధించిన లక్షణగ్రంథమిది. విశ్వేశ్వరుని ఆదేశము ననుసరించి, సత్కవి సౌకర్యసిద్ధికొరకు అచ్చటచ్చటనున్న రస_భావ_

అలంకార-చ్ఛందో-వ్యాకరణాంశముల నొక్క-చోచేర్చి పెద్దన యీ కావ్యాలంకారచూడామణిని రచించెను. అచ్చటచ్చట దృశ్యకావ్యప్రశంస కలదు కాని ప్రత్యేకించి తల్లక్షణ మిందులేదు. అమృతానందయోగి అలంకారసంగ్రహపు అనుసరణలిందు కన్పట్టుచున్నవి.

భోజరాజీయాది కావ్యకర్తయగు అనంతామాత్యుడు (క్రీ. శ. 1435 ప్రాంతముల) 'రసాభరణ' మనెడి లక్షణగ్రంథమును రచించెను. 'రసాలంకార' మనెడి నామాంతరము గల దీని యందు నాలుగు ఆశ్వాసములున్నవి. ఇందు ప్రత్యేకించి నాట్యలక్షణము లేకపోయినను, రస-భావ-నాయక-నాయికాదివివరణము కావ్య-నాట్యములు రెండింటికిని సమానమే అయినను ప్రథమాశ్వాసములోని పద్యములను బట్టి అనంతుడు రసాభరణమును నాట్యదృష్టితోనే రచించెనని చెప్పవచ్చును.[16] అనంతుడు భరతమతానుయాయి యైనను శాంతమును కూడ తొమ్మిదవ రసముగా అంగీకరించుట చిత్రము.

తెలుగులో రూపకలక్షణమును ప్రత్యేకించి చెప్పిన ప్రథముడు చిత్రకవి పెద్దనార్యుడు (క్రీ. శ. 1550 ప్రాంతములు). ఈ గ్రంథమును గూర్చి తరువాత వివరింతును.

ఈ కాలములో తెలుగు కవులు ఒక క్రొత్త ప్రయత్నమునకు నాందీపూజ చేసినారు. నన్నయ మొదలుకొని ఆనాటివరకును కవులందరును సంస్కృతమునందలి ఇతిహాస-పురాణ-కావ్యములను మాత్రమే ఆంధ్రీకరించుటకు పూనుకొనిరి. సంస్కృతభాషలో రూపకసాహిత్యము అపారముగా నున్నది. అయినను ఆ రూపకములను ఆంధ్రీకరించుట కెవ్వరును పూనుకొనలేదు. కాని, తెలుగు కవులు సంస్కృతములో వివిధములగు రూపకములను అప్పటప్పట రచించుచునే యున్నట్లు గుర్తించియున్నాము. అయినను తదనువాదమునకుకాని, తెలుగులో స్వతంత్రరూపకరచనకు కాని ఎవ్వరును పూనుకొనకపోవుట విచిత్రము. అట్టి స్థితితో ఈ కాలమున కొందరు కవులు సంస్కృతరూపకములను ఆంధ్రీకరించుటకు పూనుకొనుట ముదావహము; కాని, ఆ అనువాదములు రూపకరూపమును కాక, ప్రబంధరూపమును దాల్చుట దురదృష్టము, ఇట్లు సంస్కృతరూపకములను ప్రబంధీకరించుటకు పూనుకొనిన వారిలో మంచన (1350 ప్రాంతములు) ప్రథముడుగా కన్పట్టుచున్నాడు. ఇతడు రాజశేఖరుని 'విద్ధసాలభంజిక' యనెడు నాటకమును అనుసరించి 'కేయూరబాహుచరిత్ర'మును రచించి నండూరి గుండయామాత్యున కంకిత మొసంగెను. ఇందీతడు 22 నీతి కథలను అధికముగా చేర్చెను. తరువాత పేర్కొ-న దగినవాడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు (క్రీ. శ. 1450 ప్రాంతములు). ఇతడు సరస్వతీకటాక్షమును పొందిన మహాకవి. పినవీరభద్రుడు భారతమందలి శకుంతలోపాఖ్యాన కథను ప్రధానముగాగ్రహించి, కాళిదాసు నాటకక్రమమును కొంతగ్రహించి 'శకుంతలా పరిణయము' (లేదా శృంగారశాకుంతలము) అనెడి ప్రబంధమును రచించెను. ఇందు స్వకపోల వర్ణనలు కూడ కలవు. ఇతడు కాళిదాసు శ్లోకములను కొన్నింటిని చక్కగా తెనిగించెను.

పై ఇరువురును సంస్కృతరూపకములను అందలి క్రమమును పాటించుచు యథాతథముగా అనువదించినవారుకాదు. కాని నందిమల్లయ, ఘంట సింగయ అనెడి జంటకవులు (క్రీ. శ. 1480 ప్రాంతముల) కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము'ను అదే పేరుతో యథా

క్రమముగా అనువదించియున్నారు. మాతృకలోని కథాప్రణాళిక, పద్యక్రమము, భావస్థితి సర్వసామాన్యముగా మార్పు లేకుండ తెలుగున స్వీకరింపబడినవి. ఇది ప్రబంధమగుటచేత లక్షణానుసారముగా అచ్చటచ్చట కొన్ని క్రొత్త వర్ణనలు మాత్రము కల్పింపబడెను.

అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానమును, బిజ్జల తిమ్మభూపాలుని అనర్ఘరాఘవమును కూడ ఆయా సంస్కృతరూపములకు ప్రబంధీకరణతుల్యములే.

## వసంతోత్సవములు

రెడ్డిరాజుల కాలములోని ఒక ప్రత్యేకత వసంతోత్సవ నిర్వహణము. చైత్రమాసములో జరిగెడి ఆయా దైవోత్సవము లన్నియును వసంతోత్సవములే; వీనినే 'చైత్రయాత్రామహోత్సవము' లందురు. ఇట్టి చైత్రయాత్రామహోత్సవములందే సంస్కృతరూపకములు ప్రదర్శింపబడినట్లు ఆయా ప్రస్తావనలను బట్టి తెలియుచున్నది. ఈ వసంతోత్సవములు బహు ప్రాచీనకాలమునుండియు భారతదేశమున ప్రచారములో నున్నవి. అవి రెడ్డిరాజుల కాలములో, ముఖ్యముగా కుమారగిరిరెడ్డి కాలములో, అత్యంతవైభవముగా జరిగెడివి. ఇట్లు నిత్య వసంతోత్సవప్రియుడగుటచేతనే కుమారగిరిరెడ్డి 'వసంతరాయ' లనియు, ఆ ఉత్సవములం దుపయుక్తమగు కర్పూరమునుబట్టి 'కర్పూరవసంతరాయ' లనియు ప్రసిద్ధి వహించెను.

సోమదేవుని 'కథాసరిత్సాగర'మందు (క్రీ. శ. 1063–1082) వసంతోత్సవ ప్రశంసలు చాల కలవు.[1] అన్నిచోట్లను లతలు, పూవులు, వృక్షములు మొదలగువాని శోభయే అధికముగా వర్ణింపబడెను. ఇంక ఆ వసంతోత్సవసమయములలో ఉద్యానవనవిహారములు, పానగోష్ఠులు, సరసస్లాపములు ప్రధానవిశేషములు. ఇట్టిది క్రమముగా మదనోత్సవముగా మారినది. వాత్స్యాయన కామసూత్రములలో 'సువసంతక' మనెడి దేశ్యక్రీడావిశేషము చెప్పబడెను (1–4–42). 'సువసంతక మనగా మన్మథోత్సవ' మని జయమంగళుడు వ్యాఖ్యానించెను. అందు నృత్యములు, గీతములు, నాట్యములు జరుగును. ఇది జనసంఘ మంతటికిని సంబంధించిన ఉత్సవమన్నమాట (Community festival). కాళిదాసు శాకుంతలమందు (6వ అంక ప్రారంభమున) గల ప్రసంగమునుబట్టి వసంతోత్సవము మన్మథదైవతాకమగు నుత్సవమే యని స్పష్టమగుచున్నది. శ్రీహర్షుని రత్నావళీనాటిక మదనోత్సవముతోనే ప్రారంభమైనది. హరకోపానలదగ్ధుడైన మన్మథుడు పునర్జీవితుడైన దినము (చైత్రశుద్ధ త్రయోదశి)తో ఈ ఉత్సవములు ప్రారంభమై 9 రోజులు జరుగునుకాన ఇవి మదనోత్సవము లనబడిన వనియు, వసంతకాలమందు జరుగును కాన వీనికి వసంతోత్సవములను పేరు వచ్చెననియు హేమాద్రి 'వ్రతఖండ'మందు పేర్కొనెను.

నన్నిచోడుడు తన కుమారసంభవమునందు 'మనసిజుని పునరవతరణ' సమయమందే వసంతోత్సవమును వర్ణించుట గమనింపదగినది (9 ఆశ్వా. 51–136 ప.). కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశకలోను (1, 7 ఆశ్వాసములందు), శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందును (V–92–125 ప.) కూడ ఈ వసంతోత్సవ వర్ణనములు కలవు. మొత్తమునకీ ఉత్స

వములందు—1. నీరు వోతలాట (కర్పూరాదులను చల్లుకొనుట), 2. చల్లుపోరు (జలకేళి), 3. పుష్పాపచయము, 4. మధుపానము, 5. ఆటలు (నృత్యాదులు), 6. పాటలు అనునవి ప్రధానములైనవి. కుమారగిరిరెడ్డి వసంతోత్సవకేళిలో 'కస్తూరికారేణు సమూహమే మేఘమును, హిమాంబువులే వర్షధారలును, కర్పూర ఖండములే వడగండ్లును' అయ్యెడివట.[2] ఈ మహారాజునకు 'ప్రతి సంవత్సరోత్సవంబునకుం దగిన కస్తూరీ - కుంకుమ - ఘనసార - సంకుమద - హిమాంబు - కాలాగురు - గంధసార ప్రభృతి ద్రవ్యంబు' లొడగూర్చినవాడు సుగంధ ద్రవ్య భాండాగారాధ్యక్షుడగు అవచి తిప్పయసెట్టి (హరవిలాసము I-7 ప. II. 144 ప.). శ్రీకృష్ణదేవరాయలు కూడ ఈ వసంతోత్సవప్రియుడే యని పారిజాతాపహరణమును బట్టి తెలియుచున్నది (I-139 ప.).

నిజమునకు వసంతోత్సవము క్రీడాప్రధానమైనను, అది లలితకళల అభివృద్ధికికూడ ఆకరమైనదనెడి విషయమును మరువరాదు. ఆ ఉత్సవములందు నర్తకులు తమ నృత్యములను ప్రదర్శించియు, నటులు నాటకములను ప్రదర్శించియు, గాయకులు తమ శక్తిని ప్రదర్శించియు, కవులు నూత్నకావ్యములను చదివి వినిపించియు రాజసన్మానము లందెడివారు. కళాకారుల సంవత్సరప్రయత్న మంతయును ఆ ఉత్సవములలో ఫలించెడిది; అది వారికి పర్వకాలము.

## క్రీడాభిరామము[1]

క్రీడాభిరామమును గూర్చి ఇంతకుముందే కొంత ప్రసంగించి యున్నాను. సంస్కృత రూపకములు తెలుగున ప్రబంధములుగా అవతరించుటకు కొంత అపవాదము ఈ క్రీడాభిరామము. అంతవరకును తెలుగులో మార్గరూపకరచన లేదన్న అపనిందను పోగొట్టినదియును ఈ క్రీడాభిరామమే. క్రీడాభిరామరచన తెలుగు రూపకచరిత్రలో ఒక ముఖ్యఘట్టము. అది ఈ కాలములోనే ప్రసక్తమైనది.

"ఆ మంత్రిశేఖరుండు (వల్లభామాత్యుడు) రావిపాటి త్రిపురాంతకదేవుండను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుభాష రచియించినవాడు" (క్రీ. రా. 36 వ వచనము) అని ప్రస్తావనా ప్రారంభములో కలదు. దీనినిబట్టి క్రీడాభిరామకర్త వల్లభరాయుడనియు, తరువాతి పద్యమునుబట్టి ఇది వీథి యనెడు రూపకభేదమనియు స్పష్టమగుచున్నది; కాని, ప్రబోధచంద్రోదయాదులవలె ఇదియును సంస్కృతరూపకమునకు ప్రబంధీకరణమేయని శ్రీ టి. అచ్యుతరావుగారును;[2] క్రీడాభిరామము వల్లభరాయవిరచితమే కాదనియు, దానిని శ్రీనాథుడే రచించెననియు, ఈ సత్యము ప్రాచీనకాలము నుండియు ప్రచారములోనే యున్నదనియు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారును[3] రెండువాదములను ప్రతిపాదించియున్నారు.

### కర్తృత్వము :[4]

కృత్యవతరణికలోను, సూత్రధారవాక్యములలోను, గ్రంథాంతగద్యలోను క్రీడాభిరామము వల్లభామాత్యకృత మనియే స్పష్టముగా, నిస్సందేహముగా పేర్కొనబడెను.

కొందరు సంకలనగ్రంథకర్తలు క్రీడాభిరామమును వల్లభరాయ కృతమునుగానే పేర్కొని యున్నారు. కాని, కొందరు లక్షణకర్తలు పొరపడియో, మరి యెందుచేతనో క్రీడాభిరామమును శ్రీనాథకృతమునుగా పేర్కొనుట జరిగినది. ఆ వ్రాతలే ఈ వాదోపవాదములకు మూలబీజము లైనవి. ఇందులకు తోడు క్రీడాభిరామమందలి పెక్కు పద్యముల ఎత్తుగడలు, పదప్రయోగ ములు, భావములు శ్రీనాథుని గ్రంథములందలి వానితో సంవదించుచున్నవి.

శ్రీనాథుడు ధనాశచేతనో, మరెందుచేతనో క్రీడాభిరామకర్తృత్వమును వల్లభరాయనికి అంటగట్టెనని భావించెడి శ్రీ శాస్త్రిగారు "...ఎన్నటికిని గూడఁ గ్రీడాభిరామము శ్రీనాథకృతము గాదను వాదము పుట్టకుండుటకో యనునట్లు శ్రీనాథకవి యనేకస్థలముల నిందుఁ దన తక్కిన గ్రంథముల రచనలను జేర్చెను" (వారి పీఠిక-పుట-12) అని వ్రాసియున్నారు. ఇది చిత్రముగా నున్నది. అనగా వల్లభరాయని మోసగించిన శ్రీనాథుడు వట్టి దొంగ అయి యుండవలె నన్న మాట ! ఈ యూహ అసమంజసమని చెప్పక తప్పదు. ఇంక శైలీ విషయమునగల సామ్య మును జూచి పొందెడి శంకకు శ్రీ మానవల్లివారి క్రింది వాక్యములే సమాధానము కాగలవు. (వారి పీఠిక-పుట-VI) : "...శైలీ విషయమున సామ్యమును జూపి శ్రీనాథునకుఁ గర్తృత్వ మారోపింతమన్నచో నక్కాలపుఁ గావ్యములెల్ల నించుమించుగా సమానపాటవమును గవితా ధాటియును నిరంకుశభావములును గలిగియున్నవి. పినవీరభద్రుడు, శివలీలావిలాసము వ్రాసిన కొమ్మనయు, ఎలకుర్తి రామరాజును, తులసి బసువనియు, అంగర నృసింహ కవియు రచించిన కావ్యములలో బిగువును, ధారాపాతమును సమానములుగా నున్నవి." లేదా శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు పేర్కొన్నట్లు శ్రీ శాస్త్రిగారు శ్రీనాథునివని చూపించిన భావములు, పద ముల కూర్పులు మొదలగునవి సంస్కృతప్రేమాభిరామములోనివే అయియుండవచ్చును.

ఏదేని ఒక విషయమును నిర్ధరించుటలో గ్రంథస్థాధారము ప్రబలప్రమాణముకావల యును. కాని, శైలీసామ్యము విషయమున గ్రంథస్థాధారమును గ్రహించిన శ్రీశాస్త్రిగారు విస్పష్టముగానున్న కర్తృత్వవిషయమున ఆ గ్రంథస్థాధారమునే గ్రహింపకపోవుట చింత్యము. క్రీడాభిరామమును వల్లభరాయడే రచించియుండు ననుటయే సత్యసమ్మతము కాగలదు. వల్లభ రాయని వాగ్వైభవములు వర్ణనాతీతములనియు, అతడు చాటుకవితాపటుత్వ సంపన్నుడనియు గ్రంథమునుబట్టి కూడ తెలియుచున్నది. పోతే, శ్రీ తమ్మయ్యగారూహించినట్లు క్రీడాభిరామ రచనలో వల్లభరాయనికి శ్రీనాథుడు కొంత సాహాయ్యముచేసి యుండవచ్చును. ఆ సాహాయ్యము కూడ ఆదరపూర్వకమును, అభిమానప్రేరకమును అయియుండునని చెప్పుట సమంజసము. శ్రీ తమ్మయ్యగారే పేర్కొన్నట్లు, శ్రీ నాథుడు ప్రౌఢదేవరాయలను దర్శించిన సందర్భములో వీరిరువురును సన్నిహితులై యుందురు.

### క్రీడాభిరామము - వీథి :

గోవిందమంచనశర్మ యను నాత డోరుగంటిలోని ఆర్యవాటమందలి కామమంజరియను పునర్భువునకు అనుపు కాడు. ఆతడు కాసల్నాటివాడు. మాధవుని కుమారుడు. మీసాలప్పయ్య

ద్వివేదిగారి మేనల్లుడు. సంకృతిపూతిమాష గోత్రుడు.[5] మంచన కార్యాంతరవ్యాసంగమున దేశాంతరమున కొంతకాలముండి, మిత్రుడయిన టిట్టిభసెట్టితో కలిసి ఒకనాడు యోరుగంటికేతెంచెను. ఆ మిత్రులిరువురును ఒకనాటి వేకువజామున ఓరుగంటిలో ప్రవేశించి, నగరములోని వింతలను విశేషములనుచూచి వినోదించుచు, రాత్రికి గమ్యస్థానముచేరి కామోత్సవమునకు కడంగిరి. క్రొత్తవాడగు టిట్టిభసెట్టికి మంచన ఆ నగర విశేషములను వర్ణించి చెప్పుట ఇందలి ప్రధానవిషయము. దీని స్వభావాదులు వీథీలక్షణమునకు సరిపోవుచున్నవి[6]—

1. పాత్రలు : మంచన, టిట్టిభసెట్టి—ఈ ఇరువురే ఇందలి ముఖ్యపాత్రలు. తక్కినవారెవ్వరును, రంగస్థలముమీదకు వచ్చినను, ప్రత్యక్షముగా మాటాడ నక్కరలేదు. అందుచేత క్రీడాభిరామము ద్విపాత్రహార్య మగుచున్నది. ఆయా సందర్భములందు ఆకాశ పురుషభాషితములును ప్రయుక్తములైనవి.

2. రసములు : వీథి సర్వరససంపన్నము. "గణనకెక్కిన దశరూపకములయందు వివిధ రసభావభావనవీథి లెస్స" అని కవి ఆదిలోనే చెప్పుట గమనార్హము. ఇందు ప్రధానమైనది శృంగార రసము. తక్కిన రసము లాయా సందర్భములందు కలవు. ఇందలి శృంగారమంతయును పరకీయారతికి సంబంధించిన దగుటచేత ఇది ఆలంకారికముగా 'ఆభాస' మనబడును. దీనికి పరిపూర్ణపోషణములేదు కాని అత్యధికముగా సూచింపబడుట జరిగినది.

3. వృత్తి : ఇచ్చట వృత్తియనగా నాట్యవృత్తి. ఇది కావ్యవృత్తికంటె భిన్నమని తెలియవలెను. క్రీడాభిరామమంతయును శృంగారవిషయకమగుటచేత ఇందలి నాట్యవృత్తి కైశికి అనియు, ఇతర రసములు ప్రసక్తములైనప్పుడు ఆయావృత్తులు కలవనియు తెలియవలెను.

4. నాయకుడు : ఇందు మంచన నాయకుడు. ఇతడు ధాత్రీసురతిలకుడు; అయినను వీని బ్రాహ్మణ్యము జాతిమాత్రోపజీవ్యము. జారరతిప్రియుడగుటచేత ఇతడు అధమపాత్ర అగుచున్నాడు. టిట్టిభసెట్టి వీనికంటెను సన్నాసి. అంతియేకాక ఇందువర్ణింపబడిన వెల్ల అనుదాత్తవిషయములే.

5. నాయిక : ఇందలి నాయిక కామమంజరి; ఈమె పునర్భువు (మారుమనువుది). అందుచేత నాయిక నాయకోచితగానే యున్నది.

6. అంకములు : క్రీడాభిరామంబను వీథినాటకంబున "సర్వంబు నేకాశ్వాసము" అని గ్రంథాంతమున కలదు[7]. వీథినాటకము, ఏకాశ్వాసము అనునవి పరస్పరవిరుద్ధములు. ఇచ్చట "సర్వంబు నేకాంక" మనియే ఉండదగును. ఈ ఏకాంకమందు నాలుగు భాగములున్నవి—1. శ్రవ్యకావ్యపద్ధతిలో చెప్పబడిన కృత్యవతరణిక; 2. ప్రస్తావన (దీనిని సూత్రధారుడొక్కడే నిర్వహించెను); 3. అసలు కథ; 4. అంతమునగల భరతవాక్యమును పోలిన రెండు పద్యములు.

7. ఇతివృత్తము : ఇందలి కొన్ని విషయములు చారిత్రకముగా సత్యములే అయినను మొత్తముమీద ఇతివృత్తము మాత్రము కల్పితమైనదే. గ్రంథారంభము ఉదయ సూర్యస్తుతితోడను, గ్రంథాంతము చంద్రస్తుతితోడను ఒప్పుచుండుటచేత ఇందలి ఇతివృత్తము ఏకదివసప్రయోజ్యమగు చున్నది. అసలు, ఇతివృత్తము అల్పమగుట స్పష్టమే.

8. సంధులు : ఇందు రెండే సంధులుండవలెను. మిత్రులిరువురును వేశవాటంబు దాటిపోవలెనని తలంచుటతో ముఖసంధి పూర్తిఅగుచున్నది. తరువాతిది నిర్వహణసంధి.[8]

9. లాస్యాంగములు : ఇందు లాస్యాంగములను స్పష్టముగా నిరూపించుటకు వీలులేకున్నను ఆయావనితల విలాసగమనాదులు వర్ణితములైనచోటులందు లాస్యచ్ఛాయలు కలవని చెప్పవచ్చును.

10. వీథ్యంగములు : ఇందు త్రయోదశ వీథ్యంగములను చక్కగా నిరూపించవచ్చును.[9] పై విధముగా వీథీలక్షణము లన్నియును[10] క్రీడాభిరామమందు సమన్వయ మగు చున్నవి. కావున క్రీడాభిరామము వీథి అగుట స్పష్టము. మరియు గ్రంథాదిని 'వివిధ రసభావ భావన వీథి లెస్స' అని పేర్కొనఁ బడుట, ప్రస్తావనలో 'వీథి యను రూపకము...తిప్ప వల్లభుండెట్లు తెనుఁగు జేసె' అని ఆశంకింపబడుట, గ్రంథాంతగద్యలో వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబను వీథి నాటకంబున' అని చెప్పబడుట—అనువానిని బట్టి కవి క్రీడాభిరామమును వీథినిగానే రచించెననియు స్పష్టమగుచున్నది.

ప్రస్తావనలో "ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుభాష రచియించినవాడు" అని ఉన్నదానిలోని 'రూపక' పదమును గ్రహించి శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు క్రీడాభిరామము 'శ్రవ్యకావ్యమైన చంపూ కావ్యము' అని సిద్ధాంతించుటకు ప్రయత్నించినారు.[11] కాని పై గ్రంథస్థాధారములను వారు గుర్తించినట్లే కన్పట్టదు. వారి వాదము నిలువజాలదు.

"ప్రేమాభిరామ నాటకంబు" ననుసరించి "క్రీడాభిరామంబను రూపకంబు రచింపబడె" నని చెప్పబడుటచేత క్రీడాభిరామము కేవలానువాదము కాదని స్పష్టమగుచున్నది. ఇది కేవలానువాదము కాదనెడి విషయమును కవి పేరు మార్పులోనే సూచించి యున్నాడు. అసలానాడు యథాతథానువాదమను దానిని తెలుగు కవులు ఆదరింపనే లేదను సత్యము విస్మరింపరానిది. ప్రేమాభిరామమును ప్రధానముగా అనుసరించుచు వల్లభరాయడు తననాటి విశేషములను కూడ ఇందు చేర్చియుండును (ప్రేమాభిరామము నాటక మనబడినది. కాని, ఇచ్చట ఈ నాటక పదము రూపకసామాన్యవాచియే అనియు, ప్రేమాభిరామముకూడ వీథియే అనియు తలచుట సమంజసము కాగలదు.)

ఇంతకును, క్రీడాభిరామమందు కొన్ని శ్రవ్యకావ్యసరణు లుండుటయే ఈ వాదోపవాదములకు మూలమైనది. రంగస్థలసూచనాదులు వచనములో నిష్కర్షగా లేకపోవుట, పాత్రల

వేషాదులు ప్రబంధధోరణిలో పద్యములందు వర్ణింపబడుట, ప్రబంధములందు వలెనే ఇచ్చట ను గ్రంథాదిని కృతికర్తృవంశాదుల వర్ణనలుండుట మొదలగునవి ఇందుల కుదాహరణములు. మరియు క్రీడాభిరామమును సంపాదించిన ముప్వురును దీనిని ప్రబంధమును ముద్రించినట్లే ముద్రించియున్నారు. ప్రేమాభిరామము కూడ ఇట్లే ఉండునని చెప్పజాలము. అంతకు ముందు తెలుగులో ఏవిధమైన మార్గరూపక రచనయును ఆదర్శముగా లేకపోవుటచేతను, నాటికి వీథినాట కాదులే బహుళప్రచారము నందుండుట చేతను వల్లభరాయడు వీథినాటకపద్ధతిని కొంతస్వీకరించి యుండునని తలంపవచ్చును. అందుచేతనే సంధి వచనములవంటివి ఇందు పెక్కులు కలవు.

సూత్రధారుడు మూలకారుడగు త్రిపురాంతకుని, మాతృభాషను ప్రశంసించిన పిమ్మట ముద్రితప్రతులలో క్రిందివిధముగా కలదు—

"వ. నేపథ్యమున

చ. గతిరసికుండ ! షట్చరణ.........

ఆ. చేరవచ్చి వచ్చి దూరంబుగాఁ బోదు.........

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు హా! యేనెఱింగితి.........అయ్యిరువురు నా బాల్య మిత్రులు వీరిరువురి యోగక్షేమంబు లనుసంధించెదం గాక యని నిష్క్రాంతుండయ్యెనిది ప్రస్తావన.

సీ. గన్నేరుఁ బూఁజాయ కరమొప్ప.........

.........వచ్చె గోవింద శర్మ

మాధవునిపట్టి యొసపరి మన్మథుండు.

.....................

వ. తూర్పుఁ గనుంగొని టిట్టిభునిం జూచి వయస్య ! సుప్రభాతంబు సుఖనిద్ర యయ్యెనే.................."

పై ఘట్టమును కేవలము శ్రవ్యకావ్యము నందలి ఘట్టమును వలెనే ముద్రించుట అసమంజసము. క్రిందివిధముగా ముద్రించినచో క్రీడాభిరామ దృశ్యత్వము సుస్పష్టము కాగలదు—

[ నేపథ్యమున—

చ. గతిరసికుండ ! షట్చరణ............]

సూత్రధారుడు : [ఆకర్ణించి] హా ! యేనెఱింగితి.........అయ్యిరువురు నాబాల్య మిత్రులు వీరి యోగక్షేమంబు లనుసంధించెదం గాక [అని నిష్క్రాంతుండయ్యె].

ఇది ప్రస్తావన

[ సీ. గన్నేరుఁ బూఁజాయ కరమొప్ప............]

గో. మం. శ. : [పై వేషముతోఁ బ్రవేశించి, తూర్పుఁగనుంగొని, టిట్టిభునిం జూచి] వయస్య ! సుప్రభాతంబు ! సుఖనిద్రయయ్యెనే ?......

ఇచ్చట ఒక సత్యమును గుర్తింపవలసియున్నది. ఈ రచనలో ఎట్టి మార్పులను చేయకయే, కేవలము రంగస్థలసూచనలను కుండలీకరణములందుంచుచు, అవసరమైన సూచన

లను కుండలీకరణములందు చేర్చుచు ముద్రించినచో క్రీడాభిరామము ప్రదర్శనయోగ్యమైన చక్కని వీథి కాగలదు. వల్లభరాయడే కొన్ని రంగస్థల సూచనల నొసంగి యుండుట గమనార్హము. ఉదా : గోవింద టిట్టిభులు "ప్రవేశనాటితకంబునఁ జిత్రశాలఁ జొచ్చి" నారట. (183 వ.)

పాశ్చాత్యసాహిత్య ప్రభావము తెలుగుజాతిమీద పడునంతవరకును తెలుగులో సంస్కృతరూపకానువాదము కాని, సంస్కృతరూపకములను బోలిన స్వతంత్ర మార్గరూపక రచనకాని జరుగలేదు. ప్రాచీనాంధ్రులు సంస్కృతరూపకములను రచించియున్నను తెలుగులో రూపకరచన చేయుటకు పూనుకొనలేదు. సంస్కృతరూపకముల ననువదించుటకు పూనుకొనినవారు కూడ వానిని శ్రవ్యకావ్యములనుగా మార్చివేసినారు. ఇందులకు కారణము లెట్టివైనను మార్గనాటకాభావము మాత్రము సత్యము. ఇట్టిస్థితిలో వల్లభామాత్యుడు ఒక గొప్ప సాహస కార్యమునకు పూనుకొనెను. అదియే క్రీడాభిరామరచన. అది నిజముగా ఆనాడు సాహసకార్యమే అని అనుటకు "అతఁడెంతటివాఁడు, ప్రేమాభిరామమనఁగ నెంతటియది, దాని ననుసరించి వీథియను రూపకము మదివెరపులేక తిప్పవల్లభుండెట్లు తెనుఁగుఁజేసె" అనెడి ప్రస్తావనలోని పద్యము బలము నొసంగుచున్నది. దశవిధరూపకములలోను వీథి తక్కువరకము. అట్టిదానిని రచించినవాడు త్రిపురాంతకుడు; దానిని తెనుగుజేసిన వాడు మది వెరపులేని వల్లభామాత్యుడు.

## విజయనగరరాజుల కాలము

రెడ్డిరాజుల కాలములో వికసించిన నృత్య-నాట్య-సంగీతములు విజయనగరరాజుల కాలములో మఱింత పుష్టివహించినవి. శ్రీకృష్ణదేవరాయల కాలము లలితకళల ఉన్నతికి పరాకాష్ఠ యని చెప్పవచ్చును; ఆయన 'సాహితీ-సమరాంగణ చక్రవర్తి'!

విద్యానగరరాజ్యప్రతిష్ఠాపకుడును, వేదభాష్యకారుడును అయిన విద్యారణ్యస్వామి (క్రీ. శ. 1320-80) 'సంగీతసార' మనెడి లక్షణగ్రంథమును రచించినట్లు గోవిందదీక్షితుడు 'సంగీతసుధ' లో పేర్కొనెను. విద్యారణ్యుడు 15 మేళకర్తరాగములను నిర్ణయించి, ప్రచుర ప్రయోగముగల ఏబది రాగములను నిర్దేశించెనట.[1] విద్యారణ్యస్వామి గౌరవార్థము కూడిన సభలోని వారి నానందపరచుటకు భాస్కరకవియను నతడు "ఉన్మత్త రాఘవ" మనెడి ప్రేక్షణకమును రచించెను (ఇది ముద్రితము). ఇందలి రామవిరహవర్ణన విక్రమోర్వశీయ చతుర్థాంకమును బోలియున్నది. రెండవ హరిహర రాయల (కీ. శ. 1378-1404) పుత్రుడగు విరూపాక్షుడు 'నారాయణ విలాస' మనెడి 5 అంకముల నాటకమును రచించెను (S. V. H.P. 53). ఇతడు 'ఉన్మత్తరాఘవ' మనెడి ఏకాంక రూపకమును కూడ రచించెనట (Catalogue of MSS. in Adyar library-II-27). తాను భరతవిద్యయందు ప్రసిద్ధుడనని విరూపాక్షుడు నటీముఖముగా చెప్పుకొనినాడు.

రెండవ (ప్రౌఢ) దేవరాయల[2] (కీ. శ. 1422-46) రాజప్రతినిధి యగు గోపేంద్ర తిప్పభూపాలుడు 'తాలదీపిక' యనెడి లక్షణగ్రంథమును రచించెను. తంజావూరులోని తాల

దీపిక వ్రాత ప్రతిలో "సంగీతదీపిక" అనెడి తెలుగు టీక కూడకలదు. 'డిండిమకవిసార్వ భౌమ' బిరుదాంచితుడగు మొదటి అరుణగిరినాథుడు (ప్రౌఢ దేవరాయల ఆస్థాన పండితుడు) "సోమవల్లీయోగానంద"మనెడి ప్రహసనమును రచించెను (T.C. II-2276). ఇందొక యోగి కులభ్రష్టయైన స్త్రీతో విహరించుట వర్ణితమైనది.

పావాచలాధీశ్వరుడును, చంపకపురపురందరుడును అయిన గంగాదాసుడు స్వచరిత మగు "గంగాదాసప్రతాపవిలాస". మనెడి నాటకమును ప్రదర్శింపజేయుట కుత్సహించుచుండగా మల్లికార్జునరాయల (క్రీ. శ. 1447-65—ప్రౌఢదేవరాయల పుత్రుడు) ఆస్థాననటుడును, 'రిపు నాట్యకారవారణమదనివారణపంచాన' బిరుదాంచితుడును అయిన 'నాట్యరసికు' డనెడి నటుడు అందులకు పూనుకొని, రాజాజ్ఞపొంది, గంగాదాసుని సందర్శించి ఆ నాటకమును చక్కగా ప్రదర్శించెనట,[3] దీనినిబట్టి నాటి విజయనగరనటులు పరరాష్ట్రములకు కూడ వెడలి తమశక్తిని ప్రదర్శించెడివారని స్పష్టమగుచున్నది. మల్లికార్జునుని ఆస్థాన విద్వాంసుడగు చతురకల్లినాథుడు శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమునకు 'కలానిధి' అనెడి ప్రామాణికమగు వ్యాఖ్యను రచించెను. ఇతడు అభినవభరతాచార్య, రాయబయకార బిరుదాంచితుడు.

రెండవ దేవరాయల కాలములో నృత్యకళ కూడ చాల అభివృద్ధిలోనున్నదనియు, వారాంగనలు నృత్యకళకు పట్టుగొమ్మలనియు నాడు విజయనగరసామ్రాజ్యమును సందర్శించిన అబ్దుల్‌రజాక్ అను పర్షియా రాయబారి వ్రాసిన వ్రాతలనుబట్టి తెలియుచున్నది.[4] ఈ కాలములోనే సంకీర్తనాచార్యుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు వేలకొలది కీర్తనలు రచించుటయే కాక 'సంకీర్తన లక్షణ' మనెడి లక్షణగ్రంథమును కూడ రచించెను. దీనిని అన్నమాచార్యుల మనుమడు చినతిరుమలాచార్యుడు ఆంధ్రీకరించెను. అన్నమాచార్యులతరువాతి దేశభాషావాగ్గేయకారు లందరకును ఇది ప్రమాణగ్రంథము.

శక 1382 నాటి ఒక తమిళ శాసనమునుబట్టి సాలువ నరసింహరాయల నగరులో ఒక 'నాటకశాల' ఉండినట్లు తెలియుచున్నది.[5] శ్రీమన్ మహా మండలేశ్వర మీసరగండ కట్టారి సాలువ నరసింగదేవ మహారాజు 'నాటకశాల'కు చెందిన నట్టువ తిమ్మనాయకుని కుమారుడగు నట్టువ 'తిప్పానాయకు' నకు ఇవ్వబడిన దానాదుల వివరము ఆశాసనమందు కలవు. బహుశః ఇది చంద్రగిరిలోని రాచనగరుకు సంబంధించిన నాటకశాల అయి యుండును.

శ్రీకృష్ణదేవరాయల సవతిఅన్నగారైన వీరనరసింహరాయల (క్రీ. శ. 1505-1509) కాలములో కూచిపూడి బ్రాహ్మణభాగవతులు సుప్రసిద్ధమైన తమ భామాకలాపమును (లేదా మరియొక నృత్యప్రక్రియను) రాచనగరులో ప్రదర్శించినట్లు 'మాచుపల్లి కైఫీయతు' వలన తెలియుచున్నది.[6] ఆ నృత్యప్రదర్శనసమయములో కూచిపూడి భాగవతులు సంబెట గురవరాజు అనెడి సామంతుని దుశ్చర్యలను ప్రదర్శించి రాయల దృష్టినాకర్షించిరి. రాయలు వివరములు తెలిసికొని, కోపించి, ఆ సామంతుని శిక్షించెను. కాగా, కూచిపూడి భాగవతులు తమ నాట్యకళా శక్తిచేత ప్రజాపీడనము తొలగించుట వంటి జగద్ధితకార్యములను సాధించిన సత్యము గమ

నార్హము. వీరిని గూర్చి తరువాతి అధ్యాయములో ప్రసంగింతును. వీరనరసింహరాయల ఆస్థానములోనే కుమారడిండిముడు (రెండవ అరుణగిరినాథుడు) 'వీరభద్రవిజయ' మనెడి డిమమును రచించియుండెను (T.C. III-2832). ఇది భూపతిరాయపురమందలి రాజనాథదేవోత్సవ సమయమున ప్రదర్శింపబడెనట. కుమార డిండిముని అల్లుడు 'స్ఫులింగకవి' సత్యభామా పరిణయ మనెడి ఐదు అంకముల నాటకమును రచించెను (T. C. III-2953). ఇది ములందలో దైవోత్సవసమయమున ప్రదర్శింపబడెనట. ఈకాలములోనే భండారు విఠలుడు సంగీత రత్నాకరమునకు తెలుగులో వ్యాఖ్యరచించెను. ఇతడు గుజరాత్ సుల్తాను అయిన గియాజుద్దీన్ చేత 3,000 తులముల బంగారమును బహుమతిగా పొందెనని తెలియుచున్నది.

ఆంధ్రుల సంస్కృతిచరిత్రలో కృష్ణరాయల యుగమొక స్వర్ణయుగము. నృత్య-నాటక-సంగీతము లానాడు మరింత యభివృద్ధి నందినవి. కృష్ణరాయలు స్వయముగా 'జాంబవతీ కళ్యాణ' మనెడి సంస్కృతనాటకమును రచించెను. (S. V. H. P. 142-43). అది విరూపాక్ష దేవుని చైత్రోత్సవమును తిలకింపవచ్చిన సుమనస్సుల యెదుట ప్రదర్శింపబడినదట.[7] కృష్ణరాయలు 'ఉషాపరిణయ' మనెడి రూపకమును కూడ రచించినట్లును, అది వనపర్తిసంస్థానములో ఉన్నట్లును తెలియుచున్నది. తాను 'రసమంజరి' యనెడి లక్షణగ్రంథమును రచించినట్లు ఆముక్తమాల్యదలో చెప్పుకొనెను కాని అది లభ్యముకాలేదు. క్రీ. శ. 1514 నాటి ఒక శాసనములో[8] (కేశవస్వామి ఆలయములోని స్తంభముమీద) రాయలనాటి నటులపేర్లు పేర్కొనబడుట గమనార్హము—తిరుపత్తూరులోని సోమరసకుమారుడైన కర్ణంబసపరస చేగయ్య కుమారుడైన 'నట్టువ నాగయ్య'కు పోతవరం నివాసిఅయిన నట్టువ తిమ్మయ్య కుమార్తెఅయిన 'పాత్రి'కి "తాయికుం (కొం)డ నాటకము" ను ప్రదర్శించి నందులకు కొంత భూమిని దానముచేసిన విషయము నీ శాసనము వివరించుచున్నది. ఈ తాయికొండ నాటకస్వరూప మెట్టిదో తెలియదు. తిమ్మయ్య కుమార్తె పేరు ఇందు పేర్కొనబడలేదు; కాని, ఆమె 'పాత్రి' యట! 'పాత్రి' యనగా నర్తకియని అర్థము. కాగా తాయికొండ నాటకము 'నృత్యనాటకము' కావచ్చును. ఈ నాటకమందు నాగయ్యయును, పాత్రియును పాల్గొనుటనుబట్టి ఆనాడు స్త్రీపురుషులు కలిసియే నాటకప్రదర్శనము లిచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఆ పాత్రి తండ్రి కూడనటుడే అగుట గమనార్హము. అనగా నాడు నటన వంశపారంపర్యముగా వచ్చుచున్న వృత్తియన్నమాట.

మరియు కృష్ణరాయలు 'కృష్ణ' డనెడి సంగీతాచార్యునియొద్ద స్వయముగా వీణ నభ్యసించెననియు, గురుదక్షిణగా అమూల్యములగు రత్నాదులనొసంగెననియు, 'రాఘవేంద్రవిజయ' మనెడి కావ్యమునుబట్టి తెలియుచున్నది. గజపతుల ఆస్థానమునుండి వచ్చి విజయనగరములో స్థిరపడిన భండారు లక్ష్మీనారాయణ (విఠలుని పుత్రుడు) రాయల ఆస్థానములో రాయబయకారుడు; 'అభినవభరతాచార్య' బిరుదాంచితుడు. ఇతడు 'సంగీతసూర్యోదయ' మనెడి లక్షణ గ్రంథమును రచించెను.[9] దీనికి 'లక్ష్మణ భరత' మనెడి నామాంతరము కలదు. కృష్ణరాయల ఆదరణములో లక్ష్మీనారాయణ అంతఃపురస్త్రీలకు కూడ సంగీతమును నేర్పినట్లు తెలియుచున్నది. రాయలు ఆముక్తమాల్యదలో నట్టువకత్తెల వీణావాదనమును (I-62), స్త్రీలు 'మేఘ రంజి

రాగము' ను ఆలపించి మేఘములను కల్పించుటను (II-64), వివిధవాద్యములు మ్రోగుటను (IV-35) వర్ణించియుండుట గమనార్హము.[6] 'క్రిష్టవాడిఫిగరెడో' అను నతడు విదేశముల నుండి తన వెంట తెచ్చిన కొన్ని వాద్యములను కృష్ణరాయలకు బహూకరించినట్లు పేయసు పేర్కొనెను (Forgotten Empire. P. 251 and N. (3)).

సంగీత-సాహిత్య-నాట్యప్రియుడే కాక కృష్ణదేవరాయలు నృత్యప్రియుడు కూడను. రాయల ఆస్థానములో 'రంజకం' వంశమునకు చెందిన నర్తకీనర్తకులు కలరని తిరుపతి దేవస్థానము వారు ప్రకటించిన శాసనముల మూడవ సంపుటమును బట్టి తెలియుచున్నది.[10] 'విద్వత్సభారాయ' బిరుదాంచితుడగు కృష్ణదేవరాయలు కొంత తడవు విద్వద్గోష్ఠి నెరపి పిమ్మట నృత్యమును తిలకించెడివాడు. ఆ నృత్యమేళమునకు నాయకుడు తిరుమలనాథుని పుత్రుడు 'శ్రీరంగ రాజు'. ఆ మేళములో సుప్రసిద్ధనర్తకి శ్రీరంగరాజు పుత్రికయగు 'కుప్పాయి' లేదా 'కుప్పాసాని'. శ్రీరంగరాజునకు 'విద్వత్సభారాయరంజక' అనెడి బిరుదొసంగబడెను; ఈ బిరుదు కుప్పాయికి కూడ ఇవ్వబడినది. చివరకు 'రంజకం' అనెడిది ఇంటిపేరుగా కూడ మారినది. కుప్పాయికి ఇరువురు కుమార్తెలు కలరు—తిరుమలమ్మ, ముద్దుకుప్పాయి. ముద్దుకుప్పాయి అచ్యుతరాయల నగరులోని నర్తకి. 6-6-1531 తేదీనాటి శాసనమునుబట్టి అచ్యుతరాయ లీమెను తిరుపతి గోవింద రాజస్వామివారి ఆలయములో దేవదాసిగా నియమించెనని తెలియుచున్నది. తిప్పసాని కుమార్తె యగు 'తిరువెంకట మాణిక్కం' అను నామెకు గౌరవచిహ్నముగా పల్లకి ఒసంగబడినట్లు ఇంకొక శాసనమునుబట్టి తెలియుచున్నది. ఈ నర్తకీ-నర్తకులు పెక్కురు నాటి దేవాలయములకు దానము లొసంగినట్లు కూడ శాసనములు తెలుపుచున్నవి (ఈ శాసనములలో ఎక్కువభాగము తమిళ భాషయందున్నవి). బెల్గుల నివాసినియును, చారుకీర్తిపండితాచార్యుని శిష్యురాలును అయిన 'మంగాయి'కి "రాయపాత్ర చూడామణి" అనెడి బిరుదు కలదట (E. C.-No. 341).

రంజకం శ్రీరంగరాజు, ఆతని కుమార్తె కుప్పాయి తమ నృత్యవిద్యను రాయల వారి 'నృత్యశాల' లో ప్రదర్శించుచుండెడివారు. ఆ నృత్యశాలలో అంతఃపురస్త్రీలు కూడ నృత్యము నేర్చుకొనుచుండెడివారట. ఆ నృత్యశాలను స్వయముగా సందర్శించిన పేయసు (Paes) అను నాతడు దానిని విపులముగా వర్ణించియుండెను.[11] అందలి స్తంభములును, కుడ్యములును కూడ ఏదో ఒక నృత్యభంగిమమును ప్రముఖముగా చూపుచుండెనట. ఇంత వర్ణించియు ఈ నృత్యశాల పేరేమో పేయసు పేర్కొనలేదు.[12] క్రీ.శ. 1599 నాటి ఒక శాసనమును బట్టి (E. C. XII-Kg. 29 P. 36) ఎలహంక నాడు ప్రభువు అయిన ఇమ్మడి హిరికెంపయ గౌడుని నగరు నృత్యశాల (State dancing saloon) కు 'పట్టద-నాటక-శాలె' అను పేరు కలదని తెలియుచున్నది.

జగన్నాథపండితరాయల తాత కేశవభట్టు కూచిపూడి నాట్యవేత్త అనియు, కృష్ణరాయలను మెప్పించి 'ముంగండ' అనెడి గ్రామమును అగ్రహారముగా పొందెననియు ఒక గాథ కలదట.[13]

క్రీ. శ. 25-1-1518 నాటి ఒక శాసనమునుబట్టి బ్రహ్మేశ్వరాలయము నందలి ఒక నాట్యాచార్యునకు కృష్ణరాయలు భూదానమునుచేసినట్లు తెలియుచున్నది (Rangacharya-Top-list, II-1222). నిజపట్టాభిషేకోత్సవసమయమున కృష్ణరాయలు విరూపాక్షాలయములో 'రంగమంటపము' కట్టించెనట (శ్రీ వేదంవారి ఆముక్తమాల్యద పీఠికానుబంధము-పుట 147).

కొండవీటి పాలకుడును (క్రీ. శ. 1520-33), తిమ్మరుసు మంత్రి మేనల్లుడును అగు నాదెండ్ల గోపమంత్రి కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు ఉత్తమమైన వ్యాఖ్యను రచించెను. ఇతడు తెలుగులో 'కృష్ణార్జున సంవాద' మనెడి ద్విపదకావ్యమును కూడ రచించెను. సంవాదకావ్యములలో నిదిఉత్తమమైనది.

కృష్ణరాయలనాటి లలితకళాప్రియత్వము నాటి సాహిత్యమునందును ప్రతిఫలించు చున్నది. అల్లసాని పెద్దన మనుచరిత్రలోను (V-63), రామరాజభూషణుడు వసుచరిత్రలోను (I-103), తాళ్ళపాక తిరుమలయ్య వైరాగ్యవచనగీతములలోను (పుట-108) నాటక శాలను పేర్కొనియున్నారు. నాటకాది ప్రశంసలు నాటి కావ్యములం దనేకములు గలవు. పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నములో నాటకప్రదర్శన విధానము చాల విపుల ముగా వర్ణితమైనది. కాని ఈ వర్ణనమంతయును మూలమైన హరివంశమందే కలదు. దానినే సూరన అనుసరించెను. అయినను సూరన సొంత కల్పనలు కొన్ని కలవు—1. చిన్నివటులు భద్రునిచే పొగడించుకొని, మరల వానిని నిందించుట; 2. గంగావతరణ నాటకప్రదర్శన ములో రంగాలంకరణమును ఒక సీసపద్యములో వర్ణించుట. ఇందు మొదటి కల్పన నటుల పతనావస్థను సూచించుచున్నది.[14] వీరెల్లరు బ్రాహ్మణేతరులే.[15] (కూచిపూడివారొక్కరే బ్రాహ్మణులు. వారు నాట్యకళకు గౌరవమును కూర్చుటయేకాక తాము సమ్మానార్హులైనారు). ఇంక రెండవ కల్పన నాటకప్రదర్శనమందలి నైపుణ్యమునకు తార్కాణము[16]. నాట్య శాస్త్రమున రంగాలంకరణమునకు సూచనలున్నప్పటికిని సంస్కృతనాటకప్రదర్శకులు కేవలాభి నయముచేతనే సర్వమును కన్నులకు కట్టునట్లు చేయుదురు. ఇంక సూరన చేసిన వర్ణనను బట్టి రాయలనాటికి రంగాలంకరణమందు ప్రత్యేకశ్రద్ధ వహించుట ప్రారంభమైనదని చెప్పగలము. కాగా పై కల్పనలందు సూరన తన నాటి పరిస్థితినే చొప్పించి వర్ణించెననుట అసమంజసము కాజాలదు.

### ఆంధ్రప్రసన్నరాఘవనాట్యప్రబంధము[17] :

క్రీడాభిరామ రచనతో ఇంచుమించుగా సరిసమానమైన రచన యొకటి ఈ కాలమున వెలువడినది. అదియే 'ప్రసన్నరాఘవనాటకాంధ్రీకరణము'. ఆంధ్రీకర్త బొడ్డుచర్ల తిమ్మయ మంత్రి (క్రీ. శ. 16 వ శతాబ్దము). కళాపూర్ణోదయకృతిపతి యగు కృష్ణభూపతి తాతయును, ఈ ఆంధ్రీకరణకృతిపతియగు నంద్యాల తిమ్మరాజు తాతయును స్వయముగా నన్నదమ్ములు. '...ఆరాజచూడారత్నంబునకు జగత్ప్రసిద్ధంబుగా ప్రసన్నరాఘవంబను మహానాటకం బంధ్ర నాట్యప్రబంధముగా ననుసంధించి యంకితంబు గావించి' తదీయ వంశావతారవర్ణనము చాల

విపులముగా చేసినాడు తిమ్మయమంత్రి. అటు పిమ్మట ప్రస్తావన, విష్కంభ ప్రవేశకములు, అంకములు మొదలగునవన్నియు వేర్వేరుగా మార్పులు లేకుండ నట్లే యాంధ్రీకరింపబడినవి.

ఉదా : (ప్రథమాంక ప్రారంభము)—

— ఇది విష్కంభము —

క. ఆతరువాతఁ బ్రవేశంబై తనరెడు మాగధద్వయంబుననుగుణా
స్వీతుడు నూపురకుడు విఖ్యాతిన్ మంజీరకుని బ్రియంబునఁ బలుకున్. 176

సీ. అంగజాహితశైల శృంగాగ్రములబోల్చు ప్రసవిత కర్ణికారము లనంగ
భాసురస్ఫాటిక ప్రాసాదవలభిరేఖలనించు పసిడి సింగము లనంగ
నుద్దండపుండరీకోపరిస్థలముల నవతారమొందిన యజు లనంగ
స్నిగ్ధదుగ్ధాబ్ధివీచికలలోఁ గనుపట్టు లలితోదితేందుమండలము లనఁగ
రాజభానూపమాన విరాజమాన దంతిదంతశలాకావితానవిరచి
తాంచ దురుమంచికలఁగుంకుమాంగరాగకలితులై యొప్పెదరు కంటె కంటె నృపులు ?

వ. అన మంజీరకుం డోయి నూపురక యిటు చూడు మని.

క. చెలగెడు తమతమ దిక్కుల నిలచిన నృపవరులచేత నిబిడంబగు మ
చ్చుల బవరి సీతపెండ్లికిఁ దెలియం ధనువెత్తి కదియు దిగ్వలయమనన్.

క. నటుఁడాడింపగ నాడెడు పటుగతి నొక బొమ్మ మంచభాగమున మహా
నటచాపారోపణగతి విటియగు నీ నృపుల చిత్తవృత్తియుబోలెన్,

వ. అన నూపురకుండు మంజీరకునితో నిట్లనియె.

గీ. మహిత సీతావధూకరగ్రహణ వాసనావసంతరమాస్ఫూర్తి ననిచినట్టి
పులకకళికలఁ దగు నాత్మభుజరసాలశాఖ లీక్షించు నీతఁడే జనవిభుండు ?

వ. అనవుడు— 183

ప్రతిఅంకము చివరను మాత్రము ప్రబంధములందలి అశ్వాసాంతగద్యను పోలిన పద్య మొకటి వ్రాయబడినది (అన్నింటను మొదటిమూడుపాదములు సమానములే).

క. నందేల తిమ్మరాజ పురందరరచిహ్న ప్రసన్నరాఘవనాట్యా
మంద ప్రబంధరాజమునందు ద్వితీయాంకమయ్యె నార్యస్తుతమై.

క్రీడాభిరామమునందు కంటె కూడ ఇందలి సంభాషణములు సూటిగా నున్నవి; పాత్ర వర్ణనలను, అనవుడు నావుడులను కుండలీకరణములందుంచినచో నెట్టి మార్పులును లేకయే ఇది చక్కని తెలుగు పద్యనాటకము కాగలదు[18]. శైలి కొంతవరకు జటిలపదభూయిష్ఠమైనను, ప్రసన్నమై ధారాళముగా సాగినది. ఈ కవియైనను కాలప్రభావమునకు లొంగక, సాహసించి, కేవల నాటకరూపముగానే దీని ననువదించియున్నచో, ఆ మార్గమున నింకను పెక్కుమార్గ నాటకము లాకాలమందే యుద్భవించియుండెడివి.

లభ్యమైనంతలో తొలి యక్షగానముగా పరిగణింపబడిన చక్రపురి రాఘవాచార్యుని (1545 ప్రాంతములు) 'విప్రనారాయణచరిత్ర యక్షగానము' ఈ కాలమునాటిదే.[19] సుప్రసిద్ధమైన యక్షగానము కందుకూరి రుద్రకవి (1568 ప్రాంతములు) 'సుగ్రీవవిజయము' కూడ ఈ కాలమున వెలువడినదే. ఇది కందుకూరి జనార్దనస్వామివారి వసంతోత్సవసమయమున ప్రప్రథమముగా ప్రదర్శింపబడెనట.

కృష్ణరాయల తమ్ముడు అచ్యుతరాయలు (1530-42) 'తాళకళాబ్ధి' అనెడి సంగీత లక్షణగ్రంథమును రచించెను. దీనికి సోమభట్టు అనునతడు తెలుగు వ్యాఖ్య వ్రాసెనని తెలియుచున్నది. అచ్యుతరాయలు 'సాహిత్యసార' మనెడి లక్షణగ్రంథమునుకూడ వ్రాసెను. కృష్ణరాయల అల్లుడగు రామరాయల (క్రీ. శ. 1542-64) ఆస్థానములోని రాయబయకారుడు రామామాత్యుడు రామరాయల ఆదేశము ననుసరించి 1550 లో 'స్వరమేళకళానిధి' అనెడి కేవల సంగీతలక్షణగ్రంథమును రచించెను. నాటి లక్ష్యలక్షణ రీతులను పరిశీలించి ఈతడు సమన్వయ పూర్వకముగా తన గ్రంథమును రచించెను. ఇతడు వీణాభేదములలో 'అచ్యుత రాజేంద్రవీణను' పేర్కొనుట గమనార్హము. బహుశః ఈ కాలమునకు చెందినవాడో, లేదా కొంత తరువాతివాడో అయిన పోలూరి గోవిందకవి 'రాగతాళచింతామణి', 'తాలదశ ప్రాణ దీపిక' అనెడి రెండు లక్షణగ్రంథములను తెలుగులో రచించెను; 'నాట్యశాస్త్రు' మందలి ఆయా భాగములను అంతయో ఇంతయో తెనిగించిన ప్రథముడితడే.

క్రీ. శ. 1550 ప్రాంతముల చిత్రకవి పెద్దనార్యుడు 'లక్షణసార సంగ్రహ' మనెడి ఛందోగ్రంథమును రచించెను[20]. ఇందు మూడవ ఆశ్వాసములో 49 గద్యపద్యములలో రూపక లక్షణము చెప్పబడినది. ఇది కేవలము 'దశరూపకనాటకసంజ్ఞాప్రకరణము' మాత్రమే. ఇందు ఉదాహరణములు అసలేలేవు. దశరూపకములకు తప్ప ఇంక దేనికిని లక్షణనిర్వచనములు కూడ లేవు. కేవలము రూపకసామగ్రి, అందలి విభాగములు, తదంగములు మాత్రమే పేర్కొనబడినవి. అందుచే దీని ఉపయోగ మల్పము. కాని పెద్దన పదునారు ఉపరూపకముల పేర్లను పేర్కొనుట ఒక విశేషము. అన్ని రూపకములను ఇతడు 'నాటక' పదముతో వ్యవహరించుట గమనార్హము. ఇతడచ్చటచ్చట అమృతానందయోగిని అనుసరించినట్లు కన్పట్టుచున్నది. తెలుగులో నాటకలక్షణమును చెప్పుటకు పూనుకొనిన ప్రథముడితడే. ఆ విషయమును కూడ ఇతడు ప్రారంభములో చెప్పుకొనెను.

రామరాయల తమ్ముడగు తిరుమలరాయలకు వసుచరిత్రను కృతి యొసంగిన రామరాజ భూషణుడు తాను 'సంగీతకళారహస్యనిధి' నని చెప్పుకొనెను (1-16)[21]. వసుచరిత్రలోని పద్యములనెల్ల వీణమీద చక్కగా పాడవచ్చుననెడి సత్యము వేత్తలకు విదితమే. ఆదర్శప్రాయమైన సంగీతశాల యెట్లుండవలెనో రామరాజభూషణుడు వర్ణించి యుండెను[22]. మరి కృష్ణరాయల సంగీతశాలయును ఇట్టిదే అయియుండును. పింగళిసూరన కళాపూర్ణోదయమును కృతిగొన్న నంద్యాల కృష్ణవిభుడు 'సంస్తవ్యనవీనగానసరసత్వ మహత్త్వ మరుత్తనూజుడు' గా ప్రశంసింపబడెను (కళా. పూ. V. 227). కుకుత్సవిజయకర్త యగు మట్ల అనంతభూపా

లుడు 'సంగీతజనికీర్తి'యట; మరియు వానిని 'వైణికాగ్రేసరుల్వాణి' యందురట. (క. వి. I-94 ; 29). 'పాండురంగమాహాత్మ్య' కృతిపతియగు విరూరి వేదాద్రిమంత్రి పూర్వీకులలో నొకడగు కోన మంత్రి 'గానకళాతుంబరుఁడనగా' ప్రసిద్ధి చెందెనట. (పాం. మ. I-47) ఆయా రాజుల ఆస్థానములందు పలువురు నృత్య-సంగీతవేత్త లున్నట్లు కావ్య కృత్యవతరణికల వలన స్పష్టమగుచున్నది.

రెడ్డిరాజులు వసంతోత్సవములను నిర్వహించినట్లే విజయనగర రాజులు 'మహర్నవమి' ఉత్సవములను నిర్వహించెడివారు. ఇవి ఆశ్వయుజమాసమున తొమ్మిది రోజులు జరుగును. ఈ ఉత్సవములను రజాక్ తోపాటు పేయసుకూడ మరింత విపులముగా వర్ణించెను. ఈ ఉత్సవములందు వీరత్వాది ప్రదర్శనముల కెక్కువ ప్రాధాన్యము కలదు. నాడు దేవదాసీలు, రాజనర్తకీమణులు, పట్టణమందలి వారాంగనలు అని నర్తకులు మూడు రకములుగా నుండెడివారు. దైవసేవకు అంకితలైన దేవదాసీలు పవిత్రజీవనము గడిపెడివారు. నాటి వారాంగనలకు ఎనలేని గౌరవము కలదు. వారు రాజు నెదుట తాంబూల సేవనము చేయుదురు! ఈ వేశ్యలను 'నృపతి వెలియంతిపురము'గా నెన్నదగునట!! (ఆముక్తమాల్యద-I-60). ఈ వేశ్యల వలన గ్రహింపబడిన 12 వేల పణముల పన్నుతో నగరపు కావలివాండ్ర జీతబత్తెములు చెల్లిపోవుచుండెనట ! ! !

## తంజావూరురాజుల కాలము

1550 ప్రాంతముల చెవ్వప్పనాయకుడు తంజావూరున కధిపతి అయ్యెను. 1565 లో తళ్లికోట యుద్ధానంతరము విజయనగరసామ్రాజ్యము ఛిన్నాభిన్నము కాగా ఈ నాయకరాజు స్వతంత్రించెను. చెవ్వప్పనాయకుని కుమారుడు అచ్యుతప్పనాయకుడు[1] (1580-1614). ఆయన తదుపరి ఆయన కుమారుడు రఘునాథరాయలు (1614-1631) రాజయ్యెను. ఇతడు తండ్రి కాలములోనే క్రీ. శ. 1600 నుండియు రాజ్యభారమును వహించినట్లు తెలియుచున్నది. రఘునాథనాయకుని కుమారుడే విజయరాఘవనాయకుడు (1633-73). విజయనగర సామ్రాజ్యమున కృష్ణదేవరాయ లెట్లు సాహితీ సమరాంగణ చక్రవర్తియో తంజావూరున రఘునాథరాయ లట్లు. రఘునాథ-విజయరాఘవనాయకు లిరువురును తాము స్వయముగా సంగీత-సాహిత్య-నాట్యవేత్త లగుటయేకాక తాము పెక్కు గ్రంథములను రచించి, రచింపజేసిరి; వీరి కాలమున గుర్తింపవలసిన విశేషములలో మొదటిది రాజాస్థానమున పెక్కురు కవయిత్రులుండుట; రెండవ విశేషము ఈ కాలము యక్షగాన-వీథినాటకములకు స్వర్ణయుగమగుట.

మహావిద్వాంసుడగు గోవిందదీక్షితుడు రఘునాథరాయల ప్రధాని. ఇతడే 'సంగీతసుధ'ను రచించి, రఘునాథనాయకుని పేరు పెట్టెనని గోవిందదీక్షితుని రెండవ కుమారుడు వేంకటమఖి చతుర్దండిప్రకాశికలో సూచించియున్నాడు. అయినను రఘునాథుడు స్వయముగా సంగీత-నాట్యవేత్త. యజ్ఞనారాయణదీక్షితుని (వేంకటమఖి అన్న) 'సాహిత్యరత్నాకరము'న (VI-9-29 శ్లో.) రఘునాథనాయకుడు ప్రప్రథమముగా చేసిన 'వీణకచేరి' విపులముగావర్ణిత

మగుట గమనార్హము. సంగీతసుధ లోని శ్లోకములను బట్టి రఘునాథుడు జయంతసేనాది రాగములను, రామానందాది తాళములను క్రొత్తగా కల్పించుటయే కాక అన్నిరాగములను పాడుటకు అనువుగా తన పేరుమీదుగా రాగమేళనమును కనిపెట్టి[2] వీణావాద్యమునకు వికాసమును చేకూర్చెనని తెలియుచున్నది. 'యక్షైఘగీతమపి గానశైలిమ్' అని యక్షగానపదము ప్రప్రథమముగా నిర్వచింపబడినది సంగీతసుధలోనే.

రఘునాథుడు దేశినృత్యములను బాగుగా అభిమానించినట్లు చెప్పవచ్చును. తన వాల్మీకిచరిత్రలో (III–పుట–42) 'పేరణి, దండలాస్యమును, బెక్కణి, కుండలి నాఁజతుర్విధోదారములైన నాట్యములు" అని పేర్కొనుట గమనార్హము. రఘునాథుని ఆదరణములో పెక్కురు నాట్యకత్తెలు కలరని విజయరాఘవుని కావ్యములను బట్టియు, చెంగల్వ కాళకవి రాజగోపాలవిలాసమును బట్టియు తెలియుచున్నది. అందు ఆ నర్తకీమణుల పేర్లును, వారు ప్రసిద్ధినందిన ఆయా నృత్యముల పేర్లును కూడ ఒసంగబడెను[3]. వీరెల్లరును ప్రసంగాంతరమున చేమకూర వేంకటకవి వర్ణించినట్లుగా 'చెలఁగియింపు గనఁగఁ, బాడఁ, జెప్పఁ, జదువ, వలవ, వలపింప నేర్చిన యలరుఁబోండ్లు; విపుల భరతకళాశాస్త్రనిపుణులైన బిరుద పాత్రలు' (విజయవిలాసము–I–80).

రఘునాథనాయకుని రాజ్యములో పెక్కు నాటకశాల లున్నవని విజయవిలాసమునుబట్టి తెలియుచున్నది. రఘునాథుని నగరులోనే 'నవరత్నమయమైన నాటకశాల' కలదట[4]. (విజయరాఘవుని 'రఘునాథనాయకాభ్యుదయము'–పుట,17). నగరులోనేకాదు శృంగాటకములయందు కూడ నాటకశాలలు కలవట (విజయరాఘవుని 'రఘునాథాభ్యుదయ' యక్షగానము–పుట–13), కామరసు వేంకటపతి సోమయాజి రచించిన 'విజయరాఘవచంద్రికావిహార'మందలి నాయిక 'బైటినాటకశాల పడుచు' అట. అట్టివారింకెందరు కలరో? దీనినిబట్టి నాటి నాట్యకత్తెలు సంఖ్యాతీతలగుట స్పష్టమగుచున్నది. అందుచేతనే చేమకూర వేంకటకవి రఘునాథరాయలను 'భరత విద్యాధురంధరుడౌట రంగస్థలంబు రామాలంకృతంబుచేసె' అని శ్లేషలో వర్ణించియుండెను. (విజయవిలాసము–I–21). రఘునాథరాయలు ఆస్థానమందలి నృత్యములనే కాక దేవాలయ నృత్యములను కూడ పోషించెను. ఆతడు శ్రీరంగపతి ఆలయమందు 'నాట్యముల' నిమిత్తము దానము లొసంగెను (రాజగోపాలవిలాసము–I–45).

ఈ కాలమునకూడ కొన్ని సంస్కృతరూపకములు రచింపబడెను. చెవ్వప్ప నాయకునకు ఆశ్రితుడైన రత్నఖేట శ్రీనివాసదీక్షితుడు 18 రూపకములను రచించెను. అందులో 'భైమీపరిణయము', 'భావనాపురుషోత్తమము' అనెడి రూపకములు కలవు. ఈతని కుమారుడగు రాజచూడామణిదీక్షితుడు 'శృంగారసర్వస్వ' మనెడి భాణమును, 'ఆనందరాఘవ' మనెడి ఐదు అంకముల నాటకమును, 'కమలినీకలహంస' మనెడి నాటికను (ఇది ముద్రితము)రచించెను. ఇతడు తన ఏడవ ఏటనే కమలినీకలహంసమును రచించినట్లు తత్ప్రస్తావనయందు కలదు. రఘునాథుడు చిదంబరము వెళ్ళినప్పుడు తదాస్థానమందు కూడ రాజచూడామణిదీక్షితుని రూపకములు ప్రదర్శింపబడినట్లు ఆనందరాఘవప్రస్తావననుబట్టి తెలియుచున్నది. రఘునాథుడు

గోవిందదీక్షితునకు శిష్యుడుకాగా, తత్పుత్రుడగు యజ్ఞనారాయణదీక్షితుడు రఘునాథుని శిష్యుడయ్యెను; ఇతడు 'రఘునాథవిలాస' మనెడి 5 అంకముల నాటకమును రచించెను. ('సహృదయ' అనెడి సంస్కృత పత్రికలో ముద్రితము), పేరుసూరి యను నతడు తెలుగు 'వసుచరిత్ర'ను "వసుమంగళనాటకము" అను పేర నాటకీకరించెను (D. C. XXI-8497). ఈ ఐదంకముల నాటకము మధురమీనాక్షీదేవి ఉత్సవసమయములో ప్రదర్శింపబడెనట. ఇతడు దాక్షిణాత్యుడైన తెలుగు కవి కావచ్చును (వసుచరిత్ర పద్యకావ్యముగా తమిళములోనికి అనువదింపబడి యుండుట గమనార్హము). కృష్ణాధ్వరి "కల్యాణకౌముదీ-కందర్ప" నాటకములను రచించి రఘునాథునకు అంకితమొసంగెను; అందుచే ఆతడు తనకు జామాత అని కృష్ణాధ్వరి చెప్పుకొనెను.

ఇంక విజయరాఘవుడు స్వయముగా పెక్కు యక్షగాననాటకములను రచించి ప్రదర్శింపజేసినవాడు. వాగ్గేయకారుడును, భరతశాస్త్ర ధురంధరుడును అగు క్షేత్రయ్య (1600-1680) విజయరాఘవుని ఆస్థానమును సందర్శించి, ఆతనిపై పదములను చెప్పియుండుట గమనార్హము[5]. విజయరాఘవుని ధర్మపత్నినని చెప్పుకొన్న రంగాజమ్మ 'మన్నారుదాసవిలాస' మనెడి వీథి నాటకమును రచించెను. విజయరాఘవుని ఆస్థానకవయిత్రి కృష్ణమాంబ (కృష్ణాజీ) నాట్యవిద్యాప్రవీణ యని ప్రతీతి కలదు. ఈమె గుంటూరి నుండి వలసవచ్చిన రావినూతుల తిరుమలయ్య కుమార్తెయట. యక్షగాననాటక ప్రదర్శనములు విజయరాఘవుని కాలములో పరాకాష్ఠకు పోయినవి. విజయరాఘవుని వలెనే తంజావూరు నేలిన మహారాష్ట్రరాజులు కూడ తెలుగులో పెక్కు యక్షగానములను రచించి, ప్రదర్శింపజేసినారు. ప్రతాపసింహుని ఆస్థానములో 'ముద్దుపళని' అను కవయిత్రి ఉండెను; ఈమె 'రాధికాసాంత్వన' మనెడి శృంగారప్రబంధమును రచించెను. ఈమె "ప్రతాపహేళిభోసలతాళరాజరాణ్మణిసుతప్రతాపసింహేంద్రమౌళి"కి వలపునేస్తమట; మరియు భరతనాట్యప్రవీణురాలట. ఈమె రసపిపాసియనియు, కళామయజీవియనియు ప్రతీతి.

తంజావూరును పాలించిన నాయకరాజులు, మహారాష్ట్రరాజులు వలెనే మధురనేలిన నాయకరాజులును, పుదుక్కోటనేలిన తొండమండరురాజులును స్వయముగా కవులేకాక సంగీత-సాహిత్య-నృత్యవిద్యాధురంధరులగు కళాకారులను పోషించియున్నారు. విజయరంగ చొక్కనాథుని కాలమున తిరువెంగళార్యుడను సంగీతకళానిధియుండెను. ఈతడు గొప్పవైణికుడని ప్రసిద్ధి. సత్యభామాసాంత్వన కృతికర్తయగు లింగనమహి కామేశ్వరకవి తాను 'వల్లకీవాదనధురీణుడ'ననియు, 'వర్ణగీతాదిగాంధర్వస్వరకల్పనాప్రవీణుడ' ననియు చెప్పుకొనెను.

ఈ కాలమునాటి యక్షగాన వీథి నాటకములలోని 'వేషధారి జాస్తాలు' సరస్వతీ మహాలు గ్రంథాలయమునందున్నవి[6]. కాని, ఆనాడు స్త్రీలు నాటకములందు పాల్గొన్నట్లు కన్పట్టదు; వారిది నృత్యరంగము మాత్రమే.

ఈ కాలమున పెక్కు శాస్త్రగ్రంథములు కూడ బయలుదేరినవి. గోవిందదీక్షితుని రెండవ కుమారుడు వేంకటమఖి (వేంకటాధ్వరి లేదా వేంకటేశ్వర దీక్షితుడు) విజయరాఘవుని

ఆస్థానవిద్వాంసుడై 'చతుర్దండిప్రకాశిక'[7] అనెడి సంగీతలక్షణమును రచించెను. తాను 72 మేలకర్తల పద్ధతిని కనుగొన్నట్లును, అది విమర్శకు తావులేని పద్ధతి అనియును, షాలలో చనుడు కూడ అంతకు మించి చెప్పలేడనియు ఆతడు చెప్పుకొనెను. అహోబలుడు 'సంగీత పారిజాతము' ను రచించెను. ఇది క్రీ. శ. 1724 లో పర్షియన్ భాషలోనికి అనువదింపబడెను! పాశ్చాత్యులంగీకరించెడి 'సమానశ్రుత్యంతరస్థాయి' నిర్దేశమును (Equal temperamental scale), రాగనిర్మాణమున కుపయోగపడెడి 12 శ్రుతుల నిర్దేశమును చేసిన ప్రథముడితడే యందురు. గోవిందుని 'సంగ్రహచూడామణి' (సంగీతశాస్త్రసంక్షేపము) త్యాగయ్య సంగీత మునకు సరిపోలియున్నదనియు, నేటి కర్ణాటసంగీతమునకు ఇదియే ఆధారగ్రంథమనియు సంగీత జ్ఞుల అభిప్రాయము. మైసూరు ప్రభువగు కంఠీరవరాజు (1704-13) 'నాట్య విద్యావిలాస' మనెడి సంస్కృతాంధ్రమిశ్రమగ్రంథమును రచించెను. నాట్యకర్తలు తమ తమ సామర్థ్య ములను వివరించు గ్రంథ మిది. ఇతడు తెలుగులో పెక్కు యక్షగానములను రచించెను.

లింగముగుంట మాతృభూతయ్యకవి 'అభినయదర్పణ' మనెడి మూడాశ్వాసముల ప్రబంధమును రచించెను. నందికేశ్వరుని అభినయదర్పణము దీనికి మూలమైనను సంప్రదాయ భేదములు పలుతావుల కన్పట్టుచున్నవి. చిల్లకూరి దివాకరకవి రచించిన 'భరతసార సంగ్రహము' భరతముని నాట్యశాస్త్రము మొదలు సంగీతరత్నాకరము వరకునుగల పది భరతముల (నాట్యశాస్త్రగ్రంథముల) సారము. ఈ భరతములలో చాలవరకు తెలుగు టీకలతో తంజావూరు సరస్వతీ మహలులో కలవు. దామరాజు సోమయ్య 'భరతము' నొక దానిని రచించి నట్లు పెదపాటి జగన్నాథకవి కూర్చిన "ప్రబంధరత్నావళి" నిబట్టి తెలియుచున్నది. ఇందు ఐదు పద్యము లుదాహృతములైనవి. సోమయ్య 16 వ శతాబ్దివాడైనను కావచ్చును. గణపవరపు వేంకటకవి (ముద్దళగిరి కాశ్రితుడు) "ఆంధ్రప్రతాపరుద్రీయము" ను రచించెను. శహాజీమహా రాజు (1687-1711) ఆస్థానకవియగు గిరిరాజ కవి తమ్ముడైన వేంకటగిరి (కవిగిరి) కూడ 'అభినయదర్పణము' ను అనువదించి శహాజీ బంధువులలో నొకడగు ఖండోజీరాయని కంకిత మిచ్చెను. క్రీ. శ. 1656 లో రచింపబడిన 'అప్పకవీయము' ప్రధానముగా ఛందస్సునకు సంబం ధించినదైనను ప్రథమాశ్వాసము కావ్య-నాట్య-రస-భావనిర్ణయమును, నాయక-నాయికా నిర్ణ యమును వివరించుచుండుట గమనార్హము. ఏయేపాత్రల కేయేభాషల నుపయోగించవలెనో కూడ ఆతడు నిర్దేశించెను[8].

అలంకారశాస్త్ర ప్రపంచములో సాటిలేని మేటియును, ఉద్దండపండితుడును, కోనసీమ బ్రాహ్మణుడును అయిన జగన్నాథపండితుడు (C. 1590-1665) 'రసగంగాధరము' ను రచించెను. వారణాసి ధర్మసూరి 'సాహిత్యరత్నాకరము'ను, కృష్ణశర్మ 'మందారమరంద చంపువు'ను రచించినారు. రెండవ గ్రంథమందు నాటకప్రకరణము కూడ కలదు. భాష్యాది బహుశాస్త్ర పరిచయోదాత్తుడు, మహామహోపాధ్యాయ బిరుదాంచితుడు అయిన ఎలకూచిబాల సరస్వతి (1590-1670) తన 'రాఘవయాదవపాండవీయ' మందు "కవిసమీహిత రంగ కౌముదీనామనాటకవిధానప్రతిష్ఠాఘనుండ" ననియు, పిమ్మట చింతామణి టీకా ప్రారంభ

ములో "కౌముదీనాటకకావ్యకవి"ని అనియు చెప్పుకొనుట గమనార్హము. "కవులచే కోరబడిన 'రంగ కౌముది' అను పేరు గల నాటకవిధానము (లక్షణము)ను ప్రతిష్ఠించిన (నిర్ణయించిన) ఘనుడ"నని మొదటిదాని కర్థము. అనగా బాలసరస్వతి 'రంగ కౌముది' అను పేరుగల నాటక లక్షణమును రచించెనన్న మాట; కాని, అది లభ్యముకాలేదు. కాని, ఇచ్చట ఒక సంశయము కలుగుచున్నది. రెండవదానినిబట్టి "కౌముదీనాటక మనెడి కావ్యము రచించిన కవి" అని కాని, "కౌముది అనెడి నాటకకావ్యమును రచించినకవి" అని గాని అర్థము వచ్చును. 'కౌముదీ నాటక' మనెడి కావ్యమన్నచో అది 'విష్ణుమాయావిలాసనాటకము' వంటి ప్రబంధము కావల యును. ఇంక రెండవ అర్థములో నాటకకావ్య మనగా దృశ్యకావ్యము (రూపకము). దీనిని బట్టి 'కవిసమీహితరంగకౌముదీనామ'లోని 'రంగ' పదము 'కౌముది'కి చెందదు. అందు చేతనే తరువాతి దానిలో బాలసరస్వతి 'రంగ' పదమును వదలివేసెనేమో? అయినచో బాల సరస్వతి వ్రాసినది సంస్కృత నాటకమో లేదా తెలుగు ప్రబంధమో అయియుండవచ్చును.

అటు దక్షిణదేశములోని ఆ ప్రభువులందరును సంగీత-సాహిత్య-నాట్యములను ఆదరించినట్లే ఇటు గోల్కొండ నవాబులు కూడ ఆ త్రివిధకళలను ఆదరించి, పోషించి యున్నారు. వీరిలో ఇబ్రహీం కుతుబ్‌షా (1550-1580) ఆంధ్రమున స్వయముగా పండితుడు; అద్దంకి గంగాధరకవి 'తపతీసంవరణోపాఖ్యాన' కృతిపతి. ఇతని సేనానాయకుడగు అమీన్ ఖాన్ పొన్నిగంటి తెలగనార్యుని యయాతిచరిత్ర కృతిపతి. అబ్దుల్లా కుతుబ్‌షా (1620-72) క్షేత్రయ్యను ఆదరించెను; అతని ఆస్థానములో తులసిమూర్తి అనెడి వాగ్గేయకారుడుండెనట. అబుల్ హసన్ కుతుబ్‌షా (1672-1687) కూచిపూడివారి నృత్యప్రదర్శనములకు ముగ్ధుడై వారికి 'కూచిపూడి'ని అగ్రహారముగా నొసంగెను. ఈ నవాబుల కాలములోని వాడగు అక్బర్‌షా (లేదా బడేసాహెబ్) నాయికా-నాయక భేదములను సవివరముగా తెలిపెడి 'శృంగారమంజరి' అనెడు గ్రంథమును తెలుగులో రచించెను. ఇది అలభ్యము. కాని తెలుగు శృంగారమంజరిని అనుసరించి ఆతడే సంస్కృతమున ఇంకొక 'శృంగారమంజరి'ని రచించెను.[9] తెలుగు శృంగారమంజరిలో ప్రాచీనాంధ్రభాషోదాహరణములు కూడ కలవట. సంస్కృత శృంగార మంజరికి ఆధారగ్రంథములుగా పేర్కొన్న వానిలో భట్టుమూర్తి 'సరసకావ్యము' (సరస భూపాలీయము) కూడ కలదు.

మహారాష్ట్రరాజులలో శహాజీ (1687-1711), రెండవ శరభోజీ (1798-1832) లు ముఖ్యముగా పేర్కొనదగినవారు. శహాజీ తెలుగులో పెక్కు యక్షగాన నాటకములను రచిం చెను. అతని ఆస్థానములోనివారగు రామభద్రదీక్షితుడు 'జానకీపరిణయము' అనెడి రూపక మును (Comedy of errors పద్ధతిలో నడచిన రూపకమిది); వేంకటేశ్వరుడు 'రాఘవానంద లీలాపరిణయ-సభాపతివిలాసము' లనెడి నాటకములను, 'ఉన్మత్తకవికలశ' (లంబోదర ప్రహసన) మనెడి ప్రహసనమును సంస్కృతమున రచించియున్నారు. మొదటి శరభోజీ (1712-1727) ఆస్థాన కవియగు జగన్నాథుడు 'రతిమన్మథనాటకము'ను, 'వసుమతీపరిణయ' నాటకమును సంస్కృతమున రచించెను. శ్రీరంగరాయల మంత్రియగు రాయసం అహోబలుడు 'కువలయవిలాస' మనెడి రూపకమును రచించెను.

రెండవ శరభోజీ ఆస్థానములో తొలిరోజులలో మహాదేవ అన్నవి, సుబ్బరాయ నట్టువనారు గొప్ప సంగీత-నృత్య-విద్యానిధులుగా నుండిరి. సుబ్బరాయ నట్టువనారు కుమారులైన చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అనువారు కూడ నృత్యవిద్యాధురంధరులే; వారిలో వడివేలు నృత్యకళయందు అద్వితీయుడట; ఇతడును కర్ణాటసంగీతకళాచక్రవర్తి త్యాగరాజును (1767-1847) మిత్రులని చెప్పుదురు. ఈ సోదరులు నలుగురును నేటి 'భరతనాట్యము'[10] నకు రూపులు దిద్దినవారు. వీరిందు నృత్త-నృత్యములకు సమానావకాశములు కలుగునట్లుగా అంగములను ఆరు క్రమములో నిర్ణయించినారు—అలరిపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదము, తిల్లాన; అంతమున ఒక శ్లోకాభినయము. వీనిలో అలరిపు, జతిస్వరము, తిల్లాన అనునవి కేవల నృత్తపరములు; పద-శ్లోక-శబ్దములు నృత్యపరములు, వర్ణ-స్వరజతులు నృత్త-నృత్యములకు సమానావకాశము కలవి. ఈ 'భరతనాట్యము' స్త్రీల నృత్యము; ఏకపాత్రహార్యము (Solo type); సుమారు మూడుగంటల కాలమునకు సరిపోవునది.

పల్లవి రాజగోపాలయ్య వంశీయుడగు వేంకట్రామశాస్త్రి (19వ శతాబ్ది ప్రథమభాగము) మేలట్టూరులో 12 యక్షగానములు తెలుగులో రచించెను. అచ్చటివారు వీనిని నేటికిని ఆయా దైవోత్సవములందు ప్రదర్శించుచున్నారు.

18 వ శతాబ్దిలో శాస్త్రాదులను రచించిన మరికొందరు తెలుగువారు కలరు.

మరింగంటి నరసింహాచార్యులు 'నాటకశాస్త్రము'ను వ్రాసెనట. గుడిపాటి కోదండకవి 'రసమంజరి'ని 3 గుచ్ఛములుగా ఆంధ్రీకరించెను. కర్తపేరు తెలియని ఇంకొక 'శృంగార రసమంజరి' కలదు. ఇందు వివిధనాయకులకు ఉదాహరణములుగా క్షేత్రయ్య పదములు పేర్కొనబడుట గమనార్హము. మల్లరి ఆరాధ్యుడు 'శివలింగసూర్యోదయ' మనెడి 5 అంకముల నాటకమును వీరశైవమతప్రాధాన్యనిరూపణము కొరకు రచించెను; ఇది కందుకూరి బసవేశ్వరుని గౌరవార్థము రచింపబడెనట (T. C. III-3125).

19, 20 శతాబ్దములలో కూడ పెక్కురు శాస్త్ర గ్రంథములను, సంస్కృత రూపకములను రచించియున్నారు. మతుకుమల్లి నృసింహకవి 'భరతశాస్త్ర సర్వస్వము', 'సంగీతసారము' అనెడి గ్రంథములను, 'శ్రీకృష్ణజలక్రీడావిలాసనాటకము'ను రచించెను. వీరు నాట్యాచార్యులై యుందురు. వీరి భార్య జానకమ్మగారు కవయిత్రి. వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్ర బహద్దరువారు 'సభారంజని' యనెడు నృత్యగానాభినయశాస్త్రమును రచించెను. లేపాక్షి వేంకట నారాయణ కవి 1900 ప్రాంతముల 'నాట్య ప్రదీపన' మనెడి భరతశాస్త్రమును రచించెను. ఇందులో చాల అల్పభాగమే లభించినది (అముద్రితము). ఇందు 32 అడవులు (కరణములు) నిర్వచింపబడెను. ఇతడు పెక్కు యక్షగానములను రచించి, ప్రదర్శింప జేసెను. 19వ శతాబ్ది చివరి భాగములోను, ఈ 20 వ శతాబ్దిలోను పెక్కు సంస్కృత లక్షణగ్రంథములు ముఖ్యముగా అలంకారశాస్త్రగ్రంథములు ఆంధ్రీకరింపబడెను[11]. అంతియేకాక ప్రాచ్య-పాశ్చాత్య నాట్యరీతులను, సాహిత్యరీతులను పరిశీలించుచు ప్రత్యేకగ్రంథములు కూడ బహుళముగా బయలుదేరినవి. వీనినిగూర్చి 'విమర్శలు-సమస్యలు' అనెడి అధ్యాయములో వివరింతును.

శ్రీయుతులు కోరాడరామచంద్రశాస్త్రి ('శృంగారసుధార్ణవ' మనెడి భాణము), పద్మనాభ శాస్త్రి ('త్రిపురవిజయ' వ్యాయోగము, 'లీలాదర్పణ' మనెడి భాణము), రొంపిచర్ల పార్థసారథి భట్టార్ ('మదనానంద' భాణము), కొంఠి భద్రాద్రిరామశాస్త్రి ('ముక్తావళీ' అనెడి రూపకము), పేరి కాశీనాథశాస్త్రి ('పాంచాలికారక్షము', 'యామినీపూర్ణతిలక' అనెడి రూపకములను), మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులు ('మంజులనైషధ' మనెడి నాటకము), మాడభూషి వేంకటాచార్యులు (విశిష్టాద్వైత ప్రతిపాదకమగు 'శుద్ధసత్త్వ' మనెడి రూపకము), బోధానందసరస్వతి ('చిచ్చూర్యాలోక'మనెడి నాటకము), విశ్వనాథుడు (కాశీలో స్థిరపడిన ఆంధ్రుడు. 'మృగాంకలేఖ' అనెడి నాటిక), వేంకట కృష్ణకవి ('విలాస భూషణ' మనెడి రూపకము), వేంకటాచార్యుడు ('చాతురీ చంద్రిక' యనెడి రూపకము), కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ('అమృత శర్మిష్ఠ' యనెడి రూపకము) మున్నగువారు సంస్కృతమున పలు రూపకములను రచించియున్నారు. తెలంగాణములోని కవులు కూడ చాల సంస్కృతనాటకములను, తెలుగు యక్షగాననాటకములను రచించియున్నారు.[12]

ఇంతవరకును ప్రాచీనకాలమున నృత్య - నాట్య - సంగీతములనెడి మూడు కళల వికాసమును దిఙ్మాత్రముగా వివరించి యున్నాను. ఇంక వివిధ వినోదప్రదర్శనములను గూర్చి వేర్వేరుగా తరువాతి అధ్యాయములో వివరింతును.

ఆంధ్రరాజుల కాలము

1. 'హరితాల'మనగా గైరికధాతు విశేషము. వీథినాటకాదులందు నటులు ముఖమునకు వేసికొనెడి అర్థమే ఈ హరితాలము.

2. చూ. (1) 'గాథాసప్తశతిలోఁ దెలుఁగు పదములు'—డా. దివాకర్ల వేంకటావధాని (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - 43 వ సం. 5 వ సంచిక - పుటలు 35-48)

(2) 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు'—శ్రీ తిరుమల రామచంద్ర (భారతి - సర్వధారి చైత్ర సంచిక).

3. నాట్యశాస్త్రమందు దాక్షిణాత్య, ఓఢ్రమాగధి, ఆవంతి, పాంచాలి అనెడి నాలుగు ప్రవృత్తులు మాత్రమే చెప్పబడినవి. ఇందు ప్రాగుత్తర - పశ్చిమోత్తర హిందూస్థానముల ప్రసక్తి లేక పోవుట గమనార్హము. నాట్యశాస్త్ర రచనాకాలమువాటికి వంగదేశము, అస్సాము మొదలగు ప్రాగుత్తరభాగములు ఆర్యనాగరికతాప్రభావమునకు లోనుకాలేదనియు, విదేశీయుల దండయాత్రలకు తరచుగా గురియగుచుండెడి పశ్చిమోత్తరభాగములందు స్థిరమైన నాట్యసంప్రదాయము నెలకొని యుండుటకు అవకాశము లేదనియు తలంపనగును. (See. Dr. Ghosh's English trasnlation of Natya Sastra - P. 104. F. N)

4. Journal of Andhra Historical Research Society - Vol. III. Pp. 25-26.

5. తంజావూరు సరస్వతీమహాలు ప్రచురణము - నెం. 74 - (1957).

చాళుక్యుల కాలము

1. "ఆంధ్రుల చరిత్ర : సంస్కృతి" — శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ బాలేందు శేఖరము. (పుట - 211.)
2. Ibid. P. 196.
3. చూ. ''నన్నయ భారతం-నాటకలక్ష్యలక్షణసమన్వయం''— శ్రీబుద్ధాశేషగిరిరావు-ఆంధ్రపత్రిక-ఉగాదిసంచిక, 1922.
"వెయ్యేండ్ల తెలుగునాటకము''— శ్రీ నిడుదవోలు వేంకటరావు-పరిశోధన—డిసెంబరు. జనవరి, 1955.
''నన్నయ అవతారిక''—డా॥ దివాకర్ల వేంకటావధాని - ఆంధ్రపత్రిక - ఉగాదిసంచిక (1956 - 57).

4. సోమనాథుని కాలము వివాదాస్పదమైనది-
శ్రీ నిడుదవోలు వేంకటరావు - క్రీ. శ. 1190-1260.
డా॥ చిలుకూరి నారాయణరావు - క్రీ. శ. 1247-80.
శ్రీ ఆర్. నరసింహాచారి (కర్ణాటక కవిచరిత్ర) క్రీ. శ. 1195 ప్రాంతములు.

5. దేశినృత్య పద్ధతుల వర్ణనము (పండితారాధ్యచరిత్రలో) పుట 435.
రాజాస్థాన నృత్యవర్ణనలు ( ,, ) పుటలు 436-38.
పూజానృత్య వర్ణన (బసవపురాణములో) పుటలు 53-54
"అమరాంగనలు దివినాడెడు మాడ్కి నమరంగ గడలపై నాడెడువారు;
ఆవియద్గతిఁ బక్షులాడెడునట్టి భావన మ్రోకులపై నాడెడువారు" పుట 434.
"ప్రమథ పురాతన పటుచరిత్రములు గ్రమమొంద బహునాటకము లాడువారు;
లలితాంగరసకళాలంకారరేఖ లలవడ బహురూప మాడెడువారు;
భారతాది కథలఁ జీరమఱుఁగుల నారంగ బొమ్మల నాడించువారు;
కడు నద్భుతంబుగఁ గంబసూత్రము లడరంగ బొమ్మల నాడించువారు;
నాదట గంధర్వ యక్ష విద్యాధరాదులై పాడెడు నాడెడువారు" పుటలు 435-36.
"పురములు గాల్చిన పోల్కి యాడుచును....................
సరినజుతలఁగొన్న సరణి యాడుచును
వెండియు భవుబహువిధ చరిత్రముల ఖండితగతి నాటకంబు లాడుచును—పుటలు 442-43.

6. చూ. "సోమననాటి సంగీతసంప్రదాయము" - శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు - పరిశోధన - ఆగస్టు - నవంబరు 1955; ఫిబ్రవరి - మార్చి. 1956.

కాకతీయుల కాలము

1. కుమారసంభవమందలి దక్షాధ్వరధ్వంసాది ఘట్టములు "పద్యనాటికలు"గా నున్నవని శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు నిరూపించియున్నారు. చూ. వారి 'నన్నిచోడకవిచరిత్రము'.
2. (1) Epigraphica Indica—Vol. V—Pp. 142 - 43.
(2) శ్రీ మల్లంపల్లి వారి రేడియో ప్రసంగము. చూ. ఆకాశవాణిప్రసారిక - జనవరి. 1957.
3. అగస్త్యుఁ డనునది అసలు పేరనియు, విద్యానాథు డనునది బిరుదనామ మనియు విమర్శకులు తలంచుచున్నారు.

4. చలమచర్ల రంగాచార్యులుగారి "ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము" (1961) నకు రాఘవాచార్యులుగారి "సాహిత్య కుసుమాంజలి" అనెడి భూమిక (పుటలు. 58-59).
5. ''సరస్వతి''—1వ సం. నెం. 6. పుట 7.
6. క్రీడాభిరామము - ఉపోద్ఘాతము (1952). పుటలు 105-106.
7. South Indian Inscriptions—Vol - IV – No. 773.
8. షోడశకుమారచరిత్రము – 8 వ ఆ. 91 ప.
4 వ ఆశ్వాసములో అన్నయకవి హంసావళీకన్య నాట్యభవనమును, అందలి చిత్రములను విపులముగా వర్ణించెను (53-55 ప.). కృష్ణదేవరాయల నాట్యభవనవర్ణనమునుకూడ పరిశీలించితిమేని అన్నయకవి ఆనాటి నాట్యభవనములనే వర్ణించెననియు, అది లాక్షణికమగు వర్ణన కాదనియు తోపగలదు.
9. భావప్రకాశనము—ఉపోద్ఘాతము—శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రి (1930) - పుట 12.
10. భారతి - జనవరి, 1956 - పుట 38.
11. చూ. కృష్ణమాచార్యుని సింహగిరివచనములలోని 24 వ వచనము. కృష్ణమాచార్యులు రెండవ ప్రతాపరుద్రుని కాలములోనివాడు.
12. చూ. ''కృష్ణమాచార్యులు : ఆంధ్రప్రదేశము''—శ్రీ నిడుదవోలు వేంకటరావు - ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక (1-11-1956).

## రెడ్డిరాజుల కాలము

1. see "History of the Reddi Kings" by Sri M. Somasekhara Sarma - Pp. 417-27.
2. నృసింహపురాణము - II-82: III-64; III-67 మొ.
3. ఇట్టి వర్ణనలు సాహిత్యమందింకను గలవు — వసుచరిత్ర (IV - 17); ప్రభావతీప్రద్యుమ్నము (V-58; I-57); కుమారసంభవము (IX-46); నిరంకుశోపాఖ్యానము (II-9) మొ.

శ్రీనాథుని క్రింది వాక్యముకూడ గమనార్హము. ఇందు తెర నల్లనిదిగా చెప్పబడినది —

''కొదమ మొగుళ్ళు దెరలును; దడంబడఁ బడు వలుద
వడగండ్లు పుష్పాంజలులును, నుఱుము చప్పుళ్ళు
మర్దళధ్వనులుగా గగన రంగస్థలంబునం గ్రొమ్మెఱుంగు మెఱుంగుఁబోఁడి గొండ్లి పరిఢవించె.''

—(కాశీఖండము—III - 23 వ.)

4. బయకారు డనగా వాగ్గేయకారుడు. చతురకల్లినాథునకు (ఇమ్మడి దేవరాయల ఆస్థాన విద్వాంసుడు—1446-65) 'రాయబయకారు' డనెడు బిరుదు కలదు. ఈతనితోనే ఈ ఉద్యోగము ప్రారంభమైనదని ''ఆంధ్రవాగ్గేయకారచరిత్ర'' కారులు పేర్కొనిరి (పుట 34). కాని శృంగారనైషధమునుబట్టి ఆ పదవి అంతకుముందే కలదని ఊహించుట కవకాశము కలదు.
5. రంభోర్వశుల నృత్యమును వర్ణించిన మరికొందరు కవులు :
(1) కొఱవి గోపరాజు "సింహాసనద్వాత్రింశిక"—Part I-I-129-30.
(2) రఘునాథరాయల "వాల్మీకి చరిత్ర"—(3 వ ఆశ్వా.)

6. ఈ శ్లోకమును పలువురు కవులు అనుసరించియున్నారు—
   (1) నన్నిచోడుని "కుమారసంభవము" (IX - 38)
   (2) కొఱవి గోపరాజు "సింహాసనద్వాత్రింశిక" (Part I - I-133)
   (3) విన్నకోట పెద్దన "కావ్యాలంకారచూడామణి" (II - 21)
7. ఇందలి సానులు ఆరాధనా—కేళికానృత్యముల కుద్దిష్టమైనవారు. దైవోత్సవసమయమున సాని యీశానియై చేసెడి నృత్యము భీమేశ్వరపురాణమందు వర్ణితమైనది (I - 105)
8. చదలువాడ మల్లన చోళదేశమునుగూర్చి చెప్పిన క్రింది పద్యము ఆ కాలమునాటి తెలుగుదేశము నకును అన్వయించును —

   "తిరునాళ్ళును దేరులు ననవరతంబును నంగరంగ వైభవములునుం
   దిరమగును దేవళంబులఁ బరగఁగ నొక కోడిగూయు పల్లియనైనన్"
   —(విప్రనారాయణ చరిత్ర - I - 60)

9. ఈత డింతటి వాడగుటచేతనే శ్రీనాథునంతటివాడు కూడ "ఎటుల మెప్పించెదో నన్ను నింకమీద" అని "రావు సింగమహీపాలు ధీవిశాలు నిండుకొలువున నెలకొనియున్న శారదాంబ"ను అర్థింప వలసివచ్చినది.

10. ఒక ఉదాహరణము :—

   "వేశ్యకు గుణవంతుఁడగు నాయకునియందునుగూడ ననురాగముండదు; అట్టి యరక్తను వర్ణించుట రసాభాసమునకే కారణమగును; కాన, వేశ్యను నాటకాదులందు 'వర్ణింపరాదు' అని కొందరందురు. వా రిట్లును జెప్పుదురు - 'వేశ్య సామాన్యవనిత; ఆమె ప్రధానముగా ద్రవ్యమునే కోరును. ఆమెకు గుణహీనునియెడ ననిష్టములేదు; గుణియెడ నిష్టమునులేదు. అట్టివేశ్యయెడ శృంగారాభాసమే కాని శృంగార మెంతమాత్రము నుండ.' కాని ధీమంతుడగు శ్రీ సింగభూపతి యీ మతము నంగీకరింపఁడు...." అనుచు వేశ్యనాయికగానుండ నర్హురాలేయని సిద్ధాంతించెను. (బులుసు వేంకటరమణయ్యగారి అనువాదము - పుటలు 95-97).

11. తిరుపతి దేవస్థానమువారి ప్రచురణము - పంగనాముల బాలకృష్ణమూర్తిగారి ఉపోద్ఘాతము.
12. కాటయవేముని మాలవికాగ్నిమిత్రవ్యాఖ్యానప్రారంభము.
13. కాటయవేముని శాకుంతల వ్యాఖ్యాన ప్రారంభమును చూడవలెను.
14. సెప్టెంబరు, 1958 ''భారతి''లో నేను వ్రాసిన ''వసంతరాజీయ''మనెడి వ్యాసమును చూడ వలెను.
15. "ఏ కుమారగిరి ప్రభువుయొక్క సిరితో సదృశురాలగు లకుమాదేవి సభలలో నాట్యశాస్త్రార్థము లకు వేలకొలది నూతనాభినయములను చేకూర్చుచు అర్థిబృందమునకు వేలకొలది ధనములను దానము చేయుచున్నదో ఆ కుమారగిరి ప్రభుని మహిమ లోకాతీతమై వర్ధిల్లుచున్నది."
16. చూ. రసాభరణము - పుటలు 6-7.

   "రసము నాయకసమాశ్రయమునఁ బ్రావీణ్యు డగునటు చేష్టలనైనఁ దత్క
   థాకర్ణనంబుననైన సామాజికప్రకరానుభావ్యమై పరఁగుచుండుఁ
   బరగతంబయ్యు సద్భావనచే రసోదయవిశేషము విరుద్ధంబుగాదు
   మఱియు మాలత్యాది మహిళాప్రసంగంబు వినుచు సభ్యులు నిజవనితలందుఁ
   దలఁపునిలుప రసాశ్రయత్వంబు గలుగు; ననుకరణమాత్రమైయుండు నాశ్రయంబు

గాదు భావకత్వాదులు గలిగెనేని వాడు సామాజికుల యట్టివాఁడయపు౽."
"ప్రకటనటుఁడరయ సామాజిక సముఁడగునేని వానిచే నను భావా
దిక మెట్లొదవుననిన వాని కది యభ్యాసజనితనిపుణతయయ్యేన్".

## వసంతోత్సవములు

1. ఒకఉదాహరణము– చూ. వేదం వేంకటరాయశాస్త్రిగారి అనువాదము (1948)– సం. 6. పుటలు 1832–34. ఈ కథాసరిత్సాగరము గుణాఢ్యుని 'బృహత్కథ'లోని ఒక భాగమునకు సంస్కృతీకరణమనియు, ఇది క్రీ. శ. ప్రథమ శతాబ్దినాటిదనియు విమర్శకుల అభిప్రాయము. కాగా వసంతోత్సవములు క్రీ. శ. ప్రథమ శతాబ్దినుండియు, లేదా అంతకు ముందునుండియు ప్రచారమునందున్నవని చెప్పవచ్చును.

2. (1) ద్రుజ్జవరపు శాసన శ్లోకము (క్రీ. శ. 1371)
(2) భీమేశ్వరపురాణము— V – 124 ప.
చూ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "రెడ్డిరాజులచరిత్ర"–పుట472. అధస్సూచిక 40.

## క్రీడాభిరామము

1. క్రీడాభిరామమును ఇప్పటికి ముప్వురు సంపాదించిరి—
   1. శ్రీ మానవల్లి రామకృష్ణకవి—1909.
   2. శ్రీ వేటూరిప్రభాకరశాస్త్రి—1928.
   3. శ్రీ బండారు తమ్మయ్య—1952.

వీరు ముప్పురును తమ తమ ముద్రణములకు విపులములగు పీఠికలను సంతరించియున్నారు.

2. చూ.విజయనగరాంధ్రసాహిత్యచరిత్ర.
3. చూ. వారు సంపాదించిన ముద్రణమునకు పీఠిక.
4. ఇందును గూర్చిన వాదోపవాదముల నెల్ల బండారు తమ్మయ్యగారు తమ పీఠికలో ఉట్టంకించియున్నారు. వివరములకు అందు చూడవలెను.
5. 'పూతిమాష' గోత్రము కల్పితముగా కన్పట్టును. కాని ఆగోత్రీకులు నెల్లూరు మండలములో నేడు కలరట! ఈ గోత్రమునకు ఋషులు పదునొకండుగురట!!
6. వీథీలక్షణము : సమన్వయము – చూ. స్రవంతిలోని నా వ్యాసము–"వల్లభామాత్యుడు" –స్రవంతి–ఏప్రిలు, 1959.
7. "అంకమని వ్రాయుట ఆనాటి వ్రాయసగాండ్లకు క్రొత్త. తెలిసియో తెలియకయో వారు దానిని "ఆశ్వాస" మని మార్చియుందురనుటలో సందేహములేదు. క్రీడాభిరామమందు కన్పట్టుచున్న కొన్ని శ్రవ్యకావ్యలక్షణములును ఈ మార్పు చేయుటకు బలము నొసంగి యుండవచ్చును. అంతమాత్రమున దీనిని శ్రవ్యకావ్యముగా పరిగణించుటకు వీలులేదు.

   అనర్ఘరాఘవాంధ్రీకరణమునందును, అంకాంతము అట్లే–అనగా 'అంక'మనియే వ్యవహరింపబడుట గమనార్హము.
8. "క్రీడాభిరామంలో వీధినాటకలక్షణాలు" – శ్రీ తిరుమల రామచంద్ర (ఇందు సంధి – సంధ్యంగ సమన్వయము చేయబడినది.)–"అభ్యుదయ" – అక్టోబరు, 1958.

9. "అభ్యుదయ" - డిసెంబరు, 1958—ఇందు వీథ్యంగములు నిరూపితములైనవి.

10. "వీథియందు ఒకేపాత్రకాని ఇరువురుపాత్రలుకానిఉందురు. ఆకాశభాషితములుండును. శృంగారము అధికముగాను, తక్కిన రసములు అల్పముగాను సూచితము లగుచుండును. ఇందలి వృత్తి కైశికి. నాయకుడు ఉత్తమ - మధ్యమ - అధమ పాత్రలలో ఎవరైనను కావచ్చును. నాయిక నాయకోచితయైనది కావలయును. ఇందు ఒకే ఒక అంకము ఉండును. ఇతివృత్తము సంక్షిప్తమును, ఏకదివసప్రయోజ్యమును కావలయును. సాంగములైన ముఖ - నిర్వహణ సంధులు రెండే ఇందుండును. లాస్యాంగము లుండిన నుండవచ్చును. వీథి త్రయోదశాంగసహితము కావలయును." - ఇది సమగ్ర వీథీనిర్వచనము.

11. చూ. స్రవంతి - మే, 1959. ఈ విమర్శను చూచినపిమ్మటకూడ నేను నా యభిప్రాయమును మార్చుకొనవలసిన అవసరము కన్పట్టుటలేదు. బెండపూడన్నయామాత్యుడు కట్టించిన మొగసాల మంటపములో భీమేశ్వరుడు పేరోలగముండి "... చంపూచాటు నాటకోదాహరణ.... ఆది ప్రబంధంబు లాకర్ణించు" చుండెనని భీమేశ్వరపురాణములో శ్రీనాథుడు వ్రాసియుండెను. ఇందలి "ఆకర్ణించు" అనెడి క్రియపై ఆధారపడి శ్రీ కొర్లపాటివారు ఇంత గ్రంథమును అల్లినారు. పేరోలగంబునందున్నవారు నృత్యాదుల నవలోకించుట కవకాశమున్నది. కాని నాటకప్రదర్శనమును అవలోకించుటకు అవకాశములేదు; అందులకు ప్రత్యేకముగా ఏ నాటకశాలయోకావలెను. అందుచే పేరోలగమందు ఆ యా నాటకకర్తలు తమతమ నాటకములను చదివి వినిపించిరనియే ఇచ్చటి అర్థము; కావుననే "ఆకర్ణించు" అనెడి క్రియ ప్రయుక్తమైనది. ఇంక ఆలంకారికులునాటకమును చంపూకావ్యముగనే వర్ణించినారనియు, నన్నయాదులు నాటకపదమును రూపక సామాన్యవాచిగా వాడియున్నారనియు, ప్రబంధపదమునకు దృశ్యకావ్యమనెడి అర్థము కలదనియు శ్రీ కొర్లపాటివారు గుర్తించినట్లే కన్పట్టరు. (కాళిదాసు భాసాదుల రూపకములను ప్రబంధములనినాడు; శారదాతనయుడు లక్షణగ్రంథమైన తన భావప్రకాశనమునుకూడ ప్రబంధమనినాడు). కాగా పైవర్ణనలోని 'చంపు' వనునది శ్రవ్యకావ్యము; నాటకమనునది దృశ్యకావ్యము; తక్కినవి క్షుద్రకావ్యములు అని తెలియవలెను. ఇంతయును, నాటక పదమునకు "శ్రవ్యకావ్యమైన చంపూకావ్యము" అనెడి అర్థమునొసంగెడి లాక్షణికనిర్వచనమును వారొసంగనే లేకపోవుట గమనార్హము.

## విజయనగరరాజులకాలము

1. మేళకర్త జన్యరాగపద్ధతికి గోవిందదీక్షితుని కుమారుడును, 'చతుర్దండిప్రకాశికా' కారుడును అయిన వేంకటమఖి మూలపురుషుడని కొందరును, 'స్వరమేళకళానిధి' కర్తయగు రామామాత్యుడు మూలపురుషుడని కొందరును తలంచుచున్నారు. కాని గోవిందదీక్షితుని వాక్యములను బట్టి విద్యారణ్యుడే ఆ పద్ధకి మూలపురుషుడని తెలియుచున్నది.

విద్యారణ్యస్వామి రచించిన 'వేదాంతపంచదశి'లోని ఒకభాగమగు 'నాటకదీపము' నాటి నాట్య-నృత్యముల ప్రయోగమును భంగ్యంతరముగా సూచించుచున్నది.

2. శ్రీనాథునకు కవిసార్వభౌమ బిరుదమునొసంగి, తన ముత్యాలశాలలో దీనారటంకములతో కనకాభిషేకము చేసిన ప్రౌఢదేవరాయలితడే.

3. S. V. H. (Sources of Vijayanagara History) (1919) - Pp. 65-67.

4. అబ్దుల్ రజాక్ వర్ణన :—

''ఆ సంవత్సరము రజాబ్ మాసమున పూర్ణిమనాడు (క్రీ. శ. 1444 ఆశ్వయుజ పూర్ణిమ) విశాల మైన యొక మైదానముమీద రాయలు దేరాలు వేయించి కొలువుదీరి యుండెను.... సర్వాలంకార భూషితలై శృంగారపుకణికలై జంత్రగాత్రముల రాగమాలపించుచు నృత్యముచేయుచున్న యా జవ్వనుల రూపము, సౌందర్యము, విలాసము, హొయలు.... తహతహలాడించుచుండెను. ఆ సౌందర్యవతులు రాయలకెదురుగా ఒక అందమైన తెరవెనుకకూర్చుండిరి. అంతలో తటాలున ఆ తెర రెండువైపులనుండి లాగివేయబడెను. తెరతీసినపుడాసుందరులు పాడుచు నృత్యముచేయ నారం భించిరి. సర్వసంగపరిత్యాగులయిన మునులకుకూడ మతిచలింపజేసెడి వారి నృత్యములు.... మా మేనులు పరవశములయ్యెను." చూ. భావరాజు వేంకటకృష్ణరావుగారి ''విదేశయాత్రికులు : ప్రాచీనాంధ్రదేశము''—పుటలు - 188-90.

5. Tirupati Devasthanam's Inscriptions - vol. II. No. 10 - Pp. 14-15.

6. ఈమాచుపల్లి కైఫీయతు మెకంజీసేకరణలలోనిది - (L. R. 56 - Pp. 65 ff).
'' ఆ (సంబెట) గురవరాజు ప్రభుత్వములో ప్రజలకు అతిదారుణశిక్షచేయుస్తూవుండేవారు. ప్రజల వద్ద ద్రవ్యాకర్షణచేసేయెడల త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసుకవచ్చి స్తనాలకు చిరుతలు పట్టించేవారు. అలాగంటి దినములలో వినుకొండ, బెల్లంకొండ తట్టున కూచిపూడి అనే గ్రామంనుంచి బ్రాహ్మణులు భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థళమునకు (సిద్ధవటం సీమ) వచ్చివుండి సంబెట గురవరాజుయొక్క దారుణప్రభుత్వము చూచి యిక్కడనుండి లేచిపోయి విద్యానగరమునకుపోయి అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపరిపాలనంచేస్తూవుండగా భాగవతులు దర్శనం అయి కేళిక అడుగగా శలవుయిచ్చినారు. అక్కడ కీర్తన వినికిచేసేటప్పుడు సంబెట గురవరాజు వేషంవేసికొని వొకడు, యిద్దరు బంట్రోతుల వేషంవేసికొని, వొకడు స్త్రీ వేషంవేసుకొని, సంబెట గురవరాజు వలెనే ఆ వేషగాడు కూర్చుండి, రాయలసమక్షమందు ఆ స్త్రీయొక్క స్తనాలను చిరుతలు పట్టించి సొమ్ముయివ్వమని తహశ్శీలుచేసినట్లు వినికిచేసినారు.

''అప్పుడు రాయలవారు చూచి అది యేమని అడుగగా ముఖస్తులయినవారు భాగవతుల ముఖతా ఆ వర్తమానము తెలిసి.... విన్నపంశాయగా చాల తీక్షచేసి, మరునాడు ఉదయమందు ఆ సంగతి తీరుగా జ్ఞాపకంసేయమని ముఖస్తులైనవారికి ఆజ్ఞయిచ్చినారు....''

చూ. శ్రీ దిగవల్లి వేంకటశివరావు - ''కథలు : గాథలు'' - 4 వ భా. పుటలు 151-52.

7. నృత్య-నాట్య-సంగీతప్రియుడైన కృష్ణరాయలుకూడ తెలుగులో నొక నాటకమును రచించి యుండకపోవుట విచారకరము.

8. Madras Epigraphical Reports. No. 556 of 1916.

9. ఇత డచ్చుటచ్చట కొన్ని క్రొత్తకల్పనలుకూడ చేసినాడు. ఉదా :- తాండవనృత్యమందలి 'గంగావతరణ' మనెడి కరణమును ఇతడు 'కృష్ణావతరణ'మని పేర్కొనెను.

10. ఆ యీ విషయములు "Devasthanam's Epigraphical Reports" అను సంపుటములో క్రోడీకరింపబడెను. (పుట. 205).

11. Sewell—"Forgotten Empire" - Pp 288-9.

12. Dr. B. A. Saletore— "Social and political life in Vijayanagar Empire"— Vol II. P. 411.

ఈ నృత్యశాలయొక్క శిథిలములైనను నేడు కన్పట్టకపోవుట విచారకరము. కాని, విఠలస్వామి ఆలయకళ్యాణమంటపమునకు ఎదురుగాఉన్న ఒక మంటపము ఈ నృత్యశాలయే కావచ్చునేమో.
చూ. R. N. Saletore- Vijayanagar Sexcentenary com. Volume (1936). P. 206.

13. చూ. ఎల్లోరా – "మన ప్రాచీన కళలు : పుట్టుపూర్వోత్తరాలు" – పుట. 52.

14. "ఆటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టి పురమైన యశ్రమమునను జొచ్చి,
పగలెల్ల నాటలభ్రమయించుచును సందుగొందులెల్ల నెఱింగికొనుచు, రేలు
కన్నగాండ్రగుచు నగళ్ళు ప్రవేశించి యందు నెంతటి వారలడ్డమైనఁ
జక్కడఁచుచుఁ బేనుగ్రుక్కినపాటిగా నిష్టమైన యర్థమెల్లఁ బడసి
బ్రతుకు చునికి మీ స్వభావమంతయును ..." (I – 108)

15. "మగుడఁ బుచ్చుకొనఁగఁ దగదు నీవంటిన గోచులు...." (I – 106)
ఇంకొక ఉదాహరణము :
"నటవిటగాయకగణికాకుటిల వచశ్శీధురసము గ్రోలెడు చెవికిం గటువీశాస్త్రము...."
—మనుచరిత్ర – V-8.

16. "ఆ నాటకప్రయోగావసరముల భగీరథాద్యాకారధారణమును,
గంగాది నిమ్నగాగతియుఁ గైలాసాది నగకల్పనమును. నానావనప్ర
పంచనంబును, బహుపక్షిమృగాది జంతువిశేషరూపవృత్తులును, మఱియు
నెచటికెయ్యది యోగ్య మచటఁ దత్తద్వస్తుసృష్టి సన్నిదమునేసి గృతక
మగుట నిశ్చయింపఁగ లేక యబ్రపడుచుఁ జూచి...." (IV – 101)

17. ఆంధ్ర రచయితలసంఘము (హైదరాబాదు) పక్షమున డా॥ బి. రామరాజు (ఉస్మానియా విశ్వవిద్యాలయమున తెలుగుశాఖలో రీడరు) సంపాదకత్వమున ఇది ప్రకటింపబడినది (1962)
—ఈ ప్రచురణపై సమీక్షకు నిడుదవోలు వేంకటరావుగారి వ్యాసమును చూడవలెను.
(భారతి – మార్చి, 1963)

18. "బొడ్డుచెర్ల చినతిమ్మయ కృతానువాదము అటు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని యనువాదము (శృంగార శాకుంతలము) ప్రబంధమువలెగాని ఇటు కొక్కొండవారి యనువాదము నాటకమువలెగాని లేదు. ఇది మధ్యేమార్గముగానున్న ప్రక్రియ. మీదుమిక్కిలి కవి దీనిని నాట్యప్రబంధమనినాడు. అనగా దీనిలో అటు నాటకలక్షణములును, ఇటు ప్రబంధలక్షణములును కలియగలుపుగా నున్నవి. మన నాటకపరిణామమున నిదియొక వినూత్నఘట్టమని భావించుచున్నాను."
"సంస్కృతమున ప్రసన్నరాఘవము ఏడంకముల నాటకము. తెలుగులోకూడ నిది ఏడంకముల నాట్యప్రబంధము. తెలుగులో తక్కిన ప్రబంధములందువలె ఆశ్వాసవిభజనముగాక ఈ నాట్యప్రబంధమున అంకవిభజనము గలదు. మూలమునగల అర్థోపక్షేపకాదులు నాట్యప్రబంధమున గూడకలవు, నాందీప్రస్తావనలు, విష్కంభములు, పాత్రప్రవేశనిష్క్రమణములు, స్వగతములు, ఆకాశభాషితములు, ప్రకాశములు, నేపథ్యములు, ఆయాపాత్రల సాత్త్వికభావసూచనములును ఉన్నవి యున్నట్లుగా నాట్యప్రబంధమున నిరూపితములైనవి. కాని మూలమునగల వచన సంభాషణములుగూడ అధికముగా పద్యబద్ధములైపోయినవి. దీనిలో వచనభాగములు లేకపోలేదు. వాని సంఖ్య చాలతక్కువ. అనిన, నావుడు, అనవుడు, ఇట్లనియె-వంటి కవివచనములు లేకున్నచో నిది యచ్చపు నాటకానువాదమై యుండును... కవిసూచనములను, సంధివాక్యములను కుండలీకరణము లందుంచి, పాత్రల పేరులు వాని కెదురుగా వారి సంభాషణములుంచి ముద్రించినచో నిదియొక పద్యనాటకమగును."
—డా॥ బి. రామరాజు – 'ప్రరోచన' – పుటలు 9-10.

19. డా॥ యస్వీ జోగారావు "ఆంధ్ర యక్షగానవాఙ్మయ చరిత్ర" (ద్వి. భా. పుట. 7.)

20. వివరములకు నిడుదవోలు వేంకటరావుగారి ఉపోద్ఘాతమును చూడవలెను.

21. 'నరసభూపాలీయము' (కావ్యాలంకారసంగ్రహము) అనెడి లక్షణగ్రంథమును తెలుగులో రచించిన భట్టుమూర్తియును, రామరాజ భూషణుడును ఒక్కరేయని విమర్శకులు నిరూపించియున్నారు. ఇది ప్రతాపరుద్రీయమును ఒరవడిగా పెట్టుకొని వ్రాసినగ్రంథమైనను ఇందును నాటకప్రకరణము లేదు. నాయక - నాయికా - రస - భావ - ధ్వని - అలంకారములు మాత్రమే చర్చింపబడెను. తెలుగులో పఠన - పాఠన వ్యవహారమందున్న గ్రంథమిదియే. 'కృష్ణకవి' యనునతడు సంస్కృతములో "నృసింహభూపాలీయ" మను లక్షణగ్రంథమును రచించెను. తెలుగు నరసభూపాలీయకృతిపతియగు తొరగంటి నరసభూపతికి, సంస్కృత నరసభూపాలీయకృతిపతియగు గొబ్బూరి నరసభూపతి పినతల్లికుమారుడు. కావున రెండును సమకాలిక రచనలు. రెండింటికిని జన్యజనకభావము లేకపోయినను సాదృశ్యరేఖ కలదు. (చూ. శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారి వ్యాసము - ''భారతి''— బహుధాన్య సం॥ మాఘము - పుటలు - 129-138.)

22. వసుచరిత్ర—III-34.

## తంజావూరు రాజులకాలము

1. ఈ అచ్యుతప్పనాయకుని కాలములోనే నృత్య - సంగీతములకు పట్టుగొమ్మలైన పెక్కు తెలుగు కుటుంబములు రాజాశ్రయము నర్థించి తంజావూరునకు వలసపోయెను. అచ్యుతప్పనాయకుడు వారినెల్ల ఆదరించి, తనపేర 'అచ్యుతాపురము'ను అగ్రహారముగా వారి కొసంగెను. అదియే నేటి 'మేలట్టూరు' (మేళముల ఊరు).

2. ఈ రఘునాథ మేళవీణ కనిపెట్టబడకపూర్వము వీణావాదనమందు రాగము మారినప్పుడెల్ల తంత్రులను సరిదిద్దుకొనవలసి వచ్చెడిదట. అనగా ప్రతిరాగమునకును ప్రత్యేక తంత్రీమేళనము అవసరమయ్యెడిదన్నమాట.

ఒక ఉదాహరణము:—

"వాలారుంగొనగోళ్ళ నీవలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీవంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రులు, మేళవింపఁగదవే లోలాక్షి ! దేశాక్షికిన్." —మనుచరిత్ర - III-57.

బసవపురాణమునుబట్టియు (పుటలు - 78-79), వసుచరిత్రమును బట్టియు (IV-52) కూడ పై విషయము స్పష్టమగుచున్నది.

కాగా "ఇప్పుడు రాగములన్నియు పలికించుట కనుకూలమయియున్న రీతి నక్కాలమున వీణలు తత్తద్రాగానుకూల స్వరస్థానములను కలిగియుండలేదు. ఏదేని ఒక రాగమునకు మేళవింపబడిన వీణ నతిప్రయాసమున రాగాంతరాలాపన సమయమున మార్చవలసి యుండెడిది. కొన్ని యెడల ఆ యా రాగములకు బ్రత్యేకముగ వీణ లేర్పడియుండెడివి. గొప్ప సంగీతవిద్వాంసుడును, సంగీత - సాహిత్యములం దసమాన ప్రతిభావిలసితుడును, తంజాపురప్రభువునగు రఘునాథ రాయడే పరిశ్రమించి వీణపయి రాగముల నన్నింటిని పలికించుటకు దగిన పథకము నేర్పఱచె"నని తెలియవలెను. (మనుచరిత్ర — ఆనంద ముద్రణాలయ ముద్రణము —1947—పుట 121. అధస్సూచిక.)

3. కాళకవి 'చంద్రరేఖ' అను నామెను ఎక్కువగా వర్ణించియుండెను. ఆమె 'ముద్దుచంద్రరేఖ' యట! వీరవేంకటరాయ (1642వరకు పరిపాలించిన 3వ వేంకటపతిరాయ) పృథ్వీమహేంద్రదత్తములైన బహువిధబిరుదములు కలవట. మరియు ఈమె విజయరాఘవుని ప్రేయసిగా వర్ణితమైనది. ఇంక ఆ యా నర్తకీమణులు, వారు ప్రసిద్ధికెక్కిన నృత్యములు క్రిందివిధముగా నున్నవి —

| | | |
|---|---|---|
| ముద్దుచంద్రరేఖ | — | పేరణి |
| రూపవతి | — | పదచాళి ('చౌపదకేళిక' అని కాళకవి) |
| శశిరేఖ | — | కోపులతోకూడిన జక్కిణి ('దేశి' అని కాళకవి) |
| లోకనాయిక | — | దురుపదకేళిక ('నవపదములు' ,, ) |
| కీరవాణి | — | దురుసైన కోపు |
| చంపక | — | శబ్దచూడామణి |
| మూర్తివధూటి | — | జక్కిణి |
| కోమలవల్లి | — | కొరవు (కోపు?) |
| రత్నగిరి | — | ద(దు)రుపదములు |
| భాగీరథి | — | పేరణి |

వీరేకాక కొరవంజి, శివలీల, గుజరాతిదేశి మొదలగు నృత్య విశేషములను మరికొంద రభినయించిరట. మనకు పేర్లు తెలిసినవారు కొందరే; పేర్లు తెలియనివారు ఇంకెందరో!

4. కన్నడరాజగు కేలడి బసవని "శివతత్త్వరత్నాకరము" (రచన - 1709-10) నందలి 6 వ కల్లోల ప్రథమతరంగములో దొడ్డ శంకన్న నాయకుడు ఇక్కేరిలో కట్టించిన విచిత్రమైన 'నాటకశాల' పేర్కొనబడెను. (S. V. H. P. 343). ఈ శంకన్న నాయకుడు వేంకటపతి రాయల (వేంకట II - 1585-1614) సామంతుడు. ఇక్కేరి తెలుగు-కన్నడదేశముల సరిహద్దులో నున్నది. రఘునాథరాయల నాటకశాలయును ఇట్టిదే కావచ్చును.

5. 'కృష్ణలీలా తరంగిణి' కర్తయగు నారాయణతీర్థులవారును ఇంచుమించు ఇదేకాలమునకు చెందియున్నారు. వీరు 'పారిజాతాపహరణ' గాథను నృత్యనాటకముగా తెలుగులో వ్రాసియున్నారు.

6. ఉదాహరణముగా 'ఉషాకల్యాణ' పాత్రలను పరిశీలింపవచ్చును. (B. No. 36/ D. No. 799)

| | | |
|---|---|---|
| విఘ్నేశ్వరుడు | — | రాముడు |
| పరిచారకుడు | — | కుప్పయ్య |
| కురుక్కుళ | — | రామయ్య |
| ప్రమథగణాలు | — | కృష్ణుడు శ్రోత్రియం గోపాలుడు |
| మణియం | — | శ్రీనివాసుడు |
| దవ్వారికుడు | — | వైద్యనాథ కుప్పడు |
| నందికేశ్వరవేషం | — | సుందరం కుప్పడు |
| ఈశ్వరవేషం | — | శామావయ్య వెంకటాచలం |
| పార్వతీవేషం | — | కుప్పడు గురువుడు |
| కౌమారస్వామి | — | సుబ్రహ్మణ్యుడు గోపాలుడు |
| బాణాసురవేషం | — | శ్రీనివాసవెంగు శేషగిరి |
| ఉషావేషం | — | అహోబళం సుబ్బుకుట్టి |
| కుంభాండకన్యా | — | వెంకట్రాయుడు గుండురంగడు |

| | | |
|---|---|---|
| బాణరమణి | — | కుప్పడు గురువుడు |
| చిత్రరేఖ | — | పెదసుబ్బరాయడు చిన్నసుబ్బరాయడు |
| రాజవైద్యుడు | — | చిన్న శ్రీనివాసుడు సుందరం |
| అనిరుద్ధవేషం | — | సుబ్బుకుట్టి అహోబిళం ( ? ) |
| విదూషకవేషం | — | వెంకాచం శేషయ్య కిచ్చిగాడు |
| బాణాసురప్రధాని | — | రంగయ్య వెంకటాచలం |
| గౌతమి వేషం | — | శ్రోత్రియం గోపాలుడు పెత్తు |
| కృష్ణవేషం | — | రంగయ్య వెంకటాచలం |
| నారదవేషం | — | వెంకాచం శేషయ్య గౌతమశేషయ్య |
| సాత్వికవేషం | — | ముద్దణ్ణారాకు |
| సఖివేషం | — | సామయ్య కృష్ణుడు |
| దవ్వారికుడు | — | కుప్పడు శ్రీనివాసుడు |
| జోసి | — | చిన్నగురువుడు పెత్తు |

ఇందులో మొదటి ఆరును పూర్వరంగమునకు సంబంధించిన వేషములు. ఇవి నాటకములన్నింటికిని సమానమే. ఒక్కొక్కరు రెండుమూడు వేషములనుకూడ ధరించెడివారు. ఒక వేషమునకు ఇరువురు కూడ ఉన్నట్లు కన్పట్టుచున్నది. పురుషులే స్త్రీవేషములను ధరించెడివారు.

7. "గీత - ప్రబంధ - తాయ-ఆలాప" రూపమైనదానిని 'చతుర్దండి' అందురట. (తులజరాజు సంగీత సారామృతము). ఈ అర్థము సరికాదనియు, "స్థాయీ-సంచారీ-ఆరోహ-అవరోహ" రూపమైన గానక్రియను 'చతుర్దండి' అందురనియు, ఇది నారదమునీశ్వర ప్రోక్తమనియు మానవల్లి రామకృష్ణకవిగారు తెలిపియున్నారు.

8. సుకవినిగూర్చి అప్పకవి చెప్పిన పద్యము పరిశీలనార్హము—

"ఇమ్మహిని మునులచే వెలసె మ్ముసు గావ్యములు, 'నానృషిఃకురుతే కా
వ్య'మ్మను వచనార్థంబే సమ్మతి, గలివేళ సుకవిజనులే మౌనుల్".

— అప్పకవీయము - I.43.

9. డా॥ వి. రాఘవన్ బృహదాంగ్ల పీఠికతో దీనిని హైదరాబాదు పురాతత్త్వశాఖవారు ప్రకటించియున్నారు. (1951)

10. భరతప్రతిపాదితమగు 'నాట్య' పదమునకు 'రూపకప్రదర్శన'మని యర్థము. కావున నేటి 'భరతనాట్యము' భరతప్రతిపాదితమును కాదు; నాట్య మంతకంటెనుకాదు. ఇది కేవలము నృత్త-నృత్యముల సమ్మేళనము మాత్రమే. 'భరతనాట్య'మని ఆ ఒక్క విధానమునుమాత్రమే పిలుచుట అసమంజసము. దానికంటె అధికముగా 'కూచిపూడి నాట్యము' భరతప్రతిపాదిత నాట్యమునకు సన్నిహితమైనది. ఈ సత్యమును పలువురు పెద్దలే గుర్తింపకుండుటవలన దేశములో, పండిత లోకములో, అనేకభ్రమలు వ్యాప్తమై యున్నవి. ఈ విషయమునుగూర్చి శ్రీ పి. వి. రాజమన్నారు హెచ్చరించి యుండుట గమనార్హము — "అఖిలభారత నృత్యోత్సవాధ్యక్షోపన్యాసము"— నవభారతి - జూన్, 1958.

11. బులుసు వేంకట రమణయ్యగారి "ఆంధ్రాలంకారవాఙ్మయచరిత్ర"ను చూడవలెను.

12. చూ. గోలుకొండ తెలుగుకవుల సంచిక.

## చతుర్థాధ్యాయము

# దృశ్య కళారూపములు

## నృత్యములు

అన్నగరి నాట్యశాలలఁ
జెన్నగు మురజముల రవళిచే నటియించున్
గన్నియలకన్న మున్నగఁ
బన్నగభుక్తులు దృష్టి పాత్రములగుచున్.

—వసుచరిత్ర_1 అశ్వా. 103 ప.

తెలుగు కావ్యములందు బహుళముగా నాట్యవర్ణనలు కలవు. కాని, పరిశీలించి చూచినచో ఆలంకారికముగా చేయబడిన వర్ణనలలోని నాట్యశాలలన్నియును, 'నృత్యశాల'లే అనియు అందు చెప్పబడిన తెరలన్నియును నర్తకీ ప్రవేశమునకుముందు పట్టెడి తెరలే అనియు, ఆ నాట్యములెల్ల నృత్యములే అనియు తెలియగలదు. ఇంచుమించుగా తెలుగుకవు లందరును కొంచెముగానో గొప్పగానో నృత్యవర్ణనను ఏదో ఒక సందర్భములో చేసియేయున్నారు.

ఆంధ్రదేశమందలి ప్రాచీననృత్యసంప్రదాయము ప్రధానముగా రెండు శాఖలుగా వర్థిల్లినది—మొదటిది నట్టువమేళసంప్రదాయము; రెండవది నాట్యమేళసంప్రదాయము. ఈ రెండు సంప్రదాయములకును నాట్యశాస్త్రము దిఙ్మాత్రముగను, అభినయదర్పణ_భరతార్ణవ_రసమంజరులు ప్రధానముగను ఆధారగ్రంథములు. అయినను ప్రదర్శనక్రమమున భిన్నములై ఇవి రెండును రెండు వేర్వేరు శాఖలుగా వర్థిల్లినవి.




ఆలయములో స్వామి సన్నిధిని జరిగెడి ఆరాధనానృత్యములు, కల్యాణమంటపములో జరిగెడి కేళికానృత్యములు నట్టువమేళ సంప్రదాయమునకు చెందినవి; వీనిని దేవదాసీలే చేయుదురు. అందున, స్వామి సన్నిధిని, బలిపీఠముపై నృత్యముచేయు నర్హత అధికారముద్రలను పొందిన దేవదాసీలకే కలదు; అచ్చట నృత్యము చేయుటకు తక్కినవారికి అర్హతలేదు. విజయనగరరాజుల కాలములో దేవదాసీలు పవిత్రజీవనమును గడపెడివారనియు, రాచనగరులోని దేవాలయమందు ప్రతిశనివారమును నృత్యము చేసెడివారనియు, దేవదాసి కావలసిన వ్యక్తిని పదియేండ్ల ప్రాయమందే దేవాలయమున కర్పింతురనియు, అప్పుడు పెండ్లి అంత ఉత్సవము జరుగుననియు, ఆమె దేవుని కర్పింపబడిన దగుటచేత దేవదాసి అయినదనియు[1]

బార్బోజా అను యాత్రికుడు వర్ణించియుండెను. తన జీవితసర్వస్వమును దేవదేవుని సేవకే అంకితముచేసి, తదైక్యమునకు తహతహపడి, భగవంతునిలో లయించిన దేవదాసి (గిరిక) విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగ'లులో వర్ణితమైనది. అట్టివారే నిజమైన దేవదాసీలు.

ఇంక ఆలయావరణములో, కల్యాణమంటపమందు స్వామి వేంచేసియున్నప్పుడు దేవదాసీలేకాక నృత్యవిద్యాపారంగతులైన వారాంగనలును నృత్యము చేయవచ్చును.[2] ఇది వినోదార్థమేర్పడినదికాన దీనికి 'కేళిక' అనిపేరు.

దేవాలయములందు ఒకరికిమించిన దేవదాసీలుందురు. కాని, రాజాస్థానములందు సాధారణముగా ఒక్కతెయే 'రాజనర్తకి' యుండును[3]. చాళుక్యరాజుల కాలములోని చెల్లవ్వ, చామెకాంబలు; కాకతీయుల కాలమునాటి మాచల్దేవి; కర్పూరవసంతరాయల ఆస్థానములోని లకుమాదేవి; కృష్ణదేవరాయల ఆస్థానములోని రంజకంకుప్పాయి, నాయకరాజుల ఆస్థానములోని ముద్దుచంద్రరేఖ ఇట్టివారే. ఈ నట్టువమేళములందు హంగుదారులు కొందరుందురు; సాధారణముగా గురువు బ్రాహ్మణుడే అయియుండును. దేవదాసీ-రాజనర్తకీ నృత్యములు ఏకపాత్రహార్యములు (Solo-type dances). రాజాస్థానములందలి నృత్యములు ప్రధానముగా రెండు విధములు—మార్గపద్ధతి; దేశి పద్ధతి, మార్గపద్ధతి అభినయదర్పణానుసారి. ఇంక దేశిపద్ధతి ఆయా సీమలకు ప్రత్యేకమైనది. దండలాసిక, ప్రేంఖణి, కుండలి మొదలగునవి దేశి నృత్యములు. వీనినెల్ల జాయపసేనాని తన నృత్తరత్నావళిలో విపులముగా వివరించియుండెను. తెలుగు కావ్యములందుకూడ దేశినృత్యవర్ణనలు బహుళముగా కలవు. ఇవి అన్నియును లాస్యపద్ధతికి చెందిన అభినయములు. ఈ దేశిపద్ధతినృత్యములు తంజావూరు నాయకరాజులకాలములో పరాకాష్ఠను పొందినవి.

ఇంక భారత-భాగవత-రామాయణాదులందలి గాథలను స్వీకరించి, సంగీత-నృత్యములను మేళవించి నాటకముగా ప్రదర్శించు వారిది 'నాట్యమేళ' మనబడును. వీరి ప్రదర్శనములను 'నృత్యనాటకములు' (dance dramas) అని అందురు. భగవంతుని లీలలకు సంబంధించినవై భగవదారాధనమే ప్రధానధ్యేయముగా కలవి 'భాగవతములు' అనబడును. వీనిని ప్రదర్శించువారు 'భాగవతులు' అనబడుదురు[4]. ఈ భాగవతుల మేళమునే 'భాగవతమేళము' అందురు. ఇవి నాలుగు వీథులును కలియుచోట ప్రదర్శింపబడు చుండుటచేత 'వీథి భాగవతము' లైనవి. ఇవి పూర్వకథాయుతము లగుటచేతను, బహునర్తకులు, వేషధారణము కలవగుటచేతను నాటకశాఖకు చెందుచున్నవి. వీనిని ప్రదర్శించువారు 'నాట్యమేళము' అనబడుచున్నారు. నాట్యమేళములవారు నృత్యనాటకములనేకాక కలాపములను కూడ ప్రదర్శింతురు. ఈ కలాపము లొక విశిష్టసృష్టి. నాయకరాజుల కాలములో రాజసంబంధి గాథలుకూడ నృత్యనాటకములకు ఇతివృత్తములైనవి. ఈ నాట్యమేళములందు కూచిపూడిభాగవతులు సుప్రసిద్ధులు. వీరి మేళములందు స్త్రీలకు ప్రవేశములేదు. కూచిపూడివారందరును బ్రాహ్మణులే. కాని అర్వాచీన కాలములో పిచ్చుకకుంట్లు, ఏనాదులు, గొల్లలు, మాలలు మొదలగు కులములవారు కూడ నృత్యనాటకములను, భామాకలాపమును; వారాంగనలు భామాకలాప-గొల్లకలాపములను నేర్చి

ప్రదర్శింప సాగినారు. వీరికి గురువులో లేదా ఆ గురువులకు గురువులో కూచిపూడి సంప్రదాయములో శిక్షణమును బడసినవారే అగుట గమనార్హము. కూచిపూడి సంప్రదాయము తెలుగు దేశమందంతటను అల్లుకొనిపోయినది. అంతియేకాదు; నేడు ఈ 'ఆంధ్రనాట్యము' జాతీయ, అంతర్జాతీయఖ్యాతిని గడించుకొన్నది.

తెలుగు దేశమున వీరశైవమత విజృంభణముతో నృత్యములు, నాటకములు సాంఘిక కళలుగా రూపొందినవి. అవి క్రమముగా తక్కువ శీలముకలవారి పాలబడి, నటనర్తకులు నీతిబాహ్యులై సంచరించుచు నింద్యులైనారు. కళాకారుడు తన కళాశక్తితో ప్రజలను సంస్కరించి, అభ్యుదయ మార్గమున నడిపింపగలవాడే అయినను, నాట్యమందుకొరకే సృష్టింపబడిన దైనను, ఒక దశలో ప్రజలనైతికపతనముతోపాటు కళలును పతనములగుట తటస్థించుచుండును. అప్పుడు మరల తదుద్ధరణమునకై ప్రయత్నములు జరుగును. ఇట్టి పతనోన్నతములు ఆయాకాలములందు కళలకు సహజములే. 13 వ శతాబ్దిలో, కాకతీయుల కాలములో, నృత్య కళకు రాజాస్థానప్రవేశగౌరవములు కలిగించుటకు ప్రయత్నములు జరిగినవి; అసలీ ఉద్యమమునకు బ్రాహ్మణులు గురుపీఠమును వహించినారు; రాజులును, రాజబంధువులును పట్టుగొమ్మలు అయినారు. జాయప సేనానికికి నృత్యగురువగు గుండామాత్యుడును, నూత్నభరతాచార్యుడుగా కీర్తింపబడిన వెన్నెలకంటి సూరామాత్యుడును బ్రాహ్మణులు. కూచిపూడి నాట్యకళకు మూలపురుషుడుగా, భామాకలాపస్రష్టగా ప్రసిద్ధిచెందిన సిద్ధేంద్రయోగియును నాడు నాట్య కళోద్ధరణమునకు పూనుకొనిన బ్రాహ్మణులలో ఒకడు అయియుండును.

సిద్ధేంద్రుడు పూర్వజన్మసంస్కారబలముననో, భగవత్కృపవలననో, గురుశుశ్రూష వలననో వాగ్గేయకారుడగుటయే కాక, నృత్యకళాధురంధరుడు కూడనై, క్రొత్త పద్ధతిని త్రొక్కి, భామాకలాపమును సృష్టించియుండును. ఇందులకు జాయనలక్షణగ్రంథమును, జయదేవుని గీతగోవిందమును కూడ తోడుపడియుండును. తన నూత్నరచనను ప్రయోగింపగల వారికొరకు సిద్ధేంద్రుడు అన్వేషణము మొదలుపెట్టెను. ఆ ప్రయత్నములో కూచిపూడి బ్రాహ్మణులు ఆయన కంటబడినారు. కూచిపూడి బ్రాహ్మణులందరును వేదాధ్యయనపరులు, తపస్సంపన్నులు, యజన యాజనపరతంత్రులు, సామగానమున సాటిలేని మేటులు. కూచిపూడిబాలుర సుకుమారదేహములును, కమ్మెచ్చులుతీసిన కంఠస్వరములును సిద్ధేంద్రుని ఆకర్షించినవి. అంతట ఆతడు పెద్దలను అంగీకరింపజేసి, వారి అనుమతితో, భగవత్సన్నిధానములో కూచిపూడి బాలురకు నృత్యశిక్షణమును ఆరంభించెను. అదియే తెలుగువారికి గర్వకారణమగు 'కూచిపూడినాట్య' కళకు నాందీపూజ జరిగిన శుభముహూర్తము. 'భామాకలాపము' తమకీవిధముగానే లభించినదనియు, కూచిపూడి నాట్యకళాప్రారంభ మదియే అనియు, అంతకు ముందు తమ పూర్వులకు నృత్య కళతో కాని, నాటకప్రదర్శనములతో కాని ప్రమేయము లేదనియు కూచిపూడివారి విశ్వాసము.

సిద్ధేంద్రుని ప్రేరణమువలన, ఆయన శిక్షణలోనే, కూచిపూడి వారు నర్తకులైనారు. అట్లు నర్తకులైన ఈ బ్రాహ్మణులను సంఘమానాడు బహిష్కరించుట తథ్యము. కాని, అట్టి బహిష్కారములేకుండునట్లుగా సిద్ధేంద్రుడు శ్రీ శృంగేరీపీఠాధిపతుల ఆదేశమును సంపాదించెనట. అంతట సిద్ధేంద్రుడు తనజీవితసర్వస్వమగు భామాకలాపము చిరకాలము వర్ధిల్లవలెననెడి

కోరికతో కూచిపూడి వారినుండి క్రింది విధముగా వాగ్దానమును పొందెను—"ఆ గడ్డమీదపుట్టిన ప్రతి బిడ్డకును (మగవానికి) సిద్ధేంద్రునిపేరు చెప్పి, ముక్కుకుట్టి, కాలికి గజ్జెకట్టవలయును. స్త్రీల కీకళ నిషిద్ధము. ఇంక పురుష దేవృత్తి నవలంబించినను, ఒక్కసారి అయినను, ఆయూరి రామలింగేశ్వరస్వామివారి సన్నిధిని భామవేషమును కట్టితీరవలయును." కూచిపూడి వారును ఈ నియమమును విధిగా, భక్తిశ్రద్ధలతో పాటించుచు ఆ కళకును, తమకును ఎనలేని కీర్తిని పెంపొందించుకొనిరి.

సిద్ధేంద్రయోగిని గూర్చి పరంపరాగతముగా వినవచ్చెడి ఐతిహ్యములు పెక్కులు కలవే కాని చారిత్రకాధారములులేవు. సిద్ధేంద్రుడు 17 వ శతాబ్దిలో నుండెనని కొందరు విమర్శకులు సిద్ధాంతించి యున్నారు. కాని, అది విశ్వసనీయముగా కన్పట్టదు. ఇంతకు ముందు పేర్కొన్న మాచుపల్లి కైఫీయత్తునుబట్టి, క్రీ. శ. 1500 నాటికే కూచిపూడి బ్రాహ్మణభాగవతులు సుప్రసిద్ధులై నారనియు, వారి మేళమొకటి దూరదేశములందు సంచారము చేయుచు[5] కేళికాప్రదర్శనముల నొసంగుచుండెననియు స్పష్టమగుచున్నది. సిద్ధేంద్రుని శిక్షణములో భామాకలాపమునే ప్రప్రథమముగా నేర్చియున్న కూచిపూడి భాగవతులు వీరనరసింహరాయల యెదుట ఆనాడు ప్రదర్శించిన కేళిక సుప్రసిద్ధమైన భామాకలాపమే అని విశ్వసించుచున్నాను. అయినచో సిద్ధేంద్రుడు విధిగా క్రీ. శ. 1500 నాటికి పూర్వుడగును; అనగా 14 వ శతాబ్దికో లేదా 13 వ శతాబ్దికో చెందిన వాడగుచున్నాడు.

**భామాకలాపము :**

భామాకలాపరచనకు మోక్షదృష్టియో, మరేదియో ప్రేరకమైనను, అది ఒక అపూర్వ కళాసృష్టి; నృత్యకళ పరమకోటిని పొందిన రచనయది. కళావేత్తయును, తపస్సంపన్నుడును అగువాడే అట్టి రచన చేయగలడు. "నానృషిః కురుతే కావ్య" మ్మను సూక్తి ఇప్పట్ల సార్థకము. ఇందలి కథ నిమిత్తమాత్రమే; నిజమునకు కృష్ణదేవునకుగాని, రుక్మిణి లేదా సత్యభామకుగాని ఇందు ప్రాధాన్యములేదు; ఇంక ఇది ఆద్యంతమును ప్రణయకలహకుపితుడగు భర్తకు దూరమైన సత్యభామా విరహాభినయమే.[6] ఈ విప్రలంభశృంగారాభినయమందు అష్టవిధనాయికా భేదములు, తత్తదవస్థా భేదములు, దశవిధలాస్యాంగములు, స్త్రీలకు సహజములైన అంగజ_స్వభావజ_అయత్నజవికారములు మొదలగువానితో కూడిన అలంకారశాస్త్ర సర్వస్వమును నృత్య_గాన_వాద్యములతో సమన్వయమగుచున్నది. ఈ అభినయము సంతటిని భామ ఒక్కతెయే చేయును. అలంకారశాస్త్రమును, చతుర్విధాభినయములును, సంగీతమును సమానములగు పాళ్ళలో మేళవింపబడిన భామాకలాపము ఏకపాత్రాభినయమునకు ఉత్తమ నిదర్శనము. ఇది అంతయును లాస్యాభినయమనియు ఇందు తాండవమునకు చోటులేదనియు తెలియవలెను.

ఒకనాడు సత్యాకృష్ణులు మాటాడుకొనుచుండగా ఇరువురిలో ఎవరు ఎక్కువ సౌందర్యవంతులనెడి ప్రశ్న కలిగెను. 'నేనే ఎక్కువ సౌందర్యవంతురాల' నని ముందు ఆలోచన

లేకయే సత్య సగర్వముగా పలికెను. అది కృష్ణునకు కోపకారణమయ్యెను; కోపముతో శయ్యాగారమును వీడి వెడలిపోయెను. అప్పుడు సత్యకు తన తప్పిదము తెలిసెను. విరహార్తయై విలపించును. ఇంక విరహబాధను భరింపలేక దూతిని స్వామి సన్నిధికి రాయబార మంపును. ఎట్టకేలకు కృష్ణుడు రుక్మిణితో లేదా రాధతో కలిసివచ్చును.[7] అది మరల సత్యకు అసూయా కారణమయ్యెను. అప్పుడా ఇరువురిమధ్యను సుప్రసిద్ధమైన సవతుల కయ్యముసాగును. చివరకు కృష్ణుడు సత్యను మన్నించును; ఇరువురు భార్యలతోను సుఖముగానుండును—ఇది భామాకలాప మందలి కథకాని కథ. ఈ భామాకలాపప్రదర్శనమందు నాట్యమేళమునకు గురువు లేదా నాయకుడు అగునాతడు సూత్రధారుడై కథకుడుగాను, భామకు చెలికత్తెయగు 'మాధవి' గాను, కృష్ణునకు చెలికాడగు 'మాధవుడు'గాను మారుచు, సమయోచితముగా కథాసంధానము చేయుచుండుటయే కాక చక్కని హాస్యమును వెదజల్లుచుండును. మాధవి సత్యభామకు అంతరాత్మతుల్యము; ఇంక సత్య భగవదైక్యమునకు తపించు జీవాత్మ—ఇది ఇందలి వేదాంతార్థము.

భామాకలాపమునకు 'పారిజాత' మనెడి పేరు కలదు. కాని, ఆ పదము దీనికి అన్వర్థము కాదు. ఇది అంతయును సత్యభామా విరహకలాపమే; ఇందు పారిజాతాపహరణ ప్రశంసయే లేదు. సిద్ధేంద్రుని అనుసరించి కొందరర్వాచీనులు మరి కొన్ని భామాకలాపములను రచించి యున్నారు. అర్వాచీన రచనలలో ప్రాచీనాంధ్రగ్రంథములందలి పద్యములు, అర్వాచన వాగ్గేయ కారుల పదములు, జావళీలు చేరిపోయినవి. కూచిపూడివారు కూడ వీనిని గ్రహించినారు. అట్టి వానిలో దామెరతిమ్మేంద్ర భూపాలునిమీది పదమొకటి. ఇంతకును సిద్ధేంద్రుని మూలరచన యేదో తెలియని పరిస్థితి కూడ ఏర్పడినదన్నచో అతిశయోక్తి లేదు. దీనిని గూర్చి సవిమర్శక మైన పరిశోధన జరుగవలసి యున్నది. మరి కొందరు పారిజాతాపహరణకథను జోడించి నృత్యనాటకములు రచించియున్నారు.

ప్రదర్శన ప్రారంభమునకుముందు నాట్యశాస్త్రవిహితమైన పూర్వరంగము ప్రవర్తిత మగును. అటుపిమ్మట కథాప్రారంభము. భామ రంగస్థలముమీదికి వచ్చుటకుముందు ఒక తెర పట్టుదురు. దాని కిరువైపులను కాగడాలు వెలుగుచుండును. అంతట భామ తన పొడుగుపాటి జడను తెరపై వేసి, సభలోని పండితులను సవాలుచేయును. ఈ ఘట్టమునే 'వేణీప్రబంధ' మందురు. కూచిపూడినర్తకులు, ముఖ్యముగా భామవేషధారి, నృత్యమందే కాక సంగీత-సాహిత్యము లందును; వేద-వేదాంగాది విద్యలందును నిష్ణాతులుగా నుండెడివారు. ఆ జడ నట్లువేయుట యనగా శాస్త్రార్థచర్చయందుకాని, భామవేషాభినయమందుకాని తనతోసాటి యెవ్వరును లేరని తెల్పుట! అంతియేకాక అసూయతో మంత్రప్రయోగములు చేయువారిని సవాలుచేయుట కూడను!! కూచిపూడి నర్తకులలో కొందరు మంత్రశాస్త్రనిష్ణాతులు కూడ కలరు. సంచారము లందు అసూయాపరులుచేసిన మంత్రప్రయోగములు, అందులకు కూచిపూడి నర్తకులు చేసిన ప్రతిక్రియలు, ప్రయోగములు—వీనిని గూర్చి పెక్కు ఐతిహ్యములు ప్రచారములో నున్నవి. భామ అట్లు తెరమీద జడవేసి, జడయొక్క పుట్టువును కూర్చి చెప్పి (అది దేవశిల్పియగు మయుని సృష్టియట) శాస్త్రార్థచర్చ చేయును, అంతట రెండు కాగడాలమీదను చల్లిన గుగ్గిలపు

మెరుపులో భామ తన మొగమును చూపును; రెండవసారియును అట్లే తెరను నడుమువరకును దింపుదురు; ఇంక మూడవసారి పూర్తిగా తీసివేయుదురు; అప్పుడు ప్రావేశికీధ్రువను (ప్రవేశపుదరువును) పాడుచు భామరంగస్థలమును ప్రవేశించును (ఈ తెరను ప్రధానమైన ప్రతిపాత్ర ప్రథమప్రవేశమునకు ముందును పట్టుచుందురు). ఇందలి ముఖ్యవిశేషము భామయేకాక తక్కిన వారు కూడ వచనమును చెప్పుటయేకాక నృత్యము చేయుచు స్వయముగా పాడుచుందురు; భరత శాస్త్రవిహితమైన ఈ పద్ధతి తెలుగువారి నృత్యమందలి ప్రత్యేకత ! భామాకలాపములోని ఇంకొకవిశేషఘట్టము కేవలము ఏకపాత్రాభినయమైన 'దశావతారనృత్యము.' సాధారణగా దీనిని భామయే నిర్వహించును. కూచిపూడి వారి భామాకలాపప్రదర్శనమును గాంచి, ముగ్ధుడై గోల్కొండ నవాబు వారికి కూచిపూడిని అగ్రహారముగా నొసంగిన విషయమును పేర్కొనియే యున్నాను.

## నృత్యనాటకములు :

నేర్చినది మొదలు బహుకాలము వరకును కూచిపూడి నర్తకులు భామాకలాపమును అభినయించి దేశము నుఱ్ఱూతలూగించినారు. కాని, ఒకే పద్ధతి ఎంతకాలమని ఆనందము నొసంగ గలదు ? ఎంత భక్తులును, ఎంత రసికులును అయినప్పటికిని ఒక్క భామాకలాపమునే పదే పదే దర్శించుటకు ప్రజలును, పదే పదే ప్రదర్శించుటలోను, చక్కని భామ వేషధారిని తయారు చేసికొనుటలోను కూచిపూడి వారును విసిగియుందురు. అప్పటికి దేశములో అసంస్కారులచే ప్రదర్శింపబడుచున్న వీథినాటకములపై కూచిపూడివారి దృష్టిపడినది. అంతట వారావీథినాటక ములను చేపట్టి, సంస్కరించి, శాస్త్రీయ నృత్య-గానములను జోడించి ప్రదర్శించుటకు పూనుకొని నారు. కథాప్రధానములైన ఈ నృత్యనాటకములు మరల ఒక నూతోన్నిత్సాహమును ప్రజల లోను, నర్తకులలోను కలిగించెను. కాని, ఈ నృత్యనాటకములను, కూచిపూడివారు ఎప్పుడు చేపట్టినారో సరిగా నిర్ణయించి చెప్పుట కష్టము. నేడు వారు ప్రదర్శించుచున్న ప్రహ్లాద, ఉషా పరిణయము మొదలగు నృత్య నాటకములు నూరునూటయేబది సంవత్సరముల క్రిందట మాత్రమే రచింపబడినవని తెలియుచున్నది !

## గొల్లకలాపము - పగటివేషములు :

కూచిపూడివారు నృత్యనాటకములనే కాక గొల్లకలాపమనెడి విశిష్టప్రయోగము నింకొక దానిని చేపట్టిరి. ఇది కూడ సిద్ధేంద్రుని రచనయే యని కొందరందురు కాని తగిన ఆధా రములు లేవు. ఇది అర్వాచీనరచనయని తెలియుచున్నది.[8] సంస్కృతమునందు వేదాంత పరమైన ప్రబోధచంద్రోదయాది నాటకములు కలవు. మందబుద్ధులకు గూడ వేదాంతమును సుబోధమగునట్లు చేయు ప్రయత్నములో ఇట్టి నాటకరచన లొక భాగము; గొల్లకలాపమును ఇట్టిదే. ఇందు పిండోత్పత్తి మొదలుకొని అనేక విషయములు చర్చింపబడును. ఇందు ఇరువురు ప్రధానులు—ఒకరు గొల్లభామ; రెండవవారు సూత్రధారుడు లేదా హాస్యగాడు (బ్రాహ్మణుడు)

నృత్యము, సంగీతము, సాహిత్యము ఆలంబనముగా తెలుగునాట వేదాంత ప్రచారమొనర్చిన ఉత్తమకళాసృష్టి యీ గొల్లకలాపము.

అటు సత్యభామవేషమునకుగాని, ఇటు గొల్లభామవేషమునకుగాని నృత్యసంగీతములు ముఖ్యములు. సంగీతమునందు ప్రావీణ్యములేని కొందరు ఆ కాలములో పగటివేషములను చేపట్టినారు; ఆధునికకాలములో కొందరు సినీమాలలో ప్రవేశించినారు. మరికొందరు ఆయా పట్టణములందు స్థిరపడి ఇతరులకు కూడ నృత్యమును నేర్పుచున్నారు. మొత్తముమీద కూచిపూడి వారు క్రింది ప్రదర్శనములందు సిద్ధహస్తులు—

1. కలాపములు— భామాకలాపము, గొల్లకలాపము (చోడిగాని కలాపమునుకూడ వీరు ప్రదర్శించినట్లు ప్రతీతి).

2. నృత్యనాటకములు— ప్రహ్లాదచరిత్రము, ఉషాపరిణయము, శశిరేఖాపరిణయము, మోహినీరుక్మాంగద, గయోపాఖ్యానము, హరిశ్చంద్రనాటకము, ఉత్తరరామచరిత, రుక్మిణీ కళ్యాణము మొదలగునవి.

3. ఇతరవేషములు—దాదినమ్మవేషము, జాలింతవేషము, కురవంజివేషము (సింగి-సింగడుల కలాపము).[9]

## ఇతర మేళములవారు :

కూచిపూడివారి కాణాచి యనదగిన భామాకలాపమును, దానితోపాటు గొల్లకలాపమును అర్వాచీనకాలములో ఇతరులు, ముఖ్యముగా కళావంతుల స్త్రీలు కూడ నేర్చి, ప్రదర్శింప సాగిరి. కూచిపూడి బ్రాహ్మణులు కొందరు, వారి శుశ్రూషచేసిన మరికొందరు వీరికి గురువులైనారు. ఈ గురువులందరును మూర్తీభవించిన సంగీత-సాహిత్య-నృత్యవిద్య లనదగినవారును; పవిత్రజీవనులును. ఇంక శిష్యురాండ్రును వారియెడ వినయవిధేయతలుగలిగి, నియమపూర్వక జీవితములను గడపుచుండెడివారు. భామాకలాపమును నేర్చిన స్త్రీలలో పెండ్యాల సత్యభామ మొదలగువారును, గొల్లకలాపమును నేర్చినవారిలో చిత్తజల్లు వైదేహి మొదలగువారును, ఆచార్యులలో రావూరి కామయ్య, కొల్లూరి వెంకయ్య, పుల్లాపంతుల చలమన్న మొదలగు వారును సుప్రసిద్ధులు.

భామాకలాపముతోపాటు నృత్యనాటకములను కూడ ఇతరజాతుల పురుషులు కొందరు నేర్చుకొని, ప్రదర్శించుటకు మొదలుపెట్టిరి. ఇట్టివారిలో గొల్లలు, పిచ్చుకకుంట్లు, యానాదులు మొదలగువారు ముఖ్యులు. పిచ్చుకకుంట్లలో కొందరు పురుషులు కూడ భామవేషమందు ప్రసిద్ధి వహించిరి.[10] పిచ్చుకకుంట్లవారి మేళము కేవలము పురుషులమేళమే. విజయనగరముదగ్గర తెర్లాంలో బూర్లగడ్డ వెంకటస్వామి మేళము ప్రసిద్ధినందినది; వీరు 'కాలుకుంట్లు' అట.

విశాఖజిల్లాలో ప్రత్యేకమైన భామాకలాపపద్ధతి కలదు; అందు ప్రసిద్ధులు వరదా ఆదినారాయణగారు.

ఇంక రాజాశ్రయాదులులేని రాజనర్తకీ-దేవదాసీ సంప్రదాయములవారు క్రమముగా దిగజారి బజారులలో మేజువాణీలకు దిగినారు. అట్టివారిని పిలిపించి, తైతక్కలాడించి, వారిని కూడ అనుభవించెడి సరసులు ఎక్కువైనారు; దీనితో అసలు నృత్యకళ పతనమైనది.

**కూచిపూడి వారి ఆహార్యము : ప్రసిద్ధ నర్తకులు :**

కూచిపూడివారిలో క్రింది కుటుంబములవారు ప్రసిద్ధ నర్తకులు—1. హరివారు, 2. చింతావారు, 3. బుక్కావారు, 4. వెంపటివారు, 5. వేదాంతమువారు, 6. భాగవతుల వారు, 7. ఇంగువవారు, 8. పసుమర్తివారు, 9. మహంకాళివారు, 10. జోస్యులవారు, 11. చల్లావారు. ఇటీవలివారిలో వెంపటి వేంకటనారాయణ, చింతా వేంకటరామయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి[11] గార్లు సుప్రసిద్ధనాట్యాచార్యులు. నవ్యులలో చింతా కృష్ణమూర్తి, వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యం మొదలగువారు ప్రసిద్ధులు. భాగవతుల దశరాథయ్య అనువారు మంత్రశాస్త్రములో అఖండులని ప్రసిద్ధి.

కూచిపూడివారి ఆహార్యమునందు కూడ విశిష్టత కన్పట్టగలదు. వారు భామవేషము నకు ఏడువారాల సొమ్ములు పెట్టుదురు—పెద్దజడ, చిన్నజడ, శిఖ, రాగిడి, చంద్రవంక, సూర్యుడు, తములపాకు, మొగలిరేకు, కేతకి, తురాయి, పాపట పింజినీలు, కమ్మలు, చేర్లు, జూకాలు, కర్ణపత్రములు, తాయెత్తులు, బాజుబందులు, దండకడియములు, మత్స్యములు, వోచీలు, కంకణములు, కడియములు, చిన్నపతకము, పెద్ద పతకము, వడ్డాణము, బిళ్ళల మొల త్రాడు, అడ్డబాస, కట్టడపు బులాకీ, ముక్కుపుల్ల మొ॥ ఈ నగలలో చాలవరకు నేడు రాజుల ఇండ్లలో బంగారు ఆభరణముల రూపమున కన్పట్టగలవు. శిరోభూషణమగు పెద్ద జడలోని బిళ్ళలు భూగోళ-ఖగోళ శాస్త్రముల ననుసరించి సూర్యచంద్రులను, నక్షత్ర సముదాయమును సూచించునట. ఇంక రాజు వేషమునకు కిరీటము, శంఖచక్రములు లేక భుజకీర్తులు, కర్ణపత్ర ములు, గండభేరుండము మొదలగునవి ప్రధానభూషణములు. భుజకీర్తులు మొదలగు వానిని బాడిద చెక్కతో తయారుచేయుదురు; పైన తళుకునుపయోగింతురు. స్త్రీవేషమునకు చీరలను, లంగాలను; పురుషవేషమునకు పాత్రల స్వభావముల ననుసరించి కోట్లు, కండువాలు మొ॥ ఉప యోగింతురు. కొన్ని వేషములకు వీరు ప్రతిశీర్షములను (కృత్రిమ ముఖములను-Masks) ఉపయోగింతురు—చతుర్ముఖబ్రహ్మ, నరసింహావతారము మొ॥ ఆహార్యమునకు సంబంధించిన వస్తువులనెల్ల వీరు ఒక పెట్టెలో పెట్టుదురు. దీనికి 'గజీయంపెట్టె' అని పేరు (Make-up Box). వీరి రంగస్థలము ఏ వీథిలోనో తాత్కాలికనిర్మాణము. ఏవిధమైన ఆడంబరమును, అట్టహాసమును లేకయే, కేవలము అభినయసామర్థ్యము చేతనే సామాజికులను మంత్రముగ్ధులను కావించి తెల్లవారువరకును అట్లే కూర్చుండబెట్టుదురు. దినచర్యలో కూడ వీరు చాల నిష్ఠగా నుందురు. నృత్యశిక్షణములో ఏమాత్రపు అలసతను సహింపరు. కూచిపూడి నర్తకుడు నృత్య కళయందెంత నిష్ణాతుడో, సంగీతమందును అంతటి నిష్ణాతుడును అగును. అంతియేకాదు, లక్ష్యలక్షణసమన్వయ జ్ఞానముకొరకు శాస్త్రపఠనముకూడ ఆవశ్యకము. ఇది కూచిపూడి నాట్య మందలి విశిష్టత.[12]

ఆధునికనాటకముల విజృంభణముతో, భరతనాట్యము తెలుగుదేశమున ప్రచారము నందుటతో కూచిపూడి నాట్యమునకు ఆదరణము సన్నగిల్లినది; ఇటీవల పునరుద్ధరణప్రయత్న ములు తీవ్రముగా సాగినవి; సత్ఫలితములు కలిగినవి,

# బొమ్మలాటలు

"భారతాది కథలఁ జీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు;
కడునద్భుతంబుగఁ గంబ సూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు"

—(పండి. చ-ప్ర. ప్ర.-పు. 435.)

బొమ్మలాటలు రెండు విధములు—1. కఱ్ఱబొమ్మల ఆట; 2. తోలుబొమ్మల ఆట. చీరమఱుగుల భారతాదికథల నాడించుట తోలుబొమ్మలాట; ఇంక కంబసూత్రముల ఆట కఱ్ఱ బొమ్మలాట. కాగా, ఈ బొమ్మలాటలు పండితారాధ్యచరిత్రనాటికి ముందే అనగా క్రీ. శ. 12 వ శతాబ్దినాటికి ముందే తెలుగుదేశమందు సుప్రసిద్ధములన్నమాట. కఱ్ఱబొమ్మలాటలకు యావ ద్భారత ప్రసిద్ధి కలదు. కాని తోలుబొమ్మలాటలు కేవలము దక్షిణదేశమునకు మాత్రమే చెందిన వని మహాభారతములోని 'రూపోపజీవనము' (XII-CCXCV-5.) అనెడి పదమును వాఖ్యానించుచు నీలకంఠపండితుడు తెల్పియుండుట గమనార్హము— 'రూపోపజీవన' మను నది 'జాలమండపిక' అను పేర దాక్షిణాత్యులందు ప్రసిద్ధము. సూక్ష్మవస్త్రమును కట్టి (దాని వెనుకనుండి) చర్మమయములైన ఆకారములతో రాజామాత్యుల చర్యలు ప్రదర్శింపబడును[1]. మరియు దాక్షిణాత్యులలో తెలుగువారే ఈ కళయందు సుప్రసిద్ధులగుట గమనింపదగ్గది.

క్రీ. శ. 1521 నాటి యొక శాసనమును బట్టి బొమ్మలాటవారు తమ విద్యాధిక్యముచే అగ్రహారమును బహుమతిగా పొందగలిగినారనియు[2], ఒక గణితశాస్త్రగ్రంథమునుబట్టి ఒక బొమ్మలాట వంశస్థుడు కృష్ణదేవరాయలంతటి చక్రవర్తికి అధికాప్తుడై, ఆందోళికాది సన్మానము లను బడసెననియు తెలియుచున్నది[3]. బొమ్మలాట అనునది ఇంటిపేరగుట గమనార్హము. ఒక వ్యక్తియో, వాని పూర్వులో బొమ్మలాటలందు బహుప్రసిద్ధి వహించియుందురు. ఆధునిక కాలములో 'భారతమువారు', 'బి. ఏ. వారు' అనునవి ఇంటిపేర్లు అయినట్లే, ఆనాడు ప్రసిద్ధిని బట్టి 'బొమ్మలాటవారు' అని ఇంటిపేరు వచ్చియుండును.

మరియొక శాసనమునుబట్టి[4] (A. R. 316 of 1928) కడప మండలమందలి కమలా పురము తాలూకా చిడిపిరాల గ్రామమును చంద్రమయ్య యనునతడును (ఇతనిని బొమ్మలాట రయితు అని అందురట), బొమ్మలాట యమృతకవి యనునతడును తెరనాటకము లాడుటకై పెద చిట్టయ్య యనునతని కొసంగిరని తెలియుచున్నది. అనగా బొమ్మలాటవా రున్నతపదవుల యందుండి రాజసన్మానముల నందుచు స్వయముగా గ్రామదానముల నొసంగుచున్నారని నిర్ణ యించుట అసమంజసము కానేరదు[5]. తెరనాటక మనగా తెరవెనుక బొమ్మల నెక్కించి యాడించు నాటకము; అనగా బొమ్మలాట అని అర్థము[6].

జంత్రపుబొమ్మల, కీలుబొమ్మల ప్రసక్తులు తెలుగు కావ్యములందు బహుధా కలవు; ఇట్టివి కేవలము ప్రత్యేకప్రదర్శనముల కొరకే కాక అలంకరణార్థము వినోదమందిరములందు,

పడకటిండ్ల యందుకూడ ఉండినట్లు కావ్యముల వలన తెలియుచున్నది. "ఇచ్చటి మందిరము లలో కొన్ని పాంచాలికాయంత్రనిర్మితములు కలవు. అవి యూరక అప్పుడప్పుడు ప్రదక్షిణము చేయుచుండును. అవి ఒక్కొక్క ప్రదక్షిణమునందు ఒక్కొక్క వింతరూపమును దాల్చు చుండును" అని విజయనగర రాజసౌధములనుగూర్చి అబ్దుల్ రజాక్ వర్ణించుట గమనార్హము[7].

ఇప్పట్ల కావ్యములందలి కొన్ని వర్ణనలనుకూడ పరిశీలించుట న్యాయ్యము. కృష్ణరాయ విజయములోని వర్ణన (IV-119) కఱ్ఱబొమ్మలాటను సూచించుచున్నది[8]. చంద్రభానుచరిత్ర లోని పద్యమునుబట్టి బొమ్మలాటలు కథాసంయుతములుగా జరిగెడివని స్పష్టమగుచున్నది[9]. అట్టి వానిలో 'గంగావతరణ' కథ యొకటి. ఇది 16 వ శతాబ్ది చివరి రచన. 1650 ప్రాంతముల రచింపబడిన చంద్రాంగదచరిత్రలో ఒక పద్యమునందు బొమ్మలాట మేళమును, తత్ప్రదర్శన విధానమును వర్ణింపబడెను[10]. బొమ్మలాటలు తెల్లవారువరకును జరిగెడివను విషయమును పాంచాలీపరిణయము తెలుపుచున్నది[11]. ప్రదర్శనము జరుగుచున్నప్పుడు కథాగతపాత్రము లొకవంక రాకపోకలు జరుపుచు, సంవాదాదులు కావించుచుండగా ఇంకొక ప్రక్క హాస్య పాత్రలు (గాందోళిగాడు, బంగారక్క మొ॥) నిలిచియుండుటను అనిరుద్ధచరిత్ర (18 వ శతాబ్ది మధ్యభాగము) లోని పద్యము తెలుపుచున్నది[12]. తోలుబొమ్మలాటలలో ఈ హాస్యపాత్రలను కొంతసేపు ఆడించి, మరల వానికి పనిపడునంతవరకును ఒక ప్రక్కగా తెరకు గ్రుచ్చి యుంచబడుట అందరకును తెలిసినదే.

కీలుబొమ్మలాటయందు వెనుక తెరమాత్రమే ఉండును; కథావశమున బొమ్మలు ఆ తెరచాటునుండి వెడలి వచ్చుచుండును. 'సరస్సునుండి వెలుపలికి వచ్చెడి స్త్రీలు తెరవాసివచ్చు జిగిబంగరు జంత్రపు బొమ్మలటు' లున్నారని అబ్బయామాత్యుడు పేర్కొనుట గమనార్హము (అని. చరి.-II-59.). తోలుబొమ్మలాటలు మాత్రము తెరలోపలనే జరుగును. వివిధములైన వర్ణములతో చిత్రింపబడిన ఆ బొమ్మలు వెనుకగానున్న దీపముల వెలుతురువలన నన్నని, తెల్లని తెరలోనుండి సామాజికులకు స్పష్టముగా కన్పించుచుండును.

కఱ్ఱబొమ్మలాటలకు తెలుగుదేశములో కొండపల్లి బొమ్మలు సుప్రసిద్ధములు. కొండ పల్లి కొండమీద దొరకెడి ప్రత్యేకమైన కఱ్ఱతో, తదితరసామగ్రితో వారాబొమ్మలనుచేసి, రంగులను వేయుదురు. ఇంక తోలుబొమ్మలను తయారుచేయుటలో జింకచర్మమును, మేక చర్మమును ఉపయుక్తములగును. (ఇవి చాల transparent అని తెలియవలెను). జింక చర్మమును దివ్యస్వరూపములకును, మేకచర్మమును తామసాదిస్వరూపములకును వాడుదురు. ఈ కఱ్ఱబొమ్మలు, తోలుబొమ్మలు కూడ 'సూత్ర' సాహాయ్యముతో ఆడింపబడుచుండును. ఆ సూత్రమును ధరించి, బొమ్మలను ఆడించునతడు 'సూత్రధారు' డనబడును[13]. ఇతడు సామాజికులకు కన్పింపడు.[14] అతడే సంభాషణములను చెప్పుచుండును. లేదా చంద్రాగద చరిత్రలో చెప్పబడినట్లు సంభాషణములను లేదా ప్రసంగములను చేయునతడు 'ప్రసంగి' యను పేరవేరుగానుండవచ్చును. అట్లే సంగీతమునకు కూడ వేరుగానుందురు. తోలుబొమ్మలాటలందు సంగీతమును సాధారణముగా స్త్రీలే పాడుచుందురు. తోలుబొమ్మలాటస్త్రీల కీచుకంఠము,

స్వరగాంభీర్యము సుప్రసిద్ధములు. ఈ మేళములోనివారు సాధారణముగా ఒకే కుటుంబమునకు చెందినవారై యుందురు. ఒకరికి వీలులేనిచో ఇంకొకరిని సర్దుకొనుటకు వీలుగా బొమ్మలాట సూత్రధారుడు ఇద్దరుముగ్గురు భార్యలనుచేసికొనుట కూడ కద్దు.

తెలుగులో బొమ్మలాటమేళములవారి సాహిత్యము యక్షగాన-వీథినాటకములే. వారు వీనిని యథాతథముగాకాని, కూర్పులు, మార్పులుచేసికొని కాని వాడుకొనుచుందురు. కొన్ని యక్ష గానములు కేవలము తోలుబొమ్మలాటలకొరకే వ్రాయబడినవని తెలియుచున్నది. 1750 ప్రాంత ముల బొమ్మలాట సాంబయ్య అనునతడు కిరాతార్జునీయము (తెలుగు), సారంగధరచరిత్రము (కన్నడము) అను వానిని రచించెనట. వీనితండ్రి సిద్దయ 'బొమ్మలాటశాసన', 'మోహనకవి' బిరుదాంచితుడట. 1850 ప్రాంతమువాడగు మరింగంటి భట్టరురామానుజాచార్యులు (గంజాంజిల్లా గుజ్జువాడ నివాసి) రచించిన శ్రీరామనాటకము 'బొమ్మలాట రామాయణము'గా ప్రసిద్ధిచెందినది (చె. ప్రా. లి. పు. భాం-N. No. 966). సంతవేలూరు కుశలవనాటకము మొదలగునవి నాటకప్రదర్శనమునకును, బొమ్మలాటకును కూడ ఉపయోగపడునట్లు రచింపబడెను. రంగనాథ రామాయణమువంటి ద్విపదరచనలను కూడ తోలుబొమ్మలాటలవా రుపయోగించుకొనుచుందురు.

తెలుగుదేశములో బొమ్మలాట ప్రదర్శనములు అర్వాచీనకాలములో నశించినవి. మహా రాష్ట్రులీకళను చేపట్టినారు; ఇది ఎప్పుడు జరిగినదో చెప్పజాలము. కాని 19 వ శతాబ్దిమధ్యలో కొన్ని మహారాష్ట్రకుటుంబములు తెలుగుదేశమునకువలసవచ్చి ఈ కళను మరలప్రచారములోనికి తీసికొనివచ్చినవి. వారిలో ఒకశాఖవారే నేటి 'సురభినాటకసమాజములవారు.' నేడు తెలుగు దేశమందలి తోలుబొమ్మలాటలవారిలో అధికము మహారాష్ట్రదేశమునుండియే వచ్చినవారగుటచేత అసలు తోలుబొమ్మలాటలు కూడ మహారాష్ట్రదేశమునుండియే దిగుమతిఅయ్యెనని కొందరు తలంచుచున్నారు; కాని, ఈ అభిప్రాయము సత్యదూరము. ఈ మహారాష్ట్రులు ప్రప్రథమముగా కడప-బళ్ళారి మండలములలో స్థిరపడినారు.ఆ మండలములు మొదటినుండియు బొమ్మలాటలకు ప్రసిద్ధిచెందియున్నట్లు శాసనములవలన తెలియుచున్నది. ఇట్లు వలసవచ్చినవారు, ఇక్కడికి వచ్చినతరువాతనే తోలుబొమ్మలాటను నేర్చినారన్నను అసమంజసముకానేరదు. అంతియేకాక పశ్చిమగోదావరి, తూర్పుగోదావరిమండలములలో మహారాష్ట్రసంపర్కము బొత్తిగాలేని కేవల ఆంధ్రులే తోలుబొమ్మలాటవారుగా ప్రసిద్ధినందియుండుటయు విస్మరింపరానిది.

ఈ తోలుబొమ్మలాట ప్రదర్శనములను పునరుద్ధరించి, ఆధునికముచేయుటకు కేంద్ర ప్రభుత్వపరిశోధన ఉపకారవేతనమును పొందిన శ్రీ రమణగారు (కాకినాడ) ప్రయత్నించు చున్నారు.

**ఛాయానాటకములు :**

సంస్కృతము నందు 'ఛాయానాటకములు' అనెడి తెగకుచెందిన మేఘప్రభాచార్యుని 'ధర్మాభ్యుదయము', సుభటుని 'దూతాంగదము' మొదలగురూపకములు కొన్నికలవు. ఇవి తోలుబొమ్మలాటల కుపయుక్తములైన రూపకములని కొందరు తలంచినారు. కాని ఆలంకారికు లెవ్వరును ఈ పదమును నిర్వచింపలేదు; అంతియేకాదు శాస్త్రగ్రంథములందు తత్ప్రశంసయును

కన్పట్టదు. ఆయాకారణములనుబట్టి ఛాయానాటకములు తోలుబొమ్మలాటలకు సంబంధించినవి కావనియు, పూర్వరూపకముల ననుకరించుచు, అందలి శ్లోకాదులను కొన్నింటిని గ్రహించుచు, స్వకపోలకల్పనములనుచేయుచు, మూలరూపకములకు 'ఛాయ'గా రచింపబడినవే ఛాయానాటకములనబడెననియు డా. ఎస్. కె. దే ప్రభృతులు నిర్ణయించి యున్నారు.[15]

ఆధునికకాలములో 'ఛాయానాటకప్రదర్శనము' (Silhouette) అనుపద్ధతి ఇంకొకటి ప్రచారములోనికివచ్చెను. ఇది 'Shadow play' అనుదానికంటె భిన్నమైనది. సజీవవ్యక్తులను కాని, జంతువులనుకాని దీపమునకును తెల్లని సన్నని తెరకునుమధ్య నిలబెట్టి వానినీడలు తెరపై పడునట్లుచేయుదురు. తోలుబొమ్మలాటలయందు తోలుబొమ్మలు తెరను అంటిపెట్టుకొని యుండవలసినట్లు ఇందు వ్యక్తులు తెరకు అంటిపెట్టుకొని ఉండనక్కరలేదు; వారిబొమ్మలు తెరపై నల్లగా పడుచుండును. ఆకారరేఖలుమాత్రము ప్రస్ఫుటముగా కన్పట్టుచుండును. మరియు వ్యక్తులుగాని, జంతువులుగాని, చివరకు బొమ్మలుకాని అక్కరలేకయే కేవలము చేతులతోను, చేతివ్రేళ్ళతోను పెక్కు ఆకారములను సృష్టింపవచ్చును. హస్తాభినయము తెలిసినవారికిది మిక్కిలి సులభము. కేవలము తాత్కాలికప్రదర్శనములతో తృప్తిచెందక పాశ్చాత్యులు ఇట్టి సినిమాలను కూడ తీసియున్నారు.

భారతీయుల బొమ్మలాటలలో తోలుబొమ్మలాటలు జావా మొదలగు ప్రాచ్యదేశములకును, కట్టెబొమ్మలాటలు పాశ్చాత్యదేశములకును వ్యాపించినవి. జావాద్వీపవాసుల వినోదములలో ప్రధానమైనది 'వాయంగ్' (బొమ్మలాట). ఇందులో పలుభేదములున్నవి[16]. ఈ వినోదములందెల్లెడల హిందూసంప్రదాయమే గోచరించును. జావా, బలి ద్వీపములను చంద్రవంశపు, యదువంశపు హిందూరాజులు చాలకాలము పరిపాలించినారు.

కట్టెబొమ్మలాట పాశ్చాత్యదేశములందు నేడధికాదరణమునుపొంది, అభివృద్ధిలోనికి వచ్చినది. ఆ కళలనుగూర్చిన పెక్కుగ్రంథములు ప్రకటింపబడెను. వానిని ప్రదర్శించుటకు ప్రత్యేకసమాజములు పెక్కులుగలవు; వారికి ప్రభుత్వాదరణముకలదు. ఈమధ్య రష్యన్ కళాకారులు భారతదేశమునందలి ముఖ్యపట్టణములందు ఈ బొమ్మలాటను అద్భుతముగా ప్రదర్శించియున్నారు. ఈ కళాకారులు 6 అడుగుల ఎత్తువరకు మూయబడినభాగమున తాము ప్రచ్ఛన్నముగానుండి, ఇంచుమించుగా తమనెత్తిమీదనే బొమ్మలనాడింతురు. ఒక్కొక్క బొమ్మకు నలుగురైదుగురు మనుష్యులు పనిచేయుచుందురు. ఇవియన్నియును గుడ్డబొమ్మలు; కాని మనుష్యులవలెనే అన్నిపనులను చేయుచున్నట్లు సూత్రసాహాయ్యమున ఆ కళాకారులు చూపింతురు. రాజస్థానమందుకూడ ఈ కీలుబొమ్మల ప్రదర్శనములుకలవు. అచ్చటివారు పైన ప్రచ్ఛన్నముగానిలిచి, పైనుండియే క్రిందిబొమ్మలను సూత్రముల సాహాయ్యమున ఆడింతురు.

పాశ్చాత్యులు బొమ్మలను ఐదు ప్రధానశాఖలుగా విభజింతురు—1. Shadow-Puppets; 2. Hand Puppets; 3. Hand and Rod Puppets; 4. Rod – Puppets; and 5. Marionettes (String Controlled Puppets.). వీనిలో ఒక్కొక్కపద్ధతి ఒక్కొక్కరకపు ప్రదర్శనమునకే బాగుండును; అన్నియును అన్నికథలకును సరిపడవు.

ప్రభుత్వము వృద్ధకళాకారులను ఆదుకొన్నచో సంప్రదాయవిచ్ఛిత్తికాకుండగనే ఆధునిక పద్ధతులలో మన బొమ్మలాటల ప్రదర్శనములను పునరుద్ధరింపవచ్చును.

## యక్షగానములు

1. "కీర్తింతురెద్దాని కీర్తిగంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి (భీ.పు. – III–65)[1]

2. "రాగమునుండి లంఘించు రాగమునకు, నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి, వలపుపాడుచువచ్చె జక్కులపురంధ్రి."
—క్రీడాభిరామము–పుట–46.

3. ప్రోలుగంటి చెన్నశౌరి (15 వ శతాబ్ది ఉత్తరార్ధము) అష్టభాషాకవివర్యుడై "సౌభరిచరితంబు జక్కులకథచెప్పి లాలిత నవరసాలంకృతముగ" నరసింగరాయలచేత నగ్రహారంబులును వివిధార్థములను గొనియెనట (హరిభట్టు నారసింహపురాణము)

4. "కవితాధోరణి యక్షగానరచనల్ గంధర్వగాంధర్వమున్
హవణింపం గనకప్రసూనముల కత్యామోదసంపర్కమై
మివులన్ మెచ్చఁగఁజేసి శేఖరుల భూమిన్ సత్కళావంతులన్
భువనంబెల్లనుముంచె నద్భుతరసాంభోరాశి నుల్లాసియై."
—(కట్టా వరదరాజు శ్రీరంగమాహాత్మ్యము–1630 ప్రాంతములు)[2]

5. "వృషభగతి త్రిపుటరే కంప్రియుగమగుఁ దుద నేడులఘువులతోఁగఁజేయ
జంపెరేకునకు లక్షణము ద్విరదగతియగుఁగాన నొకలఘువందుమాన
రచ్చరేకగును దురగవల్గనముగతి మఱియేకతాళియౌ మధురగతిని
అటతాళమున మాత్రలంఘ్రి కిర్వదినాల్గు నాల్గిటవిరతి పద్నాలుగింట
నిలుచు నర్ధంపునర్ధచంద్రికలు దీన యక్షగానాదికృతులలో నార్యులిడిన
రగడభేదంబు లివియౌను......................." [3]
—(లక్షణసారసంగ్రహము – 1550 ప్రాంతముల–II–141).

6. "..........................................వీన
యక్షగానప్రబంధంబు లతుకవచ్చు, రగడభేదంబు లివియంద్రు......[4]
—(అప్పకవీయము–1656 రచన–IV–304).

7. "యక్షౌఘగీత మపి గానశైలీమ్"
"యక్షాశ్చ నాగా అపి కిన్నరాశ్చ గాంధర్వముఖ్యా అపి గానలోలాః"[5] —(సంగీతసుధ)

పై ఉదాహరణములను పరిశీలించినచో 15 వ శతాబ్దినాటికి 'యక్షగానము' ఒక సాహిత్యప్రక్రియగా స్థిరపడినదని తెలియగలదు. సంస్కృతమూలమునందు లేకపోయినను తెలుగులో "యక్షగాన"మనెడి సమస్తపదమును ప్రయోగించిన ప్రథముడు శ్రీనాథుడు.[6]

గంధర్వులు దక్షవాటీపుర వైభవమును 'గాంధర్వము'న కీర్తింతురని మూలమందుండగా గాంధర్వమున 'యక్షగానసరణి'లో కీర్తింతురని శ్రీనాథుడు పేర్కొనెను. అనగా 'యక్షగాన' రచనమును 'గాంధర్వము'న కూర్చినారన్నమాట. కాగా, వరదరాజు పేర్కొన్నట్లు యక్షగాన రచనలోని కవితాధోరణికి గంధర్వుల గాంధర్వముతో డైనదన్నమాట. అట్టి సంయోగమువలన ఆతడే పేర్కొన్నట్లు 'కనకప్రసూనములకు చక్కని తావి అబ్బినట్లైనది'. కవిత్వమునకు గాంధర్వము తోడైనదనగా ఆ రచన గానప్రధానమైనదన్నమాట. సంగీతసుధలో గానశైలీ ప్రాధాన్యము పేర్కొనబడుట గమనార్హము. తెలుగులాక్షణికులు యక్షగానములందుపయుక్తములగు రగడభేదములనుమాత్రమే వివరించి గీతిప్రాధాన్యమునే స్పష్టీకరించియున్నారు.[7]

ఇట్లు కొందరు యక్షగానరచనలను ప్రశంసింపగా మరికొందరు కవులు, లాక్షణికులు యక్షగానములనే రచించియున్నారు— చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణచరిత్రము,[8] కందుకూరి రుద్రయ్య సుగ్రీవవిజయము, బాలపాపాంబ 'అక్కమహాదేవి చరిత్రము', కంకటి పాపరాజు 'విష్ణుమాయావిలాసము', అప్పకవి 'అంబికావాదము' ఇందులకుదాహరణములు. అప్పకవి యక్షగానమును 'ప్రబంధ'మనుట గమనార్హము. కేవలము గానప్రధానములన్నంత మాత్రమున ఇవి కవిత్వగుణమున నీరసములనిమాత్రము తలంపరాదు; ఇందు కవిత్వ-గానములు రెండింటికిని సమప్రాధాన్యము కలదు.

'సంగీతసుధ' రచయితతప్ప మరి యే యితర సంస్కృతలక్షణకర్తయును యక్షగానముమాట తలపెట్టలేదు; అతడుకూడ 'యక్షగాన'మనెడి సమస్తపదమును వాడకపోవుట గమనార్హము. కావున, దీనిని సంస్కృతసాహిత్యముతో సంబంధములేని కేవల దేశిసంగీత-సాహిత్యప్రక్రియగా నిర్ణయింపవచ్చును. 'రగడ'యనెడి ఛందోభేదము సంస్కృతమునందు లేకపోవుటయును ఇందులకు బలముగానున్నది.

సాధారణముగా యక్షగాన నాటకములందలి గీతులకు 'దరువు'లను పేరు ప్రచారమునందున్నది. సంస్కృతమునందలి 'ధ్రువా' పదమే కన్నడ-తెలుగు భాషలలో 'దరువు' అయినదనియు, శార్ఙ్గదేవుడు పేర్కొనిన 'రహడి' ఛందము తెలుగులోని 'రగడ' వంటిదే అనియు, కావున యక్షగానము సంస్కృతప్రాకృతములందలి నృత్య (ఉప) రూపకములనుండియే ఉత్పన్నమైనదనియు డా. వి. రాఘవన్ ప్రభృతుల అభిప్రాయము[9]. ఈ అభిప్రాయము సమంజసముకాదు. ప్రాచీనములైన సుగ్రీవవిజయాదులలో 'దరువు' అను పదమేలేదు. అందు ఏల, జంపె, త్రిపుటాదులే కలవు. అవియెల్ల తాళప్రధానములైన గీతులు. తెలుగులో 'దరువువేయుట' అనగా మద్దెలవాయించుట లేదా తాళమువేయుట అని అర్థము. అది క్రమముగా తాళ-లయల కనుగుణమగు గీతికికూడ పేరైనది. అందుచే దరువునకును, ధ్రువకును సంబంధము కల్పించి కాలనిర్ణయమునకు కడంగుట సమంజసముకాజాలదు. ఇంకను రెండింటికిని సంబంధమున్నదనియే గట్టిగా వాదించినచో వేటూరి ప్రభాకరశాస్త్రిగారూహించినట్లు అతిప్రాచీనమైన తెలుగు దరువే సంస్కృతమునందు 'ధ్రువ' అయినదనికూడ వాదింపవచ్చును[10].

యక్షగాన రచనలు తెలుగులోనేకాక కన్నడ తమిళభాషలలోకూడ కలవు. ఈ యక్షగాన రచన దక్షిణ కనరాజిల్లాలో ఆరంభమై తెలుగు తమిళ రాష్ట్రములకు ప్రాకినదని డా. రాఘవన్ సిద్ధాంతించియున్నారు[11]. ఈ అభిప్రాయముకూడ సమంజసముకాదు: యక్షగాన రచన 14 వ శతాబ్ది ప్రాంతములందో, అంతకింకనుముందో తెలుగుదేశమందే ఆరంభమైనదనియు, తెలుగుదేశమునుండియే కన్నడ-తమిళదేశములకు వ్యాపించెననియు శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారు నిరూపించియున్నారు[12]. కన్నడ తమిళ యక్షగానములను పరిశీలించినచో అవియేవియును 17 వ శతాబ్దికి ముందరి రచనలు కావని తెలియగలదు. ఆ రచనలలో అధికభాగము 18 వ శతాబ్ది నాటివే.

'యక్షగాన'మందలి యక్షపదమును, గానపదమును సంస్కృత పదములే. అయినను యక్షగానము సంస్కృతసాహిత్యప్రక్రియకు సంబంధించినది కాదని గుర్తించియున్నాము. అయినచో ఈ పదమెట్లు వచ్చినదను విషయమును ఆలోచింపవలసియున్నది. 'యక్షగాన'మనెడి సమస్తపదము 'జక్కులపాట' అనుదానికి సంస్కృతీకరణమని విమర్శకుల నిర్ణయము.

17 వ శతాబ్దిలో యక్షగానపదము 'వీథినాటకము'నకు పర్యాయపదమైనది. కాని, యక్షగానోత్పత్తికిని, నాటకములకును ఎట్టి సంబంధమునులేదు. (యక్షగానము ఆదిలో 'పాట' మాత్రమే. 'జక్కులరేకు' అనునది దీనికి ఈ స్థితిలోనే పేరై యుండును). తెలుగు కన్నడ దేశములందు యక్షులను కొలిచెడి సంప్రదాయమున్నది. 'అక్కదేవత'లనెడి ఏడుగురు యక్షకన్యలను, అందులో ముఖ్యముగా 'కామేశ్వరి'ని ఆరాధించెడివారు తెలుగుదేశములో నేటికిని అన్ని వర్ణములవారిలోను కలరు[13]. తెలుగు కన్నడ సాహిత్యములందును, బౌద్ధసాహిత్యమందును యక్షుల ప్రశంసలు బహుధా కలవు. యక్షులు అప్సరః స్త్రీలకు నృత్తము లందు సహాయకులట[14]. కన్నడ యక్షగానములందు 'యక్షిణి' వేషము 'యక్షాందోళన' మనెడి నృత్యమును నేటికిని ప్రదర్శించుచున్నది[15]. ఇట్లు యక్షసంప్రదాయమునకు చెందిన ఆటవిక జాతికి, లేదా జానపదులకు 'జక్కులవారు' అనెడిపేరు వచ్చియుండును. ('యక్ష' శబ్దమునకు వికృతియే 'జక్కు'). కామవల్లీమహాలక్ష్మి(కామేశ్వరీదేవి = లక్ష్మీదేవి)ని స్తుతించుచు పాడుటయే వీరి కులాచారమని చెప్పవచ్చును. జక్కుల పురంధ్రి ఇట్లే పాడినదని క్రీడాభిరామమందు వర్ణితమైనది[16]. ఈ పద్యమునకు వెనువెంటనే అక్కదేవతల ప్రశంస చేయబడుట గమనార్హము.

పై విధముగా తెలుగుసాహిత్యములో 'జక్కుల పురంధ్రుల' పాట వర్ణితముకాగా కన్నడ సాహిత్యమందు 'ఎక్కలగాణల' గానము ప్రస్తావింపబడినది. 'ఎక్కలగాణ'[17] పదమును విడదీసి అర్థముచెప్పినచో 'ఇంపైన గాయకుడు' అని అర్థము చెప్పవలెను. అయినను ఈ 'ఎక్కల' పదము 'జక్కుల' పదమువంటిదేఅని స్ఫురింపక మానదు. ఈ గానమునుగూర్చి శ్రీ ముట్నూరి సంగమేశం క్రిందివిధముగా వ్రాసినారు — "అగ్గళుడు (12 వ శతాబ్ది) వ్రాసిన చంద్రప్రభాపురాణంలో (7 ఆ.96వ.) వనవిహారం చేస్తూన్ననాయకుడు, మేళతాళాలతో నిమిత్తంలేకుండా దేశీయగీతాన్నొకదానిని ఒక 'ఎక్కలగాణ' యింపుగా పాడుతూఉంటే విన్నాడని వర్ణించబడింది. అభినవపంపని (12వ. శ.) మల్లినాథపురాణంలో (VI-98) కమలా మోది

యైన తుమ్మెద ఝంకారం కమలాలయయైన లక్ష్మిని కీర్తిస్తూపాడే 'ఏక్కల'గానంతో పోల్చి వర్ణించబడింది. రత్నాకరవర్ణి (16 వ. శ.) వ్రాసిన భరతేశవైభవంలో (ఆస్థానసంధి_58వ) వెనుక పాటకులతోనూ, మేళతాళాలతోనూ 'ఎక్కడిగలు' 'నాట్యమాడినట్లు వర్ణించబడింది. ఆయావ్రాతలవల్ల యీ ఎక్కలగాణలు తెలుగుజక్కులపాటకులవలెనే జానపదగాయకులనీ, లక్ష్మీప్రశస్తిని వర్ణించడమే వీరికికూడ కులాచారమనీ, నృత్యంకూడ వీరెరుగుదురనీ, అందులో హంగుదారుల ఆటోపంకూడ వీరికవసరమేఅనీ బోధపడుతూంది." (భారతి, ఫిబ్రవరి_1956, పుట 67).

12 వ శతాబ్దిలో ఎక్కలగాణల గానము సాహిత్యమందు ప్రస్తుతింపబడినదన్నచో నాటికి చాలముందే అది ప్రచారములో నుండియుండవలెను. అట్లే తెలుగులోని జక్కులపాటలును అతి ప్రాచీనములై యుండుననుటలో సందియములేదు. ఇప్పుడీపాటకులు నశించినారు. కన్నడదేశములో ఎక్కలగాణలుకాని, ఎక్కడిగలుకాని, ఇదేపేరుతోనున్న జాతికాని నేడులేదట. తెలుగుదేశములో గుంటూరు జిల్లాలో జక్కులవారున్నను వారికిప్పుడీయక్షగానములతో సంబంధము కన్పట్టదు.[18]

యక్షగానచరిత్రలో విస్పష్టములైన దశలు మూడు కన్పట్టుచున్నవి_1. కేవలము గేయరూపమున నుండుట; 2. సంవాదరూపమును తాల్చుట; 3. వీథి నాటకముతో అభేదమును చెందుట.

1. కేవలము గేయరూపముననుండుట___ఈదశ కేవలము గానాత్మకమైనది. ఇది దేశిచ్ఛందస్సులలోని విడివిడిపాటల సంపుటీకరణముకావచ్చును; లేదా కథనాత్మకముకావచ్చును. క్రీడాభిరామమందు పేర్కొనబడిన జక్కులపురంధ్రిపాట ఈదశకుచెందినదే. క్రీడాభిరామమందు జక్కులపురంధ్రిపాటయేకాక మాలెతలు ఏకవీరనుగూర్చి పాటలుపాడుట (పుట 43_131 ప)[19], బవనీలు పరశురామునిగూర్చిన పాటలుపాడుట[20] (పుటలు 42_43_129_30 ప.), ఒక పూర్వ సువాసినియొక్క విద్దికంచి (కూచి ?) రామాయణగానము[21] (పుట 56_170 ప.), ఒకపడతి పలనాటివీరకథను పాడుట (పుటలు 36_37. 116_117 ప.) కూడ వర్ణితములైనవి. జక్కుల వారికి కామవల్లీ మహాలక్ష్మి కులదైవమైనట్లే మాలెతలకు ఏకవీరాంబ కులదైవము. వీరీ దేవతలనుకొలిచి స్తుతించునట్లే బవనీలు[22] పరశురామునికథలను, కొందరు పడతులు పలనాటి వీరులకథలను పాడుట కులాచారమైనట్లుగా స్పష్టమగుచున్నది. వీరివలెనే సుద్దులగొల్లలు కృష్ణలీలలను, కాటమరాజుకథలను పాడుచుందురు.[23] పైపాటలను, కథలను పాడెడివారి ఆశయ మొక్కటియేఅనియు (అనగా ఆరాధ్యదైవమునో లేదా జాతీయవీరులనో స్తుతించుట), కులము లను జాతులను సంప్రదాయములనుబట్టి భిన్నత్వము వచ్చెననియు, ఇట్టివి యన్నియును యక్ష గాన చరిత్రలోని ప్రథమదశకే చెందుననియు తలంచుచున్నాను. ఆదిలో ఈ ఆరాధ్యదైవ స్తుత్యాదులు కేవలము తత్ప్రయోజనపరములే కావచ్చును; తరువాతికాలములో అదియే వారికి జీవనాధారముకూడ అయ్యెను.

2. సంవాదరూపమునుతాల్చుట_ మొదటిదశయందు అజ్ఞాతకవులరచనలు ప్రాధాన్యము వహించియుండును. ఈదశలో ప్రసిద్ధివహించిన కవులుకూడ యక్షగానరచనను చేపట్టినారు.

దీనితో వరదరాజుచెప్పినట్లుగా గానమునకు కవితాధోరణి తోడైనది. ఈదశకుచెందినవే సుగ్రీవ విజయాదులు. వీనియందు సంవాదము[24] పద్య-ద్విపద-గేయములలో జరుగుచుండును. సంధి వచనములవంటివి గద్యములోఉన్నవి. సూత్రధారుడుమాత్రము ఉండడు. సౌభరిచరిత్ర మనెడి జక్కుల కథకూడ ఈ దశకే చెందియుండునని తలంచుచున్నాను. ఒక స్త్రీ కాని, ఒక పురుషుడు కాని వీనిని గేయరూపమున హావభావములతో చదివి పాడి వినిపించుచుండును. నేటి బుఱ్ఱ కథలు[25], హరికథలు[26] కూడ ఈ దశకు చేరవలసినవే.

3. వీథి నాటకముతో అభేదము—ఈ మార్పు ప్రధానముగా 17 వ శతాబ్దిలో నాయక రాజుల కాలములో వచ్చినదని చెప్పవచ్చును. 'యక్షగాన నాటకము' అనెడి సమస్త పదము వ్యవహారములోనికి వచ్చినది. కృతికి ఆదిలో యక్షగానమని ఉన్నచో అంతమున వీథినాటక మనియో లేదా నాటకమనియో ఉండును. అట్లే ఆదిలో నాటకమని ఉన్నచో అంతమున యక్ష గానమని యుండును. యక్షగానము వీథినాటకముతో అభేదమును చెందుటలో మరల రెండు దశలను గుర్తింపవచ్చును—మొదటిది యక్షగానము వీథినాటకగుణములను గ్రహించు చుండుట; రెండవది యక్షగాన-వీథి నాటకములు ఒకటియే అగుట.

సారాంశ మేమనగా సంగమేశంగారు తలంచినట్లు "ఆటవికజాతుల నాట్య గానాలవల్ల స్ఫూర్తిగొని, వారి సంప్రదాయాలను చాలవరకు స్వంతం చేసికొని, ఆనాటకానాట సాహిత్యకలక్షణాలను పెంపొందించుకొంటూ వెలసిన దేశిరచనలే యక్షగానాలని నమ్మ వచ్చును"[27]. మరియు డా. యస్వీ జోగారావు పేర్కొన్నట్లు "యక్షగానము హరికథవలె నాఖ్యా నింపబడుచు, ఇంటింట నాడువారిచేఁ బారాయణము గావింపఁబడుచు, బొమ్మలాటవలెనే వెనుక పాటగాఁ బరిగణింపఁబడుచు, వీథిభాగవతులచే రూపకముగా బ్రదర్శింపఁబడుచు నిట్లు బహుముఖ ప్రయోజనములతో బహుముఖముగా వర్ధిల్లుచువచ్చినది."[28]

## కొరవంజి (కుఱవంజి)

"తెలిసినంతలో 'కొరవంజి' పదమును ప్రప్రథమముగా కావ్యములో వాడిన తెలుగు కవి అయ్యలరాజు రామభద్రుడు (1500-1580) గా కన్పట్టుచున్నాడు. చెంగల్వరాయ విరచిత మగు 'ఎఱుకుల కథ'లలో ఎఱుకుల ఆచార్యవ్యవహారములు, ఆహారవిహారములు మొదలగు వానినిగూర్చిన వివరములుకలవు. ఎఱుకులకే 'కొఱవంజు'లనియు, 'కొఱవత' లనియు, 'కొరతి' అనియు, 'సింగి' అనియు పర్యాయవ్యవహార నామములున్నట్లు ఈ రచనవలన తెలియుచున్నది. 'కొరవంజి' పదమాజాతికిని, స్త్రీకిని, పురుషునకును, వారి నృత్యవిశేషమునకును వ్యవహార పదమైనది. పదునాఱవశతాబ్దివాడగు రామభద్రుడు కొరవంజుల క్రీడావిశేషములను[2] పేర్కొ నుటచేత ఇది అంతకు ముందే ప్రచారమునందియుండుననుట స్పష్టము."[3]

తెలుగు కావ్యములందు కన్పట్టు ప్రయోగములనుబట్టి 'కొర (ఱ) వంజి' పదము మొదట జాతిపరమనియు, పిమ్మట ఎఱుకచెప్పి జీవించు ఆ జాతిస్త్రీకి, లేదా ఆ జాతిలోని పురుషు నకు వ్యవహారనామమైనదనియు, అటుపిమ్మట వారి నృత్య విశేషమునకు (సోదెచెప్పుట)ఆ పేరు

వచ్చెననియు ఊహింపవచ్చును.[4] క్రమమేది అయినను కావ్యములందుకాని, నాటకములందుకాని నాయికకో, నాయకునకో సోదెచెప్పెడి ఎఱుకులసానికి 'కొరవంజి' అనుపేరు రూఢమైనదనుట స్పష్టము.[5] ఈ కొరవంజి పాత్రప్రవేశముకల యక్షగానములు లేదా వీథినాటకములు 'కొరవంజు' లనబడినవి. ఇవి తెలుగు–తమిళ–కన్నడ భాషలు మూడింటనుకలవు.

ఈ కొరవంజుల పుట్టుకనుగూర్చి వేటూరిప్రభాకరశాస్త్రిగారు క్రిందివిధముగా వ్రాసి యున్నారు[6]– "తొలుత ద్రావిడభాషలలో వెలసినదృశ్యరచనలు కురవంజులనఁబడినవి. ఆంధ్ర కర్ణాట ద్రవిడదేశముల యరణ్యములలోవసించు నాటవికులు, చెంచులు, కురవలు (క్రోవ, కోయ) అనువారు. అందు కురవజాతివారి యంజె = అడుగు (నృత్యవిశేషము) 'కురవంజె'అనఁ బడెను. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ–ఇత్యాదులు నృత్యవిశేషములు......కొరవ జాతులవారు చేయునృత్యములు కొరవంజులనఁబడెను. కొరవంజెయన్న పేరు తొలుతవారి నృత్య మునకును, పిదప నృత్యవిశిష్టమయిన వారి చిన్ని చిన్ని గేయరచనలకును, నాపై కురవజాతివారి కినిగూడ, బేరైనది. కురవజాతివారు తొలుతచేయు నృత్యవిశేషము కాలక్రమమున నాయాపర్వత ప్రదేశముల స్థలమాహాత్మ్య కథలతోను, శివవిష్ణులీలాకథలతోను మిశ్రితములయి గేయవిశిష్ట నాట్య రూపములనుపడసెను......అవి సింగి–సింగఁడు–అని యిద్దఱుపాత్రములుగలవై సంస్కృత వీథినాటకములఁ బోలియున్నవి. సింగి, సింగఁడు సంస్కృత నాటకములలోని నటీనటులవలె నాలుమగండ్రు. వీరిద్దఱే కథాపాత్రములగుచుందురు. కొన్నింట కథాసంధాయకుఁడు–సంధివచన ములఁజెప్పువాఁడు, విదూషకుఁడనఁదగినవాఁడు–మూడవపాత్రము–కోణంగి యనువాఁడు (పిదప చోడిగాఁడు) కానగును......దేశిరచనలలోనుండి సింగి–సింగఁడు, కోణంగి, దరువు అనునవి నటీ–నటులుగను, విదూషకుఁడుగను, ధ్రువగను సంస్కృతనాటకములఁజేరెనేమో యని యూహింపఁదగినట్టున్నది.....చెంచులు కురవలు....అటవికవస్తువులను నగరములకు గొనివచ్చి అమ్ముచున్నప్పుడు తమ గేయనృత్యవిశేషములను నగరములందును, పల్లెలందును బ్రయోగించు టచే నవి నాగరికదేశములందును వ్యాపించెను."

ద్రవిడదేశపు దృశ్యప్రబంధమైన 'కొరవంజి' నుండియే యక్షగానముత్పన్నమైనదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాదము.[7] కేవలము 'కొరవల అంజె' యే దృశ్యరచనమునకు మూలమనుట సత్యసమ్మతముకాజాలదు.వారు కొరవలో, మరియెవరో తెలియదుకాని, ఆ'ప్రాక్తన మానవుల అంజె' (ఆటపాట–Ballad Dance) యే నృత్య–సంగీత–సాహిత్యములకు మూల మైనదనుట ప్రాచ్య–పాశ్చాత్య విజ్ఞవిమర్శకులంగీకరించినదే. కాని, దానిని కేవలము కొరవలను ఒకజాతికి మాత్రమే పరిమితముచేయనిచో శాస్త్రిగారివాదము కొంతవరకును సమంజసమే. ఇంక నటీ–నట–విదూషక–ధ్రువలు దేశిరచనలలోనుండియే రూపొందియుండుననెడి విషయము సాదరముగా ఆలోచింపదగినవిషయము.[8]

16వ శతాబ్దిలో కొరవంజి నృత్యము వర్ణితమైనను[9] ఆ శతాబ్దములోకాని, ఆ వెనువెంటనే కాని సాహిత్యప్రక్రియగా కొరవంజులు రచింపబడినట్లు కన్పట్టదు. కన్నడమందలి కురవంజులు కూడ పదిహేడవ శతాబ్దమునకుమించి ప్రాచీనమనిపించుకోవని ముట్నూరి సంగమేశంగారు

పేర్కొనియున్నారు; కావున కురవంజులు ప్రాచీనములుకావని స్పష్టమగుచున్నది. వారు కొరవంజులను మూడురకములుగా వివరించినారు;[10] ఆ విభజనము సమంజసముగానున్నది—

"కొరవంజి యక్షగానాలు ముప్విధాల కనిపిస్తాయి. కొరవంజి, కొరవనాయకుల ప్రణయవృత్తాంతాన్నే వర్ణించేవి మొదటిరకం. ఇందులో చెంచులక్ష్మి (కొరవంజి)ని, నృసింహస్వామి (కొరవనాయకుడు) వలచి, వరించినగాథ వర్ణించబడుతుంది. కొరవంజిని సింగిఅనీ, కొరవనాయకుని సింగడనీ యిందులో వ్యవహరిస్తారు. తెలుగులో గరుడాచలమాహాత్మ్యం, చోడిగానికలాపం వగైరా రచనలిట్టివి. విశాఖమండలంలో ప్రదర్శింపబడే ఎరుకలకీర్తన యీచోడిగానికలాపమే. ఈ కథలోగల ప్రణయఘట్టం, యీపాత్రలు మిగిలినకొరవంజి రచనలన్నిటికీ మూలాలు. లక్ష్మీనృసింహులకుబదులుగా పార్వతీపరమేశ్వరులను ఎరుకదంపతులుగా మార్చివ్రాసిన యక్షగానాలు కూడ దీనినుకరించి వెలసినరచనలే. శహాజీమహారాజుగారు తెలుగులో వ్రాసిన కిరాతవిలాసమనే యక్షగానమిట్టి అనుకరణమే.........

"నాయకుడు ఎరుకతవేషంతోపోయి, నాయికనుకలసి, ఆమె హస్తరేఖలు పరీక్షించి, త్వరలో ఆమెకు అనుకూలుడైన భర్త దొరుకుతాడనిచెప్పి, కొంతపూర్వరాగం ప్రదర్శించినట్లు వర్ణించిన రచనలు కొరవంజి రచనలలో రెండవరకం. తెలుగులో రాములవారి ఎరుక, సీతాకల్యాణం వగైరాలు, కన్నడంలో అర్జునకొరవంజి, కృష్ణకొరవంజి వగైరాలు యీ రకమైన రచనలు.

"ముఖ్యకథతో ఏవిధమైన సంబంధమూ లేకపోయినా ఏదోవిధంగా ఎరుకత పాత్రకు ప్రవేశం కల్పించి, ఆమెచేత నాయికకు సోదెచెప్పించడం, తదుపరి ఎరుకరాజును ప్రవేశపెట్టి పరిహాసపూర్ణంగా వర్ణించడం, ఆమీద నా ఎరుకదంపతుల వాదవివాదాలు ముతుకగా ఏకరువుపెట్టి ప్రదర్శించడం అనే ఘట్టాలుకల రచనలు మూడవరకమైన కొరవంజి రచనలు. ఈ రచనలో ముఖ్యకథలో పూర్వభాగం ఎరుకల సంవాదానికి పీఠికగా ఉపకరిస్తుంది. వీరి సంవాదం ముగిసినపిదప ముఖ్యకథలో మిగతాభాగం ఏవో అయిందంటే అయిందన్నట్లుగా పూర్తిచేయబడుతుంది."

కాగా, ప్రాచీనకావ్యములందు కొరవంజి నృత్యవర్ణనలు, కొరవంజిపాత్ర వర్ణనలు మాత్రమే కన్పట్టుచున్నవి. అటుపిమ్మట యక్షగాన – వీథినాటకములందు కొరవంజిపాత్రకు ప్రవేశముకలిగినది; అంతియేకాదు, సింగి–సింగడులకథయే నాటకమైనది. ఇంక ప్రత్యేకముగా 'కొరవంజి' అనుపేర రచనవెలయుటఅనునది తెలుగులో 19 వ శతాబ్దిలోనే జరిగినది.[11] ఇంక కొరవలఅంజెయే యక్షగానాదులకు పూర్వరూపమనుట సమర్థనీయమైన సిద్ధాంతము కాజాలదని పేర్కొనుట చర్వితచర్వణము కాగలదు.

'కొరవంజు'లనెడి ప్రత్యేక రచనలలో ప్రబోధచంద్రోదయాదులవలె వేదాంతబోధాత్మకము లైనవికూడ కలవు.

## పగటివేషములు

"ఆపట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
విధమునఁ బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము దులకాడునట్లాడు" —(పండి. చరి-పుట 436).

పాల్కురికి సోమనాథుని పై వర్ణనమునుబట్టి శివరాత్రియుత్సవములో కొందరు గంధర్వ-యక్ష-విద్యాధరాదుల వేషములనుధరించి, ఆ వేషముల కనుగుణముగా పాటలుపాడుచు, ఆట లాడుచు ఉండెడివారని స్పష్టమగుచున్నది.

ఇందు గుర్తుపట్టరానివిధముగా (ప్రచ్ఛన్నముగా) వేషముధరించుట వర్ణితమైనది. చారచక్షులైనరాజుల కొలువులలోనుండెడి వేగులవాండ్లు ఇట్టి వేషములను ధరించుచుందురనునది ప్రసిద్ధవిషయమే. పట్టపగలుకూడ గుర్తుపట్టుటకు వీలులేనంత సుష్ఠుగా వేషధారణము జరుగును కావునను, పట్టపగలుకూడ ఈ వేషధారులు ఊరిలోతిరుగుచుందురుకావునను అర్వాచీనకాలములో వీరి వేషములకు పగటివేషములనుపేరు వచ్చియుండవచ్చును; అటుపిమ్మట, ఈ పగటివేషములు వినోదముక్రిందికిదిగి, వృత్తిగాకూడ మారియుండవచ్చును. కాని, సోమన వర్ణించిన వేషములు శివరాత్రి జాగరణోత్సవసమయములో రాత్రిపూటధరింపబడినవి; అందుచేతనే వాని నాతడు పగటివేషములనలేదు. అయినను అవి పగటివేషములవంటివే అనుట అసమంజసము కానేరదు. ముఖ్యముగా ఆహార్యప్రభావముచేత ఒకవ్యక్తి, పూర్తిగా భిన్నమైన ఇంకొకవ్యక్తిగా చలామణియగుట[1] ఇందు ప్రధానము.

పగటివేషములను వృత్తిగా స్వీకరించినవారినిగూర్చి తెలుగుకవులు వర్ణించినట్లుగా కన్పట్టదు. కాని, రాజ కళింగగంగును[2]గూర్చిన ఒక ఐతిహ్యముమాత్రము పరంపరాగతముగా వినవచ్చుచున్నది—కళింగగంగు ప్రచండకవియగు భీమకవి శాపమునకుగురియై, రాజ్యమును కోల్పోయి, వికారియైతిరుగుచు, ఎట్టకేలకు భీమకవి అనుగ్రహమును మరలపొందెను. ఇంతలో కళింగగంగునకు ఒక పగటివేషములమేళముతో పరిచయమయ్యెను. అతడు వారితోకలిసి, తన శత్రురాజునెదుట తన రాజ్యభ్రష్టతనే ప్రదర్శింపజేసి, అందులో తన రాజవేషమును తానే ధరించెను. కొంతసేపు ప్రదర్శనమునుసాగించి, అటుపిమ్మట నటనకుస్వస్తిచెప్పి, ముందునకుదూకి, శత్రురాజునుపొడిచివేసి, తానే రాజకళింగగంగునని ప్రజలకుతెలియజెప్పి, తనరాజ్యమును తిరిగిపొందెను—ఈ ఐతిహ్యమునుబట్టి పగటివేషముల మేళములవారికిగల శక్తి స్పష్టమగుచున్నది.[3]

గాత్రసౌష్ఠవాదులులేని కూచిపూడి నటులు కొందరు అర్వాచీనకాలములో పగటివేషములనుకూడ వృత్తిగా స్వీకరించిరని తెలిపియున్నాను. వీరికంటె ముందే 'గడ్డిపాడు భాగవతులు' పగటివేషములను వృత్తిగా స్వీకరించి, ప్రసిద్ధులైనారు. వీరినిగూర్చి శ్రీనివాస

చక్రవర్తిగారు సమగ్రమగు వ్యాసము నొకటి ప్రకటించియున్నారు[4]. ఆ వ్యాస సారాంశమును క్రింద పొందుపరచుచున్నాను——

కృష్ణాజిల్లాలో వీరంకిలాకునకు మైలుదూరములోఉన్న 'గడ్డిపాడు' (హనుమంతరాయ పురాగ్రహారము) ఈ భాగవతులకు కేంద్రము; అందుచేతనే వీరు 'గడ్డిపాడు భాగవతులు'గా ప్రసిద్ధినందినారు. పల్లావఝ్ఝలవారు, శ్రీకారంవారు, కూచివారు, కనుపూరివారు, బెల్లంకొండ వారు, బాపట్లవారు, కపులవారు అనువారందరును గడ్డిపాడు భాగవతులే. వీరందరకును మైసూరు తెలుగు బ్రాహ్మణుడు పల్లావఝ్ఝుల వేంకట్రామయ్య అనునాయన గురువు. పూర్వమీ వేషములు తెలుగుదేశములోకంటె మైసూరులో ఎక్కువ వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది. రెండు శతాబ్దములకు పూర్వమీ వేంకట్రామయ్యగారు పగటివేషములనే వృత్తిగా స్వీకరించి, తెలుగుదేశములో సంచార మొనర్చి, చివరకు గుంటూరుజిల్లా రేపల్లెలో స్థిరపడి, అక్కడి వారితో సంబంధబాంధవ్యము లేర్పరచుకొని, వారందరకును పగటివేషములను నేర్పెను.

కూచిపూడి బ్రాహ్మణభాగవతులవలెనే వీరును వేదాధ్యయనపరులు; సదాచార పరాయణులు; మంత్రశాస్త్రవేత్తలు. వాచిక-ఆహార్యాభినయములలో వీరిని మించినవారులేరు. తెలుగుదేశములో ఎన్నెన్ని తెగలవారు, కులములవారు కలరో వారందరి వేషభాషల తీరులను ఉచ్చారణవైవిధ్యముతో ప్రదర్శించుట వీరికి వెన్నతో బెట్టిన విద్య. ప్రచ్ఛన్న వేషములు వేసికొని, ఎందరినో భ్రమింపజేసి, ఎన్నియో పారితోషికములు సంపాదించినట్లు ఐతిహ్యము లెన్నియో కలవు. 1900-1930 ప్రాంతముల కూచి వెంకయ్యగారనెడి భాగవతుడు ప్రదర్శించిన నైపుణ్యమునుగూర్చి పెద్దలు పెక్కు కథలు చెప్పుచుందురు.

గడ్డిపాడు భాగవతుల శుశ్రూషచేసి ఈ విద్యను నేర్చిన ఇతరులలో దత్తమండలము నందలి 'ఈతముక్కు-జంగాలు' ముఖ్యులు. వీరికిని గడ్డిపాడు భాగవతులకున్నంత ప్రఖ్యాతి కలదు. కాని, గడ్డిపాడువారివి సాత్త్వికప్రధానములైన వేషములుకాగా, వీరు తామసప్రధానములగు (రాక్షసాదుల) వేషముల నెక్కువగా ఆదరింపసాగిరి.

గడ్డిపాడు భాగవతులు కట్టెడి వేషములు ఇంచుమించుగా అరువదినాలుగు కలవట. సాధారణముగా బుడబుక్కల వేషముతో ఆరంభింతురు. వారి పరిభాషలో వీనికి 'జాతీయము' లని పేరు. ఈ వేషములన్నియును ప్రధానముగా రెండు విధములు——వినోదార్థము, హితోప దేశార్థము. బుడబుక్కల వేషము[5], దొరవేషము మొదలగునవి మొదటిరకము. ఇంక రెండవ రకపు వేషములందు సంఘములోని దురభ్యాసములను వెక్కిరించి, తద్వశులైనవారిని ఆ మార్గమునుండి మరలించుటకు ప్రయత్నము జరుగును. వీరి వేషములలో చివరిది గారడీవేషము; ఇందు 'పేకముక్కల మ్యాజిక్' మొదలు వాయుస్తంభనాది ఇంద్రజాలముల వరకును ప్రదర్శింతురు. కాని, ఇట్టిది ఆదినుండియు ఉన్నదికాదనియు, మధ్యలో వచ్చినదనియు చెప్పుదురు.

వీరి ఈ వేషములలో అర్ధనారీశ్వరవేషము చాల మనోహరమైనది[6]. ఈ గడ్డిపాడు భాగవతులు ఒక తరములో తమవేషములవలన భూములు, అగ్రహారములు సంపాదించి,

ఆపైన వేషములు వేయుట తమ గౌరవమునకు భంగమని కాదోలు క్రమముగా వేషధారణము మానివేసినారు. పగటివేషములను వృత్తిగా అవలంబించినవారుగాని, దానిని కళగా ఆరాధించువారుగాని నేడు అదృశ్యమగుచున్నారనియే చెప్పవచ్చును. నేడీ వేషములు 'వినోద వేషధారణము' (Fancy dress) అనుపేర పాఠశాలలందును, కళాశాలలందును సంవత్సరమున కొకసారి మాత్రమే కన్పట్టుచుండును.

ఇంక కూచిపూడివారు కొందరు అర్వాచీనకాలములో పగటివేషములను వృత్తిగా స్వీకరించుటకు కారణములుగలవు. కూచిపూడి భాగవతుల సంఖ్య అధికమగుటచేతను, ప్రదర్శనముల వలన వచ్చెడి రాబడి తగ్గుచుండుటచేతను, వచ్చినది మేళములోనివారికెల్ల సరిపడక పోవుటచేతను కొందరైనను ఇంకొకవృత్తిని విధిగా స్వీకరింపవలసి వచ్చినది. మరియు కూచిపూడి నృత్యనాటకములందు నృత్యమున కెంత ప్రాధాన్యమున్నదో, గీతమునకును అంత ప్రాధాన్యమున్నది. నర్తకుడు సంగీతజ్ఞుడగుటయేకాక కమ్మని కంఠముకలవాడుకూడ కావలయును. నృత్యము చేయునాతడే గీతమునుకూడ పాడుచుండునుకాన కమ్మని కంఠములేని నర్తకుడు ఆతడెంత నృత్యవిద్యానిధియైనను రంగమున రాణింపడు; తక్కినవారు అట్టివానిని ఆదరింపరు. అట్టివారుకూడ ఇంకొక వృత్తిని స్వీకరింపవలసి వచ్చినది; ఇట్టివారికెల్ల గడ్డిపాడు భాగవతులు మార్గదర్శకులైనారు[7].

## గారడీ : విప్రవినోదము

సంతలలో, గ్రామ-నగర చతుష్పథములలో నేటికిని అప్పుడప్పుడు మనము దొమ్మరివాండ్ర యాటలను, గారడీవాండ్ర ప్రదర్శనములను చూచుచుందుము. ఇవికూడ ప్రాచీనకాలము నుండియు తెలుగుదేశమున వర్ధిల్లుచునేయున్నవి. పండితారాధ్యచరిత్రలో సోమనాథుడు వీనిని కూడ వర్ణించెను—

"అమరాంగనలు దివినాడెడు మాడ్కి
నమరంగ గడలపైనాడెడువారు.
ఆవియద్గతిఁ బక్షులాడెడునట్టి
భావన్రమోకులపై నాడువారు." —(పండి.చరి-పర్వ ప్ర. పు. 434.)

ఇందు, మొదటి రెండుపాదములందును దొమ్మరిసానులు వెదురుగడపైనెక్కి అచట చిత్రవిచిత్రములను చూపుట వర్ణితమైనది: ఆకాశమున అప్సరఃస్త్రీలు ఆడుచున్నారనెడి భ్రమను కలిగించినదట వారియాట ! అనగా, ఆ గడలు అంతఎత్తుగానున్నవన్నమాట !! దొమ్మరిసానులు మొదట భూమిపై ఆడి, పిమ్మట గడనెక్కి ఆకాశమందు ఆడుదురు. అట్లుభూమిమీద పాతినగడ మీదనే కాక, ఒకపురుషుడు తన నొసటిపైనిల్పిన గడపై నిల్చికూడ ఈ సానులు తమవిద్యను చూపించుచుందురు. దొమ్మరిసానిఆటను శ్రీహర్షుడు ఆలంకారికముగా వర్ణించియుండెను;[1] అందులకు శ్రీనాథుని అనువాదము క్రిందివిధముగానున్నది—

"ఈ సకలావనీతలము నెక్కటిఁదాన పరిభ్రమించి య
ఖ్యానపరంపరాపరత నభ్రమునన్ విహరింపగోరియో
లాసికకీర్తి విభ్రమకలాగరిమ న్నటియించుచుండు నీ
రాసుతు వంశరత్నముఁ దిరంబుగఁజెంది యమందలీలలన్."

బొమ్మరిసానిముందుగా నేలపై తన విద్యనుచూపి, అనంతరము గడనెక్కిమింటనాడుట యిందు సూచితమైనది. నాచనసోముడు పేర్కొనిన గడసానిఇట్టిదే.[2]

వ్యక్తులు తాముగా ఇట్టి చిత్రవిచిత్రములను చూపుచుండుటయేకాక ఏనుగులు మొదలగు జంతువుల చేతకూడ ఇట్టిపనులుచేయింతురు. విజయనగరసామ్రాజ్యమునందు, మహర్నవమి ఉత్సవములలో జరిగెడి ఇట్టి చిత్రవిచిత్రములను అబ్దుల్ రజాక్ వర్ణించియుండెను.[3] నేడీవిద్య 'సర్కసుకంపెనీ'లలో అధికముగా కన్పట్టుచున్నది. వృత్తిగా ఈ విద్యను స్వీకరించినవారి సంఖ్య తగ్గిపోవుచున్నది.

సోమనాథుని వర్ణనలోని చివరిరెండు పంక్తులును గారడీవిద్యను సూచించుచున్నవి. గారడీవాడు చాలపొడుగుపాటి త్రోకను ఆకాశములోనికి విసరివేయును. అది వెదురుగడవలె అట్లేనిలిచిపోవును. గారడీవాడు నిచ్చెనయెక్కినట్లు దానిపై ఎక్కి, ఆకాశములోనికిపోయి, అదృశ్యుడై, మరలకన్పించి క్రిందికి దిగివచ్చును; లేదా అచ్చటవిచిత్రములైన పెక్కువిద్యలను ప్రదర్శించును. భారతదేశమున ఈ విద్య తెలిసినవారిప్పుడు మృగ్యమనియే చెప్పుదురు.[4] ఈ గారడి వాండ్రు పైవిధముగా త్రోకుపై ఆడుటయేకాక ఇంకను అనేకములైన గారడీవిద్యలను చూపు చుందురు.[5] ఈ గారడివిద్యను సంస్కృతమున 'ఇంద్రజాల' మనియు, గారడీవాండ్రను[6] 'ఐంద్ర జాలికు' లనియు అందురు. ఐంద్రజాలికుల వర్ణనలుతెలుగు కావ్యములందు చాలకలవు. కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో ఐంద్రజాలికుని కథనొకదానిని మనోహరముగా వర్ణించి యుండెను (XI–30 వ కథ–పుటలు 106–113). జలస్తంభనము, శిలాస్తంభనము, అగ్నిస్తంభ నము,......ఇంద్రజాల–మహేంద్రజాల–అదృశ్యకరణ–నష్టవస్తుసముద్ధరణములు మొదలగున వన్నియును ఈ గారడీవిద్యలే. ఈ విద్యలందు జైనులు సుప్రసిద్ధులని 'వినుకొండదండకవిలె'ను బట్టి తెలియుచున్నది. పై ఐంద్రజాలికునికథఅట్లే జైనుల "త్రిషష్టికాపురుషచరిత్రము"లో నుండుట గమనార్హము.[6]

గారడివాండ్రు సంతలలో, గ్రామ–నగర చతుష్పథములలో తమవిద్యను ప్రదర్శించు చుండగా 'విప్రవినోదులు' అనువారు భవనములలో, నగరులలో, ఆస్థానములలో తమ విద్యను ప్రదర్శించుచుందురు. మొదటి ప్రతాపరుద్రుని గూర్చి వివరించెడి 'వినుకొండదండకవిలె'లో విప్రవినోదుల జన్మవృత్తాంతము విపులముగా వర్ణితమైనది.[7] ఈ కథయందు సత్యమున్నను లేక పోయినను, విప్రవినోదులు విప్రులను మాత్రమే యాచించి జీవింతురనెడి విషయముమాత్రము సత్యము; మరియు వీరు విప్రులను యాచించి బ్రదుకువారగుటచేత సంఘవ్యవస్థలో వారికంటె తక్కువవారనెడి విషయము నిస్సంశయము.

సదాశివరాయలకాలమునాటి శాసనములను[8] పరిశీలించినచో ఆనాడు విజయనగరసామ్రాజ్యములో విప్రవినోదులుఅధికముగా కలరనియు, వారికి అగ్రహారములు కలవనియు, వారు భగవత్సేవకై అనేకదానముల నొసంగిరనియు, వారిలో అనేకగోత్రములకు, సూత్రములకు చెందినవారు కలరనియు స్పష్టముకాగలదు. కొందరూహించినట్లుగా వీరికిని, బ్రాహ్మణులకును ఆనాడు విరోధమున్నట్లు కాని, వారు బ్రాహ్మణులఅంతస్తునకు రాబ్రయత్నించినట్లు కాని ఆధారములు లేవు. నేటికిని ఈ విప్రవినోదులను పల్లెటూళ్లలో అప్పుడప్పుడు చూడగలము.[9] ఇది చాల వినోదకరమైనవిద్య; ఇప్పుడు నశించిపోవుచున్నది.

అర్వాచీనకాలములో ఈ విద్యను ఇతరులుకూడ నేర్చిరనియు, గంజాము, విశాఖమండలములలోని విప్రవినోదులు కేవలము శూద్రులేఅనియు తెలియుచున్నది.

## బహురూపము

1. "లలితాంగరసకళాలంకారరేఖ । లలవడబహురూపమాడెడువారు"

—(పండి. చరి._పుట 435).

2. "అమరంగన్ స్ఫుటభక్తినాటకము భాషాంగక్రియాంగాభిర
మ్యముగాఁజూపిన మెచ్చి మీరలు పురేయన్నంతకున్ యోనిగే
హములన్ రూపులు పన్నుకొంచును నటుండై వచ్చి సంసార రం
గములోనన్ బహురూపమాఁడు వెలయంగా జీవి సర్వేశ్వరా !"

—(యథావాక్కుల అన్నమయ్య_సర్వేశ్వరశతకము_20 ప.)

3. "సర్వేశ్వరా ! యవధారు; జగంబు నీ నాటకశాల; నేనెత్తిన
తొలుజన్మంబులు నీముందరనాడెడు బహురూపంబులు;
దారసుతబంధు జనులు మేళగాండ్రు;
నిన్నునుతించిన వేదశాస్త్రపురాణంబులు తూర్యత్రయంబు;
మాపాదప్రచారంబులు నాట్యంబు; సేయుచేఁతలు ఆడెడిమాటలు క్రియా
భాషాంగంబులు......
మీ కొలువునర్తకులమైనవారము, మీకు వినోదముచేసికొని బ్రతుకవలయుఁ గాని......

—(తా. పెద. తిరుమలయ్య 'వేంకటేశ్వర వచనములు'.)

4. "నానావేషధరం యత్తద్బహురూపమి తీరితమ్."

—(వేదసూరి 'సంగీతమకరందము_చూ. భరతకోశము. పుట. 418.)

5. దామరాజు సోమయ్య "భరతము"లో (ప్రబంధరత్నావళి_పు.143; 487 ప.);
హరిభట్టు "నారసింహపురాణము"లో (I_213); అయ్యలరాజు నారాయణకవి "హంసవింశతి"లో (V_126); ఎడపాటి ఎఱ్ఱన "మల్హణ చరిత్ర"లో (II_పు. 40);
"బహురూపము" నొక 'నృత్య' విశేషముగా పేర్కొనిరి.[1]

6. "వ్యక్తంబుగా నితరాకృతినున్న । భక్తుఁడెఱుంగుఁ దద్భావమెట్లనిన
బహురూపమాడుచోఁబాటి వెండీఁడు । సహజంబుఁజూప కే జాడవచ్చినను
నరయనేరంగమధ్యంబుననున్న । తరుణియెఱుంగదే తనమగ డగుట"
—(పండి. చరి...దీక్షప్ర. పుట. 144).

7. "జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపి తెఱంగున" నలుడు దమయంతికి కన్పట్టెనట —(దీనికి మూలములేదు...శృం. నైష. IV. 2).

8. "జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపితెఱంగున" దుష్యంతుడు కన్పట్టెనట
—(ఇది శ్రీనాథుని కనుసరణము–శృం.శాకుం...II. 78).

9. "ఆశాగజాకృతులలవడ జనులకుఁజూపవచ్చిన బహురూపులనఁగ......"
—(కరివర్ణన–విక్రమార్కచరిత్ర–I–85).

10. "పశుపక్షిమృగముఖ్యబహురూపధారణావిధి పరకాయప్రవేశములును......ఆది గాఁగల విద్యలనతిశయిల్లె......" —(విక్రమార్కచరిత్రము–V–66).

11. "రూప్యాచలము బహురూపంబుల నటించు రమణ, శోభిల్లు సౌధములపెల్లు"
— (పురవర్ణన–కేయూరబాహుచరిత్రము–I–19).

12. "నాటక......నాట్య......బహురూపనటనత్వంబును...ఈ చతుష్షష్టికళల యందును... కొంతపరిచితుండను" —(సింహాసనద్వాత్రింశిక–XI–పుట 112).

13. "సంగీత సాహిత్య సరసవిద్యలకిచ్చు బహురూపులకిచ్చు బట్టుకిచ్చు"
—(రాయన భాస్కరునిపై చాటువు–చాటు.ప.మ.మం. పుట 80).

డా. యస్వీ జోగారావు "బహురూపము" అనెడి వ్యాసము (ఆం.సా.ప. పత్రిక–44 సంచిక)లో తలంచినట్లు పాల్కురికి సోమనాథుని పంక్తులలో అంగ–రస–కళా–అలంకారముల చేత ఆంగిక–సాత్త్విక–వాచిక–ఆహార్యాభినయములును; అన్నమయ్యయును, పెదతిరుమలయ్యయును ఒకజీవియొక్క వివిధజన్మములా జీవియొక్క బహురూపములనుటలో ఏకనటుని యనేక వేషస్వీకృతియును ద్యోతమానములగుచున్నవి. విక్రమార్కచరిత్ర–కేయూరబాహుచరిత్రలును అనేకవేషస్వీకృతినే సూచించుచున్నవి. శ్రీనాథ–పినవీరభద్రులవర్ణనలును, చాటుపద్యమణిమంజరియును 'బహురూపు' డనగా 'నటుడు' అనునర్థమును స్పష్టముచేయుచున్నవి. బహురూపనటనత్వము చతుష్షష్టికళలలో నొకటిగా సింహాసనద్వాత్రింశిక తెలుపుచున్నది (కాని, కామసూత్రాదులందీ ప్రశంసకన్పట్టదు). ఇంక వేదసూరి నిర్వచనము కూడ నటుని యనేకవేషస్వీకృతినే సూచించుచున్నది. మరియు బహురూపపదము శివునియందును, ఊసరవెల్లియందును చెల్లుచున్నదని నిఘంటువులనుబట్టి తెలియుచున్నది; ఇదికూడ అనేకవేషస్వీకృతి సూచకముగానే యున్నది.

'బహురూప'పదము నాట్యశాస్త్రమందుకాని, అభినయదర్పణ-భరతార్ణవాదులందుకాని లేదు (అమరకోశమందీ పదమున్నను దానికి 'నజ్జరస' మని యర్థ మొసంగబడెను). కాని, 'నృత్తరత్నావళి' యందుమాత్రమిది 'దేశినృత్తము' గా స్వీకరింపబడుట గమనార్హము (7 వ అధ్యాయము).[2]

"బహురూపస్య లోకస్య తత్తద్రూపప్రదర్శనాత్ ।
వేష చేష్టిత భాషాభిః బహురూపం నిరూపతే ॥ 137
సర్వ.........నావహమ్ ప్రకల్పకః (?) ।
రంజకో మంజువాగ్ వాగ్మీ కల్యః కైవారకోవిదః ॥ 138
సురేఖో రసికో రూపభాజనం భావకో యువా ।
...............నాత్యుచ్చో నాతివామనః ॥ 139
సంస్కృతాది భాషాసు నానాదేశోద్భవాసుచ ।
దక్ష స్పదస్యాభిజ్ఞో బలవాన్ విజితశ్రమః ॥ 140
ఆశువేషాంతరగ్రాహీ ప్రస్తావోచితపాఠకః ।
స్వతుల్యానుచరైర్యుక్తో ముండితశ్మశ్రు మూర్ధజః ॥ 141
మధురధ్వనిశారీరో బహురూపీ నిగద్యతే ।
గుణైరేభిర్యుతా స్త్రీవామతా ముండనవర్జితైః ॥ 142
త్రివిధాభినయే నాథ్యం లోకధర్మముపేయుషా ।
సాత్త్వికేన పరిత్యక్తం హావభావై రలంకృతమ్ ॥ 143
ద్విచతుశ్చరణావాద సజ్జివాభినయాంచితమ్ (?) ।
ప్రథమంప్రవిశేత్పాత్రం సకలాతోద్యసంయుతమ్ ॥ 144
వాద్యప్రవర్తితైః (పాఠైః ?) ర్నృత్తైరపి మనోహరమ్ ।
నృపవంశేన వా లోకప్రసిద్ధచరితేనవా ॥ 145
యన్నాట్యే (దృశ్యతే ?) సాక్షాత్ తత్కుర్యాదత్ర కృత్రిమమ్ ।
అత్యంత గ్రామ్యభాషాఢ్యమనిష్టంయత్ సభాసదమ్ ।
...............యచ్చబహురూపం నతన్మతమ్ ॥ 146

॥ ఇతి బహురూపనృత్తమ్ ॥

ఇందు, జాయసేనాపతి బహురూపుని లక్షణములను కూడ వివరించియుండుట గమనార్హము. ఆ లక్షణములలోని 'ఆశువేషాంతరగ్రాహీ ప్రస్తావోచిత పాఠకః' అనునవి ప్రధానములు; ఇవి బహురూపస్వరూపమును పట్టి యిచ్చుచున్నవి. వలసినవేషమునెల్ల ధరించుటకు వీలుగా 'బహురూపి' ముండితశిరస్కుడు కావలయునట ! 'బహురూపికి' కొంత పరివారముకూడ నుండునట ; 'బహురూపము' కథాప్రధానముకాదు కావున ఇందు 'సాత్త్వికాభినయము' ఉండదు. వేషముచేత, భాషచేత, చేష్టితములచేత (ఆహార్య-వాచిక-ఆంగికాభినయ

ములచేత) ఆయాలోకావస్థలను నిరూపించుటయే 'బహురూపము' కాగలదు ('దేశినృత్త' మన్నంత మాత్రమున ఇది కేవలము నృత్తప్రధానమనికాని, నృత్యప్రధానమనికాని చెప్పుటకు, పై నిర్వచనమునుబట్టి, వీలులేదు). డా. జోగారావు పేర్కొన్నట్లు 'బహురూప మొకయనిబద్ధ కావ్యసంకలనము' వంటిది.[3]

తెలంగాణము పల్లెలలో నేటికిని 'బహురూపులవాళ్ళు' కన్పట్టగలరు; వీరు మేళములు కట్టి కూడ తిరుగుచుందురు. శ్రీ బి. ఎన్. శాస్త్రి 'సంధ్యారాగ' మనెడి తమ సాంఘికనవలలో 'బహురూపుల' ('బైరూపుల')వానిని చిత్రించియున్నారు. కలకత్తాలో శ్రీ శంభుమిత్ర 'బహురూపి' అను పేర ఒక నాటకసమాజమును నడుపుచున్నారు. ఆధునికకాలమున, ఆచార్యచంద్రశేఖరము (నెల్లూరు) బహురూపాభినయమందు అంతర్జాతీయఖ్యాతి నార్జించియున్నారు. కేవలము ఆయనయొక్కడే 'ఆశువేషాంతరగ్రాహియై ప్రస్తావోచితపాత్రకు డగుచుండును. మరియు తన 'ట్రూపు'తో కలసి విభిన్నములైన వివిధ సన్నివేశములను ఒకదానివెంట నొకటి అద్భుతావహముగా ప్రదర్శించుచుండును.

## ఖండితగతి నాటకములు

"..................

పురములుగాల్చిన పోల్కియాడుచును । మరుఁజిఱువుచ్చినమాడ్కినాడుచును
సతికర్ధమిచ్చిన చందమాడుచును । యతులు గొల్వఁగనున్నయందమాడుచును
నంధకాసురుమదంబడచుటాడుచును । గంధగజాసురుఁగడపుటాడుచును
జన్నంబుఁద్రుంచిన చాళినాడుచును । వెన్నుండుగన్నిచ్చువేళనాడుచును
గరళంబుదాల్చిన కరణియాడుచును । సరినజుతలఁగొన్న సరణియాడుచును
వెండియు భవుబహువిధచరిత్రముల । ఖండితగతినాటకంబులాడుచును"

—(పండి. చరి. పుటలు 442–43).

సోమనాథుడు పేర్కొనిన పై అంశములన్నియును శైవకథలకు సంబంధించియున్నవి. అంతియేకాదు; ఇవి సమగ్రమగుకథలు కూడకావు—చిన్నచిన్నఘట్టములుమాత్రమే. ఒక్కొక్క ఘట్టమును ప్రదర్శించుటకు ఇద్దరుముగ్గురు సరిపోదురు. వీరనరసింహరాయలయెదుట కేళికను ప్రదర్శించుచు మధ్యలోకూచిపూడి భాగవతులు ప్రదర్శించిన సంబెటగురవరాజు కథయును ఇట్టి చిన్నఘట్టమే. ఇట్టివానిని సోమనాథుడు 'ఖండితగతినాటకము' లనినాడు. రూపారోపము. వాచికాభినయము, ఒకరినిమించిన నటులు ఉండుటచేత ఇట్టివి రూపక(=నాటక)జాతిలో చేరినవే అగుచున్నవి. కాని సమగ్రేతివృత్తరహితములగుటచేతను, అల్పఘట్టములగుటచేతను ఇవి 'ఖండితగతినాటకము' లనబడినవి. వీనిని నేటి ఏకాంకికలతోకూడ పోల్చుటకు వీలులేదు. వానికంటె కూడ అల్పకాలికములివి.

ఇచ్చట ఒక విషయమును గమనింపవచ్చును. కొన్నిరకముల పగటివేషములలో ఇద్దరుముగ్గురు వేషధారులుందురు; ఒక్కొక్కవిషయము ఇంచుమించుగా ఒక 'ఖండితగతి

నాటకము'గానే సాగిపోవుచుండును. సోమనాథుడు 'పగటివేషములు' అనెడి ప్రత్యేకపదము నెచ్చటను వాడలేదు—యక్షవిద్యాధరాదివేషములను గూర్చి మాత్రము ప్రసంగించియున్నాడు. మరి, ఆ వర్ణనకును, ఇచ్చటివర్ణనకును సంబంధమున్నదేమో ఇంకను పరిశీలింపవలసియున్నది.

## సాంగనాటకములు

"కరమర్థి నూరూర సిరియాలు చరిత...............
ప్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల । విస్తారముగజేసి వినుతించువారు
నటుగాక సాంగభాషాంగక్రియాంగ । పటునాటకంబులనటియించువారు"

—(బసవపురాణము_పుట 124).

"ప్రమథపురాతన పటుచరిత్రములఁ । గ్రమమొంద బహునాటకములాడువారు"

—(పండి. చరి_పుట 435).

"లెస్సగాక కిరాట : ఈ లేమచరిత । మాడుదురు నాటకంబుగ నవనిలోన"

—(క్రీడాభిరామము పుట_59).

తెలుగు నాటకములనుగూర్చి అసందిగ్ధముగా పేర్కొనిన ప్రథముడు పాల్కురికి సోమనాథుడు. సిరియాలుచరితమును "సాంగభాషాంగక్రియాంగపటునాటకంబుల" నటించుచున్నారు. అనియు, ''ప్రమథపురాతన పటుచరిత్రములఁ గ్రమమొంద బహునాటకము'' లాడుచున్నారు అనియు, ''వెండియుభవుబహువిధచరిత్రముల ఖండితగతినాటకంబు'' లాడుచున్నారు అనియు అతడు పేర్కొనెను. ఈ నాటకములు తెలుగుభాషలోనివే యగుట నిస్సంశయము. నాడు ప్రదర్శితములైన తెలుగు నాటకములలో 'సిరియాలు చరితనాటక'మొకటి యన్నమాట (ఇట్టిది సంస్కృతమున కన్పట్టదు !), ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠి ప్రతిష్ఠాపారీణయగు మాచల్దేవి చరితమును "ఆడుదురు నాటకంబుగ నవనిలోన" అని వల్లభరాయడు తెల్పియున్నాడు. కృష్ణరాయల కాలములో స్త్రీ_పురుషులుకలసి 'తాయికొండ నాటకము'ను ఆడినట్లు శాసనాధారము కలదు. కాని ఇవి యేవియును మనకు లభ్యములుకాలేదు.

పైవర్ణనలనుబట్టి ఈ నాటకములు పరిణతదశలోనున్నవనిమాత్రము స్పష్టముకాగలదు. కాని ఈ నాటకముల తొలిదశఎట్టిదో, అసలు ఆరంభమెప్పుడుజరిగినదో, పరిణామమెట్టిదో తెలిసికొనుటకు తగిన ఆధారములులేవు. రూపకసహజపరిణామమును, గ్రీకురూపకముల ఉత్పత్తి వికాసములను పరిశీలించినపిమ్మట తొలితెలుగు రూపకములుకూడ అట్లే ఉత్పన్నములైయుండునని సులువుగా గ్రహింపవచ్చును. అడవులలో ఎఱుకులలేమలు త్రాగినమత్తులో గీతములు పాడుచు, ఆడిన దృశ్యమును నన్నిచోడుడు వర్ణించియుండెను (కు. సం_VI_45_47). తమ కులమునకో, లేదా తమ జాతికో సంబంధించిన ఉత్సవములలో ఎఱుకులు, కోయలు మొదలగు ఆటవికజాతుల స్త్రీ_పురుషులెల్లరును కలసి పాల్గొందురు. తొలిరోజులలో ఇట్టి ఉత్సవములందు ప్రవర్తిల్లిన ఆటపాటలు డయొనిసస్‌ఉత్సవములందు ప్రవర్తిల్లిన డిథీరాంబ్స్‌కు ప్రతికృతులు; ఈ ఆటపాటలే తెలుగురూపకములకుకూడ దారితీసియుండుట నిస్సంశయము. ఆదిలో వారి

పాటలు ప్రకృతి శక్తులను కీర్తించునవియే అయినను తరువాత కథాత్మకములగుట సహజము. క్రమముగా సంవాదశైలి ప్రాధాన్యమువహించుటయు, దానితో రూపారోపము ఆవశ్యకమగుటయు జరిగియుండును. అంతట దేశికవులు రూపకరచన కుపక్రమించియుందురు. ఈ ఆరంభమెప్పుడు జరిగినదో తెలియదుకాని, అతిప్రాచీనమగుటమాత్రము సత్యము. కాని, ఆదేశికవుల పేర్లుకాని, వారి రచనలుకాని కొన్ని అయినను మనకు లభింపకపోవుట దురదృష్టము.

పై ఆట-పాటలలో పాటకే ప్రాధాన్యముకలిగినప్పుడు అది గేయకావ్యమునకు దారితీసినది; తత్ఫలమే అర్వాచీనకాలములోని 'యక్షగానము'. ఇంక ఆటకు ప్రాధాన్యము వచ్చినప్పుడు అది క్రమముగా సంవాదమునకును, రూపారోపమునకును దారితీసినది; తత్ఫలమే 'నాటకము'. ఇట్లు విడిపోయిన ఈ రెండుశాఖలును నాయకరాజులకాలములో మరల సన్నిహితములై పోయినవి. లభ్యములైన తెలుగు (వీథి) నాటకములలో సూత్రధారునకు తొలి గ్రీకు రూపకములో కోరస్‌లకున్నంత ప్రాముఖ్యముండుట గమనార్హము. కోరస్‌వలెనే ఈ సూత్రధారుడును హితోపదేశికుడైన పెద్దగా, సాక్షీభూతుడైన ప్రేక్షకుడుగా, విమర్శకుడుగా, నాటకములోని ప్రకృతిగామారుచుండును. ఈ పద్ధతి అస్సామునందలి ప్రాచీన 'అంకీయనాట్' ప్రదర్శనములందును గమనింపవచ్చును. ఇవి అస్సామీ సంస్కృతభాషాసమ్మిశ్రిత రచనలు. మరియు ఈ నాటకములందు నృత్య-గానములకు ప్రాధాన్యమెక్కువ. కాగా ఈ దేశిరూపకములు సంస్కృత రూపకములకంటె భిన్నములగుచున్నవి; అనగా ఇవి సంస్కృతరూపకముల ప్రభావమునకు పూర్తిగా లోనుకాలేదన్నమాట. కారణము ఇంచుమించుగా క్రీ. శ. పదియవశతాబ్దమునాటికి సంస్కృత రూపకరచన క్షీణదశలోపడుటయని చెప్పవచ్చును. 15 వ శతాబ్దినుండియు ప్రచారములోనున్న అంకీయనాట్ ఇట్టి దేశిరచనయే. ఇట్టిరచనలు అర్వాచీనకాలమందలి కన్నడ, తమిళ సాహిత్యములందును కలవు.

ఈ దేశితెలుగునాటకములకు 'వీథినాటకము'లను పేరు ప్రచారములోనున్నది. సంస్కృతము నందలి దశరూపకములలో 'నాటకము', 'వీథి' అనెడి రెండు రూపకభేదములుకలవు; కాని, తెలుగులోని వీథినాటకమునకును, పై రెండింటికిని సంబంధములేదు; అనగా తెలుగు వీథినాటకము వీథీరూపకభేదమునుకాదు, నాటకమంతకంటెనుకాదు. ఈ సమస్తపదములోని 'నాటక' పదమునకు 'రూపక'మనిమాత్రమే అర్థము. ఈ నాటకములు వీథులలో, చతుష్పథములలో ప్రయుక్తములయ్యెడివికాన వీనికి 'వీథినాటకములు' అను పేరువచ్చినది. రాయలసీమ, కన్నడ దేశములందలి 'బయలాటలు', అరవదేశమందలి 'తెరుక్కూత్తులు' ఇట్లు వీథులలో ప్రయుక్తములయ్యెడివే. తెలుగులోని ఈ దేశినాటకములకు 'వీథినాటకము'లనెడి పేరు ప్రాచీనకాలమునుండియు నున్నట్లు కన్పట్టదు. పాల్కురికి సోమనాథాదులు "నాటకములు" అనిమాత్రమే వ్యవహరించిరి.

క్రీ.శ.12 వ శతాబ్దినాటికే తెలుగునాటకములు "సాంగ-భాషాంగ-క్రియాంగంబులు"గా ప్రయుక్తములగుచున్నవని సోమనాథుని వర్ణనలనుబట్టి స్పష్టమగుచున్నది. 'సాంగ'మనగా 'అంగములతోకూడిన'దని అర్థము. 'అంగము'లనగా నాట్యశాస్త్రోక్తములగు నాందీ-ప్రస్తావ

నాది పూర్వరంగాంగములు. ఐదవ అధ్యాయములో భరతుడు 9 అంతర్యవనికాంగములను, 10 బహిర్యవనికాంగములను పేర్కొనెను. ఈ 19 అంగములను పూర్వరంగమున సంపూర్ణముగా నిర్వహింపబడినచో అది సాంగముగా నిర్వహింపబడిన ప్రదర్శనమగునన్నమాట, సోమనాథుడీ యర్థమునందే 'సాంగ'పదమును ప్రయోగించి యుండునని నిశ్చయముగా చెప్పగలము.[1]

ఇంక భాషాంగ-క్రియాంగపదములకు రెండురకములైన అర్థములను చెప్పవచ్చును. సంగీతపరిభాషలో భాషాంగ-క్రియాంగములు రాగములు.[2] కాని చేయుచేతలు, నాడెడుమాటలు క్రియాభాషాంగంబులు" అని తాళ్ళపాక పెదతిరుమలయ్య పేర్కొన్నదానినిబట్టి భాషాంగ-క్రియాంగపదములు వాచికాభినయ-ఆంగికాభినయములనెడి అర్థములందు ప్రయుక్తములైనవనుట స్పష్టము. ఈ అభినయవిధానముకూడ నాట్యశాస్త్రమందు విపులముగా నిర్దేశింపబడినది. కాగా 12 శతాబ్దినాటికే తెలుగునాటకములు నాట్యశాస్త్రసంప్రదాయమును అలవర్చుకొని, శాస్త్రీయ పద్ధతిలో ప్రదర్శింపబడుచున్నవన్నమాట.

ఇప్పట్ల సోమనాథుడు ప్రయోగించిన మరి రెండు, మూడు పదముల అర్థములుకూడ పరిశీలనార్హములు — పటునాటకములు, ప్రమథపురాతనపటుచరిత్రములు, బహునాటకములు. శాస్త్రనిహితములగుటచేతనే సిరియాళచరితనాటకాదులు 'పటు'నాటకములనబడినవి. నాటకములు అట్టివగుటకు ఇతివృత్తములుకూడ 'పటుచరిత్రము'లగుట తప్పదు. ఇంక బహునాటకములు అను సమస్తపదమునకు అనేక నాటకములు అని అర్థముచెప్పవచ్చును; లేదా సంస్కృతాంగ్ల శబ్దకోశములో మోనియర్ విలియమ్సు తెల్పినట్లు 'మహానాటకములు' అని అర్థము చెప్ప వచ్చును. ఆటవికుల అనాగరకప్రదర్శనము లింతగా శాస్త్రవిహితములై మహానాటకములగుటకు ఎంతయోకాలము పట్టియుండవలెను; ఎన్ని కథలో రూపకములుగా రచింపబడియుండవలెను.[3] కాని, అవియన్నియును కాలగర్భములో కలిసిపోయినవి.

క్రీ. శ. 12 వ శతాబ్దితరువాత తెలుగునాటకములను శిష్టులుకాని, రాజులుకాని ఆదరించి నట్లు కన్పట్టదు. కాకతీయరాజుల ఆస్థానములో నృత్యమునకుమాత్రమే ఆదరణము లభించినది; కారణమేట్టిదియైనను నాటకములకట్టి భాగ్యముపట్టలేదు. క్రీ.శ. 12, 13 శతాబ్దములనుండియు తెలుగుదేశమున సంస్కృత రూపకరచన సాగుచునేయున్నది. అవి ఆయాదైవోత్సవములందు దేవాలయనాట్యమండపములందో, నాటకశాలలలోనో ప్రదర్శింపబడియున్నట్లు ఆయారూపక ప్రస్తావనలనుబట్టి తెలియుచున్నది. ఈ సంస్కృత రూపకరచనా-ప్రదర్శనములు పండితజన రంజకములు. వీనికే రాజాదరణము లభించినది. అందుచేత తెలుగునాటకములు వీథినిబడవలసి వచ్చెను. ప్రజల ఆదరణమును, వీథులలో తాత్కాలికముగా నిర్మింపబడెడి బహిరంగరంగస్థల ములును వానికి నిలువ నీడలయ్యెను. ఇట్టిస్థితిలో నటుల విద్యానైతికస్థితులు దిగజారుట సహజము. ఈ కాలములోనే కూచిపూడి బ్రాహ్మణభాగవతులు 'భామాకలాపము'ను ప్రదర్శింప నారంభించియుందురు. ఇది కేవలము నృత్యప్రధానమగు ప్రదర్శనమైనను ఇందు నాటకపు పోకడలుకలవు. ఒకప్రక్క ఈ కేళికాప్రదర్శనములును, ఇంకొకప్రక్క సంస్కృతరూపక ప్రదర్శనములను సాగుచుండుటచేత శిష్టులు తెలుగు రూపకరచనవైపు దృష్టినిసారింపలేదని

చెప్పవచ్చును. వల్లభరాయాదులొకరిద్దరు సంస్కృతనాటకముల ననువదించుటకు ప్రయత్నము చేసినను, వారిని అనుసరించినవారే లేకపోయినారు. కాగా క్రీ.శ. 17 వ శతాబ్దివరకును తెలుగు నాటకములు వీథులలోనే ఉండిపోయినవి.

ఆటవికుల ఆటపాటలనుండి నాటక మొకశాఖగాను, యక్షగాన మింకొకశాఖగాను అభివృద్ధిచెందినవనియు, మరల అవి కలసిపోయినవనియు తెలిపియున్నాను. ఈ పరిణామము 17 వ శతాబ్దిలో, నాయకరాజులకాలములో జరిగినది. నాటి రచనలలో ఆరంభమున యక్షగాన మనియున్నచో మరియొకచోట నాటకమనియు, ఆరంభమున నాటకమనియున్నచో మరియొక చోట యక్షగానమనియు, లేదా 'యక్షగాననాటక'మనెడి సమస్తపదమును ప్రయుక్తములగుట పరిశీలింపవచ్చును. కాగా కేవలము దృశ్యప్రధానములేఅయిన నాటి యీదేశిరచనలకు 'యక్ష గానము'లను పేరు చెల్లుట సమంజసముకాదు; అవిఅన్నియును నాటకములే. వీథులలోనున్న నాటకములను పండితులును రాజులును చేపట్టి సంస్కరించి, రాజాస్థానమందు ప్రవేశపెట్టినను వీనికిపూర్వమునుండియు వచ్చుచున్న 'వీథినాటకము'లను పేరుమాత్రము పోలేదు.[4] నాయక రాజుల ఆస్థానములలో లౌకిక-కల్పితకథలు నాటకీకరింపబడుచుండుగా మేలట్టూరులో వేంకట్రామశాస్త్రి కేవలభాగవతకథలనే నాటకీకరించెను. శాస్త్రీయనృత్య-గానసంపన్నములైన యీ నాటకములకు 'నృత్యనాటకము' లను పేరుకూడ అన్వర్థమే. వీనిని అర్వాచీనకాలములో కూచిపూడివారుకూడ చేపట్టినారు.

నాటిరాజులు, తదాస్థానపండితులు రచించిన నాటకములలో హాస్యప్రసంగములెక్కువ; ముదురుపాకమునబడిన ఘట్టములుకూడకలవు. రచనయంతయును హాస్యప్రాయముగా నడచిన వానిలో 'తంజాపురాన్నదానమహానాటకము' ముఖ్యమైనది. ఈ హాస్యప్రసంగములందానాటి ఛాందసపు ఆచారవ్యవహారములు, వ్యక్తులదోషములు విమర్శకుగురియైనవి. ప్రదర్శనమునందు కూడ ఒక క్రొత్తవిశేషమును గుర్తింపవచ్చును. నాటకారంభమున గణపతిప్రార్థన జరిగినప్పుడు గణపతివేషమును సరస్వతీప్రార్థనజరిగినప్పుడు సరస్వతీవేషమును రంగస్థలముమీదకువచ్చి, పూజలంది, నటులను దీవించివెడలుట జరుగుచుండెడిది. బొమ్మలాటలయందును, కన్నడయక్ష గానప్రదర్శనములందును ఈ పద్ధతికలదు. ఇది భరతోక్తమైన పద్ధతికాదు; ఇది కేవలముదేశి పద్ధతియే. క్రీ. శ. 1880 ప్రాంతముల తెలుగుదేశమున ఆధునికరంగస్థల నాటకప్రదర్శనములకు పునాదులువేసిన ధార్వాడనాటకసమాజమువారుకూడ ఈ దేశిపద్ధతినే అనుసరించియుండుట గమ నార్హము. కొన్నిరచనలు కేవలము ఒకరాత్రి ప్రదర్శనమునకేకాక 5, 6 రాత్రులు వరుసగా ప్రదర్శించుటకు ఉద్దిష్టములైనవి; సంతవేలూరు కుశలవనాటకము ఆఱురాత్రులకథ !

19 వ శతాబ్దిలోకూడ వీథినాటకములను ప్రదర్శించెడి మేళములనేకములు వెలసినవి-ఘట్టుదేశపువారి మేళము, లేపాక్షివారి మేళము, వేములపల్లివారిమేళము, ధర్మపురివారిమేళము, తాడిపత్రివారి మేళము, పడకండ్ల స్వామిరాయికవి మేళము, త్వరకవి రామకృష్ణయ్యగారి మేళము (నెల్లూరు మండలము), చుక్కలూరివారి మేళము; ధేనువకొండవారి మేళము, సంతవేలూరివారి మేళము, తత్రికంటివారి మేళము, భాగవతుల రంగయ్యగారి మేళము మొద

లగునవి. ఈ నాటకసాంఘికులందరును చక్కనిపండితులు. వీరుతమ మేళములతో సంచారము లొనర్చుచు ప్రదర్శనములొనంగినారు. వీరియొద్ద పనిచేసి, ప్రయోగరహస్యములను గ్రహించి వెళ్ళిన మరికొందరు మరికొన్ని మేళములను తయారుచేసినారు. అట్లేర్పడినవే గొల్లభాగవతులు, పిచ్చుకకుంట్లు భాగవతులు, యానాదిభాగవతులు మొదలగువారి మేళములు.

పై మేళములలోని వారందరును పురుషులే. పడకండ్లవారి మేళములో మాత్రముస్త్రీలు కూడ నుండెడివారట; కాని, ఇది చాల అరుదు. తంజావూరులోని 'నాటకవేషధారిజాప్తా'లలో కూడ స్త్రీలుకనప్పట్టరు. కాని, 1900 ప్రాంతముల కేవలము స్త్రీలమేళములే కొన్నిబయలుదేరినవి. వీరు కళావంతులకుటుంబములకు చెందినవారు; గురువులుమాత్రము బ్రాహ్మణులే. తెలంగాణ ములోని వీథినాటకప్రదర్శనములందు కూడ స్త్రీలకుప్రవేశముకలదు; అంతియేకాదు, నాటకకళ కును, బ్రాహ్మణులకును సంబంధమున్నట్లు కూడ కనప్పట్టదు. 20 వ శతాబ్ది ప్రారంభములో కూడ తెలంగాణములో శతాధికములైన వీథినాటకములు రచింపబడినవి. ఆధునికరంగస్థల నాటకప్రదర్శనములు నేడుప్రముఖస్థానము వహించియున్నను, పల్లెపట్టులలో వీథినాటకప్రదర్శ నములింకను సాగుచునేయున్నవి; ఈ దేశికళ అంతటి జీవశక్తికలదని తెలియవలెను.

## మార్గనాటకాభావము

మార్గనాటకములనగా సంస్కృతరూపకానువాదములు, లేదా ఆ పద్ధతిలో రచింపబడిన స్వతంత్ర రూపకములు. ఇట్టివానికి వల్లభరాయడు నాందీపూజచేసినను, వానిననుసరించినవారే లేరని చెప్పవచ్చును. కాగా, ఆంగ్లభాషా-సాహిత్యములచేత తెలుగువారు ప్రభావితులగు నంతవరకును తెలుగులో సమగ్రమగు మార్గనాటకరచన జరుగనేలేదని తెలియవలెను.

తెలుగు యక్షగానములనుగూర్చి పరిశోధకవ్యాసమును వ్రాసిన డా. యస్వీజోగారావు 'యక్షగాన' పై శిష్ట్యమును క్రిందివిధముగా తెలిపియున్నారు. (ప్రథమభాగము-పుటలు 216-224)

1. అది సర్వోపభోగ్యమైన సమాహారకళ. 2. వివిధప్రక్రియానుబంధము(ప్రబంధము, కలాపము, ఉలాప్రబంధము, కొరవంజి, వీథినాటకము, మార్గనాటకము, బొమ్మలాట, జంగం కథ, హరికథ, ఆధునికనాటకము మొదలగు వివిధప్రయోజనాత్మకములై బయల్వెడలిన సాహిత్యప్రక్రియలతో దీనికి సంబంధముకలదు). 3. బహువిధపదకవితాప్రభేదసమీకరణము. 4. వస్తువైవిధ్యసంపన్నము. 5. రసవిషయిక విశిష్టము, హాస్యప్రధానము. 6. ఛందో వైవిధ్యసహితము (పదకవితలే కాక జాత్యుపజాతులును ప్రయుక్తములు). 7. భాషావైవిధ్య సంపన్నము. 8. లోకవృత్త ప్రదర్శకము. 9. దేశినాటకకళాప్రతినిధి. 10. విశిష్టతలలో విశిష్టత తెలుగు ప్రత్యేకతయగుట.

ఇంతవరకును నేనువివరించిన దానినిబట్టి జోగారావుగారు యక్షగానపరముగా పేర్కొనిన పైవిశిష్టతలెల్ల 'వీథినాటకము' యొక్క విశిష్టతలేయని విశ్వసించుచున్నాను. ఇన్ని రకముల విశిష్టతలతో కూడుకొనిన, అందున తెలుగుప్రత్యేకత అయిన, దేశివీథినాటకము

బహుళప్రచారములోనుండగా తెలుగువారికింక మార్గనాటకముల ఆవశ్యకమే లేకపోయిన దన్నను ఆశ్చర్యపడనక్కరలేదు.

తెలుగులోని మార్గనాటకాభావమునకు కారణములను కొందరు విమర్శకులు క్రిందివిధముగా ఊహించియున్నారు—

1. "........ముఖ్యముగా నాదృష్టికిఁదోచిన కారణమేమన, మనవాఙ్మయములో సంస్కృతమునందుఁగాని, మఱియే హైందవభాషయందుఁగాని పొడసూపని ప్రబంధస్వరూపముత్పత్తియగుటయేయని చెప్పఁదగియున్నది—.........వీనియందు నాటకములయొక్కయుఁ గావ్యములయొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే వేఱుగా నాటకములువ్రాయునవసరములేకపోయినది.....మన ప్రబంధములు గీర్వాణనాటకములవలె నయిదాఱాశ్వాసములతోఁ బూర్తిఁజెంది కథయంతయు నాటకనిర్ణయపరిమాణములను మించకయుండును......అనఁగా నాంధ్రప్రబంధములు సంస్కృత నాటకములవలె నిర్మాణక్రమమును సూచించుచున్నవి. కావున విద్యాభ్యాసులగువారికి నాటకములకు బదులుగాఁ బ్రబంధములుచేకూర్పఁబడినవి." (శ్రీ తేకుమళ్ల అచ్యుతరావు – "విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రను"— 1 వ భాగము. పుటలు–168–69).

2. చిన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలో శ్రవ్యకావ్యమునే ప్రశంసించియుండెను. "........ఈ వ్రాతలంబట్టిచూడఁగా మనవారు శ్రవ్యముమాత్రమే సప్తసంతానములలోఁజేరినదనియు, ఆముష్మికాభ్యుదయప్రదమనియు, దృశ్యకావ్యమట్టిదికానియు తలంచిరని యొక రహస్యము వెలువడుచున్నది. మహాకవులెవ్వరును రూపకలక్ష్యరచనసేయమికిది ప్రథమకారణముగానోపు......మఱియు పూర్వులు రూపకరచనసేయనేలేదనుట సరిగాదు. శ్రీనాథుఁడు వీథీనాటము రచించెనని ప్రసిద్ధముగదా. అతఁడుబూతులు చేర్పకయుండిన నప్పటినుండియే నాటకములల్లుకొనియుండును. (శ్రీవేదం వేంకటరాయశాస్త్రి –"గ్రామ్యభాషాప్రయోగనిబంధనము"—1934–పుటలు 54–55).

3. "తెలుగు సాహిత్యములో పనిచేసినవారందఱును సంస్కృతసాహిత్యమందు కొంచెమో గొప్పయో పరిచయముగలవారే. అట్లున్నను మొన్నమొన్నటివఱకు తెలుఁగురూపకములు యక్షగానములయంతస్తునుదాఁటి పెరుగకపోవుట తెలుఁగువారి యధైర్యమును, చాదస్తమును, సోమరితనమును దెలుపునేకాని వేఱగునా ?" (శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ – "నాటకోపన్యాసములు"—1935–పుటలు 55–56).

4. "సంస్కృతరూపకములలో పాత్రోచితభాష ఒక లక్షణము. ఉత్తమ పాత్రలకు సంస్కృతమును, స్త్రీలకు తదితరపాత్రలకు ప్రాకృతమునువాడిరి. తెనుగుకవి యేమిచేయవలెను ? గ్రాంధిక–గ్రామ్యములను వాడవలెను. గ్రామ్యములాక్షణికనిషిద్ధమై పోయినది. కావున చేయునదిలేక ఆంధ్రకవులు రూపకానువాదమును వదలిరి." (శ్రీ రాయప్రోలు సుబ్బారావు–కురుగంటివారి "కొందఱు తంజావూరు కవులు–పండితులు" పీఠిక–పుట. 6).

5. "ఆద్యులైన నన్నయాదుల మార్గమునువీడి నాటకపరివర్తన మారంభించి, భిన్న మార్గమును ద్రొక్కుట కప్పటి కవులకు ధైర్యము చాలినదికాదు (పుట 10) ... సంస్కృత ప్రాకృతములవలెఁ దెలుఁగున గ్రాంధిక గ్రామ్యభాషలురెండును వ్యాకరణపరిసంస్కృతములై యుండలేదు...పోనీ, లాక్షణికులు చెప్పిన యాయొక్క నిబంధనము నుల్లంఘించి సర్వ పాత్రలకు నొకచేభాష నుపయోగించి నాటకరచనకుఁ గడంగుటకుఁ బూర్వాంధ్రకవులకంత నిరంకుశత్వము, స్వాతంత్ర్యమును లేకపోయెను (పుట. 11) ... కించి దూనముగా నాటకాకృతినే వహించిన ప్రబంధములఁబఠించి తదాసాదితానందానుభవముచేతనే సంతుష్టులైరి. (పుట 13)... నాటకప్రయోగమునకు ముఖ్యావశ్యకములైన రంగపరికరాదులు లేకపోవుటచేతను, నాటకపాత్రధారు లార్యధర్మముననుసరించి సంఘమున నీచముగఁ జూడఁబడుచుండుటచేతను ప్రభువులు సైతము నాటకకళ నభివృద్ధిచేయ నంత శ్రద్ధవహింపకపోవుటచేతను, నానాఁటి కవులీ వాఙ్మయశాఖయం దభిరుచివహించి కావ్యరచనముచే దాని బరిపోషింపఁబూనుకొనరైరి (పుట16)" (డా. దివాకర్ల-వేంకటావధాని-"ఆంధ్రనాటకారంభదశ"- వ్యాసమాల (1946).

6. "నాటకమునకు సహాయకారి అయినది గద్యము. అట్టి గద్యము ప్రత్యేక కావ్యరచనగా వికాసముచెందకపోవుటయే మార్గనాటకాభావమునకు కారణము. గద్య రచనాకాలము ప్రారంభముకాకముందే నాటకరచన ప్రారంభముకాలేదనివిచారించుట వ్యర్థప్రయాస" (డా॥ ఐ. పాండురంగారావు. "ఆంధ్ర-హిందీరూపక్" పరిశోధకవ్యాసము - (1960 - పు. 47).

7. మహమ్మదీయ పరిపాలకుల నాటకవ్యతిరేకత కారణమని కొందరు, నాటకశాలల అభావము కారణమని మరికొందరు, తదితరు లింకేవియో కారణములను పేర్కొందురు.

పైనపేర్కొన్నట్లుగా పలువురు పలువిధములైన కారణములను ఊహించియున్నారు. వీనిలో ఏఒక్క యూహయును సమగ్రమగుహేతువు కాజాలదు; చాల హేతువులుండియుండవలయును. ఇంతకును పాశ్చాత్య ప్రభావమునకు లోనగునంతవరకును మార్గనాటకములు లేకపోవుటయనునది ఒక్క తెలుగుభాషకుమాత్రమే ప్రత్యేకతకాదు. ఈ అభావము భారతీయభాషలన్నింటియందును కలదు. ఇది విచిత్రముగా కన్పట్టినను పరమసత్యము. ఈ దృష్టితోకూడ ఈ సమస్యను పరిశీలింపవలసియున్నది. కాగా, తెలుగుభాషలోని మార్గనాటకాభావమునకు కారణములను కొన్నింటిని క్రిందివిధముగా పేర్కొనవచ్చును—

1. దేశిరచనలైన వీథినాటకములే పండితపామరరంజములై యుండుటచేత మార్గనాటకముల ఆవశ్యకము వారికి కన్పట్టలేదు. (వీథినాటకములు పామరులపాలబడినప్పుడు పండితులు సంస్కృత రూపకరచనా-ప్రదర్శనములతోనే తృప్తిపడిరి. ఏవియో ఒక నాటకప్రదర్శనమును జరుగుచునేయున్నవికాన మహమ్మదీయుల వ్యతిరేకత, నాటకశాలల అభావము, నటుల నింద్యత్వమును కారణములు కాజాలవు).

2. భాషాసమస్యయును ఒక కారణమైయుండును; వ్యవహార లేదా గ్రామ్యభాషను గ్రంథములలో వాడుటకు జంకియుందురు. (మొత్తమంతయును గ్రాంధికభాషలో వ్రాసియుండ

రాదాయన్నచో ఔచిత్యభంగమగుట తప్పదు.) తెలుగుభాష రూపకరచనకు తగదనెడి నీరస భావముకూడ కొందరికి ఉండియుండవచ్చును.

3. చిత్రకవి పెద్దన నాటకలక్షణమును, వల్లభరాయాదుల సంస్కృత రూపకానువాదములను విడిచివేసినచో తెలుగులో లక్షణము వ్రాసిన తక్కిన లాక్షణికులకుగాని, కవులకుగాని దృశ్యమైన నాటకముపై ఆదరమున్నట్లు కన్పట్టదు; (తెలుగు లాక్షణికులపై దండి-భామహుల ప్రభావమధికము). రాజులును అట్టివారే. నన్నయభట్టు ఒకపద్ధతిలో నడచి దారిచూపెను; ఇంక తక్కిన తెలుగుకవులందరును గతానుగతికముగా ఆ మార్గమునందే నడచి శ్రవ్యకావ్యములనే సంతరించిరి; కాగా నాటకములు దేశితనమునే పొందుట తప్పనిసరియైనది. (నాటకమును రచింపుమని రాజరాజు నన్నయను అడిగియున్నను, లేదా నన్నయయే స్వయముగా ఒక నాటకమును వ్రాసియున్నను నేడు తెలుగు సాహిత్యచరిత్రను ఇంకొకవిధముగా వ్రాయవలసి వచ్చెడిది).

4. సంస్కృతమునందలి కావ్యములెల్ల పద్యమయములో, గద్యమయములో అయియుండును. (చంపువు లత్యల్పము). కాని, ఇంచుమించుగా తెలుగు కావ్యములన్నియును సంస్కృతరూపకములవలె గద్య-పద్య సంమిశ్రితములై యుండుటచేత, అందేనాటకరీతులను కూడ సంతరించుకొని తెలుగుకవులు తృప్తిపడియుండిరని తలంపవచ్చును.

5. గద్యరచన విరివిగా జరుగకపోవుటచేత నాటకరచన కనుకూలవాతావరణము కల్పితము కాలేదనుటయు సమంజసమే.

6. మార్గనాటకరచన కనుకూలవాతావరణము నాయకరాజులకాలములో ఏర్పడినను నాటి వీథినాటకముల ఉచ్చస్థితి మార్గనాటకముల పుట్టుకకు అవకాశము నొసంగలేదు.

ఇన్ని కారణముల ఫలముగా క్రీ.శ. 1860 ప్రాంతములవరకును తెలుగులో యథాతథముగా సంస్కృతరూపకానువాదములుకాని, లేదా ఆ పద్ధతిలో రచింపబడిన స్వతంత్ర రూపకములుకాని సంభావ్యములుకాలేదు. ఈ రెండుపద్ధతులును ప్రారంభమైనంతనే పాశ్చాత్య రూపకానువాదములు, ఆ పద్ధతిలో రచింపబడిన స్వతంత్రనాటకములుకూడ తలయెత్తుట జరిగినది.

## భారతీయభాషలు : ఆధునికనాటకారంభము

మార్గనాటకాభావము ఒక్క తెలుగు భాషకుమాత్రమే ప్రత్యేకతకాదనియు, భారతీయ భాషలన్నింటను అది సమానధర్మమే అనియు తెలిపియున్నాను. (కొన్ని భాషలలో పాశ్చాత్య ప్రభావము పడనంతవరకు ఏవిధమైననాటకమును లేకపోవుటకూడ కలదు). తెలుగుదేశమున వీథినాటకములు ప్రచారమందున్నట్లే తక్కిన రాష్ట్రములందును రకరకముల దేశికరూపములు ప్రచారమందున్నవి—బెంగాలులో యాత్రలు (లేదా జాత్రలు), కీర్తనలు; మహారాష్ట్రములో లలితములు, తమాషాలు; గుజరాతులో భవైయీలు; రాజస్థానములో రాస-ఝూమరా-డోలా

మారూలు; బీహారులో విదేశియాలు (భోజపురిభాషలో); కాశ్మీరులో 'బంద్ పథేర్‌లు'; అవధీ-పూర్వ హిందీభాషలలో రాస-స్వాంగ-భాండ-నౌటంకీలు; అస్సాములో అంకీయనాట్‌లు మొ.[1] వీటి అన్నింటను సమానములైన ధర్మములను క్రిందివిధముగా క్రోడీకరింపవచ్చును- 1. నృత్య-గానములకు ప్రాముఖ్యమధికము. 2. గద్యము అల్పముగా ఉపయుక్తము. 3. స్థిరమైన రంగస్థలముకాని, నాటకశాలలుకానిలేవు; అన్నియును తాత్కాలికనిర్మాణములే. 4. ఆహార్యము విషయమున మోటుదనమెక్కువ, 5. కవులరచనలకంటె తత్కాల కల్పితప్రసంగములకే అధికప్రాధాన్యము; అందున హాస్యభాగము నూటికి నూరుపాళ్ళు, 6. ఈ ప్రదర్శనములందు నాటి గ్రామీణజీవితసమస్యలుకూడ ప్రాధాన్యమును వహించినవి. 7. ఆధునికనాటకములారంభమైనప్పుడు వానిపై వీనిప్రభావముకలదు; కాని, అటుపిమ్మట ఇవియే వాని ప్రభావమునకు లోనై సంస్కరింపబడసాగినవి.

ఏవో కొన్ని అపవాదములనుతప్పించినచో, భారతీయభాషలలో ఆధునిక రంగస్థల నాటకరచనా-ప్రదర్శనములు క్రీ. శ. 1840 తరువాతనే ఆరంభమైనవని చెప్పవచ్చును. ఈ ఉద్యమము ప్రప్రథమముగా వంగదేశమున కలకత్తాలో ఆరంభమైనది; అటుపిమ్మట బొంబాయి-పూనానగరములకు ప్రాకినది, ఆ తరువాతనే తక్కిన నగరములకు వ్యాప్తమైనది. తొలి తెలుగు రంగస్థల నాటకరచనా-ప్రదర్శనములనుగూర్చి పరిశీలించుటకుముందు బెంగాలు (వంగదేశము) బొంబాయి, మద్రాసు రాష్ట్రములలోనిస్థితిని పరిశీలించుట ఆవశ్యకము.

1. వంగరాష్ట్రము : క్రీ. శ. 12 వ శతాబ్దిలో లక్ష్మణసేనుని ఆస్థానకవియగు జయదేవుడు రచించిన 'గీతగోవిందము' ఆనాటి బెంగాలీ నృత్యసంప్రదాయమునకు సంస్కృతీకరణమని తలంపబడుచున్నది[2]. దీనికి సంగీత-నృత్యములను జోడించి, నృత్యనాటకమునుగా ప్రదర్శింపవచ్చును. తురుష్క దండయాత్రలవలన 15 వ శతాబ్దమువరకును గీతగోవిందము ప్రసిద్ధికివచ్చినట్లు కన్పట్టదు. చైతన్యదేవుని (క్రీ. శ. 1486-1534) తో రూపకప్రదర్శనములారంభమైనవి. ఆతడు నటుడుకూడను; 'రుక్మిణీహరణ'మనెడి ప్రదర్శనములో చైతన్యుడు రుక్మిణిపాత్ర నద్భుతముగా నభినయించెనని బృందావనదాసు రచించిన చైతన్యభాగవతము వలన స్పష్టమగుచున్నది. ఈ రుక్మిణీహరణ ప్రదర్శనము నేటికిని బెంగాలుదేశమందు ప్రచారములోనున్న జాత్రల లేదా యాత్రల ప్రదర్శనములను పోలియుండునని తలంపబడుచున్నది. అటుపిమ్మట సంస్కృతరూపకానువాదములు కొన్ని వెలసినవి. జాత్ర లేదా యాత్ర అనునది నృత్త-గాన-వాద్యములతోకూడిన మతయాత్ర (దేవుని ఊరేగింపువంటిది) యని సామాన్యార్థము; మన 'జాతర' లిట్టివే. ఆదిలో జాత్ర సాగుచుండగా వేషధారుల నృత్త-గానాదులు ప్రదర్శింపబడెడివి. పిమ్మట అవి ఒక నిర్దిష్టప్రదేశమున ప్రదర్శితములయ్యెడివి; అటుపిమ్మట అందు సంవాదాదిరూపకధర్మములుచేరినవి. అప్పుడే నేటి జాత్రకు సంపూర్ణస్వరూపము సిద్ధించియుండును[3]. ఈ జాత్రలు లేఖనభాగ్యమునకు నోచుకొనలేదు. ఈ ప్రదర్శనములకు నిర్ణీతమైన రంగస్థలాదులు ఉండవు. నృత్త-గీతముల ప్రాముఖ్యమధికము. సంవాదము, ఇతివృత్తము అల్పములు. ఈ జాత్రలుకూడ సంస్కృతరూపకముల తొలిదశకు చిహ్నములని విమర్శకుల యభిప్రాయము.

ప్లాసీయుద్ధానంతరము పాశ్చాత్యరూపక ప్రదర్శనముల నిమిత్తము అధికారులు కొన్ని నాటకశాలలను కలకత్తాలో నెలకొల్పిరి. లెబెడెఫ్ అను రష్యాదేశస్థుడు సొంత నాటకశాలనునెలకొల్పి, The Disguise అనెడి ఆంగ్లనాటకమును వంగభాషలోని కనువదింపజేసి 27-11-1795 తేదీన, 21-3-1796 తేదీన రెండుసార్లు ప్రదర్శింపజేసెను. ఈ ప్రదర్శనమందు స్త్రీలుకూడ పాల్గొనిరి. క్రీ. శ. 1831 లో 'జూలియస్ సీజర్' వంగభాషలోనికి అనువదింపబడెను. 1832 లో ప్రప్రథమముగా వంగదేశీయులే ఒక నాటకశాలను నిర్మించుకొనిరి. 1852 లో జోనేంద్రగుప్త 'కీర్తి విలాస్' అనెడి ప్రథమవంగవిషాదరూపకమును రచించెను. సంస్కృత ఫక్కికలో వ్రాయబడిన 'కులీన-కుల-సర్వస్వము' 1857 లో ప్రదర్శింపబడెను. ఆంగ్ల రూపకపద్ధతిలో రచింపబడిన 'శర్మిష్ఠ' 1859 లో ప్రదర్శింపబడెను. 1873 లో నటుడు, దర్శకుడు, నాటకరచయిత అయిన గిరీష్‌చంద్రఘోష్ రంగమున కవతరించుటతో ఆధునిక నాటకములు వంగదేశమున సుస్థిరములైనవి; జాత్రలు సన్నగిల్లెను.

2. బొంబాయి రాష్ట్రము : బొంబాయి బహుభాషారాష్ట్రము—గుజరాతి, మరాతి, ఉర్దు, హిందుస్తాని మొదలగు భాషలకది ఆలవాలము.

క్రీ. శ. 1842 లో సాంగ్లీప్రభువు అప్పాసాహెబ్ ఒకనాడొక కన్నడయక్షగాన ప్రదర్శనమును చూచుటతటస్థించెను. మరాటీభాషలోకూడ నాటకమునురచించి, సమాజము నేర్పరచి, ప్రదర్శించుమని ఆతడు విష్ణుదాస్‌భావే అను కీర్తనకార్‌ను ఆదేశించెను. అంతట భావే'సీతాస్వయంవర'మనెడి రూపకమును రచించి, ఆస్థానోద్యోగులు నటులుగా 1843 లో దానిని ప్రదర్శించెను. ఇదే మరాఠీ నాటకరచనా-ప్రదర్శనములకు ఆరంభము. ఈ రచన యక్షగానమునకును ఆధునికనాటకమునకును మధ్యేమార్గమున నడచెను. 1861 లో క్రొత్తమార్గమున 'మాధవరావు పీష్వా' అనెడి రూపకము రచింపబడువరకును పైవిధముగానే ప్రదర్శనములుసాగినవి. భావే సమాజమువారు బొంబాయిలోకూడ ప్రదర్శనములొసంగినారు. ఇవి పార్శీల నధికముగా నాకర్షించెను. మేధావంతులును, ధనవంతులును అయిన పార్శీలే పిమ్మట బొంబాయి నాటకరంగమునకు పట్టుగొమ్మలైనారు. ఆదిలో నటులుకూడ ఎక్కువగా పార్శీలే. వీరు ఎక్కువగా గుజరాతీ నాటకములనే ప్రదర్శించెడివారు. 1852 లో 'పార్శీ నాటకసమాజము' అనునది స్థాపింపబడెను (అంతకుముందుకూడ సమాజములు, నాటకశాలలు, ప్రదర్శనములు ఉన్నను అవి ఆంగ్లభాషకే పరిమితములని చెప్పవచ్చును). హోమ్‌రూల్ ఉద్యమపితామహుడగు దాదాభాయి నౌరోజీ ఈ మండలి ఉపదేశికవర్గ సభ్యుడట. ఈ మండలి స్థాపనతో ఆధునికగుజరాతీనాటకరచనాప్రదర్శనములు ఒకేసారి అవతరించినవి. అటుపిమ్మట అనేకులు అనేకసమాజములను స్థాపించిరి...దాదాభాయితూతి, దాదాభాయిపటేల్, కువర్జినజీర్, ఖోరీ, ఖటావు, కబ్రజి, బాలీవాలా మొదలగువారు. వీరుస్థాపించిన సమాజములన్నియును దేశసంచారమొనర్చుచు గుజరాతీ, హిందీ, ఉర్దూ నాటకములను ప్రదర్శించెను. బాలీవాలా తన సమాజమును ఇంగ్లండు, బర్మా మొదలగు దేశములకుకూడ తీసికొనివెళ్ళెను. ఈ సమాజములందు స్త్రీలుకూడనుండిరి. ఖటావు, గోహార్ మొదలగు నటీమణులను ప్రసిద్ధిలోనికి తెచ్చెను. రంగముపై చిత్రవిచిత్రములను

(ట్రాన్సఫర్‌మేషన్ సీనులు మొ.) చూపుటకొరకు వీరందరు ఇంగ్లాండుదేశమునుండి రంగపరికరములను తెప్పించిరి, ఆంగ్లేయపద్ధతిననుసరించి ప్రతినాటకము చివర ఒక చిన్న హాస్యఘట్టమును ప్రత్యేకముగా ప్రదర్శించెడివారు. హిందువులు రంగమున ప్రవేశించిన తరువాత పార్సీలు ఉర్దూనాటకములనే ప్రదర్శింపసాగిరి.

భావేయొక్క సాంగ్లీనాటకకంపెనీకి ప్రతిగా, 'ఆల్టేకర్ కంపెనీ' అనునదింకొకటి బయలుదేరినది. 'ధార్వాడనాటకసమాజ'మనుపేర 1880 ప్రాంతముల తెలుగుదేశమున సంచారమొనర్చినది ఈ సంఘమే. వీరు వంగ_పార్సీ నాటకప్రదర్శనములలోని అట్టహాసములనెల్ల స్వీకరించి, హిందూస్తానీనాటకములను ప్రదర్శించిరి. 1881 లో అన్నా కిర్లోస్కరు రచించిన 'సంగీతశకుంతల' (కాళిదాసు శాకుంతలమున కనుసరణము) ప్రదర్శితమగుటతో మరాఠీ నాటక చరిత్రలో ఒక క్రొత్తయుగమారంభమయ్యెను. సంగీతనాటకముల కితడే పితామహుడు. ఈ ప్రదర్శనములు ఓపెరాలను పోలినవైనను, సంవాదములు గద్యాత్మకములగుటచేత వానికంటె భిన్నములగుచున్నవి. ఇవి తెలుగులోని 'గద్య_పద్య_గేయసమ్మిశ్రితము'లగు నాటకముల వంటివి. ఇతర మరాఠీ నాటకసమాజములలో 'బాలగంధర్వ సమాజము' (పాటలకు ప్రసిద్ధి) కూడ తెలుగుదేశమున ప్రసిద్ధివహించెను. కొన్ని సమాజములవారు కేవలము గద్యనాటకములనే ప్రదర్శించెడివారు.

3. మద్రాసు రాష్ట్రము : బొంబాయివలె మద్రాసుకూడ బహుభాషా రాష్ట్రము—ఇందు తమిళ_కన్నడ_తెలుగు_మళయాళములు ముఖ్యభాషలు. 1875 లో మద్రాసులో 'మద్రాసు డ్రమెటిక్ సొసైటీ' స్థాపింపబడెను. ఇందు ఆంగ్లేయు లాంగ్లనాటకములను ప్రదర్శించెడివారు. 1880 ప్రాంతముల పూనా సాంగ్లీ కంపెనీ మద్రాసు వచ్చెను. 1882 ప్రాంతముల 'ది ఓరియంటల్ డ్రమెటిక్‌క్లబ్' స్థాపింపబడెను. ఈ క్లబ్ ప్రదర్శనములందు 1885 ప్రాంతముల పాశ్చాత్యుల హార్మోనియం, హిందూస్తానీ 'గజల్స్', వినోదాత్మకములైన ఆంగ్లగేయములు ప్రవేశించినవి. 1890 లో బళ్ళారి ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి తమ 'సరసవినోదినీసభ' సామాజికులతోవచ్చి మద్రాసులో ప్రదర్శనములొసంగినారు. ఆప్రదర్శనములే ఆధునికతమిళ నాటకముల ఆరంభమునకు ప్రేరకములయ్యెను. శ్రీ పి. సంబంధం మొదలియార్ మిత్రులతో కలసి 1891 లో సరసవినోదినీసభ పద్ధతిలో 'సుగుణవిలాససభ'ను స్థాపించెను. ఈ సంబంధం మొదలియారే ఆధునికతమిళనాటకములకు పితామహుడు. ఈ సభవారు తమిళనాటకములనేకాక తెలుగు, కన్నడ, ఆంగ్లనాటకములనుకూడ ప్రదర్శించెడివారు. ఆదిలో ఈ సభాప్రదర్శనములు 'విక్టోరియా పబ్లిక్‌హాలు'లో జరిగెడివి. తెలుగుదేశమందు ప్రసిద్ధివహించిన కన్నడ నాటకసమాజములో 'గుబ్బి వీరన్న' కంపెనీ పేర్కొనదగినది. బళ్ళారిలో తెలుగు నాటకరచనా ప్రదర్శనలకు ప్రేరకమైనది రంగాచారిగారి కన్నడనాటక సమాజము.

## నృత్యములు

1. అట్లు దేవుని కంకితము చేయబడినవారు అస్ఖలిత బ్రహ్మచారిణులగుటచేత "దేవదాసీకుల" మనునది ఏర్పడుట కవకాశము లేకుండెను. కాని, క్రమముగా ఆ నిష్ఠ తగ్గినది. దైవసేవ అప్రధానమై, 'మానవసేవ' ప్రారంభమైనది. క్రమముగా కులమొకటి ఏర్పడినది: అదియే నేటి వారాంగనా కులము.

2. 'పురాతమ్మ' యనెడు నర్తకి నృత్యమును, హంగుదారుల, వాద్యకర్తల పేర్లను సోమనాథుడు బసవపురాణమందు విపులముగా వర్ణించెను (పుటలు. 53_54)

3. రాజాస్థాననృత్యము శ్రీనాథుని 'పలనాటి వీరచరిత్ర'లో విపులముగా వర్ణితమైనది_పుటలు 18_19

4. పోతకమూరి అన్నలు ఇట్టి భాగవతులే అయియుందురు. వారి నృత్యము కేవలము భగవదారాధన పరమైనది.

5. చూ. నావ్యాసము 'సిద్ధేంద్రయోగి' (భారతి_జనవరి, 1960). తెలుగుదేశమునకు కూచిపూడి నాట్యకళ యెట్టిదో మళయాళదేశమునకు కథాకళి అట్టిది. ఇది కూచిపూడివారి నృత్యనాటకములను పోలియుండును. కాని, ఇందు నటులు వాచికాభినయమును పరిహరించుటచేత తెలుగు నృత్యనాటకముల వలె కథాకళి సమగ్ర నృత్యకళకాదు. ఈ కథాకళినాట్యమునకు క్రీ.శ. 1575_1650 నాటివాడగు కొత్తరక్కరరాజు మూలపురుషుడని తెలియుచున్నది. క్రీ. శ. 1503_1509 ప్రాంతముల విజయనగరములో రాయల యెదుట ప్రదర్శన మొసంగిన కూచిపూడి మేళము ఆ ప్రాంతములందే మళయాళదేశమునుకూడ సందర్శించి ప్రదర్శనము లొసంగినట్లు తెలియుచున్నది. కూచిపూడివారి నాట్యకళ ప్రేరకముకాగా, కొత్తరక్కరరాజు నాటికి దేశమందున్న 'కుడియాట్టము'ను సంస్కరించి, నేటి కథాకళికి రూపులు దిద్దియుండును. నాడు కథాకళి మేళములును, కూచిపూడి మేళములును బ్రాహ్మణ మేళములేయగుట గమనార్హము.

6. కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారు పేర్కొన్నట్లుగా సత్యభామయే శృంగారరససర్వస్వమని కాలంబనమని తెలిసినవారు సృష్టిలో ముగ్గురన్న ముగ్గురే—మొదటివారు శ్రీకృష్ణదేవుడు, రెండవవారు తెలుగుకవి నంది తిమ్మన్న (పారిజాతాపహరణ కర్త): మూడవవారు సిద్ధేంద్రయోగి (భామాకలాప స్రష్ట).

7. రాత్రి ఏ పదిగంటలకో ఆరంభమైన భామాకలాప ప్రదర్శనములో కృష్ణుడు రంగముమీదకు వచ్చునప్పటికి తెల్లవారుజామున మూడు లేదా నాలుగు గంటలు అయినను అగును. అంతవరకును రంగముమీద ఉండునది భామయు, చెలికత్తెయును మాత్రమే. సత్యయే అష్టవిధనాయికలుగా మారుచు తత్తదవస్థా భేదములను అంతకాలమును అభినయించుచునే యుండును. ఈ దృష్టితోనే దీనిని ఏకపాత్రాభినయము (లేదా ఏకపాత్ర నృత్యము) అనుట (Solo type dance).

8. "గొల్ల కలాపమందలి యజ్ఞపు పట్టు గురించి చెప్పేది తరిగొండ వేంగమాంబ రచన. క్షీరసాగర మథనమును వర్ణించిన గొల్లకలాపమును ఆత్రేయపురపు వేంకటదాసు, తమ్మన్నగారలు రచించారు. పిండోత్పత్తిని గురించిచెప్పే కలాపం సిద్ధేంద్రుని పేరనూ, భాగవతుల రామయ్యగారి పేరను చెల్లుబాటు అవుచున్నది"—ఆంధ్రవాగ్గేయకారచరిత్రము_పుట 201. (శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు).

9. ఇంకను వివరములకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ ప్రచురించిన 'కూచిపూడి నాట్య సదస్సు ఉత్సవసంచిక' (1959) ను చూడవలెను.

10. పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా కుమారదేవ గ్రామములోని మంచిరాజు వేంకట్రాజుగారనెడి నియోగి భామవేషమునకు సుప్రసిద్ధులు. వారి శిష్యులు వల్లంపట్ల రామయ్యగారు, వారు మా ఊరిలోని (ఐందపురం, కొవ్వూరు తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా) పిచ్చుకకుంట్లకు భామా కలాప-గొల్ల కలాపములను నేర్పినారు. ఐయ్యా పెద గంగాధరుడు, ఐండి చిట్టిలింగము, దేశి లక్ష్మీనారాయణ మొదలగువారు భామవేషమున సిద్ధహస్తులు. 16 సంవత్సరముల వయస్సులో లక్ష్మీనారాయణ భామవేషము అద్భుతముగా నుండెడిది. ఈ పిచ్చుకకుంట్లు వీనిని నేర్చుకొనుటకు మా పితృపాదులు పోణంగి రామమూర్తిగారి ప్రోత్సాహమే హేతువగుట నాకు గర్వకారణము. అటుపిమ్మట వీరు నృత్యనాటకములను కూడ ప్రదర్శింప నారంభించిరి. తెలంగాణములో కూడ పిచ్చుకకుంట్లు కలరుకాని, వారికి ఈ కళలో ప్రవేశములేదు.

11. ప్రపంచ విఖ్యాత నర్తకుడు శ్రీ ఉదయశంకర్ శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారిని కలిసికొన్నప్పుడు శాస్త్రిగారు, తమవృద్ధాప్యములో, భామవేషముసుకట్టి అభినయించి చూపినారట. శ్రీ శాస్త్రిగారు ధరించిన ఏడువారాల సొమ్ములను, వారి హస్త పాద విన్యాసములను కాంచి, దిగ్భ్రమచెంది శ్రీ ఉదయశంకర్ శాస్త్రిగారికి పాదాక్రాంతుడయ్యెనట ! కూచిపూడి నాట్య విశిష్టత మరి అట్టిది!!

12. ''దాక్షిణాత్యులు బహునృత్తగీతప్రియు''లని భరతుడు పేర్కొనుటయు, సంగీత నృత్యకళలందు ఆంధ్రులే తక్కిన దాక్షిణాత్యులకు నిన్న మొన్నటివరకును మార్గదర్శకు లగుటయును గమనార్హములు—

''In the Tamil Country, where the Telugu dance and music heritage was most carefully preserved, Tamil versions and Tamil padas also on the model of Kshetragna's Composition arose-'' — Dr. V. Raghavan's Introduction to 'Sringara manjari'. (1951) P. 70

''Any one who wanted to get any proficiency in any of the fine Arts till about 100 years ago, had to learn Telugu'' — Sangeetha Kalanithi Sri K. Vasudeva Sastry's Introduction to 'Taladasa Pranadipika'. (1950) P. XI.

## బొమ్మలాటలు

1. "రూపోపజీవనం 'జాలమండపి'కేతి దాక్షిణాత్యేషు ప్రసిద్ధమ్.
తత్రసూక్ష్మవస్త్రం వ్యవధాయ చర్మమయైరాకారైః
రాజామాత్యా దీనాం చర్యాప్రదర్శ్యతే."

తెలుగుకవుల కావ్యములందుకాని, శాసనములందుకాని 'జాలమండపిక' అన్న పేరు ప్రయుక్తమైనట్లు కన్పట్టదు.

2. "శుభమస్తు। విష్ణుసంవత్సర మా। ర్గ సు ౧౩ లు శ్రీ। గంగరాయదేవమహా। రాయలయ్యవారు బొమ్మలాట పరువటి పురాణం। వీరపకుమారుడు కృష్ణపకు సాదలి హబ్బిలోని ఉప్పుగుంటపల్లె సర్వమాన్యంగా। మనించిన దర్మశిలాశాసనం........" (ఇచ్చట తరువాత కొన్నిపాదములు చెడిపోయినవి.)

—E. C. X. Sd. 100 - Pp. 238-39. ఇది కోలారుజిల్లాలో దొరికిన తెలుగుశాసనము.

3. కృష్ణరాయలను, తదనుజుడైన అచ్యుతరాయలను అధికాప్తుడై కొలిచినవాడు బొమ్మలాట విరూపాక్షుని కుమారుడు 'కాలుడు.' ఇతడు విద్యానిధియట ! ఇతని ప్రార్థనపై వల్లభాచార్యుడు (కవి దేవేంద్రుడు) గణితము నొకదానిని రచించెను—

"...............కృష్ణరాయభూ
జానిని, వెండియుఁ దదనుజన్మని నచ్యుతదేవరాయనిన్
దానధికాప్తుడై కొలిచి, తద్దయుమన్ననగాంచి మించు వి
ద్యానిధి బొమ్మలాట విరుపాధిపు కాళని ప్రార్థనంబునన్,
..................

"............అచ్యుతదేవరాయల కృపాదృష్టిఁజేసి ఆందోళికారూఢుఁడగుచును........
బొమ్మలాట కాళఁడు.........."

—ఆంధ్రకవితరంగిణి—9 వ సం.—పుట 245.

4. చూ. ఆంధ్రకవితరంగిణి—9 వ సం.—పుట 246.

5. బళ్ళారిజిల్లాలో 'బొమ్మలాట పల్లె' అనెడి ఊరుకలదు. అది కూడ బొమ్మలాటవారి గ్రామమే అయియుండును.

6. "తెరనాటక" మనగా తెరలనుపయోగించెడి నాటకప్రదర్శనములని కొందరు విమర్శకులు తలంచినారు. కాని, అది సమంజసముగా కన్పట్టదు. బొమ్మలాట యమృతకవి బొమ్మలాటవారికే దానమిచ్చినట్లు తలంచుట సమంజసము. ఈ తెరనాటకములను జంగాలాడెడివారని కావ్యములవలన తెలియుచున్నది.

7. చూ' "విదేశయాత్రికులు : ప్రాచీనాంధ్రదేశము"—పుట 189.
—శ్రీ భావరాజు వేంకట కృష్ణరావు.

8. "మదనుఁడను బొమ్మలాటగాఁడదనెఱింగి
రాజు నెదుటికిఁ దెరలోన రహిఁజెలంగు
మెచ్చు బంగారు ప్రతిమను దెచ్చె ననఁగ
వచ్చెఁ బెండ్లికుమారి చెల్వంబుమీఱి".

9. "తెరసంధించి, ప్రఫుల్లహల్లక శిఖాదీపచ్ఛట ల్నించి లోఁ
గరమర్థిన్ జలమానుషీ ప్రతిమలంగై నేసి యీసింధుసుం
దరి గంగావతరప్రసంగతకథానాట్యంబు సూపన్సురల్
సరవిన్ వైచునొసంగులో యనఁగ నంచల్ప్రవాలెడిం జూచితే"
కావేరీవర్ణనము—"చంద్రభానుచరిత్రము"—II. 99.

ఇందలి 'గంగావతరణము' ప్రభావతీప్రద్యుమ్నమునందలి 'గంగావతరణము' ఒకటికాదు.

10. "నికటక్షోణికఁ బువ్వువీడఁ దెరయై, నీడల్ సభాసీనులై,
శుకరాజంబు ప్రసంగియై, కిసలయస్తోమంబుదీపంబులై,
పికముల్ పాఠకులై, యళుల్ప్రతిమలై పెంపొందఁ జైత్రుండు ద
ర్పకుఁడీక్షింపఁగ బొమ్మలాటఁ గనుపింపన్ జూచితే నెచ్చెలీ.
—చంద్రాంగదచరిత్రము—IV—207.

11. "అప్పుదిద్దినవానియటులు, వేఁగినదాఁక
బొమ్మలాటగన్న భోగి పగిది" —కాకమాని మూర్తి "పాంచాలీపరిణయము"- ప్ర. ఆ.

12. సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగబోరు, మ
క్షికవితతుల్ వ్రణంబు పరికింపగతిం గొదవల్ గణించుటల్
కుకవులనై జబుద్ధి, తెరలో కథచొప్పునబొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమలుండవె పెక్కులువెక్కిరించుచున్.
—కుకవినింద—"అనిరుద్ధచరిత్రము"—I-12.

13. సూత్రధారశబ్దములోని 'సూత్రము'(దారము) అనెడి అర్థమునుబట్టి తోలుబొమ్మలాట విషయములోనే ఈపదము అన్వర్థమగుచున్నది. ఈ పదమునాధారముగాచేసికొని కొందరు పాశ్చాత్యపండితులు బొమ్మలాటలనుండియే సంస్కృతరూపకములు జనించినవని సిద్ధాంతమొనర్చినారు. ఈ వాదము బలహీనమైనది; బొమ్మలాటలు ఆరంభమగుటకుముందే రూపకరచనము, తత్ప్రదర్శనము కలవని విమర్శకులు నిరూపించియున్నారు.

14. "బొమ్మలాటవాడు బొమ్మలనాడించు
భువిని జనులుచూడ పొలుపు మీర
తాను మరగియుండి దైవమాడించురా
విశ్వదాభిరామ వినురవేమ." (వేమనపద్యము).

కఱ్ఱబొమ్మనాడించు విధమును రాజశేఖరుడు బాలరామాయణ (5 వ అం.) మందు వర్ణించిన విధము గమనార్హము—

గీ. దారుమయగాత్రమొక సూత్రధారుఁడవలఁ
దగుగతిఁగదల్ప, మొగమునఁ దాపియున్న
శారికయ మాటలాడ రాక్షసకులేంద్రు
చేతము హరించు నీ యంత్రసీత నిజము."
—శ్రీ తిరుపతివేంకటకవుల ఆంధ్రీకరణము.

శారికకుబదులు, మామూలుగా, వెనుకనుండి శ్రీకంఠమును సమన్వయించుట సాధారణము.

15. ఇందులకు సుభటుని క్రింది శ్లోకము కూడ ఒక ఆధారము—
"స్వనిర్మితం కించనగద్యపద్యబంధం కియత్ప్రాక్తన సత్కవీంద్రైః।
ప్రోక్తం గృహీత్వాప్రవివర్త్యతేస్మ రసాఢ్యమేతత్సుభటేన నాట్యమ్" ॥
—A History of Sanskirt Literature-Vol I (Calcutta-1947)-P. 501-F.N. 2,

16. "జావాద్వీపవాసుల వినోదములు: వాయంగ్ ఆటలు" — శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ
"చారిత్రక వ్యాసములు"—పుటలు 96-107.

17. "Not all puppet plays are suitable for acting by all types of puppets. Hand-puppets are excellent as comedians and satirists. Let them carry, embrace, pull and push, fight, dance together, go in and Rout of doors. Leave to Rod-puppets serious drama; they can be very dignified, and even create a religious atmosphere. There can also be convincing fights with sword, lance, or fists. Hand-

and-rod-puppets lend themselves to many different plays; they do satire well, but they can also reach the heights of tragedy. String-puppets (Marionettes) are excellent for climbing, swinging, rocking, and most forms of aerial movement. Tricks, dances, and acrobatic stunts are traditional String-puppet material. Shadows are somewhat unreal in quality and are good for fantasy, dreams and processions;they can dance and do tricks so long as they are kept within the two dimensional limitation of the screen."

—"The Puppet Theatre Hand Book" by M. Batchelder—P. 203.

## యక్షగానములు

1. దీనికి మూలము క్రిందివిధముగానున్నది—

"కీర్తయంతిస్మ మాహాత్మ్యం గంధర్వాస్త్రిదివౌకసః ।
గాంధర్వవిద్యానిపుణా గాంధర్వేణ గరీయసీ" ॥

—(సంస్కృత భీమేశ్వరపురాణము—10 వ అధ్యా. 19 శ్లో.)

2. భైరవకవి "శ్రీరంగమాహాత్మ్యము" పీఠికలో మానవల్లి రామకృష్ణకవిగారు ఉదాహరించినారు.

3. "యక్షగానలక్షణము" అని మూలమందు శీర్షికకలదు. కాని, ఇది యక్షగానలక్షణముకాదు; ఇందుయక్షగానములందుపయుక్తములగు రగడభేదములు మాత్రమే చెప్పబడినవి.

4. చిత్రకవి పెద్దనార్యుని పై లక్షణసారసంగ్రహ పద్యమునే అప్పకవి సమగ్రముగా అనుసరించి యుండెను.

5. see-Music Academy Journal-Vol. I. 1930. -గంధర్వకిన్నరాదులకువలెనే యక్షులకు కూడ ఒక ప్రత్యేక సంప్రదాయమున్నట్లు ఆంజనేయభరతములో పేర్కొనబడెనట.

6. అంతకు ముందు పాల్కురికి సోమనాథుడు "యక్ష-గంధర్వ-విద్యాధరాదుల" వేషములను ధరించెడి వారిని గూర్చిచెప్పియుండెను. కాని ఆవేషధారణమునకును యక్షగానమునకునుసంబంధములేదు.

7. సారాంశము—

యక్షగానము :

(1) భీమఖండోదాహరణమునుబట్టి—"గానరూపస్తోత్రపాఠము"

(2) క్రీడాభిరామోదాహరణమునుబట్టి— "గానరూపకథాఖ్యానము". లభించిన తొలుతటి యక్షగానములలో తాళప్రధానములు, రగడవికారములు నైన రేకులు, ద్విపదలు, ఏలలు, అర్ధ చంద్రికలు, ధవళశోభనములు, అల్లోనేరేళ్ళు మొదలగు దేశిచ్ఛందఃప్రక్రియలే కన్పట్టును. ఇందు వచనభాగము స్వల్పము—అది ఎడనెడ సంధివచనప్రాయముగా నుపయుక్తము.

—డా. యస్వీ జోగారావు—"యక్షగానము"

(తెలుగుభాషా సమితివారి "తెలుగు సంస్కృతి" సంపుటము—పుటలు 985-86.)

8. ముద్రితమైన యక్షగానములలో సుగ్రీవయక్షగానమే ప్రాచీనరచన. విప్రనారాయణచరిత్రము దీని కంటె కూడ కొంచెము ప్రాచీనమని డా. యస్వీ జోగారావు నిరూపించియున్నారు. రెండింటికిని రచనావిధానమందు సామ్యముకలదు.

9. "Yakshagana" by Dr. V. Raghavan—Triveni—Sep-Oct, 1934-Vol. VII-No.2.

10. "దేశి రచనలలోనుండి సింగి-సింగడు, కోణంగి, వదవు అనునవి నటీ-నటులుగను, విదూషకుడుగను, ధ్రువగను సంస్కృత నాటకములఁజేరెనేమో యని కూడ యోచింపదగినట్టిది."
—సుగ్రీవవిజయ పీఠిక- పుట.6.

11. చూ. పై డా. రాఘవన్‌గారి వ్యాసము.

12. "Yakshagana" by Sri. S. Ramakrishna Sastry —Madras University Journal.
—Jan, 1958-Vol. XXVIII-No.4.

13. క్రీడాభిరామము-పుటలు 46-47. చూ. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి క్రీడాభిరామపీఠిక
—పుటలు—96-102.

14. అనగా అప్సరసలది నృత్తము, యక్షులది గానమువన్న మాట-"నిర్జరీజనతానృత్తసహాయులాలసుల యక్షగ్రామవాస్తవ్యులన్"
—(పారిజాతాపహరణము-II-92.)

15. చూ. శ్రీ మట్నూరి సంగమేశం-"కన్నడ యక్షగానములు"
—భారతి-ఫిబ్రవరి, 1956-పుటలు 66-67,

16. "కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని కంఠస్వరంబుతో గారవింప,
మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను కొడుపుచేఁదాటించు నెడపదపవ,
శ్రుతికినుత్కృష్టంబుఁ జూపంగ వలయుచోఁ జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ,
గిల్లుగిల్లున మ్రోయుకింకిణీ గుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప,
రాగమునసుండి లంఘించు రాగమునకు నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు పాడుచువచ్చె జక్కుల పురంధ్రి.
—క్రీడాభిరామము-పుటలు-45-46.

17. గాణ పదమునకు గాయకుడు లేదా గాయని అని అర్థము. "వేల్పుగాణలువాడు లక్ష్మీనారాయణుల కళ్యాణంపుఁ బాటలం దీటుకొను తిన్నని రవంబులు గలిసి బలిసికొను కోలాహలమ్ములు...."
—మనుచరిత్రము—VI-71.

18. అయినను, లభించిన యాధారములనుబట్టి యక్షగానము, పుట్టుకలో, జక్కులవారికి సంబంధించియే యుండునని నిశ్చయించుట అసమంజసము కాజాలదు.

19. "అలరుంబోఁడి జనంగమప్రమదమధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలఁగంబాడె సమస్తలోకజననిన్ శ్రీయేకవీరాంబికన్
వలరాజొక్కొకమూర్ఛనాస్వరమునన్ బ్రాణంబు గల్పింపఁగాఁ
గలకంఠీకలకంఠకోమలకుహూకారంబుతోరంబుగన్."—క్రీడాభిరామము-పుట 43.

20. "కక్షనిక్షిప్త వికస్వరస్వరవిలాసశ్రీనివాసంబు జవనికందుఁ
గట్టినతంత్రకిఁ గంఠశ్రుతికిఁ గూడఁజొక్కంబుగా నారిసొంబగుమీఱ
నాలాపముల శుద్ధసాళవ సంకీర్ణవివిధరాగంబుల చవులుచూపి
డమడమధ్వనులఁ బొటారించియెడనెడఁ గ త్తెరమార్గంబు బిత్తరిల్ల
వాద్యవైఖరిఁ గడునెఱవాదియనఁగ నేకవీరామహాదేవియెదుటనిల్చి
పరశురామునికథ ల్లెల్లఁబ్రౌఢిఁబాడెఁ జాయతరకీర్తి జవనీలచక్రవర్తి."
"జవనీల జవనికపాటలనిల్లాంధ్ర రమణఁబ్రుక్కాడించు రంతకత్తె"
—(మాహురమ్మ వర్ణనము.)—క్రీడాభిరామము-పుటలు-42-43.

21. "కోయిల పంచమ స్వరముగ్రోల్చిన భంగిని విద్దికంచిరా
మాయణ మాఱుకొండలు నచ్యుతజాగరవేళఁ బాడె నా
రాయవితంతురత్న మనురాగముతోడ............"—క్రీడాభిరామము-పుటలు-55-56.

22. డా. బి. రామరాజు "తెలుఁగుజానపదగేయ సాహిత్యము" లో జవనీలను గూర్చి వివరించి యున్నారు (పుటలు 367-68). పరశురామునికథకే 'ఎల్లమ్మకథ' అనియు, 'రేణుకాదేవి' కథ యనియు పేర్లుకలవట. వీరు వాయించు వాద్యమునకు తెలంగాణములో 'జమిడిక' అని పేరు (జమిడిక = జవనిక = పంబ); గుంటూరుజిల్లాలో 'జముకు' అందరు. ఈపద్యములందలి'జవనికా' పదము 'జమిడికా' పదమనియే తలంచుచున్నాను. క్రీడాభిరామకథ తెలంగాణమునకే సంబంధించిన దగుట గమనార్హము.

23. అయ్యలరాజు నారాయణామాత్యుని 'హంసవింశతి'లో సుద్దులగొల్లలు వర్ణితులైనారు(II-88-90). ఇట్టివారే దాసరులు, జంగములు. మరియు తెలంగాణములోని పిచ్చుకకుంట్లు, శారదకాండ్రు, వీర ముష్టి వాండ్రు, ?రన్నలవాండ్రు—వీరిని గూర్చినవివరములకు రామరాజుగారి పై పరిశోధనా వ్యాసమును చూడవలెను (పుటలు. 759-74).

24. ఇవి సంవాదాత్మకములగుటచేత పాత్రసమారోపముతో, కొలదిమార్పులతో నాటకమువలె ప్రదర్శించుటకు కూడ అనువుగానుండును. అంతియేకాక ఇవి బొమ్మలాట ప్రదర్శనములకు కూడ ఉపయుక్తములగును. బొమ్మలాట సాంబయ్యవ్రాసిన కిరాతార్జునీయ యక్షగాన రచనయు, సుగ్రీవ విజయరచనయు ఇంచుమించుగా సమానములే.

25. క్రీడాభిరామమందు ఒక పడతి పల్నాటివీరులను పాడుట క్రిందివిధముగా వర్ణితమైనది
—(పుటలు 36-37- 116-117 ప)

"ద్రుతతాలంబున వీరగుంభితకథుంధుం ధుంకిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళికయతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కత ప్రత్యక్షరముం గుమారపులు ఫీట్కారంబునఁదూలఁగన్."

"గర్జించి యరసి జంఘాకాండయుగళంబు వీరసంబెట కోలవ్రేయునొకఁడు,
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి కుంతాభినయముఁ గైకొనునొకండు,
బిగువుఁగన్నుల నుబ్బుబెదరుఁ జూపులతోడ ఫీట్కారమొనరించుఁ బెలుచనొకడు,
పటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల ధరణియాస్ఫోటించి దాఁటు నొకఁడు,
ఉద్ధిప్రకటింప నొక్కరుండోలవాయు, బయలుగుఱ్ఱంబు భంజిళ్ళఁబఱపు నొకఁడు
కొడుకు దాటింపుచును బెద్దగొలువులోనఁబడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు."

ద్విపదలోనున్న ఈ పలనాటివీరకథ శ్రీనాథవిరచితమో, మరియొక అజ్ఞాతకవి కృతిమో నిశ్చయముగా తెలియదు. ఈ పలనాటివీరకథవంటిదే అర్వాచీనకాలమందలి 'బొబ్బిలికథ' యును. వీనిని నేడు 'బుఱ్ఱకథ'లందురు. నాడీ కథలను స్త్రీలే చెప్పెడివారు. ఆయాభావములకు తగిన కంఠస్వర వైవిధ్యములతో. హావభావాదులను జోడించి వారు గేయమును పాడునప్పుడు కథాపాత్రములు మన కనులయెదుట నిల్చినటు వీరావేశమెత్తింపగలవు. ఈ విషయమే విపులముగా రెండవపద్య మందు వర్ణితమైనది. నేటి బుఱ్ఱకథలను పురుషులే చెప్పుచున్నారు. నేటి వారిలో 'శ్రీనాజర్' సుప్రసిద్ధుడు.

26. 'హరికథ'యనెడి నేటి సాహిత్యప్రక్రియ మహారాష్ట్రదేశమునుండి తెలుగు దేశమునకువచ్చినదని కొందరందరు. కాని, అది సరికాదు. ఇది యక్షగానశాఖయే అని తెలియవలెను. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమందున్న శ్రీదాగేపల్లి అనంతరామాచార్యులు యక్షగానమన్నను, హరికథయన్నను ఒక్కటేయని తలంచినట్లు తెలియుచున్నది. (చూ. "యక్షగానము: హరికథ").

27. "కన్నడ యక్షగానాలు"–భారతి–ఫిబ్రవరి 1956. పుట 67.
—(శ్రీ కె. సుబ్బరామప్ప.)

28. "యక్షగానము : హరికథ"–ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.
—(డా. యస్వీజోగారావు)

## కొరవంజి (కుఱవంజి)

1. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులోని వ్రాతప్రతి—10 వ సం. 486
2. "అఱునిభమధ్య లా క్రియలు నా పరిభాషలు నొప్పఁ జిందు, జ
క్కిణి, కొరవంజి మేళములఁ గేళికసల్పిరి..........."
—(ఋశ్యశృంగునియెదుట వేశ్యలనృత్యము - రామాభ్యుదయము-II-131)

3. తూమాటి దొణప్పగారి "యక్షగానములు : ప్రాచీనాంధ్ర నాటకస్వరూపములు" అనెడి వ్యాసము లోనివి పై అంశములు......
—(Andhra University Colleges Magazine and Chronicle - P. 12)

4. "బెబ్బులి కొదమం జేయిచ్చి పిలిచి కొఱవంజి యొకం డదరక...."
— ఇచ్చట పురుషునకు పేరు.

"చలువుచున్నది ప్రౌఢజాడలఁ గొరవంజి యల తిలోత్తమ నృత్యనిలయసీమ...."
— ఇచ్చట నృత్యమునకు పేరు.

5. "కుంచియదోయిమూఁపులకుఁ గొప్పులకున్నెటి చూపజోఁటిజో
డించు నలంకరింప గుబులైన కిరీటముపెట్టి జక్కిణీ
సంచున కజ్జగంధి జలజాత సుగంధి మణిమయక్రియ
ల్గాంచినఁ బట్టఁబట్టెఁ దెలుకల్నెఱపెం గొరవంజియాటలన్"
—కకుత్స్థ విజయము - III-86.

"ఎఱుకోయెఱుకయటంచుం గొరవంజి నటించెనొక్క గురుకుచ వంకన్
బురుకఁడు బంగరుబుట్టియు సొరిదిం గొల్లాపురమ్మ సుద్దులు వెలయన్."
"తరకట బురకటగాదే తరుణీ నామాట నీకుఁ దార్కాణమగునే
బురుకనికి బువ్వఁ దేవే యెఱు కదగవెయ్యంచు నొక్కయింతి నటించెన్"
— దశావతారచరిత్రము-VII-287-88

"సవరనిపని వన్నెఱవిక పిక్కటిలంగ గులుకు పాలుబ్బ గుబ్బలుచెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింత పొలుపుదెల్పెడు పచ్చబొట్టులెసఁగఁ
గుఱుమాపు పయ్యంటచెఱఁగులో నిడుకొన్న ముద్దుబల్కుల చిన్ని బుడుతఁడమరఁ
దిరతరంబులనుండి తనయింట వెలయు పుత్తడిపైఁడిబుట్టి మస్తమున వెలుఁగ

బొమలసందున నామంబుభూతిపూత నెన్నొసటఁ బుక్కిటవిడెంబు కన్నుఁగొనలఁ
గాటుక రహింప వచ్చి.........." —శుకసప్తతి-I-97.

6. సుగ్రీవవిజయ యక్షగానపీఠిక-పుటలు 4-6.

7. ఈ వాదమును నేలటూరి వేంకటరమణయ్యగారు విమర్శించియున్నారు — ఖర ఉగాది-ఆంధ్ర పత్రిక. వీరివాదము బొమ్మలాటలనుండి యక్షగానముత్పన్నమైనదని; ఇదియును సత్యసమ్మతము కాజాలదు.

8. 'నట్' అనెడి ప్రాకృత ధాతువునకు 'నృత్' అనునది సంస్కృతరూపమని కొందరు తలంచు చుండుటయు, "దాక్షిణాత్యులు బహునృత్త-గీతప్రియులు" అని భరతుడు చెప్పియుండుటయు ఇప్పట్ల స్మరణీయము.

See also "Natya, Nritta and Nritya: Their meaning and relation" -P. 13. by sri K. M. Varma.—Orient Longmans (1957).

9. మళయాళమునందలి 'కొఱత్తియాట్టమ్', అరవమునందలి 'కురువైకూత్తు' అనునవి కొరవంజి నృత్యములే. ఈ 'కురవైకూత్తు' శిలప్పదిగార కాలమునందే ఉన్నట్లు తెలియుచున్నది. ఇది నాడును నృత్యవిశేషము మాత్రమే. 16 వ శతాబ్దికి ముందు కురవైకూత్తు దృశ్యరచనగా లేదా సాహిత్యప్రక్రియగా రూపొందినట్లు చెప్పదగిన ఆధారములు లేవు.

10. "కన్నడ యక్షగానములు" —భారతి-ఫిబ్రవరి; 1956. పు. 68.

11. ఈ వివరణమునుబట్టి చూచినచో "ఆజాతి పాత్రలుకల దృశ్యవిశేషము 'కొరవంజి' యను నేలటూరివారి వాదము పరిమిత సత్యపూరితము" అనెడి దొణప్పగారి వాక్యమునకు ("యక్షగానము: ప్రాచీనాంధ్రనాటకస్వరూపములు"-పు.12)అవకాశములేదని స్పష్టమగుచున్నది.

## పగటివేషములు

1. ఈ సందర్భమున భరతుని వాక్యములు గమనార్హములు:—

"నాట్యము ఆహార్యప్రభావముచేతనే సిద్ధించును. అట్లేకానిచో అల్పపరిచ్ఛదములుగల నటుడు రాజగుణముల నెట్లు నిరూపింపగలడు ? వర్ణకములచే అచ్ఛాదితుడును, భూషణములచే అలంకృతుడును అయిన నటుడు గంభీరమైన ఆహార్యముతో కూడినవాడై రాజువలెనే కన్పట్టును. లోకమంతయును నాట్యధర్మ ప్రవృత్తమై ఇందుండునుకదా. అందుచే ఒకేనటుడు సప్తద్వీపాశ్రయుడును కావచ్చును".

—(నా నాట్యశాస్త్రానువాదము-పుట. 853).

2. "చారిత్రక పరిశోధనలనుబట్టి రాజ కళింగగంగు అనంతవర్మచోడ గంగేయని తెలుచున్నది. అతఁడు క్రీస్తుశకము 1076-77 మొదలు 1147 వఱకు సకలకళింగదేశమును పరిపాలించెను. ఉత్కలమును వేంగిభూమియందలి ఉత్తరభాగమునుగూడ జయించి పాలించినట్లు శాసన ప్రమాణ ములు గలవు." —(నందిరాజు చలపతిరావుగారి 'రాజకళింగగంగు' నాటకమునకు రాళ్ళభండి సుబ్బారావుగారి 'అభిప్రాయము'నుండి). కొందరీకథ కులోత్తుంగచోడుని కుమారుడగు రాజ కళింగ గంగును గూర్చినదని భావించుచున్నారు.

3. వీరనరసింహరాయలయెదుట కూచిపూడి మేళమువారు ప్రదర్శించిన 'సంబెట గురవరాజు' ఘట్టమును ఇంచుమించుగా ఇట్టిదే. షేక్స్పియరు నాటకము 'హేమ్లెట్'లోను ఇట్టి ఘట్టమొకటికలదు.

4. "గడ్డిపాడు భాగవతులు"—'నటన' - ఆగస్టు 1948, సెప్టెంబరు 1948 సంచికలను చూడవలెను.

5. డుబుడక్కి (బుడబుక్కల)వారు అయ్యలరాజు నారాయణకవి 'హంసవింశతి'లో వర్ణింపబడెను. (II-28).

6. దశావతారచరిత్రలోని ఒక వర్ణననుబట్టి స్త్రీలుకూడ అర్ధనారీశ్వరవేషమును ధరించినట్లు ఊహించుట కవకాశముకలదు—

"ఇంతియొక్కతె అర్ధనారీశవేషమూని సాక్షాత్కరించిన మౌనిజనులు
భ్రమసి సద్భక్తి "జయజయ పార్వతీశ" యనుచుమ్రొక్కిరి నృపులు గన్గొనుచు నగఁగ".
—VIII - 289.

7. కూచిపూడివారిలో వేదాంతం మల్లికార్జునుడు, సత్యనారాయణ, సాంబయ్యగార్లును, చింతా శివరామయ్య, మహంకాళి పెదసత్యనారాయణ ప్రభృతులును పగటివేషములందు ప్రసిద్ధిగడించియున్నారు.

## గారడీ : విప్రవినోదము

1. "భువిభ్రమిత్వాఽనవలంబ మంబరే విహర్తుమభ్యాసపరంపరాపరా ।
అహో : మహావంశమమూం సమాశ్రితా సకౌతుకం నృత్యతి కీర్తిన ర్తకీ ॥
—నైషధము - XII-16 శ్లో.

2. "సంతసెన్నఁడో జవ్వనమమ్ముకొన్న గడసాని నసుంగవయఁదలంచితే"
అని ఊర్వశి నరకునితో అనును—ఉ.హరి-I-74.

3. శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు "విదేశయాత్రికులు : ప్రాచీనాంధ్రదేశము"
—పుటలు 191 – 192.

4. దీనినే ఆంగ్లమున 'Rope trick' అందురు. ఇందలి రహస్యము పాశ్చాత్యుల కింకను పట్టువడలేదు.

5. క్రింది పద్యములలో ఇంద్రజాలవిద్య భంగ్యంతరముగా వర్ణితమగుట గమనార్హము.—
"సురలన్మర్త్యసమంబుగా, మనుజులన్ శోభిల్ల బృందారకో
త్కరభూమంగా, ఘనునల్పు, నల్పుని ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్జేయుచు నీ మహామహిమ ప్రీతిం బద్మజాండంబులం
దరయన్ జీవుల నింద్రజాలముగా నాడించు సర్వేశ్వరా !"
—యథావాక్కుల అన్నమయ్య "సర్వేశ్వరశతకము"-12 వ పద్యము.

6. Vol. II-Chap. VI-Pp. 200-209.

7. చూ. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారి "కొండవీటిసామ్రాజ్యము" (1935)-పుటలు 23-24. జైనులకును బ్రాహ్మణులకును వచ్చిన వివాదములో సూర్యదత్త వరప్రసాదియైన బాలకుడొకడు బ్రాహ్మణులకు సహాయపడి జ్యోతిషవిద్యలో జైనులనోడించెను. అతడే విప్రవినోదులకు మూలపురుషుడట !

8. చూ. Epigraphical Reports-402 of 1920; 403 of 1920; 97 of 1912 etc.
1556-57 ప్రాంతములనాటి ఒకశాసనములో (E.R. 586 of 1912) వివిధ శాఖలకును, సూత్రములకును చెందిన విప్రవినోదులు కొందరు "చౌలూరు" గ్రామవాసులకు పన్నులుమాఫీచేసి నట్లు చెప్పబడినది.

9. గుంటుపల్లి ముత్తరాజు అన్నదానమునుగూర్చి చెప్పిన చాటువుఒకటి విప్రవినోదుల గారడీని భంగ్యంతరముగా సూచించుచున్నది—

"సంతతమారగించునెడ సజ్జనకోటులఁ బూజనేయు శ్రీ
మంతుఁడు గుంటుపల్లికులమంత్రి శిఖామణి ముత్తమంత్రి దొ
బంతియె బంతిగాక కడుపంద గులాముల బంతులెల్ల నూ
ల్బంతులు, దుక్కిటెద్ల మెడబంతులు, విప్రవినోదిగారడీ
బంతులు, దొంగవాండ్ర మెడబంతులుసుమ్ము ధరాతలంబునన్."

—చాటుపద్య మణిమంజరి-పుట. 107.

## బహురూపము

1. శృంగారకావ్య గ్రంథమండలివారు ప్రకటించిన "హంసవింశతి" (1938) లో 'నృత్తంబు' అని యున్నది. సందర్భమునుబట్టి అది నృత్యమే; నృత్తముకాదు.

2. 'నృత్తరత్నావళి' వ్రాతప్రతినుండి యెత్తివ్రాసిన భాగమిది. పాఠముసరిగాలేదు. డా. వి. రాఘవన్ 1956 ప్రాంతముల సంపాదించిన విపుల పీఠికాసహిత సంస్కృతమూలము ఇంకను వెలుగు చూడలేదు. 1959 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటకఅకాడమీవారు తలపెట్టిన ఆంధ్రానువాదము కూడ అదేస్థితిలో ఉన్నది.

3. ఇచ్చట ఒకవిషయమును పరిశీలింపవలసియున్నది. బహురూపాభినయ పరిణామమే 'పగటివేషములు' అగునా? బహురూపాభినయమందప్పటి కప్పుడు వివిధవేషములను ధరించుట జరుగు చుండగా పగటివేషములందు సాధారణముగా రోజుకొకవేషము ధరించుట జరుగును.

## సాంగ నాటకములు

1. "కన్నడ యక్షగాన" నాటకప్రదర్శనములయందలి పూర్వరంగ నిర్వహణమునుగూర్చి ముట్నూరి సంగమేశంగారు చేసిన వివరణమును పరిశీలించినచో 'సాంగ' పదమున కర్థము విస్పష్టము కాగలదు. —(చూ. "కన్నడ యక్షగానాలు" - పుటలు 70-71 - భారతి - ఫిబ్రవరి, 1956). వారు కన్నడ యక్షగాన నాటకవిషయమున పేర్కొనిన క్రియాకలాపమంతయును తెలుగు నాటకములకును ప్రత్యక్షరము అన్వయించును. అంతియేకాక నటుల వాచికాభినయము, నృత్య-గీతములు తెలుగు నాటకములందే అధికము.

2. "అష్టాదశజాతి ప్రభూతంబులై శుద్ధ-భిన్న-గౌళ-దేసరి-సాదారి-తోపరాగసంజ్ఞలఁ బ్రసిద్ధంబులైన శుద్ధరాగంబులు (మొత్తము ఆరుభేదములు) ముప్పదియాఱును. రాగాంగంబు లిరువదియును. భాషాంగంబులు నలుపదియేడును, సుపాంగంబులు ముప్పదియొక్కటియును. క్రియాంగంబులు మూఁడును గాఁబడి తెలుంగుల నూటముప్పదియేడగు రాగంబులు మేళావిభాగంబుతో నాలాపంబు సేసి"— భైరవకవి "శ్రీరంగమహత్త్వము". ఇందు రాగాంగ-భాషాంగ-ఉపాంగ-క్రియాంగములు దేశ్యరాగభేదములు.తనమేళకర్త రాగములోని స్వరములనేకలిగియుండి, వానితోపాటు ఒకటిరెండు

అన్యస్వరములనుకూడ కలిగియుండురాగము 'భాషాంగరాగ' మనబడును— బిలహరి, కాంభోజి, భైరవి మొ॥. ఇంద్రియములకు ఉత్సాహమును కలిగించునట్లుగా ప్రయుక్తమగు రాగము క్రియాంగ రాగము.

3. హరునియొక్కయు, హరభక్తులయొక్కయు కథలుమాత్రమే నాటకములుగా నాడబడుచున్నట్లు సోమనాథుడు పేర్కొనెను. ఆంధ్రులు ప్రాచీనతమకాలమునుండియు శివోపాసకులగుటచేత వారి నృత్య-నాటకములు ప్రాచీనతమకాలమునుండియు శివపరములుగానే వెలసియుండవచ్చును.

4. విజయరాఘవుని కాలములో యక్షగానమునకు 'నాటక'మనెడి పేరు స్థిరపడినది. అప్పుడందు దరువులకు తాళప్రాధాన్యముతగ్గి రాగప్రాధాన్యము వచ్చినది; మధుర కవితారీతులుతగ్గి క్షేత్రయ పదములవంటివి హెచ్చినవి; గద్యమునకు ప్రాధాన్యము హెచ్చినది; సంధివచనములుతగ్గి సంభాషణము లధికమైనవి. శహాజీ కాలములో ఈ యక్షగాననాటకములు మార్గనాటక ప్రభావమునకులోనై అంకవిభాగాదులనుకూడ సంతరించుకొన్నవి.

## భారతీయభాషలు : ఆధునిక నాటకారంభము

1. సంక్షిప్తవివరములకు క్రింది ప్రచురణములను చూడవలెను.
   (1) "Indian Drama" (November, 1956.) Publications Division, Government of India.
   (2) "Indian Literature" (Vol. I, No. 2 - April - Sept, 1958) — Sahitya Akademi, New Delhi.

ఇంకను వివరములకు ఆయా భాషల నాటకములపై వెలసిన ప్రత్యేక రచనలను పరిశీలింపవలెను.

2. ఆంధ్రుడైన నారాయణతీర్థులు రచించిన 'కృష్ణలీలాతరంగిణి'నికూడ ఇట్లే ప్రదర్శింపవచ్చును. ఇదియును నాటి భామాకలాపాదుల పద్ధతికి సంస్కృతీకరణమనియే చెప్పవచ్చును.

3. ఈ జాత్రలు, రాసలీలా మహోత్సవములవంటివే. విజయనగరములో సంస్థానాధిపతుల పోషణలో "రామలీలా మహోత్సవములు" తొమ్మిదిరోజులు జరిగెడివి. తొమ్మిదిరోజులలోను, తొమ్మిది రామాయణ ఘట్టములను ప్రదర్శించెడివారట. ఇది సంఘమున కంతటికిని సంబంధించిన ఉత్సవము (Community festival). ఆ సమయములో విజయనగరము రామాయణకాలమునాటి భరతవర్షముగా మారిపోయెడిది. నేటి సంస్కృత పాఠశాలకెదురుగానున్న పెద్దమైదానము 'అయోధ్యాపట్టణము'. ఊరికి తూర్పుగానున్న ప్రదేశము 'లంకాపట్టణము'. ఇంక రాజావారి పూలతోట 'మిథిలానగరము'. 9 వ రోజున అయోధ్యాపట్టణమునుండి లంకాపట్టణమునకు దాడి వెడలెడివారు. మహారాజావారుకూడ ఈ ఊరేగింపుతో లంకాపట్టణమునకు వెళ్ళెడివారట. అచ్చట రామ-రావణ సైనికులకు (వారు తత్తదుచిత వేషములతో నుందురు) యుద్ధము, రావణ సంహారము జరిగెడివి. చిన్ని వరహాలు అనెడి కోమటి రావణవేషమును ధరించెడివాడనియు, ఆతని ఆహార్యము నేటికిని విజయనగరములో కలదనియు తెలియుచున్నది.

✻

ఈ ద్వితీయభాగమందు ఆఱు అధ్యాయము లున్నవి.

మొదటి అధ్యాయము—'ఆధునికనాటకారంభము' అనునది—ఆధునికాంధ్రనాటక రచనారంభ-ప్రదర్శనారంభములను (క్రీ. శ. 1860-1880; 1880-1886) వివరించుచున్నది. ఇందు ఆధునికకాలమందలి ప్రథమాంధ్ర నాటకకర్తల, తద్రచనల ప్రశంస చేయబడినది.

రెండవ అధ్యాయము—'ఆధునిక నాటక వికాసము' అనునది—ఆధునికకాలమున తెలుగునాటకరచన బహుముఖములుగా వికసించుటను వివరించుచున్నది (క్రీ. శ. 1886-1900).

మూడవ అధ్యాయము—'రచనాప్రయోగములవిస్తృతి' అనునది—అంతకుముందేర్పడిన మార్గములలో నాటకములు బహుళముగా వెలయుటను వివరించుచున్నది (క్రీ. శ. 1900-1920).

నాలుగవ అధ్యాయము—'నూతనప్రయోగములు : నాటకములు' అనునది—నూత్నభావప్రేరితులైన రచయితలు వివిధ దృక్పథములతో నాటక రచన చేయుటను వివరించుచున్నది (క్రీ. శ. 1920-1944).

ఐదవ అధ్యాయము—'నూతనప్రయోగములు : నాటికలు' అనునది—నూత్నభావప్రేరితులైన రచయితలు వివిధ దృక్పథములతో నాటికలను, ప్రహసనములను, ఏకాంకికలను రచించుటను వివరించుచున్నది (క్రీ. శ. 1920-1944).

ఇంక ఆఱవ అధ్యాయము—'సమకాలీనరచనలు' అనునది—క్రీ. శ. 1944 తరువాతి రూపకచరిత్రను దిఙ్మాత్రముగా వివరించుచున్నది.

ఈ ద్వితీయభాగము ఈ పరిశోధనావ్యాసమునకు హృదయస్థానము.

✻

ప్రథమాధ్యాయము

# ఆధునిక నాటకారంభము

## భూమిక

క్రీ. శ. 1857 లో బొంబాయి, కలకత్తా, మద్రాసు మహానగరములలో భారతదేశమునందలి మూడు ప్రధానవిశ్వవిద్యాలయములకు అంకురార్పణము జరుగుటతో ఆంగ్లవిద్యావ్యాప్తి శీఘ్రగతిని పురోగమించినది. తెలుగుజిల్లాలలో కూడ ఆంగ్లవిద్యావ్యామోహ మధికమయ్యెను. అవకాశమున్న వారెల్ల ఆంగ్లభాషాపాండిత్యసంపాదనమునకు యత్నింపసాగిరి. కేవలము దేశభాషలలోనే పండితులైనవారు కూడ ఆంగ్లభాషా ప్రభావమునకు లోనుకాసాగిరి. ఒకప్రక్క తమలో జీర్ణించుకొనిపోయిన సంస్కృతవిద్యాసంస్కారము, ఇంకొకప్రక్క చెలియలికట్ట త్రెంచుకొన్న సముద్రమువలె దేశమునంతటిని స్వీయప్రభావమున ముంచివేయుచున్న ఆంగ్లవిద్యా ప్రభావము—ఈ రెండింటి సంఘర్షణముతో, లేదా సమ్మేళనముతో వారిలో క్రొత్తయూహలు బయలుదేరెను. అట్టివారిలో శ్రీయుతులు కోరాడ రామచంద్రశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం పంతులు, పరవస్తు వేంకటరంగాచార్యులు అనువారలు—తెలుగునాటకసాహిత్యవిషయమున—ప్రథములు. ఈ ముగ్గురును సంస్కృతరూపకాంధ్రీకరణమునకు దొరకొనినారు; ముగ్గురిలో శాస్త్రిగారు ప్రప్రథమమున స్వతంత్రరూపక నిర్మాణమునకు కూడ పూనుకొనినారు.

శాస్త్రిగారి స్వతంత్రరూపకము–'మంజరీమధుకరీయము' అనెడినాటిక–ఆధునికకాలమున తొలితెలుగు రూపకమనిచెప్పవచ్చును. ఇది 1860 ప్రాంతముల రచింపబడినట్లు తెలియుచున్నది. (కాని దీని ముద్రణముమాత్రము చాల ఆలస్యముగా జరిగినది). పిమ్మట 1871 లో పంతులుగారు 'నరకాసుర విజయవ్యాయోగము'ను ఆంధ్రీకరించిరి; ఇది1872 లోనే ముద్రింపబడినది. లభ్యమైన తొలి సంస్కృతరూపకాంధ్రీకరణమిదియే. తరువాత ఆచార్యులుగారు 1872 ప్రాంతముల 'అభిజ్ఞాన శాకుంతలము' నాంధ్రీకరించిరి.

క్రీ. శ. 1875 లో రామచంద్రశాస్త్రిగారి శిష్యులు వావిలాలవాసుదేవశాస్త్రిగారనెడి పట్టభద్రులు సుప్రసిద్ధ ఆంగ్లరూపకకర్తయగు షేక్స్పియర్ యొక్క 'జూలియస్‌సీజర్' ను 'సీజరు చరిత్రము' అనుపేర ఆంధ్రీకరించిరి; ఇదియును వెనువెంటనే ముద్రింపబడినది. వాసుదేవశాస్త్రిగారు ఆంగ్లరూపకము నాంధ్రీకరించిన ప్రథములేకాక ప్రథమస్వతంత్ర సాంఘికరూపక కర్తలు కూడను; వీరి ఈ సాంఘికరూపము–'నందకరాజ్యము'–1880 లో ముద్రింపబడినది,

ఇట్లు, ఆధునిక నాటకరచన క్రీ. శ. 1860 ప్రాంతముల ప్రారంభమైనను, పైనలుగురి రచనలలో ఏయొక్కటియును ప్రదర్శింపబడలేదు. కాగా, పైనలుగురు రచయితలును తెలుగు నాటకచరిత్రలో ప్రథమదశలోని రూపకరచనారంభస్థితికి చెందినవారగుచున్నారు.

ఇంక ప్రథమదశలోని రూపకప్రదర్శనారంభ స్థితికిచెందినవారిలో ధార్వాడనాటకసమాజ ప్రదర్శనములచే ప్రభావితులైన కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రథములగుచున్నారు. క్రీ. శ. 1880 ప్రాంతముల వీరొక విద్యార్థినాటకసమాజమునుస్థాపించి, వారిచే స్వీయరచనలను ప్రదర్శింపజేసినారు. ఆధునిక నాటకప్రదర్శనము లారంభమగుటతో తెలుగుదేశమున క్రొత్త చైతన్యము వెల్లివిరిసినది. ముఖ్యపట్టణములందెల్ల నాటకసమాజములు వెలసినవి. వానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి_గుంటూరు 'హిందూనాటకసమాజము', బందరు 'హిందూనేషనల్ థియాట్రికల్‌సొసైటీ', రాజమండ్రి 'నాటకోజ్జీవకసమాజము' మొదలగునవి. ఇవియన్నియును ఔత్సాహికనాటకసమాజములేయగుట-గమనార్హము.

ఇంతవరకును__అనగా క్రీ.శ. 1860 నుండి 1886 వరకును_తెలుగునాటక సాహిత్య చరిత్రలో ఆరంభదశ. అటుపిమ్మట 'వికాసదశ'(1886 నుండి 1900 వరకును). ఈ కాలమున ప్రాచ్య-పాశ్చాత్య రీతులసమ్మేళనముతో స్వతంత్రనాటక నిర్మాణ ప్రయత్నములు విరివిగా సాగినవి. మద్రాసు విశ్వవిద్యాలయమువారి పుణ్యమాయని దక్షిణదేశమున పాశ్చాత్యరూపక సాహిత్యవిజ్ఞానమున కంతటికిని షేక్స్పియర్ రూపకములే మూలకందములైనవి. తదను సారముగా ఆహ్లాద-విషాదరూపకములు పెక్కులు బయలుదేరినవి.

క్రీ. శ. 1900 నుండి తెలుగునాటక చరిత్రలో మూడవదశ ఆరంభమగుచున్నది. నాటి నుండి ఇంచుమించుగా 1920 వరకును తెలుగునాటకరచన సంప్రదాయపద్ధతిలో_అనగా అంతకు ముందేయేర్పడిన మార్గములలో_విరివిగా జరిగిపోయినదశ. ఈ కాలమునందలి విశేషమువృత్తి నాటకసమాజములు వెలయుట. అందలినటులను, ప్రదర్శనసౌలభ్యమును దృష్టియందుంచుకొని నాటకరచన విరివిగాసాగుట మరియొక విశేషము. ఇంకొకవిశేషము చారిత్రకనాటక వికాసము.

క్రీ. శ. 1920 నుండి 1944 వరకును గల కాలములో స్వాతంత్ర్య సమరోజ్జృంభణ ముతో దేశమల్లకల్లోలముగా నుండెను. ప్రారంభమున జాతీయభావపూరితములైన రూపకములు వెలసినవి. అటుపిమ్మట సంఘసంస్కరణోద్దేశముతో సాంఘికవ్యసనములపై నాటకములు వెలసినవి. కొందరు గ్రామీణజీవితమును చిత్రింపసాగిరి. మరికొందరు ప్రాతయన్నదానినెల్ల యెదిరింపసాగిరి. ఇంతలో పాశ్చాత్యదేశములందు, రూపకనిర్మాణశిల్పమున విప్లవముతెచ్చిన ఇబ్సెన్ ప్రభృతుల ప్రభావముకూడ సోకినది. కాగా తెలుగునాటకకర్తలొక్కొక్క రొక్కొక్క క్రొత్తపోకడను ప్రవేశపెట్టి ప్రసిద్ధులైరి. ఏకాంకికారచనారంభము ఈ దశయందలి మరియొక విశేషము.

క్రీ. శ. 1944 నుండి తరువాతి కాలము ఐదవదశ. దీనిని ఔత్సాహికనాటకయుగ మనవచ్చును. ఈకాలమున నాటికా నాటకపుపోటీలు బహుళవ్యాప్తినందుట ముఖ్యవిశేషము.

తత్ఫలముగా యువరచయిత లెందరో ప్రసిద్ధికివచ్చిరి. ఏకాంకికారచన, రేడియోరూపకరచన బహుళప్రచారమునందిన కాలమిది.

కాగా తెలుగు నాటకచరిత్రలో ఐదు ప్రధానదశలు గోచరించుచుండుట స్పష్టము.

## శ్రీకోరాడ రామచంద్రశాస్త్రి [1]

తొలి తెలుగురూపక కర్త:

ఆధునికకాలములోని తొలి తెలుగురూపకకర్తలను గూర్చి శ్రీవావిలాలవాసుదేవశాస్త్రి క్రిందివిధముగా పేర్కొనియున్నారు ('ఉత్తర రామచరిత' ఆంధ్రీకరణమునకు ఆంగ్లపీఠిక— తేదీ 9-11-1883)—

"..............It was, however, very unfortunate that Telugu language had, till very recently, laid no pretensions to the possession of Dramatic Literature........But, when, after what may be termed the Revival of Telugu Literature has set in, it has struck my Guru, Brahmsri Korada Ramachandra Sastri Garu of Masulipatam how sadly defective our native tongue was in dramatic works—not to speak of the consequent absence of facilities to elevate the moral tone of the masses,–that great Pandit translated Venisamhara of Bhattanarayana, whose Telugu has, some how, not yet passed through the press. Mr. Kokkonda Venkata Ratnam pantulu, residing in Madras, followed in the wake and published his version of the Narakasura vijaya vyayoga of Dharmabhatta. Then Sriman Paravastu Venkata Ranga charyar Averghal of Vizagapatam, commenced translating the well-known Sakuntala......Afterwards, my friend, Mr. Kandukuri Veeresalingam....has taken up the same play.... The same author has also translated, Dhavaka's (or Sriharsha's) Ratnavali and Shakespear's Comedy of Errors and, partly, Merchant of Venice, as well. Mr. Guruzada Sriramamoorti pantulu of Peddapoor Advita Samaj, has also published the first two acts of the Merchant of Venice and also the first Act of a new play.. ...I was the first to translate English plays, and my Julius Caesar, I am glad, has been favourably noticed....I have, subsequently, given to the Telugu public an original Drama in 5 acts, styled, the reign of king Nandaka, very instructive and, at the same time, written in the easy and idiomatic Telugu of our Northern Circars........"

వాసుదేవశాస్త్రిగారి వాక్యములనుబట్టి ఆధునికాంధ్రరూపకరచనకు నాందీపూజ చేసినవారు శ్రీ కోరాడ రామచంద్రకవి యని స్పష్టమగుచున్నది. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి నరకాసురవిజయవ్యాయోగాంధ్రీకరణము క్రీ. శ. 1871 లో ఆరంభమై, 1872 లో ప్రకటిత

మైనది. కాగా కవిగారి వేణీసంహారాంధ్రీకరణము క్రీ. శ. 1872 కు పూర్వమే జరిగినదన్న మాట. కాని, ఇది ప్రకటితముకాలేదు, అంతియేకాదు, వ్రాతప్రతియును లభ్యముకాలేదు. కవిగారు మొత్తము 31 గ్రంథములను రచించిరి. కాని, అందులో ముద్రితములైనవి చాల తక్కువ. వాని ముద్రణమైనను చాల ఆలస్యముగా జరిగినది[2]. ముద్రితములైనవానిలో 'మంజరీమధుకరీయ' మనెడి నాటికకలదు. ఇది తెలుగులో రచింపబడిన స్వతంత్ర రూపకము. "దృశ్య శ్రవ్యకథామయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబుల సవిశేషవిశేషసుషమంబులయి మహాకవులచేఁ ద్రిలింగభాషయందు గ్రంథితంబులుగ, దృశ్యంబులగునవి తాదృశంబులుగామికింజింతించి, తద్గ్రథననిషేధకారణంబుఁ గానక...' అనుచు కవిగారు మంజరీమధుకరీయ ప్రస్తావనలో చెప్పుకొనుటనుబట్టి మంజరీమధుకరీయమే తెలుగులో వారి తొలిరూపకమనియు, కాగా ఇది వేణీసంహారాంధ్రీకరణముకంటె ముందరి రచన యనియు తెలియుచున్నది; ఈ మంజరీమధుకరీయము క్రీ. శ. 1860 ప్రాంతముల రచింపబడియుండునని 'ఘనవృత్త' పీఠికలో (క్రీ. శ. 1917 లో) సుప్రసిద్ధ పరిశోధకులును, కవిగారి మనుమలును అయిన శ్రీ కోరాడ రామకృష్ణయ్య వ్రాసియున్నారు. దీనినిబట్టి ఆధునికకాలమున తొలి తెలుగు రూపకము మంజరీమధుకరీయమే అగుచున్నది[3].

## తొలి తెలుగు రూపకము

### మంజరీమధుకరీయము :

ఇది నాలుగు అంకముల నాటిక. మధుకరుడనెడు రాజపరమేశ్వరుడు, మంజరియను రాజకన్యను వివాహము చేసికొనుట ఇందలి ప్రధానకథ. చండయోగిని యనెడు క్షుద్రమంత్రోపాసకురాలివలన మంజరి కష్టములపాలయ్యెను. కథాంతమున మధుకరుని పట్టమహిషి వారి వివాహమును వ్యతిరేకించినను, మంజరి తన పినతల్లి కుమార్తెయని తెలిసినప్పుడు, పశ్చాత్తప్తయై రాజును క్షమాభిక్షవేడి, మంజరికి దేవీపదమిచ్చి, తాను 'భట్టిని' అగుటకు సమ్మతించెను. ఇందలి నాయికా_నాయకులు మంజరీమధుకరులగుటచేత దీనికి 'మంజరీమధుకరీయ'మను పేరు పెట్టిరి. మంజరీ_మధుకరుల తొలివలపు కలలలో రతిసౌఖ్యమమభవించుటతో ఆరంభమగుట ఇందలి కల్పనలలోని ఒక విశేషము. అచ్చటచ్చట కొన్ని కల్పనలను విడిచినచో, మొత్తముమీద కథయంతయును సంస్కృత నాటికాసామాన్యమైనదే. ఇందు భవభూతి మాలతీమాధవపు పోలికలుకూడ కొన్ని కన్పట్టగలవు. అయినను ఇందలి కథ అపూర్వమును, స్వకపోలకల్పితమును అగుచున్నది.

ఇందలి సంభాషణలు సాధారణముగా సరళముగానే సాగినవి[4]. కాని, అచ్చటచ్చట కొన్ని సంభాషణలును, ముఖ్యముగా కొన్ని వర్ణనలును జటిల_దీర్ఘసమాసభూయిష్ఠములుగా కూడ నున్నవి, సంభాషణలు కొన్నిచోట్ల ప్రబంధధోరణిలో వర్ణనాత్మకముగనుండును. దృశ్యకావ్యమునందిది లోపమే అయినను విసుగు కల్గింపకుండ కవిగారు జాగ్రత్తపడినారని చెప్పవచ్చును. అంకమంతయును ఒకే రంగముగానుండుటయు, అందు స్థల, కాలైక్యములు

పాటింపబడుటయు సంస్కృతరూపకసంప్రదాయము. కవిగారుకూడ ఆ పద్ధతినే అవలంబించినట్లు కన్పట్టినను, ఇందు ప్రధానముగా రెండులోపములు కన్పట్టుచున్నవి—1. మొదటి అంకము 12 పుటలలో నుండగా, తుది అంకము 125 పుటలున్నది (రెండు, మూడు అంకములు చెరి నలువదియైదు పుటలలో నున్నవి), కాగా, అంకవిభజనముకాని, ఇతివృత్త విభజనముకాని సరిగా జరుగలేదనుట స్పష్టము. 2. పేరుపెట్టి రంగ విభజనము చేయకపోయినను రెండవ అంకమందు 4 రంగములును, నాలుగవ అంకమందు ఇంచుమించుగా 8 రంగములును కలవు. ఈ రంగముల స్థల-కాలములు భిన్నములగుటచేత వీని ప్రదర్శనము కష్టసాధ్యము కాగలదు. రంగస్థలమునందు భోజనాదులను లక్షణకర్తలు నిషేధించియున్నారు. కాని ఇందులో విదూషకుడు రంగముమీద ఫలహారము తృప్తికరముగాచేసి, గఱ్ఱున త్రేన్చినాడు. ఇట్టి లక్షణోల్లంఘనములుకూడ అచ్చటచ్చట అల్పముగా కలవు.

కథాకథనమందు కవిగారు రెండు చక్కనిపద్ధతులను అవలంబించుట గమనార్హము— 1. ప్రేక్షకుల కుతూహలమును రేకెత్తించుటకు గోప్యార్థగోపనముచేయుచు, సరియైన సమయములోనే అసలువిషయమును వ్యక్తముచేయుచుండుట- ఆయనసపుత్రెట్టె మాయమగుట, మంజరీ-మధుకరుల విరహకారణములు, దేవి ప్రయత్నములు మొదలగునవి పెక్కులు ఇందులకు ఉదాహరణములు. 2. స్పష్టతకొరకును, ముఖ్యవిషయము లేదా క్లిష్టకల్పనము ప్రేక్షకుల దృష్టినుండి తప్పిపోకుండుటకును ఒకే విషయమును రెండుమూడుసార్లు చెప్పించుట; అట్లు చెప్పినను విసుగు కలుగకుండచేయుట. చెప్పినదానినే మరల చెప్పుటను సాధారణముగా మనవారంగీకరింపరు. కాని కొందరు పాశ్చాత్యులంగీకరింతురు. తక్కిన కావ్యములమాట యెట్లున్నను రూపకము ప్రదర్శనప్రధానమగుటచేతను, ఒకసారి ఒక దృశ్యము అయిపోయినచో పునరావలోకనమునకుకాని, జరిగినదానినిగూర్చి పునరాలోచన చేయుటకుకాని అవకాశము ఉండదు. అట్టియెడ స్పష్టత కొరకు, శిల్పసమ్మతముగా, జరిగిన ముఖ్యవిషయములను మరియొకమారు చెప్పుట ఆవశ్యకమే. పాశ్చాత్యసాహిత్యప్రభావము ఏమాత్రమును కన్పట్టని రామచంద్ర కవిగారి రచనపై యభిప్రాయముతో సంవదించుట చిత్రము!

సంస్కృతరూపకములందు తత్తత్పాత్రవిశేషములకు ప్రాకృతభాష రూపకానుశాసనవిహితమై యున్నది. మరి, తెలుగులో ఏపద్ధతిని అనుసరింపవలెనను సందేహము కవిగారికి కలిగినది. కాని—1, వసంతతిలక-వల్లీవల్లవోల్లాస-శృంగారరంగాది భాణంబులు రూపకవిశేషంబులయ్యును ప్రాకృతమిశ్రమంబులుకాక ననిమిషభాషయందు సవిశేషంబుగ చూపట్టుచున్నవి; 2. మిశ్రంబులయందు గ్రథితంబగు ప్రాకృతంబును ఛాయవీడి సకలజనంబుల కానందవిధాయకంబు గానేరమి సంభవించుచున్నది; 3. ఆ మిశ్రమరూపకంబులయందును ఒక్కొక్క చక్కిం బ్రాకృతవ్యవహారయోగ్యంబు లయిన పాత్రంబులును సంస్కృతంబాశ్రయించి వచించుట కలదు. "అందుచే ప్రాకృతభాషలేమి అత్యంతనిషేధాపాదకంబుకాదని తలంచి సంచితోత్సాహుండై సంస్కృతాంధ్ర మిశ్రంబుగా ప్రాచీనానుశాసనోక్త లక్షణలక్షితంబగునటుల" తమ రూపకమును కవిగారు రచించియున్నారు. 'ప్రాకృతభాషలేమి'

అనుటలో కవిగారు తెలుగుభాషకు సంబంధించి వ్యావహారికము నుద్దేశించి చెప్పియున్నారని తలంచుచున్నాను. ఇంక 'సంస్కృతాంధ్రమిశ్రంబుగా' అన్నప్పుడు సంస్కృతమనగా తత్సమ మనియు, ఆంధ్రమనగా తద్భవ-దేశ్యములనియు గ్రహింపవలసియున్నది. సాధారణముగా ఇందలి ఉత్తమపాత్రలు తత్సమబహుళమగు భాషను, స్త్రీ-నీచపాత్రలు తద్భవ-దేశ్యబహుళ మగు భాషను అవలంబించి మాటలాడుట గమనింపదగును. కుంభస్తని యనియెడి దాసిమాటలు వ్యవహారభాషకు సన్నిహితములుగాకూడ నున్నవి.

మొత్తమునకు మంజరీమధుకరీయము ప్రస్తుతపు రంగవ్యవస్థలనుబట్టి ప్రదర్శనయోగ్య మైన రూపకముకాదు. ఇది శ్రవ్యరూపకము (closet drama) మాత్రమే. ప్రాచీన సంప్ర దాయముల ననుసరించి, స్వీయపాండిత్యప్రకర్షయే ముఖ్యముగా కవు లందరును తలచుచుండిన కాలమందలి రచన ఇది. దీనిని ప్రదర్శనయోగ్యమును చేయవలెనన్నచో సంక్షిప్తమొనర్చి, పెక్కులుమార్పులు చేయవలసియుండును. ఇదియే తెలుగులో తొలిమార్గరూపకమగుటచేతను, మార్గదర్శకము కాదగిన తెలుగురూపక మింకొకటి లేకపోవుటచేతను, ఈ రచన ఇట్లు సాగిన దని తలంపవచ్చును.

**ఇతరరూపకములు :**

కవిగారు అనువదించిన 'ఉన్మత్తరాఘవ'ముకూడ ముద్రితమైనది. శాపవశమున లేడిగా మారిపోయిన సీతనుగూర్చి రాముడున్మత్తుడై విలపించుట ఇందలి ఇతివృత్తము (ఇది ప్రేక్షణకమనెడి ఉపరూపకవిశేషమట. కాని లాక్షణికులు చెప్పిన లక్షములు దీనికి పట్టుటలేదు). కవిగారి ఉన్మత్తరాఘవాంధ్రీకరణము సరళముగా సాగినది.

కవిగారు తమ 23 వ ఏటనే (క్రీ. శ. 1839 ప్రాంతముల) 'శృంగారసుధార్ణవ' మనెడి భాణమును సంస్కృతమున రచించినట్లు గ్రంథస్థాధారమునుబట్టి తెలియుచున్నది. మార్గ పద్ధతిలో తొలితెలుగు స్వతంత్రరూపకమును రచించిన కవిగారు సంస్కృత రూపకకర్తయును అగుట ముదావహము. "ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా" అను నిశ్చయమున 19 వ శతాబ్దిలో సంస్కృతాంధ్రగ్రంథములను రచించి, క్రొత్తమార్గము తీసిన పండితకవి రామచంద్రశాస్త్రి" అని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి వీరిని ప్రశంసించియున్నారు (ఆంధ్రరచయితలు - పుట-16). కవిగారి క్రొత్తమార్గము, రాజమార్గమై ఘనతకెక్కుట ఆంధ్రుల అదృష్టము.

## శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు

వావిలాల వాసుదేవశాస్త్రిగారి వాక్యములనుబట్టి 'నరకాసుర విజయ వ్యాయోగము' రెండవ సంస్కృత రూపకాంధ్రీకరణమగుచున్నను, లభ్యమైన వానిలో ఇదియే ప్రథమ సంస్కృతరూపకాంధ్రీకరణమగుచున్నది. ఈ కృతికర్తయగు శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు భక్తుడుగా, సంగీతజ్ఞుడుగా, కవిగా, నాటకరచయితగా, పత్రికా సంపాదకుడుగా,

విమర్శకుడుగా, ఉపాధ్యాయుడుగా ఘనతకెక్కిన ఒక మహావ్యక్తి. 'మహామహోపాధ్యాయ' బిరుదమునందిన ఆధునికాంధ్రులలో వీరు రెండవవారు[2]. సభలోని పండితులతో, తరగతిలోని విద్యార్థులతో, ఇంటిలోని భార్యతో, వీథిలోని బిచ్చగానితో—అందరితోను ఒకేరకముగా గ్రాంథికభాషలోనే మాటాడిన వీరగ్రాంథికవాది పంతులుగారు[3]. సమకాలీన పండితుల విమర్శలకు పంతులుగారు గురి అయినంతగా ఏకాలమునందును ఇంకొకరు గురికాలేదని చెప్పవచ్చును. శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, అముద్రితగ్రంథచింతామణి సంపాదకులైన శ్రీ పూండ్ల రామకృష్ణయ్య (నెల్లూరు) వేంకటరత్నం పంతులుగారి గ్రంథములను నిర్దాక్షిణ్యముగా విమర్శించివైచినారు.

పంతులుగారికి గిట్టనివి రెండు—సంఘసంస్కారము; వ్యావహారికభాష. పంతులుగారు పూర్వసంప్రదాయానుయాయులగుటచేత వారికివి గిట్టకపోవుటలో ఆశ్చర్యములేదు. వీరగ్రాంథికవాదులగుటచేత కాబోలు వీరు ఆదిలో సరళశైలినికూడ అంగీకరించెడివారు కాదట. తరువాత పంతులుగారు ఈ అభిప్రాయమును మార్చుకొన్నట్లు వీరేశలింగముగారే తెలిపియున్నారు (స్వీ. చ. ద్వి. భా. పుట 187). పంతులుగారు పూర్వసంప్రదాయానుయాయులన్నంతమాత్రమున నూతనత్వమున కేమాత్రమును అంగీకరింపరనియు, స్వతంత్రులుకారనియు అర్థముకాదు. తెలుగులో నాటకరచన కుపక్రమించుట వలననే వారి నూతనప్రియత్వము, స్వతంత్రత వ్యక్తమగుచున్నవి. అంతియేకాదు; క్రొత్తఛందస్సులను సృష్టించుటలోకూడ వీరు స్వతంత్రతను చూపినారు. 'సీస'మనెడి ఒక లోహముపేరు ఒక ఛందస్సున కున్నదికదా, ఇంక తక్కిన లోహములపేర్లుకూడ పెట్టుకొన్నచో తప్పేమి? అనెడి భావముతో పంతులుగారు 'వెండి', 'బంగారము' మొదలగు పేర్లతో ఛందస్సులను సృష్టించి తమ గ్రంథములలో వాడినారు. అంతియేకాదు. మంజుభాషిణి, వనమయూరము, రుక్మతీవృత్తము మొదలగు అపూర్వవృత్తములనుకూడ వాడియున్నారు.

పంతులుగారు 1871 లో 'ఆంధ్రభాషాసంజీవని' అను పత్రికను, తరువాతికాలములో 'హాస్యవర్ధని' అను పత్రికను ప్రారంభించి, నడపిరి. నాడు తెలుగుదేశములో అనేకములైన పత్రికలు బయలుదేరి, భాషా–సాహిత్య విమర్శాదులకు పూనుకొని, సాహిత్యోజ్జీవనమునకు దారితీసినవి. అట్టివానిలో వీరేశలింగముగారి 'వివేకవర్ధని' (1878), 'హాస్యసంజీవ'ని; పూండ్ల రామకృష్ణయ్యగారి 'అముద్రితగ్రంథ చింతామణి'; శ్రీ పనప్పాకంవారి 'వైజయంతి' మొదలగునవి ప్రసిద్ధములు. ఇందలి వ్యక్తిగతదూషణములను విడిచివేసినచో[4], ఇవి తెలుగు సాహిత్య పునరుజ్జీవనమునకెంతయో తోడ్పడినవనుట నిర్వివాదము.

పంతులుగారు పెక్కు శ్రవ్యకావ్యములను శతకములను మాత్రమేకాక ఐదు రూపకములను, 'అజామీళోపాఖ్యాన'మనెడి యక్షగానమునుకూడ రచించియున్నారు. ఐదు రూపకములలో 'పౌండరీక'మనెడి భాణమును (రచన 4862_63 ప్రాంతములట!) 'శ్రీమతీమాధవ'మనెడి నాటకమును అముద్రితములు. ఇంక తక్కిన మూడును—నరకాసురవిజయవ్యాయోగము (1872), ధనంజయవిజయవ్యాయోగము (1894), ఆంధ్రప్రసన్నరాఘవము (1897) ఆంధ్రీకరణములు; ఇవి ముద్రితములు.

**నరకాసురవిజయవ్యాయోగము :**

ముద్రణభాగ్యమునుగాంచిన ప్రథమసంస్కృతరూపకాంధ్రీకరణమిది. సంస్కృత మూలమును రచించిన మహామహుడు వారణాశి ధర్మసూరి (ఆంధ్రుడు, గుంటూరుమండలము వాడు, క్రీ. శ. 18 వ శతాబ్ది ప్రథమపాదము). పంతులుగారు దీనిని 1871 వ సంవత్సర ప్రారంభములో అనువదించినారు. 1872 లో ప్రకటితమైనది[5], "ఆంధ్రమున రూపకాద్యమిది" అని పంతులుగారు ప్రస్తావనలో సూత్రధారముఖముగా చెప్పికొనియున్నారు. ఈ 'నరకాసుర విజయము' తెలుగులో ప్రథమమార్గరూపకమని నాటి మద్రాసు పండితులు కొందరు ప్రశంసించి యున్నారు[6]. 1860 ప్రాంతముల రచింపబడినదని తలంపబడుచున్న మంజరీమధుకరీయమును, తొలి సంస్కృతాంధ్రీకరణమగు వేణీసంహారమును అముద్రితములగుటచేత వానినిగూర్చి వీరెవ్వరికిని తెలియుటకవకాశములేదు. అందుచేత ఇదియే తొలి ప్రయత్నమని వీరు తలంచినారు; నిజమునకు పంతులుగారు ఆధునికాంధ్రనాటకకర్తలలో రెండవవారు మాత్రమే. కాని, ఇచ్చట ఒక విషయమును మరువరాదు. పంతులుగారు రెండవవారన్నంతమాత్రమున మొదటివారగు కవిగారు వీరికి మార్గదర్శులనికాని, వారి రచనలు వీరికి ప్రోత్సాహకములనికాని అర్థము చేసికొనరాదు. రచనాకాలమునుబట్టిమాత్రమే వారు ప్రథములు[7]. ఇంక రచనావిధానమునుబట్టి ఎవరికివారే ప్రథములు.

సంస్కృతమునుండి ఇతిహాస-పురాణ-కావ్యముల అనువాదములకు నన్నయ-తిక్కన-పోతన-శ్రీనాథాదులు అనేక మార్గములనుచూపియున్నారు; కాని, రూపకాంధ్రీకరణమునకు ఆదర్శములేదు. అందుచే కావ్యానువాదమునకు శ్రీనాథునివలె, రూపకానువాదమునకు పంతులుగారే ఒక మార్గమును నిర్ణయించుకొనవలసివచ్చినది. పై అనువాదములందు సంక్షిప్తతకు, విపులీకరణమునకు, మార్పులకు, చేర్పులకు అవకాశములున్నవి. కాని, రూపకానువాదమునందట్టి అవకాశములేదు. ప్రతిశబ్దము, ప్రతి అర్థముకూడ ఇందు అపరిహార్యములే; కవి ఎట్టి స్వతంత్రతను అవలంబించుటకు అవకాశములేదు. (ప్రాచీనాంధ్రకవులు రూపకానువాదములు చేయకపోవుటకు ఈ స్వాతంత్ర్యహీనత ఒక కారణమైయుండవచ్చునని గుర్తించియున్నాము). పంతులుగారు రూపకాంధ్రీకరణములో ఈ క్రిందివిధమును అవలంబించినారు:

"పద్యమునకుఁ బద్యంబును గద్యమునకుగద్యమును దగంజేయబడెన్
హృద్యంబుగ నీకృతియం దాద్యకృతింగాంచినట్టు లర్థులుపొగడన్."

సంస్కృతరూపకాంధ్రీకరణములో పద్యమునకు పద్యము, గద్యమునకు గద్యము వరుసగా వ్రాయుటఅను సంప్రదాయమును 1872 లో పంతులుగారు ఏర్పరచినారు. అదియే నేటికిని అవలంబింపబడుచున్నది. మరియు పంతులుగారు అర్థమునేకాక శబ్దమునుకూడఎచ్చటను జారవిడువలేదు. అసలు, వ్యాయోగము ఓజోగుణయుక్తమును, ఆరభటీవృత్తి బహుళమును అగుటచేతమూలమే కొంత జటిలముగానున్నది. పంతులుగారుకూడ అనువాదములో అదేపద్ధతిని అవలంబించినారు. పద్యగద్యములలో అచ్చటచ్చట కొన్ని భాగములు సరళశైలిలో నున్నవికూడ లేకపోలేదు[8]. మూలమునందలిభావము తెనుగులో ఒక పద్యములో సరిపడనిచో వేరొక పద్యమునుగూడ

వ్రాసినారు (ఉదా. 4 వ పద్యము); లేదా కొన్నిచోట్ల యింకొకపాదము నధికముగా వ్రాసినారు. (ఉదా. చూ. పంచపాది వృత్తములు).

### ఆంధ్రీకృత ధనంజయవిజయవ్యాయోగము :

పంతులుగారి రెండవ ఆంధ్రీకరణముకూడ వ్యాయోగమే. ఇది కాంచనాచార్యుని ధనంజయవిజయవ్యాయోగమున కనువాదము (ఉత్తరగోగ్రహణకథ). ఈ అనువాదము మొదట 'వైజయంతి'లో ప్రకటితమై తరువాత 1894 లో గ్రంథరూపమున ముద్రితమైనది. ఇందు పద్యములశైలి యెటులున్నను వచనము కొంత సరళముగా నడచినదని చెప్పవచ్చును[9].

### ఆంధ్రప్రసన్నరాఘవనాటకము :

జయదేవుని ప్రసన్నరాఘవమున కిది అనువాదము. ఇది మొదట 'వైజయంతిలో' ప్రకటితమై 1897 లో గ్రంథరూపమున ముద్రితమైనది. పంతులుగారి ఆంధ్రప్రసన్నరాఘవము, శ్రీ వేదమువారి తీవ్రవిమర్శకు గురియైనది. పంతులుగారు అనువాదములో ప్రాకృతభాషాస్థానములో అచ్చ తెనుగును వాడవలెననెడి నియమమునుచేసికొనినారు. ఇది చాల అసభ్యమైన నియమమనియు, పంతులుగారు దీనిని నిర్వహింపలేక పలుమాఱు తప్పిపోయిరనియు వేదము వేంకటరాయశాస్త్రిగారు విమర్శించినారు. ఇంత తీవ్రవిమర్శకు గురియైన గ్రంథ మింకొకటి లేదనియే చెప్పవచ్చును[10]. తక్కినవిషయములెట్లున్నను, వ్యక్తిగతమైన విరోధముకూడ ఈ విమర్శకు కొంత కారణమైయుండవచ్చును. ఇంతకును '...బాగుగనున్న చోటులను బన్నుగ మూలకృతికునెన్నుఁడీ। బాగుగలేనిచో ననుఁ దవంచెగడుండు' అని పంతులుగారు చెప్పుకొనియే యున్నారు.

## శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులు[1]

కవికులగురువగు కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలానువాదమునకు దొరకొనిన ప్రథములు పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవార్లంగారు. తమ 8 వ ఏటనే 'కుంభకర్ణ విజయ'మనెడి సంస్కృతకావ్యమును రచించి, 12 వ ఏడు వచ్చునప్పటికి వ్యాకరణ–న్యాయశాస్త్రములందు అసమాన ప్రజ్ఞావంతులైన ప్రతిభాశాలి వీరు. ఆనాడు జమీందారులనేకులు భూరిదానములొసంగి, సన్మానములుచేసి, వీరిని గౌరవించిరి. ఉర్లాం జమీందారులు నిర్వహించుచుండిన శ్రావణి పండిత పరిషత్తునకు ఆచార్యులవారు శాశ్వతాధ్యక్షులైనారు. ఆచార్యులవారి పాండిత్యమునకును, సంస్కృతమున వారి శాస్త్రీయోపన్యాసధోరణికిని[2] ముగ్ధులై మైసూరు మహారాజావారు అఖండ సన్మానముకావించిరి. 1887 లో విక్టోరియారాజ్ఞి రాజ్యపాలనముయొక్క పంచాశత్యుత్సవ సందర్భములో ప్రప్రథమముగా నలుగురు భారతీయవిద్వాంసులకు 'మహామహోపాధ్యాయ' బిరుదము లొసంగబడినవి; ఆ నలుగురిలో రంగాచార్యులవారొకరు !

ఆచార్యులవారి సాహిత్యకృషిలో ముఖ్యముగా పేర్కొనదగినది వారి "శబ్దార్థ సర్వస్వము". ఆంగ్లమునందలి విజ్ఞానసర్వస్వము (Encyclopaedia Britannica) వంటి

బృహన్నిఘంటువిది. అ, ఆలతో కూడిన పదములను మాత్రము ఆచార్యులవారే తెనుగక్షరములలో స్వయముగా 1877 లో ముద్రించినారు. అది ఇప్పటివరకును సంపూర్ణముగా ముద్రింపబడకపోవుట ఆంధ్రుల దురదృష్టము. ఈ శబ్దార్థసర్వస్వపీఠికలో ఆచార్యులవారు తామురచించిన గ్రంథములపట్టిక నొసంగియున్నారు. వానిలో 'మంజులనైషధ'మనెడి సంస్కృతనాటకమును, అభిజ్ఞానశాకుంతల_కమలినీకలహంసాంధ్రీకరణములును కలవు. కాగా, ఇవిమూడును 1877 కు పూర్వమే రచింపబడినవన్నమాట. దినమునకొక యంకముచొప్పున నేడుదినములలో మంజులనైషధమును రచించినట్లు వారు చెప్పుకొనినారు.[3]

## తొలిశాకుంతలాంధ్రీకరణము :

సంస్కృత రూపకాంధ్రీకరణమునకు పూనుకొనినవారిలో రంగాచార్యులవారు మూడవవారని వావిలాలవారు తెలిపియున్నారు. ఇంక శాకుంతలాంధ్రీకరణమునకు పూనుకొనినవారిలో ఆచార్యులవారే ప్రథములు. ఈ అనువాదము క్రీ. శ. 1872 ప్రాంతములందే ఆరంభమైనదట. కాని, అందలి మొదటి రెండంకములును 1875 లో మాత్రమే 'సకల విద్యాభివర్ధని' అనెడి వారి పత్రికలోనే ప్రకటితములైనవి. సరిగా ఆ సంవత్సరములోనే కందుకూరి వీరేశలింగము పంతులుగారును శాకుంతలములోని మొదటి రెండంకముల నాంధ్రీకరించి, డిసెంబరు, 1875 నుండి తమ 'వివేకవర్ధని'లో ప్రకటింపనారంభించిరి. కాని, అప్పటికి, ఇరువురి అనువాదములును రెండేసి అంకములు ప్రకటింపబడుటతోమాత్రమే నిలిచిపోయినవి.[4] తరువాతిభాగములను ప్రకటింపక పోవుటకు కారణమేదియైనను, ఆచార్యులవారుమాత్రము అనువాదమును సాంతముగానే చేసినారట. కాని; ఆ వ్రాతపతి తరువాతికాలములో, మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారి అశ్రద్ధవలన పోయినదట.[5]

ఆచార్యులవారు తమ ఆంధ్రీకరణములో 'సంస్కృతభాగమును తత్సమయుక్తమగు తెనుగులోనికిని, ప్రాకృతభాగమును కేవలదేశ్యాంధ్రము (అచ్చతెనుగు) లోనికిని' పరివర్తించియున్నారు. కాని, దేశ్యాంధ్రరచన కొన్నిచోట్ల సరళముగా సాగినట్లు కన్పట్టదు. నాకులభించిన వ్రాతప్రతిలో ప్రస్తావనాభాగములేదు. అందు విశేషములేవైన చర్చింపబడినవేమో తెలియదు. ఆయా అంకప్రారంభములందు స్థలనిర్దేశములును, అందువచ్చు పాత్రముల వివరములును వ్రాయబడియుండుట ఇందలి ఒకవిశేషము. అనువాదములో కంద_గీత_సీసములనడక సరళముగా నున్నది. వృత్తములుమాత్రము కొన్నియెడల జటిలపాకములోనే యున్నవి. వచనము సాధారణముగా సరళమే.[6] కాని, మొత్తముమీద ఆచార్యులవారు శబ్దాడంబరమును ఆదరింపలేదని మాత్రము చెప్పవచ్చును. మంజులనైషధ ప్రస్తావనలో 'శబ్దాడంబరభూయిష్ఠమగు కవితాపద్ధతి'నాదరించువారిని ఆచార్యులవారు నిరసించుట గమనార్హము.

## శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి[1]

రాజమహేంద్రవరము 11 వ శతాబ్దినుండియు కవిపండిత నిలయము. 19 వ శతాబ్ది చతుర్థపాదములో అచ్చట ప్రసిద్ధికాంచిన కవిత్రయములో శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి ఒకరు;

తక్కిన ఇరువురు—శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు; శ్రీ వడ్డాది సుబ్బారాయుడు.[2] వాసుదేవశాస్త్రిగారు క్రీ. శ. 1873 డిసెంబరులో ప్రథమశాస్త్రపరీక్ష (F. A.) వ్రాసినతరువాత బందరునుండి రాజమహేంద్రవరమువచ్చి, అప్పటినుండియు అచ్చటనే స్థిరపడిరి; ఏప్రిలు, 1873 లోనే రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వ సర్వకళాశాలలో ఉపాధ్యాయులుగ నియమితులైరి. 1877 లో ప్రైవేటుగా పట్టపరీక్ష (B. A.)కు కూర్చుండి, ఉత్తములుగా ఉత్తీర్ణులైరి. నాటినుండియు కళాశాల తరగతుల కధ్యాపకులై ప్రథమశాస్త్రతరగతికి గణితమును, పట్టపరీక్షకు భాషాశాస్త్రమును (Phylology) బోధించెడివారు.[3] కొంతకాలము Superintendent of Vernaculars గాను, మరికొంతకాలము కృష్ణా, గుంటూరు మండలములందలి పాఠశాలల సహాయపరీక్షాధికారిగాను నియమింపబడిరి.

శాస్త్రిగారు క్రీ. శ. 1874 లో 'ముముక్షుతారక'మను పేరు భజగోవిందశ్లోకముల నాంధ్రీకరించిరి; ఇదియే వీరి ప్రథమకృతి. ఇంక రూపకములలో 'జూలియస్‌సీజరు'నకు ఆంధ్రీకరణమగు 'సీజరుచరిత్రము' మొదటిది; వీరు దీనిని 1874 లో ఆంధ్రీకరించి, 1876 లో ప్రకటించిరి. వీరి రెండవరూపకము 'నందకరాజ్యము'; ఇది స్వతంత్రసాంఘికనాటకము; 1880 లో ప్రకటింపబడెను. మూడవరూపకము' ఉత్తరరామచరితానువాదము'; ఇది 1881 లో ప్రకటితమైనది. ఇంక నాలుగవరూపకము 'మృచ్ఛకటికాంధ్రీకరణము'; ఇది 1891 లో ప్రకటింపబడెను.

### ప్రథమ ఆంగ్లరూపకాంధ్రీకరణము :

ఆధునిక ప్రథమాంధ్ర నాటకకర్తలలో, నాకుతెలిసినంతలో, వాసుదేవశాస్త్రిగారు నాలుగవవారు; అయినను ఆంగ్లరూపకముల ననువదించినవారిలో మాత్రము వారే ప్రథములు. మరియు 'జూలియస్‌సీజరు' ననువదించుటచేత వీరు ఆంగ్లనాటకాంధ్రీకరణమునకు పూనుకొనిన ప్రథములేకాక విషాదాంతనాటకమును తెనుగులో రచించిన ప్రథములుకూడనగుచున్నారు.[4] శాస్త్రిగారు తమ అనువాదవిధానమునుగూర్చి ఆంగ్లపీఠిక వ్రాసికొనియున్నారు (4_1_1875); 'వివేకవర్థని'లో దీనిపై విమర్శ వెలువడినది (2 వ సం. 6 వ సంచిక_జులై, 1876). ఈ రెండింటిని పురస్కరించుకొని, ఈ ఆంధ్రీకరణమందలి విశేషములను క్రిందివిధముగా పేర్కొనవచ్చును—

1. ఛందస్సున కనుగుణములగు మార్పులనుమాత్రమే కావించుచు, ఆంగ్లనామములను యథాతథముగానే వాడినారు. (ఆ భాషాజ్ఞానములేనివారి కిట్టివి శ్రుతికటువుగా నుండవచ్చును.)
2. చాలవరకు హిందువుల ఆచారసంప్రదాయముల నిందులో చొప్పించినారు. (పూర్తిగా భారతీయము చేయుటకును రచయిత సుముఖులే).
3. ఆంగ్లమునందలి 'Iambus' ఛందముస్థానములో ఇంచుమించుగా అట్టిదేయగు తేటగీతిని ఆసాంతమును వాడియున్నారు. (కాని ఛందములను మార్చుటయే మంచిది).

4. శైలి సులభమైనది, ఇంపైనది.

5. అచ్చటచ్చట వాడికలోనున్న అందమైన గ్రామ్యపదములును, అన్యభాషాపదములును ఇందు ప్రయుక్తమైనవి.

6. అంకములును, రంగములును మార్పులేక యథాతథముగానే యున్నవి.

తెలుగులో ఆంగ్లరూపకానువాదమునకు తామే ప్రథములగుటచేత తదనువాదమం దుత్పన్నమగు సమస్యలను స్వయముగా పరిష్కరించుకొని, శాస్త్రిగారే కొన్ని నియమములను ఏర్పాటు చేసికొనవలసి వచ్చినది. మొదటిసమస్య ఆంగ్లనామములను యథాతథముగా నుంచుటయా, లేదా తెలుగునామములను కల్పించుటయా? ఆంగ్లనామములను యథాతథముగనే ఉంచుటకు శాస్త్రిగారు నిర్ణయించుకొనిరి. ఇది సముచితమగు నిర్ణయమనియే చెప్పదగును. గ్రంథాంతమున నామవివరణపట్టికను అనుబంధముగా నొసంగుచు, ఆ పాత్ర లెచ్చటెచ్చట వత్తురోకూడ చెప్పియున్నారు. సాధారణముగా 'ఉకారాంతపదముల కన్నింటికిని బిందుపూర్వక డువర్ణము వైకల్పికముగా' చేర్పబడెను; ఇంక తక్కిన భేదములన్నియును గణమునననుసరించి వచ్చినవిమాత్రమే.[5]

రోమనుల ఆచారసంప్రదాయములను, ఆంగ్లకవిసమయములను చాలవరకు మార్చి, భారతీయముచేయుటకు ప్రయత్నించినారు. 'రోమన్' వాసనలేకుండ చేయవలెనని మిత్రులు సలహాఇచ్చినారట. అట్లుచేయుట సాధ్యమగుచో రెండవ ముద్రణములో చేయుటకు వారు సుము ఖతను చూపినారుకూడను. ఆంగ్లనామములమధ్య భారతీయకవిసమయాదులను ప్రవేశపెట్టుట కొంత వికృతముగా కన్పట్టుచున్నది; కొన్నిచోట్లమాత్రము ఇవి అందముగానే యున్నవి. కొన్నిచోట్ల అనువాదము వ్యాఖ్యానాత్మకముగానున్నది; మరికొన్నిచోట్ల యతి-గణనియముల వలన వ్యర్థపదప్రయోగము తప్పలేదు. ఈ గుణములు అనువాదమంతటికిని సమానములే.[6]

ఇంక తేటగీతి విషయము. శాస్త్రిగారు సీజరుచరిత్రమునేకాక నందకరాజ్యమును కూడ పూర్తిగా తేటగీతిలోనే వ్రాయుటచేత వీరు ప్రథమాంధ్రపద్యనాటకకర్తలుకూడ నగు చున్నారు. ప్రాచీనాంధ్ర కావ్యములలో కావ్యమంతయును ఒకేఛందములో వ్రాయబడినవిలేవు. ఈ విషయమునకూడ శాస్త్రిగారు క్రొత్తమార్గమును త్రొక్కినారని చెప్పవచ్చును. ఆంగ్లము నందలి 'Iambus' పాదములు ఐదేసిగణములు (feet) కలవై, ఏపాదమునకాపాదము స్వతంత్రముగా నుండును; తెలుగులోని తేటగీతియు ఇంచుమించుగా ఇట్టిదే. దానివలెనే దీనిని గద్యమువలెనే పఠింపవచ్చును. అందుచేత శాస్త్రిగారు దీనిని ఎన్నికచేసినారు. నాటకమంతయును ఒకేఒకఛందములోనడచుట విసుగుగానుండునని కొందరి ఆశంక. "మరి ఆ విసుగు మూలమును చదువునప్పుడేమగును?" అని శ్రీ పానుగంటివారి ప్రశ్న. (శాస్త్రిగారి శిష్యులే అయిన వీరు కూడ తమరూపకములందు తేటగీతినే ఆదరించుట గమనార్హము).

మొత్తముమీద అనువాదము సరళముగానున్నది. మూలమును చూచుకొనవలసిన ఆవశ్యకములేదు. ప్రదర్శించుటకెవరైన ప్రయత్నించినచో తప్పక సఫలులుకాగలరని విశ్వ

సించుచున్నాను. ఈ సీజరుచరిత్రము 1879 వ సంవత్సరపు ప్రవేశపరీక్షకు పాఠ్యగ్రంథముగా మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే నిర్ణయింపబడెను.

## తొలి తెలుగు సాంఘికరూపకము

### నందకరాజ్యము :

ఇది ఐదు అంకముల సాంఘిరూపకము. క్రీ. శ. 1880 లో ముద్రింపబడినది; రచన యును అప్పుడేజరిగినదని చెప్పవచ్చును. తెలుగు స్వతంత్రరూపకములలో మంజరీమధుకరీయము మొదటిది; నందకరాజ్యము రెండవది. కాని, తెలుగు సాంఘికనాటకములలో నందకరాజ్యమే మొదటిది. అంతియేకాదు ముద్రణభాగ్యమునుపొందిన తొలితెలుగు స్వతంత్రనాటకమును ఇదియే. నందకరాజ్యమనగానే చరిత్రకుసంబంధించినచంద్రగుప్త, చాణక్య, నందులు జ్ఞాపకము వత్తురు; కాని, ఇది చరిత్రకు సంబంధించినదిమాత్రము కాదు. కేవలము కల్పిత సాంఘికకథ. నందకుడనునాతడొక జమీందారు. అతడు రాజ్యమునకురాగానే బ్రాహ్మణులు, జనులు సుఖమంద గల మనుకొనిరట. కాని, రాజోద్యోగులు, ముఖ్యముగా నియ్యోగులు, విజృంభించి, మడి మాన్యము లపహరించి (ముఖ్యముగా వైదికులను) బాధింపనారంభించిరి. ప్రథమాంకమందు నియ్యోగులైన ఉద్యోగులచేత (అనగా కరణములచే) వైదిక బ్రాహ్మణులు పడెడి అవస్థలు వర్ణితములైనవి.[7] ద్వితీయాంకమందు దివాన్‌గారైన శరభోజీరావు పంతులుగారి దుష్టచర్యలు, రాజుగారికొలువులో అష్టావధానము[8] వర్ణితములైనవి. తృతీయాంకములో శరభోజీ ఠాణాలను తణిఖీచేయుపద్ధతి, రాణీరంగయ్యమ్మ రాజునకు హితబోధచేయుట వర్ణితములైనవి. చతుర్థాంక ములో రాజపురోహితుడగు శారదానందుని తోడ్పాటుతో సుబ్బారావను లౌక్యుని నాయకత్వమున వైదికులు రాజునకు యథార్థమెరింగించుట; ఆతడు మంత్రులను దేశబహిష్కార మొనరించి, సుబ్బారావును మంత్రిగాచేయుట వర్ణితములైనవి. పంచమాంకప్రారంభములో మంత్రులూరు విడిచి కాశికి బయలుదేరుట వర్ణింపబడినది.

ఇంతటితో కథ ముగియవలసినదే. కాని, విక్రమార్కకథలలోనిదగు 'ససేమిరా'యను కథను స్వీకరించి, అనాలోచితముగా రాజు శారదానందుని శిక్షించుట మొ॥ శాస్త్రిగారిందుచేర్చి నారు. నాటకప్రదర్శనముతో కథ సుఖాంతమగును. ఇందులో శరభోజీపాత్ర చివరివరకును చక్కగాపోషింపబడినది. ఆతడు చాల మొండిధైర్యముకలవాడు; తన దేశబహిష్కారమును చూచి ఆనందించుచున్న వైదికులనుచూచి "నన్ను వెడలింపఁగల్గిరన్సంతసంబు పొందుచున్నారు గాఁబోలుఁ బురమునందు; వారు నన్వెడలించుట వట్టిమాట; జపతపస్సులమహిమలుజరుపు వీరె విశ్వనాథుపురమునుండి వెడలువారు" (పుట 141) అని పలుకుట గమనార్హము. పంచమాంక మందు స్త్రీవిద్యనుగూర్చియు, ప్రాచీనాంధ్రకవులను గూర్చియు, ప్రాతక్రొత్తనాటక ప్రదర్శన ములనుగూర్చియు, ద్విపద – తేటగీతుల రచనాసౌలభ్యమునుగూర్చియు చర్చలుకలవు. "కఠిన పదములులేకుండ సులభముగాకూర్చిన పదజాలమున్ననే నాటకమును చూతు"నని మంత్రియగు సుబ్బారావుచెప్పుట గమనింపదగినది. భాషావిషయమున శాస్త్రిగారు సారళ్యమునువాంఛించినను,

గ్రామ్యపదములను సమయోచితముగా వాడుచున్నను వ్యావహారికభాషనుమాత్ర మాదరింప లేదనుట స్పష్టము. రచనలో ప్రాచీనరూపకసంప్రదాయముల నెడనెడ నుల్లంఘించియున్నారు. శాస్త్రిగారు దీనిని 'నాటక'మని వ్యవహరించిరి; కాని నాటకలక్షణములు దీనికిపట్టవు. ఇది ప్రకరణమునుగాదు. అసలు శాస్త్రిగారి నందకరాజ్యము మొదలు నేటివరకును 'నాటక'మను పేరుతో వెలువడుచున్న సాంఘికరూపకము లన్నింటివిషయమును ఇంచుమించుగా ఇంతియే.

నందకరాజ్య మైదంకములలోను మొత్తము 26 రంగములున్నవి (4+6+3+5+8); ఇది ప్రయోగసౌలభ్యమును తగ్గించును. పంచమాంకమందలి కథను ఇంచుమించుగా సాగదీసినట్లైనది. అయినను, ఇప్పట్ల అనాలోచితముగా శారదానందుని శిక్షించి నందులకు రాజు పుత్రవియోగబాధ ననుభవించినట్లు కూర్చియుండినచో బాగుండెడిది. "పూర్వపు గ్రామ్యవ్యవహారములిందు సుందరతరముగా నభినర్తితములు. పదప్రయోగమున నంత ప్రౌఢిమ పొడసూపదుగాని, స్వాభావికత పెద్దదిగానున్నది" అని మథునాపంతులవారు నందకరాజ్యమును గూర్చి వ్రాసిన వాక్యములు సమంజసములుగానున్నవి. (ఆంధ్రరచయితలు-పు. 96).

**ఉత్తరరామచరితము :**

శాస్త్రిగారు దీనిని 10-4-1880 తేదీన అనువదించుట కారంభించి, 7-5-1880 తేదీనాటికి పూర్తిచేసినారు. 1881 లో 'చింతామణి'లో ప్రకటితమై, 1883 లో మొదటిసారిగా గ్రంథరూపమున వెలువడినది. 1890 లో ప్రథమశాస్త్రపరీక్షకు పఠనీయగ్రంథమైనది. ఉత్తరరామచరితనాంధ్రీకరించిన ప్రథములు శాస్త్రిగారే; అంతియేకాదు, శాస్త్రిగారి నాటకములలో ప్రదర్శన భాగ్యమును పొందినదియును ఈ ఉత్తరరామచరితానువాదమే (దీనికి శాస్త్రిగారు వ్రాసిన ఆంగ్ల పీఠికనుండి కొంతభాగమునిదివరకే ఉద్ధరించియున్నాను). ఇందు శాస్త్రిగారు పెక్కుచోట్ల మూల వాక్యములను యథాతథముగా అనువదింపక, స్పష్టతకొరకు కొంత వైపుల్యము నంగీకరించిరని చెప్పవచ్చును[9]. రచనయంతయును గ్రాంథికమే. వెనుకటి నాటకములందున్న సారళ్యమిందు లేదు. కొన్నిచోట్ల అన్వయక్లిష్టతకూడ కలదు. ఇందు శాస్త్రిగారు వివిధవృత్తములను వాడియున్నారు. నందకరాజ్యము చివరను, దీని చివరను (భరతవాక్యములకు పిమ్మట) శాస్త్రిగారు విక్టోరియారాజ్ఞి ప్రశంసను చేసియున్నారు.

శాస్త్రిగారి మృచ్ఛకటికాంధ్రీకరణము 1891 లో చింతామణిలో ప్రకటితమై, పిమ్మట 1896 లో గ్రంథరూపమున వెలువడినది. ఉత్తరరామచరితానువాదముకంటె మృచ్ఛకటికానువాదమే బాగున్నది. ఇందుకూడ అధమపాత్రలకు గ్రాంథికభాషయే ఉపయుక్తమైనది. శకారాదుల విషయమున శాస్త్రిగారు రకరకముల వృత్తములను వాడియుండుట ఒక విశేషము[10].

''వావిలాల వాసుదేవశాస్త్రి'' అను పేరు చక్కని ఆటవెలదిపాద మగుచున్నది. అందుచే బాల్యమిత్రులును, బావమరదియును అగు కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వీరిని "బావగారు ఆటవెలదిపాదములలో చిక్కుకొనినారు" అని హేళనముచేసినారట !

## శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు[1]

ఈ అధ్యాయమున ఇంతవరకును నలుగురు నాటకకర్తలనుగూర్చి వ్రాసియున్నాను. వీరు నలుగురును ఒకదశకు చెందినవారు. వీరి రచనలలో అధికభాగము 1880 కి పూర్వమే వెలువడెను. ఇది ఆధునికాంధ్రనాటక సాహిత్యచరిత్రలో ప్రథమదశయని పేర్కొనియున్నాను. ఈ ప్రథమదశలో తెలుగునాటకరచన ముప్విధములుగా (అనగా స్వతంత్రరూపకనిర్మాణము, సంస్కృతరూపకానువాదము, ఆంగ్లరూపకానువాదము) సాగినను, అవియేవియును ప్రదర్శింపబడినట్లు కన్పట్టదు. అందులకు ఆ రచయితలు ఎట్టిప్రయత్నమును చేయనేలేదు. కేవల రచనతోనే వారు తృప్తిపడినట్లు తలంపవచ్చును. వాసుదేవశాస్త్రిగారుమాత్రము నందకరాజ్యము చివర వీథిభాగవతుల ప్రదర్శనమును విమర్శించి, క్రొత్తపద్ధతియొక్క ఆవశ్యకమును సూచించియున్నారు.

ఇంక తెలుగునాట, ఆధునికనాటకములను ప్రదర్శించుటకు పూనుకొనినవారు కందుకూరి వీరేశలింగంపంతులుగారు. పంతులుగారి జీవితవిశేషములు, వారి బహుముఖమైన ప్రజ్ఞ, వారొనర్చిన సాంఘిక–సారస్వత సేవలు ప్రజలందరకును తెలిసినవే. ఒక 'యుగపురుషుడు'గా కీర్తింపబడిన మహావ్యక్తి ఆయన. తెలుగు సారస్వతములోని ప్రతిశాఖలోను వారికి ప్రథమస్థానమో, ప్రధానస్థానమో కలదు. ఆధునికనాటకరచనారంభమునకు కాకపోయినను, ఆధునిక నాటకప్రదర్శనారంభమునకైనను వారు ఆద్యులైనారు. పంతులుగారు మొత్తము 16 రూపకములను వ్రాసిరి. ఇందులో బ్రాహ్మవివాహము (1880), వ్యవహారధర్మబోధిని (1880), తిర్యగ్విద్వన్మహాసభ (1887), మహారణ్యపురాధిపత్యము (1889) అను నాలుగును ప్రహసనప్రాయములు; స్వతంత్ర రచనలు. రత్నావళి (1880), అభిజ్ఞానశాకుంతలము (1875–1883), మాళవికాగ్నిమిత్రము (1885), ప్రబోధచంద్రోదయము (1885) అను నాలుగును సంస్కృతరూపకానువాదములు. చమత్కారరత్నావళి (1880), వినీసు వర్తకచరిత్రము (1880), రాగమంజరి (1886), కల్యాణకల్పవల్లి (1894) అను నాలుగును ఆంగ్లరూపకానుసరణములు, లేదా అనువాదములు. వివేకదీపిక (1880) స్వతంత్రప్రచారరూపకము. తక్కిన మూడును అనగా ప్రహ్లాద (1885), దక్షిణగోగ్రహణము (1885) సత్యహరిశ్చంద్ర (1886) అనునవి— స్వతంత్రపౌరాణికనాటకములు. కాగా 1880 లో ఆరు రూపకములును, 1883 లో ఒకటియును, 1885 లో ఐదును, 1886 లో ఒకటియును, 1889 లో రెండును, 1894 లో ఒకటియును రచింపబడినవన్నమాట. వీనిలో బ్రాహ్మవివాహము మొదటిది. చివరిది కల్యాణకల్పవల్లి. తెలుగులో అంతకుముందే నెలకొన్న మూడు రూపకశాఖలలోను పంతులుగారు రచన సాగించియున్నారు.

### బ్రాహ్మవివాహము :

పంతులుగారు 1875 లోనే అభిజ్ఞానశాకుంతలానువాదముతో తమ ఆంధ్రరూపకరచనకారంభము చేసినను, దానిని కొనసాగింపలేదు; 1880 వరకును వారు మరల రూపకరచనవైపే

దృష్టిని మరల్చలేదు. 1880 లో మరల మొదలుపెట్టి బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మ బోధిని అనెడి ప్రహసనప్రాయములైన రూపకములను రచించి, 'హాస్యసంజీవని'లో ప్రకటించి నారు[2]. 'బ్రాహ్మవివాహము' వెలువడిన కొన్ని దినములవరకును జనులు గుంపులుగుంపులుగా గూడి వీథియరుగులమీదగూర్చుండి దానిని చదివి పకపక నవ్వుచుండిరి; దీనిని జనులు 'పెద్దయ్య గారి పెండ్లిపుస్తక'మనెడివారట. దీనిని పంతులుగారు కేవలము వినోదముకొరకేకాక అతి బాల్యవివాహము, వృద్ధవివాహము, కన్యాశుల్కము మొదలైన దురాచారములవలని యనర్థ కములనుచూపి జనులను వానినుండి విముఖులనుచేయు తలంపుతోగూడ వ్రాసియున్నారు. (స్వీ. చ. 2 వ భా. పుట. 175). ఇందు ఏడు అంకములు, వానిలో 'ప్రదేశము'లనుపేర రంగములు కలవు. కాని ఒక నాటకమును రచింపవలెనను దృష్టితో పంతులుగారు దీనిని రచింప లేదనుట స్పష్టము. నాటకీయతకు ఒక ప్రధానచిహ్నమైన సంభాషణరూపములో దీనిని రచించు టయే వారుచేసినపని[3]. సంఘములోనిలోపముల నెత్తిచూపుటకు వావిలాలవారే నందకరాజ్యము నంవారంభముచేసినారు (దీని ప్రకటనయును 1880 అగుట గమనార్హము). కాని పంతులుగారు కేవలము హేళనాత్మకముగా ఆ లోపములను ఎత్తిచూపుచు ఆసాంతము రచనను అట్లే సాగించి నారు. నాటివ్యక్తులే కొందరిందు పాత్రములైనారు. కాగా, తెలుగులోని ప్రహసనరచనకుకూడ ఇది ఆరంభమని చెప్పవచ్చును.

### వ్యవహారధర్మబోధిని :

హాస్యసంజీవనిలో బ్రాహ్మవివాహ ప్రకటనము ముగిసినవెంటనే 'వ్యవహారధర్మ బోధిని' ప్రకటన మారంభమైనది. ఇందు ఐదు అంకములు, 'ప్రదేశము'లనుపేర రంగములును కలవు. బ్రాహ్మవివాహమునందువలెనే ఇందలి పాత్రలును చాలవరకు నిజమైనవి. దీనినిగూడ జనులు విశేషముగా చదువుచు 'ప్లీడరు' నాటకమని పిలువజొచ్చిరట. (స్వీ. చ. 2 వ భా. పుట 176)[4]. బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మబోధిని—రెండును కేవలము గద్యమునందే వ్రాయబడినవగుట గమనార్హము. అందున వ్యవహారధర్మబోధిని వ్యావహారికభాషలో రచింప బడుట యొక విశేషము (నిజముగా నాడిది సాహసమే అనవచ్చును. అసలు పంతులుగారు గ్రామ్య లేదా వ్యావహారికభాషావాదికారు). ఆధునికుల తెలుగురూపకములలో ప్రదర్శనభాగ్యము గాంచిన ప్రథమరూపకమిదియేయగుట యింకొక విశేషము. "...వ్యవహారధర్మబోధినిని నామిత్రులు కొందఱును, విద్యార్థులు కొందఱునుచేరి, 1880 వ సంవత్సరమున శ్రీ విజయ నగరము మహారాజాగారి బాలికాపాఠశాలలో (రాజమండ్రిలో) మొదటఁ బ్రయోగించిరి. అందు న్యాయాధికారులయొక్కయు, న్యాయవాదులయొక్కయు, దుశ్చర్యలు పరిహాసరూపమునఁ బ్రక టింపబడినవి. వానిని బ్రదర్శించుటవలన నందభివర్ణింపఁబడిన దోషములుగలవారి మనస్సులకుఁ గొంత నొప్పికలిగినను, ఇటువంటి రూపకములను బ్రదర్శించుట కదియే మొదలయినందున నూఱులకొలఁది జనులువచ్చి, చూచి యానందించిరి." (స్వీ. చ. 1 వ భా. పుట. 175). పంతులుగారు వ్యవహారధర్మబోధినిని ప్రదర్శనమున కుద్దేశించి వ్రాయకపోయినను, మొత్తమున కీ ప్రదర్శనము విజయవంతమైనదని తెలియుచున్నది. పంతులుగారి ఇట్టి రచనలు రంగప్రదర్శన

మునకనుకూలములుగా నున్నవని నాడు 'హిందూపత్రిక' కూడ అభిప్రాయమొసంగెను. (చూ. వివేకవర్ధని-3 వ సం. 12 వ సంచిక). వ్యవహారధర్మబోధిని ప్రదర్శనము విజయవంత మగుటతో ఒక 'నాటకసమాజము'ను స్థాపించవలెనను అభిప్రాయము పంతులుగారికిని, వారి మిత్రులకును కలిగెను[5].

## ధార్వాడ నాటకసమాజము :

ఇంతలో 'ధార్వాడ నాటకసమాజము'వారు తెలుగుదేశములో సంచరించుచు, హిందూస్తానీ నాటకములను ప్రదర్శింపసాగిరి. దీనిని 'ధార్వాడ నాటకసమాజ'మని పేర్కొనుటయేకాని, దీని అసలుపేరేమో ఎవ్వరును తెలుపలేదు. ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరములు జరుపగా శ్రీ వి. జి. భావే అనెడి నటవిమర్శకులు 26-8-1957 తేదీన 'సాంగ్లి'నుండి నాకు వ్రాసిన సమాధానములో కొన్ని వివరములు తెలిపినారు. ధార్వాడ నాటకసమాజము అసలుపేరు 'అలచేకర్ హిందూ డ్రమెటిక్‌కంపెనీ'. ఇది 1870 ప్రాంతముల స్థాపింపబడినది. 'అలచే' అనునది సాంగ్లికి 20 మైళ్ళ దూరములోనున్న ఒకగ్రామము. ఈ సమాజమునకు సీతారాంజోషి అనునతడు యజమాని. వాని సోదరుడు వామన్‌జోషి ప్రముఖపాత్రలను ధరించెడివాడు. గోపాల్ దాతే అను ఇంకొక ప్రముఖవ్యక్తి రాక్షసపాత్రలను వేసెడివాడు. ఇంకొక నటుడు బాల్‌ఖరే. వీరు మొదట విష్ణుపంత్ భావే నాటకములను ప్రదర్శించెడివారు. తరువాత సొంతముగానాటకములను వ్రాయించుకొనుటయేకాక, 'అన్నాకిర్లోస్కర్' నాటకములనుకూడ ప్రదర్శించెడివారు. వీరు 1880-81 ప్రాంతముల తెలుగుజిల్లాలలో సంచరించినారు[6]. ఈ ధార్వాడ నాటకులు రాజమహేంద్రవరములో ప్రదర్శనము లొసంగినతరువాతనే తెలుగుదేశములో ఆధునిక నాటకప్రదర్శనము లారంభమైనవని చెప్పవచ్చును (అంతకుముందు ప్రదర్శింపబడినది 'వ్యవహారధర్మబోధిని' యొక్కటే కన్పట్టుచున్నది). కాగా, ఆంధ్రనాటకరంగచరిత్రలో ఈ సమాజముయొక్క పాత్ర చిరస్మరణీయము.

## ప్రథమ ఆధునికాంధ్రనాటకసమాజము :

ధార్వాడ నాటకసమాజమువారి నాటకప్రదర్శనములను కాంచుటతో రాజమండ్రివారికి ఎక్కడలేని ఉత్సాహమును కలిగినది. వారు వీరేశలింగంపంతులుగారిని ప్రోత్సహించిరి. అంతట పంతులుగారొక నాటకసమాజమును స్థాపించుటయు, దానిచే రెండు నాటకప్రదర్శనము లిప్పించుటయు వెంటవెంటనే జరిగినవి[7]. శ్రీ వావిలాలవారు ఉత్తరరామచరితానువాద పీఠికలో వ్రాసినదానినిబట్టి తెలుగుదేశమున ప్రథమనాటకసమాజమును స్థాపించినఖ్యాతి పంతులుగారికే దక్కినదనియు, వారు స్థాపించిన నాటకసమాజములోని నటులు ముఖ్యముగా కళాశాలవిద్యార్థులనియు తెలియుచున్నది[8]. నటులన్నచో గౌరవములేని ఆ కాలములో విద్యార్థులు నాటకములు వేయుటకు తల్లిదండ్రులంగీకరింపలేదు. అందుచేత ఈ నాటకసమాజమునెడను, నాటక ప్రదర్శనముల యెడను పంతులుగారు తరువాతికాలములో ఆదరమును చూపుట మానివేసిరి. తెలుగునాట వెలసిన ఈ ప్రథమనాటకసమాజమునందలి నటులందరిపేర్లుకాని[9], వారి ప్రదర్శన విధానమును

గూర్చిన వివరములు కాని తెలియలేదు; వీరికి ధార్వాడ నాటకసమాజము ప్రేరకమగుటచేత, ఈ ప్రదర్శనములును ఆ సమాజప్రదర్శనముల కనుకరణముగానే ఉండియుండవచ్చును.

రత్నావళి :

ఇంతకుముందే ఆరంభమైన సంస్కృతానువాద పద్ధతినే పంతులుగారిందును అవలంబించినారు. ఈ అనువాదమున కెక్కువకాలము పట్టలేదని పంతులుగారి వాక్యములవలన తెలియుచునేయున్నది. సంస్కృత రూపకానువాదకులెల్లరు ప్రస్తావనలందు సూత్రధారముఖముగా తమ అనువాదములను గూర్చికూడ చెప్పుకొనుటకారంభించిరి; కాని, పంతులుగారట్లుచేయలేదు. అనువాదమంతయును గ్రాంథికభాషలోనే నడచినది; అయినను పంతులుగారిభాషచోని విశిష్టతయగు సారళ్యమిందునుకలదు. వ్రాతప్రతిరూపముననే, రచన .అయిన వెంటనే, ప్రదర్శింపబడిన రూపకమిది.

చమత్కారరత్నావళి :

ఇదియును 1880 చివరిభాగములో, 'రత్నావళి' తో పాటే, అదేప్రయోజనముకొరకు, శీఘ్రకాలములో రచింపబడిన రూపకము.[10] ఇది "Comedy of Errors" అను షేక్స్పియరు నాటకమునకు అనువాదము. ఇందు ఆంగ్లనాటకానువాదమునకు ప్రథములైన శ్రీవావిలాలవారు ఏర్పరచిన మార్గమునకు భిన్నమైనమార్గమును పంతులుగారు అవలంబించియున్నారు_1. పాత్రల నామములను, దేశముల నామములను మార్చివేసినారు. ఉదా : ధర్మపాలుడు (Solinus, Duke of Ephesus); వసంతకుడు (Antipholus); చోళమండలము (Ephesus) మొదలగునవి. 2. సేవకాదులకు, స్త్రీలకు వ్యావహారికభాష నుపయోగించినారు. 3. ఆంగ్లమునందలి పద్యభాగమును గూడ వచనములోనికే అనువదించి, దీనిని కేవలము గద్యనాటకముగా చేసినారు. 4. Aegeonఅను వర్తకుడు మరణదండనమును విధింపుమని Duke ను కోరుచున్న మాటలతో మూలము ఆకస్మికముగా ప్రారంభమైనది. కాని, పంతులుగారు ఈ మాటలకుపూర్వరంగముగా ఒకపుట గ్రంథమును కల్పించినారు. (కాని, ఇది షేక్స్పియరు పద్ధతికి విరుద్ధమైనది). ఈ విధముగా మధ్యలో కూడ అచ్చటచ్చట స్వల్పములగు మార్పులుచేసినారు. మొత్తమునకు ఆయామార్పులవలన ఈ నాటకము స్వతంత్రనాటకమనెడి భ్రాంతినికలిగించుటకు సమర్థమైయున్నది. అనువాదము చాల సరళముగాసాగినది. కళాశాలావిద్యార్థులు కాని, ఔత్సాహిక సమాజములవారుకాని ఈ గద్యనాటకమును ప్రయోగించుటకు పూనుకొన్నచో నేడును తప్పకసిద్ధిని పడయగలరని విశ్వసించుచున్నాను.

పంతులుగారి 'వివేకదీపిక' స్త్రీపునర్వివాహమునకు సంబంధించిన మూడంకముల ప్రచార గద్యనాటకము. ఇందు ఉపన్యాసధోరణి అధికము; నాటకీయత అత్యల్పము. రచన 1880 లోనే జరిగినది. "మర్చంట్ ఆఫ్ వెనిస్ అను నాటకములోని ప్రథమ_ద్వితీయాంకములను 'వినీసు వర్తకునిచరిత్ర'మనుపేర ద్విపదకావ్యముగాచేసి ప్రకటించితిని" అని పంతులుగారు వ్రాసికొనిన దానినిబట్టి, వారు 'వినీసువర్తకచరిత్రము'ను నాటకదృష్టితో తెనిగింపలేదనుట స్పష్టము.

పేర్లు మొదలగునవి మార్పులులేక యథాతథముగానే ఇందున్నవి. అనువాదమందు సారళ్యము లోపించినది.

## అభిజ్ఞాన శాకుంతలము :

"1875 లో మొదటి రెండంకములను కొంచెము కఠినశైలితో వ్రాసినను నాటకమాడు నప్పుడందఱకును దెలియుట యత్యంతావశ్యకమను నభిప్రాయముతో నిప్పుడీ యయిదంకములను మిక్కిలి సులభముగా వ్రాసినాఁడను.........ప్రథమ, ద్వితీయాంకములయందు కలకత్తా ప్రతియందుఁగల యధికశ్లోకములను గూడఁ జేర్చితినిగాని......తరువాతనట్టివానిని వదలివేసి బహుప్రతులయందున్న రీతినే తక్కిన భాగమును తెనిగించినవాఁడను'' అని పంతులుగారు వ్రాసికొనుట గమనింపదగినది (ప్రథమముద్రణ పీఠిక_25_10_1883).

1875 లో రెండంకములును, 1883 లో తక్కిన ఐదంకములును అనువదింపబడినవి. ఇది మొత్తముమీద రెండు భాగములుగా భిన్నకాలములలో, భిన్నదృష్టులతో రచింపబడినది. అయినను పంతులుగారి భాషాంతరము గూఢపదములును, ప్రౌఢాన్వయములును లేనిదై పామరులు కూడ గ్రహించునట్లుగా తేటతెల్లమయి యుండుటచేత ఇది నాటకసమాజములవారికికూడ అధికముగా ఆదరపాత్రమైనది. అనేక నాటకసమాజములవారు దీనిని బహుస్థలములందు ప్రదర్శించి యున్నారు. నాటకముయొక్క గొప్పదనమునకు ఇదియును ఒక కొలబద్దయే. శాకుంతలానువాదములన్నింటను ప్రసిద్ధివహించినది పంతులుగారి అనువాదమే.

## పంతులుగారి ఇతరనాటకములు :

తెలుగులో బహుళనాటక కర్తలుగా ప్రసిద్ధివహించినవారు పలువురుకలరు; ఆ యందరిలోను పంతులుగారే ప్రథములని చెప్పవచ్చును. కాగా, పంతులుగారు రచించిన తక్కిన నాటకములను గూర్చి కూడ తెలిసికొన్నచో తెలుగు నాటకరంగమునకు వారొనర్చిన బహుముఖసేవ స్పష్టము కాగలదు.

1885 లో రచింపబడిన అయిదు నాటకములలోను మాళవికాగ్నిమిత్రము మొదటిది[11] (పీఠిక తేదీ 16_4_1885). ఈ అనువాదమందు చెప్పుకొనదగిన ప్రత్యేకతలేదు. రచన సాఫీగా జరిగినది. ప్రహ్లాదనాటకము (రచన 1885) ఐదు అంకముల స్వతంత్ర పౌరాణిక నాటకము. కాగా, స్వతంత్రపౌరాణికరూపకములలో ఇదియే ప్రథమమని చెప్పవచ్చును. ఇందు మొత్తము 8 పద్యములున్నను (అవి సన్నివేశ ప్రాబల్యమున ప్రహ్లాదుడు చదివెడివి) దీనిని కూడ గద్య నాటకమునుగానే పరిగణింపవచ్చును.[12] ఇందులో పంతులుగారు తమ సంఘసంస్కరణాది ప్రచారమును ప్రవేశపెట్టి, నృసింహమూర్తినే ఒక ప్రచారకునిచేసినారు[13] (చూ. పుట 94). ప్రబోధచంద్రోదయ ప్రథమాంకము 1885 లోను, తక్కినభాగము 1891 లోను అనువదింపబడెను. ఇది కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమున కనువాదము. ఇందు, పాత్రానుగుణముగా కొన్ని పద్యములు కఠినశైలిని రచింపబడెను; అందుచే అసూయాగ్రస్తులు కొందరు అవి పంతులుగారివికావేమోయని సందేహించిరట. రాగమంజరి (రచన 1885) షెరిడన్ యొక్క

'దిడ్యూయన్నా' కు అనుసరణము. కథరమ్య మయ్యును, కొంతచిక్కుగా నుండును; షెరిడన్ తననాటిసంఘములోని అవకతవక-ఆచారవ్యవహారములను హేళనముచేయుటలో సిద్ధహస్తుడు. పంతులుగారును దానిననుసరించి తమకాలపు సంఘమును విమర్శించియున్నారు. ఇందులకై వారు తమ అనుసరణమందు భారతీయవాతావరణమునే కల్పించిరి; పేర్లనుమార్చివైచిరి. 'దక్షిణ గోగ్రహణము' (రచన 1885) గద్య-పద్యాత్మకమైన ఐదు అంకముల స్వతంత్రనాటకము (కాని, ఇందును పద్యములుచాలతక్కువ). భారతకథను నాటకీకరించుటకు ఆధునికకాలములో ప్రయత్నించిన ప్రథములు పంతులుగారే.

సత్యహరిశ్చంద్రనాటకమున 1886 లో మొదటి నాలుగంకములును, పిమ్మట పంచమాంకమును పూర్తిచేయబడెను. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యాన కథను మార్పక నాటకరూపముగా వ్రాసియిండని రాజమండ్రిలోని "నాటకోజ్జీవకసమాజము" వారు కోరినమీదట పంతులుగారీ రచన ఆరంభించిరి. వారప్పుడు దానిని ప్రదర్శింపకపోయినను, తరువాత కాకినాడలోని ఒక సమాజమువారు దానిని ప్రదర్శించిరనియు, అది చక్కగానుండెననియు పంతులుగారు వ్రాసికొనిరి.

తిర్యగ్విద్వన్మహాసభ-మహారణ్యపురాధిపత్యములు (రచన 1889)—ఇవి ఆక్షేపగర్భ రచనలు. వీనినిగూర్చి, తెలుగులోని ప్రహసనములనుగూర్చి వ్రాయునప్పుడు తెలుపుదును. ఈ రచనలవలన పంతులుగారిపై అభియోగములుకూడ వచ్చినవి. కల్యాణకల్పవల్లి (రచన 1894) షెరిడన్‌యొక్క 'ది రైవల్సు' కు అనువాదము.

ప్రహసనములు :

పంతులుగారు పెక్కు ప్రహసనములనుకూడ రచించి, ప్రకటించిరి. వారి సంఘసంస్కార దృష్టి ఈ రచనలందు స్వేచ్ఛగా ప్రసరించినది.ఇందులో కొన్ని ఆంగ్లప్రహసనముల కనుసరణములుకూడ కలవు.[14] ఇవి ఎప్పుడెప్పుడు రచింపబడినవో సరిగా తెలియుటలేదు. ఈ ప్రహసనములన్నియును నేడు సంపుటముల రూపమునలభింపగలవు. వీనినిగూర్చి తరువాత వ్రాయుదును.

ఆంధ్రనాటకరంగమున పంతులుగారు చిరస్మరణీయులు.

## శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి[1]

తెలుగు "కవిజీవితములు" కర్తగా గురుజాడ శ్రీరామమూర్తిగారు సుప్రసిద్ధులు. 1880 జనవరిలో శ్రీరామమూర్తిగారు "మర్చంట్ ఆఫ్‌వెనిస్" నాటకమును "వెనీసువణిజ నాటకము" లేదా "సుహృత్సుభాషితము" అను పేర అనువదించి ప్రకటించినారు. గద్య-పద్యములు రెండును రంగస్థలమున రక్తికట్టవలెననెడి యూహతోఅనువాదమందనేక ఛందముల నుపయోగించినట్లు వీరు పీఠికలోచెప్పుకొనినారు. కాని వివిధములైన ఛందస్సులను వాడుటచేత రచనలో సారళ్యముచెడి, ఎగుడుదిగుడు లేర్పడినవి. మనసంప్రదాయము ననుసరించి అశ్లీలములుగా నుండువానిని అనువాదములో పరిహరించివేసినారు; వర్ణనలలో కొంతస్వాతంత్ర్యమును

స్థాపించిరి. శ్రీరామజననము, సీతాకళ్యాణము, ప్రహ్లాదనాటకము, హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగు నాటకములు వేసవి సెలవులలో వరుసగ కొన్నిసంవత్సరములు ప్రదర్శింపజేయుచు వచ్చిరి. వీరి రచనలు రసపూరితములై మిక్కిలి జనరంజకములుగ నుండెను. కొందరు సమర్థులగు నటులు నేర్పడిరి."[3]

ఇప్పట్ల "వస్త్రాపహరణ" పీఠికలోని (1896) శాస్త్రిగారి వాక్యములుకూడ పరిశీలనార్హములు—"నేను గుంటూరు మిషన్‌పాఠశాలలో నుపాధ్యాయుడుగానుండగా నచటి పాఠశాలలో జదువుచున్న బాలురుకొందఱువచ్చి, తమరొక నాటకసంఘమును స్థాపింపదలచి యున్నామని, దానికి నధ్యక్షతవహించి, కొన్నినాటకములను వ్రాసియీయవలయుననియు నన్ను గోరిరి. నేవారియభీష్టము నన్యథాకరింపజాలక యందునకంగీకరించి, హరిశ్చంద్రచరిత్రాది పురాణ కథలను, యుగంధరవిజయమనుపేర బ్రతాపరుద్రుని చరిత్రమును, 'శివాజీ నాటక'మనుపేర శివాజీవఱకు గొంతకొంత మహారాష్ట్రచరిత్రమునుజేర్చి నగటున ముప్పదియొక్క నాటకములు వ్రాసియిచ్చితిని. వానినా 'గుంటూరి నాటకసంఘము'వారు గుంటూరు, బెజవాడ, రాజమహేంద్రవరములలో బ్రవర్తించియున్నారు. వానింజూచి సంతుష్టులై యచటి యుద్యోగస్థులు, పెద్ద మనుష్యులు ననేకులానాటక రచనంగూర్చియు, బ్రవర్తనముం గురించియు బెక్కువిధముల శ్లాఘించుచు దమయభిప్రాయముల నుత్తరములమూలమున నాకందించియున్నారు. అయిన నా సంఘములో బెక్కురానాటకములను స్వోపయోగమునకై యుంచుకొనవలయునేకాని ముద్రాపణము చేయింపగూడదను నభిప్రాయములు గలవారగుటంజేసి యందెద్దియు బ్రచురించుట కవకాశము గలుగదయ్యె."

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 31 నాటకములను వ్రాసియున్నను, అందులో ఒక్కటియును ముద్రితము కాలేదు. చివరకు వ్రాతప్రతులుకూడ అంతరించిపోయినవి. వారికుమారులు గోపాలకృష్ణయ్యగారు 15 నాటకముల వ్రాతప్రతులను సేకరించి కాపీలుచేయించినారట; కాని అవికూడ అదృశ్యమైపోయినవి. ఇది చాల దురదృష్టకరమైన విషయము. గోపాలకృష్ణయ్యగారి లేఖనుండి పై పదునైదునాటకముల పేర్లుమాత్రము తెలియుచున్నవి—1. గయోపాఖ్యానము, 2. శ్రీయాళరాజు చరిత్ర, 3. వజ్రదంష్ట్రోపాఖ్యానము, 4. శుకరంభాసంవాదము, 5. శశిరేఖా పరిణయము, 6. సుభద్రాపరిణయము, 7. శ్రీరామజననము, 8. కీచకవధ, 9. హరిశ్చంద్రోపాఖ్యానము, 10. సుగ్రీవపట్టాభిషేకము, 11. సీతాన్వేషణము, 12 సీతాపహరణము, 13. ద్రౌపదీవస్త్రాపహరణము, 14. యుగంధరవిజయము, 15. శివాజీవిజయము. పై నాటకముల పేర్లను పరిశీలించినచో నేడు తెలుగుదేశమున ప్రసిద్ధివహించియున్న పెక్కునాటకముల ఇతివృత్తములను సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆనాడే (1881-84) ప్రప్రథమముగా తెలుగులోనికితెచ్చి, నాటకీకరించి యున్నారని స్పష్టమగుచున్నది.

## గయోపాఖ్యానము :

శాస్త్రిగారి మనుమలైన దిగంబరశర్మగారియొద్ద గయోపాఖ్యానముయొక్క అసంపూర్ణమగు వ్రాతప్రతి యొకటియున్నది. అందు 12 రంగములు సంపూర్ణముగాను, 13 వ రంగ

ప్రారంభమును కలవు. రంగములు చాలచిన్నవి. ఈ వ్రాతప్రతిని ఎవ్వరో బాలుడు వ్రాసి యుండవలెను; అంతయును తప్పులు తడకగానున్నది. గయుడు శ్రీకృష్ణునిచేతిలోకాక గాలవ ఋషి యర్ఘ్యమిచ్చుచుండగ నతనిచేతిలో నుమిసినట్లును, అతడు తన పరాభవమును శ్రీకృష్ణున కెరింగింపగా మహర్షిని పరాభవించినందులకు శ్రీకృష్ణుడు గయునిదండింపనెంచినట్లును, అందు వలన శ్రీ కృష్ణార్జునులకు యుద్ధము జరిగినట్లును ఇందున్నది. ఇందు గాలవునిపాత్ర చాల చిత్రముగానున్నది. అతనిచే కృష్ణుని అనిపించినమాటలు బాగుండలేదు; ఇట్టిపనిని ఉత్తర హరి వంశములో నాచనసోముడుకూడ చేసియున్నాడు.

## వస్త్రాపహరణము :

ఇది 1896 లో ప్రకటింపబడినది. శాస్త్రిగారి నాటకములలో ముద్రితమైనదిదియొక్క టియే. గుంటూరులో నుండగా వ్రాసిన ద్రౌపదీవస్త్రాపహరణమును, ఇదియును ఒక్కటికాదు. ఈ వస్త్రాపహరణమును చెన్నపురిలోని దీనపోషక సభవారికొరకు వ్రాసినారు (దీనికిశాస్త్రిగారే అధ్యక్షులు). కథాక్రమణికయును మారిపోయినదని పీఠికలోచెప్పుకొనినారు. శాస్త్రిగారు మొదట ద్రౌపదీవస్త్రాపహరణమునువ్రాసి, ఆ కథానుక్రమణికను మార్పుచేసి, 1896లో మరల వస్త్రాప హరణమును వ్రాయులోపల ఇంకొకరెవ్వరును వస్త్రాపహరణగాథను స్వీకరించి నాటకీకరించి నట్లు కన్పట్టదు; అందుచేవారికి వేరొకవస్త్రాపహరణనాటకము మార్గదర్శకముకాలేదని తలంచు చున్నాను. శాస్త్రిగారి ఈ రచనపై శ్రీధర్మవరమువారి రచనాప్రభావము అధికముగా కన్పట్టు చున్నది— నూత్నవృత్తములను వ్రాయుట,[4] పద్యములలో చెప్పినభావములనే వచనములలోను పాటలలోను చెప్పుట, ద్విపదలో ఉత్తరరంగమును వ్రాయుట మొదలగునవి. (దీనిని రచించు నాటికి శాస్త్రిగారు మద్రాసులో శ్రీ ధర్మవరమువారి సరసవినోదినీసభాప్రదర్శనములనుతిలకించిచూచే యున్నారు).

ఇందులో కొన్ని నూత్నకల్పనలుకలవు. "13 సంవత్సరములతరువాత నీవు దుర్యోధనుని అపరాధము కారణముగా అనేక క్షత్రియసమూహములను చంపుదు"వని వ్యాసుడు ధర్మజునితో చెప్పెనట. అప్పుడు ధర్మజుడు "నేఁడు మొదలుగాఁ బదుమూఁడేడులు దుర్యోధనుని కహితముగఁ బల్కన్, వేడిమిమాటలకును మాఱాడఁబోను......" అని ప్రతిజ్ఞపట్టెనట. (పుట 14). ధర్మజుడు జూదమునకంగీకరించుట కిదేకారణము. భర్తృపరాభవమునకు ప్రతిగా ద్రౌపదీ వస్త్రాపహరణమను నూహమును దుర్యోధనునకు గలిగించినది భానుమతియేయనియు, ద్రౌపది తమకు దాసికావలయునని భానుమతి గౌరీవ్రతముచేసినట్లును ఇందుగలదు. మొదటి యూహసమంజసముగా కన్పట్టదు; చివరకు ఆమెయే నడివీధిలో వివస్త్రయై భంగపడినది.

అంతటను వృత్తరచన సరళముగా చక్కగా సాగినది. "......ఐనను నేను సర్వజ్ఞుడనుగాను. నాగ్రంథమున నొరులు దప్పులుపట్టగలరాయను నభిమానము నాకులేదు......" అని వస్త్రాపహరణపీఠికలో చెప్పుకొనగలిగిన వినయధీరులు శాస్త్రిగారు. ఇంతకు పూర్వము వ్రాసిన నాటకములు కేవలవచన నాటకములుకాగా ఇది గద్య-పద్యాత్మకమగుట విశేషము. ఇందు ఐదు అంకములున్నవి. 1, 3, 4 అంకములందు రెండేసి రంగములున్నవి; వీనిలో మొదటిరంగము

చూపినారు. మరియు అనువాదములో పోర్షా 'తెలుగువారి ఆడుపడుచు'వలె తయారైనది; ఆమె జుట్టు నల్లగానే ఉన్నట్లు వర్ణింపబడెను. కాని, భూమికలపేర్లు, సన్నివేశములు మొదలగువానిని అట్లే ఉంచి, వీనిలో స్వాతంత్ర్యమును చూపినంతమాత్రమున కలిగిన శిష్టతయేమియునులేదు.

"కొన్ని కొన్ని దేశములలోఁ గొందఱు ప్రసిద్ధపురుషులుందురు. వారొక్కొక్క గుణంబునకు నుపమానంబుగఁగైకొనఁబడుదురు. అట్టివారాదేశములవారికేవిధమైన శ్రమములేకయే బోధయగుదురు. కర్ణునకేమిగుణము ప్రసిద్ధమైనదో, ధర్మరాజును హరిశ్చంద్రుఁడును నెందులకుఁ బ్రసిద్ధివడిసిరో మనదేశస్థులందరు లెస్సగనెఱుంగుదురు......కావున వీరింజెప్పుట యితరదేశములలో నిరుపయోగముగ నుండు......" అటులనే ఇతరదేశపు వ్యక్తులనుగూర్చి మనదేశము వారికి చెప్పుటవ్యర్థము అనునూహతో అనువాదములో శ్రీరామమూర్తిగారు మూలమందలి గ్రీకుపురాణగాథాసంబంధి ప్రసంగములను వదలివేసినారు.

మొత్తమునకు, ఆంగ్లనాటకానువాదకులలో ప్రథములైన మువ్వురును (శ్రీయుతులు వాసుదేవశాస్త్రి, వీరేశలింగం పంతులు, శ్రీరామమూర్తి) మూడుభిన్నమార్గములను త్రొక్కియుండుట స్పష్టము.

## శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి[1]

కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గుంటూరు మిషనుహైస్కూలులో పనిచేయుచున్నప్పుడు దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులుగారు అందులో చదువుచుండిరి. ఆ రోజులలో, పాఠశాలాధికారులు, ఏటేటజరుగు వార్షికోత్సవసభలలో బాలురచేత పద్యములు చదివించుచు, వినోదసంభాషణలు చేయించుచుండెడివారు. ఒకసారి ఒక విద్యార్థితో అట్టి సంభాషణకావించుటలో వేంకటప్పయ్యపంతులుగారు రోకంటిపాటవలె పాడక సహజరీతిని సంభాషించుటచేత సభ్యులందరును ఆనందమొందిరట. సుబ్రహ్మణ్యశాస్త్రిగారుకూడ ఇట్టి వినోద సంభాషణములను కొన్నింటిని (1880 ప్రాంతముల) వ్రాసియున్నారు.[2] ఇంతలో ధార్వాడ నాటకసమాజమువారు గుంటూరుకూడవచ్చి 1881 ప్రాంతముల నాటకప్రదర్శనము లిచ్చినారు. వారి నాటకప్రదర్శనములు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాటకరచనకు ప్రోత్సాహకరములయ్యెనని వేంకటప్పయ్యపంతులుగారు వ్రాసియున్నారు (స్వీయచరిత్ర_పుటలు 21_23).

"అప్పుడు (1880_81 లో) మాకు ఆంధ్రోపాధ్యాయులుగానున్న శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కొన్నినాటకములు తెలుగున వచనశైలినివ్రాసి, వానిని ప్రదర్శింపవలెనని కుతూహలపడుచు, వారు అందులకు నాటకపాత్రలుగ మార్చతలచినవారిలో నన్నుగూడ చేర్చి ప్రోత్సహించిరి...ఈ (ధార్వాడ) నాటకసంఘము ఆంధ్రదేశములో చాలా స్థలములందు ప్రదర్శనములుగావించి ప్రఖ్యాతిచెందెను. కావున వచనముననే కొన్ని నాటకములువ్రాసి, సిద్ధముచేసి, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కొందరు విద్యార్థులను, నాటకములందు ప్రీతిగలవారిని చేర్చి, సొమ్ముసంపాదింపవలెనను నుద్దేశముతోగాక కేవలము ఆత్మానందము నిమిత్తము ప్రజల నానందింపజేయుటకు నుద్దేశించి గుంటూరు హిందూనాటకసమాజ మనునొక సమాజమును

వీథియో, ఉద్యానవనమో అగును. ఇవి అర్థోపక్షేపకతుల్యములు. కాగా, ఐదు అంకములును, సంస్కృత నాటకములందువలె, ఐదురంగములని చెప్పవచ్చును. చివరిఅంకము చాలపెద్దది. ఇదియేవస్త్రాపహరణ రంగము. ఇందు భీమునిపాత్ర చక్కగాపోషింపబడెను. మొత్తమునకిది ప్రదర్శనయోగ్యమైన చక్కనినాటకము.

వీరేశలింగం పంతులుగారు సమాజమును స్థాపించి, విద్యార్థులచే నాటకములాడించిరి. కాని 'నా' అన్నవారినెవ్వరిని అందుప్రవేశపెట్టలేదు. కాని సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ అన్న కుమారులైన గోపాలకృష్ణయ్యగారిచేత ఒకటి రెండుసార్లు లోహితాస్యుడు వేషమువేయించినట్లు తెలియుచున్నది. (శాస్త్రిగారు తాము అపుత్రకులగుటచేత ఈ గోపాలకృష్ణయ్యగారినే తరువాత దత్తతచేసికొనినారు).

సులభశైలిలో, ప్రదర్శనయోగ్యములును జనరంజకములును అయిన బహునాటకములను రచించి, దేశికులై ప్రదర్శింపజేయుట, ముప్పదిసంవత్సరములుపైగా గొప్పప్రసిద్ధితో సాగిన సమాజమునకు స్థాపకులలో నొకరై ప్రథమాధ్యక్షులగుట, తనవారిని రంగముమీద ప్రవేశపెట్టుట అను విషయములలో సుబ్రహ్మణ్యశాస్త్రిగారు విశిష్టులగుచున్నారు.

## శ్రీ వడ్డాది సుబ్బారాయుడు[1]

వ. సు. రాయకవిగా సుప్రసిద్ధులై, సహస్రమాసజీవితోత్సవమును చేసికొన్నధన్యజీవి వడ్డాది సుబ్బారాయుడుగారు. తొలి తెలుగునాటకకర్తలలో వీరికి విశిష్టస్థానము కలదు. వసురాయ కవిమొత్తము 7 నాటకములను రచించినారు—1. వేణీసంహారము (రచన_1883; ప్రచురణ_1886); 2. విక్రమోర్వశీయము (రచన_1884; ముద్రణ_1889); 3. ప్రబోధ చంద్రోదయము (రచన_1891; ముద్రణ 1893); 4. చండకౌశికము (1900). 5. అభిజ్ఞానశాకుంతలము (1906); 6. మల్లికామారుత ప్రకరణము (మొదటి ఆరు అంకములు_1903; చివరి నాలుగు అంకములు_1929); 7. ఆంధ్రకుందమాల (రచన 1931; ముద్రణ_1932). ఈ నాటకములన్నియును సంస్కృతానువాదములే; అన్నియును పాఠ్యగ్రంథములుగా నిర్ణయింపబడినవే.

### వేణీసంహారము :

సంస్కృత రామాయణ_భారతగాథల విషయమున అనుమానములు పరిశ్కృతములుగా నున్నవి. కవులు, ముఖ్యముగా నాటకకర్తలు, ఒక్కొక్క ఘట్టమును గైకొని, కొన్నిక్రొత్త కల్పనలుచేసి ఆ అనుమానములను పోగొట్టుటకు, చక్కని సమన్వయమును కుదుర్చుటకును ప్రయత్నించిరి. అభిజ్ఞానశాకుంతలమందలి దుర్వాసశ్శాపవృత్తాంతకల్పన మట్టివానిలో నొకటి. అట్లే, భట్టనారాయణుడును వేణీసంహారమందు కొన్నిక్రొత్తకల్పనలనుచేసెను.[2] ప్రౌఢరీతిని సంతరింపబడిన ఈ వేణీసంహారమునకు సంస్కృతరూపకచరిత్రలో ప్రముఖస్థానమేకలదు. అట్టిదానిని, వసురాయకవిగారు అంతప్రౌఢముగాను తెనుగులోనికి అవతరింపజేసినారు. ముఖ్యముగా పద్యములు పొందికగా, పొంకముగా కుదిరినవి. శ్రీ చిలకమర్తివారు స్వీయచరిత్రలో

పేర్కొన్నట్లుగా "ప్రాణంబులు లేచివచ్చు పద్యమువిన్నన్"(పుట 152). వచనభాగమంతయును పూందాగా గ్రాంధిక భాషలో సాగినది. (అయినను తరువాతి కాలములో ఈ అనువాదము తీవ్రవిమర్శకు గురియైనది).

ఈ వేణీసంహారము ముద్రింపబడుటకు ముందే, ప్రప్రథమముగా 1883 వ సంవత్సరాంతమున వేగాయమ్మపేట (కవిగారి పూర్వనివాసము) లో వాడ్రేవు రంగనాయికాంబారాజ్ఞిగారి మందిరమున ప్రయోగింపబడెను. ఆ ప్రదర్శనము శ్రీ వాసుదేవదీక్షితులవారి ప్రశంసకు పాత్రమైనది. ఈ నాటకము ప్రప్రథమముగా ప్రదర్శింపబడిన పై ముహూర్తము సుముహూర్తము. నాటినుండి ఒక అర్ధశతాబ్దముపాటు ఈ ఆంధ్రవేణీసంహారము తెలుగునాటకరంగమున జైత్రయాత్రచేసినది. దీనిని ప్రదర్శింపని తెలుగునాటకసమాజము లేదన్నచో అతిశయోక్తి కానేరదు. తమ నాటకప్రదర్శనము విజయమందుటతో ఒక నాటక సమాజమును స్థాపించుటకు శ్రీ వసురాయకవి పూనుకొనెను. అదియే "హిందూనాటకోజ్జీవకసమాజము." ఈ సమాజమున కవిగారు కవులును, దేశికులును మాత్రమే కాక నటులుకూడను. వసురాయకవి వేణీసంహారములో ధర్మరాజుపాత్రను, అశ్వత్థామపాత్రను, శక్తిమంతముగా, అతిసహజముగా అభినయించినట్లు శ్రీచిలకమర్తివారు స్వీయచరిత్రలో పేర్కొనినారు (పుట 150-51).

తొలి తెలుగునాటకకర్తలలో భూమికాధారణముచేసిన ప్రథములు సుబ్బారాయుడుగారే. ఇట్లు ఉత్తమనాటకకర్త, నటుడు, దర్శకుడు, సమాజస్థాపకుడు అయిన శ్రీవసురాయకవి ఆంధ్రనాటకరంగచరిత్రలో ప్రత్యేకస్థానము కలిగియున్నారు.

ఇంక తక్కిన అనువాదములు ప్రదర్శింపబడినట్లు కన్పట్టవు. కాని, అనువాదములు సరళముగానే యున్నవి. ప్రబోధచంద్రోదయానువాదము చక్కగాసాగినది.[3] చండకౌశికవిషయమును శ్రీ బలిజేపల్లివారి హరిశ్చంద్రను గూర్చి వ్రాయునప్పుడు తెలిపెదను. ఇంకశాకుంతలానువాదమునకు వీరు లఘుటీకను రచించి ప్రకటించినారు. కవిగారు ఈ నాటకములన్నింటికిని కవికాలాదులనుగూర్చి చర్చించుచు పీఠికలను సంతరించియున్నారు.

## శ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవి[1]

పురుషోత్తమకవిగారి తండ్రి, శ్రీ కామయార్యుడు 1-11-1864 తేదీన సముద్రమునకు వచ్చిన పెద్ద ఉప్పెనలో సర్వస్వమునుకోల్పోయి, ఆలుబిడ్డలతో ప్రాణములు దక్కించుకొని బైటపడిరి. అటుపిమ్మట బ్రతుకుతెరువునకై బందరునుండి హైదరాబాదుచేరినారు. ఆ విధముగా బాల్యమున 2 మొదలు 12 సంవత్సరముల వరకు పురుషోత్తమకవి హైదరాబాదులో నుండుట జరిగెను. అప్పుడు వారికి హిందూస్తానీ ధారాళముగా అలవడెను. బందరు తిరిగివచ్చిన తరువాత తెలుగునేర్చి కవిత్వము వ్రాయదొడగిరి. వీరిమీద సిద్ధేంద్రులవారి భామాకలాపము యొక్కయు, వీథి నాటకములయొక్కయు ప్రభావ మధికముగాకలదు. అందుచేవారు ప్రప్రథమముగా తమ 16 వ ఏటను (1879) 'అహల్యాసంక్రందననాటకము' అనెడి యక్షగానమునురచించిరి. అది మరు సంవత్సరమే 1880 లో ముద్రితమయ్యెను (అనేకులు వీథినాటకులు దీనినాడినారట).అటు

పిమ్మట 1881 లో బందరులో ధార్వాడవారు ప్రదర్శించిన రెండు నాటకములను చూచినారు. 1884 జనవరిలో (కవిగారు రేపల్లెలో ఉపాధ్యాయులుగా పనిచేయుచున్నప్పుడు) బందరు 'నేషనల్ థియేట్రికల్ సొసైటీ మేనేజరు శ్రీ దాసాని వేంకటస్వామినాయుడువచ్చి, తమకు హిందూస్తానీనాటకములను వ్రాసిపెట్టవలయునని కోరిరి. ధార్వాడవారి ప్రదర్శనములను చూచినపిమ్మట అన్నిపురములందువలెనే బందరులోను సమాజములు బయలుదేరినవి. వానిలో కేవలము హిందూస్తానీ నాటకములను ప్రదర్శింపవలెననెడి పట్టుదల నేషనల్ థియేట్రికల్సొసైటీవారికి గాఢముగా నుండెను. వారి యీ కోరికయే పురుషోత్తమకవిగారి హిందూస్తానీ నాటకరచనకు ప్రేరకమైనది. పరభాషలో నాటకములువ్రాసి వన్నెకెక్కిన తొలితెలుగు నాటకకర్త శ్రీ పురుషోత్తమ కవియే.

## హిందూస్తానీ నాటకములు :

తను హిందూస్తానీ నాటకరచనా విధానముమగూర్చి కవిగారు క్రిందివిధముగా వ్రాసికొనిరి (శ్రీ చంద్రహాసచరిత్ర పీఠిక-1916)—

"1884 జనవరిలో నాయొద్దకు దాని (నే.థి.సొ.) మేనేజరు దాసాని వెంకటస్వామి నాయుఁడుగారువచ్చి నన్ననంత విధముల నుత్సాహపరచి విడువకయనుసరించి పనికిఁజొప్పించెను. నేను జిన్ననాటి తుర్కీయు నప్పటి సంస్కృతమును ధార్వాడావారి రెండు నాటకాలుచూచిన యనుభవము నండజేసుకొని, నా యిష్టదేవునిపై భారముపైచి పనిఁబూనితిని. నా 10 ఏండ్ల ప్రాయమున హైదరాబాదులో మహారాష్ట్రి హరిదాసులు హిందూస్థానితో హరికథలు చెప్పఁగా నేను వినియుండినదియును వారు కథాసందర్భముగల చిన్న 'టపాలు' నడుమ పాడుచుండఁగా నా చిన్నబుద్ధికి వినముద్దుగనుంచుండినదియును నాకా తరుణమున స్ఫురించి యట్టివి సూత్రధారునకేర్పఱుతమనిపించెను. నాటకముయొక్క చిన్న పెద్దతనములనుబట్టి యిఱువది మొదలఱువదివఱకట్టి 'టపా'లేర్పడెడివి. ఏ వేషధరులయిన దేవప్రార్థనలుచేయనగు పట్లందెల్లను దండకములో వృత్తములో వేయుచుందమనిపించెను. నాటకములు వ్రాయఁబూనఁగనె తత్తత్సమయానుకూలముగఁ దత్సమభూయిష్ఠముగనొ తద్భవయుతముగనొ ఫార్సీలబ్జులంగూడియొ కేవలమ్లేచ్ఛభాషగనొ పాత్రోచితభాష దానికదియె పడుచుండెడిది...ఆ మేనేజరుగారి చేతికపుడు రెండు నాటకములు వ్రాసియిచ్చి మఱి నెలనాటికి మూడు నాటకములువ్రాసి యంపితిని. ఆ యన్నియు నా సొసైటీనాటకులతిప్రీతితోఁ దయ్యారుచేసిరి.........32 నాటకములువ్రాసి ఆ 'నే. థి. సొ.' వారికిచ్చితిని..."[2]

మరియు "నాటకారంభమున గజానన సరస్వతీ ప్రదర్శనముల యేర్పాటు ధార్వాడవారినిబట్టి పుట్టిన గాణాపత్య సంప్రదాయమె. విదూషకసంబంధము వారిదిమాత్రమెకాక సిద్ధేంద్రయోగులవారును, సకల యక్షగాన ప్రబంధకర్తలు ననుసరించినది యైనందున నాకు నదియె బాగనిపించి యే నావిధమనుసరించితిని. అంకముల పరిగణనములేకుండుటకును వారి ననుసరించుటయె కారణము" అని రామదాసచరిత్ర పీఠికలో (పు. viii) వ్రాసికొనియున్నారు. కాగా యక్షగానాదులందువలె వీరి నాటకములందును సూత్రధారుడు నాటకాంతమువరకును రంగస్థలమందేయుండి, సంధివచనములను చెప్పుచుండును. నాటకములందంకవిభజనము లేదు. సంభాష

ణలు సుదీర్ఘములుగానుండుట బహుళము. 'టపాలు' (కీర్తనలు) బహుళముగాను, సంస్కృత శ్లోకములు ఎడనెడను కన్పట్టుచుండును. గీర్వాణముంబట్టి గణబద్ధత, ఉర్దూనుబట్టి యంత్య నియమము, ఆంధ్రతంబట్టి యతిప్రాస లుండునట్లు మున్పడి కష్టముపెట్టుకొని వీరు కవిత్వమును సాగించినారు. మొత్తముమీద కవిగారి హిందూస్తానీ నాటకభాష సంస్కృత పదభూయిష్ఠమై, ఆ భాషరాని తెలుగువారికికూడ సుబోధకముగానే యుండును.[3]

కవిగారు తమ 32 హిందూస్తానీనాటకములను 1884 మొదలు 1886 లోపలనే రచించినారు. 'నే. థి. సొ.' వారు వీనిని 10, 15 ఏండ్లు పలుమారనేకపురములందు ప్రదర్శించి పొగడ్తలుకాంచిరి. కవిగారు, ధార్వాడవారియెదుట నొసంగబడిన ప్రథమ ప్రదర్శనమున సూత్రధారుడుగా రంగస్థలమెక్కి, వారి పొగడ్తనందినారట. కవిగారి నాటకములలో శ్రీ రామదాసచరిత్రము ప్రప్రథమముగా ముద్రితమైనది (1916).[4] దీనికే కవిగారు విపులమైన పీఠికను సంతరించియున్నారు. (దీనితోపాటే వారి తెలుగు 'చంద్రహాసచరిత్ర' నాటకమును ముద్రితమైనది). అటుపిమ్మట 1941 లో వారికుమారులు మరి ఐదు నాటకములను ప్రకటించి యున్నారు—అహల్యాసంక్రందన నాటకము, సీమంతినీచరిత్రము, భద్రాయురభ్యుదయము, కీర్తిమాలినీ ప్రదానము, అపూర్వదాంపత్యము. ఇవి అన్నియును తెలుగులిపిలోనే ముద్రితము లైనవి; రంగస్థల సూచనలుమాత్రము తెలుగుభాషలోనే కలవు. కవిగారి ఈ రచనలలోని విశేషము 'పాత్రానుకూల భాషాప్రయోగ వైలక్షణ్యము'— భాష రాజామాత్యాదులకు ఫార్సీ లబ్జులుకలదిగను, మునిపురోహితాదులకు సంస్కృత దీర్ఘసమాసభూయిష్ఠముగను, సేవకాదు లకు కేవలము తురుష్కముగను, ఇతరులకు హిందీగాను వ్రాయబడుట గమనార్హము. తెలుగు దేశమున పాటలను, పద్యములను మొదలుపెట్టినదియును పురుషోత్తమ కవిగారే.[5]

## తెలుగునాటకములు :

మిత్రులు కవిగారిని కలిసినప్పుడెల్ల "అప్పటి తెలుగునాటకములలోఁ బాత్రోచిత భాషయే లేకున్నదనియు, నట్టి తెలుగునాటకమొకటి వ్రాయు"డనియు హెచ్చరింపసాగిరట. "ప్రపంచమునకెపుడును మార్పులొందుచుండుట సహజధర్మము. తొల్లిటి సంస్కృతనాటకములు, సిద్ధేంద్రయోగులవారి భాగవతములు, దరిమిలా కవుల వీథినాటకాలు, నప్పటి వచననాటకాలును జూడఁగా నింకెన్నిమార్పు లెట్లెట్లుపుట్టునో యిదిమాత్ర మభిరుచి చెడకుండవలెనని యోజించి ప్రదర్శనమునకెకాక 'నవల' మాదిరిగాఁ జదివించుకొనుటకు దగినట్టి సంధివచనములతోఁ గడు సులభశైలినినిట్లు సర్వధారి వత్సరమున (1888) వచ్చిన మొహరంపండువులం దైదుదినాలలో (హరిశ్చంద్ర నాటకమును) వ్రాసితిని'' అని కవిగారు పీఠికలో చెప్పుకొనినారు. వీరి తెలుగు నాటకములలో హరిశ్చంద్రయే ప్రథమము. రచన 1888; మొదట 'బుధవిధేయిని' లో ప్రక టితమై పిమ్మట 1890 లో గ్రంథరూపమున ప్రకటితమైనది. ఇది 'పాత్రోచిత ప్రసంగవచన సమన్విత'మని పేర్కొనబడినది; మరియు నిందు అంకవిభజనము లేదు; అంతటను సంధివచన ములు కలవు. కవిగారేవ్రాసినట్లు ఇది నవలవలె చదువుకొనుటకు తగియున్నది; అసలు, చాల చోట్ల సత్యనారాయణ వ్రతజాగరణమునకుఁ గాలక్షేపముగా నిది చదివించి వినుచుండెడివారట!

ఇంక 'చంద్రహాసచరిత్ర' పది అంకముల నాటకము. దీనిని ప్రథమముగా ప్రదర్శించినప్పుడు పద్యములులేవు; కీర్తనలుమాత్రమే ఉండెనట. కాని, ముద్రణమునకుముందు కీర్తనలనెల్ల పద్యములనుగా మార్పుచేసినారు. ఇందులకు కారణము 'నాటి నాటకులు(నటులు) పద్యములనెక్కువగా అభిమానించుచుండుటయే. మరియు, నాటి పద్ధతినిబట్టి తమకు అభిమానపాత్రమైన "పాత్రోచితభాష"నుకూడ వీరిందు విడిచివేసినారు. ఇది కాలప్రభావము : రచనమాత్రము సరళముగానే యున్నది. ఇందు కవిగారు లాటీవిటము, పాలాశదళము, వనమయూరము మొదలగు అపరూప వృత్తములనుకూడ వాడియున్నారు. మొత్తమిందు 345 పద్యములున్నవి: 1916 లో ఇది ముద్రింపబడునాటికి తెనుగుదేశములో పద్యమయనాటకముల ప్రభావమధికముగా నుండెను.

పై రెండు తెలుగునాటకములనేకాక పారిజాతాపహరణము, సారంగధర నాటకము, ద్రౌపదీవస్త్రాపహరణము – అను మరిమూడు తెలుగునాటకములనుకూడ రచించియున్నారు; కాని, అవి ముద్రింపబడలేదు. పరభాషలో, స్వభాషలో పెక్కునాటకములను రచించిన పురుషోత్తమ కవిగారికి తెలుగునాటకరంగచరిత్రలో ప్రత్యేకస్థానముకలదని పేర్కొనియున్నాను. కవిగారు నాటకములను వ్రాసియిచ్చుటతో తృప్తినందక, ఆ క్రొత్తభాష నందరిచేతను పలికింపజేసి (అనగా వాచికాభినయమునేర్పి) ఆచార్యత్వమును నెరపినారు. అంతియేకాక, అప్పుడప్పుడు వారే సూత్రధారత్వమునుకూడ నెరవుచుండెడివారు, వారి ఆచార్యకత్వములోనే 'బందరు నేషనల్ థియాట్రికల్ సొసైటీ' ఉన్నతస్థితినంది, వినుతికెక్కినది.

## శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి

1. శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి జన్మస్థలము— అమలాపురముతాలూకా 'కేశనకుఱ్ఱు' గ్రామము.

   జననము—యువ సంవత్సర (క్రీ. శ. 1816) ఆశ్వయుజ శుద్ధదశమి.

   మరణము—శార్వరి (క్రీ. శ. 1900) శ్రావణ బహుళపాడ్యమి.

   తల్లిదండ్రులు—సుబ్బమాంబ, లక్ష్మణశాస్త్రి.

   వీరి మూలపురుషుడగు మహాదేవుడుగారికి శ్రీశైల భ్రమరాంబిక ప్రత్యక్షదైవమట. లక్ష్మణశాస్త్రిగారు చిన్ననాడే శ్రీరామతారక మంత్రోపదేశమును పొందినారట. రామచంద్రశాస్త్రిగారిని 'రామచంద్రకవి' అనికూడ అందురు. వీరి కవితాగురువులు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు. రామచంద్రశాస్త్రిగారు బందరు నోబిల్ పాఠశాలలోను, అటుపిమ్మట కళాశాలలోను 40సంవత్సరములు ఉపాధ్యాయులుగా పనిచేసి, విరమించిరి. వీరు స్వతః పరమస్వతంత్రులనియు, దొరలందరును వీరినతిగౌరవముతో చూచెడివారనియు ప్రతీతి. వీరు యశోలుబ్ధులును, ధనకాంక్షులును కాకపోవుటచేత తమ పాండిత్యమును చాటుకొనుటకుకాని, తమ గ్రంథములను వెంటనే ముద్రించుటకుకాని ప్రయత్నింపలేదు; కాగా కొన్నిరచనల వ్రాతప్రతులుకూడ లభింపలేదు.

2. కవిగారి గ్రంథములలో 22 సంస్కృతభాషవి; ఏడు ఆంధ్రీకరణములు; రెండు స్వతంత్ర గ్రంథములు.

   వీనిలో గీర్వాణరూపకములు నాలుగు— 1. శృంగారసుధార్ణవ భాణము; 2. రామచంద్రవిజయ వ్యాయోగము; 3. కమనానంద భాణము; 4. త్రిపురాసురవిజయ డిమము.

ఆంధ్రీకృతరూపకములు ఐదు—1. వేణీసంహారము; 2. శాకుంతలము; 3. ముద్రారాక్షసము; 4. ఉత్తరరామచరితము; 5. ఉన్మత్తరాఘవము.
స్వతంత్ర ఆంధ్రరూపకము— 'మంజరీమధుకరీయ' మొక్కటియే.

ముద్రితములు—1. ఉన్మత్తరాఘవము (1891); 2. శృంగారసుధార్ణవభాణము (1899); 3. మంజరీమధుకరీయము (1908); శాకుంతలాంధ్రీకరణములోని మొదటి నాలుగు పుటలు 'రత్నాకర' మనెడి పత్రికలో (జయ (1894) సంవత్సరము-1 వ సంపుటి-1 వ సంచిక) ప్రకటితమైనవి. ఇందలి ప్రస్తావననుబట్టి శాకుంతలము నాంధ్రీకరించిన ప్రథములుకూడ వీరే యని యూహింపనగుచున్నది.

3. 1872 లో శ్రీ కొక్కొండవారి 'నరకాసురవిజయము' ముద్రితమైనది. 1875-76 లలో మరికొన్ని తెలుగురూపకములు ముద్రితములైనవి. ఇట్టివి ప్రకటితములై, అందరకును లభ్యము లగుటచేతకవిగారుకూడ వీనిని చూచియుందురనుటకు సందేహింపనక్కరలేదు. కాగా, 'మంజరీ మధుకరీయము' నిజముగా వీనికంటె అర్వాచీనరచనయే అగుచో, కవిగారు తత్ప్రస్తావనలో నాటివరకును 'దృశ్యకావ్యములు త్రిలింగభాషయందు గ్రథితములుకాలేదు' అని వ్రాయుట పొసగదు; అంతియేకాదు కవిగారివ్రాతను అనుమానింపవలసిన అక్కరయును కన్పట్టదు. అందు చేత వారి 'మంజరీమధుకరీయము' తొలి తెలుగురూపకమనుటకెట్టి అవరోధమునులేదు.— చూ. 'ఆంధ్రభాషలో ఆదినాటకకర్త'—శ్రీ కోరాడ రామకృష్ణయ్య (భారతి-ఏప్రిల్, 1960).

4. ప్రథమాంకమునుండి చిన్న ఉదాహరణము :

(అనంతరంబున మంజరియు నామోదరేఖయుం బ్రవేశించుచున్నారు)

ఆమో : హలా! మంజరి! సుఖాళంబుగ నుంటివిగదా.
మంజ : అత్తిక! నీవు వచ్చుట నింక యద్దికలుగునని నెమ్మనంబున నే నమ్మెదనే.
ఆమో : హలా! యిట్లంటివేమే?
మంజ : అత్తికా! నీవు నా చెంగటనుంటివే?
ఆమో : హలా! నీ కురంగట నవ్వ మొదలగువారంద ఱున్నారుగదా.
మంజ : అత్తిక! యీయవ్వ తొల్లింటి యవ్వ యనుకొంటివే.
ఆమో : ఇప్పుడు క్రొత్తగ మఱియొకతె యేతెంచెనే?
మంజ : కాదే. యవ్వయయిన యద్దియేకాని, దాని యాత్మ మారినదే.
ఆమో : ఓసీ చెలియా! కాదే, తొల్లింటికంటె నీయాత్మ మారినదే. దాని నెఱుంగక యమ్మను వింతగ దూఱుచున్నావు.
మంజ : అత్తికా! కొన్నినాడులు దదవుననుండుట నీయాత్మయుం దాఱుమాఱయ్యెనని దలంప దగునే.

5. ఈ సందర్భమున Benavente అనెడి స్పానిష్ రూపకకర్త చెప్పిన వాక్యములు గమనార్హములు: "Every thing that is of importance to the proper understanding of a play must be repeated at least three times during the course of the action. The first time half of the audience will understand it; the second time the other half will understand it; only at the third repetition may we be sure that every body understands it, except of course, deaf persons and 'some critics' "

— ("A Study of the Modern Drama" — by B. H. Clark - P. 8)

Scribe అనెడి ఫ్రెంచిరూపక రచయిత ముఖ్యాంశములనెల్ల ప్రథమాంకమందే ముమ్మారు చెప్పెడివాడట. రెండుసార్లు చెప్పుట ఇబ్సెన్‌లోకూడ ప్రధానముగా కన్పట్టును.

6. అనువాదమున కొక ఉదాహరణము.

"యస్యమధురోమాత్యో। దక్షిణపవనో వరూధినీనాథః।
ప్రియ భ్రమరానుచరః। స జయతు చిరం మన్మథోరాజా"

—(యక్షగానము)

అనువాదము—

"ఎవనికి మంత్రి వసంతుం। డెవనికి మలయానిలుండు హితసైన్యవిభుం
డెవనికి ననుచరు లళులగు। శివజేత సుమాస్త్రుడతడు చిరజయమొందున్"

ఉన్మత్తరాఘవమును శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు (1856-1936) కూడ అనువదించి 1899 లో ప్రకటించినారు.

## శ్రీ కొక్కొండ వేంకటరత్నంపంతులు

1. పంతులుగారి జీవిత విశేషములకు నిడుదవోలు వేంకటరావుగారి వ్యాసమును పరిశీలింపవలెను. (మార్చి, ఏప్రిలు, జులై, నవంబరునెలలు, 1951-భారతి). శివశంకరపాండ్యాగారు పంతులుగారి జీవితచరిత్రను ఆంగ్లములో రచించిరి.

జన్మస్థలము—గుంటూరుజిల్లా వినుకొండ (వీరు మాధ్వులు).
జననము—ప్లవ సంవత్సర ఫాల్గుణశుద్ధ తృతీయ భానువారము (24-3-1842).
మరణము—1915.
తల్లిదండ్రులు—రామమ్మ (రామాయమ్మ); నరసింహశర్మ (నరసింగరావు)

పంతుగారి అసలుపేరు 'వేంకటరత్నశర్మ'. 'శర్మ' అనునది క్రమముగా వ్యవహారమునుండి తొలగిపోయినది. వీరికి మొదటినుండియు భక్తితత్త్వము; సహజముగా కంఠమాధుర్యము కలవారు. వీరు 'తనుమధ్యాబిల్వనాథుల' భక్తులు; 16 వ ఏట రచింపబడిన 'బిల్వనాథశతక' మే వీరి తొలిరచన. 1867 లో 'మహాశ్వేత' అనెడి తొలి తెలుగు నవలను వీరు రచించిరి. (శ్రీ వీరేశలింగముగారి 'రాజశేఖర చరిత్ర' 1878 నాటిది). 1876 లో వీరు రచించిన 'ప్రిన్సాఫువేల్సు తారావళి' ఆంగ్లములోని కనువదింపబడి, ప్రథమ బహుమతి గాంచినది; విదేశములలో తెలుగుభాషకు కీర్తితెచ్చిన ప్రథములు పంతులుగారు. 1878 నుండి 1899 వరకును మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్రభాషోపన్యాసకులుగా పనిచేసిరి. 1899 నుండి 1915 లో చనిపోవువరకును రాజమహేంద్రవర కళాశాలలో పనిచేసిరి.

2. శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్యులవారు మొదటివారు. వీరు 'సంస్కృత విద్యా సర్వస్వ' మని పొగడ్తగాంచినవారు. ఇంక పంతులుగారు ఆంధ్రోపన్యాసకులై, ఆంధ్రపండితుడుగా ఈ బిరుదమును పొందిన ప్రథములు. ఈ విషయ మా బిరుదప్రదానసభలోనే వక్కాణింపబడెనట.

3. పంతులుగారు తమ గ్రాంథికవాదముతో తెలుగుభాషకు ఆ కాలములో ఎవ్వరునుచేయని ఒక గొప్ప సేవను చేసినారని కురుగంటి సీతారామయ్యగారు వ్రాసినది పరమసత్యము— 'అది ఇంగ్లీషుకాలము. ఇంగ్లీషుతప్ప ఉపన్యాసాలకు ఇతర దేశభాషలు పనికిరావనీ, అందులో తెనుగులో గ్రాంథికశైలిలో ఉపన్యాసమియ్యటము కష్టసాధ్యమనీ అభిప్రాయముండేది. ఇంగ్లీషుభాషా పండితులలో ఈ అభిప్రాయము ఘనీభవించి ఉన్నది. ఆ కాలములో అప్పుడు సలక్షణమైన

గ్రాంథికాంధ్రములో ఒకప్పుడు వ్రాసతోకూడ గంటలు గంటలు అనర్గళముగా ఉపన్యాసాలిచ్చి ఆ దురభిప్రాయాన్ని ఈయన తొలగించినాడు'—నవ్యాంధ్రసాహిత్యవీథులు (1949)-పుట 39.

4. "... ఈయన (పంతులుగారు) తానువ్రాసిన ప్రహసనములలో వీరిగాడని ఒక పాత్రను సృష్టిస్తే, వీరేశలింగముగారు ఒక ప్రహసనములో ఒక నత్తివాడిని సృష్టించి, వాడిపేరు 'కొ-కొక్కొ-క్కొండ వెంక' డనిపించినారు. ఇద్దరూ చల్లని హాస్యమును వ్రాయగలవాళ్లే ... అసలు ఈ పండితులతో మాట్లాడడమే విజ్ఞానదాయకము..."

—నవ్యాంధ్ర సాహిత్యవీథులు - పు. 39.

5. మనకిప్పుడు లభించునది 1950 లో వావిళ్ళవారు ప్రకటించినదిమాత్రమే. ఇందు దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యయును, కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి టిప్పణమును కలవు.

6. "...తఱుచుగ మూలాభిప్రాయము చెడకుండనున్నది. ఒక్కొక్కచోట నెక్కుడుగనున్నది. ఒక భాషలోని యభిప్రాయములు యథావస్థితములుగ భాషాంతరమునఁగూర్చుట యెంతయు దుష్కరము: మీరు కీర్తిదక్కు వేఱొండు ప్రయోజనమేమియు లేకున్నను, మిగుల నోపికతో నిట్టి కార్యము నిర్వహించుట కెంతయు సంతసించితిని. ఇదివఱకు సంస్కృతానుసారిఁగఁదెలుఁగున నాటక గ్రంథమెద్దియునులేదు. దానికి మీరు ప్రాథమికులయితిరి."

—శ్రీ రేకము రామానుజసూరి (ప్రధానాంధ్ర పండితులు, ప్రెసిడెన్సీకాలేజి)—8-3-1872. శ్రీయుతులు బహుజనపల్లి సీతారామాచార్యులుగారును, చదలవాడ సీతారామశాస్త్రిగారును కలిసి ఇదేవిధముగ ప్రశంసించియున్నారు. ఇప్పట్ల శ్రీ పనప్పాకం ఆనందాచార్యులవారి అభిప్రాయము కూడ గమనార్హము—

"Of Mahamahopadhyaya Sri Kokkonda Venkata Ratnam Pantulu Garu, the author of the drama "Narakasura Vijaya Vyayoga"—I shall have said all that one need, by stating that he may be aptly likened to Dr. Samuel Johnson, the literary dictator of his day. This is the first drama in Telugu..."

7. నిజమునకు సంస్కృత రూపకాంధ్రీకర్తలలో పంతులుగారు రెండవవారయినను. వారి నరకాసుర విజయ వ్యాయోగము ముద్రితాంధ్రరూపకములలో ప్రథమమగుటచేత, వారే ప్రథమాంధ్ర నాటకకర్తలుగా నాటి మద్రాసులోని పండితులచే కీర్తింపబడినారు. ఆ ప్రశంసల నాధారముగా చేసికొని నిడుదవోలు వేంకటరావుగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారి వాక్యములు సత్యసమ్మతములు కావని వ్రాసిపుచ్చినారు (భారతి, ఏప్రిలు, 1951). కాని ఇచ్చట ఒక ముఖ్యవిషయమును గమనింపవలసియున్నది. కవిగారి అనువాదము అముద్రితము. కాని, పంతులుగారి గ్రంథము ముద్రితమగుటచేత, అది అందరకును లభ్యమైనది. వాసుదేవశాస్త్రిగారుకూడ తమ పీఠిక వ్రాయుటకు ముందు దీనిని చూచియుందురనుటలో సందేహింపవలసిన పనిలేదు (మధ్యకాలము 11 సంవత్సరములు). అంతియేకాదు. వారు కవిగారి అనువాదమునుకూడ జూచియున్నారు. అందుచే నిజానిజములు నాటికిని నేటికిని వారికితెలిసినంతగా ఇతరులకు తెలియుటకవకాశములేదు.

8. కఠినశైలి కుదాహరణము :

"శూలాఘాతకృతక్రుదచ్యుతశరస్తోమాహతిస్థాయముల్
చాలం గాయమునం దిలాసుతునకుం జానయ్యె సయ్యారె! ఆ

ఫీలోజ్జృంభణజంభభంజనసముద్వీర్యాతిశౌర్యోగ్రదు
ర్జ్వాలారక్తిత తావకేక్షణ సహస్రత్విట్ప్రమస్జాచుచున్" ॥ప. 80॥

సరళశైలి కుదాహరణము :

"సురరిపు విముక్తమై తనుఁ । బొరసిన తన యస్త్రమునను బొలిచె హరిహరిన్
హరితాలిసంజను వైశ్వా । నరుచే సిఁబడిన స్వరుచి నలువొందుక్రియన్ ॥ప. 83॥

9. బంగారము (క్రొత్త ఛందస్సుపేరు).

"అభుదజ్మణే నరకాసురవిజయమన్ వ్యాయోగ మాంధ్రమునందుఁ జేసితాద్యుఁడవై
యయ్యది పెటుకంబు నాడికొందు కామాటయేటికి? నందఅలర నందముగా
రచియింపుమింకొక రమ్యమౌ రూపకమందును విజయమయ్యర్జునుఁడన నద్రుముగా
వెలయు ధనంజయవిజయమన్ వ్యాయోగమిదెవచ్చె విజయార్థమిత్తటికిని హితముగనే
యూవె యాంధ్రీకరింపుమంచిచ్చె..................."

శ్రీ పాలెపు వేంకట సూర్యగోపాలప్రధాని ధనంజయవిజయానువాదము మొదట చింతామణిలో ప్రకటితమై 1892 లోనే గ్రంథరూపమున ముద్రితమైనది.

10. "...ఈ గ్రంథమందు భాషాంతరీకరణము ప్రాయికముగా తప్పుగానుండును. మూలమున కిది మూలముగాను, దీనికది టీకగాను ఉండును... ఛందోవ్యాకరణముల కిది వేరుపురువు... సావధానముగా తత్త్వమరయువారు వీరికి సంస్కృతము తెలియదనియు, దేవనాగరలిపితెలియదనియు, నాటకలక్షణము తెలియనే తెలియదనియు, ఆంధ్రభాషకు వీరు విషముపెట్టినారనియు, ఇతరుల గ్రంథముల గుణదోషములను చర్చించుటకు వీరు అధికారులు గారనియు, వీరి మతముచే భాష చెడుచున్నదనియు గ్రహింతురు..." —అవతారికలో.

ఈ అనువాదమును విమర్శించుచు శాస్త్రిగారు 1898 లో ఒక ప్రత్యేక ఉద్గ్రంథమును వెలయించినారు—డెమ్మీసైజులో, చిన్నటైపులో 338పేజీల గ్రంథమది. ఇందులో శాస్త్రిగారు 2568 దోషములను చూపించినారు :

## శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులు

1. జన్మస్థలము : విశాఖపట్టణము.

జననము : చిత్రభాను (క్రీ. శ. 1822) సంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి మంగళవారము.

మరణము : వికారిసంవత్సర (క్రీ.శ. 1900) మాఘ శుద్ధ పంచమీ శనివారమునాడు (తునిలో)

తల్లిదండ్రులు : మంగతాయమ్మ, శ్రీనివాసాచార్యులు.

భార్య : తిరువేంగడమ్మ.

ఆచార్యులవారు సర్వతంత్ర స్వతంత్ర జీవితమును గడపినారు. ఎవ్వరికిని తలవంచలేదు. తన్ను గౌరవింపనివారిని, వారెంతవారయినను లెక్కచేయలేదు. ఆచార్యులవారు సూత్నమార్గానుసరణ ప్రియులుకారను. అందుచేతనే శ్రీ వావిలాలవారు వారిని 'Reformer pandit' అని పేర్కొనియున్నారు.

ఆచార్యులవారు బహుసంతానవంతులైనప్పటికిని, కుమారులందరును వారి జీవితకాలమందే మరణించిరి. ఇది వారిని క్రుంగదీసినది. ఆచార్యులవారి పౌత్రులే సుప్రసిద్ధ సంస్కృతపండితులు శ్రీమాన్ పరవస్తు వేంకట రామానుజస్వామి.

2. నాడు క్రైస్తవ మిషనరీలప్రచార మధికముగానుండెను. దానిని అరికట్టుటకు ఆచార్యులవారు పూనుకొనిరి. వారి ఉపన్యాసముల ప్రభావమువలన విశాఖపట్టణములో మిషనరీలప్రాబల్యము తగ్గినదని చెప్పుదురు.

3. ఆధునికులైన రామచంద్రకవి ప్రభృతులు సంస్కృతమున భాణాదులనే రచించిరికాని, నాటక రచనకు పూనుకొనలేదు; ఈ విషయమున ఆచార్యులవారు విశిష్టులు. భారతకథకును, మంజుల నైషధ కథకును కొంత భేదము కలదు. కొన్నిఘట్టములను రసపోషణకొరకు గ్రంథకర్త కల్పించెను. ప్రథమాంకమందలి యంత్రప్రతిమ కల్పనము, ద్వితీయాంకమందలి ఇంద్రజాల ప్రదర్శనము, చతుర్థాంకమందలి కలిద్వాపరుల హాస్యసంభాషణము, షష్ఠాంకమునందలి నలుని నాగలోక గమనము, దమయంతీ స్వయంవర రూపకప్రదర్శనము మొదలగు ఘట్టములిట్టి క్రొత్తకల్పనలు. దీనికి ఆకుండి వేంకటశాస్త్రిగారి అనువాదము 1941 లో ప్రకటితమైనది.

కమలినీకలహంసానువాదము లభ్యముకాలేదు. దీని మూలమును తెలుగులిపిలో ప్రప్రథమముగా ముద్రించినవారాచార్యులవారే.

4. ...“వేంకట రంగాచార్యులయ్యవార్లంగారు శాకుంతలమును దెనిగించిరనియు...విని, నేనా పత్రికను దెప్పించి చదువుచు, వారిది ముగిసినతరువాత పూర్ణముగా చదివి యావశ్యకమైనచో నాది పూర్తిచేయవలెనని నా భాషాంతరము నిలిపివేసితిని. వారును రెండంకములుమాత్రమే యందు ప్రకటించి నిలిపివేసిరి. వారి పుస్తకమును సొంతముగా జదివినపిమ్మట నా పుస్తకమును పూర్తి చేయవలెనని నాటకశేషమును రచింపక నేను నిలిపివేసినట్లే నా పుస్తకము ప్రకటింపబడినపిమ్మట తమది ప్రకటింపవలెనని వారును నిలిపియుందురు. (వీరేశలింగముగారి స్వీ. చ. 2 వ భా. పుటలు 187-188).

5. చూ. రామానుజస్వామిగారి మంజులనైషధాంధ్రీకరణ పీఠిక-పుట. 4. ఇట్లు వ్రాతప్రతులు పోవుట చాలచోట్ల కన్పట్టుచున్నది. పత్రికలలో ప్రకటింపబడిన రెండంకములును, మూడవ అంకములోని అధికభాగమునుగల మరియొక వ్రాతప్రతి రామానుజస్వామిగారియొద్దనున్నది. దానిని పఠనార్థము నాకు దయతో పంపియున్నారు.

6. ఒక ఉదాహరణము :

అనసూయ : అయ్యా, మఱియేమియుం బెడిదంబులేదు, ఈ బిడమానెచ్చెలియ, తుమ్మెదచే వెగడుఁబడినది (శకుంతలం జూపుచున్నారు).

రాజు : (శకుంతలాభిముఖుండై) తపంబు వర్ధిల్లుచున్నదా(శకుంతల సిగ్గుపడుచునుంచున్నది).

అన : ఇప్పుడొక విందువచ్చుటంజేసి - నేమమా అయ్యకు-
చెలియా శకుంతలా, వెళ్లుమాకుటింటికి - పండులతో
డిగ్గయంబుతెమ్మ - ఇది యడుగుల నీరుగాఁగలదు.

రాజు : భవతి, సూనృతవాక్యంబుల చేతన యాతిథ్యంబు నేయంబడె.

ప్రియంవద: కావున నీడచేఁ జలువయగు నీయేడాకులయనంటి యరంగున నయ్య కూర్చుండి యలయిక దీర్చుకొనందగు.

రాజు : మీరు నీపనిచే నలసినారు.

అన : చెలియా శకుంతలా ! మనకు విందుల గారవించుటయె గావలయునది – కాన నిచ్చట కూర్చుండుము (అందఱుం గూర్చున్నారు).

పద్యానువాదమునకొక ఉదాహరణము :

"ఘ్రాతముగాని పుష్పము, నఖంబులద్రుంపని పల్లవం బవి
ద్ధాతులజాతిరత్న మొరులానని పూవున తేనె పూర్వ జ
న్మాతతపుణ్యపూర్ణఫలమౌ నల కోమలి రూపసంపదన్
ధాత భుజింప నెవ్వనికిఁ దా నియమించునొ యేమెఱుంగుదున్."

## శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి

1\. జన్మస్థలము : రేపల్లెతాలూకా: 'కారుమూరు'.

జననము : విరోధికృత్ జ్యేష్ఠ శుద్ధ ద్వితీయా భానువారము (1-6-1851).

మరణము : 13-6-1897.

తల్లిదండ్రులు : మహాలక్ష్మమ్మ; అప్పయ్యశాస్త్రి.

(మహాలక్ష్మమ్మగారు సి. పి. బ్రౌనుదొరకు గురువులైన వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రిగారి తృతీయ పుత్రిక.)

శాస్త్రిగారు ప్రథమశాస్త్ర పరీక్షలో ఆంధ్రదేశమంతటికిని ప్రథములుగ నుత్తీర్ణులైరి. ప్రైవేటుగా పట్టపరీక్షకుకూర్చుండి ఉత్తములుగా నుత్తీర్ణులై. కర్నల్ మాక్డొనాల్డు స్వర్ణపతకమును బహుమానముగా పడసిరి.

శాస్త్రిగారికి సంతానము అక్కరకురాలేదు. అందుచేత వారి మరణానంతరము భార్య పూర్ణ మహాలక్ష్మమ్మగారు బావగారి కుమారులు సీతారామశాస్త్రిగారిని దత్తతచేసికొనినారు. వాసుదేవ శాస్త్రిగారియొద్ద వివిధభాషలకు, వివిధకళలకుసంబంధించిన సుమారు 2000 పుస్తకములతోనిండిన అమూల్య గ్రంథభాండాగారముండెడిది. అది వారి జ్ఞాపకార్థము గౌతమీగ్రంథాలయమున కొసంగబడెను.

2\. "భావను రాజమహేంద్రమునఁ బాదము పెట్టితి; నాఁడిటం గవుల్
వావిల వాసుదేవ గురువర్యుఁడొకడు, వివేకవర్ధనీ
ధీవర పత్రికాధిపతి దేశిక వీరపలింగ మొక్కడుం
గాపుటచేఁ గవిత్రయముగా గణియించిరి మమ్మిటీవలన్".

—వడ్డాది సుబ్బారాయుడుగారి పద్యము.

3\. ప్రసిద్ధ రచయితలు, నాటకకర్తలునగు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము, శ్రీ నుసర్ల అనంతరావు ప్రభృతులానాడు వీరికి శిష్యులో, శిష్యప్రాయులో అయియుండిరి. ఆ కాలములో (క్రీ. శ. 1875 ప్రాంతములు) కళాశాలతరగతులకు లొల్ల రామశాస్త్రిగారును, క్రిందితరగతులకు వీరేశలింగముగారును తెలుగు బోధించుచుండెడివారు. వేదం వేంకటరాయశాస్త్రిగారి పితృపాదులు శ్రీ వేంకటరమణశాస్త్రి కళాశాల తరగతులకు సంస్కృతమును బోధించెడివారట.

4. ఈ సందర్భమున క్రిందివార్త గమనార్హము—

"The literary and scientific world may be interested to learn that Shakespeare's Julius Caesar has been translated into Telugu by Vavilala Vasudeva Sastry. The Curator of Books informs us that this is the first and fair attempt at a metrical translation of Shakespeare into this language."

—"75 Years ago-to-day. — The Statesman —17-4-1952.

1853 లో 'మర్చంట్ ఆఫ్ వెనిస్'ను శ్రీ హేమచంద్రఘోష్ "భానుమతీచిత్తవిలాస" మను పేర వంగభాషలోని కనువదించెను; అది అప్పుడు ప్రదర్శింపబడినదికూడను. తెలిసి నంతలో, భారతదేశమున షేక్స్పియరు రూపకానువాదములకిదియే ఆరంభము. క్రీ. శ. 1872లో K. G. Natu అను రచయిత జూలియస్ సీజరును 'విజయసింహు'డనుపేర మరాటీభాషలోని కనువదించెను; ఈ అనువాదములో నితడు కొంత స్వాతంత్ర్యమునుకూడ చూపెనట. ఇది ఆ సంవత్సమే పూనాలో కళాశాల విద్యార్థులచే ప్రదర్శింపబడినట్లు తెలియుచున్నది. జూలియస్ సీజరునకు ఈ అనువాదము భారతీయభాషలలో మొదటిది; రెండవ అనువాదము శ్రీ వావిలాల వారిది.

5. Julius Caesar = జూలియసుఁడు; సీజరు.

Marcus Antonius = అంతోనియసు; అంతోని; అంతోనీ, మారుకంతొని, మార్కంతోని; అంతొనియసు, అంటొని.

6. అనువాదమునకు కొన్ని ఉదాహరణములు :

(1) Antony : And with Caesar's spirit raging for revenge,
with Ate by his side come hot from hell;
Shall in these confines with a monarch's voice
Cry 'Havoc', and let slip the dogs of war;
That is foul deed shall smell above the earth
with Carrion men, groaning for burial.

[Act III-Scene - 2]

అంతొని : (పుట 73)

"సీజరునియాత్మపగసీఁగ జెట్టపట్టి । కాళికాదేవితోడ రాఁ గాలుపురము
నుండి వాహ్యాళివెడలి, నిల్చుండకెచట । నేలపొలిమేరలంజుట్టి, నేలదాల్పు
శీవి గొంతెత్తి ధ్వంసమ్రావమొప్ప । నైకవారంబు లఱచి సమీకమునకుఁ
గుక్క కూటువువలె నుసిగొల్పఁగలదు; । విషయమందెల్లఁ బీనుఁగుపెంటలైన
దహనమునకై వారలు దారసిలక । కుళ్లుకుణపంబులెల్లెడఁ బెల్లువెరిగి
బట్టుగా మురికివాసన గొట్టఁగలదు................."

(2) "Thy heart is big; get thee apart and weep (III - 1).
"మనసుపట్టంగఁజాలవు; గనుక, నీవు
పోయియావల, శేడ్వుమి మొత్తుకొంచు (పుట-74).

(3) "Tear him to pieces; he's a conspirator" (III-3).
"ద్రోహియీతండు, వీని సందేహపడక
సున్నమున కెమ్ములేకుండఁ దన్నితన్ని
చేతి తీఁటలు దీఱంగఁజితకపొడుఁడి (పుటలు 92-93).

(4) Calendar = పంచాంగము; hand of war = కాలదండము; Noble Brutus = వర్ణనీయబ్రూటస్; Your ear's good = పాముచెవులు నీవి; Scene = ప్రకరణము; will = ఉయిలు.

డా. కొత్తపల్లి వీరభద్రరావు "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" అనెడి తమ పరిశోధనా వ్యాసములో శాస్త్రిగారి అనువాద విధానమునుగూర్చి విపులముగా చర్చించియున్నారు (ప్రథమముద్రణము-1960).

## తొలితెలుగు సాంఘికరూపకము

7. "...ఇది నేను వ్రాయుటకుగల్గిన ముఖ్యోద్దేశ్యము, మనవారిలో-అందులో బ్రాహ్మణులలో-బహుతరముగాఁగానిపింపనట్టి యైకమత్యమును సర్వవిధంబుల స్వీకరించి, దానివల్ల మేలుపడయఁగోరవలయునని యెఱింగించుటేకాని మరియొకటి కాదని స్పష్టముగాఁ జెప్పుచున్నాడను. ఈసంగతినే పొడిమాటలతోఁ దెలియజేయక, కథయొకటి కల్పించి, యందులోఁ బరస్పరవైరములు పెంచినవారు శిక్షింపఁబడినట్లు కూర్చుట మంచిదనియెంచి, ఇట్టి నా యభిప్రాయంబునె మనవారెల్లరుఁ గ్రైకొందురని తలంచి, నాటకధోరణి వ్రాసితిని......పుస్తకము పూర్తిగాఁ జదివినఁదాక నా యీ యభిప్రాయమింత స్పష్టముగాఁ దేలకపోవచ్చును. మరియు నీదినములలో జరుగుచున్న యధికారదౌర్జన్యములుకూడ నిందు నక్కడక్కడ సందర్భవశమునఁ గానుపింపఁగలవు... నాటకధోరణిని నేనిదివ్రాసితినని వినగానే నాటకాలంకారవేత్తలయిన మనవారులికిపడిలేచిచూచి దీనను శల్యపరీక్ష కారంభింపకపోరు. అట్టివారికి నేనొక్క టి విన్నవింపవలసి యున్నది. సంస్కృత నాటకములలో నధమపాత్రములు ప్రాకృతమున మాటలాడుటయు, ఉత్తమపాత్రములు సంస్కృతముననే గద్యపద్యములలో మాటలాడుటయుఁ గలదు (గొప్పయింటి స్త్రీలుగూడ నీచపాత్రములె). ఇందులోఁ గూడ నాపక్కి యవలంబించినయెడలఁ బ్రాకృతమునకు బదులుగా గొల్లమాటలో, కోయమాటలో లేక గ్రామ్యభాషయైన వాడుకచేయవలసియుండెను. ఇట్టిపనిని నేను చేయుటకు మనసొప్పక వదలినాఁడను. ఇప్పటికి వచనము లేకుండగనే వ్రాయఁబడినది. కాని నేను వ్రాయఁదలచుకొన్న నాటకములలో వాఁడుకమాటలు చేర్చుటయేకాక, సహజరీతిని వచనమే కూర్చువాఁడను......"

—నందకరాజ్య పీఠిక - 1-4-1880.

8. రెండవ అంకమునందలి ఈ అవధాన సందర్భములో తమ మేనమామగారైన వఠ్యము వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారు అవధానముచేసి చెప్పిన శ్లోకములను శాస్త్రిగారు కృతజ్ఞతాపూర్వకముగా చేర్చుకొనినారు. అందులో పద్యములకు పృచ్ఛకులుగా 'ఉమాపరహితులైన వేంకటరత్నముగారు' నియమింపబడిరి. అందరును పద్యములను సంస్కృతమునందడుగగా వేంకటరత్నముగారుమాత్రము "...వాకునందు నేమియున్నది? తెలుఁగన్న నీసడెంపు వీరికేలకొ? తెలుఁగునే వేడెద మిము" (పుట 57) అని అనినారు. ఈ వేంకటరత్నముగా రెవరో?

9. మూలము : "అయోధ్యకః తదానీంతనశ్చ" (ప్రస్తావనలో)
అను : "అయోధ్యాపురవాసిని, శ్రీరామ సమకాలికుడను అయితిని."

"కిమపి కిమపిమందం..." అను శ్లోకమును పలువురు వృత్తములలో అనువదింపగా శాస్త్రి గారు తమకు ప్రియమైన తేటగీతిలో అందముగా అనువదించినారు.—

"ఒక్కసెజ్జనె, ముద్దిడుచొకరినొకర మట్లు బిగికౌగిటంబరుండి, యల్లనల్ల
మనము ముచ్చటలాడుకో, మనకుఁదెలియఁబడక యటు రాత్రిమాత్రమె గడచిపోయె."

"రాత్రిమాత్రమె" అనుటకంటె "రాత్రి తనకుఁదా" అను నర్థము వచ్చునట్లు వ్రాసియున్నచో మూలకారుని హృదయమునకు మరింత సన్నిహితముగా నుండెడిది.

10. శకారుడు :—
భద్రవృత్తము : భీమసేన దశకంధరుల్ జామదగ్న్యుఁడు ధనంజయుం
దేమిచేయుదురు ద్రౌపదిన్ బాము కొప్పు దుససేనుఁడుం
బామినట్లు నిన్ను బామెదన్.

విటుడు :—
రథోద్ధతవృత్తము : చూచుచుండగనె చుట్టుపట్టులన్ దోఁచి చీఁకటులు తూల్చెదృష్టులన్
వాచినట్టు లెగఁబట్టి చూడఁగా వేచి తెప్పఁబడవేయు నీ యిరుల్.

## శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

1. జన్మస్థలము : రాజమండ్రి.
జననము : కీలకసంవత్సర చైత్ర శుద్ధ త్రయోదశీ భానువారము (16-4-1848.)
మరణము : 27-5-1919 (మద్రాసులో).
తల్లిదండ్రులు : పున్నమ్మ, సుబ్బారాయుడు.

1860లో ఇంగ్లీషునేర్చుకొనుట కారంభముచేసిరి. 1870లో ప్రైవేటుగా ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైరి. 1874 లో 'వివేకవర్ధని' ప్రారంభము. 1876 లో రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో సహోపన్యాసకులుగా చేరిరి. 1885 లో ప్రధానోపన్యాసకులైరి (లొల్ల రామశాస్త్రి గారు చనిపోయిన తరువాత). 1893 లో 'రావు బహదూర్' బిరుదు పొందిరి. 1899 నుండి 1904 వరకు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పనిచేసిరి. (అప్పుడు శ్రీ కొక్కొండవారిని రాజమండ్రి బదిలీచేసిరి. 1891 లో 'వివేకవర్ధని' ఆగిపోగా అప్పుడే శ్రీ న్యాపతివారి 'చింతామణి' ఆరంభమైనది.)

పంతులుగారి స్వీయచరిత్రలోని భాగముల నీవ్యాసమందు అధికముగా ఉదాహరించి యున్నాను. వారి యభిప్రాయములను వారి మాటలలోనే చెప్పుట సమంజసమని అట్లు చేసినాను. నే నుపయోగించిన స్వీయచరిత్రలోని మొదటిభాగము 1936 లోను; రెండవభాగము 1915లోను ముద్రింపబడినవి.

2. కులాచార విషయములలోను, రాజకీయవ్యవహారములలోను గల అనేక దురాచారములను వినోదకరముగా సంభాషణరూపమున వెల్లడిచేసి, తన్మూలమున దురాచారములను మాన్పుటకయి వివేకవర్ధని కంతర్భాగముగాను (స్వీ.చ. 1 వ భా.-పు. 175); వీరిని, వీరి వ్రాతలను దూషించుటకై శ్రీ కొక్కొండవారు ప్రారంభించిన 'హాస్యవర్ధని'కి ప్రతిగాను (స్వీ. చ. 2 వ భా. పుట 182) ఈ 'హాస్యసంజీవని' బయలుదేరినది.

3. అందుచేతనే దీనిని ఏదేని ఒక ప్రత్యేకరూపకముగా పేర్కొనుటకు లక్షణములు సరిపోవు. ఆంగ్లమునందలి 'Comedy of manners' and 'Farce' లలోని లక్షణములుకలిసి ఈరూపమును తాల్చినవని చెప్పవచ్చును. భమిడిపాటి కామేశ్వరరావుగారు పేర్కొన్నట్లుగా "బ్రాహ్మ వివాహము ఆ కాలములో జరుగుచుండిన పెళ్ళిళ్ళనుగూర్చిన కావ్యదూషణ. ముసలివాని పెళ్ళికి అడంగిసబబులు, పూర్వశ్లోకములకు పెడఅర్థములు, ముసలి సబబులు, జ్యోతిషము చూచుట, నిశాలగ్నము,సానిమేళము, సభాతాంబూలపుగొడవలు, అపాత్రదానము, భోజనవేళ అలుగుటలు, వెక్కులు, రాత్రివేళ ఊరేగింపుచిక్కులు, అప్పగింతలవేళ ఏడ్పులు, ముసలిపెళ్ళివల్ల కొందరకు కలిగెడి దురూహలు, కొందరకుపట్టెడి దుర్గతి మొదలైన విషయములు ఇందురూపింపబడినవి"—(పరిచయము–వీరేశలింగగ్రంథావళి–2 వ సంపుటము).

4. పంతులుగారీవిధముగా నిర్దయలో రాజమహేంద్రవరపౌరుల లోపములను ఎత్తిజూపుచుండుట విమర్శకు గురియైనది. కాని, "మన తప్పులను కప్పిపుచ్చి, మంచివారని యితరులకు తోచునట్లు చేయవలెననుట కొందఱి మతము. మనతప్పులను వెల్లడించి, వానిని తొలగించి మనవారిని నిజముగానే మంచివారిని చేయవలెననుట మరికొందఱిమతము. నేనీ రెండవతెగలోఁజేరినాఁడను" అని పంతులుగారు సమాధానము చెప్పుకొనినారు (చూ. స్వీ. చ. 2 వ భా. పుటలు 177–78).

5. "ఇట్టి నాటక ప్రదర్శనములవలన జనులకు వినోదము కలుగుటయేకాక యక్రమములుచేయువారు సిగ్గుపడి తమప్రవర్తనమును దిద్దుకొనుటయు నందువలన నీతి వర్ధిల్లుటయుఁ గలుగును గానఁ గ్రొత్త నాటకములనుజేసి నాటకసమాజమునొకదానిని స్థాపింపవలసినదని నామిత్రులనేకులు నన్నుఁగోరిరి." (స్వీ. చ. 1 వ భాగ. పుట 175).

6. "1880 వ సంవత్సరమునందు ధార్వాడ నాటకసమాజమువారు మాపట్టణమునకు (రాజమండ్రికి) వచ్చి గొప్ప పాకవేసి, దానిలో తమ నాటకముల నాడిపోయిరి" (వీరేశలింగముగారి స్వీయచరిత్ర 2 వ భా. పుట 178).

"నా 18వ ఏట, అనగా 1881 వ సంవత్సరములో ధార్వాడావారీయూరికి (బందరునకు) వచ్చి నాటకములాడిరి. రెండునాటకముల నేఁజూచితిని. అందపుడుండిన బావాజీగారి ప్రజ్ఞావిశేషము వాచాతీతము. ఆయన హిందూస్తానీ మాటలాడగా వినునెడ దాని పుట్టువు తెలుఁగిట్టిదని చెప్పఁబడకయె తెలియనయ్యెడిది."

—శ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవి 'రామదాస చరిత్ర' (హిందుస్థానీ నాటక) పీఠిక.

7. "నా మిత్రులకోరిక ననుసరించి 1880 వ సంవత్సరములో కడపటిభాగమున నొక నాటకసమాజమును స్థాపించి, ధార్వాడ నాటకులువచ్చి నాటకములాడి విడిచిపోయిన పాకలోనే 'రత్నావళి', 'చమత్కార రత్నావళి' యను రెండు నాటకములుచేసి యాడించితిని. అట్టినాటకములాడుట కదియే ప్రథమప్రయత్నమైనను, మొత్తముమీద నవి జయప్రదముగానే జరిగినవని యెల్లవారు నభిప్రాయపడిరి".

—(స్వీ. చ. 1 వ భా. పుట 175; చూ. స్వీ. చ. 2 వ భా. పుటలు 178–179).

8. "... సంస్కృతభాషలో రచియింపఁబడియున్నవానిలో నుపయోగకరములగు నాటకములను దెనిగించి ప్రచురించుటేకాక, అట్టివానిని ప్రయోగించుటకును, ప్రయోగింపించుటకును బూనుకొని వేగిదేశ నాయకరత్నమయి శ్రీ రాజరాజనరేంద్రుని రాజధానియయియుండిన యీ రాజమహేంద్ర

పట్టణమందు స్వదేశస్థుల విద్యాజ్ఞానాభివృద్ధికోరెడు కొందఱు తామొక సంఘముగా నేర్పడి కృషి చేయుచున్నారు. వారి కోరికమీఁదను శ్రీ భవభూతి కృతమయి శ్రీమద్రామాయణోత్తరకాండ కథాప్రతిపాదకమగు 'ఉత్తరరామ చరిత్రము' అను నాటకమును నిదిగో ప్రచురించుచున్నాఁడను (ఉత్తరరామచరిత్రానువాదము - "చింతామణి"—జనవరి, 1881).

"It must, of course, be a source of pleasure of all workers in this field and to those interested in their success, that under the auspices of Mr. K. Veeresalingam Pantulu, a Dramatic Company was formed by the students of our College, who performed on the stage his Ratnavali and Comedy of Errors.

(ఉత్తరరామచరితానువాదము - ప్రథమముద్రణ పీఠిక 9-11-1883).

9. సోమంచి శంకరమను కళాశాలవిద్యార్థి, అడివికొల్లు కనకరాజు అనునతఁడు రత్నావళీ, చమత్కార రత్నావళీ నాటక ప్రదర్శనములందు పాల్గొనియున్నట్లు శ్రీ చిలకమర్తివారు బందా కనకలింగేశ్వర రావు గారితో చెప్పినారట.

10. ఇందలి ప్రథమాంక ప్రథమభాగము 1875 లోనే 'వివేకవర్ధని'లో ద్విపదరూపమున ప్రకటిత మైనది. అందు పేర్లలో మార్పులులేవు.

11. ఇంచుమించుగా నాటకకర్తల ప్రథమ నాటకరచననుబట్టి వారి కాలక్రమమును పాటించుచున్నాను. ఒక్కొక్క నాటకకర్త భిన్నకాలములలో బహురచనలు చేసియున్నారు. అయినను నాటకకర్తలు ప్రధానముగా గ్రహింపబడుటచేత, ఇప్పట్ల భిన్నకాలములలోని ఆ బహురచనలనెల్ల సౌల భ్యార్థము ఒకచోటనే వివరించుచున్నాను.

12. పంతులుగారి సంస్కృతానువాదములన్నియును మూలమునందువలె యథాతథముగా గద్య-పద్య మయములే. ఆంగ్లానువాదములందు మార్పులుచేసి గద్యమయములనుగానే రచించిరి. ఇంక స్వతంత్ర రచనలలో ప్రహసన ప్రాయములైనవన్నియును పూర్తిగా గద్యమునందే యున్నవి. తక్కినవానిలో పద్యములత్యల్పములై, అవియును గద్యనాటకములుగానే కన్పట్టగలవు.

13. "సంఘదురాచార సంస్కరణమును, పరిశుద్ధమతధర్మప్రకటీకరణమును నామనస్సు నెప్పుడును బాయకుండునుగాన నేనేపుస్తకమునైనను వాని నించుక చొప్పించుచుందును. కాబట్టి ఈపుస్తకము నందును (ప్రహ్లాదనాటకమున) వాని చిహ్నములు కానవచ్చును"

—(స్వీ. చ. 2 వ భా. పు. 194).

14. "అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, 'విచిత్రవివాహ ప్రహసనము, మహాబధిరప్రహసనము, పునర్మరణప్రహసనము, బలాత్కారగాన వినోద ప్రహసనము, కలహప్రియాప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము, మహావంచక ప్రహసనము, అసహాయశూర ప్రహసనము—అను పదియు నింగ్లీషులోనున్న ప్రహసనముల ననుసరించి, పేరులను కొంత కథను తెనుఁగువారి కనుకూలముగానుండులాగున నేను మార్చివేసిన ప్రహసన ములు. కలిపురుష శనైశ్చర విలాసము, వేశ్యాప్రియప్రహసనము, కౌతుకవర్ధని, వినోద తరంగిణి నా స్వకపోల కల్పితములైన ప్రహసనములు'' (స్వీ.చ. 2 వ భా. పుటలు 241-42) వివేకవర్ధనిలో (31-3-1886) ఆత్మూరి లక్ష్మీనరసింహముగారినిగూర్చి 'దంభాచార్య విలసన' ప్రహసనమును ప్రకటించిరి. డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ పరిశోధనా వ్యాసములో

పై పది ప్రహసనములకును ఆంగ్లమూలములను నిర్దేశించియున్నారు— తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము (1960)—పుటలు. 374-395. శ్రీ అక్కిరాజు రమాపతిరావుగారు శ్రీ కందుకూరివారి రచనలపై పరిశోధనముచేసి డాక్టరేటు పట్టమును పొందిరి.

## శ్రీ గురజాడ శ్రీరామమూర్తి

1. వీరు నియోగి బ్రాహ్మణులు. తండ్రి శ్రీ దుర్గాప్రసాదరావు. ఆదిలో కాకినాడలో నివాసము. తరువాత విజయనగరములో ఆనందగజపతి ఆస్థాన విద్వాంసులుగా ఉండిరి. వీరి 'కవిజీవితములు' తెలుగు కవులను గూర్చిన ఐతిహ్యములు ప్రధానముగా కలదై వీరేశలింగముపంతులుగారి 'కవులచరిత్ర' కంటె ముందే 1880 లో ముద్రితమైనది. 'రాజయోగి' అను పత్రికను నడిపిరి.

## శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి

1. వీరును వావిలాల వాసుదేవశాస్త్రిగారును మేనత్త మేనమామ పిల్లలు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వాసుదేవశాస్త్రిగారికంటె ఒకటి రెండు సంవత్సరములు చిన్న. కాగా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1852 లేదా 1853 ప్రాంతముల జన్మించియుందురు.

తల్లిదండ్రులు—వీరమ్మ, గోపాలకృష్ణశాస్త్రి; భార్య—అద్వైతబ్రహ్మేశ్వరమ్మ.

గోపాలకృష్ణశాస్త్రిగారి జన్మభూమి తెలంగాణా మధిరతాలూకాలోని విప్పలమడక అగ్రహారము. తరువాత రేపల్లెలోని కాపుమూరులో స్థిరపడినారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1884 వరకు గుంటూరు మిషనుస్కూలులోను, అటుపిమ్మట 1889 వరకు గుంటూరు ప్రభుత్వ పాఠశాలలోను పనిచేసి, 1889 ఫిబ్రవరి లేదా మార్చి నెలలలో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులై మద్రాసు ట్రిప్లికేనులో కాపురము పెట్టిరి.

వాసుదేవశాస్త్రిగారి మరణముకంటె వారమురోజులుముందే సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 6-6-1897 తేదీన మద్రాసులో చనిపోయిరి (హేవళంబి జ్యేష్ఠశుద్ధ సప్తమి).

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దత్తపుత్రులు గోపాలకృష్ణయ్యగారు వాసుదేవశాస్త్రిగారి దత్తపుత్రులు సీతారామశాస్త్రిగారికి 27-12-1934 తేదీన తమ పితృపాదుల జీవిత విశేషములను పొందుపరచుచు వ్రాసిన లేఖనుండి పై విషయములు సంగృహీతములు.

2. ఒక ఉదాహరణము: ఇది గోపాలకృష్ణయ్యగారిలేఖలో ఉదాహృతము.

"చెలికాడా! బడియందుఁ దిట్లువడుచుం జీవాట్లు దించుం దినం
బులు వ్యర్థంబుగ బుచ్చనేల? మనదబ్బుంబెట్టి దెబ్బల్దినం
దల వ్రాతాయిది? చాలు, స్కూలుకొకదండం, బిప్డు రావోయి మి
త్రులతో హాయిగఁగూడి యాడుదము బంతు ల్కోలికొమ్మచ్చులున్"

3. "... ఆ (గుంటూరు నాటక) సమాజమువారు 1884 వ సంవత్సరమున డిశంబరు నెలవులలో రాజమహేంద్రవరమువచ్చి, వారి నాటకములను ప్రదర్శించిరి. వచననాటకములైనను, నవియెంతో మనోహరములుగనుండెను ... వారి నాటకములలో 'యుగంధరవిజయ' మనునది మిక్కిలి చక్కగనుండెను. వారి హరిశ్చంద్రనాటకముగూడ మిక్కిలి రసవంతముగనుండెను.

పలుమాటలేల, వారి నాటకములన్నియును జనాకర్షకముగనే యుండెను. నాటకముల శైలిగూడ సులభమై ప్రేక్షకులకు సుబోధకముగనుండెను".

—శ్రీ చిలకమర్తివారి 'స్వీయచరిత్ర' (1957)-పుట 83.

4. సుగంధి, చండి, హయహేషితము, పటహము, అలసగతి మొ॥
కొన్ని ఉదాహరణములు :

చండి : జూదముగలుగన్, వాదముచెలఁగున్ మోదము తొలఁగున్, భేదము మెలఁగున్.

—ధర్మరాజు (పుట-41)

పటహము :

నీవే దిక్కంటి మామయ్యా ! యే వెంటం బ్రోతిఁక మామయ్యా !
యా వైర్యర్థంబది మామయ్యా ! వేవే నీవే వెన మామయ్యా !

—దుశ్శాసనుడు శకునితో (పుట-44)

## శ్రీ వడ్డాది సుబ్బారాయుడు

1. జన్మస్థానము—నగరము తాలూకా పానెర్లపూడిలంక 1872

తల్లిదండ్రులు—లక్ష్మాంబ; సూరపరాజు (నియోగులు).

మొదటిభార్యపేరు వేంకమ్మ. కళత్రములు నష్టములగుచుండ సుబ్బారాయుడుగారు మొత్తము ఆరు వివాహములుచేసికొనినారు. వీరు దొడ్డమపేట దివాణమువారి పోషణములో శ్రీ భగవతి వాసుదేవదీక్షితులవారియొద్ద విద్యనభ్యసించిరి. పదుమూడవయేటనే కవిత్వము చెప్పనేర్చి గురువును మెప్పించిరి. భావసంవత్సరమున (క్రీ. శ. 1874) రాజమహేంద్రవరములో ఉపాధ్యాయులుగా ప్రవేశించి, చివరకు ప్రభుత్వకళాశాలలో ఉపాధ్యాయులుగా రిటైరు అయినారు. ఉపాధ్యాయులుగా వీరికీర్తి ఎనలేనిది. సర్. కె. వి. రెడ్డి ప్రభృతులు వీరి శిష్యులే. సుబ్బారాయుడుగారు ఎంత నిరాడంబరులో అంత స్వతంత్రులు. నాడు రాజమహేంద్రవరమున కవిత్రయముగా పరిగణింప బడిన ముప్వురిలో వీరొకరు. 1932 లో డా. రాధాకృష్ణ అధ్యక్షతను షష్టిపూర్త్యుత్సవము జరిగెను. 1937 లో శ్రీ చిలకమర్తివారి ప్రోత్సాహమున సహస్రమాన జీవితోత్సవము జరిగెను. కవిశేఖర బిరుదాంకితులైరి. వీరి కృతులలో భక్తచింతామణి, వేణీసంహారము సుప్రసిద్ధములు; అందలి పద్యములు పలువురనోటికి వచ్చును.

మరణము : 2-3-1938.

2. ప్రథమాంకములోని భానుమతీ పరిహాసోక్తులు, ద్వితీయాంకములోని భానుమతీ స్వప్నదర్శనాది వృత్తాంతము, చతుర్థాంకమున గాంధారీ ధృతరాష్ట్రులు యుద్ధరంగమునకువచ్చుట. షష్ఠాంకములో చార్వాకుని కల్లమాటలనునమ్మి యుధిష్ఠిరు డగ్నిప్రవేశముచేయ నుంకించుట మొ॥ నూత్నకల్పనలు. సుయోధనుని వధించి, తద్రక్తసిక్తమైన హస్తములతో ద్రౌపది వేణిని ముడిచి కొప్పు పెట్టెదనని భీముడుచేసిన ప్రతిజ్ఞ సంపూర్ణమగుటచేత దీనికి 'వేణీసంహార' మను పేరు వచ్చినది.

3. ప్రబోధచంద్రోదయము వేదాంతపరమైన నాటకము. ఇందు అరిషడ్వర్గాదులకు రూపకల్పనము చేయబడినది. దీనిని 'Allegorical play' అందురు. ఇట్టివాని అనువాదము చాలకష్టము.

ఒక ఉదాహరణము :—

మూలము :

"ప్రభవతి మనసి వివేకోవిదుషామపి శాస్త్రసంభవస్తావత్ ।
నిపతంతి దృష్టివిశిఖాయావన్నేందీవరాక్షీణామ్॥ (I-11)

శ్రీ కందుకూరివారి అనువాదము :

"పృథివి నిందీవరాక్షుల దృష్టివిశిఖసంతతులు పర్వకుండెడు నంతవఱకె
మహిత విద్వాంసులకునైన మనసులందు శాస్త్రజన్యవివేకంబు సంభవిల్లు.

శ్రీ వసురాయకవి అనువాదము :

"ఎంతదాఁకఁ దాఁకవిందీవరాక్షుల సోయగంపు వాలుఁజూఁపుఁదూపు
లంతదాఁకనేకదా కనంబడు శాస్త్రభవవివేక మెట్టి ప్రాజ్ఞునకును."

## శ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవి

1. పురుషోత్తమకవిగారి పూర్వులు నాదెళ్ళనుండివచ్చి, కృష్ణాతీరస్థమగు సీతారామపురాగ్రహారమున స్థిరపడినారు.

తల్లిదండ్రులు : సుబ్బాంబ, కామయార్యుడు.

జననము : రుధిరోద్గారి సంవత్సర వైశాఖ శుక్ల పంచమి. (23-4-1863).

కవిగారు మొత్తము 112 గ్రంథములను రచించిరి. ఇందులో కావ్యములు, స్తోత్రములు, వర్ణనలు, నిఘంటువు (పురుషోత్తమకవీయము), శాస్త్రగ్రంథములు, హిందీనాటకములు, తెలుగు నాటకములు మొదలగునవెన్నియో కలవు. వీరికి మేధాదక్షిణామూర్తి ఇష్టదైవము; ఉపదేశమునుకూడ పొంది, జీవితమంతయును భగవదర్పితముగా గడిపినారు. వీరికి గర్భ-బంధ-చిత్ర కవిత్వములన్నచోగూడ ప్రీతికలదు. అందు సిద్ధహస్తులగుటచేతనే వీరికి ''సరస చతుర్విధకవితా సామ్రాజ్య ధురంధరు"లనెడి బిరుదువచ్చెను. 'బుధవిధేయిని' అను పత్రికను ఆరంభించి కొంత కాలము నడిపిరి.

కవిగారి కుమారులు మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు ''ఉత్తమ జీవితయాత్ర" అనుపేర పితృపాదుల చరిత్రను కావ్యఖండముగా సంతరించినారు (1954). దానినిబట్టియు, చంద్రహాస-రామదాసచరిత్ర నాటకములకు కవిగారు వ్రాసికొన్న పీఠికలనుబట్టియు నాటి పలువిషయములు తెలియుచున్నవి.

2. ఈ హిందూస్థానీ నాటకములపేర్లు (రచనాక్రమములో) పేర్కొనబడియున్నవి—

1. కాళాసురవధ, 2. పంచాక్షరీ మహిమము, 3. సుభద్రా పరిణయము, 4. భస్మాసురవధ, 5. కళావతీ పరిణయము. 6. శూద్ర తపోనర్థకము. 7. శారదోపాఖ్యానము, 8. లవణాసుర సంహారము, 9. మనోజవాలక్ష్మీనివారణము, 10. గోకర్ణ మాహాత్మ్యము, 11. అహల్యా సంక్రందన నాటకము, 12. బిల్హణీయము. 13. సీమంతినీ చరిత్రము, 14. సోమవారవ్రత మహిమ, 15. పుత్రకామేష్టి, 16. సీతాకళ్యాణము, 17. దశరథ నిర్యాణము, 18. రామారణ్యావాసము, 19. సీతాపహరణము, 20. సుగ్రీవ పట్టాభిషేకము, 21. హనుమత్ప్రతాపము, 22. రావణసంహారము, 23. శ్రీయాళచరిత్రము, 24. రామదాసచరిత్రము, 25. మిత్రసహోపాఖ్యానము, 26. ఇళమహారాజుచరిత్రము, 27. సుకన్యాపరిణయము, 28. శుకరంభాసంవాదము,

29. నారాయణరావు ఫార్సు, 30. భద్రాయుషోపాఖ్యాన పూర్వభాగము, 31. భద్రాయుషోపాఖ్యానోత్తరభాగము, 32. హరిశ్చంద్ర చారిత్రము.

పరభాషలోనైనను, రామాయణగాథలను వరుసగా నాటకీకరించిన ప్రథములు కవిగారే.

3. శైలికి ఒకటిరెండు ఉదాహరణములు (రామదాస చరిత్రమునుండి)—

గజాననుడు ; భక్తా ! వినయసంయుక్తా ! కళ్యాణ్, కళ్యాణ్, మై కైలాస శిఖరి శిఖర్పర్, సభా భవనాంచిత సింహాసనా సీన్హో హమారె పితాజీకే అంకపీఠ్పర్. బహుత్ ఖుషిసె బైఠ్కె, లోకాలోకన్‌కర్తె రహాథ. తబ్ భక్త్‌హో తేరా వినుతి శ్రవణగోచర్ హోనేసె, సంతుష్టాంతరంగ్ హో మై తుఝ్కొ వర్దేనే ప్రసన్ హువాహుం. అభిలాషా తుమ్హారా బతా. తుం సఫల మనోరథ్ హో జావె.

సూత్రధారుడు : జగజ్జేగీయమాన మహామహిమాంచితౌదార్య నివారితాఖిలార్తజనదైన్యా ! సర్వలోక శరణ్యా ! ప్రథమగణ్యా ! అప్ భక్తాధీన్ హోనేసె, అయిసీ దీన్పర్ సానుఘ్రహా యేహై. ఆప్కొ సందర్శన్ కర్నేసె యిచ్ మై పావన్భీ, నిర్విచార్భీ హువాహుం. ఆజ్ఞానువర్తి హోనే కేలియె కర్నే విజ్ఞాపన్ యెః హై.........

* *

తానీషా : అచ్ఛా, అక్కన్నా ! హుసుం తహస్సీల్దారికా, ఉన్కొ లిఖ్దేకే, మొహర్భీ హెంచాకె, వ్హాఁసె, సొహబ్బతుక్కొ, వ్హాఁ, హిమ్మతుక్కొ, హోనాపడేగా. తో ఉన్కొ ఖ్వాహిష్, జిత్నాహై ఉత్నాటక్ హుజూర్కొ కుమ్మక్కీదేక, రెహ్నాబ్బుయె సొజాదుః. హమారే నామ్నె, ఉన్కొరఖో హమ్భి, కచ్నాకచ్, తబ్భర్మాయింగె. (పుట-21)

అచ్చటచ్చట అంత్యానుప్రాసముగల రచన సాగుచుండును—''అరే చేలా ! సుశీలా ! అజ్ఞాన జాలా ! హముక్కొ నజాన్నేవాలా !.........'' (పుట 21)

4. ''ఎప్పుడేవికాని, చిత్తులు సాఫులునని లేకుండ నొక్కొక్కప్రతియె వ్రాసి యది కేవలమాయొక్క కంపెనీ (సే. ధ,సో.) వారి యుపయోగమునకే యిచ్చివేయుటంబట్టియు వారినస్సుల నడుగుటయు వారొప్పియిచ్చుటయు నసంభవమైనందునను, వారి ఖులాస వెనుబడఁగనే వీని విలాసము మూలఁ బడవలసెను. మున్నివి కనియున్నవారనేకులు తమకవియిప్పింపుఁడని కొందఱును, వానిం బ్రచురపఱుపుఁడని కొందఱును బలుమాఱెచ్చరించుచున్నారు. ప్రకటనమె కర్తవ్యమని యేర్పఱచి కొంటిని'' —చంద్రహాస చరిత్రపీఠిక - 1916.

5. నాదెళ్ళ పురుషోత్తమకవిగారి హిందూస్థానీ నాటకములపై పరిశోధనముచేసి, శ్రీ భీమసేన్‌నిర్మల్ (ఉస్మానియా విశ్వవిద్యాలయము) డాక్టరేట్ పట్టమును పొందియున్నారు.

ద్వితీయాధ్యాయము

# ఆధునిక నాటక వికాసము

## శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులు[1]

ఉత్తమ నాటకకర్తగా, దర్శకుడుగా, మహానటుడుగా చిరయశస్సునార్జించి, 'ఆంధ్ర నాటక పితామహుడు'గా ప్రసిద్ధికెక్కిన ధర్మవరం కృష్ణమాచార్యులవారిని ఎరుగని తెలుగు చదువరులుండరని చెప్పుట అతిశయోక్తికాదు. క్రీ. శ. 1886 వ సంవత్సరమునకు పూర్వము నాటకరంగవిషయమున తెలుగుజిల్లాలలో జరిగిన కృషియంతయును ఒకయెత్తు. అటుపిమ్మట ధర్మవరం కృష్ణమాచార్యులుగారుచేసిన కృషియంతయును ఒక ఎత్తు. 1860 ప్రాంతముల నుండియు తెలుగులో నాటకరచనయును, 1880 నుండి నాటకప్రదర్శనములును జరుగుచున్నను బళ్ళారివాసులకు ఆ విషయమే తెలియదు. 1885 వ సంవత్సరమువరకును వారెరిగినవి కన్నడ బయలాట ప్రదర్శనములుమాత్రమే. 'రంగాచారి నాటకకంపెనీ'లోని కన్నడ సామాజికుల యొక్క సంగీతమును, వారి ప్రదర్శనములును బళ్ళారి పౌరులను బాగుగా ఆకర్షించినవి. అట్టి స్థితిలో ఆచార్యులవారి సోదరులు గోపాలాచార్యులుగారొక తెలుగునాటకమును రచించి ప్రదర్శింపజేసిరి. కాని, అది విజయవంతముకాలేదు. కన్నడనాటకములవలె తెలుగునాటకము రక్తి కట్టకపోవుటచేత గోపాలాచార్యులుగారు కించపడుటయేకాక తెలుగుభాష నాటకరచనమునకు పనికిరాదనుభావముకూడ ప్రబలినది. ఇది ఆచార్యులవారికి సంతాపకారణమయ్యెను; అప్పుడు వారు తెలుగునాటకరచనకు పూనుకొని 'చిత్రనళీయము'ను వ్రాసి, విజయవంతముగా ప్రదర్శించి పై అపవాదును పోగొట్టిరి[2]. అటుపిమ్మట వరుసగా పెక్కు నాటకములను రచించిరి.

ఆచార్యులవారు 1874 లో కావ్యరచన యారంభించిరి. సంస్కృతాంగ్లభాషా నాటకముల నాసక్తితో జదివి 1879 లో నీత్యుపదేశకములగు 'ఉన్మాదరామప్రేక్షణికము', 'మదన విలాసము' అనెడి చిన్ననాటకములను, చిత్రనళీయమున వచనభాగము కొంతవ్రాసిరి. ఆ సంవత్సరమందే కొందరు మిత్రులతో కలిసి కొన్ని ఆంగ్లనాటకములను ప్రదర్శించుచు పై రెండు చిన్న తెలుగునాటకములనుకూడ విజయవంతముగ ప్రదర్శించిరి. 1886 లో వారి మిత్రకోటి 'సరసవినోదిని'యను సభగానేర్పడి ఆచార్యులవారిని దానికధ్యక్షులుగ నెన్నుకొనిరి. కాని, ఆ మిత్రులందరును బహుతరముగ నాంధ్రభాషనభిలాషచే నభ్యసించినవారైనను కర్ణాటభాషయందు పక్షపాతముకలవారు; అంతియేకాక వారంతవరకును చూచినవి కర్ణాటనాటకములే కావున దేశ

భాషలలో నాటకములకు దగినభాష కన్నడమేయనియు, తెనుగందులకు తగదనియు వారి నమ్మకము. అందుచే వారు కన్నడమందే నాటకములను రచింపుడని ఆచార్యులవారిని బలవంత పెట్టిరి. అంతట ఆచార్యులవారు స్వప్నానిరుద్ధమనుపేర ఉషాకల్యాణమును కన్నడభాషలో రచించిరి. దీనిని సరసవినోదినీసభవారు 14-9-1886 తేదీన ప్రదర్శించిరి. నెలలోపల మూడు సారులీ నాటకము ప్రదర్శింపబడెను. అప్పుడు తెలుగునాటకము నొకదానిని ప్రదర్శింపవలెనని ఆచార్యులవారు పట్టుబట్టి చిత్రనళీయమును సొంతముగా రచించిరి. అది 29-1-1887 తేదీన సరసవినోదినీసభవారిచేతనే విజయవంతముగా ప్రదర్శింపబడెను; ఇది కన్నడనాటకముకంటె విశేషముగా ప్రజల ఆదరణమును పొందెను. చిత్రనళీయప్రదర్శనము జయప్రదమగుటతో తెలుగుభాష నాటకభాషగా ఆదృతమై, చివరకు బళ్ళారి కన్నడసీమ కాదన్న భావము పైవారికి కలిగింప సమర్థమయ్యెను[3].

చిత్రనళీయ ప్రథమప్రదర్శనమునందు నలభూమికను ఆచార్యులవారేధరించిరి. అంతియే కాదు, సరసవినోదినీసభ మొదటితరము నటులలో ఎల్లప్పుడును ఆచార్యులవారే నాయకపాత్రధారి. అటుపిమ్మట వీరు దశరథుడు, రాజరాజనరేంద్రుడు మొదలగు పాత్రలను ధరించుచుండెడివారు. కరుణరసప్రధానమును, అత్యంతసహజమును అయిన ఆచార్యులవారి దశరథపాత్రాభినయము సహృదయుల మన్ననలంది ప్రసిద్ధికెక్కినది[4]. ఆచార్యులవారు సంగీతములో నిధులని చెప్పుదురు. నాటకములలోని పాటలకు, పద్యములకు వారే రాగనిర్దేశాదులను చేసెడివారు (మోహన, జంఝూటి, కేదారగౌళ, కమాజురాగములు వారికి ప్రీతిపాత్రములట). సంగీతముపై వారికెంత అభిమానమున్నను అర్థమునకు భంజకముకాని శ్రావ్యమైన సంగీతమునే వారు పాడెడివారు; రంగస్థలమునందు అంగీకరించెడివారు. సంగీతగాయకునకు తంబుర ఎంత ఉపయోగపడునో పద్యమును చదువుటకు సంగీతము అంతియే ఉపయోగపడవలెనని వారి ఆశయము. తొలిసంవత్సరములో ఆచార్యులవారు అభినయమునకే అధికప్రాముఖ్యము నొసంగినారు; అటుపిమ్మట రంగాలంకరణమునకుకూడ ప్రాముఖ్యమీయనారంభించిరి. ఇంకొక ముఖ్యవిషయమేమనగా ఆచార్యులవారు ఆంగికాభినయముకంటె వాచికాభినయముమీదనే ఎక్కువశ్రద్ధ చూపెడివారు. 'రిహార్సల్సు'లో ఎక్కువకాలమును ఉచ్చారణావిధానమును నేర్పుటకే వినియోగించెడివారు.

ప్రతినాటకమునకును 'రిహార్సల్సు' చేయించెడిభారమును ఆచార్యులవారే స్వయముగా వహించుట ఆచార్యులవారిలోని విశేషము. శిక్షణకాలములోను, ప్రదర్శనసమయములోను వారు చాల 'నిక్కచ్చి'గా నుండెడివారు. ఏమాత్రపు అలసతనుకాని, అజాగ్రత్తనుకాని సహించుటయే లేదు. ఏనటుడైనను వారు చెప్పినట్లు చేయకపోయినచో వారికి చాల ఆగ్రహముకలిగెడిది; తీవ్రముగా మందలించెడివారు; చేయిచేసికొన్న సందర్భములుకూడ కలవందురు[5].

ఇంకొకవిశేషమేమనగా ఆచార్యులవారు తాము స్వయముగా నటించుటయేకాక తమ సోదరులనుకూడ నటులనుగా తయారుచేయుట[6]. తెలుగుదేశములో నాటకకర్తలే భూమికాధారణము చేయుటయనునది వడ్డాదివారితో ప్రారంభమైనది. దానిని పరమకోటికి కొనిపోయినవా

రాచార్యులవారే. నాటకరచన, దర్శకత్వము, నటన—అను మూడుగుణములును ఒకరియందే మూర్తీభవించియుండుట చాల అరుదు. ప్రాచీనకాలమున భారతదేశములో భవభూతి ప్రభృతు లట్టివారుగా కన్పట్టుదురు; పాశ్చాత్యదేశములలో ఎస్కిలస్, సొఫోక్లిస్, షేక్స్పియరులు అట్టివారు. ఆధునికకాలములో తెలుగుదేశమున ఆచార్యులవారు అట్టివారు.

ఆచార్యులవారు ఏదేని నాటకమును వ్రాయతలపెట్టినప్పుడు అందలి భూమికలకు తగిన నటులను ముందుగానే నిర్ణయించుకొనెడివారు. పిమ్మట ఆ నటులను దృష్టిలో నుంచుకొని తమ రచనను సాగించెడివారు. తొలిరోజులలో ఆచార్యులవారు తమనాటకములనుతామే వ్రాసికొనెడివారు. తరువాతిరోజులలో నాటకరచనకు ప్రణాళికను సిద్ధముచేసికొన్న పిమ్మట, ఒక మంచి విలేకరిని వేకువజామున తమయింటికిరా నియనించి, తాముపచారుచేయుచు ఆశువుగా సంభాషణలు చెప్పి వ్రాయించుచుండెడివారు[7]. అప్పటికది వచనరూపముమాత్రమే. నాటకము ముగిసిన పిమ్మట సభాసభ్యులను సమావేశపరచి, అందరకును చదివి వినిపించి, ఎవరేని తగు సలహాల నొసంగినచో స్వీకరించి, మార్పులు చేసెడివారు. తమదే సిద్ధాంతమనెడి మొండిపట్టుదల వారికి లేదు. తరువాత ఆయా నటులకు నాటకభాగములను పంచిపెట్టి, వారివారి యోగ్యతలనుబట్టి పద్యములను, పాటలను రచించి యిచ్చుచుండెడివారు.

స్థానికులందరి అభిమానమును చూరగొనిన తరువాత సరసవినోదినీ సభవారు 1890 జూన్ నెలలో ప్రప్రథమముగా మద్రాసు 'విక్టోరియా పబ్లికుహాలు' లో కొన్ని నాటకములను విజయవంతముగా ప్రదర్శించినారు.[9] అప్పుడు మద్రాసు పురప్రముఖులు సంప్రీతులై ఆచార్యుల వారికి సన్మానపత్రము నొసంగిరి.[10] మద్రాసుయాత్ర జయప్రదమగుటతో ఆత్మవిశ్వాసము ప్రబలినది. అంతట ఆచార్యులవారు ఈ సమాజమును అనేక పట్టణములకు తీసికొనిపోయి ప్రదర్శనముల నొసంగినారు. ఎచ్చటికివెళ్ళి ప్రదర్శనముల నొసంగినను ప్రజల, పత్రికల, విమర్శకుల పొగడ్తలను బహుళములుగా పొందుచునేయుండిరి. 1905 ప్రాంతముల గద్వాలు మహారాజావారు, హైదరాబాదులో పెద్దసభచేసి ఆచార్యులవారికి 'ఆంధ్రనాటక పితామహ" బిరుదము నొసంగియున్నారు. నాడాచార్యులవారికి జరిగినంతటి ఘనసన్మానము తెలుగునాటక కర్తలలో మరియొకరికి జరుగలేదనుట అతిశయోక్తి కాదేమో.

సరసవినోదినీ సభవారు చక్కని సొంతనాటకశాలను 1907 లో నిర్మించుకొనినారు. దీనికి "రామకృష్ణవిలాస్" అను పేరుపెట్టబడెను. ఇందులకు ఆచార్యులవారు ఆరు.వేల రూపాయలు పెట్టుబడిపెట్టి, వాయిదాలమీద రాబట్టుకొనిరి. ఇట్లు ఆచార్యులవారి నాయకత్వములో 1912 వరకును సరసవినోదినీసభ నిర్విరామముగా, నిర్విఘ్నముగా, స్తుతిపాత్రముగా తనకార్యక్రమమును నిర్వహించెను. కాని, అప్పుడు సభ్యులలో కొందరు "ఆచార్యులవారు తమ నాటకము లన్నియును సరసవినోదినీ సభకొరకే వ్రాసినారుకాన అవి అన్నియును సభకేచెందవలెననియు, ఆచార్యులవారికి వానిపై ఎట్టిఅధికారమును ఉండరాదనియు'' ఒక వాదమును లేవదీసిరి. ఈవాదము కోర్టువరకునుపోయెను. ఇది ఆచార్యులవారికి కష్టముకలిగించెను. అంతట వారు హృదయభారముతో ఆసభనుండి తప్పుకొని 1912 అగస్టు నెలప్రాంతములో ''అభినవ సరసవినోదిని'' అను

పేర ఇంకొక సభను ఆరంభించిరి. ఈసభపక్షమున ఒకటి రెండు ప్రదర్శనముల నొసంగినారో లేదో, ఇంతలో ఆచార్యులవారు 30-11-1912 తేదీన దివంగతులగుట తటస్థించెను.

ఆచార్యులవారు పెక్కునాటకములను రచించినను, వానిని ముద్రించుటకు శ్రద్ధతీసికొనలేదు. వారిజీవితకాలములో చిత్రనళీయ-విషాదసారంగధరములు మాత్రమే ముద్రితములైనవి. మొదటిది వారిజీవిత కాలముననే నాలుగు ముద్రణములందెను.[11] మరి 12 నాటకములు వారి మరణానంతరము ముద్రింపబడెను. ఆచార్యులవారు వామనచరిత్రము (లేదా ఉపేంద్రవిజయము,) స్వప్నానిరుద్ధము అనెడి రెండు కన్నడనాటకములనుకాక మొత్తముమీద 27 తెలుగు నాటకములను రచించియున్నారు. వీనిలో మదనవిలాస-ఉన్మాదరామప్రేక్షణికములు రెండును 1879 లో రచింపబడిన చిట్టినాటకములు. ఇవి 1879 లోనే ప్రదర్శింపబడినను, ముద్రితములు కాలేదు; వ్రాతప్రతులు కూడలేనట్లే. ఇంక తక్కినవానిలో—'ర్యాజాభిషేక' మనునది ఐదవజార్జి రాజ్యాభిషేకోత్సవమునాడు (22-6-1911) ప్రత్యేకముగా ప్రదర్శించుటకు రచింపబడినది (దీని వ్రాత ప్రతియునులేదు). 'ఉదసా కల్యాణ' మనునది ప్రత్యేకనాటకముకాదు; 'రామకృష్ణ విలాస్' ప్రారంభోత్సవము నాడు ప్రదర్శించుటకు 'ఉ'ష-'ద'మయంతి-'సా'విత్రి అనుమూడు నాటకములందలి కల్యాణ ఘట్టములను చమత్కారముగా కూర్చిన కూర్పు. ఇంక తక్కిన 23 నాటకములలో పదునాలుగు ముద్రితములు;[12] తొమ్మిది అముద్రితములు. ఈ అముద్రితములలో సుశీలాజయపాలీయము, సీతాస్వయంవరము, ఘోషయాత్ర, విభీషణపట్టాభిషేకము అను నాలుగింటి వ్రాతప్రతులును లభింపలేదు.

## ముద్రిత నాటకములు :

ఆచార్యులవారి నాటకముల రచనలయానుపూర్విసరిగా తెలియుటలేదు. కాని ఆయాకారణములనుబట్టి ముద్రింపబడిన నాటకముల రచనాక్రమమును క్రిందివిధముగా పేర్కొనవచ్చును—

1. చిత్రనళీయము—1894 లో ప్రథమముద్రణము.
2. సావిత్రీ చిత్రాశ్వము—ఇందు చివరి మూడుఅంకములలో శేషాచార్యులవారి పద్యములు కలవు.
3. చిరకారి—17-1-1891 తేదీన బళ్ళారిలో ప్రప్రథమముగా ప్రదర్శితము,
4. బృహన్నల—క్రొత్తవిధముగా సవరింపబడిన ఈనాటకము 21-3-1897 తేదీన ప్రప్రథమముగా ప్రదర్శింపబడెను.
5. వరూధిని— వ్రాతప్రతిమీది తేదీనిబట్టి (24-6-1896) ఇది 1896 లో రచింపబడినదని చెప్పవచ్చును. (మనుచరిత్రలోని పద్యములిందు యథాతథముగా గ్రహింపబడెను).
6. విషాదసారంగధరము—1889 లో ప్రప్రథమముగా బళ్ళారిలో ప్రదర్శింపబడెను.
7. పాదుకాపట్టాభిషేకము—ఈ ప్రస్తావనలో మాత్రమే 'ఆంధ్రనాటకపితామహ' బిరుదు పేర్కొనబడెను.
8. ప్రమీలార్జునీయము—26-12-1905 తేదీన 'సుగుణవిలాససభ' లో ప్రదర్శితము. ఇందు 'స్త్రీవిద్య'ను గూర్చిన చర్చకలదు.

9. ప్రహ్లాదనాటకము—పోతన్నగారి భాగవతపద్యములిందు యథాతథముగ కలవు.
10. ముక్తావళి—తొలుత దుఃఖాంతము; తరువాత ఆచార్యులుగారే మోదాంతముగ మార్చినరట.
11. అభిజ్ఞానమణిమంతము (చంద్రహాస నాటకము)— – డిటో –
12. రోషనారాశివాజి—చారిత్రకనాటకము.
13. పాంచాలీస్వయంవరము—ఇందు యువతీవివాహ చర్చకలదు.
14. మోహినీరుక్మాంగద—మల్లనామాత్యుని పద్యములిందు యథాతథముగా స్వీకృతములు.

లభించిన వ్రాతప్రతులు :

1. అజామిళ; 2. హరిశ్చంద్రనాటకము; 3. సుగ్రీవపట్టాభిషేకము; 4. యుధిష్ఠిర యౌవరాజ్యము; 5. ఉషాపరిణయము. వీనిలో 'అజామిళ' ఉత్తమమైనరచన. సుగ్రీవపట్టాభిషేకములో వాలిపాత్రచిత్రముగా చిత్రింపబడెను.[13] హిడింబాభీమసేనీయమనెడి ఇంకొకవ్రాత ప్రతికూడ కలదు. "యుధిష్ఠిరయౌవరాజ్యము" నకు లాక్షాగృహదహనము, హిడింబాసురవధ, హిడింబాభీమసేనుల సమాగమము అనెడి మూడుఘట్టములను చేర్చుటతో ఇది సిద్ధమైనది. దీని తరువాతి కథయే 'పాంచాలీస్వయంవరము.'

అజామిళ :

ఆచార్యులవారి 'వచన నాటకము'గా ప్రసిద్ధినందిన రచనయిది.[14] ఇందు, పురాణ ప్రసిద్ధమైన 'అజామిళ' భూమికను ఆచార్యులవారు పూర్తిగా, చిత్రముగా మార్చివేసినారు. అసలు భాగవతమందలి అజామిళుడు పరమదుర్మార్గుడు. కాని ఈనాటకమందలి అజామిళుడు పండితుడు, సత్త్వగుణ సంపన్నుడు, ధర్మదీక్షాపరుడు, క్షమాగుణసంపన్నుడు. మీదుమిక్కిలి సంఘసంస్కారి. వివాహముకాకుండగనే రజస్వలఅయి సంఘముచే బహిష్కృతురాలైన పద్మావతియనుకన్యను మరణోద్యోగమునుండి రక్షించి వివాహముచేసికొనును. అది తక్కిన వైదిక శిఖామణులకు కంటగింపై, పద్మావతిని కామించిన ఒక బలవంతునితోడ్పాటుతో ఆ భార్యాభర్తల ననేకవిధములుగా బాధింతురు. వారు వానినెల్ల ఓర్మితో భరింతురు. విధిలేక అజామిళుడొక దొంగలగుంపుతో కలిసిపోయి వారికి నాయకుడగును. ఆదంపతులు చివరకు సంతానసహితముగా వ్యాధిపీడితులై మరణింతురు. పుత్రమరణదుఃఖముతో ఏకాదశినాడు జాగరణముచేసి, చిన్ని కొడుకు నారాయణుని స్మరించుచు ప్రాణములువీడుటచేత అజామిళునకు పుణ్యలోకప్రాప్తికలిగినది.

ఆచార్యులవారీ నాటకకథాగమనమునకు 'రజస్వలావివాహ' మనెడి ఆధునిక సమస్యను కేంద్రముగాచేసినారు. అంతియేకాదు, స్త్రీలసమావేశములు, అజామిళుడు సురాపానము వలదని దొంగలకు బోధించుట, న్యాయస్థాన విచారణము,[15] వ్యాధినివారణప్రయత్నములు మొదలగున వన్నియును ఆధునికవాతావరణమునకు సంబంధించినవే. ఇది పౌరాణికకథలో అంతగా అతికి నట్లు కన్పట్టదు. ఇంతచేసియును, చివరకు ఏకాదశి ఉపవాసముచేతను, 'నారాయణ' స్మరణచేతను అజామిళుడు ముక్తుడైనట్లు చెప్పబడినది; అంతకంటె అజామిళ దంపతుల మరణముతోను, వారి మరణమునకు పశ్చాత్తప్తులైన శత్రువులు దుఃఖించుటతోను నాటకము అంతమైయున్నచో

కథకు మరింత జిగి చేకూరెడిది. నాయకమరణముతో అంతమైన ఈనాటకము 'విషాదనాటక' మగుచున్నది; సంఘమునకెదురీదుట, విధిలేక దొంగలగుంపుతో చేరుట అనునవి అజామిళుని యందలి దోషములు లేదా లోపములు. అందులకే అతడు బలియయ్యెను. అందులకు తగినపద్ధతిలో నాటకరచన బాగుగనే జరిగినది. ఇందు పాత్రోచితభాష పాటింపబడుట యొకవిశేషము.

## ఆచార్యులవారి నాటకసామాన్యలక్షణములు :[16]

ఆచార్యులవారి నాటకరచనా విధానమును ఇంతకుముందే వివరించియున్నాను. వారు ఏనాటకమునైనను ముందుగా కేవలము వచనముగానే వ్రాసెడివారు (పుటకు ఒకే ప్రక్క). అటుపిమ్మట ఎదుటిపేజీలో సందర్భోచితముగా పాటలను, పద్యములను ఎఱ్ఱసిరాతో వ్రాసెడివారు. ఇట్లువ్రాయుటలో ప్రదర్శనమందు పాల్గొనెడినటులయోగ్యతలు కూడ కొంతవరకు వారిదృష్టిలో నుండెడివి. రచన ఈవిధముగా సాగెడిదికావుననే వచనములో చెప్పినభాగమే పద్యములోను, అదేపాటలోను ఉండుటచూడగలము. నాటకమును చదివెడివారికిది వింతగా తోపవచ్చును. కాని, నటులుమాత్రము సంగీతము తెలిసినవారైనచో పద్యమునో, లేదా పాటనోపాడి వచనమును మానివేసెడివారు. సంగీతముతెలియనివారు వచనముతోనే తృప్తిపడెడివారు. ఆచార్యులవారు అజామిళను కూడ పై విధముగా ముందు కేవలము వచనముగానే వ్రాసినారు. కాని, అటుపిమ్మట మామూలు పద్ధతిగా పద్యములను, పాటలను నాటకమునందంతటను వ్రాసెడి ప్రయత్నము చేయలేదు; అది కేవలము వచనముగానే విజయవంతముగా ప్రదర్శింపబడినట్లు తెలియుచున్నది.

పాశ్చాత్యనాటకసంప్రదాయములను జీర్ణించుకొన్న ఆచార్యులవారు విషాదరూపక రచనపై అధికాదరణముచూపినారు; అంతియేకాదు, వారు తెలుగులో ప్రథమస్వతంత్ర విషాద రూపకరచయితలు కూడను. సారంగధర, పాదుక, అజామిళ సంపూర్ణముగా విషాదరూపక ములు. ముక్తావళీ–చంద్రహాసలు తొలిరూపమున విషాదరూపకములే.

అజామిళతప్ప తక్కిన నాటకములన్నియును గద్య–పద్య–గేయసమన్వితములు. అజా మిళయందు తప్ప తక్కినటకములన్నింటను భాషగ్రాంథికమును, శైలిప్రాబంధికమును. అంతమాత్రమున భాషదుర్బోధమని తలంపరాదు. నేటివారికది కొంతకృతకముగా నున్నట్లు కన్పట్టును. (తాము పాటలను స్వీకరించిన హేతువులను ఆచార్యులవారు చిత్రనళీయపీఠికలో వివరించినారు.)

అంకమును పాశ్చాత్యులపద్ధతిలో రంగములనుగా విభజించినారు. ఏకరంగములైన అంకములు ఆచార్యులవారి రచనలలో ఇంచుమించుగా లేవనియే చెప్పవచ్చును. వరూధిని (3 అం.) తప్ప, తక్కిన నాటకములన్నియు పంచాంకపరిమితములు.

ఆచార్యులవారి నాటకములన్నియును స్వతంత్రరచనలే. వారు ప్రఖ్యాతములైన కథలనే స్వీకరించినను, ఔచిత్యమునననుసరించి క్రొత్త కల్పనలను బహుళముగా చేసియున్నారు. సన్నివేశములకూర్పులో ఆచార్యులవారు సిద్ధహస్తులని చెప్పవచ్చును. నాటకమున నాయకుడు

ప్రఖ్యాతుడును, ఉదాత్తుడును అయిన రాజర్షి కావలయును. కాని ఆచార్యులవారి రచనలలో ఈ ఆలంకారిక సూత్రమున కపవాదములుకలవు—అజామిళ, చిరకారి మొదలగు నాటకములిందుల కుదాహరణములు.

పాశ్చాత్యుల 'ఎపిలోగ్'ను దృష్టిలోపెట్టుకొని ఆచార్యులవారు తమ నాటకములందు 'ఉత్తరరంగము'లను రచించియున్నారు; ఇందు ఆయా నాటకములవలన నేర్వదగిన నీతులు విశదము చేయబడెను. రంగవిభజనపద్ధతి నవలంబించుటచే రచనలో వీరికి ప్రవేశ-విష్కంభాదుల యావశ్యక మెచ్చటనోకాని కలుగనేలేదు.

నీతిబోధయందుకూడ దృష్టికలవారగుటచేత ఆచార్యులవారు ప్రఖ్యాతకథలయందు ఆధునిక రాజకీయ-సాంఘికసమస్యలనుకూడ చొప్పించిరి.[17] ఇందు కొన్ని రమణీయములుగా నున్నను, మరికొన్ని ప్రాతకథలలో అతికినట్లుగా కన్పట్టవు. ఇట్టివానిని 'anachronism' అను దోషముగా పరిగణింతురు.

ప్రస్తావనా-ఆముఖాంగ-అర్థోపక్షేపకాది ప్రయోగములచేత కథాసూచనయు, ప్రథమ పాత్రప్రవేశ సూచనయును జరుగునుక్షాన భారతీయనాటకములలో 'ఆకస్మికారంభము' కన్పట్టదు. కాని పాశ్చాత్యపద్ధతి ననుసరించి ఆచార్యులవారు తమ నాటకములను 'ఆకస్మికారంభములు' కలవానినిగా రచించినారు. పాదుకాపట్టాభిషేకము, వరూధిని మొదలగు నాటకములందలి ఆరంభములిట్టివే. ఇట్లే కొన్నిచోట్ల అంతములుకూడ అకస్మికములుగానే కన్పట్టును.

కాళిదాసాదులు, షేక్స్పియరు ప్రభృతులు హాస్యమును చాల పరిమితముగా వాడియున్నారు. కాని, సభ్యులను దృష్టిలో పెట్టుకొన్న ఆచార్యులవారు దీని కెక్కువ అవకాశమును కల్పించినారు. కొన్నిచోట్ల కథతో అతుకని భాగములుకూడ కలవు. మరికొన్నిచోట్ల ప్రసంగములు సభ్యతను మీరినవికూడను.

ఆచార్యులవారి భాషగ్రాంధికమును, శైలిప్రాబంధికమును అగుటచేత వారితొలినాటకము తెలుగు ప్రబంధములను తలపించుచుండును. సాధారణముగా పద్యములలో భావగాంభీర్యము తక్కువ. నాటకములలో రకరకముల నూత్నఛందములను వాడుట వీరిలోని యొకప్రత్యేకత; వానిలో పెక్కింటిని పాటలుగాకూడ పాడవచ్చుననివారు అధస్సూచికలలో తెలిపియున్నారు.

వేణీసంహారాదులందును, కొన్ని షేక్స్పియరు నాటకములందును సంవాదముతోపాటు కథనమునకును అనగా ఉపన్యాసధోరణి సంవాదములకును, దీర్ఘస్వగతములకును ప్రాధాన్యము కలదు. ఈకథాకథనపద్ధతిని విమర్శకులు దోషముగానే పరిగణించిరి; అయినను ఆచార్యులవారు ఈ పద్ధతిని కూడ అధికముగానే అనుసరించియున్నారు.

ఆచార్యులవారు కొన్ని నాటకములలో 'మూకరంగము' (Silent scene or mime) లను ప్రవేశ పెట్టినారు—సుగ్రీవపట్టాభిషేకములో 'సప్తతాళభేదన' రంగము; అజామిళలో దొంగలుదోపిడి చేయురంగము మొ॥ ఇందువాచికము లేకుండగనే రంగమంతయును సాగిపోవును.

పాశ్చాత్యుల నాటకములలో అధికముగా కన్పట్టెడి పాత్రల చిత్తవృత్తినిరూపణము నకును, భావసంఘర్షణమునకును ఆచార్యులవారెక్కువ ప్రాధాన్యము నొసంగినారు.[18]

మొత్తముమీద ఆచార్యులవారినాటకములలో దోషములుతక్కువ; అవియైనను కాల ప్రభావమునకు సంబంధించియుండును. ఆచార్యులవారికిముందు తెలుగునాటకరచనకు సుప్రసిద్ధ మైన మార్గములేదు; సర్కారుజిల్లాలలో స్వతంత్రనాటక రచనా-ప్రదర్శనము లింకను ప్రయోగ దశలోనే యున్నవి. అట్టిస్థితిలో ఆచార్యులవారు స్వప్రతిభతో పెక్కు ఉత్తమనాటకములను రచించి, ఉత్తమసంప్రదాయములకు చిహ్నమైన సరసవినోదినీసభను స్థాపించి, దేశికత్వమును వహించి, స్వయముగా నటించి, నటింపజేసి, ప్రాచ్య-పాశ్చాత్య సిద్ధాంతములను సమన్వయించు టలో ప్రథములై విలసిల్లినారు. ఇట్టి మహావ్యక్తి 'ఆంధ్ర నాటక పితామహ' బిరుదమునకు సర్వథా అర్హులు.[19]

## విషాద సారంగధరము

సారంగధరచరిత్రను తెలిపెడి తెలుగుగ్రంథములలో గౌరన 'నవనాథచరిత్ర' తొలి రచన (15 వ శతాబ్ది పూర్వభాగము); దీనికి గిరిరాజకవి పద్యప్రబంధము మూలమట. కాని అది లభ్యముకాలేదు. గౌరన గ్రంథమునుబట్టి సారంగధరకథకు తెలుగుదేశముతో నెట్టిసంబంధ మునులేదు—కథమాళవదేశమందలి మాంధాతపురమున జరిగినది; సారంగధరుని తండ్రి రాజ మహేంద్రుడు. క్రీ. శ. 1517 లో 'బాలభాగవత' మనెడి ద్విపదకావ్యమును రచించినదోనేరు కొనేరుకవి మాత్రము ఈ కథను తెలుగుదేశమునకు ముడిపెట్టెను.[1] సారంగధరచరిత్రమును పద్యకావ్యముగా రచించిన చేమకూర వేంకటకవి (రఘునాథనాయకుని కాలము) గౌరనకథనే గ్రహించినను రాజమహేంద్రుని మాళవపతియనియేకాక రాజమహేంద్రవిభుడనియు పేర్కొనెను; అంతియేకాక మాంధాతపురమును రాజమహేంద్రవరముగా మార్చెను. కాగా, ఆతడీకథను తెలుగుదేశమునకు ముడిపెట్టుటయందే మొగ్గుచూపెనన్నమాట. 1656 లో 'అప్పకవీయము'ను రచించిన అప్పకవియును, అటుపిమ్మటివారగు సముఖమువేంకటకృష్ణప్ప నాయకుడు, బాణాల శంభుదాసుడు, కూచిమంచి తిమ్మకవి మొదలగువారు ఈ కథకు తెలుగుదేశముతో అవినాభావ సంబంధమునే నిర్దేశించియున్నారు.[2] ఇట్లు 'పదహారణాల' తెలుగుకథగా మారిపోయిన సారంగ ధర చరిత్రనే కృష్ణమాచార్యులవారు చేపట్టినారు. గౌరనయును, వేంకటకవియును చిత్రాంగిని 'భోగసతి' యనినారు; కాని, శంభుదాసుడును, తిమ్మకవియును ఆమె 'రాజుగారి రెండవభార్య' యని మార్పుచేసినారు.[3]

సారంగధరకథలను పోలినకథలు గ్రీకు-రోమన్ సాహిత్యములందునుకలవు. గ్రీకు విషాదరూపకర్త యురిపిడస్ రచించిన 'హిప్పొలిటస్'; రోమన్ నాటకకర్త సెనీకా రచించిన 'హిప్పొలిటస్' లేదా 'ఫేడ్రా'అనెడి విషాదరూపకములందలి కథలు అచ్చముగా సారంగధరుని కథవంటివే. అందున, సెనీకారచన తెలుగులోనికథకు మరింత సన్నిహితముగా కన్పట్టుట పరిశీలింపవచ్చును.[4]

మహారాష్ట్రభాషలోని 'కృష్ణాగరుడి చరిత్రము'ను, కన్నడభాషలోని 'కుమారరాముని కథ'యును సారంగధర కథాంశములతో సంవదించుచున్నవి. అసలిట్టికథకు మూలము ద్రావిడుల లోని 'మాతుల కన్యోద్వాహపద్ధతి' ఔత్తరాహులైన ఆర్యులకు నచ్చకపోవుటయే అయి యుండుననని కేతవరపు రామకోటిశాస్త్రిగారూహించినారు.[5] మన హిందూవేదబ్రాహ్మణ పురాణాదివాఙ్మయములందిట్టిది (ఒక యువతి సవతి కుమారుని కామించికవయగోరుట) వేరొక్క కథకన్పట్టుటలేదు. కాని ఇట్టి వృత్తాంతములు గ్రీకువాఙ్మయాదులందనేకములుకలవు. కుమారుడు తన తల్లినే వివాహమాడి సంతానమును పడసినవృత్తాంతమును ఎస్కిలస్ నాటకీకరించినాడు (Oedipus Rex); ఇది ఉత్తమనాటకముగా నేటికిని విమర్శకులచే ప్రశంసలనందుకొను చున్నది. కాని మనవారి నీతిప్రమాణములువేరు; ఇట్టి ఘోరములుతప్పవనునప్పుడు భారతీయులు ఏదో యొకటి కల్పించి, ప్రమాదములను తప్పింపజూతురు.[6] కాని పాశ్చాత్యుల నీతిప్రమాణ ములు వేరగుటచేతనే, బహుప్రాచీనకాలమందే, ఇట్టికథలు సాహిత్యమున స్థానమాక్రమించుట కవకాశము కలిగినది. క్రీస్తుశకము రెండవశతాబ్దమునకు పూర్వమునుండియు రోముమొదలగు పాశ్చాత్యదేశములతో దక్షిణాపథము వర్తకవ్యాపారములు సాగించియుండుట వాస్తవ చరిత్రాంశము. కావున గౌరన కాలమునకు చాలముందే ఈ కథ దక్షిణాపథమునకు దిగుమతి అయియుండవచ్చును.

సారంగధరుని కాలుసేతులు మరలవచ్చెనని చెప్పుటకంటె కథవిషాదాంతమగుటయే సహజమని ఆచార్యులవారి తలంపు; అంతియేకాటు. నీతిబోధ విషాదనాటకములందువలె మంగళాంత నాటకములయందు కలుగజాలదని వారు చిత్రనళీయ ప్రథమ ముద్రణపీఠికలో పేర్కొనియున్నారు, అందుచే వీరు కథను దుఃఖాంతమొనర్చి తదనుగుణముగా కథాగతినిమలచు కొని, దీనికి 'విషాదసారంగధర' మని పేరుపెట్టిరి. ఇది, దుర్మరణముపాలైన సారంగధరుని చరిత్రమగుటచేత దీనికి 'విషాద సారంగధర' మను పేరుపెట్టిరని తలంపవచ్చును. అంత మాత్రమున సారంగధరుడే నాయకుడని తలంపరాదు. ఈ నాటకమునందు రాజనరేంద్రుడే కథానాయకుడని 'పాత్రలపట్టిక' లో ఆచార్యులవారు నిర్దేశించియున్నారు. ఏకైకపుత్రుడును, కులదీపకుడును అయిన సారంగధరుని దుర్మరణము నాయకుడగు రాజనరేంద్రుని జీవితమును దుఃఖభాజన మొనర్చెను కాన ఈనాటకమునకు 'విషాదసారంగధర' మని పేరుపెట్టుట సమంజ సమే కాగలదు.

విషాదరూపకనాయకుడు సత్పురుషుడే అయినను, ముఖ్యముగా, తనదైన ఒకదోషము చేత (అది స్వల్పమే అయినను) పతనముచెందును. రాజరాజు ఉత్తముడు; చక్రవర్తి. కాని, వానికిగల 'కామ' మనెడి దోషమువలన కోడలుకావలసిన యువతిని భార్యగాస్వీకరించి, ఆమె మనస్సులో ఆరని చిచ్చుపెట్టెను. అందులకు ప్రతిఫలముగా వంశవర్ధనుడైన ఏకపుత్రుని కోల్పోయి తత్ఫలమనుభవించినాడు; అందుచే ఆతడు విషాదనాయకుడే (Tragic hero) అగు చున్నాడు. అంతమున నాయకమరణమునే విధిగాచూపవలెనను నియమమెచ్చటనులేదు; బ్రతికి యుండినప్పటికిని రాజనరేంద్రుడు పుత్రమరణముతో జీవచ్ఛవమే అయినాడు. అయినచో కథా

గమనమంతయును తదున్ముఖముగా సాగినదాలేదాయనునది మిగిలిన ప్రశ్న. అట్లుసాగినప్పుడే అది 'విషాదరూపక' మనిపించుకొనును. ఇట్లు కథనునడుపుటనే 'నిర్వహణశిల్ప' మందురు. ఈ నిర్వహణ శిల్పమందు ప్రధానమైనవి మూడంశములు—1, వస్త్వైక్యమును సాధించుట; 2. పాత్రపోషణము త్తముగా, శిల్పసమ్మతముగా నుండుట; 3. రచనఉదాత్తముగా నుండుట.

రూపకమునకు అతిప్రధానమైన వస్త్వైక్యము ఇందు చక్కగా సాధింపబడినది.[7] కథా సంవిధానమందు ఆచార్యులవారు సిద్ధహస్తులనుట నిర్వివాదము.

ఈ రూపకమందు ప్రధానప్రాతలు మువ్వురు—రాజనరేంద్రుడు, చిత్రాంగి, సారంగ ధరుడు. రాజనరేంద్రుడు ఉత్తమవిషాద రూపకనాయకుడుగా తీర్పబడినాడు. అతని పతనమునకు జాలిపడని సహృదయుడుండడనుట నిర్వివాదము. రాజనరేంద్రుని పాత్రకంటెను ఎక్కువ రమణీయముగా చిత్రాంగిపాత్ర పోషింపబడినది. చిత్రాంగిపాత్ర పరిపోషితమైన పద్ధతిని సవిమర్శకముగా ప్రశంసించుచు ఆచార్య తణికెళ్ళ వీరభద్రుడుగారొక చక్కనివ్యాసమును వ్రాసియున్నారు.[8] ఇంక సారంగధరుడు[9] వయోధర్మమును మించిన ఆత్మసంయమనమును, సర్వనాశనము తననెదుర్కొనుచున్నను పినతల్లి దౌష్ట్యమును ప్రకటింపని చిత్తస్థైర్యమును కలవాడుగా చిత్రింపబడినాడు, స్థూలదృష్టికి 'ఈతడే నాయకుడా' అని అనిపించునంతగా సారంగ ధరుని పాత్రపరిపోషితమైనది (అతని జీవితమే, ఒక విషాదరూపకము; అందాతడు నాయకుడే). వాని పతనము, ప్రధానమైన నాయకపతనమునకు దారితీసినది. ఈ దృష్టితో కూడ సారంగధరపాత్రను పరిశీలింపవలసియున్నది.

రచనఉదాత్తముగా నుండుటయనగా శైలిపటువుగా, సంవాదములు నిబిడముగా, పద్య రచన తగినఛందములలో రసోద్దీపకముగా సాగుటయని అర్థము. శైలిప్రాబంధికమగుటచేతను, సంభాషణలు చాలచోట్ల సుదీర్ఘములగుటచేతను, వచనమునందు శబ్దమునకెక్కువ ప్రాధాన్య ముండుటచేతను, పద్యములంత భావగాంభీర్యము కలవి కాకపోవుటచేతను రచనాశిల్పము లోప భూయిష్ఠముగానున్నదనియే చెప్పవచ్చును. అది, నాటికాలప్రభావము; నాటిప్రజలకది రుచించి నది కూడను.

అంతకుముందు తెలుగులో సుప్రతిష్ఠితమైన మార్గమేదియును లేకపోవుటచేతను, తమకు కూడ విషాదరూపకరచనకదియే ప్రారంభమగుటచేతను, నాటి ప్రజలయభిరుచికి కొంత తల యొగ్గవలసివచ్చుటచేతను రచనలో స్వల్పదోషములు దొరలియుండవచ్చును. అయినను మొత్తముమీద ఆచార్యులవారు తెలుగునాటక చరిత్రలో ఒక క్రొత్తఅధ్యాయమునకు మూల పురుషులైనారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పేర్కొన్నట్లు "పది శోకాంతనాటకములు చేసినంతపని తెలుఁగువారికిది యొకటేచేసినది," (చూ. నాటకోపన్యాసములు-పుట 87).

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము[1]

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రసిద్ధనాటక కర్తగా, నవలరచయితగా, హాస్య రచయితగా, ఏకసంథాగ్రాహిగా, సంఘసంస్కర్తగా ఆంధ్రులకు చిరస్మరణీయులు. వీరిమాతా

మహులు కవులు; మేనమామయగు పురాణపండ మల్లయ్యశాస్త్రిరు సుప్రసిద్ధపండితులు. గురువు లగు వీరేశలింగముగారు నాటకకర్తలు, ప్రహసనరచయితలు, సంఘసంస్కర్తలు. ఇందులకు తోడు పుట్టుకతోనే వచ్చినవి ఆంధ్రాభిమానము, జాతీయాభిమానము—ఇవియన్నియును లక్ష్మీనరసింహముగారిని తీర్చిదిద్దినవి. అందుచేతనే 1907 లో బిపిన్ చంద్రపాలువచ్చిన సమయములో

"భరతఖండంబు చక్కని పాడియావు । హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరిగొల్లవారు । పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి"

అని ఆశువుగా చెప్పగలగినారు. మరియు 1909 లో పంచములకు పాఠశాలను పెట్టి నిమ్నజాత్యుద్ధరణమునకు పాటుపడినారు (గాంధీమహాత్ముని హరిజనోద్ధరణోద్యమమునకు చాలముందే వీరా సమస్యను చేపట్టుటగమనార్హము).

రాజమహేంద్రవర హిందూనాటక సమాజస్థాపకులగు ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు 1889 జనవరి నెలలో ఒకనాడు లక్ష్మీనరసింహముగారి యొద్దకువచ్చి 'కీచకవధ నాటకము'ను వచనములో వ్రాసిఇవ్వవలెనని కోరినారు (నాయుడుగారు 'వచన' నాటకమునే అడుగుటకు కారణము ఆసమాజసభ్యులు పద్యములుచదువలేని వారగుటయే); అందులకు వారు అంగీకరించి రచనమొదలుపెట్టిరి. అది లక్ష్మీనరసింహముగారి నాటకరచనకే కాక, అసలు వారి గ్రంథరచనకే ఆరంభము. వీరు మొత్తము పది స్వతంత్రనాటకములను రచించిరి; పార్వతీ పరిణయమను నాటకమును, భాసరూపకములను సంస్కృతమునుండి అనువదించిరి. ఇతరులు రచించిన అశ్వమేధము, సారంగధర అనెడి నాటకములలో కొన్నిభాగములను క్రొత్తగావ్రాసి యిచ్చిరి. మరియు పెక్కుప్రహసనములను కూడ రచించిరి.

నాటకములు :

కీచకవధ : గ్రంథరచనకారంభముకాన మొదటి రెండంకములలోను కఠినపదములు, కఠినసమాసములు కొంవలినవి. తక్కినభాగమున, శృంగారస్పర్శ అధికముగాన అది సులభ శైలిలో సాగినది. ఇది రాజమహేంద్రవర హిందూనాటక సమాజమువారిచే ప్రప్రథమముగా 15–6–1889 తేదీన ప్రదర్శింపబడెను. అది విజయవంతమగుటతో నాయుడుగారికేకాక, కవిగారికిని గుండెదిటవు కలిగినది. అంతట వారి నాటకరచనాప్రవాహము ఒడ్డులొరసికొనుచు ప్రవహింప సాగినది. వారు హిందూనాటకసమాజగ్రంథకర్తగా పరిగణింపబడసాగిరి.

ద్రౌపదీ పరిణయము : ఐదు అంకములు. 1889 సెప్టెంబరులోనో, అక్టోబరులోనో ప్రథమప్రదర్శనము. ఇందు 4 వ అంకమున టంగుటూరి ప్రకాశంపంతులుగారు మిక్కిలి యద్భుతముగ నభినయించెడివారట. ఇదియును వచననాటకమే.

గయోపాఖ్యానము : రచన 1889 డిసెంబరు; ప్రథమ ప్రదర్శనము 1890 ఏప్రిలు. శ్రీకృష్ణపాత్రధారి పాడగలవాడగుటచే ఆ పాత్రకు కొన్నిపద్యములువ్రాయబడెను. వీరినాటకము లన్నింటను సుప్రసిద్ధమైనదిదియే.[2]

లక్ష్మీనరసింహముగారు మెట్రిక్యులేషనులో నుత్తీర్ణులై ప్రవేశపరీక్షకు కొంతచదివి మానినవారు. ఆంగ్లమున నుపన్యసింప సమర్థులు. అయినను వారాంగ్లనాటకముల ననువదించుటకు ప్రయత్నింపలేదు. సత్యము చెప్పవలెనన్నచో మూడంశములందుతప్ప మరియెచ్చటను వారి నాకములం దాంగ్లనాటకప్రభావము పడలేదు (1. చంద్రహాస-ప్రహ్లాద చరిత్రలయందు రంగ విభజనముండుట; 2. చంద్రహాస చరిత్ర విషాదాంతమగుట; 3. ఇంచుమించుగా అన్ని నాట కములను పంచాంక పరిమితములేయగుట). మరియు ప్రతి నాటకమందును నాందీ-ప్రస్తావనా-భరతవాక్యములను యథావిధిగా వ్రాసినారు.

తనకు నచ్చిన, లేదా తాను మెచ్చిన కథను గైకొని తనచిత్తముననుసరించి నాటకములను వ్రాసెడి యవకాశము చిలకమర్తివారికి కలుగలేదు. ఎల్లప్పుడును హనుమంతరావునాయుడు గారో, మరియొకరో ఫలానికథను నాటకముగా రచించిపెట్టుడని కోరుటయు, వెంటనే వారందు లకు పూనుకొనుటయు, ఇంచుమించుగా రోజులలో రచనముగించుటయు జరుగుచుండెడిది. వెంటనే రెండవప్రతియైనను వ్రాయించకుండగనే, ఆ ఒక్కప్రతిని సమాజమున కిచ్చివేసెడి వారు. మరల ఒకసారి సరిచూచుకొనెడి ప్రయత్నమెన్నడును చేయనేలేదు. అంతియేకాక వారి రచనలో అధికభాగము నాటి సమాజపు నటులను దృష్టిలో పెట్టుకొని సాగెడిది. ధర్మవరం ప్రభృతులును ఇట్లే చేసిరి. అసలు, ఆకాలమే అంత ! ఆకాలమందేకాదు, మైలవరం, ఏలూరు నాటకసమాజముల కాలములలో—1910-1930 మధ్యకూడ—నటులనుబట్టియే నాటకములు వ్రాయబడెడివి. కవులు స్వతంత్రులై వ్రాసిన నాటకములలో ఉత్తమమైనవానిని ఎన్నికచేసికొని, ప్రదర్శించుటకుబదులుగా సమాజములవారు తమకున్ననటులను దృష్టిలోపెట్టుకొని, కవులను పరి మితులలో నిర్బంధించి, నాటకములను వ్రాయించుకొనిరి. తెలుగులోని బహుళఉత్తమనాటకముల అభావమున కిది ముఖ్యకారణము; కాగా తెలుగు నాటకరంగ చరిత్రలో ఇదియొక దురదృష్టకర మైన పరిణామము !

చిలకమర్తివారి నాటకరచన 1889 లో ఆరంభమైనను 1906 వరకును ఒక్క నాటకముకూడ వారిది ముద్రింపబడలేదు. అప్పుడొకనాడు సమాజమున కుపాధ్యక్షులును, చింతా మణీ ముద్రాక్షరశాలాధిపతులును అయిన సత్యవోలు గున్నేశ్వరరావుగారు వారి నాటకములను ముద్రించుట కుత్సాహముచూపిరి[6]. అందులకంగీకరించి, ఒక గుమాస్తానేర్పరచుకొని, తమ నాటకములను సవరింప నారంభించిరి. కాగా పారిజాతాపహరణము 1906 ప్రారంభములోను, ప్రసన్నయాదవము ఆ సంవత్సరాంతమునను ముద్రితములైనవి. ఇంక గయోపాఖ్యానమును సవరించుట యాలస్యమగుటచేత అది 1909 లో ముద్రింపబడినది. ముద్రణమునకుముందు లక్ష్మీనరసింహముగారు తమ నాటకములలో తలపెట్టిన సవరణ కర్థము 'పూర్వము పద్యములు లేని పాత్రలకు పద్యములు పెట్టుట, తక్కువయున్నపాత్రలకు నెక్కువపెట్టుట, మునుపున్న భాగములను కొన్నింటిని తీసివేసి క్రొత్తభాగములు చేర్చుట' (స్వీ. చ. 236-37). కాగా, ఇతి వృత్తమందుకాని, కథాగమనమందుకాని, పాత్రపోషణయందుకాని వారు మార్పులుచేసినట్లు కనపట్టదు. పూర్వపు ప్రతులు లభింపకపోవుటచేత వారుచేసిన మార్పులలో ఎంతవరకు అభివృద్ధి

శ్రీరామజననము : రచన 1889 డిసెంబరు; ప్రథమ ప్రదర్శనము 1890 జనవరి. పదిరోజులలో పూర్తిచేయబడిన రచనయిది.[3]

పారిజాతాపహరణము : రచన 1890 వేసవిలో. ఇందు శ్రీకృష్ణపాత్రకుద్దేశింపబడిన పిళ్ళారిసెట్టి రామకృష్ణమ్మ నాయుడుగారు పద్యములు చదువలేనివారగుటచేత మొదట పద్యములను వ్రాయలేదు; కాని ముద్రణమునకు ముందే చాలపద్యములను చేర్చినారు.

నలనాటకము : రచన 1890; ప్రథమప్రదర్శనము 1892 జూన్ ప్రాంతములు; ఇందు దుర్గి గోపాలకృష్ణరావు నలుడు, ప్రకాశంపంతులుగారు దమయంతి. తమ నాటకముకంటె ధర్మవరమువారి చిత్రనళీయ మన్నివిధముల మిన్నగనుండుటచేత వీరీనాటకమును ముద్రించు ప్రయత్నము చేయలేదు; వ్రాతప్రతి అలభ్యము.

సీతాకల్యాణము : రచన 1890 మార్చి; ఆ శ్రీ రామనవమిదినములలోనే ప్రథమ ప్రదర్శనము.

పార్వతీ పరిణయము : ఇది వీరి ప్రథమసంస్కృతరూపకానువాదము. అనువాదము 1899 లో. 1904 లో ప్రథమశాస్త్ర పరీక్షకు పాఠ్యగ్రంథము.

ప్రసన్నయాదవము : శ్రీకృష్ణనరకాసురుల యుద్ధగాథ ఇది. రచన 1905_06.

ప్రహ్లాదచరిత్రము : రచన 1927; పిఠాపురం రాజావారి కంకితము.

చతురచంద్రహాసము : రచన 1927 ప్రాంతములు. చతురచంద్రహాస_ప్రహ్లాదచరిత్రములు రెండును నాటకసమాజముతో సంబంధమును వదలుకొన్నతరువాత రచింపబడినవి.

భాసనాటకముల ఆంధ్రీకరణము : 1926 కు ముందే భాసనాటకచక్రములోని స్వప్నవాసవదత్తను, మధ్యమవ్యాయోగమును[4] (ఇది 1915 లో ముద్రితము) ఆంధ్రీకరించి ప్రచురించిరి. క్రమముగా అభిషేక_కర్ణభారములను తప్ప తక్కిన రూపకములనన్నింటిని అనువదించిరి. షష్టిపూర్త్యుత్సవ సంపుటములలో 6 వ సంపుటమందు స్వతంత్రనాటకములును, 7 వ సంపుటమందు భాసనాటకములును ముద్రితములైనవి. అభిషేకనాటకమును 1933 లో తెనిగించినారు; కర్ణభారమును వారు తెనిగించినట్లు కన్పట్టదు.

ప్రహ్లాద చరిత్రమందు ఆరు అంకములున్నవి; అందు మరల రంగములున్నవి, కాని తక్కిన స్వతంత్ర నాటకములన్నియును పంచాంకపరిమితములే; అంతియేకాదు ఇంచుమించుగా అంకములన్నియును ఏకైకరంగములే. వీరు గ్రహించినవన్నియును ప్రఖ్యాతేతివృత్తములే; ఒక్క చతురచంద్రహాస కథ మాత్రము అంతప్రసిద్ధమైనదికాదు. ఈ నాటకము నొక్కదానినే వీరు దుఃఖాంతముగా రచించియున్నారు. కుంతలసామ్రాజ్యమును చేజిక్కించుకొనవలెనన్న యాశ అడియాసకాగా ''భాగురాయణచరిత దృశ్యప్రబంధమం దిదె కడపటియంకము; తెరపడవలసిన యవసరమువచ్చినది......" అనుచు నాతడు పొడుచుకొని చనిపోవును. ఇంక కవి భరతవాక్యమును కూడ పలుకలేదు. మొత్తముమీద లక్ష్మీనరసింహముగారు ప్రాచీనమర్యాదల నుల్లంఘించిన ఘట్టమిది యొక్కటియేయని చెప్పవచ్చును.[5]

యున్నదో చెప్పజాలము. ఇంక నేటి ముద్రిత ప్రతులనుబట్టియే నాటకములను పరిశీలింపవలసి యున్నది.

హాస్యరచనలు :

'గణపతి' అనెడి శ్రీ చిలకమర్తివారి వచన రచన సుప్రసిద్ధమైనది. 1916 లో 'మనోరమ' యను మాసపత్రికను ప్రకటింప నారంభించి అందులో 'వినోదములు' కూడ వరుసగా ప్రకటింప సాగిరి. ఇవి చిన్నచిన్న ఖండములై, కథనాత్మకములుగాను సంవాదాత్మకములుగాను ఉండెడివి. 1910 లో 'దేశమాత' యను వారపత్రికను ప్రారంభించినప్పటినుండియు వారమున కొక చిత్రకథను, ఒక 'హాస్యలత'నుకూడ ప్రకటింపనారంభించిరి. ఈ హాస్యలతలు సంఘ దురాచారములమీదను, రాజకీయములమీదను, మ్యునిసిపలు విషయములమీదను, జనాభాలెక్కలు మొదలైనవానిమీదను వ్రాయబడుచుండెడివి. కొన్నింటియందు రంగవిభజనాదులుకూడ కలవు (ఈ హాస్యరచనలన్నియును షష్టిపూర్తి ప్రథమసంపుటములో చేర్చబడెను). ఇంక ప్రహసనములనుపేర మరికొన్ని రచనలున్నవి. కనకశునక ప్రహసనము, మహారసిక ప్రహసనము, గయ్యాళి గంగమ్మ ప్రహసనము, ఆత్మగౌరవ ప్రహసనము, వరదక్షిణ ప్రహసనము, బధిర చతుష్టయ ప్రహసనము, బలవంతబ్రాహ్మణార్థ ప్రహసనము, అద్భుతశ్రాద్ధ ప్రహసనము, కైలాసదూత ప్రహసనము మొదలగునవి.

కనకశునక ప్రహసనములో ధర్మశాస్త్రవేత్తలమని చెప్పుకొని ఇతరులకు లేనిపోని దారుణమైన శిక్షలు కల్పించి విధించుచు అది తమకేతటస్థించినప్పుడు చల్లగా జారుకొనెడి దాంభికులు హేళనచేయబడినారు. ఇట్లే ప్రతి ప్రహసనములోను ఏదో ఒక సాంఘిక దురాచారమునో, మూఢత్వమునో, వ్యక్తుల దౌష్ట్యమునో వెల్లడిచేయుట జరిగినది.

హిందూనాటకసమాజము :

సమాజస్థాపకులైన హనుమంతరావునాయుడుగారితోపాటు లక్ష్మీనరసింహముగారును ఈ సమాజమందు ప్రముఖవ్యక్తులైనారు. పై గ్రామములలో ప్రదర్శనములిచ్చుట కేగినప్పుడు వీరిదే యాజమాన్యము. సమాజసభ్యులందరును వీరియందు భయభక్తులుకలవారై మెలగు చుండిరి. నాయుడుగారు, లక్ష్మీనరసింహముగారు, ప్రకాశంపంతులుగారు—ఈ మువ్వురివలన ఈ సమాజమునకు ఎనలేని ఖ్యాతి వచ్చినది. ఆంధ్రనాటకరంగ చరిత్రలో ఈ మువ్వురి కలయిక ఒక రమణీయఘట్టము. 1894 నుండి 1901 వరకును సమాజము పనిచేయలేదు. 1901 లో నాయుడుగారు సమాజమును పునరుద్ధరించి లక్ష్మీనరసింహముగారినే దాని కధ్యక్షులను చేసినారు. వీరి ప్రోత్సాహముతోనే ఈ సమాజమువారు 1903 లో పెంకుటి నాటకశాలను కట్టుకొనినారు. స్త్రీ వేషమునకు సుప్రసిద్ధులైన ముప్పిడి జగ్గరాజుగారిని ఈ సమాజమునకు తీసికొనివచ్చిన వారు లక్ష్మీనరసింహముగారే. 1908 లో గున్నేశ్వరరావుగారును, నాగేశ్వరరావుగారును ఈ సమాజమును స్వాధీనముచేసికొనువరకును లక్ష్మీనరసింహముగారే ఈ సమాజమున కధ్యక్షులుగా నుండిరి.

లక్ష్మీనరసింహముగారు నాటకరంగమును, సమాజమును నీతిమంతముగా నిలుపుటకును, సమాజగౌరవమును స్వాతంత్ర్యమును నిలుపుటకును శక్తివంచనలేకుండ ప్రయత్నించిరి[7].

లక్ష్మీనరసింహముగారి నాటకములనెల్ల ఒక్క హిందూనాటక సమాజమువారే ప్రదర్శించెడివారు. 1909లో గయోపాఖ్యానము ముద్రింపబడిన తరువాతకాని వారి నాటకప్రతులు ఇతర సమాజములవారికి లభింపలేదు. కాగా, శ్రీ చిలకమర్తివారి నాటకయుగము 1909 లో గయోపాఖ్యాన ముద్రణముతోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఆటుపిమ్మట వారి నాటకములను ప్రదర్శింపని తెలుగునాటకసమాజమేలేదన్నచో అతిశయోక్తికాదు. అందున గయోపాఖ్యానమునకున్న ఖ్యాతి మరియే తెలుగునాటకమునకు లేదని చెప్పవచ్చును.

## గయోపాఖ్యానము : ప్రసన్నయాదవము

గయోపాఖ్యానము[1] :

మరుత్తరాట్చరిత్రలోను, చిత్రభారతములోను గయోపాఖ్యానకథను పోలిన కథలు కలవు. గయోపాఖ్యానమును ఇతివృత్తముగా స్వీకరించి పద్యకావ్యములుగా ఐదారుగురు వ్రాసియున్నారు. వారిలో ఈ కథను 'కృష్ణార్జునసంవాద'మను పేర ద్విపదకావ్యముగా వ్రాసిన నాదెండ్ల గోపమంత్రి ప్రథముడు, తరువాత ఈ కథనే గ్రహించి రామయామాత్యుడు రెండాశ్వాసముల చిన్న కావ్యమును, వేల్పింటి సుబ్బయార్యుడు ఐదాశ్వాసముల పెద్దకావ్యమును[2] రచించిరి. వెలిచేరు వేంకటరామప్రధాని ఇంకొకపద్యకావ్యమును, కస్తూరిరంగకవి 'కృష్ణార్జునసంవాద'మను పేర ఇంకొక ద్విపదకావ్యమును రచించినారట. వీరేకాక ఓబయామాత్యుడు, పోచిరాజు అనువారలు ఈ కథను కావ్యములుగాను, ధేనువకొండ తిమ్మయ్య 'జంగంకథ'గాను రచించిరట. సాధుపల్లి చంద్రశేఖరకవి యనునతడీ కథను కన్నడములో కావ్యముగా రచించెనని తెలియుచున్నది. ఆధునిక కాలములో శ్రీ ఎన్. సి. కేల్కర్ అనునతడీ కథను 'కృష్ణార్జునయుద్ధ' మను పేర కన్నడములో నాటకీకరించెను[3]. కొండుభొట్లవారు 1885 కు ముందే తెలుగులో గయోపాఖ్యాన కథను నాటకీకరించియున్నారు. దానిని గుంటూరు హిందూనాటకసమాజమువారు రాజమండ్రిలో ప్రదర్శించినారు. అటుపిమ్మటనే చిలకమర్తివారు తమగయోపాఖ్యాన నాటకమును వ్రాయుట జరిగినది.

కాగా, కొండుభొట్లవారి రచనకంటె భిన్నమైన విధముగా చిలకమర్తివారు వ్రాయవలసివచ్చినది. ఈ భేదము కథలోకూడనున్నది. గయుడుగాలవఋషి చేతులలో నుమిసిన కథను కొండుభొట్లవారు గ్రహింపగా, చిలకమర్తివారు గయుడు శ్రీకృష్ణుని చేతులలోనే యుమిసిన కథను గ్రహించినారు. చిలకమర్తివారే వ్రాసికొన్నట్లు వారి కథ రామయామాత్యుని కథాసరణి ననుసరించియున్నది (అంతియేకాదు; పద్యరచనయందును అనుసరణము కలదు). మొట్టమొదట అది కేవలము వచనముగానే వ్రాయబడినది. వచనమును అర్థవంతముగా చదువుటలోను, రసమునుబట్టి ముఖవైఖరిని, కంఠస్వరమును మార్చుటలోను నిపుణులైన శ్రీయుతులు హనుమంతరావునాయుడు (గయుడు), ప్రకాశంపంతులు (చిత్రరేఖ–

అర్జునులు), దుర్గి గోపాలకృష్ణరావు (శ్రీకృష్ణుడు), ఐనవోలు తాతయ్యనాయుడు (కౌశికుడు) గార్లచే ఈ వచననాటకము బాగుగా రక్తికట్టినది. వ్రాతప్రతిని సవరించి ముద్రించినప్పుడుకూడ వచనభాగములో మార్పులేదు. పద్యభాగమంతయును మాత్రము నూతనముగ జేర్పబడెనట. అచ్చుపడిన వెంటనే ప్రతులు శనగపప్పువలె ఖర్చుపడినవట. లక్ష్మీనరసింహముగారు 1942 లో స్వీయచరిత్ర వ్రాయునప్పటికి లక్షప్రతులమ్ముడుపోయినవని అంచనావేయబడెను (record sales). అనగా తెలుగుదేశమున గ్రంథముద్రణ చరిత్రలో ఇది అపూర్వవిషయమన్నమాట! కాగా, గయోపాఖ్యాన మాబాలగోపాలముచేతను సేవింపబడినదన్నచో అతిశయోక్తిలేదు[4], దీనిపై ప్రజలకంత అభిరుచి యేలకల్గెనో లక్ష్మీనరసింహముగారే ఊహింపలేకపోయినారు.

"లక్ష్మీనరసింహముగారీ యితివృత్తములో గొన్ని మార్పులుచేసి రమణీయ నాటక్మము రచించిరి." అని జయంతి రామయ్యపంతులుగారును, "పూర్వకృతులయందలి అనౌచిత్యములను సూక్ష్మదృష్టిని పరిశీలించి, పరిహరించి, నాటక రూపమున ప్రాతకథనే పోతపోసినాడు చిలకమర్తి. సృష్టించవలసిన వైచిత్రిని నాటకకర్త సృష్టించినాడు...నాటకమును క్రమోన్మీలనము చేయుటలో చిలకమర్తి ఇతివృత్తమును చక్కగాదిద్దుకొనినాడు[5]" అని కేతవరపు రామకోటిశాస్త్రిగారును వ్రాసిన వాక్యములెంతయును సమంజసములు; రామాంజనేయుల యుద్ధకథవలెనే కృష్ణార్జునుల యుద్ధకథయును సహజముగానే కుతూహలమును రేకెత్తించునట్టిది. అందులకుతోడు, లక్ష్మీనరసింహముగారు సన్నివేశము లొండింటితో సంబంధించి కార్యకారణబద్ధములగునట్లుగా కూర్చుకొని, కథను నాటకోచితముగా మలచుకొనియున్నారు.

"ఈ కథయందర్జునుఁడే ప్రధాననాయకుడని చెప్పవలసియున్నది. ఆతనియందు శౌర్యము, ధర్మనిష్ఠ—యీరెండు నొకటికొకటి తీసిపోకుండనున్నవి" అని రామయ్యపంతులుగారు వ్రాసినారు (పుట 78). అర్జునుని యందా గుణగణములుండుట నిజమే; కాని అర్జునుడు నాయకుడనుటకంటె శ్రీకృష్ణుడే నాయకుడనుట సమంజసము; ఈ నాటకమునకుగల 'ప్రచండయాదవ'మనెడి నామాంతరముకూడ శ్రీకృష్ణుడు నాయకుడనుటనే సమర్థించుచున్నది. అయినచో అర్జునుడు ప్రతినాయకుడుకాగలడు. మొత్తమున కిరువురును ఇందు ప్రధానపాత్రలే. కథను ఉదాత్తముగామలచుకొనుటలో శ్రద్ధవహించినకవి ఆ పాత్రల వ్యక్తిత్వమును కాపాడుటలో కొంత అశ్రద్ధను చూపినారని చెప్పకతప్పదు. ఇందు కృష్ణార్జునులతిసామాన్యమానవులనుగా చిత్రించినారు. కృష్ణుడు సుభద్రను నిందించినతీరును, కృష్ణార్జునులు పరస్పరము పద్యములలో చేసికొనిన దూషణములును ఆ పాత్రలకు కళంకావహములై ఆ పాత్రల ఉదాత్తను భంజించుచున్నవి[6]. గయోపాఖ్యానమును సవరించి ముద్రించిన కాలము పద్యనాటక యుగము. ఆ కాలప్రభావమునకును, ప్రజలయభిరుచికిని వీరు తలయొగ్గినారు. మరియు పద్యములను కమ్మెచ్చుదీసినట్లు నడిపింపగలరుకాన లక్ష్మీనరసింహముగారు ముఖ్యముగా చరమాంకములో, కొంత మితిమీరినారు. మితిమీరుట యెల్లప్పుడును అనౌచిత్యమునకే దారితీయును. ఇప్పట్ల అదియే జరిగినది.

కాని ఒక సత్యమునుమాత్రము మరువరాదు. గయోపాఖ్యానమునకు వచ్చిన ఖ్యాతి యంతయును పద్యములవలననే. ఇందు పద్యములు సులభశైలిలో, అలతి అలతి పదములతో,

అన్వయసారళ్యముతో హృదయంగమములుగానుండును. ఇందలి భావములు, దెప్పుళ్ళు మొదలగునవి నిత్యవ్యవహారమునకు అత్యంత సన్నిహితములగుటచేతనే జనసామాన్యమున కవి అంతగా ప్రీతిపాత్రములైనవి. విమర్శకులుకూడ అందలిపాత్రలు కృష్ణార్జునులనెడి సత్యమును రవ్వంత సేపు మరచినచో ఆ పద్యములకు ముగ్ధులగుటయేకాక, అవి అనౌచిత్య దోషమునకు గురియైనవనికూడ అనలేరు.[7]

"విమర్శనదృష్టితోఁ జూచినప్పుడు కొన్ని నెరసులుకనఁబడినను లక్ష్మీనరసింహముగారి నాటకముమొత్తముమీఁద రససమంచితమై సామాజికచిత్త సమాకర్షకమైయున్నది. పాకము ద్రాక్షాపాకము. శైలి సుప్రసన్నము" అనెడి శ్రీ జయంతివారి వాక్యములను గయోపాఖ్యాన విమర్శనసారాంశముగా గ్రహింపవచ్చును. ఇంక జాతీయమైన పలుకుబడులకు, హృదయంగమమైన వర్ణనలకు, అంతగా మోతాదునుదాటని చిక్కని హాస్యమునకు గయోపాఖ్యానమేకాక, లక్ష్మీనరసింహముగారి నాటకములన్నియును ఉదాహరణములే.

## ప్రసన్నయాదవము :

"నా నాటకములలో గయోపాఖ్యానము శ్రేష్ఠమని ప్రజలభిప్రాయపడుదురు. ప్రసన్నయాదవము శ్రేష్ఠమని నా యభిప్రాయము" అని శ్రీ చిలకమర్తివారు వ్రాసికొనియున్నారు. (స్వీ. చ. పుట 291). అనగా జనాకర్షణవిషయమున గయోపాఖ్యానము మిన్నయైనచో కావ్య గౌరవమున ప్రసన్నయాదవము మిన్నయని వారి యభిప్రాయము. ఇందు శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధగాథ ప్రధానము. ఇందైదంకములు కలవు. ఒక్కొక్క అంక మొక్కొక్క రంగము. 2, 4, 5 అంకములముందు విష్కంభములును, 3 వ అంకముముందు ప్రవేశకమును కలవు; కాని, నిజమునకీ విష్కంభములుకూడ లక్షణమునుబట్టి చూచినచో ప్రవేశకములేయని చెప్పవలెను. ప్రథమాంకమున నరకుడు స్వర్గమునాక్రమించుట, ద్వితీయాంకమున ఊర్వశీ-నరకుల సంవాదము, తృతీయాంకమున నరకుని దుశ్చర్యలు శ్రీకృష్ణుడువిని సత్యభామా సహితుడై బయలుదేరుట, చతుర్థాంకమున శ్రీకృష్ణ- నరక - సత్యభామల యుద్ధకలాపములు, పంచమాంకమున శ్రీకృష్ణుడు నరకపుత్రుడగు భగదత్తునోదార్చి పదారువేల కన్నియలను పరిగ్రహించుట వర్ణితములైనవి. ఊర్వశీమోహమున, హవ్యభాగముల కర్తృత సంపాదింప, నరకుడు దుండగములకుదిగుటయే వాని పతనమునకు హేతువు. కథాసంవిధానము చక్కగానే యున్నది. కథాగమనమునకంతగా ఉపయోగింపనివియును, ఉదాత్తములు కానివినియును అగు హాస్యప్రసంగములు 2, 4, 5 అంకములందున్నవి. నరకాసుర-కృష్ణసంవాదమును, కృష్ణార్జున సంవాదమువలె కొంత హద్దుమీరినది. శుక్రాచార్యునిపాత్ర ఉదాత్తముగాలేదు; ప్రహ్లాదచరిత్రమందును శుక్రుడేదో పురోహితునివలె నున్నాడుకాని సకలరాక్షసుల గురువుగా కన్పట్టుటలేదు. ఇంక ఊర్వశీ-నరకుల సంవాదము. దీనిని ఉత్తరహరివంశమున నాచనసోముడు చక్కగా నిర్వహించెను; చిలకమర్తివారును ఈ ఘట్టమునకు న్యాయ్యమునే చేకూర్చినారు. మొత్తముమీద నాటకము బాగున్నది. రంగముమీద ఇంకను ఎక్కువ రక్తికట్టును.

తమ గుణములతోపాటు తమ లోపములనుగూడ బాగుగా ఎరిగియున్న మనీషి శ్రీ చిలకమర్తి; ఇంచుమించుగా ఒక యుగకర్తకు దీటైన సుచరిత్రుడాయన. ఆంధ్రులకు చిరస్మరణీయుడు. వారిమాటలలోనే చెప్పవలెనన్నచో ఆయన "కలమే ఖడ్గము, శాస్త్రమే దళము విజ్ఞానంబె శౌర్యంబుగా అజ్ఞాన విరోధిమండలము చేవందాఁకి తూలించి, నిశ్చల ధర్మంబులు ధాత్రినిల్పు కవితా సామ్రాజ్య పట్టాభిషిక్తు"డు ఆ మహనీయుడు.—(చతుర చంద్రహాస ప్రస్తావనలో).

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి[1]

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంచితులగు వేదము వేంకటరాయశాస్త్రిగారు ఉత్తమ నాటకకర్తలుగానేకాక మహాపండితులుగా, ఆలంకారికులుగా, అభినవ మల్లినాథులుగాకూడ ఆంధ్రులకు చిరస్మరణీయులు. పెక్కు గ్రంథములను రచించిరి. పెక్కు విమర్శలను వ్రాసిరి. పెక్కు గ్రంథములను సంస్కరించి ప్రకటించిరి. పెక్కు సంస్కృతగ్రంథముల ననువదించిరి. పెక్కు సంస్కృతగ్రంథములను ఆంధ్రవ్యాఖ్యానసహితముగా ప్రకటించిరి. 1913 లో ప్రకటితమైన శృంగారనైషధ 'సర్వంకష' వ్యాఖ్యయును, 1927 లో ప్రకటితమైన 'ఆముక్తప్రకాశని' వ్యాఖ్యయును శాస్త్రిగారి సర్వతోముఖపాండిత్యమునకు పతాకలు. వారి రసమంజరీ_సాహిత్యదర్పణ_కథాసరిత్సాగరాద్యనువాదములు సుప్రసిద్ధములు. శాస్త్రిగారు ఎంత ఉద్దండపండితులో అంత ఉద్ధతులుకూడను. పాండిత్య_కవిత్వవిషయములలో వారెవ్వరికిని తల ఒగ్గలేదు. ప్రతిస్పర్ధులను "మీలెక్క యేమిటి?" యని ఎదిరించి బ్రతికినారు.[2] శాస్త్రిగారి నిర్భయ విమర్శలకు వారి 'శారదాకాంచికలు' ఉదాహరణములు (ఆ శీర్షికలో వెలువడినదే 'ఆంధ్రప్రసన్నరాఘవ నాటకవిమర్శనము). శాస్త్రిగారికి పట్టుదలకూడ ఎక్కువ. ప్రతిస్పర్థులను 'గోతిలోపాతించి గోరీకట్టినస్తేనే' కాని వారికి తృప్తికలిగెడిదికాదు.[3]

శాస్త్రిగారు మొత్తము పదిరూపకములను రచించినారు. అందులో స్వతంత్ర నాటకములు మూడు; తక్కిన ఏడును సంస్కృతానువాదములు. ఈ నాటకము లన్నింటను 'ప్రతాపరుద్రీయము' సుప్రసిద్ధమైనదియును, శాస్త్రిగారికి నాటకరచయితగా బహుళఖ్యాతి తెచ్చిపెట్టినదియును అగుచున్నది. వీరి తొలినాటకము నాగానందము (1891). సంస్కృతరూపక మర్యాద ననుసరించి సంస్కృతభాష యుండుచోట్ల సలక్షణ గ్రాంధికభాషను, ప్రాకృత భాషాభేదములుండుచోట్ల గ్రామ్యభేదములను వీరు వాడినారు. దీనినే వీరు 'పాత్రోచిత భాషాప్రయోగ' మనినారు. అభిజ్ఞానశాకుంతల (1896) అనువాదమందును భాషావైవిధ్యము పాటింపబడినది.[4] ఈ నాటకమును నెల్లూరులో ప్రప్రథమముగా "అమెచ్యూర్ డ్రమెటిక్ సొసైటీ"వారు 3_7_1897 తేదీన ప్రదర్శించినారు. శాస్త్రిగారియొద్ద ప్రత్యేకముగా శిక్షణమునుపొందిన శ్రీమాన్ కందాడై శ్రీనివాసన్ (దొరస్వామి అయ్యంగారు) ఆనాడు దుష్యంతపాత్రను ప్రశంసనీయముగా నిర్వహించినారట.

శాస్త్రిగారి ప్రసిద్ధనాటకమగు 'ప్రతాపరుద్రీయ' గద్యభాగరచన 1896 జూలై నాటికి పూర్తి అయినవి; అటుపిమ్మట పద్యములనుకూడ చేర్చి 1897 జూలై – అక్టోబరు ప్రాంతముల గ్రంథరూపమున ప్రకటింపబడినది. ఇది శాస్త్రిగారి తొలి స్వతంత్రరూపకము. "ఇటువంటి యద్భుత నాటకమింతవఱకును తెలుగులో వెలువడలే"దని నాటి విమర్శకులు దీనిని ప్రశంసించి యున్నారు. దీనిని ప్రప్రథమముగా నెల్లూరు 'అమెచ్యూర్ డ్రమెటిక్' సమాజమువారు నెల్లూరు 'లక్ష్మీవిలాసనాటకశాల'లో 24-1-1898వ తేదీన ప్రదర్శించినారు; కాని అది విజయవంతమైనట్లు కన్పట్టదు. 'ఉషానాటకము'(1901) శాస్త్రిగారి రెండవ స్వతంత్రరూపకము. ''ప్రౌఢజనైకవేద్యరసంబగు ప్రతాపరుద్రీయ నాటకమువలెఁగాక కోమల మతిసుగమంబగు దృశ్యప్రబంధంబొకటి అర్ధ్యర్ధయామమాత్ర ప్రయోజనీయము నిర్మించియిమ్మని విక్రమసింహపుర్యాంధ్రభాషాభిమాని సమాజమువారును మద్రాసు విద్వన్మనోరంజనీ సమాజమువారును కోరగా'' శాస్త్రిగారు ఈ చిన్ని రూపకమునురచించినట్లు పీఠికలో వ్రాసికొనినారు. ఈరచన గురజాడ అప్పారావుగారి తీవ్ర విమర్శకు గురియైనది.[5] రచన ఉదాత్తము కాకపోయినను ప్రదర్శనమునకుమాత్రమనుకూలము.

'ప్రియదర్శిక' (1909) అనువాదములో శాస్త్రిగారొక క్రొత్తపద్ధతి ఆరంభించినారు— ఇందు ఒకప్రక్క మూలము, దానికిఎదురుగా రెండవప్రక్క అనువాదము, అధస్సూచికలలో నాటకలక్షణాది విషయములనుతెలిపెడి వ్యాఖ్య ముద్రితములైనవి. ఈ పద్ధతిబాగున్నది. ఇందలి యింకొక విశేషము శ్లోకభాగములెల్ల వచనముగానే ఆంధ్రీకరింపబడుట (నాటకాంతమున మాత్రము పద్యములను వరుసగా ప్రకటించియున్నారు). కేవలము వచననాటకముల నాదరించువారు కూడ ఎట్టి మార్పులను చేయకయే ఈ నాటకమును ప్రదర్శింపవచ్చును. ఇందు రంగములను 'స్థలకము'లనినారు.

బొబ్బిలియుద్ధనాటకము (1916)[5] శాస్త్రిగారి మూడవ స్వతంత్ర నాటకము. రచన 1916 కు చాలముందే జరిగినదట. దీనిని శాస్త్రిగారు 'రంగరాయప్రశస్తి'గావ్రాయుటచేత రంగారాయడుత్తముడుగాను, విజయరామరాజు క్షుద్రదారుడుగాను చిత్రింపబడినారు. నైజాము నవాబు చినవేంకటరాయని బొబ్బిలి జమీనుకు ప్రభువునుగా నెలకొల్పుటతో నాటకము మంగళాంతమైనది. కాని, నాటకమందాద్యంతము విషాదచ్ఛాయలే నెలకొన్నవి. న్యాయముగా ఇది విషాద నాటకమే; చివరిదైన దశమాంకము అనవసరమేఅని చెప్పవచ్చును.

మాళవికాగ్నిమిత్రము (1919) ఆంధ్రభాషాభిమాని సమాజమువారికొరకు అనూదితమైనది. ఉత్తరరామచరిత (1920) అనువాదమునకు 70 పేజీల ఉపోద్ఘాతముకలదు. తమ నాటతమునకింత విపులమగు పీఠికను సంతరించిన తొలి తెలుగునాటకకర్త శాస్త్రిగారే. ఉత్తరరామచరితము 'అతిశాకుంతల'మని వీరి నిశ్చితాభిప్రాయము. సంస్కృతమూలమును 1890 ప్రాంతముల క్రిష్టియన్‌కాలేజి విద్యార్థులచే మద్రాసులో విజయవంతముగాప్రదర్శింపజేసి, 'ఉత్తరరామచరితము శ్రవ్యరూపకముమాత్రమే' అనెడి అపప్రథమును పోగొట్టినవారు శాస్త్రిగారు. వీరి విక్రమోర్వశీయము (డిసెంబరు 1920), రత్నావళి (జనవరి 1921) అనువాదములు రెండును 1921 లో ప్రకటితములైనవి. 'రత్నావళి' శాస్త్రిగారి చివరినాటకము.

ఆంధ్రభాషాభిమాని సమాజము :

24-1-1898 తేదీనాటి ప్రతాపరుద్రీయ ప్రథమప్రదర్శనము విజయవంతము కాలేదని తెలిపియున్నాను. దానిని మరల ప్రదర్శింపవలెనని శాస్త్రిగారి అనుయాయులు పట్టుబట్టినారట; తక్కినవారందులకు జంకినారు. అంతట వారిలో చీలికలు బయలుదేరినవి. దొరస్వామి అయ్యంగార్ ఆధ్వర్యములో కొందరుసభ్యులు చీలిపోయి, పూండ్ల రామకృష్ణయ్యగారి తోడ్పాటుతో 30-4-1899 తేదీన 13 గురు సభ్యులతో "ఆంధ్రభాషాభిమాని సమాజము"ను నెల్లూరులో స్థాపించిరి; శాస్త్రిగారి నాటకములనుతప్ప మరి యే యితర నాటకములను ప్రదర్శింపరాదని వారి శపథము. ఈ సమాజమునకు శాస్త్రిగారే శాశ్వతాధ్యక్షులు. వారు ప్రతిసంవత్సరమును వేసవి సెలవులలో నెల్లూరువెళ్ళి, నటులందరకును శిక్షణ నొసంగుచుండెడివారు; వారికి సంపూర్ణముగా తృప్తి కలిగినతరువాతనే నాటకము ప్రదర్శింపబడుచుండెడిది. ఆ సమాజనటులందరకును శాస్త్రిగారొక దైవము; ఇతరుల నాటకములు నాటకములేకావని వారి విశ్వాసము. 1899 తరువాత శాస్త్రిగారు రచించిన నాటకములన్నియును 'ఆంధ్రభాషాభిమాని సమాజము' కొరకే యగుట గమనార్హము.

అనువాదములు :

శాస్త్రిగారి అనువాదములు మూలములకు అత్యంతము సన్నిహితములు (మూల విధేయములు)గా నుండును. ఇందువలన వారి అనువాదములు కేవల పాండిత్యదృష్టితో చూచువారికి సంతృప్తినీయగలవు. కాని, ఈ కారణముగా రచనలో (వచనమునందుకూడ) సారళ్యము లోపించినది. నిజముచెప్పవలెనన్నచో స్వతంత్రనాటకములందున్నంత సారళ్యముకూడ అనువాదము లందు లేదు.[6]

కాని ఇచ్చట ఒకవిషయమును గుర్తింపవలసియున్నది. శాస్త్రిగారిరచన చదువుటకు సుకరముగా నుండకపోయినను, వారి తర్ఫీదులో - ముఖ్యముగా పద్యములను చదువుటయందు- నెల్లూరినటులొక క్రొత్తపద్ధతిని నేర్చినారట; అది చాల జనరంజకముగా నుండెడిదనియు, కాని అది ఇతరులకు పట్టుబడలేదనియు పెద్దలందురు.

స్వతంత్రములు :

"హూణరూపకరసంబుదరంబునిండార(ద్రావి గఱ్ఱునఁద్రేఁచితనిసి"నట్లు ఉషానాటకములో శాస్త్రిగారు చెప్పుకొనియున్నను వారి స్వతంత్రరూపకములందుకూడ ప్రాచీన సంస్కృత మర్యాదలనే అధికముగా పాటించియున్నారు. అంకమును రంగములుగా విభజించుట మొదలగు వానియందచ్చటచ్చటమాత్రమే కొన్ని పాశ్చాత్యానుసరణములు కన్పట్టగలవు. శాస్త్రిగారికి తెలుగుదేశముమీదను, తెలుగువీరులమీదనుగల గౌరవాభిమానములు హేతువులుగా వారి లేఖిని నుండి రెండురూపకములు, తెలుగుదేశపు చరిత్రకుసంబంధించియే బయలుదేరినవి. బహుశః శాస్త్రిగారి ప్రతాపరుద్రీయమే, తెలుగులోని తొలిచారిత్రకనాటకము అయియుండవచ్చును. శాస్త్రిగారు సహజముగా హాస్యప్రియులు. పద-కావ్య-సన్నివేశ-పాత్రగతములైన హాస్యములను

జనింపజేయుటకు స్వతంత్ర నాటకరచనలో వారు ప్రయత్నించియున్నారు. కాని, కొన్నిచోట్ల అవి ఆభాసములుగానే కన్పట్టుచున్నవి. ముఖ్యముగా గురజాడవారు పేర్కొన్న ఉషానాటకము లోని కరేణుకా - గంభీరవేదుల వృత్తాంతము ఇట్టిదానికి ప్రథమోదాహరణము. ఇట్టివానిని డా. అవధానిగారు సూచించినట్లుగా, శాస్త్రిగారు నాటి సామాజిక మనోరంజనార్థము సృష్టించి యుండవచ్చును (చూ. ''ఆంధ్రనాటకకర్తలు''-పుట 46). కాని. అంతటివారుకూడ ఈ స్థితికి తలయొగ్గుట సమంజసము కాజాలదు. శాస్త్రిగారి స్వతంత్రనాటకములందు 'ప్రతాపరుద్రీయము' ప్రధానస్థానము నాక్రమించుచున్నది; తెలుగు నాటకరచనలో ఇదిఒక క్రొత్తయుగమునకు దారి తీసినదని పలువురి అభిప్రాయము.

శాస్త్రిగారి విమర్శనగ్రంథములలో "గ్రామ్యభాషా ప్రయోగనిబంధనము" (రచన 1899 జూన్) నందు పాత్రోచితభాషాసమస్య విపులముగా చర్చింపబడెను; "భారతాభారత రూపకమర్యాదలు"లో నాటకమర్యాదలనుగూర్చిన కొన్ని వివరణములు కలవు.

## ప్రతాపరుద్రీయము

ప్రతాపరుద్రీయ రచనాకాలాదులనుగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను[1]. ప్రతాప రుద్రీయమందలి యనేకవిషయములు శాస్త్రిగారి స్వానుభవమునకు వచ్చిన విశేషవిషయముల భాగములే యని శాస్త్రిగారి మనుమలు శాస్త్రిగారి జీవితచరిత్రలో పేర్కొని, అందులకు పెక్కు ఉదాహరణములను పేర్కొనియున్నారు[2]. సాయెబులు, చాకళ్ళు, మంగళ్ళు, పామరులు, విద్యావంతులు, బాలురు, స్త్రీలు, అరవలు మొదలైనవారి గ్రామ్యభాషా భేదములను చిన్నప్పటి నుండియు శ్రద్ధగా పరిశీలించెడి శీలముగల శాస్త్రిగారు, ఆ అనుభవమును ప్రతాపరుద్రీయ-బొబ్బిలి యుద్ధ నాటకములందు చక్కగా వినియోగించుకొనియున్నారు. ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసియున్నది. శాస్త్రిగారు నాటకమున నీచపాత్రలకు వాడినది 'గ్రామ్యభాష'యేకాని 'వ్యావహారికభాష'కాదు. నాటకవిషయమున వారు శుద్ధ గ్రాంథికవాదులకెట్లు వ్యతిరేకులో, శుద్ధ వ్యావహారిక వాదులకును అట్లే వ్యతిరేకులు. కాగా, శాస్త్రిగారి పాత్రోచితభాషావాదము నాటక మందలి నీచపాత్రల గ్రామ్యమునకుమాత్రమే పరిమితమైనదని తెలియవలెను. కావ్యమందుకాని- పాఠ్య ప్రణాళికయందుకాని వారు గ్రామ్యభాష నెన్నడంగీకరింపరు. అంతియేకాదు, నాటక మందైనను ఉత్తమ-మధ్యమ పాత్రల విషయమున శిష్టవ్యావహారికము నుపయోగించుటకుకూడ వారంగీకరింపని విషయమే. శిష్టవ్యావహారికభాష ఏల మీకిష్టముకాదని గురజాడ అప్పారావు గారు ప్రశ్నించియున్నారు[3]. మరి శాస్త్రిగారు దాని కేమి సమాధానమిచ్చినారో తెలియరాదు.

శాస్త్రిగారి ప్రతాపరుద్రీయమును గురజాడవారి కన్యాశుల్కమును ఒకే సంవత్సరములో ప్రకటితములైనవి. ఇవి రెండును తెలుగుభాషలోని ఉత్తమ నాటకములుగా ప్రశంసింపబడు చున్నవి. మరియు కొందరు ప్రతాపరుద్రీయమే సర్వశ్రేష్ఠమనుచుండగా మరికొందరు కన్యా శుల్కమే సర్వశ్రేష్ఠమైనదనుచుందురు. ఇప్పట్ల కన్యాశుల్క కర్తలైన అప్పారావుగారు ప్రతాపరుద్రీయముపై వెలిబుచ్చిన అభిప్రాయము గమనార్హము[4]—"వేంకటరాయశాస్త్రిగారి

'ప్రతాపరుద్రీయము'వంటి కొన్ని నాటకాలలో కవితా ప్రౌఢిమ, కల్పనాచాతుర్యము లోపించక పోయినా ప్రస్తుతం తెలుగున వెలువడుతున్న నాటకాలన్నీ వొట్టి డొళ్ళు సరుకులు. చివరకు ప్రతాపరుద్రీయంలోనైతం పేజీలకు పేజీలు ఎన్నితిప్పినా అవి నాటకకథావిస్తరణకు, పాత్రల పెరుగుదలకు ఉపకరించవు[5]. అయితే యీ నాటకంలో నాకు బాగానచ్చిన వొక లక్షణంమాత్రం వుంది. మన దేశచరిత్రలో గుండెలను కదిలించే వృత్తాంతాన్నొకదాన్ని తీసుకొని దానిని నాటకంగా వెలయించేటపుడు యీకవి సాహిత్యాత్మక దేశభక్తిపూరిత కాల్పనిక వాతావరణాన్ని సృష్టించుకొని దానిని నేర్పుతో జయప్రదంచేశాడు. కాని నాటకంలోని చారిత్రక చిత్రీకరణ మటుకు కేవలం అభూతకల్పన; అసంభావితవిషయాలు సారస్వత కట్టుబాట్లను లైసెన్సును అతిక్రమిస్తున్నాయి". ఈ విమర్శలో కొంత అతిశయోక్తి లేకపోలేదు[6].

ప్రతాపరుద్రీయమునందు పది అంకములున్నవి. కొన్ని అంకములందు రంగవిభజనము కలదు. ఇందు పద్యములు పాటలుకూడ కలవు. మామూలు నాటకములకంటె ఇంచుమించుగా మూడింతలుండును. వీథినాటకములవలె రెండు రాత్రులు ప్రదర్శింపవలసి వచ్చును. ప్రదర్శన ప్రధానమైనరూపకమింత పెద్దదిగా నుండరాదు. ఇది ప్రతాపరుద్రీయములోని ప్రథమలోపము. ఈ విషయమును శాస్త్రిగారుకూడ గుర్తించియున్నారు—"ఈ నాటకము రెండురాత్రుల కుద్దేశింపబడినది. అట్లు ఆడువారు తొలి 6 అంకములు ఒకరాత్రి, కడమ 4 అంకములు ఒక రాత్రిగా ఆడుటమంచిది. అటుగాక సంగ్రహించి ఒక రాత్రి ఆడఁగోరికయైన 3 అం; 5 అం. లోని 1 స్థలకము; 6 అం; 7 అం; 8 అం. లోని 2, 5 స్థలకములు ఆడుటమంచిది" అని శాస్త్రిగారు నాటకపాత్రములపట్టిక చివర సూచించియున్నారు[7]. ఇట్లు చేసినచో పుటల పెరుగుదల చాలవరకు తగ్గిపోవును; రక్తి అధికమగును.

గురుజాడవారు పేర్కొన్నట్లు వేంకటరాయశాస్త్రిగారు మన (ఆంధ్ర)దేశచరిత్రలో గుండెలను కదలించెడి కథను స్వీకరించుట ఒక గొప్పవిశేషము. 'కథ' నెన్నుకొనుటలోనే కవి ప్రతిభవ్యక్తమగును; ఇంక దానిని 'ఇతివృత్తము'గా తీర్చిదిద్దుకొనుటలో ప్రతిభావంతుడైన కవితప్పక రాణించును. ప్రతాపరుద్రుని మహమ్మదీయ సైన్యములోడించి, బందీనిచేసెనన్నది మాత్రము చారిత్రకసత్యమే. దానిని ఆధారముగాచేసికొని స్వప్రతిభతో శాస్త్రిగారింతగా విపులీకరించినారు. ఇందులో కల్పనలధికముగానున్నమాట వాస్తవమేకాని అది లోపముగా కన్పడకుండ కథాసంవిధానమును నిర్వహించుటలో శాస్త్రిగారు అద్భుతమైన ప్రతిభను చూపినారు. సంభాషణలలో, సన్నివేశములలో ప్రతివిషయమున అత్యంతము జాగరూకతవహించినారు. ఈవిషయము నిర్వివాదము. మరియొక ముఖ్యవిషయము—పాత్రపోషణవిషయములో శాస్త్రిగారియందు వ్యక్తమైనవిశిష్టత. యుగంధరమంత్రి చారిత్రకపురుషుడుగా, తెలుగువారి మహామంత్రిగా ఆంధ్ర సారస్వతములో సుస్థిరస్థానమును సంపాదించుకొనియున్నాడు శాస్త్రిగారిలేఖినీ ప్రభావమువలన.[8] అట్లేపేరిగాడు, విద్యానాథుడు, చెకుముకిశాస్త్రి మొదలగువారును సంపూర్ణముగా, ఉత్తమముగా రూపు కట్టుకొనియున్నారు. యుగంధరపాత్రపోషణముతో దీటైనది 'ఎల్లి' పాత్రపోషణము. శాస్త్రిగారు సృష్టించిన పాత్రలన్నింటను 'ఎల్లి' పాత్ర లలితమైనది.

మొత్తముమీద తెలుగువారు గర్వింపదగిన ఒక జాతీయరూపకమును నిర్మించిన ఖ్యాతి శాస్త్రిగారికిదక్కినది. "చారిత్రకముగా ప్రచారంలో వున్నకథను, ముఖ్యమయిన పాత్రలను తీసికొని, దానికి మెరుగులుదిద్ది పాత్రలకు ప్రాణప్రతిష్ఠచేసి విజయంసాధించిన రచయితలు మనకు ప్రపంచసాహిత్యంలో ఇద్దరేకనిపిస్తారు: ఒకరు ఆంగ్లరచయిత షేక్స్పియరు, రెండవ వారు శ్రీవేదంవారే"—శ్రీ ఎమ్. నాగభూషణ్ (ఆంధ్రప్రభ—1-6-1958).

## శ్రీ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ[1]

మహాపండితుడుగా, కవిగా, విమర్శకుడుగా, పత్రికా సంపాదకుడుగా, వక్తగా, సంభాషణాచతురుడుగా, పాశ్చాత్య వైజ్ఞానిక విద్యాసంపన్నుడుగా, చిత్రకారుడుగా, న్యాయవాదిగా, పారిశ్రామికుడుగా పేరెన్నికగన్న మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ గారు ఆంధ్రభీష్ముడనియు, అఖండ ప్రతిభాసంపన్నుడనియు, జంగమవిజ్ఞాన సరస్వమనియు ఆంధ్రదేశమంతటను గుర్తింపబడినారు.[2]

నాటక కళారంగములో కూడ శర్మగారిపాత్ర విశిష్టమైనది. క్రీ. శ. 1880-90 మధ్య కాలములో వీరు కాళిదాసు విక్రమోర్వశీయమును, భవభూతి ఉత్తరరామచరితమును ఆంధ్రీకరించినారు. ఇందులో విక్రమోర్వశీయము మూడంకములు మాత్రమే ప్రచురింపబడినది. ఇంక ఉత్తరరామచరిత్రమును యథాతథముగా అనువదించినను, మొత్తమంతయును వచనరూపముగా అనూదితమైనది. దశరూపకములలో ఒకభేదమైన 'ఉత్సృష్టికాంకము' అనెడి స్వరూపమును ఎన్నికచేసి, 'పార్థపరాజయము' అనెడి రూపకమును రచించినారు; ఇది ఉత్తరహరి వంశమందలి కథ. బౌద్ధ వాఙ్మయమునకు సంబంధించిన ఒకనాటికను 'అవదాతకలభకము' (తెల్ల ఏనుగుపిల్ల) అనుపేర రచించినారు. ఇంక వీరి ప్రత్యేకవిమర్శన గ్రంథము—"నాటక సర్వస్వము"—అనునది. ఇది లక్షణగ్రంథము: ఇంకను అముద్రితము.

శర్మగారు తెలుగునాటకరంగమునకుచేసిన సేవలో ముఖ్యముగా పేర్కొనవలసినది క్రీ. శ. 1895 లో ప్రకటితమైనవారి "మనోరమ" నాటకము.[3] ఐదంకముల ఈ సాంఘిక నాటకము ఒకరాత్రిలో రచింపబడినదట! దీనిని స్వగ్రామమగు మేరంగిలో స్వీయదర్శకత్వమున ప్రదర్శింపజేసినారట. స్త్రీవిద్యకు ప్రాధాన్యమొసంగిన 'మనోరమ' నాటి సాంఘికవ్యవస్థా పరిణామోన్ముఖత్వమును ప్రతిబింబించుచున్నది. మాధవశర్మ. వసంతశర్మలనెడి సోదరులు మనోరమా-మందారికలనెడి సోదరీమణులను పాఠశాలప్రధానోపాధ్యాయిని సాహాయ్యముతో తాము కోరినప్రకారము పరిణయమగుట ఇందలి కథాసారము. స్త్రీ విద్యవలన లాభములు, కళలవలన కలిగెడి సత్ఫలములు ఇందు సుదీర్ఘముగా ఉపన్యసింపబడినవి. రచన సరళమగు వచనములో సాగినది, అచ్చటచ్చట పద్యములును కలవు. వావిలాలవారి తొలితెలుగు సాంఘిక నాటకము కేవల పద్యమయమగుటచేత 'మనోరమ'ను తొలి వచన సాంఘికనాటకమునుగా పేర్కొనుట సమంజసము కాగలదు.

క్రీ. శ. 1929 లో "ఆంధ్రనాటకకళాపరిషత్తు" స్థాపింపబడుటలో శర్మగారిపాత్ర అద్వితీయము. అంతియేకాదు, మూడురోజులపాటు జరిగిన ప్రథమాంధ్రనాటకకళాపరిషత్తునకు తొలిరోజున (19_6_1929 తేదీన) అధ్యక్షతకూడ వహించినారు.

## శ్రీ గురజాడ వేంకట అప్పారావు[1]

అపరవిద్యాభోజులుగా యశశ్శరీరులైన విజయనగరం మహారాజా శ్రీ ఆనందగజపతి వారి శీలము, వ్యక్తిత్వము పరిణతమనస్కుల హృదయములనిట్టే ఆకట్టుకొనెడివి; నిష్కల్మష హృదయముతో, నిండుదయతో, నిరంతర సత్యాన్వేషణముతో వారు కుశాగ్రబుద్ధిగలమేధావులను ఆకర్షించెడివారు. వారికి ఆయనపట్ల అవ్యాజమైన భక్తిప్రేమలుకలుగుటకు కారణము ఆయన సుగుణసంపత్తియే; వారి జీవితములు ఆయనజీవితముతో పెనవేసికొనిపోయినవి. అట్టివారిలో గురజాడ వేంకట అప్పారావు పంతులుగారొకరు.

మహారాజావారు మద్రాసు 'లెజిస్లేటివ్ కౌన్సిలు' సభ్యులుగానున్న కాలములో కన్యాశుల్కనిషేధశాసనము నొకదానిని ప్రవేశపెట్టవలయునని తలంచి, అందులకు 1897 ప్రాంతముల వివరములను సేకరించిరి. కాని ఏలనోప్రభుత్వము సుముఖముగాలేకపోవుటచేత రాజావారి ఆశయము ఫలింపలేదు. ఇంక ఆ దురాచారమును నిర్మూలించుటకు సాహిత్యమే, అందున నాటక రూపమే, సాధనముగా కన్పట్టినది; మహారాజావారి అభిప్రాయమును కార్యరూపమునొందించుటకు నడుముగట్టినారు అప్పారావు పంతులుగారు_అదియే 'కన్యాశుల్క' రూపకరచన. ఇందులో పంతులుగారొక క్రొత్తమార్గమునకు ప్రయత్నముచేసినారు___రూపకమునంతటిని వ్యావహారిక భాషలోనే వ్రాయుట[2]. కాగా, 'కన్యాశుల్కము'యొక్క తొలిప్రతి 1892 జూలై ప్రాంతములకు సిద్ధమైనది; అది మహారాజావారికే అంకితమైనది.

ఈ కన్యాశుల్కమును ప్రప్రథమముగా 1892 ఆగస్టు నెలలో విజయనగరము జగన్నాథ విలాసినీ నాటక సమాజమువారు ప్రదర్శించినారు. ఆ ప్రదర్శనము చాలబాగున్నదని 26_7_1892 తేదీనాటి 'తెలుగుహార్పు' అనెడి పత్రికలోని సమీక్షవలన తెలియుచున్నది. కన్యాశుల్కము కృతిసమర్పణోత్సవ సందర్భములో అది పునఃప్రదర్శితమైనప్పుడు నిష్ఠల చలపతిశాస్త్రి (కళాశాలోపాధ్యాయులు) అనెడివారు గిరీశంపాత్రను అభినయించి మహారాజావారి ప్రశంసలనుపొందినారట. ఈ నాటకమునకు నాటివిజయనగర సంస్థానపండితులు ముడుంబై వరాహనరసింహస్వామిగారు సంస్కృతములో 'ప్రొలోగ్' ను వ్రాసినారు; ప్రదర్శనమునాడు దానిని మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు పఠించినారు.[3] కన్యాశుల్క ప్రథమముద్రణము, తొలిప్రదర్శనములు నాటి పత్రికల, విమర్శకుల ప్రశంసలకు పాత్రమైనవి.[4] దీనితో 'రూపకరచనకు వ్యావహారిక భాషయేతగు' ననెడి అప్పారావుపంతులుగారి అభిప్రాయమునకు బలముచేకూరినది; వారి ద్యమము దృఢతరమైనది.

కన్యాశుల్కము తొలిరచనలో అంకములైదు, మొత్తమురంగము లిరువదియేడు. కాని 9 లో జరిగిన పునర్ముద్రణములో అంకములేడును, రంగములు ముప్పదియైదును అయినవి.

గ్రంథము కూడ మూడింతలు పెరిగినది. ఏవియోకొలది మార్పులుచేసి రూపకమును ముద్రింప వలెనని పంతులుగారు తలంచిరట. కాని, మిత్రులసలహాలనుబట్టియు, శ్రీముని సుబ్రహ్మణ్యంగారి విమర్శను దృష్టిలోనుంచుకొనియు[1] వారు మొత్తమునాటకమునే మార్పు (recast) చేసినారు. కాగా, రెండవముద్రణము ఇంచుమించుగా ఒక క్రొత్తనాటకముగా తయారైనదన్నమాట; ఈ ముద్రణప్రతులే నేడు మనకు లభించుచున్నవి.

పంతులుగారు కన్యాశుల్కముసేకాక 'కొండుభట్టీయం', 'బిల్హణీయం' అనెడి మరి రెండునాటకములను కూడ రచించియున్నారు; కాని ఇవి అసంపూర్ణ రచనలుమాత్రమే. వీనినే కాక మరికొన్ని నాటకములను, అందున, చారిత్రకనాటకములను వారు వ్రాయసంకల్పించు కొన్నట్లు వారు వ్రాసికొన్న డైరీలనుబట్టి తెలియుచున్నది. కాని, వారికోర్కెసఫలమైనట్లు కన్పట్టదు. వీనిలో సామాజికేతివృత్తమును స్వీకరించి, కన్యాశుల్కముపద్ధతిలో మలచిన నాటకము కొండుభట్టీయము; ఇంక బిల్హణీయము ప్రాచీనశృంగారగాథాసంబంధి.

కొండుభట్టీయమును 1906 లో రచించినారు; కాని ఆ వ్రాతప్రతిని పోగొట్టుకొన్నారు. 1910 లో మరల వ్రాయసమకట్టి 3 అంకములుపూర్తిచేసినారు. 1909 లో కన్యాశుల్కమును తిరిగివ్రాసెడి సమయములో అసలు కొండుభట్టీయములోని కొన్నిసంఘటనలు, చమత్కారములు కన్యాశుల్కమునందు చేరిపోయినవని తెలియుచున్నది. డైరీలనుబట్టి యిది విషాదాంతనాటక ముగా వ్రాయబడినదని ఊహింపబడుచున్నది.

వ్యావహారికభాష సాంఘికేతివృత్తములకేకాక శృంగారసంబంధి పౌరాణికగాథలకు కూడ చక్కగా అన్వయించునని చూపుటకొరకు అప్పారావుగారు బిల్హణీయనాటకమును రచించుటకు పూనుకొనినారు. రచన 1910 లో జరిగినది. అప్పారావుగారు సంస్కృతబిల్హణీయ మును కాని, సింగనార్యుని ఆంధ్రానువాదమును కాని అనుసరింపలేదు. మూలమున బిల్హణుడు కామి; కాని అప్పారావుగారి లేఖినిలో బిల్హణుడు ఒక ఉదాత్తనాయకుడుగా, మహామేధావిగా అవతరించినాడు. అసలు, కథ నడచినమార్గమేవేరు.

అప్పారావుగారు ఆదర్శజీవి; "నాది ప్రజలవుద్యమము; దానిని యెవరిని సంతోషపెట్ట డానికైనా వదులుకోను" అనిచెప్పి తాను నమ్మినదానిని ఆచరణలో పెట్టగలధైర్యశాలి. "దేశాభి మానం నాకుకద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్. పూని యేదైనాను వొకమేల్‌కూర్చి జనులకు చూపవోయ్" అని ఇతరులను హెచ్చరించి, తాను తెలుగుదేశమునకు నిజముగానే ఒకమేలు చేకూర్చినారు; తెలుగుసాహిత్యమున 'దేశిసరుకులు' నించినారు. అందుచేతనే వారు తెలుగు సాహిత్యమున చిరస్మరణీయులు; కొందరింకను చాల ముందునకుపోయి వారిని 'గురజాడ వాల్మీకి' యని సన్మానించుచున్నారు.

## కన్యాశుల్కము

తెలుగుభాషలో వెలువడిన నాటకములన్నింటిలోను కన్యాశుల్కము ఉత్తమోత్తమ మని కొందరు నిరూపించుచుండగా మరికొందరావిషయమును ఖండించుచున్నారు; ఈ ఖండన

మునకు ప్రధానకారణములు మూడు— 1. అందలి ఇతివృత్తమునకు శాశ్వతత్వములేదు; 2. రచన ప్రాచీనలక్షణములకు వ్యతిరేకము; 3. ఆంగ్లభాషాపదప్రయోగమువలన సార్వజనీనత్వము కుంటువడుచున్నది.[1]

అప్పారావుగారు మూడుప్రయోజనముల నుద్దేశించి కన్యాశుల్కమును రచించినారు— 1. సంఘసంస్కరణము; 2. భాషాసంస్కరణము; 3. ఉత్తమరూపకనిర్మాణము.

1. కన్యాశుల్కమునకు గిరీశమును నాయకునిగా పెట్టుటచేత సంఘసంస్కారము వేశాకోశములోనికి దిగినదనియు, మీనాక్షీ—మధురవాణులకు సంబంధించిన ఘట్టములు ఔచిత్యరహితములై నైతికవిరుద్ధప్రయోజనకారులుగా నున్నవనియు అప్పారావుగారిని కొందరు విమర్శించియున్నారు. చివరి విమర్శకు అప్పారావుగారే సమాధానమొసంగి యున్నారు.[2] ఇంక 'గిరీశం' విషయము. ఇతడు ఆధునికాంధ్రసాహిత్యములో ఒక అపూర్వమైనపాత్ర; పండితపామరులను సమానముగా ఆకర్షించినవాడు; నిజముగా ఇట్టిపాత్రను సృష్టించుటలోనేయున్నది అప్పారావుగారి ప్రతిభఅంతయును;కాని ఈ పాత్రవలన రూపకప్రయోజనమెంతవరకు సిద్ధించినదనునది చర్చనీయాంశమే. ఇందలి అసలుకథ 'కన్యాశుల్కము'నకు సంబంధించినది; దీనితో గిరీశమునకెట్టిసంబంధమునులేదు. ఇంక, నాచ్‌క్వొశ్చిన్, విడోమారేజి—ఈ రెండును ఇందలి ఉపకథలు. ఉపకథలకు సంబంధించినవాడగుటచేత గిరీశం ఉపనాయకుడగుచున్నాడు. కాని, ఇతడు అటు వేశ్యాసంపర్కమువలదనుటకుగాని, ఇటు విధవావివాహము సమంజసమనుటకుగాని ఎంతమాత్రమును ఉపయోగపడలేదనియే చెప్పవలెను.

2. భాషాసంస్కార విషయమున అప్పారావుగారు కృతకృత్యులైనారు. వారీవిషయమున యుగపురుషులే అయినారు.

3. కందుకూరివారి 'బ్రాహ్మవివాహము'ను గూర్చి చెప్పుచు "Brahmavivaham was meant to be a pure comedy of manners, while in kanyasulkam, humour, characterization, and the construction of an original and complex plot have been attempted" అని అప్పారావుగారు ప్రథమముద్రణ పీఠికలో చెప్పకొని యున్నారు. కన్యాశుల్కమందు హాస్యము ప్రధానముగా వాక్కువలన సాధింపబడినది; మరికొంత చేష్టలవలన. ఇందు హాస్యమునకు ప్రధానాలంబనము గిరీశము. వానిమాట లెల్లప్పుడును ఆంగ్లభాషాపదములతో మిశ్రీకృతమై హాస్యకారణములగుచున్నవి. కాగా 'తెనుగురూపకదేహమునకు ప్రాణము ఆంగ్లభాషాపద ప్రయోగ' మగుచున్నదనెడి విమర్శ కవకాశమేర్పడుచున్నది. కాని, ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసియున్నది—ఆంగ్లభాషాపదప్రయోగములేకయే ఉత్తమహాస్యమును సృష్టింపబడిన సన్నివేశములుకూడ కన్యాశుల్కమందుకలవు; మరియు ఇందు వాడబడిన ఆంగ్లపదములు తెలుగువారి నిత్యజీవనములో సమ్మిశ్రితమైపోయిన పదములేయని మరచిపోరాదు. ప్రతాపరుద్రీయమున ఉర్దూభాషాపదములకెంత ప్రాముఖ్యమున్నదో, కన్యాశుల్కమున ఆంగ్లభాషాపదములకంత ప్రాధాన్యమున్నది; ప్రతాపరుద్రీయమున పాత్రవైవిధ్యము ననుసరించి భాషావైవిధ్యమును నిరూపితమైనట్లే, కన్యాశుల్కమున పాత్రవైవిధ్యము ననుస

రించి ఆంగ్లపదప్రయోగ వైవిధ్యమును నిరూపితమైనది. కన్యాశుల్కమందలి ప్రతిపాత్రయును ఆంధ్రుల హృదయములకు హత్తుకొనిపోవుటయే కాక, ఈ సత్యము పాత్ర నిర్మాణములో అప్పారావుగారు చూపిన ప్రతిభను నిరూపించుచున్నది. కన్యాశుల్కమందలి ప్రధానపాత్రలన్నియును ప్రత్యేకవ్యక్తిత్వములు కలవిగా నిర్మింపబడినవనుట నిస్సంశయము.[3]

ఇంక ఇతివృత్తనిర్మాణము, ఇతివృత్తమునందు ప్రథమముద్రణములో నున్నంత పొందిక రెండవముద్రణములో లేదనుట అసమంజసము కాజాలదు. ప్రతాపరుద్రీయవిషయమున తాముచూపిన దోషమునకే కన్యాశుల్క ద్వితీయముద్రణమునందు అప్పారావుగారు పాల్పడినారు. గ్రంథము విపరీతముగా పెరిగిపోయినది, అందువలన ఇతివృత్తము నిబిడబంధము కాకపోవుటయేకాక, సమగ్రప్రదర్శనార్హతను కూడ కోల్పోయినది.[4] ప్రతాపరుద్రీయమువలె ఇదియును రెండు రాత్రులరూపకమే. దీనినెవ్వరును సంపూర్ణముగా ప్రదర్శించినట్లు కన్పట్టదు. కన్యాశుల్కములో ఇతివృత్తవిషయమున నిబిడబంధము చేకూరవలెనన్నచో దీనిని సంస్కరించుకొనకతప్పదు. ముందుగానే నిర్ణీతమైన ఒక ప్రణాళికను వేసికొనకపోవుటచేతను, సగము వ్రాసినతరువాత కొన్నిపాత్రల విషయమునవారి దృక్పథము మారిపోవుటచేతను పైదోషములు దొరలినవని చెప్పవచ్చును.

ఇందలి ఇతివృత్తమునకు శాశ్వతత్వములేదనెడి వాదము అంతగా ఆదరణీయముకాదు. ఇది సాంఘికేతివృత్తము; కల్పితము—ఇట్టివానిని మన ప్రాచీనులు కూడ రచించియున్నారు. పాశ్చాత్యుల ఆహ్లాదరూపకములు ఇట్టివే. రూపకమందలిసమస్య తాత్కాలికమైనదైనను, దానిని సార్వజనీనమగునట్లుగా కవికల్పించినప్పుడు తదుత్తమత్వమున కుపహతికలుగదు.[5] ఇందు కవిప్రతిభ వ్యక్తమగుట కెంతేని యవకాశముకలదు. అప్పారావుగారీవిషయమున కృతకృత్యులైరనియే చెప్పవచ్చును.

ఇంక రూపకరూపమును గూర్చిన విమర్శ మిగిలినది. 1925 లో వేయబడిన తృతీయ ముద్రణ ముఖపత్రముమీద "హాస్యరస ప్రధానమగు నాటకము" అనియున్నది. ఇచ్చట 'నాటక' పదము కేవలము రూపకవాచిమాత్రమే. హాస్యరస ప్రధానమన్నంతమాత్రమున 'ప్రహసనము'ను కాదు; ఆ లక్షణములు దీనికి పట్టవు. అసలు, అప్పారావుగారు దీనిని మనప్రాచీనలక్షణములను దృష్టిలో పెట్టుకొని వ్రాయలేదని తెలియవలెను. వారు దీనిని పాశ్చాత్యదేశములందలి "social comedy" పద్ధతిలో రచింపవలెనని ఉద్దేశించినట్లుగా కన్పట్టుచున్నది, ఈ జాతిరూపక కర్తలలో మోలియర్ ప్రముఖుడు. అతని దృష్టిలో "correction of social absurdities must at all times be the matter of true comedy." ఆస్కార్ వైల్డులోని సునిశిత హాస్యము, పాత్రపోషణ వైచిత్రి అప్పారావుగారిలోను కన్పట్టును; మరియు సాంఘిక ప్రయోజన దృష్టి వీరిలో అధికము. అంతియేకాదు, బెర్నార్డుషాలోని 'గుండెను దూసికొనిపోయెడు వ్యంగ్యము'ను వీరిలో ప్రకృతిసిద్ధముగానున్నది. ఈ మూడింటి సమ్మేళనముతో అప్పారావుగారు కన్యాశుల్కమును రచించినారు; దీనిని ఈ దృష్టితోనే చూడవలసియున్నది.

ఈ సందర్భమున, కన్యాశుల్కముయొక్క కన్నడభాషానువాదమునకు డా. సి. ఆర్. రెడ్డిగారు వ్రాసిన ఉపోద్ఘాతములోని వాక్యములను పేర్కొని యీచర్చను విరమింతును—

"Still with all its defects of technique for which the Madras University, which in the true manner and style of pandits does not tolerate modern productions, is to be blamed……kanyasulkam remains a master-piece in the difficult realm of social satire. It is a glow with life and humanity; its men and women move about with all the graces and kind-nesses, oddities, cruelties, and chicaneries, sanctities and hypocrisies of real life—a life in which nature and custom, reason and tradition, senti-ment and superstition are in miserable conflict."

## శ్రీ కోలాచలము శ్రీనివాసరావు[1]

వ్యాఖ్యాతృశిరోమణిగా జగద్విఖ్యాతుడైన మల్లినాథసూరి వంశీయులు శ్రీనివాసరావు గారు. ఇంక శ్రీనివాసరావుగారు "ప్రపంచనాటకచరిత్ర" (Dramatic History of the World) ను ఆంగ్లమున ప్రకటించి, విశ్వవిఖ్యాతులైనవారు. ఇంతవరకును ఆధునిక కాలమున తెలుగుకవులు నాటకప్రపంచమున చేసినకృషిప్రశస్తి తెలుగుసీమలను దాటిపోలేదన్నచో నతిశయోక్తికాదు. శ్రీనివాసరావుగారి కృషి కట్టిభాగ్యము లభించినది; అది తెలుగువారి గర్వమునకు కారణమైనది. ఇట్టి మహత్తరకృషికావించుటకు వారికి కలిగిన యవకాశము పేర్కొనదగినది. వంశము పండితవంశము; కాగా సంస్కృతాంధ్రము లాబాల్యాభ్యస్తములు. బళ్ళారిలో నుండుటవలన కన్నడము సుపరిచితము. ఇంక ఆంగ్లము పనివడినేర్చినది. బళ్ళారిలో వారి అన్నగారు వేంకట్రావుగారు మంచి ఉన్నతస్థితిలోనున్న న్యాయవాది; అన్నగారి ఆదరణములో వీరి సాహిత్యకృషి కెంతయేని విశ్రాంతి లభించినది. ఇన్నింటికితోడు బళ్ళారిలో అప్పటికే తెలుగు నాటకరంగము మూడుపూవు లారుకాయలుగా విజృంభించుచున్నది. ఈ వాతావరణములో సహజ ప్రతిభావంతులగు శ్రీనివాసరావుగారి ప్రపంచనాటకచరిత్ర నిర్మాణకృషియును, తెలుగు నాటకరచనయును నిర్విఘ్నముగా సాగిపోయినవి.

కాని, విచిత్రమేమనగా, తెలుగువారికి చాలమందికి, శ్రీనివాసరావుగారి 'ప్రపంచ నాటకచరిత్ర' విషయము తెలియనే తెలియదు; అది ఆంగ్లభాషలోనుండుట యొక కారణమేమో ?[2] ఇంక శ్రీనివాసరావుగారిని నాటకకర్తగా మాత్రమే తెలుగువారెరుగుదురు. నాటక కర్తగా వారికి ప్రఖ్యాతి తెచ్చినవి వారి చారిత్రకనాటకములు; అందున 'రామరాజుచరిత్రము' (Fall of Vijayanagar) విశేషప్రచారమునందినది. ఈ నాటకమునకు తెలుగుదేశమున వింతటి ప్రచారముతెచ్చినవారు బళ్ళారి రాఘవాచార్యులగారు; దీనికేకాదు, శ్రీనివాసరావుగారి పెక్కునాటకములకు ప్రచారము తెచ్చినది రాఘవాచార్యులుగారే.

ధర్మవరమువారి నాటకరచన యారంభమైన తరువాత ఇంచుమించుగా ఎనిమిది సంవత్సరములకు శ్రీనివాసరావుగారు నాటకరచన యారంభించినారు. వారి తొలినాటకము 'సునందినీ పరిణయము' 1894_95 ప్రాంతముల ప్రకటితమైనది. ఇందలి కథ ఇంచుమించుగా కల్పితమైనదని చెప్పవచ్చును. ఇది సునందినీపరిణయ వృత్తాంతము కాన దాని కాపేరే పెట్టబడినది; అంతియేకాక 'దురాశ భంగమును కలిగించును' అనునీతిని తెలియజేయునది కాన దీనికి 'దురాశా భంగము' (Avarice defeated) అను నామాంతరముకూడ కలదు. సుమతియను మంత్రి దురాశాపూరితుడై తన్నునమ్మిన రాజున కెగ్గుచేయతలపెట్టి, పెక్కు దుష్కార్యములాచరించి, చివరకు భంగపడుట యిందు ప్రధానమగుటచేత దీనికీపేరుకూడ తగియున్నది; ఇది నాటకములందు నీతిని ప్రధానముగాతలంచు కృతికర్త మనస్తత్వమునకు సరిపోవునదికూడను. ఇది చాల పెద్దనాటకము; పూర్తిగా ప్రదర్శించుటకు 7_8 గంటలకాలము పట్టును. ఇట్లు రచించుటకు కారణము "శ్రావ్యములుగా నైతముండిన మేలనియుఁ బ్రదర్శించువా రందున నేభాగము కథాసరణికి నుపయుక్తంబగునో దానిని వేఱుపఱచి ప్రదర్శింపవలె ననియు నాయుద్దేశ్యము. ఇటులనే ఇంగ్లీషునాటకములు. అటుగాదేని యేనాటకముగాని బ్రదర్శింప సాధ్యంబుగాదు" అని వారు తెలిపియున్నారు.[3] కాని, తమ రెండవనాటకమగు 'సుఖమంజరీపరిణయము'ను మాత్రము 3_4 గంటలకాలమునకు సరిపడునట్లుగానే రచించియున్నారు. అయినను, మొత్తముమీద వారి నాటకము లన్నియును వైశాల్యమున పెద్దవియే.

శ్రీనివాసరావుగారు మొత్తము ముప్పది నాటకములవరకును రచించినారు—అందు చారిత్రకములు కొన్ని; పౌరాణికములు కొన్ని; సాంఘికములు కొన్ని; తక్కినవి చారిత్రక_పౌరాణిక వాతావరణములో కల్పింపబడినవి.[4] వారి నాటకరచనారంభమునకు గల ప్రోత్సాహమెద్దియో తెలియదు; కాని, 1902 ప్రాంతముల వారు బళ్ళారి 'సుమనోరమసభ' కధ్యక్షులైనది మొదలు, ఆసభవారి ప్రోత్సాహముచేతనే పెక్కునాటకములు రచించిరని చెప్పవచ్చును. వీరి నాటకములలో అధికభాగము ముందుగా సుమనోరమ సభవారిచేతనే ప్రదర్శింపబడెను. ధర్మవరమువారి నాటకములు సరసవినోదిని సొత్తుగా పరిగణింపబడినట్లే వీరినాటకములు సుమనోరమసభ సొత్తుగా పరిగణింపబడెడివి. ధర్మవరమువారి నాటకములు రచింపబడిన చాలకాలమువరకును ముద్రణభాగ్యమును పడయలేదు; కాని వీరి ప్రముఖనాటకము లన్నియును ఇంచుమించుగా రచింపబడినవెంటనే ముద్రింపబడినవని చెప్పవచ్చును. మరియు, 1919 లో చనిపోవువరకును వీరు నాటకములను వ్రాసి, ఆడించి, ప్రచురించుచునేయున్నారు.

ధర్మవరమువారికిని కోలాచలమువారికిని పోలిక లనేకము లున్నవి—ఇరువురును ప్లీడర్లు. ఇరువురును స్వతంత్రనాటకకర్తలు. ఇరువురును బహుళ నాటకకర్తలు. ఇరువురికిని ప్రత్యేకనాటకసమాజము లున్నవి. సమాజపునటులను దృష్టిలోపెట్టుకొని నాటకములను రచించుట ఇరువురును చేసినారు. ఇరువురును పద్యములను, పాటలను ఆదరించినారు. సమాజములలోని సభ్యులవిషయ మెట్లున్నను, వీరిరువురును మాత్రము మిత్రులే. ఇంక భేదములలో తప్పక పేర్కొనదగినది—ధర్మవరమువారు ఉత్తమనటులు; కోలాచలమువారు రంగస్థలము నెక్కనట్లు

కన్పట్టదు. ఇంకొకభేదము కోలాచలమువారికి నీతియందు దృష్టి యధికము; ధర్మవరమువారికి రసదృష్టి యధికము. సాదృశ్యబాహుళ్యములనుబట్టి కోలాచలమువారి నాటకములనుగూర్చి వివరించునప్పుడు ధర్మవరమువారి ప్రసక్తికూడ వచ్చుచుండుట సహజము.[5]

కృష్ణమాచార్యులగారివలెనే శ్రీనివాసరావుగారుకూడ పాటలను తమ నాటకముల యంతములందు చేర్చినను వారికి పాటలయందుకంటె పద్యములందే అధికాదరము—"నాటకంబునకుఁ బాటలే ముఖ్యమని కొందఱి తాత్పర్యము. పద్యంబు లంతకంటెను ముఖ్యమని నా తాత్పర్యము...పద్యంబులలో రాగాలాపన సేయకూడదా? అంతమట్టుకు సంగీతము నాటకంబునకుఁ జాలదా?" అని సుఖమంజరీపరిణయ పీఠికలో పేర్కొనియుండుట గమనార్హము. కృష్ణమాచార్యులవారి నాటకములందుకంటె వీరి నాటకము లన్నింటను పద్యము లెక్కువయే.[6] ఇరువురికిని ప్రాబంధికశైలియందే ప్రీతి; అందున మరల శ్రీనివాసరావుగారిదే పైచేయి. కాగా, ఇరువురి పద్యములందును ప్రబంధరీతిని బోలిన శబ్దార్థరచన అధికముగా కన్పట్టును; మరియు నిందు మంచి భావము, భాష కల రసోచిత పద్యసందర్భములతోపాటు, రసభంజకము లైన పద్యసందర్భములుకూడ కలవు.[7] ఇట్టివి పాటలందుకూడ కలవు. అసలు, తాము పాటలను చేర్చుటకు కారణము నాటి ప్రజాభిరుచియేయని ఇరువురును అంగీకరించియున్నారు. కాని, ఇరువురును సంగీతజ్ఞులు; తమపాటలకు రాగతాళనిర్ణయములను వారే చేసియున్నారు. పద్యములందుకూడ కొన్నింటిని రాగమాలికలగా పాడుట కనువుగా ఆయా రాగములపేర్లు ముద్రాలంకారము రీతిగా చేర్చి వ్రాసియుండుట గమనార్హము.[8]

ఇరువురును అంకములను, పాశ్చాత్యపద్ధతిని రంగములుగా విభజించియున్నారు. (రంగవిభజనమువలన అనేకవిషయములను మనము ప్రత్యక్షముగా చూచుట కవకాశము కలిగినది). అయినను, అంకములందు స్థల-కాలైక్యములు సాధారణముగా పాటింపబడినవి. ఇరువురును పంచాంకపరిమితిని చాలవరకు పాటించియున్నారు. ఇరువురి నాటకములందును కొన్నింట నాందీ-ప్రస్తావనలు కలవు; మరి కొన్నింట లేవు; కాగా, ఈ విషయమున నిశ్చితమైన అభిప్రాయ మున్నట్లుగా కన్పట్టదు. ఇరువురును ప్రవేశక-విష్కంభాదుల నంతగా నుపయోగింపలేదు; అసలు, రంగవిభజనమున నట్టి యావశ్యకము వారికి కలుగ లేదనవచ్చును. ఇరువురును మరణము, యుద్ధము మొదలగువానిని అంకముననిబంధించి ప్రాచీన నియమోల్లంఘన మొనర్చియున్నారు. కృష్ణమాచార్యులవారి నాటకములలో ఆలింగన-చుంబనాదులకు కూడ అవకాశము లున్నవి.

ఇరువురును తమ సమాజములను అందలి నటులను దృష్టిలోపెట్టుకొనియే తమ తమ నాటకములను చాలవరకు రచించియున్నారు; ఈదృష్టి శ్రీనివాసరావుగారిలో కొంతవరకు తక్కువయని చెప్పవచ్చును. మొత్తముమీద ఇరువురి నాటకములును ప్రదర్శనసౌలభ్యము కలవియే. ఇరువురును కొన్నినాటకములను, తమ కిష్టములేకపోయినను, సభలవారిబలవంతము చేత రచింపవలసివచ్చినట్లు చెప్పుకొనినారు;[9] అంతియేకాదు, సుమనోరమ సభవారు తమ శుభాంతనాటకములను దుఃఖాంతములుగా మార్చి యాడుచుండగా శ్రీనివాసరావుగారు చూచుచు

నూరకుండవలసివచ్చినది. సభ్యులను, లేదా నాటి ప్రజలను తృప్తిపరచుటకై ఇరువురును పాటలను పార్శీ, హిందూస్తానీమట్లలో బిగించుటయేకాక కొన్నిసన్నివేశములను అనవసరముగా, రసభంజకములుగాకూడ కల్పించియున్నారు. అట్టివానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి హాస్య రస ఘట్టములు—కృష్ణమాచార్యులవారి చిత్రనళీయములోని సుదేవపర్ణాదుల సంభాషణము (అడవిలో కలిసికొన్నప్పుడు), చిరకారిలోని చెవిటివారి వినోదము మొదలగునవి; శ్రీనివాస రావుగారి ప్రస్తావనలలోని విదూషకపాత్రము, ప్రహ్లాదయందలి గురుశిష్య సంవాదము మొద లగునవి. మొత్తముమీద శ్రీనివాసరావుగారికంటె కృష్ణమాచార్యులవారిలో హాస్యమును సృజించుశక్తి ఎక్కువగా నున్నదని చెప్పవచ్చును.

నాటకములమూలమున ప్రజలకు నీతిబోధింపవలయుననెడి యాశయ మిరువురికిని కలదు; కాని ఇరువురి మతములందును కొంత భేదముకలదు. "నీతి కుదర్పవలయునన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీఱవలయు"నని కృష్ణమాచార్యులవారి తలంపు; ఆ దృష్టితోనే వారు సారంగధర కథను చేపట్టిరి. కాని, శ్రీనివాసరావుగారు ఇందుల కంతగా అంగీకరింపరు. మొత్తముమీద ఇరువురును 'శౌర్యము, సాహసము, భక్తి, పతిసతీవ్రతములు, సత్యము, అహింస' మొదలగు నీతులను బోధించు కథలనే ఎన్నుకొని నాటకములను రచించుటయే కాక, నీతికి భంగము కలుగునని తోచిన ప్రసిద్ధసన్నివేశములనుకూడ మార్చివేసియున్నారు. కృష్ణమా చార్యులవారు వాలివధసన్నివేశమును మార్చివేయగా, శ్రీనివాసరావుగారు ద్రోణవధసమయమున ధర్మరాజు అసత్యమాడెడి సన్నివేశమును మార్చివేసినారు. అవకాశము లభించినప్పుడెల్ల కృష్ణమాచార్యులుగారు ఆధునిక సాంఘికసమస్యలను పురాతన కథలందు చొప్పించుటకు యత్నింపగా, శ్రీనివాసరావుగారు నీత్యుపదేశమునకు దొరకొందురు—శిరోమణిలో భగవ ద్గీతాంశముల చేర్పు, 'మైసూరు రాజ్యము' నందలి వివిధమతసిద్ధాంత నిరూపణము మొదలగున విందుల కుదాహరణములు. ఇంక 'గిరిజాకల్యాణము'ను ఆసాంతము వేదాంతపరముగానే రచించియున్నారు. ఇరువురును 'ఉత్తరరంగము' లనుపేర ఆయా నాటకములందలి నీతులను తెలుపుటకు నాటకాంతములందు ద్విపదమాలికలను రచించియున్నారు. శ్రీనివాసరావు గారు ఉత్తరరంగములను కొన్నింటిని నాటకకథలలోని భాగములుగా రచించియుండుట గమ నింపదగినది—ఉదా : 'సునందినీ పరిణయము', 'సుఖమంజరీ పరిణయము' మొదలగునవి. నీతిపై ఎంతటి దృష్టియున్నను, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పేర్కొన్నట్లుగా, "ఇద్దఱిలో ఎవరును నీతిపేర రసమునుగాని, రసముపేర నీతినిగాని ప్రాయశః చెఱిచినవారుగారు."

ఇరువురి రచనలలోను విషాదనాటకములు, లేదా అశుభాంత నాటకములు కలవు. రామరాజుచరిత్ర, సుల్తానాచాందుబీ, శిలాదిత్య అనునవి శ్రీనివాసరావుగారు రచించిన విషాద రూపకములు. కాని, వీనిలో రామరాజుచరిత్రమును వీరు శుభాంతనాటకముగానే రచించినారు; అట్లే ముద్రితమైనదికూడను. కాని, దానిని విషాదాంతముగా మార్చి ప్రదర్శించినారు సుమనో రమ సభవారు. ఇంక తక్కిన రెండింటను విషాదచ్ఛాయలంత జిగిగాలేవు. కాగా, కృష్ణమా చార్యులుగారి విషాదసారంగధరమువంటి విషాదరూపకమును శ్రీనివాసరావుగారు వ్రాయనే లేదని చెప్పవచ్చును.

ఇరువురిలో కృష్ణమాచార్యులుగారు "రోషనారా శివాజి" యనెడు చారిత్రకనాటక మొక్కటి మాత్రమే వ్రాసినారు. కాని, శ్రీనివాసరావుగారు ఆరు చారిత్రక నాటకములు వ్రాసి యున్నారు. అంతకుముందుకూడ తెలుగులో ప్రతాపరుద్రీయ, రంగరాయకదన సమవకారాది చారిత్రకనాటకములను వ్రాసిన కవులున్నను, చారిత్రకనాటకరచనావిషయమున శ్రీనివాసరావు గారే సుప్రసిద్ధులైనారు.

మొత్తముమీద, ఇరువురును సమానప్రతిభావంతులు; ఆ తొలిరోజులలో తెలుగు నాటకకళకు, నాటకరంగమునకు గౌరవమును కలిగించి, సాటిలేని కళాసేవ చేసియున్నారనుట నిస్సంశయము. కృష్ణమాచార్యులవారికంటె ఎనిమిది సంవత్సరములు ఆలస్యముగా నాటకరచన యారంభించుటచేగాబోలు వారు రచన మానుకొన్న తరువాత ఇంచుమించుగా ఎనిమిది సంవత్స రములవరకును నాటకరచనచేసి శ్రీనివాసరావుగారు కీర్తిశేషులైనారు.

## రామరాజు చరిత్రము.
### (కర్ణాటకరాజ్యనాశనము)

విషాదసారంగధర మొక్కటియు పది విషాదనాటకముల యంతపనిచేయగా, ఈ 'రామరాజుచరిత్ర' మొక్కటియు పది చారిత్రకనాటకములయంత పనిచేసినది. శ్రీనివాసరావుగారి నాటకములలో నిది యారవది; ఇది 1907 లో ముద్రితమైనది. అంతకుముందేవారు 'సుల్తానా చాందుబీ' యనెడి చారిత్రకనాటకమును వ్రాసి యున్నారు. తాము చారిత్రకనాటకములను వ్రాయు టకు గలకారణమును వారీక్రిందివిధముగా చెప్పుకొనినారు–"కేవల పౌరాణికకథలు నాటకములుగఁ బన్నుటయందు గ్రంథకర్తకు నితివృత్తకల్పనా కష్టంబేమియు నుండదనియును, జనసామాన్య మునకుఁ జరిత్రాంశములు బొత్తిగఁ దెలియవుగావున, నవినాటకంబులుగ వ్రాయుటచే నితి వృత్తకల్పనా చమత్కృతినగపఱచుటయగాక, జనులకుఁజరిత్రాంశములు బోధింపనగునని యెంచి తురుష్కులలో గొప్పరాణియని ప్రసిద్ధికి నెక్కి, 'అహమ్మదునగరు' రాజ్యమునేలిన "సుల్తానా చాందుబీ' యనునామె చరిత్రంబు నాటకరూపంబున వ్రాసితి" (సత్యహరిశ్చంద్రీయము–ఉపో ద్ఘాతము). దీనిని సుమనోరమ సభవారు చక్కగా ప్రదర్శించినారు. అంతట శ్రీనివాసరావుగారు వెంటవెంటనే 'రామరాజుచరిత్రమును'ను, 'శిలాదిత్య'ను, 'మైసూరురాజ్యాభివృద్ధి'ని రచించినారు.

ఈ రామరాజు చరిత్రమున, 'తాళికోట యుద్ధమునందుఁ బరాజయమునొంది హిందూ రాజులు విజయనగరరాజ్యమును గోలుపోయిన విషయ' మితివృత్తము. తాళికోటయుద్ధమున రామరాజుశిరము నరికినవాడాతని సేనాధిపతులలోని యొకమహమ్మదీయుడని యొక చరిత్ర కారుడు వ్రాసినదాని నాధారముగజేసికొని, కార్యకారణదృష్టితో శ్రీనివాసరావుగారిందు క్రొత్త కల్పనచేసినారు; తత్ఫలమే పఠాన్‌రుస్తుం, ఆషాబీపాత్రల సృష్టి. ఇందు నాయకుడు పఠాన్; ఆతడుసాధించినది కర్ణాటకరాజ్యనాశనము. కాగా, దీనికి "రామరాజు చరిత్రము" అనెడి పేరు కంటె "కర్ణాటక రాజ్యనాశము" (Fall of Vijayanagar) అనెడిపేరే ఉచితముగానుండును. ఈ నాటకమును గూర్చిన విమర్శనములలో ప్రధానమైనవి రెండుకలవు—ప్రాచీనాంధ్రనాయ

కుల తెలివిలేమిని ప్రదర్శించుటకాని, హిందూ మహమ్మదీయ సఖ్యతకు భంజకముగా నితివృత్త కల్పనముకాని సమంజసములుకావనునది మొదటివిమర్శ. ఇంక రెండవవిమర్శ పఠాన్‌రుస్తుం నాయకుడుగా నుండదగినవాడు కాడని; ఒకవేళ నేటి అభిరుచులకు తగినట్టుగా నాతడునాయకు డగుట కభ్యంతరములేకపోయినను, సుమనోరమ సభవారు, తదనుసారముగా నితరులు ఆపాత్ర నిర్వహణములో చూపించిన భావసంఘర్షము ఆపాత్రకు తగదు.[1]

1906 డిసెంబరులో కలకత్తాలో దాదాభాయినౌరోజీయధ్యక్షతలో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభలలో 'స్వరాజ్యతీర్మాన' మామోదింపబడుటతోబాటు 'వందేమాతరం' గీతము జాతీయగీతముగా నంగీకృతమైనది – ఇది స్వాతంత్ర్యసమరములో నొక ప్రముఖఘట్టము. ప్రజలలో విపులముగ దేశాభిమానమును, నూత్నోత్సాహము రేకెత్తినవి. కవులు చారిత్రక నాటకముల నధికముగా వ్రాసినదీకాలములోనే. తెలుగు కవులుకూడ కొందరు భారతాదికథలను గ్రహించి, అందలిపాత్రలను వీరరస ప్రధానముగ తీర్చిదిద్దిరి; కొందరు రసపుత్ర చరిత్రాంశములను గైకొని స్వదేశాభిమానదీక్షను చిత్రించిరి; కొందరు బొబ్బిలికథాదులను గైకొనిరి. కాని, ఎవ్వరును నాటి ఆంగ్లేయప్రభుత్వమునకు వ్యతిరేకముగా, వారిదుర్ణయములను చిత్రించుచు నాటకములను వ్రాయుటకు సాహసింపలేదు (ఆ ఉద్యమము 1919 తరువాత ఆరంభమైనది). ఇంకవారి దృష్టియంతయును మహమ్మదీయగాథలపై ప్రసరించినది. 'అత్తమీదికోపము బిడ్డమీద' చూపించినట్లు ఆంగ్లేయప్రభుత్వముపైగల కోపము మహమ్మదీయులపై వ్యక్తముకా జొచ్చినది. అట్టివానిలో ఈ రామరాజు చరిత్రమొకటిగా కన్పట్టుచున్నది. (చూ. 'నాట్యాంబుజము'— పుటలు 206–07; 333–34).

ఇంక పఠాన్, పురాణం సూరిశాస్త్రిగారు పేర్కొన్నట్లు "ఉదారస్వభావుడుకాడు. మాతాపితరుల యందాదరణగలవాడు కాడు. శృంగారనియమముల నెఱింగినవాడుకాడు. నీచకార్యము నెదిరించు నీతిగుణోపేతుడుకాడు. క్షాత్రధర్మమున నెదుర్కొని వృద్ధునైనను పోరాడువాడుకాడు. ద్రోహి. కృతఘ్నుడు. విశ్వాసఘాతకుడు. గూఢచారుడు. కుత్రమారి. దొంగపోటులవాడు. నీచుడు "(నాట్యంబుజము–పుట 221). అట్టివాడు, అసలు కథావశమునగూడ, జీవించియుండుట కంటె మరణించుటయే మేలు; అందుచేత సుమనోరమ సభవారు చేసినమార్పు సమంజసముగానే యున్నది. కాని, ఆతడాత్మహత్య చేసికొన్నట్లుగాకాక, వేరొకవిధముగా చిత్రించుటబాగుండెడిది. ఇంక చివరిరంగమున వాని కాపాదింపబడిన భావసంక్షోభమును బట్టి ఆతడు క్షణకాలముత్తమ నాయకుడుగా కన్పట్టుటకవకాశమున్నది. "ఆషాబీ యెడలనున్న కామోద్రేకమును గణియింపకున్నను, పితృవాత్సల్యము, ప్రభుభక్తియు నొకచెంపను, స్వమతాభిమానము వాక్పరిపాలనము మఱియొక చెంపను పఠానుని మానసమును కలవరపరచునట్లును మహోదారస్వభావప్రవృత్తిచే పఠానుడు దురదృష్టవంతుడై తుదినొందె"నని మార్పుచేసినవారి యభిప్రాయము. ఇది రసోద్వేగ ప్రదర్శనమున కనువైన చక్కని ఘట్టము. అయినను, విమర్శకదృష్టితో చూచినచో ఈభాగము వాని తొలిచిత్తవృత్తికి అతుకుపెట్టినట్లుగానే కన్పట్టగలదు.

పఠాన్ పాత్రకు, అంతియేకాదు రామరాజు చరిత్రకే, విశేషఖ్యాతి తెచ్చినవారు రాఘవాచార్యులుగారు. ఇందలి కొన్ని భాగములను వారు హిందీలోనికిని, ఆంగ్లములోనికిని అనువదింప

జేసి కూడ ప్రదర్శించు చుండెడివారు. ప్రజలలో దీనికి కలిగిన వ్యాప్తి ఫలముగా, ఇది 1918 ప్రాంతముల ప్రభుత్వ నిషేధాజ్ఞకు గురియైనది.

రచననుగూర్చికూడ రెండుమూడుమాటలు చెప్పవలసియున్నది. ఇందులోకొన్ని రంగముల విషయమున చేయదగుమార్పులను చేర్పులను సూచించుటయేకాక తమతమ ఇష్టానుసారముగా ప్రదర్శకులు ప్రదర్శింపవచ్చునని శ్రీనివాసరావుగారే పీఠికలో తెల్పియున్నారు. నిబిడబంధముతో కవి నాటకమును రచింపలేదనుటకిది యాస్పారమొసంగుచున్నది. ప్రథమాంక-ద్వితీయాంక ప్రారంభములందలి ప్రథమరంగములు నాటకకథ కేమాత్రమును సంబంధింపక పోవుట యిందులకొకయుదాహరణము. ఇంక పఠాన్‌నోట సంస్కృత పదజటిలములగు వాక్యములను, పద్యములను వాడవచ్చునా? యనెడిప్రశ్నకుకూడ అవకాశముకలదు. ఇందులకు "ఇది తెలుగునాటకము. ఉత్తమపాత్రను ధరించినవాడు తురకవాడయినను వానికి నుత్తమభాషయ వాడవలెనని నాతాత్పర్యము" అని వారుసమాధానమొసంగినారు. తెలుగులో కవిత్వము చెప్పనేర్చిన మహమ్మదీయులలోతప్ప తదితరుల తెలుగుసంభాషణములలో, వారెట్టిసంస్కృతీసంపన్నులైనను, సాధారణముగా నొకవిధమగు యాసకన్పట్టుచునే యుండును; ఒకవేళ అదికూడ కన్పట్టదన్నను, అట్టివారికి పద్యము లనవసరమనక తప్పదు.

రామరాజుచరిత్రముతోపాటు, శ్రీనివాసరావుగారి 'సునందినీ పరిణయము' కూడ సర్కారు జిల్లాలలో విశేషప్రచారమందినది.

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు[1]

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి పేరు స్మరణకువచ్చినంతనే వారు మనకు రెండుమూర్తులతో సాక్షాత్కరింతురు—ఒకమూర్తి 'సాక్షి' రచనకు సంబంధించినది; ఇంకొకమూర్తి 'నాటకరచన'కు సంబంధించినది. పంతులుగారు సహజముగా హాస్యప్రధానమైన చిత్తవృత్తికలవారు; దానికి ఘాటైన విమర్శను జోడించి గిలిగింతలు పెట్టుచు, నెత్తిపై ఉంగరపు వ్రేలితో మొట్టుచు, వీపుపై జఱచుచు, పిక్కపాశములుపెట్టుచు, కత్తివ్రేటులకు పాలొనర్చుచు, మరల మనసారనవ్వించుచు జంఘాలశాస్త్రిరూపములో పంతులుగారు 'సాక్షి' వ్యాసములలో గోచరింతురు. మతము, నాగరకత, వేదాంతము, రాజకీయములు, విద్యావిధానము, స్త్రీలస్థితి, నాటకరీతులు, సారస్వతపుపోకడలు......ఒకటియననేల, సాక్షివ్యాసములందు పంతులుగారు తడవని విషయమేలేదని చెప్పుట అతిశయోక్తికాజాలదు; అదియంతయును నొకప్రత్యేకప్రపంచము. ఆంగ్లమునందలి ఎడిసన్ 'స్పెక్టేటర్'ననుసరించి పంతులుగారాంధ్రమునందొక యపూర్వ వాఙ్మయశాఖను సృష్టించిరి.

ఇంక వారి రెండవమూర్తి. సాక్షిప్రథమవ్యాసములు 1913 నాటివి. కాని, వారిప్రథమ నాటకము, నర్మదాపురుకుత్సీయము, 1900 లోనే ప్రకటితమైనది; అసలు, నాటకరచనతోనే పంతులుగారి సారస్వతకృషి ప్రారంభమైనది. పాశ్చాత్యనాటకకర్తలలో షేక్స్పియరు వీరికి ఆదర్శము. ఆతడు రచించినన్ని నాటకములను రచించి, లౌకికప్రపంచము నంతటిని నాటకప్రపంచమున

చిత్రింపవలెనని వీరి సంకల్పము; ఆ పట్టుదలతోనే ముప్పదికిపైగా నాటకములను రచించి యున్నారు.[2] శ్రీయుతులు కృష్ణమాచార్యులు శ్రీనివాసరావుగార్లవలెనే వీరు కూడ కేవలము స్వతంత్రనాటకములనే రచించియుండుట గమనార్హము. కాని, వీరినాటకములందు పాటలులేవు; భక్తిరసపోషణమందుతప్ప పాటలను వీరంగీకరింపరు. ఇంక పద్యములవిషయమున ఆటవెలది, గీతము, సీసము అనెడి మూడు ఛందస్సులనే వాడియున్నారు; నాటకమున పాడుటకనువైన పద్యములుండరాదని వారిసిద్ధాంతము[3]. నాందీపద్యముల విషయముననూ, పాత్రవశమున వెఱ్ఱిమొఱ్ఱి కవిత్వమును చెప్పవలసినప్పుడును మాత్రమే వీరు వృత్తములను వాడినారు(కంఠాభరణమందలి భట్రాజుల కవిత్వము, విజయరాఘవమందలి ద్విజిహ్వుని కవిత్వమును ఇందులకుదాహరణములు). ఇంక వీరి వచనరచన వ్యావహారికమునకు దగ్గరగానుండు సరళ గ్రాంధికమైయున్నది; సాక్షిరచనయు నిట్టిదే. శ్రీయుతులు వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్ల శైలియును సరళమే అయినను దీని ప్రత్యేకత దీనిదే; ఇది అనుకరణీయమన్నను అతిశయోక్తి కాజాలదు.

పంతులుగారి నాటకములన్నింటను అంకములు ఏకైకరంగములే; రంగవిభజన వారు చేయలేదు; అయినను ప్రవేశక-విష్కంభాదులను అంతగావాడకపోవుట చిత్రము. నాటకములందన్నింటను సన్నివేశముల నద్భుతావహములుగా కూర్చుటలో పంతులుగారు గొప్పనిపుణతను చూపియున్నారు. ఈ కూర్పునేర్పు ప్రేక్షకునిలో ఉత్సుకతను వృద్ధిపొందించును. ముందేమి జరుగనున్నదో యనునాత్రము నిది కలిగించును. అంతియేకాదు, వారు కూర్చిన సన్నివేశములన్నియును పూర్వాపరములతో సందర్భించినవై ఔచితీసహితముగా నుండును.

ఏనాటకమును చదివినను ఇది స్పష్టము కాగలదు. తెలుగు నాటకములలో "శైలీసౌలభ్యమునకు తిరుపతి వేంకటేశ్వరకవులను, సందర్భసన్నివేశనైపుణ్యమునకు ధర్మవరం వారిని, సంవాదకౌశలమునకు పానుగంటివారిని, సజీవపాత్రసృష్టికి వేదంవారిని, ప్రయోగసారళ్యమునకు చిలకమర్తివారిని పేర్కొనవలసియుండు" నని ఆచార్య పింగళిలక్ష్మీకాంతంగారనుచుండెడివారు. పానుగంటివారి సంవాదకౌశలమునకు వారినాటకములలోని ప్రతిపుటయును ఉదాహరణమే. ఈ సంవాదములందు సూక్తివైచిత్రియు బహుళముగా గోచరించుచుండును.[4] ఒక్కొక్కప్పుడీయుక్తి ప్రతియుక్తు లతిగానుండుటయును కలదు.[5] అంతియేకాక ప్రసంగవశమున వీరు కొన్ని వంకరమాటలను ఉన్నతపాత్రములచేత కూడ ఔచితీరహితముగా పలికించుచుందురు.[6] ఇట్టివి ప్రతినాటకమునందునున్నవి. ఇది వీరిలో ఒకలోపమని అంగీకరింపక తప్పదు. ఇంక కేవలము దాసీలచేత పలికించెడి యసభ్యములు కొల్లలుగా నున్నవి. అసలు, పంతులుగారి నాటకములలో దాసీల యాధిక్య మనల్పము. వారు పేరునకుమాత్రమే దాసీజనము; కాని రాజులును, రాణులునువారి చెప్పుచేతలలోనివారే. అందున, దాసికొంచెము ముసలిదియైనచో నింక దానినోటికి అడ్డేయుండదు. ఈదాసీలందరును నిగ్రహానుగ్రహసమర్థలు. భార్య తన్నుదగ్గరకురానిచ్చునట్లు చేయుమని దశరథునియంతటివాడు కైకేయిదాసి రుచిరయను దానిని బతిమాలుకొనెను. ఇంక కల్పితనాటకములలో పంతులుగారి కలమున కభ్యంతరమేమున్నది? ఏమైనను పంతులుగారి దాసీపాత్రములు మాత్రము ప్రత్యేకముగా పఠనార్హములు.

పంతులుగారి రచనలలోని పై 'అసభ్యత' కు హేతువు నూహింపవలసియున్నది. పంతులుగారికి షేక్స్పియరు నాటకములాదర్శములైనను, వారిమీద 'రెస్టొరేషన్ కామెడీ 'ల ప్రభావముకూడ అధికముగానున్నది. ఈ కామెడీలలో అసభ్యతకు; అశ్లీలములకు నిదర్శనములైన సన్నివేశములు కోకొల్లలు. కాళిదాసు, షేక్స్పియరువంటి మహామహులలోకూడ ఆలంకారికులును, విమర్శకులును కొన్ని అశ్లీలమును చూపించియున్నారు. కాని, వానినెల్ల పరిశీలించిన పంతులుగారు అట్టివానినుండి తప్పించుకొనుటకు ప్రయత్నింపవలసియుండెను; వారట్లుచేయలేదు. ఇందులకు ముఖ్యకారణము వారి వ్యంగ్యహాస్యప్రవృత్తియే. లోపముకన్పించినచోట, అవకాశము లభించినచోట కసిదీర ఒక విసురు విసిరినకాని వారికితృప్తిలేదు. ఇందులకు సమకాలీనప్రేక్షకుల అభిరుచులును అడ్డుపడలేదు.

'గండ' మను వీథ్యంగమును ప్రయోగించుటలో పంతులుగారికాసక్తియెక్కువ. అసలు వేరొకయర్థమునుగూర్చి పలుకబడిన తొందరపాటుతో గూడిన వచనము ప్రస్తుతార్థమునకు సరిపోవుట (అందులో అపశకున ప్రాయముగనుండుట) గండ మనబడును; దీనినే 'మూడవ పతాకాస్థానక' మనియు నందురు. (ఉత్తరరామచరిత్రలో, వేణీసంహారములో ప్రయుక్తములైన 'గండము' లిట్టివియే), ఇట్టివి కూర్చుటకు రచనానైపుణ్యమధికముగా కావలసియుండును. ఇవి ప్రచండచాణక్య-విజయరాఘవ-పాదుకాపట్టాభిషేకములలో నధికముగాకలవు. పంతులుగారికి ఉపమానములందు ప్రీతిహెచ్చు. ఇంచుమించుగా ప్రతిపద్యములోను వీరేదోయొకయుపమానమును ప్రయోగించుచునేయుందురు. కవియొక్క ప్రకృతిపరిశీలనాశక్తి ఆతని ఉపమానములలో ప్రతిఫలించుచుండును. (కాళిదాసు 'కవికులగురు'వనిపించుకొనుట కిదియొక కారణము). వీనితోబాటు లోకోక్తులను, పలుకుబడులను కూడ కొల్లలుగావాడుచుందురు.[7]

తొలిరచనయగు నర్మదాపురుకుత్సీయమందు దీర్ఘస్వగతము లత్యల్పములు; కాని, తరువాతి నాటకములందివి యెక్కువైనవి. ఒక్కొక్కప్పుడు సంభాషణ చాల తీవ్రముగా జరుగుచున్నప్పుడు పాత్రలు దీర్ఘస్వగతములను పద్యములలో కూడ సాగించుచుందురు; అంతవరకును తీవ్రముగా వాదించుచున్న రెండవపాత్రము అదిపూర్తియగువరకును నోరుమూసికొని కూర్చుండవలసినదే. ఇంక అపవారించి మాటాడించుట పంతులుగారికి నల్లేరుమీద బండిసాగినట్లు. అంతియే కాదు. వీరు పెక్కుపాత్రములచేత, ఛాందసపు ధోరణిలో, ఉపన్యాసముల నిప్పించుచుందురు; అట్టివారందరును జంఘాలశాస్త్రికి సన్నిహిత బంధువులుగానే గోచరించుచుందురు. ఇది కొంతవరకు నిజమే అయినను మొత్తముమీద వారి సంభాషణలు చాల ఉత్తమస్థాయిలో నుండును. అసలు వారు, ముఖ్యముగా, సంభాషణాకౌశలమువిషయముననే ప్రశంసింపబడుట స్మరణీయము.

రంగస్థలముమీద పెక్కుపాత్రము లుండగా నందులో ఒక పాత్రమునుగూర్చి మరియొక పాత్రముచేత 'తనలో' విమర్శను చేయించుచుందురు. రంగస్థలమును రెండు కక్ష్యలుగా విభజించి ఒకప్రక్కను ప్రధానపాత్రములచేత మాటాడించుచుందురు; రెండవప్రక్కనుండి ఒకడు ప్రవేశించి మొదటివారికి కన్పడనట్లుగా నటించుచు వారి సంభాషణములను మాత్రము విని, వానిపై గచ్ఛద్వ్యాఖ్యను చేయుచుండును. నర్మదాపురుకుత్సీయమున మొదటి రెండంకము

కాదు. పంతులుగారు శ్రీరామభక్తులు; తత్ప్రసక్తి వచ్చినపుడెల్ల తాము పరవశులై పలుకు చుండుటయేకాక పఠితకును, ప్రేక్షకునకునుగూడ తన్మయత్వమును కలిగింతురు. రామాయణ గాథ నంతటిని నాటకీకరింపవలెనని తలపెట్టి నాలుగు నాటకములను రచించిరి. అందులో 'పాదుకాపట్టాభిషేకము' చాల ప్రసిద్ధిగాంచినది. ఇంక రాధాకృష్ణ అపూర్వమైన ఒక ప్రత్యేక సృష్టి. దీనినిగూర్చి తరువాత వివరింతును.

పంతులుగారి నాటకములన్నింటను భరతవాక్యమొక్కటియే—"లోకాస్సమస్తాస్సుఖినో భవంతు" అనునదియే వారి ధ్యేయము. "నాటకరచనా పాటవమునందు వీరితో తులతూగిన చేతులు అరుదుగ నున్నవి. పశ్చిమఖండములో నిప్పు డధికసన్మానము బడయుచున్న మేటర్ లింకు, బెర్నార్డుషా, ఇబ్సెన్ మున్నగు రచయితల రచనకంటెను వీరిరచనలు కొన్ని ప్రశస్తతరమై కానుపించుచున్నవి" అని పంతులుగారిని గూర్చి నండూరి బంగారయ్యగారు వ్రాసిన వాక్యములు సత్యసమ్మతములు. తొలి నాటకము 'నర్మదాపురుకుత్సీయము' వెలువడినప్పుడే మెచ్చి తిరుపతివేంకటకవులు వీరికి "అభినవకాళిదాసు" అనెడి బిరుదము నొసంగియుండుట కూడ ఇప్పట్ల స్మరణీయము.

పంతులుగారికి పిఠాపురములో చిలకమర్తివారి అధ్యక్షతలో 28-4-1935 తేదీన సప్తతి పూర్త్యుత్సవము మహావైభవముగా జరిగినది. "పంతులుగారిని స్మరించి, ఆదరించి, గౌరవించి, సన్మానించడం డెబ్భై సంవత్సరాల ఆంధ్రాభ్యుదయలక్ష్మిని స్మరించి, ఆదరించి, గౌరవించి, సన్మానించటమే అవుతుంది" అని అధ్యక్షపీఠమునుండి శ్రీ చిలకమర్తివారు ఉద్ఘోషించినారు.

## పానుగంటివారి కొన్ని ప్రసిద్ధనాటకములు

పానుగంటివారి నాటకములలో ఇంచుమించుగా ప్రతినాటకమును ఒక మహత్తర శిల్పఖండమే; ప్రతినాటకమును గూర్చియు చెప్పవలసినది బహుళముగా నుండును. అయినను బాగుగా ప్రసిద్ధికెక్కిన నాలుగు నాటకములనుగూర్చి మాత్రమే ఇందు దిఙ్మాత్రముగా వివరించు చున్నాను.

### రాధాకృష్ణనాటకము :

"రాధా పునాతు జగదచ్యుత దత్తచిత్తా। మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే।
తస్యాః స్తనస్తబక చంచలలోలదృష్టి। ర్దేవోఽపి దోహన ధియా వృషభం నిరుస్థన్"
అని కృష్ణకర్ణామృత శ్లోకము; భగవంతుని అంతగా వలచి, వలపించుకొన్న పుణ్యమూర్తి రాధ. ఆమె వలచినది బాలమురళీకృష్ణుని; జగన్నాటకసూత్రధారుడైన భగవంతుని, లేదా సత్యభామా విధేయుడగు శ్రీకృష్ణుని కాదు. ఆ చిన్నికృష్ణుని మురళీనాద మామెలోని ప్రత్యణువు నుజ్జీవింప జేయును—"సరస సంగీత మాధురీ సాధురీతి, మరల నింకొకసారి మురళి వాయింపుమయ్య। త్వన్ముఖామృత పూరంబుఁ ద్రావుధాన, ఘనఘనాంబువు చాతకకాంతవోలె" అని ఆమె చెప్పు

లందును అంశమంతు డిక్లే వ్యవహరించెను; అట్లే, 'కోకిల'యందు మోహనుడను ప్రతి నాయకుడును చేసెను. ఇంక రాధాకృష్ణనాటక తృతీయాంకములో రాధ, ఆమెచెలికత్తె లిరువురు రంగమధ్యమున సంభాషించుచుండగా సత్యభామయు ఆమె చెలికత్తెయును ఒకప్రక్కనుండియు, శ్రీకృష్ణుడును విదూషకుడును ఇంకొకప్రక్కనుండియు ప్రవేశించి ఒండొరులకు కన్పింపకుండ ఆయాప్రసంగములను విమర్శించుచుందురు. ఇట్టి ఘట్టములు వీరినాటకములందు చాలకలవు. రంగస్థలము బహుపాత్రసంకీర్ణము కాకుండుటకు 'బుద్ధబోధసుధ'లో పంతులుగారింకొక క్రొత్త పద్ధతి ప్రవేశపెట్టినారు—రంగస్థలమునందు బుద్ధునితోపాటు ఒకరిద్దరుమాత్రమే కూర్చుందురు; తక్కిన జనసమూహమంతయును నేపథ్యమందుండును. వారి ప్రశ్నలు, సమాధానములు నేపథ్యమునుండి వినిపించుచుండగా బుద్ధుడు తత్తదుచితముగా సంభాషణము సాగించుచుండును.

రచించిన ప్రతినాటకమందును పంతులుగారు చిత్రవిచిత్రములైన పాత్రలను సృజించి యున్నారు. ఒకపాత్రనుపోలి మరియొకపాత్ర యుండదు, పాత్రలన్నియును ప్రత్యేక వ్యక్తిత్వములు కలవియే. ఆపాత్ర సృష్టియంతయు షేక్స్పియరుపాత్ర సృష్టితో దీటైనది. దీనినిబట్టి మానవప్రకృతిపరిశీలనమునందు పంతులుగారిదృష్టి ఎంత నిశితమైనదో స్పష్టపడగలదు. సన్నివేశముల మార్పు, సంవాదకౌశలము, పాత్రసృష్టి—నాటకరచనలో ఈ మూడును మూడు విశిష్ట గుణములు; ఈ మూడును పంతులుగారిలో రాశీభూతమైనంతగా మరి యేయితర తెలుగునాటక కర్తలోను కాలేదన్నచో అది స్వభావోక్తి మాత్రమే.

పంతులుగారు సారంగధరనాటకమునుకూడ సుఖాంతముగానే రచించిరి; మీననాథుడను సిద్ధునిదయచేత సారంగధరుడు తిరిగి బ్రతుకును. కాని, కల్పితకథలతో పూర్ణిమ, రాతిస్తంభము వంటి దుఃఖాంతనాటకములను రచించినారు. పంతులుగారు సాక్షి వ్యాసములలో దుఃఖాంత నాటకముల రచనను, తదావశ్యకమును సమర్థించియున్నారు. విషాదాంతము కాకపోయినను ప్రచండచాణక్యము తచ్ఛాయలు గలదే; ఇందు చాణక్యుడు తాను స్వయముగా నందుని కత్తితో పొడిచి చంపుటయేకాక చిన్నపిల్లలైన నవనందులను వారితల్లి సునందయెదుట ముక్కలుముక్కలుగా నరకినాడు. శత్రువులయెడ చాణక్యుడు నిర్దయుడగుట ప్రసిద్ధమేకాని ఇట్టి నరఘాతుక కృత్యము ఆతడు స్వయముగా చేయునని నమ్మజాలము; ఇందు రాక్షసమంత్రి పాత్రపోషణము కూడ అనుదాత్తముగానే యున్నది. పంతులుగారి నాటకములలో నామనస్సును బాధించిన దీనాటక మొక్కటియే.

"పానుగంటివారి రచనాపాటవము" అనెడి వ్యాసములో (భారతి-యువ ఆశ్వీయుజము) నండూరి బంగారయ్యగారు పంతులుగారి రచనలోగల మూడు లోపములను, మూడు గుణములను పేర్కొనియున్నారు. లోపములు—1. నీరసపద్యరచన; 2, అసభ్యత; 3. ఛాందసపు ధోరణి. ఇంక గుణములు—1. సహజప్రతిభ; 2. మానవప్రకృతిపరిశీలనము; 3. ఉదారార్థ ప్రతిపాదనము. ఈ ఆరింటిలోను తొలి యైదింటినిగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను. ఇంక ఆరవది. పంతులుగారు రాధాకృష్ణ, విజయరాఘవము, పాదుక మొదలగు నాటకములలో మహోన్నతాశయములను ప్రదర్శించి మానవజాతికి గురుపీఠము నధిష్ఠించినారనుట అతిశయోక్తి

కొన్నది అక్షరాల నిజము. అరిషడ్వర్గమునుండి విముక్తయై, "నాకుఁ గాంతుడు నా శిరమున నున్నాడు, కనులయందున్నాడు, జిహ్వయందున్నాడు, హృదయములో నున్నాడు, నేనాతనిలో నున్నాను"అని వచించుచు అసూయావిలచిత్తయును, అహంభావమూర్తియునునగు సత్యభామలో కూడ మనఃపరిణామమును దెచ్చిన శుద్ధశీల రాధ. ఇందలి చతుర్థాంకము రాధాభక్తికి పరాకాష్ఠ యగుచున్నది. ఈ యంకము చాల దివ్యముగా కూర్పబడినది. దీనిని చదివి ముగించునప్పటికి సూత్రధారునిచేత కూచి నరసింహముగారు పలికించినట్లు "కలియుగముమాట మఱచి, నాకాంత మఱచి, మఱచి నాదైన పురుషజన్మంబుగూడ వింతగా నేను రాధికాకాంతనైతి" అనెడి అనుభవమే అందరకును కలుగును.

రాధకు బాలమురళీకృష్ణుడు సర్వదా సన్నిహితుడై యుండునట్లు వరము లభించుట; సత్య అసూయాదులు నశింపగా భక్తిసంపన్నయగుట—ఈ రెండంశములును రెండు జీవనదులుగా ప్రవహించి కృష్ణుడనెడి సముద్రములో నైక్యమగుట ఈనాటకమందు చక్కగా పరిపోషితమైనది. ఈవిషయమున, పసుమర్తియజ్ఞనారాయణశాస్త్రిగారు ఈనాటకమును తీవ్రముగా విమర్శించినారు—దీనిని "రాధాకృష్ణ" నాటక మనుటకంటె "సత్యాగర్వభంగ" మనుట సమంజసమని వారిసూచన. ఇది పైకి సమంజసముగా కన్పించినను నాటకోద్దేశ మిదికాదు. అంతియేకాదు, నిరూపితమైనదియును సత్యాగర్వభంగము కాదు; అంతటి అహంకారినికూడ 'సాదు'గా చేయగలిగిన పరిణతస్థితికి రాధ వచ్చుటయే ఇందు నిరూపితమైనది.

ఈ నాటకమున పంతులుగారు ప్రదర్శించిన పెక్కు విశేషాంశములలో నాలుగింటిని గూర్చి తప్పక పేర్కొనవలసియున్నది. పారిజాతాపహరణ ప్రసంగము నాటి సత్యభామా శ్రీకృష్ణ శిరస్తాడన వృత్తాంత మీనాటకమందు చక్కగా నతుకబడినది; సత్యభామలో మార్పు తెచ్చిన సన్నివేశమును అదియే. సాధారణముగా నాటకములన్నింటను నారదునిపాత్ర కేవలము కలహశీలత్వమునకే అంకితమైపోయినది. అట్టి నారదుడిందు రాధా-సత్యభామల సఖ్యమునకు తోడ్పడుటయేకాక, సత్యభామకు పరమార్థబోధ్ధయైనాడు. రాధామాధవ సంబంధము అసందర్భమైన శృంగారముతో అశ్లీలములతో అపనిందలకు గురియగుచున్న కాలమది. సాధారణముగా కథలందు రాధను జారిణిగానో, కృష్ణునికంటె పెద్దదిగానో చిత్రించుట సంప్రదాయమైనది. కాని, ఇందలి రాధ పరమభక్తాగ్రణి యగుటయేకాక, పతివ్రతయును; అంతియేకాదు, కృష్ణునికంటెను చిన్నదియే. కాని, ఆమె మనఃఫలకమున ముద్రితమైనది బాలమురళీకృష్ణుని మూర్తిమాత్రమే. ఐహికవాంఛావిరక్తయైన రాధాదేవికి ప్రౌఢకృష్ణునిస్మరణమే బాధాకరమైనది; ఆవిషయమెరుగని సత్యభామ "అనుపయుక్తుడగు బాలకృష్ణుని యామె యేల వలచుచున్నదో" యని కలవరపడుట కవకాశము కలిగినది. ఇంక నాల్గవవిశేషము—ఇందు రాధ కిరువురు చెలికత్తెలుకలరు. ఒకరు లలిత; ఇంకొకరు మధుర. మూడవయంకమున కృష్ణవిరహార్తయైన రాధాదుఃఖోపశమనార్థము లలితా-మధురలు శారద-కృష్ణులుగా నటింతురు. అసలు, లలిత-మధురము లనెడివి భక్తిభేదములు;ఇవి ఉత్తరోత్తరగుణాధికములు. లలితభక్తితో ఆరంభమైన రాధయొక్క బాలమురళీకృష్ణ సాన్నిధ్యవాంఛ మధురభక్తిగా పరిణమించుటను పంతులుగారు నిరూపించినారు. కావుననే చతుర్థాంకములో రాధవెంట మధురనొక్కతెనే చిత్రించుట జరిగినది.

"ఇందలి పాత్రసంభాషణములు భారతీయుల ప్రస్తుతాధ్యాత్మికపరితాపమును సుచ్ఛ్వసించు వేదవాక్యములనఁజెల్లు"నని పురాణం సూరిశాస్త్రిగారును, "రాధాకృష్ణనాటకమును రచించిన పంతులుగారి కాలములో నివసించుచున్న మనము ధన్యుల"మని నండూరి బంగారయ్యగారును పేర్కొనుట స్మరణీయములు. ఈజాతికిచెందిన నాటకము మరియొకటి తెలుగులో లేదనుట అతిశయోక్తి కాజాలదు.

విజయరాఘవము :

ఇది చాల పెద్దనాటకము. ఇందలి మహావీరులలో ఇంద్రజిత్తుతప్ప తక్కినవారందరును రాముని గొప్పదనమెఱిగినవారే. "ఈవు లోకపిత వని............ నేనెఱుంగుదు"నని రావణుడే చివరకు రామునితో చెప్పుకొనినాడు. నాటకమంతయును రామభక్తిమయమై "జయ జయా ! రామభద్రా ! రామచంద్రా !" మొదలగు వాక్యములతో మారుమ్రోగుచుండును. రాజోద్యోగుల అసమర్థత, పరస్పరాసహనములే రావణునిపతనమునకు కొంతవరకు కారణములని పంతులుగారు చిత్రించినారు; అందుచేత ద్విజిహ్వుడు మొదలగువారికి అనవసరపు ప్రాధాన్యమీయబడెను. ఈ ద్విజిహ్వుడు కవికూడను; అందున ఆధునిక కవియట ! "స్వతంత్ర జీవనోపాధులలోఁగన్నము వేయుట తరువాత గ్రంథకర్తృత్వమే యూరివారి ధనమును హరించుటకుత్తమమైన"దని వాని సిద్ధాంతము !

ఈనాటకమంతయును యుద్ధవర్ణనామయము, దీనిని చిత్రించుటలో పంతులుగారు అపూర్వమైననేర్పునుచూపినారు. యుద్ధమును రంగముమీదచూపరాదనెడి యాలంకారికనియమము నుల్లంఘింపకయే అనగా మొత్తముమీద రంగముపై ప్రదర్శింపకయే యుద్ధభ్రాంతిని పఠితలకును, ప్రేక్షకులకును కల్పించినారు పంతులుగారు. వేణీసంహారమునందు యుద్ధవార్తలుచారునిచే వర్ణింపబడివి; ఆవర్ణనలలో, కేవలము కథాకథనముచేయుచున్న కవియే మనకు గోచరించునే కాని యుద్ధభ్రాంతికలుగదు. పంతులుగారాపద్ధతిని విడిచి యింకొకత్రోవ త్రొక్కినారు. ఒక్కొక్క పాత్రమే రంగస్థలముమీదకువచ్చి జరిగిన, లేదా జరుగబోయెడి వధాదులను సూక్ష్మముగా సూచించి, హెచ్చరికలుచేసి, పాత్రప్రవేశసూచనమునుచేసి వెడలిపోవుచుండును. ఒక్కొక్కప్పుడిరువురు ముప్వురకు రంగముమీదనే వాగ్వాదము, స్వల్పముగా యుద్ధముజరుగుచుండును. ఇట్లు మహావీరులందరును ఒకరితరువాత నింకొకరు రంగముమీదకు వచ్చుచు యుద్ధము మనకండ్ల యెదుటనే జరుగుచున్నదనెడి భ్రాంతిని కల్పించుచుందురు. ఈ పద్ధతిప్రదర్శన యోగ్యమై శ్లాఘనీయముగానున్నది. యుద్ధమునింత హృదయంగమముగా చిత్రించిన నాటకమింకొకటి లేదనియే చెప్పవచ్చును.

విప్రనారాయణ :

ఇందు ప్రధానపాత్రములు మూడు—శ్రీనివాసుడు, దేవదేవి, విప్రనారాయణుడు, దేవదేవి తనలో తలపోసికొన్నట్లుగా విప్రనారాయణుడు "బహునిష్కల్మష హృదయుడు. బహుభూతదయాయుక్తుడు. స్త్రీపురుషభేదమే యిప్పటి కెఱుగని మహామహుడు." కాని వీనిలోను కొన్ని

దోషములు లేకపోలేదు—స్వల్పస్తుతిప్రియత్వము, అత్యమాయికత మొదలగువాని వలన నాతడు రంగభక్తినుండి దిగజారుట జరిగినది. కాని, వాని భక్తియొక్క శక్తియెట్టిదనగా దురుద్దేశముతో కౌగలించుకొనిన దేవదేవియొడలాపాదమస్తకము భగ్గు భగ్గున నిప్పులతో గాల్చినట్లు మండి పోయెను. పంతులుగారు కొన్ని పాత్రములను తామందులో లీనమైపోయి రచించినట్లుగా కనప్టుదురు. రామాయాణ నాటకములలో ఆంజనేయునిలో లీనమై రామభక్తిని, రాధాకృష్ణలో రాధగానైపోయి కృష్ణభక్తిని ప్రపంచమునకు చాటినారు. ఇంక ఈ విప్రనారాయణలో దివ్య ప్రబంధానుసంధానపరైకచిత్తుడైన వైష్ణవభక్తుడై రంగభక్తిని ప్రకటించుకొన్నారు. అసలు, వారే నాటకమును వ్రాసినను అంతియే. ఇందలి సంభాషణములు కొన్నిచోట్లదీర్ఘములై విసుగుకలిగించు చున్నను మొత్తముమీద చాలశక్తిమంతములై చురుకుగా సాగిపోయినవి (సంభాషణములలోని యీ చురుకుదనము 'కోకిల' నాటకమునందును అధికమే). ఈ గుణము ముఖ్యముగా దేవదేవీ శ్రీనివాసుల సంభాషణములలో కానవచ్చును. తెలుగుదేశమున విప్రనారాయణగాథకు ప్రసిద్ధి తెచ్చినది పంతులుగారి యీనాటకమే.

### కంఠాభరణము :

పంతులుగారి హాస్యరసప్రవృత్తికి ఈ నాటకరచన పరాకాష్ఠ. కన్యాశుల్కముతరువాత, సాంఘికములలో అంతగా ప్రసిద్ధికివచ్చినదిదియే. ఇది ఆంగ్లములోని 'ఫార్సు' అనుజాతికి చెందిన రచన; ఇందు హాస్యమేప్రధానము. ప్రస్తావనలో కూచినరసింహముగారు చెప్పినట్లుగా హాస్యము వలని రెండు ప్రయోజనములున్నవి— 1. దుఃఖితుల మనస్సులోని బాధను గూడ మరపించి నవ్వించుట; 2. పరమదుష్టులకును నీతినికరపుట. ఈరెండు ప్రయోజనములును ఇందు సాధింప పడినవి. వ్యభిచారశీలురై, లోకము తమసుఖానుభూతికొరకేయని తలచెడి విలాసపురుషుల హాస్యాస్పద జీవితము కృష్ణారావులో చక్కగాచిత్రమైనది. అశ్లేశుద్ధఛాందసుడగు సోమావధాని, లుబ్ధాగ్రేసరుడగు సుబ్బిసెట్టి, మదపుపిచ్చియెక్కిన పండితుడు పిచ్చిరామశాస్త్రి, గ్రుడ్డిదర్బారు నవాబుగారు—ఈ పాత్రలన్నియును మంచిశక్తిమంతములుగా చిత్రములైనవి. ఇందులో పిచ్చిరామ శాస్త్రి, సోమావధానులు మొదలగువారికి సంబంధించిన శాబ్దికహాస్యమే కాక సన్నివేశముల కూర్పులోకూడ హాస్యము చక్కగాపరిపోషితమైనది. సుబ్బిసెట్టి షష్టిపూర్త్యుత్సవము, భట్రాజుల ఆశుకవిత్వము, సుబ్బలక్ష్మిరామశాస్త్రిల అపూర్వసమావేశము, విటశేఖరుడైన కృష్ణారావు మనః పరిణామము, నవాబుగారి గ్రుడ్డిదర్బారు...ఇవియన్నియును నవ్వనని పంతముపట్టినవారిని గూడ మనసారనవ్వించును.

## మరికొందరు నాటకకర్తలు : వారినాటకములు

రాజమహేంద్రవర హిందూనాటకసమాజ సభ్యులు ప్రదర్శించిన ప్రథమనాటకము తోలేటి వేంకటసుబ్బారావు (1875–1940) గారి 'హరిశ్చంద్ర' (8–6–1889 తేదీన). సామాజికులు పద్యములు పాడలేనివారగుటచేత వీరు దీనిని కేవలము వచనముగానే రచించుట గమనార్హము. ఈ సమాజ సభ్యులాకాలములో ప్రదర్శించిన మరికొన్ని నాటకములు—చిలుకూరి లక్ష్మీ

నరసింహారావుగారి ద్రౌపదీవస్త్రాపహరణము; ముడుంబై రామానుజాచార్యులుగారి పాండవాశ్వమేధము; మరియొకరి సారంగధర. ఇవి యన్నియును ప్రదర్శనయోగ్యములైన నాటకములని చిలమర్తివారు స్వీయచరిత్రలో పేర్కొనియున్నారు.

**శ్రీ సుసర్ల అనంతరావు:**

వీరు శ్రీ వావిలాలవారి శిష్యులు. 1884 ప్రాంతముల వడ్డాదివారితో కలిసి వేణీసంహారమున దుర్యోధనపాత్రధారణ చేసియున్నారు. అటుపిమ్మట మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో ఆంధ్రపండితులైనారు. వీరి 'పాండవాజ్ఞాతవాసము' 1887 లో ప్రకటితమైనది. ఇది గద్య-పద్యాత్మకమైన స్వతంత్రనాటము. వీరు నటులై, రంగస్థలానుభవము గడించి, నాటక రచనచేసియున్నారు. వీరి ముద్రారాక్షసానువాదము 1990 లో ప్రకటింపబడెను.

**శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (1873-1951):**

దేశభక్తులుగా, సంఘసంస్కారులుగా, నాటకసమాజస్థాపకులుగా, నటులుగా, నాటక కర్తలుగా సుప్రసిద్ధులు రామశాచంద్రశ్త్రిగారు. 1895లో విశాఖపట్టణమున "కళాభిలాషక నాటక సమాజము"ను స్థాపించి, విజయవంతముగా నడిపించినారు. పడుపువృత్తిమానిన స్త్రీలకొరకు "సంగీతమానినీ సమాజము"ను స్థాపించి నడిపినారు. వీరు ధరించిన పాత్రలలో కృష్ణుడు, ధర్మరాజు, అర్జునుడు మున్నగునవి ముఖ్యములు. శాస్త్రిగారు నటులేకాక మంచిదేశికులు కూడను. ఎట్టి మొద్దునైనను, చక్కని నటునిగా తయారుచేసెడిశక్తి వీరికుండెడిదట. వీరు మొత్తము ముప్పదివరకు నాటకములను వ్రాసినట్లు తెలియుచున్నది. ఇందులోకొన్ని అసంపూర్ణములుకూడనున్నవి.[1] ముద్రితములైనవి చాల తక్కువ; వానిలో బిల్హణీయము (రచన-1902; సవరించిన రెండవకూర్పు-1913), పారిజాతాపహరణము (రచన-1902; సవరించిన కూర్పు-1914) అనునవి సురభినాటక సమాజమువారికొరకు వ్రాయబడిన నాటకములు. ఈ నాటకముల రచనలో తప్పక చెప్పదగిన విశేషములులేవు; కాని, పాటలతోను, పద్యములతోను కూడినవై ప్రదర్శన సౌలభ్యముకలిగిన నాటకములివియని మాత్రము చెప్పక తప్పదు.

"కళాభిలాషక కావ్యమాలిక", 'కవితాసుమతి' మున్నగువాని మూలమున తెలుగునాట సాహిత్యము'ను ఒక ఉద్యమముగా నడపిన ప్రథములు శాస్త్రిగారేయని చెప్పవచ్చును.

**శ్రీ కోపల్లి వేంకటరమణారావు:**

వీరు 1897 లో రాజమండ్రిలో పట్టభద్రులైనారు. 1885 ప్రాంతముల 'శ్రీరామవిజయ' 'రుక్మిణీ పరిణయము' లనెడి స్వతంత్రనాటకములను రచించి ప్రకటించినారు. వీరు బాల్యము నుండియు కాకినాడ నాటకసమాజమున సభ్యులు; వారికొరకే వీనినిరచించినారు. రచింపబడినప్పటి నుండియు వీనిని అనేక నాటకసమాజములవారు ప్రదర్శించియున్నారు. వీరి సీతాపరిణయము 1892 ప్రాంతముల ప్రకటింపబడినది.

**శ్రీ వల్లూరి బాపిరాజు:**

వీరు వీరేశలింగంపంతులుగారి సహచరులలో నొకరు. సంఘసంస్కారాభిలాషతో 1897 లో 'సాగరిక' అనెడి నాటకమును రచించిరి. ఇతివృత్తము విధవావివాహామునకు సంబం

ధించినది. ప్రగతిశీలుడగు నొక యువకుడిందు నాయకుడు. నాటకమునకు సంతరించిన యుపోద్ఘాతములో బాపిరాజుగారు తమ యాశయములను వివరించియున్నారు. బాపిరాజుగారి ఇంకొక నాటకము 'సుగుణమణి' (1909). ఇది గద్యపద్యాత్మకమైన కాల్పనికనాటకము. ప్రేమికు లిరువురు, తల్లిదండ్రు లిష్టపడనికారణముగా, ఆత్మహత్య చేసికొందురు.

## శ్రీ సి. యస్. ఆర్. కృష్ణమ్మ :

వీరు బారిష్టరు. షేక్స్పియర్ 'మాక్బెత్' ను పూర్తిగా వచనముగా అనువదించిరి (1895). పేర్లలోకాని, స్థలములలోకాని ఎట్టి మార్పులను చేయలేదు. Lady Macbeth అనుటకు 'మాక్బెత్ దేవి'–ఈవిధముగా అనువాదము జరిగినది. శైలి సంస్కృతపదభూయిష్ఠము.

## శ్రీ దాసు శ్రీరామకవి (1864-1908):

'దేవీభాగవతము' నాంధ్రీకరించి తెలుగుసాహిత్యములో స్థిరస్థానమును సంపాదించు కొన్నవారు దాసు శ్రీరాములుగారు. వీరు తమ 14 వ ఏటనే 'సాత్రాజితీవిలాస' మనెడి యక్షగానమును రచించిరి. అటుపిమ్మట అభిజ్ఞానశాకుంతల–రత్నావళీ–మాలతీమాధవ–ఉత్తరరామ చరితాది పెక్కు సంస్కృతనాటకముల నాంధ్రీకరించిరి. వీరు శాకుంతల–ముద్రారాక్షసములను కేవలము అచ్చ తెలుగులోనికి చక్కగా అనువదించిరి (1898). మనోలక్ష్మీవిలాస–మంజరీ మధుకరీయాది స్వతంత్ర నాటకములను రచించిరి. వీరి 'తెలుగునాడు' అనెడి కావ్యఖండ మానాడు చాల ప్రచారమందినది. సంగీత–అభినయశాస్త్రములలో నారితేరినవారై కృతులను, జావళీలనుకూడ రచించియున్నారు. వీరి కుమారులు నారాయణరావుగారుకూడ సంగీత సాహిత్యములందు నిపుణులై సారంగధర, పాదుక, హరిశ్చంద్ర మొదలగు నాటకములను రచించి, తాము మేనేజరుగానున్న బందరు దేశీయ నాటకసమాజమువారిచే ప్రదర్శింపజేసిరి. వీరు కొంతకాలము కృష్ణాపత్రికకు సంపాదకులుగాకూడ పనిచేసి 1905 లో చనిపోయిరి.

## కాళ్ళకూరి సాంబశివరావు (1870-1916) :

'రంగరాయకదనసమవకార' మనుపేర బొబ్బిలియుద్ధకథను నాటకీకరించిన ప్రథములు వీరు (1899). 'ఈ కథాసరణి కొంచెమించుమించుగా సమవకారలక్షణమును పోలిన హేతువుచేత సాధ్యమైనంతవరకు దానిననుసరించినాడనని చెప్పుకొనినారు. కథ నేరికొనుటలో, పేరుపెట్టుటలో, నిర్వహణములో క్రొత్తదారి చూపినారు సాంబశివరావుగారు, రచనమాత్రము ప్రబంధశైలిలో నడచినది. రాజమండ్రి, బందరు మొదలగు పట్టణములలో పెక్కుసమాజముల వారు దీనిని ప్రదర్శించెడివారు. సాంబశివరావుగారు 'కన్యకాపరమేశ్వరీవిలాస' 11908) మనెడి వైశ్యపురాణోక్తగాథను ప్రకరణరూపముగా రచించియున్నారు; ఇందు పాటలుకూడకలవు.

## శ్రీ. పి, శ్రీనివాసాచార్యులు :

1897 లో వెలువడిన వీరి 'శివాజీ' నాటకము (ఐదంకములు) తొలి చారిత్రకరూపము లలో చాల విశిష్టమైనవి. షేక్స్పియర్ నాటకములు వీరికి ఒరవడి. ప్రసిద్ధమైన శివాజీకథయందు నాటకీయమైన మార్పులను చేసికొన్నారు. వీరి ఇంకొక స్వతంత్రరూపకము 'కనకాంగి'.

## శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులు :[2]

దృశ్యప్రబంధములై యుండియు, శ్రవ్యప్రబంధములుగానే పండితోత్తములుసైత మనేక శతాబ్దములుగా వినియోగించుచున్న సంస్కృతనాటకములను దృశ్యప్రబంధములుగాఁ జేయ నుద్యమించి 'ది మద్రాసు ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ' అను నాటకసమాజమును 1879-80 ప్రాంతముల మద్రాసులో స్థాపించినవారు గోమఠం శ్రీనివాసాచార్యులుగారు. 1880 నవంబరులో నాటి గవర్నరు, విజయనగరం మహారాజా శ్రీ ఆనందగజపతి ప్రభృతుల యెదుట సంస్కృతనాటక ప్రదర్శనములో దుష్యంతపాత్రను ధరించి, చక్కగా నిర్వహించి, 'ది ఇండియన్ గారిక్' అను బిరుదును, 'చెన్నపురి రాజధానిలో నాటకప్రయోగ పితామహు'డను ఖ్యాతియును పొందినవారీ శ్రీనివాసాచార్యులుగారు (చూ. వారి కమలాపహరణము). శ్రీ ఆనంద గజపతి మహారాజావారి ఆదరణమునుపొంది, విజయనగరమువచ్చిరి, అచ్చటి 'జగన్నాథవిలాసినీ సభ'కు నేతృత్వమునువహించి, పెక్కుసార్లు భూమికాధారణముచేసినారు. విజయనగరములో గురజాడ అప్పారావుగారును, వీరును సన్నిహితమిత్రులైనారు. ఒకరి ప్రభావ మింకొకరిమీద నున్నది. 'కన్యాశుల్కము'ను శ్రీనివాసాచార్యులుగారేవ్రాసి గురజాడవారి పేరుపెట్టినారేమోయని లోకులను భ్రమింపజేసినది వారిరువురిమైత్రియును.

శ్రీనివాసాచార్యులవారు మహానటులేకాక, నాటకకర్తలుకూడను. వారివి మూడు నాటకములు ముద్రితములైనవి. 1. Harischandra, the Martyr to Truth (ఇది ఆంగ్లమునరచింపబడిన నాటకము); 2. కమలాపహరణము; 3. ఇంక మూడవదానిపేరు తెలియదు; అసంపూర్ణము. గురజాడవారి కన్యాశుల్కమును వీరి ఆంగ్లహరిశ్చంద్రనాటకమును, ఇంచుమించుగా ఒకే కాలములో రచింపబడినవి. ఒకేకాలములో జగన్నాథవిలాసినీసభవారిచేత తొలి ప్రదర్శనములందినవి (1892-93); ఒకేసారి ప్రథమముద్రణములను పడసినవి (1897). గురజాడవారు దీనికి ఆంగ్లమున నొక ఉపోద్ఘాతమును సంతరించియున్నారు. ఈ ఆంగ్ల హరిశ్చంద్రకు ఈ నాటకమున మూడంకములును, అందు మరల పెక్కు రంగములును కలవు. ఆచార్యులవారీ రచనలో అచ్చటచ్చట సంస్కృతపదములనట్లే వాడియున్నారు, తగిన ఆంగ్ల పర్యాయపదములు లేకపోవుటచేత. సంగీతము విషయములో వీరొక క్రొత్తపద్ధతి నవలంబించినారు. అనగా ఆంగ్లేయపద్ధతిలో రచింపబడిన గేయములకు భారతీయ సంగీతమును మేళవించుట. ఈమార్పు విజయవంతమై అందరి మెప్పుదలను పొందనదని వారు పీఠికలో తెలుపుకొనియున్నారు. ఈ నాటకము విజయవంతముగా పెక్కు ప్రదర్శనములనుపొంది, ఆంగ్లేయుల ప్రశంసలనుకూడ నందుకొన్నది. ఇంకొకవిశేషము, ఇందు హరిశ్చంద్ర భూమికను ఆచార్యులవారే ధరించెడివారు. వారి నటన నాటి మద్రాసు గవర్నరు లార్డు వెన్లక్ ప్రశంసకు పాత్రమైనది. పరభాషలో నాటకములనువ్రాసి, ఆడించి, మెప్పుపొందినవారు శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ కవి; ఇంక ఆచార్యులవారు స్వయముగా ప్రధానభూమికలనుగూడ ధరించి మెప్పుపొందియున్నారు[3].

కమలాపహరణము పదియంకముల తెలుగునాటకము. మద్రాసువచ్చి ప్రదర్శనము లొసంగిన పార్శీ నాటకసమాజమువారు 'గులేబకావలి' అనెడి హిందూస్థానీ నాటకము నొక

దానిని ప్రదర్శించిరి. అది వారి ప్రదర్శనములలో ఉత్తమోత్తమమైనదట. ఆ కథను స్వీకరించి, తెలుగులో నాటకముగా వ్రాయవలెనని ఆచార్యులవారి కోరిక. అది చిరకాలమునకుకాని సఫలమైనట్లు కన్పట్టదు. రచన ఎప్పుడో తెలియదుకాని, ప్రథమ ముద్రణముమాత్రము 1919 లో జరిగినది. ఇందు బహుభార్యాత్వము వలన కలిగెడి దొసగులు నిరూపితములైనవి. కథ మంగళాంతమేయైనది. ఆచార్యులవారిందు చక్కని కీర్తనలను వ్రాసియున్నారు.

అసంపూర్ణ నాటకము—ఇందు మూడు అంకములుమాత్రమే లభించినవి; ఆభాగము 1955 లో జూలై-అగస్టునెలలలో ఆంధ్రదినపత్రికలో ప్రకటితమైనది. ఇది కల్పితకథ; వ్యావహారికభాషలో వ్రాయబడినది. ఇందలి నాయిక మైథిలి, 15 ఏండ్ల కన్య; అమె సరస్వతీదేవి అపరావతారముగా వర్ణితమైనది. నాయకుడగు రామచంద్రరావు 24 సంవత్సరముల వయస్సువాడు; బారిష్టరై వృత్తిలో మంచిపేరు సంపాదించినవాడు; ఇరువురికిని వివాహము నిశ్చయము కాబోవుచున్న సమయములో వ్రాత ఆగిపోయినట్లు కన్పట్టుచున్నది. ప్రతినాయకులిరువురు కలరు. కథ దుఃఖాంతమైయుండునేమోయని యూహించుచున్నాను. రచన ఎప్పుడో తెలియదు.

మదరాసు కల్యాణరామయ్యరు శాకుంతలనాటక ప్రదర్శనము చూచినతరువాత అప్పారావుగారు తమ డైరీలో వ్రాసికొన్న వాక్యాలు గమనింపదగినవి—'విజయనగరం జట్టు నాటకములలో అభినయం యింతకంటె బాగున్నది. బుచ్చిశాస్త్రి కంపెనీవారు కల్యాణరామయ్యరు జట్టుకంటె అన్నివిధాలా ఎన్నోరెట్లు మెరుగు. అయితే, వారికి శ్రీనివాసాచారి తరిఫీదువుందని చెప్పకతప్పదు' (గురజాడ రచనలు-3 వ సంపుటము-పుటలు 69-70).

## ధర్మవరం రామకృష్ణమాచార్యులు

1. జననము — పరీధావి సంవత్సర (1853) కార్తీకశుద్ధ ఏకాదశి. (తాడిపత్రి తాలూకా ధర్మవరములో)

ఇంటిపేరు కొమాండూరువారు; పూర్వులగ్రామము 'ధర్మవరము'. రామకృష్ణమాచార్యులవారి తండ్రి (వీరిపేరును కృష్ణమాచార్యులే) బళ్ళారి వార్డ్లాకాలేజీలో ఆంధ్రోపాధ్యాయులేకాక వైద్యులు కూడను. అందుచే వీరిని 'వైద్యం ధర్మవరం కొమాండూరు కృష్ణమాచార్యులు'గారు అనెడివారు. క్రమముగా 'ధర్మవరము' అనునదే ఇంటిపేరుగా స్థిరపడిపోయినది. చిన్నప్పటినుండియు కుశాగ్రబుద్ధిఅయిన మన రామకృష్ణమాచార్యులుగారు అవధానమునందు, వైద్యమునందు, జ్యోతిషమునందు, తెలుగు-కన్నడ-సంస్కృత భాషలయందు నైపుణ్యమును సంపాదించిరి. 1874 లో వస్తుగ్రేడు ప్లీడరు అయి న్యాయవాది వృత్తిని చేపట్టినారు. ప్రసిద్ధ నాటకకర్త ధర్మవరం గోపాలాచార్యులుగారు వీరి పెద్దతమ్ముడు; మహానటుడు బళ్ళారి రాఘవాచార్యులుగారు వీరి మేనల్లుడు.

ఆయాదు సబ్ మేజిస్ట్రేటు కోర్టులో వాదించుటకువెళ్ళి, వాదన సాగుచుండగనే కాలుజారి. 'హా రామచంద్రా'యనుచు 30-11-1912తేదీన ప్రాణములువీడినారు. ఆచార్యులుగారు దశరథపాత్రనుధరింపగా వారిప్రక్కను శ్రీరామునిపాత్ర చిరకాలము ధరించిన పడాల శ్రీరాముడు

గారే నాడచ్చట మేజస్ట్రేటు. వారే ఆచార్యులవారికి మరణసమయములో ఉపచారములు సల్పిరి. 'వినాదైన్యేనజీవనం, అనాయాసేన మరణం' అన్నవి చేకూరిన ధన్యజీవి కృష్ణమాచార్యులుగారు. కృష్ణమాచార్యులుగారి నాటకములనుగూర్చి డా. డి. వి. అవధానిగారు చాలకాలము క్రిందట ఒక పరిశోధనావ్యాసమును వ్రాసిరి. ('ఆంధ్రనాటకపితామహుడు'—ముద్రణము-1964). ఆ మధ్య 'పరిశోధన' పత్రికాధిపతులు ఆంధ్రనాటక పితామహుని సంస్మరణసంచికను ప్రత్యేకముగా ప్రకటించిరి (డిసెంబరు-జనవరి—1955).

2. ఈ అపవాదునుగూర్చి ఆచార్యులవారు చిత్రనళీయ ప్రస్తావనలో ఇరువురు పౌరుల సంవాద రూపమున చర్చించుటయేకాక, ప్రథమముద్రణ పీఠికలో ఆ యీ విషయములను విపులముగా వివరించియుండిరి (నేటి చిత్రనళీయ ముద్రణ పీఠికలలో అది కన్పట్టుటలేదు).

3. చూ. ఆచార్యులవారి 'చిత్రనళీయ ప్రథమముద్రణ పీఠిక' (1894).

4. పాదుకాపట్టాభిషేక ప్రదర్శనమునుగూర్చిన కరపత్రములో 'No eye is kept dry' అని సభవారు సవాలుచేసెడివారట. ఆ సవాలు నంగీకరించివచ్చి, రంగమండలమున బింకముగా కూర్చున్న వారుకూడ దశరథమరణఘట్టములో మాత్రము ఆచార్యులవారి వాచిక-ఆంగిక అభినయము అనుభవమునకు వచ్చినప్పుడు వారింక దుఃఖము నాపుకొనజాలకపోయెడివారట. ఆ ఘట్టములో ఆచార్యులవారి అభినయము అత్యంత సహజముగా నుండెడిదనియు, మృతుడైనట్లు పడిపోయి నప్పుడు, ఆచార్యులవారు నిజముగానే చనిపోయినారని తలంచి కొందరు మిత్రులు దుఃఖించుట జరిగినదనియు తెలియుచున్నది (చూ. వేదంవారి 'భారతా భారతరూపకమర్యాదలు'—పుట-53).

5. తాము అనుకొన్నట్లుగా నటులు నటింప సమర్థులైనప్పుడే ఆచార్యులుగారు ప్రదర్శనమునకు పూనుకొనెడివారు. లేనిచో ఎంతకాలమైనను ఓపికతో శిక్షణ నొసంగెడివారు. ఒకసారి పాదుకలో మంథరవేషము వేయువానిని సిద్ధముచేయుటకు మూడునెలలు పట్టినదట. ముక్తావళి నాటకములో నాయికాభూమికాధారికి ఒక దీర్ఘ వచనము నేర్పుటకు రెండునెలలు పట్టినదట. ఒక్కొక్కసారి ఒకేపాత్రను అభినయించుటలో పోటీలుపెట్టి సమర్థుని యెన్నుకొనెడివారట. ఆచార్యులవారి యీ తీవ్రశిక్షణావిధానమునకు తట్టుకొనలేక కొందరు సరసవినోదినీ సభను విడిచిపెట్టివేసినట్లు తెలియుచున్నది. అట్టివారిలో బళ్ళారి రాఘవాచార్యులుగారొకరట. అట్టివారెల్లరునుచేరి పోటీ నాటకసమాజమునొకటి స్థాపించిరి; అదియే 'సుమనోరమ' సభ.

6. ఆచార్యులగారి తమ్ములు ముప్పురునుకూడ న్యాయవాదులే. చిన్నతనములోనే తండ్రి చనిపోవుట చేత ఆచార్యులవారే వీరినెల్లపెంచి పెద్దవారినిచేసినారు. పెద్దతమ్ములు గోపాలాచార్యులుగారు నటులేకాక (ఆడవేషములుకూడ వేసినారు) సుప్రసిద్ధ నాటకకర్తలుకూడను. మూడవ తమ్ములు వేంకట కృష్ణమాచార్యులుగారు ఆచార్యులవారి తరువాత నాయకపాత్రధారులైనారు; వారిది నిండైన విగ్రహము, కమ్మగా పాడెడివారు. ఆచార్యులవారికంటె పెద్దవారును, వీరి బావగారును అయిన తాడిపత్రి నరసింహాచార్యులు (రాఘవాచార్యులుగారి తండ్రి)గారు సరసవినోదినీసభకు 'ప్రాంప్టర్'గా నుండెడివారు. రాఘవాచార్యులుగారుకూడ ఒకటిరెండు సంవత్సరములిందే యుండిరి.

7. శ్రీ కప్పుగల్లు భీమసేనరావు అనువారావిధముగా పెక్కు నాటకములకు విలేకరులైనారు. వీరు 'సరసవినోదిని'కి 'ప్రాంప్టర్'గాకూడ నుండెడివారు; ఆచార్యులవారికి అత్యంత సన్నిహితులు. వీరి కుమారులు కప్పుగల్లు సంజీవమూర్తిరావుగారు ఆచార్యులవారినిగూర్చి అనేక వ్యాసములు

వ్రాసియున్నారు. నేను బళ్ళారి వెళ్ళినప్పుడు వీరును, ఆచార్యులవారి కుమారులు రంగాచార్యుల వారును అనేక విషయములను దయతో నా కెరింగించిరి.

8. ఇట్లు చేయుటవలన ఒక దోసగుసంభవించుట యనివార్యము "పూర్వోత్తర సందర్భములు, ఆయా పాత్రముల పరస్పరసంబంధము, రసభావములధార—ఇత్యాదులు మనస్సులో జీవంతములై యున్నప్పుడు వ్రాసిన పద్యములకును తరువాత నెపుడో యభిప్రాయము మనస్సులో నుంచుకొని కూర్చిన పద్యములకును భేదముండదా? మొదటివి కథాప్రవాహముతోఁ జేరినట్లుండును. రెండవవి అందదుకులుగా నుండును."

—శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ—"నాటకోపన్యాసములు" (1935)—పుట. 72.

9. అటుపిమ్మట ప్రతి వేసవినెలవులలోను మద్రాసులో ప్రదర్శనములొసంగుట కారంభించిరి. ఈ ప్రదర్శనముల ప్రభావముచేతనే మద్రాసులో 1-7-1891 తేదీన సుగుణవిలాససభ స్థాపింపబడుటయు రావుబహదూర్ సంబందం మొదలియార్ 97 నాటకములను రచించి ఆధునిక తమిళ నాటక పితామహుడగుటయు జరిగెను. (చూ. పరిశోధన—డిసెంబరు,జనవరి-1955-సంబందం మొదలియారుగారి వ్యాసము—'గురుదేవుడు').

10. ఈ సన్మానపత్రమును సమర్పించినవారిలో శ్రీయుతులు పి. చంచలరావు, పి. ఆనందాచార్యులు, పిఠాపురం కుమారరాజా, డా. గస్టవ్ఆపర్ట్ ప్రభృతులుకలరు. చూ "Standard"—(27-7-1907).

11. "........నా యితర నాటకములు ముద్రితములు కాకుండినను దేశదేశములనున్నవారు నా అనుమతిమీఁద వ్రాతప్రతులు తెప్పించుకొనియున్నారు. ఈ మూలమున నాటకసంవిధానముల సంభాషణములఁ బలుపురెఱుంగుట కాస్పదమయ్యె. దానివలన నాకేమియు లోపముకలుగక పోయినను, నా నాటకములనున్న కొన్ని సంవిధానాదివిధానముల నితరకవివర్యుల వలనఁబ్రచురితములైన నాటకముల నే చూచినప్పుడు నాకింతచింత వొడముటకాకరమయ్యె. నాకుదోచిన సంవిధానములే యితరులకుఁ దోఁచియుండిన నుండవచ్చును. అందేమియు దోషములేదు. అయిన నాటకములఁ బ్రచురించినప్పుడు నా సంవిధానక్రమమే యితరుల స్వత్వముగా పాఠకులెక్కడ భావింతురోయను శంకవొడముట కాస్పదమయ్యె. కావున నింక నానాటకములఁ బ్రచురించుటకుఁ దడవుసేయుట సముచితముకాదని దోఁచె. సావిత్రీ చిత్రాశ్వము, పాదుకాపట్టాభిషేకము, విషాద సారంగధరము అనునాటకముల ప్రకటింపనుద్యమించి పాటుపడుచున్నాఁడను" (చిత్రనళీయ చతుర్థ ముద్రణపీఠిక—20-6-1908).

"ఈనాటకము లింతవఱకుఁబ్రచురింపఁబడకుండుటకుఁ గారణము లనేకములు.కార్యాంతర ప్రవిష్టుఁడనైనందున నా పని నాకితరకార్యములకెడమియ్యదయ్యె. ఎప్పుడైన నవకాశముకలిగెనా, సరసవినోదినీ సభకై క్రొత్తక్రొత్త నాటకములు రచియించుచు వచ్చితిఁగాని రచియించిన వానిన్నవరించి ప్రచురింపఁ జాలనైతి........" (విషాద సారంగధర ప్రథమముద్రణ పీఠిక).

12. చిత్రనళీయ-విషాద సారంగధరములను ఆచార్యులవారే ప్రకటించినారు. ఇంకసావిత్రీచిత్రాశ్వ-పాదుకాపట్టాభిషేకములనుకూడ ముద్రించుటకు ప్రయత్నించుచున్నానని వారుతెల్పియేయున్నారు. కాగా, ఈనాలుగింటికే ఆచార్యులవారు సవరణప్రతులను (Press copies) సిద్ధముచేసియున్నారు. కావున అందేప్రస్తావనాదులు యథావిధిగా కన్పట్టుచున్నవి. తక్కినకొన్నింటిలో నాందీపద్యములు కూడ లేవు?

13. మూడవ అంకములో రావణుడు సీతనెత్తికొనిపోవుచుండగా వాలిఅడ్డుపడి, అట్టిపని వలదనును. రాముడు శూర్పణఖ ముక్కు చెవులు కోయించుటచేత ప్రతీకారముగా తానీపనికి పూనుకొన్నట్లు రావణుడు చెప్పును. 'అబలనట్లు చేయుటతప్పే' యనుచు రావణుడు సీతను కొనిపోవుటకు వాలి యంగీకరించును.

వాలి : ............మీ మీ కలహములతో నాకేల? రావణా! కొనిపొమ్ము తరుణిని, దుడుకుతనము మాత్రమొనర్పనని మాటయిమ్ము. రాముడు నాయొద్దకేతెంచి తానొనర్చిన క్రూర కార్యమునకు సమాధానమొసంగెనా, నేను నీయొద్దకేతెంచెదను. అప్పుడు నీవే యీతన్వినిగొనివచ్చి అతనికప్పగింపవలసి వచ్చెడు. ఈలో నీవేమైన దుష్కార్య మొనరించి యుంటివా నీలంకనంతయు సముద్రమున పెకలించివైచెద............"

14. కాని చివరి అంకములో విష్ణుభటులకు, యమభటులకు జరిగిన ఘట్టమున మాత్రము భాగవతము లోని పద్యములు మాత్రము కొన్నియథాతథములుగా గ్రహింపబడెను.

15. అజామిళలో 2 వ అంకములోని 2 వ రంగము న్యాయస్థానము. ఇది సరిగా విషాదసారంగ ధరమునందలి న్యాయస్థానరంగమువలెనే యున్నది. ఉద్దండ-సదయు లను న్యాయవాదులలో సదయుడు అజామిళుని పక్షము; ఇతడు ఓడప్రయాణముచేసి వెలికిగురియైన వాడట. విషాద సారంగధరమునందువలె ఇచ్చటను న్యాయపక్షము ఓడిపోయినది. దీనినిబట్టి తెలియకుండ న్యాయస్థానములలో జరిగెడి అన్యాయములను ఎత్తిచూపుటయే ఆచార్యులవారి ఆశయమనియు, తాము న్యాయవాదులగుటచేత తమ ప్రతిభను వ్యక్తముచేసికొనుటకు వారీరంగములను కల్పింప లేదనియు చెప్పవచ్చును.

16. ఈ లక్షణములలో కొన్నిరచనా విధానమునకు సంబంధించియున్నవి; కొన్నిలోపములు; తక్కిన సామాన్యలక్షణములు. ఆచార్యులవారితో సరిసమానముగా బళ్లారిలో నాటకరచనచేసినవారింకొకరు కలరు; వారే కోలాచలం శ్రీనివాసరావుగారు. వారిలోని సామాన్య నాటకలక్షణములనుగూర్చి వివరించునప్పుడు మరల యీ ప్రసక్తి రాగలదు.

17. పాంచాలీస్వయంవర మందలి యువతీవివాహ ప్రశంస; ప్రమీలార్జునీయ మందలి స్త్రీ విద్యా-స్వాతంత్ర్య సంబంధి చర్చ; చంద్రహాసలోని ఉప్పుపన్నుమీది ఉపన్యాసము; అజామిళలోని రజస్వలా వివాహ-సురాపాన నిషేధప్రసంగములు మొదలగునవి యిందులకుదాహరణములు. భారతకథ ననుసరించిన చిరకారి నాటకములో ఆంగ్లపదములు కూడ కలవు (పుట 33).

18. ప్రాచ్య-పాశ్చాత్యులు కథావిషయమున సమప్రాధాన్యమునే చూపువారైనను,భారతీయులు రసపోషణ యందెక్కువ మక్కువజూపగా, పాశ్చాత్యులు పాత్రపోషణయందును, చిత్తవృత్తి నిరూపణ మందును ఎక్కువమక్కువను జూపియున్నారని సాధారణముగా చెప్పుచుందురు. నిజముచెప్ప వలయునన్నచో ఇదియొక పెద్దభేదముకాదు. షేక్స్పియరు మొదలగువారి నాటకములందు పాత్ర పోషణకెట్టి ప్రాధాన్యముకలదో శాకుంతల-మృచ్ఛకటిక-ఉత్తరరామచరిత-ముద్రారాక్షసాదు లందును అట్టిప్రాధాన్యమే కలదు. కావున, రా. అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లు "ప్రాచ్యుల కును, పాశ్చాత్యులకును నాటకరచనలో తత్త్వమునందంతగాభేదములేదు.ఇరువురును ముఖ్యముగా రసోపాసకులే."-నాటకోపన్యాసములు-పు. 59. కాని, వారివారి పరిభాషయందును, నిర్మాణశిల్ప మందును మాత్రము భేదము కలదు. కాని పాశ్చాత్యులు భావసంఘర్షమునకు అధికప్రాధాన్యము నొసంగుదురు. "శకుంతలను పరిగ్రహించుటయా? నిరాకరించుటయా" అని దుష్యంతుడు

సందిగ్ధావస్థలోపడిన ఘట్టమువంటివానియందు కూడ భారతీయులు తద్విపులీకరణమునకు ప్రాధాన్యము నొసంగరు; దానినికూడ సూచనామాత్రముగానే చేయుదురు.

అసలు, ప్రాచ్య-పాశ్చాత్యమతములు రెండింటను 'కథ'కు అధికప్రాముఖ్యముకలదు. రసవంతము కాదగిన ఘట్టము నొకదాని నేరికొని, దానిని ప్రతిభావంతుడైనకవి సంస్కరించుకొని, సన్నివేశముల నేర్పరచుకొని, శిల్పసమ్మతముగా సంవిధానమొనర్చినచో రస-పాత్రపోషణముల కాతడు ప్రత్యేకించి శ్రమింపనక్కరలేదు; వానిఅంతట అవియే సమకూరును. ఇట్లు నిర్మితమైన కథకే 'ఇతివృత్త' మనుపేరు చెల్లునని అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండెను. ఆచార్యులవారు స్వప్రతిభతో పైవిధముగా సంవిధానమొనగూర్చుకొనుటలో సిద్ధహస్తులు.

19. ఇక్కడ ఇంకొకవిషయమును గుర్తుంచుకొనవలయును. ఇంచుమించుగా 1895 వరకును ఆచార్యులవారినాటకములను సరసవినోదినీ సభవారొక్కరే ప్రదర్శించెడివారు; నాటివరకును వారి నాటకముల ప్రభావము సర్కారుజిల్లాలవారిమీద లేదనియే చెప్పవచ్చును. కాగా, కృష్ణమాచారి నాటకయుగము వాస్తవముగా 1900 తో ప్రారంభమగుచున్నది. అప్పటినుండియే దేశము నలుమూలల వారి నాటకప్రదర్శనములు సాగినవి.

## విషాద సారంగధరము

1. భానుమతీ విమలాదిత్యుల పుత్రుడు రాజరాజనరేంద్రుడు; ఇతడు రాజమహేంద్రవరమనుపేర రాజధానిని కట్టించి వేగిదేశమునేలెను. ఆతని పెద్దకొడుకు సారంగధరుడు శాంతమూర్తి; ఇతడు పినతల్లివలన కలిగిన ఆపదనుగడచి చౌరంగియను సిద్ధుడయ్యెను—చూ. కోరాడ రామకృష్ణయ్యగారి 'నావనాథచరిత్ర' పీఠిక.

2. ఇట్లు జరుగుటకు హేతువు దీపాలపిచ్చయ్యశాస్త్రిగారు పేర్కొన్నట్లు "మహాత్ములకథలను, మహాపురుషుల జీవితములను తమతమ అభిజనములకు—అనువగుచో అన్వయములకు—అతుకు పెట్టుకొని యానందించు స్వభావమే" యని చెప్పవచ్చును.—చూ. శాస్త్రిగారి 'సారంగధర చరిత్ర' పీఠిక (1942)—పు. 53.

3. సారంగధరునకు కన్యల నన్వేషించు ప్రయత్నములో రాజు చిత్రాంగిపటమునుచూచి మోహించి, ఖడ్గమునువంపి, వివాహకార్యము నెరవేర్చి, చిత్రాంగిని భార్యగానొనర్చుకొనెననియు, తాను చిత్రమందు చూచినవాడును, రాజును ఒకరుకాకుండుటచేత సందేహించిన చిత్రాంగి చెలికత్తెల వలన నిజమెరింగి తాను మోసగింపబడినట్లు గ్రహించెననియు శంభుదాసుడు కథను మార్చెను. ఆచార్యులవారికథనే స్వీకరించి "ఇందువలన చిత్రాంగి దుర్మోహమునకించుక క్షమాపణకలిగె"నని ప్రథమముద్రణ పీఠికలో తెల్పినారు.

4. చూ. రుద్రాభట్ల ప్రకాశరావుగారి వ్యాసము—"సారంగధరచరిత్ర : గ్రీకు రోమకకథామూలములు"—భారతి—శ్రీముఖవైశాఖము (1932).

హిప్పొలిటస్ గ్రీసుదేశపురాజు మొదటిభార్య కుమారుడు; అందగాడు, నీతిమంతుడు. రాజుగారి రెండవభార్య ఫేద్రా; సవతికుమారునిపై మోహము కలిగి ఆమెతపించుచుండెను. ఇంతలో రాజు కార్యాంతరవ్యాసంగమున దేశాంతరమేగును. ఒకనా డాకస్మికముగా రాజకుమారుడు ఫేద్రా అంతఃపురమునకురాగా రాణి తనకోరిక నెరింగించెను. అదివిని హిప్పొలిటస్ మండిపడి, ఆమెను చంపనెంచి కత్తినెత్తియు, స్త్రీహత్యచేయజాలక ఎత్తినకత్తి నచ్చటనేవిడిచిపోవును.

అంతట ఆమెదాసి తనరాణిని రక్షించుటకై అల్లరిచేసి, కత్తినిచూపి, రాజకుమారునిపై నేరము మోపును. రాజు తిరిగివచ్చి, దాసియు ఫేడ్రాయును పన్నినకుట్రను నమ్మి కుమారుని చంపించును. ఫేడ్రా కత్తిచేబూని దుఃఖముతో ప్రవేశించి, ప్రియునిశవముపైబడి ఏడ్చి, రాజకుమారుడునిర్దోషి యనిచెప్పి, కత్తిపైబడి మరణించును. రాజు దుఃఖముతో మరణమును కోరుకొనును. ఇది సెనీకా రచనలోనికథ. రాజకుమారుడు ఫేడ్రాగృహమున కేలవచ్చెనో సెనీకాతెలుపలేదు.

ఇంక యురిపిడస్ వారిరువును కలిసికొన్నట్లే చెప్పలేదు. రాణి రాయబారమంపును. రాజ కుమారుడు కోపించును. తనకోరిక అవమానముగా పరిణమించుటచేత రాణి ప్రాయోపవేశము చేయపూనెను. కాని దాసితోకలిసి కల్పించి వ్రాసిపెట్టిన ఒక ఉత్తరముమూలమున రాజకుమారుడు రాణిని బలాత్కరించెనని రాజునమ్మి కుమారుని చంపించును. ఇందు నిజమును 'దయానాదేవత' చెప్పును. హిప్పొలిటస్ దుర్మరణమునకు 'వీనస్' దేవత ఆగ్రహముకారణమట; ఆకారణ మననే ఫేడ్రాకు సవతికుమారునిపై మోహముకలిగినదట.

రాజేస్వయముగా మోసముచేయుటయు, సారంగధరుని పావురముల యాటయు తెలుగు లోని కల్పనలు. 'చిత్రాభ్యుదయము' లో కాళ్ళకూరి నారాయణరావుగారు ప్రధానమంత్రికంటె తానెక్కువగా రాజునకు సన్నిహితుడుకావలెననెడి పేరాశతో రెండవమంత్రి మోసముచేసి చిత్రాంగి పెండ్లికావించెననియు, రాజునిర్దోషియనియు కల్పించుట గమనార్హము. అసలీకథ పుక్కిటిపురాణమని వారి సిద్ధాంతము.

5. చూ. "ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—మన్మథ చైత్రము— పుట 45.

6. ఒక ఐతిహ్యము—వేశ్యాగృహమందున్నది తనతల్లియేయని యెరుగని రాజకుమారుడొకడు ఆమెను కవయబోవుచు దారిలో అవుదూడ తోకనుత్రొక్కెను. అది బాధతో తల్లితోచెప్పుకొనెను. "తల్లిని కవయబోవుచున్నవా డింతకంటె ఘనకార్యమేమి చేయునులే" అని గోవు దూడ నోదార్చెను. పశుభాషతెలిసిన రాజకుమారుడు నిజమెరింగెను. ప్రమాదము తప్పెను.

7. కాని, సుదీర్ఘమైన న్యాయవిచారణఘట్టము (తృతీయాంకము) మాత్రము వస్త్వైక్యమునుభంజించు చున్నదనియు, అచ్చట రాజనరేంద్రుడు విషాదరూపక నాయకుడుగా గాక న్యాయమును పాలించు చక్రవర్తిగా దర్శనమిచ్చుచున్నాడనియు కేతవరపు రామకోటిశాస్త్రిగారు అభిప్రాయపడినారు. (చూ. ఆం. సా.ప.ప. మన్మథ చైత్రము—పు. 53). కాని ఆతడప్పటికింకను దుఃఖోపహతుడు కాలేదు. ముద్దులభార్యకు అవమానము జరిగినదను భ్రమలోపడి క్రోధావిష్టుడైనప్పటికిని, న్యాయాన్వేషణబుద్ధితో సహజముగ ధీరోదాత్తుడగు నాతడు ధర్మాసనమందుండి ఓర్పుతో దీర్ఘ విచారణమును చేయించినాడు. కావున, దీనివలన రాజనరేంద్రుని పాత్రపోషణకు క్షతికలిగినదని కాని, ఆతని విషాదనాయకత్వ ముపహతమగుచున్నదని కాని తలంపనక్కరలేదు. అంతియే కాదు, రాజరాజు న్యాయపక్షపాతము, ఆతని విషాదనాయకత్వమునకు మరింతవన్నెపెట్టుచున్నది.

"మరియు నాటకకర్త న్యాయవాదికనుక నీయంశమును చాలపెంచినా" డనుటయును సమంజసముకాదు. ఒక ప్రక్క భార్యకుజరిగిన అవమానము, ఇంకొకప్రక్క ఏకైకపుత్రునిపై దోషారోపణము, మరియొకప్రక్క తనయింటనే ధర్మచ్యుతి జరిగినదను చింత—ఈమూడింటి చేతను సంక్షుభితుడైపోయిన నాయకుని కర్తవ్యతావిమూఢతకు ఈదీర్ఘవిచారణము తార్కాణమని చెప్పవచ్చును. అంతియేకాదు, న్యాయస్థానవిచారణ పద్ధతిలోని దోషమును నిరూపించుటకీయంశము నిట్లు పెంచి వ్రాసెననియు చెప్పవచ్చును. కాని, ఇట్టిదానికి శిల్పదృష్టిలో స్థానములేదు. చివరి

'ఉత్తర రంగము' కూడ నాయకపాత్ర పోషణకు భంజకముగా నున్నదని శాస్త్రిగారు పేర్కొని యున్నారు. కాని, అది నాటకములోని సహజభాగముమాత్రము కాదని మరచిపోరాదు.

8. ఇది విషాదసారంగధర పూర్వముద్రణములందు కూడ ప్రకటితమైనది. తొలితెలుగు నాటక విమర్శకులలో ఆచార్య తణికెళ్ల వీరభద్రుడుగారికి ప్రముఖస్థానమున్నదని చెప్పవచ్చును. (వారు ఆంగ్లసాహిత్యవేత్తలు.)

9. సారంగ ధరునిపాత్ర రూపుకట్టలేదనియు, అతడు క్రియాశూన్యుడుగా నుండెననియు శాస్త్రి గారు విమర్శించియున్నారు. ఈ విమర్శ సమంజసముగా కన్పట్టదు. ఆతనికథాపరిధిలో ఆతడు ఒక విషాదరూపకనాయకు డనుట నిస్సందేహము. పీఠికలో ఆచార్యులవారే చెప్పుకొన్నట్లు తన శ్రేయస్సునుగోరు మిత్రుని హితోపదేశమును పెడచెవినిపెట్టుట యనునదియే సారంగధరునిలోని లోపము. వాని పతనమునకు నిజముగా అదియేబీజము.

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము

1. జననము : ప్రభవ భాద్రపద బహుళచతుర్దశి (26-9-1867). జన్మస్థలము : ఖండవల్లి. విద్యాభ్యాసము : వీరవాసరము, నరసాపురము, రాజమండ్రి. నివాసము : రాజమండ్రి.

తల్లిదండ్రులు : వేంకటరత్నమ్మ, వెంకన్న (ఆరామద్రావిడులు). భార్య-వెంకాయమ్మ (1930 లో మరణించినారు). లక్ష్మీనరసింహంగారి అసలుపేరు 'పున్నయ్య';తరువాత అంతర్వేది దేవునిపేరుపెట్టినారు. రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాలలో 1887 లో మెట్రిక్యులేషన్ పరీక్ష యందుత్తీర్ణులైనారు. జ్ఞానమువచ్చునాటికే వీరికి రేచీకటికలదు. అది క్రమముగా వృద్ధిఅయి, 1910 నాటికి పూర్తిగా అంధత్వమువచ్చినది. అయినను వారు ఉపాధ్యాయులుగాపనిచేసినారు. సొంతపాఠశాలను నడిపినారు; నాటకములువ్రాసి ఆడించినారు; పెక్కువచన-పద్యకావ్యములను, నవలలను రచించినారు; దేశమంతయును తిరిగినారు; అవధానములుచేసినారు; పత్రికలనునడిపి నారు; మహావక్తలుగాపేరుపొందినారు; అనేక ప్రముఖమహాసభల కధ్యక్షులైనారు; సంఘ సంస్కరణకు పాటు పడినారు. 1943 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారి 'కళాప్రపూర్ణ' బిరుదును పడసినారు. 1923 లో వీరి షష్టిపూర్త్యుత్సవము రాజమండ్రిలో పెద్దఎత్తున జరిగినది; ఆసన్మాన సంఘమువారు వీరి రచనలన్నింటిని 10 సంపుటములుగా అచ్చువేసినారు. లక్ష్మీనరసింహముగారు తమస్వీయచరిత్రరచన 18-3-1942 తేదీన ప్రారంభించి, 12-7-1942 తేదీనాటికి పూర్తి చేసినారు.

మరణము : 17-6-1946.

1887 లో జరిగిన విక్టోరియా రాణి పరిపాలనయొక్క సువర్ణోత్సవ సందర్భమున లక్ష్మీ నరసింహముగారు ప్రప్రథమముగా పద్యములువ్రాసిరి. తరువాత గురువుగారైన వేదమువేంకటా చలముగారు బదిలీఅయిన సందర్భములో పద్యములువ్రాసిరి. దానితో వీరు 'కవి'గా ప్రసిద్ధులైరి. వీరికిగల జ్ఞాపకశక్తి అపూర్వమైనది. పద్యమునుకాని, వచనమునుకాని, విషయమునుకాని, విన్నంతనే జ్ఞాపకము పెట్టుకొని తు, చ, తప్పకుండ అప్పగించగలిగెడివారు. అట్టి జ్ఞాపకశక్తి తోనేవారు స్వీయచరిత్రమును వ్రాసినారు. నాటి నాటకరంగ విశేషములను వారి మాటలలోనే వివరించుటకు ప్రయత్నింతును.

2. ఇందు ప్రకాశంపంతులుగారు రెండవయంకములో చిత్రరేఖపాత్రను ధరించి మిక్కిలి యొప్పించి. మూడవయంకమున, నయిదవయంకమున అర్జునపాత్రనుధరించి కన్నులవైకుంఠముగా ప్రదరించెడివారట (చిలకమర్తి వారి స్వీయ చరిత్రము—పుట. 82).

3. "ఇందు 4 వ అంకములో అప్సరసలు ఋష్యశృంగుని తమవలలో వేసికొని, యాశ్రమమునుండి తీసికొనివచ్చిన ఘట్టములో సంభాషణములు చమత్కారముగా, రసవంతముగానున్నవని సమాజ సభ్యులును, ప్రేక్షకులును ప్రశంసించిరి. ఇందులో గర్భవతియైన 'కౌసల్యయావేశ' మనెడిభాగ మొకటికలదు; గర్భములోనున్న శ్రీరాముడు రావణుని దుర్జయమునకురోసి, తనయాగ్రహమును కౌసల్య నోటినుండి వెడలగ్రక్కును. అది కొంత భయంకరముగనుండును. ప్రేక్షకులారంగ మునుకూడ మిక్కిలిగా మెచ్చుకొనుచుండెడివారు. రెండవసారి ఈ నాటకము ప్రదర్శింపబడు నప్పుడు ప్రకాశముపంతులుగారు కౌసల్యపాత్రధరించి ఆ యావేశరంగమును బాగుగా నొప్పించిరి"—స్వీ. చ. పుట-81.

4. మధ్యమవ్యాయోగమందు లక్ష్మీనరసింహముగారొక క్రొత్తపద్ధతి నవలంబించిరి—

"సంస్కృతగ్రంథములలోని కొన్ని శ్లోకములభావము తెలిఁగింపఁబడునప్పుడు వృత్తము లలో నిముడక పెద్దదయి సీసమునకుఁ జిన్నదై యాంధ్రీకరించువానికి గొప్ప మనస్సంకటమును గల్గించుచుండును. తెనిఁగించువాఁడట్టి సమయమున సీసపద్య మెత్తుకొని భావము మొదటి నాల్గు పాదముల నిమిడిపోవుటచేత నెత్తుగీతమునకు భావమభావమవుటచేత నహంభావము కొంతబూని తన సొంత కవిత్వమునుజెప్పియో పదములనవసరముగా దీర్ఘములుజేసియో కవిత్వకన్యను లాగిలాగి యీడ్చియీడ్చి పూర్తిచేయును. అట్టిచిక్కు నాకును సంభవించినది. ఈవఱకు నేను నట్లు చేసినాడను. కాని యిప్పుడట్టిపని సమంజసముగాలేదని తోఁచినందున శ్లోకభావము పెద్దదై నప్పుడు దానిని సీసపద్యములో నిమిడ్చి క్రింద నాటవెలఁదిగాని తేటగీతిగాని చేర్చుటమానితిని. ఇందువల్ల కవిభావము వ్యక్తవఱచుట కెంతపద్య మవసరమో అంతపద్యమే యల్లఁబడుచున్నది. మూలకవి హృదయములోలేని నూతనభావము వచ్చుటకువీలులేదు... ఇందుఁ బండితాభిప్రాయమే ప్రమాణము" (పీఠిక).

ఆధునికులు కొందరు భావము సమాప్తమైపోయినదనుచు పద్యములోని చివరిభాగమును పూర్తిచేయకయే విడిచిపెట్టుచుండుట జరుగుచున్నది. చిలకమర్తివారవలంబించిన పద్ధతి దీనికంటె చాల ఉత్తమమైనది. అనువాదకునకులేని స్వేచ్ఛ సొంతకల్పన చేయువానికి కలదు. భావమైపోయినదని పద్యమును సగములో ఆపివేయుటకంటె కోట్లకొలదిగనున్న వృత్త జాత్యుపజాతులలో భావమునకు తగిన చిన్న ఛందస్సునే ఎన్నుకొనుట సమంజసము. మరి యిందులకు శ్రమపడవలసియున్నది.

5. ఇట్టి అభినవరూపక నిర్మాణము సమంజసమేనా అనెడి పారిపార్శ్వక ప్రశ్నకు సూత్రధారు డొసంగిన సమాధానము గమనార్హము—

"కాళిదాసాది గీర్వాణకవులు దృశ్యకావ్యములఁ దొల్లి స్వకపోలకల్పితముగ
నల్లిరేకాని యేమూలమనుసరించి వారు భాషాంతరమ్ములు పరపిరయ్య?"

6. సీతాకల్యాణ-పారిజాతాపహరణ-ద్రౌపదీపరిణయ-గయోపాఖ్యానములు నాలుగింటిని ముద్రణార్థము ఐదుసంవత్సరములు గుత్తకుతీసికొని ప్రతిఫలముగా వేయిరూపాయలిచ్చుటకు గున్నేశ్వరరావుగారు ఒప్పందముచేసికొనిరి. కాని చివరకు సీతాకల్యాణ-ద్రౌపదీపరిణయములకు బదులు

క్రొత్తగా వ్రాసిన ప్రసన్నయాదవమును తీసికొనుట జరిగినది. పారిజాతాపహరణ-ప్రసన్న యాదవ-గయోపాఖ్యానములు మూడింటి అమ్మకము వలనను వారికి చాల లాభము వచ్చినది.

7. ఆ రోజులలో సమాజములవారికి అధికారుల బెడద ఎక్కువగానుండెడిది. 'ఫ్రీటికెట్ల' కొరకు ఉద్యోగుల భార్యలుకూడ కబురంపసాగిరట. ఇంక శాంతిభద్రతలను కాపాడు నెపముతో పోలీసు లధికసంఖ్యాకులుగా వచ్చి నాటకశాలల నాక్రమించెడివారు. నిజముగా టిక్కెట్లు కొన్న వారు ఖాళీలేక వెడలిపోవలసి వచ్చెడిది. లక్ష్మీనరసింహముగారుమాత్రము ఉద్యోగుల కెన్నడును జడియలేదు, పత్రికలలోవ్రాసి, పెద్దలతో సంప్రదించి పైవారికెల్ల బుద్ధిచెప్పి సమాజమున కెట్టి బెడదయును లేకుండచేసిరి (స్వీ. చ. - పుట 240).

## గయోపాఖ్యానము : ప్రసన్నయాదవము

1. దీనిపై విమర్శలకు, ముఖ్యముగా, క్రింది రచనలను చూడవలెను—
   1. "ఆధునికాంధ్రవికాసవైఖరి"—శ్రీ జయంతి రామయ్యపంతులు (1937-రచన 1934) పుటలు 59-79.
   2. డా. దివాకర్ల వేంకటావధాని—ఆంధ్రపత్రిక "మన్మథ ఉగాదిసంచిక" (1955).
   3. శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి—"చిలకమర్తివారి గయోపాఖ్యానము"—స్రవంతి-నవంబరు 1955.
2. వేల్లంటి సుబ్బయ్యార్యుడు రచించిన గయోపాఖ్యానము 1928 లో బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రణాలయమందు ముద్రితమై గార్ల (నైజాం) లోని శ్రీ వేంకటేశ్వర గ్రంథమండలివారిచే ప్రకటింపబడినది.
3. ఈ నాటకమునుగూర్చి ఆర్. కె. యాజ్ఞిక్‌గారి వాక్యములు గమనార్హములు—

"Here the human element is particularly stressed, although the attitude of reverence for the august figures is retained. Only a student of British drama could have attained the polish and refinement of treatment that this play-wright brings to bear on his material."

—The Indian Theatre (1933) — P. 239.

4. "తెలుగుదేశములో గయోపాఖ్యానమును ప్రదర్శింపని రంగస్థలములేదని చెప్పవచ్చును. కొన్ని స్థలములలో గొందరు పెద్దమనుష్యులు గయోపాఖ్యాన నాటక విషయమై పోటీపరీక్షలుపెట్టి, కృష్ణార్జున పాత్రల పలువురుచేత ధరింపజేసి, వారిలో శ్రేష్ఠముగ నభినయించినవారికి బంగారు పతకములు మొదలైన బహుమతు లిచ్చుచు వచ్చిరి. గయోపాఖ్యాన మచ్చుపడివచ్చిన వెంటనే గున్నేశ్వరరావుగారు, నాగేశ్వరరావుగారు విడిపోకయున్న కాలమున రాజమహేంద్రవరములో మొదటిసారి ప్రయోగించిరి. దానిని చూచుటకు పడమటి గోదావరి జిల్లాలోని చేబ్రోలు, తాడేపల్లిగూడెము ప్రాంతములనుండికూడ జనులు వచ్చిరట. ఆనాడు నాటకప్రదర్శనమువల్ల పదునాలుగువందలరూపాయలు వచ్చెను. ఆ నాటకమునందు జనులకంత యభిరుచి యేలకలిగెనో? నేనే చెప్పజాలను..." అని లక్ష్మీనరసింహముగారు వ్రాసికొనియుండుట గమనింపదగినది. (స్వీ. చ. పు. 290-291).

5. ఇందలి ప్రధానపాత్రములు ముప్వురు; ఆ ముప్వురిలోను దోషములున్నవి. ఈశ్వరుని మాటలలో చెప్పవలెనన్నచో — "ధరఁగలవారిఁ జూడకయె తానుమియన్ గయుతప్పు; చూడ కింకరత నొనర్చువాని నటకం గమకించుట నీది (కృష్ణుని) తప్పు; తా నరయకముందుగా శరణమాతని కిచ్చుట పార్థతప్పు..." కాగా కథలో ఈ మూడుఘట్టములును లోపభూయిష్ఠములే. అయినను కవి స్వీయప్రతిభచే కథాగతిని చక్కగా మలచుకొని పై దోషములను స్థూలదృష్టికి కన్పట్టకుండ చేసి, చివరమాత్రము తానుచేసిన మాయను ఈశ్వరుని నోటితో చెప్పించివేసినారు.

6. కాని, యుద్ధము ప్రారంభమగు వరకును ఆ రెండు పాత్రములును సహజమగు సుదాత్తతను కోలుపోలేదని మరవరాదు. ఇచ్చట ఇంకొకవిషయమునుకూడ గుర్తుంచుకొనవలసియున్నది. ఇప్పుడు మనము అనౌచిత్యములుగా, పాత్రయొక్క ఉదాత్తతకు భంజకములుగా పరిగణించు చున్న పద్యములేవియును తొలిప్రాతలోలేవు; అది కేవలము వచననాటకమే. నాదెండ్ల గోప మంత్రి తన ద్విపదకావ్యమునకు "శ్రీకృష్ణార్జున సంవాద"మని పేరుపెట్టినను, అందు కృష్ణార్జును లకు సంవాదమే జరుగలేదు: రామామాత్యాదులే దీనిని కల్పించినారు. అందుకూడ ద్వంద్వ యుద్ధము కొంత జరిగిన పిమ్మటనే వారిమధ్య కొంత వాగ్వివాదము జరిగినట్లున్నది. ఇంక లక్ష్మీనరసింహముగారు యుద్ధారంభమునకుముందే కృష్ణాదులు పాండవులను చూడవచ్చినట్లును, అప్పుడు కృష్ణార్జునులకు సంవాదము జరిగినట్లును మార్పుచేసినారు. అసలు వీరు గోపమంత్రిని, ఈ పట్టున అనుసరించియున్నచో ఈదోషముకూడ ఈ నాటకమునకు పట్టెడిదికాదు.

7. గయోపాఖ్యానమునందు నాందీ భరతవాక్యములతో కలుపుకొని మొత్తము 208 పద్యములున్న వని రామకోటిశాస్త్రిగారు లెక్కవేసి తేల్చినారు. ఇందులో కొన్ని అస్థానపతితములు కల వనుట సత్యమే. ప్రయోగాభిలాషులు కొన్నింటిని పరిహరించుకొనవచ్చును.

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

1. జననము—ప్రమాదీచ మార్గశీర్ష బహుళ షష్ఠీ బుధవారము (21-12-1853) మదరానులో.
మరణము—(18-6-1929) (నెల్లూరులో).
తల్లిదండ్రులు—లక్ష్మమ్మ, వేంకటరమణశాస్త్రి.

శాస్త్రిగారికి 1922 జూలైలో శారదాపీఠాధిపతులు 'మహామహోపాధ్యాయ' బిరుద మును. 1927 లో ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 'కళాప్రపూర్ణ' బిరుదమునొసంగిరి. 1910 లో క్రిష్టియన్ కాలేజీ పదవినుండి విరమించిరి. శాస్త్రిగారి జీవిత విశేషములకు వారి మనుమడు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి M. A. రచించిన "వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవిత చరిత్ర సంగ్రహము" (1949) చూడవలెను.

2. చూ. ప్రతాపరుద్రీయ ప్రస్తావన—

"అంకెకుఁ దార్చె నే రసికసంగల భారతి ప్రౌఢనీతి, నా
కింకిరినాంధ్ర ద్రావిడియుఁ గేరుచు దైవియుఁగూడి రెవ్వనిన్.
జంకు కళంకులేని కవిచంద్రుఁడు, తోషిత కోవిదేంద్రుఁడా
వేంకటరాయశాస్త్రి కృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే".

3. చూ. ప్రతాపరుద్రీయమున పిచ్చివాని వాక్యములు—

"మహా మహావాళ్ళంతా మట్టిగొట్టుకపోయినారు.
ఈ రాగడు వీరడూనా యీడేరేవాళ్లు ?
నాకు శూన్యంపెట్టినవాళ్ళు నాశనమైపోతారు..." (పుట. 132)

"వీరడికి రాగడికి నాశమంగళం... ..." (పుట. 131)
"వీరణ్ణి రాగణ్ణి మన్నుచేయిస్తాన్
గోతిలో పాతించి గోరీ కట్టిస్తాన్" (పుట. 124)

4. "నాగానందమునఁ బ్రాకృతస్థానమున నేఁ బ్రయోగించిన గ్రామ్యభేదములను నాంధ్రాంగ్లేయభాషా పారీణులగు విపులహృదయు లామోదించిరి. దీనియందును గణ్వకశ్యపులకును తలారి చెంబడుల కును నేకవిధ భాషణముం బ్రయోగించుట యనుచితమని కావలివాండ్రకు మత్స్యఘాతకునికిని గ్రామ్యముం బ్రయోగించితిని." —శాకుంతల పీఠికలో.

5. "వేంకటరాయశాస్త్రిగారికి 'కళ' అంటేయేమిటో బొత్తిగా తెలియదు. గ్రీకు నాటకాలలో 'కోరస్'ల్లాగ, ఆంగ్లంలో 'ప్రోలోగ్'లవలె కథాకథనంకోసం ఆయన తన నాటకంలో విష్కంభాలను ఆశ్రయించారు. నాటకంలోవచ్చే దేవతామూర్తులను వొట్టి పిరికిపందలుగా చిత్రించారు. ఇక బాణాసురుణ్ణంటావా కడు దురహంకారిగా, మర్యాదా మప్పితమూ యేకోశానా లేని జడునిగా, అమిత నీచునిగా తన తండ్రి అని ఉష చెప్పుకొని గర్వపడేందుకు యెంతమాత్రం తగనివిధంగా సృష్టించారు. దిక్పాలకుల్ని బాణాసురుడు 'ఒరే' అని సంబోధిస్తాడు. ...అది ఎందుకూ కొరగాని పుస్తకం. శ్రీ వేంకటరాయశాస్త్రిగారు బొత్తిగా పసిపిల్లల మనోభావాలు కల వారనికాని, సహజ విలక్షణ భావనాశక్తి లోపించినవారనికాని, నేనెన్నడూ అనుకోలేదు. ఒక అంకం 'ఉషావిరహం', మరొక అంకం 'ప్రద్యుమ్నవిరహం'. శైలి చూతామంటే పాతఫక్కీ; తలనొప్పి; చికాకు. అన్నీ పాతసంప్రదాయాలే! అంతా కన్వెన్షన్లమయం. తామర ఆకులు, సెజ్జలు, చంద్రకిరణతాపం, విరహవేదన అన్నీని. లేనివేంలేవు. పాత్రౌచిత్యమూలేదు. కదలికా లేదు. పాత్రచిత్రణాలేదు. బాణాసురుని మేనల్లునికీ, ఉషాధాత్రేయికీ మధ్య నాటకకర్త నడిపించిన శృంగారఘట్టాలు చదవడానికి అసహ్యమే? వినడానికి రోతే. వొట్టి అశ్లీలంతప్ప మరేమీ కనిపించదు. శాస్త్రిగారు 'బఫూనరీ'నే హాస్యచమత్కారాలనుకుంటున్నారు"— అప్పారావుగారు వంగవోలు మునిసుబ్రహ్మణ్యంగారికి 24-9-1909 తేదీన వ్రాసినలేఖనుండి—"గురజాడ రచనలు" 5 వ సం-పుటలు 87-88;95-97.

అప్పారావుగారి పైవిమర్శ చాల ఘాటుగా ఉన్నది. పాత్ర పోషణాదుల విషయమై వారి విమర్శ సమంజసమే. కాని సంప్రదాయములపై వారు చేసిన విమర్శమాత్రము అసమంజసము. అవి సక్రమముగా నిర్వహింపబడకపోయినచో, అది ఆ సంప్రదాయముల దోషము కాజాలదు. అందుచే, ప్రాచీన సంప్రదాయములన్నంత మాత్రమున 'పాతఫక్కీ' అని నిరసించుట విచారకరము.

5. పెద్దాడ మల్లేశకవి పాటయును, రంగరాట్చరిత్రమను పద్యకావ్యమును ఈ రచన కాధారములట. వీనిలో పద్యకావ్యము కావ్యమార్గమున మెరుగెక్కియున్నను రసనిష్యందంబున పాటయే మిన్న యని వారు తెలిపియున్నారు. శ్రీపాదవారి బొబ్బిలియుద్ధ నాటకము 1908 లోను; అంతకుముందే 1899 లో 'రంగరాయ కదన సమవకారము'ను ప్రకటితములై యున్నవి.

6. అసలు, తెలుగువారి నాటకానువాదములలోనే ఒక లోపము కన్పట్టుచున్నది, తెలుగు పలుకుబడియు, నుడికారమును సంస్కృతపు పలుకుడి, నుడికారములకంటె భిన్నములైనవి. అందుచే ఆంధ్రీకరణమునందు యథావాక్యానువాదము పనికిరాదు. ఈ సత్యమును గుర్తించిన వారు చాల తక్కువయగుటచేత సంస్కృతరూపకానువాదములను చదువుచున్నచో భాష కృతకముగా తోచుచుండును; ఇది శాస్త్రిగారి అనువాదములలో మరియు నధికము,

## ప్రతాపరుద్రీయము

1. ప్రతాపరుద్రీయము 1897 జూలై, అక్టోబరు ప్రాంతములలో వెలువడినది; "ఆ సంవత్సరాంతమున కన్యాశుల్కము వెలువడెను" అని శాస్త్రిగారి మనుమలు ప్రతాపరుద్రీయ నాటకోపోద్ఘాతములో (1954-పు. 6) వ్రాసియున్నారు. ఇది పొరపాటు. కన్యాశుల్కము 1897 జనవరి లోనే ప్రకటితమైనది. అది అసలు 1892-93 ప్రాంతములలో రచింపబడినదై, ముద్రణము నకుముందే పెక్కు ప్రదర్శనములను పడసెను. క్రీ. శ. 1897 లో సుప్రసిద్ధమైన 'Mascow Art Theatre' స్థాపింపబడుట యాదృచ్ఛికమైన విశేషము.

2. శాస్త్రిగారు చోడవరములో నుపాధ్యాయులుగా పనిచేసినప్పు డచ్చట 'పేరిగా'డనెడి నౌకరుండెడి వాడు. వాడొక వింతప్రకృతి. ఆ పేరును శాస్త్రిగారు గ్రహించినారు. శ్రీకాకుళమునందలి వాకళ్ళ ఆచార - భాషణములుకూడ శాస్త్రిగారి హృదయమున హత్తుకొన్నవి. స్వారస్యపు త్రాడు (సారాసెంబుతాడు)ను గూర్చియు, ఆనందబాష్పములనుగూర్చియు పూర్వపు ఐతిహ్యము లను వారు జనవినోదినిలో ఏనాడో ప్రకటించియున్నారు. రాజమండ్రిలో చదువుచున్నప్పుడు శాస్త్రిగారికి ఒకసారి గోదావరిలో నీటిగండము తప్పినది. ఇది విద్యానాథుని పాత్ర విషయమున స్వీకృతమైనది. విశాఖపట్టణములో ఒక ముసలిమొగుడు పడుచుపెళ్ళామును 'నేను కండ చీమను ఏమనుకున్నావో? పట్టుకుంటే వదలను' అనెడివాడట. అదికూడ ఇందుచేర్పబడెను. ఐదవ అంకములోని బొడ్మిన్ ఆరోజులలో విశాఖలోని సారాదుకాణదారు. నాటివారే ఘనపండా దిగ్విజయ జ్యోతిషికులును, గులాం దస్తఖైర్మనిషీయును. ఇట్లే ఇంకను పెక్కువిషయములు కలవు.

3. 8-1-1914 తేదీన శాస్త్రిగారికి అప్పారావుగారు వ్రాసిన లేఖ—

"I have to ask you one question; you used in your plays various class dialects on the ground of ఔచిత్యమ్. Why did you omit the best of them i, e, the language of the cultured Brahmans? Is there no use for it any where? Does not the same ఔచిత్యమ్ require that characters of a certain social standard use it?" —శ్రీ శాస్త్రిగారి జీవితచరిత్రము-పుట 129.

4. అప్పారావుగారు 7-5-1909 తేదీన వంగవోలు మునిసుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలోని భాగము(—చూ. గురజాడ రచనలు. 5వ సం. 5. పుటలు-75-76), అప్పటికి కన్యాశుల్కము రెండింతలై రెండవముద్రణమునందుచున్నది.

5. ఇట్టిలోపము కన్యాశుల్కమందును కలదు. తరువాత వివరింతును.

6. ఈ సందర్భమున ఒక ఆధునిక విమర్శనుకూడ పరిశీలింపదగును—'ప్రతాపరుద్రీయము శాస్త్రి గారి రూపకములందేగాదు ఆంధ్రరూపకవాఙ్మయమునకే తలమానికమువంటిదని ముందు మనవిచేసితిని. దాని సరసనుగాదుకదా దరిదాపులనైనఁ జోటు సంపాదించినరూపకము మఱి యొకటి యాంధ్రమునలేదన్న నసత్యముగాదు. అట్టిది కన్యాశుల్క మొక్కటి కలదని కొందఱన వచ్చును. కాని యది సరిగాదు. కన్యాశుల్కములోని యితివృత్తమునకు శాశ్వతత్వములేదు. ఒక్కొక్క సమస్యను బురస్కరించుకొని ప్రచారార్థమయి బయలుదేరిన గ్రంథసాహిత్యమా సమస్య రూపుమాయఁగనే తన పూర్వపుటౌన్నత్యమును గోల్పోవును. కన్యాశుల్కమట్టిది... ప్రతాపరుద్రీయములోని యితివృత్తమట్టిదిగాదు. దానికి శాశ్వతత్వమున్నది. మఱియొక్క విష

యము; ఇది పాఠకులకు సంబంధించినది. ప్రతాపరుద్రీయమును జదివి యానందించు పాఠకు లందఱును కన్యాశుల్కమును జదివి యానందింపరనలేము. దానికింకొక సంస్కారము కావల యును. అది యాంగ్లభాషాజ్ఞానమువలనఁగానిరాదు... ప్రతాపరుద్రీయ మట్టిదిగాదు... ఎక్కడఁ జూచినను తెలుఁగుఁదనము మూర్తీభవించినట్లుండు నీ నాటకమునుజూచి యానందించుటకు తెలుఁగువాడై తెనుఁగుభాష నెఱిగియుండుట చాలును".

—శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ—"శ్రీ శాస్త్రిగారి రూపకసమాలోచనము"
—స్రవంతి-జూలై, 1959-పుటలు-28-29.

7. ఈ సంగ్రహింపు విషయమున డా. డి. వి. అవధానిగారు క్రిందివిధముగా సూచించియున్నారు— "మొదటి రెండంకములను దుది రెండంకములను దగ్గించినను గథావిధానమున కంతరాయము రాదు. శాస్త్రిగారు హాస్యరసమునందలి యాసక్తిచేతనో, సామాజిక మనోరంజన కౌతూహలము చేతనో మంత్రులు పేరిగాని స్వారస్యగ్రహణ పాటవమును బరీక్షించు షష్ఠాంకమున కథిక ప్రాధాన్యము నొసంగిరి. నాకుంజూడ దాని స్థానమున యుగంధరవిద్యానాథ సమాగమముతోడను మంత్రాంగనిశ్చయముతోడను గూడిన చతుర్థాంకమునుంచుట యుచితమేమోయని తోఁచు చున్నది. వలీఖాను నిర్దిష్టుఁడైన రాజును జెఱపట్టిన వృత్తాంత మంతర్నాటకమునమాత్రము వివరింపఁబడియున్నచో నాటకరక్తికి మఱింత యుత్కర్ష గలిగించియుండును"

—"ఆంధ్రనాటక కర్తలు"—పుట. 41.

8. చారిత్రక విషయములను ఇష్టమువచ్చినట్లు మార్పుచేయుట తగదని త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఆక్షేపణపూర్వకమైన ఒక గేయమును ప్రచురింపగా శాస్త్రిగారిని సమర్థించుచు దువ్వూరి రామిరెడ్డిగారొక వ్యాసమును ప్రచురించియున్నారు.

9. భాసరచితమగు ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని యౌగంధరాయణపాత్ర శాస్త్రిగారి యుగం ధరపాత్రకు మూలమని కొందరభిప్రాయపడినారు, అది పొరపాటు. అసలు భాసనాటకముల ఉనికితెలిసినది 1912-13 లో మాత్రమే. అంతకు సుమారు 16 సంవత్సరములకుముందే రచింప బడిన నాటకమున అది అనుకరింపబడినదనుట అసమంజసము. యుగంధరపాత్ర సృష్టి కేవ లము శాస్త్రిగారి స్వీయమే. 'ఆయన గాలిని బేనును, దోయముతో నఱుకుఁ, బొగలతో గోడ లిడున్, ఆయన ప్రయోగ మభినవతోయజభవ సృష్టి' అని యుగంధర మంత్రినిగూర్చి విశ్వాస రావు పలికిన పలుకులు, నిజముగా శాస్త్రిగారియెడకూడ నన్వర్థములే.

## శ్రీ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ

1. జననము— రక్తాక్షిసంవత్సరాశ్వయుజ బహుళ పంచమి బుధవారము (19-10-1864)
మరణము— 3-8-1933.
తల్లిదండ్రులు—నరసమాంబ; బాపిరాజు.
జన్మస్థలము—మేరంగి.

1886 లో విశాఖమండలమందలి పార్వతీపురమునందు న్యాయవాదివృత్తి స్వీకరించి, చిర కాలము మేరంగి సంస్థానము మేనేజరుగా పనిచేసెను.

2. క్రీ. శ. 1886 ప్రాంతముల 'సుజనప్రమోదిని' అను పత్రికను ప్రారంభించిరి. 1890 ప్రాంతముల నూతన శీర్షికలతో కూడిన నవ్యకవితా సంకలనమును 'ఆంధ్రపద్యావళి' అనుపేర

ప్రకటించి, తెలుగులో లిరికల్ కవిత్వమునకు శ్రీకారమునుచుట్టినారు. పాశ్చాత్య వైజ్ఞానిక శాస్త్రజ్ఞానమును సంపాదించి, భూతత్త్వ ఖనిజ క్రిమికీటకాది శాస్త్రవిషయములపై సుబోధకమగు శైలిలో వ్యాసములువ్రాసి, 1894 లో 'రహస్యదర్పణ'మను పేర గ్రంథరూపమున ప్రకటించిరి. వారు అధ్యక్షతవహించిన మహాసభలకు, చేసిన మహోపన్యాసములకు లెక్కయేలేదు. వారితో సంభాషణము విజ్ఞానదాయకముగా నుండెడిదట.

3. ప్రథమ ముద్రణమునకు శర్మగారు సంతరించిన ఉపోద్ఘాతము పరిశీలింపదగియున్నది—

"సంస్కృతభాషయందు నాటకము లనేకములుగలవు. పూర్వకవులు తెలుగునఁ గ్రొత్త నాటకములను రచింపలేదు. సరేగదా సంస్కృతనాటకమునయినను దెలుఁగించినట్లుగానరాదు. కొందఱిప్పుడిప్పుడు తెలుఁగించుచున్నారు. తెలుఁగునఁ గ్రొత్తనాటకములను రచించుటకు లక్షణగ్రంథములులేవుగనుక సాధ్యమయినంతవరకు సంస్కృతనాటక లక్షణములనే యనుసరించి వ్రాయవలసియుండును. అట్లు వ్రాయబూనినను సంస్కృతనాటక లక్షణములను సంపూర్ణముగా బట్టించి తెలుఁగునాటకములను రచించుట దుర్లభమనియే చెప్పదగియుండును.

నాటక రచనయందును నాటక ప్రయోగమునందును నాటకములను జూచుటయందును మన తెలుఁగువారి కిప్పుడిప్పుడభిరుచి గలుగుచుండుటచేతఁ గాలోచితమైన తెలుఁగు నాటకము లుండుట యావశ్యకమని తలంచి యీ చిన్నినాటకమును రచించితిని. గుణగ్రహణపారీణులు దీని నాదరించి చదువఁదగినవారిచేఁ జదివించి, యాడఁదగినవారిచే నాడింతురని నమ్ముచున్నాను. మఱియును స్త్రీలకు మిక్కిలి యుపయోగించునని దీనిని వ్రాసితిని. కాఁబట్టి బుద్ధిమంతులు చదువు వచ్చిన యంగనలచేఁ జదివించి చదువురానివారికిఁ జదివి వినిపించి నా యుద్దేశమును నెరవేర్తురుగాత !

Vizagapatam
3rd March 1895

Venkata Rao, A. Sankhyayana

## శ్రీ గురజాడ వేంకట అప్పారావు

1. జననము—దుందుభి సంవత్సర భాద్రపద శు 13 ఆదివారము (30-11-1861)
జన్మస్థలము— వీరవల్లి తాలూకా రాయవరము (విశాఖజిల్లా)
తల్లిదండ్రులు—కౌసల్యమ్మ, వేంకటరామదాసు (నియోగులు).
భార్య—అప్పలనర్సమ్మ.

1884 ఏప్రెలులో విజయనగరం కళాశాలలో అసిస్టెంటు లెక్చరరుగా ప్రవేశించినారు. 1886 లో పట్టభద్రులైనారు. 5-6-1896 లో సంస్థానశాసన పరిశోధకులుగా నియుక్తులైరి. 1898 జూన్‌లో రీవా మహారాణికి ఆంతరంగిక కార్యదర్శిగ నియమింపబడిరి. బాల్యమునుండియు గిడుగు రామమూర్తిపంతులుగారును, వీరును సన్నిహిత స్నేహితులు.
మరణము—30-11-1915 (ఉదయం ఎనిమిదిగంటల 20 నిమిషాలకు).

అప్పారావు పంతులుగారి నాటకమేకాక, ముత్యాలసరాలుకూడ సుప్రసిద్ధములైనవి. వారి 'పూర్ణమ్మ', 'కన్యక' మొదలగు పాటలు పండితపామరహృదయరంజకములైనవి.

2. "......Such a scandalous state of things is a disgrace to society, and literature cannot have a higher function than to show up such practices and give currency

to a high standard of moral ideas. Until reading habits prevail among the masses, one must look only to the stage to exert such healthy influence. These considerations prompted me to compose kanyasulkam.

"I clothed the play in the spoken dialect not only that it is better intelligible to the public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu. Dramatic style is, no doubt, determined to some extent by usage, but the absence of any real dramatic literature in Telugu, leaves a writer free to adopt that outward form which he deemes most appropriate for the presentation of his ideas".

—Preface to the First Edition.

"When I wrote the play, I had no idea of publication. I wrote it to advance the cause of Social Reform and to combat a popular prejudice that the Telugu lauguage was unsuited to the stage"

—Preface to the Second Edition.

3. చూ. "గురజాడ రచనలు-4—మాటామంతీ : అవీ. ఇవీ" (1958). పుటలు 88-97.

4. "The first editon was a marked success. The press gave it a cordial reception and hailed it as an event in the histroy of Telugu Literature, and men, women and children read it with interest."

—Preface to the Second Edition.

5. "కొన్ని సందర్భములలో పంతులవారికిని నాకును భేదాభిప్రాయములు గలిగి ఉత్తరప్రత్యుత్తరములద్వారా చర్చజరిగియుండెను. మీనాక్షియను బాల్యవితంతువును, మధురవాణియను వేశ్యయు గనపడు నాటకరంగములు ఔచిత్యవ్యతిరేకములనియు, నైతికవిరుద్ధ ప్రయోజన కారులనియు ఆ ప్రదర్శనములు యువతీయువకులకు శ్రేయోదాయకములు గావనియు విమర్శించియుంటిని".

—శ్రీ వంగవోలు మునిసుబ్రహ్మణ్యం.
చూ. గురజాడ రచనలు—5. పుట 79.

## కన్యాశుల్కము

1. ఆధునికులలో 'కన్యాశుల్కము'ను సమగ్రముగా విమర్శించినవారు కేతవరపు రామకోటిశాస్త్రి గారు—భారతి—జూన్, 1955. దీనిపై మోచర్ల సీతారామయ్యగారు (బరంపురం) ఆ సంవత్సరము ఆగస్టులో ఒక ప్రతివిమర్శనము చిన్నపుస్తకరూపమున ప్రకటించియున్నారు.

'కన్యాశుల్కము' గురజాడ అప్పారావుగారి రచనయేకాదనెడి వాదమొకటి అమధ్యబహుళ ప్రచారమందినది; కాని, అది అంతటితో సమసిపోయినట్లే ఎంచవచ్చును. ఇది అప్పారావుగారి రచనయే అని నిరూపించుటకు తగినంతసాక్ష్యమున్నది. అందుచే పైవాదమును నేనులెక్కలోనికి తీసికొనలేదు.

ఇంకొక్క విషయమును కూడ ఇచ్చట గుర్తింపవలెను—అర్వాచీనవిమర్శలకు కాని, ఇప్పుడు నేనుచేయుచున్న సమీక్షకుకాని కన్యాశుల్కము ద్వితీయముద్రణమే ఆధారము.

2. "Poetic justice is not what it was at one time. I paint life, artistically idealising of course. Though art is my master, I have a duty to society. Therefore one question the reader may ask. 'Have I made vice attractive?' I hope not. In the first edition, Madhuravani was colourless iniquity. Now she is fully drawn. I am myself fascinated with Madhuravani. So, I reform her in the last Act. you cannot now quarrel.

"The book has gained an obtrusive but strong moral purpose. you will find that I do not at all trifle with life. I take it quite seriously, a very difficult matter in a book that bubbles with laughter.

"Do not forget the humanity of a nautch girl. Her joys and sorrows are as serious a matter as yours or mine. How is an unchaste wife or a rakish husband (and society teems with both) better than a nautch girl, who is not a fraud in this sense that her label is correct? She breaks no marriage bond."

—Letter to Sri. V. M. Subrahmanyam
"The Hundu"—27-2-1936.

3. I కన్యాశుల్కమందలి పెక్కుపాత్రలు, సన్నివేశములు అప్పారావుగారి కాలములోనివేఅని చెప్పుదురు.—

గిరీశముపాత్రకు మూలమని చెప్పబడువారు—నిష్ఠలచలపతిశాస్త్రి: చిరంజీవి అనెడి స్కూలు మాష్టరు; వేములకొండ సీతారామమూర్తిగారి కుమారుడు (ఈ చివరి విషయమును అప్పారావుగారే స్వయముగాచెప్పిరట).

మధురవాణి— మద్దెల మహాలక్ష్మి (ఈమె గాత్రమునందును, వీణయందును నిపుణురాలట).

రామప్పంతులు— 'రామప్పంతులు' అనెడి సహజనామముగల రాయవరంకరణము; పాలెపులక్ష్మణ రాజుఅనెడి నియోగి మొఖాసాదారు(వీరు అంగరఖా, మీసాలకురంగు, గిరజాలు, నీలిరంగుకళ్ళద్దాలు ధరించి 70 ఏళ్ళ వయస్సులో కూడ గంభీరముగానుండెడి వారట).

అసలు అప్పారావుగారే 'రామప్పంతులు' అని కొందరందురు.

ఇప్పటి చిన్నపోష్టాఫీసుప్రక్కన 'సూరమ్మ హోటలు' అని ఉండెడిదట; అదియే నాటకములోని పూటకూటియిల్లు.

II కన్యాశుల్కమునందలి పాత్రలను ప్రశస్తముగా నిర్వహించిన పూర్వపు నటులలో కొందరు—

గిరీశము— నిష్ఠల చలపతిశాస్త్రి; మండపాక కొండలరావు (వీరు అందుకొరకే పుట్టినారా అనిపించెడివారట); పడాల సత్యనారాయణ, వెలివెల వీరరాఘవస్వామి; డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు మొ॥

మధురవాణి— హోటలు సూరమ్మగారి కుమారుడు డి. వి. సుబ్బారావు (తరువాత B. A; B.Ed. వీరికి నృత్యము కూడ తెలియునట; అద్భుతముగానుండెడిదట); ఎర్ర మిల్లి పేర్రాజు, స్థానం నరసింహారావు, న్యాపతి రాఘరావు మొ॥

కరటకశాస్త్రి— కర్రాపాపయ్యశాస్త్రి.
అగ్నిహోత్రావధాన్లు— రామన్నపంతులు, డా. ఎ. వీరభద్రరావు మొ॥

III అప్పారావుగారి అంగీకారముతో పడాలవారు గిరీశముపాత్ర నిర్వహణములో ధరించిన వేషముతీరు—తెల్లనిపంచె బెంగాలీకట్టు: లోపలచేతులుగల కంపెనీ బనియను; దానిపై పల్చని నీలిరంగువాయల్ చొక్కా; లేతకనకాంబరం రంగు (చైనాసిల్కు) తలపాగా; వెండిపొన్నుతోడి మిల్టరీ బెత్తము. వెలివెలవాడు స్కాట్‌స్కార్ఫ్ మెడలో కట్టుకొని, సైకిల్‌పంచెకట్టు కట్టుకొనెడివారట. మధురవాణి లంగా, వోణీతోనే ఉండెడిదట.

IV 1919 లో దీపావళిరోజున డా. గోవిందరాజుల సుబ్బారావు ప్రభృతులు మద్రాసు వి.పి.హాలులో కన్యాశుల్కమును ప్రప్రథమముగా ప్రదర్శించినారు. నాటి నుండియే నెల్లూరు–కృష్ణా–గోదావరీ మండలములలో ఈ నాటకము ప్రసిద్ధికి వచ్చినది.

4. " If only Apparao's art had been equal to his imagination.... there is no need to speculate. It was not. He could not shake off the Elizabethean technique, the only one with which the Madras University acquaints its students and in consequence he has produced a drama which is next to impossible to stage. The scenes are short, and innumerable; no mortal company could have an adequate supply of the 'curtains' etc. needed to present them, or sufficient hands to do it neatly and without intolerable fatigue. The story drags on for page after page.....It is a study drama though the portions taken seperately are splendid for acting. Selections from it would have a rousing effect....."

Dr. C. R. Reddi's "Preface" to Kannada translation of Kanyasulkam.

5. "It has been said that comedy is, by its very nature, incapable of translation. Its appeal depends, far more than with tragedy, on local and topical interest, and on its preoccupation with the immediate concern of its audience. Thus the greater its appeal to its contemporaries the less its impact on future ages, and the history of the theatre shows innumerable instances of comedies enormously successful in their own day and soon forgotten. This handicap is, ofcourse, subject to the overriding force of genius......"

—The Oxford Companion to the Theatre—P.-143.

## శ్రీ కోలాచలము శ్రీనివాసరావు

1. జన్మస్థలము ; బళ్ళారిజిల్లా హొసపేట తాలూకాలోని కామలాపురము.
నివాసము : బళ్ళారి (వకీలుగా).
జననము : ప్రమాదీచ ఫాల్గున శుద్ధ చతుర్దశి (13-6-1854).
తల్లిదండ్రులు : అచ్చమాంబ; సేతుపతిశాస్త్రి.

వీరి రెండవ అగ్రజులు వేంకట్రావుగారు సుప్రసిద్ధులు; నాటి అసెంబ్లీ సభ్యులు. ఈ అన్నదమ్ములు తమ పిల్లలకు రామాదులపేర్లు పెట్టుకొనిరి. వేంకట్రావుగారి కుమారులు—

శ్రీరామచంద్ర; కుమార్తె శాంతాదేవి. పెద్దవారగు వేంకట్రామప్పగారి కుమారులు—శ్రీయుతులు భరత—లక్ష్మణులు. ఇంక శ్రీనివాసరావుగారి కుమారులు శ్రీ శత్రుఘ్నరావు (వీరే తండ్రిగారి నాటకములను పెక్కింటిని అచ్చువేయించినారు). శ్రీనివాసరావుగారు తమ తక్కిన సంతానమునకు పెట్టినపేర్లు కూడ గమనార్హములు—సునందినీపరిణయనాటకము వ్రాసిన సమయములో పుట్టిన కుమార్తెపేరు 'సునందనమ్మ'. ప్రతాపాగ్రహరీయము రచించినపుడు పుట్టినకుమారునిపేరు 'ప్రతాప్'. శ్రీనివాసరావుగారిని "ఆంధ్రచారిత్రకనాటకపితామహుడు" అని అనుటకద్దు.

2. శ్రీనివాసరావుగారు వేదములనుగూర్చికూడ చాల పరిశోధనముచేసి యున్నారు. ఆ విషయముకూడ చాల మందికి తెలియదు. వేదమును మతగ్రంథమనుట కంటె చరిత్రమనుటయే సమంజసమనియు, ఆర్యులు వ్యవసాయమే ముఖ్యవృత్తిగా గలవారనియు (అర్ = వ్యవసాయము) వారు నిరూపించినారు. మరియు వేదకాలమునాటి సాంఘికాది పరిస్థితులనుగూర్చి పెక్కువ్యాసములు ప్రకటించిరి. 'భగవద్గీతా విమర్శన' మనుపేర ఒక్కొక్క అధ్యాయమును పురస్కరించుకొని విపులవ్యాఖ్యానమును ప్రకటించిరి. కాళిదాసాదులకాలనిర్ణయాదులను గూర్చి అనేక పరిశోధన వ్యాసములు ప్రకటించిరి. మరియు అగస్త్యభారతమును పద్యకావ్యముగా ఆంధ్రీకరించిరి. మొత్తముమీద వారి సాహిత్యకృషి మువ్విధములుగా సాగినది—

1. చరిత్ర రచన; 2. నాటక రచన; 3. పరిశోధన.

3. మరి రెండు కారణములను కూడ వారు చెప్పుట గనార్హము—" ఇప్పటికాలములో ప్రతిపట్టణంబులోను నాటక సంఘంబులేర్పడి యక్షరశూన్యులు సైతమాడి వారివలె పాఠమునేర్చుకొనివేషంబులు ధరించి రంగస్థానమలంకరించి యుక్తాయుక్తంబులు దెలియక వ్యస్తావ్యస్తముగా సంభాషించి రసస్ఫూర్తిగల పదములందు రసభంగంబు గలిగించి తమచేతనయినంత సామర్థ్యంబుచే నాటకంబు నెఱపంబూనుదురు. ఇది యజ్ఞానదోషము. అట్టివారికి నివి దుస్సాధ్యంబుగా నుండవలెననుట వేఱొక కారణము..............

"పైఁగా తెలుగునాటకములు పామరులకుసైతమర్థమయ్యెడులాగునను, కథాసరణి తెలియులాగునను నుండవలెనుగాన నించుక స్థూలముగావ్రాయవలసి వచ్చినది."

కాని, చివరకు "నాలుగైదు గంటలకాలముకన్న హెచ్చుకాలము ప్రదర్శింపఁదగిననాటకములు జనులయోపికను బాపునుగావున దీర్ఘముగఁ దెంచినాటకములు వ్రాయుటతప్పని యిపుడు నేఁదెలిసితి. హెచ్చుగం బద్యములు వ్రాయుట వృథాయాశము" అని అంగీకరించియున్నారు.

—సుఖమంజరీ పరిణయ పీఠిక (20-12-1895).

4. చారిత్రకములు—సుల్తానాచాందుబీబీ, రామరాజుచరిత్రము (విజయనగర నాశనము), శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, చంద్రగిర్యభ్యుదయము, ప్రతాపాగ్రహరీయము.

పౌరాణికములు—గిరిజా కల్యాణము, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, కాళిదాసనాటకము, మదాలస (మార్కండేయ పురాణము), ప్రహ్లాదనాటకము (దానవవధ).

భారతనాటకములు—శిరోమణి, ధర్మవిజయము(భారతయుద్ధము), చంద్రహాస: ద్రౌపదీవస్త్రాపహరణము, బభ్రువాహన, కీచకవధ (సైరంధ్రి).

రామాయణ నాటకములు—శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకాపట్టాభిషేకము, లంకాదహనము, కుశలవ.

ఉభయములు—సునందినీ పరిణయము; సుఖమంజరీ పరిణయము, సీమంతినీ నాటకము;

సాంఘికములు—మానాపమాన నాటకము; యువతీవివాహము (అముద్రితము); మానవ పిశాచము; రాక్షసీ మహత్వకాంక్ష.

ప్రహసనములు—"అన్యాయ ధర్మపురి మహిమ" (1915); "నాచిపార్టి" (1915); ఆచారమ్మ కథ (కన్నడము).

5. చూ. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి "నాటకోపన్యాసములు". ఇందు శర్మగారిరువురి భేదసాదృశ్యములను చక్కగా వివరించియున్నారు; అందలి కొన్ని ముఖ్యాంశము లీసందర్భమున గ్రహింపబడినవి.

6. ఇతరుల పద్యములను సందర్భవశమున స్వీకరించుటకు కృష్ణమాచార్యులుగారి కభ్యంతరములేదు; తాము ప్రహ్లాదలో పోతన పద్యములను స్వీకరించిరి; కాని శ్రీనివాసరావుగారందుల కంగీకరింపక, పోతనతో సమానముగా వ్రాయవలెనని తలంచి ప్రహ్లాదనాటకరచనకు మొదలిడిపూర్తి చేసిరి. శ్రీనివాసరావుగారి పద్యరచనాశక్తికిది యొకతార్కాణము. కాని, చివరకు "ఆశైలినిఁబట్టి నేను పద్యములువ్రాసితిని గాని యంతటి రసముప్పతిలజేయునంతటి శక్తి లేదయ్యెను" అని ఉపోద్ఘాతమున అంగీకరించిరి.

7. ఉదాహరణములుగా నొక్కొక్కటి :

"విషాదసారంగధర"—సారంగధరుని శిక్షకు పరితపించు రత్నాంగి—

"దినయామినుల నయారే
ఘనయాతన లనుభవింపఁగనయాయె నయా!
వినయార్యనయా సునయా
తనయా మనయార్తి కెదియొ ధారుణి నెనయా!"

"శిలాదిత్య"—వితంతుగర్భిణి తనగర్భచిహ్నములను తానేవర్ణించుకొనుట.

"మిన్నయి సన్నగానున్ననాలేఁగౌను గరువంపుగరిమ మైఁబరఁగెనేఁడు
రాగోరు రుచులచేరాజిల్లు చనుమొనల్ నీలకాంతి వహించి నెగడెనేఁడు......"

8. ఉదా: చిత్రనళీయమున బాహుకుని విరహవేదనలోని పద్యములు మొ॥ శ్రీనివాసరావుగారి 'సత్య హరిశ్చంద్రీయము'లోని మాతంగకన్యలు తమగానకలానైపుణ్యము చూపు సందర్భమునగల ముప్పదియేడు రాగముల ద్విపద మొ॥

9. ద్రౌపదీవస్త్రాపహరణ సారంగధరములవంటి ఇతివృత్తములను నాటకీకరింపరాదని శ్రీనివాస రావుగారు 'ప్రపంచనాటక' చరిత్రలో పేర్కొనియున్నారు. అయినను ద్రౌపదీవస్త్రాపహరణము సభ్యుల బలవంతముచేత వ్రాసినారు. ఇంక మైసూరురాజ్యమున ఇంచుమించుగా సారంగధర కథవంటి కథనే చిత్రించి వకీళ్ళ కోలాహలాదులనుకూడ చేర్చియున్నారు. అంతకుముందే కృష్ణమాచార్యులవారి పాదుక చాలప్రసిద్ధిగన్నది. 'ఒక పట్టణములోనే వేర్వేఱు కవులు రచించిన రెండు నాటకములుండుట చెడుగు. కవులకు స్పర్థలులేకయున్నను నాయా సంఘములవారికి నభిమానసాంబంధిక మనస్తాపములు కలుగుచుండును. దుర్వాదములును ప్రబలును' అని చెప్పియు మరల తాము పాదుకను రచించిరి.

## రామరాజు చరిత్రము (కర్ణాటకరాజ్య నాశనము)

1. ఈమని లక్ష్మణస్వామిగారీ యసందర్భమును గమనించి, కథాంశమును మార్చివై చి, పఠానునకు (పటాణికి)మొదటినుండియు నుదాత్తత నాపాదించి ప్రదర్శించెడివారట— చూ. నాట్యాంజలి మ- పుటలు.209-10.

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

1. జన్మస్థలము—రాజమండ్రి తాలూకా సీతానగరము; నివాసము—పిఠాపురము.
జననము—1-2-1865; మరణము—1-1-1940.
తల్లిదండ్రులు—వేంకటరత్నమ్మ; వేంకటరమణయ్యపంతులు (మధ్వులు).

రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో బి. యే. చదివినారు. (వీరిపై వీరేశలింగముపంతులుగారి ప్రభావ మధికము). పిమ్మట ఉర్లాం, కోలంక లక్ష్మీనరసాపురం, అనెగొందె సంస్థానములలో దివాన్‌గా పనిచేసి చివరకు 1920 ప్రాంతములలో పిఠాపురమునందు స్థిరనివాస మేర్పరచు కొనిరి; నాటినుండియు శ్రీ పిఠాపురం రాజావారి ఆదరణములోనే సుఖముగా కాలముగడపినారు.

పంతులుగారు ఆజానుబాహువు; ఒక ఉత్తమ సేనాపతివలె కనిపించెడివారట.

2. శ్రీ పిఠాపురం రాజావారి పినతల్లి అయిన రాజా చెల్లాయమ్మరావుగారు కాకినాడ హిందూనాటక సమాజ ప్రదర్శనములనుకాంచి, దివాన్‌గా ఉన్న పంతులుగారిని నాటకరచనకు ప్రోత్సహించి నారట. వారు నర్మదాపురుకుత్సీయమును వ్రాయుటయు. చెల్లాయమ్మారావుగారి ఆదేశమున పిఠాపురములో నొక సమాజము స్థాపితమగుటయు నేకకాలమున (1900) జరిగినవి. అటు పిమ్మట వరుసగా అనేక నాటకములను, ప్రహసనములను రచించిరి. వారు తమ నాటక పీఠికలలో ఆయా నాటకములయొక్క క్రమసంఖ్యను, రచనాకాలమును పేర్కొనియున్నారు. తెలుగు నాటకకర్తలలో ఇట్లు పేర్కొన్నవారు వీరొక్కరే.

పౌరాణికములు—నర్మదాపురుకుత్సీయము (1900); సారంగధర (1905); రాధాకృష్ణ (1909); విప్రనారాయణ (1909); సరోజిని (1930).

రామాయణకథలు— పాదుక (1909); విజయరాఘవము (1909); వనవాసరాఘవము (1910): కల్యాణరాఘవము (1915).

చారిత్రకములు—ప్రచండ చాణక్యము (1909); బుద్ధబోధసుధ (1910): చూడామణి.

కల్పితములు—కోకిల (1909); వృద్ధవివాహము (1910); కంఠాభరణము (1917); పూర్ణిమ (1919); సరస్వతి (1920-Comedy of Errors పద్ధతిలో); వీరమతి; పద్మిని (1929); మాలతీమాల (1929); రాతిస్తంభము (1930); విచిత్ర వివాహము (1930); ముద్రిక.

హాస్యవల్లరి (1906)—ఇందు చిన్నచిన్న ప్రహసనములేకాక 'మనోమహిమము' అను మూడంకముల రూపకముకూడ కలదు.

పానుగంటివారి రచనలపై పరిశోధనముచేసి శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి డాక్టరేట్ పట్టమునుపొందినారు (ముద్రణము-1967).

3. ఈ నియమమునువలన వీరి పద్యరచన కొంతవరకు నీరసముగా కన్పట్టును; వీరు అసలు చక్కని వృత్తరచనయే చేయలేరేమోయని కొందరు సందేహించినారు. మొదటిది కొంతవరకు సత్య మైనను, రెండవదిమాత్రము నిరాధారము. వారు తమ నాటకములకు వ్రాసికొన్న లేదా కూచి నరసింహంగారికి వ్రాసిపెట్టిన నాంది ప్రస్తావనలలో చక్కని వృత్తములు కలవు. ఇంక 'చిది మిన పాల్గారు చెక్కుటద్దములపై...' (పాదుక) వంటి మనోహరపద్యము లెన్నియో కలవు. వీరు పాటలను వలదనుటకును, పద్యములను పాదరాదనుటకును హేతువు వారికి సంగీతజ్ఞానము లేకపోవుటయేయని కొందరి యనుమానము. ఈ యనుమానమును సత్యముకాదని పెద్దలవలన వినికిడి. వారికి సంగీతమందు చక్కని ప్రవేశము కలదు. ఇంకవానిని వలదని త్రోసిపుచ్చుటకు హేతువు అవి లోకావస్థానుకరణములగు నాటకములందు అసహజములనియే.

4. ఉదా : 'నర్మదాపురుకుత్సీయము'లో నర్మదదేవవైద్యుని వేషమున రాజువ్యాధిని కుదుర్పవచ్చును; విదూషకుడువలదని వారించును.

నర్మద : దానమీయబోయిన బలిచక్రవర్తి కడ్డదగిలిన శుక్రాచార్యునివలెనే యుంటివి.

విదూ : భళి ! చక్రవర్తిని నడుగఁ ద్రొక్కుటకు వచ్చిన మాయావేషధారివేనా ?

నర్మద : (తనలో) వీఁడునన్నానవాలు పట్టెను కాఁబోలు ! (అని అనవసరముగా ఉలికిపడును).

5. ఉదా : నర్మద చెలికత్తె, నర్మద చిత్రపటమును నిద్రించుచున్న పురుకుత్సుని ప్రక్కలోనుంచెను (అంతకుముందొకరొకరి నెరుగరు). అందులకు కోపించి—

నర్మద : నాపటము నా (ను+ఆ) రాజు ప్రక్క నెందుల కుంచితివి ?

చెలి : నీరాజుకనుకనే యుంచితిని. ప్రక్కనెందులకుంచితివని యాక్షేపించుచుంటివా ? పోనిమ్ము భావిపుంభావ సూచనగాఁ బైననే పెట్టెదనులెమ్ము.

6. ఉదా : రాధాకృష్ణనాటకమున—

సత్యభామ : .........అదిగాక పురుషులయనురాగము చర్మమాత్రగతమే.

పాదుకాపట్టాభిషేక నాటకమున—

కౌసల్య : ........కడుపుతీపు తెలిసిన నీకే యీ పోఁగాలమా ?

కైక : పోఁగాలము నాకు కాదు నీకు; నీ కొడుకునకు. నీ కొడుకునకుఁ గాటికిఁ బోఁగాలము. ఆ వేడుకచూడలేక నీకు వల్లకాటికిఁబోఁగాలము.

7. కొన్ని ఉదాహరణములు :

"యతి వ్యభిచరించు వాఁడైన నాతడెంతకాల మెందటితో ననుగడుపులేల (నర్మ. పురు.)

"మనసు మెట్లుచెడిన వీణవలె పాడైనది" (సారంగ.)

"సతియాసన్నయైనపుడు మృతియాసన్నయైనపుడు మతిదూరమగు చుండునుగదా?" (విజ.రాఘ.)

"చిల్లువడిన కుండలోనుండి నీరుప్రాకిపోవునటులు నీజ్ఞానము నశించుచున్నదిసుమా. (నర్మ.పురు.)

## మఱికొందరు నాటకకర్తలు : వారి నాటకములు

1. జయంతి సుబ్బారావుగారు రచించిన 'కవిగారి మనుగడ'ను చూడవలెను, శాస్త్రిగారికి విద్యార్థిగా నున్నప్పుడే 'కవి' యను బిరుదము వచ్చెను. నాటినుండియు వారికి 'కవి'గారనియే పేరు; 'శాస్త్రి'గారన్నచో విశాఖపట్టణమువారికి తెలియనే తెలియదు. (వీరు భావసంవత్సరములో

పుట్టినారు. ఖావలోనే పుట్టి 'కవి'గా సుప్రసిద్ధులైన యింకొక మహాపురుషుడు మానపల్లి రామకృష్ణకవిగారు, జన్మస్థలము కృష్ణాజిల్లా గన్నవరము తాలూకా 'కనకవల్లి అగ్రహారము; కాని చదువుకొరకు విశాఖపట్టణముచేరి అచ్చటనే స్థిరపడినారు. కొన్ని అముద్రితనాటకముల ప్రతులు వారి కుమారులయొద్ద 'కనకవల్లి'లో కలవు,

2. జననము—1842 (చంగల్పట్టు జిల్లా).

పట్టభద్రులై కొంతకాల ముపాధ్యాయులుగానుండిరి. 1875-76 ప్రాంతముల 'పార్సీ విక్టోరియా థియాట్రికల్ కంపెనీ' వారు బొంబాయినుండివచ్చి, మద్రాసులో ప్రదర్శనముల నొసంగిరి. దానికి పటేల్ (M. A. Oxford) అనునత డధ్యక్షుడట. ఈ సమాజమువారి ప్రదర్శనములు ఆచార్యులవారిలో ఒక నూతనోత్సాహమును రేకెత్తించినవి. తత్ఫలమే వారు మద్రాసులో స్థాపించిన 'ది ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ'. ఆచార్యులవారు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లములందు చక్కని పండితులు. మంచి సంగీతజ్ఞులు. అసలు క్షేత్రయ్య పదము లను ప్రచారమునకు తెచ్చినది వీరే! వీరిది చాల కమ్మని గాత్రమని చెప్పుదురు. నాటకములందు పద్యములను పఠింపవలసిన రీతిలో వీరు క్రొత్తమార్పు తెచ్చినారట.

3. ఆంగ్లమున నాటకములు వ్రాసిన మరికొందరు తెలుగువారినిగూర్చికూడ ఈ సందర్భమున పేర్కొనవలసియున్నది;

శ్రీ కె. కృష్ణారావు (సబార్డినేటు జడ్జి, కాకినాడ) 1872 ప్రాంతముల 'Chandrahasa' అనెడి ఆంగ్లనాటకమును వ్రాసి ప్రచురించిరి. ఇది నాడు రంగస్థలమున విజయవంతమైన రచన. శ్రీ టంగుటూరి శ్రీరాములు (ప్లీడరు - రాజమండ్రి) 'Prithviraj and Tarabai' అనెడి ఆంగ్లనాటకమును రచించి 'కార్లీనియన్' అనెడి పత్రికలో వరుసగా ప్రకటించిరి. దీనికి శ్రీ మంగిపూడి వేంకటరత్నశర్మ అనువాదము 1913 లో ప్రకటితమైనది.

శ్రీ కొప్పరపు సుబ్బారావు 'Ali Baba' అనెడి ఆంగ్లనాటకమును రచించి, తొలి ప్రపంచసంగ్రామ సమయములో సైనికుల ఆహ్లాదనార్థము, మెసపొటేమియాలో ప్రదర్శింప జేసిరి.

తృతీయాధ్యాయము

# రచనాప్రయోగముల విస్తృతి

## భూమిక

క్రీ. శ. 1900 నాటికి నాటకరచనా-ప్రదర్శనవ్యాసంగములు తెలుగుదేశములోని అన్ని ప్రాంతములకును వ్యాపించిపోయినవి. దేశమునందంతటను అనేక నాటకసమాజములు వెలసినవి; నటులనేకులు వెలుగులోనికి వచ్చిరి. ప్రజలకును నాటకములపై నభిమానమంకురించినది. సమాజములవారి కోరికలను మన్నించి రచయితలు క్రొత్తక్రొత్తనాటకములను రచించుటకు పూనుకొనిరి. 1900 నాటికి స్థిరపడిన స్వతంత్రనాటక రచనారీతులలో ముఖ్యముగా పేర్కొనదగినవి మూడు కలవు—1. కన్యాశుల్కమువలె కల్పిత సాంఘికేతివృత్తములతో నాటకములను రచించుట; 2. ప్రతాపరుద్రీయమువలె చారిత్రక కథలను నాటకీకరించుట; 3. జాతీయోద్యమమును దృష్టిలోనుంచుకొని, పౌరాణికగాథలను స్వీకరించి, ప్రబోధాత్మకముగా రచించుట. 1900 తరువాత పై మువ్విధములగు రచనలనుచేసిన వారిలో కోలాచలం శ్రీనివాసరావుగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగార్లు ప్రథములేకాక ప్రధానులుకూడను. శ్రీనివాసరావుగారి నాటకరచన 1894 ప్రాంతములందే ఆరంభమైనది. లక్ష్మీనరసింహారావుగారి రచన 1900 లో ప్రారంభమైనది. అయినను వారు ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగార్ల వర్గమునకే చెందినవారగుదురు. అందుచేత వీరినిగూర్చికూడ ఇంతకుముందే వివరించుట జరిగినది.

ఇంక ఈ కాలమున సమాజములును, నాటకరచయితలును అధికమగుటచేత ఒకరు అనువదించిన నాటకమునే పలువురు అనువదించుట, ఒకరు నాటకీకరించిన కథనే కైకొని పలువురు నాటకములను వ్రాయుట జరిగినది. ఈ కాలమున అభిజ్ఞానశాకుంతలమునకు ఇరువది వరకును[1], ఉత్తరరామచరితకు పదివరకును అనువాదములువెలసినవి. అట్లే స్వతంత్రనాటకముల విషయమునను పునరుక్తి యధికముగ కన్పట్టుచున్నది. సమాజముల మధ్యగల స్పర్ధలిందులకు గారణమని చెప్పవచ్చును. ఒకకథనే పలువురు నాటకీకరించుటయేకాక-కోలాచలంవారివలె పానుగంటివారివలె—ఇరువదికిపైగా నాటకములను రచించిన రచయితలు ఈ కాలమున పలువురు వెలసిరి. మరియు నీకాలమందే నాటకపోటీలు ఆరంభమైనవి. నటవృత్తికి గౌరవమేర్పడినది. వృత్తినటులేర్పడినారు. ధర్మవరమువారి ప్రభావమువలన నాటకములందు పద్యము

లకు, పాటలకు విలువ హెచ్చిన కాలమిది. ఎంతటివారైనను ప్రజల యీ యభిరుచికిలొంగి తమ నాటకములందు పద్యములను పాటలను విరివిగా చేర్చుట కారంభించినారు. ఇంక పాటలు లేని నాటకములందు జనరంజనార్థము పాటలను సమకూర్చుటకు కొందరు రచయితలు బయలు దేరినారు. ప్రజలకు పద్యములపై, గేయములపై మోజు హెచ్చుటతో అంతకుముందు కేవలము వచననాటకములు వ్రాసిన రచయితలుకూడ తమపద్ధతిని, అభిరుచిని మార్చుకొని ఆయానాటకముల ముద్రణ సమయములందు పద్య-గేయములను విరివిగా చేర్చుటకారంభించినారు. ఇట్లు తయారైనవే చిలకమర్తివారి గయోపాఖ్యాన ప్రభృతి నాటకములు. ధర్మవరమువారి చిత్రనళీయమందు 217 పద్యములు, 78 పాటలు కలవు. చిలకమర్తివారి గయోపాఖ్యానమందు 193 పద్యములు చేరినవి. బలిజేపల్లివారి హరిశ్చంద్రలో 198 పద్యములు, 22 పాటలు కలవు. తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగమందు 338 పద్యములు కలవు ; కొందరు పాటల, పద్యముల యందున్న ప్రీతిలో తమ నాటకముల పేర్లకుముందు 'సంగీత' పదమును చేర్చుట కారంభించినారు (సంగీత హరిశ్చంద్ర, సంగీత సావిత్రి మొదలగునవి).

ఈ కాలమందలి యింకొక ముఖ్య విశేషము తెలుగుదేశమున వ్యాపారరంగస్థలము విజృంభించుట. ఈ హేతువుల ఫలముగా ప్రదర్శనములందు అద్భుతములైన 'సీనరీ'లకును, నటుల సంగీతమునకును ప్రాధాన్యము హెచ్చినది. చాలమంది కవులు తమ రచనలలో నిర్మాణ శిల్పమునకు ప్రాధాన్యమొసంగుట మానివేసి, కేవలము జనరంజకముగా మాత్రమే వ్రాయుట కారంభించినారు. కావున ఈ కాలమున వెలసిన నాటకకర్తలను స్థూలముగా నాలుగువర్గములుగా విభజింపవచ్చును. అందు మొదటి రెండు వర్గములలో ప్రదర్శన సౌలభ్యముతోపాటు సాహిత్య గౌరవమునుకల స్వతంత్ర రచనలను చేసినవారు చేరుదురు. మూడవవర్గమున ప్రదర్శనమందంతగా దృష్టిలేనివారును, అనువాదములు చేసినవారును చేరుదురు. ఇంక నాలుగవ వర్గములో అధికముగా ప్రదర్శనసౌలభ్యములు కలవియై, రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శింపబడిన రచనలను చేసినవారు చేరుదురు. ఈ రచనల విజయమునకు సమాజముల వారి అద్భుతమైన సీనరీలు నటులసామర్థ్యము అధికముగా తోడ్పడినవని చెప్పుట అసమంజసముకానేరదు.

సంస్కృత, ఆంగ్లభాషల నుండియేకాక దేశభాషల నుండి అనువాదములో, అనుసరణములో, తెలుగులో వెలయుట ఈ కాలమందలి మరియొక విశేషము.

క్రీ. శ. 1910లో గుంటూరులోని యువజనసంఘమువారు ప్రత్యేకాంధ్రరాష్ట్రసిద్ధికి నాందీగీతము పాడినారు; అది 1913 లో ఆంధ్రమహాసభ స్థాపనకు కారణమైనది. 1916 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసుమహాసభ డా. పట్టాభిసీతారామయ్యగారి పట్టుదల వలన భాషాప్రయుక్త రాష్ట్ర విభజనమునకు అంగీకరించినది. దీనితో ఒకప్రక్క జాతీయస్వాతంత్ర్య సంపాదనా దీక్ష, ఇంకొకప్రక్క ప్రత్యేక రాష్ట్రసంపాదనాదీక్ష ఆంధ్రులను ఆవరించుకొన్నవి. ఈకాలమున వీనిప్రభావము ప్రచ్ఛన్నముగా నున్నను, తరువాతికాలములో ఇవి సాహిత్యరంగమున ఉద్యమములగుట గమనింపవచ్చును.

## ప్రథమవర్గము

ఈకాలమున ప్రదర్శనసౌలభ్యముతోపాటు సాహిత్యగౌరవమునుగల నాటకములను రచించినవారు ప్రథమ, ద్వితీయవర్గములకు చెందుదురని పేర్కొనియున్నాను. ఇందు ప్రథమ వర్గమునకు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, శ్రీ తిరుపతి వేంకటకవులు చెందుదురు. కోలాచలమువారి రచనలలో పెక్కు ఈకాలమున వెలసినవే. ఇంక పానుగంటివారి రచనలన్నియును ఈకాలమునకు చెందియున్నవి. కాగా, ఇంతకుముందరి అధ్యాయమునందే ఈ ఇరువురిని గూర్చి వివరింపబడినప్పటికిని, న్యాయ్యముగా ఈ ఇరువురును ఈ ప్రథమవర్గమునకు చెందినవారే అగుదురని గుర్తుంచుకొనవలసియున్నది.

### శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి :[1]

పలువురు మహాకవులు వేయి సంవత్సరములపాటు కృషిచేసి సృష్టిచేసినయంత తెలుగుసాహిత్యమును తామొక్కరే సృష్టిచేసిన మహామహులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. వీరు మహోపాధ్యాయ–కళాప్రపూర్ణ–కవిసార్వభౌమ బిరుదాంచితులు. గజారోహణ–గండపెండేర–కనకాభిషేక సన్మానములందిన కవిరాజులు. ఆంధ్రప్రదేశప్రభుత్వ ఆస్థానకవులు (Poet-Laureate)గా నియమితులయినవారిలో వీరు రెండవవారు. భారత–భాగవత–రామాయణములను పూర్ణముగా నాంధ్రీకరించుటతోపాటు ఇంచుమించుగా 200 గ్రంథములను రచించిరి. ఒక అర్ధశతాబ్దిపాటు తెలుగు సారస్వత ప్రపంచమునేలిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు వీరికి శిష్యులు.

కృష్ణమూర్తిశాస్త్రిగారు మొత్తము 32 నాటకములను రచించిరి; ఇందులో 21 నాటకములు ముద్రితములైనవి. తొలినాటకము 'కలభాషిణి' 1902 లో ముద్రితమైనది. భారతాద్యనువాదములందు యథామాతృకానువాదమును పాటించినట్లే, నాటకరచనలో శాస్త్రిగారు ప్రాచీన లక్షణములను తు, చ తప్పక యనుసరించియున్నారు. "నాటక నియమములన్నియు నిందు నెలకొల్పితినని విజ్ఞప్తి గనుగాని శీఘ్రకాలములోనైనను గొంచెము శ్రద్ధచేసియే యీనాటకమును రచించితిని" అని వారు వినయభరముతో అవతారికలో చెప్పుకొనినారు. మరియు నిందు పాటకనుకూలముగా ప్రస్తారాగతములగు కొన్ని క్రొత్త వృత్తములు రచించి, రాగతాళములు సూచించియున్నారు. కళాపూర్ణోదయ కథలోని పూర్వభాగమందలి కలభాషిణీ–మణికంధరుల సమావేశమువరకుగల కథను గ్రహించి, కొన్నిచోట్ల కొంతకొంత మార్చియు, కొంతకొంత చేర్చియు, కొంతకొంత పేర్చియు కథానాయికయగు కలభాషిణిపేర ఏడంకముల నాటకమును రచించినారు. కాగా కళాపూర్ణోదయ కథకును, దీనికిని చాల వ్యత్యాసము కన్పట్టుచున్నది. మొత్తముమీద రచనయంతయును ఔచిత్యసహితమై యొప్పుచున్నదని చెప్పవచ్చును. పద్యరచన పింగళి సూరన పద్యరచనతో దీటువచ్చునని చెప్పజాలముకాని, మొత్తముమీద బాగుగనే యున్నది. కలభాషిణీ పాత్రపోషణము విషయములోకూడ శాస్త్రిగారు కొంతస్వాతంత్ర్యమును చూపించియున్నారు. నీచపాత్రములకు వ్యావహారికభాష నుపయోగించియుండుట గమనార్హము.

నాయకపతనము నిరూపింపరాదను విశ్వాసముగలవారైనను శాస్త్రిగారు రెండుమూడు నాటకముల నశుభాంతముగానే రచించియున్నారు. అందులో "తిలకమహారాజ నాటక" మొకటి (1922). బొబ్బిలియుద్ధనాటక మింకొకటి. వేణీసంహారాది సంస్కృతనాటకముల ననువదించుటతోపాటు వీరు రెండు ఆంగ్లనాటకములనుగూడ ననువదించియున్నారు—1. వీరసేన విజయము (పెరికిల్స్); 2. మోహినీమనోహరము (ట్వెల్ఫ్‌నైట్-1915). ఇంక రాజభక్తి నాటకమనునది 12-12-1911 నాడు జరిగిన జార్జి పట్టాభిషేకోత్సవమును పురస్కరించుకొని వెలువడిన నాటకము.

### శ్రీపాదవారి 'బొబ్బిలియుద్ధనాటకము':

కృష్ణమూర్తిశాస్త్రిగారి నాటకము లన్నింటను ఎక్కువ ప్రసిద్ధిగన్నది వారి 'బొబ్బిలి యుద్ధనాటకము' (1908). అంతకుముందే కాళ్ళకూరివారి రంగరాయకదనసమవకారము వెలువడియున్నది; కాని, అది తమకంత సంతోషము కలిగింపలేదనిచెప్పి, వేరొక నాటకము వ్రాయుడని ఇమ్మానేని హనుమంతరావునాయుడుగారు శాస్త్రిగారిని ప్రోత్సహించిరి. అంతట నాటి చరిత్రను తెలుపుగ్రంథములను పరిశోధించి, శాస్త్రిగారీ రచన చేసియున్నారు. అటుపిమ్మట మరి కొన్ని బొబ్బిలియుద్ధనాటకములు బయలుదేరినవి. కాని అన్నింటిలోను శాస్త్రిగారి రచనయే బహుళవ్యాప్తిని, ఖ్యాతిని పడసినది.

బొబ్బిలినాటకము లన్నియును రంగరాయాది వీరుల ప్రశస్తిని తెలుపునవియే; అన్నింటను రంగరాయడుత్తముడుగాను, విజయరామరాజు కుట్రదారుడుగాను చిత్రింపబడెను.[2] అంతమున చిన్నరంగరాయ పట్టాభిషేకము చిత్రింపబడును. కాని, ఆద్యంతము విషాదచ్ఛాయలతో కూడిన ఇతివృత్తమిది. ఇందు నాయకుడు రంగారావే కాన, ఇది నాయకమరణముతో కూడిన ఇతివృత్తముకూడ నగుచున్నది.

ఇందలి నాయక-ప్రతినాయక-రసాదులనుగూర్చి పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు కొన్ని ఆక్షేపణములను చేసియున్నారు.[3] అందు కొంత సత్యమున్నను, అసలు, నాటకరచనలో నున్న జిగిబిగువులను కాదనుటకు వీలులేదు. శాస్త్రిగారు దీనిని విషాదనాటకముగానే మనస్సులో భావించి, తదనుగుణముగా రచన సాగించియున్నచో ఇది ఇంకను వన్నెకెక్కియుండెడిది. ఈనాటకములోని ప్రథమవిశిష్టత సరళపద్యరచన. అది పద్యనాటకయుగముకదా! శాస్త్రిగారిందు పాత్రోచితభాషను ప్రయోగించియున్నారు; మొదట బుస్సీకికూడ గ్రామ్యమే వాడిరిగాని నాటకమంతయును, ముఖ్యముగా ద్వితీయాంకము గ్రామ్యభాషాభూయిష్ఠ మగుననెడి జంకుతో మరల మంచిభాషగా సవరించినారట. "అది నాతప్పుగానెంచక ప్రదర్శకులు తదుచితభాషలోనికి మార్చుకొనిన మార్చుకొందురుగాక" అని కూడ వారు పేర్కొనియున్నారు.

1916 లో శాస్త్రిగారు బొబ్బిలియుద్ధనాటకపు పోటీలను రాజమండ్రిలో స్వయముగా నిర్వహించియున్నారు.

**శ్రీ తిరుపతి వేంకటకవులు[4] :**

"దోసమటంచెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుబాసలకు మేమె కవీంద్రులమంచుఁ దెల్పఁగా;
రోసము కల్గినం గవివరుల్ మము గెల్వుఁడు-గెల్చిరేని యీ
మీసము తీసి మీ పదసమీపములం దలలుంచి మ్రొక్కమే."

అన్న ప్రతిజ్ఞతో, 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదాంచితులై తెలుగు సారస్వత సామ్రాజ్యమును నిరంకుశముగ నేలిన కవులజంట శ్రీ తిరుపతి వేంకటకవులు (దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగార్లు). వీరికాల మాధునికాంధ్రసారస్వతములో ఒక సువర్ణఘట్టము. జంటకవిత్వమునకు, ఆశుకవిత్వమునకు, అవధానకళకు ఎనలేని గౌరవమును కూర్చినవారగుటయేకాక నూత్నకవిత్వమార్గమునకు మార్గదర్శకులైరి. నేటి సుప్రసిద్ధ కవిపండితులలో నించుమించుగా నందరును వీరికి సాక్షాచ్ఛిష్యులే. ఈకవులపై వేంకటశాస్త్రిగారి ప్రభావ మనల్పము. కవిసమ్రాట్టు విశ్వనాథసత్యనారాయణగారు పేర్కొన్నట్లు "శత్రుపర్వతశతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేంకనగురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుఁగునాడునన్"; అంతియే కాదు "వానలో తడియనివారు మద్గురువధాన మరందధారలో గడుగనివారు మాకెచటఁ గానగ రారిలఁ దెల్గునాడులన్". ఇంక వేంకటశాస్త్రిగారే "కవనార్థమ్ముదయించితిన్; సుకవితాకార్యంబె నావృత్తి: మద్భవమద్దానఁదరింతు; తద్భవము మద్భాగ్యంబు" అని చెప్పుకొనుట స్మరణీయము. వీరికి 1933 లో బందరులో జరిగిన షష్టిపూర్త్యుత్సవము, 1949 లో ప్రభుత్వ ప్రథమ ఆస్థాన కవిగా వీరు నియమింపబడినప్పుడు బెజవాడలో జరిగిన సన్మానోత్సవము తెలుగు సారస్వత చరిత్రలో అపూర్వఘట్టములు. వేంకటశాస్త్రి గారు పూర్ణచరిత్రులు.

తిరుపతి వేంకటకవులపేర నేడు 16 రూపకములు, రెండు ప్రహసనములు కన్పట్టుచున్నవి; ఇందులో కొన్ని కేవలము తిరుపతి శాస్త్రిగారు రచించినవి, మరికొన్ని వేంకటశాస్త్రి గారు రచించినవి; తక్కినవి ఇరువురును కలిసి వ్రాసినవి—కాని, మొత్తమన్నియును ఇరువురి పేరనే చెల్లుబడియగుచున్నవి;[5] వారి యన్యోన్యత యట్టిది.

తిరుపతి వేంకటకవుల నాటకములలో తొలిరచన ఐదంకముల "పండితరాజము" (రచన-1900 ప్రాంతములు; ప్ర. ము. 1909). ఇందు వీరు తెలుగుదేశపు విద్వత్కవియైన జగన్నాథ పండితరాజుకథను స్వీకరించి, అపూర్వముగా తీర్చిదిద్దినారు. యవనియనబడు 'లవంగి' పాదుషా కుమార్తెకాదనియు, కారణజన్మురాలనియు, బ్రాహ్మణకన్యయనియు చిత్రించినారు. లవంగికి స్వప్నములో అంబికకన్పట్టి, పండితరాజు చిత్రముచూపి, 'ఇతడేనీభర్తకాగల' డని చెప్పినది; ఇది ప్రభావతీ ప్రద్యుమ్నమందలి సన్నివేశము ననుసరించిచేసిన కల్పన. గంగాలహరిని పఠించి (దీనిని పూర్ణముగాతెనిగించి యిందుచేర్చిరి), పాదములవరకుపొంగివచ్చిన గంగలో పండితరాజు అంతర్హితుడయ్యెనని లోకప్రతీతి; కాని,వీరు దీనిని సుఖాంతమొనర్చి పండితరాజును వెలివెట్టి బాధించినవారందరును పశ్చాత్తప్తులైనట్లు మార్చిరి. ఇంక భాషావిషయమున నవలంబింపబడిన రీతిని వారే పేర్కొనిరి—"......పాదుషా మొదలైన కొన్ని తురుష్కపాత్రము

లకు నందజితో(బాటుగా( దెలు(గే వాడ(బడినది. అయ్యెడ(ద త్తదుచితముగా భాషమార్చికొన( బ్రదర్శకులు హెచ్చరింపబడుచున్నారు.....గద్యములలో నచ్చటచ్చట రసోచితముగా గ్రామ్యము వాడ(బడినది."

1902 లో ఏడవ ఎడ్వర్డు పట్టాభిషేకము జరిగినది; దానిని పురస్కరించుకొని, వ్రాయబడిన నాటకము "శ్రీ మదెడ్వర్డు పట్టాభిషేకము" (1904); ఇందులకు ప్రోత్సాహకులు ఈకవులకు పోషకులగు రామచంద్ర వేంకటకృష్ణరావు బహద్దరుగారు; ఈ రచన కాదర్శమైనది విద్యానాథుని ప్రతాపరుద్రీయమందలి "ప్రతాపరుద్ర కళ్యాణము." తాను చెప్పిననాటక లక్షణమునకు లక్ష్యముగా విద్యానాథుడు రచించిన నాటకమది. అట్లే, తిరుపతివేంకటకవులును దీనిని నాటక లక్షణమునకు లక్ష్యముగానే రచించి, అధస్సూచికలందు లక్ష్యలక్షణ సమన్వయముచేసియున్నారు. తెలుగు స్వతంత్ర నాటకములవిషయమున నిట్టి లక్ష్య-లక్షణసమన్వయ మపూర్వమని చెప్పకతప్పదు. ఇందులో కొన్ని కల్పనలు (విక్టోరియా మహారాజ్ఞి స్వప్నవృత్తాంతము మొ॥) ఉన్నను అవి, మొత్తముమీద, ప్రధానకథకు భంగములేకుండగా చేయబడినవే. ప్రధాన పాత్రములకుతప్ప తక్కిన వారికిందు తెలుగుపేర్లే వాడియున్నారు. సమకాలికేతివృత్తమును స్వీకరించి తెలుగున నాటకీకరించినవారిలో బహుశః వీరే ప్రథములుకావచ్చును. ఇట్టిదియే వీరి యింకొకరచన "బొబ్బిలి పట్టాభిషేకము;" ఇది 1928 లో జరిగిన బొబ్బిలిరాజావారి పట్టాభిషేక సందర్భమున వేంకటశాస్త్రిగారిచే రచింపబడినది. 'దంభవామనము' న దేవేంద్రాదులను మాతృభక్తి పరాయణులనుగా చిత్రించి, అందువలననేవారు తిరిగి స్వర్గమును గెల్చుకొనినట్లు చేసిన కల్పనయు; 'ప్రభావతీ ప్రద్యుమ్నము' లో సుచిముఖిపాత్రనట్లే నిలుపుటయు ప్రత్యేకముగా గమనార్హము. 'వ్యసన విజయము' జూదమనెడి వ్యసమువలన కలిగెడి కష్టములను నిరూపించెడి ప్రకరణము; మూడవ అంకము సగములో ఈరచన ఆగి పోయినది.

ఈ కవుల ఆంధ్రీకృత నాటకములలో 'మృచ్ఛకటికము' (1907) ప్రధానమైనది, (వావిలాల వాసుదేవశాస్త్రిగారి మృచ్ఛకటికానువాదము 1892 లోనే జరిగినది కాని దానికంత ప్రశస్తిరాలేదు). అసలు, ఇందలి కథ జనరంజకమైనది; ఆ పైని శూద్రకుని రచన మనోహరమైనది, దీని సహజస్ఫూర్తికి తిరుపతివేంకటకవులశైలి మరింత వన్నెతెచ్చినది. ఇందలి గద్య పద్యములు ద్రాక్షాపాకమునబడినవి. మృచ్ఛకటిక ప్రకరణమెంతమనోహరమైనదో తత్ప్రదర్శనమంత క్లిష్టమైనది. అందుచేత దీనిని ప్రదర్శించుటకు చాలకాలమువరకును ఎవ్వరును సాహసింపలేదు. దీనిని ప్రప్రథమముగా తెలుగునాటకరంగమున విజయవంతముగా ప్రదర్శించిన వారు ఏలూరులోని 'మోతేవారి కంపెనీ' అని తెలియుచున్నది (1924 లో). అటు పిమ్మట శ్రీయుతులు కొప్పరపు సుబ్బారావు, భమిడిపాటి కామేశ్వరరావు, వావిలాల సోమయాజులు, మల్లాది వేంకటకృష్ణశర్మ ప్రభృతులు ఈ కథనే స్వీకరించి కొన్నిమార్పులనుచేసి, ఎక్కువ ప్రదర్శనానుకూలతను కలిగించి 'వసంతసేన' అన్న పేరుతో నాటకములను రచించిరి. కాని తిరుపతి వేంకటకవులశైలి మరియొకరికి పట్టుబడునదికాదు.

**తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగ విజయములు':**

తిరుపతి వేంకటకవుల నాటకములలోనేకాదు, తెలుగు నాటకములలోనే ఇంతప్రసిద్ధి గన్న నాటకములను వ్రేళ్ళమీద లెక్కింపవచ్చుననుట అతిశయోక్తి కాదు. 1903 లో తిరుపతి శాస్త్రిగారు "పాండవ విజయము"ను రచించి ప్రకటించినారు. వేంకటశాస్త్రిగారు దానినే పెంచి, 1911 లో ఉద్యోగము, విజయము అను పేర రెండుభాగములు చేసినారు; అవియే సుప్రసిద్ధములైన 'పాండవోద్యోగము;' 'పాండవ విజయము'—వీనిని కలిపి సాధారణముగా 'ఉద్యోగ విజయములు' అందురు.[6]

అసలు, తిరుపతివేంకటకవుల శైలిరంగప్రదర్శనోచితమైనది; వారి నాటకములఖ్యాతి కిదియే మూలహేతువు. వేంకటశాస్త్రిగారు పాండవోద్యోగ విజయములను రచించునాటికి తెలుగు దేశములో పద్యనాటకములపై (అనగా నాటకములందు ఎక్కువపద్యములుండుటపై) మోజు హెచ్చినది. అది దృష్టిలోనుంచుకొని శాస్త్రిగారు మనోజ్ఞమైన శైలిలో వందలకొలది పద్యములను రచించినారు; అవి చదువుటకుకాని, వినుటకుకాని విసుగునుకలిగింపవు; ఈ పద్యములవలననే ఎందరో నటులు సుప్రసిద్ధులైరని చెప్పవచ్చును.[7] కాగా, ఈ నాటకములందు సన్నివేశచమత్కృతి కంటె, పద్యరచనా చమత్కృతియే అధికమని అంగీకరింపక తప్పదు.

పానుగంటివారు రామాయణకథను విభజించుకొని, నాలుగు నాటకములుగా రచించినట్లే, తిరుపతివేంకటకవులు భారతకథను విభజించుకొని ఆరునాటకములుగా రచించియున్నారు. (ఇట్లే రామాయణ నాటకములను కూడ వ్రాయదలంచియు, పానుగంటివారు రామాయణ నాటకములు వ్రాయుటచేత వీరాప్రయత్నము చేయలేదందురు). కాంగ్రెసువారు స్వరాజ్య తీర్మానమొనరించి, తత్సాధనకై పోరాడుచున్న రోజులవి; దేశీయులను తత్సమరోన్ముఖులను చేయవలసిన భారము తమపైనున్నదని నాటికవులు గ్రహించియున్నారు; అందుల కధికముగా తోడ్పడునవి నాటకములు. నాటకముల రూపమున పూర్వాంధ్రజాతీయవీరుల చరిత్రలను ప్రదర్శించినచో ప్రజలలో చైతన్యము సులువుగాకలుగును. ఈదృష్టితో కొందరు చారిత్రకగాథలను స్వీకరింపగా, వేంకటశాస్త్రిగారు భారతకథలనెన్నుకొనినారు; ఆదృష్టితోనేప్రధానముగా ఉద్యోగవిజయములందు పాండవులను 'ధర్మవీరు' లనుగా చిత్రించియున్నారు. (అచ్చటచ్చట మాతృదాస్య విమోచనము, స్వాతంత్ర్య సంపాదనము మొదలగు భావములిందు పొందుపడుట స్మరణీయము).

ఉద్యోగవిజయముల ప్రశస్తినిగూర్చి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పినమాటలు చాల సమంజసములుగానున్నవి—"పేలవముకాని సుబోధకత, భారముకాని ఉదారత–ఇవి రెండును ఈ నాటకములకు పెట్టనినగలు, మరియు, జాతీయవీరత్వమును, ధర్మాచరణమును ఈ నాటకములు తిరిగి జ్ఞాపకముచేయుచుండుట కూడ ఈ నాటకప్రసిద్ధికి హేతువులు. ఇవి రంగప్రయోగమును మాత్రమే దృష్టిలోపెట్టుకొన్నవి కాక, సాహితీగౌరవమును కూడ సంపాదించుకొన్నవియగుటచేత చిరస్థాయిగా నిలువగలవనుటలో సందేహములేదు. సంస్కృతవేణీ సంహారాదులలో విడువబడిన కొన్ని అందమైన ఘట్టములు–కృష్ణరాయబారాదులు–ఇందులో

పూరింపబడినవి." అంతియేకాదు పాత్రపోషణము కూడ చక్కగా జరిగినది-కృష్ణుని ప్రపంచ నాటకసూత్రధారిత్వము, దుర్యోధనుని రాజసము, ధర్మరాజునీతి, అశ్వత్థామయౌద్ధత్యము, భీష్ముని కృష్ణభక్తి, కర్ణుని స్వామిభక్తి మున్నగునవి ఇందు చక్కగానిరూపితములైనవి.

పౌరాణిక నాటకములలో నేటికినిరంగస్థలమును పాలించుచున్నవి ఉద్యోగవిజయములే. ఇందులోని పద్యములు, కనీసము నాలుగైదుఅయినను, నోటికిరాని నాటకకళాభిమాని యుండడన్నచో అది అతిశయోక్తికాదు.

## ద్వితీయ వర్గము

ఈ ద్వితీయవర్గమునందు వివరింపబడుచున్న రచయితలుకూడ ప్రథమవర్గమందలి వారివలె సుప్రసిద్ధులు. శ్రీపాదవారును, శ్రీ తిరుపతి వేంకటకవులును ఏ యొక సమాజమునకును చెందినవారుకాదు. కాని, ఈ వర్గమందలి రచయితలు అంతయో ఇంతయో ఏదియో యొక సమాజమునకు చెందినవారుగానున్నారు. అయినను వారి కృషికి ఆయా సమాజములు పట్టుగొమ్మలైనవనుటకంటె, వారి సాహచర్యమున ఆ సమాజములు వన్నెకెక్కినవని చెప్పుట అసమంజసముకాజాలదు.

### శ్రీ జయంతి భావనారాయణ[1] :

భావనారాయణగారు చిన్నతనమున తమ పినతండ్రియును, అభినయ-సంగీతశాస్త్ర పారంగతులును అగు వెంకయ్యగారికి అమలాపురములో అంతేవాసులై విద్యనభ్యసించిరి. 1880 నుండియు కాకినాడలో స్థిరపడిరి. అచ్చట జగన్నాథపురములోనున్న యొక యువక నాటకసమాజమునకు 1884 ప్రాంతములలో దేశికులైరి. వీరి శక్తిని గుర్తించిన సింగితం అబ్బాయిగారు వీరిని వెంటనే తమ నాటకసమాజములోనికి తీసికొనినారు. అందులో వీరు ప్రముఖపాత్రలను ధరించి నాడు ప్రఖ్యాతివహించిరి. ఆ అనుభవమును పురస్కరించుకొని వీరు ఆరు నాటకములను వ్రాసిరి. 'కుముద్వతీ సారంగధరము' (1909) అనెడి నాటకమందు భావనారాయణగారు చిత్రాంగి నుంపుడుకత్తెగా చిత్రించియున్నారు. ఒక యోగిని (గౌతమి) పాత్రను కల్పించి కథాగమనసూత్ర మామెచేతనే ధరింపచేసినారు; అంతియేకాదు, ఏరచయితయును ప్రాముఖ్యమొసంగని సారంగధరుని భార్యకు-కుముద్వతికి-ఇందు నాయికాత్వము లభించినది. చిత్రాంగి వలపునకు లోబడి మామగారు రాజ్యపాలన నుపేక్షించుచున్నారని తెలిసికొని దుఃఖపడుచున్న కుముద్వతి తన భర్తయగు సారంగధరుడు పావురములవేట యనెడి వ్యసనాసక్తుడయ్యెనని విని మూర్ఛపోవును; ఇది నాటక ప్రారంభమందలి కథ. రాజ్య సంక్షోభమడగి, చిత్రాంగి కోపమునకు గురియై మరణశిక్షకు పాల్పడిన సారంగధరుడు తిరిగి కుముద్వతికి లభించుటతో నాటక మంతమగుచున్నది. రచనలో ప్రత్యేకించి చెప్పదగిన విశిష్టత లేదు. కాని సారంగధర కథకు మార్పుతేవలయుననెడి ప్రయత్నమే ఇందు ప్రధానము.

'సంగీతసభ' (1906) యందలి కథ ద్రౌపదీవస్త్రాపహరణమునకు సంబంధించి యున్నది. ధర్మరాజాదుల మయసభతో ప్రారంభమై ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరములిచ్చెడి కౌరవ సభతో అంతమగుటచేతను, గేయ బాహుళ్యము కలదగుటచేతను దీనికి 'సంగీతసభ' యనుపేరు పెట్టియుందురు. 'A Political Drama in Six Acts' అని ముఖపత్రముమీద వేసిరి; కాని, ప్రత్యేకించి విశేషార్థమేమియును కన్పట్టదు. కౌరవ-పాండవుల కలహము రాజకీయ కలహమని స్ఫురింపజేయుటకే అట్లు పేర్కొనియుందురు.

భావనారాయణగారి నాటకములన్నింటను విశిష్టమైనది 'ప్రత్యక్ష నారసింహము' (1913). ఇందు శ్రీమన్నారాయణుడు కథానాయకుడు; 'విష్ణుభక్తిదేవి' కథానాయిక. ఈ విష్ణుభక్తియే దైవ ప్రేరణమున ప్రహ్లాదరూపమున అవతరించినట్లు కథాబీజమును కల్పించి భావనారాయణగారీ నాటకమును చక్కగా నిర్వహించిరి. ఇది చాల పెద్దనాటకము. అయినను కొన్ని సమాజములవారు దీనిని చక్కగా ప్రదర్శించినారట. దీనికి పీఠిక వ్రాయుచు ఈ కవిని గూర్చి తిరుపతి వేంకటకవులు చెప్పినమాటలు పరిశీలనార్హములు—'...ముందుఁ గవితావనితచే వరింపఁబడినవారు పిదప భాషావనితకై ప్రయత్నింతురేని వారికది సులభసాధ్య యగునేకాని రసాభాసమును కలిగింపదు. ముందుగా భాషావనితచే వరింపబడినవారు పదంపడి కవితావనితకై పాటుపడినచో వారికది సులభసాధ్యమునుగాదు, రసాభాసమును బుట్టింపకయును మానదు. ఆ యుభయపక్షములవారిలో నీకవి మొదటి పక్షములోనే చేరినవారు...'

భావనారాయణగారు 'లోకోక్తి ప్రకాశిక' యనుపేర పదునెనిమిది వందల సామెతలను గ్రంథస్థము చేసినారట; అవి సర్వజనుల సంభాషణములందేకాక, గ్రంథములందును తత్తదుచిత స్థానముల నాక్రమించుకొనుచుండును.

## శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము[2] :

మద్రాసులో పట్టభద్రులై, విశాఖపట్టణముచేరి, కలాభిలాషక నాటకసమాజ స్థాపనములో లక్ష్మీనరసింహముగారు శ్రీ మారేపల్లివారికి కుడిబుజమైనారు. అంతియేకాదు వారితో పాటు ప్రముఖపాత్రలను ధరించినారు. అటుపిమ్మట జగన్మిత్రసమాజములోచేరి, అచట దేశికులైనారు. అందులకుతోడు ప్రాచ్య-పాశ్చాత్య నాటకసారస్వతమును చక్కగా పరిశీలించినారు. ఈ అనుభవముతో వీరు ఆరు నాటకములను రచించియున్నారు.

వీరి 'చిత్ర హరిశ్చంద్రీయము'[3] (1913) నందలి కథ ప్రాచీనమైనదే. కాని, 'బద్ధకులలో బద్ధకుడగు తాను ఒడలువంచి వ్రాయుటయే చిత్రములలో చిత్రమట !' అందుచేతనే తన నాటకము 'చిత్ర హరిశ్చంద్రీయ'మైనట్లు సూత్రధారునిచే చెప్పించినారు. కాని, నిజముగా ఇందు ప్రతి సన్నివేశమందును ఒక్కొక్క చిత్రమును వీరు కల్పించియున్నారు. విశ్వామిత్ర వశిష్ఠుల సంవాదమును సూత్రధారుడే సూచించినాడు. నాటక ప్రారంభమందు విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని సాధింప సమర్థుడైన శిష్యుని (నక్షత్రకుని)—రుద్రుడు తన జటలనుండి వీరభద్రుని పుట్టించినట్లు—పుట్టించును. హరిశ్చంద్రునకు గణపతియనెడు విదూషకుడు కల్పింపబడెను. చివర

చంద్రమతి కలహకంటకికినే చంపినట్లు నేరారోపణము చేయబడెను. తనమాట వినలేదని కుపితుడైన త్రిశంకువు ఆదిలో హరిశ్చంద్రుని పుత్రదుఃఖ మనుభవింపుమని శపించును. ఇట్టివే అనేక చిత్రవిషయములిందు కలవు. ఈ కారణములచేతనే దీనికి 'చిత్ర' పదము సార్థకమగుచున్నది. ఈ సన్నివేశకల్పనలవలన హరిశ్చంద్ర కథావిషయమున జనించెడు పెక్కు శంకలకు సమాధానములేర్పడినవని చెప్పవచ్చును.

ఈ నాటకప్రస్తావనలోని క్రిందివిషయమీ సందర్భమున గమనార్హము. నరసింహముగారు మద్రాసు రాజధానీకళాశాలలో వీరేశలింగముగారికి ఆరునెలలు శిష్యులైనారట; అందుచేత గురుస్తుతిచేయుచు క్రిందివిధముగా వారిని ప్రస్తుతించినారు—

"మోడుమ్రాఁకులు మొలకెత్తు పోల్కికావ్యములు రచించుటయేకాక
బోడితలలు మఱల మొలకెత్తఁజేసిన మాన్యుఁడెవడు?..."

ఈ గురుశిష్యుల కవిత్వములను సరిపోల్చి ఎవరధికులో తెలుపుమని మారిషుడడుగగా 'సెట్టి సేరు, లింగము పదిసేరు'లనెడి సామెతనుచెప్పి 'వీరి పేరులే తారతమ్యమును నిర్ణయించును. శూద్రుఁడైన లక్ష్మీనరసింహము బ్రాహ్మణాగ్రగణ్యుఁడైన వీరేశలింగముగారి పాదసేవకే అర్హుఁ'డని సూత్రధారుడు సమాధానమొసంగెను.

వీరి 'అహల్య' (1933) కేవలము వచననాటకము. దీనినికూడ నరసింహముగారు చాల 'చిత్రము'గా రచించియున్నారు. గౌతముని భార్య అసలుపేరు 'హల్య'; ఈమె బ్రహ్మపుత్రి. ఈమె తమ్ముడు ఋక్షవిరజుడు ప్రమాదవశమున అంబికాసరస్సున మునిగి స్త్రీగా మారిపోయెను. మరి ఇంక సంతానము కలిగినప్పుడే శాపవిముక్తి. హల్య గర్భిణిగా నున్నప్పుడు బ్రహ్మ ఆమెను దీర్ఘమూర్ఛలోముంచి, అచ్చముగా సోదరిపోల్కినున్న స్త్రీరూప ఋక్షవిరజుని ఆమెస్థానమందు నిల్పెను. ఈమె నిజమైన 'హల్య' కాకపోవుటచేత 'అహల్య' యనబడినది. ఈ సత్యమును గౌతముడుకూడ ఎరుంగడు. ఈ 'అహల్య'నే ఇంద్ర-సూర్యు లనుభవించిరి. నాటకాంతమున బ్రహ్మసభలో సత్యము బయల్పడును. కాని భర్తచే అనుమానింపబడిన దుఃఖముతో 'హల్య' లోకముముఖము చూడలేక తనంతతానే శిలారూపమును తాల్చును. కాగా, గౌతమభార్య 'హల్య'కు జారిణీత్వదోషమే పట్టలేదు. హల్యాగౌతముల పుత్రిక అంజన పుట్టుగ్రుడ్డి. ఆమె చరిత్ర ఇందు ఉపకథ. నారదుడు కథాగమనమునకు దోహదము చేసియున్నాడు.

నరసింహముగారీ నాటకమును విషాదాంతము చేసినారు. అసలు, నాటక నిర్వహణమంతయును తదభిముఖముగానే సాగినది. దీనికిని ఒథెల్లో నాటకమునకును పోలికలున్నవి— గౌతముడు ఒథెల్లోతోను, హల్య డెస్డిమోనాతోను, నారదుడు ఇయాగోతోను పోల్చుటకు తగినవారు; కాని ఆ నాటకమునందలి రక్తపాతాదులవంటి వానిని ఇందు కల్పింపకయే నరసింహముగారు దీనిని ఉత్తమ విషాదరూపకముగా నిర్మించియున్నారు.

### శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి[4] :

గుంటూరు ఫస్టుకంపెనీకి 1900 ప్రాంతముల పట్టుగొమ్మలైన ముప్పురిలో లక్ష్మీకాంతకవిగారొకరు; తక్కిన ఇరువురును శ్రీయుతులు హరి ప్రసాదరావు, కోపల్లె హనుమంతరావుగార్లు. కవులుగా, దేశికులుగా, సంగీతజ్ఞులుగా, నటులుగా, నాటకరచయితలుగా ప్రసిద్ధినందిన బహుముఖ ప్రజ్ఞావంతులు లక్ష్మీకాంతకవిగారు. కొంతకాల మవధానములుకూడ చేసినారు. సంగీతమున వీరు నిధులు. ఒకే రాగమును రాత్రి తెల్లవారువరకును, అలపులేకుండ, ఆలాపింపగల సమర్థులని చెప్పుదురు. రంగస్థలముమీద కన్నడ, శహన, బేగడ, ఆనందభైరవి మొదలగు రాగములను వ్యాప్తికి తెచ్చినవారు వీరే. వీరు ప్రముఖపాత్ర లెన్నియో ధరించి ప్రజలను రంజింపజేసినారట; అన్నింటను నక్షత్రకుడు వీరి అభిమానపాత్ర.

వీరు భవభూతి ఉత్తరరామచరితను గ్రహించి స్వేచ్ఛానువాదము చేసిరి. అంతియే కాదు కొన్నిచోట్ల క్రొత్తపద్యములనుకూడ రచించిరి. 'ఉత్తరరాఘవము' అని పేరు పెట్టుటలోనే తదర్థమంతయును వ్యక్తమగుచున్నది. ఉత్తరరామచరితమందలి రసమునుగూర్చి వాదోపవాదములున్నవి. కాని, లక్ష్మీకాంతకవిగారు 'కరుణ విప్రలంభ'మును అంగిరసముగా స్వీకరించి, తదుచితముగా నాటకమును తీర్చి దిద్దినారు. తమ వాదములను విపులీకరించుచు కవిగారు విపులమైన ఉపోద్ఘాతమునుకూడ రచించియున్నారు (10-7-1930).

### బలిజేపల్లివారి హరిశ్చంద్ర[5]:

హరిశ్చంద్రకథను స్కాందపురాణ మొకరీతిగాను, మార్కండేయపురాణ మింకొకరీతిగాను వివరించుచున్నవి. ఆచార్య క్షేమీశ్వరుని 'చండకౌశికము' మార్కండేయపురాణము ననుసరింపగా, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానాదులు స్కాందపురాణోక్తగాథ ననుసరించియున్నవి. ఇదియే నేడు ప్రచారమందున్నది. వీరేశలింగముపంతులుగారును ఈ కథనే అనుసరించి తెలుగులో ప్రప్రథమముగా హరిశ్చంద్రనాటకమును రచించిరి. ఇంద్రసభలోని 'సత్యము'ను గూర్చిన విశ్వామిత్ర-వశిష్ఠ సంవాదమును పంతులుగారే కల్పించిరి. అది రంజకముగానుండుటచేత పలువురాపద్ధతినే అవలంబించిరి. 1900 లో శ్రీ వ. సు. రాయుడుగారి చండకౌశికానువాదము వెలువడినది. 'చండకౌశికము' (మిక్కిలి కోపముగల కౌశికుని అనగా విశ్వామిత్రునియొక్క కథకలది) అనుటనుబట్టి ఇందు విశ్వామిత్రుడు నాయకుడగుచున్నాడు. హరి-హర-హిరణ్యగర్భుల విద్యాత్రయమును సాధింతునని విశ్వామిత్రు డుగ్రతపమునకు బూనుకొనెను; ఫలము చేతికందెడి సమయములో అనాలోచితముగ బ్రవేశించిన హరిశ్చంద్రునివలన విఘ్నము వాటిల్లెను. తత్కారణమున విశ్వామిత్రుడు హరిశ్చంద్రునిపై పగబూనెను. వశిష్ఠునిమీది పంతము కారణముగా హరిశ్చంద్రునిపై పగబట్టుటకంటె, తనకు అపకారముచేసిన హరిశ్చంద్రునిపై పగబట్టుట సమంజసముకాగలదు. ఇందు ఇంద్రసభ ప్రశంసయేలేదు. మార్కండేయపురాణగాథయాధారముగా మరికొన్ని క్రొత్త కల్పనలనుకూడ ఆచార్య క్షేమీశ్వరుడు చేసెను. (క్షేమీశ్వరుడు రాజశేఖరుని సమకాలికుడు కావచ్చును). కాని, ఆపద్ధతినెవ్వరును అనుసరించినట్లు కన్పట్టదు.

1889 లో కందుకూరివారి 'సత్య హరిశ్చంద్ర' నాటకము వెలువడినది మొదలు తెలుగులో అనేక హరిశ్చంద్రనాటకములు బయలుదేరినవి; కాని, అన్నింటను నాటికి నేటికి బహుళ వ్యాప్తికాంచి, సుప్రసిద్ధమైనది బలిజేపల్లివారి 'సత్యహరిశ్చంద్రీయము' (1912) మాత్రమే. దీనికింత ఖ్యాతివచ్చుటకు మూడు కారణములు చెప్పవచ్చును—గుంటూరు ఫస్టు కంపెనీవారి ప్రదర్శనల విశిష్టత; సత్యహరిశ్చంద్రీయపు పోటీల కిదియే మూలగ్రంథమగుట; పద్య రచనలోగల విశిష్టత. ఈ మూడింటను చివరి హేతువే ప్రధానమైనది. అది పద్యనాటకముల కాలమని ఇంతకుముందే పేర్కొనియున్నాను. లక్ష్మీకాంతకవిగారి పద్యములన్నియును మంచి పాకమునబడినవి. అవి కమ్మెచ్చున దీసినట్లు సాగుచు మనోహరములుగానుండును. ఆ కారణముగా నాటకకళాభిమానుల హృదయములను కైవశము చేసికొన్నవి. వచనశైలికూడ ఉదాత్తమై, నాటి యభిరుచులకు దగియున్నది. చెళ్ళపిళ్ళవారి పాండవోద్యోగవిజయములందలి పద్యములొకప్రక్కను, బలిజేపల్లివారి సత్య హరిశ్చంద్రీయములోని పద్యము లింకొకప్రక్కను, చిలకమర్తివారి గయోపాఖ్యాన పద్యములు మరియొకప్రక్కను తెలుగునాటకరంగమును ఒక అర్థశతాబ్దికిపైగా గుత్తకొన్నవన్నచో అతిశయోక్తి కాజాలదు.

## శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు :

'ఆంధ్రనాటక పితామహు'లకు తగిన సోదరులు గోపాలాచార్యులుగారు. వారి నాటకరచనకొక విధముగా ప్రోత్సాహకులు వీరేయని గుర్తించియున్నాము. అన్నగారితోనుండి భరతాది భూమికలను మనోజ్ఞముగా నిర్వహించెడివారు. అటుపిమ్మట హైదరాబాదులో వకీలు వృత్తి నారంభించినారు. కాని, అచ్చట నొక నాటకసమాజమును స్థాపించి, హరిశ్చంద్రాది నాటకములను స్వయముగా రచించి ప్రదర్శింపజేసినారు. అచ్చటనుండి 1910 ప్రాంతముల బళ్ళారికి తిరిగివచ్చి, 1912 లో అన్నగారితో కలసి, 'అభినవ సరసవినోదిని స్థాపించినారు. అది కృష్ణమాచార్యులుగారి మరణముతో వెంటనే ఆగిపోయినది. అటుపిమ్మట 'కృష్ణమాచార్య సభ' అను పేరుతో ఒక సమాజమునునడపి, దేశమంతయు తిరిగి ప్రదర్శనము లొసంగియున్నారు. ఈ సమాజమునకు రాఘవాచార్యులుగా రుపాధ్యక్షులుగా నుండిరి.

గోపాలాచార్యులుగారు బళ్ళారి తిరిగివచ్చినతరువాత మరికొన్నినాటకములను వ్రాసినారు. వారి మేనల్లుడే అయిన రాఘవాచార్యులుగారు ప్రతినాటకపు వ్రాతప్రతిని పరిశీలించి మార్పులు, కూర్పులు సూచించెడివారు[6]; ఆ ప్రకారమే గోపాలాచార్యులుగారు సరిదిద్దుకొనెడివారు; వారిరువురిమైత్రియు నట్టిది—అట్లు రూపొందినవే రామదాసు, సుభద్రార్జునీయము, రాం కబీర్ అనెడి నాటకములు. గోపాలాచార్యులుగారు మొత్తము 12 నాటకములను వ్రాసినట్లు తెలియుచున్నది[7]. అందులోను సుప్రసిద్ధములైనవికూడ పై మూడే. గోపాలాచార్యులుగారొక విచిత్రమైన నాటకమునుకూడ రచించియున్నారు. దీనిపేరు 'కెయిసర్' లేదా 'కలియుగ దుర్యోధన నాటకము' ఇందలి ప్రముఖ భూమికలుక్రిందివిధముగా నున్నవి— జర్మనీరాజు కైసర్—దుర్యోధనుడు; ఫ్రాంసు (ప్రణయదేశపు) రాజు—విరాటుడు; బ్రిటిషురాజు—అర్జునుడు; ఇండియా రాజు—కృష్ణుడు మొ॥ జగత్తునంతటిని తన ఏలుబడిలోనికి తెచ్చుకోవలెననెడి దుర్యోధనుని

దురాశతో నాటకమారంభమై, ధర్మవిజయముతో నాటకమంతమగును. ఇండియాదేశపురాజు అర్జునునకు తోడ్పడి దుర్యోధనుని అపజయమునకు కారకుడగును. ఇట్లిది కొంత పౌరాణిక వాతావరణము, మరికొంత చారిత్రకవాతావరణము, ఇంక కొంత ఆధునిక వాతావరణము కలసి కలగలపుగానున్నది. 'రాం కబీర్'లో కబీరుపాత్రను బహునిర్మలముగా పోషించుటకు ప్రయత్నించి, గోపాలాచార్యులుగారు కృతకృత్యులైనారు. ఇందు కబీరునకు 'హిందూస్తానీ' ఉపయుక్తమైనది. ఇంక సుభద్రార్జునీయములో ఘటోత్కచుని నాటకకథాగమన సూత్రధారుని చేసినారు. కథ పౌరాణికమైనను, జీవితమున కత్యంత సన్నిహితములుగా సన్నివేశములకూర్పు నిర్వహింపబడుట యిందలి విశేషము. ఇది రాఘవాచార్యులగారి కంకితము.

## గోపాలాచార్యులవారి 'రామదాసు'

తెలుగులోని రామదాసునాటకము లన్నింటిలోను బహుళవ్యాప్తి-ఖ్యాతులు పొందినది గోపాలాచార్యులుగారి 'రామదాసు' నాటకమే. కథ ముక్కోటి యాంధ్రులకు ప్రీతిపాత్ర మైనది. అంతియేకాదు నాటకరచనలో ఆరితేరిన గోపాలాచార్యులుగారి లేఖిని యిందు పరిణతి పొందినది. అందులకుతోడు కళాప్రపూర్ణులగు రాఘవాచార్యులవారి నటనాకౌశలము దీనికి వన్నె పెట్టినది[8]. హైదరాబాదులో నివసించినకాలములో గోపాలాచార్యులుగారు రామదాసు చరిత్ర వివరములను విమర్శించి సేకరించియుండిరి. కాగా వీరి రచన చరిత్ర కెక్కువ సన్నిహిత మగుట కవకాశమొదవినది. గోపాలాచార్యులుగారు పాత్రోచితభాష నాదరించినారు (పౌరులు మొదలగువారి కుపయోగింపబడినభాష 'మిశ్రభాష'యని పేర్కొనబడినది). కబీరు, తానీషా మొదలగువారికి నచ్చుమగు నుర్దుభాషనే వ్రాసి, ప్రక్కనే తెనుగును వ్రాసియున్నారు. 'వేష ధారుల శక్తికొలది, దర్శకుల రక్తికొలది' ఈ మాటలను వాడుకొనవచ్చునని వారు తెల్పిరి. ఇందు పద్యములు తక్కువ; పాటలెక్కువ. గేయ-పద్యరచన చాల సరళముగా సాగినది. ('భద్రాద్రిరఘురాము భజనకు చనుచుండ బంధుమిత్రులయాజ్ఞ పడయనేల?' మొదలగు పద్యము లిందలివే). రామదాసు భక్తిపారవశ్యమిందు బహు లలితముగా పోషింపబడినదనుట అతి శయోక్తికాదు. ఇందలి 'జైలు' రంగము నటులకు ఒరపిడిరాయివంటిది. బళ్లారి రాఘవా చార్యులుగారు ఈ రంగమునకు ఎనలేని ఖ్యాతి తెచ్చినారు. 'భక్తి'ని అంగిరసముగాచేసి నాటకము నుత్తమముగా నిర్వహించినవారిలో వీరు రెండవవారు; మొదటివారు 'రాధాకృష్ణ' నాటకకర్త యగు పానుగంటివారు.

## శ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ[9] : రసపుత్ర విజయము :

స్వరాజ్యోద్యమముచే సంపూర్ణముగా ప్రభావితులై నాటకరచనకు పూనుకొన్న తెలుగు వారిలో ప్రథములు ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారేయని చెప్పవచ్చును. 'దేశభక్తి' ప్రబో ధమే వీరి నాటక రచనాధ్యేయము; కావుననే తదనుగుణములైన చారిత్రక కథలనే వీరు స్వీక రించినారు. రసపుత్రవిజయములోని నాందిలో భరతమాతవందనము, 'రాణాప్రతాపసింగు' (రాజపుత్రతేజఃపుంజము)లో ఆంధ్రమాతప్రశస్తి యుండుట గమనార్హము. యజ్ఞనారాయణగారి

నాటకములన్నింటను సుప్రసిద్ధమైనది 'రసపుత్ర విజయము' (1910). నాడు దీనిని ప్రదర్శింపని నాటక సమాజమేలేదన్నచో నతిశయోక్తికాదు. ఇందు ఉదయపురరాణా రాజసింహుడు కథానాయకుడు. రూపనగరాధీశ్వరుని రెండవకుమార్తె విమల కథానాయిక. విమలసోదరి కేసరీబాయి ఔరంగజేబు పట్టమహిషి; ఆమెకు ఔరంగజేబు అవగుణములన్నియును పట్టువడినవి. ధన_ అధికార గర్వములతో కేసరీబాయి చెల్లెలిని అవమానింప సమకట్టి, చివరకు తానే అవమానము పొందెను; ఔరంగజేబు రాజసింహునితో తలపడి, ఓడిపోయి సంధిచేసికొనెను. విమలారాజసింహుల వివాహముతో నాటకము సుఖాంతమైనది.

రాజసింహుని విజయమునకు ఆతని సోదరియును జస్వంతసింహునిభార్యయును అయిన వీరమాతయును, జస్వంతసింహుని ప్రధాని దుర్గాదాసును తోడ్పడిరి. వీరమాత యోధపురుషుని వేషముతో వీరవిహారముచేసెను (పేరులోనే ఆమె పాత్రౌచిత్యము వెల్లడియగుచున్నది). ఇంక దుర్గాదాసుపాత్ర నాటి నటుల నటనాసామర్థ్యమునకొక గీటురాయిగా తలంపబడినది___యోగిగా, వీరుడుగా, మంత్రిగా ముమ్మూర్తుల నాతడు నాటకమందంతటను అలముకొనెను. పేరునకు రాజసింహుడు నాయకుడైనను, కథనంతయు నడిపించినది దుర్గాదాసే. ఇందు, సామాన్యులగు మహమ్మదీయులకు మిశ్రభాషయును; ఔరంగజేబునకు, వానికుమారుడగు అక్బరునకు మాత్రము గ్రాంథికభాషయును ప్రయుక్తమైనవి. యజ్ఞనారాయణగారిమీదకూడ నాటిపద్యనాటకముల ప్రభావమధికముగాకలదు. ఈచారిత్రక నాటకములో వారు మొత్తము 188 పద్యములను రచించినారు ! పద్యములు చాలవరకు మనోజ్ఞములుగానే యున్నవి.

రాజపుత్రతేజఃపుంజము కూడ పద్యమయనాటకమే; ఇందుపాటలు కూడ కలవు. పాటలలోనేకాక పద్యములలో కూడ యజ్ఞనారాయణ గారిందు 'సంవాదము' లను (duets) నడపుట గమనార్హము, మరియు, కృష్ణమాచార్య ప్రభృతులవలె ఒకేసీసమును వివిధరాగములతో నడిపించు ప్రయత్నమున దానిని ముద్రాలంకారయుక్తముగా కూడ రచించియున్నారు.

తెలుగున, చారిత్రకనాటకముల రచనలో ఒక క్రొత్తచైతన్యమును తెచ్చినఖ్యాతి యజ్ఞనారాయణగారికి చెందును.

### శ్రీ కాళ్ళకూరి నారాయణరావు :[10]

శ్రీ మజ్జగద్గురు శంకర భగవత్పాద ప్రసాదిత "మహాకవి"బిరుదాంచితులు నారాయణరావుగారు. వీరి నాటకరచన ముప్విధములుగా సాగినది___పౌరాణికములు, సాంఘికములు, ప్రహసనములు. వీరి సాంఘిక నాటకములకే ప్రచారమధికముగా వచ్చినది. కాని, పౌరాణిక నాటకములు కూడ చక్కగరచింపబడియున్నవి. "చిత్రాభ్యుదయము" (1909) అనెడి నాటకమునందు సారంగధర కథయే నిబంధింపబడినను కాళ్ళకూరివారిందు పెక్కుమార్పులను కావించినారు. సారంగధరకథ కట్టుకథ అనియు, అవినీతిదాయికమనియు తాము వ్రాసిన విపులమగు పీఠికలో నిరూపించియున్నారు. అందుచేతనే తమ నాటకమునకు 'సారంగధర' యను పేరు పెట్టినచో అందలి విశిష్టతను గణింపక ఇతరనాటములతోపాటే జమకట్టివేయుదురనెడి జంకుతో

'చిత్రాభ్యుదయ' మనెడి గూఢనామమునుంచిరి. ఈ నాటకమునకు వీరు విపులమైన అవతారిక కూడ సంతరించినారు.

పెద్దమంత్రికంటెను రాజునకు తానెక్కుడు కూర్చువాడు కావలయునని రెండవమంత్రి హరిశర్మ ప్రయత్నము. పెద్దమంత్రి గుణదేవుడు తీర్థయాత్రలకేగిన సమయములో రాజునకు చిత్రాంగిపై మోహము కలుగునట్లుచేసి, ఆమె యంగీకరించినచో వివాహమాడుట కొడంబడునట్లు చేసెను. హరిశర్మమాత్రము, సారంగధరునిపేరుచెప్పి, చిత్రాంగిని వానికత్తికే పెండ్లిచేసి, మోసముతో రాజధానికి తీసికొనివచ్చి, ఆమె రాజునే వరించినదనియు, రాజుకత్తికే వివాహమైన దనియు రాజును నమ్మించెను. మోసమును గ్రహించిన చిత్రాంగి కన్యాగౌరీవ్రతమిషతో రాజు కంటబడకుండ తప్పించుకొనుచు, నేర్పుతో సారంగధరుని తనమందిరమునకు రప్పించి సత్యము నివేదించును. కాని, ఆ పరిస్థితులలో, ఆమెను స్వీకరించుట కాతడొడంబడలేదు. ఆమె నిరాశతో గోదావరిలోబడెను. అచ్చట జరిగిన గందరగోళమునుబట్టి చిత్రాంగి ఆత్మహత్యకు సారంగ ధరుని దౌష్ట్యమేహేతువై యుండునని న్యాయాధిపతి యూహించెను. రాజు అంగీకరించి శిక్ష విధించెను. ఇంతలో యాత్రలనుండి తిరిగివచ్చుచున్న పెద్దమంత్రి గుణదేవుడు చిత్రాంగీ సారంగధరుల నిరువురను రక్షించి మీననాథాశ్రమమునకు చేర్చును. అచ్చట జరిగిన అంతర్నాటికా ప్రదర్శనమువలన సర్వమునెఱింగి పశ్చాత్తప్తుడైనరాజు చివరకు చిత్రాంగీ-సారంగధరులకు వివాహముచేయును; ఇదియే 'చిత్ర-అభ్యుదయము'.

కాళ్ళకూరివారు పైకల్పనలలో చాల స్వతంత్రించినారనుట సుస్పష్టమే. ఇందెచ్చటను అసభ్య సంభాషణలుకాని, అసభ్య సన్నివేశములుకాని, అభూతకల్పనలుకాని లేనేలేవు. తప్పంత యును ఒక మంత్రిమీదుగా బోయినది; తక్కినవారందరును నిర్దోషులుగానే చిత్రింపబడినారు. సారంగధర నాటకకల్పన లన్నింటను, ఇది మనోజ్ఞముగానున్నదని చెప్పవచ్చును. చిత్రాంగీ-సారంగధరులకు వివాహముచేసినవారు నారాయణరావుగారొక్కరే. నాడు, ఇది చాలసాహస మైనపని.

'పద్మవ్యూహము'దొరతనమువారి 1919 సంవత్సరపు నివేదికయందు, ఆసంవత్సరము ప్రకటింపబడిన యాంధ్ర గ్రంథములన్నింట నుత్తమమైనదిగా ప్రశంసింపబడినది. అభిమన్యు వధా సందర్భమున కలిగెడి ఐదు ఆశంకల నివారణమునకై తామీనాటకమును వ్రాసినట్లు నారా యణరావుగారు తెలుపుకొనినారు. ఇది వీర-అద్భుత రసప్రధానమై, ప్రదర్శనయోగ్యమై యొప్పు చున్నది. ఈ నాటకమున కృష్ణుడర్జునునకుచేసిన ఉపదేశమున స్వరాజ్యోద్యమమునుగూర్చిన ప్రబోధము చేయబడుట గమనింపదగిన విశేషము.

ఇంక నారాయణరావుగారి సాంఘికనాటకములు తెలుగునాటకరచనలోని తరువాతి దశకు సంబంధించియున్నవి. ఆ సందర్భమున ఆ నాటకములనుగూర్చి వివరింతును.

## శ్రీ శ్రీపాదకామేశ్వరరావు[11] :

తెలుగులో నాటకప్రయోగ విమర్శను క్రమపద్ధతిలో ప్రారంభించినవారు కామేశ్వర రావుగారే అన్నచో అతిశయోక్తికాజాలదు. హిందీ, బెంగాలీ భాషానాటకములను తెలుగులోనికి

అనువదించిన ప్రథములును కామేశ్వరరావుగారే అగుచున్నారు. 1908 లో రాజమహేంద్రవరములో "రాజమండ్రి అమెచ్యూర్స్"అనెడి ఔత్సాహికనాటక సమాజమును స్థాపించి పదిపన్నెండు సంవత్సరములపాటు నడిపించినారు; ఇటు ఈ సమాజమున ప్రముఖపాత్రలను ధరించుచు; అటు కూల్డ్రేగారి ఆధ్వర్యమున ఆంగ్లనాటకములందుకూడ పాల్గొనినారు. నాటిరాజమహేంద్రవర నాటకరంగ చరిత్రలో కామేశ్వరరావుగారి కొక విశిష్టస్థానమున్నది.

కామేశ్వరరావుగారి నాటకవిమర్శ 1914 ఉగాది సంచికతో ఆరంభమైనదని చెప్పవచ్చును. అటుపిమ్మట పలుపత్రికలలో ఎన్నియో విమర్శ వ్యాసములు ప్రకటించిరి. హిందీ నుండి డి. ఎల్. రాయి 'నాటక విమర్శ"ను అనువదించి ప్రకటించినారు (1927) .వాచికము, రంగ పరికరములు, వేషధారణము, అభినయము అనునవి వీరివిమర్శలలోని ప్రధానాంశములు (కొలువు దీర్చినప్పుడు, అంతఃపురములోనుకూడ రాజు ఒకే వేషమును ధరించెడి రోజులవి). కామేశ్వర రావుగారు విమర్శించువారేకాక, రంగస్థలమునచేసి కూడ చూపగల సమర్థులగుటచేత నాటినటులందరును వారికి శిష్యప్రాయులై అనేక విషయములందు సలహాలను పొందుచుండెడివారు (కాగా, వీరుకాలేజీలోనేకాక, కళారంగమునను 'మాష్టరు'గారే). లోపముకన్పట్టినచో, వారెంతటి వారైనను లెక్కచేయక, నిర్భయముగా విమర్శచేయుచుండుట వీరి ప్రత్యేకత; పక్షపాతరహితులగుటచేత నాటి నాటకపు పోటీలన్నింటికిని వీరొక న్యాయమూర్తిగా నెన్నుకొనబడెడివారు[12]. కామేశ్వరరావుగారు ధరించిన పాత్రలలో తప్పక పేర్కొనవలసినవి చాణక్యుడు, రాణాప్రతాప్, పేరిగాడు, కీచకుడు, అశ్వత్థామ మొదలగునవి. వీరి సహచరులలో ముఖ్యముగా పేర్కొనదగినవారు అంకరాజు రామారావుగారు (వీరుప్రఖ్యాతనటులు); భమిడిపాటి కామేశ్వరరావుగారు.

కామేశ్వరరావుగారు బెంగాలి, హిందీ, మహారాష్ట్రము, ఓఢ్రము, తమిళము, ఇంగ్లీషు, ఫ్రెంచి, పంజాబి భాషలనుండి పెక్కునాటకములను, ప్రహసనములను తెనిగించియున్నారు.[13] వీనిలో బాగుగాప్రసిద్ధికి వచ్చినవి చంద్రగుప్త; సోరాబురుస్తుం. 1900 తరువాత తెలుగుదేశమున వచననాటక రచనా-ప్రదర్శనము లదృశ్యమైపోయినవి (గద్యనాటకములు రక్తికట్టవనియే వారి నమ్మకము). అందులకపవాదములు కామేశ్వరరావుగారి అనువాదములు. అనువాదకళలో వీరు సిద్ధహస్తులు; వీరితెలుగువచనమును, శైలియును నాటకోచితములైనవి. ఆ నాటకముల ప్రసిద్ధికి కారణములివియే. ఈ విధముగా కామేశ్వరరావుగారు కాలప్రవాహమున కెదురీది గద్య నాటకములను రచించుటయేకాక తెలుగువారికి ఇతరభారతీయభాషలలోని నాటకపు పోకడలను కూడ తెల్పినవారైరి. వీరి వచనము కొంతవరకు అనుప్రాసయుక్తముగా నుండును; వచనమును నటులు సులభముగా జ్ఞాపకముంచుకొనుట కీవిధము దోహదకారిగానుండును.

## శ్రీ ముత్తరాజు సుబ్బారావు :[14]

చరిత్రమున్నగువానిలో ఎమ్. ఏ. పట్టభద్రులై తెలుగులో కవిత్వముచెప్పుటకు పూనుకొనువారిసంఖ్య, నాడును నేడును, బహు అరుదుఅని చెప్పవచ్చును; అట్టివారిలో సుబ్బారావుగారొకరు.బందరు నోబిల్ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా పనిచేసినకాలములో "చిత్రకళాభివర్ధని"

యనెడు సమాజమును నడిపినారువీరు. నాడు సమాజములవారిమధ్య స్పర్ధలేకాని స్నేహధర్మము చూపట్టెడిదికాదు. కాని సుబ్బారావుగారందులకు అపవాదమని చెప్పవచ్చును. వారు అన్నిసమాజములవారికిని మిత్రులే; అందరునటులకును గౌరవనీయులే–ఇది వారిలోని విశిష్టత. తెలుగులో చక్కని నాటకవిమర్శనము వెలయింపజేయవలెననెడి యుద్దేశముతో 1916 లో పురాణము సూరిశాస్త్రిగారు నాటిపెద్దలందరిచేతను విమర్శలు వ్రాయించి ప్రకటించిరి; అట్లు నాడు నాటకసంస్కరణమును గూర్చి విమర్శ వ్రాసినవారిలో సుబ్బారావుగారు ముఖ్యులు. (చూ. నాట్యాంబుజము–పుటలు 271–81).

సుబ్బారావుగారి నాటకములన్నింటను సుప్రసిద్ధమైనది 'శ్రీ కృష్ణతులాభారము'[15]. 1920–22 మధ్యకాలములో నెల్లూరు "ఆంధ్రసభ" వారు దీనిని చాలసార్లు ప్రదర్శించిరి. అంతటితో దీనికి అపూర్వమైన వ్యాప్తియు, ఖ్యాతియు లభించినవి. కథ ఆకర్షణీయమైనది; సుబ్బారావుగారి కవిత్వము మధురమైనది; రచన ప్రదర్శనానుకూలమైనది–ఆ యీ కారణములవలన నిది ఎక్కువప్రసిద్ధికి వచ్చినదని చెప్పవచ్చును. "సత్యావిభుడైన కృష్ణుదివ్యచరితమును నాటకముగా వ్రాసితి" నని చెప్పుకొనినారు సుబ్బారావుగారు. సత్యభామ సౌందర్యసౌభాగ్యగర్వితః భర్తృప్రణయమునకు, నాదరణమునకు నేకాస్పదురాలుగా నుండవలెననెడి అహంభావముకలది. నారద సాహాయ్యమున పుణ్యకవ్రతమిషచే తనమనోరథమును చేకూర్పనెంచుకొని, నడివీథిలో నవ్వులపాలై, చివరకు గర్వమంతయు నశింపగా రుక్మిణివలె పరమభక్తురాలైనది. సుబ్బారావుగారు రుక్మిణీ–సత్యభామల పాత్రలను పోషించిన విధమును తొలిముద్రణము పీఠికలో దుర్భాసుబ్రహ్మణ్యశర్మగారు వివరించియున్నారు—

"........సత్యభామ ప్రవర్తనము ప్రేమపూర్వమనియు, రుక్మిణీదేవి వృత్తము భక్తిపూర్వమనియుఁ గవి తొలుతనుండి ప్రేమ–భక్తుల వేఱిమిని దడవి పాదుకొల్పి ప్రోదిచేసి పోషించియున్నాఁడు. మఱియ,భక్తితత్త్వవిదులు సాధ్యభక్తిని బ్రేమలక్షణముగానే యభివర్ణించియున్నందునఁగవి తన ప్రయోగించిన ప్రేమశబ్దమున కర్థమును బాత్రముఖమునఁ బలుమారు నుడివి పఠితలకుఁ దనయాశయమును దేటతెల్లముచేసియున్నాఁడు. సత్యాదేవియు, రుక్మిణియు నిర్వురును కృష్ణునెడఁ బ్రేమకలవారే. కాని, సత్యకుఁగృష్ణుఁడు జగన్మోహనాకారుఁడైన పురుషరత్నము. ఆయనను వశీకరించు కొనుటకుఁదనకుఁ గల 'మూలధనము' శృంగారము...... రుక్మిణికట్లుకాదు.........అతఁడు తన నాథుఁడేగాక జగన్నాథుఁడని తెలియును.....వేయేల రుక్మిణి కృష్ణునకాత్మసమర్పణము చేసికొన్నవిదుషి. సత్యకృష్ణుని వలపుచూఱగొనఁగోరియున్నకామిని......ఇందువీరుచూపిన చమత్కృతియు నిట్టి వినోదకథలో వీరు వెలయించిన వివేకసామగ్రియు వీరి కలావిత్త్వమును బ్రకటించుచున్నవి......"

సుబ్బారావుగారు శ్రీకృష్ణతులాభారమును రచించుటకుముందే చాల నాటకములను రచించియున్నారు. వానిలో 'రాజ్యశ్రీ' అనెడి చారిత్రక నాటకము ప్రధానమైనది; ఇందలి రచనావిశిష్టత కలరి చెన్నపురి సుగుణవిలాససభవారు కవికి స్వర్ణపతకమును బహూకరించినారట.

సుబ్బారావుగారు పూర్వసంస్కృత మహాకవుల మనోహరశ్లోకముల ననువదించి యచ్చటచ్చట సందర్భానుసారముగా తమ నాటకములందు చేర్చుకొనియున్నారు.[16]

## తృతీయ వర్గము

### స్వతంత్ర రచనలు :

ఈ వర్గమునకూడ విద్వత్కవులుగా పేర్కొనదగినవారు పలువురుకలరు—శ్రీయుతులు రాజామంత్రిప్రగడ భుజంగరావు, రాజావిక్రమదేవ వర్మ, రాజా కొచ్చర్లకోటవేంకటకృష్ణారావు, రాజాకోటగిరి వేంకటకృష్ణారావు, రాజా మేకా వేంకటాద్ర్యప్పారావు, కొత్తపల్లి సూర్యారావు, హోతావేంకట కృష్ణయ్య, కూచినరసింహం, ద్వివేదిబ్రహ్మానందశాస్త్రి, ఆదిభట్లనారాయణదాసు, నందిరాజు చలపతిరావు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, శృంగారకవి సర్వారాయుడు, కేతవరపు రామకృష్ణశాస్త్రి, బాలాంత్రపు వేంకటరావు, తాడూరి లక్ష్మీనరసింహారావు, ఉమ్రాలీషా మొదలగువారు. వీరిలో ఉమ్రాలీషా, కేతవరపు రామకృష్ణశాస్త్రి ప్రభృతుల నాటకములు కొన్నిరంగస్థలమునకే యుద్దిష్టములైనను తక్కినవారి రచనలకదియేప్రయోజనము కాదు. వీరిలో చాలమంది కేవలము 'రచనాగౌరవము' కొరకే నాటకములను రచించియున్నారనుట సాహసము కాజాలదు. వీరిలోమొదటి ఐదుగురును విద్వత్కవులేకాక రాజకవులు కూడను; నాటకములను రచించుటయేకాక పలువురిచేత రచింపజేసినవారు కూడను.

భుజంగరావుగారు (ఏలూరువాస్తవ్యులు) శాకుంతల_ఉత్తర రామచరిత_ప్రసన్నరాఘవాదుల నాంధ్రీకరించుటయేకాక, శశిరేఖ, కృష్ణనాటకము, నలనాటకము, పాండవాజ్ఞాతవాసము (1909) అనెడి స్వతంత్రనాటకములనుకూడ రచించిరి. అంతియేకాదు, షేక్స్పియరుయొక్క "ఏజ్ యు లైక్ ఇట్" (As you Like it) ను "చారుమతీ పరిణయ" మను పేర అనువదించిరి (1917). ఈ అనువాదమున భారతీయవాతావరణమే కల్పితమైనది. సాంప్రదాయిక పద్ధతిని నాందీ_ప్రస్తావనా_భరతవాక్యాదులు రచింపబడినవి. పాండవాజ్ఞాతవాసమును నూతన కల్పనలతో, ప్రదర్శనానుకూలముగ రచించితినని చెప్పుకొన్నారు.[1]

విక్రమదేవవర్మ(జయపుర సంస్థానాధీశ్వరులు) గారి శ్రీనివాసకల్యాణము 1899 లోను, మానవతీచరిత్ర 1901 లోను ముద్రితములైనని. ఇందు పద్యములు, పాటలు కూడకలవు. విక్రమదేవ వర్మగారు జగన్మిత్ర నాటకసమాజమునకు కొంతకాలము అధిపతులై, విశాఖపట్టణ నాటకరంగమున కెంతయో ఖ్యాతిని చేకూర్చిరి. జగన్మిత్ర సమాజమువారు 9_7_1898 తేదీన శ్రీనివాసకల్యాణమును విజయవంతముగా ప్రదర్శించిరట. (ఈ రచనకు 'సాంగ్లీ నాటకకంపెనీ' ప్రదర్శనము ప్రేరకమైనదని చెప్పుకొనినారు).

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు పోలవరం జమీందారులు (తిరుపతి వేంకటకవులు వీరి ఆస్థానకవులు). వీరి 'అపవాద తరంగిణి' (1901) షెరిడన్‌కవియొక్క "స్కూల్‌ఫర్‌స్కాండల్"కు వచనానువాదము. 1898 లో ప్రారంభమైన వీరి "సరస్వతి" నాటి సారస్వతపత్రికలలో తలమానికముగా విలసిల్లినది.

కోటగిరి వేంకటకృష్ణారావుగారు గంపలగూడెంజమీందారులు. వీరినాటకములు నాలుగు "శ్రీ కృష్ణరాయనాటకావళి" యనుపేర ప్రకటితములైనవి (అభినవపాండవీయము, పాదుషా పరాభవము, బెబ్బులి, ప్రణయాదర్శము[2]). ఈ సంపుటమునకు విశ్వనాథ సత్యనారాయణగారు మహోదాత్తమైన పీఠికను వ్రాసినారు (ప్రణయాదర్శము "రోమియో అండ్ జూలియట్" కు అనువాదతుల్యము).

ఇంక రాజావేంకటాద్ర్యప్పారావుగారు (ఉయ్యూరు జమీందారులు) గీతగోవిందమును మనోజ్ఞముగా తెనిగించిన రసికావతంసులు; రాధాకృష్ణ ప్రేమోపాసకులు. గోవర్ధనోద్ధారణము, పృథ్వీరాయాంతము, శోభనాచలమాహాత్మ్యము, దుర్యోధనాంతము (1915), రామదాసు చరిత్ర, ఆంధ్రవరలక్ష్మీ విజయము మొదలగునవి వీరినాటకములు. ఈ చివరి నాటకమునకు "జ్యోతిర్లీల" యనునామాంతరముకలదు. ఇది కాకతిరుద్రమదేవికి సంబంధించినకథ; కాని, జ్యోతిశ్శాస్త్ర విశేషములను పెక్కింటిని దృశ్యరూపమున వ్యక్తముచేయుటయే కవిప్రధానోద్దేశము. పురుష ప్రయత్నమునకు ప్రకృతిసత్యములు స్వాధీనములని నిర్వచించుట యిందలికథా పర్యవసానము. పృథ్వీరాయాంత-దుర్యోధనాంతములు 'ట్రాజెడీల' పద్ధతిలో నడచినరచనలు. విషాదనాటక రచన ఆనాటికింకను తెలుగులో ప్రసిద్ధముకాలేదు, అయినను అప్పారావుగారు సాహసించినారు. అప్పారావుగారు కేవలము రచయితలేకాదు; దర్శకులుకూడను. నూజివీటిలో తమ సంస్థానము నందే ఒక నాటకశాలను నెలకొల్పి తమ నాటకముల నన్నింటిని ప్రదర్శింపజేసినారు. ఈ నాటకములనే కాక, జయదేవుని గీతగోవిందానువాదమును కూడ నాటకముగా ప్రదర్శింపజేసినారు.

1902 ప్రాంతములనొక పార్శీనాటక సమాజమువారు ప్రదర్శించిన కొన్నినాటకముల ననుసరించి కొత్తపల్లి సూర్యారావుగారు (1873-1938-కాకినాడవాస్తవ్యులు) "త్రిలోకసుందరి" (1908 - ఫసానే అజాయబ్) లను హోతా వేంకటకృష్ణయ్యగారు "శశికళా సుదర్శనము" (లాల్ గోహార్)ను, ప్రభల శ్రీరామశాస్త్రిగారు సౌభాగ్య సుందరి, 'వసంతప్రభ' (గుజరాతీనుండి అనుసరణములు-1917) అనునాటకములను, మాదిరెడ్డి గంగాధరరావుగారు 'సంగీతగోపీచందు' (1911) ను రచించిరి. వేంకటకృష్ణయ్యగారు సుభద్రార్జునీయము, ప్రభావతీ ప్రద్యుమ్నము (1911) మొదలగునాటకములను కూడ రచించియున్నారు. సూర్యారావుగారు కన్యకాపరమేశ్వరీ నాటకము (1909) మున్నగువానితోపాటు "హ్రస్వరంగములు" అనుపేర విద్యార్థుల "చౌచౌ" ప్రదర్శనముల కనువుగా నుండునట్లు ఆరు నాటకాఖండములను కూడ ప్రకటించియున్నారు (1925). హరికథాచక్రవర్తి ఆదిభట్లనారాయణదాసు (1864-1945) గారినెరుగని యాంధ్రులుండ రనుట అతిశయోక్తికాదు. వారు పాటలతో, పద్యములతో'సారంగధర'ను రచించి సారంగధరుని చంపకయే విడిచిపుచ్చిరి; కాని స్త్రీ దౌష్ట్యమును గుర్తించిన అతడు సర్వసంగ పరిత్యాగియై వనములబట్టెను.

ద్వివేదిబ్రహ్మానందశాస్త్రిగారు ఉత్తరరామచరిత్రాది నాటకములను, శృంగారతరంగిణ్యాదిభాణాదులను, అభినవమోహనము, ఆనందోదయము (విప్రనారాయణ కథ-1909) మొదలగు స్వతంత్రనాటకములను రచించిరి. కూచినరసింహము (1866-1940)గారు రూపలత,

"వనవాసి" ('హెర్మిట్'లోని కథమూలము) యనెడు రెండు స్వతంత్రనాటకములను రచించిరి (1917_18)³. అభినవవాగనుశాసనులు మల్లాదిసూర్యనారాయణశాస్త్రి (1880_1962) గారు 'ఆంధ్రదశరూపక' కర్తగానేగాక ఉత్తరరామచరితానువాదకులుగా కూడ సుప్రసిద్ధులు. ఉత్తర రామచరితానువాదములన్నింటను శాస్త్రిగారి యనువాదమే మనోజ్ఞముగా నున్నదని జయంతి రామయ్యపంతులుగారు ప్రశంసించియున్నారు. వీరి విక్రమోర్వశీయ_భీష్మప్రతిజ్ఞాదులు స్వతంత్ర రచనలు. పీఠికాపుర సంస్థానకవులు రామకృష్ణకవుల 'మదాలస' (1911) పేర్కొన దగినరచన.

తెలుగునాటకములను రచించిన మహమ్మదీయులలో ఉమ్రాలీషాగారు (1885_1945_ పిఠాపురం వాస్తవ్యులు) ప్రముఖులు. మణిమాల (1912), విచిత్రబిల్హణీయము (1911), చంద్రగుప్త, కాలేజిగరల్ (సాంఘికనాటకము) ప్రభృతి స్వతంత్రనాటకములను రచించిన వీరు 1908 నుండి రాజమండ్రి 'హిందూ నాటక సమాజము' ప్రఖ్యాతికి పాటుపడినవారు. తాడూరి లక్ష్మీనరసింహారావుగారి ఉన్మత్త రాఘవాంధ్రీకరణము 1889 లో ప్రకటితమైనది; రుక్మిణీస్వయంవరము (1903) అనెడి స్వతంత్రనాటకమును కూడ వీరు రచించిరి. శృంగారకవి సర్వారాయుడుగారి 'సివిక్స్ డ్రామాలు' విద్యార్థుల "చౌచౌ" ప్రదర్శనములకు బాగుండును. విశ్వవిఖ్యాతికాంచిన పరిశోధకాగ్రేసరులును, అభినవభారతీ సహితమైన నాట్యశాస్త్ర సంపాదకులును, సారస్వత సేవయే జీవితసర్వస్వముగా భావించినధన్యజీవియును అగు మానవల్లి రామకృష్ణకవి (1866_1957) గారు భాసనాటకానువాదమునకు పూనుకొనినవారిలో బహుశః ప్రథములగుదురు. వీరికర్ణభారము మున్నగు అనువాదములు భాసనాటకముల సంస్కృతమూలములు 1913 లో ప్రకటితములైనంతనే వెలువడినవి. ఆకాలమందే వేటూరి ప్రభాకరశాస్త్రి (1888_1950) గారు కూడ భాసనాటకానువాదమునకు పూనుకొనిరి. రామకృష్ణకవిగారి తొలిరచన 'కళింగసేన' అనెడి స్వతంత్రనాటకము (ప్రకరణము)పుస్తకరూపమున మూడంకములు ముద్రితమై,ఆగిపోయినట్లు తెలియుచున్నది. ఇది చారిత్రకము; పద్యమయము. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'వారకాంత' (1908), 'రామదేవ విజయం', సాహసికరాజపుత్రం (1910)అనెడి నాటకములను రచించినారు. శేషాద్రిరమణకవుల అర్జునపరాభవము (రచన 1912; ప్రచురణము_1916); పాడి వేంకటనారాయణమూర్తిగారు మాలతీమాధవీయము (1900); ప్రియదర్శన (1890) మున్నగు నాటకములను రచించియున్నారు. వేలూరు శివరామశాస్త్రిగారి మాధవవర్మ (1920) తప్పక పేర్కొనవలసిన రచన.

'మంజువాణీ' పత్రికాధిపతులు నందిరాజు చలపతిరావు (1873_1960 _ ఏలూరు వాస్తవ్యులు) గారి 'రాజ కళింగగంగు' ప్రత్యేకముగా పరిశీలనార్హము. వీరు 'చిత్రాంగి', 'సావిత్రి' నాటకములనుకూడ రచించియున్నారు. బాలాంత్రపు వేంకటరావుగారు 1906 ప్రాంతముల "సతీసంయుక్త" రచించినారు; ఇది రంగస్థలమున కూడ ప్రసిద్ధిగాంచినది. వీరి "యాచశూరేంద్రవిజయము" (రంగరాయవిజయము_1910) వేంకటగిరిరాజావారి బహుమానమును పొందినది. వేంకటరావుగారు తారాశశాంకాది నాటకములనుకూడ వ్రాసియున్నారు. వావిలికొలను సుబ్బారావుగారి 'సుభద్రావిజయనాటకము' (1911) పరిశీలింపదగినది.

ఈ కాలమున వెలువడిన మరికొన్ని చారిత్రకనాటకముల నిచ్చట పేర్కొనవలసి యున్నది. కల్పిత చారిత్రకనాటకమనదగినది వారణాసి శ్రీనివాసరావుగారి ప్రచండమార్తాండము (కొల్లాపురదహనము-1914). ఇది పశ్చిమగోదావరిజిల్లాలోని కొల్లేరుసరస్సు పుట్టుకకు సంబంధించి యున్నది. చెలికాని వేంకటసూర్యారావుగారు "చినరంగరాయనాటకము" (1916) ను రచించిరి. 'బొబ్బిలియుద్ధనాటక' కథకు తరువాతికథ ఇందు చిత్రితమైనది.[4] ఛత్రపుర వాస్తవ్యులైన శ్రీ భాగవతుల నృసింహశర్మ మరల బొబ్బిలియుద్ధనాటక కథను గైకొని 'ప్రతిజ్ఞా విజయరామరాజీయము' (పద్మనాయకవిక్రమము-1918) అను నాటకమును రచించిరి. ఇవి ఆంధ్రదేశమునకు సంబంధించినకథలు. శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రి ('శివాజీవిజయము' అను మహారాష్ట్ర స్వతంత్రరాజ్యస్థాపనము-1921), శ్రీ కడప వేణుగోపాలశెట్టి (కృష్ణవిలాస సభాధ్యక్షులలో నొకరు—'చాణక్య' నాటకము-1911), శ్రీ గాదేపల్లి సూర్యనారాయణశర్మ ('లీలావతి' అను గజనీసోమనాథపురపు 12 వ దండయాత్ర-1913), శ్రీ మంగిపూడి వేంకటశర్మ ('పృథ్వీరాజు-తారాబాయి' ఇది ఆంగ్లనాటకానువాదము - 1913) మొదలగువారు ఇతర రాష్ట్రములకు సంబంధించినకథలను గైకొని చారిత్రకనాటకములను రచించియున్నారు. 'భక్త మీరాబాయి' నాటకమునకు చరిత్రాంశములపై శ్రీ కేతవరపువారు వ్రాసిన 'విన్నపము' ప్రత్యేకముగా పరిశీలనార్హము. కూచిపూడి రాజరత్నముగారి శ్రీ క్రీస్తుజన్మవిలాసము 1913 లో వెలువడినది. దాసు నారాయణరావు శ్రీరాములుగార్లు రచించిన బుద్ధనాటకము 1907లో వెలువడినది. బుద్ధనాటకములకు ఇదియే ప్రారంభము. పైవిధముగా రచనలుచేసిన కవులింకను చాలమంది కలరు; స్థాలీపులాకన్యాయముగా కొందరినే పేర్కొనుట జరిగినది.

### దేశీయభాషలనుండి అనువాదములు :

ఈ కాలమున స్వతంత్రరూపకరచనతోపాటు దేశీయభాషలనుండియు, పాశ్చాత్య భాషలనుండియు అనువాదములు, అనుసరణములు తెలుగున వెలసినవి. శ్రీపాద కామేశ్వరరావుగారి అనువాదములనుగూర్చి ఇంతకుముందే తెలిపియున్నాను. కామేశ్వరరావుగారితోపాటు వంగ-మహారాష్ట్రాది భాషలయందలి నాటకముల నాంధ్రీకరించి ప్రకటించినవారిలో ముఖ్యులు మాచిరాజు దుర్గాశంకరామాత్యులు (1870-1930—శివలీలలు, శంభాజీనిర్యాణం, అవోహావేశం, ఒకపెగ్ మొ॥). ఈ ఇరువురి నాటకములను ప్రకటించుటకు రాజమండ్రిలో ప్రత్యేకముగా "అభినవాంధ్ర గ్రంథమాల" స్థాపింపబడినది. దేశీయభాషలనుండి నాటకముల ననువదించినవారిలో శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రి (దుర్గాదాస్, రాణాప్రతాప్ మొ॥), శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (చంద్రగుప్త, నూర్జహాన్ మొ॥) కూడ ముఖ్యులు.

### ఆంగ్లరూపకానువాదములు :

ఈ తృతీయవర్గమునందు పేర్కొన్న కవులలో పలువురు ఆంగ్లనాటకములను తెలుగులోనికి అనువదించియున్నారు. కొన్ని అనువాదములనుగూర్చి క్రింద వివరింతును. శ్రీయుతులు వావిలాల - గురజాడ - కందుకూరి త్రయముకావించిన ఆంగ్లరూపకానువాదములనుగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను. వారి తరువాత 1900 లోపల మరికొందరు

ఆంగ్లరూపకముల ననువదించియున్నారు—వల్లూరి పద్మనాభరాజుగారి 'జయద్రథనాటకము' (1894-'ఒథెల్లో'కు అనువాదము), సి. ఎస్. ఆర్. కృష్ణమ్మగారి 'మాక్బెత్తు' (1895), శ్రీరాం వీరబ్రహ్మముగారి వాసంతిక (స్కాట్ నవలకు అనువాదము—1913), తురగా వేంకటాచలముగారి 'మాలతీ వసంతము' (1899-'టెంపెస్టు'కు అనువాదము) మొదలగునవి యిందుల కుదాహరణములు. పద్మనాభరాజుగారు వీరేశలింగంపంతులుగారి పద్ధతిననుసరించిరి. కృష్ణమ్మగారు మరల యథాతథానువాది; వీరు నాటకమునంతటిని వచనములోనికే అనువదించిరి. కాని, శైలి చాల జటిలమైనది.

1900 తరువాత పెక్కు ఆంగ్లనాటకములు అనూదితములైనవి; ఇట్టివారిలో ప్రథములు కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుగారు. వీరి 'అపవాదతరంగిణి' 1901 లో ముద్రితమైనది; ఇది షెరిడన్ 'స్కూల్ ఫర్ స్కాండల్'కు వచనానుసరణము; భాష శిష్టవ్యావహారికము. కోటగిరి వేంకటకృష్ణారావుగారు 'రోమియో అండ్ జూలియట్'ను 'ప్రణయాదర్శ'మనుపేర అనువదించిరి (ఈకథను కొంతవరకు వల్లూరి బాపిరాజుగారు 'సుగుణమణి' లో అనుసరించియున్నారు). చెన్నాప్రగడ భానుమూర్తిగారు 'మందపాలచరిత్రము' (1911) అనుపేర 'కింగ్ లియర్' నాటకమును; తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు 'వణిక్పురవర్తకోదంతము' (1906) అనుపేర 'మర్చంట్ ఆఫ్ వెనిస్'ను; చిల్లరిగె శ్రీనివాసరావుగారు 'పుళిందాసుశీలము' (దీనికి విపులమైన పీఠికకలదు-1909) అనుపేర 'ఒథెల్లో'ను, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'మోహినీమనోహరము' (1915) అనుపేర 'ట్వెల్ఫ్తు నైట్'ను, తురగా వేంకటచలముగారు 'శ్రీ సరోజిని' అనుపేర 'యాజ్ యు లైక్ ఇట్'ను, ఆకెళ్ళ సత్యనారాయణరావుగారు 'జయదేవు'-(1915) అనుపేర 'ఒథెల్లో' నాటకమును అనువదించియున్నారు. అభినవ ఆర్షమత ప్రతిష్ఠాపనాచార్యులగు పరమహంస విద్యానందస్వాములవారు 'షేక్స్పియర్' నాటకములన్నింటిని అనువదింపసమకట్టి 'టెంపెస్ట్' (ఝంఝామారుతము-1907), 'కింగ్‌లియర్' (ప్రళయాంతకరాజు-1907) మొదలగునాటకములను అనువదించి ప్రకటించియున్నారు; అట్టి ప్రయత్నమే 'అభినవభారతము' అనుపేర రెంటాల వేంకటసుబ్బారావుగారు మొదలుపెట్టి 'ఒథెల్లో'ను 'అభిలబింబము' అనుపేర అనువదించి ప్రకటించిరి (1911). వీరందరును తమ అనువాదములకు దేశీయతాముద్రను వేసినవారే.

ఈకాలమున బయలుదేరిన మరికొన్ని అనువాదములనుకూడ పేర్కొనవలసియున్నది-దంటుసుబ్బావధానిగారి 'చిత్రమాధవ నాటకము' (1912 - 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'), రొద్దము హనుమంతరావుగారి 'చంద్రికానాటకము' (1900-'వింటర్స్‌టేల్'), బులుసు పాపయ్యశాస్త్రిగారి 'వసంతయామినీ స్వప్నము' (1912-'ఎ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్'), మంత్రిప్రగడ భుజంగరావుగారి 'చారుమతీపరిణయము' (1917-'యాజ్ యు లైక్ ఇట్'), కోటమర్తి చిన రఘుపతిగారి 'ప్రతాపసింహ' (1927-'హేమ్లెట్'), జయంతి భావనారాయణగారి 'సౌందర్యసతీమణి' (1804-'ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్'), నిడమర్తి సుబ్బారావుగారి 'విచిత్రరత్నావళి' (1913-'సింబలైన్'), వేదము వేంకటాచలఅయ్యగారి 'విధిలేకవైద్యుడు' (1912)

అంకరాజు రామారావుగారి 'విధిలేనివైద్యం' (1917-'మాక్ డాక్టర్'), జల్లేపల్లి హనుమంత రావు (1866-1920) గారి 'సుసేనవిజయం' ('సింబలైన్'-1898) మొదలగునవి, రాయప్రోలు వేంకటరామసోమయాజులుగారు 'మిడ్ సమ్మర్‌నైట్స్ డ్రీమ్' ('స్వప్నశివపాలిత'-1936) మొదలగు మూడు షేక్స్పియరు నాటకముల ననువదించి ప్రకటించియున్నారు.

ఇంక సంస్కృతానువాదములు. వీనినిగూర్చి ఆ యా సందర్భములందు పేర్కొని యున్నాను. ఇంతవరకును పేర్కొనబడని మరికొన్ని అనువాదములు—ఆకొండి వ్యాసమూర్తి గారి అనర్ఘరాఘవము (1900), చెన్నాప్రగడ భానుమూర్తిగారి ప్రియదర్శిక (1909) ప్రభృతులు, జనమంచి వేంకటరామయ్యగారి మాలతీమాధవము (1902), అద్దాల సుబ్బారాయుడుగారి విక్రమోర్వశీయము (1889), జి. నరసయ్యశాస్త్రిగారి అభిజ్ఞానశాకుంతలము (1906), కాకర్ల కొండలరావుగారి తపతీసంవరణము (1919) మొదలగునవి. ఈకాలమున అభిజ్ఞానశాకుంతలమునకు, ఉత్తరరామచరితమునకు అనేక అనువాదములు వెలసినవి. అట్లే పెక్కు భాసనాటకములుకూడ పలువురిచే అనూదితములైనవి.

## చతుర్థవర్గము

ఈకాలమందలి నాటకకర్తలను నాలుగు వర్గములుగా విభజింపవచ్చునని తెలిపి యున్నాను (ఇది కేవలము స్థూలవిభజనమేయని మరువరాదు). ఇప్పుడింక నాలుగవ వర్గమునకు చెందిన నాటకకర్తలనుగూర్చి వివరింతును. రెండవ మూడవ వర్గములలోనివారిలో కొందరు ఏదోయొక నాటకసమాజమునకు చెందియున్నను, వారి రచనలు కేవలము ఆ సమాజము కొరకే ఉద్దిష్టములైనవికావు. కాని నాలుగవవర్గములోనివారి నాటకములు తొలుత ఆయా సమాజముల కొరకే వ్రాయబడినవి. ఆ సమాజముల ప్రదర్శనములవలననే వాటికి ఖ్యాతి వచ్చినది. ఆ సమాజములు మూలబడిన తరువాతనే ఆనాటకము లితరులకులభించెడివి. కొందరు పుస్తకవిక్రేతలకొరకు రచనలుచేసిరి. ఎట్టి నిర్బంధములునులేకయే రచనలు చేసినవారును కలరు. వీరిలో ఆంగ్ల-సంస్కృత నాటకముల ననువదించినవారు లేకపోవుట గమనార్హము.

### శ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి (1888-1954) :

సచ్చిదానందశాస్త్రిగారు సంస్కృతాంధ్రములందు చక్కని పండితులు. ఈ సంస్కారము వారి లలిత (1939), బృంద (1941), దివోదాసు (1950) నాటకములందు కన్పట్ట గలదు. కాని వారి నాటకములన్నింటను ప్రసిద్ధమైనది 'సావిత్రి'; దీనిని వీరు 1915 ప్రాంతముల మొదట బెజవాడ 'మైలవరం' కంపెనీ'వారి కొరకు వ్రాసినారు. వారు దీనిని అపూర్వ దృశ్య పరికరములతో దేశమంతటను ప్రదర్శించినారు. ఆ సమాజఖ్యాతికి ఈ నాటకము కొంత కారణమనికూడ చెప్పవచ్చును. అటుపిమ్మట వీరు ఏలూరు 'మోతేవారి కంపెనీ'కి వచ్చినారు. సమాజముల మధ్యనున్న స్పర్ధలు కారణముగా, మోతే నారాయణరావుగారు శాస్త్రి గారిచేత క్రొత్తకల్పనలతో ఇంకొక 'సావిత్రి'ని వ్రాయించి, మొదటిదానిని మించిన విధముగా ప్రదర్శించినారు. ఈ రెండవ 'సావిత్రి'యే ముద్రణభాగ్యమునంది మనకు లభించుచున్నది.

(ఇదియే సినీమాగాకూడ తీయబడినది). శాస్త్రిగారు 'సావిత్రీ గ్రంథమండలి'ని స్థాపించి తమ నాటకములను ప్రకటించుకొనినారు.

## పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి (1881-1934):

వీరుకూడ విద్వత్కవులే. బళ్లారి నాటకసమాజములలో సుప్రసిద్ధులైనారు. వీరి నాటకములలో 'శ్రీకృష్ణలీలలు' (1914), 'లవకుశ' (1915), 'జ్ఞాన కృష్ణలీల' మున్నగు నాటకములు సుప్రసిద్ధములు. ఇవి కన్నడ-అరవ భాషలలోనికికూడ అనూదితములైనవి. వీరి కుమారులు బాలసరస్వతిగారుకూడ ప్రసిద్ధ నాటకకర్తలు; వీరి 'తుకారాం'ను వ్యాప్తిలోనికి తెచ్చినవారు సి. ఎస్. ఆర్. ఆంజనేయులుగారు.

## శ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రి (1872-1943):

వీరు 1903 ప్రాంతముల బందరు గొడుగుపేటలోని 'జగన్మోహిని థియేటర్'లో నాటకరచయితగా, నటుడుగా నాటకరంగమున ప్రవేశించినారు. అచ్యుతరామశాస్త్రిగారు పిమ్మట కొన్ని సంవత్సరములు బెజవాడ 'హిందూ థియేటర్'లో పనిచేసి రామరాజ్యవియోగాది నాటకములను, తరువాత మైలవరం కంపెనీలోచేరి వారికొరకు కొన్ని నాటకములను వ్రాసి యున్నారు. శాస్త్రిగారు ఇంచుమించుగా ముప్పదినాటకములను రచించిరి. ఆ నాటకములన్నింటను 'ద్రౌపదీవస్త్రాపహరణము' సుప్రసిద్ధమైనది. ఇది మైలవరం కంపెనీవారి కాణాచి. అచ్యుతరామ శాస్త్రిగారి ఇంకొక ప్రసిద్ధ నాటకము 'సక్కుబాయి'. దైతా గోపాలంగారి సుశిక్షణలో ఈ నాటకము దేశమంతటను చక్కగా ప్రదర్శింపబడినది. ఒకేచోట కొన్నిరోజులవరకును ఈ నాటకము ప్రదర్శింపబడెడిదన్నచో దీనికానాడు లభించిన ఆదరాభిమానముల నూహించుకొన వచ్చును. అటుపిమ్మట వీరు సినిమాలలోకూడ రచయితగా పనిచేసినారు. శాస్త్రిగారికి 1922 లో విజయనగరమున ఘనమైన సన్మానము జరిగినది. అప్పుడు వీరికి 'నాటకచక్రవర్తి' యనెడి బిరుద మొసంగబడెను.

## మరికొందరు రచయితలు:

కేవలము ప్రదర్శన సౌలభ్యమే, ప్రయోగ విజయమే దృష్టిలోనుంచుకొని బహుళ నాటకములను రచించినవారిలో పేర్కొనదగినవారు శ్రీయుతులు సోమరాజు రామానుజరావు, కాశీనాథుని వీరమల్లయారాధ్యుడు, ద్రోణంరాజు సీతారామారావు, చక్రావధానుల మాణిక్యశర్మ, రామనారాయణకవులు, గూడూరు కోటేశ్వరరావు, బద్దిరెడ్డి కోటేశ్వరరావు, ముత్తనేని వేంకట చెన్నకేశవులు; నంబూరి తిరునారాయణస్వామి, భోగరాజు నారాయణమూర్తి, జానపాటి పట్టాభి రామశాస్త్రి, ఓలేటి పార్వతీశ్వరకవి, బేతపూడి లక్ష్మీకాంతం, పామర్తి బుచ్చిరాజు, కొండపల్లి లక్ష్మణ పెరుమాళ్ళు, వెంపటి వేంకటనారాయణ, త్యాడి వేంకటశాస్త్రి, అవసరాల శేషగిరిరావు, ఆకెళ్ళ సత్యనారాయణరావు, అయినాపురపు సుందరరామయ్య, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడు, అయినాపురపు సోమేశ్వరరావు, అవటపల్లి హనుమంతరావు, మద్దులపల్లి గురుబ్రహ్మం, శ్రీరాం వీరబ్రహ్మం, గుండు చంద్రమౌళి, చందాల కేశవదాసు, గూడ కృష్ణయ్య ప్రభృతులు.

పై నాటక రచయితలలో శ్రీయుతుల సీతారామారావు, మాణిక్యశర్మ, రామానుజ రావు, రామనారాయణ కవులు, సుందరరామయ్య—వీరు ఒక్కొక్కరు ఇరువదేసి నాటకములకు పైగా రచించియున్నారు. సీతారామారావుగారు (రాజమహేంద్రవరవాస్తవ్యులు) బందరు నాటకసమాజముల కొరకును, రాజమండ్రి గున్నేశ్వరరావుగారి నాటకసమాజము కొరకును 1913 ప్రాంతములకు ముప్పది నాటకములకుపైగా రచించినారు. వీరి నాటకములలో 'విజయ 'బొబ్బిలి' (1912), 'పీష్వానారాయణరావు' (1912), 'చతురచంద్రహాస', 'సారంగధర' మున్నగునవి ప్రసిద్ధములు. సీతారామారావుగారి కవితాగురువులు శ్రీ తిరుపతి వేంకటకవులు భారతగాథను నాటకీకరించుటచేత వీరు రామాయణగాథను నాటకీకరించుటకు పూనుకొని శ్రీరామ జననము, శ్రీరామప్రవాసము (1914), శ్రీరామోద్యోగము, శ్రీరామవిజయము, శ్రీరామాశ్వ మేధము అనుపేర ఐదు నాటకములను రచించిరి. మాణిక్యశర్మగారు నరసాపురములో 'దేశీయనాటక గ్రంథమాల'ను స్థాపించి 'బిల్వమంగళ', 'చంద్రకాంత నాటకము', 'సంగీత సావిత్రి', 'సంగీత సత్యవిజయము' (హరిశ్చంద్ర) మున్నగు పెక్కునాటకములను ప్రకటించి యున్నారు. చారిత్రక నాటకములను వ్రాయవలెనని మొదలుపెట్టినప్పటికిని, కాలప్రవాహమున కెదురీదలేక కాబోలు పౌరాణిక నాటకములనే అత్యధికముగా వ్రాసిరి. వీరి చారిత్రక నాటక ములలో 'మహారాష్ట్రవిజయము' (1914) మొదలగునవి ప్రసిద్ధములు.

రామానుజరావుగారు భద్రాచలప్రాంతముల దేశముఖులు, దేశపాండ్యాలు. వీరి నాట కములలో 'ధరణికోట' (రెడ్డిసంగ్రామ విజయము), 'కాళిదాసు', 'సక్కుబాయి', 'దానవీర కర్ణ', 'రంగూన్‌రౌడి', 'తాజ్‌మహలు' (వచనము-1925), 'ప్రతాపరుద్రీయము' మొదలగునవి ప్రసిద్ధములు, వీరి ధరణికోట చక్కని చారిత్రకనాటకము. ఇంక 'రంగూన్‌రౌడి' ఆంధ్ర నాటక రంగమును కొంతకాలము పరిపాలించినదని చెప్పవచ్చును. సుందరరామయ్యగారు (కొమరి పాలెం వాస్తవ్యులు) 20 వ ఏటనుండియే పార్శీ నాటకకథల నెక్కువగా నాటకీకరించినారు— లాల్‌గోహర్ (జయచంద్ర చంద్రరేఖా విజయము), గూల్బకావళి, మువ్వాజ్రి మొదలైనవి. వీరు ప్రతిజ్ఞాయాదవము, ప్రతిజ్ఞాపాండవము (1920), గర్వభంగము, ఊర్వశీ శాపవిమోచ నము మున్నగు పౌరాణిక నాటకములనుగూడ రచించియున్నారు[2]. సుందరరామయ్యగారు తమ నాటకరచనావిశిష్టతను సూత్రధారపరముగా నిట్లు చెప్పుకొనినారు (ప్రతిజ్ఞా పాండవ ప్రస్తావనలో) :

"అంకవిభజన, రంగభాగ్యంబు ఫణితి, పాత్రలప్రవేశ, ముచితసంభాషణగతి
ఎద్ది ఎట్టులుండనందమో అద్దియటుల హత్తుకొన వ్రాయు పద్ధతి యతనిసొమ్ము."

వీరమల్లయ్యగారు బెజవాడ 'హిందూ థియేటర్'లో సుప్రసిద్ధులు; వీరికి పద్యనాటకములమీద మోజు హెచ్చు. సత్యహరిశ్చంద్ర-ఉషాపరిణయ - సారంగధర - స్త్రీసాహస-కుశలవ-జయంత జయపాలీయ-లంకాదహన-తారాచంద్రీయాదులు మున్నగునవి వీరి నాటకములు; 'సీతామనో హరము' మున్నగునవి ప్రహసనములు. కార్వేటి నగరములోని 'హార్డింజి నాటకసభ'వారి కొరకు గుండు చంద్రమౌళిగారు శమంతకమణివిజయము (1910), దేశింగుమహారాజ చరిత్ర (చెంజియుద్ధము-1913) మొదలగు నాటకములను రచించియున్నారు.

చందాల కేశవదాసుగారి ప్రసిద్ధనాటకము 'కనకతార'. ఇది రాజమండ్రి 'హిందూ నాటకసమాజము' వారిచే అత్యద్భుతముగా ప్రదర్శింపబడెడిదట (1911 ప్రాంతముల). చెన్న కేశవులుగారి 'చండిక', 'శశిరేఖాపరిణయము' (1918) లు ప్రసిద్ధిగన్నవి. తిరునారాయణ స్వామిగారి 'దుర్గావతి' (4911), 'రుక్మాంగద నాటకము'లు సమాజములవారిని బాగుగా నాకర్షించినవి. భోగరాజు నారాయణమూర్తిగారి 'ఉషాపరిణయము' (1909), 'లలితాంగి' (1913) నాటకములు; పట్టాభిరామశాస్త్రిగారి 'కంసవధ' (1911), 'వాసంతికా పరిణయము' (1911)లు; ఓలేటివారి 'సువర్ణమాల' (1907), 'తారాశశాంకము' (1908) లు; దేవగుప్తాపు భరద్వాజము గారి 'శర్మిష్ఠావిజయము' (1910); బుచ్చిరాజుగారి సంగీతనాటకములు 'జగన్మోహిని' (1911), 'పద్మిని' (1913)లు; లక్ష్మణ పెరుమాళ్ళుగారి 'హాళ్ళిఘాటు యుద్ధము' (1920); జేతపూడివారి 'సుభద్రాపరిణయము' (1916); వెంపటి వేంకటనారాయణగారి 'గోపీచందు' (1911); గాడేపల్లి సూర్యనారాయణశర్మగారి 'సంగీత సైంధవార్జునము' (1912) మున్నగునవి; అష్టావధాని త్యాడి వెంకటశాస్త్రిగారి 'ససేమిరా', 'మదాలసీయము', 'మదనమోహిని' (1920 లు; శేషగిరి రావుగారి సంయుక్త-విభీషణపట్టాభిషేకాదులు; భువనగిరి బుచ్చపరదేశి సోమయాజిగారి 'సౌగంధికపుష్పాపహరణము' (1914); ఆకెళ్ళవారి జయంతజయపాలీయాదులు; విష్ణుభొట్ల వారి సారంగధర-కుశలవనాటకాదులు; సోమేశ్వరరావుగారి సతీ అనసూయాదులు; హనుమంత రావుగారి కాళిదాసనాటకాదులు; వీరబ్రహ్మంగారి రత్నమాలా నాటకాదులు; గురుబ్రహ్మంగారి శృంగారచంద్రహాసీయాదులు; గూడ కృష్ణయ్యగారి 'సంగీతశాకుంతల నాటకము (1912); బసవరాజు సీతాపతిరావుగారి 'సాత్రాజితీ పరిణయము' (1915) మున్నగునవికూడ రంగస్థలమున విజయవంతములైన రచనలే. శ్రీయుతులు బద్దిరెడ్డి (బాలచంద్రప్రతాపము మొ॥), గూడూరి రామనారాయణకవుల (పాండవ నాటకములు, అహల్యాశాపవిమోచనము మొ॥) కొన్ని రచనలు 1920 లోపలనే జరిగినను 1920 తరువాతనే ముద్రితములై ప్రచారమునకు వచ్చినవి. కృష్ణ విలాససభ తెనుగు కండక్టరగు ఫణిహారం శేషాచార్యులుగారి 'ప్రహ్లాదచరిత్ర', 'చంద్రహాసలు' (1924) కూడ పేర్కొనదగినవి.

ఏ రెండు మూడేసి నాటకములనో వ్రాసి సంతృప్తిపడిన కవులుకూడ ఈ కాలమున కొందరు కలరు. వారి రచనలుకూడ ప్రసిద్ధికి వచ్చినవి. పింగళి నర్సయ్యగారు బందరు, ఏలూరు నాటకసమాజములలో ముంజులూరి కృష్ణారావుగారి సహనటులు; వీరి 'మార్కండేయ నాటకము' చాల ప్రసిద్ధికి వచ్చినది. వేదం వేంకటాచల అయ్యగారు మద్రాసు 'సుగుణ విలాస సభ'లో ప్రసిద్ధ దేశికులు (కండక్టర్). వీరు ప్రప్రథమముగా మోలియర్ నాటకమును నెల్లూరు మాండలికములోనికి అనువదించినారు (1912-విధిలేక వైద్యుడు). తరువాత 'నందుని చరిత్రము'ను ప్రకటించినారు. సత్యవోలు కామేశ్వరరావుగారు కిర్లంపూడి సంస్థానపండితులు; చక్కని కవనధోరణి కలవారు; అంతకన్న చక్కగా చదువగలవారట. వీరి రతిమన్మథ నాటకము పండిత జగన్నాథుని సంస్కృతనాటకమున కనువాదము; 'కాదంబరి' (1908), స్వీయ సంస్కృత నాటకమున కాంధ్రానువాదము. తణికెల్ల పూర్ణయ్యపంతులుగారి 'ప్రసన్న పాంచాలీయము' (1913), 'రాణీ సంయుక్త' (1909) పేర్కొనదగియున్నవి. వల్లూరి బాపిరాజుగారి

'సుగుణమణి' 1909) కూడ ప్రసిద్ధికెక్కినది. ఆర్. మదనగోపాలనాయుడిగారి 'గోగ్రహణము' (1913), 'రాజభక్తి'; భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మగారి 'దుర్యోధన పరాభవము' (1915), 'నందవధము' (1913) పేర్కొనదగిన రచనలు. సుప్రసిద్ధ విమర్శకులును, ఆంధ్ర నట ప్రకాశికా కర్తలును అగు పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారి 'లంకాదహనము' (1907) ఈ కాలమున చాల ప్రసిద్ధి వహించినది. అందులో కవిగారుకూడ పాత్రధారణము చేసెడివారు.

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారి సుభద్రాకల్యాణము (1916); జనమంచి శేషాద్రి శర్మగారి సీతాస్వయంవరము (1916); చిల్లరిగె శ్రీనివాసరావుగారి పుళిందాసుశీలము (1909); పనప్పాకం శ్రీనివాసాచార్యులుగారి కనకాంగి (1900), సైంధవవధాదులు; కస్తూరి సుబ్బారావు (అనంతపురం) గారి శాకుంతలా దుష్యంతము (1915), సుగ్రీవ పట్టాభిషేకములు; రెంటాల వేంకట సుబ్బారావుగారి అధిలబింబము (1911); గ్రంధి సుబ్బారాయగుప్తగారి సుజ్ఞానపరిణయము (1910), ఆంధ్రమాతలు; దంటు సుబ్బావధానిగారి చిత్రమాధవము (1912); తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి వణిక్పురవర్తకోదంత (1906)-దుర్ణయ దురోదరాదులు; పాలెపు వేంకట సూర్యగోపాలుగారి నాగానందాదులుకూడ పేర్కొన దగిన రచనలు. ఈ కాలమున స్త్రీలుకూడ కొందరు నాటకములను రచించియున్నారు. గుండు అచ్చమాంబ (కాళహస్తీశ్వర కళ్యాణోత్సవము-1904-ప్రహసనప్రాయము), గూడపాటి లక్ష్మీనరసమ్మ (స్వయంవరము-1912); కందాళ చూడమ్మ (కమలాపరిణయము-1918); ఉేకుమళ్ళ లక్ష్మీబాయమ్మ (వామననాటకము-1913); విస్సంరాజు సీతాంబ (సావిత్రీ నాటకము-1917); సీరం సుభద్రయాంబ (సురుచీవిజయము-1914) ప్రభృతులు ఈ కాలమందలి నాటకరచయిత్రులు. సుభద్రయాంబగారు సెట్టి లక్ష్మీనరసింహముగారి అగ్రసోదరి; వీరికి యోగవిద్యయందు మంచి ప్రవేశముకలదట. సురుచీవిజయము స్త్రీ స్వాతంత్ర్యసమస్యకు సంబంధించిన కల్పితరచన.

కాళ్ళకూరి సాంబశివరావుగారి రంగారాయ కదనసమవాకారమునుగూర్చి ఇంతకుముందు పేర్కొనియున్నాను. ఆ విధముగానే దశరూపకములలోని మరికొన్ని భేదములను స్వతంత్రముగా రచించుట కీకాలమున చిలకపాటి వేంకట రామానుజశర్మగారు ప్రయత్నించినారు. వారి సుమనోవినోదనభాణము (1903); కాళిదాసచరిత ప్రకరణము (1908) ఇందుల కుదాహరణములు.

ఈ కాలమున (1900-1920) బయలుదేరిన నాటకములలో మూడువంతులకుపైగా, సంప్రదాయానుసారముగా, గతానుగతికముగా రచింపబడినవే. చారిత్రకనాటక వికాసము ఈ కాలమందలి విశేషము. సాంఘికరూపకములైన రంగూన్‌రౌడీ మొదలగు కొన్ని నాటకములందు ఆంగ్ల నాగరకతావాసనాసక్తమైన జీవితము, తన్నిరసనాదులు ఇతివృత్తములుగా స్వీకరింపబడినవి. ఈ కాలమున వెలువడిన కొన్ని సాంఘికనాటకములను పేర్కొందును—వెంపరాల సుబ్రహ్మణ్యముగారిచే రచింపబడిన స్నేహలత లేక 'వరశుల్కము' (1914) అను విషాద నాటకమునందు వరశుల్క క్షుద్రదేవతా పీఠమునందు యాగపశువైన స్నేహలత చరిత్రము వర్ణితమైనది. ఇది కలకత్తానగరమందు యథార్థముగా జరిగిన కథయట. కాని కవి

కథారంగమును స్వస్థలమగు విశాఖపట్టణమునకు మార్చినారు. కవిగారు విషాదనాటకము (tragedy) ను నిర్యాణనాటక మనినారు. గాదిశ్రీ జగన్నాథస్వామిపంతులు (ఛత్రపురము) గారు రచించిన సంస్కార దర్పణము (1915) ఏడంకముల సాంఘికరూపకము. 'సాంఘిక విషయములన్నియు నొక్కటి విడువబడకుండ నిందు(బొందింప(బడిన హేతువున దీనికి సంస్కారదర్పణమను నామము సార్థకముకావచ్చును' అని కవిగారు ఉపోద్ఘాతమందు తెల్పి నారు. ఇందు వివాహవిషయకచర్చ ప్రధానము; కరుణము ప్రధానరసము. కడప వేణుగోపాల ప్రణీతమగు నవనాగరికము (1911) నవనాగరీక వ్యవహార ధర్మంబుల వెల్లడిజేయుచు నీతుల గర్భితముగానునిచి వ్రాయబడిన నాటకము. ఇందు మూడు కథలు ఏకకథగా కూర్పబడినవి[3].

## పోటీలు : విమర్శలు

**ఆంధ్రనాటకపరిషత్తు :**

ఈ కాలమున నాటకపుపోటీలు ఆరంభమైనవని తెలిపియున్నాను. అంతియేకాదు, ప్రత్యేక నాటకవిమర్శనముకూడ ఈ కాలమందే ఆరంభమైనది. ఈ రెండుఅంశములకు ఆరంభ కులు పురాణం సూరిశాస్త్రిగారు. వారికి ప్రోత్సాహకులు కానుకొలను వేంకటరామయ్యగారు. కార్యరంగము బందరు. 1915 డిసెంబరునెలలో వీరు "ఆంధ్ర నాటక ప్రోత్సాహకసంఘము" ("ఆంధ్రనాటక పరిషత్తు") అనుదానిని స్థాపించిరి. దీనిపక్షమున ప్రచురణములనుకూడ ఆరంభించిరి.

"నాటకసమాజములకు పోటీపరీక్షలనేర్పరచి, మేలగువానిని సత్కరించి నటుల నుత్సాహపరచి, నాటకప్రదర్శనముల మెరుపించునుద్దేశముతో నాంధ్రనాటక ప్రోత్సాహక సంఘము తొలుదొలుత నొక పరీక్షామండలిగ బనిజేయుచుండెను. 'వారు పరీక్షించువారు : మేము నిలచి యుత్తరువిచ్చెడివారమా ?' యను భావముచే ననేకనాటకసమాజములు వెనుదీయు చున్నవి...... నాట్యౌచిత్యమునుగూర్చి నటులకు వలయు శిక్షాసంస్కారము లీ పరీక్షలవలన సంపూర్ణముగా సిద్ధింపకున్నవి. ఇట్టి శిక్షయు ప్రదర్శనారీతులగూర్చి యభినవాదర్శములును, పాత్రాభినయమునుగూర్చి సంప్రదాయసిద్ధమగు రసానుభవమును కలిగించినగాని సంఘోద్దేశ్య ములు నెరవేరవు. నటుల కెట్టిశిక్షణ యావశ్యకమో, నాటకకవులకుకూడ నట్టే యభినవవికాస ములు, క్రొత్తతెలువులు, నాగరకతళుకులు, ఆధునికరుచులును గోచరింపనావశ్యకమైయున్నది. నటులును నాటకకవులును కొన్ని క్రొత్తయంశములను గ్రహింపవలసియున్నది. ఇట్టి శిక్షామార్గ ముల నవలంబించి నాటకకళోద్ధారకములగు నుపదేశములుజేయుటకై యాంధ్రనాటకప్రోత్సాహక సంఘము బోధక_పరీక్షాధికారముల రెంటిని స్వీకరించినది.[1]"

ఈ సంఘమున నాటి సుప్రసిద్ధ కవి_పండిత_నటులందరును, సుమారు 150 వరకు, సభ్యులైనారు. ఈ సంఘ కార్యకర్తలు బళ్ళారి, నెల్లూరు, గుంటూరు, బందరు, రాజమహేంద్ర వరము, విశాఖపట్టణములలో స్థానిక కార్యనిర్వాహకమండలుల నేర్పాటుచేసి, వానిమూలమున నాంధ్రదేశపు నానాప్రాంతములకు నాటకోద్ధారక ప్రయత్నములను వ్యాపింపజేయుటకు ప్రయ

త్నించినారు. అంతియేకాదు నాటకకవులకు, నటులకు ఉపయోగించుచిమిత్తమై కొన్ని సూచీ పత్రములను ప్రకటించు ప్రయత్నముచేసిరి—అందలి ప్రథమప్రచురణమే "ఆంధ్రనాటక నామావళి" (1916). మరియు, నాటకాభిమానులచే విమర్శలువ్రాయించి కృష్ణాపత్రికాదులలో ప్రకటించిరి. ఈ సంఘమునకు పురాణం సూరిశాస్త్రిగారు కార్యదర్శులై రెండుసంవత్సరములు 'నాటకపరిషత్తు' అనుపేర పోటీపరీక్షలను నిర్వహించిరి. కాని, "పోటీపరీక్షలవలన మాత్సర్యమున కవకాశము హెడమచుండెను. నాటకసమాజముల పెద్దలెంత వివేకౌన్నత్యములు గలవారయ్యును సామాజికులలో పెక్కురు సామాన్య సంస్కారులగుటచేతను, పరీక్షా సమయమున కొందరునటులు అదివరకెవ్వరు జూచితలచియుండని ప్రతిభావిర్భావమున విస్తరించుట చేతను, పరీక్షాధికారులు వేషభాషాభినయ సంగీతములకేర్పరచిన గణనపద్ధతులలో నన్నిటి యందు సమానసౌకర్యముగల సామాన్య నటునకు మొత్తముమీద యేదో ఒకదానియందు విశేష లక్షణముండి మిగిలినవానిలో జంకుచుండిన నటనాయకులకన్న యెక్కువఫలితము వచ్చుట చేతను, పర్యవసానము అపజితులకాశాభంగముగ నుండుటచేతను పోటీపరీక్షలు విరోధముల కాకరమై పరిణమించెను."[2] అందుచేత సూరిశాస్త్రిగారు ఆ సంబంధమును 1918 లో వదలు కొనిరి. అటుపిమ్మట వారు కేవలము విమర్శపై దృష్టికేంద్రీకరించి, ప్రత్యేకగ్రంథములను వెలయించిరి. అటుపిమ్మట 1924 ప్రాంతముల వి. టి. రాఘవాచార్యులుగారు గూడవల్లి రామ బ్రహ్మంగారి సహకారముతో "భరతమునిబృందము" అనుపేర విజయవాడలో ఒక నాటక కళాశాలను స్థాపించి, నటులకు శిక్షణ మొసంగుటకు ప్రయత్నించిరి. కాని ఆ ప్రయత్నముకూడ సఫలముకాలేదు.

ఆంధ్రనాటకనామావళి :

సూరిశాస్త్రిగారు 1916 లో "ఆంధ్రనాటకనామావళి" యనెడుపేర ప్రచురించిన సూచీ పత్రమునందు 1901 మొదలు 1916 వరకు ప్రచురింపబడిన తెలుగు నాటకములపేర్లును, కవుల పేర్లును, అంకసంఖ్యయును, మూల్యవివరములును ఒసంగబడెను. ఇతివృత్తముననుసరించి నాటకములు పదునొకండుశీర్షికలుగా విభజింపబడినవి—1. భారతకథలు (29); 2. రామాయణ కథలు (26); 3. కృష్ణగాథలు, పురాణములు (58); 4. సంస్కృతానువాదములు (44); 5. పార్శీనాటకానువాదములు (7); 6. ఆంగ్లానువాదములు (17); 7. తెలుగు ప్రబంధముల కథలు (10); 8. జనరంజకములు (72); 9. సాంఘికములు (53); 10. ప్రహసనములు (16); 11. చారిత్రకాదులు (38); 11. వీథినాటక-యక్షగానములు (78).[3] మొత్తము 449 నాటకములీపట్టికలో చేరియున్నవి. ఈ పట్టికనుబట్టి ఏజాతినాటకము లేయేట నెన్ని వెలువడినవి యును, ఒక్కొక్కసంవత్సరమున ప్రచురింపబడిన నాటకసంఖ్యయును తెలియుచున్నది. 1901-1906 మధ్య నాటకములంతగా వెలువడలేదు; ఆపిమ్మట నవి బాగుగా వెలువడినవి.

శాస్త్రిగారింకొకవిధముగాకూడ — అనగా నాటకములను సీమల శీర్షికలక్రిందకూడ విభజించి నాటకములజాతి నిరూపణమొనరించి యున్నారు. ఆంధ్రదేశమున ప్రధానముగా నాలుగుభాగములు కన్పట్టుచున్నవి — ఈ భాగములలో మొదటిది విశాఖపట్టణమండలము

(గంజాము, విశాఖజిల్లాలు); రెండవది గోదావరీ-కృష్ణామండలము (పిఠాపురము మొదలు బాపట్లవరకును); మూడవది దత్తమండలములు; నాలుగవది నెల్లూరుసీమ (మద్రాసుతోసహా). ఇందు ఒక్కొక్కభాగమున నొక్కొక్కజాతి నాటకములు మిగిలినవానికన్న నెక్కువగ వ్రాయబడినవి. ఒక్కొక్కభాగపు నాటకరసములు మరియొకభాగమునలేవు. ఆయా భాగములలో నాయారసముల ననుసరించి యాడినగాని నాటకములు జనరంజకములు కాజాలవు. నెల్లూరుసీమలో కర్నాటకపుపాటను మెత్తురు. బళ్ళారిసీమలో భక్తి-శృంగారరసములను పార్సీ సంగీతపుపాటలతో మెత్తురు; ఆసీమలో నచ్చటచ్చట కొన్ని చారిత్రకనాటకములు వ్రాయబడినవి కాని ప్రదర్శనములందు శృంగార-విషాదములకే యాధిక్యమధికమై, అవి వీరరసావేశమును కలిగించుటలేదు. విశాఖపట్టణమండలమున, వంగదేశ సామీప్యమునజేసి, సాంఘిక-చారిత్రకేతివృత్తములధికముగా స్వీకరింపబడెను. కృష్ణా-గోదావరీ మండలములలో నన్నిజాతుల నాటకములును బయలుదేరినవి. మద్రాసులో కేవలము వీథినాటక - యక్షగానములే ప్రకటితములైనవి.

పై నాటకముల మొత్తములో కొన్ని పునర్ముద్రణములు కలవు; కొన్ని క్రొత్త నాటకములు చేరలేదు. అయినను నాటిపరిస్థితిని ఈ పట్టికలమూలమున సులువుగా గ్రహింపవచ్చును.

1900 లోపల నాటకరచన మారంభించిన ప్రసిద్ధకవుల నందరినిగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను. వారి నాటకములలో ఎక్కువభాగము 1900 తరువాతనే ముద్రితములై ప్రజల కందుబాటులోనికి వచ్చినవి. మరియు 1900 తరువాతకూడ చాలకాలమువరకును ఇంచుమించుగా వారందరును నాటకములను రచించుచునేయుండిరి. ధర్మవరమువారి చిత్రనళీయ నాటకము 1900 లోపలనే ముద్రితమైనను, వారి తక్కిన నాటకములన్నియును చాల ఆలస్యముగా ముద్రితములైనవి. చిలకమర్తివారి నాటకరచన 1899 లో ఆరంభమైనను వారి నాటకములు 1909 లోనే ముద్రితములైనవి (అసలు చిలకమర్తివారి నాటకముల ప్రసిద్ధి అప్పటినుండియే). కన్యాశుల్కము 1909 లో రెండవ ముద్రణమును పొందిన తరువాతనే ప్రసిద్ధికి వచ్చెను. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు పేర్కొన్నట్లు గురజాడ వేంకట అప్పారావుగారు చనిపోయిన తరువాతనే జీవించుట ప్రారంభించినారు! 1900 ప్రాంతములనుండి నాటకరచన చేసినవారి నాటకములు వెంటవెంటనే ముద్రితములై వ్యాప్తినొందసాగినవి.

సూరిశాస్త్రిగారు పేర్కొన్నట్లుగా 1900-1906 మధ్యకాలములో దేశమున నొకవిధమైన నిస్తబ్ధత యేర్పడినట్లు కన్పట్టుచున్నది. జాతీయ మహాసభలో స్వరాజ్యతీర్మానము అంగీకరింపబడుటతో దేశమున నొకవిధమైన నూత్నోత్సాహము, కర్తవ్యదీక్ష వెల్లివిరిసినవి. ఆ ప్రభావము తెలుగు నాటకరంగముమీదకూడ కన్పట్టుచున్నది. తత్ఫలితముగనే వీరరసప్రధానములైన ప్రసిద్ధ చారిత్రక పురుషుల, పౌరాణికపురుషుల కథలను స్వీకరించి, వారిని జాతీయ వీరులనుగా చిత్రించుటకు ప్రయత్నములు జరిగినవి. కవులీ ప్రయత్నమున కృతకృత్యులైనారని చెప్పవచ్చును.

ఇన్ని నాటకములీకాలమున ప్రకటింపబడినను-రవాణాసౌకర్యము లెక్కువగానున్నను-ఒక ప్రదేశమందలి నాటకము లింకొక ప్రదేశమున కుపయుక్తములగుట చాల తక్కువ. సమాజముల మధ్యగల స్పర్ధలు కారణముగా ఏ సమాజమున కాసమాజము కొన్ని క్రొత్త నాటకములను వ్రాయించుకొని, వానిని తమ సొంతసొత్తుగా భావించుకొనెడివి. కొందరు కవులు సహజాభిలాషతో నాటకములను వ్రాసియున్నారు. ఆయా కారణములచేత ఒకే ఇతివృత్తమును పలువురు నాటకీకరించుట జరిగినది[5]. ఇట్టి పరిస్థితి ఇతర రాష్ట్రములందుకాని, ఇతరదేశములందు కాని ఇంతగా కన్పట్టదు. ఇది తెలుగువారి ప్రత్యేకతయనవచ్చును. ఉదాహరణముగా చెప్పవలెనన్నచో సూరిశాస్త్రిగారి పట్టికనుబట్టి ఈ కాలమున బయలుదేరిన హరిశ్చంద్రనాటకములు పదుమూడు; సారంగధర నాటకములెనిమిది; ఉషాపరిణయములారు; సావిత్రి చరిత్రలైదు; తారాశశాంకములైదు; శశిరేఖాపరిణయములైదు.

ఈ కాలమున గుర్తింపవలసిన యొక ముఖ్య విశేషము క్రొత్తరకముల ప్రహసనముల ఉద్భవము. ప్రదర్శన సమయములలో ప్రహసనములను ప్రదర్శించుటను ధార్వాడవారే నేర్పియున్నారు. కాని ఈ కాలమున నాటకసమాజములవారు బ్రహ్మాండమైన సీనరీలను ఏర్పాటుచేసికొనియుండుటచేత ఒకదృశ్యమునుమార్చి యింకొక దృశ్యమును ఏర్పాటుజేసికొనెడిలోపల ప్రేక్షకులను వినోదింపజేయవలసిన యావశ్యక మెక్కువైనది. అందులకు చిన్నచిన్న ప్రహసనములు కావలసివచ్చినవి. వీనిని చిన్నచిన్న కవులేకాక పెద్దపెద్ద కవులును వ్రాయుట కారంభించిరి. ఏతత్ప్రదర్శనములకు సమాజములలో ప్రత్యేకముగా హాస్యనటులేర్పడినారు. ఈ ప్రహసనములలో కొన్ని సంస్కరణోద్దేశములు కలవి; మరికొన్ని వ్యక్తిగత దూషణములతో, వ్యంగ్యార్థములతో కూడుకొన్నవి; తక్కినవి కేవలము వినోదాత్మకములు[6]. 1920 నాటికి ఇట్టి రకరకముల ప్రహసనము లించుమించుగా రెండువందలవరకును ప్రకటితములైనవి.

ఈ కాలమున నుద్భవిల్లిన యింకొక విశేషము నాటకగేయ సాహిత్యము. దీనికాదిపురుషులనదగిన శ్రీయుతులు ధర్మవరం, కోలాచలంగార్లు వారి నాటకములకు పాటలను వారేవ్రాసికొనియున్నారు. కాని ఈ కాలమున ఇతరులనాటకములకు-కవికోరికమీదగాని, సమాజముల కోరిక మీదగాని-పాటలను వ్రాసియిచ్చెడి నాటకవాగ్గేయకారులు బయలుదేరినారు. ఇట్టి వారిలో ముఖ్యముగా పేర్కొనబడవలసినవారు పాపట్ల కాంతయ్యగారు, అల్లకచంద్రశేఖరకవి. కాంతయ్యగారు సర్కారు జిల్లాలలోని నాటక గేయసాహిత్యమునకు బ్రహ్మలని చెప్పదగినవారు.[7] చంద్రశేఖర కవి కవియేకాక నటులుకూడను. వీరు రచించిన కీర్తనలు "ఆంధ్రనాటక కృతులు" అను పేర రెండుభాగములుగా ప్రకటింపబడెను-రసపుత్రవిజయ, కుశలవ, చంద్రకాంత, సారంగధర, సుగుణమణి నాటకములందలి కీర్తనలు ప్రథమభాగముగను (1917), తక్కిన కీర్తనలురెండవ భాగముగను (1921) ప్రకటింపబడినవి. కాంతయ్యగారి కీర్తనలు కూడ గ్రంథరూపమున వెలువడినవి; ఇందలి విశేషము కీర్తనలన్నియును స్వరయుతముగా ప్రకటింపబడుట. ప్రహ్లాద నాటకమునందలి కీర్తనలు 1923 లోను, ద్రౌపదీవస్త్రాపహరణమునందలి కీర్తనలు 1925 లోను ప్రకటింపబడినవి; ఇవి కేవలము "మైలవరం బాలభారతీ సమాజము" వారిసొత్తు. నాటకము

లాయా సమాజములకెట్లు సొంతములో, ఈ గేయములును అట్లే సొంతములు. ఒక్కొక్క నాటక మందలి కీర్తనలు ప్రత్యేక సంపుటములుగా ముద్రితములైనవి కూడను.

ప్రజలకు పాటలమీద మోజు హెచ్చుగా నుండుటచేతను, పాటలను వ్రాసియిచ్చెడివారు లభించుచుండుటచేతను ఈ కాలమున కొందరు నాటకకర్తలు తమనాటకములకు 'సంగీత'అనెడి ఉపపదమును చేర్చుట కారంభించినారు. కాని, నిజమునకివి పూర్వమునుండియు వ్యాప్తిలోనున్న గద్య-పద్య గేయసమ్మిశ్రితములగు నాటకములవంటివేకాని, తద్భిన్నములైనవికావు.

1913 ప్రాంతములలో కృష్ణామండలమున నాటకపు పోటీలారంభమైనవి. హరిశ్చంద్ర, బొబ్బిలియుద్ధనాటకము, గయోపాఖ్యానము, ఉద్యోగవిజయములు, రసపుత్ర విజయము, రంగూన్‌రౌడి మొదలగు నాటకములకు పోటీలు జరిగినవి. ఈ పోటీలవలన నాటకములకు, అందు నెగ్గిననటులకు అధికములగు వ్యాప్తి-ఖ్యాతులువచ్చినవి. 1900 నాటికి ప్రసిద్ధకవులందరును నాటకములను రచించుట కారంభించినారు. పండితులకు, కులీనులకు నాటకప్రదర్శనములన్నచో కొంత గౌరవమేర్పడినది. ఈపోటీలవలన ఆ గౌరవ మినుమడించుటయేకాక ఆ నాటక కర్తల, ఆ నటుల విషయమున 'వీరపూజ' (hero-worship) ఆరంభమైనదన్నను అతిశయోక్తి కాజాలదు. ఈ పోటీల ఫలముగా కొందరు యువనటులు వెలుగులోనికివచ్చి, బహుళ ఖ్యాతినందుట గమనింపవచ్చును.

తెలుగునాటకరంగమున వ్యాపారనాటకసమాజము లుద్భవిల్లినదికూడ ఈ కాలముననే. రాజమండ్రి హిందూనాటకసమాజ మిట్టివానిలో మొట్టమొదటిది. ఈ వ్యాపారనాటకసమాజములు పలువురు ప్రసిద్ధ నటులను, కవులను ఆకర్షించుటతోపాటు, పలువురు అప్రసిద్ధనటులను, అప్రసిద్ధకవులనుకూడ ఆకర్షించి వెలుగులోనికి తెచ్చినవి. ఆ కారణముగా అనేక నాటకములు బయలుదేరుట కవకాశము కలిగినది. ఈ కాలముననే తెలుగులో 'నాటక విమర్శ' బయలుదేరుట గమనించియున్నాము. కాని ఈ విమర్శ లధికముగా ప్రదర్శనములకు సంబంధించియుండుటచేత, రచనలపై వాని ప్రభావము కన్పట్టదు. నాటకరంగమునకు సంబంధించి ఈ కాలమున వెలువడిన గ్రంథములలో కోలాచలమువారి 'ప్రపంచనాటక చరిత్ర' ('Dramatic History of the World'—1908) తెలుగువారికి ఒక గర్వహేతువు. 'ఆంధ్రనాటకములు-కొన్ని సమయములు' అనెడి విపులవ్యాసమునుకూడ వీరు ప్రచురించినారు. దీనిని 'ప్రపంచనాటక చరిత్ర'కు అనుబంధముగాకూడ చేర్చినారు.

శ్రీ గురజాడవారు 'కన్యాశుల్కం' ద్వితీయముద్రణ పీఠికలో క్రిందివిధముగా వ్రాసియున్నారు (1-5-1909) :

"Itinerant Maharatha troupes staged Hindi plays in the Telugu districts and made money. Local companies copied their example and audiences listened with delight to what they did not understand. The bliss of ignorance could not have been more forcibly illustrated. Kanya-sulkam gave little scope to vulgar stage attractions such as flaring costu-

mes, sensuous dances, bad music and sham fights; yet it drew crowded houses and vindicated the claims of the vernacular……I am glad to find that Hindi plays are on the decline. But the conditions of the Telugu stage can by no means be considered to be satisfactory. There are no theatres worth the name and no professional actors who practise acting as an art. There are not many good plays either. Modern life which presents complex social conditions is neglected by play-wrights except for purposes of the broadest farce, and poverty of invention is manifested by the handling of threadbare romantic topics. Few writers display knowledge of technique………"

గురుజాడవారి పై విమర్శ 1909 నాటిది. ఇందు కొంత అతిశయోక్తి లేకపోలేదు. నిజమునకు 1909 కి ముందే తెలుగునాటకరచయితలలో, సమాజములలో నవచైతన్యము కలుగుట గమనించియున్నాము. ఇంక 1912 తరువాత తెలుగునాటకరంగము బహుముఖములుగా వ్యాపించుటగూడ గుర్తించియున్నాము. ఈ వ్యాప్తి ఇంచుమించుగా 1920 వరకు కొనసాగినది. అటుపిమ్మట మరియొకదశ ప్రారంభమగుచున్నది.

1919 లో మొదటి ప్రపంచయుద్ధము సమాప్తమైనది. యుద్ధానంతరమున ఆంగ్లేయులేదో యొరిగింతురని కొండంతయాశపడిన జాతీయనాయకుల యాశలు అడియాసలైనవి. ఇంక జాతీయోద్యమము ద్విగుణీకృతోత్సాహముతో విజృంభించినది. జాతీయోద్యమముతోపాటు ఆంధ్రులమీద మరి మూడు ఉద్యమముల ప్రభావముకూడ కలదు—ఒకటి సాహిత్యమందలి కాల్పనికోద్యమము, వీరేశలింగంపంతులుగారు ప్రారంభించిన మానవోద్యమము, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమము. ఇట్టి స్థితిలో తెలుగు నాటకచరిత్రలో తరువాతి అధ్యాయము ప్రారంభమగుచున్నది.

భూమిక

1. అభిజ్ఞానశాకుంతలమునకు కొన్ని అనువాదములు :

1. పరవస్తు వేంకటరంగాచార్యులు – 1872–75
2. కందుకూరి వీరేశలింగం – 1875–83
3. కోరాడ రామచంద్రశాస్త్రి – ?
4. రాయదుర్గం నరసయ్యశాస్త్రి – 1894 మే
5. వేదం వేంకటరాయశాస్త్రి – 1996
6. దాసు శ్రీరాములు (అచ్చతెనుగు) – 1898
7. వడ్డాది సుబ్బారాయుడు – 1906
8. గూడకృష్ణయ్య – 1912
9. అంబటిపూడి రామబ్రహ్మం – 1912
10. వి. కన్నయ్య – 1915
11. కస్తూరి సుబ్బారావు – 1915
12. మంత్రిప్రగడ భుజంగరావు – 1919
13. మోచర్ల రామకృష్ణయ్య –
14. త్రిపురాన సూర్యప్రసాదరావు –
15. గరిమెళ్ళ వేంకటనరసింహశాస్త్రి –
17. సోమరాజు రామానుజరావు – 1921–22
17. రాళ్ళభండి కోటమరాజు – 1921–25
18. కాంచనపల్లి కనకాంబ – 1929

"ఏనుగునెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము, స
న్మానములందినాము, బహుమానముల్ గ్రహించినార, మె
వ్వానిని లెక్కఁబెట్ట కనివారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగొనినారము నీవలనన్ సరస్వతీ"

ముట్నూరి కృష్ణారావుగారు పేర్కొనినట్లుగా "వీరికవిత్వము ప్రాచీనకవితకు భరతవాక్యము. నవీనకవిత్వమునకు నాంది. వీరి కవిత్వమం దెచ్చటఁజూచినను సౌకుమార్యము, పౌరుషము, జీవము గోచరించుచుండును. ఈ విలక్షణములే యాంధ్రదేశమున శిష్యసహస్రముల వెదజల్లినవి. వీరి రచనలెక్కువగ వీరి జీవితమునకు సంబంధించినవగుటచే నాకవిత్వ మాత్మగౌరవమును ప్రతిష్ఠించుకొన్నది".

5. చారిత్రకములు — పండితరాజము (ప్ర. ము. 1909); శ్రీమదెడ్వర్డు పట్టాభిషేకనాటకము (1904); బొబ్బిలి పట్టాభిషేకనాటకము (1932).
పౌరాణికములు — భారతనాటకములు; సుకన్య (1908); అనర్ఘనారదము (1909); దంభవామనము (1909); ప్రభావతీప్రద్యుమ్నము (1931).
భారతనాటకములు — పాండవవిజయము (1903); పాండవాశ్వమేధము (1903); పాండవప్రవాసము (1907); పాండవజననము (1908;) పాండవోద్యోగము (1911) పాండవరాజసూయము (1921).
సంస్కృతానువాదములు — బాలరామాయణము (1902-03); మృచ్ఛకటికము (1907); ముద్రారాక్షసము(1908).
సాంఘికము — వ్యసనవిజయము (అసంపూర్ణ ప్రకరణము).
ప్రహసనములు — పెల్లైటూళ్ళ పట్టుదలలు (1903); రసాభాసము.

6. తొలిరోజులలో ఉద్యోగ-విజయములను విడివిడిగానే ప్రదర్శించెడివారు; కాని, 1915 ప్రాంతములనుండి రెంటింటిలోని కొన్నిభాగములను తగ్గించివేసి, ఒకేనాటకముగా 'ఉద్యోగవిజయము' లను పేర సమాజములవారు ప్రదర్శించుచున్నారు. (సాధారణముగా 'ఉద్యోగము'లోని 5, 6 అంకములను, విజయములోని మరికొన్నిభాగములను తగ్గించుచుందురు.) అచ్చులోమాత్రము రెండును వేర్వేరుగానే యున్నవి.

7. 'ఉద్యోగవిజయము'లలోని కృష్ణార్జున పాత్రలనుధరించి, తెలుగునాటకరంగమున ఉత్తమ నటులనిపించుకొన్నవారెందరో కలరు; అసలు, ఆ నాటకములవలననే కొందరునటులు సుప్రసిద్ధులైనారనుట ఎక్కువ సమంజసము—శ్రీయుతులు మల్లాది గోవిందశాస్త్రి, ముంజులూరి కృష్ణారావు, డి. వి. సుబ్బారావు, బెల్లంకొండ సుబ్బారావు, బందా కనకలింగేశ్వరరావు, పీసపాటి నరసింహమూర్తి ప్రభృతులు కృష్ణవేషమునుధరించి, వందలకొలదిగానున్న పద్యములను మనోహరముగా జదివి, ప్రేక్షకుల మన్ననలనుపొంది, పాండవోద్యోగవిజయములవలననే సుప్రసిద్ధులైనారన్నచో అతిశయోక్తికానేరదు.

## ద్వితీయవర్గము

1. చూ. పులవర్తి భీమలింగమూర్తిగారి వ్యాసము—ఉగాదిసంచిక-1919.
భావనారాయణగారి నాటకములు :

1. రఘుదేవరాజీయము (అముద్రితము); 2. సౌందర్య సతీమణి (1904); 3. సంగీత సభ (1906); 4. కుముద్వతీ సారంగధరము (1909); 5. ప్రత్యక్షనారసింహము (1913); 6. తులసీమాధవము (అసమగ్రము).

వీరు 'గాయనగాయనీ మనోరంజని' మనెడి సంగీతగ్రంథమునుకూడ రచించియున్నారు.

జన్మస్థలము : అమలాపురముదగ్గరనున్న మోడేకుఱ్ఱు.

తల్లిదండ్రులు : వెంకమ్మ, రామయ్య.

జననము : జూన్, 1867, మరణము : 10-12-1917

2. జననము - 1879 ఆగష్టు. మరణము - 12-6-1938

జన్మస్థలము - గంజాముమండలములోని గోపాలపురము.

తల్లిదండ్రు లిరువురును విద్యావంతులు.

లక్ష్మీనరసింహముగారు కొంతకాల ముపాధ్యాయులుగను, కొంతకాలము న్యాయవాదులుగను పనిచేసి, పిమ్మట జయపురంమహారాజా శ్రీ విక్రమదేవవర్మగారికి అంతరంగిక కార్యదర్శులైరి. వీరు బహుళగ్రంథకర్తలు.

వీరు వ్రాసిన నాటకములు:—

1. రుక్మిణీకళ్యాణనాటకము (1905); 2. మాలినీ విజయము (కీచకవధ-1907); 3. చిత్ర హరిశ్చంద్రీయము (1913); 4. లుబ్ధాగ్రేసర చక్రవర్తి (ప్రహసనము-1914) 5. అహల్య (1933); 6. చిత్ర.

నరసింహముగారి సోదరి శ్రీమతి సీరము సుభద్రయాంబకూడ కవయిత్రియే. ఆమె "సురుచీ విజయము" అనెడి నీతిబోధకమగు చక్కని నాటకమును రచించిరి (1914).

చూ. డా. దివాకర్ల వేంకటావధానిగారి 'అహల్య' పీఠిక.

3. శ్రీ కస్తూరి నరసింహారావు 1905 లో ప్రకటించిన తమ హరిశ్చంద్ర నాటకమునకు 'నవ హరిశ్చంద్రనాటకము' అని పేరుపెట్టిరి. ఇది ప్రధానముగా శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము ననుసరించియున్నను, 'శంకరకవి తీసికొనివచ్చిన కథారీతిలోఁ గొన్నిస్థలములందుఁ బరస్పర విరుద్ధములుగాను, కొన్నిపద్యములలోఁ గొన్నిశబ్దములు ప్రకృత్యానుకూల్యము లేనివిగాను' కన్పించుటచే వీరు కొన్నిమార్పులను, నాటకప్రక్రియదృష్టితో, చేసినట్లు పీఠికలో చెప్పుకొనినారు.

4. జననము - 23-12-1881, మరణము - 30-6-1953.

జన్మస్థలము - బాపట్లతాలూకా 'ఇటికంపాడు'.

తల్లిదండ్రులు - ఆదిలక్ష్మమ్మ; నరసింహశాస్త్రి.

లక్ష్మీకాంతకవిగారు ఉప్పుసత్యాగ్రహముచేసి జైలుశిక్షననుభవించిరి. 1926 లో చల్లపల్లి రాజా వారిసాయముతో గుంటూరులో ప్రసిద్ధమగు చంద్రికాముద్రణాలయమును స్థాపించినారు. 1930లో రంగూన్‌లో సన్మానితులై 'కవితాకళానిధి'యను బిరుదమునందినారు. 1942 లో చలనచిత్ర సంఘమువారు ఘనముగ సన్మానించి 'పుంభావసరస్వతి'యను బిరుదమునొసంగిరి. సినిమా కళలో రచయితలుగా,నటులుగా పరిశ్రమచేసిన తెలుగుకవులలో వీరు ప్రధానులనిచెప్పవచ్చును. చరమదశలో కాళహస్తిలో స్థిరపడినారు.

వీరు రచించిన నాటకములు:—

1. బుద్ధిమంతీవిలాసము (1905); 2. సత్యహరిశ్చంద్రీయము (1912); 3. ఉత్తరరాఘవము (1910); 4. సాత్రాజితీయము.

19. కాకర్ల కొండలరావు - 1930
20. వత్సవాయి వేంకటనీలాద్రిరాజు - 1933
21. జె. గంగన్న - 1931
22. ఎస్. రామకవి -
23. భువనగిరి విజయరామయ్య
24. పేరి కాశీనాథశాస్త్రి -
25. చిలుకూరి శ్రీరాములు - 1946
26. ముళ్ళపూడి నారాయణశాస్త్రి - 1954
27. పంగనామముల రామచంద్రరావు - 1948
28. దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
29. కేశిరాజు వేంకటనృసింహఅప్పారావు -
30. మాదిరాజు విశ్వనాథరావు -

## ప్రథమవర్గము

1. జననము—29-10-1866.

జన్మస్థానము—పశ్చిమగోదావరి జిల్లా, కొవ్వూరు తాలూకా, దేవరపల్లి గ్రామము.

నివాసము—1898 నుండియు రాజమండ్రి.

తల్లిదండ్రులు—వేంకటసుబ్బమ్మ సోమిదేవమ్మ; వేంకటసోమయాజులు.

12 వ ఏటనే కవిత్వము చెప్పనేర్చినవారు శాస్త్రిగారు.

2. కాని. ఇది సత్యముకాదనియు, నిజమునకు బొబ్బిలివారిదే లోపమనియు, వారు దురభిమానమునకు లోనైరనియు, విజయరామరాజు తప్పులేదనియు, వెంగళ్రావు చనిపోకుండ నర్సాపురముచేరి రంగరాట్చరిత్రమును వ్రాయించెననియు, తాండ్రపాపయ్యను రామరాజే చంపెననియు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రసంగాంతరమున తెల్పియున్నారు. ఇందలి సత్యాసత్యములు చరిత్రకారులు తేల్చవలసిన విషయములు.

3. చూ. "ఆంధ్రనట ప్రకాశిక"—పుటలు 337-78.

నాయకుడైన రంగారావు పతనము చెందుట, ప్రతినాయకుడైన విజయరామరాజు కేవలము పిరికివానిగా చిత్రింపబడుట మొదలగునవి పసుమర్తివారి విమర్శకు గురియైనవి. మొత్తము మీద శాస్త్రిగారు తమ రచనలో విజయరామరాజు పాత్రకు అంతగా ప్రాధాన్యమొసంగకపోవుట గమనార్హము.

4. శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి (వెలనాట్లు).

జననము - 3-4-1872; మరణము - 7-12-1920. ✓

జన్మస్థానము - ఎండగండి.

తల్లిదండ్రులు - శేషమ్మ, వేంకటావధాని.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి (ఆరామద్రావిడులు).

జననము - 8-8-1870; మరణము - 15-2-1950. ✓

జన్మస్థానము - దంగేరు: నివాసము - కడియము.

తల్లిదండ్రులు - చంద్రమ్మ. కామయ్యశాస్త్రి.

1888 లో చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్ద ఇరువురును అంతేవాసులుగ చేరినారు. ఇరువురును కలిసి 23-11-1892 తేదీన కాకినాడలో ప్రప్రథమముగా శతావధానము చేసినారు. నాటినుండి వారుచేసిన శతావధానములకు, మెట్టిన రాజాస్థానములకు, పొందిన గౌరవములకు లెక్కయేలేదు.

5. "సత్యహరిశ్చంద్రీయము" బలిజేపల్లివారిరచనయేకాదనియు, దానిని శ్రీ భాగవతుల సుబ్బయ్య అనువారు రచింపగా, లక్ష్మీకాంతకవిగారు తమపేరు పెట్టుకొనిరనియు లోకమున నొక ప్రవాదమున్నది. సుబ్బయ్యగారు ఏలూరులో నేటికిని సుఖులైయున్నారు. వారిని స్వయముగా కలిసికొని యీ విషయమై ప్రశ్నించితిని. వారు నవ్వుచు మా లక్ష్మీకాంతకవి ఒకరిసొత్తును దొంగిలింపవలసిన ప్రతిభాదరిద్రుడు కాడనియు, సత్యహరిశ్చంద్రీయము సంపూర్ణముగా బలిజేపల్లివారిరచనయే యనియు వారు స్పష్టముచేసియున్నారు. కావున, సత్యహరిశ్చంద్రీయకర్త బలిజేపల్లి వారేయనుట నిస్సందేహము.

6. రుక్మిణీకృష్ణీయము లేదా మాయాశక్తి అనునాటకముయొక్క వ్రాతప్రతిని చదివి, దానిపై తమ అభిప్రాయమును తెలుపుచు 19-4-1925 తేదీన రాఘవాచార్యులుగారు గోపాలాచార్యులుగారికి ఆంగ్లమున వ్రాసిన సుదీర్ఘమైనలేఖ నాయొద్దనున్నది. అందువారు నాటకమునకావింపవలసిన మార్పులను సూచించుటతోపాటు, నాటకరచనలో పాటింపవలసిన కొన్ని ధర్మములనుకూడ వివరించియున్నారు—(1) నాటకమున మాటలకంటె చేష్టప్రధానము: (2) ధర్మబోధ ఉపన్యాస రూపమునకాక ఆచరణరూపమున పొడగట్టవలెను; (3) సంభాషణములు నాతిదీర్ఘములై మనోహరములుగానుండవలెను; (4) హాస్యము నాటకమందవశ్యముండితీరవలయును (అది జీవితమున ఉత్తేజనము కల్పించెడిదికావలయును.).

7. ముద్రితనాటకములు— రామదాసు; రాంకనీరు; సుభద్రాపరిణయము; ప్రేమచంద్రయోగి లేదా అస్పృశ్యవిజయము; రుక్మిణీకృష్ణీయము లేదా మాయాశక్తి.

అముద్రిత నాటకములు— శ్రీరామలీలలు; గిరిజాశంకరీయము; పాండవాజ్ఞాతవాసము; ఉత్తమరామ చరిత్ర; హరిశ్చంద్ర; కెయిసర్ లేక కలియుగదుర్యోధన; ఉషాపరిణయము.

8. రాఘవాచార్యులవారికి కీర్తితెచ్చిన లేదా వారివలన ప్రఖ్యాతిపడసిన నాటకములలో రెండు ప్రధానములైనవి—ఒకటి కోలాచలమువారి 'రామరాజుచరిత్ర'; రెండవది గోపాలచార్యులవారి 'రామదాసు'. ఈ రామదాసు నాటకమునకు ప్రఖ్యాతితెచ్చినవారింకను మరికొందరుకలరు— శ్రీయుతులు యడవిల్లి సూర్యనారాయణ, శ్రీ రామాయణం సర్వేశ్వరశాస్త్రి, శ్రీ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి మొ॥

9. "నలువ కొలమను తరువునఁదెలుఁగు నాటి శాఖపూచిన పూవు, విశాఖపుర 'మి
షన్ హయస్కూలు నందొజ్జ, సర్వబుధవిధేయుఁడతఁడు, ఇ. యజ్ఞనారాయణుండు"
—రసపుత్ర విజయప్రస్తావన – సూత్రధారుడు.

వీరు 'హితకారిణీ గ్రంథమాలా' సంపాదకులుగా నుండిరి. వ్రాసిన నాటకములు: 1. రసపుత్ర విజయము (1910); 2. అపూర్వ నాగరికత (1912): 3. భారతమాత (1913); 4. రాజపుత్రతేజఃపుంజము లేదా రాణాప్రతాపసింహ (1920); శ్రీకృష్ణజననము. అపూర్వ నాగరకత మూడు భాగములుగా వెలువడినది: ఇందు, నవనాగరకతమూలమున వచ్చిన కొన్ని దురాచారములు మనోహరముగా వ్యక్తముచేయబడినవి. ఇంక 'రాజపుత్రతేజఃపుంజము'ను "ఆపదలందు ధైర్యమే సుఖాస్పదమౌ; నిజకార్యసిద్ధి దీక్షాపరతన్ లభించునను సత్యము నిత్యము చాటితెల్పఁగన్" రచించినట్లు వారే తెల్పుకొనియున్నారు. శ్రీకృష్ణజననములో ఆధునిక రాజకీయ వాతావరణమును చొప్పించియున్నారు. శ్రీకాకుళము దగ్గరనున్న 'కంచిలి' కి సంబంధించిన గాథను పురస్కరించుకొని వీరు విషాదరూపకమును కూడ రచించిరట; ఇది అముద్రితము.

'రాణా ప్రతాపసింగు' నాందిలో ఆంధ్రమాత ప్రశస్తి గమనార్హము:
"సారస్వతశరీరధారులై యమరులౌ నన్నపార్యాదులఁ గన్నతల్లి,
కార్యఖడ్గకవిత్వ ఘనులు తిక్కాత్రయోదారవీరులఁ గన్నవీరమాత,
ప్రాగ్వణిగ్గమకు కేంద్ర స్థానమౌ పూర్వజలరాశి పెనుప్రాపుగలుగు వసుధ,
గౌతమీకృష్ణవేణీతటీక్షేత్రగర్భముల రత్నములీను రత్నగర్భ,
దళితరిపుజాత మహితగోత్ర సముపేత, ప్రజప్రబోధింప పూతప్రభాతగీత,
మతిముదంబునం బాడెడు నాంధ్రమాత, నిఖిలసంపత్సమేతయై నెగడుగాత."

10. నారాయణరావుగారు ప్రతినాటకప్రారంభమందును "మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణే నమః" అని పేర్కొని యుండిరి. మేధాదక్షిణామూర్తి భక్తులైన యింకొక నాటకరచయిత శ్రీ నాదెళ్ళవారు.

నారాయణరావుగారి నాటకములు :

పౌరాణికములు—చిత్రాభ్యుదయము (1909); పద్మవ్యూహము (1919).

సాంఘికములు—చింతామణి (1921); వరవిక్రయము (1922 ప్రాంతములు); మధుసేవ (1906); కాలేజీగరల్.

ప్రహసనములు— బుడ్డాగ్రేసరచక్రవర్తి ప్రహసనం (1906); రూపాయగమ్మత్తు (1920); కారణంలేని కంగారు (1920); దసరాతమాషాలు (1920); ఘోరకలి (1921); మ్యునిసిపలు ముచ్చట్లు (1921); విదూషకకపటము (1921).

11. కామేశ్వరరావుగారి తల్లిదండ్రులు—నరసమ్మ; ఉమామహేశ్వరరావు. విజయనగరములో సంస్కృతము ప్రత్యేకవిషయముగా పట్టభద్రులైనారు; పిమ్మట ఫిలాసఫీ ఎమ్. ఏ.లో ఉత్తీర్ణులైనారు. అటుపిమ్మట రాజమహేంద్రవరము ట్రెయినింగ్ కాలేజీలో ఉపన్యాసకులుగా పనిచేసిరి. వీరు నటులు, రచయితలు మాత్రమేకాక చక్కని సంగీతజ్ఞులు కూడను.

12. నాటకపుపోటీలలో పరీక్షాధికారులు మార్కులువేయవలసిన పద్ధతిని కామేశ్వరరావుగారు క్రింది విధముగా రూపొందించిరి—

| | | | | |
|---|---|---|---|---|
| I | వేషము 5 మార్కులు | 15 | | 100 |
| | శీవి 10 మార్కులు | | | |
| II | ఉచ్చారణ—నిర్దుష్టత-4; స్పష్టత-4; ధార-8; | 40 | | |
| | ఊతము-10; ఆపులు-10; కంఠధ్వని-4 | | | |
| III | సంగీతము—కంఠము-2; శాస్త్రము-3; | 10 | | |
| | సంగీతవాచకసమ్మేళనము-5 | | | |
| IV | అభినయము - 25 | 35 | | |
| | మూకాభినయము - 10 | | | |

—ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక (1917-18).

13. కామేశ్వరరావుగారి నాటకములుకొన్ని—
చంద్రగుప్త (1922 ప్రాంతములు), సౌరాబురుస్తుం, భారతరమణి, సీత, రాణాప్రతాపసింహ, బిల్వమంగళ (ఇవి బెంగాలీనుండి అనూదితములు).

లీలావతీ సులోచనము—(తమిళమునుండి అనూదితములు)

శ్రీ మాధవాచార్య విద్యారణ్య, డిటెక్షన్, శివాజీశీలము, శంభాజీ నిర్యాణము (ఇవి మహారాష్ట్రమునుండి అనూదితములు)

కలాపహాడ్ (ఒరియానుండి)

పునర్వివాహము (పంజాబీనుండి)

ప్రహసనములు—తగినశాస్తి, పిసినిగొట్టు (ద్విజేంద్రుని రచనకు అనువాదములు); గడుసు గంగయ్య, క్రొత్తల్లుడు మొ॥

14. ముత్తరాజు సుబ్బారావుగారు నోబిల్‌కళాశాలనుండి విరమించుకొన్నతరువాత నెల్లూరులో స్థిరపడి, నిర్ధనులుగాచనిపోయినారు. అంతట వారిమిత్రులు చిత్రకళాభివర్ధనికే "ముత్తరాయమెమోరియల్" సమాజమని పేరుపెట్టినడుపుచు, కొన్నినాటకప్రదర్శనములేర్పాటుచేసి, సుబ్బారావుగారి కుటుంబమునకు ధనసహాయమొనర్చినారు.

సుబ్బారావుగారు పెక్కు స్వతంత్రనాటకములు రచించియున్నారు—

పౌరాణికములు—తులాభారము (రచన-1920; ప్ర. ము. 1922); కచదేవయాని (1939); భక్తమార్కండేయ (1940).

చారిత్రకములు—రాజ్యశ్రీ; చంద్రగుప్తనాటకము లేదా మౌర్యాభ్యుదయము (1932); రణతిక్కన (1938). చంద్రగుప్తనాటకము (5 అం) తప్ప తక్కినవన్నియును మూడేసి అంకములే కలిగియున్నవి.

15. తులాభారనాటకములలో పోతుకూచి సుబ్బయ్య (1885-1947)గారి రచన మొదటిదిగా కన్పట్టుచున్నది (రచన 1916; ప్రథమ ప్రదర్శనము చింతామణిథియేటర్‌లో 25-1-1919 తేదీన). బందరులో దీని ప్రదర్శనమును చూచియే సుబ్బారావుగారు తమ నాటకమును రచించియున్నారట.

సత్యాగర్వభంగమును పానుగంటివారు నిరూపించినవిధమును గుర్తించియున్నాము. ఆ దృష్టితోచూచినచో ఇందలికథలో ఔచిత్యమంతగా కన్పట్టదు; గర్వభంగమొనర్చుటకు సత్యభామను బజారుపాలుచేయుట న్యాయ్యముకాజాలదు.

16. ఒక ఉదాహరణము :

"భ్రమరంబు భ్రమరికి సుమరసంబును జూపి త్రాగించి, శేషంబుత్రాఁగుచుండు

.....................

ఔర ! ప్రేమమాహాత్మ్యమేమనఁగవచ్చుఁ జేతనావళినెల్ల వశీకరించె"

ఇది కుమారసంభవములోని అకాలవసంతోదయవర్ణనలోని శ్లోకముల కనువాదము.

## తృతీయవర్గము

1. మంత్రిప్రగడ భుజంగరావుగారు శ్రీ పి.చెంచయ్యతోకలసి "ఆంధ్రవాఙ్మయచరిత్ర"ను ప్రప్రథమముగా ఆంగ్లభాషలో రచించి ప్రకటించియున్నారు. ("Heritage of India" Series).

2. "నాటకాంతము కవిత్వముప్రాసిన మహాకవి. ఈయన కవితకింత బిగువులగువులు వచ్చుటకుఁ బురాజన్మసుకృతమే హేతువు, ఏ మహావిద్వాంసుడు వాడలేనియటులు మంచిపొంకముగా బింకముగాఁ బదసంధానముగావించును. సమాసభూయస్త్వము వీరి కవితకుఁదరచుగానుండు గుణము; ఆగుణము వీరరసభరితములైన వీరినాటకములు కొన్నింటికిగొప్పరమణీయతనిచ్చినది. 'శ్రీకృష్ణరాయనాటకావళి'యను పేర వీరు రచించిన నాలుగు నాటకములు చాలగొప్పవి".

— శ్రీ మధునాపంతులవారి 'ఆంధ్రరచయితలు' (పుట-397).

3. పానుగంటివారి పెక్కునాటకములకు కూచివారు నాందీప్రస్తావనలు రచించిరి. ఇంక కూచివారి యీరెండునాటకములకును పానుగంటివారు నాందీప్రస్తావనలురచించియున్నారు. వీరు చాల ఆప్త స్నేహితులు. కూచివారిని, పానుగంటివారిని, చిలకమర్తివారిని కలిపి "సింహత్రయ"మనెడివారట యారోజులలో. పిఠాపురోన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులుగా కూచివారు సుప్రసిద్ధులు.

4. "కవికాలాదికములు అన్నపేరుతో ఈ నాటకమునకు నడకుదుటి వీరరాజుపంతులుగారు వ్రాసిన పీఠికలోని క్రిందివాక్యములు గమనార్హములు : ".......దశవిధరూపకములలో దేనియందును జేరక నాటకలక్షణమునకు వెలియైయున్న యీ పుస్తకమునకు నాటకమనుపేరిడుట యేలయని పెద్దలాక్షేపింపకుందురుగాక ! ఇక్కాలమున బయలువెడలు నాంధ్రనాటకములలో ననేకములు పూర్వనాటకలక్షణములకు వెలిగానేయున్నవి. ఇట్లుండుటకుఁ గారణము లనేకములుగలవు....... ఆయా విషయములనుచర్చించుచు ఆంధ్రనాటకములంగూర్చి తామొక విమర్శనగంథమును వ్రాయుచున్నట్లు ఇందు వీరరాజుగారు తెలిపినారు; అది లభ్యముకాలేదు.

## చతుర్థవర్గము

1. సచ్చిదానందశాస్త్రిగారు "దివోదాసు" లో సనాతనధర్మ ప్రాశస్త్యమును చక్కగా నిరూపించి యున్నారు. తెలుగు నాటక ప్రపంచమంతయును ఏకాంకిలతో, సాంఘికేతివృత్తములతో, సాంఘిక సమస్యలతో నిండియున్న కాలములో శాస్త్రిగారు "పౌరాణిక" రచనకు పూనుకొని, ఉదాత్తముగ నిర్వహించి యుండుట ముదావహము.

2. అయినాపురపు సుందరరామయ్యగారు 'ప్రతిజ్ఞాయాదవ' ప్రస్తావనయందు నాడు శతాధికముగా వెలువడుచున్న 'నవల' లను గూర్చి సూత్రధారముఖముగా చేసిన విమర్శ పరిశీలనార్హము:

"భువివార్తా పత్రికలటి కవనంబేయగు 'నవలల' కవనం బబలా
అవి చదివెడ రొకమాతే యివి యటులే చదివి యవలనే పడవైతుర్."

"అవనిఁగనంగ దేహబల మల్పము, బుద్ధిబలంబు నల్పమై
నవకపుఁబద్య కావ్యములు నాటకముల్ రచియింపఁజాలకే
నవలలు వ్రాయఁజొచ్చి రవి నాణెముఁ గూర్చునటంచు నాడరే
నవలలకే జనింపఁబఁడె నావెల కూర్పు పఠించుటల్ చెలీ."

"హత్తిన వర్ణనాతిశయమందిన జవ్వని పద్యకావ్యమౌ
బిత్తరి వృత్తచిత్ర పదభేషజ ప్రౌఢయె దృశ్యకావ్యమౌ
సత్తవిహీనయౌ వచనజల్పని లోలయె గద్యకావ్యమౌ
హత్తుగఁగావ్య కన్యకను నాగతిగా విభజింప నయ్యెడిన్."

3. ......"మొదటి కథ స్త్రీలకు విద్యాకౌశలత్వము ప్రసాదించి యన్యనాగరికుల శీలంబులనెల్ల దిన్నఁగానేర్పి తుదకు వివాహాదికార్యంబులయందు నన్యులకు వలెవారికిని స్వాతంత్ర్యమొసంగమిచే గలుగుచుండు విపరీతంబులందెల్పుచుండును. రెండవది వైశ్యబ్రాహ్మణుల వివాహపద్ధతులలో కేవల శిశుమాత్రులైన కన్యలకు వయోవృద్ధులైన భర్తలఁ పెండ్లిచేయుటచేతఁ గలుగుచుండు కుటుంబకష్టంబులును దెల్పుచుండును. మూడవకథ యాంగ్లేయభాషనుండి గ్రహింపఁబడియాంధ్రీకరింపఁబడిన హాస్యరస సంపూరితమై ప్రకాశించునది. ఈ మూడు కథలనొక్కటే కథగా కనుబడు విధముగా నీనాటకమును నావల్లనైనంత మట్టుకు నల్లితిని....."—పీఠిక-7-4-1911.

## పోటీలు : విమర్శలు

1. "ఆంధ్రనాటకనామాళి" (1916)-సంపాదకపీఠిక—పుట-7, (సంపాదకులు-శ్రీయుతులు పురాణం సూరిశాస్త్రి, కానుకొలను వెంకటరామయ్య).

2. శ్రీ పురాణం సూరిశాస్త్రి—"నాట్యాంబుజము" (1923)—పుట-13.

3. పుట 341 లోని పట్టికను చూడవలెను.

4. పుట 342 లోని పట్టికను చూడవలెను.

5. ఈ సందర్భమున కందుకూరివారి వాక్యములు గమనింపదగినవి—" నేను దీనిని (అభిజ్ఞాన శాకుంతలానువాదమును) రచించిన తరువాత దాఁదాపుగాఁ బదేండ్లకు (1894 లో) దీనికంటె నెక్కువ మనోహరముగా నుండవలెనని క్రైస్తవ కళాశాలా పండితులగు రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు శాకుంతలమును మరలఁదెలిఁగించిరి. ఈ రెండింటికంటెను నధికరమ్యముగా నుండవలెనని రెండు మూఁడేండ్లతరువాత (1896 లో) చెన్నపురి క్రైస్తవ కళాశాలా సంస్కృత పండితులగు వేదము వేంకటరాయశాస్త్రిగారు వెండియుఁ దెలిఁగించిరి. తరువాత మఱి రెండేండ్లకాళి (1898లో) మూటికంటెను ముద్దుగానుండవలెనని దాసు శ్రీరామపండితులవారింకొక భాషాంతరముచేసిరి; ఇవన్నియు నిట్లుండఁగా నన్నిటినిమించి యత్యంత హృద్యముగా నుండవలెనని మఱి యెనిమిదేండ్ల కనఁగానేను భాషాంతరీకరించిన యిరువదేండ్లకు తరువాత (1906) వడ్డాది సుబ్బారాయుడుగారు వేరొకభాషాంతరముచేసిరి." (స్వీ. చ. 1 వ. భా-పుటలు 189-90). కందుకూరివారికి ముందే కోరాడ రామచంద్రశాస్త్రిగారును, వారితో సమకాలమున పరవస్తు వేంకట రంగాచార్యులవారును శాకుంతలము ననువదించియున్నారు. వడ్డాదివారి తరువాత ఇంచుమించుగా ఇరువదిమంది శాకుంతలమునను వదించిరి. మొత్తము శాకుంతలానువాదములు ముప్పదికిపైగాకలవు. చూ. పుటలు 332-33; ఇది అనువాదనాటకములకు ఒక ఉదాహరణము మాత్రమే; ఇంక స్వతంత్ర నాటకముల విషయమును ఇట్టిదే.

6. కొన్ని ఉదాహరణములు :
తస్సు—మల్లాది అచ్యుతరామశాస్త్రి (1915); తవిటిరొట్టె—తిరుపతి వేంకటకవులు (1913); నాచిపార్టీ—కోలాచలము శ్రీనివాసరావు (2925); లొడాలి బుచ్చిగాడు - శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి (1912).

7. కృత్తివెంటి నాగేశ్వరరావు, సత్యవోలు గున్నేశ్వరరావుగార్లు వీరిని ప్రప్రథమముగా రాజమండ్రి తీసికొనివచ్చిరి. అక్కడ కొంతకాలముండి, పిమ్మట బెజవాడ మైలవరం కంపెనీకి వెళ్ళినారు; వారువెళ్ళిన తరువాత రాజమండ్రిలో చంద్రశేఖరకవిగారు ప్రసిద్ధికివచ్చినారు.

| ౮. నాటకజాతి ; | 1901 | 1902 | 1903 | 1904 | 1905 | 1906 | 1907 | 1908 | 1909 | 1910 | 1911 | 1912 | 1913 | 1914 | 1915 | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. భారత కథలు | — | — | — | — | — | 1 | 3 | 2 | 3 | 1 | 2 | 2 | 4 | 5 | 6 | 29 |
| 2. కృష్ణగాథలు; పురాణములు | — | — | — | — | 2 | 2 | — | 2 | 5 | 7 | 9 | 7 | 9 | 10 | 5 | 58 |
| 3. రామాయణకథలు | — | — | — | — | — | — | — | 3 | — | 3 | 1 | 1 | 4 | 6 | 8 | 26 |
| 4. సంస్కృతానుకరణములు | — | 2 | 4 | 1 | — | 1 | 2 | 4 | 2 | 2 | 6 | 4 | 4 | 4 | 3 | 44 |
| 5. పార్శీనాటకానుకరణములు | — | — | — | — | — | — | — | — | 2 | 1 | — | 1 | 1 | — | 2 | 7 |
| 6. ఇంగ్లీషునాటకానుకరణములు | — | — | — | — | — | — | 2 | — | 2 | 2 | 3 | 2 | 3 | — | 3 | 17 |
| 7. తెనుగుప్రబంధముల ననుసరించినవి | — | — | 1 | — | — | — | — | — | 5 | 2 | 1 | — | — | — | 1 | 10 |
| 8. జనరంజకములు | 2 | 9 | — | 2 | — | — | 3 | 5 | 9 | 9 | 7 | 7 | 7 | 6 | 7 | 72 |
| 9. సంఘావస్థానుకరణములు | — | — | — | — | 2 | 2 | — | 5 | 3 | 8 | 13 | 5 | 7 | 4 | 4 | 53 |
| 10. ప్రహసనములు | — | — | — | — | 1 | 1 | — | 1 | — | 2 | 3 | 1 | 1 | 1 | 5 | 16 |
| 11. చరిత్రల, నవలల అనుసరణలు | — | — | — | — | — | — | 2 | 1 | 3 | 1 | 9 | 8 | 8 | 4 | 2 | 38 |
| 12. వీథినాటకములు; యక్షగానములు | 2 | 1 | 6 | 2 | 3 | 2 | 4 | 3 | 4 | 8 | 6 | 6 | 9 | 11 | 11 | 78 |
| మొత్తము | 4 | 4 | 11 | 5 | 8 | 9 | 16 | 26 | 38 | 46 | 60 | 44 | 57 | 51 | 57 | 449 |

| నాటకజాతి | విశాఖ మండలము | గోదావరీ-కృష్ణా మండలములు | నెల్లూరు-మద్రాసులు | దత్తమండలము |
|---|---|---|---|---|
| 1. భారత కథలు | 1 | 23 | 4 | 1 |
| 2. రామాయణ కథలు | 0 | 21 | 4 | 1 |
| 3. కృష్ణగాథలు : పురాణములు | 5 | 43 | 8 | 2 |
| 4. సంస్కృత నాటకానుకరణములు | 1 | 37 | 5 | 1 |
| 5. పార్శీనాటకానుకరణములు | 0 | 7 | 0 | 0 |
| 6. ఇంగ్లీషు నాటకానుకరణములు | 2 | 11 | 4 | 0 |
| 7. తెలుగుప్రబంధములననుసరించినవి | 0 | 8 | 2 | 0 |
| 8. జనరంజకములు | 8 | 47 | 11 | 6 |
| 8. సంఘావస్థానుకరణములు | 14 | 33 | 6 | 0 |
| 10. ప్రహసనములు | 1 | 7 | 6 | 2 |
| 11. చారిత్రకములు : నవలలు | 6 | 28 | 2 | 2 |
| 12. వీథినాటకములు | 3 | 18 | 46 | 11 |
| మొత్తము | 41 | 284 | 98 | 26 |

చతుర్థాధ్యాయము

# నూతన ప్రయోగములు : నాటకములు

## భూమిక

ఆధునిక నాటకరచనా ప్రయోగముల విస్తృతికాలమున తెలుగు నాటకరంగము మూడుపూవు లారుకాయలుగా వర్ధిల్లినది. సంస్కృతనాటక రచనావిధానము ననుసరించియో, లేదా అప్పుడప్పుడు ఆంగ్ల నాటకరచనా సంప్రదాయముల ననుసరించియో స్వతంత్ర పౌరాణిక, చారిత్రకనాటకములు రచింపబడుట ఈ కాలమునందలి ప్రత్యేకత; అంతియేకాదు, సంప్రదాయముల కలగలుపుతో అటుకాని, ఇటుకాని చెందని రచనలుకూడ ఈ కాలముననే చాల బయలుదేరినవి. ప్రతి నాటకసమాజమును అందలి నటులకు, పరికరములకుతగినట్లు ముఖ్యమగు పౌరాణిక నాటకములను వ్రాయించుకొనెను; వానియందు సాహిత్యదృష్టి తక్కువయని వేరుగ చెప్పనక్కరలేదు. కాగా, నాటకరచనయందు ఆసక్తితోపాటు అలసత్వమును, తేలికతనమును హెచ్చినవి.

ఇట్టి కేవల విస్తృతిమార్గమునకు వ్యతిరేకముగ వచ్చిన విప్లవమా యనునట్లు తరువాతి కాలము నూతన ప్రయోగములకాలమై వర్ధిల్లుట గమనార్హము. ఈ కాలమునందలి ప్రయోగములు మూడు విధములుగా సాగినవి—మొదటిది భావవైవిధ్యమునకు సంబంధించినది; రెండవది రచనావైవిధ్యమునకు సంబంధించినది; ఇంక మూడవది ప్రదర్శనకు సంబంధించినది. సాంప్రదాయక నాటకరచనా విధానమునుండి విడివడుటకు పలువురుచేసిన ప్రయత్నముల ఫలమే ఈ నూతనప్రయోగములు. పెక్కు ప్రయోగములు ఒండొంటికి సమకాలికములగుటకూడ గమనింపవచ్చును. మొత్తముమీద ఈ ప్రయోగముల దశలను స్థూలముగా క్రిందివిధముగా విభజింపవచ్చును—

1920-25 మధ్య దేశభక్తిపూరితములును, సంఘసంస్కరణాత్మకములును అయిన రూపకములు వెలువడినవి. 1925-30 మధ్య రచనయందు ప్రయోగాత్మకములును, సంఘతిరస్కారాత్మకములును అయిన రూపకములు వెలువడినవి. 1930-35 మధ్య రచయితల దృష్టి మరల కొంత సాంప్రదాయకమార్గము ననుసరించినది. 1935-40 మధ్య ఆంధ్ర సంస్కృతీ నిరూపణాత్మకములైన రూపకములును, 1940-44 మధ్య అన్నిరకములైన రూపకములును వెలువడినవి. ఇది కేవలము స్థూలవిభజనము మాత్రమేయని మరువరాదు.

**భావవైవిధ్యము :**

ఈ కాలమున భావవైవిధ్యము నాల్గువిధములుగా కన్పట్టుచున్నది—దేశభక్తిప్రబోధము, సంఘసంస్కరణము, ప్రాచీన సంస్కృతిప్రబోధము, సంఘతిరస్కరణము. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము కాంగ్రెసు ఆధ్వర్యమున ఇతోధికోత్సాహముతో సాగిన ఆంగ్ల సామ్రాజ్య వ్యతిరేకోద్యమము సామాన్య పౌరునికూడ స్వాతంత్ర్యదీక్షాపరునిగా చేసినది. దేశభక్తులైన రచయితలు కొందరు సాహిత్యమును స్వాతంత్ర్యసంపాదనార్థము ఒక సాధనముగా నుపయోగించిరి. ఈ ఉద్యమమునకు సమకాలికముగా సంఘసంస్కరణోద్యమముకూడ దేశవ్యాప్తముగా సాగినది. కొందరు తెలుగు నాటకకర్తలు సాంఘికదురాచారములను ఖండించుచు, సంఘమును సంస్కరింపదగిన పద్ధతులను ప్రబోధించుచు పెక్కు సాంఘికనాటకములను రచించియున్నారు. ఇట్టి సాంఘికకథావస్తుగ్రహణమున కొందరు రచయితలు కేవలము సంఘసంస్కారమునుమాత్రమే వాంఛింపగా మరికొందరు రచయితలు సంఘమును, అందలి ప్రాచీనసంప్రదాయములను త్రోసిరాజని మానవుని బుద్ధిని, సహజములైన ఉద్వేగ-ఉద్రేకములను ఆధారముగాచేసికొని నూత్నసాంఘిక వ్యవస్థను నెలకొల్పవలెననెడి ఆశయముతో సాంఘికరూపకములను రచించియున్నారు. మొదటివారు సంఘసంస్కరణమునందు మితవాదులుకాగా రెండవపక్షమువారు అతివాదులగుచున్నారు. మితవాదులు సంఘమునందు వ్యసనములుగా పరిణమించిన వేశ్యాసంపర్కము, మద్యపానము మొదలగు విషయ లోలత్వములను ఖండించి తత్సంస్కారమునకు ప్రబోధము సలిపిరి. ఈ ప్రబోధము సార్వకాలికమును, సార్వజనీనమును అగుట గమనింపదగినది. మరికొందరు ప్రాచీన సంస్కృతివైభవమును నిరూపించు రచనలకు పూనుకొనినారు. ఇంక అతివాదులు సంఘమునందలి ఒక విభాగమునకు అనగా ఒక కులమునకో, ఒక స్త్రీ జాతికో జరుగుచున్న అన్యాయములకు కారణమగు సంఘము మానవుని నైతికములగు విలువల నిర్ణయమునకు న్యాయస్థానము కాజాలదనియు, ఆయా ప్రత్యేకపరిస్థితులలో ఎవరికివారే న్యాయమూర్తులనియు ప్రబోధించుచు, సంఘతిరస్కారమును సంఘ సంస్కరణమునకు సాధనముగా గ్రహించిరి. ఇవి భావవిప్లవమునకు సంబంధించిన స్థూలవిభాగములు.

**రచనాప్రయోగములు :**

ఇంక ఈ కాలమున రచనాప్రయోగము లనేకములు జరిగినవి. భావకవిత్వము ఒక ఉద్యమముగా సాగుచున్నకాలమిది. అందు ఉత్సాహవంతులైన కొందరు సంస్కృతరూపక పద్ధతులలో నిర్దుష్టములయిన నాటకములనురచింపవలయునని ప్రయత్నించి, కృతకృత్యులైనారు. పాశ్చాత్యరూపకములచే ప్రభావితులైన మరికొందరు తెలుగున స్వతంత్రములైన చక్కని రూపకప్రక్రియలను సాధింపనెంచి, అందు కృతకృత్యులైరి. ఈ ప్రయోగములవలన సాహిత్యగౌరవమునుకూడ పడసిన కొన్ని ఉత్తమనాటకములు వెలువడుటకు అవకాశము కలిగినది. ఈ వివిధప్రయోగములఫలమే తెలుగు నాటకసాహిత్యమున ఏకాంకిక, నాటిక, గేయనాటిక, శ్రవ్యనాటికవంటి నూతన ప్రక్రియల ఆవిర్భావము.

ప్రదర్శన ప్రయోగములు :

ప్రదర్శనమున కనుకూలముగా నుండుటయే ధ్యేయముగా వ్రాయబడిన రూపకములు కూడ ఈ కాలమున విరివిగా వెలువడినవి. పై రెండురకముల రూపకములయందును, ప్రయోగానుకూల్యము తక్కువయని చెప్పవచ్చును. భావములోనో, రచనలోనో ఏదోయొక క్రొత్తవిధానమును అనుసరించుటయందే రచయిత తనదృష్టిని కేంద్రీకరించుటచేతను, సాహిత్య పరముగా ఎక్కువ బరువు కలవియగుటచేతను అవి రంగస్థలమున అంతగా రాణించుటకు తగినవికావు. దీనిని గ్రహించిన కొందరు నాటకకర్తలు—ముఖ్యముగా రంగస్థలానుభవమును గడించినవారు—ప్రదర్శనానుకూల్యమును దృష్టిలో పెట్టుకొని పెక్కు రూపకములను రచించిరి. స్త్రీ పాత్రలు తక్కువగానుండుట, అందందుమాత్రమే సంగీతమునకు ప్రాముఖ్యము నొసంగుట, సామాన్యప్రేక్షకుల నాకర్షించు హాస్యమును అంగరసముగా పోషించుట మొదలగునవి యీ రచనలయందలి ప్రత్యేకతలు.

పై మూడురకములేకాక సాంప్రదాయకమార్గమునకు చెందిన పెక్కు పౌరాణిక-చారిత్రక రూపకములుకూడ ఈ కాలమున వెలువడినవి. ఇందు, కొన్ని రచనలు కేవలము గతానుగతికములు. ఇంక తక్కినవి—అనగా భావవిప్లవమునో, రచనావైవిధ్యమునో, శిల్ప చాతుర్యమునో నిరూపించునవి—పై మూడు విభాగములలోను చేరిపోవును.

ఇంతకు ముందుకాలములోకూడ దేశభక్తి పూరితములును, సంఘసంస్కరణాత్మకము లును అగు చారిత్రక-సాంఘిక రూపకములు వెలువడియున్నవి. కాని, ఈ కాలమున అవి ఒక ఉద్యమముగా వెలువడినవగుటచేత వాని కొక ప్రత్యేకత వచ్చినది.

ఈ ప్రయోగాత్మక రచనాకాలమున ఆద్యంతములందు వెలువడిన రూపకములను పరిశీ లించినచో తెలుగురూపకపరిణామరీతి విస్పష్టముగ గోచరింపగలదు. దేశభక్తి రూపకము లతో ప్రారంభమైన ఈ కాలమున సంఘసంస్కరణాత్మకములును, తరువాత ప్రదర్శనా సౌలభ్యము కలిగినవియును అగు రూపకములుద్భవించినవి. అటుపిమ్మట సాంఘిక-రాజకీయాది కారణములచేత మరల పౌరాణిక నాటకరచన విరివిగా సాగినది. 1930-35 మధ్య ఒక నాలు గైదేండ్లపాటు నాటకరచనారంగమున స్తబ్ధత యేర్పడినదని చెప్పవచ్చును. అటుపిమ్మట ద్విగుణీకృతోత్సాహముతో రచయితలు మరల ముందునకుసాగినారు. మరల దేశభక్తి రూపక ములు, సాంఘికరూపకములు, ప్రదర్శనాసౌలభ్యముగలరూపకములు వెలువడసాగినవి. నేడు ప్రదర్శనసౌలభ్యమే ధ్యేయముగా, ఔత్సాహికనాటకసమాజములను దృష్టియందుంచుకొని, పలువురు రూపకరచన సాగించుచుండుట గమనార్హము.

## దేశభక్తి ప్రబోధము

ప్రథమప్రపంచసంగ్రామానంతరము స్వాతంత్ర్యము లభింపగలదని ఆశించిన భారతీయనాయకుల ఆశలు అడియాసలైనవి. అంతవరకు ఆంగ్లేయుల పక్షమున నిలచిన రాజ

కీయ మితవాదులుకూడ స్వాతంత్ర్యశంఖమును పూరించిరి. తెలుగుదేశమునకూడ, ఈ శంఖారావము మూలమూలల వ్యాపించి, ప్రతిజీవిని కదలించివేసినది. 1920 వ సంవత్సరమున భారతజాతీయ పోరాటమున మరువరాని వత్సరము—జాతిపితయగు మహాత్మాగాంధీజీ కాంగ్రెసు సంస్థకు, స్వాతంత్ర్యపోరాటమునకు నాయకత్వమును స్వీకరించిన సంవత్సరమిది. సత్యాగ్రహ సమరమునకు దేశప్రజలను సన్నద్ధులనుచేయుటకు గాంధీజీ దేశమంతటను సంచారమొనర్చుచు తెలుగుదేశమునకుకూడ విచ్చేసెను. ఆ యుద్యమముచేత ప్రభావితులైన యువకులెందరో, ఆనాడు, తమతమ చదువులను ఉద్యోగములను మానివేసి స్వాతంత్ర్యసమరయోధులుగా సన్నద్ధులైనారు. అట్టివారిలో కవులు, గాయకులు, నాటకకర్తలుకూడ కలరు.

ఈ స్వాతంత్ర్యసమరమునుగూర్చి గానముచేసిన కవులలో శ్రీయుతులు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గరిమెళ్ళ సత్యనారాయణ ప్రభృతులు ముఖ్యులు. నాటి 'తరి గాంధీయుగమేగుదెంచె' మొదలగు పద్యములు, 'మాకొద్దీ తెల్లదొరతనము' మొదలగుపాటలు ఎంత బహుళప్రచారమునందినవో, నాడు బయలుదేరిన 'గాంధీ విజయము'వంటి నాటకములుకూడ అంత బహుళప్రచారము నందినవి; ప్రశస్తికాంచినవి[1].

దేశభక్తిపూరితములైన, తెలుగు నాటకములను ముప్విధములుగా విభజింపవచ్చును— ఇందు మొదటిరకము పౌరాణికనాటకములు. ఈ నాటకములందు రచయితలాయా పౌరాణిక పాత్రలచేతనే అచ్చటచ్చట భారతమాతృదాస్యమునుగూర్చియు, స్వేచ్ఛాజీవుల సౌఖ్యమును గూర్చియు ఉపన్యసింపజేసిరి. 1907 లో ఆసేతు హిమాచలపర్యంతమును స్వరాజ్యాభిమాన మంకురించినది మొదలు 1920 లో గాంధీమహాత్ముడు నాయకత్వమును వహించువరకును స్వాతంత్ర్యభావప్రకటనము కొంతవరకును ప్రచ్ఛన్నముగానే జరుగుచు వచ్చినది. అట్టి ప్రచ్ఛన్నప్రచారమునకు పౌరాణికనాటకములు ఉత్తమసాధనములైనవి. చిలకమర్తి లక్ష్మీనరసింహము, తిరుపతి వేంకటకవులు ప్రభృతులు భారతగాథల ననుసరించి రచించిననాటకములు బహుళప్రచారమునందుట కిదియొక ముఖ్యకారణము. దేశాభిమానపూరితులైన ప్రజలు తమతమ పౌరాణిక నాయకులను, వారివారి గొప్పతనములను ఇతోధికమైన ఆనందముతో కీర్తించి, స్వాతంత్ర్యసమరమున తమ కాదర్శమూర్తులనుగా వారిని నిలుపుకొనుటకు ఈ నాటకములు తోడుపడినవి.

ఇంక రెండవరకము చారిత్రకనాటకములు. భారతవీరుల కథలెట్లు ప్రజలకు ఉత్సాహప్రోత్సాహముల నొసంగినవో చారిత్రకవీరుల కథలుకూడ అట్లే ప్రజలకు ఉత్సాహప్రోత్సాహముల నొసంగసాగెను. చరిత్ర ప్రజలదృష్టి కింకను సన్నిహితమైనదగుటచేత, చారిత్రకనాటకములు వారిని మరింత యాకర్షింపదొడగినవి. కాగా, శివాజీ, రాణాప్రతాప్, మున్నగు మహావీరుల కథలను, బొబ్బిలియుద్ధమువంటి స్థానిక చరిత్రలను కవులు నాటకీకరింప సాగిరి. రచయితల ఉత్సాహమును, ప్రజాప్రోత్సాహమును ఒండొంటికి తోడ్పడుటచేత ఆనాడు పెక్కు చారిత్రకనాటకములు బయలుదేరినవని చెప్పవచ్చును. సుప్రసిద్ధములైన 'రసపుత్ర విజయాది' చారిత్రకనాటకములా కాలమున బయలుదేరినవే[2].

పై రెండురకముల నాటకములును 1920 లోపలనే బహుళవ్యాప్తి నందినవి. ఇంక మూడవరకమునకు చెందిన నాటకములు 1920 తరువాత వెలువడినవి. ఆనాటి స్వాతంత్ర్య సమరమును ప్రత్యక్షముగ వ్యాఖ్యానించు నాటకము లీ జాతికిచెందినవి. ఈ కథలు ప్రజలకు ప్రత్యక్షచరితములగుటచేత వారికి వానియందు మరింత ఆసక్తి యధికమై, ఈ జాతి నాటకములుకూడ బహుళ ప్రచారమునందినవి. దేశమున జరుగుచున్న రాజకీయోదంతములను, ముఖ్యముగా కాంగ్రెసు కార్యకలాపములను ప్రజలకు ప్రత్యక్షముగా ప్రదర్శించుటయే యీ నాటకముల ముఖ్యోద్దేశము. ఇట్టి నాటకములను వ్రాసినవారిలో దామరాజు పుండరీకాక్షుడుగారు ముఖ్యులు.

### శ్రీ దామరాజు పుండరీకాక్షుడు[3] :

గాంధీజీ ప్రారంభించిన ఉద్యమముచే ప్రభావితులై గాంధీజీ ప్రబోధమును, కాంగ్రెసు ఉద్యమచరిత్రను గ్రంథరూపమున, ముఖ్యముగ నాటకరూపమున, ప్రతిమాసమును ప్రజల కందించుటకు పూనుకొన్నారు పుండరీకాక్షుడుగారు. వీరు రచించిన "గాంధీమహోదయము", "గాంధీ విజయము", "పాంచాల పరాభవము" అనెడి నాటకములానాడు (1921_22) బహుళ ప్రచారమునందినవి. తెలుగులో రాజకీయనాటకములులేని కొరతను ఈ రచనలు తీర్చినవనుట అతిశయోక్తికాదు. అయ్యదేవర కాళేశ్వరరావుగారు "గాంధీ మహోదయ" ప్రచురణమును ప్రారంభించుచు పేర్కొన్నట్లుగా ఇట్టి రాజకీయనాటకములను రచించుటకు తగిన పాండిత్యము, ఉత్సాహము, దేశభక్తి, ధైర్యసాహసములు పుండరీకాక్షుడుగారియందు మూర్తీభవించి యున్నవి. కావుననే వారు తాము తలపెట్టిన ఉద్యమమున కృతకృత్యులు కాగలిగినారు. "గాంధీ మహోదయము" లేదా "నవయుగారంభము" అనెడి తొలినాటకమున తిలకు మరణానంతరము గాంధీయుగ మారంభమగుట నిరూపితమైనది. "గాంధీ విజయము" లేదా "నవయుగము" అనెడి రెండవ నాటకమున గాంధీజీయుగ మారంభమైనది మొదలు నాగపుర మహాసభాంతము వరకునుగల చరిత్ర చిత్రితమైనది[4], నాటకారంభములందు కవి కొంత పౌరాణిక వాతావరణమునుకూడ కల్పించుట గమనార్హము[5]. మొత్తముమీద రంగస్థలమున విజయమందుటయే కాక[6] పలువురు కూర్చుండి చదివించుకొని విని యానందించుటకుకూడ ఈ నాటకము లధికముగా నుపయోగపడినవి. ఆ విధముగా ఈ నాటకములవలన తెలుగుదేశమున రాజకీయప్రచార మధికముగా జరుగుట కవకాశము కలిగినది.

ఇంక వీరి "పాంచాల పరాభవము" పంజాబు మరంతములను ప్రత్యక్షముగ వర్ణించుచున్నది. ఇందు "డయరాసుర" (డయ్యరు) పరిపాలనము, పాంచాలమాత వస్త్రాపహరణము, శ్రీకృష్ణుని జన్మస్థానవర్ణనము, అమృతసర కాంగ్రెసు మహాసభల వివరములు నిరూపితములైనవి. ఈ నాటకము ఆంగ్లదేశపు పార్లమెంటులోకూడ అలజడి కలుగజేసినదన్న సత్యము తెలియదగినది.

ఇట్లు కేవలము రాజకీయ ప్రచారనాటకములనేకాక, సంఘసంస్కరణాత్మకములగు నాటకములనుకూడ వీరు రచించియున్నారు. అట్టివానిలో "సంఘసమస్య అను సంస్కారిణి"

(1922) ఈ కాలముననే రచింపబడిన నాటకము. బ్రహ్మసృష్టినుండి, కలియుగమున నేటి వరకును వివిధకులములవారు పడు బాధలు ఇందు వర్ణింపబడినవి.

"—పరస్పరవైరముల్ దలంపక యొకచే కుటుం
బముగ భారతసంఘము కీర్తిగాంచెడున్"

అని నాందీ పద్యము. ఇంక ఆరవ అంకమున చివరిరంగములో నాటకములోని పాత్రలందరును ఏకమై, త్రాగుడును మాన్పించుటలో జయమంది, లోకకల్యాణమొనర్చి, జగన్మాతకు మంగళము పాడుదురు[7].

## శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి :

అనాడు సమకాలికరాజకీయచరిత్రలను నాటకీకరించిన వారిలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారుకూడ సుప్రసిద్ధులే. వీరు రచించిన "తిలకుమహారాజ నాటకము" (1921) ఆ మహా మహునకు దేశభక్తు లొసంగెడి నివాళులకు నాటకరూప మనవచ్చును. ఇందు నటి "సుజలాం, సుఫలాం" అనుచు వందేమాతరం గేయమును పాడుకొనుచు ప్రవేశించుట గుర్తింపదగినది. రాగతాళయుక్తముగా గానముచేయుట కనువుగా సుదీర్ఘమగు సీసపద్య మొకటి యిందు రచింప బడుట యొకవిశేషము. శ్రీపాదవారు సంప్రదాయమునకు సర్వదాబద్ధులు; అయినను దీనిని మరణ ముతో అంతముచేయుచు, "మరణముతో నాటకము సమాప్తినొందించుట ప్రాచీన సంప్రదాయము కాదు. కాకున్న నుద్బోధనార్థమట్లు చేయవలసివచ్చినది". అని పీఠికలో వ్రాసికొనియున్నారు. శాస్త్రిగారిదే మరియొక రచన "గాంధీ విజయధ్వజ నాటకము" (1924);నాగపూరు కాంగ్రెసు వరకును నడచిన రాజకీయచరిత్ర యిందు వర్ణితమైనది. అసహాయోద్యమారంభమున కంగీకారము కుదిరి, ప్రజలు గాంధీజీని పూజించుటతో నాటకము అంతమగుచున్నది. నాలుగవ అంకములో కాంగ్రెసునుగూర్చియు, గాంధీజీనిగూర్చియు నారద-ఇంద్ర-బృహస్పతులు తర్కించుకొనుట వర్ణితమైనది. ఈ నాటకమున శాస్త్రిగారు పాత్రోచితమైన భాష నుపయోగించియున్నారు. వీరు "స్వరాజ్యోదయ" మనెడి మరియొక నాటకమునుకూడ రచించియున్నారు.

## మరికొన్ని నాటకములు :

అనాడు మరికొన్ని రాజకీయనాటకములుకూడ వెలువడినవి. అట్టివానిలో డి. సీతా రామయ్యగారి "స్వరాజ్యధ్వజము" (1921), జంధ్యాల అయ్యవారిశాస్త్రిగారి "ఆలీ ప్రభృతుల నిర్బంధము" (1921) మొదలగునవి పేర్కొనదగినవి. ఖిలాఫతు ఉద్యమ నాయకులగు మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులను కరాచీలో విచారించుటయు, నిర్బంధించుటయు మున్నగా గల విషయములు "ఆలీ ప్రభృతుల నిర్బంధము" నందు నిరూపితములైనవి (ఇది తెనాలిలోని "స్వరాజ్య గ్రంథాలయము" పక్షమున ప్రకటితమైనది).

ఈ రాజకీయనాటకములన్నింటను ప్రాచీనసంప్రదాయానుసారముగా నాందీ-ప్రస్తావ నాదులు పాటింపబడుట పరిశీలనార్హము. ఈ విధముగా ఒకప్రక్క దేశభక్తి ప్రబోధాత్మకము లగు రాజకీయనాటకములు పుంఖానుపుంఖములుగా వెలువడుచున్న కాలములో అదే ఆశయ

ముతో రెండుమూడు పౌరాణిక నాటకములుకూడ వెలువడియున్నవి. ఇట్టివానిలో బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు రచించిన "మాతృదాస్యవిమోచనము" (1924) ప్రముఖముగా పేర్కొనదగినది. గరుత్మంతుడు తన తల్లి దాస్యమును పోగొట్టిన కథను ప్రధానముగా చిత్రించుచు పరోక్షముగా నాటి స్వాతంత్ర్యసమరోద్యమమును ఇందు నిపుణముగా నిరూపించియున్నారు పట్టాభిరామయ్యగారు. "మాతృప్రేమను ప్రజలెల్ల మసలునట్లు, దాస్యమున నేరు బాధల నందకుండునట్లు" చేయుమని భరతవాక్యమున, పౌరాణిక కాలమునాటి స్వాతంత్ర్యసమరయోధుడు గరుత్మంతుడు వాసవుని అర్థించుట గమనార్హము.

1929 ప్రాంతముల మద్దూరి అన్నపూర్ణయ్యగారు రచించి, కాంగ్రెసు పత్రికలో ప్రకటించిన "చిచ్చులపిడుగు" కూడ ఇప్పట్లో పేర్కొనదగినది. 1857 నాటి విప్లవవీరుడు మంగళపాండ్యాకథ ఇది. ఆ రోజులలోనే దీనిని శ్రీ అమంచర్ల గోపాలరావు గుంటూరులో యూత్‌లీగ్ పక్షమున విజయవంతముగా ప్రదర్శించినారు.

ఈ కాలమున వెలువడిన కొన్ని చారిత్రకనాటకములను ఇచ్చట పేర్కొందును— బాలకవి దేవినేని వీరరాఘవకవి తారాబాయి అను పృథ్వీరాజు విజయము (1924), అవసరాల శేషగిరిరావుగారి రాణీసంయుక్త (1925), యలమర్తి శ్రీనివాసరావుగారి పీష్వానారాయణరావు వధ (1929) మొదలగునవి. బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహముగారు సురాజుద్దౌల లేక అసామాన్య (1923) అను చారిత్రక నాటకమునేకాక చంద్రరేఖ, ప్రభాకర మున్నగు పెక్కు ఇతరనాటకములను రచించిరి. శనగవరపు రాఘవశాస్త్రిగారి "రామరాజు" (ఫాలాఫ్ విజయనగర్) 1924 లో వెలువడినది; విజయనగరరాజ్య వినాశనమును సాధ్యమయినంతవరకు చరిత్రకు సన్నిహితముగా రచింపవలెనని కవి ఆశయము; రచన సరళమైనది.

సురవరము ప్రతాపరెడ్డిగారి "భక్తతుకారాం" తొలుత మూడంకములుగా "కళ"లో ప్రచురింపబడినది (1923), పిమ్మట సికింద్రాబాదు "జగదీశ నాట్యమండలి" వారి కోరిక ననుసరించి రెడ్డిగారు దీనిని 1932 లో ఐదంకముల నాటకముగాపెంచి తిరుగవ్రాసిరి. పై మండలి వారు దీనిని పలుతావులందు విజయవంతముగా ప్రదర్శించిరి. ఇందు రెడ్డిగారు తొలుత పూర్తిగా గ్రాంధికభాష వాడినను అది కృత్రిమముగా నున్నదని తలచి 1945 లో వచనములోని భాష సంతయు మార్చి, నాటకమును తిరుగవ్రాసినారు. ఇందు "ప్రఘట్టకములు" అనుపేర 12 రంగములున్నవి.

## సంఘ సంస్కరణము

ఒకప్రక్క ప్రజలందరును స్వాతంత్ర్యసంపాదనాదీక్షాకంకణబద్ధులై ఉత్సాహావేశములతో సత్యాగ్రహసమరమున పాల్గొనుచుండ, వేరొకప్రక్క బానిసత్వమునకు అలవాటుపడిన కొందరుమాత్రము తమ ఆనందమే జీవితసర్వస్వముగానెంచి, చెడుత్రోవలుపట్టి, విషయలోలురై ప్రవర్తించుచుండిరి. దేశభక్తిపరులైన మరికొందరు సంస్కర్తలు సంఘమును క్షీణింప

జేయుచున్న దురాచారములను, ఈవ్యసనములను రూపుమాపుటయే ధ్యేయముగానుంచుకొని తమ జీవితములను సంఘసంస్కరణమునకు వినియోగించిరి. త్రాగుడు, వేశ్యాసంపర్కము—ఈ రెండును నాటి ప్రబలవ్యసనములు. వరశుల్కము మొదలగునవి సంఘములోని మధ్యతరగతి ప్రజలను పీల్చి పిప్పిచేయుచున్న దురాచారములు. అంతియేకాక, నవనాగరకతా వ్యామోహమున పడి యువకులు తప్పుదారులను పట్టుచున్న కాలమది. కవులును, నాటకరచయితలును ఈ వివిధ సమస్యల నితివృత్తములుగా స్వీకరించి నీతిబోధకములగునట్లుగా రచనలు చేసియున్నారు.

దేశభక్తి విషయమునందు వలెనే, సంఘసంస్కరణ విషయమునందును ప్రబోధము మొదట కొంత ప్రత్యక్షముగాను, కొంత పరోక్షముగాను ఆరంభమైనది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు బ్రాహ్మవివాహాదులను కేవలము వినోదముకొరకేకాక అతిబాల్యవివాహము, వృద్ధ వివాహము, కన్యాశుల్కము మొదలగు దురాచారములవలని యనర్థకములను నిరూపించి, జనులను వానినుండి విముఖులను చేయవలెననెడి తలంపుతోకూడ వ్రాసియున్నారు. మరియు నాడు వెలువడిన పౌరాణిక-చారిత్రక నాటకములలోకూడ సంఘమును పీడించుచున్న దురాచారములను నిరసించెడి ఉపన్యాసములు కన్పట్టగలవు[1]. ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు పౌరాణిక కథయైన "అజామిళ"ను కేవలము రజస్వలావివాహసమస్యాప్రధానమైన నాటకమునుగానే రచించుట స్మరణీయము. ఇంక ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ, గురజాడ వేంకట అప్పారావు ప్రభృతులు ఒక్కొక్క సాంఘికసమస్యను చేపట్టి మనోరమ, కన్యాశుల్కము మొదలగు నాటకములను వ్రాసియున్నారు. ఇంతియేకాక, శ్రీయుతులు కందుకూరి, చిలకమర్తి ప్రభృతులు సంఘదురాచారాదులను తెగడుచు పెక్కు ప్రహసనములనుకూడ రచించియున్నారు. ఈ సందర్భమున పానుగంటివారి "కంఠాభరణము"ను కూడ పేర్కొనవలసియున్నది. ఇంక ఈ కాలములో సాంఘికసమస్యల నితివృత్తములుగా స్వీకరించి నాటకములు వ్రాసి, వ్యసనములను, దురాచారములను ప్రత్యక్షముగా ఖండించుటకు పూనుకొనినవారిలో కాళ్ళకూరి నారాయణరావుగారు ప్రముఖులని చెప్పవచ్చును.

## శ్రీ కాళ్ళకూరి నారాయణరావు :

నారాయణరావుగారు రచించిన పౌరాణికనాటకములనుగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను; ఇప్పుడు వీరి సాంఘికనాటకములనుగూర్చి వివరింతును. నారాయణరావుగారు రచించిన సాంఘికనాటకములు మూడును—చింతామణి (1921), వరవిక్రయము (1923), మధుసేవ (1926)—మూడుదశాబ్దములపాటు తెలుగునాటకరంగమును పరిపాలించినవని చెప్పవచ్చును. చింతామణిలో వ్యభిచారమును, వరవిక్రయములో వరశుల్కమును, మధుసేవలో మద్యపానమును ప్రధానసమస్యలు.

'చింతామణి' పది అంకముల రూపకము. వీరి నాటకములలో అధికప్రచారము నందిన నాటకమిదియే. ఇందలి కథ కృష్ణకర్ణామృతకర్తయగు లీలాశుకునకు[2] సంబంధించినదిగా చివరి అంకమున సూచింపబడినను, ఇది ప్రధానముగా సాంఘికరూపకముగానే నిర్వహింపబడింబ

యున్నది. దీనిని 'శాంతరస ప్రధానమగు ప్రకరణ'మని సూత్రధారుడు వర్ణించియుండుట పరిశీలనార్హము. సుపుత్రుడుగా, ఆదర్శభర్తగా, గృహమేధిగా, ఉత్తమవ్యక్తిగా వన్నెకెక్కిన బిల్వమంగళుడు చింతామణి యనెడు వేశ్యవలలోచిక్కి తుదకు, కృష్ణమాహాత్మ్యముచే పరివర్తనము చెందిన చింతామణివలెనే, ఆతడుగూడ విరాగియగుట యిందలికథ, రూపకమంతయునుచక్కగా నిర్వహింపబడినప్పటికిని అంతమునందలి పైమార్పు ఆకస్మికమై కొంతఅసహజముగా కన్పట్టగలదు. సహజముగా చింతామణి తనవృత్తియెడ విముఖురాలు. కాని తల్లిమీది గౌరవముచేత ఆమె మాటల నౌదలతాల్చుచున్నది. మొదటినుండియు చింతామణి పాత్రలో, ఈ భావసంఘర్షణమును చక్కగా పోషించిన నారాయణరావుగారు ఆమె వైరాగ్యమునకు ఏదేని ఇంకొక వ్యాజమునుకాని, సంఘటనమునుకాని కల్పించియున్నచో కథకు మరింతజిగి చేకూరియుండెడిది.

కొంత విమర్శకదృష్టితో సూక్ష్మముగా పరిశీలించినచో నారాయణరావుగారు బిల్వమంగళుని పతనోన్నతములను, ఆతడు మహాభక్తుడుగా మార్పుచెందుటను నిరూపించుటయందుకంటె, పురాణం సూరిశాస్త్రిగారు పేర్కొన్నట్లుగా[3], వెలయాండ్రలోపముల నెత్తిచూపుట, వేశ్యావృత్తిని దూషించుట అనువానియందే ఎక్కువమొగ్గు చూపినారేమోయని స్ఫురింపగలదు. మార్పుచెందిన చింతామణి పలికినపలుకులు కూడ ఒకమహాభక్తురాలికో లేదా ఒకమహావిరాగిణికోతగినవిగాకాక వేశ్యావృత్తిని ఖండించెడివారి ఉపన్యాసములవలె నుండుటయు గమనార్హము. ఆ వృత్తిపై ఇట్లు విరుచుకొనిపడుటకంటె, దానివలన సంఘమునకెట్టి కీడుకలుగుచున్నదో చూపుట ఆవశ్యకము; ఇందు నారాయణరావుగారు కృతకృతులైనారని చెప్పుటకవకాశమున్నను పైలోపములవలన నిర్మాణశిల్పము కొంత దెబ్బతిననదని చెప్పకతప్పదు.

ఈ రూపకరచనోద్దేశము సంఘసంస్కరణమనుట నిర్వివాదము. కాని, రూపకమునందంతటను వ్యసనముల స్వేచ్ఛావిహారమును చిత్రించి అంతమున ఏవో ఆకస్మికమైన మార్పును సూచించినంతమాత్రమున రూపకప్రయోజనము సిద్ధింపదనియు, ఇట్టి రూపకములు మంచికంటె చెడ్డనే లోకమున వ్యాపింపజేయగలవనియు కొందరు విమర్శించుచున్నారు. లోకమున మంచి-చెడ్డలు రెండును పరస్పరము సంబంధించియున్నవి; చెడును తీవ్రముగా నిరూపించినప్పుడే మంచికి క్రాంతికలుగునని మనవారి ఆశయము;[4] పురాణములందలి నిగమశర్మోపాఖ్యానాదులిట్టివే. మరియు ఈ సాంఘికనాటకములందు సమకాలీన సాంఘికపరిస్థితులు వ్యాఖ్యాతములైనవనెడి సత్యమునుకూడ మనము విస్మరింపరాదు.

చింతామణి రూపకములోని సుబ్బిసెట్టిపాత్ర తెలుగునాటకరంగమున ఒక విశిష్టమగు హాస్యభూమిక. గిరీశమువలె, పేరిగానివలె, సుబ్బిసెట్టికూడ తెలుగువారికి ప్రేమపాత్రుడు : ఈ రూపకమునందలి హాస్యము ప్రధానముగా వాక్సంబంధి; చేష్టతదనుగుణముగా నుండును.[5] ఆనాడు తెలుగున హాస్యనటులకు ఈ పాత్రనిర్వహణము గీటురాయి అయినదనుట అతిశయోక్తి కాదు. నారాయణరావుగారిందు పాత్రోచితముగా చక్కనివాడుకభాషను ప్రయోగించియున్నారు. అంతియేకాదు, వాడుకభాషలో చక్కని పద్యములను కూడ రచించియున్నారు.

నారాయణరావుగారు తమ పౌరాణిక రూపకములను 'నాటకము'లనియు, సాంఘిక రూపకములను 'ప్రకరణము' లనియు పేర్కొనుట గమనార్హము. ఈ ప్రకరణములన్నియును దశాంక పరిమితములు. సాధారణముగా, ఒక్కొక్క అంక మొక్కొక్క రంగము మాత్రమే. అర్థోపక్షేపకము లైదింటిని వీరు విరివిగా వాడుకొనినారు. సాంఘిక రూపకములందు మాత్రము ఆపేర్లను వాడక 'రంగము' లనినారు. మొత్తముమీదవీరు 'సలక్షణత'కు ఎక్కువగా ప్రయత్నించి యున్నారని చెప్పవలసియున్నది.

'వరవిక్రయము' కాళ్ళకూరివారి రూపకములన్నింటియందును ఉత్తమమైనదనవచ్చును. గురజాడవారి కాలమున 'కన్యాశుల్కము' ప్రాధాన్యమును వహింపగా నారాయణరావుగారి కాలమున కాపరిస్థితి తారుమారై 'వరశుల్కము' ప్రాధాన్యమును వహించినది![6] ఈరెండు శుల్కములును పరస్పరవిరుద్ధములైనట్లు కన్పట్టినను, ఆ రెండింటివలనను బాధల ననుభవించినది "స్త్రీ" మాత్రమే యనెడిసత్యము గమనింపదగినది. ఇందలి ప్రధానకథ సుఖాంతమే అయినను, ఒక కన్య ఆత్మబలిదానము ఇందు ప్రాధాన్యమును వహించుటచేత దీనికి కొంతవిషాదచ్ఛాయ కూడ కలిగినది. కథానిర్మాణమునందును, పాత్రపోషణమునందును, చెప్పదలచుకొన్నదానిని నిర్దుష్టముగా నిరూపించుటయందును నారాయణరావుగారు కృతకృత్యులైనారు; కాగా,ఈకాలమున వెలువడిన కొన్ని ఉత్తమరూపకములలో దీనికి ఒక స్థానములభించుచున్నది. ఇందలి అక్కసెల్లెండ్రు, వారి తల్లిదండ్రులు, అట్లే పరమలోభిఅయిన సింగరాజు లింగరాజు,చివరకు పెండ్లిండ్ల పేరయ్య—అన్నిభూమికలును సజీవముగా చిత్రింపబడినవనుట నిస్సంశయము. సుబ్బిసెట్టి వలెనే లింగరాజుకూడ ప్రజల ఆదరాభిమానములను చూరగొన్నవాడు. విలక్షణప్రకృతిగల ఒక పాత్ర శీలచిత్రణము (Character Study) నకు ఈ కాలమున లింగరాజు ప్రథమోదాహరణము.

నిశితముగా పరిశీలించినచో, ఇందును ఒకటిరెండు లోపములు కన్పట్టగలవు. పురుషోత్తమరావుగారు తమకున్నవని చెప్పుకొన్న ఆదర్శములలో ఒకదానినైనను నెరవేర్చుకొనుటకు ప్రయత్నింపలేదు. పెండ్లిండ్ల పేరయ్యచెప్పగానే కట్నమిచ్చుటకు సులభముగా అంగీకరించినాడు; ఒకవేళ కాలమర్యాదననుసరించి అంగీకరించెనన్నను పదివేలకు తక్కువకాని సింగరాజువారి సంబంధమేకావలెనని పాటుపడుట వింతగా కన్పట్టును. కమల తన ఆశయమును నేరవేర్చుకొనుటకో లేదా తనకసి తీర్చుకొనుటకో చేసినచేతలు, ఆడినమాటలు ఆమె వయస్సునకు మించినవిగా కన్పట్టుచున్నవి. అయినను మొత్తముమీద ఈలోపము లంతగా పరిగణనీయములుకావు.

"మధుసేవ" మద్యపానసమస్యపై కేంద్రీకృతమైన రూపకము. నాయకుడైన రఘునాథరావు ఉత్తముడైనజమీందారు, కాని మద్యపానవ్యసనమునబడి సర్వస్వమును కోల్పోయి తుదకు పశ్చాత్తప్తుడగుట యిందలికథ. నాయకపాత్రనిర్వహణము ఉదాత్తముగానే నడచినదని చెప్పవచ్చును. కాని, ఆతని మిత్రుడగు శర్మయొక్క సంభాషణలలోని ఆంగ్లపదజాలము ప్రయోజనవిహీనమనక తప్పదు.[7] మరియు, రఘునాథరావుభార్య 'నిర్మల' పాత్రఅంత చలనవంతముగా కన్పట్టదు. ఇట్టిలోపము లొకటిరెండున్నను, రచయితమాత్రము తనధ్యేయము

నందు[8] - మద్యపానవ్యసననిరసనమందు - కృతకృత్యుడైనాడనక తప్పదు. ఈరూపకమందు విశ్వాసరావు (జమీందారుగుమాస్తా) పాత్రమాత్రము చాల ఆకర్షణీయముగా చిత్రితమైనది. "విశ్వాసము" రూపుకట్టిన మూర్తియతడు. మరియు, రఘునాథరావుజీవితమున ఆది, మధ్య, అంతములందు వచ్చిన స్థితివైరుధ్యములు నిపుణముగా చిత్రితములగుటచేత రూపకము మరింత నిబిడబంధము కలదైనది.

నారాయణరావుగారు కేవలము రచనాభిలాషతోమాత్రమేకాక, ఉన్నతమైన ఆదర్శముతో, లక్ష్యశుద్ధికలిగిన ధ్యేయముతో సాంఘికనాటకరచనచేసి యున్నారనుట స్పష్టము. రచయిత ఎంత విశిష్టముగా వ్రాయుటకు ప్రయత్నించెనో పాఠకుడును, విమర్శకుడును అంత జాగరూకతతో తన్నిష్ఠమైన రసగ్రహణమును చేయవలయునని వారుహెచ్చరించి యుండుట గమనార్హము.[9]

నారాయణరావుగారు కేవలము అటు సంస్కృతరూపకములనుకాని, ఇటు ఆంగ్లరూపకములను కాని అనుసరింపక చాలవిషయములందు స్వతంత్రతను చూపియుండుట గమనించి యున్నాము. వీరిపద్యరచనయు, గ్రాంథికగద్యరచనయు కూడ మిక్కిలి సులభములై వ్యావహారిక భాషకు చేరువలోనున్నవి; ముఖ్యముగా వీరి పద్యములకెనలేని వ్యాప్తివచ్చినది. మరియు వీరిరచనలన్నియును రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శించుట కనువుగానున్నవి. నారాయణరావుగారు గ్రహించిన కథలనే గ్రహించి, ఆనాడు పలువురు నాటకరచయితలు చాలనాటకములను రచించియున్నారు; కాని అన్నింటను నారాయణరావుగారి నాటకములు గుణాధికములు; వ్యాప్తి ఖ్యాతులును వీనికేలభించినవి.

పానుగంటివారి వలెనే కాళ్ళకూరివారును తమపాత్రలచేత సమకాలీన సాంఘికాచారములపై, వ్యక్తులపై సంస్థలపై విమర్శలు చేయించుచుండుట పరిశీలింపవచ్చును[10]. వీరు సృష్టించిన పాత్రలలోపరస్పరము పోలికలుకల పాత్రలు కొన్ని జంటలుగా కన్పింతురు; అట్లే సుబ్బిసెట్టి-కాసింలలోను పోలికలుకన్పట్టగలవు. ఇంకనిర్మల-రాధలు ఒకే తరగతికి చెందిన స్త్రీలు, బహుశః కథలలోని పోలికలనుబట్టి పాత్రలలోను ఈపోలికలు వచ్చియుండును.

### సామాన్యలక్షణములు :

దేశభక్తి, సంఘసంస్కారము అనెడి విషయముల నాలంబనముగా చేసికొని వ్రాయబడిన నాటకములన్నెల్ల పరిశీలింపగా కొన్ని సామాన్యలక్షణములు గోచరింపగలవు. ఈరచనల భావములందు నూతనత్వమున్నను, రచనమాత్రము ప్రాచీనసంప్రదాయపద్ధతినే సాగినది; అనగా, ఈ రచయితలు సంస్కృతలక్షణానుసారముగానే తమరచనలు చేసియున్నారన్నమాట. నాటకము లెల్ల ప్రదర్శన సౌలభ్యము కలవియగుట రెండవలక్షణము. కథలు ప్రజలకు సన్నిహితములగుట, అలతి అలతి పదములతో శైలిసరళమగుట, పాత్రలు—అందున స్త్రీపాత్రలు—తక్కువయగుట, రంగముల మార్పు తక్కువయగుట మొదలగువానివలన ప్రదర్శనమున కెక్కువ

సౌలభ్యము చేకూరినది. ఈ నాటకములందలి భాష గ్రాంధికమే అయినను అది వాడుకభాష కత్యంత సన్నిహితమైన సరళభాషయగుటచేత అవి ప్రజలకు మరింత సన్నిహితములైనవి.

అన్నింటికంటె ముఖ్యమైనది పద్యరచన. ఈ కాలమునందలి నాటకములలోని పద్యములు దేశభక్తిని, మహానాయకులను, సంఘసంస్కరణమును పురస్కరించుకొని వ్రాయబడిన వగుటచేత సందర్భసన్నివేశములతో నిమిత్తములేకుండ వానిని యథేచ్ఛముగా పాడుకొనవచ్చును. అందుచేతనే గాంధీజీ, తిలకు, భరతమాత మున్నగు విషయములపై వ్రాయబడిన పద్యములేకాక వేశ్యలు, వేశ్యమాతలు, వేశ్యలవలన సర్వస్వమును కోల్పోయిన విటుల ఆక్రందనములు, మద్యపానమత్తుల ప్రవర్తనలు మున్నగు విషయములపై వ్రాయబడిన పద్యములు కూడ బహుళప్రచారము నొందుట కవకాశము కలిగినది.[11]"

ఇకముందుకాలములో భావములయందు, రచనయందు కూడ కేవలము క్రొత్తదనమునే కాక విప్లవమును కూడ తీసికొనివచ్చిన రచనలు వెలువడనున్నవి; వాని ఆవిర్భావమునకు భావములందు మాత్రమే క్రొత్తదనముకల ఈ రూపకములు దారితీసినవని చెప్పవచ్చును.

### మరికొన్ని రూపకములు :

ఈకాలమున, ప్రదర్శన సౌలభ్యముకల మరికొన్ని సాంఘికనాటకములను వ్రాసినవారిలో కోపల్లి వేంకటరమణారావుగారు ప్రముఖులు. పెట్టమారిమగడు, బలేపెళ్ళిళ్ళు, భాగ్యరేఖ, గరల్ వైపు, ఓన్లీడాటర్, క్లాస్‌మేట్సు, గర్భవతివంటి నాటకములను పెక్కింటిని రమణారావుగారు రచించియున్నారు. ఇవికూడ రచనలో ప్రాచీన సంప్రదాయానుసారములే. ఇందు భాగ్యరేఖ, శ్రీజయపురం మహారాజావారి వలన పారితోషకమును కూడ పొందినది. వీరిరచనలు ప్రదర్శనానుకూలములే యైనను, వానియందు ఉదాత్తతలోపించినది. రంగస్థలమున ప్రదర్శింపదగినవి, ప్రదర్శింపదగనివి అనెడి ఔచిత్యమును వీరు అంతగా పాటించినట్లు కన్పట్టదు. ముసలి పెండ్లికొడుకుల ఆరాటములు, వారిని పెండ్లియాడిన బాలికలపాట్లు, బాలవితంతువులకు పునర్వివాహము కావించినందువలన కలిగెడి అగచాట్లు, అధికారుల దుష్ప్రవర్తన మొదలైన సాంఘికసమస్య లెన్నింటినో కోపల్లివారు చిత్రించియున్నారు. కాని, సహృదయులకు వెగటు కొలుపు సన్నివేశములు, అభాసమునకు దారితీసెడి హాస్యములు, ఉదాత్తత పొంతపోని కథాసంవిధానములు కలవై, ఈనాటకములు కొన్ని గాంభీర్యమును కోల్పోయినవి.

ఈకాలమున సంస్కారము కొరవడిన నాటకసమాజములనేకములు బయలుదేరుటతో, నీచశృంగార మాలంబనముగా నెన్నియో నాటకములు బయలుదేరినవి; వీనియందు సాహిత్య గౌరవము లోపించినదని ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు. ఇంతకుముందు సావిత్రి, హరిశ్చంద్ర మొదలగు పౌరాణికకథలను ప్రతినాటకసమాజమువారును వారివారికి తగినరీతిగా వ్రాయించుకొన్నట్లే, ఈకాలమున ఆయా నాటకసమాజములవారు ఒకేసాంఘికసమస్యపై పలువురిచేత నాటకములను వ్రాయించుకొనసాగిరి. "చింతామణి" నాటకమున కాధారమైన లీలాశుకుని కథను గ్రహించి వ్రాయబడిననాటకములు పదిపన్నెండుకలవు. "వరవిక్రయ" మను పేరుతోనే

నలుగురైదుగురు రచనలు చేసియున్నారు. అట్లే 'మధుసేవ' ఇతివృత్తముగా పెక్కునాటకములు బయలుదేరినవి.[12] ఇవియెల్ల ప్రదర్శన సౌలభ్యముకలవై, పెక్కుసార్లు రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శింపబడినవైనను, వీనియందు కథాప్రణాళికలో కాని, తన్నిర్వహణములో కాని, వైచిత్రియును ప్రత్యేకతయును అంతగా కన్పట్టవు.

ఇప్పట్ల చింతామణి నాటకమునకు ప్రతిబింబముగా వెలసిన 'సుమతి' యనునాటకముపై దువ్వూరి రామిరెడ్డిగారి విమర్శ పరిశీలనార్హము. (చూ. కవికోకిలగ్రంథావళి; 4-పుట-92.)

## సాహిత్యదృష్టి

ఇంతవరకును, నాటకకర్తలు 'భావము'న తీసికొనివచ్చిన క్రొత్తదనమును గూడ గుర్తించియున్నాము. ఇకముందు 'రచన'లో వచ్చిన క్రొత్తదనములను గూడ గుర్తింపగలము. ఇంతకు ముందరికాలములో దేశభక్తులు, సంఘసంస్కర్తలు తమతమ భావములను ప్రజలకత్యంత సన్నిహితములను చేయుటకు నాటకముల నొకసాధనముగా నుపయోగించుకొని యున్నారు.[1] కానివారందరును సాహిత్యమున నిష్ణాతులుకారు; నాటకరచనా విధానమున చేయితిరిగిన వారంతకంటెను కారు. కేవలము ఉత్సాహమే ప్రధానముగా రచనసాగించి, ఉద్యమప్రచార మొనరించినారు ఆనాటకకర్తలు. వీరిలో కొందరు ప్రతిభాశాలురే అయినను, తక్కినవారు ప్రతిభా-వ్యుత్పత్తులు లేనివారగుటచేత తేలికరచనలుచేసి, నాటకరచనను క్షీణస్థితికి తీసికొనివచ్చినారు. ఇట్లు, సాహిత్య ప్రక్రియగా, నాటకమునకు పట్టుచున్న దైన్యస్థితిని పరికించి, తన్నివారణార్థము, రచనావిధానమున నూతనప్రయోగములను చేయుటకు కొంద రుపక్రమించిరి.[2] ఇట్టివారందరును కేవలము సాహిత్యపరులు; అందున, అప్పుడే ఆరంభమైన భావకవిత్వోద్యమమునకు, వీరందరును వైతాళికులు!, అంతియేకాదు. ఆంగ్ల సంస్కృత సాహిత్య విశిష్టతలను ఆకళించుకొన్న వారగుటచేత, అందలి ఉత్తమసాహిత్య ప్రక్రియల నెల్ల తెలుగున అవతరింపజేయవలెననెడి దీక్షతో కూడియున్నవారు కూడను.

ఈకాలపు నాటకకర్తలు, నాటకకర్తలగుటకు ముందే ఇతరసాహిత్యవీథులలో ఎప్పుడో ఒకప్పుడు పయనించియున్నవారే! శ్రీయుతులు రాయప్రోలు, విశ్వనాథ, దువ్వూరి, చింతా, అబ్బూరి, తల్లావఝ్ఝుల, నోరి ప్రభృతులపేర్లు వినిపించినంతనే భావకవిత్వోద్యమ మంతయును తలపునకు వచ్చును.[3] వీరెల్లరును ఆంధ్ర-ఆంగ్ల-సంస్కృత భాషలయందు నిష్ణాతులు; అందలి ఉత్తమరూపకసాహిత్యములను జీర్ణించుకొన్నవారు. సంస్కృతరూపకములందలిభావోదాత్తతను ఉత్తమకవితారీతులను, ఆంగ్లరూపకములయందలి విషాదాది ఉత్తమరూపక రచనారీతులను ఆకళించుకొన్న ఈ రచయితలు తెలుగులో, నాటకరచనావిషయమున, క్రొత్తప్రయోగములను చేయనారంభించిరి. కాని వీరందరును సాహిత్యపరులగుటచేతను, వీరిదృష్టి ప్రధానముగా నిర్మాణశిల్పమున కేంద్రీకృతమగుటచేతను వీరు కేవలము సాహిత్యరూపకములు (Literary plays) మాత్రమే రచింపగలిగినారనుట అసమంజసము కాజాలదు. (అంతమాత్రమున ప్రదర్శనానుకూలములైన రచనలులేవని యర్థముచేసికొనరాదు).

## శ్రీ దువ్వూరి రామిరెడ్డి[4] :

భాషలోకాని, నిర్మాణశిల్పములోకాని ఏవిధమైన ఉదాత్తతయునులేని నాటకములు ఉత్తమ నాటకములుగా చెలామణియగుచుండుటకు ఆవేదనపడి, తెలుగునాటక సంస్కరణమునకు పూనుకొని, ఉత్తమ నాటకరచనకు లక్ష్యములుకాదగిన స్వతంత్రనాటకములను రచించుటకు దొరకొనినవారు దువ్వూరి రామిరెడ్డిగారు. వీరు రచించిన 'నాటకకళాసంస్కరణ'మనెడి వ్యాసము (1935) ప్రామాణికమై నేటికిని నాటకకర్తలకును, నటులకును, ప్రయోక్తలకును అనుసరణీయముగా నున్నదన్నచో అతిశయోక్తిలేదు. వీరి రూపకములు నాలుగింటిలోను మూడు నాటకములు; నాలుగవది ఏకాంకిక. నాటకములు మూడింటిలో 'సీతావనవాసము' పౌరాణికము; 'కుంభరాణా' చారిత్రకము; 'మాధవవిజయము' మిశ్రమము.

'సీతావనవాసము' రెడ్డిగారి ప్రథమనాటకము. ఇందలి ఇతివృత్తము భవభూతి ఉత్తరరామచరితమందలి ఇతివృత్తమే, భవభూతి, ఉత్తరరామ చరితమందు సీతావిరహియైన రాముని మానసికవ్యథను అత్యంతరమణీయముగ చిత్రించినాడు; కాని, బాధితురాలైనసీతకు అందు ప్రాధాన్యము లేదు. ఇంక, సీతావనవాసమందు రెడ్డిగారు సీతకు ప్రాధాన్యమొసంగి, సీతారాములవ్యథ సమానమేయని నిరూపించియున్నారు; అసలు నాటకమునకు పేరుపెట్టుటలోనే వారి ఆశయము వ్యక్తమగుచున్నది. కాగా, రెడ్డిగారు రచనయందేకాక పాత్రచిత్రణమునందును విశిష్టత చూపినారన్నమాట.[5] ప్రాపంచిక విషయములందు అమాయకులైన కుశలవులు, యుద్ధ విషయమున వీరాలాపములాడుట యిందు మనోహరముగ చిత్రితమైనది. సీతపై అపవాదు కల్పించుటకు ముఖ్యకారకురాలైన శూర్పణఖను విభీషణుడు దండించి, ఆమెచేత నిండు పేరోలగమున రామునియెదుట తానుకల్పించిన మిథ్యాప్రవాదముల నంగీకరింపజేయుట యిందలి యింకొక విశేషము.

'కుంభరాణా' విషాదరూపకము. దీనికిని షేక్స్పియరు రచన 'ఒథెల్లో'కును చాల పోలికలున్నవి—భర్త అసూయాగ్రస్తుడగుట, అమాయికయగు భార్య భర్తవలననే నాశమగుట, ఆ అసూయకును ఈ నాశమునకును బహుమానముగా లభించిన ఒక వస్తువు (అచ్చట జేబురుమాలు, ఇచ్చట ముత్యాలహారము) హేతువగుట అనునవి రెండింటను సమానములు. కేతవరపు రామకృష్ణశాస్త్రి ప్రభృతులు మీరాబాయికి ప్రాధాన్యమొసంగి నాటకరచన సేయగా రెడ్డిగారు రాణాకు ప్రాధాన్యమొసంగి, ఆతనిని ఉత్తమ విషాదరూపకనాయకునిగా తీర్చిదిద్దియున్నారు. అక్బరు పేర్కొన్నట్లుగా విషయలోలుడైన రాణాకు భార్య దివ్యభక్తికూడ దోషముగానేకనపట్టినది; ఇదియే వానిలోనిప్రధానలోపము. ఈలోపము వానిశంకకు దారితీరిసినది; అది ఆ భార్యాభర్తల మరణమునకు దారితీసినది. కాగా, రెడ్డిగారు ఒక ఉత్తమ విషాదరూపకమును ఒక ఉత్తమవిషాదరూపక నాయకుని తెలుగువారి కొసంగిరనుట అతిశయోక్తికాదు. ఈ కుంభరాణావలెనే, అధికమోహమునకు గురియై పతనముచెందిన మరియొక విషాదనాయకుడు 'కీచకుడు'; ఆతడు శ్రీ విశ్వనాథవారి సృష్టి ('నర్తనశాల'లో).

పౌరాణిక చారిత్రక సాంఘిక వాతావరణములను సమ్మిశ్రితముచేసి వ్రాసిననాటకము 'మాధవవిజయము'. ఇందలి విజయవర్మ 'దుష్టబుద్ధి'వంటి పాత్ర. హత్యలు, కుతంత్రములు మొదలగువానితోకూడిన ఈ నాటకము అపరాధపరిశోధకనవలను జ్ఞప్తికి తెచ్చుచుండును. కాని, నిర్మాణశిల్పమున షేక్స్పియరు రూపకములను తలపించుచుండును. కుంభరాణా విషాదరూపక నాయకుడుకాగా, ఇందలి మాధవవర్మ ఆహ్లాదరూపక నాయకుడు. "కాంగ్రెసువాలా" సాంఘిక రాజకీయాత్మకమైన ఏకాంకరూపకము. ఈ రచనపై గురజాడవారి 'కన్యాశుల్క'రచనా ప్రభావము కొంత కన్పట్టగలదు. రమణాశ్రమవాసియగు కల్యాణరెడ్డి, శాంతినికేతనవాసియగు రంగారావు, కాంగ్రెసువాదియగు వెంకటరెడ్డి ఇందుప్రధానపాత్రలు. శాంతినికేతన-రమణాశ్రమ వాసుల ఆంగ్లేయ భావవ్యామోహమును, 'కళ కళకోసమే' యనెడివారి సిద్ధాంతవివరణమును, వెంకటరెడ్డి దేశభక్తి - మానవత్వములను రామిరెడ్డిగారు చక్కగా నిరూపించియున్నారు.

భావిసంతతులవారికికూడ తమ శిల్పసిద్ధిపై గౌరవముండునట్లును, తమ అభిరుచి సత్యముగను తమ ఔచిత్యదృష్టి మరింతనిశితముగను ఉండునట్లును నాటకకర్తలు ప్రయత్నించి నప్పుడే ఉత్తమనాటకములు వెలువడగలవని ప్రబోధించిన రెడ్డిగారు చిత్తశుద్ధితో వ్యవహరించి, ప్రాత క్రొత్తల మేలుకలయికతో, ప్రాచ్య-పాశ్చాత్య సిద్ధాంతసమన్వయపూర్వకముగా మూడు నాటకములను రచించియున్నారు; అవి మూడును తెలుగునాటకసాహిత్యమున కమూల్యాలంకారము లనుట నిస్సందేహము. సంక్షేపభావప్రకటనమునకును, మానసిక సంక్షోభమునకును రెడ్డిగారు అధికమగు ప్రాముఖ్యమొసంగియున్నారు.[6] ఉత్తమనాటకమున అభినయమునకు ప్రాధాన్యముండునుకాన 'కార్యప్రచలనమును, అభినయమును అడ్డగించు పాటలు పద్యములు ఉండరాదు' అని వీరి అభిప్రాయము. ఒక్క మీరాబాయివిషయమునతప్ప, మరియెచ్చటను వీరు పాటలను వ్రాయలేదు. పద్యములు మాత్రమచ్చటచ్చట కలవు. అవి అలతి అలతి పదబంధములుకలవై మధురముగా నుండును. ఎడనెడ ఔచితిననుసరించి, ఉత్సాహి, సుగంధి ప్రభృతి వృత్తములను కూడ రచించియున్నారు.

రెడ్డిగారు పాత్రోచిత భాషావాదులు; కావుననే వారి రచన తదనుసారముగానడచినది. మరియు వీరు హాస్యమునకు తగుమాత్రముగా తమనాటకములందు స్థానమును కల్పించియున్నారు. సమకాలీనవిషయవిమర్శనమును వ్యంగ్యముగా చేయించి, తన్మూలమున హాస్యమును సృష్టించుటయందుకూడ వీరు నేర్పును చూపించియున్నారు (కుంభరాణాయందు).

వ్రాసిన నాటకములు సంఖ్యలో స్వల్పములే అయినను, సాహిత్య గౌరవసంపాదకములగు (ఉత్తమనాటకరచనకు వలసిన ఉదాత్తకథాగ్రహణము, ఇతివృత్తనిర్మాణము, రసపోషణ, పాత్రపోష మొ॥) లక్షణములనెల్ల కలిగిన నాటకములను తెలుగువారి కందించిన రెడ్డిగారు తెలుగునాటకరంగమున చిరస్మరణీయులు.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ[7] :

ఆధునికాంధ్రసాహిత్యమున మకుటములేని'సమ్రాట్టులు' విశ్వనాథ సత్యనారాయణగారు. అంతియేకాదు, వారు నవ్యులలో నవ్యులు; ప్రాచీనులలో ప్రాచీనులు, వారు చేపట్టని సాహిత్య

ప్రక్రియ లేదు. చేపట్టిన ప్రతి ప్రక్రియలో ఏదియోయొక విశిష్టతను వారు రూపొందించి యున్నారు. అనగా భాషలోకాని, భావములోకాని, నిర్మాణశిల్పములోకాని, కథను వ్యాఖ్యానించుటలో కాని, లేదా మొత్తముమీదకాని ఏదోయొక క్రొత్తదనమును తమప్రతిరచనలోను భాసింపజేయుట వారిలోని ప్రత్యేకత; మరి, 'సమ్రాట్టులు' నూతన ప్రియులుకదా!

విశ్వనాథవారు బహుళ రూపకకర్తలు. వీరి ముద్రితరూపకములలో నాలుగు సుప్రసిద్ధములు—నర్తనశాల, అనార్కలి, వేనరాజు, త్రిశూలము; ఈ నాలుగును విషాదాంతములే! ఈ నాలుగింటను రచనావిషయమున విశ్వనాథవారు వేర్వేరు ప్రయోగములను చేసియున్నారు.

నర్తనశాల : నర్తనశాల తొమ్మిదిఅంకముల నాటకము; ప్రాచ్య నాటకలక్షణములు, పాశ్చాత్యవిషాదరూపకలక్షణములు సమ్మిశ్రితములైన రచనయిది. కీచకుడు ద్రౌపదిని సుదేష్ణాంతఃపురమున తొలిసారిగా చూచుటతో నాటకమారంభమై, ఆతడు నర్తనశాలలో భీమునిచేతులలో మడియుటతో నాటకమంతమగుచున్నది. దీనికి 'కీచకవధ' యనెడు నామాంతరమున్నది. కీచకుని పరస్త్రీకాముకతయనెడి యధర్మమును నిర్మూలించి, ధర్మసంస్థాపనము జేయుటకు పూనుకొనినవాడు యుధిష్ఠిరుడు; "ధర్మమూర్తులగు తమరు నిల్చినచో ఛేసభ" అని పంచమాంకమున కవి ఉత్తరచేత చెప్పించుట గమనార్హము. అసలు ఈ నాటకమునకు ఈ అంకమే ఆయువుపట్టు. ఇందు నాయకుడు ధర్మరాజు. ప్రతినాయకుడు కీచకుడు. ద్రౌపదీ-భీములు సాధనములుగా ధర్మరాజు 'కీచకుడు' అనెడి అధర్మమును నిర్మూలించి, ధర్మస్థాపనము చేయుటయే ధర్మజుడు సాధించిన ఫలము. ఇది భారతీయ దృక్పథము.

కాని సత్యనారాయణగారు దీనిని కేవలము భారతీయదృక్పథముతోనే రచించినట్లుకన్పట్టదు. ఈ రచనమీద షేక్స్పియరు విషాదరూపకముల ప్రభావము స్పష్టముగా కన్పట్టుచున్నది. ఈ దృష్టితో చూచినచో ఇది విషాదరూపకమగుచున్నది. ఇందు కీచకుడు నాయకుడు. ఇతడు మహావీరుడు, ఉదాత్తుడు, రసైకజీవి. కాని, ఈతని శృంగారము అస్థానపతితమైనది; అదియే వానిలోని లోపము. కీచకుని అస్థానపతితమైన కామము, ఆపాత్రశీలమందు దిద్దుకొనరాని లోపమై (tragic flaw), అది అతని మరణమునకు హేతువైనది.[8] "..........శత్రునృపతులు మత్స్యదేశములపైని, దృష్టిపఱుపరు నాకంటియెఱుపుఁజూచి" అనుచు నాటకారంభమున కీచకుడు రంగమున ప్రవేశించినది మొదలు, అంతమున భీముని గుర్తించి, పొంగిపోయి, అంతలోనే కఠినుడై "ఛీ నాకొఱకు స్త్రీవైవచ్చి పౌరుషమేటికి"అని ఈసడించువరకును కీచకుని పాత్ర చక్కగా పరిపోషితమైనది. ఈ విధముగా విశ్వనాథవారు కీచకుని ఒకఉత్తమ విషాద నాయకునిగా రూపొందించియున్నారు.

మరియు, విరహిజన సంతాపకారిణియగు వర్షఋతు వాతావరణమును ఇతివృత్తమునకు నేపథ్యమునుగా సంతరించి, తన్మూలమున విషాదచ్ఛాయలను మరింత పెంపొందించుటలో విశ్వనాథవారు అపూర్వమైన ప్రతిభను ప్రదర్శించినారు.

వేనరాజు : పై విధముగా ప్రాచ్య-పాశ్చాత్య లక్షణములను రెండింటిని చిత్రముగా సమ్మేళనముచేయుట విశ్వనాథవారి రచనలలోని విశిష్టత. 'వేనరాజు' రచనయును ఇట్లేసాగినది. భారతీయదృష్టితో చూచినచో ఇందును దుష్టసంహారమును, ధర్మసంస్థాపనమును ప్రధానములు. "నాకు వేనుఁడేమిశత్రువు? ధర్మమునకు శత్రువు" అని గౌతముడనుట గమనార్హము (పుట 131). ఇందు పృథువు నాయకుడు. మానవధర్మస్వరూపుడైన అంగరాజు, ఆర్యధర్మస్వరూపుడైన గౌతముడు, దైవధర్మ స్వరూపుడైన పృథువునకు సహాయులు; ధర్మవీర మిందలి రసము.

కాని వేనుని నాయకునిగా పరిగణించినప్పుడు, ఇది ఇంకొక ఉత్తమ విషాదరూపక మగుచున్నది. వేనుడు నిస్సందేహముగా మహాపురుషుడే; కాని వానిలోనున్న లోపము 'సనాతన ధర్మవ్యతిరేకత'; అనగా లోకమున కెదురీత. ఈ లోపమువలననే అతడు పతనమైనాడు.[9] వేనునిగూర్చి గౌతముడన్న వాక్యములు పరమసత్యములు—"అన్నా ! నీవంటి దివ్యపురుషులు జన్మించనే జన్మించరు. జన్మించినను నీవంటి మహాప్రత్యేకతా లక్షణములు కలవారివలన లోకమునకు లాభములేదు" (పుట 63). నిజమునకు వేనునిజీవిత సారమిదియే. విశ్వనాథవారు నిరూపింపదలచుకొన్నదియును ఇదియేయని భావింతును.

'వేనరాజు' ను విమర్శించువారందరును అది ప్రధానముగా వేదమతస్థాపనార్థము వ్రాయబడినదని తలంచుచుందురు. కాని అంతకంటె ఇంకొకరహస్యమిందు కలదు—ఒక రక్కసి ప్రభుత్వమును 'అహింస' మూలమున ఎదుర్కొనినట్లు క్రొత్తగా కల్పించిన వందులకథలో విశ్వనాథవారు గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమమును నిపుణముగా నిరూపించియున్నారు. ఇందు వంచులుచదినిన పద్యములన్నియును వేనుని మానసికదశాపరిణామమును సూచించుచుండుట గమనింపవచ్చును. సంభాషణలలోని ఉక్తి-ప్రత్యుక్తికా వైఖరి, సూచ్యార్థసూచన, ధ్వని—ఇవి పరాకాష్ఠను పొందినరచన విశ్వనాథవారి 'వేనరాజు' (ఇట్టినిర్మాణశిల్పము వారి తక్కిననాటకము లందును కన్పట్టగలదు). ఇందు మొదటిభాగమున తర్కవితర్కము లధికము; ప్రేక్షకులు సంస్కారులై సిద్ధపడివచ్చినప్పుడే ఇది రంగస్థలమున విజయమందును.[10] ప్రయోగవిజయము విషయమున నర్తనశాలయే గుణాధిక మనకతప్పదు.

త్రిశూలము : యావద్భారతమును లేదా కనీసము దక్షిణాపథమునైనను ఒక్క గొడుగు క్రిందకుతేవలయుననెడి ఆశయముతో 'తిభువన మల్లబల్లహ' బిరుదాంచితుడగు బిజ్జలుడు బసవనికి మహామాత్యపదము నొసంగెను. అప్పటికే బసవడు మహిమలు ప్రకటించుచు, మహాభక్తుడుగా, నందీశ్వరుని అపరావతారముగా ప్రసిద్ధికెక్కినాడు. కాగా, బసవని మాహాత్మ్యము తనసైన్య బలమునకు తోడుపడగలదని బిజ్జలుడాశించెను. కాని, బసవడు రాజనీతిచతురుడుకాడు; అంతియే కాదు, అన్యమత అసహిష్ణువు కూడను. మతాంతరుడనెడి ద్వేషముతోనే బసవడు బిజ్జలునితో సహకరింపలేదు (నాటకము విషాదాంతమగుటకిదియే కారణము).అంతట కోపముతో బిజ్జలుడు కావించిన 'శివద్రోహము'నకు కల్యాణ కటకమునశించినది. ఇంక, బసవడు రాజద్రోహమునకు

పొల్పడియుండుటచేత తత్ప్రవర్తితమగు వీరశైవ మతము నశించినది. ఈనాటకమున, చరిత్రకు విశ్వనాథవారు కావించిన వ్యాఖ్యానమిది. చారిత్రకముగా 'నీల' (బిజ్జలుని సోదరి) బసవని భార్యఅగునో కాదో సంశయవిషయము. అందుచేత వీరామెను భక్తురాలినిగాచేసి, ఆత్మసంయోగ మును కల్పించినారు.

ఈ నాటకరచనలో విశ్వనాథవారు రెండు క్రొత్తప్రయోగములనుచేసియున్నారు. శాకుంతలమున కాళిదాసు శృంగారరసమును అతిలోకముగా పోషించినాడు; ఆయనను మించ వలెననెడి పట్టుదలతో ప్రయత్నించి, భవభూతి వివిధరస సమ్మేళనమును అద్భుతముగా నిర్వ హించి, కృతకృత్యుడైనాడు. వీరును, ఆప్రయత్నమును దృష్టిలోపెట్టుకొని, ఈ నాటకమున వివిధభావముల సమ్మేళనమును చక్కగా నిర్వహించి, కృతకృతులైనారు. బిజ్జలుడు వీరతా మూర్తి; బసవడు నిలువెల్ల భక్తిభరితుడు; జగదేవుడు కర్మపరతంత్రుడు; నీల మతమునకు ప్రతీక——ఈవివిధ భావములనెల్ల విశ్వనాథవారు చక్కగా గ్రథనముచేసినారు. ఇంక రెండవ ప్రయోగము– 'హెన్రీఎస్మండు' అనెడి 19 వ శతాబ్దినవలలో తద్రచయిత 17 వ శతాబ్దినాటి జీవితమును చిత్రించుచు, ఆ 17 వ శతాబ్దిలో వాడుకలోఉన్నభాషనే తన రచనలో ఉపయుక్తము చేసెను. ఇట్టి ప్రయత్నమునే విశ్వనాథవారు త్రిశూలమందుచేసినారు. పాల్కురికి సోమనాథుని బసవపురాణమందలి ద్విపదల నట్లే వాడుకొనినారు. మరికొన్నిచోట్ల ఆద్విపదలను వచనముగా మలచుకొనినారు. ఇంక తక్కినచోట్ల తత్తుల్యమైన భాషనే తాము వ్రాసినారు. తెలుగు సాహిత్యచరిత్రలో ఇది అపూర్వమైన ప్రయత్నము; ఇందు విశ్వనాథవారు కృతకృత్యు లైనారు.

విశ్వనాథవారు రచనయందేకాక, పాత్రపోషణయందును సిద్ధహస్తులు; వీరి నాటకము లందలి ప్రతిపాత్రయును ఇందులకుదాహరణమే అనుట అతిశయోక్తికాదు. మరియు వీరు నాట కములందు, సాధారణముగా, గేయ కవితారీతికి (lyrical element) ప్రాధాన్యముకల్పించుచు, అందులకొకపాత్రను ప్రత్యేకించుచుందురు——నర్తనశాలలోని 'ఉత్తర' అట్టిది; వేనరాజులోని 'అంగరాజు' అట్టివాడు; త్రిశూలములోని 'నీల' అట్టిది.

అనార్కలి : ఇది 'నూత్నమార్గ విరచిత దృశ్యకావ్య'మని సూత్రధారునిచేతను, 'విషాద నాటక' మని అంతమున సలీముచేతను విశ్వనాథవారు పలికించుట పరిశీలనార్హము. నాయకుడగు సలీము——కీచకుడు బిజ్జలుడు వేనుడువంటివాడు కాకపోయినను——రూపకము విషాదాంతమగుట, అంకములందు రంగములను కల్పించుట, పూర్వాంకమందు చిలుకలు, పూవులు మొదలగువానిని మూర్తిమంతములుగా కల్పించుట, నాయకుని 'అంతరవ్యక్తి' గా 'కవి' పాత్రను సృష్టించుట, గీతిప్రాధాన్యము నధికముచేయుట అనునవి ఈ రచనలోని నూత్నమార్గములు. ఇందలినాయకుడు ప్రేమైక జీవియగు సలీము; కాని, ఇతడు అస్వతంత్రుడగు యువరాజు, ఇంక, నాయికయగు అనార్కలీ అపరూప సౌందర్యవతి, ప్రేమమయమూర్తి. కాని, ఆమె బానిస-మహారాజ్ఞికాగల

అర్హత ఆమెకులేదు. కాగా, ఇది ఉభయత్రానురాగమే అయినను, అస్థానపతిత మగుటచేత వారి ప్రేమ ఫలించుట కవకాశములేకపోయినది.

ఈ నాటకేతి వృత్తములో అనార్కలీ నృత్యము కేంద్రబిందువువంటిది. ఈ నృత్యము ముమ్మారు జరిగినది. మొదటినృత్యమును కథాప్రారంభమునకుముందేచూచి, సలీము ఆమెను ప్రేమించెను. ఈ నృత్యము, రెండవసారి, పూర్వాంకమందలి 5 వ రంగమున జరిగిది; దీనితో వారి ప్రేమ దృఢపడినది. అనార్కలీయందు దోషమును ప్రత్యక్షముగా, ఆరోపించుటకొరకు రాజామాన్‌సింగు అంతమున ఏర్పాటుచేసినది మూడవ నృత్యప్రదర్శనము; చివరికిదియే ఆమె నాశనమునకు హేతువైనది—ఇదియే ఇందలి రహస్యము.

అనార్కలీ-సలీముల ప్రేమకు, అక్బరుకంటె కూడ, రాజామాన్‌సింగ్ అధికముగా వ్యతిరేకి; ఆతడు తాను సుక్షత్రియుడైనప్పటికిని తనకంటె తక్కువవారని తాను భావించెడి మహమ్మదీయులతో సంబంధములు చేసికొనినాడు. కాని, తనమేనల్లుడు మాత్రము, తనకంటె తక్కువదిగా పరిగణింపబడెడి పిల్లను వివాహము చేసికొనరాదట! ఇది ఒక విచిత్రమైన మనస్తత్వము. అమాయికజీవి, ఆ అనార్కలీశాపమే క్షత్రియవంశనాశమునకు కారణమైనదని విశ్వనాథవారిందు చరిత్రకు వ్యాఖ్యానముచేసినారు.

ఇందు మొత్తముము రెండు భాగములున్నవి; అవి పూర్వ-అపరఅంకములనబడినవి. ఇందు పూర్వాంకము అనార్కలీ-సలీముల ప్రేమాభివృద్ధిని (శృంగార రసపోషణమును), రెండవ భాగము తన్నాశమును చిత్రించుచున్నవి. పూర్వాంకమనెడి ప్రథమభాగమందు విశ్వనాథ వారొక క్రొత్తపద్ధతిని ప్రవేశపెట్టియున్నారు. ఇందు పూలకన్నెలు, చిలుకలు, కోకిలలు, మొదలైన పాత్రలుకలవు. ఆధునిక కాలమున ఈ రకపురచనలకు మారిస్‌మేతర్‌లింకు మూల పురుషుడు. విశ్వనాథవారాపద్ధతి నవలంబించి, ప్రణయైకజీవుల స్వచ్ఛభావప్రపంచనమును చేసియున్నారు.[11]

ఇతర రచనలు : తల్లిలేనిపిల్ల, ధన్యకైలాసము, అంతానాటకమే మున్నగు సాంఘిక రూపకములనుకూడ విశ్వనాథవారు రచించియున్నారు. మొదటి రూపకమందలి పాత్రసృష్టిలో 'ఆదర్శదృష్టి' అధికము; చివరిది కేవలము ప్రహసనము; ఇంక మధ్యది ఒక కలగూరగంప. విశ్వనాథవారు శతాధికములైన రేడియో రూపకములను రచించియున్నారు. మరియు, వీరి కిన్నెరసానిపాటలు మొదలగునవి గేయనాటికలుగాను, వేయిపడగలు మొదలగునవి పెద్దనాటక ములుగాను రేడియోలో ప్రసారితములైనవి. వీరు రేడియోకొరకు రచించిన రూపకములలో 'కావ్యహరిశ్చంద్ర' ప్రత్యేకముగా పేర్కొనదగినది. కథ ప్రసిద్ధమైనదే అయినను, వీరు రచనలోఒక విచిత్రమైన కల్పనచేసినారు—హరిశ్చంద్రుడు సత్యవాక్యతత్పరుడగు మహారాజే కాక మోక్షగామియగు జీవుడుకూడను. ఆతడు మాతంగకన్యలను నిరాకరించుటలో 'కామము'ను, రాజ్యమును విశ్వామిత్రున కర్పించుటలో 'లోభము'ను......ఈ విధముగా అరిషడ్వర్గమును, ఈషణత్రయమును క్రమముగా జయించుటను ఇందు విశ్వనాథవారు అపూర్వముగా చిత్రించి యున్నారు.

విశ్వనాథ సత్యనారాయణగారు తమ రచనలన్నింటిలోను కాలవిషయమున, కథావిషయమున సంక్షిప్తతాదులను సాధించుటకు అనేకరకములైన శిల్పములను, చిత్రములనుఅపూర్వముగా ప్రదర్శించుచుండుట సర్వసాధారణము. రచనాశిల్పమున వీరిది అందెవేసినచేయి. వీరి నాటకములు, సాహిత్య గౌరవమధికముగా కలవియగుటచేత ప్రేక్షకులు సారస్వతద్రష్టలై, ప్రయోక్తలు క్రాంతదర్శులైయున్నప్పుడే తొలినాటకములు నాలుగును రంగస్థలమున రాణింపగలవు.

శ్రీ చింతా దీక్షితులు[12]:

భావకవులలో సున్నితమైన భావవ్యక్తీకరణమునకు, లలితపద ప్రయోగమునకు చింతా దీక్షితులుగారిది పెట్టినదిపేరు. అట్టి రచయిత, మధురమైన భక్తిభావమును మరింత సునిశితముగా ప్రపంచించిన వచన నాటకము 'శబరి' (అచ్చటచ్చట పాటలుమాత్రము కలవు. రచన 1925 ప్రాంతములు). శబరి భక్తిసాధన ఇందలి వస్తువు. ఇందు ఉపదేశము, సాధన, పరివర్తనము, నిరీక్షణము, సిద్ధి అనెడి ఐదుభాగములు (అంకములు) ఉన్నవి. శబరి మానసిక దశాక్రమ పరిణామచిత్రణమును, న్యాయ్యముగా కావ్యరూపమున జరుగవలసినదానిని, నాటకరూపమున ఉత్తమముగా సాధింపగలిగినారు దీక్షితులుగారు. అమాయికమగు భక్తికి రూపచిత్రణమే 'శబరి' పాత్ర.

గురూపదేశముననుసరించి, తాను భావించిన లక్ష్యసిద్ధిలో అణుమాత్రముకూడ లోపమును రానీయనంతటి చిత్తైకాగ్రతను సాధించినది శబరి. కాగా, ఆమె సర్వమును రామమయము; రామచంద్రుని కష్టములే ఆమె కష్టములు[13]. ఈ సాధనలో అమాయికయైన ఆ శబరికి, సర్వప్రకృతియును తోడుపడినట్లు చిత్రించినారు దీక్షితులుగారు. అంకారంభములందు వారుచేసిన రంగవర్ణనలన్నియును, ఆయా రంగమునందలి కథలకు ప్రతీకలు. ముఖ్యముగ అయిదవ అంకమునకు ముందుచేయబడిన రంగస్థలవర్ణన శ్రీరామచంద్రుని రాకకు సర్వప్రకృతియును నివాళిపట్టుట సూచించుచున్నది. శబరి ఆనందమే ప్రకృతి ఆనందమనియు, ప్రకృతి తన సర్వసంభారములను ప్రోగుచేసికొని, శబరి లక్ష్యసిద్ధికి దోహదమొసగుచున్నదనియు ఇందు సూచితమైనది. ఇట్టి ఉత్తమ ప్రతీకాప్రయోగము తెలుగుసాహిత్యమున అరుదుగా కానవచ్చును. విద్యాగంధము సుంతయునులేని శబరిచేత సాధనాంతమున "అరుగో ! అరుగో ! వచ్చారు ! మేఘమూ, మెరుపులాగ ఉన్నారు నా తండ్రులు" అని రామలక్ష్మణులనుగూర్చి వర్ణింపజేయుటలో ఆమె తపస్సిద్ధినంతయు ద్యోతకము చేసియున్నారు దీక్షితులుగారు.

ఈ నాటకమందలి మరియొక విశిష్టత వచనరచన. చిన్నచిన్న మాటలలో లలిత-మధురభావ వ్యక్తీకరణముచేయుచు, శిష్ట వ్యావహారికములో వచనమును గేయప్రాయముగా నడిపించినారు దీక్షితులుగారు[14]. భావముల ననుసరించి సంభాషణ, సంభాషణల ననుసరించి కథయు అతివేగముగా నడచినవి—ఇది యిందలి మరియొక విశిష్టత. ఇందు శబరియే ప్రధాన పాత్ర. తక్కినవారందరును ఆమె భక్తి పరిణతికి దోహదకారులు మాత్రమే. ఇట్టిది ఏకపాత్ర ప్రధానమగుటచేతను, పక్షులు మొదలగునవికూడ ఇందు పాత్రలగుటచేతను, ఈ నాటకమునకు

రంగస్థలప్రయోగ సౌలభ్యము తక్కువయగుచున్నది. కాని, శ్రవ్యరూపకముగా దీనిని విజయవంతముగా ప్రదర్శింపవచ్చును.

తెలుగున తీయని కావ్యమువలెకూడ చదువుకొనుటకు తగిన రూపకము లంతకుముందు వెలువడలేదు. ఆ కొరతను తీర్చినది దీక్షితులువారి నూతన ప్రయోగమగు 'శబరి'. కాలక్రమమున, అటుపిమ్మట పేర్కొనదగినవి విశ్వనాథవారి అనార్కలి, అబ్బూరి రామకృష్ణారావుగారి 'నదీసుందరి'. శ్రీయుతులు నోరి నరసింహశాస్త్రి, తలావఝ్ఝుల శివశంకరశాస్త్రి ప్రభృతులు మరికొందరుకూడ సాహిత్యరూపకములను రచించియున్నారు; వీరినిగూర్చి తరువాత వివరింతును.

ఈ కాలమున విద్వత్కవులచే రచింపబడిన కొన్ని నాటకములను పేర్కొందును— కట్టా అచ్చయ్యగారి 'మహాభారత యుద్ధము' (1924), అనుముల విశ్వనాథశాస్త్రిగారి 'మేనకా విశ్వామిత్రము' (1929), కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి మంగతాయి (1926–'విలాసిక' అనెడి రూపకభేదము), శేషాద్రి రమణకవుల 'పాపారాయ నిర్యాణము' (1921), వేలూరి శివరామశాస్త్రిగారి 'మాధవవర్మ' (1920), గరిమెళ్ళ సత్యనారాయణగారి 'మాణిక్యము' (1926) మొదలగునవి.

## సంఘతిరస్కారణము

సంఘ సంస్కారణోద్యమమును, సంఘ తిరస్కారణోద్యమమును ఇంచుమించుగా సమకాలికములే. ఇందు తొలి ఉద్యమ నిర్మాతలు ఆశావాదులుకాగా, మలి ఉద్యమనిర్మాతలు నిరాశావాదులగుచున్నారు. సంఘసంస్కారణమును ప్రచారముచేయువారికి, ఈ దురాచారములు తొలగి, సంఘమెన్నటికైనను బాగుపడుననెడి విశ్వాసమున్నది. కాని సంఘమును తిరస్కరించెడి వారికి అట్టి విశ్వాసములేదు. ఇంక గత్యంతరములేకపోవుటచేత తిరస్కారమునకు పూనుకొన్నట్లు వారే చెప్పుకొనిరి. ఈ రెండు ఉద్యమములకును మరియొక మూలభేదము కలదు— సంఘసంస్కారణోద్యమము సంఘమునందలి బాహిరములైన దురాచారములను నిర్మూలించుటకు మాత్రమే సమకట్టినది. ఇంక సంఘతిరస్కారణోద్యమము మానవుల ఆంతరంగిక విశ్వాసములపై దాడి వెడలిన విప్లవము. ఈ విప్లవవాదులు తాత్కాలికములగు మానవుని మానసికదుర్బలత్వములను నిరసించుటయేకాక, సాంప్రదాయికములగు భావములను, విశ్వాసములను త్రోసిరాజనిరి.

ఇట్టి సాంఘిక మత విశ్వాసముల తిరస్కారణము ఆంగ్లసంస్కృతీసంపర్కజనితమని చెప్పవచ్చును. ఇది ఇంచుమించుగా 1900 నుండియు ప్రబలుచు వచ్చినది. ఆంగ్ల దేశమునకు, విద్యాభ్యాసమునిమిత్తము పోయివచ్చిన యువకులు కొందరు ఆ దేశమునందలి సాంఘికస్థితిగతులను, అచ్చటి మతవిషయకాది సిద్ధాంతములను గ్రహించి[1], భారతదేశమున కూడ అట్టి సంఘవ్యవస్థను పాదుకొలుపవలయుననియు, పాశ్చాత్య దేశములందు ప్రచారమందున్న సర్వసమానత్వమును సాధింపవలెననియు కృతనిశ్చయులైరి. ముఖ్యముగా వారెదిరింపబూనుకొన్నవి—1. మతము, సంప్రదాయములు, పురాణములు మొదలగువానిని

గూర్చిన సామాన్యుల భావన; 2. సంఘమున ఏవో ఒకటి రెండు శాఖలవారు అధికులై తక్కిన వారందరిచేతను గౌరవ మర్యాదలను పొందుచుండుట. ఈ తిరుగుబాటు ఆనాడు అన్ని రంగము లందును (మత-రాజకీయ-సాంఘిక-సారస్వత రంగములందును) ఆరంభమైనది[2]. ఈ తిరుగు బాటుదారుల ముఖ్య సిద్ధాంతములను (సారస్వతరంగమునకు సంబంధించినవి) క్రిందివిధముగా క్రోడీకరింపవచ్చును—1. అర్వాచీన వేదకాలమునుండియు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులకు వేదము నభ్యసించుయోగ్యతను నిషేధించి, వారిని అజ్ఞానమునందుంచి, అణగద్రొక్కిరి. మనువుసాక్షికుడై వర్ణాశ్రమధర్మ వ్యవస్థను నెలకొల్పెను. 2. పురాణములందలి కథలు సత్యము నకు, తర్కమునకుకూడ దూరములు; వానికి నూతన వ్యాఖ్యానము చేయవలసియున్నది. 3. సాంప్రదాయకసిద్ధాంతములను తిరస్కరించి, సర్వసమానత్వమును సాధింపవలసి యున్నది. 4. సాంఘికదురాచారములకు, మూఢవిశ్వాసములకు సనాతన సిద్ధాంతములే కారణ మగుటచేత వానినన్నింటిని త్రోసిరాజనవలయును.

అనగా, సంప్రదాయమును సమూలముగా నాశనముచేసినకాని సంఘము బాగుపడదని వీరి నిశ్చయము. 'సంప్రదాయమునకు పురాణములు చరిత్రలువంటివికాన వాని యాధిక్యమును రూపుమాపవలయును; లేదా వానియందుగల క్షమింపరాని దోషములను వెలికితీసి చూపవల యును' అని వీరి పూనిక. ఇట్టి సిద్ధాంతములను నాటకమున ప్రపంచించుటకు పూనుకొన్న వారిలో ముఖ్యులు, ప్రథములు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు; శ్రీయుతులు ముద్దుకృష్ణ, చలం, ఆమంచర్ల ప్రభృతులు ఆ తరువాత గణనీయులు.

ఇందు త్రిపురనేని, ముద్దుకృష్ణ, ఆమంచర్లగార్లు ఒక వర్గమునకు చెందినవారు; చలం గారు ఇంకొకవర్గమునకు చెందినవారు. తొలివర్గమువారు ఆర్యమత సిద్ధాంతములను, ఆ సిద్ధాం తములను నిష్కర్షించు సాహిత్యగ్రంథములను నిరసించుటకు ఆ వాఙ్మయమునుండియే కొన్ని ఆధారములను సేకరించి, తన్నిరూపణమును, తద్వ్యాఖ్యానమును చేసియున్నారు. ఇంక చలం గారికి సమకాలికజీవితము ఆలంబనము. సాంఘికముగా స్త్రీ పురుషుల అసమానత్వము, అర్థరహితముగాతోచెడి కట్టుబాట్లు వారికి ప్రమేయము. అట్టివానిని ఆయన అవహేళము చేసి నాడు, విమర్శించినాడు. క్రొత్త వ్యవస్థ ఏర్పడుటకంటె గత్యంతరములేదని చాటినాడు. కాగా, తొలివర్గమువారిని మతవాదులనియు, చలం వర్గమువారిని సాంఘికవాదులనియు పేర్కొన వచ్చును.

### శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి :

సంఘతిరస్కరణవాదులలో ప్రథములును, ప్రధానులును అయిన త్రిపురనేని రామ స్వామిచౌదరిగారు భారత-రామాయణ-భాగవతములు మూడింటిపైనను మూడు నాటకములను వ్రాసియున్నారు. అసలీ మూడు గ్రంథములే—తక్కిన అన్ని పురాణములకంటెను—ప్రజలకు సన్నిహితములు. అందుచేత వీనినిగూర్చిన విశ్వాసములపై దాడి వెడలినచో చేపట్టిన ఉద్యమము నకు మరింతవ్యాప్తి చేకూరునని వీరు భావించియుండవచ్చును.

చౌదరిగారి తొలినాటకము 'కురుక్షేత్ర సంగ్రామము'. ఇది 1911 లోనే ప్రకటితమైనది. పాండవులకు లభించిన విజయము ధర్మమార్గసంగతము కాదనియు, శాస్త్రదృష్టితో పరిశీలించినచో పాండవులకు రాజ్యభాగము రానేరాదనియు, దుర్యోధనుడే సుక్షత్రియుడనియు, ఈ నాటకమున వీరు భారతకథకు వ్యాఖ్యానము చేసినారు[4]. ఇది సంప్రదాయమునకు విరుద్ధమైన నిరూపణము. రెండవ నాటకమగు 'శంబుకవధ'లో రామాయణకథ వ్యాఖ్యాతమైనది. వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థారక్షణార్థము శ్రీరాముడు శంబుకుడను శూద్రమహర్షిని సంహరించెనని రామాయణమందు కలదు. శ్రీరాముడు ఆ శూద్రమహర్షిని మతరక్షణార్థముకాక రాజనీతికొరకు చంపెనని చౌదరిగారు నిరూపించినారు. శూద్రులు యజ్ఞయాగాదులుచేయుట, వేదాధ్యయనముచేయుట మొదలగునవి నిషిద్ధములు. ఆ నిషేధములను వ్యతిరేకించి తపస్సుచేయుటకు పూనుకొన్నవాడు శంబుకుడు. అతనిని తక్కిన ప్రజలుకూడ అనుసరించినచో రాజ్యమున విప్లవము వచ్చుననియు, రాజ్య మల్లకల్లోలమై తమ యాధిక్యము నశించుననియు భయపడిన వశిష్ఠాదులు రామునిచేత చేయించిన వధయే ఈ 'శంబుకవధ' యని చౌదరిగారి వ్యాఖ్యానము.

ఇంక వీరి మూడవనాటకము 'ఖూనీ'.'వేనరాజు'నాటకము మూలమున'తాతలనాటిప్రాంత కథను త్రవ్వి పెల్లగించి, ఆర్యఋషుల మహాత్మ్యమును, వారి వృత్తశీలములను క్రొత్తమాటలచే లోకమునకు బోధింపఁబూనుకొన్న' విశ్వనాథ సత్యనారాయణగారికి సమాధానముగా వ్రాయబడిన నాటకమిది. "భాగవతప్రకారము వేనుఁడు పాషండుడు, నాస్తికుడు. పాషండుఁడనగా వేదబాహ్యుడు. ఇందుదోషమేమున్నదో తెలియుటలేదు...పాషండులైనంతమాత్రమున (అనగా వైదికధర్మముల ననుష్ఠింపనంతమాత్రమున) మానవుఁడు పాపకర్మముల నాచరించునని కాని ధర్మపీడలను సల్పుననికాని చెప్పుట లోకమునెడ మహాపచారముచేయుటయగును. భగవంతుని ప్రేమించుటకన్నఁ దోడిమానవులఁబ్రేమించుట పరమోత్తమంబు...పాషండులైనంతమాత్రముననే మానవులు దుర్మార్గులుకారనియు, వేనరాజు పాషండుఁడైనను, సత్యనారాయణగారు చిత్రించినట్లు దుర్మార్గుఁడు కాఁడనియు ఋజువుచేయుటకే 'ఖూనీ' వ్రాయబడినది" అని చౌదరిగారు 'తొలిపలుకు'లో పేర్కొనియున్నారు. కాగా, ఆర్యఋషులు స్వార్థపరులై కుట్రచేసి, ధర్మపరుడైన వేనుని 'ఖూనీ'చేసినారని చౌదరిగారు నిరూపింప ప్రయత్నించిరి.[5]

చౌదరిగారు తమ మూడునాటకములకును విపులమైన పీఠికలను వెలయించియున్నారు. వీనియందు వారువెలిపుచ్చిన యభిప్రాయములను క్రిందివిధముగా క్రోడీకరింపవచ్చును—"భారతదేశచరిత్రను గమనించినచో ఆర్యులు, అనార్యులను ద్రావిడులను పెక్కుఇక్కట్లకు లోనుచేసినట్లు తేటతెల్లమగును. ఆర్యులు తమ ఆధిపత్యమును నిలబెట్టుకొనుటకే స్మృతి సాహిత్యమును సృజించిరి. ఇవి కుటిలబుద్ధితో వ్రాయబడిన వ్రాతలు; ఈ శాసనములతో వివిధవర్గములమధ్య ఐకమత్యము నశించినది. వైదికధర్మముదృష్ట్యా అందరును సమానులే. కాని, రామరాజ్యమునందుకూడ అనార్యులకు తపమాచరించుకొనెడి హక్కులేకుండెను. ఇట్టి వ్యవస్థకు కారకులగు స్మృతికర్తలను, అనగా స్వార్థపరులైన ఆర్యఋషులను ఎదిరించిన ధీరులలో వేనుడొకడు..." ఈ సిద్ధాంతములు వ్యాఖ్యానములు వివాదములకు దారితీసినవి.[6] అవి యెట్లున్నను, ఆయా

నాటకములందలి శిల్పచాతుర్యము, ఆంధ్రనాటక సాహిత్యపురోభివృద్ధికి అవి చేసిన తోడ్పాటు మాత్రమే మనకు గణనీయములు.

ముద్రారాక్షసము నందువలెనే, వీరి నాటకములందును నాయికలు లేకపోవుట గమనార్హము.

'కురుక్షేత్రసంగ్రామము'నకు వ్రాసిన 'విజ్ఞప్తి'లో తెలుగునాటకరంగస్థితిని సంక్షిప్తముగా విమర్శించుచు సంస్కృతనాటకముల, లేదా ఆంగ్లనాటకముల లక్షణములను అనుసరించుటకంటె, ఆధునికపరిస్థితులకు తగినట్లుగా తెలుగువారు ప్రత్యేక నాటకలక్షణములను సృజించుకొనవలసిన యవసరమున్నదని చౌదరిగారు 1911లోనే సూచించియున్నారు. "ప్రస్తావనాదులుండిననేమి ? యుండకున్ననేమి ? రసభంగముకాదుగదా ?"అనియు. "యత్కించద్భేదము లేకుండ గీర్వాణనాటక లక్షణముల(జేకొనుట కేవలము వెఱ్ఱియని నాయభిప్రాయ"మనియు వారీవిజ్ఞప్తియందు పేర్కొనియున్నారు.

"శంబుకవధ" (1920) కు వ్రాసిన 'నాటకవిషయ'మన్న పీఠికలో చౌదరిగారు మరికొన్నిసూచనలు చేసియున్నారు. అది పద్యనాటకయుగము; దానిని వ్యతిరేకించినారు చౌదరిగారు—"వచనమునందుకన్న( బద్యమునందు నెక్కువ భావప్రకటనమున కవకాశముగలదన్న వాద మాదరణీయముకాదు. కాని, పద్యనాటకములయందు సంగీతము ముఖ్యాంగమగుటంజేసి యయ్యది ప్రేక్షకుల మనోగతులను గొంతవఱకు లో(బఱచుకొని రసోదయము(గావించును. అయినను గద్యనాటకములయందు నభినయవిశేషముచేతను, స్వరగతిచేతను నీ రసోదయమునే కల్పింపవచ్చును. పద్యమునకన్న గద్యము ప్రాకృతజనంబునకు సులభగ్రాహ్యముగా నుండును. కాన, సంగీతనాటకములున్నను, లేకున్నను, వచననాటకములుమాత్ర మత్యవసరము,"[7] మరియు, అభినయమంతయును పాత్రోచితముగ నుండవలెననిచెప్పుచు "మహారాణికిని, సామాన్యస్త్రీకిని నొక్కవిధమగు నాపద సంభవించినను, నిరువురు నొకవిధముగా శోకింపరు, మహారాణి గుమిలి కుమిలిపనవును. సామాన్యయో గొంతెత్తి బావురుమని యేడ్చును"-అని వారు వ్రాసిన వాక్యములుకూడ గమనార్హములు. ఇంతవ్రాసియు చౌదరిగారు పాత్రోచితభాష నాదరింపకపోవుట విచిత్రము ! వారు మూడునాటకములను గ్రాంధికభాషయందే రచించిరి. మరియు వచననాటకములయందే ఆదరముచూపినవీరు తమనాటకములన్నింటను కొలదిగనో గొప్పగనో పద్యములను వ్రాసియేయున్నారు.

ఈ గ్రంథపీఠికలయందు చౌదరిగారు వెలిపుచ్చిన కొన్నివిషయములు మాత్రము వారి యీ సత్య-తార్కికదృష్టికి విఘాతములుగా నున్నవి. 'సంస్కృతనాటకములు ప్రదర్శనానుకూల్యములుకావు'; 'రెడ్డిరాజులు గీర్వాణభాషాజ్ఞానములేనివారు' మొదలగు వాక్యములిందుల కుదాహరణములు. సంస్కృతనాటకముల ప్రయోగములకొరకే నాట్యశాస్త్రాదు లుద్భవించిన విషయమును గుర్తించియున్నాము. ప్రాతకాలమునాటి విషయములెట్లున్నను, ఆధునికకాలమున విజయనగరములోని "జగన్నాథ విలాసినీసభ" కేవలము సంస్కృతనాటకముల ప్రదర్శనములకే ఉద్దిష్టమైనది; వారి సంస్కృతనాటక ప్రదర్శనములు ఉత్తమస్థాయిలో నుండెడివి. జి.సి.

శ్రీనివాసాచార్యులుగారు సంస్కృతనాటక ప్రదర్శనములనిమిత్తము మద్రాసులో "ఓరియంటల్ డ్రమెటిక్ క్లబ్"ను స్థాపించి తమజీవితమంతయును సంస్కృతనాటక ప్రదర్శనములలోనే గడిపి, 'ది ఇండియన్ గారిక్' అనెడి బిరుదును పొందియున్నారు. వేదం వేంకటరాయశాస్త్రిగారు మద్రాసు క్రిస్టియన్‌కళాశాలా సంస్కృత విద్యార్థులచేత ఉత్తరరామచరితమును విజయవంతముగ ప్రదర్శించియున్నారు. ఇవియెల్ల చౌదరిగారికి అవ్యవహితపూర్వమందు జరిగినవి; ఈ సత్యమును వారు గమనింపకపోవుట విచారకరము.

తెలుగుకవులు మున్ను నాటకములను వ్రాయకుండుటకుగల కారణములను వివరించుచు, "పదంపడి కవిచంద్రులైన శ్రీనాథాదులు కేవలోదరపోషణార్థమై గీర్వాణభాషాజ్ఞానములేని రెడ్లకు గృతులొసంగనుండినను వారు సంస్కృతంబున నాటకంబులుండుట యెఱుంగమి నాటకాంధ్రీకరణంబునకు నుత్సాహపరుపరైరి." అని చౌదరిగారు వ్రాసినవాక్యములు, అసలు రెడ్లమీద దాడియో లేక నిజముగా వారికి చరిత్ర తెలియదో ఎరుగుట కష్టము. కుమారగిరిరెడ్డి, కాటయవేమారెడ్డి, అనవేమారెడ్డిప్రభృతులు సంస్కృతమున మహావిద్వాంసులై, ఆభాషలో నాట్య-సంగీత-సాహిత్యశాస్త్ర గ్రంథములను, సంస్కృతనాటకములకు వ్యాఖ్యలను వ్రాసియుండుట ప్రథమభాగమున మూడవఅధ్యాయమున గమనించియున్నాము. కావున, చౌదరిగారి పై సిద్ధాంతములు తొందరపాటుతో కూడినవని చెప్పకతప్పదు.

ఇట్లు, మొత్తముమీద చౌదరిగారు ఇతివృత్త సంవిధానములో, కథావ్యాఖ్యానములో, కొంతవరకు రచనలో క్రొత్తదారినిత్రొక్కి, నూతనప్రయోగమునకుపక్రమించి, సాహిత్యమున, ఈ సంఘతిరస్కరణోద్యమమునకు నాయకులైరి.

## శ్రీ ముద్దుకృష్ణ[8]:

త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఆర్య-అనార్య భేదదృష్టితో రామాయణమును భిన్నవిధముగా వ్యాఖ్యానించుటకు పూనుకొనినారు. కాని, ముద్దుకృష్ణగారు, 'అశోకము'(1934) అనెడి తమ నాటకములో, ఇంకొకమెట్టు ముందునకుపోయి, ఆదర్శపవిత్రదంపతులుగా లోకముచేత ఆరాధింపబడు సీతారాముల ప్రణయముమీదనే దండెత్తి ఇరువదియవ శతాబ్దపు 'సెక్సుతత్త్వవేత్త' దృష్టితో సీతా-రామ-రావణుల ప్రణయములను చిత్రించుటకు పూనుకొనినారు. అందు వీరు ప్రతిపాదించిన సిద్ధాంతములను క్రిందివిధముగా క్రోడీకరింపవచ్చును—

1. ఆనాటి ఆర్య-అనార్య సంఘర్షణమున ఆర్యులకృత్యములను సమర్థించుటకే వాల్మీకి రామాయణమును వ్రాసెను. అంతియేకాదు, వర్ణనలలో అద్భుతమైన కవిత్వపు పోకడలను, ఆర్యపక్షమును సమర్థించుటకు ధర్మసూత్రములను ప్రవేశపెట్టి రామాయణమునకు గొప్ప విలువను కలిగించినాడు వాల్మీకి.

2. పురుషులకొకటి, స్త్రీలకింకొకటి—ఇట్లు నీతిని రెండువిధములుగా విభజించుటలో తయారైన ప్రమాణగ్రంథములనుబట్టి హిందూస్త్రీ అన్యాయస్థితిలోపడిపోయినది. హిందూ ధర్మాత్ములు, 'స్త్రీకి ఆత్మలేదు' అనెడి ఒక చిన్నసూత్రములో ఆమె సమస్తమును సరిపెట్టి వేసినారు. అసలు, మనపూర్వులకు ప్రేమతత్త్వమే తెలియదు.

3. 'సవిమర్శముగా పరిశీలించినచో రాముడు, 'ఉత్తకీర్తికాముడు.' కీర్తికొరకు దేని కైననుసరే సంసిద్ధపడువాడు. ఆర్యత్వమువినా అంగీకరింపలేని ఆతడు ఇతరసంప్రదాయముల లోని ధర్మములను గ్రహింపలేడు.

4, రావణుడు, ఈ నాటికిని అందరును తలంచుచున్నట్లు దుర్మార్గుడును, రాక్షసుడును కాదు; అంతియేకాదు, చాల 'పెద్దమనిషి' కూడను. మరియు ఆతడొక మహాప్రణయమూర్తి.

ఈ దృక్పథముతోనే ముద్దుకృష్ణగారు 'అశోకము'ను రచించినారు.[9] అంతియేకాదు, తన ధర్మమును తననీతిని అడుగడుగునను తానే నిర్ణయించుకొని శీలమును నిలబెట్టుకొనగల వ్యక్తిత్వమున్న స్త్రీనిగా సీతను చిత్రించినారు. అందులకనుగుణముగా, స్వయంవరమునకు ముందే, రామ_రావణులు సీతను కలిసికొన్నట్లు, అడవిలో సీతా_రాములు రావణుని అతిధి సపర్యలతో ఆదరించినట్లు, ఆతడు వారిని లంకకు ఆహ్వానించినట్లు మొదలుగాగల సన్నివేశము లను, అవాల్మీకములైన వానిని, కల్పించినారు. ముద్దుకృష్ణగారిభావము లెట్టివైనను, వారికల్పనల లోను, వారివ్యాఖ్యానములలోను, వారి తర్కమునందును కొన్నిలోపములు కన్పట్టుచున్నవి.— 1. రావణుని సమర్థించుటకు వాల్మీకివాక్యములనే ప్రమాణముగా స్వీకరించిన ముద్దుకృష్ణగారు శ్రీరాముని నిరసించుటలో ఆ వాల్మీకిప్రామాణ్యమునే త్రోసిరాజనినారు; అనగా అప్పుడు వాల్మీకి మరల ఆర్యపక్షపాతి అయినాడు. 2. రాముని నిరసించుటకు ఆఫ్ఘనురాజు అమానుల్లాను ఉదాహరణముగా గైకొనినారు; ఇందువలన పాఠకునకు కొంతఅభినివేశమును నమ్మకమును కలుగుట కవకాశమున్నది కాని, ఇది తర్కమనిపించుకొనదని వారికి అంతరంగమున తెలిసి యుండకపోదు.[10] 3. ఒక స్త్రీని (సీతను) హిందూమహాత్ముల దృష్టినుండి రక్షించినారు కాని, ఇంకొకస్త్రీని (శూర్పణఖను) మరల ఆమహాత్ముల దృష్టితోనే చిత్రించినారు. 4. నేటి పాశ్చాత్య సంప్రదాయ పద్ధతిలో ఆనాటి రామ_రావణులు ఆనాటి సీతప్రేమను, స్వయంవరమునకుముందే, అర్థించినట్లు కల్పించుటలో రచయితకు సంప్రదాయవ్యతిరేకతయందున్న యభినివేశమే వ్యక్త మగుచున్నది కాని, ఆ కల్పనకు ఆవశ్యకతయును, సార్థకతయును కన్పట్టదు. 5. రామాయణ గాథనర్థముచేసికొనుటకు ముందు ఎంతయో పూర్వసాహిత్యపరిచయము కావలయును. రావణుడు కారణజన్ముడు; రాముడు అవతారమూర్తి 'కేవలము రావణసంహారార్థము అవతరించినాడు_ ఆ యిరువురును మిత్రులగుట పొసగదు. 6. వీరి చిత్రణములో రావణునిపై మమకారముచూపిన సీత_మానసికముగా_అపవిత్రురాలైనది (ఇంకరావణుని స్పృశింపవచ్చునా ? కూడదా ? అనెడి ప్రశ్నకుతావేలేదు).

సీతనుగూర్చిన వాల్మీకివర్ణనలలో—విశాలములైన ఆమెకన్నులు—ప్రాముఖ్యమును వహించినవి; ముద్దుకృష్ణగారి మాటలలో చెప్పవలెనన్నచో ఆమెవి "కైపుఎక్కించే కన్నులు"— రావణుని ప్రేమోన్మాదమునకు ఆ కన్నులే కారణములు. లలితమైన ఈ విషయమును గ్రహిం చుటలో, నిరూపించుటలో ముద్దుకృష్ణగారు చక్కని నేర్పు చూపినారు. కాని, ఆనేర్పు రావణుని ప్రణయమువలెనే, అస్థానపతితమైనదని చెప్పకతప్పదు. అట్లుకానిచో, తద్రమణీయభావభరితమై

వారికలమునుండి ఒక చక్కని నాటకము వెలువడి యుండెడిదే. కాని, ప్రాచీన శాస్త్రములందు, సిద్ధాంతములందు వారికిగల తిరస్కారభావము, దానికి అట్టి అవకాశము లేకుండచేసినది.

ఖూనీ, అశోకంలు రెండును 1944_45 లో ఆంధ్రవిశ్వవిద్యాలయమున కె. వి.గోపాల స్వామిగారి ఆధ్వర్యమున, ప్రప్రథమముగా గుంటూరులో ప్రదర్శితములైనవి.

## శ్రీ ఆమంచర్ల గోపాలరావు :

గోపాలరావుగారి 'హిరణ్యకశిపుడు' నాస్తికమత బోధకమైనది. దేవుడులేడను సిద్ధాంతమును ప్రచారముచేయుటకు సమకట్టిన హిరణ్యకశిపుని శుక్రాచార్యులు, మంత్రి_సేనానులతో శత్రుపన్ని సంహరించుట యిందలికథ. చనిపోవుచు, హిరణ్యకశిపుడు "నాయనా! కల్పితదైవ భావన వీడుము. మతమును కలనైన స్మరింపకుము. ఇవన్నియును అసత్యములు" అని ప్రహ్లాదునకు హితముగరపుట పరిశీలనార్హము. హిరణ్యకశిపుని భావనప్రకారము సంఘ సంస్కరణమనగా 'లోకమున వర్తిల్లుచున్న మతాచారముల నిర్మూలనము', "మతమన్నది లేకున్న లోకమున ఇంక కష్టము, పాపము, వంచన, హింస, మొదలగు ఘోరారిష్టముల కునికియేయుండదు...దైవమే లేనప్పుడు మానవుడు దైవద్రోహియగుటెట్లు?" అని హిరణ్యకశిపుని వాదన.

అన్నిటికంటెను చిత్రమైనది ఈ నాటకమందలి చివరిరంగము. ఇందు హిరణ్యకశిపుడు అర్ధరాత్రమున శుక్రాచార్యులవారి శయ్యాగారమున 20 వ శతాబ్దపు ఐరోపాయుడుపులతో నొక పొట్టివ్యక్తిగా ప్రవేశించి "ఆచార్యా! ఇది కలియుగము, నా విప్లవమిప్పటికి జయించినది" అని వారితో పలుకును. ఇది కలయట[11]. నాటకభాషలో జిగి కన్పట్టదు.

## శ్రీ గుడిపాటి వెంకటచలం [12]:

సంఘమున వ్యక్తిగతమగు స్వేచ్ఛను అడ్డగించెడి శక్తులు నశింపవలెనన్న సిద్ధాంత ద్రష్టనుగా, ఫ్రాయిడ్ లైంగికసిద్ధాంతానుయాయిగా వెంకటచలంగారిని పేర్కొనవచ్చును. వీరు రచయితలేకాక విమర్శకులుకూడను; సంఘతిరస్కరణవాదుల మాటలలో చెప్పవలెనన్నచో వీరి విమర్శ సమకాలీన సంఘముమీద, కరడుకట్టుకొనిపోయిన వన్న సనాతనసిద్ధాంతముల మీద, కట్టుబొట్లమీద, మానవుని సహజమైన జీవనకాంక్షకు వ్యతిరేకముగా అతనిమీద రుద్దబడిన ఆంక్షలమీద. 'తిరుగుబాటు ఆదర్శం తిరుగుబాటుయొక్క అవసరం లేకపోవడం' అని తమ ధ్యేయమును నిర్వచించినారు చలంగారు. తత్సాధనకే నిరంతరప్రయత్నములు సాగించియున్నారు.

చలంగారికి నాటకములు, నవలలు, కథలు, నాటికలు_అన్నియును స్వీయభావవ్యక్తీకరణమునకు సాధనములుమాత్రమే. అందుచేతనే వీరి 'నాటకములను' 'భావప్రధాన రూపకములు' (Dramas of ideas) అనవచ్చును. ఇందు నాటకీయసంఘర్షణముకంటె, పాత్రపోషణాదులకంటె, రచయిత తాను చెప్పదలచుకొన్న విషయమునకే ప్రాధాన్య మొసంగును. తన

భావము ప్రాతిపదికగా దానిచుట్టును పాత్రలను, కథను, వాతావరణమును సృష్టించుకొనును (ఇట్టివారిలో బెర్నార్డుషా ప్రముఖుడు). ఇట్లు సృష్టించుకొనుటలో, రచయిత ప్రతిభావంతు డగుటచేత సాహిత్యమునకు ధ్యేయమగు రసపోషణమును కొంతవరకు సిద్ధించినది; అందు వలననే వీరి రచనలకు సాహిత్యమున ప్రత్యేకస్థానము లభించినది.

చలంగారి నాటకములలో నాలుగు పౌరాణికములు; తక్కిన మూడును సాంఘికములు. ఇతివృత్తమేదియైనను వ్రాసెడి పద్ధతియందుకాని, వ్రాసెడి విషయములందుకాని అంతగా మార్పు కన్పట్టదు.

సారంగధరుని పవిత్రునిగాను, చిత్రాంగిని వేశ్యగానో, తత్తుల్యురాలుగానో చిత్రించుట సంప్రదాయమైయున్నది. అందులకు పూర్తిగా భిన్నమైన మార్గమును త్రొక్కినవారొక్క కాళ్ళకూరి నారాయణరావుగారే (చిత్రాభ్యుదయము–1909). చలంగారుకూడ ఇంచుమించుగా అదే విధానము ననుసరించి చిత్రాంగీ–సారంగధరులు తొలుతనే ప్రేయసీప్రియులనియు, వారిని కాదని అధికారమదమున రాజరాజు చిత్రాంగిని వివాహమాడెననియు నిరూపించి, అట్టి బల వంతపు వివాహములు దేశమున అనేకములు జరుగుచున్నవనియు, వాని పర్యవసానము, చిత్రాంగీ–సారంగధరుల గాథవలెనే, విషాదాంతమనియు చలంగారు 'చిత్రాంగి'లో నిరూపించి నారు[13]. ఈ నాటకమున, సారంగధరునికంటె చిత్రాంగికే ప్రాముఖ్య మధికము; మరియు, ఆమె నిర్దోషియని నిరూపించుటకు ప్రయత్నము జరిగినది.

"శశాంక"యందు స్వేచ్ఛాశృంగారమునకు నూత్నకల్పనచేసినారు చలంగారు. చిత్రాంగీ–సారంగధరుల కథవలెనే తారా–శశాంకుల కథకూడ దుర్వ్యాఖ్యాతమైనదని చలం గారి విశ్వాసము. తారకు భర్తపై గౌరవము, భక్తి; శశాంకునిపై ఓపరానివలపు—ఈ భావ ద్వంద్వమునందు కొట్టుమిట్టాడుచున్న తారకు[14] బృహస్పతిచేతనే మార్గము చూపించినారు చలం గారు. 'చిత్రాంగి' నాటకమందు ఆ చిత్రాంగి చలంగారి స్వీయసృష్టియైనట్లే, ఈ 'శశాంక' నాటకమందు బృహస్పతి చలంగారి స్వీయసృష్టి. రాజరాజు స్వార్థపరుడై ఎదుటివారి ప్రేమను అర్థముచేసికొనలేకపోయెను. కాని, బృహస్పతి, 'ప్రేమ ఆత్మసమర్పణమైనప్పుడే స్వీకర ణార్హము' అని గ్రహించినవాడగుటచేత స్వార్థత్యాగము చేయగలిగినాడు. కాగా 'చిత్రాంగి' యందు సాధింపలేకపోయినదానిని చలంగారు 'శశాంక'యందు సాధించినారన్నమాట[15].

'పద్మావతీ చరణచారణ చక్రవర్తి'గా, గీతగోవిందకర్తగా సుప్రసిద్ధుడైన జయదేవుని విషాదజీవితము చిత్రితమైన నాటకము 'జయదేవ'. జయదేవుడు జీవితమున ఎన్నియో ఎదురు దెబ్బలుతిනినాడు. కాంతకు, కాంక్షకు దూరముగాపోవలయునని ప్రయత్నముచేసియు, ఆ సుడి గుండమునపడి మునిగిపోయినవాడు. దేశాంతరగతుడైనను, సన్యసించినను, కనులు పొడుచు కొన్నను అతనిలోని కామప్రవృత్తి అణగలేదు. నిజమునకివి యేవియును వాని రోగమునకు మందులుకాలేదు. అసలైనమందును వృద్ధభిక్షువు సూచించినాడు—"నీ సౌందర్యవాంఛ, నీ కామ శక్తి, నీ గానమాధురి, నీ కవితాగ్ని, అన్నీ ఈశ్వరుడి పాదాలముందు అర్పించే పుష్పాలుగా

మారాలి." నాటినుండియే జయదేవుడు మారిపోయినాడు. అంతట వానిజీవిత సర్వస్వసారమును, అపూర్వమును, అద్వితీయమునుఅయిన గేయకావ్యము ఉద్భవించినది. స్వస్థానవినివేశితమైన మానవునిశక్తి పుష్టినంది అపూర్వసృష్టి సంపన్నముకాగలదని చలంగారు ఈ నాటకమున నిరూపించినారు. ఆధ్యాత్మిక-వాస్తవిక తత్త్వములమధ్య |వేలాడిన జయదేవుని మనస్తత్త్వము వంటిదే చలంగారి మనస్తత్త్వముకూడ అని పేర్కొనుట అసమంజసము కాదేమో.

చలంగారి సాంఘికనాటకములలో "విడాకులు" మంచిరచన. స్త్రీపురుష ప్రేమ తత్త్వమే దంపతుల జీవితములను ఆనందధామములుగనో, నరకతుల్యములుగానో చేయగల దనియు, స్త్రీ పురుషుల హృదయములను బంధించునది పవిత్రమగు ప్రేమయేకాని వివాహ విధి కాదనియు ఇందు నిరూపించినారు చలంగారు. మరియు, నిత్యజీవితములయందలి కరడుగట్టిన స్వార్థము, భర్తలు భార్యలను నీచముగా చూచెడిస్థితి ఇందు విమర్శితములైనవి. ఇంతవరకును వీరు వ్రాసిన నాటకములలో కనిపించని నిండైన పాత్రపోషణ ఈ నాటకమందు కన్పట్టుచున్నది. తక్కిన నాటకములందలి పాత్రలలో 'చలం' పరోక్షముగా కన్పట్టుచునే యుండును; కాని ఈ నాటకమందలి పాత్రలు ఆయా పరిస్థితులను, వారివారి మనస్తత్త్వములను ప్రతిబింబించునవై సజీవముగా కన్పట్టగలవు. మామూలుగా సంఘముపై తనకుగల కసిని, బాధను వ్యక్తపరచుటకు సాధనములుగా పాత్రల నుపయోగింపక, వానినెల్ల కళాత్మకముగా, తీర్చిదిద్దుటచేత ఇదివారి సాంఘిక నాటకములం దుత్తమరూపకమగుచున్నది.

ఇక చలంగారి చివరిరూపకము 'పురూరవ'. న్యాయ్యముగా ఇది 'నాటకము' గాదు. దీనిని "సంభాషణరూపకకావ్య"మనవచ్చును.[16] కాని, ఇంతకుపూర్వము చలంగారుచేసిన సాహిత్య సృష్టియంతయును దీనిని రచించుటకు కూర్చుకొన్న సాధనసంపత్తిగాను, ప్రయోగమాత్రపు ప్రయోజనముకలదిగాను భావింపబడుట సమంజసము. చలంగారి భావములు, వారి రచనా సంవిధానము ఇందు పరాకాష్ఠనందుకొన్నవి. స్త్రీ పురుషుల సంబంధముయొక్క పర్యవసాన మును ఆధ్యాత్మికమైన "ఆత్మదర్శనము"నుగా నిరూపించినా రిందు చలంగారు. 'ఆధ్యాత్మికత అంటే ప్రపంచములోని అందానికి, ఆనందానికి కళ్ళుతెరవడం' అని వారి నిర్వచనము. చలం గారి అన్వేషణలో 'ప్రేమ'-'ఈశ్వరుడు' సమానములు. ప్రేమసాధనములో దీక్ష, దానియందు నిత్యాసక్తి, దానినుండి మనస్సును చంచలముకానీయకుండుటవంటి అనేకవిధులుకలవు - దీనికి తట్టుకొన్న ప్రేమయే చిరకాలము మనగలదు. మానవుల మానవులమధ్యకాని, మానవుల భగవంతునిమధ్యకాని - ఇట్టిప్రేమయే అనశ్వరమై నిలుచునని చలంగారు సిద్ధాంతీకరించినారు 'పురూరవ'లో. కాగా, చలంగారి సాహిత్యమునందేకాక, నాటక సాహిత్యమునందే దీనికొక ప్రత్యేకస్థానము కలదు.

చలంగారి గ్రంథములన్నియును ప్రేమను, శృంగారమును ఆలంబనముగాచేసికొని వెలువడినరచనలు. తొలుత స్వేచ్ఛాయుతమగు ప్రేమను, తరువాత నియమితమును ఆత్మకు పరిమితమును అగుప్రేమను, తరువాత ఆధ్యాత్మిక ప్రేమభావమును ప్రపంచించుటలో చలంగారి మానసికపరిణామక్రమము సుస్పష్టమగుచున్నది.

ఇంతకుముందే పేర్కొన్నట్లుగా, చలంగారు, నాటకములను ప్రదర్శనదృష్టితో వ్రాయలేదనుట సత్యమే ఐనప్పటికిని, కొన్నింటిని చక్కగానే ప్రదర్శించుట జరిగినది. అసలు, నాటకములలో అధికభాగము చలంగారి భావములకు సంభాషణరూపములు. ఇవి సంభాషణరూపమున నుండుటచేతను, నాటకమునకు ఆవశ్యకములైన ముఖ్యలక్షణములలో నొకటియగు మానసిక సంఘర్షణమున కిందుప్రాధాన్యముండుటచేతను వీనికి నాటకసాహిత్యమున స్థానములభించినది. అసలు, చలంగారి ఉద్దేశములో, ఇవిప్రదర్శితములు కావలసినవి నాటకరంగస్థలమునందు కాదు; ప్రేక్షకుల లేదా పాఠకుల హృదయరంగస్థలములందు మాత్రమే. నిజముజెప్పవలెనన్నచో ఇతివృత్త నిర్మాణమున, పాత్రపోషణమున చలంగారికి శ్రద్ధలేదు; మరి, అవి అట్లు ఆకర్షణీయములగుటకు కారణములు వారిలోని భావతీవ్రత, వచనరచనాశక్తి. చలంగారి వ్యావహారిక వచనరచన విశిష్టమైనది. ఉద్వేగపూరితులైన మానవులమానసికవేదన వ్యక్తమగు భాష ఇందుపయుక్తమైనది. దానికి ఆలంకారికుల, వ్యాకరణకర్తల నియమములు పట్టవు; ఆయనభావముల వలెనే, ఆభాషయును ఎట్టికట్టుబాట్లకును లొంగదు. కాని, సహజమై, ఉద్వేగభరితమై, సూటిగా గ్రుచ్చుకొనునట్టి శైలికనుకనే అది పాఠకుని మనస్సును ఆకర్షించి తుదివరకు నడిపించుకొనిపోవును.

ఇట్లు ఆనాడు తానునమ్మినదివ్రాసి, వ్రాసినది ఆచరించిన దీక్షాపరుడు చలంగారు.[17] వారి అభిప్రాయములు మనకునచ్చవచ్చును; నచ్చకపోవచ్చును. కాని, వారిరచనలను మాత్రము, చేతపట్టినచో, చివరివరకు చదవకమానలేము.

## ప్రదర్శన సౌలభ్యము

ఏభాషయందైనను ఉత్తమ నాటకమునకు సాహిత్యగౌరవము, ప్రదర్శన సౌలభ్యము—ఈ రెండును రెండు కన్నులవంటివి. మిగిలిన సాహిత్య శాఖలనుండి నాటకమును వేరుచేయునది ప్రదర్శనమేయని గుర్తించియున్నాము. సాహిత్యమున చెప్పబడని, లేదా చెప్పరాని భావములనుకూడ అభినయముల సాహాయ్యమున ప్రదర్శనమందు చెప్పుటకు వీలున్నది. కాగా ఈ రెండింటిలో ప్రదర్శనమునకే ప్రాధాన్యము లభించుచున్నది. అయినను నాటకమునకు ప్రదర్శన సౌలభ్యమాత్రముననే ఉత్తమత్వము చేకూరునని తలంపరాదు; రెండింటికిని సమప్రాధాన్యమున్న నాటకములే ప్రపంచసాహిత్యములందు ఉత్తమనాటకములు కాగలిగినవని తెలియవలెను.

ఇంతకుముందుకాలమునకూడ ప్రదర్శన సౌలభ్యముకల పౌరాణిక-చారిత్రక నాటకములు మరలమరల రచింపబడియున్నవి. ద్రోణంరాజు సీతారామారావు, చక్రావధానుల మాణిక్యశర్మ, సోమరాజు రామానుజరావు ప్రభృతుల నాటకములిట్టివే. వీరికి సాహితీగౌరవ సంపాదనమునందుకంటె రంగస్థలప్రయోగ గౌరవమునందే దృష్టి యధికము. అంతయో, ఇంతయో సాహిత్యగౌరవమునుకూడ నిలబెట్టుకొని రంగస్థలమునందుకూడ విజయమును పొందగల నాటకములను రచించుట నాటకరచనారంభ కాలమునుండియు జరుగుచునేయున్నది. అట్టిది ఈ

కాలమున ఒక ఉద్యమముగా ఆరంభమైనదని చెప్పవచ్చును. ఈ ఉద్యమమున ప్రముఖులు శ్రీయుతులు కొప్పరపు సుబ్బారావు, భమిడిపాటి కామేశ్వరరావు, పింగళి నాగేంద్రరావు ప్రభృతులు. వీరందరును కేవలము నాటకరచనయందేకాక ప్రదర్శనమందును అనుభవజ్ఞులు, ఉత్తమప్రయోక్తలు, రంగస్థల విజ్ఞానమున నిష్ణాతులు. సమకాలీన నాటకరచన ముఖ్యముగ 1915 తరువాత గతానుగతికమైనదని గమనించియున్నాము. ఈ దశలోని లక్షణములకు వ్యతిరేకముగ నాటకరచన యారంభించినారు ఈ యుద్యమములోనివారు[1]. ప్రదర్శన సౌలభ్యమెంతముఖ్యమో, సాహిత్యగౌరవమును అంతియే ముఖ్యము వీరిదృష్టిలో.

ఇంతకుముందున్న కాలమున నాటకములందు పద్యములకో, పాటలకో లేదా రెండింటికో ప్రాధాన్యము లభించినది; తత్ఫలముగా నాటక ప్రదర్శనము 'సంగీత కచేరీ' యగుట తటస్థించినది. ఈ స్థితినుండి నాటకరచనా-ప్రదర్శనములను నూతన మార్గమును పట్టించుటకు ఈ రచయితలు రెండుమార్గముల ననుసరించిరి—దాదాపు వెనుకటి పౌరాణిక-చారిత్రకగాథలనే స్వీకరించి, సాహిత్య దృష్టితో ఇతఃపూర్వము కన్పట్టని నిర్దుష్టరచనా విధానములను వెలయించి చూపుట మొదటిమార్గము. ప్రాతపద్ధతిని పూర్తిగ విస్మరించి, ఇతివృత్తములో, రచనలో క్రొత్తపద్ధతిని చూపుట రెండవమార్గము. మొదటివర్గమువారి నాటకములకును, అంతకుముందరి నాటకములకును ఇతివృత్తమున భేదములేదు. కాని ఈ నాటకములందు సాహిత్యగౌరవమధికము; సంగీత ప్రాధాన్యము తగ్గినది. నటుల నటన కవకాశము హెచ్చినది. ఇంక రెండవవర్గమువారు ప్రహసనాదులను చేపట్టినారు. మరియు పద్యములను పాటలను పూర్తిగా నిరాకరించినారు (పద్యములున్నను వానిని వచనమువలె చదువవలయునేకాని పాడరాదని వీరి సిద్ధాంతము). మొదటివర్గమువారి ప్రదర్శనావిధాన మెంతగా జనరంజకత్వమును పొందినదో, రెండవవర్గమువారి క్రొత్త కథలును అంతగా జనరంజకత్వమును పొందినవి. ఇందు మొదటి వర్గమునకు చెందినవారు కొప్పరపు సుబ్బారావు, పింగళి నాగేంద్రరావుగార్లు; ఇంక రెండవ వర్గమునకు చెందినవారు భమిడిపాటి కామేశ్వరరావు ప్రభృతులు. వీరినిగూర్చి తరువాతి అధ్యాయములో ప్రసంగింతును.

### శ్రీ కొప్పరపు సుబ్బారావు[2]:

ఉత్తమప్రయోక్తగా, ప్రాచ్యపాశ్చాత్యనాటకరచనావిధానవేత్తగా, సంగీతకళాసాధకుడుగా తెలుగుదేశమునకు సుపరిచితులు కొప్పరపు సుబ్బారావుగారు. నాటకశాఖయందు వారికున్నయభినివేశము సాటిలేనిది. అయిదారుసంవత్సరముల వయస్సునుండి మరణపర్యంతమును తెలుగునాటకరంగముతో ఏదోఒకవిధముగా జీవితమును ముడిపెట్టుకొన్న సుబ్బారావుగారు తమ తొలిరచనను పాశ్చాత్యదేశములలో ఆంగ్లమునవ్రాసి, ప్రదర్శింపజేయుట విచిత్రము : పాశ్చాత్యదేశములలో నివసించెడి అల్పసంఖ్యాకులగు భారతీయులందరును అత్యంత సన్నిహితులుగా, సోదరభావమున మెలగుచుండెడివారు. అచ్చటినుండి స్వదేశమునకు తిరిగివచ్చిన సుబ్బారావుగారికి భారతదేశమందలి అనైక్యము జిజ్ఞాసాకారణమైనది. మరియు వారే చెప్పుకొన్నట్లు నాడు ప్రముఖులైన నాటకరచయితలలో వారివలె రాష్ట్రేతరనాటకరంగ పరిచయము కలవారుకాని,

ఆధునిక రంగ ప్రయోగపద్ధతులలో మెలగినవారుకాని, వివిధ నాటక స్వరూపములు తెలిసినవారు కాని లేరనుట అతిశయోక్తికాదు. ఇట్టి అనుభవములును, పై జిజ్ఞాసయును కారణములుగా తెలుగులో నాటకరచన కుపక్రమించినారు సుబ్బారావుగారు.

"రోషనార" వీరి తొలి తెలుగునాటకము. తనకు చిక్కి, తన్ను గాఢముగా వలచిన రోషనారను (మొగలాయీ చక్రవర్తి ఔరంగజేబు సోదరిని) శివాజీ మాతృగౌరవ పురస్సరముగా త్రిప్పిపంపివేయుట, తన వలపు ఫలింపనందుల కామె పగగొని, శివాజీపై దండెత్తి, చివరికి ప్రాణములు కోల్పోవుట యిందలి యితివృత్తము. ఈ నాటకమందలి కథ కొంత చారిత్రకము, కొంత కవికల్పితము. రచనాపద్ధతిలోకాని, సంభాషణలలోకాని ప్రత్యేకవిశిష్టత ఇందేమియును లేదు. కాని రోషనారా—శివాజీల పాత్రలను చిత్రించినతీరులో మాత్రము కవి చాల నేర్పు చూపినాడని అంగీకరింపక తప్పదు. రోషనారా తన ప్రేమను వెల్లడించునప్పుడు శివాజీ వితర్కము; భారతజాతి రక్షణకుగా, ప్రేమించిన యువతిని మాతృగౌరవమున చూచిన శివాజీ ఉదాత్తత; ప్రేమకు విఘాతము కలుగగా కదనరంగమున నిలచి. ఓడిపోయి, తన ప్రేమను విడనాడలేక అంతిమసమయమున సకల భారత సామ్రాజ్యాధినేతవుకాదగిన అర్హత నీకే కలదని రోషనారా ప్రియునకు శుభాకాంక్షలు పలుకుట మొదలగు ఘట్టములు విషాదరూపకమునకు సన్నిహితములై ప్రజల మనస్సులను ఆకట్టుకొనగలవు.

మరియు ఈ నాటకము ప్రసిద్ధికి వచ్చుటకు ఇంకొక కారణముకూడ కలదు. ఇందు రోషనారా పాత్రధారి స్థానం నరసింహారావుగారు, శివాజీ పాత్రధారి మాధవపెద్ది వేంకట్రామయ్యగారు—ఈ ఇరువురు నటులు హేతువులుగా ఈ నాటకము తెలుగు నాటకరంగమును కొన్ని నాళ్ళు పరిపాలించినదని చెప్పవచ్చును. ఈ నాటక ప్రసిద్ధికి కన్నులుకుట్టి, నాటి ప్రభుత్వము దీనిని నిషేధించినది కూడను.

హిందూ మహమ్మదీయ సమైక్యతను బోధించు మరియొక నాటకము 'నూర్జహాన్'[3]. మొగలాయీ చక్రవర్తి అక్బరు పుత్రుడగు జహంగీరు, అతని భార్య నూర్జహానులకు సంబంధించిన కథ యిందలి ఇతివృత్తము. 'వసంతసేన' యనునది మృచ్ఛకటికకు ప్రయోగ సౌలభ్యదృష్టితో చేయబడిన స్వేచ్ఛానువాదము. ఇందు క్రొత్త కల్పన లనేకములు కలవు.

సుబ్బారావుగారి నాటకములన్నింటను బహుళ ప్రచారమునందినది 'తారాశశాంకము'. శేషము వేంకటపతి ప్రబంధమున కిది సన్నిహిత నాటకీకరణము. "ఈ నాటకం ఇంత త్వరలో ఇంత బహుజనామోదాన్ని పొందడానికి కారణం ఏమనగా—దీన్ని ప్రదర్శించుటలో సామాజికులు చూపిన క్రొత్తదనం—అనగా, శ్రద్ధ, కట్టుబాటు, సమష్టిసహకారం, (team work), ఉచితరంగాలంకారాలు, అన్నింటికంటె ప్రశంసనీయమైనటువంటి క్రమశిక్షణ" అని సుబ్బారావుగారు పీఠికలో పేర్కొనుట గమనార్హము. 1943–44 నాటికి కిరాయినటుల నాటక ప్రదర్శనముల ఫలముగా తెలుగునాటక ప్రదర్శనస్థాయి పడిపోయినది—ఆ నటులయందొక పద్ధతి, నియమము, శిక్షణలేవు. అట్టివానికి ప్రతిగా శ్రీ రాజరాజేశ్వరీమండలి స్థాపకులగు

శ్రీ సూరిబాబు, శ్రీమతి రాజేశ్వరి ఈ నాటకమును చేపట్టి ప్రదర్శనము నొక శిల్పముగా సాధించుటలో కృతకృత్యులైనారు, (ప్రథమ ప్రదర్శనము 29-10-1944). ఆనాడిట్టి సమాజములలో చెప్పుకొనదగిన మరియొక సమాజము డి. వి. సుబ్బారావుగారి 'ఇండియన్ డ్రమటిక్ కంపెనీ'. వీరి నాటకప్రదర్శనములు పాశ్చాత్య దేశములందలి వృత్తి నట సంఘముల నాటకప్రదర్శనముల కెందును తీసిపోవునవికావని విజ్ఞుల యభిప్రాయము. స్త్రీపాత్ర లధికముగా గల 'స్త్రీసామ్రాజ్యము' సురభినాటకసమాజముద్వారా బహుళ ప్రసిద్ధినందినది.

కాలప్రభావమున కనుగుణముగా సుబ్బారావుగారుకూడ తమ నాటకములందు నీతిబోధ చేయించుటకు పూనుకొన్నారు. మరణసమయమున రోషనారా శివాజీ నుద్దేశించి పలికినపలుకులు, తారాశశాంకమునందలి బృహస్పతి చివరిపలుకులు మొదలగునవి ఇందుల కుదాహరణములు.

సుబ్బారావుగారి నాటకములన్నియును రంగస్థలమున విజయవంతములై జనాదరణమును చూరగొనియున్నవి. ఆ నాటకములవలన నటులు జనాదరణము పొందిరా, ఆ నటులవలన నాటకములు జనాదరణము పొందినవా అనెడి విషయమును నిర్ణయించి చెప్పుట కష్టము. మొత్తముమీద నటులయొక్కయు, నాటకకర్తయొక్కయు సమష్టికృషియే వీని విజయమునకు కారణమనుట సమంజసము. ఈ సందర్భమున ఒక సత్యమును పేర్కొనవలసియున్నది. స్థానంవారిని ఉత్తమనటులుగా తెలుగుదేశమునకు పరిచయము చేసినవారు సుబ్బారావుగారును, వారి రోషనారాయును.

## శ్రీ పింగళి నాగేంద్రరావు[4] :

కొప్పరపు సుబ్బారావుగారును, పింగళి నాగేంద్రరావుగారును సాహిత్య-ప్రదర్శన రీతులను మేళవించి నాటకరచన కావించినవారు. కొప్పరపువారి నాటకములను విజయవంతముగా ప్రదర్శించి ప్రసిద్ధి నొందించినవారు శ్రీయుతులు మాధవపెద్ది, స్థానం, సూరిబాబు, శ్రీమతి రాజేశ్వరి ప్రభృతులుకాగా పింగళివారి నాటకములను విజయవంతముగ ప్రదర్శించి ప్రసిద్ధి నొందించినవారు శ్రీయుతులు డి. వి. సుబ్బారావు, తోట వేంకటేశ్వరరావు ప్రభృతులు. రచయిత లిరువురును చక్కని ప్రయోక్తలుకాన తమ నాటకములను ప్రదర్శించు నటులను తామే సుశిక్షితులను చేసికొనియున్నారు.

1919 ప్రాంతముల నాగేంద్రరావుగారు కలకత్తాలో ద్విజేంద్రలాల్‌రాయ్‌గారు రచించిన 'మేవాడురాజ్యపతనము' అనెడి చారిత్రకనాటకప్రదర్శనమును తిలకించినారు. ఆ ప్రదర్శనమును, చారిత్రకనాటకములయందున్న సహజాభినివేశమును, స్వాతంత్ర్యోద్యమమును ప్రోత్సాహకములు కాగా నాగేంద్రరావుగారు 1922 లో 'మేవాడు రాజ్యపతనము'ను వచన నాటకముగా ఆంధ్రీకరించినారు. ద్విజేంద్రలాల్‌రాయ్ నాటకముల నాంధ్రీకరించిన ప్రథములు నాగేంద్రరావుగారు (అటుపిమ్మట వారే శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు). ఇండియన్ డ్రమాటిక్ కంపెనీవారు నాగేంద్రరావుగారి 'మేవాడురాజ్య పతనము'ను 1924 లో బందరులో ప్రదర్శించినారు. నాడు యువకనటులైన డి. వి. సుబ్బారావుగారు వృద్ధ సేనాపతి గోవిందసింగు పాత్రను అత్యద్భుత

ముగ నటించి, విద్యాధిక ప్రేక్షకలోకమునకు ఒక మహానటుని చూపించితిమన్న సంతృప్తి నొసంగినారు.

1923 లో డి. యల్. రాయ్‌గారి మరియొక నాటకమును 'పాషాణి' యనుపేర ఆంధ్రీకరించి కృష్ణాపత్రికలో ప్రకటించినారు. అంతటితో అనువాదములకు స్వస్తిచెప్పి, ఆ సంవత్సరమందే, డి. యల్. రాయ్‌గారి నాటక పద్ధతిలో 'జేబున్నిసా' అనెడి స్వతంత్ర నాటకమును రచించి కృష్ణాపత్రికలో ప్రచురించినారు. కాని, ఇది హిందూ-మహమ్మదీయ మత సామరస్యమునకు భంగము కలిగించుచున్నదని ఉమ్రాలీషా ప్రభృతులు లేవదీసిన ఆందోళనము వలన—కాదని శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రికలో మూడు సంపాదకీయములను వ్రాసినప్పటికిని—ప్రభుత్వమువారు దీని ప్రదర్శనమును నిషేధించిరి[5]. నటనకు పెక్కు అవకాశములుగల నాటకమిది.

ఇంతవరకును నాటకరచనలో ప్రయోగములు చేయుచున్న నాగేంద్రరావుగారు అంతవరకును గడించిన అనుభవమును పురస్కరించుకొని 1928 లో 'వింధ్యరాణి'ని వెలువరించినారు. డి. వి. సుబ్బారావుగారు వింధ్యరాజుగా, తోట వేంకటేశ్వరరావుగారు అవంతిగా ఈ నాటకము సుమారు పది సంవత్సరములపాటు తెలుగునాటకరంగమును పరిపాలించినదని చెప్పవచ్చును. ఆస్కార్ వైల్డ్ తన 'The Duchess of Padua' అనెడి నాటకమున ప్రపంచించిన స్వేచ్ఛాప్రణయ వాదమును సూత్రప్రాయముగా గ్రహించి నాగేంద్రరావుగారీ నాటకమును రచించినారు. వింధ్యరాణి ప్రదర్శనయోగ్యములైన నాటకములలో ఉత్తమమైనదని చెప్పవచ్చును,

వీరి తరువాతి నాటకము 'నారాజు'. ఇందలి కథ ముద్రారాక్షస కథను పోలియుండును. ఇందలి 'విశ్వపతి' రాక్షసమంత్రికి ప్రతినిధి. ఈ విశ్వపతి పాత్రసృష్టిలో నాగేంద్రరావుగారెంతటి ప్రతిభను చూపిరో తన్నిరూపణములో డి. వి. సుబ్బారావుగారును అంతటి ప్రతిభను చూపెడివారు. నాగేంద్రరావుగారు తెలుగు చారిత్రకగాథను స్వీకరించినది ఈఒక్క నాటకముననే. ఇది శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించినకథ,

"నారాజు" (1929) వ్రాసిన తరువాత ఇరువదియైదు సంవత్సరముల వరకును నాగేంద్రరావుగారు నాటక రచనకు పూనుకోలేదు. అప్పుడు వెలువడిన తొలి నాటకము 'ఒకే కుటుంబం' (1954-55); మలి నాటకము 'క్షాత్రహిందు' (1956). 'ఒకే కుటుంబం' ఒక్కటియే నాగేంద్రరావుగారి సాంఘికనాటకము. ఒక పద్యమును, ఒక పాటను తప్పించినచో తక్కినదంతయును వచనమే. 'లోకైక్యసాధనకు ఏకాత్మభావనే సుస్థిరప్రాతిపదిక' యనెడి సూత్రముపై నిర్మింపబడిన దీనాటకము. ప్రపంచమునందలి అన్ని రాజ్యములును కలసిమెలసి ఒకే కుటుంబము (వసుధైకకుటుంబము)గా జీవింపవలెనని ప్రబోధింపబడుచున్న కాలమిది. 'సమష్టి జీవనంలో వ్యక్తమౌతున్న ఈ విశిష్టలక్ష్యం వ్యష్టిజీవనంలోకూడ ఫలసిద్ధి పొందినప్పుడే దానికి సంపూర్ణ సార్థక్యం' అని వీరి విశ్వాసము. కోటికి పడగలెత్తవలయునని అణచుటకు వీలులేని కోర్కెలకు వశుడై, సునిశితముగా లోకప్రతారణమునకు నడుముగట్టిన

భర్త, ఆ భర్త ప్రతారణశీలమును సహింపక ఎదురు తిరిగి, దానిని వెల్లడిచేయ సమకట్టిన భార్య—ఈ ఇరువురి విచిత్రప్రకృతులే ఈ నాటకమునకు బీజము. ఈ విషయము నాటకాంతమునందే వెల్లడియగును. ఎక్కడనో కథను ప్రారంభించి ఒక్కొక్క ఘట్టములో ఆ సన్నివేశమునకు పోషకమగు ఒక నూతనమైన రహస్యమును వెల్లడిచేయుచు నిర్వహణాద్భుతముగా చక్కని నాటకీయ శిల్పమును చూపించినారిందులో నాగేంద్రరావుగారు. 'లోకహితమే లక్ష్యముగాగల పత్తేదారీతనమునకు ఆటపట్టు'గా కథను తుదివరకు నడిపించుట ఈ నాటకమునందలి మరియొక ప్రత్యేకత.

నాగేంద్రరావుగారి చివరి నాటకము 'క్షాత్రహిందు'. ఇది వీరి ఉత్తమనాటకము[6]. 'పృథ్వీరాజ్‌రాసో' అనెడి కావ్యము ఈ కథకు మూలము; దీని కర్త పృథ్వీరాజు మిత్రుడు చాందుభట్టు అని ప్రతీతి. ఈ కావ్యమును తమ నాటకమందు మలచుకొనుటలో నాగేంద్రరావుగారు చక్కని శిల్పచాతుర్యమును చూపినారు; ఉన్న పాత్రలను క్రొత్తరీతిని తీర్చి దిద్దినారు; లేని పాత్రలను సందర్భానుసారముగ, ఔచితీసహితముగ కల్పించినారు. చాందుభట్టు విషాద గీతములను నాందిగా గ్రహించుటలో రచయిత భావ్యర్థమును నిపుణముగా నిరూపించినారు.

భారతజాతీయతను రక్షించుటకు కంకణము కట్టుకొన్న యోధుడుగా పృథ్వీరాజును, తన వీరపూజకు పృథ్వీరాజును లక్ష్యముగా నిలుపుకొన్న వీరవనితనుగా సంయుక్తను చిత్రించినారు నాగేంద్రరావుగారు. అంతియేకాదు, మతాతీతమైన జాతీయతను ప్రబోధించుటనుకూడ గమనింపవచ్చును. 'సాటి మానవుణ్ణి బానిసభావంతో చూచే నైచ్యం ఈ దేశంలో ఎవరికీలేదు' అని చాందుభట్టు ప్రబోధించిన జాతీయ ధర్మమునకు ఆకృష్టుడైన కుతుబుద్దీన్, అనుకూలవతియైన అతని భార్య చంచరి, మహాయోధుడు కైమోష్, వీరందరి కంటెముఖ్యముగా చాందుభట్టు —ఈ పాత్రలు ఇందు ఔచితీసహితముగా, సజీవముగా చిత్రితములైనవి.

రచన యంతయును శిష్టవ్యావహారికములో సాగినది. అచ్చటచ్చట సందర్భోచితములగు కొలది తేటగీతులు కలవు. నాగేంద్రరావుగారిసన్నివేశ చిత్రణ నైపుణ్యము పరాకాష్ఠపొందినదీ నాటకమునందు. చారిత్రకాంశములను నామమాత్రముగా గ్రహించి, కథాకల్పనమునందు, పాత్రచిత్రణమునందు, సంవాదనిర్వహణమునందు నాగేంద్రరావుగారు అనల్పశిల్పనైపుణ్యమును చూపించియున్నారు. ఇది వీరి నాటకములన్నింటను ఇంచుమించుగా సమానధర్మమే. సాహిత్య గౌరవమును, ప్రదర్శనా సౌలభ్యమును ఇంతగా సాధించుకొన్ననాటకములు తెలుగులో కొలదిగామాత్రమే కలవు.

## నూతన ప్రయోగములు : రెండవదశ

నాటకరచనలో నూతన ప్రయోగములు రెండుదశలుగా జరిగినట్లు పేర్కొనియున్నాను. అందు మొదటి దశలో 1920 నుండి 1930 వరకును తెలుగు నాటకరంగమున జరిగిన నూతన ప్రయోగముల వైశిష్ట్యమును వివరించియున్నాను. ఇంక రెండవదశ 1935 నుండి 1944 వర

కును సాగినది. ఈ రెండుదశల మధ్యకాలమున (1930_35) నాటకరచనలో చెప్పుకొనదగిన మార్పుకాని, విశేషముకాని ఏమియునులేదు. ఇతఃపూర్వమున్న శతాధికములగు పౌరాణిక నాటకములవంటివే ఈ మధ్యకాలమునకూడ రచింపబడినవి.

ముందు రాబోవు మహోజ్జ్వలమగు 'నాటికాకాలమునకు' 1930 లో వెలువడిన పాకాల వేంకట రాజమన్నారుగారి 'తప్పెవరిది' బీజములు నాటినది. వీరిపై ప్రఖ్యాత పాశ్చాత్య నాటకకర్త అయిన ఇబ్సెన్ స్వభావవాద మధికముగా కలదు. వీరి ఈ ప్రథమ నాటిక 1930 లోనే వెలువడినను, 1935 తరువాతనే వారి ప్రభావ మితర నాటక కర్తలపై కన్పట్టగలదు. వీరినిగూర్చి తరువాతి అధ్యాయమందు వివరింతును.

ప్రథమ దశయందువలెనే ఈ రెండవ దశయందును ఐదు విధములుగా రచనా ప్రయోగములు జరిగినవి. భారతదేశభక్తి నాటకములకు బదులు ఆంధ్రదేశభక్తి నాటకములీ కాలమున బయలుదేరుట మాత్రము విశేషము.

## ఆంధ్రోద్యమము :

బంగాళారాష్ట్ర విభజనమునకు వ్యతిరేకముగ జరిగిన ఉద్యమములో 'ఒకే భాష మాటాడు ప్రజలకు ఒకే రాష్ట్రము ఉండవలెను' అనెడి నినాదము అంతర్గర్భితమై యున్నది. ఆ ఉద్యమమునకు ఆంధ్రులుకూడ మద్దతు నిచ్చియున్నారు. తత్ఫలముగా 1911 లో బెంగాలు, అస్సామ్, బీహారు రాష్ట్రములు భాషాప్రయుక్త రాష్ట్రములుగా అవతరించినవి. అంతటితో ప్రత్యేకాంధ్ర రాష్ట్రవాంఛ ఆంధ్రులలో అంకురించి ప్రబలసాగినది. 'ఆంధ్రుల వ్యక్తిత్వమును, ఆత్మగౌరవమును పునః ప్రతిష్ఠించుటకును, యావదాంధ్ర జాతియొక్క ఆంధ్ర భాషయొక్క అభ్యున్నతి కొరకును ఆంధ్రరాష్ట్ర సంపాదనము కొరకు, ఆంధ్ర విశ్వ విద్యాలయ స్థాపనము కొరకు కృషిచేయు నిమిత్తము మే 1913 లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగెను. అప్పటినుండి జరిగిన ఉద్యమఫలముగా 1918 లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఏర్పడినది. ఆంధ్రోద్యమము ప్రజలలో బాగుగా వ్యాపించినది. ఆ ఉద్యమ ప్రభావము నాటక కర్తలపై కూడ పడినది.

ఆంధ్రోద్యమ సమస్యపై వెలువడిన ప్రథమనాటకము గ్రంథి వేంకట సుబ్బరాయ గుప్తగారి 'ఆంధ్రమాత'. ఇది ఆంధ్రమహాసభల ప్రారంభదశలోనే రచింపబడినది. కాని 1921 లో మరికొన్ని అంశములు క్రొత్తగా చేర్చి దీనిని ప్రకటించినారు. ఇతివృత్తము కల్పిత మైనది. పద్య-గద్య సమన్వితమై ప్రాబంధికశైలిలో వ్రాయబడిన నాటకమిది[1]. రాజకీయ సంబంధి ఖిలాఫతు ఉద్యమాదులేకాక విధవా కేశఖండనాది పెక్కు సాంఘిక సమస్యలుకూడ ఇందు చర్చింపబడినవి. 1921 లోనే ద్రోణంరాజు సీతారామారావుగారి 'ఆంధ్రపతాకము' కూడ వెలువడినది.

ఆంధ్రోద్యమము 1913 లోనే ప్రారంభమైనను 1920 లో ప్రారంభమైన గాంధీజీ జాతీయోద్యమములో, ఈ యుద్యమము మూలబడిపోయినది. ముందు స్వరాజ్యము, అటు

పిమ్మట స్వరాష్ట్రమనెడి దీక్షతో ఆంధ్రులు పనిజేయసాగిరి. కాని, రెండును కనుచూపు మేరలో కన్పట్టలేదు. ఇంతలో 1935 లో ఒరిస్సారాష్ట్ర మేర్పడినది. దీనితో మరల ఆంధ్రులు కనులు విప్పినారు. ఒకప్రక్క కవుల ఆంధ్ర ప్రశస్తులు (శ్రీయుతులు రాయప్రోలు, విశ్వనాథ ప్రభృతులచే) పునరుద్ధరితములగుచుండగా ఇంకొకప్రక్క నాటకరచయితలు ప్రబోధాత్మకము లగు నాటకములను రచింపసాగిరి. దేశభక్తి నాటకములందువలెనే ఈ నాటకములందును ఆంధ్ర మాత వందనము, పూర్వౌన్నత్య ప్రశస్తి, ఇరువురు ఆంధ్రరాష్ట్ర భక్తులు ఆనాటి ఆంధ్రమహా సభల విశేషములను చర్చించుట వంటివి కన్పట్టగలవు. గుళ్ళపల్లి నారాయణమూర్తిగారి 'ఆంధ్ర జ్యోతి', కవులూరు హనుమంతరావుగారి 'ఆంధ్రపతాకము', మల్లపాక రామశాస్త్రిగారి 'ఆంధ్రమహానాటకము' మొదలగునవి ఆంధ్రోద్యమమునకు సంబంధించిన నాటకములు.

హనుమంతరావుగారు ప్రత్యేకాంధ్రరాష్ట్ర సమస్యనే ఇతివృత్తముగా స్వీకరించి 'ఆంధ్రపతాకము (ముద్రణ-1939) ను రచించియున్నారు. ఆంధ్రరాష్ట్రోద్యమ చరిత్ర సర్వ మిందున్నది. ఈ జాతినాటకములన్నింటను ఉత్తమమైనది 'ఆంధ్రజ్యోతి' (1941). గుళ్ళపల్లి వారు దేశభక్తులై, స్వాతంత్ర్య సమరమున ప్రశంసనీయమగు పాత్రను నిర్వహించినవారు. వారి ఆంధ్రదేశాభిమానము, స్వరాష్ట్రగాఢవాంఛ 'ఆంధ్రజ్యోతి'లో సర్వత్ర కన్పట్టగలవు. ఇది సంప్రదాయమార్గమున నడచిన రచన.

ఇట్లు కొందరు రాష్ట్రోద్యమమునే అవలంబముగా చేసికొని నాటకములు రచింపగా మరికొందరు ప్రాచీనాంధ్ర మహావీరుల, రాజ్యముల చరిత్రలను స్వీకరించి నాటకములు వ్రాయ సాగిరి. స్వాతంత్ర్య సమరోత్తేజనము కొరకు నాటిరచయితలు శివాజీ, పృథ్వీరాజు ప్రభృతుల గాథలను స్వీకరించినట్లే, ఈనాటి రచయితలు కాకతీయరాజులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు మొదలగువారి గాథలను స్వీకరించి రచనలు చేసియున్నారు. పోతుకుచ్చి సుబ్బయ్యగారి 'ఆంధ్రవాణీ సామ్రాజ్యము (అను) శ్రీకృష్ణదేవరాయలు', దూపాటి కొండమాచార్యులవారి 'ఆంధ్రవిజయము', రాజా వేంకటాద్ర్యప్పారావుగారి 'ఆంధ్రవీరలక్ష్మీ విజయము', నండూరి బంగారయ్యగారి 'ఆంధ్రతేజము' మున్నగునవి ఇట్టి నాటకముల కుదాహరణములు.

ఈ నాటకములందు నండూరివారి 'ఆంధ్రతేజము' (రచన-1938) ప్రశస్తమైన రచన. కొండవీటి సీమకును, రాచకొండకును మధ్య వివాదమునకు కారణమైన 'ధరణికోట' గాథ ఈ నాటకమున కితివృత్తము (ఈ పేరుతో సోమరాజు రామానుజరావుగారొక నాటకమును వ్రాసి యున్నారు). ఆంధ్రదేశ సమైక్యతకు తెలుగువీరులు చేసిన కృషి, దాని ఫలితములనుండి మనము నేర్చుకొనవలసిన గుణపాఠములను ప్రదర్శించుటయే ఈ నాటక రచనోద్దేశము. అటు కాకతీయసామ్రాజ్య మంతరించి, యిటు విజయనగర సామ్రాజ్యమింకను ఉదయింపని యుగసంధికాలమునందలి అరుణరేఖలలో సనాతన ధర్మరక్షణమునకయి యాంధ్రుడు పడిన తహతహను ప్రత్యక్షపరచుటకూడ ఈ నాటకము తలపెట్టిన ప్రధానాశయము. "సమకాలిక జీవితము కొంత వ్యంగ్యమర్యాదగా ఇందు ప్రతిబింబించుచున్నను, అనాదినుండి నేటికిని

దేదీప్యమానముగ వెలుగుచున్న ఆంధ్రతేజమునకు శాశ్వతమైన సాహిత్యదేవాలయమును నిర్మించుటే నా ప్రధానాశయ"మని బంగారయ్యగారు సుదీర్ఘమగు పీఠికలో స్పష్టము చేసి యున్నారు. మరియు "యావద్భారతవర్ష చరిత్రమున నాత్మానుసంధాన మొనర్చి దానికి శాఖయగు నాంధ్రుల చరిత్రలో నాత్మానుసంధానమొనర్చి, దానికి ఉపశాఖయగు నీ రెడ్డిరాజులయుగమును ఆత్మప్రధానముగ చిత్రించుట కీ నాటకమున కృషి జరిగినది" అనియు వారు పేర్కొనుట గమనార్హము[2].

ఇది రంగస్థలమునకూడ విజయమందిన రచన. 22-1-1950 తేదీనాటి ప్రదర్శనమున నటపితామహులనదగిన డా. గిడుగు వేంకట సీతాపతిగారుకూడ పాల్గొని ప్రశంసనీయముగ నటించియున్నారు.

ఈ కాలమునకూడ జాతీయ స్వాతంత్ర్య సమరోత్తేజకములగు రచనలు మరికొన్ని బయలుదేరినవి. కోటమర్తి చినరఘుపతిగారి 'చితోడు విజయము' మొదలగునవి ఇందుల కుదాహరణము. స్వాతంత్ర్యసమర చరిత్రను 'అభినవభారత సమర' మనుపేర ఎమ్. ఎస్. ఎన్. శర్మగారు నాటకీకరించియున్నారు.

## సంఘ సమస్యలు :

ఈ దశలోని సాంఘిక నాటకములలో హరిజనసమస్య, వివాహసమస్య, స్త్రీ స్వాతంత్ర్యసమస్య మొదలగునవి ప్రాధాన్యమును వహించినవి.

ఈ కాలమున అంటరానితనమును మంటకలుపవలయుననెడి నినాదముతో వ్రాయబడిన నాటకములు చాల కలవు—ఎ. నీలకంఠశాస్త్రిగారి 'హరిజనుడు', ధర్మవరం గోపాలాచార్యుల వారి 'అస్పృశ్య విజయము లేదా ప్రేమచంద్రయోగి' మొదలగు నాటకము లిట్టివి. 'హరిజనుడు'లో భగవంతుడు రాత్రివేళ, హరిజనుని దేవాలయమునకు తీసికొనిపోవుట చిత్రితమైనది. ఈ కాలముననే పరోక్షముగా హరిజనుల గొప్పతనమునుగూర్చి వివరించెడి 'నందనారు' చరిత్రమును పలువురు నాటకీకరించిరి. పుట్టుకలో మాలపాలేరు అయ్యును, భక్త్యావేశమున భగవత్సాన్నిధ్యమును పొందగలిగిన మహాభక్తుని జీవిత చరిత్ర యిది. పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు ఈ సమస్యను హరిజన సమస్యతోనే ముడిపెట్టిరి. నందనారు నాటకములతో ఓరుగంటి కృష్ణకౌండిన్యుడుగారి 'శ్రీ నందనారు చరితము' (1933) ప్రశస్తమైనది. దీనికి విపులమైన పీఠికను వెలయించిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు రచయితనుగూర్చి చేసిన ప్రశంస సమంజసమైనది. దామరాజువారి 'విలాస్ విహార్'లో ఈ హరజన సమస్యకు కూడ ప్రాధాన్యము కలదు. ఇప్పట్ల తాండ్ర సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పతితపావన (1936), మునిమాణిక్యం నరసింహారావుగారి 'తిరుగుబాటు' (1938) పేర్కొనదగినవి. పతితపావన కాల్పనిక నాటకము. తిరుగుబాటు కేవలము వచననాటకము. తిరుగుబాటు తీవ్రభావోపేతమయిన దగుటచేతను, ప్రతీకారవాంఛాసహితమైనదగుటచేతను నాడు ప్రభుత్వమువారి నిషేధాజ్ఞకు గురియైనదికూడను.

ఇంక వివాహ సమస్యలలో వర్ణాంతర-మతాంతర వివాహములు, ప్రేమ వివాహములు, విధవా వివాహములు, దేవదాసీ సమస్య మొదలగునవి నాటకములకు ఇతివృత్తము లైనవి. కోపల్లి వేంకట రమణారావుగారిట్టి సమస్యలను తమ నాటకములందు చిత్రీకరించియున్నను వారు తాము గ్రహించిన సమస్యలకు న్యాయ్యము చేకూర్పలేదని చెప్పవలసియున్నది. 'ఇతడు-ఈమె' అనెడి పేరుతో సి. వేంకటరామశాస్త్రిగారు రచించిన నాటకమున విధవా వివాహ సమస్య ప్రధానము. చేకుమళ్ళ కామేశ్వరరావుగారి 'కోపదారి మొగుడు'లో స్త్రీ స్వాతంత్ర్యము, విధవా వివాహము ప్రధానసమస్యలైనవి.

వివాహసమస్యలకు సంబంధించిన నాటకములలో బళ్ళారి రాఘవాచార్యులుగారి 'సరిపడని సంగతులు (Facts Unpleasant-1933), పి. వి. రంగారామ్‌గారి 'దంపతులు' (1931), మల్లాది అవధానిగారి 'గాలివాన' (1938) అనువానినికూడ పేర్కొనవలసియున్నది. ఈ మూడును వచన నాటకములే. రాఘవాచార్యులుగారు విధవా వివాహములను ప్రోత్సహించుటయే కాక, విధవలైన యువతులు తమ అజ్ఞానముచేత తప్పుత్రోవలు త్రొక్కినప్పుడు పెద్దలు వారిని క్షమించి, సన్మార్గగాములను చేయవలయునని స్పష్టము చేసియున్నారు. ఇందు భీమసేనరావుగారనెడి వకీలు తమ అక్క కుమార్తెయగు తారయను విధవను తన పంచనుజేర్చి, ఆమె అజ్ఞాన వశమున తనకు లోబడి గర్భవతి కాగా, భీమసేనరావుగారి కుమారుడే ఆమె అజ్ఞానకృత దోషమును క్షమించి, ఆమెను వివాహమాడ నిశ్చయించుకొనెను. ఇట్టి నాటకములు కేవలము పాశ్చాత్య సంస్కృతీ ప్రేరకములనీ ప్రత్యేకించి చెప్పవలసిన అవసరములేదు. చలంగారి రచనలుకూడ ఈ తరగతికి చెందినవే. ఇంక 'దంపతులు'లోని ఇతివృత్తము ఆదర్శప్రేమకు సంబంధించియున్నది. స్త్రీ పురుషులు పరస్పరము ప్రేమించి వివాహము చేసికొన్నప్పుడే అది ఆదర్శప్రేమ కాగలదని ఇందు రంగారామ్‌గారు చిత్రించియున్నారు. 'గాలివాన'లో స్త్రీ ఆర్థికముగా స్వాతంత్ర్యమును కలిగియుండుట ఆవశ్యకమను విషయము చిత్రితమైనది. ఆర్థిక స్వాతంత్ర్యమున్నప్పుడే సమాజములో స్త్రీకి అర్హస్థానము లభింపగలదని అవధానిగారి ఆశయము. ఈ గాలివాన నాడు నిజముగా పెద్ద గాలివాననే సృష్టించినది—కొందరు దీనిని నూతన భావములుగల గొప్ప రచనయని ప్రశంసింపగా, మరికొందరు ఘోరమగు రచనయని తెగడియున్నారు. అవధానిగారు Philosophy అను పేర నాటకాంతమందు తమ ఆశయములను వివరించియున్నారు.

పి. వి. రాజమన్నారుగారు, రంగారామ్‌గారు, కె. వి. గోపాలస్వామిగారు—ఈ ముప్వురును సన్నిహిత స్నేహితులు. తెలుగుదేశమున ఇబ్సెన్ ప్రభావమునకులోనైన ప్రథములు వీరు ముప్వురే. మొదటి ఇరువురును నాటకకర్తలుకాగా, చివరివారు ప్రయోక్తలు మాత్రమే అయినారు. రాజమన్నారుగారు స్త్రీ సమస్యను ప్రధానముగా చేసికొని పెక్కు నాటికలను, ఏకాంకికలను రచించి ప్రకటించినారు. వానిని ప్రదర్శించి, ప్రచారము చేసినవారు బళ్ళారి రాఘవాచార్యులుగారు. వీరిరువురును కలిసి 'తెగని సమస్య' అనెడి నాటకమును వ్రాసియున్నారు (ఇది అముద్రితము). ఇందు ప్రేమలేని పెండ్లి వినాశకారణమగునని నిరూపిత

మైనది. నిజమైన ప్రేమ ఎంతటి త్యాగమునకయినను సంసిద్ధమేయని నిరూపించుచు రావు వేంకట మహీపతి గంగాధర రామారావు (పిఠాపురం యువరాజా) గారు 'ఆలోకంనుండి ఆహ్వానం' అనెడి నాటకమును 1938 లో ప్రకటించినారు. ఇందు నూత్నభావములతో, వినూత్న ప్రపంచసృష్టికి ప్రయత్నము జరిగినది. వీరి శైలిలో ఒక విశిష్టత కలదు.

దేవదాసీ సమస్యను ఇతివృత్తముగా గ్రహించి కే. కృష్ణారావుగారు 'మంచివాళ్ళెవరు' అనెడి నాటకమును రచించినారు. ఈ సమస్యనే చేపట్టి రాజమన్నారుగారు 'మనోరమ' వంటి కళాత్మకములగు రచనలను చేసియున్నారు.

సాంప్రదాయకములగు మతభావములను నిరసించి, వ్యాఖ్యానించెడి నాటకములు—ఖూనీ, అశోకం మొదలగునవి—ఈ దశలోనే వెలువడినవి. ఇట్టి వ్యాఖ్యానముల కోవకు చెందినదే నోరి నరసింహశాస్త్రిగారి 'సోమనాథ విజయము'. ఇట్టి రచనలకు ప్రతిగా మరికొన్ని రచనలు ఈ కాలమున వెలువడినవి—సాంప్రదాయక జీవన విధానములను సంరక్షించు నుద్దేశ్యముతో వ్రాయబడిన నాటకములివి. కాళ్ళకూరి హనుమంతరావుగారి కాలేజిగరల్ (1933), లేడీడాక్టరు (1935), దామరాజువారి 'మిస్ విహార్', యమ్. నీలాద్రిగారి రిస్టువాచీ మొదలగు నాటకములు మతాంతర వివాహములు, విడాకులు, స్వేచ్ఛాప్రణయము, రజస్వలా వివాహము మొదలగువానిని నిరసించుచున్నవి.

ఈ కాలమున వెలువడిన మరికొన్ని సాంఘిక నాటకములు—ఉమ్రాలీషాగారి ఎక్స్ కాలేజీ గరల్ నాటకము (1935), కవటాల జయరామారావుగారి ప్రేమకుమారి (విషాదనాటకము–1935), మారిశెట్టి సత్యనారాయణగారి బీదవిద్యార్థి, బి. ఏ (1939), గాలి బాలసుందర రావుగారి అపోహ (1936) మొదలగునవి. జొన్నలగడ్డ మృత్యుంజయశర్మగారి 'చింతామణి' (1936) కూడ పరిశీలింపదగినది.

ఈ కాలమున పాశ్చాత్య సంప్రదాయమువలన ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ప్రభావితులైన వారిలో పలువురు మన మత–సంప్రదాయములకు క్రొత్తక్రొత్త వ్యాఖ్యానములు చేసి సాంఘిక విప్లవమును తెచ్చుటకు ప్రయత్నించిరి. ఆ ప్రయత్నములవలన వారు సంఘము నెంతగా సంస్కరించిరను విషయము సందిగ్ధమైనను కళాత్మకములైన నాటకములను వెలయించుటలోమాత్రము చాలమంది కృత్యులు కాలేకపోయిరనుట అసమంజసము కాజాలదు.

ఆర్థికమైన అసమానత్వమును, రైతు–కూలీ సమస్యలను చేపట్టి వెలువడిన నాటకములు కూడ ఈ కాలమున కొన్ని గలవు. ఇట్టివానికి మూలకందము శ్రీ దువ్వూరివారి 'కృషీవలుడు' కావ్యము (1919). సి. సత్యనారాయణరావుగారి 'స్వేచ్ఛాజీవులు' (1937) లో రైతు జీవితము చక్కగా చిత్రితమైనది; ఇట్టిదే సబ్నవీసు రామారావుగారి "రైతుబిడ్డ" (1939). ఇందు గ్రామీణ జీవిత విధానము చక్కగా చిత్రితమైనది; చక్కని వాడుకభాష ప్రయుక్తమైనది. ఈ కాలమునకు చెందిన ఎమ్. పరంధామయ్యగారి 'వీరయువకుడు'లో ధనిక–పేద వర్గములవారి

సమస్య చిత్రితమైనది. మంథా సూర్యనారాయణగారి 'కృషీవల విజయము' (1935), శేషాద్రి శర్మగారి 'హాలికోద్ధారము' (1935) మొదలగునవి ప్రదర్శనసౌలభ్యముకల ప్రచార నాటకములు.

## సాహిత్యదృష్టి :

ఇంతకుముందు, సాహిత్యదృష్టితో రచింపబడిన రూపకములలో 'నాటకరూపము' (dramatic form) నకు ఎక్కువ ఆధిక్యము కలదు. నాడు 'నర్తనశాల', 'కుంభరాణా' వంటి నాటకములందు కథా సంవిధాన-పాత్రపోషణ విధానములు ముఖ్యములుకాగా, 'శబరి' వంటి నాటకములలో భావ వ్యక్తీకరణము మాత్రమే ముఖ్యమైనది. ఇంక ఈ రెండవదశ యందలి సాహిత్య ప్రధానములైన రచనలలో పెక్కింటియందు నాటకరూపమునకుకాక నాటక వస్తువునకు ప్రాధాన్యము కన్పట్టగలదు. వస్తుభేదమునుబట్టి ఈ రూపకములు చారిత్రక ములు లేదా తత్తుల్యములు, జీవిత చిత్రణములు, సమస్యా చిత్రణములు అగుచున్నవి. ఇందు పెక్కు పఠనీయ రూపకములు మాత్రమే (study plays).

ఈ రెండవ దశలో సాహిత్యరూపకములను రచించిన వారిలో శ్రీయుతులు కాళ్ళ కూరి గోపాలరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (1891 - 1961), శిరోమణి చలమచర్ల రంగాచార్యులు ప్రభృతులు ఎన్నదగినవారు. వీరి రచనలు సంఖ్యలో స్వల్పములే అయ్యును, గుణమునందు అధికములేయని చెప్పవచ్చును. ఈ రచనలందు వీరు స్వీయాభిప్రాయప్రపంచన మునకు ప్రాముఖ్య మొసంగుటయు గమనింపగలము.

కాళ్ళకూరి గోపాలరావుగారి వాల్మీకి 1935 లో వెలువడినది, నాయకుడు జన్మతః బ్రాహ్మణుడు. కాని, కులభ్రష్టుడై, తస్కరనాయకుడై నానా పాపకార్యములాచరించి, పశ్చాత్తప్తుడై చివరకు వాల్మీకి మహర్షియగుట ఇందు ఉత్తమముగా చిత్రితమైనది. తరువాతి కాలములో వెలువడిన మన స్తత్త్వనిరూపక రూపకములకు ఇది మార్గదర్శకమైనదన్నచో అతిశయోక్తికాజాలదు. ఇందు పాత్రోచితభాష చక్కగా ప్రయుక్తమైనది.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాటకములు రెండును—నిగళ బంధనము (1935), రాజరాజు (1944)—ప్రదర్శనమునకు అంతగా అనుకూలములుకావు. రంగములు చిన్నవై బహుళముగా నున్నవి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ఆంధ్రాభిమాన మెక్కువ. తెలుగుదేశము, తెలుగు ప్రజలు, తెలుగు కవులు, తెలుగురాజులు, తెలుగు స్త్రీలు—అంతటను వారికి ఏదో యొక ప్రత్యేకత కన్పట్టుచునే యుండును. అందుచేతనే వారు తెలుగు కథలనే స్వీకరించి, పై నాటకములను రచించినారు. రాజాస్థానములందు పదవులకై జరిగెడి అంతర్యుద్ధములు ప్రాతి పదికగా శ్రీకృష్ణరాయల జీవితాంశములపై నిర్మితమైన రచన "నిగళబంధనము". ఇందు తిమ్మరుసయ్యగారి భార్య "లక్ష్మమ్మ" పాత్ర శాస్త్రిగారి ప్రత్యేక సృష్టి. ఈమె కృష్ణరాయల తల్లి నాగమ్మకు సహాయపడినది. కృష్ణరాయల విజయముతో నాటక మంతమగుచున్నది.

కథాంశములు చారిత్రకములైనను కాకున్నను, ఇందు ప్రతిపాత్రయును చక్కగాపోషింపబడెను. కథయందు వేగమెక్కువ.

ఇంక రాజరాజునందలి కథ సారంగధర కథయే. సారంగధర కథను విశిష్టముగా నాటకీకరించిన నలువురిలో వీరు చివరివారు. (మొదటి మువ్వురు శ్రీయుతులు ధర్మవరము, కాళ్ళకూరి, చలంగార్లు). వీరు నలువురును నాలుగు రకములుగా కల్పనలుచేసినను మొత్తము మీద అందరును రాజరాజు (ఇది కల్పిత పాత్రయేయైనను) కామప్రవృత్తిని, అతని దౌష్ట్యమును చిత్రించియున్నారు. శ్రీపాదవారు కాళ్ళకూరివారిని కొంతవరకు అనుసరించి, తప్పిదమును మంత్రులలో నొకడైన మహారుద్రయ్య మీదను నెట్టివేసినారు. ఇరువురు రచయితలును ఈ మంత్రులను కొంతవరకు "ఒథెల్లో" యందలి ఇయాగో పద్ధతిలో చిత్రించియున్నారు. వీరిది కేవలము 'ప్రయోజనములేని దుష్టత్వము' కాకున్నను, వీరు తమ కార్యసిద్ధికై చేయు కుతంత్రము లన్నియును ఇయాగో చేష్టలను మరపింపగలవు.

తన రాజు కామావేశమున, అధర్మపరుడై కోడలుకావలసిన స్త్రీని, భార్యనుగా చేసికొన్న కారణమున వాని సేవగించుకొని ధర్మప్రబోధాత్మకమగు భారతరచన కాతడు కృతిపతి కాగల యర్హతను కోల్పోయెనని తలంచి నన్నయ భారతరచన యాపివేసెనని శ్రీపాదవారిం దొక విశేష వ్యాఖ్యానము చేసినారు. ఇందు చిత్రాంగీ–సారంగధరులకంటె రాజరాజుపాత్ర ప్రముఖమగుటచేత దీనికి "రాజరాజు" అను పేరు సార్థకముగా పెట్టబడినది. ఇంక నన్నయగారి పాత్ర చిత్రణము శ్రీపాదవారి స్వీయసృష్టి, అది వారి కళానైపుణ్యమునకొక నిదర్శనము. "ఇలా వాగనుశాసనుని ధర్మజ్యోతితో ధగధగలాడుతూ కవిసమ్రాట్టు మెప్పూ, సాహిత్య సమ్రాట్టు ఆదరమూ సంపాదించుకున్న నా రాజరాజు నాటకం, నిజంగా, నారచలన్నింటికీ తలమానికం అయినది" అని వారు చెప్పుకొనుట గమనార్హము[3].

శ్రీపాదవారి రచనలలో కథాగమన వేగము, శైలి—రెండును పెనవేసికొనిపోవును. (అసలు ఆ వేగమునకు వారి శైలిలోని విశిష్టతయే కారణమని చెప్పవచ్చును). కేవలము తెలుగుదనము, తెలుగు నుడికారపుసొంపు వారికి ఉగ్గుపాలతో బెట్టిన విద్యలు. ఆంగ్లభాషా పరిచయము లేకపోవుట వారి తెలుగుదనమునకు మరింత వన్నె చేకూర్చినది. తెలుగుపదముల కూర్పు, అందలి వాస్తవికత వారి రచనల కంత వేగమును, అంత నిండుదనమును కూర్చినవి.

ప్రత్యేకమగు శైలిని సాధించుకున్న నేటి తెలుగు రచయితలను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. అందు శ్రీయుతులు విశ్వనాథ, చలం, శ్రీపాదలు ప్రథమశ్రేణికి చెందినవారగుదురు. గోదావరీతీరమునందలి పల్లెటూళ్ళలోని వైదిక బ్రాహ్మణుల శిష్టవ్యావహారికము శ్రీపాదవారిలో తొణికిసలాడుచుండును. ఈ శైలిలోని నిండుదనము వారి పాత్రలలోకూడ కన్పట్టగలదు.

శిరోమణి చలమచర్ల రంగాచార్యులవారి ఏకైక నాటకము 'హాలికుడు' (రచన–1940). తన కావ్యకన్యకను "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి, యప్పడుపుగూడు భుజించుటకన్న

సత్కవుల్ హాలికులైననేమి" అన్న దీక్షతో ఒక ప్రక్క కవితా వ్యవసాయమును, ఇంకొక ప్రక్క అసలు వ్యవసాయమును సాగించి హాలికుడుగా బ్రతికిన పోతన్నగారి చరిత్ర చిత్రణమీ నాటకము. కాగా, ఈ నాటకమునకు హాలికుడు అన్న పేరు సార్థకమగుచున్నది. ఇందు పోతన జీవితమునందలి సంఘటనల నన్నింటిని ఒక క్రమములోకూర్చి, అవసరమైన కొన్ని చిన్న పాత్రలను[4] కల్పించుకొనినారు రంగాచార్యులుగారు. శ్రీనాథ పోతనల భిన్న ప్రకృతులను వీరు మనోహరముగా సమన్వయించి, ఈ నాటకాదర్శమున ప్రతిఫలింపజేసినారు. చివర, సింగ భూపాలుడు పశ్చాత్తప్తుడైనట్టి సన్నివేశమును రమ్యముగ పోషించినారు రంగాచార్యులుగారు.

### ప్రయోగ సౌలభ్యము :

1935 ప్రాంతములకే దేశమున కంట్రాక్టునాటకముల ప్రాముఖ్యము పెరిగినది. దానితోపాటు నాటకములను ప్రదర్శించుటలో నిర్లక్ష్యము, అనైక్యముకూడ పెంపొందినవి. ఇందులకు వ్యతిరేకముగ సాగిన ఉద్యమమునందు క్రొత్తనాటకముల రచనలు, వాని ప్రయోగము ముఖ్యమైనవి. ఇంతకుముందు కాలమునకూడ, ఇట్టి ఉద్యమమునందు కృతకృత్యులైన రచయితలను, నటులను పేర్కొనియే యున్నాను. ఈ రెండవదశయందు ప్రయోగదృష్టితో నూతన ప్రయోగములను చేసినవారిలో శ్రీయుతులు గుండిమెడ వేంకట సుబ్బారావు, నండూరి బంగారయ్య, వేలూరి చంద్రశేఖరము, వింజమూరి శివరామారావు ప్రభృతులు ముఖ్యులు. ప్రయోగసౌలభ్యముకల రచనలను చేయవలెననెడి ధ్యేయమే వీరియందుకల సామాన్యలక్షణము.

గుండిమెడ వేంకటసుబ్బారావు[5]గారికిని, పింగళి నాగేంద్రరావుగారికిని కొన్ని పోలికలు కలవు. చారిత్రక నాటకరచన, ప్రయోగసౌలభ్యసాధన—అనునవి రెండును ఇరువురికి ప్రీతిపాత్రములు. ఇరువురును, చిన్నతనమునుండియు హృదయములందు పొంగుచున్న దేశభక్తికారణముగా చారిత్రకనాటకములను చేపట్టినవారు. పింగళివారు ఒకేఒక సాంఘిక నాటకమును వ్రాయగా, గుండిమెడవారు ఒకేఒక పౌరాణిక నాటకమును వ్రాసినారు.

అక్బరు-ఔరంగజేబులకాలములో స్వరాజ్య-స్వమతరక్షణార్థము ప్రతాపసింహాది రాజపుత్రులు సలిపిన స్వాతంత్ర్యసమరము ఈనాటకముల కితివృత్తమైనది. కథాకథనమునందును, సన్నివేశసంవిధానమందును సుబ్బారావుగారి ప్రజ్ఞ పేర్కొనదగియున్నది. చారిత్రకాంశములనే అధికముగా గ్రహించినను, తన్నిర్వహణమందు స్వీయకల్పనలకుకూడ ప్రాముఖ్యమొసంగియున్నారు. సన్నివేశ కల్పనమందేకాక, దానిని తుదివరకును జిగితగ్గకుండ నిర్వహించుటలో సుబ్బారావుగారిది అందెవేసినచేయి. ముఖ్యముగా ప్రేక్షకుల మనస్సులను ఆకర్షించి, చివరివరకును వారి ఉత్సుకతను ఆకట్టుకొనగలశక్తి వీరి నాటకములన్నింటను కలదు. 'రాణాప్రతాప్', 'దుర్గాదాస్' కథలవంటి కథలను స్వీకరించి ఇతరభాషలలో ద్విజేంద్రలాల్‌రాయ్ ప్రభృతులును, తెలుగులో ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ ప్రభృతులును నాటకములను రచించియున్నారు. సుబ్బారావుగారు వారినెవ్వరిని యనుకరింపక, స్వీయకల్పనాశక్తినే వెలయించిరి. వీరి నాటకములన్నింటను 'ఖిల్జీరాజ్యపతనము' మిక్కిలి ప్రఖ్యాతికాంచినది. అల్లాఉద్దీన్‌ఖిల్జీ అనంతరము

ఖిల్జీరాజ్యము నశించుట ఇందలి వస్తువు. అల్లాఉద్దీన్‌ఖిల్జీ గుజరాతును జయించి, ఆదేశపు రాణిని చెరపట్టెను. ఆమె అతనిపై కక్షతీర్చుకొనుటకు యుక్తిపన్నగా, కామాంధుడైన అల్లాఉద్దీన్ అందు చిక్కుకొని, తన్మూలమున సపుత్రకముగా మడియుట యిందు రమణీయముగా చిత్రితమైనది. ఇందు అల్లాఉద్దీన్ పుత్రుడగు ఖజీర్‌పాత్రను సుబ్బారావుగారేధరించి ప్రశంసనీయముగ నిర్వహించెడివారట.

వీరి 'పృథ్వీపుత్రి' ఉత్తరరామచరితకు స్వేచ్ఛానుకరణము. వీరి చారిత్రకనాటకములన్నియును విషాదాంతములు. వీరి శైలియును, శిల్పమును ఈ నాటకములకు చక్కగా సరిపోయినది. 'రాణాప్రతాప్'లోని చివరిఘట్టము (రాణాప్రతాప్ మరణము) వంటివాని నిర్వహణములో సుబ్బారావుగారి శక్తి ప్రస్ఫుటముగా గోచరింపగలదు.

ప్రదర్శనసౌలభ్యముతోపాటు, సాహిత్యగౌరవమునుగల రచనలు చేసిన గుండిమెడ వేంకటసుబ్బారావుగారు ప్రశంసనీయులు.

ఈసందర్భమున 1939 లో వెలువడిన వేలూరి చంద్రశేఖరముగారి 'కాంచనమాల'ను పేర్కొనవలసియున్నది. అశోకుని భార్యయగు తిష్యరక్షిత సవతికుమారుడగు కుణాలుని ప్రేమించి, తిరస్కృతయై, పగబట్టి, అతని కనులను పీకించివేసిన విషాదగాథ ఇందు చిత్రితమైనది. నిబిడబంధముతో రూపొందింపబడిన ఈనాటకము ముద్రింపబడుటకుముందే 1938 లో బందరులో ప్రదర్శింపబడి తెలుగునాటకప్రయోగమందు ఒక నూతనాధ్యాయమును ప్రారంభించినది. ఈ కథనే గ్రహించి శేషుబాబుగారు 'అశోకరాజ్యము' అను రూపకమును రచించినారు (1945); ఇది 1944 లో ఆంధ్రనాటక కళాపరిషత్తువారిచే బహుమతి పొందినది.

నాటకరంగమునకు సంబంధించిన పెక్కుసమస్యలను ఇతివృత్తముగా స్వీకరించి, పలువురు పలు ప్రహసనములను రచించియున్నారు; కాని ఒక్కరును అట్టిసమస్య నొకదానిని ప్రధానముగా చేసికొని, నాటకమును మాత్రము వ్రాయలేదు. అట్టి ప్రథమప్రయత్నమును చేసినవారు నండూరి బంగారయ్యగారు. నాటకప్రదర్శనములందు స్త్రీపాత్రలను స్త్రీలే ధరింపవలయునని బళ్ళారి రాఘవాచార్యులుగారి నినాదము. దానిని ఇతివృత్తమునుగా చేసికొని బంగారయ్యగారు రాజ్యలక్ష్మి (1938) అనెడు నాటకమును రచించినారు. జగన్మోహనరావు నటుడు. స్త్రీపాత్రలను స్త్రీలే ధరింపవలయునని వానిసిద్ధాంతము. లీలావతి యనునామెను సహనటిగా స్వీకరించి, విదేశములందు నాటకములను ప్రదర్శించుటకేగును. అతడు తిరిగివచ్చినరోజున వాని యధ్యక్షతలో ప్రదర్శింపబడిన నాటకమున, వాని భార్యయే పాత్రధారణము చేసినది. అది వానికి ఆగ్రహము కలిగించెను. చివరకు జగన్మోహనరావు భార్యచేసినపనిని మనఃపూర్వకముగా అంగీకరించును. ఇది ప్రదర్శనమునకు అనుకూలమైన రచనయే కాక, నాటకసమస్యపై చేయబడిన సరిక్రొత్త ప్రయోగము. ఈ 'సిద్ధాంతము'నకు, బహుళవ్యాసములును, పెక్కు ఉపన్యాసములును చేయగలిగిన మహోపకారమును ఈ నాటకప్రదర్శన మొక్కటియే చేయగలదనుట అతిశయోక్తి కాజాలదు.

వింజమూరి శివరామారావుగారి విశ్వామిత్ర (అముద్రితము)ను కూడ ఈశీర్షికలో చేర్పవలసియున్నది. రాజసమూర్తియైన విశ్వామిత్రుడు కామక్రోధాదులను జయించి రాజర్షి యగుట యిందలి కథ, ఇందు వశిష్ఠవిశ్వామిత్రుల పాత్రలు చక్కగా పరిపోషితములైనవి. "అంతశ్శత్రువులను జయించు. ఆర్జించినశక్తి లోకకళ్యాణానికి వినియోగించు. ప్రతిజీవిని సమభావంతో ప్రేమించు" అని నారదుడుచేసిన బోధలోను, "పరమేశ్వరుడే ప్రజ, ప్రజే శక్తి, శక్తికి మూలం ప్రేమ, ప్రేమసాధన తపస్సు" అని వశిష్ఠుని తుదిపలుకులలోను రచయిత ఈనాటకమున, విశ్వప్రేమను ప్రబోధించుట స్పష్టముకాగలదు.

అవటపల్లి హనుమంతరావు, ఊటుకూరి సత్యనారాయణరావుగార్లను కూడ ఈసందర్భమున పేర్కొనవలసియున్నది. హనుమంతరావుగారి కాళిదాసు (1926) నేటికిని రంగస్థలమున విజయవంతమగుచున్న సుప్రసిద్ధమైన నాటకము. ఇంక సత్యనారాయణరావుగారి పాషాణి (1937) మున్నగునవి కూడ రంగస్థలమున విజయవంతములైన నాటకములు. ఇరువురి శైలి సరళమై, ఆకర్షణీయముగా నుండును.

ఈకాలమున వెలువడిన కొన్ని అనువాదములనుకూడ ఇచ్చట స్మరింపవలసియున్నది— పురిపండ అప్పలస్వామిగారి 'ఉత్కళపతనము' (కళాపహాడ్‌కు అనువాదము-1931), రావూరి వేంకటసుబ్బమ్మగారి 'కర్పూరమంజరి' (రాజశేఖరుని కృతికి అనువాదము-1935), ఈశ్వర సత్యనారాయణశర్మగారి ఆరోగ్యశాస్త్రనాటకమగు 'జీవానందనాటకము' (ఆనందరాయ కృతికి అనువాదము-1931) మొదలగునవి. అట్లే ఈకాలమున వెలువడిన మరికొన్ని స్వతంత్రనాటకములను కూడ స్మరింపదగును. మక్కపాటి వేంకటరత్నకవి 'ద్రౌపదీ మానసంరక్షణము' (1921), జనమంచి శేషాద్రిశర్మగారి 'విచిత్రపాదుకాపట్టాభిషేకము' (ప్రాచీనలక్షణ లక్ష్య సమన్వయపూర్వకముగా రచింపబడినది-1927), దుర్భాక రాజశేఖరశతావధానిగారి 'సీతాపహరణము' (1934), రాప్తాటి సుబ్బదాసుగారి 'అభిజ్ఞానజయదేవ' (1932), సర్వా వేంకటశేషయ్యగారి 'హరివిజయము' (1937), శ్రీరాం వీరబ్రహ్మకవి 'తుకారామ్' (కృష్ణదేవరాయలు గజపతి కుమార్తె 'తుకారామ్'ను వివాహమాడుట-1932) మొదలగునవి. 1923 లో వెలువడిన పి. యన్. రామకృష్ణగారి 'సహకారి నాటకము' సహకార ప్రచారనాటకములకు ప్రారంభమని చెప్పవచ్చును.

ఈవిధముగా ఈ రెండవదశలోకూడ కొన్నినాటకములు కేవలము సాహిత్యదృష్టిని, మరికొన్నినాటకములు ప్రయోగదృష్టిని, తక్కినవి సాహిత్యప్రయోగములను రెండింటిని పురస్కరించుకొని వెలువడియున్నవి. ఈ మూడురకముల ప్రయోగములవలనను, తెలుగు నాటకరంగమున కొంత నూతనవికాసము కలిగినదనుట స్పష్టము.

## దేశభక్తి ప్రబోధము

1. చూ. 'తెలుగునాటక సాహిత్యంపైని భారతజాతీయోద్యమ ప్రభావం' —శ్రీ శ్రీనివాసచక్రవర్తి; "దేశబంధు"—1-10-60.

నాడిదేశభక్తి ప్రబోధమెంతతీవ్రముగా ప్రజలహృదయములలో నాటిపోయినదనగా-పెండ్లిండ్లలో కూడ వ్యాంపువాద్యము ప్రారంభమైనచో "మాకొద్దీతెల్లదొరతనము" (గరిమెళ్ళ సత్యనారాయణ గారి)పాట వినిపించెడిది; స్త్రీలు 'రారా! గాంధికుమారా!' అనుచు నలుగుపాటలు, తలుపుదగ్గర పాటలు పాడెడివారు: మంగళహారతినిపట్టిన పసిపిల్లలు "మంగళంబు భరతమాత!" అని ఆరంభించెడివారు. (చూ. శ్రీ ఆచంట జానకిరాం—"నా స్మృతిపథంలో"-పుటలు 83-84).

2. ఆకాలమున వెలువడిన చారిత్రకనాటకములనుగూర్చి వెనుకటి అధ్యాయమునందే వివరించి యున్నాను. వింజమూరి వేంకటలక్ష్మీనరసింహారావుగారు బాలబాలికల కుపయుక్తములగునట్లు, సరళమగుభాషలో వ్రాసి ప్రచురించిన "చారిత్రక నాటకపంచకము"కూడ ఆకాలమునకు చెందినదే (పీఠిక తేదీ 1-3-1919). ఇందు రసపుత్రవిజయము, శివాజీచరిత్ర, రాణీ సంయుక్త, మొదలగుకథలు నాటకీకరింపబడెను. ఇవి చిన్నచిన్న రచనలు.

3. శ్రీ దామరాజువారి జననము - 1898, జన్మస్థలము - గుంటూరుజిల్లా పెదమద్దూరు. వీరు చిన్నతనమునుండియు దేశభక్తిపరులు. "స్వరాజ్య సోపానపంక్తి ప్రచురణములు" అను పేర వీరు తమనాటకములనేకాక మరికొందరి రచనలనుకూడ ప్రచురించియున్నారు. వీరు తమ నాటకములతోపాటు ఆంధ్రదేశమంతయును సంచారమొనర్చి కాంగ్రెసుప్రచారమొనర్చియున్నారు. కాని, వీరినాటకములు అచిరకాలములోనే ప్రభుత్వ నిషేధాజ్ఞకుగురియైనవి; నటులు నిర్బంధింపబడిరి: ముద్రితప్రతులు తగులబెట్టబడినవి. అయినను, వారి పాటలు, పద్యములు ప్రజలందరి నోళ్ళలోను మార్మ్రోగుచునే యుండెడివి. వారి "గాంధీనామం, మరువాం, మరువాం" అనెడి పాటను, "కత్తులులేవు, శూలమును గాండివమున్ మొదలే హుళక్కి" వంటి పద్యములను నాడాంధ్రదేశమున మనస్సులోనైనను పాడుకొననివారు లేరన్నచో అతిశయోక్తికాజాలదు.

4. ఈనాటకపు తొలికూర్పుప్రతులు (ఏప్రిలు, 1921) రెండుమూడునెలలలోనే పూర్తిఅయిపోవుట చేత వెంటనే ద్వితీయముద్రణము (అక్టోబరు. 1921) జరిగినదన్నచో ఈజాతి రచనల కానాడున్న బహుళప్రచారము నూహించుకొనవచ్చును.

5. 'నాంది'లో గాంధీజీని వర్ణించిన విధానము గమనార్హము—

కత్తులులేవు, శూలమును గాండివమున్ మొదలేహుళక్కి, నో<br>రెత్తి ప్రచండవాక్పటిమనేనియుఁజూటఁడు, వైరిమీద దం<br>డెత్తగ సేనలేదు, బలహీనముకాయము, కోపతాపముల్<br>బొత్తుగసున్న, అట్టి ఘనమూర్తి మనోబలశాలి గాంధిఁ జే<br>యెత్తి నమస్కరించి స్మరియించెదనెప్డు స్వరాజ్యసిద్ధికిన్.

ఇట్టి గాంధీజీసైన్యమును "అసిలేనిసేన" అని పేర్కొనినారు కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారు.

6. ఆనాడు పత్రి శీనప్ప (గుంటూరు)గారి బృందము ఈ నాటకములను బహుళముగా ప్రదర్శించెడిది. శీనప్పగారి గాంధీవేషము అత్యద్భుతముగా నుండెడిదట. ఈ బృందమునందలి ఇతర

నటులు శ్రీయుతులు జాగర్లపూడి లక్ష్మీనరసింహారావు (భరతమాత), ఏకా ఆంజనేయులు (దేశభక్తుడు), వింజమూరి శ్రీనివాసాచారి (అనిబిసెంటమ్మ), సింగు(డయ్యరు) ప్రభృతులు.

7. ఈ నాటకములనేకాక పుండరీకాక్షుడుగారు తరువాతికాలములో మరికొన్ని నాటకములనుకూడ రచించియున్నారు—1936లో 'మిస్‌విహార్' అను 'కలియుగభారతము' అనెడి నవీన సాంఘిక రూపకమును రచించినారు. విధవావివాహము, వర్ణాంతరవివాహము మొదలగు సాంఘిక సమస్యలీనాటకమందు చిత్రితములైనవి (ఇది ముద్రితము). మరియు "భగవాన్ నారద" (1935), భక్తపోతన (1940), తారాశశాంకము, కంథరాజా (1938) అనెడి నాటకములను, 'ఓట్ల ప్రహసన' మనెడి ప్రహసనమునుకూడ రచించిరి. ఈ నాటకములు అముద్రితములు; కాని పలుసార్లు ప్రదర్శితములై ప్రజల ఆదరాభిమానములను చూరగొనియున్నవి.

## సంఘ సంస్కరణము

1. ధర్మవరమువారి పాంచాలీపరిణయ-ప్రమీలార్జునీయాదులందలి యువతీవివాహ-స్త్రీ స్వాతంత్ర్య సంబంధి చర్చలు, చిలకమర్తివారి చతురచంద్రహాసలోని స్త్రీవిద్యాప్రశంసలు, కందుకూరివారి ప్రహ్లాదలోని పరిశుద్ధమతప్రకటీకరణము మొదలగునవి ఇందుల కుదాహరణములు

2. లీలాశుకుని చరిత్రము నెవ్వరును స్పష్టముగా నిరూపింపలేకున్నారు. కృష్ణకర్ణామృతమునకు పీఠిక వ్రాసిన తంజనగరం శేవప్పెరుమాళ్ళయ్యగారు ప్రతిపాదించిన విషయసంగ్రహము క్రింది విధముగానున్నది—

లీలాశుకుడు శ్రీకాకుళ వాస్తవ్యుడనెడి ప్రతీతికలదు. కృష్ణకర్ణామృత ప్రథమశ్లోకమగు "చింతామణిర్జయతు........" అనుదానిపైగల వ్యాఖ్యనుబట్టి లీలాశుకుడు చింతామణియనెడు వేశ్యయందాసక్తుడై యుండెడివాడనియు. ఆవేశ్య అతనివిద్యావిలసనము, కవితాపటిమ ఈవిధముగా వ్యర్థములగుచుండుటకు విచారించి, ఉపాయమున, అతడు సోమగిరియను గురుపునాశ్రయించునట్లుచేసినదనియు తెలియుచున్నది. సోమగిరి మంత్రోపదేశబలమున లీలాశుకునకు శ్రీకృష్ణ సాక్షాత్కారమైనది.

ఈ గాథతోడి నాటకములు వంగ-మహారాష్ట్రాదిభాషలందు కూడకలవు; వానిలో ఒకటి రెండు తెలుగులోనికి అనూదితములైనవి కూడను.

3. చూ. "నాట్యంబుజము"—పుట 334.

ఈ సందర్భమున సూరిశాస్త్రిగారి విమర్శ-'సంఘమున వెలయాండ్రు ఉండవలెనా? అక్కరలేదా?' అనెడి ప్రశ్నపై కేంద్రీకృతమై సాగినది. అది వివాదాస్పదమైన విషయమేకాక, ఇచ్చట అప్రస్తుత విషయమును కూడ అగుటచేత తత్ప్రసక్తిని వదలివేయుచున్నాను.

4. ఈ సందర్భమున విషాద సారంగధర పీఠికలోని ధర్మవరమువారి వాక్యములు పరిశీలనార్హములు—"నీతియు దుర్నీతియుఁ బరస్పరాధారములు గల్గినవి. దుర్నీతియించుకైనఁ బ్రకటింపకున్న నీతికిఁగాంతి గలుగదు. రావణునిదుర్నీతిలేకున్న శ్రీరామునకంత కీర్తిగలుగునా? దుర్యోధనుని దుర్నీతిలేకయున్న పాండవులకంతటి ఖ్యాతికలిగియుండునా? కావున నీతికుదుర్పవలెనన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలెనని నా సవినయ విజ్ఞాపనము. రుచిభేదములు నభిప్రాయ భేదము లున్ననుండుఁగాక."

5. "దూరము—దగ్గరకువచ్చితివా, దవడపళ్లరాలఁగొట్టెదను" అని చింతామణి కసరుకొనగా—"దూడా? యేదూడ? అందులో వోమాట అరువెట్టావు—నేత్తోనో, సెప్పుతోనో సెప్పలేదు." అనుచు చతురోక్తులాడిన సరసుడు సుబ్బిసెట్టి!

తెలుగు నాటకరంగమున ఇరువురు సుబ్బిసెట్టులుకలరు. ఇందులోఒకరు పానుగంటిలక్ష్మీనరసింహారావుగారిసృష్టి (కంఠాభరణము—1917): ఇంకొకరు కాళ్ళకూరివారిసృష్టి (చింతామణి—1921)—ఇరువురును ఆంధ్రుల అభిమానపాత్రులే!

6. అంతియేకాదు 'పునస్సంధాన శుల్కము'లుకూడ ప్రాధాన్యమునువహించినవి. అవసరాల శేషగిరిరావుగారి 'పునస్సంధాన శుల్కము' (1927) పరిశీలింపదగును.

7. కన్యాశుల్కమునందలి 'గిరీశము' యొక్క సంభాషణలను దృష్టిలోపెట్టుకొనియే నారాయణరావుగారు 'శర్మ' సంభాషణలను రచించియుందురు. కాని, రెండింటి ప్రయోజనములందును చాల భేదమున్నది. గిరీశముయొక్క ఆంగ్లపదజాలప్రయోగము ఆపాత్ర గుణశీలములను, వ్యక్తిత్వమును నిరూపించుచున్నది. ఇక శర్మపాత్ర విషయమున అట్టి ప్రయోజనమేమియును కన్పట్టదు.

8. "మనదేశమున కిప్పుడు మద్యపానము మహత్తర శత్రువు....ఈ దుర్వ్యసనము హరించి, ఈ సొమ్ము మిగిలినచో మనదేశము మహైశ్వర్యముతోఁ దులఁదూగదా?........ఇంతకంటె స్వరాజ్యమిఁకనేమున్నది? ఈ ప్రబల శత్రువును భస్మీకరించుటకై ప్రయత్నించవలసిన బాధ్యత ప్రతి భారతీయుని యందునుగలదు........ఈ రూపముగా నా బాధ్యతను నిర్వర్తించుకొను తలంపుతో నే నీ రూపకమును వ్రాసినాఁడను......" —అవతారికలో.

9. "మత్సరహృదయు లిందే వంకనైన దోషముం గ్రహించి యానందింపఁగలరు. నిర్మత్సరులైన పండితులు గ్రహింపఁదగిన గుణమిందెయ్యెడనైన వెలయించి నన్నుధన్యుఁజేయఁబరమేశ్వరుం బ్రార్థించుచు దీనిని విరమించెద"—చిత్రాభ్యుదయ పీఠిక.

"Errors, like stones upon the surface flow. He who would search for pearls must dive below." —(Quotation from Dryden)—పద్మవ్యూహ పీఠిక.

"A perfect Judge will read each work of wit with the same spirit that its author writ"—మధుసేవ పీఠిక./

10. ఒక ఉదాహరణము ;

"........నేను హైస్కూలులోఁ జదువుకొనుచుండగా, మా టీచరుగారొకసారి మాచేత నొకనాటకమాడించినారు. అంతట నాదృష్టిచదువుమీదనుండి సరాసరినాటకములమీదికినడచినది. ఆపాటున మాయూరునందలి 'ఆంధ్రయువజన సంతోషసంగీత సరస్వతీ హిందూనాటక సమాజ సంఘసభ'లోఁజేరినాను. నాటకసంఘముయొక్క నామమునకుఁగాఁబోలు నవ్వుచున్నారు. ఇప్పటి పేరులింకను లమడగొయ్యి, గత్తరబిత్తర, కొకిబికి కొల్లేటి చేఁద్రాయిలుగా......"

—శర్మ ('మధుసేవ'లో)

11. కొన్ని ఉదాహరణములు :

గాంధీజీమీది పద్యము!

కత్తులులేవు, శూలమును గాండివమున్ మొదలే హుళక్కి......

—గాంధీవిజయము.

విటుని ఆక్రందనము—
"తాతలనాటి క్షేత్రములెల్ల తెగనమ్మి దోసిళ్ళతో తెచ్చిపోసినాను......"
"అత్తవారిచ్చిన యంటుమామిడితోట యీవుకోరగ వ్రాసియిచ్చినాను......"
—చింతామణి.

12. 1926లో చెఱుకుపల్లి పట్టాభిరామయ్యగారును, అంతకుముంచే జి. కామేశ్వరరావుగారును వర విక్రయ నాటకములను రచించియున్నారు, ఇవియును పలుసార్లు ప్రదర్శితములైనవి. అట్లే మద్య పాన విషయముపై కొడాలి సత్యనారాయణరావుగారు వ్రాసిన 'మధుసేవ' (1926) కూడ పలు సార్లు విజయవంతముగా ప్రదర్శితమైనది. గోమఠం వేంకటరంగాచార్యులుదారి 'వృద్ధవివాహము' (1928), పానుగంటివారి వృద్ధవివాహముకూడ ఈ కాలమునకుచెందిన రచనలే.

## సాహిత్యదృష్టి

1. తనభావములను సులువుగా ప్రజలకందింపగల సాధనములు నాటకములగుటచేత తాను నాటక కర్తనైతిననియు, అంతకంటె సులువైనమార్గమింకేదియైననున్నచో తాను ఇప్పట్ల దానినే అనుస రించుట జరిగియుండెడిదనియు జార్జిబెర్నార్డుషా పేర్కొనియుండుట గమనార్హము. నాటకములను విమర్శించునప్పుడు, ఆనాటకరచయిత లెట్టిఅభిప్రాయములుకలవారైనను, అవి విమర్శనీయాంశ ములుకారాదు. ఆ రచయితలు తమ ధ్యేయమునందెంతవరకును కృతకృత్యులైరి? వానికి నాటక సాహిత్యమున ఎట్టి స్థానముకలదు. అనెడి విషయములే విమర్శింపబడుట న్యాయ్యము.

2. ఈ సందర్భమున దువ్వూరి రామిరెడ్డిగారి వాక్యములు గమనార్హములు—
"....కావున. ఇప్పటికవులును తక్కుంగలశిల్పులును, సమకాలీన ప్రజాబాహుళ్యము యొక్క యశిక్షితమైన యభిరుచి యడుగులకు మడుఁగులొత్తి సునాయాసలభ్యమైనఁ గీర్తిగొరకు పాటుపడుటయే వారిబాధ్యతయనితలంచుకొనక భావిసంతతులకుఁగూడ మన శిల్పసిద్ధిపైన గౌరవ ముండునటుల తమ యభిరుచిని మఱికొంత సత్యమునను, ఔచిత్యదృష్టిని మఱికొంత నిశితము గను అలవరుచుకొనుట యావశ్యకము."
—చూ. 'నాటక కళాసంస్కరణము'–కవికోకిలగ్రంథావళి–4 (వ్యాసములు)–పుట. 80.

3. భావకవులెవ్వరును ఆకాలమున నాటకరచనముజోలికుపోలేదని లోకమున నొక యభిప్రాయము వ్యాపించియున్నది. అది సత్యముగాదు. పైని పేర్కొన్నవారందరును సాహిత్యమున స్థిరముగా నిలువగలిగిన పెక్కురూపకములను రచించియున్నారు. వానిని పరిశీలించినచో వారా యా నాటక రచనలయందు కావించిన నూతనప్రయోగములు స్పష్టములు కాగలవు.

మిగిలిన అన్నికాలములందును సంస్కృత–ఆంగ్లనాటకానువాదములు విరివిగానే వెలు వడుచు వచ్చినవి; కాని, ఈకాలమందుమాత్రము అట్టిది జరుగలేదు. ఈనాటి భావకవులందరును స్వతంత్ర నాటకములను రచించుటయందే మక్కువను చూపియున్నారు. అందున అవి రచనా వైవిధ్యములుకలవై ఒక ప్రత్యేకజాతిగా పేర్కొనబడదగినవై యున్నవి.

4. శ్రీ దువ్వూరివారి జననము— 9–11–1895 (గూడూరులో).
మరణము— 11–9–1947.

చిన్ననాటినుండియు విజ్ఞానశాస్త్రమన్నను, చిత్రలేఖనశిల్పములన్నను ప్రాణము. స్వయం కృషితో పలుభాషలునేర్చిన ప్రతిభావంతులు. కర్షకజీవితమును మధురకవితావస్తువుగా మలచిన

భావుకులు. ఖయాము రుబాయతులకు వీరి తెలుగుసేత అత్యంత మధురమైనది. వీరి రూపకములు— సీతావనవాసము (ఏప్రిలు, 1921); కుంభరాణా (అక్టోబరు, 1924), మాధవ విజయము (ఫిబ్రవరి, 1925); కాంగ్రెసువాలా (ఏప్రిలు, 1935).

5. అసలిట్టి విశిష్టతలను చూపుటకొరకే వారు స్వతంత్రరచన చేసియున్నారు; ఉత్తరరామచరితమును అనువదింపకపోవుటకిదియే కారణము. ఇట్టి ప్రయత్నములనే బలిజేపల్లి లక్ష్మీకాంతకవి; వి. వి. సుబ్బారావు ప్రభృతులు కూడచేసియున్నారు.

6. యుద్ధరంగమున కుశ–లక్ష్మణుల సంవాదమును, కుంభరాణా, మాధవవర్మల పాత్రపోషణములును ఇందులకుదాహరణములు. ధర్మవరమువారిలో సంక్షేపభావప్రకటనము లోపించినదనియు, చిలకమర్తి వారిగయోపాఖ్యానములో కృష్ణార్జునుల సంవాదములు ఔచితీరహితములనియు రెడ్డిగారు విమర్శించియున్నారు. అంతియేకాదు నాటకమున, అప్రస్తుత ప్రసంగములను కూడ గర్హించియున్నారు; కాని, అట్టివానినుండి వారుకూడ, అచ్చటచ్చట, తప్పుకొనలేకపోయినారు. "పారతంత్ర్య విషవాయువునందు నాయౌవనకుసుమము వివర్ణమయి జీర్ణించిపోవుచున్నది" వంటి పలుకులు (మాధవ విజయము), కుంభరాణాలోని 'ఆంధ్రుల దాంభిక సంభాషణలు' వంటివి ఇందుల కుదాహరణములు.

7. శ్రీ విశ్వనాథవారి జననము : 10–9–1895 (మన్మథ భాద్రపద బహుళషష్ఠి).

వీరికి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కవితాగురువులు. పలువురు పండితులకడ అనేకశాస్త్రములనభ్యసించిరి. వీరు రచించిన రూపకములలో నర్తనశాల, అనార్కలి అనునవి 1924 వ సంవత్సరమునకు ముందే రచింపబడినవి. వేనరాజు 1926 ప్రాంతముల రచింపబడెను. త్రిశూలము–వేయిపడగలు 1933–34 నాటి రచనలు. 1933–38 మధ్యకాలము, వీరు నిరుద్యోగులుగా నున్నకాలము. అది వీరి జీవితమునకు పరీక్షాసమయము. కాని, ఆకాలమందే వీరు అనేకములగు రచనలను, నూతన ప్రక్రియలలో వెలయించి యున్నారు !

8. సంకేతమునననుసరించి, నర్తనశాలకు బయలుదేరుటకు ముందు కీచకునకు నిజముగానే పశ్చాత్తాపము కలిగినది. తన్నలంకరింపవచ్చినదానిని వారించి, 'మగనాలివి మమ్మునేల తాకవలె ? సేవావృత్తి నీచము. ఇదివరకు మాపొనర్చిన యఘములే చాలును మమ్ముద్రుంచి వేయుటకు" అని ఎంతయో నిగ్రహముతో, వివేకముతో పలికినాడు. కాని చివరకు వానిలోని కామమే జయించి, వానిపతనమును అత్యంతసన్నిహిత మొనర్చినది.

9. వేనునకు కూడ, అంతమున పశ్చాత్తాపము కలిగినది; కాని, అప్పటికి సమయముమించిపోయినది. విశ్వనాథవారు వేనుని పరస్పరవిరుద్ధములగు గుణములసమ్మేళనమునుగా నిరూపించియుండుట గమనార్హము. వేనునిదృష్టిలో ప్రేమకు లింగవివక్షలేదు; పురుషులు పురుషులను కూడ ప్రేమింపవచ్చును; చివరకు ఏకగర్భసంజనితులును వివాహమాడవచ్చును [పుట 33]. తన మార్గమున కడ్డువచ్చువారిని నిర్దయగా మారణహోమమాచరింపగల కర్కశుడాతడు. కాని, మరల సన్నిహితులపైన అమితమైనప్రేమ కలవాడు. అంతియేకాదు, ఆతడొక గొప్పసౌందర్యవేత్త; గొప్ప సంగీతజ్ఞుడు. అతడు వీణవాయించునప్పుడు దివ్యపురుషునివలె నుండునట [పుట 132]. ఇట్టి విరుద్ధప్రవృత్తులుకలవారికి సాధారణముగాకొన్ని complexes ఉండుట సహజము; అట్టివానిలో నొకటి వేనుడు దయ్యములకు జంకిపోవుట.

10. ఈ 'వేనరాజు' 1934 లో ఆంధ్రనాటక కళాపరిషత్ సభలలో ప్రప్రథమముగా ప్రదర్శింపబడినది. ఆనాడు స్థానం నరసింహారావుగారు పృథువు. డా. గోవిందరాజుల సుబ్బారావుగారు అంగరాజు. మాధవపెద్ది వేంకట్రామయ్యగారు గౌతముడు. శేషాచార్యులుగారు వేనరాజు. విశ్వనాథవారే స్వయముగా ఆచార్యకత్వమును వహించిరి. కాని ఆనాడది విజయవంతముకాలేదు. ఇది వైదిక నాటకమని పలువురుపెద్దలు తలంచిరి. తత్ఫలముగా ఆనాడు పెద్దఅల్లరిజరిగినది; నాటకప్రదర్శనము సగములోనే ఆగిపోయినది. అటుపిమ్మట బయలుదేరినదే త్రిపురనేని రామస్వామిచౌదరి గారి ఖూనీ!

ఆధునికాంధ్ర సాహితీరంగమున నండూరివారి యెంకిపాటలు ఎంత గాలిదుమారమును రేపినవో విశ్వనాథవారి వేనరాజును అంతగాలిదుమారమునే రేపినదని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పేర్కొనియున్నారు.

11. ప్రస్తావనలో కవి సూత్రధారునిచేత చెప్పించినవాక్యములు పరిశీలనార్హములు. "......ఇందలి పూర్వాంకమందలి రచనాపద్ధతికి వ్యాఖ్యానప్రాయముగా రెండుమాటలను చెప్పెదను. ఇందు వసంతుడు, పూలకన్నెలు, మన్మథుడు, చిలుక, కోకిల, కవి మొదలైన పాత్రలువచ్చును. వీరందరును నాయికానాయకుల సమక్షమందే వచ్చెదరు. మనపూర్వకావ్యములందు వీనినుద్దీపన విభావములుగా చెప్పిరి. ఆ యుద్దీపన విభావముల వెనుకనున్న మానసికస్థితి యాయాపాత్రలవాక్కులందు వారిమాటలుగా గ్రుచ్చబడినవి. కవి నాయకునిలోనే యొకభాగము. అతడు బయటికింకొకపాత్రవలె కన్పించును; కాని కథానాయకుడుకాని సలీము, ఒక మహోత్కృష్టభావపరంపరాలగ్నబుద్ధియగు సలీము కవిగా కన్పించుచున్నాడు. చిలుక, కోకిల మొదలైనవి పలికినపలుకులు వానియందున్న యర్థమును నాయికా నాయకులు సంకల్పించుకొనిరి; ఆభావములే చిలుకలు, కోకిలలు, పుష్పకన్యలు చెప్పినట్లిందు వ్రాయబడినవి."

ఆధ్యాత్మిక సౌందర్యమునకు సంబంధించిన అభౌతికార్థములనన్నింటిని భాషలోనిపదములు, వానికున్న అర్థములు పూర్ణముగా వ్యక్తముచేయలేవు. అందుచేత ఆధ్యాత్మిక సౌందర్య ప్రపంచనమే ధ్యేయముగాగల మేతర్లింకు కొన్ని సంజ్ఞలనేర్పరచుకొనవలసివచ్చెను. దీనినే సంజ్ఞావాచకత్వము, లేదా ప్రతీకవాదము (Symbolism) అందురు. ఈ ప్రయత్నములో నాతడు పక్షుల నెక్కువగా నుపయోగించెను.

12. శ్రీ చింతావారి జన్మస్థలము : రామచంద్రపురం తాలూకా 'దంగేరు.'
జననము—1891; మరణము—25-8-1960.

బాలవాఙ్మయ పితామహులు; కథకచక్రవర్తి బిరుదాంచితులు. మధురభావములను లలితములైన అలతి అలతిపదములతో, ఉన్నతముగా వ్యక్తీకరించుటలో సిద్ధహస్తులు దీక్షితులుగారు.

13. అసలు దీక్షితులుగారు శబరిని మించిన భక్తులు; కావుననే ఆపవిత్రురాలిచరిత్రనంత హృదయంగమముగా చిత్రింపగలిగినారు. రామచంద్రమూర్తినిగూర్చి వారు మతంగమహర్షిచేత పలికించిన పలుకులు గమనార్హములు—"ఆ మహాపురుషుని శరీరకాంతి ఆకాశము! కన్నులతేజము సూర్యచంద్రులు. అతని నవ్వులలో నక్షత్రపు తళుకులు. ప్రకృతి అతని విగ్రహములో ప్రతిఫలిస్తున్నది. అతని దక్షిణబాహువులో అమృతమూ, హాలాహలముకూడా కలవు." [పుట. 17]

14. చలంగారుకూడ ఇట్టి శక్తిసంపన్నులే "ఓపువ్వు పూసింది", "విన్నపాలు" మొదలగునవి ఇందుల కుదాహరణములు. కాని, వారు తమ నాటకములందట్టి భాషను ప్రయోగించియుండలేదు.

## సంఘ తిరస్కారణము

1. ఈ కాలముననే ఇంగ్లండులో సాంఘికవిప్లవము వచ్చినది. మానవుని జన్మసిద్ధాంతమునుగూర్చిన డార్విన్ వాదము వెనుకటివిశ్వాసముల నన్నింటిని మార్చివేసినది. ఇందులకుతోడు ఫ్రాయిడ్ మన స్తత్త్వశాస్త్రము మానవుడు తానుచేసెడి ప్రతిపనిని, చెప్పెడి ప్రతిమాటను కార్య-కారణ సంబంధమును తార్కికముగాఆలోచించి సమన్వయపరచుకొనిన తరువాతనే ఆయావిషయములను నమ్మవలయునన్న సిద్ధాంతమునకు దోహదకారియైనది. దీనిని Age of Question, Examination and Test (పరీక్షయుగము లేదా అప్రత్యయయుగము) అనవచ్చును.

2. ఈ కాలముననే చెన్నపట్టణమున జస్టిసుపార్టీ తలయెత్తినది(1914). రాజకీయరంగమున జస్టిసు పార్టీ, సాంఘికరంగమున కులములవ్యవస్థపై తిరుగుబాటుదారులు, ప్రాచీనాలంకారశాస్త్రములపై శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, పురాణములపై శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి ప్రభృతులు ప్రారంభించిన తిరుగుబాటులు ఇంచుమించుగా సమకాలికములైనవి.

3. శ్రీ త్రిపురనేనివారి జననము ; మరణము : 16-1-1943.

జన్మస్థలము : కృష్ణాజిల్లా 'అంగలూరు'

తల్లిదండ్రులు : రామమాంబ, చలమయ్య.

త్రిపురనేని రామస్వామిచౌదరిగారు పాశ్చాత్యదేశములలో విద్యాభ్యాసముచేసి, బారిస్టరు పట్టముపొందివచ్చి, తెనాలిలో న్యాయవాదులుగా స్థిరపడినారు. వీరు శతావధానులుకూడను. 'కవిరాజ' బిరుదాంచితులు. సూతాశ్రమవ్యవస్థాపకులు.

నాటకములు : కురుక్షేత్రము (1911); శంబుకవధ (1920); ఖూనీ (1-8-1935). సూతపురాణము, భగవద్గీత మొదలగునవి వీరి యితర గ్రంథములు.

4. ఈ నాటకమునకు వీరు వ్రాసిన 'భరతవాక్యము' గమనార్హము—

ధర్మజుఁబోలెనేఁటి వసుధాపతులెల్లరు రాజ్యకాంక్ష దు
ష్కర్మము నేయకుండుదురుగాత, భయంకరఘోరజన్యముల్
మర్మముతోడఁ జేయుటలుమానెదరుగాత మహేంద్రజాలులన్
వర్మములుగాఁగఁ జేసికొని వర్తిలకుందురుగాత మెప్పుడున్."

ఈ నాటకమందుమాత్రమే వీరు భరతవాక్యమును వ్రాసిరి. ఇంక నాందీప్రస్తావనలను ఏ నాటకమందును వ్రాయలేదు.

5. 'విప్లవం లేక వేనరాజు' అనెడి నాటకములో ధనేకుల బుచ్చివెంకటకృష్ణ చౌదరిగారు వేనుని ఇంచుమించుగా ఇదేదృష్టితో చిత్రించియున్నారు. అందు, వేనుడు సాంఘిక విప్లవకారుడైనాడు; స్వార్థపరులై మూఢనమ్మకములలో దురహంకారప్రేరితులైన నిరంకుశులబారినుండి నిరక్షరాస్యులైన ప్రజాబాహుళ్యమును సముద్ధరింపగోరి, భావదాస్య నిర్మూలనకే వేనుడు తన జీవితమును అర్పించినట్లు వీరు చిత్రించినారు. అతడు స్వబలమునునమ్మి, హింసను హింసతోనే నిర్మూలింపవలెనని ప్రత్యయముతో ప్రవర్తించుటకంటె అనాగరకులై దాస్యశృంఖలములలో మ్రగ్గెడి తన ప్రజలకువలసిన విజ్ఞానచైతన్యము కల్గించియున్నచో ఆ ప్రజలే ఆ సంఘద్రోహులను అంత మొందించియుండెడవారనియు, అట్లు చేయకపోవుటచేతనే వేనుడు తన జీవితమును కోల్పోయె ననియు వీరి వ్యాఖ్యానము.

6. ఆనాడీసమస్యలపై సుదీర్ఘములగు చర్చలు జరిగినవి. వివరములకు త్రిపురనేని సుబ్బారావుగారి "మహాకవి మధురస్మృతి" అనెడి వ్యాసమును చూడవలెను. —'ఆంధ్రప్రభ' - మార్చి, 1960 - 20, 27 తేదీ పత్రికలు.

7. ఆంగ్లదేశమున బెర్నార్డుషా వచననాటకముల ప్రదర్శనములను స్వయముగా తిలకించి వచ్చిన వారు చౌదరిగారు. అయినను తత్ప్రభావము వీరిపై పూర్తిగా పడలేదు. ఇంక కేవల వచన నాటకములను విరివిగా రచించి, ప్రచారములోనికి తెచ్చినవారు శ్రీయుతులు చలం, భమిడిపాటి ప్రభృతులు మాత్రమే.

8. ముద్దుకృష్ణగారి జననము—7-2-1899.
జన్మస్థలము—రాజమండ్రి.
తల్లిదండ్రులు—పాపమ్మ, ముద్దునరసింహం.

ముద్దుకృష్ణగారు బి. ఏ., బి. ఎల్. పట్టభద్రులు. హరీంద్రనాథ ఛటోపాధ్యాయతోకలిసి వీరు ఆంగ్లనాటక ప్రదర్శనములలో పాల్గొనినారు; పిమ్మట స్వీయనాటకములను ప్రదర్శించుచు దేశమంతయును తిరిగినారు. 'జ్వాల' పత్రికకు సంపాదకులు. సినీమాలలో వ్యావహారికభాష ప్రవేశపెట్టిన ప్రథములు ముద్దుకృష్ణగారే.

9. ఈ రచనకు ముఖ్యకారణములను వారేచెప్పుకొనినారు. "కారణాలన్నీగణిస్తే రావణునిపక్షం ఆలోచించడం న్యాయమౌతుందికదా! నా యత్నానికి ఇది ముఖ్యకారణం. (పుట 101). 'రామ రాజ్య'మనీ 'సీతవంటిభార్య' అనీ వీటిని నిత్యలక్ష్యాలుగాచూపుతూ, అందువల్లకలిగే లోపాలనూ ప్రమాదాలనూ సంఘము గుర్తించకుండా ఉండడం ఈ వ్రాతకు ఇంకొక కారణం".

10. ఆంగ్లసాహిత్య సంపర్కమువలన కొన్ని గొప్పమేళ్లు కలుగుటతోపాటు కొన్ని గొప్ప విపత్తులు కూడ కలిగినవి. అట్టివానిలో ఇట్టి తర్కవిజృంభణమొకటి. అలంకారశాస్త్రమన్నచో అర్థశబ్దా లంకారములుమాత్రమే అనెడి దృష్టితో విమర్శించిన కట్టమంచివారి 'కవిత్వతత్త్వవిచారము' నందును ఆయాఘట్టములందిట్టివి కన్పట్టగలవు.

11. ఇది బెర్నార్డుషావ్రాసిన 'సెయింట్‌జోన్' అనెడి నాటకమందలి చివరిరంగమును పోలియున్నది. అందు రాజునకు చనిపోయినవారందరును 20 వ శతాబ్దపు దుస్తులలో కన్పట్టి జరిగిపోయిన సంఘటనలపై తమతమ వ్యాఖ్యానములను వివరింతురు.

12. శ్రీ గుడిపాటివారి జననము—18-5-1898.

వీరు కొమ్మూరి సాంబశివరావుగారి పుత్రులు; తాతగారైన గుడిపాటి వేంకటరామయ్య గారికి దత్తులు; ఉద్యోగ్యరీత్యా ఉపాధ్యాయులు, పిమ్మట స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగాపనిచేసి రిటైర్ అయినారు. ప్రస్తుతము రమణాశ్రమ నివాసి.

సంఘసంస్కర్తగా, తాను నమ్మినసిద్ధాంతముల ప్రచారకుడుగా, నవల రచయితగా, కథకుడుగా, నాటకకర్తగా తెలుగుదేశమున సుప్రసిద్ధులు చలంగారు.

వందకుపైగా కథలు, పాతికకుపైగా నాటికలు, పెక్కు నాటకములు, నవలలు, అనేక వ్యాసములు, లేఖలు మొదలగునవి వీరి రచనలు—అన్నియును ముద్రితములే.

వీరి నాటకములు : చిత్రాంగి (1921); శశాంక (1926); మంగమ్మ (1930); జయదేవ (1935); త్యాగం (1935); విడాకులు (1938); పురూరవ (1947);

13. ఈ నాటకమునకు గిడుగు రామమూర్తి పంతులుగారు ఉపోద్ఘాతము వ్రాయుచు దేశమున, సంఘమునందలి దురాచారములయెడ ఆధునికులకుకలిగిన భావవ్యతిరేకతను ప్రశంసించుచు, ముఖ్యముగా వివాహవిషయమున చలంగారుఇచ్చిన తీర్పును అంగీకరించుట గమనార్హము.

14. "కాని మీరు నన్ను లాలించినప్పుడు, నన్ను ప్రజ్వలింపప్రయత్నించినప్పుడు మీరు ఉన్నతస్వర్ణ పీఠంనుంచి పతితులైనట్లుతోస్తారు. నాభక్తి సిగ్గుతో కప్పుమూసుకుంటుంది"అని తార బృహస్పతితో పలికిన పలుకులు ఆమె భావసంఘర్షణమును వ్యక్తముచేయుచున్నవి.

15. ఈ సందర్భమున బృహస్పతి గౌతమునకు చేసిన ఉపదేశమును పరిశీలించినచో ఇందు చలంగారు ప్రపంచించిన సిద్ధాంతము విశదముకాగలదు—

"సమస్తజీవుల్ని ప్రేమించు. నీకన్న, నీతపస్సుకన్న, నీ భార్యకన్న, నీ యీశ్వరుడికన్న అధికంగా దుర్గతిలో పెనుగులాడే యీ లోకాన్నంతా ప్రేమించు ... పాపంలో మునిగినకొద్దీ, అంధకారంలో జారినకొద్దీ, నీచేతుల్ని ఇంకాకిందికి జాచి, హృదయానికింకా దగ్గరగా హత్తుకో, బంధించుకు. శిక్షించుకు....." —శశాంక-పుట 76.

మరియు "నేను నమ్మినవాటినే వ్రాశాను....వ్రాసినవాటినే ఆచరించాను" అని చలంగారు చెప్పుకొనుట గమనార్హము. —(మ్యూజింగ్స్-భాగము-2. పుట. 59).

16. "సంభాషణా శ్రవ్యరూపకము" అన్నారు సంపత్కుమారగారు.

—చూ. వారివ్యాసము 'పురూరవ'-జయంతి - నవంబరు, 1959.

17. చలంగారు నాడును నేడును అతివాదులే. రమణాశ్రమవాసియై, జీవితవిధానమును పూర్తిగామార్చు కొనినారు. ఇటీవల హైదరాబాదు 'కళావని'వారు తాము ప్రకటించిన 'నాటక ప్రత్యేకసంచిక' కొరకు "నేనెందుకు నాటకాలువ్రాశాను?"అన్న శీర్షికపై ఒక వ్యాసమునువ్రాసి పంపవలసినదని అర్థింపగా, చలంగారు క్రిందిసమాధానమును వ్రాసినారు—

"ఆనాటకాలన్నీ బుద్ధిలేకరాశాను. ఇంకెన్నటికీ అట్లాంటిపని చేయను. అని ఓపేజీలో మీ పత్రికలో వెయ్యండి —చలం".

—కళావని 'నాటక ప్రత్యేకసంచిక' (1965)—పుట. 51.

## ప్రదర్శన సౌలభ్యము

1. ఈ గతానుగతిక రచనావ్యామోహమునుండి విడివడి నాటకకర్తలు, తమకుతోచిన నూతన విధానములను అవలంబించి రచనలుకావించుటచేతనే ఈ కాలపు రచనలను "నూతనప్రయోగములు" అనుట సమంజసమగుచున్నది.

2. శ్రీ'కొప్పరపువారి జన్మస్థలము : గుంటూరుజిల్లా ముప్పవరము.
జననము : 1890 ఏప్రిల్, 29.
తల్లిదండ్రులు : రామమ్మ, కామరాజుకవి.

సుబ్బారావుగారికి చిన్ననాటినుండియు నాటకకళపై అభినివేశము. 1918 లో యుద్ధమునందు పనిచేయుటకు మెసపుటేమియా ప్రయాణము. అచటినుండి ఫ్రాన్సు. అచట సోల్జర్ల కొరకు నిర్మింపబడిన నాటకశాలలో ప్రప్రథమముగా 'ఆలీబాబా' నాటకమును ఆంగ్లమున వ్రాసి, భారతీయనటులచే ప్రదర్శింపజేసినారు.

మరణము : 1959 మే-3.

నాటకములు : రోషనార (1921); రాణాప్రతాప్ (1923); శ్రీసామ్రాజ్యము (1932); తారాశశాంకము (1944); నూర్జహాన్; వసంతసేన;

అల్లీముతా మొదలగు నాటికలనుకూడ వీరు రచించినారు. నాటకములను వృత్తినాటక సమాజములకొరకును, నాటికలను ఔత్సాహిక నాటకసమాజములకొరకును వ్రాసినట్లు చెప్పుకొనినారు. సుబ్బారావుగారు నాటకరంగమునకు సంబంధించిన బహుముఖ సాంకేతికవిజ్ఞానమునందు నిష్ణాతులగుటయేగాక, ప్రథమశ్రేణికిచెందిన హార్మోనిష్టుకూడను. కలకత్తా, బొంబాయినగరములలో కొంతకాలము నివసించి, ఆయా నాటకప్రయోగవిధానములను బాగుగా ఆకళింపుకొన్నారు. 1946 లో "తెలుగు లిటిల్ థియేటర్"ను స్థాపించినారు. దానికి అనుబంధముగా నాటకకళకు సంబంధించిన ఆంగ్ల-ఆంధ్ర-సంస్కృతాది భాషలలోని అమూల్యములైన గ్రంథములను సేకరించి 'నాటకగ్రంథాలయము'ను స్థాపించినారు.

3. "కన్నులవిరెండు వేర్వేర నున్ననేమి
కలిపిచూచెడిదృష్టి యొక్కటియె సుమ్ము"

అని ఇందు మంగళగీతము పాడబడుట గమనార్హము.

4. శ్రీ పింగళివారి జననము. : డిసెంబరు — 1901.

జన్మస్థానము : విశాఖపట్టణముజిల్లా 'రాజాం'.

ఉత్తమప్రయోక్తలు; బందరులో డి. వి. సుబ్బారావుగారి "ఇండియన్ డ్రమాటిక్ కంపెనీ"కి చాలసంవత్సరములు కార్యదర్శిగానున్నారు. సినీరచయితలుగా నేడు సుప్రసిద్ధులు. 1948 లో నాటకరచయితగా ఆంధ్రనాటకకళాపరిషత్తుచే సన్మానితులు.

నాటకములు: మేవాడురాజ్యపతనము (1922); పాషాణి (1923); జేబున్నీసా (1923), వింధ్యరాణి (1928); నారాజు (1929); ఒకేకుటుంబం (1956); ఛత్రహిందు ((1957).

5. ఇంచుమించుగా ఇదేకాలములో ప్రభుత్వ నిషేధమునకు గురియైన మరి రెండు నాటకములు కలవు—కోలాచలంవారి 'రామరాజు', కొప్పరపువారి 'రోషనార'.

6. ఈ నాటకవిశిష్టతను కూలంకషముగ వివరించినారు "శ్రోతవ్యం"లో కమలాకర వేంకటరావుగారు.

## నూతన ప్రయోగములు – రెండవదశ

1. దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులుగారిని గోఖలేతో పోల్చి చెప్పిన పద్యములు పరిశీలనార్హములు—

"నెలకు న్వేలుగడించగల్గియును దానిన్మానుచు స్స్వేచ్ఛా నాం
ధ్రులకై శక్తిని ధారవోయుచును సంతుష్టిన్ సదా మిత్రమం
డలి మెచ్చన్గనె గౌరవంబు నల కొండా వేంకటప్పయ్యనే
వలనన్ జూచిన దేశభక్తుడగు నవ్వా చింత నీకేటికిన్."

"ఆంధ్ర గోఖేలు" అనబడు వేంకటప్పయ్యపంతులుండగా నీకు చింతయేల? అని ఆంధ్రమాత యూరడింపబడుట ఇచ్చటి సందర్భము.(పుట. 83).

2. "ఆత్మవత్సర్వభూతాని యనుచు, బలుకు భారతజాతీయ సందేశభరమునుదాల్చు నాంధ్రసామ్రాజ్య నిర్మాతవగుము తండ్రీ" అని ఎఱ్ఱాప్రగడయును,

"భరతమాత ముద్దులపట్టి, మిమ్ము
గన్నతల్లి, కవీంద్రుల కల్పవల్లి
బ్రహ్మవిద్యాధిరాజుల పాలవెల్లి
యాంధ్రమాతకు మంగళమగుగాక."

అని విజయాంబికా-అనపోతారెడ్లు భరతవాక్యమును పలుకుట గమనింపదగినది.

3. ఈ నాటకము మునుగా భారతిలో ప్రచురింపబడినప్పుడే విశ్వనాథవారు నన్నయ పాత్రపోషణమునకు మెచ్చుకొనినారు. ఈ నాటకము జయపూరు రాజా విక్రమదేవవర్మగారికి అంకితము. రాజావారు గ్రాంథికవాదులు; శ్రీపాదవారు వ్యావహారికవాదులు; రాజావారికి ఈ నాటకమునందలి సారంగధరపాత్ర చిత్రణము నచ్చలేదు; దానిని మార్చుటకు శ్రీపాదవారు అంగీకరింపలేదు. అయినను గౌరవముతో వారంకితమిచ్చుట, ఆదరముతో వీరుగైకొనుట వారి సహృదయతలకు తార్కాణములు.

4. అప్పటప్పట హాస్యమును ప్రవేశపెట్టుటకు, కథాకథనమునకు ఆవశ్యకమగునట్లు కల్పింపబడిన పేరావధాని, పుల్లన్న లిందులకు తార్కాణము.

5. శ్రీ గుండిమెడవారి జననము—25-7-1901 (గంజాంజిల్లా ఛత్రపురము)

వీరు బహుళ నాటకకర్తలు, నవల రచయితలు, నటులు, చిత్రలేఖకులు. వీరి నాటకము లన్నియును విశ్వవిద్యాలయములయందు పఠనీయగ్రంథములైనవి.

నాటకములు—రాణాప్రతాప్ (1927); మేవాడు పతనము (1930); ఖిల్జీరాజ్యపతనము (1933); పృథ్వీపుత్రి (1946); దుర్గాదాసు (1949).

పంచమాధ్యాయము

# నాటికలు : ఏకాంకికలు

## భూమిక

ఈ పరిశోధనావ్యాస ప్రథమభాగ ద్వితీయాధ్యాయమందు సంస్కృతమందలి రూపక-ఉపరూపక భేదములనుగూర్చి వివరించియున్నాను. భరతుడు పేర్కొన్న పదునొకండు రూపకములలోను ఐదు (వ్యాయోగ-అంక-ప్రహసన-భాణ-వీథులు) ఏకాంకములనియు, ఉప రూపకములలో పదునాలుగు ఏకాంకములనియుకూడ పేర్కొనియున్నాను. ఈ ఏకాంక రూపకోప రూపకములను "ఏకాంకికలు" అనవచ్చును. కాని నేడు శతసంఖ్యాకముగా వెలువడుచున్న నాటకములు ప్రాచీనలక్షణ సమ్మతములు కానట్లే నేడు సహస్రసంఖ్యాకముగా వెలువడుచున్న ఏకాంకికలుకూడ ప్రాచీనలక్షణసమ్మతములుకావు. అట్లే నాటిక విషయమును. భరతముని పేర్కొన్న నాటికకును నేడు నాటికలనుపేర వెలువడుచున్న రచనలకును లక్షణ సమన్వయము కన్పట్టదు[1]. కాగా నేటి ఏకాంకికలును, నాటికలును కేవలము ఆధునికసాహిత్య ప్రక్రియ లగుట స్పష్టము.

పాశ్చాత్య దేశములందుకూడ కళాత్మక రచనయైన ఏకాంకిక (One-act play) ఆధునిక సాహిత్య ప్రక్రియమే. మిష్టరీ, మిరకల్ రూపకముల వంటివి వైశాల్యమున చిన్నవి యగుటచేత అవి ఏకాంకికలకు ప్రాతిపదికలుగా తలంపబడుచున్నవి. తరువాతి కాలములో పెద్ద నాటకములు ప్రయోగింపబడుటకు పూర్వము ప్రేక్షక ప్రరోచనార్థము చిన్నచిన్న రూపకములు ప్రయోగింపబడెడివి; వీనికి (Curtain-raisers) అనిపేరు. అసలునాటకమందుత్సుకత కలవారు ఈ చిన్నిప్రదర్శనములు పూర్తిఅయిన తరువాతనే నాటకశాలయందు ప్రవేశించెడివారు. ఆధునిక కాలములో ఔత్సాహిక నాటకసమాజములవారు ఏకాంకికా ప్రయోగమును చేపట్టుటతో కళాత్మకమగు ఏకాంకికలు విరివిగా రచింపబడసాగినవి. ఇంక ఆధునిక రచయితలు అధికముగా రచించెడి మూడు లేదా రెండు అంకముల రూపకములను "నాటికలు" అనవచ్చును. నిర్మాణవిషయమున నవలకును, కథానికకును ఉన్న భేదమే నాటకమునకును, ఏకాంకికను గలదు. అనగా వైశాల్యమున నాటకముకంటె నాటిక చిన్నది. ఇంక నాటికకంటె ఏకాంకిక చాల చిన్నది. అంతమాత్రమున నాటకమును సంక్షిప్తము చేసినంతమాత్రమున నాటిక అగునని కాని, నాటకమును లేదా నాటికను సంక్షిప్తము చేసినంతమాత్రమున ఏకాంకిక అగుననికాని

తలంపరాదు. దేని రచనాపద్ధతి దానిదే; దేనికదియే ఒక ప్రత్యేకకళ. ఉత్తమ నాటకనిర్మాణ మెంత కష్టమో ఉత్తమ ఏకాంకికారచన అంతకష్టము; అంతియేకాదు: అంతకంటెను కష్ట మన్నను అతిశయోక్తి కాజాలదు. కావుననే ఉత్తమ నాటకకర్త ఉత్తమ ఏకాంకికారచయిత కాలేకపోవచ్చును.

ఏకాంకికారచనకు సంక్షిప్తత ప్రాణము—వస్తుగ్రహణములో, పాత్రోన్మీలనపద్ధతిలో, ఆద్యంతములనిర్మితిలో, సంవాదములలో—ఒకటియననేల, సర్వత్ర సంక్షిప్తత ఆవశ్యకమే. ప్రాచీనకాలమున పాశ్చాత్యులు ఉత్తమవిషాదరూపకమునకు చెప్పిన ఐక్యత్రయాదిలక్షణములు, భారతీయులు అంకమునకుచెప్పిన వివిధలక్షణములు నేటి ఏకాంకికకు చక్కగా పట్టుచున్నవి. ఇతివృత్తమునందు ప్రాసంగికాదులుండవు; స్థలమునందు మార్పు ఉండదు. ఇంక కాలము—ఆకథ లోకమునందు జరుగుట కెంతకాలముపట్టునో, ప్రదర్శనమునందును ఇంచుమించుగా అంతియే కాలముపట్టును. రంగస్థలము బహుపాత్రసంకీర్ణముకాదు. కథ ఆద్యంతము ప్రత్యక్ష నేత్రచరితమే యగును. ఈ విధముగా గౌరవముచేత కాకపోయినను, ఆవశ్యకమగుటచేత నైనను ప్రాచీనలక్షణములు ఏకాంకికారచనయందు ఆదృతములగుట గమనింపవచ్చును.

తెలుగు సాహిత్యములోని నూతన ప్రక్రియలు—ఏకాంకిక, ప్రహసనము, నాటిక—పాశ్చాత్య సాహితీ సంపర్కమును, నూతన ప్రయోగములయందలి యభినివేశమును కారణము లుగా అవతరించినవేయైనను అవి కేవలము అనుకరణాత్మకములుకాక దేశీయతాముద్రను పొందినవై, కళాత్మక స్వీయసృష్టిగా రూపొందియున్నవి. తెలుగులోని పెక్కు ప్రహసనములు ఏకాంకికాప్రాయములే. ఏకాంకిక అన్నప్పుడు స్థల—కాలైక్యములు కలిగినదై విధిగా ఏక రంగముగా నుండుట ఆవశ్యకము; ఇంక నాటికలో స్థల కాలముల మార్పులతోపాటు రంగము లైదారువరకు నుండవచ్చును. కాని తెలుగు రచయితలీ భేదమును గమనించి ఈ పదములను వాడుచున్నట్లు కన్పట్టదు. 'నాటిక' అను పదమే వారిచే విరివిగా వాడబడుచున్నది. కావున నేను ఇచ్చట వాడబోవు నాటికాపదము మూడురకముల ప్రక్రియలకును (నాటిక, ఏకాంకిక, ప్రహసన ములకు) ప్రతీకయని గ్రహింపవలయును. స్వరూపభేదమునుబట్టి ఈ నాటికలలో మరల పెక్కు భేదములు కలవు—దృశ్యనాటిక, పద్యనాటిక, గేయనాటిక, నృత్యనాటిక, శ్రవ్యనాటిక మొద లగునవి. ఇది మరల వస్తుభేదమునుబట్టి—నాటకమునందువలెనే—పౌరాణిక, చారిత్రక, సాంఘిక, సంకీర్ణభేదములను గలిగియుండును.

నాటికారచనకు ప్రేరణము నాలుగు విధములుగా కలుగవచ్చును—విశిష్టమైన సన్ని వేశము లేదా కథ, విలక్షణమైనపాత్ర, క్లిష్టమైన సమస్య, ఉత్తేజకమైన వాతావరణము, సన్నివేశము ప్రేరకమైనచో తదుచితమైన పాత్రసృష్టి జరుగును. పాత్ర ప్రేరకమైనచో తదుచితమైన సన్నివేశకల్పనము జరుగును. సమస్యకాని, వాతావరణముకాని ప్రేరకములైనచో తదుచిత సన్నివేశసృష్టి, పాత్రసృష్టి జరుగును. లేదా సందేశమొసంగుట జరుగును. పై నాలుగింటిలో ఏది ప్రేరకమైనను వస్తువునందు నిబిడత్వము, రచనలో జిగి, కథాగమనములో ఉత్సుకత ఉన్నప్పుడే అది ఉత్తమ రచన కాగలదు.

తెలుగులోని ఏకాంకికలను రచనాదర్శములనుబట్టి ఆరు రకములుగా విభజించినారు డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు[2]—

1. పౌరాణిక-చారిత్రక పాత్రల చిత్రణము—చలంగారి భానుమతి, బుచ్చిబాబుగారి తిష్యరక్షిత మొదలగునవి.
2. కాల్పనికవాతావరణచిత్రణము—అవధానిగారి జగజ్జ్యోతి, కృష్ణశాస్త్రిగారి ఊర్వశి మొ.
3. వ్యాఖ్యానదృష్టి—జి. వి. కృష్ణారావుగారి "భిక్షాపాత్ర" మొ. ఏకాంకికల తొలిరోజులలో వెలువడిన చింతా దీక్షితులు, కవికొండల వేంకటరావు, అడివి బాపిరాజు ప్రభృతుల రచనలు.
4. కథాప్రధానములు—శ్రీయుతులు చందూరి నాగేశ్వరరావు, ముద్దా విశ్వనాథం ప్రభృతుల రచనలు.
5. జీవితములోని సన్నివేశచిత్రణము—మల్లాది రామకృష్ణశాస్త్రిగారి బాల, వెంపటి నాగభూషణంగారి కళాకేళి, నార్ల వేంకటేశ్వరరావుగారి నాటికలు మొ॥
6. ఉప(సం)దేశాత్మకములు—సోమయాజుల వేంకటరామమూర్తిగారి 'సిద్ధౌషధం', అవధానిగారి భద్రకాళి, ముద్దుకృష్ణగారి టీ కప్పులో తుపాను మొ॥ రాజమన్నారుగారి రచనలందలి సందేశములలో సూక్ష్మదృష్టి, వివేచనాశక్తి ఉన్నవి. విశ్వనాథ కవిరాజు రచనలు వినోదాత్మకములేకాక, ప్రేక్షకుల అపేక్షను పొంది, వారిలో సంస్కారమును తేగలవు.

ఈ కాలమున సాంఘిక సమస్యల పరిష్కార ప్రతిపాదనమునకు అందున స్త్రీ, ఆమెకు సంబంధించిన సమస్యల చర్చలకు ఈ నూతనప్రక్రియ రచయితలకు చాల ఉపకరించినది. నాటకము విస్తృతిలో విశాలమైనదగుటచేత కథను కొంత అనవసరముగాపెంచి, ఆవశ్యకముకాని హాస్యములను, పద్యములనుచేర్చి రచింపవలసియున్నది. అట్లుకాక, చెప్పదలచుకొన్నదానిని సూటిగా ప్రతిపాదించుటకు ఈ నూతనప్రక్రియ చాల సహకారియైనది. అందుచేతనే పలువురీ ప్రక్రియచేత ఆకర్షితులైనారు. ఈ ప్రక్రియను చేపట్టిన తొలి రచయితల[3] రచనలను పరిశీలించినచో పై విషయము సుస్పష్టముకాగలదు. తొలిరచయితలలో సుప్రసిద్ధులగు విశ్వనాథకవిరాజుగారు, పి. వి. రాజమన్నారుగారు వెలయించిన రచనలలో (ఏకాంకికలు, నాటికలు) నూతనమగు సమస్యలు సూటిగా, తేటతెల్లముగా, అనవసరప్రసంగములు లేకుండ ప్రతిపాదితములగుట గమనింపవచ్చును.

విశ్వనాథకవిరాజుగారు తమ రచనలలో సన్నివేశ చిత్రణమునకు ప్రాధాన్యమునిచ్చి, చిట్టచివరకు ఒక 'కొసమెరుపు'వలె తాను ప్రతిపాదింపదలచుకొనిన ఉపదేశమును లేదా భావమును వెలిబుచ్చుచుందురు; తుదివరకును పోషింపబడిన ఉత్సుకత (Suspense) అంతమున విచ్చిపోయి ప్రేక్షకులకు ఆహ్లాదకారియగును. ఇంక రాజమన్నారుగారి రచనలందు సన్నివేశకల్పనమునకు వలసిన సాధనసంపత్తియంతయు ముందు సిద్ధము చేయబడియుండుట పరిశీలింప వచ్చును. కాగా, ఇరువురును, ఈ నూతనప్రక్రియ రచనావిధానమున రెండు క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టినవారైరి.

## కొందరు తొలి నాటికాకర్తలు

**శ్రీ విశ్వనాథకవిరాజు[1] :**

హాస్యగర్భితమైన నాటికారచనలో సిద్ధహస్తులు విశ్వనాథకవిరాజుగారు. హాస్యపుపాలు అధికమైనచో అది ప్రహసనముగా పరిణమించును; కాని కవిరాజుగారి శక్తి నాటికను తన హద్దునుదాటి పోనీయలేదు. మరియు, నాటికను ప్రయోజనబద్ధముచేసి, కేవలము సంభాషణ మాత్రముగా సాగిన సన్నివేశమునందలి నిగూఢమైన అర్థమును అంతమున పరిష్కరించుటలో అంతదనుక తెలియరాని ఒక వినూత్నవిషయమును గ్రహించి ప్రేక్షకులు తన్మయులగుదురు. ఇట్టి 'కొసమెరుపు' నాటికకును, ఏకాంకికను జీవము; ఇది కవిరాజుగారిలో అపూర్వముగా కన్పట్టగలదు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పేర్కొన్నట్లు "ప్రహసనాల్లోలాగ ఒకడు ఏదో వలపన్నడమూ, నాయకులు ఎత్తెత్తి అడుగులు వేస్తూనే ఆ వలలో చిక్కుకోవడమూ చూపించే పేలవనాటికలుకావు వారివి. వారి నాటికల్లో వ్యక్తుల్లోని అసందర్భపు గుణాలకు ప్రతిగా ప్రతినాయకులు మనకికూడా తెలియకుండా పై ఎత్తులు వేస్తారు".

విశ్వనాథకవిరాజుగారు ఏబదికిపైగా నాటికలను రచించియున్నారు. ఇందు దొంగాటకం, డొంకలో షరాబు, వైవాహికం, సరాగం, కిర్రుగానుగ, రాజీ, నేపథ్యంవంటి ప్రసిద్ధ రచనలు కలవు. అన్నింటియందును నిర్మాణచాతుర్యము, సన్నివేశహాస్యము, సంభాషణాచమత్కారము వెల్లివిరియుచుండును. అసలు వారనుసరించిన విధానములోనే యున్నది రచనా సౌష్ఠవమంత యును. వీరి నాటికలలో ఎక్కువభాగము గృహస్థ జీవితమునకు సంబంధించిన సన్నివేశముల చిత్రణము కన్పట్టగలదు; మనస్పర్థలువచ్చి విడిపోయిన ఇరువురు తుదకు రాజీపడుట, వాగ్గతమైన హాస్యము—ఇవి వీనియందు సర్వసాధారణమనిచెప్పవచ్చును. సామాన్య విషయములను స్వీకరించినప్పటికిని సంభాషణలయందును, సన్నివేశకల్పనయందునుగల వైచిత్రితో ఇవిఉత్తమ రచనలుగా రూపొందినవి, 'డొంకలో షరాబు'లోని షరాబుమోసము, 'దొంగాటకము'లోని దొంగవేషము, వైవాహికములోని వియ్యంకుని అజ్ఞాతవాసము, మనకు తెలియకున్నను, నాయకుని చిందులు, ప్రగల్భములు మనలను ఆనందింపజేయుచుండును. అంతమున, ఇంతవర కును తాను దాచిఉంచిన రహస్యమును రచయిత బయటపెట్టుటతో మనస్సునకు ఒక వికాసము కలుగును; ఇది కవిరాజుగారి శిల్పములోని ప్రత్యేకత.

నిర్మాణకౌశలమునకు ముఖ్యముగా పేర్కొనవలసిన రచన 'రాజీ'. ఇందు సగ భాగము భర్తకోపము, తక్కిన సగభాగము భార్యకోపము; భర్తకోపము తీరుటతో నాటిక అంతమైపోయినదని ప్రేక్షకుడనుకొనుచున్న సమయములో ఆకస్మికముగా మరల కథ ప్రారంభమగును, ఇంతలో భార్య సినిమా టిక్కెట్టునకు సైకిలు బహుమానము వచ్చినదన్న వార్త తెలియుటతో ఇరువురును 'రాజీ' పడుదురు. స్త్రీ-పురుష లిరువురును అన్యోన్యానురాగ మున మెలగవలెనన్న సందేశముతో నాటిక అంతమగును. కాని ఈ సందేశమునో, ఉపదేశ మునో కవిరాజుగారు సూచింతురేకాని, ఉపన్యాసమువలె బహిరంగముగ పాత్రలచేత చెప్పిం

పరు. కావుననే నిర్మాణశిల్పమున అవి ఉత్తమములనుట. మరియు వీరి నాటికలలోని మరి రెండు విస్పష్ట గుణములు—సంభాషణములలోని సారళ్యము, అందలి వేగము. సంభాషణలను ఇంత సరళముగా, వేగముగ నడిపింపగల సమర్థులు నాడు నాటికారచయితలలో లేరనుట అతిశయోక్తికాదు.

వీరి "నేపథ్యం" అనెడి ఏకాంకిక నాటి కంట్రాక్టు నాటకములమీది విమర్శ. ఆజాతి రచనలలో ఇది ఉత్తమమైనది. అన్ని రచనలందును మాండలికపదప్రయోగమును హాస్యసృష్టికొరకు సాధనముగా వీరు చేసియుండుట గమనార్హము. వీరి నాటికలన్నియును ప్రదర్శనాసౌలభ్యమునకు సుప్రసిద్ధములు. మరియు ఆ రచనలు సన్నివేశకల్పన, పాత్రపోషణ, సంభాషణాచాతుర్యములందు శక్తిమంతములగుటచేత నేటికిని అవి ప్రేక్షకుల ఆదరాభిమానములను చూరగొనుచున్నవి. దొంగాటకము, డొంకలో షరాబు, కిర్రుగానుగవంటి నాటికలలోని కమ్మని హాస్యము; దిద్దుబాటు, రాజీవంటి నాటికలలోని యథార్థజీవిత చిత్రణము కవిరాజుగారికి తెలుగు నాటికా సాహిత్యమున స్థిరమగు స్థానమును సంపాదించిపెట్టినవి. కేవలము రచయితలే కాక నటులు, ప్రయోక్తలు, విమర్శకులుకూడ అగుటచేత ప్రేక్షకుల చవుకబారు అభిరుచులకు లొంగిపోక, సాహిత్య గౌరవమునకు లోపమురాని, ప్రదర్శనాసౌలభ్యమును సాధించుకొన్న, బహుళజనామోదమును పొందిన రచనలు కవిరాజుగారు చేయగలిగినారు.

## శ్రీ పాకాల వేంకటరాజమన్నారు[2] :

ఇబ్సెన్, గాల్స్‌వర్దీ ప్రభృతులవంటి సాంఘిక రూపక రచయితల రచనలచే ప్రభావితులైన పి. వి. రాజమన్నారుగారు తెలుగు నాటికాసాహిత్యమున ఒక అపూర్వమైనస్థానమును కల్పించుకొన్నారు. వారి "తప్పెవరిది" (1930)తో తెలుగు నాటికాసాహిత్యమున ఒక క్రొత్త అధ్యాయము ఆరంభమైనదని చెప్పవచ్చును. పై పాశ్చాత్యరచయితల యందువలెనే, సమకాలీన సమాజమునందలి అనేకములైన లోపములను నాటికాముఖమున ఎత్తిచూపి విమర్శించుట వీరియందలి ప్రత్యేకత. సమకాలీన సంఘములోని కుళ్ళును వెలికితీసి, బహిరంగపరచి, సంఘసంస్కరణావశ్యకమును సుస్పష్టముచేయుట వీరి ఆశయము. వీరిమీదపడిన ప్రభావము పాశ్చాత్యసంబంధియైనను, రచనావిధానమునందు కాని, భావవ్యక్తీకరణవిధానమునందుకాని తదనుకరణము గోచరింపకుండుట గమనింపవచ్చును[3].

రాజమన్నారుగారి రచనలయందు శిల్పవిన్యాసముకంటె సందేశలక్ష్యము హెచ్చు. వారి నాటికలన్నియును ఏదో ఒక సందేశమును దృష్టియందుంచుకొని రచింపబడినవే— వేశ్యలు పతివ్రతలకంటె ఎక్కువ త్యాగము చేసినను వారి త్యాగము సమాజము దృష్టిలో నిరర్థకము (ఏమి మగవాళ్ళు, నిష్ఫలం); సంకల్పము, పర్యవసానము మానవుడూహించినట్లు జరుగునవికావు (విముక్తి); మాతృప్రేమ అనూహ్యము (తల్లిప్రేమ); లోకము కత్తులబోను, నిర్దాక్షిణ్యపు నియమములతో లోకము "దయ్యాలలంక"గా మారుచున్నది; తథాగతుని ఆధ్యాత్మిక విజయములో లోకమును సౌందర్యవంతము చేయగల ప్రేమజ్యోతులెన్నియో ఆరి

పోయినవి (నాగుపాము); "ప్రేమ లోకములను జయింపగల కాలమింకను రాలేదు"—ఇట్టి సందేశములకు వీరి రచన లునికిపట్టులు. మరియు, ఈ సందేశములు, శ్రీపాదవారు పేర్కొన్నట్లు "సమాజానికి పైపైనతేలే బెండ్లుకావు".

ఈ సందేశములు విస్పష్టముగా ఉపన్యసింపబడుట రచనావైశిష్ట్యమునకు లోపము; రాజమన్నారుగారిలో అట్టిలోపము కన్పట్టదు. రచయిత జీవితమునందలి మంచిచెడ్డల సంఘర్షణమును నిరూపించునంతవరకే తనబాధ్యతయని గుర్తెరుంగవలయును. సందేశము ప్రస్ఫుటమైనచో రచనయందలి గంభీరత కొరవడును; రాజమన్నారుగారు అట్టిలోపమున కెన్నడును పాల్పడలేదు. తాను భావించిన అంతమును ఒకమాటలో, లేదా ఒకచేష్టలో వ్యక్తముచేయగల్గుట సిద్ధహస్తుడైన రచయితకుకాని చేతకానిపని; అట్టిదానిని రాజమన్నారుగారు సాధించియున్నారు. 'నిష్ఫలం', 'ఏమిమగవాళ్లు' అనెడి ఏకాంకికల అంతములను పరిశీలించినచో ఈ విషయము సుస్పష్టముకాగలదు. ఒక్కమాటలో (ఏమిమగవాళ్లు), ఒక్కచేతలో (నిష్ఫలం) రచయిత తన నాటికమూలమున తాను చెప్పదలచుకొన్న సందేశమునంతటిని చెప్పివేయుట జరిగినది. ఈవిధముగా, రచనాశిల్పమున సంక్షిప్తతను సాధించిన నాటికాకర్తలలో రాజమన్నారుగారు ముఖ్యులు.[4]

వీరి నాటికలు సాంఘికసమస్యాప్రతిపాదకములని చెప్పియున్నాను. పతితలుగా ప్రసిద్ధలైన వేశ్యల ప్రేమానుబంధమును, త్యాగబుద్ధిని, హృదయనైర్మల్యమును వీరి నాకర్షించినవి. కాగా, కనకాంగి, చిత్రరేఖల పాత్రలలో ఆభావములను చిత్రించియున్నారు. వీరు కేవలము వేశ్యల గొప్పతనమును మాత్రమే చూపి నాటికలను అంతముచేయలేదు; దానితోపాటు పురుషుల (వేణు, జమీందారుల) నీచభావములనుకూడ వ్యక్తముచేసినారు. ఆ వేశ్యల త్యాగాదులను నిరూపింపవలెననెడి ఆశయముకంటె, అట్టి హృదయసంస్కారమున్నవారికి రెండవవారి నీచభావములవలన ఎంత తీరని అవమానముకలుగునో సూచించుటయే ప్రధానమని చెప్పవచ్చును. అనగా తనకు నచ్చినపాత్రలను పైపైకెత్తికొనిపోయి, సంఘమునందు వారు నీచముగా చూడబడుచున్నను, నిజముగా వారు ఉన్నతులే అని చూపుటమాత్రమే కాక, అంతటి ఉత్తములును నీచవాతావరణములో, నీచస్వభావులు పెట్టు హింసచేతను, చూపెడి న్యూనతవలనను తలక్రిందులుగా పడిపోయినట్లు చూపుట రాజమన్నారుగారి రచనలలోని విశిష్టత.

బాల్యవితంతువులజీవితములను వీరు రెండునాటికలందు చిత్రించియున్నారు—విముక్తియందలి రాధ, వయ్యాలలంకయందలి సుధ – రాజమన్నారుగారి విశిష్టపాత్రచిత్రణములు; ఇందు సుధ కేవలము కాల్పనికజీవి. తాను ఆనందముగా నుండుటయేకాక తన ప్రక్కనున్నవారినిగూడ సంతోషపెట్టుట ఆమెప్రకృతి, ఈమెకు కేవలము విరుద్ధప్రకృతి ఆమె అక్క లక్ష్మీకాంతం. వీరిరువురికి మధ్యగల వ్యత్యాసములను చూపుటలో రచయిత జీవితమునకొక నూత్న వ్యాఖ్యానముచేసెను—స్వేచ్ఛాజీవులమని నిత్యజీవితమందు గర్వించువారు నిజముగా స్వేచ్ఛకు దూరమై అనేకబంధనములలో చిక్కుకొనియుందురు; మానసికమైన స్వేచ్ఛను కోరువారికి ఈ

జీవితపుటెల్లలు అడ్డురావు. తనను ముద్దిడుకొననెంచిన చలపతిరావును వారించి, 'ఏమో ?' అన్న వాని ప్రశ్నకు "అప్పుడు మనం ఇక్కడే ఉండిపోవాలి, మళ్ళీ ఆదెయ్యాలవూళ్ళోకిపోతే ఎలా బతకడం" అని సుధచే సమాధానము చెప్పించుటలో ఆమెజీవితము నంతటిని వ్యాఖ్యానించినారు రాజమన్నారుగారు; వీరు సృష్టించిన పాత్రలన్నింట సుధ విశిష్టమైనది.

ఇట్లు, ఏదో ఒకసమస్యను గ్రహించి, ఆసమస్యను ఒక సన్నివేశముగా ఊహించి, దానికి రూపకల్పనచేసి, దానిచుట్టును పాత్రలను చిత్రించుట రాజమన్నారుగారి రచనావిధానమని చెప్పవచ్చును. కేవలమేదో యొక సందేశము నొసంగుటలోనేకాక రచనాశిల్పమున వైశిష్ట్యమును చూపుటచేతను కూడ రాజమన్నారుగారు ఉత్తమనాటికాకర్త లగుచున్నారు. ఎక్కడికక్కడ క్రొత్తమార్గమును పట్టుచు, చివరవరకును ప్రేక్షకుల ఆసక్తిని ఆకట్టుకొనగలశక్తి వారి కథానిర్మాణమున కున్నది. ప్రేక్షకులను, పతితలను సన్మార్గవర్తులను చేయవలెననెడి యాకాంక్షకంటె, నేటి సంఘములోని సత్యాసత్యములను, విస్తృతమైన జీవనవికాసము సంకుచిత సంప్రదాయాదులవలన నిరుద్ధమైపోవుచున్న విధానమును వారి ముందుంచుటయే రాజమన్నారుగారి ధ్యేయము.

రాజమన్నారుగారి నాటికలను చదువుచున్నప్పుడు, అందు కొట్టవచ్చినట్లు కన్పట్టు వారి వ్యక్తిత్వమును గమనింపగలము. ఆ వ్యక్తిత్వము వారి విశాలమైన దృష్టివలన, తులనాత్మకమైన పరిశీలనవలన, పతితజీవుల బాధాత్మకగాథలను చిత్రింపవలెననెడి ప్రగాఢవాంఛవలన తీర్చిదిద్దబడినది. భావములో కుదింపు, రచనలో సంక్షిప్తత, కొసమెరుపు, జీవితవ్యాఖ్యానము, గాఢవేదనాచిత్రణము, సుష్ఠురచనాశిల్పము—ఇవి రాజమన్నారుగారిని ఉత్తమనాటికారచయితగా తీర్చిదిద్దినవి. ముఖ్యముగ స్త్రీ–అంచున సంఘనియమములకు బలి అయిన స్త్రీ–వారి చిత్రణము వలన తన నిజరూపమును నేటివారికి చూపగలిగినది.

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు[5] :

ప్రహసనరచనలో సిద్ధహస్తులుగా, హాస్యబ్రహ్మగా తెలుగువారికి సుపరిచితులు భమిడిపాటి కామేశ్వరరావుగారు. భమిడిపాటివారికి ముందు ప్రహసనరచన లేకపోలేదు; అందు కొన్ని సంస్కృతానువాదములు. కొన్ని పాశ్చాత్యప్రహసనముల కనువాదములు (సెట్టి లక్ష్మీనరసింహం, వేదం వెంకటాచలయ్యల మోలియర్ అనువాదములు మొదలగునవి). తక్కినవి స్వతంత్రరచనలు (కందుకూరి, చిలకమర్తి మొ॥)—ఇందు కొన్ని ప్రదర్శితములు కూడను. కాని తెలుగు సాహిత్యమున ప్రహసనరచనను ఒక ఉద్యమముగా సాగించి, ఆజాతిరచనలకు ఒక సాహిత్యప్రక్రియగా ప్రత్యేకస్థానమును కల్పించినవారు భమిడిపాటి కామేశ్వరరావుగారనక తప్పదు.

కామేశ్వరరావుగారికి ఇరువురు పాశ్చాత్యుల రచనలు మార్గదర్శకములైనవి—ఆ రచయితలలో ఒకరు మారిస్ మేతర్లింకు; రెండవవారు మోలియర్. కామేశ్వరరావుగారి రచనావ్యాసంగము మేతర్ లింక్ అనువాదములతో ఆరంభమైనది. గురుపాదులు శ్రీపాద కామేశ్వర

రావుగారి ప్రోత్సాహమున 1922_25 మధ్య మేతర్‌లింకు మూడు చిన్ననాటికలను (మొనాలినా, జాయ్ బెన్, మేరీమాక్డోలిన్) గ్రాంధికభాషలో అనువదించినారు (ఇవి అముద్రితములు). మేతర్‌లింకు రచనలు, వీరిలోని నాటకరచనోత్సాహమును వెల్లివిరియింపజేసినవి. ఇంతలో 1923 లో రాజమహేంద్రవరప్రభుత్వ కళాశాల కనుబంధింపబడిన మెట్కాఫ్ వసతిగృహము యొక్క పూర్వవిద్యార్థిసంఘము 8 గురు సభ్యులతో ఆరంభమైనది. ఆకాలములోనే కామేశ్వర రావుగారు తమ ప్రథమ స్వతంత్రప్రహసనము "బాగుబాగు" రచనను పూర్తిచేసినారు. (దీనికి హేజ్‌లిట్ వ్రాసిన "On Nicknames" అనెడి వ్యాసము నామమాత్రముగ ప్రేరకమైనది.) ఆయేట వినాయకచవితి సందర్భమున పైసంఘమువారు దీనిని ప్రప్రథమముగా ప్రదర్శించినారు. అదిమొదలు ప్రతిసంవత్సరమును ఆసంఘమువారు కామేశ్వరరావుగారి క్రొత్తప్రహసనము నొకదానిని ప్రదర్శించుట ఆచారమైనది.[6] 1926_27 లో ఎప్పుడూ ఇంతే, కచటపలు_అనెడి వీరి స్వతంత్ర ప్రహసనములు భారతిలో వరుసగా ప్రకటితములైనవి; వారి రచనల ముద్రణమునకు ఇదియే ప్రారంభము.[7]

1929 లో భాగవతుల అప్పారావుగారి ప్రోత్సాహమున కామేశ్వరరావుగారి దృష్టి మోలియర్ రచనలపై మరలినది_"అప్పటినుండియే నాకు కనువిప్పు కల్గినది" అని అనెడివారు కామేశ్వరరావుగారు. నాటినుండి మొత్తముమీద 12 వరకును మోలియర్ రచనల ననుసరించి తెలుగులో ప్రహసనములను రచించినారు. 1953 లో రిటైరయినతరువాత వీరిదృష్టి సంస్కృత రూపక సాహిత్యముపై తిరిగినది. అంతట ముద్రారాక్షస_మృచ్ఛకటికలను అనుసరించి 'రాక్షస గ్రహణం', 'వసంతసేన' అనెడి పేళ్ళతో తెలుగులో నాటకములను రచించిరి. పిమ్మట 'ప్రాచీనప్రముఖప్రశస్తప్రసన్న' నాటకకర్తయగు భాసుని నాటకములను చేపట్టి, అసంపూర్ణ మగు చారుదత్తమును విడిచి, తక్కిన 12 రూపకములను అనుసరించి తెలుగునరూపకములను వ్రాసినారు.

ఇన్ని ప్రాచ్యపాశ్చాత్యరూపకములను తెలుగులోనికి తెచ్చినను కామేశ్వరరావుగారు కేవలము అనువాదకులుమాత్రమే అని చెప్పుటకు వీలులేదు. వారు వానిని అనుకరించినారు, లేదా అనుసరించినారు. పాశ్చాత్యరూపకములకు ఆంధ్రతాముద్ర వేసినారు; ప్రాచ్యరూపక ములకు నవ్యతా ముద్రవేసినారు. ఇంకొక విశేష మీరచనలన్నియును గోదావరీ మండలవ్యావ హారికమున సరళముగా సాగిపోవుట.

ప్రహసనములు : మోలియర్ (1622_73) ఫ్రెంచిదేశస్థుడు. ప్రపంచప్రహసనకర్త లలో అతనిది అగ్రతాంబూలము. 17 వ శతాబ్దము ఫ్రెంచిదేశమున మహారాజు మొదలు సామాన్యునివరకును అతని హాస్యమున నోలలాడనివారే లేరనుట అతిశయోక్తికాదు. ఆ ప్రహ సనములలోని సన్నివేశ_పాత్రపోషణ_హాస్యముల చమత్కృతి కామేశ్వరరావుగారిని బాగుగా ఆకర్షించినది__"అతని కథాసందర్భం అపూర్వం, చమత్కారం అఖండం, అనుభవం అపారం, భాషాజ్ఞానం అద్వితీయం, హేళన తీవ్రం" అని వారు మోలియర్‌ను కొనియాడినారు.

ప్రహసనమునందలి హాస్యము మూడువిధములు—అంగవిన్యాసములవలనను, చేష్టల వలనను కలుగునది మొదటిది: సంభాషణలయందు వ్యక్తమగునది రెండవది; సంఘటనల, సన్నివేశముల కూర్పువలన కలుగునది మూడవది—ఇవి ఉత్తరోత్తర గుణాధికములు. ఈ ముప్విధములగు హాస్యములును మోలియర్ రచనలో కలవు. కామేశ్వరరావుగారు అనుసరణ లందేకాక, స్వతంత్రరచనలందును ఈ ముప్విధములగు హాస్యములను సాధించియున్నారు. ఇతి వృత్తమునుబట్టి ఒక్కొక్కదానియందు ఒక్కొక్కగుణము ప్రాధాన్యము వహించుటయును కలదు.

వారి ప్రథమ స్వతంత్రప్రహసనమగు "బాగుబాగు"లో వాక్చమత్కృతి అధికము; అందు ఆంగ్లపదములుకూడ విరివిగా ప్రయుక్తములైనవి. అసలువారు పాత్రలకు పెట్టినపేర్లే హాస్యద్యోతకములు—శానయ్య, మాలోకం, భాగయ్య, పర్వతాలు, పానకాలు, శఠకోపం మొ॥ మరియు సంభాషణాచమత్కృతిని సాధించుటకు వీరవలబించిన ఒక ప్రముఖమార్గము పాత్ర తననుతాను తిట్టుకొనుట, లేదా పొగడికొనుట. ఒక ఉదాహరణము—"తప్పనిసరి"లో తప్పనిసరి వైద్యుడు శానయ్య తన గొప్పతనమునుగూర్చి వినుచు వరుసగా 'ఓరి నాయిల్లు బంగారంగానూ', 'ఓరి నేచచ్చిపోనూ', 'ఓరి నన్నుపాతెయ్య' అనుచు ఆశ్చర్యపోవును. (పుట 20). ఆ ప్రహసనమందే "మూగతనం ఎందుచేతవస్తుందంటారు?" అనెడి ప్రశ్నకు "అబ్బే! అందులో ఏముందీ! మాటలు పోవడంవల్లే!" అని తప్పనిసరి వైద్యుడు చెప్పిన సమాధానమువంటివికూడ వీరి రచనలలో అధికముగానుండును. సంభాషణలు, చేష్టలు మూల మున హాస్యమును సాధించుటలో సేవకుల, పెండ్లికుమార్తెల తండ్రుల పాత్రలు ఉపయుక్తము లైనవి. ఇంక సన్నివేశకల్పనలవలన హాస్యరససృష్టిచేయుటకు ప్రతి ప్రహసనమునందును ఉదాహరణములు కన్పట్టగలవు.

మోలియర్ తననాటి సంఘమునందలి దురాచారములను, వ్యక్తులయొక్క అవగుణము లను తన ప్రహసనములందు పరిహసించినాడు. కామేశ్వరరావుగారు కథనట్లేయుంచి పాత్రలకు భాషకు కేవలము ఆంధ్రతాముద్ర వేసినారు; కాని తమకాలమునాటి సాంఘిక పరిస్థితులను, వ్యక్తులనుమాత్ర మిందు పొందుపరచలేదు. కామేశ్వరరావుగారి గొప్పతనము మోలియర్ అనుసరణములందుకంటె మోలియర్ రచనలతో తుల్యమైన స్వతంత్ర రచనలను చేయుట యందే కలదని చెప్పవచ్చును. మోలియర్ రచనలన్నియును కేవలము ప్రదర్శనముల కుద్ది ష్టములైనవి; అన్నియును ఒకే సంఘముచేత ప్రదర్శింపబడినవి. కామేశ్వరరావుగారి రచనలును అంతియేయగుట గమనార్హము. వారి రచనలు ఆంగిక-వాచిక-సన్నివేశ చమత్కృతులవలన హాస్యరససృష్టి జేయుచు, ప్రేక్షకులకు నిత్య నూతనములుగ కన్పట్టుచుండుటయే అందలి విశిష్టతకు తార్కాణము. శానయ్య, మాలోకంవంటి పాత్రలు తెలుగు సాహిత్యమున శాశ్వ తత్వము పొందినవి. ప్రదర్శనానుకూలములగు ఉత్తమ ప్రహసనములను తెలుగులోకమునకు అందించిన కామేశ్వరరావుగారు తెలుగునాటకరంగమున చిరస్మరణీయులు.

సంస్కృతానుసరణములు : భాసుడన్నచో కామేశ్వరరావుగారికి అమితమగు గౌరవము. "...నవీనులు కనిపెట్టిన ఏకాంకికలు అతనికి తెలిసినట్టు కనిపిస్తుంది. అతడు పెద్ద కథ పట్టుకొని అదంతా నాటకిస్తూ కూచోడు. ఆ కథలో నాటకం ఎక్కడుందో చూపిస్తాడు. కొద్ది మాటలతో అతడు పాత్రలకి జీవం పొయ్యడమేకాదు, వ్యక్తిత్వంకూడా ప్రసాదించగల స్రష్ట. ఏ పాత్ర ఎప్పుడు ఏ మాట ఎంతవరకు ఏరీతిగా అనాలో అనిపించగల ఔచిత్యం అతని సొమ్ము. దేవుడంతటివాడికి అతడు మచ్చ చూపించగలడు. రాక్షసికి హృదయం ఉందని నిరూపించగలడు. ప్రతి పాత్రనీ అతడు ప్రేమించే చిత్రించాడు. మానవ ప్రకృతి చిత్రణం హడావిడిలో అనుగుణంగా ప్రకృతిని వర్ణించడం అతడు మరవలేదు" అని భాసుని పొగడినారు కామేశ్వరరావుగారు.

ఇట్టి భాసుని నాటకములను పండిత ప్రకాండులు చాలమంది అనువదించిరి. అసంపూర్తిగా నిల్చిపోయిన "చారుదత్తము" తప్ప తక్కిన పన్నెండింటిని "ఆచరణకు అనుకూలించే లాగున మార్చి" ప్రకటించినారు కామేశ్వరరావుగారు. ప్రదర్శన సౌలభ్యము చేకూర్పవలెననియు, భాసుని గొప్పతనము తెలుగువారికి సంబోధము చేయవలెననియు కామేశ్వరరావుగారి ధ్యేయము! ఆ దృష్టితో వారు మూలములకు చాల మార్పులు చేసినారు. కాని ఈ అనుసరణలను చదువుచున్నప్పుడు కామేశ్వరరావుగారు అంతగా మెచ్చుకొన్న భాసుడు కన్పట్టుటలేదు! వానియందుకూడ మోలియర్ అనుసరణలలో సిద్ధహస్తులైన 'హాస్యబ్రహ్మ' యే కన్పట్టుచున్నాడు. అంతియేకాదు, భాసుని పదప్రయోగ వైచిత్రికూడ సరిగా తెలుగులోనికి రాలేదేమో అని శంకించుట అసమంజసముకాజాలదు. ఒక ఉదాహరణము—ఊరుభంగము చివర, కరుణమయ స్ఫోరకమైన దుర్యోధన-కుమారుల సంభాషణ ఘట్టము కలదు. దుర్యోధనుడు తాను తన తమ్ములయొద్దకు పోవుచుంటినని చెప్పగా, కుమారుడు తానుకూడ వెంటవత్తుననెను: అప్పుడు దుర్యోధనుడు "వెళ్ళు. వృకోదరునడుగుము" అని అనును. అచ్చట "వృకోదర" శబ్దము సార్థకప్రయోగము. భీమునిగూర్చిన దుర్యోధనభావన యంతయును ఆ పదమున మూర్తీభవించినది. కాని కామేశ్వరరావుగారు ఆ పదమును విడిచిపుచ్చి, "భీముడు బాబాయిలేడూ? భీముడి బాబాయిని పోయి అడుగు" అని తేల్చివేసినారు.

## శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి :

శ్రీ శివశంకరులు సాహిత్య సమితికి పట్టుగొమ్మలు. "సభాపతి" స్థానము నలంకరించినవారు. కేవల వచననాటికా రచనలో విశ్వనాథకవిరాజుగారును, రాజమన్నారుగారును రెండు మార్గములను వెలయింపగా, పద్య-గేయ నాటికలకు తెలుగు సాహిత్యమున ప్రత్యేక స్థానమును కల్పించినవారు శ్రీ శివశంకరులే. "స్త్రీ విరోధి" వంటి ఏ ఒకటి రెండు వచన నాటికలనో తప్పించినచో వారి తక్కిన రచనలన్నియును పద్య-గేయాత్మకములే; ఇందు కొన్ని నాటకములు; కొన్ని ఏకాంకికలు; తక్కినవి నాటికలు.

"పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" వీరి ప్రథమ పద్యనాటిక (1933); "వరపరీక్ష" వీరి ప్రథమ గేయనాటిక (1936). మొదటిది ఐతిహ్యము ఆధారముగా చేయబడిన

ఊహకల్పనము. రెండవదానికి 16 వ శతాబ్దిలో జరిగిన ఒక సంఘటన ఆధారము. బిల్హణ చరిత్రమును మార్చి క్రొత్తదనమును కూర్చినది కవిప్రియ. నోణకజాయ, పదాంకం, రాజ జామాత, దీక్షితదుహిత, సహజయానపంథీ, సద్వాక్యమువంటి వానికి రాజతరంగణిలోని కథలు, ఐతిహ్యములు ఆధారములు. పద్మావతీచరణచారణచక్రవర్తి జయదేవునకు పద్మా వతీదేవియందుగల ప్రేమాధిక్యమును చిత్రించిన పద్య-గేయనాటిక; ఇందు పద్మావతీ చిత్ర ణము హృదయాహ్లాదకరమైనది.

శ్రీ శివశంకరులపై రిచర్డ్ వాగ్నర్‌వంటి జర్మను నాటకకర్తల, టాగూరువంటి భారతీయ నాటకకర్తల ప్రభావము కలదు. అంతియేకాదు; సంస్కృత నాటకకర్తలలో విస్తృత పద్యరచన చేసిన మురారి, రాజశేఖరుల ప్రభావముకూడ వీరిపై కలదు. శ్రీ శివశంకరులు తమ గేయములను ద్విశ్ర, త్రిశ్ర, చతురశ్ర, ఖండగతులలో నడిపించియుండుటచేత వాగ్నర్‌వలె హ్రస్వ ఛందములు వీరికి ప్రీతికరములని స్పష్టమగుచున్నది. వీరి రచనావిధానమును వింగ డించి చూచినచో హృదయంగమమైన సున్నితభావములకు గేయమును, ఉదాత్తభావ వ్యక్తీ కరణకు పద్యమును ప్రయుక్తము చేసినట్లు కన్పట్టుచున్నది. ఈ రచనలను చక్కని ఆపెరాల వలె ప్రదర్శింపవచ్చును. బి. వి. నరసింహారావుగారు "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి"ని పలుసార్లు నృత్యనాటికనుగా ప్రదర్శించి యుండుట గమనింపదగినది. మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు "సహజయానపంథీ"ని మద్రాసు గోక్లేహాలులో ప్రదర్శించియున్నారు.

శ్రీ శివశంకరులు తెనాలి రామవిలాస సభలోని దర్శకత్రయములో ఒకరు. చక్కని దేశికులు. అవసరమునుబట్టి ధృతరాష్ట్రాది పాత్రలను ధరించియున్నారుకూడను. దర్శకులుగా గడించిన అనుభవము వీరి రచనలలోకూడ కన్పట్టగలదు.

ఇబ్సెన్ ప్రభావము తరువాతవచ్చిన నాటకరచనావిధానమునపై ముప్వురు రచయితలు (విశ్వనాథకవిరాజు, రాజమన్నారు, శివశంకరులు)ను సమర్థులేయని చెప్పవచ్చును—స్వగతము లను దీర్ఘోపన్యాసములను పరిహరించుట; పాత్రలు తక్కువగానుండుట; పతాకాస్థానకము నొద్దనే (అనగా రసోద్గారస్థితికి సమీపస్థితిలో) కథను ప్రారంభించుట మొదలగునవి ఈ లక్షణములకుదాహరణములు. ఈ ముప్వురేకాక తక్కిన నాటికారచయితలలోకూడ పలువురు ఈ మార్గమున పయనించియున్నారు.

## మరికొందరు ప్రసిద్ధ నాటికాకర్తలు

ముప్విధములగు నాటికారచనలకు ఆద్యులైన ముప్వురు నాటికాకర్తలనుగూర్చి ఇంత వరకును వివరించియున్నాను. ఇప్పుడు మరికొందరు ప్రసిద్ధ నాటికాకర్తల రచనలనుగూర్చి వివరింతును. ఇందులో కొందరు పై మూడు మార్గములలో ఏదోయొక మార్గమునకు చెందు దురు. మరికొందరు ప్రత్యేక విశిష్టతగల రచనలుచేసి సుప్రసిద్ధులైనారు.

శ్రీ అబ్బూరి రామకృష్ణారావు[1] :

రామకృష్ణారావుగారు నటులుగా, దర్శకులుగా, కవులుగా సుప్రసిద్ధులు. వీరి 'నదీ సుందరి' (1932) అద్భుతమైన కాల్పనిక చిత్రణము. విశ్వనాథవారి కిన్నెరసానివలె, మానవాకృతిని తాల్చియున్న కావేరీనదియే ఇందలి 'నదీసుందరి'. కవేరమహర్షి యాశ్రమమున కన్యగా పెరిగిన కావేరి, సహ్యాద్రినుండి నదిగా ప్రవహించుట యిందు చిత్రితమైనది. ఒక కావ్యఖండమునువలె, కాల్పనిక మధురిమతోను, లలితభావస్ఫోరకములగు సంభాషణములతోను నడిపిన యీ నాటిక ఈ జాతి నాటికల కలంకారము. కావేరీ–అగస్త్యుల మధురప్రేమభావము వీరి కోమలమైన లేఖినియందు మరింత పవిత్రమైనది. ఇది ప్రదర్శనానుకూలమైన చక్కని రచన[2].

శ్రీ చలం :

చలం, ముద్దుకృష్ణ, గోపాలరావుగార్ల సంఘ తిరస్కారభావములనుగూర్చి ఇంతకు ముందే వివరించియున్నాను. వీరిలో చలంగారు నాటకములందువలెనే నాటికలయందును స్వీయ భావ వ్యక్తీకరణమునే కొనసాగించినను, ముద్దుకృష్ణ, గోపాలరావుగార్లు మాత్రము అశోకం, హిరణ్యకశిపుడు నాటకములందువలె తమ నాటికలందు నూత్న వ్యాఖ్యానముల జోలికిపోలేదు.

చలంగారు నాటికలయందుకూడ సర్వసంఘ సంప్రదాయ తిరస్కారణమును, స్త్రీ పురుష సంబంధముల విమర్శయును చేసియున్నారు. సత్యం, శివం, సుందరం, పద్మరాణి, కొండడు మొదలైన అన్ని నాటికలందును, సంఘ విమర్శ, స్త్రీల సమస్య వ్యంగ్యముగా, అవహేళన పూర్వకముగా చేయబడినది. వీరి నాటికలలో 'మృత్యువు' విశిష్టమైనది. దీనిని సాంకేతిక, లేదా 'ప్రతీక నాటిక'నుగా పేర్కొనవచ్చును. 'తెలుగు నవల' అనెడి రచనలో నేటి తెలుగు నవల రచన వ్యంగ్యముగా చిత్రితమైనది. కాని ఈ వ్యంగ్యము అవహేళన రహితమగుట గమనార్హము[3].

చలంగారి నాటికలన్నింటను 'భానుమతి' ఉత్తమమైనది. వీరి నాటకములవలెనే నాటికలు కూడ సంభాషణాత్మకములైన రచనలు మాత్రమే. కాని 'భానుమతి' మాత్ర మిందుల కపవాదము. వారి వ్యక్తిత్వము ఏమాత్రమును కన్పట్టకపోవుట యిందలి విశిష్టత. భారత కథయందు నామమాత్రముగానున్న 'భానుమతి' ఒక మహారాజ్ఞిగా చలంగారికలములో రూపొందినది.

శ్రీ ముద్దుకృష్ణ :

ముద్దుకృష్ణగారి నాటికలన్నియును ప్రయోగ సౌలభ్యముకలవై బహుజనాదరణమును పొందినవి. ఇందు 'టీ కప్పులోని తుఫాను' హాస్యనాటిక—పెద్దల కట్టుబాట్లు చిన్నలమీద అధికారము చలాయించుట వరకే అనియు, అవి వారివరకు వచ్చినచో అంతటివారును తలక్రిందులైపోదురనియు ముద్దుకృష్ణగారిందు నిరూపించినారు. 'అపవాదు' సమస్యారూపకము. భర్త మరియొక వివాహము చేసికొనగా, వానిని విడిచివచ్చిన స్త్రీ స్వతంత్రముగా జీవించుటలో నెదుర్కొనెడి కష్టములిందు చిత్రితములైనవి. ఆమె మానసిక సంఘర్షణమును నిరూపించుటకు

వీరు ప్రయత్నించి యున్నచో ఈ రచనకు మరింత జిగి చేకూరియుండెడిది. వీరి 'ఢాకినీ' మూఢ విశ్వాసములమీద దండయాత్ర.

వీరి 'అనార్కలి' చక్కని విషాద నాటిక. రేడియోలో ప్రసారితమైన తొలి తెలుగు నాటిక ఇదియే. కె. వి. గోపాలస్వామిగారు పేర్కొన్నట్లు ఇందు ఆర్థిక వ్యవస్థకును, ఆవేశ ప్రధానమైన ప్రేమకును సంఘర్షణము ప్రధానముగా చిత్రితమైనది.

## శ్రీ చింతా దీక్షితులు :

"శబరి" నాటకమందువలెనే నాటికలయందును భాషయందు మాధుర్యము, రచనయందు సారళ్యము, శిల్పమునందు లాలిత్యమును చూపినారు దీక్షితులుగారు. వీరివి 'వ్యాఖ్యాన నాటిక'లనినారు డా. శ్రీపాదవారు. (కవికొండల వేంకటరావు, అడివి బాపిరాజుగార్లును ఇట్టి వ్యాఖ్యాన రచనలను చేసియున్నారు). ఇందు సంఘర్షణ, నాటకత్వము తక్కువ. వీరి శ్రీకృష్ణుడు, శర్మిష్ఠ, జటాయువు, చక్రవాక మిథునము మొదలగు నాటికలయందు సంఘర్షణము కంటె భావమునకు, ఆ భావమూలమున తాము వ్యక్తము చేయదలచుకొన్న అభిప్రాయమునకు ప్రాముఖ్యముకలదు. ఇవి ఏకాంకిక తొలిరోజులలో వచ్చిన రచనలు. కథానికావాఙ్మయమునందువలెనే నాటికాసాహిత్యమునందును దీక్షితులవారికి ప్రత్యేకస్థానముకలదు.

## డా. చిలుకూరి నారాయణరావు[4] :

ఈ రోజులలో నాటికారచనచేసిన ప్రముఖులలో డా. చిలుకూరి నారాయణరావుగారు ఒకరు__అశ్వత్థామ, అంబ లేక మొండి శిఖండి, అచ్చి అనునవి వీరి నాటికలు. ఈ మూడు నాటికలను మూడు భిన్న దృక్పథములతో వీరు వ్రాసియున్నారు. 'అశ్వత్థామ' విషాద నాటికలలో ఉత్తమశ్రేణికిచెందిన రచన, 'అంబ' యందు ఆమె భీష్ముని గెల్చుటకు చేసిన తపస్సు, దాని సఫలీకృతి నాటకీకరింపబడినది. ఇంక 'రాజులు, మంత్రులు, వీరులు మొదలగువారే నాటకములలో ముఖ్యపాత్రములుగా నుండవలెననే దురభిప్రాయమును తొలగించడానికి వ్రాసినది'. ఇందు కమ్మనిపలుకుబడి, హాస్యము కలవు. 'అచ్చి', రంగాధిక్యముకలది. వీరి ఈ రచనలలో ప్రయోగసౌలభ్యము తక్కువ! కాని అన్నియును విజయవంతముగా ప్రదర్శింపబడినవి !

## శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు[5] :

రేడియోనుండి ప్రసారమైన ప్రథమ సంపూర్ణ సంగీతరూపకము విశ్వేశ్వరరావుగారి బిల్హణీయం (1939), షెల్లీ రచించిన 'ప్రొమిథియస్ అన్ బౌండ్'ను సంపూర్ణ సంగీత నాటకముగా అనువదించియున్నారు; కళాపూర్ణోదయగాథను 'కలభాషిణి' అనెడి పేరుతో రచించి ధారావాహికముగా రేడియోలో ప్రసారము చేసినారు. వరూథిని, శారదోత్సవము మున్నగునవి వీరి ఇతర గేయనాటికలు. విశ్వేశ్వరరావుగారు శాంతినికేతనమున రవీంద్రుని అంతేవాసియై, గేయ ప్రాధాన్యములగు రచనలను అలవర్చుకొన్నారు.

**శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి :**

శైలిలో, పలుకుబడిలో తెలుగుదనము మూర్తీభవించిన శాస్త్రిగారు చక్కని నాటిక (రూపిక)లను కూడ రచించినారు—కలంపోటు, పునాదిరాయి, లక్ష్యసిద్ధి అనెడి మూడును 'కలంపోటు' అను సంపుటిలో ప్రకటితమైనవి (1955). కలంపోటు (రచన-1936) కృష్ణదేవ రాయలనాటి కథ. పునాదిరాయి (రచన 1937); లక్ష్యసిద్ధి (రచన 1939) భారతగాథకు సంబంధించినవి.

**శ్రీ తిరుపతి వేంకటకవులు :**

వీరు నాటకములనేకాక పెక్కు ప్రహసనములనుకూడ రచించియున్నారు—రసాభాసము, పల్లెటూళ్ళ పట్టుదల, అపూర్వ కవితా వివేచనము మొదలగునవి. సహజముగా వీరి శైలి సారళ్యమునకును, సూటిదనమునకును, చక్కని పలుకుబడికిని ప్రసిద్ధినందియున్నది.

**శ్రీ మల్లాది అవధాని (జననము-1915) :**

వీరు విశ్వనాథకవిరాజుగారి జ్యేష్ఠపుత్రులు. (పూర్తిపేరు వేంకట సూర్యనారాయణ అవధాని). పితృపాదుల సాహచర్యములో నాటక రచయితలుగా, నాటక విమర్శకులుగా తీర్చి దిద్దబడినారు. వీరి తొలిరచన 'కంట్రాక్టుడ్రామా' అనెడి పేరుతో రచింపబడిన 'అసంపూర్ణ రామాయణం' తెలుగు నాటకరంగమున విప్లవము తెచ్చిన నాటిక. వీరి గాలివాన నాటికనుగూర్చి ఇంతకుముందే పేర్కొనియున్నాను. ఇవికాక వీరు నాదిర్షా, ఆనందో బ్రహ్మ మున్నగు పెక్కు నాటికలను, ఖడ్గతిక్కన, జగజ్జ్యోతి, భారతయోధులు, నవద్వీపం, జగన్నియంత మొదలగు సుమారు నూరు ఏకాంకికలను రచించియున్నారు. అవధానిగారి రచన శక్తిమంతమైనది; రంగస్థల ప్రయోగానుకూలమైనది. అవధానిగారు 'నాట్యభారతి గ్రంథమాల'ను స్థాపించి, విశ్వనాథ కవిరాజుగారి రచనలను, తమ రచనలను కొన్నింటిని ప్రకటించియున్నారు.

**శ్రీ మల్లాది వేంకట కృష్ణశర్మ :**

వీరు విశ్వనాథకవిరాజుగారి సోదరులు. నాటక రచయితగా సుప్రసిద్ధులు. సురభి నాటక సమాజమువారి కొరకు వీరు పెక్కు నాటకములను రచించి, వారికి సన్నిహితులై, ప్రదర్శనసౌలభ్యమును కలిగించుచున్నారు. నాటక రచనయందేకాక ఏకాంకికా రచనయందును వీరు సిద్ధహస్తులు. వీరి వారసత్వము బహుళ ప్రదర్శనములను పొందిన సుప్రసిద్ధమైన రచన. నామకరణము, ప్రత్యక్షదైవము, సుబ్బమ్మ విరహం, గతిలేని దేశంలో మతిలేని మనుష్యులు మున్నగునవి హాస్యపరములైన ఏకాంకికలు. ప్రేమసాగరమథన మనునది స్త్రీ పాత్రలులేని నాటిక (1936 బర్లెస్క్ పద్ధతిలో నడచిన రచన). శర్మగారి రచనలన్నియును సరళములై, ప్రదర్శనసౌలభ్యమును కలిగియున్నవి.

**శ్రీ నోరి నరసింహశాస్త్రి (జననము-1900) :**

నాటికా రచనలో వివిధములైన నూతన ప్రయోగములనుచేసినవారు నోరి నరసింహ శాస్త్రిగారు. చారిత్రక నాటికలు, ప్రతీక నాటికలు, వ్యాఖ్యాన నాటికలు మొదలగు వానిని వీరు

చాల వ్రాసిరి. వీనియందు ప్రదర్శనాసౌలభ్యము తక్కువ. పతంగయాత్ర, శబ్దవేధి, సర్ప సత్రము అనునవి పౌరాణిక రచనలు. 'ఖేమాభిక్షుని', 'భాగవతావతరణము', 'సోమనాథ విజయము' అనునవి చారిత్రకములు. స్వయంవరమువంటివి సాంఘికములు, 'తేనెతెట్టె' (1950), వంటివి మారిస్ మేతర్లింకు ననుసరించిన ప్రతీకనాటికలు. పౌరాణికకాలమునాటి పరిస్థితులను, నాటి వ్యక్తుల గుణాగుణములను సునిశితముగ పరిశీలించి, జనమేజయుని సర్పయాగమును చిత్రించిన నాటిక 'సర్పసత్రము'. యాగప్రారంభము, నాగలోకవాసుల సంక్షోభము నాటికకు పీఠికాప్రాయములు. ఇక తక్షకుని పిలిచిన క్షణమునుండి యాగాంతము వరకును నాటిక అతి వేగముగా నడచినది.

'సోమనాథవిజయము' (1924) ను ఆరు రంగముల నాటకమునుగా పేర్కొనినారు రచయిత; కాని నిజముగా అది నాటికయే. మహమ్మదుగజనీ సోమనాథదేవాలయమును నిర్మూలింపగలుగుటకు వాని శక్తిసామర్థ్యములు, ఆలయరక్షణలోని బలహీనతకారణములు కావనియు, తన్ను ఆలయమున ఆకాశలింగమునుగా బంధించుటచేత స్వేచ్ఛకోల్పోయిన భగవంతుడే కోపించి, శత్రుపక్షమును చేరి తన లింగవిధ్వంసనమునకు తానే కారకుడయ్యెననియు నోరివారిందు చిత్రించినారు ! ఇది సంఘతిరస్కారణవాదులకు అత్యంతము సన్నిహితమైన వ్యాఖ్యానము.

నోరివారి సాంఘికవ్యాఖ్యాననాటిక "గజ్జెలమొలత్రాడు". భార్యాభర్తల మూఢవిశ్వాసమును, మూర్ఖాభినివేశమును చిత్రించుచున్న నాటికయిది. వీరి నాటికలకు సన్నివేశసంవిధానము, సంభాషణాసౌలభ్యము జీవములు. వీరి నాటిక లన్నియును ప్రాయికముగా వచననాటికలే. భాగవతావతరణము (1933) మాత్రము పద్యనాటిక.

### శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి[7] :

మొక్కపాటివారు పూర్తిగా సాంఘికనాటికాకర్తలు. "సాంఘికజీవితంలో ఎటుచూచినా అనేకరకములైన అసందర్భాలూ, తారతమ్యాలూ, పరస్పరవైరుధ్యాలూ నాకు తరచు కనబడుతూ వుంటాయి. మానవుల ఊహలలోకాని, మాటలలోకాని, చేష్టలలోకాని ఈ వైరుధ్యం, సంఘర్షణా ఉన్నచోట నాటకం ఉండితీరుతుంది. ఈలాటి నాటకాలకు బీజం, ప్రతిరోజూ, ప్రతి ఇంటా, ప్రతినోటా మనకు ప్రత్యక్షమవుతూనే వుంటుంది" అనిన మొక్కపాటివారి 'తుదిపలుకు'[8]లోని అర్థమే వారి నాటికారచనాలక్ష్యము.

'మ్రొక్కుబడి'లో నాస్తికత్వ-మూఢవిశ్వాసముల పరస్పర సంఘర్షణ అద్భుతముగా చిత్రితమైనది. ఒకప్రక్క పురాతనసంస్కారమునకు మూలకందమైన భక్తివిశ్వాసములు; మరియొకప్రక్క ఆత్మవిశ్వాసము, అధికారనిరసనపరాయణమైన ఆధునికత్త్వము—ఈ రెండు మన స్తత్త్వములు కలిగిన భిన్నప్రకృతులు ఒక ఇంటనున్నచో సంఘర్షణ తప్పదు. ఇంక సుకుమార్‌వంటి అధునాతనులు ప్రయోగసంధికాలములందలి యువకులవలె భగవంతునకుకూడ ఒకఛాన్సు ఇచ్చిచూడవలయునని తలంచువారు ! ఈనాటిక మనకిచ్చు సందేశము విషయమున

కొంచ రేకీభవింపకపోయినను, ఇందు సంఘర్షణమాత్రము, కళాత్మకముగా, అద్భుతముగా నిర్వహింపబడినదన్న విషయమును కాదనలేరు.

ఒకటితప్ప తక్కిన తమ నాటికలన్నియును హాస్యరసప్రధానములని మొక్కపాటివారే చెప్పుకొనినారు. "హాస్యరచయితకు మనుష్యులమాటలు, చేష్టలు, వైషమ్యాలు, తారతమ్యాలు అన్నీ కథావస్తువులుగానే కనబడతాయి. వాటిని సద్వినియోగంచెయ్యటం, సమర్థతతో సరసంగా ప్రదర్శించడం అందరకూ సాధ్యమైనపనికాదు"; అట్టిశక్తి మొక్కపాటివారి కలమునకుకలదు. మరియు ఆ హాస్యసంభాషణములకు వెనుక ప్రతిక్షణమును రచయిత గంభీరలక్ష్యము ప్రస్ఫుటమగుచునేయుండును. వీరి నాటికలు ప్రదర్శనాసౌలభ్యముగల రచనలు; పెక్కింటిని వారే ప్రదర్శింపజేసియున్నారు. సంఘర్షణ ప్రధానమైన సన్నివేశములను చిత్రించుటలోను, తాము చెప్పదలచుకొన్న సత్యమును సూటిగా చెప్పుటలోను మొక్కపాటివారు సిద్ధహస్తులు.

### శ్రీ బుచ్చిబాబు :

ఆధునికాంధ్రసాహిత్యమునందలి పెక్కు ప్రక్రియలయందు తన ప్రత్యేకతను సాధించుకొన్న వ్యక్తి శ్రీ బుచ్చిబాబు (శివరాజు వేంకటసుబ్బారావు—జననము - 1916). వీరి నాటికలు ప్రయోగాత్మకములైనవి. రంగస్థలమున విజయవంతమైన 'దారినపోయే దానయ్య' వంటి హాస్యరచనలను, 'తిష్యరక్షిత' వంటి పాత్రచిత్రణ ప్రధానములైన రచనలనుకూడ వీరు చేసియున్నారు. వీరి రచనావిధానమునందేమి, కథాగ్రహణమునందేమి వైవిధ్య మెక్కువ. భావ ప్రధానములైన వీరి నాటికలలో 'తిష్యరక్షిత' ఉత్తమమైనది. అశోకుని మూడవ భార్యయగు తిష్యరక్షితనుగూర్చిన చారిత్రకాంశములు అల్పములు. ఆ అస్థికలను గ్రహించి, చైతన్యవంతమైన ఒక అపూర్వవ్యక్తిని సృష్టించినారు బుచ్చిబాబుగారు; మరియు చిత్రలేఖకునకు దీటైన శిల్పవిన్నాణముతో (నిజముగా వీరు చిత్రలేఖకులు కూడను) ఆమె మూర్తిని తీర్చిదిద్దినారు. "నా వ్యక్తిత్వాన్ని ఎవరైతే గౌరవించారని నువ్వు నమ్ముతావో వారినే ప్రేమించానని నువ్వు నమ్ము" అన్న తిష్యరక్షిత మాటలలో ఆమెతత్త్వము, వ్యక్తిత్వకూడ ప్రతిఫలించుచున్నవి. మతముపేరిట, కట్టుబాట్లుపేరిట స్త్రీని ఆటవస్తువుగాచేసి ఆడుకొనుటయే మగవారి ప్రవృత్తియనియు, తా నందుచేతనే మతములేని మతమును ఆరాధింతుననియు ఆమెచేత పలికించుటలో నేటి సమస్యలపై విమర్శకూడ చేసినారు బుచ్చిబాబుగారు.

ఉమర్ ఖయ్యాం పాత్రకు వినూత్న వ్యాఖ్యానముచేసిన "ఉమర్ ఖయ్యాం", విజ్ఞాన శాస్త్రాభివృద్ధి మానవుని తత్త్వదృష్టిలో తెచ్చిన మార్పులను పురస్కరించుకొని వ్రాసిన "నాలుగో పరిణామం" అనెడి నాటికలుకూడ వీరి విశిష్టరచనలు.

### శ్రీ జి. వి. కృష్ణారావు :

వ్యాఖ్యానమును ఒకవంకకుత్రోసినచో పురాణములయందలి ఒకసంఘటనను నేటి సామ్యవాద దృక్పథముతో పరిశీలించిన నాటికలలో జి. వి. కృష్ణారావుగారి 'భిక్షాపాత్ర' ఉత్తమ

మైనది. కాశీలో భిక్షలభింపకపోగా వ్యాసునకు వచ్చినకోపము, కాశిని శపింపనెంచిన వ్యాసునిపై విశ్వేశ్వరునకు వచ్చినకోపము ఇందు చిత్రితములైనవి. వీరి రచనలో విశ్వేశ్వరుడు అధికారమత్తుడుగను, ధనమదాంధుడుగను రూపొందింపబడినాడు! "ప్రపంచం ఒక్కరి ప్రతిభను మాత్రం ఎన్నడును సహించలేదు" అనెడి భావవ్యక్తీకరణమునందు మాత్రము రచయిత కృతకృత్యుడయ్యెనని చెప్పకతప్పదు. ఇందలి దేవలునిపాత్ర హృదయంగమమైనది. 'యాదవప్రళయం', 'దానధార' వంటి రచనలలోగూడ వీరి యీ వినూత్నదృక్పథము ప్రస్ఫుటమగుచునే యుండును. సాంఘిక నాటికలయందు 'పాడుసంఘం' వంటివి, సున్నితహృదయసంఘర్షణమును చూపెడి 'డమడమాలబండి' వంటివి హృద్యములైన రచనలు.[9]

## శ్రీ పాలగుమ్మి పద్మరాజు :

'గాలివాన' కథతో ప్రపంచ కథానికలపోటీలో ద్వితీయస్థానమును సంపాదించుకొన్నవారు పద్మరాజుగారు. "బిహేవియరిజం" సూత్రము నాధారముగా చేసికొనిచేసిన వీరిరచనలలో 'ఖూనీ' ఉత్తమరచన. ఇది మద్రాసు రేడియోవారు జరిపినపోటీలలో ప్రథమ బహుమానమును పొందిన రచన (1946). "వింటర్స్ టేల్"ను వానకారుకథ అన్నపేరుతో తెలుగులో వీరు చక్కని గేయనాటికగా రూపొందించియున్నారు. వీరి 'రాధ ; కృష్ణుడు' అనునది చక్కని ఊహచిత్రణము. ఇందు స్త్రీ పురుషులకు సంఘమునందుండవలసిన సమప్రాధాన్యము వ్యంగ్యముగా చిత్రితమైనది. వీరు ఇంకను పెక్కునాటికలను రచించియున్నారు.

## శ్రీ గోరా శాస్త్రి :

స్త్రీ సమస్యను విభిన్నదృక్పథములతో చిత్రించిన రచయితలను గూర్చి వివరించియున్నాను. ఆ రచన లన్నింటను విలక్షణమైనది గోరాశాస్త్రిగారి 'దూరతీరాలు'. ఇందు ఆశావాదము ముఖ్యమైనది. స్త్రీ సంపూర్ణవిజయమును సాధించుటకు ఇంకను చాలదూరము ప్రయాణింప వలయునని వీరి వ్యాఖ్యానము. ఇందలి కథ ముద్దుకృష్ణగారి 'అపవాదు'లోని కథవంటిదే అయినను పాత్రపోషణవిషయమున, కదలిక కలిగింపగల సన్నివేశ నిర్మాణవిషయమున విశిష్టమైనదై, తెలుగులోని మంచినాటికలలో ఒకటిగా పరిగణింపదగియున్నది. చెప్పదలచుకొన్న అంశమును సూటిగా, నిశితముగా, చక్కని నాటకీయతతో చెప్పగలశక్తిమంతులు గోరా శాస్త్రిగారు.[10] వీరి హాస్యనాటకములు 'సెలవుల్లో', 'ఆనందనిలయం' (4954) విశిష్టమైన రచనలు. ఇవి సమకాలికవాస్తవికతాచిత్రణములు.

## శ్రీ కొప్పరపు సుబ్బారావు :

వృత్తి నాటకరంగమునకు ప్రదర్శనసౌలభ్యముగల పెక్కునాటకములను సమర్పించిన కొప్పరపు సుబ్బారావుగారు నాటికారచనలో వినూత్నప్రయోగములను చేసి విజయమును పొందియున్నారు. వీరి నాటికలన్నియును సాంఘికములే; అందున, సమాజమును వ్యంగ్యముగా చిత్రించునవియే. బర్లెస్క్ అనెడి హాస్యసంగీతరూపకజాతికి చెందినదై, గద్య-పద్య (కీర్తన) మిశ్రితమైన వీరి 'అల్లీముతా' తెలుగు గేయనాటికలలో ఉత్తమశ్రేణికి చెందియున్నది. ఇది

యును, 'నేటినటుడు' (నటనపై విమర్శ) మొదలగు వీరి ఇతరనాటికలును ప్రదర్శనసౌలభ్యము కల రచనలు. ఉత్తమ ప్రయోక్తలగు వీరు ప్రదర్శనవిషయమున అమెచ్యూర్ సంఘముల కొసంగిన "నటులకు చిన్నసలహాలు" సర్వదా అనుసరణీయములు.[11]

## శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి :

కృష్ణశాస్త్రిగారి నాటికలను సంభాషణారూపముననున్న ఉత్తమ ఖండకావ్యములనుగా పేర్కొనవచ్చును. భక్తితన్మయత్వము, భావగౌరవము, సన్నివేశసౌందర్యము వీనియందు మిక్కుటము. సున్నితములైన భావములను హృదయంగమముగా చిత్రించుటలో శాస్త్రిగారు సిద్ధహస్తులు. వీరి కృష్ణాష్టమి, ధనుర్దాసు, ఊర్వశి, విద్యావతి మొదలగునవి ఉత్తమ రచనలు. వీరి నాటికలు చాలవరకు రేడియోప్రసారమునకు ఉద్దిష్టములైనవి.

## శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు :

తెలుగులోని పద్య-గేయ నాటికాబ్రహ్మలనదగిన శివశంకరుల తరువాత, ఆజాతి రచనలను చేసిన రచయితలలో ముందుగా పేర్కొనబడవలసినవారు రజనీకాంతరావుగారు. వీరి తొలి గేయనాటిక 'చండీదాసు' 21-2-1941 తేదీన రేడియోలో ప్రసారితమైనది. అటుపిమ్మట వీరు చాల గేయనాటికలను రచించియున్నారు. రజనిగారు చక్కని గాయకులు, సంగీతజ్ఞులు అగుటచేత వారి గేయరచనలకొక ప్రత్యేకత వచ్చినది. ఈ గేయరచనలలో కొన్ని తారస్థాయి నాటికలు (చండీదాసు, లకుమాదేవి, విశ్వవీణ మొ॥)—ఇందు అభినయమునకు ప్రాధాన్య ముండును; కొన్ని మధ్యస్థాయి నాటికలు (రాసలీల, మేఘసందేశం మొ॥); కొన్ని మంద్రస్థాయి నాటికలు (మధురానగరీగాథ, మేనక మొ॥)[12]. వీరు మేఘదూతలో గీత పద్యములనుకూడ బృందగానమున కుపయోగించియుండుట గమనింపదగినది.

ఇంతవరకును వివరించిన విధముగా విభిన్నలోక ప్రవృత్తులను నాటికల మూలమున ప్రపంచించుటలో తెలుగునాటికా సాహిత్యమునందు జరిగినన్ని విజయవంతములైన ప్రయోగములు మరియెచ్చటను జరుగలేదని చెప్పవచ్చును. ఇచ్చట పేర్కొనబడిన రచయితలేకాక ప్రసిద్ధులైన మరికొందరు నాటికాకర్తలుకూడ కలరు. అంతియేకాదు. ఇచ్చట పేర్కొనబడిన రచయితలలో, ఏ ఇద్దరు ముగ్గురినో తప్పించినచో, తక్కినవారందరును బహుళ రచనలు చేసినవారే. అందరు రచయితలను కాని, వారి అన్ని రచనలనుకాని పేర్కొనుట సాధ్యముకాదు. ప్రముఖములైన నూతన ప్రయోగములను విశదీకరింపవలెననెడి దృష్టితోనే ఈ వివరణము జరిగినదని తెలియవలెను. అసలు ఇది అన్ని అధ్యాయములకును సమానలక్షణమేయనుట విస్మరింపరాదు.

ఈ అధ్యాయమును ముగించుటకుముందు డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి హెచ్చరికను ఉట్టంకించుట సమంజసమని తలంచుచున్నాను—

"తెలుగు ఏకాంకిక పత్రికాభూమి వదిలి రంగభూమిలోకి రావాలి. శ్రీ రాజమన్నారుకి నిశితమైన భాషా, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రికి లోతులు చూడగల దృష్టీ అలవడాలి. నార్ల సందేశా

లకి బరువూ, బుచ్చిబాబువాక్యాలికి వక్తృత్వమూ అలవడాలి. శ్రీకృష్ణశాస్త్రి కవితాకన్యకి ఇహ లోకయాత్రా, శివశంకరశాస్త్రి పాండిత్యానికి కార్యదీక్షా అలవాటవాలి. అయితే అప్పుడూ ఏకాంకికలకి రంగాభిషేకం. విశ్వసాహిత్యంలో ప్రవేశించిన తెలుగు ఏకాంకికలకి అప్పుడూ విభాత మహోత్సవం"—(భారతి-విరోధి పుష్యము-పుట-46).

## భూమిక

1. ఒకవేళ అట్టి సమన్వయము కలదని ప్రయాసపడి నిరూపించినను, ఆ లాక్షణికత పలువురిలో యాదృచ్ఛికమేకాని, తెలిసి పాటించినదికాదని చెప్పుట అసమంజసముకానేరదు.

2. "తెలుగు ఏకాంకిక"— డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి — భారతి - విరోధి పుష్యము-పుటలు 43-46;

"తెలుగు సంస్కృతి" (తెలుగు విజ్ఞానసర్వస్వము — మూడవ సంపుటము) లోని డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి 'ఏకాంకిక' అను వ్యాసములనుకూడ పరిశీలింపదగును.

3. భోగరాజు నారాయణమూర్తిగారి పౌరాణిక ఏకాంకిక "వ్యోమవధ" (భారతి మే, 1928) లో ప్రకటితమైనది. వీరి "నౌరోజా" (1926) హిందూ మహమ్మదీయ సఖ్యతకు సంబంధించిన నాటకము.

## కొందరు తొలి నాటికాకర్తలు

1. వీరి పూర్తిపేరు—మల్లాది విశ్వనాథశర్మ.
జననము—1893; మరణము—2-6-1947.

ఆంధ్రనాటక కళాపరిషత్తు సంస్థాపకులలో వీరు ముఖ్యులు. నాటకకళకు జీవితము నంకితము చేసికొన్న కళోపాసి. చక్కని నటులు (యుగంధరుడు మొ॥). వీరు ప్రదర్శనాసౌలభ్యము గల సావిత్రి, హరిశ్చంద్ర, మహానంద, కుశలవ మొ॥ చాల నాటకములువ్రాసి సురభి సమాజాదుల కొసంగిరి. కాని ఒకటిరెండు మాత్రమే ముద్రితములైనవి. వీరు పెక్కు సంస్కృత నాటకములనుకూడ అనువదించిరి. ఏబదికిపైగా నాటికలను రచించియున్నారు. కొన్ని హిందీ లోనికి అనువదింపబడినవి. "కవిరాజు" అనునది శ్రీ జగద్గురు శంకరాచార్యదత్త బిరుదనామము. వీరు ఉప్మాక నారాయణమూర్తిగారితో కలిసి 'హరిహర కవులు' అను పేరుతో ఒక సంవత్సరముపాటు అష్టావధానములు, శతావధానములు చేసినారు.

2. శ్రీ పాకాల వేంకట రాజమన్నారు;
జననము—10-5-1901; న్యాయవాదిగానున్న రోజులలో "కళ" అనెడి పత్రికను నడిపినారు. మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయాధిపతిగా విశ్రాంతిగైకొని మద్రాసులో స్థిరపడినారు.

3. "రాజమన్నారుగారి నాటికలు" అనెడి వ్యాసములో ('నాట్యకళ'—జనవరి 1960) సాళ్వ కృష్ణమూర్తిగారు రాజమన్నారుగారి నాటికలు, సంస్కృతమునందలి 'నాటికా' లక్షణములకు సరిపోవునని నిరూపించుటకు ప్రయత్నించియున్నారు.

రాజమన్నారుగారి నాటికలు కొన్ని "రాజమన్నారుగారి నాటికలు" అనుపేర ఒక సంపుటముగా ముద్రితములైనవి. తప్పెవరిది, మనోరమ మొదలగు వారి ఇతరరచన లిందు చేరలేదు.

"శ్రీ రాజమన్నారు నాటికలు" అనుపేర యస్వీ జోగారావుగారొక వ్యాసమును రచించి యున్నారు—తెలుగు స్వతంత్ర—22-7-1955.

4. విశ్వనాథకవిరాజుగారిలోకూడ ఈ గుణమే ప్రధానము. కాని, నిర్వహణములోమాత్రము ఇరువురికిని భేదము కలదు.

5. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు:
జన్మస్థలము: పశ్చిమగోదావరిజిల్లా, భీమవరంతాలూకా, ఆకివీడు.
జననము: ఏప్రిల్, 1897; మరణము; 29-8-1958.

రాజమహేంద్రవరం ప్రభుత్వ కళాశాలలో పట్టభద్రులు (1918లో). 1922 నుండియు రాజమండ్రి వీరేశలింగం హైస్కూలులో గణితశాస్త్రాధ్యాపకులు; పిమ్మట ప్రధానోపాధ్యాయులు. పద్యపఠనముమీదను, అభినయముమీదను, అభినివేశముకలవారు. స్వయముగా నటులు (గురుపాదులు శ్రీపాదకామేశ్వరరావుగారితో కలిసి పాత్రధారణ చేసియున్నారు). జీవితములోని వాక్చమత్కృతుల నేకరణము మొదటికృషి. అనేక నాటకములు, వ్యాసములు, చమత్కార సంభాషణలు రచించుటయేకాక "త్యాగరాజు ఆత్మవిచారం" అనెడి త్యాగరాజు రచనల సారమును రచించినారు.

నాటకములు: మొత్తము నలుబదివరకున్నవి.
3. మేతర్లింకు అనువాదములు.
12. మోలియర్ అనుసరణములు.
12. భాసానుకృతులు.
2. షెరిడాన్ అనువాదములు (Duenna; the Rivals)
3. గోల్డుస్మిత్ అనువాదము (She stoops to Conquer).
తక్కినవి స్వతంత్ర రచనలు

6. కామేశ్వరరావుగారి ప్రహసనముల ప్రదర్శనవిషయము వచ్చినపుడు మెట్కాఫ్ వసతిగృహ వార్షికోత్సవములను, తత్పూర్వవిద్యార్థిసంఘమును స్మరింపకతప్పదు. అందున ఈ ప్రహసనములకు ప్రథమ ప్రయోక్తలనదగిన శ్రీయుతుల దుగ్గిరాల సత్యనారాయణరావు, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావుగార్ల కృషి ప్రశంసనీయము.

7. బాగుబాగు, ఎప్పుడూ ఇంతే, కచటతపలు—ఈ మూడు 'ఇప్పుడు' అన్న పేరుతో గ్రంథరూపమున వెలువడినవి. స్వీయ రచనలను 'ఇప్పుడు' అనియు, అనుసరణములను 'అప్పుడు' అనియు వారు పేరుపెట్టుట గమనార్హము.

8. శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి (శివశంకరస్వామి);
జననము—12-9-1892. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము, ప్రాకృతము, పాలి, హిందీ, బెంగాలీ, కన్నడము, లాటిన్ మున్నగు బహుభాషాపండితులు. వీరు స్వయముగా కవులగుటయే

కాక సభాపతియై, పెక్కు యువకులను తయారుచేసి వారిచేత కవితాసాధనము చేయించినారు. "ఈయన ప్రభావముపడని నవ్యకవి లేడంటే అత్యుక్తికాదు" అని వీరినిగూర్చి చెప్పుదురు. నిజమునకు శివశంకరులు ఒక మహావ్యక్తిమాత్రమేకాదు; ఒక మహాసంస్థ.

## మరికొందరు ప్రసిద్ధ నాటికాకర్తలు

1. శ్రీ అబ్బూరి రామకృష్ణారావు:
జననము—20-5-1896.

కవిగా, గ్రంథాలయశాస్త్రవేత్తగా, నటుడుగా, దర్శకుడుగా సుప్రసిద్ధులు రామకృష్ణారావుగారు.

2. రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో కేవలము కళాశాలావిద్యార్థినులచే ఈ వ్యాసకర్త ఈ నాటికను విజయవంతముగా ప్రదర్శింపజేసియుండెను—జనవరి 1951.

3. చలంగారి నాటికలు కొన్ని "సత్యం-శివం-సుందరం" అను పేరను, "కొండడు" అను పేరను రెండు సంపుటములుగా ప్రకటితములైనవి.

4. డా. చిలుకూరి నారాయణరావు:
జననము—1890; మరణము—1951.

తెలుగులో ప్రప్రథమముగా 'డాక్టరేట్' పట్టమును పొందినవారు నారాయణరావుగారు. తెలుగుభాషకు సంస్కృతమే మూలమని నిరూపించుచు వీరు రచించిన ఉద్గ్రంథమును ఆంధ్ర విశ్వవిద్యాలయము ప్రచురించియున్నది.

5. శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు:
జననము—15-7-1906.
జన్మస్థలము—ఉండి, పశ్చిమ గోదావరిజిల్లా.

శాంతినికేతనమునందు గురుదేవుని అంతేవాసులు వీరు.

6. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి:
జననము—23-4-1891; నివాసము—రాజమండ్రి.

ప్రబుద్ధాంధ్ర సంపాదకులుగా శిష్టవ్యావహారికభాషావాదిగా, కథాకథనమున సిద్ధహస్తుడుగా, వివిధసాహిత్యప్రక్రియ నిర్మాతగా, ఆంధ్రత్వము మూర్తీభవించినవారుగా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సుప్రసిద్ధులు.

7. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి:

"బారిష్టరు పార్వతీశం" (1924) రచయితగా మొక్కపాటివారు తెలుగు పతితలకు సుపరిచితులు. హాస్యరచనలో సిద్ధహస్తులు.

8. "మ్రొక్కుబడి" అనెడి తమ నాటికల సంపుటికి మొక్కపాటి నరసింహశాస్త్రిగారు వ్రాసికొన్న (1951) "తుదిపలుకు" చూడవలెను. ఈ సంపుటిలో మ్రొక్కుబడి, అభ్యుదయం (1940), పెద్దమామయ్య, అసాధారణ సమావేశం, వారసత్వం, పాతివ్రత్యం అనెడి నాటికలున్నవి.

9. జి. వి. కృష్ణారావుగారి ఎనిమిది నాటికలు "తోలుబొమ్మలు" అనుపేర ఒక సంపుటిగా వెలువడినవి (1952). ఇందు—పాడుసంపుసు, దమడమాలబండి, యాదవ ప్రళయం, దానధార, విధినిర్ణయం, ధమ్మిల్లం, తమ్మపడిగ, ప్రతిక్రియ అనెడి నాటికలున్నవి.

10. "ఆశఖరీదు అణా" అనెడి సంపుటిలో (1958) గోరాశాస్త్రిగారు రచించిన ఐదు నాటికలు కలవు—ఆశఖరీదు అణా, ఆమె నవ్వింది, రాగద్వేషాలు, తీయని తలపులు, పరువుకోసం.

11. "నేటి నటుడు వగైరా" అనెడి మూడు నాటికల సంపుటిని (1946) చూడవలయును. ఇందు నేటి నటుడు, చేసినపాపం, అల్లీముఠా అనెడి మూడు నాటికలున్నవి.

12. రజనీకాంతరావుగారి గేయ నాటికలు "విశ్వవీణ" అనుపేర ఇటీవలనే ఏకసంపుటిగా ప్రకటితములైనవి (1964). వీరు మొత్తము 18 సంపూర్ణ గేయ నాటికలను, 30 వరకు గద్య పద్య గేయాత్మక నాటికలను రచించియున్నారు.

షష్ఠాధ్యాయము

# సమకాలీన రచనలు

## భూమిక

1943_44 సంవత్సరమున తెలుగు రంగస్థలచరిత్రయందు నవ్యయుగ మారంభమగుటతో తెలుగు నాటకచరిత్రయందుకూడ నవ్యయుగ మారంభమైనదని చెప్పవచ్చును. రెండవ ప్రపంచ సంగ్రామము ప్రారంభమైన తొలిదినములలోనే సినీమా, వినోదసాధనముగా, తన ఆకర్షణను కోల్పోయినది. ఉత్తమ విదేశీచిత్రముల దిగుమతి నిలుపుదలవలన, భారతీయ చిత్రనిర్మాణమునకు యుద్ధమువలన కలిగిన ఆటంకములవలన చలనచిత్రములస్థాయి పడిపోయినది. వృత్తి నాటకరంగస్థితికూడ అంతంతమాత్రమే అయినది. ఇట్టితరుణములో తెలుగుదేశమునందలి ఉత్సాహవంతులైన పెద్దలు ఔత్సాహికసమాజముల ప్రదర్శనలను, యువరచయితల రచనలను ప్రోత్సహింపసాగిరి.[1] సరిగా ఈకాలముననే తెలుగునాటకరచనా _ ప్రయోగములందు నూతనత్వమును, విజయమును సాధించిన మూడు ఉద్యమములు బయలుదేరినవి.

అందు మొదటిది ఆంధ్రవిశ్వవిద్యాలయ నాటకరంగము. 1942 లో విశాఖపట్టణముపై బాంబులుపడుటతో విశ్వవిద్యాలయము వాల్తేరునుండి గుంటూరునకు తరలింపబడినది. 1943 వ సంవత్సరపు సంస్కృతీవారోత్సవ సందర్భమున గుంటూరునందలి మూడుకళాశాలలును కలిసి తొలిసారిగా విశ్వవిద్యాలయనాటకోత్సవములను జరిపినవి. కే. వి. గోపాలస్వామిగారి ఆధ్వర్యమున అవి నేటికిని వాల్తేరులో అవిరళముగా సాగుచు నాటకప్రదర్శనముల విషయమున నూతనప్రయోగములకు ఆలంబనములుగా నున్నవి. అట్లే ఔత్సాహిక నాటకోద్యమముగా ప్రారంభమైన "ప్రజానాట్యమండలి" (భారత ప్రజానాట్యమండలికి అనుబంధసంస్థ) తెలుగు నాటకరచనలోను, ప్రయోగములోను వినూత్నత్వమును సాధించినది. ఇంక మూడవ ఉద్యమము ఆంధ్రనాటకకళాపరిషత్తుచే ప్రారంభింపబడినది. 1930 కి ముందే స్థాపింపబడిన పరిషత్తు చరిత్ర తొలిదశ 1943 తో అంతమైనది. నాటినుండి, అది ప్రారంభించిన ఔత్సాహిక సమాజముల నాటక_నాటికల పోటీలు క్రొత్తరచయితలను, క్రొత్త నటీనటులను, క్రొత్త ప్రయోగ విధానములను వెలుగులోనికి తెచ్చినవి.

సమకాలికములైన ఈ మూడు ఉద్యమములును నూతన ప్రయోగములవిషయమున ఇంచుమించుగా ఒకే లక్ష్యముకలవై తెలుగు నాటకరచనాప్రదర్శనములను క్రొత్తదారులకు

పట్టించినవి. కొందరు నటులు వృద్ధులై నాటకరంగమును విడిచిపెట్టిరి. ఆర్థిక సుస్థిరత్వము కొరకు కొందరు నటులు సినీమారంగమును ప్రవేశించిరి. నాటకశాలలు మూతపడినవి, లేదా సినీమాశాలలైనవి. కాగా, నాటకప్రదర్శనములకు క్రొత్తనటులు, క్రొత్తరంగస్థలములు కావలసి వచ్చినవి. ఈ క్రొత్తదనమునకు ప్రాతనాటకములు సరిపడకపోవుటచేత క్రొత్త నాటకరచయితలు అవతరించుట కవకాశమును, ఆవశ్యకమును కలిగెను. పై మూడు ఉద్యమములును క్రొత్తనాటకరచయితలకు, క్రొత్తనాటకములకు, క్రొత్తరకపు రంగస్థలములకు, వినూత్న ప్రయోగములకు ఆకరములై, తెలుగుదేశమున నాటకరంగపునరుజ్జీవనమునకు మూలస్తంభములైనవి.

ఇందు ఆంధ్ర నాటక కళాపరిషత్తును, విశ్వకళాపరిషత్తును నాటకముల పోటీలను జరుపుచున్నవి. విశ్వకళాపరిషత్తు పోటీలు కేవలము విద్యార్థిసంఘములకే పరిమితములుకాగా, కళాపరిషత్తుపోటీలు మరికొంత విస్తృతమైన పరిధిలో ప్రారంభమైనవి. కాని రెండువిధములుగా సాగుచున్న ఈ ప్రదర్శనములెల్ల పట్టణములకే పరిమితములైయున్నవి. ఇంక ప్రజానాట్యమండలి పట్టణములందేకాక పల్లెలందుకూడ ప్రదర్శనముల నొసంగినది. వారి నాటకేతివృత్తము లన్నియును రైతు-కూలీ సమస్యలకు సంబంధించినవగుటచేత పల్లెలయందే వానికి అధికాదరము లభించినదికూడను. కాగా, ఈకాలమున నాటకరంగను వాడవాడలా వెలయుటకును, సర్వప్రజ నాటకదర్శనాభిలాష కలది యగుటకును అవకాశము లభించినది. 1947 లో సంపూర్ణస్వాతంత్ర్యములభించుటతో అన్నికళలతోపాటు నాటకకళకును ఇతోధికప్రోత్సాహము లభించినదని చెప్పవచ్చును.

ఇంతకుముందు కాలమునందువలెనే ఈకాలమునందును వివిధములైనశాఖలలో నాటక-నాటికా రచన సాగినది—పోటీలకొరకు వ్రాయబడినవి; ప్రచారముకొరకు రచింపబడినవి; సాహిత్యదృష్టితో నిర్మింపబడినవి. అంతియేకాదు, పాశ్చాత్యనాటకానువాదములు, అనుసరణములు అధికమైనవి. శ్రవ్యనాటికారచన ఇతోధికమైనది. ఇంక నాటకలక్ష్యములో స్వభావవాదమధికమైనది; ఇది మరల రెండువిధములు. ఒకవర్గమువారు తమ కథలను పట్టణములకు పరిమితముచేయగా మరియొకవర్గమువారు తమ కథలను పల్లెలకు పరిమితము చేసినారు.

## స్వభావవాదము (Realism)[2] :

సాంఘికసమస్యల నితివృత్తములుగా చేసికొని నాటకరచనచేయుట తెలుగునాట తొలినుండియు నున్నదే. యక్షగాననాటకకర్తలేకాక, ఆధునిక నాటకకర్తలగు శ్రీయుతులు వావిలాల, కందుకూరి, పానుగంటి, కాళ్లకూరి ప్రభృతు లిట్టిరచనలు చేసియున్నారు. కాని, తెలుగునాటకరంగ పునరుజ్జీవనకాలమున నేటి నాటకరచయిత లనుసరించిన స్వభావవాదము, ఆ తొలి రచయితల దృక్పథముకంటె ప్రగతిశీలమై, అభ్యుదయకరమై కన్పట్టును. ఆ నాటకకర్తలు సంఘదురాచారములను నిరసించుచు, వానినుండి విముక్తి యెట్లుకలుగునో సూచించుటకు ప్రయత్నించిరి. ఆ దురాచారములు సంఘమున కంతటికిని చెందినవి; వీని నిర్మూలనము,

సాంఘికముగా అందరి విధి. ఇంక నేటి అభ్యుదయ లేదా స్వభావవాదులదృష్టి ఇట్టి దురాచారములపై కాక, సాంఘిక-ఆర్థికరంగములందలి అసమానత్వములపై నిశితముగ ప్రసరించినది. సంఘమునందలి తక్కువతరగతివారికి 'కనీససదుపాయములు' సమకూర్పబడినప్పుడే సాంఘిక సమస్యలు పరిష్కృతము లగునని వీరివిశ్వాసము.

రెండవ ప్రపంచయుద్ధము అంతమగుటతో దేశమున స్వాతంత్ర్యభావములతోపాటు ప్రజాస్వామ్యభావములుకూడ పెంపొందినవి. ఆర్థికమాంద్యమును అవలంబముగా చేసికొనిన పట్టణములందలి ధనికుల, జమీందారీల, భూస్వాముల తత్త్వములు కార్మిక-కర్షకుల బాధలను ఇనుమడింపజేసినవి; వారి జీవితములను క్లిష్టముల నొనర్చినవి. దీనితో ఇంతకాలమువరకును అణగియున్న 'సమానతాభావము' పెల్లుబికినది. స్వభావవాదులు, జీవితయథార్థచిత్రణమునకు పూనుకొన్నప్పుడు, ఈ అసమానత్వము, నిర్మూలింపవలసిన ప్రథమదురాచారముగ కన్పట్టినది. ప్రపంచమున, అణగద్రొక్కబడుచున్న ప్రతివర్గమును వీరి సానుభూతిని పడసినది. (ఇంతకు ముందు, రాజమన్నారు ప్రభృతులు చేపట్టిన పతితస్త్రీసముద్ధరణోద్యమమును ఇట్టిదే).

ఈ స్వభావవాదులు చిత్రింపబూనిన అసమానత్వము ప్రధానముగా రెండు విధములు— 1. కేవలము పట్టణజీవితమున, తెచ్చుకొనుచున్న చాలీచాలని జీతబత్తెములతో బ్రతుకు బరువును మోయలేని మధ్యతరగతివారి జీవితచిత్రణము మొదటిది; 2. పల్లెలలోని కర్షక కార్మికుల అవస్థాచిత్రణము రెండవది.

రచనాస్వభావమును వింగడించి, ఈ స్వభావవాదులయందు గోచరించు సామాన్య లక్షణములను క్రిందివిధముగా క్రోడీకరింపవచ్చును—1. పరిస్థితుల యథార్థచిత్రణము; అనగా స్వయముగా ఎట్టి ఫలితమునుగాని, సందేశమునుకాని, నీతినికాని నాటకాంతమున సూచింపక, కేవలము సంఘర్షణమును మాత్రమే సూచించి, తక్కినదానిని ప్రేక్షకుల యూహకు వదలుట. 2. సన్నివేశములను, సంభాషణములను ఎక్కువ నాటకీయముగ మార్చుట; ఇట్టి వానిలో సంఘమును దూషించు ఉపన్యాసములు, హత్యలు చేయుటకు బెదరింపులు ('పిష్టలు' నేటి నాటకములయందు తప్పనిసరి 'క్లైమాక్సు') వంటివి ముఖ్యమైనవి; వీనియందు ప్రదర్శనా సౌలభ్యము మాత్రము అధికముగా నుండును. 3. అన్నియును వచననాటకములే; రంజనార్థ మచ్చటచ్చట పాటలు ప్రయుక్తములగును (ప్రధానముగా నేపథ్యగానము). ఈ స్వభావ వాదులకు ప్రతినిధియని చెప్పదగిన ఆచార్య ఆత్రేయ తన 'ఎన్. జి. ఓ.' నాటకమునకు వ్రాసికొన్న పీఠికలో ఎట్టి సందర్భములందును నాటకమున పద్యములను, పాటలను ఉపయోగింపరాదని పేర్కొనెను; కాని, రానురాను ఇతర రచయితలు ఒకటి రెండు పాటల నుపయోగించు చున్నారు. 4. స్త్రీ పాత్రలను తక్కువజేయుట లేదా అసలు లేకుండ చేయుట మూలమున ప్రోత్సాహిక నాటకసమాజముల ప్రదర్శనలకు ఇతోధికావకాశములను కల్పించుట. 5. కేవలము సమకాలికములగు—ముఖ్యముగా అసమానత్వ సంబంధియగు—సమస్యలనే స్వీకరించుట, 6. సాంప్రదాయికములగు కట్టుబాట్లు, నీతి నియమములు మొదలగు వానిపై తిరుగుబాటు.

## స్వభావవాదము 1

**శ్రీ కొండముది గోపాలరాయశర్మ :**

ఆంధ్రనాటకకళాపరిషత్తు నాటకపుపోటీలు ప్రారంభమైన తొలిరోజులలో నాటకరచన చేసినవారు గోపాలరాయశర్మగారు (వీరి తొలి నాటకము 'ఎదురీత' ఆంధ్రనాటకకళా పరిషత్తు వారిచే ప్రకటింపబడినది). కాంట్రాక్టు నాటకముల రోజులలోని పౌరాణిక–చారిత్రక–యుద్ధ నాటకములకు స్వస్తిచెప్పుట, సమస్యారూపకముల రచన యారంభమగుట జరిగినదీకాలముననే. ఈ ఉద్యమముయొక్క తొలికాపు గోపాలరాయశర్మగారు. వీరి నాటకములు—ఎదురీత (1947), ఇదీలోకం (1946), న్యాయం (1947), ఏకదేశం (1947)—అనునవి నాటి సాంఘిక సమస్యలను ఇతివృత్తములుగా చేసికొన్న రచనలు. కులాంతరవివాహము చేసికొనదలచిన వారికి, సంఘమున ఎన్ని ఆటంకములు ఎదురగునో ఇందు చిత్రితములైనవి; అందున ఆ స్త్రీ ఒక వేశ్యచే పెంపబడినదైనచో—ఆ ఆటంకములు ఇబ్బడిగా ఎదురగును. అట్టి స్థితిలో సంఘమున కెదురీదవలెనన్నచో, ఆ నాయకునకు ధైర్య–స్థైర్యములావశ్యకములు; అట్టి ధైర్యము గల యువకులు తుదకెట్లు కృతకృత్యులగుదురో చూపిన నాటకము 'ఎదురీత'. ఇది ఆంధ్ర నాటకకళాపరిషత్తువారివలన రచనకు, ప్రదర్శనమునకు బహుమానములను పొందిన రచన. వీరి 'గౌతమబుద్ధ' (1949) అనెడి నాటకము తెలుగుభాషా సమితివారి బహుమానమును పొందిన రచన,

'ఇదీలోకం'లో పెట్టుబడిదారుల ఘాతుకకృత్యములు, పేదవారు ఆకలితో అలమటించి మరణించుట చక్కగా చిత్రితమైనవి. 'న్యాయం'లో పైతరగతివ్యక్తులవలె బ్రతుకవలయునని ప్రయత్నించిన మధ్యతరగతివారికి పై తరగతులవారివలన కలిగెడి అవమానములు చిత్రితమైనవి. 'ఏకదేశం'ను సాంఘిక – చారిత్రక నాటకమునుగా పేర్కొనినారు శర్మగారు; ఆంగ్లేయులు భారతదేశమున వ్యాపారముచేయుటకు వచ్చినది మొదలు స్వాతంత్ర్యము వచ్చువరకును జరిగిన సంఘటనలు ఇందు వర్ణితములైనవి; వారి 'విభజించిపాలించు' రాజనీతి సూత్రమును ఈ నాటకము చిత్రించుచున్నది.

గోపాలరాయశర్మగారి నాటకములన్నియును నూతనప్రయోగాత్మకములు. ముఖ్యముగా ఎదురీత, ఇదీలోకం, ఏకదేశం అనెడి నాటకములలో రచయిత త్రొక్కిన మార్గములు ఆనాటి నాటకరంగమునకు క్రొత్తవి. నాటకములోని పాత్రలపేర్లు, ఆ నాటకమున రచయిత మూర్తీభవింపజేయదలచుకొనిన వర్గములపేర్లను ధ్వనించుచుండుట గమనింపవచ్చును. సన్నివేశ వైచిత్రియు, సంభాషణాసౌలభ్యమును కలవియై, వీరి నాటకములన్నియును రంగస్థలమున విజయవంతములైనవి. శర్మగారు తమ నాటకములందచ్చటచ్చట పాటలనుకూడ చేర్చిరి.

"న్యాయం' అనెడి తమ మూడంకముల నాటికకు శర్మగారు వ్రాసికొన్న తొలిపలుకులోని క్రింది వాక్యములు తప్పక స్మరింపవలసినవి—"ఇందులో ప్రధానమైన విశేషం—

నాటకంలో కథాకాలం, నాటక ప్రదర్శనకాలం సరిపోతవి. 'కొంతకాలం తర్వాత' అనే ప్రసక్తి లేదు. మన నాటకసారస్వతంలో ఈ ఫక్కీలో వ్రాయబడిన నాటకం ఇదే మొదటిది. చివరిది కారాదని ఆశిస్తున్నాను."

పై గుణము ఏకాంకిక విషయములో విధిగా ఉండవలసిన గుణమని వేరుగా చెప్ప నక్కరలేదు. కాని ఈ ప్రధానసత్యమును విస్మరించిన రచనలే నూటికి తొంబదితొమ్మది.

శ్రీ ఆచార్య ఆత్రేయ :

స్వభావవాదమునకు ప్రతినిధియైన ఆచార్య ఆత్రేయగారి ప్రవేశముతో తెలుగు నాటక రంగమున ఒక నూతనసంచలనము బయలుదేరినది. కొండముది గోపాలరాయశర్మగారి 'ఎదురీత'ను నాటకకళా పరిషత్తు పోటీలలో ప్రప్రథమముగా ప్రదర్శించి ఉత్తమనటుడుగా, ఉత్తమ ప్రయోక్తగా బహుళ ప్రశంసల నందుకొన్నారు ఆత్రేయగారు. అటుపిమ్మట నాటకరచయితగా సుప్రసిద్ధులైనారు. ఒక్కొక్క నాటకరచనలో ఒక్కొక్క నూతనప్రయోగమును చేయుచు, అందు కృతకృత్యులైనారు. ఆ యీ ప్రయోగములకెల్ల పీరి కవలంబమైనది 'వెంకటగిరి అమెచ్యూర్ ఆర్టిష్ట్సు' అనెడి నాటకసమాజము.

తెలుగుదేశమునందలి స్వభావవాదుల రచనలయందు ముఖ్యముగ చిత్రితమగునది ధనికుల, పేదలమధ్య జరిగెడి సంఘర్షణము. ధనమదాంధులు తమ అధికారమును నిరంకుశముగ పేదసాదలపై ప్రవర్తింపజేయుచున్నారు. వారినుండి రక్షించుకొనుట, వారిపై ఎదురుతిరిగి విజయమును పొందుట పేదల కర్తవ్యము; ఇట్టి సంఘర్షణము ఆత్రేయగారి తొలి నాటకము లలో నధికముగా కన్పట్టును. పరివర్తన (1947), ఎన్. జి. ఓ. లేక గుమాస్తా (1949) అనెడి రచనలు ఈ తరగతికి చెందినవి. ధనికులు కేవలము కర్షకులను, కూలీలను మాత్రమే కాక విద్యావంతులనుకూడ ఎట్లు తమ ఆనందమునకు సాధనముగా చేసికొందురో నిరూపితమైన నాటిక 'పరివర్తన'. గుమాస్తా ఇంతకంటె పరిణతినందిన రచన. ఇందు చాలీచాలని జీతముతో గంపెడు సంసారభారముతో బాధపడెడి మధ్యతరగతికి చెందిన గుమాస్తాయొక్క వ్యక్తిగత భగ్నజీవితము చిత్రతమైనది. ఈ నాటక మనేకప్రదర్శనములను పొందినది. రచనకు, పాత్రధారణకు ఆత్రేయగారికి పరిషత్తు బహుమతులు లభించినవి. కె. వి. గోపాలస్వామిగారు పేర్కొన్నట్లు ఆధునికనాటకరంగచరిత్రలో ఎన్. జి. ఓ. రచనా-ప్రదర్శనములు ఒక క్రొత్త శకమునకు దారితీసిన వన్నచో అతిశయోక్తిలేదు.

సమకాలికదేశీయసమస్యలను అనగా స్వాతంత్ర్యప్రాప్తి సందర్భమున సంభవించిన సంఘటనలను కైకొని వ్రాయబడిన నాటకము 'ఈనాడు' (1947). గోపాలరాయశర్మగారి 'ఏకదేశం' వలె ఇదియును సాంఘిక-రాజకీయ-చారిత్రక రూపకముగా పరిగణింపదగియున్నది. భారతదేశవిభజనానంతరము సంభవించిన హిందూ-ముస్లిముల అంతఃకలహములు ఆధారముగా సాగిన రచనయిది. అంతకుముందున్న హిందూ-ముస్లింల సఖ్యము ఈ విభజనతో భగ్నమై,

కుటుంబముల నాశనమున కెట్లు దారితీసినదో ఇందు హృదయవిదారకముగా చిత్రితమైనది. ఆసాంతము ఒకే ఒక సెట్టుమీద వడివడిగా నడిచెడినాటక మిది—

ఆచార్యగారి తక్కిన నాటకములు విశ్వశాంతి(1953), కప్పలు(1954), భయం(1957), అశోకసామ్రాట్ (1957) — నాలుగును నాలుగు విధములుగా సాగిన రచనలు. ఆత్రేయ గారి రచన లన్నింటియందును 'కప్పలు' తేలిక రచన. కాని, ఇందు హాస్యసన్నివేశ చిత్రణ మున, హాస్యపాత్రసృష్టియందు తనకు ప్రావీణ్యము కలదనెడి విషయమును రచయిత నిరూ పించుకొనెను. అంతియేకాదు, ఇంతవరకును ఒక ప్రత్యేక రాజకీయవర్గమునకు చెందిన వ్యక్తి అని భ్రమింపజేయునట్లుగా రచనలుచేసిన ఆత్రేయగారు ఈ నాటకరచనతో ఆరంభించి సార్వ కాలికములును, సార్వజనీనములును అయిన ఇతివృత్తములను స్వీకరించి నాటకరచన చేయుట గమనింపవచ్చును. సుమతి శతకకారుడు చెప్పిన 'తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలు చేరు' ననెడి సామెతను ఆధారముగ చేసికొని పేదగానున్నప్పుడు ముఖము చూపించని బంధు వులు, స్నేహితులు అతడే ధనవంతుడైనప్పుడెట్లు పంచకు చేరుదురో ఇందు చక్కగా నిరూ పితమైనది. ఇందు సమాజములోని ఒక్కొక్క తరహాకుచెందిన కొందరు వ్యక్తులను పాత్రలుగా చేసి, వారిని వ్యంగ్యముగా చిత్రించినారు ఆత్రేయగారు.

ఇతివృత్త స్వీకరణమందింకను విస్తృతిని సాధించిన రచన 'విశ్వశాంతి'. తాత్కా లిక సమస్యలను ఆధారముగాగొని బాధాజనితులైన మానవుల హృదయ కుహరములపై సంఘము కప్పిన మాయపొరలను చీల్చి, వానికి అట్టడుగుననున్న కొన్ని విషాద నగ్నస్వరూ పములను ఇంతవరకును చూపిన ఆత్రేయగారు అంతటితో సంతృప్తినందక, తన ఆవేదనను తన అన్వేషణను విశ్వమువైపునకే మరలించినారు 'విశ్వశాంతి'లో. 'ఈనాడు'లో వలెనే ఒక కుటుంబమును ఆధారముగా చేసికొని విశ్వజనీన సమస్యను చిత్రించినారిందులో. ఈ నాటకమున భూదేవికి పెద్దకొడుకు నరరక్తభోక్తల ప్రతినిధి; ధనబలముతో విజ్ఞానమునే మానవమార ణాయుధములనుగామార్చు స్వార్థపరుడు; ఇంక చిన్నకొడుకు పీడితులైన కోటానుకోట్ల మానవుల జీవనవాంఛాప్రతిబింబము. ఈ రెండుభావముల సంఘర్షణములో తల్లి చిన్నకుమారుని పక్షముననే నిలిచి, పశుబలమును జయించుటకు సాయపడును. యుద్ధవాతావరణము ప్రపంచ మును భయపెట్టునంతకాలము ఈ 'విశ్వశాంతి' నాటకము మహత్తరసందేశము నొసంగుచునే యుండును. ఇందలి 'యుద్ధం' అనెడి అంతర్నాటకము యుద్ధబీభత్సమును కన్నులకు కట్టు చున్నది. "నాటకరంగమనే వైద్యశాలలో జరుగుచున్న ఒక చికిత్సావిధానమే ఈ 'విశ్వశాంతి'" అని పేర్కొనిన శ్రీశ్రీగారి వాక్యములు సత్యసమ్మతములు.

'భయం' ప్రతీకనాటకజాతిలో చేరినది. ఇరువదియవ శతాబ్దమునందలి మానవుల యందు సాధారణమైన మనస్తత్వము 'భయం'. ధనవంతునినుండి నిరుపేదవరకును, పెద్ద అధికారినుండి క్రింది బంట్రోతువరకును—అందరకును ఏదియో ఒకదానివలన నిత్యమును భయము కలుగుచున్నది. మానసికముగ, సాంఘికముగ, ఆర్థికముగ మానవుడు ఈ మానసిక వ్యధచే బాధపడుచున్నాడు—'మనిషికి మనిషన్న భయం; సత్యమన్న చచ్చేభయం; చచ్చు

దాక చావుభయం' అని నారు రచయిత. ఈ నాటకమునందు దాదాపు అన్ని పాత్రలకును పేర్లు పెట్టకుండ నడుపుటకు ప్రయత్నించి (ప్రొప్రయిటరు, మేనేజరు మొ॥), ఆయా వ్యక్తులను నిత్యజీవితమునందు మనకు తటస్థపడువారికంటె భిన్నముగా చిత్రించి, సార్వకాలిక వ్యక్తులకు ప్రతీకలుగా సూచించుట ఇందు పేర్కొనదగిన శిల్పచాతుర్యము.

వీరి ఇటీవలి నాటకము 'అశోకసామ్రాట్'. చారిత్రక నాటకరచననుకూడ సాంఘిక నాటకరచనయంత చతురతతోను నడిపింపగలనని ఆత్రేయగారు నిరూపించుకొనినారిందులో. కాని ఇది అశోకుని కథగాకంటె, సమకాలిక సంఘోపదేశ నాటకమువలె కన్పట్టుచున్నది. నాటకమును చదువుచున్నప్పుడు ఈ కథ అశోకుని కాలమునాటి దనెడి యూహ కలుగుటకంటె రచయిత నేటి సంఘమును అశోకుని కాలమునకు నెట్టినారని తోచుట జరుగును. చారిత్రక నాటకరచనలో చారిత్రకదృష్టి లుప్తమగుట న్యాయ్యము కాజాలదు.

ఇట్లు విభిన్నప్రయోగములను చేసిన ఆత్రేయగారి రచనలలోని కొన్ని సామాన్య లక్షణములను క్రింది విధముగా పేర్కొనవచ్చును —

ఈ నాటకములందు ప్రయోగసౌలభ్య మధికము. వాస్తవికజీవితచిత్రణమునకు సంబంధించిన రచనలనేకాక భయం, విశ్వశాంతివంటి ప్రతీకనాటకములను కూడ సౌలభ్యముతో ప్రదర్శింపవచ్చును. ఈ నాటకములందు స్త్రీపాత్రలసంఖ్య అల్పము; కాగా, ఔత్సాహిక సమాజముల కెక్కువ ఉపయోగపడుచున్నవి. ఇవి ప్రదర్శనమునకు సంబంధించిన విషయములు. వీనికంటె ప్రధానమైనది రచనావిధానము. ఆత్రేయగారు సన్నివేశచిత్రణమున అందెవేసినచేయి; సంభాషణానిర్వహణమున సిద్ధిపొందిన రచయిత. అసలు, ఆత్రేయగారిని, పీడితప్రజలపక్షమున గొంతెత్తి వాదించిన విప్లవవీరుడని చెప్పవచ్చును; వారి కలమువిసిరిన ప్రతిమాటయును అనుక్షణము కుమిలిపోవుచున్న జనుల హృదయములలోని అగ్నిజ్వాలలను వెళ్ళగ్రక్కును. తాను నమ్మిన ఒకసిద్ధాంతము నాధారముగా చేసికొని, దానిని నిష్కర్షగా, సూటిగా, నగ్నముగా ప్రదర్శించి, చేపట్టిన సమస్యకు న్యాయ్యము చేకూర్చిన శిల్పి శ్రీ ఆచార్య ఆత్రేయ.

ఆత్రేయగారి ననుసరించి వారివలె సమస్యాభావరూపకములను రచించినవారింకను పలువురు కలరు. కాని, ఆ రచనావిధానమున కృతకృత్యులైనవారు చాల తక్కువ; అంతియేకాదు, వారి సంభాషణములలో గర్భితముగా కన్పట్టెడి సంఘవిమర్శను ఉపన్యాసములలోనికి దింపి, నాటకమును పేలవముచేసినవారును పలువురు కలరు. అట్లుకాక, వారివలెనే స్వభావవాదులై, చక్కని నాటకములను రచించిన మరికొందరినిగూర్చి ఈసందర్భమున వివరింపవలసి యున్నది. వీరందరి రచనలుకూడ రంగస్థలమున విజయవంతములైనవే.

### శ్రీ అనిసెట్టి సుబ్బారావు:

అసంతృప్తులైన మధ్యతరగతివారి మనస్తత్త్వమును మరియొక దృక్కోణమునుండి పరిశీలించుట జరిగినది అనిసెట్టి సుబ్బారావుగారి "గాలిమేడలు" (1953) లో. మధ్యగరగతి

యువకుడు వాస్తవికజీవితమున ఎట్టిసౌఖ్యములను పొందలేక, అట్టివానిని వాస్తవికజగత్తునందు కంటె స్వాప్నికజగత్తునందు తేలికగా పొందగలుగుట ఇందు వ్యంగ్యముగా చిత్రితమైనది. వాస్తవిక-స్వాప్నికజగత్తులయందలి భేదము—ఈ నాటకమునందువలెనే—చిత్రింపబడిన మరియొక నాటకము శ్రీవాత్సవగారి "తీరనికోరికలు". కథాసంవిధానమునకూడ రెండురచనలకును పోలికలున్నవి; ఆంధ్రనాటకరంగమున కలుగుచున్న అభివృద్ధికి ఈ గాలిమేడలు మచ్చుతునక అనెడి ప్రశంసనుపొందిన నాటకమిది. సుబ్బారావుగారు శిల్పదృష్టి అధికముగాగల రచయిత. అంతియేకాదు, సహజముగా కవితాత్మకలవారై, ప్రౌఢోక్తిసాధించిన విప్లవకవిగా ప్రసిద్ధి పొందినారు సుబ్బారావుగారు.

సుబ్బారావుగారి మరియొక రచన "మావూరు" (1954). ఇది గ్రామరాజకీయము లాధారముగా వ్రాయబడిన నాటకము; గ్రామసీమల రాజకీయములందు ఒక అమాయకుడు బలియగుట యిందలి కథ. గ్రామీణ స్థితిగతుల నింతగా కన్నులకుకట్టిన రచనలు తక్కువయని చెప్పవచ్చును. సుబ్బారావుగారి రచనలలో, కైకొన్న సమస్యయెడ ఒక నిశితమైన పరిశీలనా భావముకన్పట్టగలదు; ఆ పరిశీలన గాఢమైన ఆత్మీయభావముతోకలిసి సంఘటనలను పటిష్ఠముగా చేసినది. స్వభావవాదులందరికంటె వీరియందు కాల్పనికత్వము కొంత ఎక్కువగా కన్పట్టగలదు.

### శ్రీ పినిసెట్టి శ్రీరామమూర్తి[1] :

శ్రీరామమూర్తిగారు, ఆత్రేయగారివలెనే రచయితలేకాక నటులుకూడను; వారి రచనలవలెనే వీరి రచనలును బహుళజనామోదమును పొందియున్నవి. వీరి తొలినాటకము "ఆదర్శజ్యోతి" (1945). "కులంలేనిపిల్ల" (1951), "కన్నకొడుకు" (1956) అనెడి వీరి నాటకములు నేటి వివాహవిధానమును విమర్శించురచనలు. కేవలము ధనముపైగల ఆసక్తితో పిల్లల ఇష్టానిష్టములను లెక్కచేయని పెద్దలకు వ్యతిరేకముగ పిల్లలు విప్లవమును లేవదీయుట "కన్నకొడుకు" లోను; కులాంతరవివాహమును కోరిన కుమారునకు వ్యతిరేకియై హత్యలు చేయుటకుకూడవెనుదీయని మూర్ఖుని మనస్తత్త్వము "కులంలేనిపిల్ల" లోను చిత్రితములైనవి.

'పల్లెపడుచు' (1955), 'అన్నా-చెల్లెలు' (1955) అనెడి నాటకములు వీరికి తెలుగు నాటకసాహిత్యమున స్థిరస్థానమును కల్పించిన రచనలు. 'పల్లెపడుచు' నందు స్వార్థజీవియైన ఒకవ్యక్తి తుదకు తన స్వార్థమునకు శిక్షితుడగుట హృదయంగమముగా చిత్రితమైనది. ఇంక 'అన్నా-చెల్లెలు' వీరి ఉత్తమరచన. దారిద్ర్యము మనుష్యులను ఎంత నీచమునకు (దొంగలుగ, వేశ్యలుగ) పాల్పడజేయునో ఇందు చూపబడినది. ఆకలిబాధకు తాళలేక అన్నమును దొంగిలించిన అన్నయే, అదేహేతువున వ్యభిచరించిన చెల్లెలిని చంపి తుదకు పశ్చాత్తప్తుడగును.

శ్రీరామమూర్తిగారి సంభాషణలలో, సన్నివేశములలో సంఘముమీద ఏవో తీరనికక్ష కన్పట్టుచుండును.

శ్రీ బెల్లంకొండ రామదాసు :

అభ్యుదయకవులలో శ్రీశ్రీ తరువాత పేర్కొనవలసిన కవిగా ప్రసిద్ధిపొందినవారు బెల్లంకొండ రామదాసుగారు. రామదాసుగారి 'అతిథి' (1953), 'ఆకాశరామన్న' (1957), 'మాష్టర్జీ' (1953), 'పునర్జన్మ' (1956) అనెడి నాటకములుకూడ పీడితప్రజానీకమునకు, ధనవంతుల అవినీతికి సంబంధించిన రచనలే. 'అతిథి' కొంతలోకొంత రాజకీయనాటకము. ధనవంతులైన భూస్వాములు తమవద్దపనిచేయు కూలిరైతులకు, వారి నాయకులకు మధ్య భేదాభిప్రాయములను కలుగజేసి, తుదకు వారిని అమాయకులైన ప్రజలచే చంపించుటకుకూడ వెనుదీయకపోవుట ఇందు వర్ణింపబడినది. సంభాషణలు సుదీర్ఘములైనను నాటకత్వమునకు హాని కలుగజేయక సన్నివేశమునకు తగినట్లేయుండుట 'మాష్టర్జీ'లోని విశిష్టత. బహుశః ఈ నాటకమునందే తెలుగునాటకములలో సంఘమునుగూర్చిన విమర్శనాత్మకమైన ఉపన్యాసధోరణి అధికమగుట కారంభము జరిగినదని చెప్పవచ్చును. 'ఆకాశరామన్న' అనువాదము; ధనికవర్గము వారి అవినీతిని బట్టబయలుచేసెడి కథనే అనువాదమునకుకూడ వీరు స్వీకరించుట గమనార్హము.

'పునర్జన్మ' రామదాసుగారి నాటకములలో ఉత్తమమైన రచన. ఇది పతిత స్త్రీల ఇక్కట్లను నిరూపించు నాటకము. పతితయైనను, దృఢముగనిలబడి, తన గతజీవితమందలి మాలిన్యమును వర్తమానజీవితమునందలి శీలప్రవర్తనలతో కడిగివేసికొన్నచో ఆమెకూడ సంఘమున గౌరవింపబడగలదని యిందు నిరూపితమైనది.

శ్రీ అవసరాల సూర్యారావు :

పతితస్త్రీసమస్యను మరియొకవిధముగా పరిష్కరించిన నాటకము సూర్యారావుగారి 'పంజరం' (1958); అంతియేకాదు, మోసముతో గొప్పవారుగా చెలామణియగుచున్న దాంభిక వ్యక్తులు చివరి కెట్టిస్థితిని పొందుదురోకూడ యీ నాటకము నిరూపించుచున్నది. రామదాసుగారి 'పునర్జన్మ', సూర్యారావుగారి 'పంజరం' పరిషత్తువారి బహుమానములను పొందిన రచనలు. వీరి 'నల్లబూట్లు' రాజకీయనాటిక.

శ్రీ ధనికొండ హనుమంతరావు :

సాంఘికసమస్యలలో కులాంతరవివాహముల సమస్యకూడ ముఖ్యమైనది. ఈ విషయము నితివృత్తమునుగా స్వీకరించి పెక్కునాటకములు వెలసినవి. అట్టివానిలో ధనికొండ హనుమంతరావుగారి 'పవిత్రులు' (1946) ఉత్తమరచన. సన్నివేశకల్పనావైచిత్రి, సంభాషణా నిర్వహణశక్తికల యీ రచన, ఈకాలమున వెలువడిన ఉత్తమనాటకములలో ఒకటిగా పరిగణింపదగియున్నది. వీరినాటికలు 'ఎర్రబుట్టలు' అనుపేర ఏకసంపుటిగాప్రకటితమైనవి (1946). ఇందు 'ప్రొఫెసర్ బిండ్సన్', 'చికిత్స', 'ఉల్టా-సీదా', 'ఎర్రబుట్టలు', 'బుద్ధొచ్చింది' అనెడి ఐదు నాటికలు కలవు; ఇవి హాస్యప్రధానములైన రచనలు.

## స్వభావవాదము 2

స్వభావవాదమును ప్రపంచించుటలో రచయితలు రెండు భిన్నమార్గముల నాశ్రయించిరని పేర్కొనియున్నాను. పట్టణములందలి మధ్యతరగతి ప్రజలు అనుభవించు కడగండ్లు కొందరికి కథావస్తువులుకాగా, ఇంకొకరికి పల్లెలలోని కర్షక-కార్మికుల స్థితిగతులు ఇతివృత్తములైనవి—ఇందు తొలివర్గమువారిని గూర్చి ఇంతకుముందరి శీర్షిక క్రింద వివరించియున్నాను. ఇప్పుడింక రెండవ వర్గమువారిని గూర్చి వివరింతును.

### శ్రీయుతులు సుంకర: వాసిరెడ్డిగార్లు :

భూస్వాముల స్వార్థపరత్వము, దినమెల్ల కష్టపడినను ఆలుబిడ్డలకు కడుపునిండుగ తిండి, కట్టుకొనుటకు బట్టకూడలేక సామాన్యమానవుడు పడెడి బాధలు ఈ రచయితలకు కనువిప్పు కలిగించినవి. అందులకుతోడు రాజకీయవాదులు ఈ ఆర్థికాసమానత్వమును గూర్చిన ప్రచారము నవలంబముగా చేసికొని, తమతమ 'పార్టీల'ను దేశము నలుమూలలందున్న ప్రజానీకమునకు సన్నిహితముచేయ సమకట్టిరి—ఈ రెండు ఆశయములును కలిసి నాడు అది ఒక ఉద్యమముగా పరిణమించినది. నాటకరచనకు సంబంధించినంతవరకును ఇది కేవల మొక ప్రచారోద్యమమే. 1943 లో తెలుగుదేశమున 'ప్రజానాట్యమండలి' స్థాపితమగుటతో ఈ రచయితల భావములు ఆకృతిని దాల్చుటకు అవకాశము కలిగినది. సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు ముందడుగు (1945), అపనింద (1946), మాభూమి (1947) అనెడి నాటకములను రచించి ప్రజానాట్యమండలికి సమర్పించిరి; ఈ నాటకములవలన ప్రజానాట్యమండలి, ఆ ప్రజానాట్యమండలి వలన ఈ రచయితలు విశేషప్రచారమును పొందిరనుట అతిశయోక్తికాదు.

"ముందడుగు"నందు జమీందారీ విధానమున రైతులు, కూలీలు ఎట్లు అణగద్రొక్కబడిరో చిత్రింపబడినది. ఈ బాధలను భరింపలేక రైతులు, కూలీలు ఏకమై, జమీందారును ప్రతిఘటింపగా అతడు పారిపోవును. పెద్దపెద్ద రైతులందరును ముందుగా జమీందారుపక్షమవలంబించినను, తుదకు తమ తప్పిదమును గ్రహించి చిన్న రైతుల పక్షమును వహించుట యిందలి విశేషము. పది పన్నెండు ప్రదర్శనములగునప్పటికే ఈ నాటక ప్రదర్శనమును ప్రభుత్వము నిషేధించినది. అంతట ఇతోధికోత్సాహముతో ఈ రచయితలు 'మాభూమి'ని రచించినారు. ఇందు ఇతివృత్తము తెలంగాణాకు సంబంధించిన జమీందారీ సమస్యగా మార్పునొందినది. అనగా తెలంగాణములోని దేశముఖ్‌లకు, వారి ప్రజలకుమధ్య జరిగిన పోరాటమిందు వర్ణితమైనది[1]. ఈ నాటకమును ప్రదర్శించుటకు 1947 నాటికి 125 ప్రజానాట్యమండలి అనుబంధసమాజములు దేశము నలుమూలల వెలసినవి. 1948 లో హైదరాబాదులో 'పోలీసు చర్య' జరిగిన తరువాత ఈ నాటకముకూడ నిషేధింపబడినది.

"ఈ నాటక రచన కొద్దిలో మిక్కిలి అందంగాఉంది. ఇందులో అచ్చమైన తెలుగు జాతీయము కుప్పలుకుప్పలుగా ఉంది" అని విశ్వనాథ సత్యనారాయణగారు, "తిక్కన తర్వాత

మళ్ళీ ఈనాడు జాతీయభాష విన్నాం" అని పింగళి లక్ష్మీకాంతముగారు మున్నగువారు మాభూమి నాటకమును ప్రశంసించుట స్మరింపదగినది. వీరి మూడవ నాటకము అపనిందకూడ ప్రజాదరణము పొందిన రచన.

అటుపిమ్మట భాస్కరరావుగారు ప్రత్యేకముగా రచించిన 'పోతుగడ్డ' (1953) లోను, సుంకరవారు ప్రత్యేకముగా రచించిన భూమికోసం, జీతగాడు, ప్రతిఫలం, శ్మశానశాంతివంటి నాటికలలోనుకూడ పల్లెలలో భూస్వాములు రైతులపై జరిపెడి అత్యాచారములు వర్ణితములైనవి. "రైతు భూమినీ, పశువుల్నీ ఎంతగానో ప్రేమిస్తాడు. వాటికోసం ప్రాణాల్నిసహితం త్యజించడానికి సిద్ధమౌతాడు. ఆ వాస్తవాన్ని ఈ నాటకంలో నిరూపించడానికి కృషిచేశాను. అంతేకాదు. చారెడు భూమికోసం వ్యవసాయ కూలీలు పడెడి తహతహనుకూడా పాఠకుల దృష్టికి, ప్రేక్షకులదృష్టికి తీసుకురావడానికి ప్రయత్నించాను" అని 'భూమికోసం' (1954) లో రచయిత సత్యనారాయణగారు 'మనవి' చేసికొన్నారు. "తరతరాలుగా ధనిక భూస్వాముల ఇనుప పాదాలక్రిందపడి నలిగిపోతూ 'భుక్తికోసం, భూమికోసం' లక్షలాది బీదరైతు కూలీ ప్రజానీకం చేస్తున్న పోరాటానికి రూపకల్పనే 'భూమికోసం' అనే ఈ నాటకం" అని శ్రీనివాస చక్రవర్తిగారు ఈ నాటకప్రస్తావనలో పేర్కొనినారు. ఈ ఆశయసిద్ధిలో రచయిత కృతకృత్యులైనారు. ఇదికూడ 'ముందడుగు' రచనవంటిదే ! కాని అందు లేని పాత్ర సృష్టి, సంభాషణా సౌలభ్యము ఇందు కలవు.

వీరు కొన్ని సాంఘికరూపకములను (పట్టణములలోని మధ్య తరగతి ప్రజల జీవితమును చిత్రించునవి) కూడ వ్రాసియున్నారు. ఇరువురును కలిసి వ్రాసిన 'అపనింద', సుంకరవారు ప్రత్యేకముగా వ్రాసిన 'గిత్తలబేరం', 'కోతలరాయుడు' అనునవి ప్రత్యేకముగా పేర్కొనదగినవి. ఒక స్త్రీ ప్రేమను పొందలేని ఒక డాక్టరు, ఆమెను అవమానింప సమకట్టి, తుదకు తానే నిందితుడగుట 'అపనింద'లో నిరూపితమైనది. నేటి పెండ్లికొడుకులను, కట్నము లాసించెడి తండ్రులు, గిత్తలను బజారులో అమ్మినట్లు అమ్ముచున్నారని వ్యంగ్యముగా చేసిన చిత్రణము 'గిత్తలబేరము'. కోతలరాయుడు హాస్యపూరితమైన నాటకము; ఇందు పురుషుని సంకుచితత్వము, భర్తకై భార్యచేయగల త్యాగము తులనాత్మకముగ పరామృష్టములైనవి.

శ్రీ బోయి భీమన్న :

పై విధముగానే పల్లెలలోని రైతుల, వ్యవసాయ కూలీల, హరిజనుల సమస్యలను చేపట్టి రచనలు చేసినవారిలో బోయి భీమన్నగారుకూడ ముఖ్యులు. గ్రామములయందలి రైతు-కూలీలకు, భూస్వాములకు జరిగెడి సంఘర్షణము ఇతివృత్తముగా కలిగిన రచనలు భీమన్నగారి 'కూలిరాజు', 'పాలేరు'. వ్యవసాయకూలీల సమస్యలు, గాంధేయమార్గమున వారి విజయము చిత్రితమైన నాటకము. 'కూలిరాజు' (1951). హరిజన యువకహృదయములలో విప్లవము తెచ్చిన వీరి 'పాలేరు' (1942) నాలుగైదేండ్లపాటు ప్రతి పల్లెయందును ప్రదర్శింపబడి, బహుళప్రచారమును పొందిన నాటకము. భూస్వాములచే సాంఘికముగ నణగద్రొక్కబడు

చున్న వ్యవసాయ కూలీలు తాము విజ్ఞానము నార్జించినకాని అభ్యుదయము నందలేమని గ్రహించి, చదువుకొనుట కుద్యుక్తులుకాగా, అందులకు భూస్వాములు పెట్టెడి అడ్డంకులు, అవి తీరి వారు విద్యాధికులుకాగా. ఆ భూస్వాములే వారికి జోహారులనుట యిందు చిత్రితమైనది. కథలో హరిజనసమస్యకూడ ప్రాధాన్యము వహించినది. ఇందలి కుబేరరావు, ఉపకారి, బాల, సీతమ్మవంటి పాత్రలు ఆయా పాత్రల వ్యక్తిత్వమునకు ప్రతీకలు; ఈ నాటకములందు పద్యములు, పాటలుకూడ కలవు. 'పడిపోతున్న అడ్డుగోడలు' ఒక హరిజనబాలిక బ్రాహ్మణుల యింటి కోడలై ప్రశంసాపాత్ర మగుటను చిత్రించిన ఏకాంకిక (1926). అరుంధతీ వశిష్ఠుల చరిత్రను ఇతివృత్తముగా గ్రహించి ఆధునికదృష్టితో రచింపబడిననాటకము వీరి 'రాగవాసిష్ఠం'. 'హరిజనులు ఆర్యులేయని నిరూపించుచు వీరు దీనికి సంతరించిన 'ప్రస్తావన' అవశ్యము పఠనీయము. ఇవికాక వీరి రచనలు కొన్ని అముద్రితములుగా నున్నవి—అమరబాల, దేవదూత మున్నగు నాటకములు; పాతవూరు, శ్రేయసి మున్నగు నాటికలు.

### శ్రీ కొడాలి గోపాలరావు :

వీరి 'పేదరైతు' (1952), 'కూలి' (1953), 'తిరుగుబాటు' (1954) మొదలగు నాటకములందు రైతు-కార్మిక నాయకులు భూస్వాములపైనను, వారికి సహాయకారులైన పోలీసులపైనను చేసిన తిరుగుబాటు, భూస్వాముల పశ్చాత్తాపము ప్రాముఖ్యము వహించుచుండును. కాని ఈతిరుగుబాటును ఆయా నాటకములందు వేరువేరు విధములుగా చిత్రించుటలో రచయిత నేర్పుచూపెను. వీరు రైతుబిడ్డలు (1952), నిరుద్యోగి (1054), లంకెబిందెలు (1959), దొంగవీరడు (1958) అనెడి సాంఘికనాటకములనుకూడ వ్రాసియున్నారు. ఒక చల్లని కుటుంబమున విరోధులుపెట్టు కలతలవలన తండ్రీకొడుకుల మధ్య కలిగెడి మనస్పర్థలు, నిరుద్యోగముచే బాధపడు వ్యక్తుల జీవనసంఘర్షణ, లేని ధనమునెడ ఆసక్తులై ప్రజ లొకరినొకరు మోసపుచ్చుకొనుట, ఆస్తి ధనముకోసమై మానవుడు హత్యలకుగూడ వెనుదీయకపోవుట అనునవి ఈ నాటకములందు చక్కగా నిరూపితములైనవి. వీరి నాటకము లన్నియును ప్రదర్శనాసౌలభ్యము విషయమున గుణాధికములు. గోపాలరావుగారి ఛైర్మన్ రాజకీయాలను హాస్యముతో రంగరించిన నాటకము. ఇట్టిదే కొండేటి సుబ్రహ్మణ్యంగారి 'ప్రెసిడెంటు పట్టయ్య'.

## ప్రయోగ సౌలభ్యము

స్వభావవాద మాలంబనముగా చేయబడిన రచనలన్నియును ప్రదర్శనదృష్టితో వ్రాయబడిన వగుటచేత ఇంచుమించుగా ఈ కాలమున వెలువడిన నాటకములన్నియును ప్రయోగ సౌలభ్యముకల రచనలే అగుచున్నవి. కాని, ఇప్పుడీ శీర్షికక్రింద వివరింపబడెడి రచనలు ఏదో యొక వాదమునో లేదా సిద్ధాంతమునో ఆధారముగా చేసికొని నిర్మితములైనవికావు; అందుచేతనే వీనిని ప్రత్యేకముగా ఈ శీర్షిక క్రింద పరిశీలించుట జరుగుచున్నది.

నేటి యీ రచనలకును, ప్రయోగసౌలభ్యముకలవిగా ఇంతకుముందు వివరింపబడిన నాటకములకును ఒకటి రెండు భేదములు కలవు. ఇంతకుముందు (ముఖ్యముగ 1920_44 మధ్య) అనేకములగు నూతన ప్రయోగములు జరిగినవి. అందు కొన్ని ప్రదర్శనాత్మకములు కావు; మరికొన్ని కేవలము ప్రదర్శనాత్మకములే అయి, సాహిత్యగౌరవము కొరవడినవి; ఇంక తక్కినవి ప్రదర్శనాసౌలభ్యము, సాహిత్యగౌరవము రెండును కలిగినట్టివి. ఇంక, ఈ సమకాలీన రచనలలో సాహిత్యగౌరవముకొరకు ప్రయత్నించుట అంతగా కన్పట్టదు. హృదయమును స్పందింపజేయగల సన్నివేశకల్పనావైశిష్ట్యమునకు బదులు హాస్యపూరితములైన చిన్న చిన్న సన్నివేశములు, పటిష్ఠములై నిండుదనముగల సంభాషణలకు బదులు తేలికగా నడచెడి చమత్కారసంభాషణలు నేటి రచనలలో అధికము. ఇందులకు, అపవాదములుకూడ లేకపోలేదు. వానిలో కొన్నింటిని ఇప్పుడు పేర్కొందును.

### డా. కొర్రపాటి గంగాధరరావు :

ప్రయోగసౌలభ్యదృష్టితో ఏబదికిపైగా నాటకములను, నాటికలను వ్రాసినవారు డా. గంగాధరరావుగారు. వీరి రచనలనెల్ల, తెలుగుదేశమునందలి ఏదోయొక ఔత్సాహిక నాటక సమాజము నిత్యమును ప్రదర్శించుచునే యుండుట యిందులకు తార్కాణము. వీరి నాటకములలో కొన్నిరచనకు, ప్రదర్శనకు నాటకపోటీలలో బహుమతులు పొందియున్నవి. వీరి రచనలు, 'గుడ్డిలోకం' (1955), లోకంపోకడ (1957), 'నిజరూపాలు' (1957), 'భవబంధాలు' (1957), 'తెరలోతెర' (1958), 'కమల' (1957), 'అందరి ఆనందం' (1957), 'పోటీ నాటకం' (1959) మొదలైనవి ఔత్సాహిక నాటకసమాజములవారికి సుపరిచితములు. ఎంతటి గంభీరమైన సాంఘికసమస్యను చేపట్టినను, దానిని చమత్కారసంభాషణలతోను, ఉత్సాహభరితములైన సన్నివేశములతోను నడిపింపగలనేర్పు డా. గంగాధరరావుగారియం దున్నది. ఔత్సాహికసమాజములవారి సౌలభ్యార్థము స్త్రీ పాత్రలు అసలే లేకుండకూడ కొన్ని రచనలను వీరు చేసియున్నారు.

సంఘము సహస్రహస్తములుకల రాక్షసివంటిది; తనవిధానము ననుసరింపనివానిని అది అణచివైచును. కాని ఆతడు ఆ పరీక్షకు తట్టుకొని నిలువబడినచో పిమ్మట ఆసంఘమే వానిననుసరించును—ఇది 'గుడ్డిలోకం'లోని ఇతివృత్తసారాంశము. నేడు మానవులకు ప్రేమానురాగములు రక్తసంబంధములైనవికాక ఆర్థికసంబంధములైనవిమాత్రమే అనెడిసత్యము వ్యంగ్యముగా చిత్రితమైన నాటకము 'నిజరూపాలు'. జీవితమునందలి భవబంధములను త్రెంచుకొనినకాని మానవులకు ఆత్మశాంతి లభింపదని నిరూపించెడి నాటకము 'భవబంధాలు'. మనస్సులో 'తెరలోతెరలు' లేకుండ త్రికరణశుద్ధిగా ప్రవర్తించినచో ఎట్టి ఇబ్బందులురావు అనునది 'తెరలోతెర'లోని కథాంశము. ఇట్టి సంఘటనలే వారి ఇతరనాటకములకును ఆధారములు. ఈ కథలను పరిశీలించినచో, ఏదియో ఒక జీవితసత్యమును, ఒక నిత్యజీవితసంఘటనమును, అందరకును వర్తించు ఒకనీతిని గ్రహించి వీరు నాటకములను రచించినట్లు కన్పట్టగలదు.

డా. గంగాధరరావుగారి నాటకములయందు కథాగమనవేగ మధికము. ఒక బలమగు సన్నివేశమును చిత్రించుటకుబదులు – కొన్ని చిన్నచిన్నసన్నివేశములను – అనుకొననివిధముగా జరుగువానిని – ఒకచో నేర్పుగా సంధానించుట వీరియందలి సామాన్యలక్షణము; సంభాషణములు హాస్యపూరితములును, హ్రస్వములును అగుట మరియొక లక్షణము—ఈ రెండింటి వలనను వారు కథాగమనవేగమును సాధించుకొనినారు. పటిష్ఠమగు సన్నివేశనిర్మాణమునందు మరింత జిగిని, సంభాషణా – రచనావిధానములందు మరింత సాహిత్యదృష్టిని పెంపొందించు కొన్నచో సాహిత్యమునకూడ స్థిరముగా నిలువగలిగిన ఉత్తమ రచనలు డా. గంగాధరరావుగారి లేఖినినుండి వెలువడగలవు.

## శ్రీ వేదాంతకవి :

ఉపాసకుడుగా, స్వాతంత్ర్యసమరవీరుడుగా, ఆంధ్ర బెర్నార్డ్‌షాగా సుప్రసిద్ధులైన వేదాంతకవిగారు 'ఆకలిమంట' (1945), 'చల్ హైదరాబాదు' (1948) మున్నగు రాజకీయ నాటకములను; 'గండపెండేరం' (1956) వంటి కాల్పనిక నాటకమును, 'కష్టకాలం' (1944) 'తంతులు' (1956), 'తెలుగుతల్లి' (1940) మున్నగు సాంఘికనాటకములను, 'మహారథి కర్ణ' (1946) మున్నగు పౌరాణికనాటకములను రచించియున్నారు. అన్నింటను 'తెలుగుతల్లి' విపులఖ్యాతిని పొందినది. ఇందులో తెలుగుతల్లిని, కవిని ప్రేయసీప్రియులనుగా చిత్రించుటయే కాక, భాగ్యవంతులు దేశము నెట్లు దోచుకొనుచున్నది నిరూపించినారు వేదాంతకవిగారు. 'ఆకలి మంటలు'లో ఆకలి ప్రజలలో తిరుగుబాటును రేకెత్తించుటను, 'కష్టకాలంలో' జమీందారులు, మతాధికారులు బీదలను పీడించుటను చిత్రించియున్నారు.

## శ్రీ కె. ఎల్. నరసింహారావు :

నరసింహావుగారి తొలిరచన 'గెలుపునీదే' తెలంగాణ ప్రాంతములోని మారుమూల లందుకూడ ప్రసిద్ధికెక్కినది (1950 కి ముందే). వీరి 'ఆదర్శలోకాలు' హిందూ-ముస్లిముల సఖ్యతకు సంబంధించియున్నది. వీరి 'అడుగుజాడలు', 'క్రొత్తగుడి' గ్రామపునర్నిర్మాణమునకు సంబంధించినవి; 'క్రీనీడలు' రంగస్థలమున చాల విజయవంతమైన నాటకము—అణచివేయ బడిన కోరికలు మానవున కెట్లు హానికరములుగా పరిణమించునో ఇందు చిత్రితమైనది. 'తోడు నీడ' అధికారవికేంద్రీకరణముతో గ్రామీణప్రజల జీవనవిధానమందు కలుగుచున్న మార్పుల వలన వారిలో ప్రభవించెడి కొన్ని సంఘర్షణలు ఇతివృత్తముగా కలిగియున్నది. 'అగ్నిపరీక్ష' మామూలు ప్రచారసాహిత్యమునకు చెందని చక్కని ప్రచారనాటకము. నరసింహారావుగారి పెక్కునాటకములు ఇంకను అముద్రితములుగానే ఉన్నవి. నటులుగా, రేపాలలోని 'గ్రామ వెలుగు నాట్యమండలి' సారథిగా నరసింహారావుగారు చక్కని అనుభవమును గడించుకొన్నారు; కావుననే ప్రదర్శనసౌలభ్యము వీరి నాటకముల కలంకారమైనది. అసలు వ్యవసాయము నందును, సాహిత్యవ్యవసాయమందును అందెవేసినచేయి నరసింహారావుగారు.

శ్రీ చిల్లర భావనారాయణ :

చిల్లర భావనారాయణరావుగారు వ్రాసిన 'గుడిగంటలు', 'కళాభిమాని', 'కామందు', 'క్రొత్తమనిషి' మొదలగు నాటకములుకూడ రంగస్థలమున విజయవంతములైన రచనలే. వీరి 'ఉమర్‌ఖయ్యామ్' (1957) ఆ పారశీకకవి ప్రేమజీవితమును నాటకీకరించుటకు తెలుగు రచయితలుచేసిన ప్రయత్నములలో చక్కని ప్రయత్నమనుట నిస్సంశయము. వీరి రచనలు ప్రదర్శనసౌలభ్యముతోపాటు సరళమగుశైలి కలిగియున్నవి.

శ్రీ డి. వి నరసరాజు :

ప్రయోగసౌలభ్యముకల పాశ్చాత్యనాటకములను అనువదించినవారిలో డి. వి. నరస రాజుగారు ముఖ్యులు. వీరి 'నాటకం' (1951) అనెడి నాటకము పి. జి. వుడ్‌హౌస్ 'ది ప్లే ఈజ్ ది థింగ్' అన్న నాటకమునకు అనువాదము. ఇది అనువాదమైనను స్వతంత్రరచనవలె తీర్చిదిద్దబడినది. సన్నివేశములయందు, సంభాషణలయందు కూడ ఈ నాటకము హాస్యమయమై మూడునాలుగేండ్లు చాల ఔత్సాహికనాటకసమాజములచే ప్రదర్శింపబడి, బహుమతులను పొందిన రచనయిది. దీనిని ప్రదర్శించిన ఉదయినీ-రాఘవకళాకేంద్రములందలి సభ్యులు ఉత్తమసమష్టి కృషికి పేరుపొందిన నటవర్గమని చెప్పవచ్చును. వీరి 'వీలునామా' (1955) కూడ అనుకరణ నాటకమే. 'ఈ ఇల్లు అమ్మబడును' (1958) అనెడి వీరి నాటికకుకూడ పరిషత్తు బహుమానము లభించినది. ఇవికాక వీరు 'ఆత్మహత్య', 'అంతరాత్మ', 'వాపస్', 'కోడిపుంజులు' అనెడి స్వతంత్రహాస్యనాటికలను కూడ వ్రాసిరి.

శ్రీ సీతంరాజు వేంకటేశ్వరరావు :

ఈకాలమున అధికసంఖ్యలో సాంఘికనాటకములను రచించినవారు సీతంరాజువారు. 'పేదపడుచు' (1951) మున్నగు సాంఘికనాటకములు, 'రాజమకుటం' (1959) వంటి కాల్ప నిక నాటకము, 'చిత్తుకాగితాలుకొంటాం' (1959) వంటి వ్యంగ్యహాస్యనాటికలు వీరి రచనలు. వీరి జానపదనాటకము 'బాలరాజు' (1959) కూడ ప్రసిద్ధిగన్న నాటకము.

శ్రీ పడాల రామారావు :

స్వాతంత్ర్యసమరవీరుడు, తెలుగుజోదు అయిన 'అల్లూరి సీతారామరాజు' కథను నాటకీకరించినవారిలో రామారావుగారే బహుశః ప్రథములు కావచ్చును (పితూరి - 1953). 'ఇదాస్వతంత్రం' (1953) మున్నగునవి వీరి ఇతరరచనలు.

శ్రీ శ్రీవాత్సవ :

ఉమ (కుమారసంభవానుసరణము-1936), 'తీరనికోరికలు' (1952) మున్నగు నాటక ములనే కాక పెక్కు నాటికలనుకూడ రచించినవారు శ్రీవాత్సవగారు. తాము సదా నూత్న ప్రయోగాభిలాషి యగుటయేకాక పలువురిని ప్రోత్సహించి నూత్నప్రయోగములకు శ్రీకారము లను చుట్టించినవారు శ్రీవాత్సవగారు.

### శ్రీ అవటపల్లి హనుమంతరావు :

'మహాకవి కాళిదాసు' (1926) నాటకకర్తగా ప్రసిద్ధినందిన అవటపల్లి హనుమంతరావుగారు 'మధుకల్లోలం' (1935) వంటి సాంఘికనాటకములనుకూడ రచించియున్నారు. మద్యపాన వ్యసనమున మానవుడెంత పతనము చెందగలడో ఇందు చిత్రితమైనది.

రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శింపబడి బహుళ ఖ్యాతిపొందిన పౌరాణిక నాటకములు కొప్పరపు సుబ్బారావుగారి 'తారాశశాంకము' (1948). తాండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'రామాంజనేయయుద్ధము' (1949) ఈకాలముననే వెలువడినవి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'పతితపావన' (1936) మున్నగు కాల్పనిక నాటకములనే కాక పెక్కు పౌరాణికనాటకములను కూడ రచించియున్నారు.

## నాటికలు

స్వభావవాదమునందలి విభిన్న దృక్పథములలోని రెండు ప్రధానభేదములను గురించి వివరించియున్నాను. నాటకములందు ఆత్రేయ, సుంకర-వాసిరెడ్డిగార్లు ఎట్లు రెండు విధములైన జీవితములను చిత్రించుటకు ప్రయత్నించిరో, అట్లే నాటికారంగమునకూడ రాజమన్నారు, నార్ల వేంకటేశ్వరరావుగార్లు రెండు వేర్వేరు నాటకరచనోద్యమములకు నాయకులైరని చెప్పవచ్చును. రాజమన్నారుగారు సంఘదురాచారములను విమర్శించు నాటికలను వ్రాసియున్నారు; ఇవి యన్నియును పట్టణములలోని జనులకు, కొంత నాగరక వేష-భాషలకు అలవాటుపడిన స్త్రీ పురుషులకును చెందిన సమస్యలు. ఇక నార్లవారు అధికముగా పల్లెజీవితమును చిత్రించినారు.

### శ్రీ నార్ల వేంకటేశ్వరరావు :

గ్రామజీవితమునందనుభూతము కాదగు సమస్తవిషయములును, సన్నివేశములును వీరి నాటికలయందు చిత్రింపబడినవి. అందువలననే వీరి నాటికలయందత్యంత వైవిధ్యము కన్పట్టును. 'కొత్తగడ్డ' (1947) సంపుటిగా వెలువడిన వీరి నాటికలు ఆర్థిక-సాంఘిక-రాజకీయ ప్రయోజనములను సాధించునవియై తెలుగునాటకరంగమున నూతనప్రయోగములైనవి.

పట్టణమునుండి వచ్చిన అల్లుడు పల్లెటూరి మామగారిని అమాయకునిగా భావించి, ధనసంగ్రహణమునకు వేసిన ఎత్తులు వ్యర్థములగుటను 'భంగపాటు' వివరించుచున్నది. ఇది నార్లవారి తొలిరచన; దీనిని వీరు 'Light comedy' అని పేర్కొనినారు. పల్లెలయందు కష్టించి తల్లిదండ్రులు పంపెడి సొమ్మును పట్టణములయందు విచ్చలవిడిగా ఖర్చుచేయు విద్యార్థుల మనస్తత్వమును చిత్రించు రచన 'ద్రోహం'; ఇందు వివిధవ్యక్తుల మనస్తత్వములు సూటిగా అభివర్ణితములైనవి. 'కొత్తగడ్డ' అనెడి నాటికయందు ఒక పల్లెటూరులోని రైతులు అవసరమగు మరియొక ప్రదేశమునకు వలసపోవుట వర్ణితమైనది; కేవలము 'కర్మసిద్ధాంతము' నకే జీవనవిధానమును వదలిపెట్టినచో అది యెట్లు పూర్తి వినాశనమునకు హేతువగునో ఈ నాటిక సూచించుచున్నది. 'పైపంట' విషాదనాటిక. ఆయేటి పంటయంతయును చేసిన బాకీలకు పోగా, తన జీవితావసరములను పైపంటకు వాయిదావేయు రైతుజీవిత మిందు చిత్రితమైనది.

పల్లెలయందు విభిన్నమన స్తత్వములు కలిగినవారుందురు; అట్టివారిలో మాటాడినంతనే అప శకునములు పలికెడివాని లక్షణములు చిత్రింపబడిన నాటిక 'శకునపక్షి'. ఇట్లే తక్కిన నాటికలును పల్లెవాతావరణసంబంధి రచనలే.

'ఆశాపాశం' అనునది (1949) నార్లవారి తుది ఏకాంకికయేకాక, ఉత్తమ రచన కూడను. 'ఆశాపాశముదా కడున్ నిడుపు' అనెడి భాగవతోక్తసూక్తికి నిదర్శనమన్నట్లుగా పెడదారులుపట్టి చెడిపోయిన కుమారునియెడ తండ్రిచూపిన వైఖరి ఇందు చిత్రితమైనది. ఇచ్చట శాస్త్రి పాత్రపోషణలో కొంత పక్షపాతమును చూపినట్లు కన్పట్టినను, ముఖ్యముగ తండ్రిపాత్ర చాల ఉదాత్తముగ నిర్వహింపబడినది.

పాశ్చాత్యుల రచనానైపుణిని కూలంకషముగా అర్థము చేసికొన్నవారగుటచేత నార్లవారి రచనలు శిల్పము దృష్టిలో ఉత్తమములు కాగలిగినవి. తెలుగున ఉత్తమ ఏకాంకికలను రచించినవారిలో రాజమన్నారుగారితోపాటు పేర్కొనదగినవారు నార్లవారు. పాత్రోచితమైన గ్రామీణభాషా ప్రయోగములో వీరు నిపుణులనవచ్చును. అర్థాంగి, దొంగ-దొర వంటి రచనలలో రంగస్థలమున ఏకపాత్రాభినయనమునకు మాత్రమే అవకాశముగల రచనలుచేసి, తెలుగులో వినూత్నప్రయోగమునకు దారితీసినారు నార్లవారు. ఈ నాటికలలో కొన్నింటి ఇతివృత్తములను గూర్చి డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పేర్కొన్న 'లోతులేకపోవుట' యథార్థ విషయమే. కాని, గ్రామీణ జీవితమును అంత నిశితముగ పరిశీలించినవారుకాని, అంతటి నేర్పుతో నిర్వహించినవారుకాని తెలుగు సాహిత్యరంగమున ఎక్కువమంది లేరనుట నిస్సందేహము. నార్లవారి హాస్యశీలత్వమును ఇందు గోచరింపగలదు.

రచయిత, పాత్రలకంటె వేరుగా కన్పించవలయుననెడి సిద్ధాంతము నార్లవారియెడ అన్వర్థము. తన పాత్రలును, తన వ్యక్తిత్వమును తాదాత్మ్యము చెందునట్లు వారెన్నడును చేయలేదు; అట్లు పాత్రల మనస్తత్వమునకు భిన్నముగా నుండియే ఆ పాత్రల సుఖ-దుఃఖములను సమానముగా పంచుకొనెడినేర్పు నార్లవారికున్నది. 'జీవితంలోని తునకల్లాగా కనబడే ఏకాంకికలు' నార్లవారి నాటికలు, ఏకాంకికలును.

### శ్రీ ఆచార్య ఆత్రేయ :

నాటకరచనయందువలెనే నాటికారచనయందును ఆత్రేయగారు అందెవేసినచేయి. 'ఆత్రేయ నాటికలు' అనెడి సంపుటిలో (1956) పండ్రెండు నాటికలున్నవి. ఇందలి ఎవరు దొంగ?, ప్రగతి మున్నగు నాటికలు బహుళప్రచారము నందినవి. ఏదేని ఒక చిన్ని సన్నివేశమును గ్రహించి, దాని లోతులను చూపగలశక్తి ఆత్రేయగారి రచనకున్నది. అది ఈనాటికలన్నింటనుకూడ కన్పట్టగలదు.

### శ్రీ పి. వి. రాజమన్నారు :

రాజమన్నారుగారు ఇటీవల ప్రచురించిన రెండు నాటికలును—'నాగుబాము' (1958), 'మనోరమ' (1959) లనుగూర్చి ఇచ్చట ప్రస్తావింపవలసియున్నది. 'నాగుబాము' చారిత్రా

త్మక వాతావరణములో జరిగిన కాల్పనికచిత్రణము. ఉత్తమ బౌద్ధశిల్పియైన నాగన్నను పాము కాటునుండి రక్షించుటకు జయశ్రీ యనెడు రాజకుమార్తె తన ప్రాణములను త్యాగముచేసిన విషాదగాథను ఈ నాటిక చిత్రించుచున్నది. 'మనోరమ' దేవదాసీసమస్యకుచెందిన నాటిక. తన ఇష్టమునకు వ్యతిరేకమైన వాతావరణములో తన జీవితమును నాశనముచేసికొన్న యువతి చరిత్ర యిందు చిత్రితమైనది. ఇందు పాత్రలన్నియును చైతన్యవంతములేయైనను, మనోరమ పాత్ర మనల దృష్టి నధికముగా నాకర్షించును; రచయితకూడ ఆ పాత్రపోషణయందే ఎక్కువ శ్రద్ధను వహించియుండుట సుస్పష్టము. రాజమన్నారుగారి ఇతర నాటికలయందువలెనే ఇందును ఒక దురాచారముయొక్క ఖండనము సునిశితముగ, సూటిగ చేయబడుట పరిశీలింపవచ్చును.

## శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి :

వీరి నాటికలన్నియును ప్రదర్శనాసౌలభ్యముకల చక్కనిరచనలు. 'లోకులు కాకులు', 'యమునాతీరే ఎవరికివారే', 'వస్తుందండి రాష్ట్రం రాకేంచేస్తుంది', 'హంతకులెవరు' అనునవి వీరి హాస్య నాటికలు (ఈ నాలుగును ఒకే సంపుటిగా వెలువడినవి_1954). తన విధిని తు. చ. తప్పకుండ నిర్వర్తింపవలయునని ఆశించిన టికెట్ కలెక్టరు పొందిన పరాభవము, ఆంధ్రుల అనైక్యము మొదలైన విషయములిందు వ్యంగ్యముగా రూపొందింపబడినవి. వీరి 'పెద్దమనుషులు' (1954) తెలుగులోని చక్కని హాస్యనాటికలలో ఒకటి. ఇది రచనకు పరిషత్తువారి బహుమానమునుకూడ పొందినది. తమ వివాహము చట్టబద్ధముకాదని భార్యాభర్తలకు ఆకస్మికముగా తెలిసినప్పుడు వారి మనస్సు లెట్లుండునో ఈ నాటిక చాల వాస్తవికముగా చిత్రించుచున్నది. ఇందలి 'రేఖ' పాత్ర ప్రేక్షకుల మనస్సులయందు హత్తుకొనిపోగల సృష్టి. నిజమునకు సంసారమునందు అన్ని బాధ్యతలను స్త్రీయే నిర్వహించుచున్నను, పెత్తనము మాత్రము తనకే కావలయునని భర్త వాంఛించుట వ్యంగ్యముగా చిత్రింపబడిన రచన 'ఈ సంసారం' (ఇవి రెండును ఒక సంపుటిగా 1954 లో వెలువడినవి). శాస్త్రిగారి 'కళ్యాణి' (1947_మారిస్ మేతర్‌లింక్ 'మోనానావా'కు అనుసరణము), న్యాయం అనెడి నాటకములు కూడ సరళములైన రచనలు.

రచనలోని సన్నివేశ_సంభాషణా నిర్వహణములందుగల చాతుర్యము శాస్త్రిగారిని ఉత్తమ నాటికాకర్తగా తీర్చిదిద్దినవి. విద్యార్థిదశలో, రాజమహేంద్రవర కళాశాలలో, శ్రీ భమిడిపాటివారి ప్రహసనప్రదర్శనములందు పాల్గొన్నవారు శాస్త్రిగారు.

## మరికొందరు నాటికాకర్తలు : వారి నాటికలు

ఇంతవరకును ఆయా సందర్భములందు పేర్కొనబడిన నాటకకర్తలలో పలువురు నాటికలనుగూడ రచించియున్నారు. వారి కొన్ని రచనల నిచ్చట వివరించుచున్నాను.

డా. కొర్రపాటి గంగాధరరావుగారి 'విధివశం', 'తనలోతాను', 'బంగారు సంకెళ్ళు' వంటి హాస్య నాటికలు ప్రదర్శనసౌలభ్యము కలిగినవై చాల ప్రచారమును పొందినవి.

అనిసెట్టి సుబ్బారావుగారి 'చెప్పుక్రిందిపూలు' నిరుద్యోగసమస్యను వ్యంగ్యముగా చిత్రించిన నాటిక. కుమారుని చదువునకు ఖర్చుపెట్టిన సొమ్మును, వాని సంపాదనమునుండి గ్రహింపవలయునని భావించెడి తండ్రిపాత్ర యిందు నిశితముగ విమర్శింపబడినది. వీరి యింకొక రచన 'శాంతి' అనెడి ఛాయా(మూక)నాటిక (1951). ఇది పలుభారతీయ భాషలలోనికి అనూదితమైనది; అంతియేకాదు, రష్యన్ ఫిలిం రాయబారసంఘమువారు దీనిని వర్ణచిత్రముగా రూపొందించియున్నారు. యుద్ధాసక్తులైనవారు ఒక యువకుని యుద్ధమున దింపుటకు యత్నింపగా, ఆతడు కర్షక-కార్మికుల సహాయమున వారి నెదిరించి, శాంతిని ప్రతిష్ఠించుట యిందలి యితివృత్తము. రెండవ ప్రపంచయుద్ధఫలితముగా తెలుగులో వెలసిన 'శాంతి' నాటకములో ఇదియొక వినూత్నప్రయోగము (గిడుతూరి సూర్యంగారి 'మానవుడు'కూడ మూక నాటికయే).

పినిశెట్టి శ్రీరామమూర్తిగారి 'ఆడది' (1952), 'రిక్షావాడు' (1952) మున్నగు నాటికలు పెక్కు ఔత్సాహికసమాజములచే ప్రదర్శితములైనవి. వీరి యీ రచనలయందు కొంతకు కొంత అతినాటకీయత (melo - dramatic effect) కన్పట్టగలదు. కొడాలి గోపాలరావుగారు వ్రాసిన 'అగ్నిపరీక్ష', 'ఎవరినీ నమ్మకు' (1959), 'త్యాగమూర్తి' (1959) మున్నగునవి ప్రదర్శనసౌలభ్యముగల సాంఘికనాటికలు. ఆమంచర్లవారి 'అపరాధి' (1950) ఈ కాలముననే వెలువడిన ఒక మంచి నాటిక. దీర్ఘముగా సాగిన సంభాషణలవలన నాటికా గమనము కొంత మందగించినను ఆ సంభాషణలు సూటిగా నుండుటచేతను, పటిష్ఠమగు సన్నివేశనిర్వహణముచేతను, పాత్రలు సజీవములుగా నుండుటచేతను ఇది మంచి రచన కాగలిగినది.

బుచ్చిబాబుగారి 'నాలుగోపరిమాణం' (1952), 'తెరపడని నాటకం' అనునవి చక్కని ప్రతీకనాటికలు. ఈ రకపు రచనలలో 'తెరపడని నాటకం' (1952) ఉత్తమమైనది. ఒక విదూషకునిచేత వేదాంతమును చెప్పించుచు, ఆయా పాత్రలను కలకాలము నిలిచియుండు మానవస్వభావములకు ప్రతీకలుగ నడిపించిన నాటిక ఇది. ఇటువంటి నూత్న ప్రయోగములను తెలుగు నాటికారచయితలలో కొలదిమందిమాత్రమే చేసినారు. స్వాప్నికజగత్తును చిత్రించెడి రచనలలో శ్రీ వాత్సవగారి నాటకము 'తీరని కోరికలు' (1952) పేర్కొనదగినది.

సుంకర సత్యనారాయణగారు రచించిన నాటికలు 'వీరకుంకుమ' అనెడి సంపుటిగా వెలువడినవి (1953). ఇందు—వీరకుంకుమ, కనువిప్పు, భూదేవి, రాంబందులు అనెడి నాలుగు నాటికలున్నవి. వీరు వాసిరెడ్డి భాస్కరరావుగారితో కలిసి వ్రాసిన నాటకములందువలెనే ఈ నాటికలందును ఇతివృత్తములు ధనికుల అధికారుల దౌర్జన్యములను, రైతుజనము కష్టములను చిత్రించుచున్నవి. ఈ విధమగు రచనయందు వీరు సాటిలేనివారనుట అతిశయోక్తికాదు.

హితశ్రీ (మతుకుమల్లి వేంకటనరసింహప్రసాదరావు)గారు వ్రాసిన 'విముక్తుడు' (1958), మొదలగు నాటికలు శక్తిమంతములైన రచనలు. ఒకానొక దుర్ముహూర్తమున

బలహీనుడై మనుష్యుడొక నేరముచేసినను, అది దాటిపోగానే ఆతడు ఆ బలహీనత నెప్పుడును తలంపునకు రానీయకుండుట యిందు హృద్యముగ వర్ణితమైనది. వీరి 'విచిత్రజీవులు' అనెడి నాటకము (1956)లో ప్రస్తుతఆర్థికవ్యవస్థలో ఒకరినొకరు మోసగించుకొనుట వర్ణితమైనది.

వేదములు, ఉపనిషత్తులు మొదలగు వానినుండి కథలను స్వీకరించి రచనలు చేసిన వారు కొందరు కలరు. శ్రీయుతులు విశ్వనాథ సత్యనారాయణ (వేద హరిశ్చంద్ర), మల్లాది సూర్య నారాయణశాస్త్రి (సుమేధ అను రాత్రిదేవీసందేశము–1948), సూరంపూడి భాస్కరరావు (శునశ్శేపుడు మొ॥) ప్రభృతుల రచన లిందుల కుదాహరణములు. భాస్కరరావుగారు చక్కని గేయనాటికారచయితలు (ఆశ్రమ–చారిత్రకము– కవి, సాంఘికము మొ॥). వీరి నాటికలు చాలవరకు రేడియోలో ప్రసారితములైనవి. మందలపర్తి ఉపేంద్రశర్మగారి 'కైమోడ్పు' సరళ ముగా సాగిన చారిత్రకనాటిక.

ముదిగొండ లింగమూర్తిగారి 'వెంకన్నకాపురం' (1959) బహుళ ప్రచారమునందిన వచనసాంఘికవిషాదనాటిక. ఇది పెక్కు పోటీలలో బహుమతులు పొందిన నాటిక. కారెపు అప్పలస్వామిగారి 'ఈరోజు బ్రాకెట్' (1957), 'కట్ జోకర్' మున్నగు నాటికలు బ్రాకెట్, పేక మున్నగు వ్యసనముల వలని అనర్థములను నిరూపించుచున్నవి. కావ్యశ్రీ రచించిన 'మాన వుడు' (1956), 'సమర్పణ' (1957) మున్నగు నాటికలు రచనాసౌష్ఠవము కలవై పోటీలలో బహుమతులు పొందినవి. డా. జె. రమాకాంత్‌గారు 'కాలచక్రం' (కాలసిద్ధాంత నాటకం–అనుస రణ) వంటి నాటకములను, 'గగనకుసుమం' (వచనసాంఘికనాటిక–అనుసరణ) వంటి నాటికలను బహుళముగా రచించియున్నారు. ఎన్. ఆర్. నందిగారి 'వాన వెలసింది' (సాంఘి కము) మున్నగు పెక్కునాటికలు ప్రదర్శనవిజయములను పొందినవి. రాగమూర్తి (మగదల రామచంద్రరావు)గారు 'ప్రత్యూష' (1959), 'మావారు' మున్నగు నాటికలు రచించియున్నారు.

సుప్రసిద్ధహాస్యరచయితలగు భమిడిపాటి కామేశ్వరరావుగారి పుత్రులు రాధాకృష్ణ గారు రంగస్థలమున విజయవంతములైన పెక్కు హాస్యనాటికలు రచించియున్నారు.—'అంతా యింతే' (1959), 'కీర్తిశేషులు', 'దంతవేదాంతం', 'భజంత్రీలు', 'మన స్తత్వం' మొ॥.

కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు 'చరిత్రగతులు' (1955) వంటి చారిత్రక నాటికలు, 'కళావరుజాకీ' (1956) వంటి హాస్యనాటికలు, 'తెరమరుగు నీడలు' (1958) వంటి సాంఘికనాటికలు రచించియున్నారు.

"నాగభూషణ్" (మొదలి నాగభూషణశర్మ)గారు వైవిధ్యముతో కూడిన పెక్కు నాటికలు రచించియున్నారు. వీరి 'అన్వేషణ' (వచనవిషాదనాటిక–1954) మున్నగు అనుసరణలు, 'మృత్యుభయం' (1957) మున్నగు స్వతంత్రరచనలు చక్కని నాటికలు.

దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారి 'సుచిత్రాప్రణయం' (1958), కంచి వాసు దేవరావుగారి 'పతితుడు' (1955), రావర్ల దివ్యప్రభాకర్‌గారి 'నిరవధి' (1954), భట్టిప్రోలు

కృష్ణమూర్తిగారి 'ఉత్తచేతులు' (1956), కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'నటన', వడ్లమూడి సీతారామారావుగారి 'తారాబలం', బలిజేపల్లి భాస్కరరావుగారి 'ప్రాణభిక్ష' (1959), వెంపో గారి 'ప్రజలకోసం' (1956), మాల్యాద్రిగారి 'చలోఢిల్లీ' (1956), వట్టికోట ఆళ్వారుస్వామి గారి 'కనువిప్పు' (1955) మొదలగు నాటికలు పేర్కొనదగినవి.

పోతుకూచి సాంబశివరావుగారు 'ఇదీ తంతు' (1949), 'ఏడు సున్నలు' (1952), 'దొంగ' (1953) మున్నగు నాటికలను రచించియున్నారు.

గొల్లపూడి మారుతీరావుగారు 'రాగరాగిణి' వంటి నాటకములనేకాక 'అనంతం' (అపరాధ పరిశోధక నాటిక_1959), 'పతిత' (సాంఘిక నాటిక), 'విలువలు' (వ్యంగ్యనాటిక) వంటి పెక్కు నాటికలను రచించియున్నారు. రచనలో, ప్రదర్శనములో నూత్నప్రయోగమునకు సర్వదా ప్రయత్నించుట మారుతీరావుగారిలోని విశిష్టత.

డా. మారేమండ రామారావుగారు 'విప్లవం' (1945), 'నైవేద్యం' (1945) మున్నగు చక్కని చారిత్రకనాటికలను రచించినారు.

ముప్పన విశ్వప్రసాద్‌గారు 'తాజమహల్' (1954) వంటి కాల్పనికనాటికలు, 'అసమర్థులు' (1958) వంటి హాస్యనాటికలు, 'దగాకోరు' (1954) వంటి వ్యంగ్య నాటికలు, 'భిక్షగాడు' (1956) వంటి సాంఘికనాటికలు విరివిగా రచించినారు. వీరు 'ప్రేమపీఠం' (అనువాదము_1954) మున్నగు నాటకములనుకూడ రచించియున్నారు.

రెంటాల గోపాలకృష్ణగారు 'ఇనస్పెక్టర్ జనరల్ (1956) వంటి అనువాద నాటకములనే కాక 'ఆకలి', 'శిక్ష' (1952) వంటి స్వతంత్రనాటికలనుకూడ రచించియున్నారు.

రావి కొండలరావుగారు 'కుక్కపిల్ల దొరికింది' (హాస్యనాటిక_1958) మున్నగు పెక్కు నాటికలనేకాక నాటకములనుకూడ రచించియున్నారు. వీరి రచనలలో మృదువైన శాబ్దికహాస్యము నిండిఉండును. వీరి రచనలు ప్రదర్శనసౌలభ్య మధికముగా కలవి.

డా. రాంబాబు, పొట్లూరి వేంకటేశ్వరరావు, పోకల నరసింహారావు, బి. ఎస్. సూరి, పోలవరపు శ్రీహరిరావు, మహీధర మోహనరావు, వి. డి. ప్రసాదరావు, రంగకవి మున్నగు పలువురు రచయితలు నాటికారచనలో వివిధప్రయోగములను చేయుచున్నారు.

నటుడుగా, దర్శకుడుగా నాటకకళకు జీవితము నంకితముచేసికొన్న ఎ. ఆర్. కృష్ణగారు పెక్కు నాటికలు రచించి, ప్రదర్శింపజేసినారు. ఇందు 'అరగంటలో అదృష్టం' (1955) వంటి ఒకటిరెండు నాటికలు మాత్రమే ముద్రితములైనవి.

శ్రీమతి కల్యాణిగారి 'పెళ్ళికొడుకు' (1954), కొడాలి సుబ్బారావుగారి 'ఆహుతి' (రాజకీయ_సాంఘికసమస్యా సమ్మేళనము), మూర్తిగారి 'మార్పు' (1949_తెలంగాణా రైతుల భాషలో వ్రాయబడినది) మున్నగు పెక్కు నాటికలు ప్రదర్శనసౌలభ్యముగల నాటికలు.

స్త్రీ పాత్రలులేని నాటికలు కొన్ని ఇటీవల వెలువడుచున్నవి (శ్రీనివాస చక్రవర్తి గారి 'లోభి' మొ॥). అట్లే ఏకపాత్రాభినయమునకు అనుకూలమగు ప్రత్యేక రచనలుకూడ వెలువడుచున్నవి—పెమ్మరాజు వేణుగోపాల కృష్ణమూర్తి (అశ్వత్థామ, కర్ణ, చాణక్య మొ॥) సోంపల్లి బాపయ్య ('అప్పాజీ', 'పురుషోత్తముడు' మొ॥) మున్నగు వారి రచనలు ఇందులకు ఉదాహరణములు.

వేలూరి శివరామశాస్త్రిగారి ప్రియశిష్యులై, సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో మనోహర కవిత్వము చెప్పగల ప్రజ్ఞాశాలి అంబటిపూడి వెంకటరత్నంగారు. వీరి నాటికలు 'కౌమోదకి' అను పేర ఏకసంపుటిగా వెలువడినవి (1950). ఇందు కొన్ని ఆంగ్లానువాదములు, కొన్ని ఉపనిషత్సంగృహీతములు, తక్కినవి స్వీయకల్పనలు.

కంచిభట్ల కృష్ణమూర్తిగారి నాటికలు నాలుగు 'దేవుడు ప్రత్యక్షమైతే... !' అనెడి పేరుతో ఏకసంపుటిగా వెలువడినవి.

రావూరి భరద్వాజగారి నాటికలు నాలుగు 'భానుమతి' అను పేరుతో వెలువడినవి (1952). ఇందులోని 'ఇష్టసిద్ధి' అనెడి చివరి నాటిక రచనకు ఫ్రాయిడ్ wish fulfilment (ఇచ్ఛా సాఫల్యత) సిద్ధాంతము ప్రోత్సాహకమైనది. కథకులుగా సుప్రసిద్ధులైన భరద్వాజగారు నాటికారచనలోకూడ విన్నాణమును చూపినారు.

వేణుగారి 'దిష్టిబొమ్మలు' 1955 వ సంవత్సరములో ఆంధ్రనాటకకళా పరిషత్తు వార్షికపు పోటీలలో ప్రదర్శనకు నటనకు ప్రథమబహుమతి పొందిన నాటిక. వీరి 'చీకటి దొంగలు' నవలపోకడలో వ్రాయబడిన నాటిక (నాటిక అంతయును 'దాసు' అను పాత్ర కథ చెప్పుచున్నట్లుగా సాగినది).

పైనిపేర్కొన్నదానినిబట్టి ఆయా రచయితల నాటికలు కొన్ని ప్రత్యేకసంపుటములుగా వెలువడిన విషయము స్పష్టము. అట్లుకాక. ఆయా రచయితల ప్రసిద్ధములైన కొన్ని నాటికలను, తమకు నచ్చినవానిని ఎన్నుకొని సంపుటములుగా కొందరు వెలువరించియున్నారు. అట్లు తొలిసారిగా వెలువడిన వానిలో డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, స్వామి శివశంకరులు, శ్రీ కె. వి. గోపాలస్వామిగార్లు సంపాదించిన మూడు సంపుటములు ప్రధానములైనవి. అటు తరువాతి కాలములో వట్టికోట ఆళ్వారుస్వామిగారు 'జీవనరంగం' అను పేర ప్రకటించిన రెండు సంపుటములు, నవ్యసాహితీసమితివారు ప్రకటించిన 'ఐదు ఏకాంకికలు' అనెడు సంపుటము పేర్కొనదగినవి. ఇట్టి సంపుటములు ఇంకను కలవు.

ఇంకను పేర్కొనబడవలసిన నాటికాకర్త లనేకులున్నారు; అసలు పేర్కొనబడినవారి నాటికలే ఇంకను చాల కలవు. యువతరమునకు చెందిన రచయితలలో పలువురు పాశ్చాత్య సాహిత్యపరిచయసంపన్నులై నాటక-నాటికా సాహిత్యమున ఇంకను పలురకముల ప్రయోగములను చేయుచునేయున్నారు.

## మరికొందరు నాటకకర్తలు : వారి నాటకములు

### సాంప్రదాయక రచనలు :

పౌరాణిక, చారిత్రక ఇతివృత్తములను స్వీకరించి రచయితలు సాంప్రదాయకమైన పద్ధతిని నాటకరచన చేయుచుండుటచేత నేటికిని రామాంజనేయ యుద్ధములు, భారత-రామాయణ నాటకములు తిరిగి తిరిగి వ్రాయబడుచునేయున్నవి. చారిత్రకనాటకములలో కొండముది గోపాలరాయశర్మగారి 'గౌతమబుద్ధ', ఆత్రేయగారి 'అశోకసామ్రాట్', దుర్భా వేంకట కృష్ణమూర్తిగారి 'విషాద తిమ్మరుసు' (1946), వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావుగారి 'నరసన్నభట్టు' (1957) మున్నగు నాటకములు పెక్కు వెలువడినవి. ఇందు 'విషాదతిమ్మరుసు' ఉత్తమ విషాదనాటకము. పుత్రశోకముచే తిమ్మరుసు గ్రుడ్లు పీకింపవలసినదని ఆజ్ఞాపించిన కృష్ణరాయని మానసిక వ్యధ, జీవితమంతయు కృష్ణరాయని సేవలో గడపి, వార్ధక్యమున శరీర బాధకు మించిన మానసికవ్యధకు లోనైన తిమ్మరుసు మానసికస్థితి ఇందు చిత్రితములు. లక్ష్మీనరసింహారావుగారు స్వయముగా నటులగుటచేత వారి రచన తదనుగుణముగా సాగినది.

ఇచ్చటనే పేర్కొనవలసిన మరియొక సాహిత్యరూపకము నండూరి రామకృష్ణమాచార్యగారి 'ధర్మచక్రము' (1950); ఇందలి గాథ 'చంద్రగుప్త-చాణక్య-బిందుసారుల ప్రసిద్ధ జీవితము లుపఘ్నములుగ కొనలుసాగి తనర్చి, తలిర్చిన నవమాలికలత'. చంద్రగుప్తునకు విషయలోలుడైన బిందుసారుడు పుత్రుడు. అతని వారవనిత ఉషాసుందరి. అతడామె మోహపాశమున చిక్కుకొనియుండగా రాజ్యముపైకి గ్రీకులు దండెత్తి వత్తురు. ఉషాసుందరి, సర్వసేనాపతియైన బిందుసారునకు వీరఖడ్గ మిచ్చినది. అంతేకాదు. తాను ధర్మదీక్షనంది బిందుసారుని 'ధర్మపత్నీసమేతంగా రాజ్యచక్రాన్ని శాశిస్తూ ధర్మచక్రాన్ని శిరసావహించు'మని ప్రబోధము చేసినది. దండనీతికి ప్రాధాన్యమిచ్చిన చంద్రగుప్త-చాణక్యులకు, ధర్మదీప్తికై సర్వమును త్యాగముచేసిన అశోక-ఉపగుప్తులకు మధ్యకాలమున రాజ్యమేలిన బిందుసారునిలో సమన్వయము పొందిన ఆ రెండు యుగధర్మములును ఇందు హృదయంగమముగ చిత్రింపబడినవి. ఉషాసుందరియెడ అతని ప్రేమ అతిపవిత్రమైన రసజగత్తులో లీనమైనది. ఇందలి వాతావరణ కల్పన, సుకుమారమగు హాస్యము, సంభాషణాచమత్కారము ఈ నాటకముయొక్క ఔచిత్యమును ఇనుమడింపజేయుచున్నవి. వీరి మరియొక చారిత్రకరూపకము 'ఛత్రపతి శివాజీ' (1947). వీరి చారిత్రకనాటకములు 'ఉరికంబం' (1954), 'శ్రీకృష్ణదేవరాయలు' (1953), 'త్యాగరాజు' (భక్తిరసపూరితమైన నాటిక-1954); 'తెలుగుగడ్డ' (వ్యంగ్యనాటిక-1954) మున్నగునవి ఇతరరచనలు. ఇవియన్నియును రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శింపబడినవి.

కన్నస్వామిగారు వ్రాసిన 'మహారుద్రీయం' మరియొక ఉదాత్తమైన చారిత్రక నాటకము. హైదరాబాదు థియేటర్ సెంటర్‌వారి బహుమానమును పొందిన రచన యిది.

ప్రతాపరుద్రదేవుడు పొరపాటున తన తండ్రి హత్యకు కారకుడగుట, ఆ కారణముగ తన తమ్మునితో మనస్పర్థలురాగా, తుదకు ప్రతాపరుద్రదేవుడు తమ్మునికి విశ్వాసము కలిగించి అతనినుండి గౌరవప్రపత్తులను తిరిగి పొందుట ఇందలి కథ. పెమ్మరాజు గోపాలకృష్ణయ్యగారి 'వీరకాపయ్య', 'నాగమనాయకుడు' మున్నగు రచనలుకూడ పేర్కొనదగిన చారిత్రక నాటకములు.

## మనస్తత్త్వనిరూపక రూపకములు :

ఫ్రాయిడ్‌తో ప్రారంభమైన మనస్తత్త్వ పరిశీలనము ప్రపంచసాహిత్యమునకు క్రొత్త కాదు. అయినను ఆంధ్రసాహిత్యమున ఆ సిద్ధాంతమును పరిశీలించి, అనుసరించినట్లు విస్పష్టముగ గోచరించుట గుడిపాటి వేంకటచలంగారితోనే ఆరంభమైనదని చెప్పవచ్చును. ఇట్టి సిద్ధాంతప్రభావమునకు లోనై రచన సాగించినవారు బుచ్చిబాబుగారు. ఇట్టి మనస్తత్త్వ పరిశీలనముతో వ్రాయబడిన రచన వ్యక్తినిష్ఠమగుటచే ఈ రకము నాటకములను వ్యక్త్యాత్మక రూపకములనుట సమంజసము. ఇట్టివానిలో బుచ్చిబాబుగారు వ్రాసిన 'ఆత్మవంచన' మేలుబంతి.

ఒక ధనికకుటుంబముపై ఆధారపడి పెద్ద చదువులు చదివి, గొప్ప ఉద్యోగమును పొందిన రాజశేఖరం విషాదజీవితమును చిత్రించు నాటకము 'ఆత్మవంచన'. కాని అతని జీవితమునందలి విషాదముకన్న ఆ కుటుంబమునందలి పెద్ద కుమార్తె రాణి జీవితము ఇంకను విషాదకరమైనది. ఇందు ఆమె మనస్తత్త్వ క్రమపరిణామమును నాలుగైదు దశలలో రచయిత నిరూపించుట జరిగినది. రాణి మానసికస్థితియందలి ఈ క్రమపరిణామమును గుర్తుంచుకొని రాజశేఖరం మాటలు కొన్ని పరిశీలించినచో రాణి, రాజశేఖరంల పాత్రచిత్రణావైశిష్ట్యము బోధపడగలదు.

"అంతటి లోతైన భావాలు కలదానివి...రాణీ, నీ నడకమాత్రం మెరకమీదనే, చిత్రం."

"మనుషులు ఎందుకు ద్వేషిస్తారో తెలుసా? వాళ్ళ కేంకావాలో తెలీక...తెలిస్తే దాన్ని సాధించడానికి యత్నిస్తారు. తెలీకపోవడంవల్లనే ఈ ఆవేదన".

"నిన్ను గురించిన సత్యం నీకు తెలుసు రాణీ. కాని నువ్వు దాన్ని ఎదుర్కొనలేవు".

"నువ్వు ఎవర్ని ప్రేమించావన్నా నేను నమ్మను...నువ్వు ప్రేమించేది ఒకే ఒక వ్యక్తి—ఆ వ్యక్తి నువ్వే" !—

రాజశేఖరం, రాణి పాత్రలు అత్యుత్తమశిల్పదృష్టితో చిత్రింపబడినవి. ఈ విషాదస్థితినుండి ప్రేక్షకుని మనసును త్రిప్పుటకు వాణి, గోపాలం పాత్రలు సృష్టింపబడినవి. ముఖ్యముగా గోపాలం సంభాషణలు ఆహ్లాదమును కలిగించి, విషాదభావము వలన కలిగిన మానసికక్షోభమును తగ్గించును.

కాని స్త్రీ పాత్రలు ఎక్కువ అగుటచేతను, నృత్యము ప్రదర్శింపబడవలసిన అవసర ముండుటచేతను దీని ప్రదర్శనము కొంచెము కష్టమగును. ఇది ఆంధ్రనాటకకళా పరిషత్తు వారిచే రచనకు బహుమానమునందిన నాటకము.

విషాదభావపోషణము నందును, ఆహ్లాదవిషాద భావములను సమముగా నడిపించి, అంతమునచూపు విషాదభావమునకు సునిశితత్వమును కలిగించుటయందును, మానసికస్థితి పరిశీలనమునందును, సున్నితమగు హాస్యసంభాషణలయందును ఈ నాటకము రచయిత నేర్పును విశదము చేయుచున్నది. ఈ కాలమున వచ్చిన విషాదరూపకములలో 'ఆత్మవంచన' ఒక ఉత్తమమైన రచన.

## ప్రతీకరచనలు :

ఈ జాతిలో రూపకములయందు ముఖ్యమైనది రాయప్రోలు సుబ్బారావుగారు వ్రాసిన 'రూపనవనీతము'. ఇది గురుదేవుల మర్మకవిత్వశాఖకు చెందిన రచన. రచయితయే చెప్పు కొన్నట్లు సంవాదరూపమున నుండుటచేతను, ప్రవేశ-నిష్క్రమణలు, రంగములు మొదలగు వాని విభాగీకరణము కలదగుటచేతను ఈ రచనకు రూపకచ్ఛాయ వచ్చినదేకాని నిజమునకిందు రూపకగుణము తక్కువ. ఆనందవర్ధనుని సాహిత్యసిద్ధాంతసూత్రముల నాధారముగా చేసికొని ఇందు ఉక్తిప్రత్యుక్తులు సాగినవి. ఆంగ్లమున షెల్లీ రూపకరచన ఇట్టిది. కాని అవి పద్యరూప మున నుండగా, ఇది గద్యరూపముననున్నది. ఇది శిష్టవ్యవహారగద్యమున సాగినను భాష మాత్రము రూపకము మోయజాలని బరువుకలది.

ఆరుద్రగారు వ్రాసిన 'దేవుని ఎదుట'లో ప్రపంచమే ఒక అన్యాయస్థానము; అసమా నత్వమే న్యాయ్యము; అట్టి న్యాయస్థానమున విచారించు మానవుని బానిసత్వమును వ్యంగ్యముగ చిత్రించిన ప్రతీకరచన ఇది.

కుందుర్తి ఆంజనేయులుగారి 'ఆశ' (1957) ఇంకొక ప్రతీకరచన. వచనగేయ రూపమున సాగిన యీ నాటికలో కాలం, చరిత్ర, ఆశ అనువానికి రూపకల్పన జరిగినది.

## మరికొన్ని సాంఘికరచనలు :

ఇంతకుముందు స్వభావవాద శీర్షికక్రింద పరామర్శింపబడిన నాటకములుకాక మరికొన్ని నాటకముల నిచ్చట పరామర్శింతును. శ్రీయుతులు హితశ్రీ, నాగభూషణ్, కొండముది శ్రీరామ చంద్రమూర్తి, కొండముది హనుమంతరావు, మంథా వేంకటరమణారావు ప్రభృతులు యువ తరమునకుచెందిన రచయితలు. హితశ్రీగారి 'విచిత్రజీవులు' (1956) లోకమున చిన్న విష యమునుండి మహత్తరవిషయమువరకును, సామాన్య మానవునినుండి గొప్పనాయకునివరకును మోసమెట్లు ప్రాధాన్యమును వహించుచున్నదో చూపిన రచన. నాగభూషణ్‌గారి నాటకములలో 'విషాదాంతం' (1955) ప్రఖ్యాతము. ఇది సరిక్రొత్త ప్రాతకథ. ప్రేయసీప్రియుల విషాద వియోగము కథావస్తువైనను కథానిర్వహణమున ఒక శిల్పచమత్కృతిచూపబడినది. ఒకే రంగ

మున, అదేపాత్రలచేత ఒకప్రక్క నాటకమును, వేరొకవంక నిజమైనసంఘటనలను జరుగుట చూపుచు జీవితమే నాటకమనెడి సత్యమును సూచించినారు నాగభూషణ్‌గారు. వీరి 'సంభవామి యుగేయుగే' ఒకే కుటుంబమునందలి నాలుగుతరముల వ్యక్తులు అభివృద్ధికెట్లు నిరోధకులో, అభ్యుదయకాముకులో అడ్డంకులను ఎట్లుదాటగలరో నిరూపించిన రచన. ఇంతకుముందే పేర్కొన్నట్లు, ఇట్టిప్రయోగములు పాశ్చాత్యనాటక సాహిత్యప్రభావజనితములు. మంథా వేంకటరమణా రావుగారి 'ఆత్మహత్య' (1958)లో కొంత ఆంగ్లవాసన కన్పించుచున్నను ఇది నాటకీయతగల రూపకము. కొండముది సోదరులు కలిసివ్రాసిన "విపర్యయం" ప్రదర్శనాసౌష్ఠవముగల రచన.

భూషణ్‌బాబుగారు 'ధర్మదీక్ష' (1950) వంటి సాంఘికనాటకములను, 'అశాంతి' (1952) వంటి రాజకీయనాటకములనుమాత్రమేకాక 'ధన్యజీవి' (1951) వంటి సాంఘిక నాటికలు మున్నగునవి రచించియున్నారు.

పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారి 'గ్రామసేవ' (1954) వారి ఆధ్వర్యములోనే ప్రదర్శింపబడినది. "స్వతంత్రం సంపాదిరించిన మనదేశంలో తిరిగి మనం చేయవలసినపనులు, వాటినిచేసే విధాలూ, వాటిని చేయడంలో కలిగే బాధలు, చిక్కులు, వీటిని తీర్చే విధానాలు" ఈనాటకమున చక్కగా చిత్రింపబడినవి.

చదలవాడ పిచ్చయ్యగారి 'ప్రతీక్ష' (1956–మనస్సౌందర్యమును చిత్రించునది), జీరెడ్డి చెన్నారెడ్డిగారి 'ప్రసిడెంటు' (1954) ప్రదర్శనయోగ్యములైన వ్యంగ్యనాటికలు. కోట లక్ష్మీ నరసింహంగారి 'ప్రణయసమ్రాట్' (1944) కూడ ఇట్టిదే.

బొజ్జా సూర్యనారాయణగారు రంగస్థలమున విజయవంతములైన 'దేవదాసు'(1957), 'ప్రజాద్రోహి', 'సంస్కరణ' మున్నగు నాటకములను రచించియున్నారు. గణపతిరాజు అచ్యుతరామరాజుగారి 'బ్రహ్మముడి' (1955) అపార్థాలవలన కలిగే అనర్థాలను నిరూపించు చున్నది.

కణ్వశ్రీగారి "బాలనాగమ్మ" (1950), "ఇదాప్రపంచం" మున్నగునవి రంగస్థలమున ప్రసిద్ధిగన్న నాటకములు. గుళ్ళపల్లి నారాయణమూర్తిగారి "విడాకులా"కూడ ఎన్నదగిన రచన.

దుగ్గిరాల విశ్వనాథంగారి "జ్యోత్స్న" (1945), యస్. టి. సుదర్శనాచార్యగారి "ఇదాస్వరాజ్యం?" (1951) పేర్కొనదగిన విషాదనాటకములు. పడాల రామారావుగారి "సందేశం" యుద్ధబీభత్సమును చిత్రించిన నాటకము.

### మరికొన్ని చారిత్రకరచనలు :

మాడభూషి వేంకటాచార్యగారి "ప్రభ" (1956) అశ్వఘోషుని జీవితగాథకు సంబంధించిన కాల్పనికనాటకము. రచన మధురముగా సాగినది. అశోకునిగూర్చి వెలువడిన నాటక

ములలో డా. చాగంటి సన్యాసిరాజుగారి "అశోక" (1951) పేర్కొనదగినది. సన్యాసిరాజుగారు స్వయముగా నటులు; చక్కని దర్శకులు. ఈ నాటకము వారి ఆధ్వర్యములోనే ప్రదర్శింపబడినది. కె. వి. ఆచార్యగారి 'దేవానామ్ప్రియ '(1956 – అశోకుడు 'దేవానామ్ప్రియ' బిరుదును సంపాదించుకొన్న కథ) చక్కని రచన. అచ్యుతుని వేంకటాచలపతిరావుగారి "శంకర విజయము" వారి మరణముపిమ్మట ముద్రితమైనది (1957). శ్రీ జగద్గురు జీవిత సందేశముల నందించు రచనయిది. భమిడి సత్యనారాయణశర్మగారి 'దారాషకో' (1946) హిందూ మహమ్మదీయ సంఘీభావరూపకము. బండ్ల సుబ్రహ్మణ్యకవిగారి 'బుద్ధావతారము' (1951), 'తులసీదాసు' (1949) సంప్రదాయపద్ధతిలో రచింపబడిన నాటకములు. ఈ వ్యాసకర్త రచించిన 'తాజ్మహల్' 1942 లో వెలువడినది; తాజ్మహల్ నిర్మాణమునకు సంబంధించిన కథయిది.

శివాజీచరిత్రకు సంబంధించిన మరిరెండు నాటకములు కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తిగారి 'శివాజీ', సురభి నరసింహంగారి 'సింహగడము' (1951) పేర్కొనదగిన రచనలు.

స్థానం నరసింహారావుగారి 'శ్రీకృష్ణదేవరాయలు' (1955) వారి నటనానుభవమును పురస్కరించుకొని వెలువడిన రచన.

ఈ కాలమున వెలువడిన చారిత్రకనాటకములలో వావిలాల సోమయాజులుగారి 'నాయకురాలు' (1946)విశిష్టమైనది. ఆంధ్రకురుక్షేత్రముగా ప్రసిద్ధిపొందినది కారెంపూడి కదనరంగము. ఈ గాథను శిల్పవిశిష్టముగామలచి, ప్రదర్శనాసౌలభ్యముగల చక్కని నాటకముగా రూపొందించినారు సోమయాజులుగారు. దీనిని చేపట్టినవారెల్ల సమష్టికృషితో దీనిని పలుసార్లు విజయవంతముగా ప్రదర్శించియున్నారు. రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారి 'కొండవీడు' (1950) కూడ పేర్కొనదగిన నాటకము.

పౌరాణికగాథ లాధారముగావెలసిన నాటకములలో మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి "సక్కుబాయి", జంపన చంద్రశేఖరరావుగారి "వేంకటేశ్వర మహాత్మ్యం", పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి 'ఉషాసుందరి , కాజ రాధాకృష్ణశాస్త్రిగారి 'అమరజ్యోతి', భూపతి లక్ష్మీనారాయణరావుగారి 'ధర్మరక్షణము' (1960) పేర్కొనవలసిన రచనలు. లక్ష్మీనారాయణరావుగారు 'ధర్మరక్షణము'నకు "పరిచయము" పేర సంతరించిన వ్యాసము తప్పక పరిశీలింపదగినది. శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి 'దివోదాసు', 'బృంద' ఈకాలముననే వెలసినవి.

డా. గరికిపాటి రాజారావుగారి దర్శకత్వములో ప్రదర్శింపబడిన 'అల్లూరిసీతారామరాజు', 'జై భవానీ' నాటకములు చక్కనిరచనలు. కణ్వశ్రీగారు "ఆనాడు" (1948)లో ప్రప్రథమముగా భారతదేశము ఘోరీకి వశమైన చరిత్రను చిత్రించి, అంతఃకలహములు స్వాతంత్ర్యమునకు ముప్పుఅని నిరూపించినారు. ఆంధ్రవిప్లవవీరుడైన అల్లూరి సీతారామరాజు చరిత్రను గ్రహించి నలుగురైదుగురు–పడాల రామారావు, గబ్బిట వెంకటరావు, కె. వీర్రాజు(మధురశ్రీ) ప్రభృతులు–

సీజరు'కు, 'ఆంటోనీ-క్లియోపాత్రా'కు చేసిన అనువాదములు సాహిత్యరూపకముల స్థాయికి చెందినవి. కాని ఈజాతి అనువాదములలో భాషయందు మరింతసౌలభ్యము కొంత విశిష్టత చేకూరినగాని ఆంగ్లనాటకముల—ముఖ్యముగ షేక్స్పియరు నాటకముల-అనువాదములయందు మూలరచయితకు న్యాయ్యము చేకూర్చుట జరుగదు.

శ్రీనివాసచక్రవర్తిగారు గోర్కీ (పతితజీవులు - Lower Depths), హూకో (జైత్రయాత్ర - చీనా ప్రజావిప్లవరూపకము) మున్నగు రచయితల నాటకములను అనువదించియున్నారు. షేక్స్పియరు నాటకములకు పలువురి అనువాదములు వెలసినవి. రాధాకృష్ణగారు 'ఇబ్సెన్' నాటకమును (Pillars of Society) 'సంఘనాయకులు' అనుపేర అనువదించి, అందు భారతీయవాతావరణమును కల్పించినారు. మాక్సింగోర్కీ-రచనను 'తుదిఘడియలు' (1950) అనుపేర ఉన్నవ లక్ష్మీనారాయణ, చిట్టూరి సత్యనారాయణగార్లు అనువదించినారు. కొప్పరపు సుబ్బారావుగారి 'ఇనపతెరలు', అవసరాలవెంకటసర్సుగారి 'జ్యోతిర్మయి', ముప్పన చినఅంకయ్యగారి 'కుళ్ళుసరుకు', గౌతమగారి 'మేడిపళ్ళు', విద్వాన్ విశ్వంగారి 'ప్రజావిరోధి', గొల్లపూడి మారుతీరావుగారి 'రాగరాగిణి' మున్నగునవికూడ పాశ్చాత్యనాటకానువాదములే.

రవీంద్రుని కృతులకు అనుకృతులు తెలుగున చాలవచ్చినవి. రవీంద్రుని నాటకములను, నాటికలను తెనిగించినవారిలో డా. బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యులు. వారు రవీంద్రుని పలుకుబడిని, భావములను తు. చ. తప్పకుండ అనువదించుటకు ప్రయత్నించుటచేకాబోలు ఈ అనువాదములు కొంత క్లిష్టాన్వయముకలవిగ కన్పట్టును. కాని ఇవి వంగమాతృకనుండి సూటి అనువాదములగుటచేత మూలకర్త రచనాపద్ధతి తెలియుటకు అవకాశమేర్పడినది.

సంస్కృతనాటకానువాదములు నేటికిని బహుళసంఖ్యలో వెలువడుచున్నవి. ఈమధ్యనే వెలువడిన దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి, భమిడిపాటి కామేశ్వరరావుగారి భాసనాటకానువాదములు, రాయప్రోలు సుబ్బారావుగారి ఉత్తరరామచరితానువాదము మొదలగునవి ఇప్పట్ల పేర్కొనదగినవి. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాథరావుగార్లు అనువదించిన బిల్హణుని 'కర్ణసుందరి' (1947) సరళముగానడచిన అనువాదము. శతావధానులు శ్రీనివాససోదరుల 'విచిత్రరాఘవము', వాడ్రేవు సీతారామస్వామిగారి 'అభిషిక్తరాఘవము' రామాయణకథా నాటకములు. కొర్ని శేషగిరిరావుగారి 'సతీఅనసూయ' (1946) మున్నగు పౌరాణికనాటకములు కూడ ఈకాలమున కొన్నివెలువడినవి. డా. దివాకర్ల వేంకటావధానిగారి 'కౌముదీమహోత్సవము' (1952) సరళముగా సాగిన సంస్కృతానువాదము.

ఇతరభాషలనుండి—ముఖ్యముగ-తమిళ కన్నడ మళయాళములనుండి ఇప్పుడిప్పుడే అనువాదములు వెలువడువడుచున్నవి. మద్రాసు దక్షిణభాషాపుస్తకసంస్థ ప్రోత్సాహముతో పైభాషలనుండి అనువదింపబడిన నాటికల సంపుటములు ప్రకటింపబడియున్నవి.

కేవలానువాదములేకాక భావానువాదములు, అనుసరణములుకూడ కలవు.

గేయనాటికలను వచనాత్మకముగనడిపి ఈశాఖయందు క్రొత్తప్రయోగములనుచేసిన వారు శ్రీయుతులు ఆరుద్ర, కుందుర్తి, సోమసుందర్ ప్రభృతులు. ఆరుద్రవ్రాసిన 'సీతాకోక చిలుక' గేయమునకు తగినఛందమున నున్నను కావలయునని రచయిత దానిని వచనమువైపునకు త్రిప్పినట్లుగాతోచును. సాంఘికసమస్యలను గేయరూపమున చిత్రించుట తెలుగులో అంతగా జరుగలేదు; జరిగినప్రయత్నములో ఇది నిర్దుష్టము. ఇట్టి మరియొక రచన శ్రీ కుందుర్తివ్రాసిన 'ఆశ'. ఇదికూడ చక్కని ప్రయోగమే. కాని సాంఘికసమస్యాచిత్రణము ఇందు కథావస్తువైనను సంభాషణలు అందందు సహజత్వమును కోల్పోయినట్లు తోచును. సోమసుందర్‌గారు అనువాదముచేసిన "మందీ_మనిషీ"(1953) అనెడి గేయరూపకము (కావ్యనాటకం) ప్రదర్శింప తగినది. (మూలకర్తయగు ఎర్నస్ట్ టాలర్ జర్మనీలోని అభ్యుదయరచయిత).

## శ్రవ్యరూపకములు :

పాశ్చాత్యసాహిత్యప్రభావమున నాటకరచనయందు ప్రారంభమైన నూతనప్రయోగము శ్రవ్యరూపకము. 1938 ప్రాంతముల ముద్దుకృష్ణగారి 'అనార్కలి' రేడియోలో ప్రసారమగుటతో ప్రారంభమైన ఈ జాతిరచనలు నేడు ఇంచుమించుగా ప్రతిరోజును ప్రసారము చేయబడుచున్నవి.

తెలుగులో ఎందరు నాటక_నాటికారచయితలున్నారో, అంతమంది శ్రవ్యరూపకకర్తలున్నారనుట అతిశయోక్తికాజాలదేమో. ఇందు ముఖ్యులైన కొందరినిగూర్చి పరామర్శింతును.

రేడియోలో రూపకరచనకొరకు ప్రత్యేకముగా నియుక్తులై, సుమారు వేయివరకు శ్రవ్యరూపకములను రచించినవారు వింజమూరి శివరామారావుగారు ;

శ్రవ్యరూపకరచనకు తెలుగునాట సాహిత్యగౌరవమును కలుగజేసిన శతాధిక రచయితలలో శ్రీయుతులు గోరాశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావుగార్లు ముఖ్యులు. వీరి రూపకములు బహుళముగా ప్రజారంజకములై, తిరిగితిరిగి ప్రసారముచేయబడినవి. వీరిద్దరును రెండు విభిన్నములైన దృక్పథములను తమ రూపకములమూలమున వెల్లడిచేసిరి. గోరాశాస్త్రిగారు ఆర్ద్రములైన సన్నివేశములనుకూర్చి మనస్సును కదలించెడినాటికలను వ్రాసియున్నారు. ఇంక కొడవటిగంటివారు వాస్తవిక రూపచిత్రణముచేయుచు సన్నివేశములందు శ్రోతలూహింపని కొన్ని మలుపులుచూపి ఆహ్లాదకరములగు నాటికలను వ్రాసినారు.

ఆర్ద్రము, విషాదభావసంజనితము అయిన సన్నివేశమునకు హాస్యముతో, యుక్తిప్రత్యుక్తులతోకూడిన సంభాషణలుచేర్చి తాము వ్రాసిన ప్రతిరూపకమునకును జీవముపోసినవారు గోరాశాస్త్రిగారు. వీరు ముఖ్యముగా ఆశావాది. 'ఆశఖరీదు అణా', 'అమరజ్యోతి'వంటి రూపకములందిది వ్యక్తముచేయబడినది. హృదయములందు జరుగు సంఘర్షణము, ఒక తీయని కలపు, దానివెంటవచ్చు అనేకానేకములైన విషాదఫలితములు, ద్వంద్వభావమున నడచు జీవనగతి వీరి రూపకములకు కథావస్తువులు. 'లోహఘంటలు' మూర్ఖుడైన మానవుడు బ్రతికియున్నంతకాలము భార్యనువేధించుకొనితిని ఆమె చనిపోయినతరువాత ఆమె విలువను గుర్తించుట కథగాకల రూపకము. వీరి రూపకములలో 'కాలాతీతవ్యక్తులు', 'కొమ్మసంపెంగ'

ఉత్తమరచనలు. 'కాలాతీతవ్యక్తులు' ప్రీస్ట్లీ "టైమ్ అండ్ ది కాన్వాస్" రచనా విధానమును అనుసరించినను ఒక కుటుంబమునందలి సుఖదుఃఖములకు ప్రతీకగా 'దీపావళి'ని సూచించి, మూడు దీపావళిరాత్రులందు జరిగిన కథను వివరించును. చిన్ననాడు ప్రేమించిన యువతిని భీరుడై పరిత్యజించి, ఆమె పాముకాటునకు మరణించినదన్న ప్రవాదమునునమ్మి, జీవితాంతమును ఆమెకు సంబంధించిన కొమ్మసంపెంగకు, కోడెత్రాచునకు భయపడి పశ్చాత్తప్తుడైనవాని కథ "కొమ్మసంపెంగ"యందు చిత్రింపబడినది.

వీరి 'సెలవల్లో', 'ఆనందనిలయం' సీరియల్‌గా ప్రసారములై అనేకుల మెప్పు నందినవి. నగరమునందలి ఒక కుటుంబము సెలవులలో అల్లునిగ్రామమునకు పోయినప్పుడు, పట్టణవాసులకు, పల్లీయులకుగల మానసికవ్యత్యాసములు హృదయంగమముగా చిత్రింపబడిన రచన 'సెలవుల్లో'.

"ఇల్లుకట్టిచూడు" అన్న సామెత ననుసరించి ఇల్లుకట్టి, ఇంటివారినందరిని వేపుకొనితిను తండ్రి, భగవంతునికి నివేదనముతప్ప వేరుతలపని తల్లి—ఇట్లు ఎవరిస్వార్థము వారు చూచు కొనెడి నలుగురు స్వార్థపరులు ఒక్కచోటచేరినచో ఎంతటి ఆనందనిలయమైనను విషాదమున కెట్లు పుట్టినిల్లుకాగలదో, తుదకు వారివారి సమస్యలెట్లు పరిష్కరింపబడినవో హాస్యపూరితముగ చిత్రించెడి రచన 'ఆనందనిలయం'. సంభాషణాచమత్కృతితో, ఒక చిన్నసంఘటనతో మన లను ఆర్ద్రమనస్కులనుచేయుట అనునది గోరాశాస్త్రిగారి రచనలయందలి విశిష్టతలు.

కొడవటిగంటి కుటుంబరావుగారుకూడ బహుళ శ్రవ్యరూపకరచయితలు. వీరి కథల వలె, నవలలవలె ఇవికూడ ఏదోఒక సాంఘికసమస్యచుట్టును అల్లబడిన రూపకములు. ఎంతటి రహస్యమునైనను యథార్థముగ బయటపెట్టించగలమందును సేవించిన ఒకకుటుంబముయొక్క రహస్యముల వ్యక్తీకరణము, పెండ్లికొడుకులకొరకు గాలములువేయు స్త్రీల మన స్తత్వము, నడుమంత్రపుసిరి మనుష్యుల మానసికస్థితిని చెడగొట్టుటవంటి కథావస్తువులు వీరి రచనలకు ఆధారములు.

వీరి రచనలలో కథనునడుపుటయందు, సంభాషణలయందు వేగముహెచ్చు. చెప్ప దలచుకొనినదానిని సూటిగాచెప్పుట, ఎంత సామాన్యమైన కథను చిత్రించినను అందు బలమగు సన్నివేశమును సృష్టించుట, ఆసాంతము రూపకమును చదివింపగల్గుట, రూపకాంతమువరకును ఉత్సుకతను పెంపొందించి చివరిసన్నివేశమున దానిని స్పష్టీకరించుట అనునవి వీరి రచనల యందు సామాన్యములైన శిల్పప్రయోగములు.

హితశ్రీగారు వ్రాసిన 'ప్రాగ్జ్యోతి', 'చరిత్రకందని కొందరు', 'అడ్డంతిరిగిన కథ', 'పరీక్ష'—వంటి రూపకములు శ్రవ్యరూపకరచనలో ఆయనను చేయితిరిగిన రచయితనుగా నిరూపించుచున్నవి. 'ప్రాగ్జ్యోతి' వంటి ఊహాచిత్రములు, 'చరిత్రకందని కొందరు' వంటి కాల్పనికచిత్రములు, 'అడ్డంతిరిగిన కథ' వంటి సరళరచనలు, 'పరీక్ష' వంటి విషాదరచనలు ఈ జాతి రూపకరచనయందు ఆయన సాధించిన వైచిత్రిని చాటిచెప్పుచున్నవి.

ఆరుద్రగారు వ్రాసిన "న్యాయాధికారి", "అక్కయ్యకు ప్రమోషన్" వంటి రచనలు శ్రోతల మన్నన లందినవి. "న్యాయాధికారి" కేవలము శ్రవ్యమేకాక ప్రదర్శించుటకుకూడ అనువైన రచన. సహజముగా ఆరుద్రగారిశైలి విశిష్టమైనది.

"ఆరుద్రనాటికలు" (1958) అనెడి పేరుతో వెలువడిన సంపుటియందు ఏడునాటిక లున్నవి—విషప్రయోగం, దేవునిఎదుట, న్యాయాధికారి, పార్కుబెంచీ, నన్నుగురించే, దరఖాస్తుఫారం, అక్కయ్యకిప్రమోషన్. ఇందులో మొదటి రెండునుకాక తక్కినవన్నియును రేడియో ప్రసారమునిమిత్తము వ్రాసిన నాటికలే.

నాగభూషణ్‌గారు వ్రాసిన 'కల-కాపురం' యువతీయువకుల కాల్పనిక-వాస్తవిక జీవితములను పోల్చిచూపిన రచన; ఇది ఆకాశవాణివారి బహుమానమునందుకొన్నది. వీరు వ్రాసిన "సర్పదష్టులు", "వడ్డించినవిస్తరి"వంటి రచనలు పలుమారులు ప్రదర్శింపబడినవి. వీరు శ్రవ్య రూపక స్వరూపస్వభావాదులనుగూర్చి రెండు ఆధికారికములైన వ్యాసములనుకూడ వెలయించిరి.

నాటకరచనకు ఆరంభించి, మొదటిసారిగా "మువ్వగోపాల" అనెడి శ్రవ్యనాటికను రచించినవారు కాటూరి వేంకటేశ్వరరావుగారు. దీనితోపాటు మరి ఆరునాటికలుకలిసి ఏక సంపుటిగా 1961 లో ప్రకటితమైనవి. వేంకటేశ్వరరావుగారు ఎంత ఆర్ద్రమనస్కులో, వారి శైలి అంత ఆర్ద్రమైనది.

ఇంకను విరివిగా రేడియోరూపకములను వ్రాసినవారిలో శ్రీయుతులు అమరేంద్ర, ప్రయాగ, భరద్వాజ ప్రభృతి రచయిత లనేకులు కలరు. రేడియోలో నియమితులైన శ్రీయుతులు ఏడిద కామేశ్వరరావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ప్రభృతులు శతాధిక రూపకములను వెలయించిరి. అందు ప్రదర్శనాసౌలభ్యము కలిగిన నాటికలు పెక్కు కలవు.

రేడియోవారు విజయవంతముగా కొనసాగించిన రూపకప్రయోగములలో 'భాణము' వంటి వాక్చిత్రము ఒకటి. ఒకే వ్యక్తియొక్క భావములను ఒక సంఘటన ఆధారముగా వివరించుట ఇందు ప్రధానము. కొన్ని రూపకములయందు ఇరువురి స్వగతములుకూడ ప్రక్క ప్రక్కన చూపబడినవి. ఇది చక్కని ప్రయోగము. గోరా శాస్త్రిగారు వ్రాసిన 'నైట్‌డ్యూటీ', 'చదువులరాణి', 'తలపోతల గతుకులు', ఆరుద్ర వ్రాసిన 'కలియని పట్టాలు' ఇట్టి రచనల కుదాహరణములు.

ఇవికాక కొన్ని అనువాదములు, కొన్ని నవలలకు నాటకీకరణములుకూడ రేడియోలో ప్రసారము చేయబడినవి; అనువాదములయందు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు ప్రసారము చేయించుచున్న సంస్కృతరూపకములను ప్రత్యేకముగ పేర్కొనవలసియున్నది. అమరేంద్ర ప్రభృతుల ఆంగ్లరూపకానువాదములుకూడ చక్కనివి కలవు. ఇంక, అఖిలభారత రూపకకార్యక్రమముపేర ప్రతిభాషయందలి ఉత్తమనాటకముల తెలుగు అనువాదములును తరుచుగా ప్రసారము చేయబడుచున్నవి.

నాటకీకరింపబడి ప్రసారముచేయబడిన నవలలలో విశ్వనాథవారి 'వేయిపడగలు', చిలక మర్తివారి 'గణపతి', అడివివారి 'నారాయణరావు', మొక్కపాటివారి 'బారిష్టరు పార్వతీశం' ముఖ్యమైనవి. ఆయా రూపకానుసరణములనుచేసిన అమరేంద్ర, 'లత' వంటి రచయితలు నవలలయందలి సన్నివేశముల, సంఘటనల విశిష్టతకు లోపము రానీయకయే ఆయా రూపకములను రచించిరి.

రేడియోలో ఇంకను చాల ప్రచారరూపకములు, గేయరూపకములు ప్రసారము చేయబడుచున్నవి. ఇంకను క్రొంగ్రొత్తప్రయోగములు శ్రవ్యరూపకవిషయమున చేయబడగలవని ఆశించుటకు అవకాశములున్నవి.

## బాలల నాటికలు :

బాలల నాటిక లనునప్పుడు రెండు విధములైన రచనలు లేదా ప్రదర్శనములు ఆవశ్యకము లగుచున్నవి—బాలల వినోదార్థము పెద్దవారు ప్రదర్శించుటకు తగిన నాటికలు మొదటి విధము. ఇంక కేవలము బాలలు ప్రదర్శించుటకు తగిన నాటికలు రెండవ విధము. అసలు బాలల కొరకు ఉద్దిష్టమైన ప్రత్యేకసాహిత్యము తెలుగులో చాల తక్కువ. అందున మొదటి విధమగు రచనలు లేనేలేవని చెప్పవచ్చును. ఇప్పుడిప్పుడే కొందరు రచయితలు ఆ లోపమును పూరించుటకు సమకట్టుచున్నారు. బాలలనాటకములను వ్రాసి వానిని ప్రదర్శింపజేయుచున్నవారిలో శ్రీయుతులు జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ), న్యాపతి రాఘవరావు, ఏడిద కామేశ్వరరావు, బి. వి. నరసింహారావు, నార్ల చిరంజీవి ప్రభృతులు పేర్కొనదగినవారు.

కరుణశ్రీగారు వ్రాసిన 'కరుణామయి' (1946) అనెడి వచన సాంఘికనాటిక బహుళ ప్రచారమునందినది. సవతితల్లి ప్రేమకు నోచుకొనని ఒక బాలిక సవతి తమ్ముని అనురాగమును సంపాదించుకొనగా తద్వారా సవతితల్లి పశ్చాత్తప్తురాలై ఆ బాలికను పరిగ్రహించుట ఇందలి కథావస్తువు. ఆర్ద్రమైన సన్నివేశములు, లలితమైన రచన ఈ నాటికకు వన్నెలు దిద్దుచున్నవి. ముఖ్యముగా అక్కాతమ్ముల సంభాషణలు హృదయాహ్లాదకరములు.

నాగభూషణ్ వ్రాసిన 'రాముని బుద్ధిమంతునితనం' అన్న నాటిక శరత్ అదే పేరుతో వ్రాసిన కథకు అనుసరణ. ఇది కొన్ని ప్రాంతములయందు పలుసార్లు ప్రదర్శింపబడినది.

నార్ల చిరంజీవి, జమ్మలమడక పూర్ణచంద్రరావు, చెఱుకుమిల్లి భాస్కరరావుగార్లు బాలల కొరకు ప్రత్యేకముగా వ్రాసిన నాటికలు ఇటీవల ప్రచారము పొందుచున్నవి.

ఇక రేడియోలో నిరంతరము పిల్లల కార్యక్రమములు నిర్వహించు న్యాపతి రాఘవరావు, న్యాపతి కామేశ్వరిగార్లు రేడియో ప్రసారమునకై పెక్కు నాటికలను వ్రాసిరి. వారి 'బాలానందము' పిల్లలు ప్రదర్శించుటకు రంగస్థలయోగ్యములగు నాటికలనుకూడ వారు వ్రాసి ప్రచురించిరి. ఇవి పిల్లల నాటికలలో ఉత్తమమైనవని చెప్పవచ్చును. ఇందు పౌరాణికములైన చిన్నచిన్న ఇతివృత్తములేకాక, హాస్యభూయిష్ఠములైన చిన్ని సన్నివేశములుకూడ నాటకీకరింప

బడినవి, ముఖ్యముగ చిన్నిపిల్లలు ప్రదర్శించుటకు అనువుగ వ్రాయబడియుండుట వీని ప్రత్యేకత. 'బూరెలమూకుడు' వంటి వీరి రచనలు కొన్ని చిత్రీకరింపబడినవి కూడను.

రేడియో ప్రసారమునకై ఏడిద కామేశ్వరరావు, శ్రీవాత్సవ, జనమంచి, తాతయ్య ప్రభృతులు పెక్కు నాటికలు వ్రాసియున్నారు, ఇవి అలతి అలతి మార్పులతో రంగస్థల ప్రయోగయోగ్యములు కూడను. బాలల నాటికలలో బూరెలమూకుడుతోపాటు 'ఇంటిముందు', 'జబ్బు కుదిరింపు', 'శ్రావణ భాద్రపదాలు', 'సింద్రిల్లా', 'పిల్లిమెడలో గంట' 'గ్రాంధికశాస్త్రి', 'నువ్వా-నేనా' మున్నగునవి బాలలలో చాల ప్రచారమును పొందినవి. ప్రహసనములలో 'చిట్టిబావ-పొట్టి మరదలు' రచనలు ప్రసిద్ధి పొందినది. ఇప్పుడిప్పుడే బాలలు ప్రదర్శించుటకు అనువయిన గేయనాటికలుకూడ వెలువడుచున్నవి.

స్త్రీలకు, బాలలకు ఉద్దిష్టములైన నాటికలను రచించినవారిలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారిని తప్పక పేర్కొనవలసియున్నది. సాంప్రదాయక సాంసారికవాతావరణమును ప్రతిబింబించుచున్న వీరి నాటికలు ఇటీవల ఏకసంపుటిగా వెలువడినవి.

ప్రహసనములు :

మోలియర్ అనువాదములు అనుసరణములుగాక తెలుగు సాహిత్యమునందు సాహిత్యస్థాయిగల స్వతంత్రములైన ప్రహసనములు తక్కువ. శ్రీయుతులు కందుకూరి, చిలకమర్తి ప్రభృతుల ప్రహసనములున్నను అవి తాత్కాలిక సమస్యలను, ఎవరో కొందరు వ్యక్తులను దృష్టియందుంచుకొని వ్రాసినవి.

ఈ కాలమునందు ప్రచురింపబడిన నాగరాజామాత్యుని నాటికలలో కొన్ని చక్కని ప్రహసనములు కలవు. వీరు వ్రాసిన "మీసాల పక్షులు" నేటి ప్రహసనములయందు చెప్పుకొనదగినది. మీసాలపక్షులు, నవకవి, పుష్పబాణవిలాసం మొదలగు రచనలందు సామాజిక జీవితమునందలి ప్రేమ, పెండ్లి, దాంపత్యము, కవిత్వమునందాసక్తి మొదలగు విషయములు వ్యంగ్యముగ చిత్రింపబడినవి. పుష్పబాణవిలాసము ఇతర భాషలలోనికికూడ అనువదింపబడి అన్యభాషాప్రేక్షకుల మన్ననలనుకూడ పొందినది.

"ఫిజిషియన్ ఇన్‌స్పైట్ ఆఫ్ హిమ్‌సెల్ఫ్" అన్న మోలియర్ రచనను "అడవాళ్ళ తెలివి" అనెడి పేర అనుసరించుటతోపాటు ముద్దుకృష్ణగారు "అడయిక్కప్పిళ్ళై" అనెడి స్వతంత్రప్రహసనమునుకూడ రచించినారు. భీమా ఏజంట్లనుగురించిన హాస్యరూపకమిది.

మల్లాది అవధానిగారి "అసంపూర్ణ నారాయణం" చక్కని ప్రహసనము. అందు నాటి కంట్రాక్టు నాటకములు విమర్శింపబడినవి. కంట్రాక్టు నాటకములను హాస్యపూరితముగ విమర్శించిన ప్రహసనములలో విశ్వనాథకవిరాజు వ్రాసిన "నేపథ్యం", సోమంచివారు వ్రాసిన "ఆంధ్ర నాటకరంగానికి జై" మున్నగునవి పేర్కొనదగినవి.

తెన్నేటి సూరిగారు భావకవుల, అభ్యుదయ కవుల రీతులపై వ్రాసిన "సాహిత్య సమవకారం" అనెడి రచన పఠింపదగినది.

ఇటీవల వెలువడిన వానిలో పూండ్ల రామకృష్ణయ్యగారు వ్రాసిన "తుఫాను" (1952) అన్న ప్రహసనిక చాలసార్లు ప్రదర్శింపబడి, పెక్కు బహుమతులను బడసినది. ఇందు సన్నివేశ హాస్యముకన్న భాషచే సాధింపబడిన హాస్యము ఎక్కువ. ముఖ్యముగ నెల్లూరు రెడ్ల "యాస"ను ప్రయుక్తము చేయుటతో ఈ ప్రహసనము బహుళ ప్రజాదరణమునందినది. ఏకాంకికాప్రాయములైన ఉత్తమప్రహసనములను రచించుటలో భమిడిపాటి రాధాకృష్ణగారు (కామేశ్వరరావుగారి పుత్రులు) ప్రసిద్ధినందినారు. వీరి "దంతవేదాంతం", "మనస్తత్వాలు" నాటకకళాపరిషత్తు పోటీలలో బహుమతులందుకొన్న రచనలు.

## ప్రచార నాటకములు-నాటికలు :

నాట్యశాస్త్రమందలి నాట్యోత్పత్తి కథను పరిశీలించినచో అసలు నాటకము ప్రచారము కొరకు, ఉపదేశము కొరకు ఉత్పన్నమయినదని స్పష్టముకాగలదు. నిజము చెప్పవలయునన్నచో ఏదియోయొక ఉపదేశములేని నాటకముకాని లేదా ఏదియోయొక ప్రచారము నుద్దేశింపని నాటకముకాని ఉండనే ఉండదు. అయినను ఆ ఉపదేశముకాని, ఆ ప్రచారముకాని వాచ్యము కాక, వ్యంగ్యసంపన్నమై, రచన కళాత్మకమయినచో అది ఉత్తమనాటకము కాగలదు. కావున ప్రచారనాటకములన్నంత మాత్రమున ఏహ్యాభావమును ఏర్పరచుకొనగూడదు. అంత మాత్రమున కేవలప్రచారనాటకములు లేవని అర్థముకాదు; అట్టివికూడ ఉన్నవి. కాని వానికి సాహిత్యమున స్థానము లభింపదు.

వెనుక దేశభక్తి నాటకములనుగూర్చి వివరముగా ప్రస్తావించుట జరిగినది. ఈ కాలమునకూడ "చలోఢిల్లీ", "జావోఢిల్లీ" "చలో హైదరాబాదు" వంటి రాజకీయనాటకములు వెలసినవి. యడ్లపల్లి కోటయ్యగారి "కామ్రేడ్ వెంగమ్మ" (1944) అనునది కమ్యూనిజముపై వ్రాయబడిన వ్యంగ్యరూపకము.

ఇవియేకాక యడ్లపల్లి కోటయ్యగారు వ్రాసిన "గాంధేయవిజయము" (1946) వంటి అహింసావాదప్రబోధక రూపకములుకూడ ఈ కాలమున చాల వచ్చినవి. ఈ అహింసాతత్త్వమును పరోక్షముగా ప్రచారముచేయు 'గౌతమబుద్ధ', 'అశోక చక్రవర్తుల' కథలనుకూడ చాలమంది రచయితలు నాటకీకరించియున్నారు.

రెండవ ప్రపంచయుద్ధకాలమున ప్రచారనాటకములు వెలువడినట్లే నేడు ప్రణాళికా ప్రచారనాటకములు వెలువడుచున్నవి. యుద్ధనాటకములకు అబ్బూరి రామకృష్ణరావుగారు, ప్రణాళికా నాటకములకు కొప్పరపు సుబ్బారావుగారు (ఐదుచక్రాలబండి మొ॥) దోహదముచేసియున్నారు; అంతియేకాదు వారు వాని ప్రదర్శనములకు సారథ్యముకూడ వహించియున్నారు. ఇప్పట్ల గిడుతూరి సూర్యంగారి "వెలుగు" (నాటిక) కూడ పేర్కొనదగిన రచన.

శాంతినిప్రబోధించు నాటకములు నేటిదనుక వచ్చుచునేయున్నవి. ఆత్రేయవ్రాసిన "విశ్వశాంతి", అనిసెట్టివ్రాసిన "శాంతి" మొదలగునవి ఈరకమునకు చెందిన రూపకములే. ఆగస్టు విప్లవమునకు సంబంధించిన నాటిక పులిపాక రామచంద్రకాశ్యపగారి "నాదేశం" (1947).

ఇక దేశవిభజననాటినుండి హిందూ-ముస్లిముల ఐక్యమును బోధించు నాటకములు (రామ్-రహీమ్ మొ॥) వచ్చుచునేఉన్నవి. ఇందు చాల ప్రదర్శింపబడినవికూడను.

కేవలము 36 నీతులబోధనకు వెలసిననాటకము యస్. హరిహర బ్రహ్మానందరావుగారి "విధినిర్ణీతము" (1946). ఆయుర్వేదమునకు సంబంధించి వెలసిన నాటకము చొల్లేటి నృసింహశర్మగారి "భిషగ్విజయము" (1951).

కొంతకాలము ఎన్నికలనాటకములు ప్రచారమునందున్నవి. అన్నిపక్షములవారును తమతమ ప్రచారములను నాటకముల మూలమునచేయుట జరిగినది. ఇట్టి ప్రచారములపై విమర్శ ఆత్రేయగారు వ్రాసిన "ఓటు నీకే".

నేడు పంచవర్షప్రణాళికపై-ముఖ్యముగ గ్రామాభ్యుదయముపై - చక్కని ప్రచార నాటకములు వచ్చుచున్నవి. ప్రభుత్వమువారు ఇట్టి నాటకములపోటీలు నిర్వహించుచున్నారు, ఇట్టి నాటకములలో కొర్రపాటి గంగాధరరావుగారు వ్రాసిన "అందరి ఆనందం" ప్రదర్శనానుకూల్యమైన రచన. చక్కని ప్రచారనాటకములను వ్రాసినవారిలో కె. యల్. నరసింహారావుగారుకూడ ముఖ్యులు. ఆయనవ్రాసిన "అడుగుజాడలు", "క్రొత్తగుడి" అనునవి రెండును గ్రామపునర్నిర్మాణమునుగూర్చిన నాటకములు. పెద్దలు అడ్డగించినను యువజనము గ్రామాభ్యుదయమునకు పూనుకొని సాధించుట ఇందు చిత్రింపబడినది. పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి "అంకితం" (1959) లో కూడ ఇట్టిప్రయత్నము కన్పట్టగలదు.

ఇవికాక ప్రజానాట్యమండలి మొదలగు సంఘములు ఇట్టి ప్రచారమును నాటకముల మూలముననేకాక బుర్రకథలు, వీథిభాగవతములు మూలమునను విజయవంతముగా నడపినవి.

ఈరకపు నాటకములలో సాహిత్యగౌరవముగల రూపకములు సంఖ్యలో అల్పములుగానేయుండును; వానిలో కొన్నింటినిమాత్రమే పేర్కొనుట జరిగినది.

## ఉపసంహారము

సమకాలీన నాటకసాహిత్యమునందు రచనా వైవిధ్యము, ప్రయోగసౌలభ్యముకల నూతనప్రక్రియలెట్లు విస్తారముగ వెలువడి జనామోదమును పొందుచున్నవో ఇంతవరకును చేసిన సమీక్ష తెలుపుచున్నది. యువతరమునకు చెందిన నాటకరచయితలను, నటులను పరిశీలించినచో వారియందు నూతనప్రయోగములను చేయవలయునన్న ఆకాంక్ష, ఉత్తమసాహిత్య సృష్టి జరుగవలయునన్న ఆవేదన కన్పించుచున్నవి.

తెలుగులో వెలసిన నాటకములు, నాటికలు లెక్కకుమించియున్నవి. అట్లే నాటక-నాటికాకర్తలును లెక్కకుమించియున్నారు. కొందరు నాదృష్టికి రానివారుకూడనున్నారు. ఆయా రచయితల నందరిని కాని, వారి రచనల నన్నింటినికాని పేర్కొనుట సాధ్యముకాదు. కావున ఇచ్చట పేర్కొనబడని రచయితలు నన్ను మన్నింపగలరని సవినయముగా వేడుకొనుచున్నాను.

ఈసమయమున ఉపసంహారముగ ఒకటిరెండు విషయములు మనవిచేయవలసియున్నది.

ఒకటి—మన రచయితలకు సంప్రదాయమునందింకను ఎక్కువఅభినివేశము ఉండవలయును. "మంచి"అన్నది ఎచ్చటనున్నను గ్రహింపవలసినదే. మంచిని గ్రహించుట అనగా అనుకరణముకాదు. అనుకరణము భావదాస్యమునకు చిహ్నము.

రెండవది—ఈనాడు చాలమంది రచయితలు ప్రయోగసౌష్ఠవమును సాధింపగల రచనలనుమాత్రమే చేయుచున్నారు. ప్రదర్శనమునందు విజయముపొందుటకొరకు ప్రేక్షకులను సులువుగా నాకర్షించువిషయములను తమతమ రచనలయందు పొందుపరచుచున్నారు. సంఘముపై దీర్ఘములైన ఉపన్యాసములు వినిపించుట, అతినాటకీయతను నిరూపించు సంఘటనములను స్వీకరించుట ఇందులకు చిహ్నములు. కేవలము తత్కాలప్రేక్షకుల ఆనందమునేకాక నాటకము సాహిత్యగౌరవమునుకూడ పొందవలయునన్నచో రచనయందు నియమమును, భాషయందు బిగువును సాధించుట అత్యావశ్యకము.

ఇక ప్రదర్శనవిషయమునుగూర్చికూడ ఒకటిరెండుమాటలు చెప్పవలసియున్నది.

నాటకప్రదర్శనములు విజయవంతమగుటకుగాని, నూత్నప్రయోగములను జరుపుటకుగాని అనువైన రంగస్థలములు ఎంతేనియు ఆవశ్యకము. హైదరాబాదులోని రవీంద్రభారతివంటి నాటకశాలలు కనీసము జిల్లా ముఖ్యపట్టణములందైనను వెలయగలవని ఆశించుచున్నాను.

ఔత్సాహికసమాజములెంతగా ప్రయత్నించినను వృత్తిసంఘములకు పోలవు. నాటకప్రదర్శనములు క్రమశిక్షణతో, పెద్దయెత్తున, సర్వసంభారములతో జరుగవలయునన్నచో ఆంధ్రదేశమున వృత్తిసంఘములు ఏర్పడవలయును. ఏదేశమునందును వృత్తిసంఘములు పెంపొందనిదే నాటకసంఘములు పెంపొందలేదు. ఈ వృత్తినటులుకూడ నాటకప్రదర్శనమును యోగతుల్యముగా భావించు పరిణతమనస్కులు కావలయును.

ఉత్తమనాటకములను వ్రాయుటకు తగిన నాటకకర్తలున్నారు; ఉత్తమ ప్రయోక్తలున్నారు; ఉత్సాహవంతులైన నటులున్నారు. వీరందరును సరస్పరము ప్రపంచములోని ఏదేశమునందలి నాటక రచనా-ప్రయోగములకును తీసిపోని దేశమునకూడ వెలువడగలవు.

## భూమిక

1. "ప్రసిద్ధ నాటికలు"కు వ్రాసిన తొలిపలుకులో కె. వి. గోపాలస్వామిగారు నాటి పరిస్థితిని సమీక్షించియున్నారు.

2. రచనకు సంబంధించిన స్వభావవాదమే యిచ్చట పరామృష్టమైనది. రంగప్రయోగమునకు సంబంధించిన స్వభావవాదము దీనికంటె భిన్నమైనది.

## స్వభావవాదము 1

1. 1944 లో పాలకొల్లులో ఆదర్శ నాట్యమండలిని స్థాపించి నాటకరచన, నాట్యమండలినిర్వహణ: ప్రధానభూమికాధారణ, దర్శకత్వము, ప్రదర్శనాబాధ్యత స్వీకరించి ఏడెనిమిది సంవత్సరాల పాటు నడిపించి, సుమారు వంద ప్రదర్శనాలు ఇచ్చిన సమర్థులు పినిసెట్టి శ్రీరామమూర్తిగారు. వీరికి అత్యంత సన్నిహితులుగా పనిచేసినవారు నేటి సినీనటుడు చలంగారు. వీరిని దృష్టిలో పెట్టుకొని 'కులంలేనిపిల్ల' లో రఘు, పల్లెపడుచులో గోపీ మున్నగు పాత్రలను సృష్టించినారు.

## స్వభావవాదము 2

1. "ఈపోరాటంలో 240 గ్రామాలపై పోలీసుదాడులు జరిగాయి. 8500 మంది అరెస్టు అయ్యారు. రు. 12 లక్షల 25 వేల విలువగల ఆస్తి లూటీ చేయబడింది. 52 మంది వీరులు ప్రాణాలను కోల్పోయారు. నైజాం కిరాతకుల చేతుల్లో 64 గురు స్త్రీలకు—మన తెలుగుసోదరీమణులకు—మానభంగం జరిగింది. వీరిలో ఇద్దరు మరణించారు. ఈ మహోజ్జ్వల పోరాటమే మమ్మల్ని ఈ నాటకం రాయడానికి ప్రోత్సహించింది."—మాభూమి నాటక పీఠిక.

## మఱికొన్ని ప్రక్రియలు

1. ఇవి అన్నియును 'వెన్నెలవాడ' అనుపేర ఏకసంపుటిగా ప్రకటితములైనవి (1959). 'అజంతాసుందరి' అనెడి సంపుటిలో అజంతా సుందరి, సుగాత్రి, ఋతువులరాణి అనెడి గేయ నాటికలు ప్రకటింపబడినవి.

నూతనప్రక్రియల
చేసిన సమీక్ష తెలు
లించినచో వారియం
సృష్టి జరుగవల

*

ఈ తృతీయభాగమందు మూడు అధ్యాయము లున్నవి.

మొదటి అధ్యాయము— 'నాటకరచనా సమీక్ష' అనునది—తెలుగు భాషలోని నాటకరచనను వివిధశాఖలుగా వర్గీకరించి, వివరించుచున్నది. అనగా, ద్వితీయభాగమందలి ఆఱు అధ్యాయములందును కాలానుపూర్విగా వివరింపబడిన నాటకములు ఇందు ఆయా శాఖలుగా వర్గీకృతములై సమీక్షింపబడినవి.

రెండవ అధ్యాయము— 'నాటకప్రయోగ సమీక్ష' అనునది—క్రీ.శ. 1880 నాటినుండి తెలుగుదేశమునందు జరిగిన ఆధునికనాటకప్రయోగముల వివిధదశలను వివరించుచున్నది. ఇందు ఆయాకాలములందు ప్రసిద్ధివహించిన నాటకసమాజముల సంక్షిప్త వివరణములు కలవు.

మూడవ అధ్యాయము— 'విమర్శలు : సమస్యలు' అనునది—ఆధునిక కాలమున తెలుగుభాషలో వెలసిన నాటకసంబంధివిమర్శలను, నాటకరచనా-ప్రయోగములకు సంబంధించిన సమస్యలను సంక్షిప్తముగా వివరించుచున్నది.

ఈ తృతీయభాగము 'తెలుగునాటకచరిత్ర'కు సింహావలోకనప్రాయము.

*

ప్రథమాధ్యాయము

# నాటక రచనా సమీక్ష

## భూమిక

ఈ అధ్యాయమును ఆరంభించుటకుముందు, ఇచ్చట రెండు ఆశంకలకు నేను సమాధానము చెప్పుకొనవలసియున్నది—ఆధునికాంధ్రనాటకరచన, ఆకస్మికముగా, సంస్కృత-ఆంగ్లరూపకాంధ్రీకరణముతో లేదా అనుకరణముతో అరంభమైనది; అనగా తెలుగునాటకరచన సంపూర్ణవికాసరూపముననే ఆరంభమైనది. ఇంక, దానికి "వికాసము" అనగానేమి ? అనునది మొదటి ఆశంక. ప్రాచీనకాలమునాటి యక్షగాన-నాటకములన్నియును దృశ్యకావ్యములే. అవి లెక్క-కుమించియుండగా, మంజరీమధుకరీయాదులనే తొలిరూపకములనుచు పేర్కొ-నుట యెట్లు సంభావ్యము కాగలదు ? అనునది రెండవఆశంక. మాటవరుసకు, ఈ రెండవఆశంకను అంగీకరించినచో మొదటి ఆశంకకు అవకాశమే ఉండదు; అట్లే మొదటి ఆశంకను అంగీకరించినచో రెండవ ఆశంకకు అవకాశములేదు.

యక్షగాన-నాటకములు దృశ్యకావ్యములనుట నిర్వివాదాంశము. వానికి ఉద్భవవికాసములున్నవి; అన్నియును ప్రదర్శనమున కుద్దిష్టములైన రచనలే; అన్నియును ప్రదర్శింపబడినవని కూడ యంగీకరింపవచ్చును. కొన్ని అర్వాచీనరచనలలో ప్రస్తావనాదులు, అంకవిభజన మొదలగు సంస్కృతరూపకలక్షణములుకూడ కన్పట్టగలవు. కాని, ఇవియెల్ల సంగీత - నృత్య ప్రధానములు; ఉపరూపకజాతిలో చేర్చదగినవి. కాగా, ఇవి దేశిరూపకములు. ఇవియును భాస-కాళిదాసాదుల లేదా షేక్స్పియరు ప్రభృతుల నాటకములును ఒకేజాతికి చెందినవని తలంచుట అసమంజసము. ఇది విజ్ఞులకు తెలియని విషయముకాదు.

యక్షగాన-నాటకములు దేశినాటకములు లేదా ఉపరూపకజాతికి చెందినవికాగా, ఆధునిక నాటకములు మార్గనాటకములు లేదా దశరూపకజాతికి చెందినవి అగుచున్నవి. సంస్కృత లక్షములను లేదా ఆంగ్లలక్షణములను అనుసరించిన (పెక్కు-ంట సమ్మిశ్రితముకూడను) ఈ మార్గరూపకరచన, ఆధునికకాలమున, మంజరీమధుకరీయాదులతోనే ఆరంభమైనది; అందుచేతనే వానిని తొలిరూపకములనుట సంభావ్యమగుచున్నది. ఈ తొలిరూపకములు రచనావిషయమున ప్రయోగమాత్రములు. అసలివి ప్రయోగసౌలభ్యముకలవి కూడకావు. ఇంక 1880 లో ప్రదర్శ

నము లారంభమైనవి. ఇంక ప్రదర్శనప్రయోగములు 1886 వరకును సాగినవి. కాగా, 1860 నుండి 1886 వరకునుగల కాలము రచనా_ప్రదర్శనముల విషయమున ప్రయోగాత్మకకాలము. ఇది అరంభకాలము. 1886 నుండి నాటకరచనలో ఒక వ్యవస్థ ఏర్పడినదని చెప్పవచ్చును. అప్పటినుండి 1900 వరకును కళాత్మకమైన తెలుగునాటకరచన అనేకమార్గముల వికసించినది. 1900 నుండి 1920 వరకును నాటకరచన, అంతవరకును ఏర్పడిన సువ్యవస్థిత మార్గములందు ఒడుదుడుకులు లేకుండ సాగినది. 1920 నుండి మరల నూత్నప్రయోగము లారంభమైనవి. ఈ విధముగా తెలుగునాటకచరిత్రలో 1886 నుండి వికాసకాలమగుచున్నది.

తెలుగులో రూపకరచన రెండు కాలములలో రెండుమార్గములుగా సాగినది. తెలుగు సాహిత్యము ఆరంభమైన తొలిరోజులనుండి ఇంచుమించుగా 1860 వరకును ఒకకాలము; ఇది యక్షగాన_నాటకముల కాలము. ఈకాలమున వీని ఉద్భవ_వికాసములను డా. యస్వీ జోగారావు గారు తమ పరిశోధనావ్యాసమున వివరించియున్నారు (ముద్రణము_1961). ఇంక నేను ఈ వ్యాస ప్రథమభాగమున, నాలుగవఅధ్యాయములో, ఏతద్విషయమును సంక్షిప్తముగా సమీక్షించు టయే కాక, నాటి దృశ్యవినోదములను విభాగీకరణ పూర్వకముగా వివరించియున్నాను. ఇంక రెండవకాలము 1860 నుండి 1960 వరకును; ఇది మార్గరూపకరచనాకాలము. ఆసలు, నా పరిశోధనాప్రమేయమును ఇదియే. న్యాయ్యముగా ఈకాలమునకు ఇంతకుముందరి కాలము పునాదియును, నాటిరచనల కీనాటిరచనలు వికసితరూపములును కావలసియున్నవి; కాని, అట్లు జరుగలేదు___రెండుకాలములకు మధ్య ఎట్టి సమన్వయమును లేదు. ఇది విచిత్రవిషయము!

ఆధునికనాటకముల ఆరంభ_వికాసములను కాలక్రమమున ఈ వ్యాస ద్వితీయభాగమున వివరించియున్నాను. ఇంక సౌలభ్యార్థము, ఆయా రూపకజాతులను లేదా ప్రక్రియలను విభాగ పూర్వకముగా, ఇప్పుడీ అధ్యాయమునందు వివరించుచున్నాను. ఈ వివరణమునందు బహుళము లైన విభాగములు కన్పట్టగలవు. స్వతంత్రరూపకములనెడి విభాగమునందు మరల అనేక ప్రభేదములు కలవు. ఈ భేదప్రభేదము లన్నియును ఒండొంటికి సంబంధములేని ప్రత్యే కపు టరలుమాత్రముకావు. అట్లే తక్కిన ప్రక్రియలందును ప్రభేదములున్నవి. అంతియేకాదు, ఒక్కొక్క రూపకము రెండుమూడేసి విభాగములక్రిందకు వచ్చుచుండును.

## సంస్కృత రూపకానువాదములు

ప్రాచీనాంధ్రకవులు సంస్కృతరూపకాంధ్రీకరణమునకు పూనుకొని యున్నప్పటికిని వారు వానిని యథాతథముగాకాక, ప్రబంధములుగా నాంధ్రీకరించియున్నారనిగుర్తించియున్నాము. ఆకాలమున కొంతకుకొంత రూపకరూపమును పొందినవి క్రీడాభిరామ _ ప్రసన్నరాఘవ నాట్యప్రబంధములు రెండుమాత్రమే కన్పట్టుచున్నవి. ప్రేమాభిరామము లభింపకపోవుటచేత క్రీడాభిరామానువాదపద్ధతి తెలిసికొనుట కవకాశము కలుగలేదు. ఇంక ప్రసన్నరాఘవాంధ్రీ కరణములో కవి_కావ్యానువాదమునందువలె _ చాల స్వాతంత్ర్యమును వహించియున్నాడు; భావమునందు, వర్ణనయందు క్రొత్తకల్పన లనేకములు కలవు.

ఆధునికకాలమున సంస్కృతరూపకములను యథాతథముగా ననువదించుటకు పూను కొనినవారిలో కోరాడ రామచంద్రశాస్త్రిగారు, కొక్కొండ వేంకటరత్నంపంతులుగారు ప్రథములు. రామచంద్రశాస్త్రిగారి తొలియనువాదము 'వేణీసంహారము' లభ్యముకాలేదు. ఇంక ముద్రితమై, మనకు లభ్యమైన తొలియనువాదము కొక్కొండవారి 'నరకాసుర విజయ వ్యాయోగము' (1871-72). అటుపిమ్మట పరవస్తువారు, కందుకూరివారు అభిజ్ఞానశాకుంతలము ననువదించినారు. తరువాత వావిలాలవారు ఉత్తరరామచరితమును (1881), వడ్డాదివారు వేణీ సంహారమును (1883) అనువదించియున్నారు. అంతటితో సంస్కృతరూపకాంధ్రీకరణము నకు రాజమార్గమేర్పడి, పెక్కు ప్రసిద్ధసంస్కృతరూపకములు తెలుగులోనికి అనూదితము లైనవి.[1]

కవి, కావ్యానువాదమునందు చూపినట్లుగా, రూపకానువాదమందు స్వాతంత్ర్యమును చూపుటకవకాశములేదు. సన్నివేశముల క్రమము, అలంకారాదులు మొదలగునవియేకాక అర్థము, భావము మొదలగునవికూడ అనువాదమందు యథాతథముగా, మార్పులులేకుండ నుండ వలయును.[2] అంతియేకాదు, మూలకారుని భారముకంటె అనువాదకుని భారమే అధికమన్న మాట ! ఆయా అనువాదకర్తల అనువాదములను పరిశీలించి, అవశ్యమనుసరింపదగిన అనువాద సూత్రములను సుప్రసన్నగారు క్రిందివిధముగా క్రోడీకరించియున్నారు. ("సంస్కృత రూప కములు-అనువాదములు"—జయంతి-ఆగస్టు, 1959).

"1. సంస్కృతమున కవి రచించునప్పు డేయుద్దేశ్యముతో ఆ రూపకమును రచిం చెనో, ఆ యుద్దేశ్యమునకు అనువాదమున భంగము కలుగరాదు. 2. జ్ఞాతశిల్పియైన కవి యుద్దేశించిన శిల్పసంబంధరహస్యముల నెరిగి వానిని యనువాదమునందు తెచ్చుటకు ప్రయత్నింప వలయును. సంస్కృతమున ఒక్కొక్కకవి యొక్కొక్క లోకోత్తరమైన శక్తికలవాడు; ఒక డర్థసంగ్రహణశీలి; ఒకని శబ్దములకూర్పు అతిలోకమైనది; ఒకని వృత్తరచనమే చమత్కార మైనది—ఈరహస్యముల ననువాదకు డెరుంగవలయును. 3. మూలకవియొక్క కల్పనలు అను వాదమున యథాతథముగా కన్పట్టవలయును; విస్తరణపనికిరాదు; వ్యాఖ్యానమౌచిత్యభంగకారి కారాదు. 4. భారతాదులలోవలె నిష్టమువచ్చినట్లు కొన్నిఘట్టముల స్వీకరించి, మరికొన్ని స్వీకరింపకుండ నుండరాదు. ఇతిహాసముల మార్గమువేరు; రూపకములట్టివికావు ఔచిత్య పూర్ణములైన మార్పులను కథయందు మూలకర్తలే చేసియున్నారు. 5. మూలములోని భాష యెట్టిదియో, అనువాదములోని భాషయును అట్టిదియో అంతకంటె కొంత సారళ్యముకలదియో కావలయును. మూలమున్నకాని యర్థముకానట్టి క్లిష్టత యనువాదమున కాపాదింపరాదు. మూలము లోని వాక్యరచనా-భాషాసంబంధి చమత్కారములను అనువాదములో వదలివేయుట దోషము కాదు. వృత్తసంబంధమగు నౌచిత్యమునుకూడ పాటించుట మంచిది. 6. రంగస్థలమున కను కూలమగు నటుల వేషభాషాదులగురించి, హావభావములగురించి సూచనలు చేయవచ్చును; ప్రదర్శనమునకు సూచనలు చేయవచ్చును. పాత్రోచితభాష ప్రవేశపెట్టవచ్చును. దీనివలననే సామాజికులలో రసస్ఫూర్తికలుగు నవకాశముకలదు, 7. మూలములో వచనములోనున్న

రసవత్తరములైన భావములను పద్యములుగ మార్చవచ్చును; అంతియేకాదు, కేవలము చప్పగానున్న శ్లోకములను వచనముగ వ్రాయవచ్చును. పాఠాంతరములను బాగుగాపరిశీలించి శుద్ధపాఠమేదియో జాగ్రత్తగా నిర్ణయించుకొనవలయును. 8. పాఠకునకు తాను చదువునది, లేదా ప్రేక్షకునకు తాను చూచునది ఏ కాళిదాసు నాటకమోయన్న ఊహ కలుగవలయునేకాని, ఏ వీరేశలింగముగారి గ్రంథమోయన్న ఊహ కలుగరాదు. ఇవి యనువాదముల కుండవలసిన స్థూలలక్షణములు. ఇవిలేనిచో దాని ననువాద మనకుండుట మేలు."

ప్రప్రథమముగా సంస్కృతరూపకముల నాంధ్రీకరించిన ఆధునికులకు ముఖ్యముగా రెండుసమస్యలెదురైనవి—1. సంస్కృతరూపకములు చంపూకావ్యములు; అనగా గద్య-పద్యాత్మకములు; అంతియేకాదు, అరుదుగా గేయసహితములుకూడను. అయినచో వీనిని తెలుగులో ఏవిధముగా అనువదింపవలెను? 2. సంస్కృతరూపకములలో ఉత్తమ-మధ్యమ పాత్రలకు సంస్కృతమును, అధమపాత్రలకు ప్రాకృతభేదములును ఉపయుక్తములైనవి. అయినచో ఆయాభాగములను తెలుగులో ఏవిధముగా అనువదింపవలెను?

కొక్కొండవారు మూలమునందలి పద్యమునకు తెలుగులోకూడ పద్యమును, మూలమునందలి గద్యమునకు తెలుగులోకూడ గద్యమును వ్రాసియున్నారు. మరియు మూలమునందలి శైలీభేద - వృత్తౌచిత్యములనుకూడ తెలుగులో సాధ్యమైనంతవరకును పాటించియున్నారు. 1871-72 లో కొక్కొండవారు మొదలుపెట్టిన ఈ పద్ధతియే రాజమార్గమై కొంచెమించుమించుగా నేటివరకును కొనసాగుచున్నదని చెప్పవచ్చును.

అర్వాచీనకాలమున ఇందులకపవాదములు కొన్నికలవు. చిలకమర్తివారి మేనగోడలు శ్రీమతి రావూరి సుబ్బమ్మగారు మృచ్ఛకటికమును సంపూర్ణముగా వచనముగానే యాంధ్రీకరించుట యిందులకొక యుదాహరణము.

ఇంక భాషావిషయములు—కొక్కొండవారు అన్ని పాత్రలకును గ్రాంథికభాషనే వాడినారు; నీచపాత్రలవిషయమున మాత్రము పదజాలము కొంతవైకృతబహుళముగానున్నది. పరవస్తువారు ప్రాకృతస్థానమున కేవలము అచ్చతెలుగునే వాడియున్నారు, కాని, తక్కిన మువ్వురును మరల గ్రాంథికమునే ఆశ్రయించిరి. పిమ్మట నాదెళ్ళ పురుషోత్తమకవిగారు తమ హిందూస్థానీనాటకములందును, తెలుగునాటకములందునుకూడ 'పాత్రోచితప్రసంగ' పద్ధతిని ప్రవేశపెట్టినారు. ఇంతలో, 1891 లో వేదమువారి 'నాగానందము' వెలువడినది. ఇందు శాస్త్రిగారు ప్రాకృతభాషలస్థానమున పాత్రౌచిత్యము ననుసరించి, తత్తద్భేదములతో వ్యావహారికభాషను ప్రవేశపెట్టినారు (వారు దీనిని 'గ్రామ్య'మనినారు). దీనిని కొంతమంది అనుసరించిరి; కాని 1900 ప్రాంతములనుండి మరల అందరును గ్రాంథికమునే ఆదరించుట కారంభించిరి. 1898 ప్రాంతములలో దాసు శ్రీరాములుగారు అభిజ్ఞానశాకుంతలము నంతటిని కేవలము అచ్చతెలుగులోనికి అనువదించియున్నారు. ఇంక 1950 తరువాత కాటూరి వేంకటేశ్వరరావుగారు నాటకమునంతటిని వచనములోనికి అనువదించుటయేకాక ప్రాకృతస్థానమున వ్యావహారికమును

ప్రవేశపెట్టగా భమిడిపాటి కామేశ్వరరావుగారు నాటకమునంతటిని వ్యావహారికమునందే రచించి యున్నారు.

1900 పూర్వము అనువాదములు చేసినవారందరును అన్ని విధముల మూలానుసరణమే పరాయణముగా భావించియున్నారు. వీరిలో వేదమువారు పలుకుబడిలోకూడ మూలమునకు సన్నిహితత్వమును సాధించుటకు యత్నించినారు. ఇందు వారు కృతకృత్యులైనప్పటికిని సంస్కృతపు పలుకుబడి—ముఖ్యముగా కర్మణిప్రయోగాదులు—తెలుగు పలుకుబడికి సరిపోక కొంత ఎబ్బెట్టుగా కన్పట్టును. 1900 తరువాతి అనువాదకులలో కొంత స్వాతంత్ర్యదృష్టి కన్పట్టగలదు. వీరు మూలమునకు వ్యాఖ్యానప్రాయముగా అనువదించుట, కొన్ని క్రొత్త వర్ణనలను—ముఖ్యముగా పెద్ద పద్యముల పాదపూరణములలో—చేయుట, కొన్నింటిని విడిచి వేయుట మొదలగునవిచేసిరి. వీరిని, ప్రధానముగా, 'భావానువాదకులు' అని పేర్కొనవచ్చును. ఈ కాలమున పెక్కు అనువాదములు వెలువడియుండుట గమనింపవచ్చును. 1900 పూర్వము ఉత్తమ సంస్కృతరూపకములను తెలుగులోనికి తేవలయుననెడి అభినివేశమును, కొన్ని సమాజముల ప్రదర్శనాభిలాషయును హేతువులుగా అనువాదములు సాగినవి; కొన్ని పాఠ్యగ్రంథములుగా నిర్ణయింపబడుటకూడ జరిగినది. కాని, అర్వాచీనకాలములో పాఠ్యగ్రంథములనుగా పెట్టించుకొనుటకే ఎక్కువగా అనువాదములు చేయసాగిరి. అంతియేకాదు, అర్వాచీనానువాదములలో ప్రదర్శింపబడినవియును చాల తక్కువయే. మరియు, ఆయాకారణముల వలన ఒకరనువదించిన దానినే పలువు రనువదించుటయును జరిగినది.

పైని రెండు రకముల అనువాదములను గుర్తించియున్నాము. ఇంక మూడవ పద్ధతి 'అనుసరణము', ఇందులో తెలుగు రచయిత, మూలమునందలి సన్నివేశాదుల విషయమున కూడ మార్పులుచేసి, ఎక్కువగా రంగప్రదర్శన యోగ్యముగా చేయుటకు ప్రయత్నములు చేసెను. బలిజేపల్లివారి "ఉత్తరరాఘవము" (1910), కస్తూరి సుబ్బారావుగారి "శాకుంతలా-దుష్యంతము" (1915), వేంకట పార్వతీశ్వర కవుల "విచిత్ర రాఘవము" (1933), కంచనపల్లి జగన్నాథరావుగారి "మాలతీమాధవము" (1940), కొప్పరపు సుబ్బారావు ప్రభృతుల "వసంతసేన" మొదలగునవి యిందుల కుదాహరణములు. భమిడిపాటి కామేశ్వరరావుగారి భాస రూపకానువాదాదులును ఇట్టివే; వీరివి కేవల వచనానువాదములు కూడ.

1900 పూర్వమే ప్రసిద్ధ సంస్కృతరూపకములన్నియును తెలుగున అనూదితములైనవి. 1912 లో భాసనాటకచక్రము వెలువడినంతనే శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం ప్రభృతులు కొన్ని భాసరూపకముల ననువదించి ప్రకటించినారు. ఈ మధ్య దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు మరల భాసరూపకముల నన్నింటిని అనువదించి ప్రకటించుచున్నారు.

ఆంధ్రీకరింపబడని ఉత్తమసంస్కృతరూపకము లింకను చాలకలవు; అనువదింపబడినవానినే అనువదించుటకంటె క్రొత్తవానిని అనువదించుటకు ప్రయత్నించుట ఆవశ్యకము.

## భారతీయభాషా రూపకానువాదములు

మతసంప్రదాయములు, ఆచారవ్యవహారములు, భావనాపద్ధతి మొదలగునవి భారతదేశ మంతటను ఇంచుమించుగా ఒకే విధముగా నుండుటుకాన సంస్కృతరూపకముల ననువదించి నట్లే భారతీయభాషా రూపకములనుకూడ తెలుగులోనికి యథాతథముగా ననువదింపవచ్చును. బెంగాలీ-హిందీ-మహారాష్ట్ర-గుజరాతీ-ఒరిస్సా-తమిళ-కన్నడ భాషలలోనుండి తెలుగులోనికి రూపకముల నాంధ్రీకరించిన పలువురీపద్ధతినే అనుసరించిరి. భారతీయభాషలలోనుండి తెలుగు లోనికి రూపకముల నాంధ్రీకరించిన ప్రథములలో శ్రీపాద కామేశ్వరరావు, మాచిరాజు దుర్గా శంకరామాత్యులు, జంధ్యాల శివన్నశాస్త్రిగార్లు ముఖ్యులు. అటుపిమ్మట పేర్కొనదగినవారు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ప్రభృతులు. సత్యనారాయణమూర్తిగారి "నూర్జహాన్" (1926), "షాజహాన్" అనువాదములు ప్రసిద్ధి కెక్కినవి. ఈ భారతీయ భాషారూప కాంధ్రీ కరణములన్నియును గద్యాత్మకములేయని చెప్పవచ్చును; ఇంకొక విశేషము చారిత్రక నాట కము లధికముగా అనూదితములగుట. స్వతంత్రచారిత్రకనాటకములతోపాటు ఇవియును తెలుగు రంగస్థలమున విజయవంతముగా ప్రదర్శితములైనవే.

తెలుగులో భారతీయభాషారూపకముల అనువాదము చాల ఆలస్యముగా జరిగినది, అంతకంటెముందు పార్శీనాటకసమాజములవారు ప్రదర్శించిన నాటకముల కథలను స్వీకరించి స్వతంత్రముగా నాటకరచనచేయుట మాత్రము జరిగియున్నది; ఇట్లు చేసినవారిలో రాజా విక్రమదేవవర్మ, కోలాచలం శ్రీనివాసరావు ప్రభృతులుకూడ కలరు. ఇంక కేవలాను వాదములు స్వాతంత్ర్యోద్యమము ముమ్మరముగా సాగుట ఆరంభమైన తరువాతనే వెలువడినవని చెప్పవచ్చును. తొలినాళ్ళలో ద్విజేంద్రలాల్‌రాయ్‌గారి నాటకములే అధికముగా అనూదితము లైనవి. వారి నాటకములను అనువదించినవారిలో పింగళి నాగేంద్రరావుగారినికూడ ప్రముఖ ముగా పేర్కొనవలసియున్నది; వారి మేవాడురాజ్యపతనము (1922), పాషాణి (1923) ఇందులకుదాహరణములు. ద్విజేంద్రలాల్‌రాయ్‌గారి నాటకములవలెనే టాగూర్‌గారి నాటకములు కూడ అధికముగా తెలుగున అనూదితములైనవి. 1923 లోనే సెట్టి లక్ష్మీనరసింహంగారు 'చిత్ర'ను తెలుగులోనికి అనువదించినారు. ఈ మధ్య టాగూర్ నాటకములనెల్ల అనువదించు టకు ప్రయత్నించినవారు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు; టాగూర్ వంగభాషా సంబంధియైన పలుకుబడినికూడ తెలుగులోనికి తెచ్చుటకు ప్రయత్నించినారు డా. రెడ్డిగారు.

శ్రీపాద కామేశ్వరరావుగారు పంజాబీభాషనుండి 'పునర్వివాహము'ను, ఒరియా భాష నుండి 'కళాపహాడ్'ను, తమిళభాషనుండి 'లీలావతీ సులోచనము'ను అనువదించియున్నారు. డి. వెంకటరమణయ్యగారు తమిళమునుండి 'గాలవబుషి నాటకము'ను అనువదించియున్నారు. కాని మొత్తముమీద, వంగ-హిందీ భాషలనుండి అనూదితములైనన్ని నాటకములు ఇతర భాషలనుండి అనూదితములు కాలేదనియే చెప్పవచ్చును. ఇటీవల దక్షిణభాషా పుస్తక సంస్థ వారి ప్రోత్సాహమున తిరుమల రామచంద్రగారు చేసిన కన్నడ నాటికల అనువాదములును, శ్రీవాత్సవగారు చేసిన తమిళనాటికల అనువాదములును, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

చేసిన మళయాళనాటికల అనువాదములును ప్రకటితములైనవి. రేడియోవారి 'జాతీయ రూపక' కార్యక్రమమందు పెక్కు భారతీయభాషారూపకముల యాంధ్రీకరణములు ప్రసారములైనవి; అగుచున్నవి. ఇట్టిరూపకములను అనువదించినవారిలో దండమూడి మహీధర్‌గారు సుప్రసిద్ధులు.

## ఆంగ్ల రూపకానువాదములు

తెలుగులోనికి అనువదింపబడిన ప్రథమాంగ్లరూపకము 'జూలియస్ సీజర్'; వావిలాలవారు 'సీజరు చరిత్ర' మనుపేర దీనిని తెలుగులోనికి అనువదించినారు (1875). పిమ్మట 1880 లో గురజాడ శ్రీరామమూర్తిగారు 'మర్చంట్ ఆఫ్ వెనిస్'ను. కందుకూరివారు 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'ను అనువదించియున్నారు. వీనిలో కందుకూరివారి అనువాదము వెంటనే రంగస్థలమున ప్రదర్శితమైనది కూడను.

ఆంగ్లనాటకముల నాంధ్రీకరించిన పై ముప్వురును మూడురకముల మార్గముల నవలంబించిరి. వావిలాలవారు మొత్తము నాటకమంతటిని—మూలమందలి 'బ్లేంక్ వెర్స్' పద్ధతిలో—తేటగీతిలోని కనువదించిరి; పేర్లనట్లే యుంచిరి; అచ్చటచ్చట దేశీయ సంప్రదాయములను ప్రవేశపెట్టిరి. కందుకూరివారు నాటకమునంతటిని వచనములోనికి అనువదించి, పేర్లను ఆచారవ్యవహారములను దేశీయములను చేసినారు. ఇంక గురజాడవారు మూలములోని పేర్లను ఆచారవ్యవహారములను దేశీయముల నొనర్చుటయేకాక సంస్కృతరూపకపద్ధతిలో వివిధములైన ఛందస్సులనువాడి పద్యములను రచించినారు. ఈ ముప్వురి రచనలలోను కందుకూరివారి అనువాదము సుబోధకమును, ప్రదర్శనయోగ్యమును అయియున్నదనుట నిస్సంశయము.

సంస్కృతరూపకములను తెనుగులోనికి అనువదించుటలో కవికి కొంత సౌలభ్యమున్నది. పేర్లు, ఇతివృత్తము, భావములు, ఆచారవ్యవహారములు దేశీయములైనవి; అంతియేకాదు, పామరులకుకూడ సన్నిహితములైనవి; మరియు, భాషకూడ సన్నిహితమైనదే. సంస్కృతపదజాలమే — మూడింట నాల్గువంతులు — తెలుగులో కన్పట్టును. కాని, ఆంగ్లరూపకానువాదము నందట్టి సౌలభ్యము సహజముకాదు. భాష, పేర్లు, భావములు, ఆచారవ్యవహారములు పూర్తిగా భిన్నములైనవి. వీనిని యథాతథముగా తెనుగులోనికి అనువదించినచో భిన్నసంస్కారముగల తెలుగుప్రజాసామాన్యమున కది దుర్బోధమే కాగలదు. అందుచేతనే కందుకూరివారు, గురజాడవారు తమతమ అనువాదములకు దేశీయతాముద్రను వేయవలసివచ్చినది. కొందరు సంస్కృతరూపకపద్ధతిలో తమతమ ఆంగ్లరూపకాంధ్రీకరణములకు నాందీ-ప్రస్తావనా-భరతవాక్యాదులనుకూడ రచించియుండుట గమనార్హము. దంటు సుబ్బావధానిగారి 'చిత్రమాధవనాటకము', భుజంగరావుగారి 'చారుమతీపరిణయము' మొదలగునవి యిందుల కుదాహరణములు. (కందుకూరివారు తమ అనువాదములకు దేశీయతాముద్ర వేసినను సంస్కృతసంప్రదాయములను మాత్రము ప్రవేశపెట్టలేదు).

కాని, నిజమునకీ పద్ధతి 'అనువాదము' (translation) అనిపించుకొనదు; ఇది అనుసరణము (adaptation) మాత్రమే కాగలదు. అయినను, పాశ్చాత్యరూపకములను తెలుగులోనికి తెచ్చునప్పుడు 'అనుసరణమే' ఉత్తమముగా, ఆచరణీయముగా కన్పట్టుచున్నది.

పాశ్చాత్య రూపకాంధ్రీకరణమునకు పూనుకొన్నవారిలో నూటికి తొంబదియైదుమంది అనుసరణ పద్ధతినే అవలంబించియున్నారు; ఇతర భారతీయ భాషలవారుకూడ పాశ్చాత్య రూపకాను వాదములందీ పద్ధతినే అనుసరించియుండుట గమనింపవచ్చును[1]. ఇటీవల వావిలాల సోమ యాజులుగారు 'జూలియస్ సీజర్', 'ఆంటోనీ అండ్ క్లియోపాత్రా'లను కేవలము వచనము లోనికి యథాతథముగా అనువదించియున్నారు. అనుభవజ్ఞులైనవారి యీ అనువాదములు కొంత సారళ్యమును సంపాదించుకొన్నవి. ఇట్టి అనువాదములుశి—లాసింహ మొ॥ ఇంకను కలవు. కాని, ఇవి రంగస్థలమున విజయవంతము లగుట అనుమానాస్పదము[2].

షేక్స్పియర్ రూపకములే ప్రప్రథమముగా తెలుగులోనికి అనూదితములైనవి. పిమ్మట కందుకూరివారు ప్రప్రథమముగా షెరిడాన్ 'డ్యూయెన్నా'ను (రాగమంజరి—1885), 'ది రైవల్స్'ను (కల్యాణ కల్పవల్లి—1894) అనువదించినారు. కాని, అటుపిమ్మట మరల అందరును షేక్స్పియరు నాటకములనే అనువదింపనారంభించినారు. 1900 లోపల ఆంగ్లరూప కాంధ్రీకరణములు, ఇంచుమించుగా పది—పదునైదుకంటె ఎక్కువగాకన్పట్టవు. కాని, 1900—20 మధ్య ఆంగ్లరూపకాంధ్రీకరణములు బహుళములుగా బయలుదేరినవి. కాని అవియన్నియును షేక్స్పియరు నాటకములే. ఎచ్చటనో ఒకటిరెండు అపవాదములుకూడ లేకపోలేదు— స్కాట్ నవల నాధారముగా చేసికొని శ్రీరాం వీరబ్రహ్మంగారు రచించిన "వాసంతిక" (1913), షెరిడాన్ "స్కూల్‌ఫర్ స్కాండల్"కు ఆంధ్రీకరణమైన కె. ఆర్. వి. కృష్ణారావుగారి "అపవాద తరంగిణి" (1901), మోలియర్ "మాక్ డాక్టర్" ననుసరించి వేదం వేంకటాచల అయ్యగారు రచించిన "విధిలేక వైద్యుడు" (1912) మొదలగునవి యిందుల కుదాహరణ ములు. మోలియర్ రూపకము నాంధ్రీకరించిన ప్రథములు వేంకటాచల అయ్య; పిమ్మట 1915 లో సెట్టి లక్ష్మీనరసింహంగారు ఇంకొక రూపకమును "లుబ్ధాగ్రేసర చక్రవర్తి" అను పేర అనువదించియున్నారు. తరువాతి కాలములో మోలియర్ రూపకములను భమిడిపాటివా రధికముగా అనువదించియున్నారు. (అనగా, అవి అనుసరణములు మాత్రమే).

పోణకా పిచ్చిరెడ్డిగారు 1927 లో ఇబ్సెన్ నాటకమగు 'The Brand'ను 'భీష్ముడు' అను పేర ఇంచుమించుగా వచనములోనికి అనువదించి ప్రకటించినారు; ఇబ్సెన్ నాటకాంధ్రీ కరణమునకు పూనుకొన్నవారిలో వీరే ప్రథములనుకొందును. ఇటీవల రాధాకృష్ణమూర్తిగారి "సంఘనాయకులు" (Pillars of Society) ప్రభృతి అనువాదములు మరికొన్ని వెలువడినవి. మారిస్ మేతర్ లింకను ప్రప్రథమముగా అనువదించినవారు భమిడిపాటి కామేశ్వరరావుగారు (1322—25), ఆచంట జానకిరామ్‌గారు "ది ఇంటీరియర్" అనెడి ఏకాంకిను "అంతరంగము" అనుపేర అనువదించి, కృష్ణాపత్రికలో ప్రకటించినారు[3]. అటుపిమ్మట "స్టిల్‌మాండ్ మాజ స్ట్రేట్" 1928 లో అనూదితమైనది. ఇటీవలకూడ సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి "కల్యాణి" ప్రభృతి ఆంధ్రీకరణములు వెలువడినవి. మొత్తముమీద, ఈ ఆంగ్లనాటకాంధ్రీకరణములు, స్వతంత్రనాటకముల రచనవలెనే ముత్త్రివిధములుగా సాగినవి—1. కేవలము పద్యాత్మకములు; 2. గద్యపద్యసమ్మిశ్రితములు; 3. కేవలము గద్యమయములు.

ఇంక, ఆధునిక కాలములో, పలువురు పలువిధములుగా పాశ్చాత్యరూపకములను తెలుగులోనికి తెచ్చుచున్నారు—కొందరివి కేవలానువాదములు (వావిలాల సోమయాజులు ప్రభృతులు); కొందరివి భావానువాదములు; కొందరివి అనుసరణములు. మరికొందరు కేవలము ఇతివృత్తమునో, లేదా పాత్రనో గ్రహించి, తక్కినదానిని స్వతంత్రముగా సృష్టించుకొనుచున్నారు. కొందరు తాము గ్రహించిన మూలములను సూచించుచున్నారు. తక్కినవారు అంతయు స్వీయసృష్టియే అన్నట్లు మాటాడ కూరకొనుచున్నారు!

ఆధునికకాలమున బహుళరచయితల రచనలు ఆంధ్రీకృతములైనవి. అట్టివానిలో జె. బి. ప్రీస్ట్లీ రచనలను ప్రధానముగా పేర్కొనవచ్చును. అవసరాల వెంకటనర్సుగారి "జ్యోతిర్మయి" (Key to a City) ఈ ఆంధ్రీకరణములలో ప్రముఖముగా పేర్కొనదగిన రచన. గోరా శాస్త్రిగారి శ్రవ్యరూపకము "కాలాతీతవ్యక్తులు" (TIme and the Conways) కూడ ఇట్టిదే. "An Inspector Calls" అనెడి నాటకమును "ఇనుపతెరలు" అనెడి పేర కొప్పరపు సుబ్బారావుగారు అనువదించినారు; అటుపిమ్మట బెల్లంకొండ రామదాసు, రెంటాల గోపాలకృష్ణగార్లుకూడ దీనిని అనువదించియున్నారు. పి. జి. వుడ్‌హౌస్ రచన "The play is the Thing" అనుదానిని డి. వి. నరసరాజుగారు అనువదించినారు. నో యెల్‌కోవర్డు రచనలను అనువదించినవారిలో కొండముది శ్రీరామచంద్రమూర్తి, నాగభూషణ్‌గార్లు ముఖ్యులు. నాగభూషణ్‌గారు హెరాల్డ్ ఛాపిన్ రచనలనుకూడ అనుసరించియున్నారు.

గాల్స్‌వర్దీ రచనలను కొందరనువదించినారు; కొందరు తత్ప్రభావమునకు లోనైనారు. సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి "న్యాయం" (Justice), కొడవటిగంటి కుటుంబరావుగారి శ్రవ్యరూపకములు ఈ సందర్భమున పేర్కొనదగినవి. ఎ. ఎస్. అవధానిగారు ఆస్కార్ వైల్డు రచనలను, అంబడిపూడి వేంకటరత్నంగారు క్లిఫర్డ్‌బాక్స్ రచనలను అనువదించియున్నారు. Crime and Punishment అను నవలను శివంగారు నాటకీకరించినారు. ప్రఖ్య శ్రీరామమూర్తిగారి "ఫణి" కి ఫ్రెడరిక్ నాట్ రచన మాతృక. ఇట్టివే మరికొన్నిరచనలు కలవు.

విలియమ్ సారోయన్, జె.ఎమ్. బారీ ప్రభృతులరచనలనుకూడ అనేకులు అనువదించియున్నారు. వీరిలో హితశ్రీ, మంథా వెంకటరమణ, అంగర సూర్యారావు, కొండముది శ్రీరామచంద్రమూర్తి ప్రభృతులు ప్రముఖులు. ఈ అనువాదములలో ఏకాంకిక లధికము. ఇంచుమించుగా ప్రతి మాసపత్రికలోను నెలకొక్కొక్క నాటిక లేదా ఏకాంకిక—అనువాదమో లేదా అనుసరణమో—వెలువడుచుండు నన్నచో అతిశయోక్తిలేదు.

రష్యన్ సాహిత్యమునుండి చెకోవ్, గోర్కీల రచన లధికముగా తెలుగులోనికి వచ్చినవి. చెకోవ్ Cherry Orchard ను శ్రీశ్రీ అనువదించినారు. 'తుదిఘడియలు', 'శత్రువులు', శ్రీనివాస చక్రవర్తిగారి 'పతితజీవులు' మున్నగునవికూడ గోర్కీ రచనల కనువాదములే. చక్రవర్తిగారి 'సీటికాకి' (చెకోవ్), జైత్రయాత్ర (హూకో) మున్నగునవికూడ పాశ్చాత్యరూపకానువాదములే. బ్రూ రచనకు అనుసరణమగు రాంషాగారి 'లక్షింపతిగారి

అమ్మాయిలు' కూడ పేర్కొనదగిన రచన. ఇటీవల లక్ష్మీకాంత మోహన్‌గారి షేక్స్పియర్ నాటకానువాదములు చాల వెలువడినవి.

## తెలుగు రూపకములపై ఆంగ్లరూపకముల ప్రభావము[1]

పాశ్చాత్యరూపక సాహిత్యప్రభావము కారణముగానే ఆధునికకాలమున భారత దేశీయ భాషలన్నింటను మార్గరూపకరచన ఆరంభమైనదని గుర్తించియున్నాము. తెలుగులో, తొలుత సంస్కృతరూపకానువాదములతోపాటు, ఆంగ్లరూపకానువాదములును వెలువడినవి. పిమ్మట, పాశ్చాత్యరూపకపద్ధతిలో కొందరు స్వతంత్రనాటకములను రచింపనారంభించిరి; అట్టివారిలో ధర్మవరమువారు ప్రథములేకాక ప్రధానులుకూడను. పాశ్చాత్యరూపకప్రభావము కారణముగా తెలుగులో వెలసిన నూత్నప్రక్రియలు రెండు — మొదటిది విషాదరూపకము; రెండవది ఏకాంకిక. ఏకాంకిక, సాహిత్యప్రక్రియగా తెలుగులో 1920 తరువాతనే వెలసినది; ఆ విషయమును గూర్చియు, విషాదరూపకస్వరూపాదులను గూర్చియు తరువాత వివరింతును.

ఇంక రూపకరచనలో, నిర్మాణశిల్పములో వచ్చిన మరికొన్ని మార్పులుకలవు — అంకమును రంగములుగా విభజించుట; నాందీ-ప్రస్తావనా-విష్కంభాదులను వదలివేయుట లేదా కొన్నిచోట్ల ప్రొలోగ్‌ను, ఎపిలోగ్ (ఉత్తర రంగము)ను వ్రాయుట; షేక్స్పియరు పద్ధతిలో స్వగతములను రచించుట; రూపకములను పంచాంకపరిమితములుగానే రచించుట; పాత్రోచితభాష నుపయోగించుట; పౌరాణికకథలలో ఆధునికసమస్యలను చొప్పించుట మొదలగునవి కృష్ణమాచార్యులుగారవలంబించిన కొన్ని పాశ్చాత్య సంప్రదాయములు. వీరు ప్రవేశ పెట్టిన మరియొక ముఖ్యాంశము భావసంఘర్షమునకు ప్రాధాన్యమొసంగుట. ఇంచుమించుగా ఇదే పద్ధతిలో రచన సాగించినవారు కోలాచలంవారు. వేదం, గురజాడల ప్రతాపరుద్రీయ-కన్యాశుల్కములమీద ఆంగ్లసాహిత్యప్రభావమున్నదనుట స్పష్టము. ఇంక, రచించిన రూపకములన్నింటను పాశ్చాత్య (షేక్స్పియర్) రూపకరచనాప్రభావము సుస్పష్టముగా కన్పట్టెడి రచయితలలో పానుగంటివారు ప్రముఖులు. కాని పై వారిలో ఒక్క పానుగంటివారుతప్ప తక్కిన వారెవ్వరును ఆంగ్లరూపకములను అనుసరింపకపోవుట గమనార్హము.

1900 ముందే, పాశ్చాత్య రూపకరచనా ప్రభావితములై వెలువడిన మరికొన్ని స్వతంత్రనాటకములు కలవు — ఆచంట సాంఖ్యాయనశర్మగారి 'మనోరమ' (1895), వల్లూరి బాపిరాజుగారి 'సాగరిక' (1897), పనప్పాకం శ్రీనివాసాచార్యులవారి 'శివాజి' (1897) మొదలగునవి యిందుల కుదాహరణములు. మనోరమ సరళశైలిలో వ్రాయబడిన ఐదంకముల నాటకము; ఇందులో స్త్రీవిద్యాసమస్య ప్రధానమైనది. ఇరువురు యువతులు, తాము ప్రేమించిన ఇరువురు యువకులను పొందగలుగుట ఇందలి ఇతివృత్తము. దీనిపై 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' ప్రభావము స్పష్టముగా కన్పట్టుచున్నది. విధవావివాహ సమస్యపై కేంద్రీకృతమైన రచన సాగరిక'. 'శివాజీ' తొలి ఉత్తమచారిత్రక నాటకములలో నొకటి; ఇందు ప్రాచీనసంస్కృత సంప్రదాయములకు స్వస్తిచెప్పుట జరిగినది.

1900_20 మధ్యకాలములో ఆంగ్లరూపకానువాదము లెక్కువగా వెలువడినను, ఆంగ్ల రూపకమర్యాదల ననుసరించి వ్రాయబడిన స్వతంత్రరూపకములు చాల తక్కువ. కాని, 1925 ప్రాంతములనుండి పాశ్చాత్యరూపకప్రభావితములైన తెలుగు స్వతంత్రరూపకములు మరల బయలుదేరసాగెను. ఇంతకుముందు షేక్స్పియరు రూపకరచనాపద్ధతిమాత్రమే తెలుగురూపక కర్తలకు ప్రధానాదర్శము. ఇప్పుడింక ఇబ్సెన్, షా, మేతర్‌లింకు, మోలియర్ ప్రభృతుల రచనలుకూడ ఆదర్శములైనవి. దీనిఫలముగా, తెలుగు రూపకరచనలోనేకాక, ప్రదర్శన ములో, అభినయములోకూడ క్రొత్తమార్పులు రాసాగెను.

విశ్వనాథ, దువ్వూరిగార్లమీద షేక్స్పియరు విషాదరూపకప్రభావము స్పష్టముగా కన్పట్టుచున్నది. విశ్వనాథవారిమీద షేక్స్పియరు ప్రభావమేకాక మేతర్‌లింకు ప్రభావముకూడ నున్నది; తత్ప్రభావఫలముగా వారి కలమునుండి 'అనార్కలి'యనెడి ఉత్తమమైన నాటిక (Lyrical play) అవతరించినది. మేతర్‌లింకు ప్రభావమునకులోనై నోరి నరసింహశాస్త్రిగారు 'తేనెతెట్టె'ను రచించియున్నారు. మోలియర్ రచనలచే ప్రభావితులై భమిడిపాటివారు తెలుగులో కళాత్మకమైన ప్రహసనవాఙ్మయమును సృష్టించియున్నారు.

అటుపిమ్మట తెలుగురచయితలను ప్రభావితముచేసిన పాశ్చాత్యరచయితలలో ఇబ్సెన్ (1828_1906) ముఖ్యుడు. ఈయన రచనలప్రభావము పి. వి. రాజమన్నారుగారి రచనలలో అధికముగా కన్పట్టును; వీరిపై గాల్స్‌వర్దీ ప్రభావముకూడకలదు. సింజీ, యేట్స్‌లచే ప్రభావితులైన నార్ల వేంకటేశ్వరరావుగారు పల్లెజీవితసంపదను చిత్రించియున్నారు. యువనాటక రచయితలలో ప్రముఖులగు ఆచార్య ఆత్రేయగారి రచనలపై గాల్స్‌వర్దీ ప్రభావ మధికముగాకలదు. ఆరుద్ర ప్రభృతుల గేయనాటకములపై క్రిస్టొఫర్ ఫ్రై ప్రభావము కన్పట్టగలదు. పాశ్చాత్యుల 'క్రైమ్'రూపకముల ననుసరించి తెలుగులో ప్రఖ్య శ్రీరామమూర్తి ప్రభృతులు "అపరాధ పరిశోధక" రూపకములను రచించియున్నారు. (ఇచ్చట కొందరు రచయితలను, వారి కొన్ని రచనలనుమాత్రమే పేర్కొనుట జరిగినది. ఇది దిక్ప్రదర్శనమాత్రమేయగుట మరువరాదు.)

పాశ్చాత్యరూపకముల ప్రభావముకారణముగానే తెలుగురూపకములందు 'హాస్యము' నకు ప్రాధాన్యమధికమగుట పరిశీలింపవచ్చును. ఆదిలో కొందరు ఆంగ్లాంధ్రపదముల మిశ్రమ ప్రయోగముచేత హాస్యమును జనింపజేసెడివారు. (అట్టిప్రయోజనములేకపోయినను, ఒక్కొక్క జాతి పాత్రలచిత్రణములో ఆంగ్లపదప్రయోగము అవసరమగుటయును గమనింపవచ్చును).

ఇచ్చట ఒక సత్యమునుమాత్రము పేర్కొనకతప్పదు. పాశ్చాత్యరూపకముల ప్రభావము కారణముగానే_విషాదరూపకములు, గేయరూపకములు, పద్యరూపకములు, ఏకాంకికలు, శ్రవ్యరూపకములు మొదలగు నూత్నప్రక్రియలు తెలుగులో అవతరించినవి. కాని ఉత్తమ రూపకనిర్మాణవిషయమున కొంత క్లిష్టసమస్య యేర్పడినదని చెప్పకతప్పదు. ప్రక్రియలు, రచనావిధానము పాశ్చాత్యము; కాని నిరూపించెడివిషయములు, చిత్రించెడి విషయములు దేశీయములు. ఈరెండింటి సమన్వయమున_ముఖ్యముగా 'నాటక'రచనలో_చాలమంది రచయితలు

విఫలులగుచున్నారు; సఫలులైనవారు కొలదిమందిమాత్రమే. ఏదియెట్లున్నను, నాటకరచనా విషయమున, కొన్నిక్రొత్తసూత్రములను నిష్కర్షించుకొనవలసిన ఆవశ్యకముమాత్రము నేడు కలదు.

## స్వతంత్ర రూపకములు

అన్నిభాషలయందువలెనే తెలుగులోకూడ స్వతంత్రనాటకములు పలువిధములుగా వెలువడినవి—పౌరాణికరూపకములు, సాంఘికరూపకములు, సంఘసంస్కారరూపకములు, రాజకీయరూపకములు లేదా ప్రచారరూపకములు, సంఘతిరస్కారరూపకములు చారిత్రక రూపకములు, మనస్తత్త్వనిరూపణరూపకములు, ప్రహసనములు మొదలగునవి. ఇందులో కొన్ని సంస్కృతమర్యాదల ననుసరించినవి; కొన్ని పాశ్చాత్యమర్యాదల ననుసరించినవి; కొన్ని మిశ్రమలక్షణాన్వితరూపకములు. ఈ రూపకములలో మరల విషాద-ఆహ్లాదభేదములు కలవు.

### పౌరాణిక రూపకములు :

పురాణేతిహాసాదులందలి లేదా ఐతిహ్యములందలి కథలనుస్వీకరించి, నాటకములుగా రచించినచో అవి 'పౌరాణిక నాటకము'లగును. ఇందు 'భారతనాటకము'లనియు, 'రామాయణ నాటకము'లనియు, 'భాగవతనాటకము'లనియు ప్రధానభేదములు కలవు. ఇంక తక్కిన కథలు ఇతర పురాణములకు, కథాసరిత్సాగరాదులకు, ఐతిహ్యములకు, జానపదగాథలకు సంబంధించి యుండును.

ఆధునికకాలమున, తెలుగుభాషలో తొలిరూపకమగు 'మంజరీమధుకరీయము' స్వతంత్ర పౌరాణికరూపకమగుట గుర్తించియున్నాము. పిమ్మట కందుకూరివారు 1885-86 లో 'ప్రహ్లాద', 'దక్షిణగోగ్రహణము', 'సత్యహరిశ్చంద్ర' అనెడి మూడుస్వతంత్ర పౌరాణిక నాటకములను రచించిరి. 1886 లో ధర్మవరమువారి 'చిత్రనళీయము' వెలువడినది. తరువాత సుసర్లవారి 'పాండవాజ్ఞాతవాసము'. తోలేటివారి 'హరిశ్చంద్ర', చిలకమర్తివారి 'కీచకవధ' మొదలగునవి వెలువడినవి. అటుపిమ్మట పౌరాణికనాటకములు పుంఖానుపుంఖములుగా వెలువడినవి. కొందరు కొన్ని కల్పితనాటకములను పౌరాణికవాతావరణములో చిత్రించి యుండుటకూడ పరిశీలింపవచ్చును. కోలాచలం ప్రభృతులకాలమునుండియు ఇది ఆరంభమైనది.

పౌరాణికేతివృత్తములను స్వీకరించి, అందులో ఆధునికసమస్యలనుకూడ చొప్పించుటకు పునాది కందుకూరి, ధర్మవరంగార్లే వేసినారు. (ఇందుకందుకూరివారిది-సంఘసంస్కరణదృష్టి, ధర్మవరంవారిది అధికముగా చమత్కారకల్పనాదృష్టి). తిరుపతి వేంకటకవులు తమ 'పాండవోద్యోగవిజయము'లందు పాండవులను ఆధునికస్వాతంత్ర్యసమరవీరులవలె తీర్చిదిద్దుట జరిగినది. 1900-1920 మధ్యకాలములో పౌరాణికనాటకములే అధికముగా వెలువడినవి. 1920 తరువాత కొందరు పౌరాణికకథలకు నూత్నవ్యాఖ్యానములుచేయుచు రచనలు చేసియున్నారు. అట్టివారిలో ముఖ్యముగా పేర్కొనదగినవారు త్రిపురనేని రామస్వామిచౌదరి, ముద్దుకృష్ణ, చలంగార్లు. విశ్వనాథవారు వేనమహారాజును వేదమతవిధ్వంసకునిగా చిత్రింప, సనాతనమతస్థులందరునుకలిసి వేనుని 'ఖూనీ'చేసినట్లు త్రిపురనేనివారు చిత్రించియున్నారు. మహాపతివ్రతగా

తలంపబడుచున్న 'సీతాదేవి' ఆధునిక ప్రణయమూర్తివలె చిత్రింపబడినది ముద్దుకృష్ణగారి 'అశోకం'లో. ఇంక చలంగారి కలములో పౌరాణికేతివృత్తములు, పౌరాణికపాత్రలు మైనపు ముద్దలవలెనై మార్పులుచెందిపోయినవి. ఈ జాతి రూపకములను 'సంఘతిరస్కరణము' అను పేర ప్రత్యేకముగా వివరించియున్నాను.

నటుడుగా బళ్ళారి రాఘవాచార్యులుగారు పౌరాణికపాత్రల నిరూపణమునందు క్రొత్తదనమును తెచ్చినారు. హిరణ్యకశిపుడు మొదలగుపాత్రలకు వారుచేసిన వ్యాఖ్యానము గమనింపదగినది. ఈ పద్ధతిని రచనలోకూడ కొందరు అనుసరించియున్నారు; ఆమంచర్లవారి 'హిరణ్యకశిపుడు' ఇందుల కొక ఉదాహరణము.

నవ్యయుగములోకూడ పౌరాణికేతివృత్తములను స్వీకరించి, రూపకములను రచించువారు కన్పట్టుదురు. సాధారణముగా వీరు పౌరాణికగాథలను ఆధునికభావముల కనుగుణముగా మలచుటకు ప్రయత్నించుచుందురు. శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి 'దివోదాసు', బోయి భీమన్నగారి 'రాగవాసిష్ఠము' మొదలగునవి ఈ జాతికిచెందిన రూపకములు.

కందుకూరివారి పౌరాణికనాటకములు ఇంచుమించుగా గద్యాత్మకములు (ఉన్నపద్యములైనను పదికిలోపు). కొండుభొట్లవారివి కేవల గద్యనాటకములు (Speech dramas). చిలకమర్తివారి తొలిరచనలుకూడ గద్యనాటకములే (1906 తరువాతనే అవి పద్యనాటకములైనవి). ధర్మవరంప్రభృతులు పద్యములను పాటలనుకూడ విరివిగా రచించినారు. తిరుపతివేంకటకవులు మొదలగువారు కేవలము పద్యములకే ప్రాముఖ్యమొసంగియున్నారు; ముఖ్యముగా అవి పద్యములవలననే ప్రసిద్ధములైనవన్నను అసమంజసము కాజాలదు.

సాధారణముగా పౌరాణికనాటకములందలిశైలి ఉదాత్తమును, భాష గ్రాంథికమును అయియుండును; అది సహజముకూడను. గురజాడ అప్పారావుగారు 'బిల్హణీయము'ను కేవలము శిష్టవ్యావహారికములో రచించియున్నారు; అది ఒక ప్రయోగమమాత్రమే. సంఘతిరస్కరణవాదులలోకూడ అధికులు—త్రిపురనేని, ఆమంచర్ల ప్రభృతులు - గ్రాంథికభాషనే ప్రయోగించియున్నారు. కాని. 'అశోకం' మొదలగువానిలో మరల వ్యావహారికమే ప్రయుక్తమైనది. భమిడిపాటివారు భాసనాటకానుసరణములలో వ్యావహారికభాషనే ఉపయోగించినారు; కాని, ఆ భాష ఆ నాటకములకు సహజముగా కన్పట్టదు.

## సాంఘిక రూపకములు :

సాంఘికరూపకములందలి ఇతివృత్తములు కల్పితములు; సంస్కృతరూపకములందలి ప్రకరణ-ప్రహసనములు ఇట్టివే. ఇందు ప్రకరణము ఉదాత్తమైనది; ఇంక ప్రహసనము హాస్యప్రధానమై కొంత అనుదాత్తముగా నుండును.

ఆధునికకాలమున, తొలితెలుగుసాంఘికరూపకము వావిలాలవారి 'నందకరాజ్యము' (1880) ఇందు నాటి బ్రాహ్మణులలోని నియోగి-వైదికశాఖలవారి విరోధములు, అధికారుల దౌర్జన్య

ములు విపులముగా వర్ణితములైనవి. అంకమును రంగములుగా విభజించుట మున్నగువానియందు తప్ప ఆంగ్లరూపకప్రభావమిందు అధికముగా కన్పట్టదు. మరియు, సంపూర్ణముగా తేటగీతిలో వ్రాయబడిన నాటకమిది! పిమ్మట పేర్కొనదగినవి కందుకూరివారి బ్రాహ్మవివాహ-వ్యవహారధర్మబోధినీ-వివేకదీపికలు (1880). వ్యవహారధర్మబోధిని వ్యావహారికభాషలో వ్రాయబడిన దగుటయేకాక ప్రదర్శనభాగ్యముపొందిన తొలితెలుగు రూపకముకూడను. కాని, వీనిని నాటకము లనుటకంటె 'ప్రహసనము'లని అనుటయే సమంజసము. అటుపిమ్మట పేర్కొనదగినవి సాంఖ్యాయనశర్మగారి 'మనోరమ' (1875), వల్లూరివారి 'సాగరిక' (1897). ఈ రెండు రచనలమీదను ఆంగ్లరూపకప్రభావము స్పష్టముగా కన్పట్టగలదు. ధర్మవరంవారుకాని, చిలకమర్తివారుకాని కేవలము సాంఘికరూపకములను రచింపలేదు (చిలకమర్తివారిలో ఆంగ్లరూపక ప్రభావము చాల అల్పముగా కన్పట్టును. తిరుపతివేంకటకవుల రచనలుకూడ ఇట్టివే).

నాటికిని, నేటికిని అద్వితీయసాంఘికరూపకముగా నెన్నబడుచున్న 'కన్యాశుల్కము' 1892 ప్రాంతములలో రచింపబడి, పలు ప్రదర్శనములనుపొంది, 1897 లో పుస్తకరూపమున వెలువడినది. ఇంచుమించుగా క్రొత్తరూపకమో అన్నంతగా సవరణపొందిన దీని రెండవ కూర్పు 1909 లో వెలువడినది. తరువాత వెలువడిన పెక్కు సాంఘికరూపకముల కిది మార్గదర్శకమైనది. మరియు కందుకూరివారు ప్రయోగాత్మకముగా వ్యవహారధర్మబోధినిలో ప్రవేశపెట్టిన వ్యావహారికభాషారచనను గురజాడవారు ఉద్యమస్థాయిలో నడపియుండుట స్మరణీయము. అసలు సాంఘికరూపకములకు పాత్రోచితమైన వ్యావహారికభాషయే తగినభాష. కన్యాశుల్కము తరువాత పేర్కొనదగినది పానుగంటివారి 'కంఠాభరణము' (1917). కాని, ఇదికూడ ప్రహసనజాతిలో చేరినదే. తిరుపతి వేంకటకవుల ఒకేఒక సాంఘికరూపకము 'వ్యసన విజయము' అసంపూర్ణముగా నిలిచిపోయినది (ఇది ప్రకరణము).

1920 తరువాతనే తెలుగులో సాంఘికరూపకము లధికముగా వెలువడినవి. ఛాందసములుగా లేదా హానికరములుగా పరిణమించిన ప్రాచీనాచారములను, ఆధునిక నాగరకతా ఫలముగా సంఘములోకన్పట్టు దాంభిక-కృత్రిమజీవితమును, వ్యక్తులను కుటుంబములను నాశనము చేసెడి వ్యసనములను ఈకాలపు రూపకములు చిత్రింపసాగినవి. కేవలము సంఘ సంస్కరణమే ప్రధానోద్దేశముగా రచనలు చేసినవారిలో కాళ్ళకూరి నారాయణరావుగారు ప్రముఖులు. ఇట్టి నాటకములందు ఆద్యంతము అవినీతియే ప్రదర్శింపబడును. అంతమున ఏదో ఒకరకముగా పాత్రలు నీతిపథమునకు మరలుట నిరూపితమగును; అట్లుకాదేని. పానుగంటివారి 'రాతిస్తంభము'నందువలె నాటకములు దుఃఖాంతములగును.

1928 ప్రాంతములనుండి ఇబ్సెన్, మేతర్‌లింకు, షా, వైల్డ్ ప్రభృతుల రూపకముల ప్రభావముకారణముగా సాంఘికరూపకము లధికముగా సమస్యాప్రధానములు కాజొచ్చినవి. ఇట్టివానిలో పి.వి.రాజమన్నారుగారి రూపకములు ప్రధానములు. ఇవికూడ సంఘతిరస్కార రూపకముల జాతిలోనే చేరును.

1944 తరువాత వచ్చిన సాంఘికరూపకములలో రైతు - కార్మికసమస్యలు, మధ్య తరగతిప్రజల సమస్యలు ప్రాధాన్యము వహించినవి—భూస్వాములు జమీందారులు రైతులను, కర్మాగారముల యజమానులు కార్మికులను పెట్టెడిహింసలు, వారినెదిరించి రైతు-కార్మికులు సాగించెడి పోరాటములు కొన్నినాటకముల కితివృత్తములైనవి. మరికొన్ని నాటకములకు మధ్య తరగతిప్రజల అగచాట్లు, స్త్రీల స్వాతంత్ర్యము మొదలగునవి ఇతివృత్తములైనవి. ఇంకకొన్ని నాటకములకు పతితజనోద్ధరణము, వర్ణాంతరవివాహములు మొదలగునవి ఇతివృత్తములైనవి. (ఇంతకుముందుకూడ ఆయాజాతి రూపకములు అప్పుడప్పుడు వెలువడుచునేయున్నవి.)

ఇబ్సెన్‌రచనలచే ప్రభావితులైన పి.వి.రాజమన్నారుగారు 1930 ప్రాంతమునుండియు సమస్యాప్రధానములైన సాంఘికరూపకములనురచింపసాగిరి; రాజమన్నారుగారు ప్రధానముగా మధ్యతరగతిప్రజల జీవితములనే చిత్రింపసాగిరి; ఆ రూపకముల ప్రచారమునకు తోడ్పడిన వారు బళ్ళారి రాఘవాచార్యులుగారు. రాఘవాచార్యులుగారుకూడ 'సరిపడని సంగతులు' (1933) అనెడి సమస్యాప్రధానమైన సాంఘికరూపకమును రచించియుండుట గమనార్హము. 1940 తరువాత ఆచార్య ఆత్రేయ మరల మధ్యతరగతిప్రజల జీవితమును చిత్రింపసాగెను. సమ కాలీన నాటకరచయితలలో ఆచార్య ఆత్రేయది అగ్రస్థానమనుట నిర్వివాదాంశము. 1930 లో వెలువడిన రాజమన్నారుగారి 'తప్పెవరిది'కి ఎంత ప్రాముఖ్యమున్నదో 1949 లో ముద్రితమైన ఆచార్య ఆత్రేయగారి 'యన్. జి. వో.'కు అంత ప్రాముఖ్య మున్నదని విజ్ఞుల అభిప్రాయము.

1940 తరువాత నాటకరచయితలదృష్టి రైతు-కార్మికుల సమస్యలపై మరలినది. రాజ మన్నారుగారు మధ్యతరగతి ప్రజల జీవితమును చిత్రింపగా, నార్ల వేంకటేశ్వరరావుగారు పల్లె జీవనమును, రైతు-కార్మిక సమస్యలను చిత్రింపసాగిరి. నార్లవారు కేవలము నాటికలను, ఏకాంకికలనుమాత్రమే రచించినారు. ఆదేకాలమున ప్రజానాట్యమండలి విజృంభించినది. తదాస్థాన కవు లనదగిన శ్రీయుతులు వాసిరెడ్డి-సుంకరలు చైతన్యవంతములైన నాటకములను రైతు-కార్మికసమస్యలను పురస్కరించుకొని రచించిరి (ముందడుగు, మాభూమి). ఇట్టి రూపకములను రచించినవారిలో బోయి భీమన్నగారుకూడ పేర్కొనబడవలసినవారు (పాలేరు మొ॥)

ఆంధ్రనాటకకళాపరిషత్తు పోటీలఫలముగా యువరచయిత లెందరో వెలుగులోనికి వచ్చి నారు. అట్టివారిలో ప్రథములు ఆచార్య ఆత్రేయగారే. (యన్. జి. వో; విశ్వశాంతి మొ॥). అటు పిమ్మట పేర్కొనబడవలసినవారు శ్రీయుతులు అనిసెట్టి సుబ్బారావు (గాలిమేడలు, మావూరు), పినిశెట్టి శ్రీరామమూర్తి (పల్లెపడుచు, అన్నాచెల్లెలు), బెల్లంకొండ రామదాసు (పునర్జన్మ, మాష్టర్జీ), బుచ్చిబాబు (ఆత్మవంచన, ఉత్తమయిల్లాలు), కొడాలి గోపాలరావు (కూలీ, దొంగ వీరడు), కొండముది గోపాలరాయశర్మ (ఎదురీత, ఇదీలోకం), అవసరాల సూర్యారావు (పంజరం), డి. వి. నరసరాజు (నాటకం) మొదలగువారు. వీరందరును నాటకములనేకాక నాటికలనుకూడ రచించియున్నారు. ఈ రచనలలో కొన్ని పరిషత్తుపోటీలలో 'ఉత్తమరచన'ల బహుమతులను పొందియున్నవి. ఈ నాటక-నాటికారచయితలలో ప్రత్యేకముగా పేర్కొన దగినవారు డా. కొర్రపాటి గంగాధరరావుగారు. వృత్తిచేత వైద్యులైనను నటనలో, రచనలో

అభినివేశమెక్కువ. వీరు ఔత్సాహికసమాజప్రదర్శనముల కనువుగా, స్త్రీపాత్రలు తక్కువగా లేదా అసలు లేకుండ, బహుళనాటకములను రచించియున్నారు. ఇవి అన్నియును ప్రదర్శితములు; ముద్రితములుకూడను.

నాటికా_ఏకాంకికారచయితలలో శ్రీయుతులు సోమంచి యజ్ఞన్నశాస్త్రి (పెద్దమనుషులు), పులుగుండ్ల రామకృష్ణయ్య (తుఫాను), పినిశెట్టి (ఆడది), వి.యస్. రామారావు (తారాబలం), భమిడిపాటి రాధాకృష్ణ (మనస్తత్వాలు, దంతవేదాంతం) ప్రభృతులు ప్రముఖులు; వీరి రచనలు కూడ పరిషత్తుపోటీలలో 'ఉత్తమరచన'ల బహుమతులనుపొందినవే. భమిడిపాటి రాధాకృష్ణ గారు ప్రహసనరచనలో తండ్రినిమించిన పుత్రులుకాగలరని వారి రచనలు సూచించుచున్నవి. ద్వితీయ ప్రపంచసంగ్రామానంతరము బయలుదేరిన 'శాంతి ఉద్యమము'నకు లక్ష్యములుగా కొందరు రచనలుచేసియున్నారు. అట్టివారిలో అనిసెట్టి "శాంతి", ఆత్రేయ "విశ్వశాంతి", పడాల "సందేశం", గిడుతూరి "చిరంజీవి మానవుడు" మొదలగునవి ప్రముఖరచనలు. "శాంతి" మూకనాటిక. నేపథ్యమందు పాత్రలు సంభాషణలను పఠించుచుండగా, రంగస్థలముమీద పాత్రలు మూకాభినయము చేయుచుందురు. కొందరు విచిత్రస్వాప్నికజగత్తుకు రూపకకల్పన చేసి, రచనలుచేసియుండుట పరిశీలింపవచ్చును.

ఏకాంకికారచనలో కొందరు యువకులు క్రొత్తక్రొత్త ప్రయోగములను చేయసాగిరి. హితశ్రీగారి "విచిత్రజీవులు"లో నాటకమందు నాటకము (play in a play) చిత్రితమైనది. నాగభూషణ్‌గారి "విషాదాంతం"లో నాటకమునకు, జీవితమునకు సమాంతరవ్యాఖ్యానము జరిగినది. కొండముది సోదరుల "విపర్యయం" లో జరిగెడిది నాటకమన్నవిషయము అంతమున కాని తెలియలేదు. రూపకరచనాశిల్పమున కన్పట్టెడి ఆయా ప్రయోగములను కొన్నింటిని క్రింది విధముగా శ్రీనివాస చక్రవర్తిగారు క్రోడీకరించియున్నారు. ('అభ్యుదయ'-జూలై 1955,)—

1. అంకవిభజనలేకుండా కొంతకాలం గడిచిందని సూచించటానికి ఫేడిన్, ఫేడవుట్‌వాడి, టెంపోను నిలబెట్టారు (ఈనాడు).
2. పాత్రల మానసికావస్థలను స్వగతాలతోకాకుండా, నేపథ్యగానంతో ద్యోతకమొనర్చారు (నేతబిడ్డ, గాలిమేడలు).
3. ప్రేక్షకులనుకూడా నాటకప్రదర్శనలో భాగస్వాములుచేయాలనే తలంపుతో పాత్రలను ప్రేక్షకులమధ్య కూర్చోబెట్టడం, ప్రేక్షకులతో మాట్లాడించడం (గాలిమేడలు, విశ్వశాంతి, ఎవరుదొంగ).
4. స్వాప్నికజగత్తును సినీమాలలోలాగా పాత్రల ఛాయలులేచి నడిచిపోయినట్లు ప్రదర్శించటం (గాలిమేడలు, తీరనికోరికలు).
5. నాటకంలోనే ఛాయానాటకాల ప్రదర్శన (నిజానిజాలు, భూమికోసం, ఆసామి).
6. నాటకమంతా ఒకపాత్ర, ఇంకొకపాత్రకు వర్ణించిచెప్తున్నట్లు నడిపించటం. అంక అంకానికి నేపథ్యంలో పూర్తికథను వివరించటం (సీతారామరాజు పితూరి).

చారిత్రక రూపకములు :

1897 లో రెండు ఉత్తమ స్వతంత్ర చారిత్రకరూపకములు వెలువడినవి— 1. వేదమువారి 'ప్రతాపరుద్రీయము', 2. పనప్పాకం శ్రీనివాసాచార్యులుగారి "శివాజి". మొదటిది తెలుగుదేశమునకు సంబంధించినది; రచన సంప్రదాయబద్ధమైనది. ఇంక రెండవది మహారాష్ట్ర చరిత్రకుసంబంధించినది; ఆవేశప్రధానమై, ప్రాచీన రూపకరచనా సంప్రదాయములకు కట్టుబడనిది; అయినను, కొంచెమించుమించుగా మొదటిదానితో దీటుకాగలిగిన రచనయిది. ఈనాటిదే హెచ్. కృష్ణమూర్తిగారి "పెనుగొండదుర్గము". పిమ్మట పేర్కొనదగినది 1899లో వెలుపడిన కాళ్ళకూరివారి "రంగరాయకదనసమవాకారము'. ఇది ప్రాబంధికశైలిలో రచింపబడినది; పెక్కునాటకసమాజములవారిచేత ఏడెనిమిదేండ్లపాటు పలుసార్లు విజయవంతముగా ప్రదర్శింపబడినది.

1906–1925 కాలములో సుప్రసిద్ధకవులు పలువురు చారిత్రకనాటకములను వ్రాసిరి. ఆ నాటకములన్నియును సుప్రసిద్ధములై, రంగస్థలవిజయమునుకూడ పొందినవి. ఇట్టివానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి కోలాచలమువారి 'రామరాజు చరిత్రము' (1907), శ్రీపాదవారి 'బొబ్బిలియుద్ధ నాటకము' (1910), పానుగంటివారి 'ప్రచండచాణక్యము' (1909), ఇచ్ఛాపురపువారి 'రసపుత్ర విజయము' (1910), ఉమ్రాలీషాగారి 'చంద్రగుప్త' (1910), బాలాంత్రపు వేంకటరావుగారి 'యాచశూరేంద్ర విజయము' (1910), ధర్మవరం గోపాలాచార్యులుగారి 'రామదాసు' (1920) మొదలగునవి.

తెలుగులోని చారిత్రక రూపకములందలి ఇతివృత్తములలో ఇంచుమించుగా సగపాలు ఆంధ్రదేశమునకు సంబంధించినవి. తక్కిన సగపాలును మహారాష్ట్ర, వంగదేశ, రాజపుత్రస్థానములకును, మహమ్మదీయచరిత్రలకును సంబంధించినవి. ఈ చారిత్రకనాటకములలో కొన్ని వ్యక్తిప్రధానములైనవి. మరికొన్ని కథాప్రధానములైనవి. ఇందు మరల కొన్ని అశుభాంతములు; మరికొన్ని శుభాంతములు. సురవరము ప్రతాపరెడ్డిగారి 'ఉచ్ఛలవిషాదము' (రచన 1921), దువ్వూరిరామిరెడ్డిగారి 'కుంభరాణా'(1924) మొదలగునవి విషాదాంత చారిత్రక రూపకముల కుదాహరణములు. ఉచ్ఛలవిషాదము జూలియస్ సీజరునాటకమును పోలినది; రచన జిగిగానడచినది. ప్రతాపరెడ్డిగారి యింకొక చారిత్రకరూపకము 'భక్తతుకారాం'(1923). శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు పెక్కు చారిత్రకనాటకములను వంగాదిభాషలనుండి యనువదించియున్నారు. చారిత్రకనాటకకర్తలలో గుండిమెడ వేంకటసుబ్బారావుగారుకూడ ప్రముఖముగా పేర్కొనదగినవారు. ప్రవాసాంధ్రులైన వీరు తెలుగు నాటకరంగమునకు అపూర్వమైన సేవ చేసియున్నారు.

1940–45 ప్రాంతముల కొన్ని ఉత్తమచారిత్రకనాటకములు వెలువడినవి—వీనిలో ముఖ్యముగా పేర్కొనదగినవి చెలమచర్ల రంగాచార్యులవారి 'హాలికుడు' (1940), నండూరి బంగారయ్యగారి 'ఆంధ్రతేజము' (రచన–1938), నండూరి వేంకట రామకృష్ణమాచార్యులుగారి "ఛత్రపతి శివాజీ – ధర్మచక్రములు', డి. వి. కృష్ణమూర్తిగారి 'విషాదతిమ్మరుసు' (1946),

భమిడి సత్యనారాయణశర్మగారి 'దారాషుకో', వావిలాల సోమయాజులుగారి 'నాయకురాలు' (1946) మొదలగునవి. ఇవియన్నియును రంగస్థలమునకూడ విజయవంతములైన రచనలే. ఈమధ్య వెలువడినవానిలో ముఖ్యమైనవి మాడభూషి వేంకటాచార్యులవారి "ప్రభ" (1956), ఆచార్య ఆత్రేయగారి "అశోకసామ్రాట్" (1957), వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు గారి "నరసన్నభట్టు" (1957) మొదలగునవి. లక్ష్మీనరసింహారావుగారు ప్రసిద్ధనటులేకాక అంతకుముందే "అనార్కలీ" ప్రభృతి ప్రసిద్ధనాటకకర్తలుకూడను.

పౌరాణికనాటకములందువలెనే చారిత్రకనాటకములందును భాష ఉదాత్తముగానుండుట ఆవశ్యకము. సాంఘికవాతావరణము, ఆధునికరాజకీయవాతావరణము చిత్రితమైన నాటకముల విషయమెట్లున్నను ఉదాత్తనాయకములైన చారిత్రకనాటకముల విషయమునమాత్రము ఈ నియమమును పాటించుట సమంజసము.

## ప్రచార రూపకములు :

రూపకములు అంతయో ఇంతయో ప్రచారసాధనముగా చేయబడుటకు పునాదివేసిన వారు కందుకూరివారే; వారిలో సంఘసంస్కరణాభిలాష యత్యధికమగుటచేత ప్రహ్లాదుని సంరక్షింపవచ్చిన నృసింహమూర్తిచేత "పరిశుద్ధమతము"నుగూర్చి ఉపన్యాసమిప్పించినారు. గురజాడవారు విజయనగరం మహారాజావారి యుద్యమమునకు లక్ష్యముగా "కన్యాశుల్కము"ను రచించి, తద్దురాచారనిర్మూలనమునకు తోడ్పడినారు. 1890 తరువాతనే ఉద్యమముల ప్రచారార్థము నాటకములు బయలుదేరినవి; 'కన్యాశుల్కము', 'మనోరమ', 'సాగరిక' ప్రభృతులు ఇట్టివే.

ఇంచుమించుగా ప్రతిరూపకమునందును వాచ్యముగానో, గర్భితముగానో ఏదియో యొక సందేశము కన్పట్టుచునే యుండును; ఆ దృష్టితోచూచినచో ఆయా రూపకము లాయా సందేశముల ప్రచారమున కుద్దేశింపబడినవని తోపగలదు. కాని, అంతమాత్రమున అవి ప్రచార నాటకములు కాజాలవు. ప్రచారనాటక మనుదానిలో తత్కాలసమస్యయొకటి ప్రాధాన్యమును వహించును. ఆ సమస్య తీరిపోగానే ఆ నాటకప్రసిద్ధియును అడగిపోవును, కాని, కవి ఆ సమస్యకు సార్వకాలికత్వమును, సార్వజనీనత్వమును ఆపాదింపగలిగినప్పుడుమాత్రము అది చిరకాలము నిలువగలదు; అనగా అందు ప్రచారగుణము అల్పముగానే యుండునని తెలియవలెను. ప్రచారనాటకములలో ముఖ్యముగా పేర్కొనదగినవి దేశభక్తినాటకములు, కేవలరాజకీయప్రచారనాటకములు, మతసిద్ధాంతబోధలకు సంబంధించిన నాటకములు మొదలగునవి.

స్వాతంత్ర్యోద్యమము కారణముగా సమకాలిక వృత్తములే నాటకీకరింపబడుట పరిశీలింప వచ్చును—దామరాజువారి నాటకములు, శ్రీపాదవారినాటకములు, జంధ్యాలవారి 'ఆలీప్రభృతుల నిర్బంధము', గ్రంధి వెంకటసుబ్బరాయగుప్తగారి "ఆంధ్రమాత" (1921) మొదలగునవి ఇందులకుదాహరణములు. ఒకప్రక్క దేశీయనాయకులనుగూర్చి నాటకములు వెలువడు-

చుండగా ఇంకొకప్రక్క ఎడ్వర్డు, జార్జి పట్టాభిషేకాదినాటకములుకూడ వెలువడుట పరిశీలింప వచ్చును. బ్రహ్మంగారి నాటకములు, క్రీస్తునాటకములు మొదలగునవి మతసిద్ధాంతబోధలకు సంబంధించినవి.

కొందరు కేవలము రాజకీయసిద్ధాంతప్రచారార్థమే నాటకములను రచించియున్నారు. కాంగ్రెసు-కమ్యూనిష్టు సిద్ధాంతాదులకు అనుగుణముగా, వ్యతిరేకముగా వ్రాయబడిన నాటకము లిందులకుదాహరణములు. కమ్యూనిస్టుసిద్ధాంతములకు వ్యతిరేకముగా వ్రాయబడినవానిలో యడ్లపల్లి కోటయ్యగారి "కామ్రేడ్ వెంగమ్మ" (1942) ప్రసిద్ధికెక్కినది; ఇది రంగస్థలమున కూడ విజయమందిన నాటకము.

మనస్తత్త్వనిరూపణ రూపకములు :

సాధారణముగా నాటకరచనయందు, క్రిందివానిలో ఏదోయొకటి ప్రాధాన్యమును వహించుచుండును—1. కొన్ని కథాప్రధానములు; 2. కొన్ని సాహిత్యప్రధానములు; 3. కొన్ని సమస్యాప్రధానములు; 4. కొన్ని పాత్రప్రధానములు; 5. కొన్ని మనస్తత్త్వ నిరూపకములు (ఒక్కొక్కనాటకములో ఒక్కొక్కరీతి ప్రధానమైనను, తక్కినవానిలో మరికొన్ని అంగములుగాకూడ నుండవచ్చును). పౌరాణిక-చారిత్రక నాటకములలో ఎక్కువభాగము కథా ప్రధానములుగా నుండును, విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతుల రూపకములు సాహిత్య గౌరవముకలవి. సమస్యాప్రధానరూపకములకు రాజమన్నారుగారు ప్రతినిధి. 'నర్తనశాల', 'కుంభరాణా' ప్రభృతినాటకములు పాత్రప్రధానములు.

కేవల మనస్తత్త్వనిరూపక రూపకములు తెలుగులో అంతగా కన్పట్టవు. ఆయా కాలములందు అచ్చటచ్చట ఇట్టిప్రయత్నములు కన్పట్టగలవు. సంతానభాగ్యమునకు నోచుకొనని ఒకస్త్రీ, భర్తను ద్వితీయవివాహము చేసికొమ్మనివేధించి, స్వయముగా తానే ఆ శుభకార్యమును నిర్వర్తించి, పిమ్మట తనభర్త తనచేతులనుండి జారిపోయెనని కలవరపడి, సవతిజీవితమును దుఃఖభాజనముకావించి, చివరకు తమ ముప్వురి మరణమునకు హేతువైన ఒకస్త్రీ సమస్తత్త్వ మును పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు 'సరోజిని' (1930) అనెడి నాటకములో నిపుణముగా చిత్రించియున్నారు. బహుశః తెలుగులోని ప్రథమ మనస్తత్త్వనిరూపణ రూపకమిదియే కావచ్చును. రాజమన్నారుగారి నాటకములలోకూడ ఈగుణము కొంత కానవచ్చును.

కాళ్ళకూరి గోపాలరావుగారి 'వాల్మీకి' (1932) ఈజాతినాటకములలో ముఖ్యముగా పేర్కొనదగినరచన. 'మనఃపరిణామనిరూపకమగు అభినవరూపకము'గా ఇది పేర్కొనబడినది. తస్కరనాయకుడు తాపసకవీంద్రుడగుట యిందు చిత్రితము.

నాటికలలో చలంగారి 'భానుమతి' ఉత్తమమైన మనస్తత్త్వనిరూపకరచన. ఇంక నాటకములలో బుచ్చిబాబుగారి 'ఆత్మవంచన' (1951) ఉత్తమమైన మనస్తత్త్వనిరూపక రూపకము. ఇందుకూడ స్త్రీహృదయమే చిత్రితమైనది. బహుశః ఈజాతిరూపకములకు విచిత్ర ప్రవృత్తులకాకరమైన స్త్రీహృదయమే సహజాలంబనము అనుకొందును.

## విషాద రూపకములు

1875 లోనే 'జూలియస్ సీజరు'ను ఆంధ్రీకరించుటతో వావిలాలవారు ప్రప్రథమముగా విషాదరూపకరచనను తెలుగులో ప్రవేశపెట్టినను దానినెవ్వరును పట్టించుకొన్నట్లు కన్పట్టదు. కాని, 1889 లో ధర్మవరమువారి 'విషాద సారంగధర' వెలువడుటతో దేశమున ఒకపెద్ద సంచలనము బయలుదేరినది. "విషాదరూపకము ఆమోదయోగ్యమా? మరణమును, అసలు, నాటకమందు వర్ణింపవచ్చునా? రంగస్థలమందు చూపవచ్చునా? మనపూర్వులేల విషాదరూపకములను రచింపలేదు?" అనెడి ప్రశ్నలుత్పన్నములైనవి. చివరి మూడింటికిని సమాధానముల నూహించినచో మొదటిప్రశ్నకు సమాధానము సులువుగా చెప్పవచ్చును.

సుఖ-దుఃఖములు లోకసహజములు. కాగా, లోకావస్థానుకరణమగు నాట్యమందును సుఖముతోబాటు దుఃఖమును చిత్రితమగుటకు సర్వవిధముల అవకాశముకలదు; కాని ఏతచ్చిత్రణమందు మనపూర్వులు కొన్ని విధి-నిషేధములను పాటించియున్నారు. ఉపనాయక-ప్రతినాయకుల విషయములలో మరణవర్ణనను భరతాదులంద రంగీకరించియున్నారు; రంగమునందు ప్రదర్శించుటకుమాత్రమే వారంగీకరింపలేదు. అనగా, మరణమును ప్రవేశకాదులందు సూచింపవలయునేకాని ప్రత్యక్షముగా రంగమునందు ప్రదర్శింపరాదు. కారణము, మరణప్రదర్శనము జుగుప్సావహమును, ప్రయోగసౌలభ్యహీనమును అగుటయే. ఇంక, అభ్యుదయమును పొందవలసిన నాయకుని మరణమునుమాత్రము ఆలంకారికులందరును ఏకకంఠముగ నిషేధించియున్నారు; అయినను వెంటనే మరల బ్రతుకుట కవకాశమున్నచో నాయకమరణ 'వర్ణన'చేయవచ్చునని అభినవగుప్తపాదులు ఈ నిషేధమునకుకూడ నపవాదమునంగీకరించి యుండుట స్మరింపదగినది; నాగానందమందలి జీమూతవాహనుని మరణవర్ణన మిట్టిది.

కాగా, భారతీయాలంకారికులు మరణమును నిషేధింపలేదనియు; ప్రదర్శనసౌలభ్యము నభిలషించి రంగస్థలమునందు ప్రత్యక్షప్రదర్శనమువిషయమున నిరాదరణమును చూపిరనియు, 'ధర్మమునకు జయముకలుగుట' అనునదియే ఆదర్శము కావలెననెడి దృష్టితో నాయకమరణమును నిషేధించిరనియు తెలియవలెను.[1] మానవుడెన్నికష్టముల ననుభవించినను చివరకు సుఖమునుపొందుట న్యాయ్యమనియు, దుష్టశిక్షణము, శిష్టరక్షణముకర్తవ్యములనియు, నాటకాదుల ప్రదర్శనములవలన మానవునిలో నిరాశ జనింపరాదనియు భారతీయుల మతము. గ్రామ్యధర్మప్రవృత్తియందున్న ప్రజలను ధర్మమార్గప్రవృత్తులనుచేయుటకే నాట్యము సృష్టింపబడినదని నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమందు స్పష్టముచేయబడుట స్మరణీయము. కావున, కావ్యమందుకాని, నాటకమందుకాని ధర్మపరాజయమును, నిరాశనుచూపించుటకు మనవారు పూనుకొనలేదు. అందుచేతనే భారతదేశమున, పూర్వకాలమున, విషాదాంతరూపకరచనకు తావులేకపోయినది. సహృదయుడు నాయకునితో తాదాత్మ్యము పొందగలిగినప్పుడే వానికి రసానుభూతి కలుగును. అట్లు తాదాత్మ్యము కలుగవలయునన్నచో నాయకుడు విధిగా ధీరుడును, ఉత్తముడును (ideal person) కావలయును. నాటక-ప్రకరణములందలి నాయకు లట్టివారుగానుందురు; అందుచేతనే అవి ఉత్తమరూపకములైనవి.[2]

గ్రీకులదృక్పథము భారతీయులదృక్పథమునకు భిన్నమైనది. అసహనము, ద్వేషము, అన్యాయాచరణము, హింసమొదలగు దుష్టశక్తుల విజృంభణమువలన మానవునిజీవితము నిరాశామయమును, దుఃఖభాజనమును అగుచున్నదనియు, అంతియేకాదు, శాంతిసౌఖ్యము లనుభవించుచున్న మానవులయెడ దేవతలు అసహనమును, విరోధమును ప్రదర్శించి, వారిని దుఃఖభాజనులను చేయుచుందురనియు గ్రీకులనమ్మిక. అందుచేత ఆచ్చటి రచయితలు మానవజీవితమును యథాతథముగానే నిరూపించుటకు పూనుకొనినారు. అయినను మృత్యుముఖమునందుకూడ మానవజీవితమునందలి ఉదాత్తతను ప్రదర్శించుటకు ప్రయత్నించుటయే ఆ రచయితలయందలి విశిష్టత; ఈగుణము కలిమివలననే విషాదరూపకనిర్మాణము ఉత్తమకళ కాగలిగినది. ఇంక షేక్స్పియరు నాటకనాయకులు గ్రీకునాయకులవలెనే ఉదాత్తులేఅయినను వారిలోగల ఏదోయొక విలక్షణమైనలోపమువలన సంకటపరిస్థితులలోపడి, తమకుముప్పుతెచ్చుకొని తాము నశించుటయే కాక సద్ధర్మల నాశనమునకుకూడ కారకులగుదురు.[3] ఈ చివరిఘట్టమున నాయకచరిత్రము మిక్కిలిశోచనీయమై, ఎంతవాని కెంతగతి పట్టినదని లోకముచూపు సానుభూతికి[4] పాత్రమగును. కాగా, ప్రళయకాల మహాభూతవిజృంభణమువంటి నాయకుని మానసికసంక్షోభమును, రాలనైన ద్రవింపజేయగల వాని శోచనీయావస్థయును విషాదనాటకమున ప్రధానములగుచున్నవి. ఇట్టి విషాదరూపకములే అరిస్టాటిల్‌చెప్పిన భావక్షాళనము (catharsis of emotions) నకు సమర్థములు కాగలవు. ఈ విషాదపరిణామమున కున్ముఖముగానే ఆద్యంతమును కథానిర్మాణము, భాషాప్రయోగాదులు జరుగును.

నాయకమరణముచేతనే ఒకరూపకము 'విషాదరూపక'మగునా? అనెడి విషయమును కూడ పరిశీలింపవలసియున్నది. 'ట్రాజెడీ'అను పదమునకు విషాదము లేక విషాదాంతత్వము అనెడి అర్థములు లేకపోయినను గ్రీకువిషాదరూపకకర్తలగు ముప్వురినాటకములును నాయకమరణములతోనే అంతములగుచున్నవి; దీనిపై 'అరిస్టాటిల్' ఆమోదముద్రవైచెను. దానినే ప్రమాణముగా ఆలంకారికులును, తక్కినకవులును గ్రహించియున్నారు. మనవారు భారత-భాగవత-రామాయణాదులనుండి రూపకకథల నెన్నుకొనియున్నట్లే, ఆ గ్రీకు రూపకకర్తలును తమతమ రూపకములకు కథలను గ్రీకుపురాణములనుండియే యెన్నుకొనిరి. మనకథలన్నియును శుభాంతములుగానేయుండును. కాని, తాత్త్వికదృష్టియందుగల భేదమునుబట్టి గ్రీకుపురాణగాథలు సాధారణముగా అశుభాంతములుగానే యుండును. ఈ కథలయందలి భేదములనుబట్టియే రూపకనిర్మాణమందును, అంతమందును భేదములు వచ్చినవనుట నిస్సంశయము. కథానిర్వహణ మెట్లున్నను అంతమునమాత్రము మరణమున్నచో అది 'విషాదరూపక' మగుననియు, శుభమున్నచో అది 'ఆహ్లాదరూపక'మగుననియు తలంచుటకూడ సమంజసముకాదు. ఏ రూపకమందైనను—అది పాశ్చాత్యముగాని, లేదా భారతీయముగాని—కథానిర్వహణమే ప్రధానము. హామ్లెట్ నాటకాంతమున హామ్లెట్, ఒఫీలియాలు బ్రతికి, వివాహమాడి, సుఖముగా రాజ్యము చేసినట్లు మార్చినంతమాత్రమున అది ఉత్తమ ఆహ్లాదరూపకము కాజాలదు. అట్టి కృత్రిమమైన అంతమునకు తన్నిర్వహణశిల్పము వ్యతిరేకమైనిల్చును. అట్లే, ఉత్తరరామచరితలో సీతారాములను అంతమున చంపివేసినంతమాత్రమున అది ఉత్తమవిషాదరూపకము కాజాలదు.

అప్పుడుకూడ జీమూతవాహనునివలె శ్రీరాముడును లోకరంజనార్థము స్వార్థత్యాగమొనర్చిన మహాపురుషుడే యగునుగాని, స్వీయాపరాధముకారణముగా ఆత్మనాశనమునకు గొయ్యిత్రవ్వుకొన్న విషాదనాయకుడు కాజాలడు. కాగా, విషాదరూపకములను రచించుటకుతగినట్టి కథలనే మనవారు స్వీకరింపలేదనుట సారాంశము.

తెలుగులో విషాదరూపకరచన కారంభముచేసిన ధర్మవరంవారు విషాదరూపక ఫలములలో నీతిబోధనుకూడ పేర్కొనియున్నారు. దానిని కొందరంగీకరింపకపోయినను అటుపిమ్మటమాత్రము తెలుగులో ఉత్తమవిషాదరూపకములు మరికొన్ని బయలుదేరినవి.

ఆధునికకాలమున విషాదరూపకరచనలో కొన్ని మార్పులు వచ్చినవి—ఉత్తములే నాయకులుగా నుండవలెననెడు నియమము సడలినది. రూపకములు కేవలము గద్యరూపముననే వెలువడినవి. నాయికా-నాయకులు సామాన్యులు. ఇంక సన్నివేశములు సర్వసాధారణములు. అయినను నిర్వహణశిల్పబలమున అవికూడ తరతమ భేదములతో భావక్షాళనము సాధించుచునే యున్నవి. తెలుగులోని తొలిస్వతంత్రవిషాదరూపకమగు "విషాదసారంగధర"లో నాయకుడు చక్రవర్తి; కాని, అటుపిమ్మట పేర్కొనదగిన వారి రెండవవిషాదరూపకము "అజామిళ"లో విషాదనాయకుడు రాజు కాదు. తెలుగులో ఆకాలమున విషాదరూపకముల నధికముగావ్రాసిన వారుపానుగంటివారు: వారి 'రాతిస్తంభము'లో నాయకుడు సామాన్యుడు.

చారిత్రకనాటకములలో కొన్ని ఉత్తమవిషాదరూపకములు కలవు. వానిలో దువ్వూరి వారి 'కుంభరాణా', వేలూరి శివరామశాస్త్రిగారి 'మాధవవర్మ', నోరి నరసింహశాస్త్రిగారి 'సోమనాథవిజయము', విశ్వనాథవారి 'అనార్కలి' మొదలగునవి ముఖ్యముగా పేర్కొనదగినవి. పౌరాణికనాటకములలో విశ్వనాథవారి 'నర్తనశాల' ఉత్తమమైన విషాదరూపకము. ఈ రచయితలు నలుగురును ప్రాచీనసంప్రదాయపరులైనప్పటికిని, వారి కలములనుండి ఉత్తమ విషాదరూపకములు, షేక్స్పియరుపద్ధతిలో, వెలువడినవి.

ఆధునికకాలమున, అనేకములగు విషాదరూపకములు వెలువడుచున్నవి. గ్రహింపబడెడి ఇతివృత్తములు సామాన్యములగుటచేత నాయకులును సామాన్యులే అగుచున్నారు. ఇంచుమించుగా ఇంతవరకును పేర్కొనబడిన సమకాలీన రచయితలందరును ఒకటియో, అంతకు మించియో సాంఘికవిషాదరూపకములను రచించియేయున్నారు. అన్నింటను బుచ్చిబాబుగారి 'ఆత్మవంచన' తప్పక పేర్కొనదగిన రచన. కాని, ఇవియన్నియును షేక్స్పియరు విషాద రూపకములదృష్టిలో నిజముగా 'విషాదరూపకములు' అనిపించుకొనవు. ఆ విషాదరూపకములందు నాయకుని సరిదిద్దుకొనజాలని లోపమును (tragic flaw), తత్ఫలమును ప్రధానములు. కాని ఈ సాంఘికవిషాదరూపకములందు ఏదేని సమస్యయో, సంఘర్షణమో ప్రధానమగును; తక్కినవానికి ప్రాధాన్యములేదు. ఇట్టివానిని ఆంగ్లమున 'Serious plays'అందురు. కోలాచలం శ్రీనివాసరావుగారు 'ట్రాజెడీ' అను పదమును 'గంభీరరూపకము' అని అనువదించియున్నారు; ఆపదము ఇట్టిరూపకములపట్ల సార్థకమని చెప్పవచ్చును.

## ప్రహసనములు

భరతుడు ప్రహసనమును క్రిందివిధముగా నిర్వచించెను—"ప్రహసనములు రెండు విధములు—శుద్ధము, సంకీర్ణము. భగవత్—తాపస—విప్ర—శాక్యాదులనుగూర్చిన హాస్యవాదములతో కూడినదియును, కుత్సితపురుషులతో నిండినదియును, పరిహాసభాషణములతో నిండినదియును, వారి భాషా—ఆచారములను యథాతథముగా ప్రదర్శించునదియును, విశిష్టభావ ద్యోతకములగు కథాఖండములను, నియతగతికల ఇతివృత్తము (ఒకేఒకని చరిత్ర)ను కలదియును 'శుద్ధ ప్రహసన' మనబడును. అనిభృతములైన వేష—పరిచ్ఛద—చేష్టితములుకల వేశ్యా—చేట—నపుంసక—విట—ధూర్త—బంధకీసంకులమగునది 'సంకీర్ణప్రహసన' మనబడును. లోకవ్యవహారసిద్ధమగు వార్తయును, దంభమును, ధూర్తుల (దొంగతాపసులు, విటుల) ప్రవివాదములును ప్రహసనము లందుండవలెను. మరియు, అవసరమునుబట్టి ఇందు వీథ్యంగములను కూర్పవలెను" (నా. శా. పుట 527). దీనిపై అభినవగుప్తుని వ్యాఖ్య క్రిందివిధముగా నున్నది—"ప్రహసనీయమైనది, అనగా పరిహాసప్రధానములైన అభాషణము లధికముగాకలది, ప్రహసన మనబడును. ప్రహసనమందు అంకసంఖ్య నిర్దేశింపబడలేదు. శుద్ధప్రహసనము ఏకాంకమనియు, వేశ్యాదిచరిత సంఖ్యాబలముచేత సంకీర్ణప్రహసన మనేకాంకమనియు కొందరందురు. కాని ఇది ఏకాంక రూపకములమధ్య పఠింపబడుటచేత ఇదియును ఏకాంకమే అని మరికొందరందురు. ఉత్సృష్టికాంక—ప్రహసన—భాణములు, కరుణ—హాస్య—విస్మయ ప్రధానములై రంజకరస ప్రధానములగుచున్నవి. అందువలననే వీనియందు స్త్రీ—బాల—మూర్ఖాదు లధికారులుగానున్నారు. వీనియందితివృత్తము విస్తృతముగానుండదు; అంతియేకాదు, ఇతివృత్తవైచిత్ర్యముకూడ నుండదు" (అభినవభారతి—2వ సం. పుటలు 449—51).

ప్రహసనమనగా కవికల్పితమైన అనుదాత్తచరితమనియు, అందు ఒకటికాని రెండుకాని అంకములుండవచ్చుననియు, అందు హాస్యము ప్రధానరసమనియు అర్వాచీనాలంకారికు లందరును అంగీకరించియున్నారు. పాశ్చాత్యుల 'ఫార్సు'లక్షణములును, భారతీయుల ప్రహసన లక్షణములును ఇంచుమించుగాసరిపోవును.[1] కాగా, ప్రాచ్య—పాశ్చాత్యుల మతములలో ప్రహసనమందు సాహిత్యపువిలువ తక్కువ. అదిముఖ్యముగా వినోదప్రధానము; అందు విరుద్ధభావముల, విరుద్ధసన్నివేశముల కూర్పుచేత హాస్యము జనించుచుండును. ఇందు ప్రధానముగా కుత్సితులు, కృత్రిమ—దాంభికజీవనులు, తెలిసినమూఢులు హాస్యభాజను లగుచుందురు; వారు అట్లు పరిహసింపబడుటలో తక్కినవారికి ఒక హెచ్చరిక అంతర్లీనమై యుండును.

వావివరుసలకు సంబంధించిన పరిహాసములెట్లున్నను కుత్సితులను, దాంభికులను, మూఢులను పరిహసించుటయన్నది మానవుడు నాగరకుడైనప్పటినుండియు నున్నదే. అది కవి కలములో నొదిగి దృశ్యరూపమునుతాల్చుటతో 'ప్రహసన'మనబడెను. రూపకము లన్నింటను—ప్రకరణముకంటెకూడ—ప్రహసనమే ప్రజల జీవితమునకు అత్యంతమును సన్నిహితమైనది; వారి భాషా—ఆచార—వ్యవహారములు ఇందొక్కచోటనే యథార్థములుగా చిత్రితములగును.

ప్రాచీనములైన సంస్కృతప్రహసనములు రెండుమాత్రమే మనకింతవరకును లభ్యములైనవి—బోధాయనుని 'భగవదజ్జుకము', మహేంద్రవిక్రమవర్మ 'మత్తవిలాసము'.[2] బౌద్ధ-కాపాలిక-పాశుపతమతములవారి యసభ్యవర్తనము లీరెండింటియందును చిత్రితములైనవి. (ఈరెండింటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెనిగించియున్నారు). భగవదజ్జుకమునందు బౌద్ధ పరివ్రాజకుడొకడు ఉసురుడిగిన వేశ్యాశరీరమునందు ప్రవేశించి కొంత వింతనడపుచుండగా యమపురుషుడు తిరిగివచ్చి, వేశ్యాప్రాణమును పరివ్రాజకుని శరీరములో ప్రవేశపెట్టును. ఈ సందర్భమున కవి కడునేర్పుచూపినాడు. వీనికి శాస్త్రిగారి అనువాదములుకూడ చక్కగానున్నవి.

ప్రహసనమందు హాస్యము ప్రధానమని గుర్తించియున్నాము. విపరీతాలంకారము, వికృతాచార-అభిదాన-వేషములు, అంగవికారములు మొదలగువానివలన జనులకు నవ్వు పుట్టించునది 'హాస్య'మనబడునని భరతుడు పేర్కొనెను.[3] సహజత్వమునకు భిన్నమైనవికారము కాని, వైపరీత్యముకాని నవ్వునుపుట్టించుట అందరకును అనుభవములోనివిషయమే. ఈ కలిగెడి నవ్వు మనస్సునకు 'వికాసము'ను కలిగించునది కావలయునని జగన్నాథుడు స్పష్టముచేసియుండుట గమనార్హము – 'వాగంగవికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః'. నాట్యశాస్త్రాదులందు హాస్యాభినయవిధానముమాత్రమే అధికముగా వర్ణితమైనది. అందుచేత హాస్యవిషయమున, ఆధునికులుచేసెడి సూక్ష్మపరిశీలనాదులు మన ప్రాచీనగ్రంథములందు కన్పట్టవు. ఇప్పుడు తెలుగులో ముట్నూరి సంగమేశంగారి 'తెనుగు హాస్యము'వంటి గ్రంథములు బయలుదేరుచున్నవి. మునిమాణిక్యం నరసింహారావుగారు హాస్యవిషయమున సూక్ష్మమగు పరిశోధనచేసి, విశిష్టవిషయములు వెల్లడించుచున్నారు.

ఇంక రచనయందు హాస్యమునుకూర్చెడి పద్ధతిని పరిశీలింపవలసియున్నది. ఇది ముల్విధములు—1. పాత్రగతము, 2. వాక్యగతము, 3. సన్నివేశగతము. ఇవి ఉత్తరోత్తర గుణాధికములన్నను సమంజసమే కాగలదు. పాత్రగతహాస్యమునకు మృచ్ఛకటికలోని 'శకారుడు', సంస్కృత - పాశ్చాత్యరూపకములందలి 'విదూషకుడు', కంఠాభరణములోని 'సుబ్బిసెట్టి' మొదలగువారుదాహరణములు (వీరియందలి వాక్-అంగ-చేష్టాదివికారములవలన హాస్యము జనించుచుండును). వాక్యగతమైనహాస్యము పలువిధములుగానుండును. కన్యాశుల్కమునందువలె ఆంగ్లాంధ్రపదమిశ్రమప్రయోగముచేతను, కఠాభరణమునందువలె అపశబ్దప్రయోగములచేతను హాస్యముజనించుట యొకరకము; ఇది శబ్దాశ్రయమైన హాస్యము (శ్లేషాదులవలన జనించు హాస్యముకూడ ఇట్టిదే). ఇంక అర్థాశ్రయమైనహాస్యము, హఠాజ్జనితమైన ఒక ఊహపై ఆధారపడి, ప్రధానముగా రెండువిధములగును —సరసోక్తి, నర్మోక్తి (ఛలోక్త్యాదులు నర్మోక్తిభేదములే). ఎవరినుద్దేశించిపలుకబడినదో వారినికూడ 'కులాసాగా' నవ్వింపగల్గునది 'సరసోక్తి' యనబడును; ఇందు ప్రసాదగుణమధికము. ఇంక నర్మోక్తి పలువిధములు—పైకి నవ్వులాటగానే కన్పించునుకాని, అందు అనావిష్కృతమైన సత్యము గర్భీకృతమైయుండును; ఒక్కొక్కప్పుడు గుండెను దూసికొనిపోయెడి వ్యంగ్యముండును; మరియొకప్పుడు చెంపపెట్టుగానై కండ్లనీరు తెప్పింపవచ్చును. భరతుడు నర్మమున మూడు ప్రధానభేదములను

పేర్కొనుట స్మరింపదగును—"ఈర్ష్యనుకాని, క్రోధమునుకాని సూచించునది; పరులను ఉపాలంభించుటతో కూడినది; వంచనాపూర్వకముగా పరులహృదయమును గ్రహించుటకు ప్రయుక్తమైనది" (నా.శా. పుట 617). పైనపేర్కొన్న భగవదజ్జుకప్రహసన సన్నివేశమువంటి కల్పనలు సన్నివేశగతహాస్యమున కుదాహరణములు.

తెలుగులో ప్రహసనరచన కాద్యులు కందుకూరివారు. వారు బ్రాహ్మవివాహాది పెద్ద ప్రహసనములనేకాక పెక్కు చిన్నచిన్న ప్రహసనములనుకూడ రచించియున్నారు; కొన్నిటికి సూత్రప్రాయముగా ఆంగ్లమాతృకలుకూడ కలవు. పంతులుగారి ననుసరించి చిలకమర్తివారు కూడ చాల ప్రహసనములను రచించియున్నారు. కాని, ఈ యిరువురి రచనలయందును కొన్ని లోపములున్నవి — హాస్యముకంటె వ్యంగ్యమధికము; పాత్రలు సార్వజనీనములుకావు (ఎవరినోదృష్టియందుపెట్టుకొని వ్రాసినట్లు కన్పట్టుచుండును). వచనరచనలో జిగిబిగువులులేవు; కేవలము సంఘదురాచారములను దూషించునుద్దేశముతో సంవాదాత్మకముగా రచింపబడిన వగుటచేత రూపకమున కావశ్యకమైన ఇతివృత్త సంగ్రథనముకాని, పాత్రపోషణముకాని కన్పట్టదు; కాగా, వీనిలో నిర్మాణశిల్పము కొరవడినది. ఈ ఇరువురిలోను చిలకమర్తివారి రచనలలో కొంత చమత్కారమధికము. బళ్ళారికవిద్వయముకూడ రెండుమూడేసి ప్రహసనములను రచించియున్నారు. శ్రీయుతులు మంత్రిప్రగడ భుజంగరావు, సెట్టి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కాళ్ళకూరి నారాయణరావు ప్రభృతులుకూడ చాల ప్రహసనములను రచించియున్నారు; కాని, అవియెల్ల తత్కాల సామాన్యవిషయములతోకూడినవై సంస్కారదృష్టితో'నో లేదా కేవలపరిహాసదృష్టితోనో రచింపబడిన వగుటచేత వానియందు కళాసంపద అంతగాకన్పట్టదు. ఇట్టివే 'లొడారి బుచ్చిగాడు', 'తవిటిరొట్టె' మున్నగు రచనలు.

కాని, తెలుగులో ఉత్తమప్రహసనములుకొన్ని లేకపోలేదు; అట్టివానిలో పానుగంటివారి "కంఠాభరణము" (1917) అగ్రస్థానమును వహించును. ఈ రచనకుముందే మోలియర్ ప్రహసనములు రెండు తెలుగులోకి అనూదితములైనవి — 'విధిలేకవైద్యుడు' (1912), 'లుబ్ధాగ్రేసర చక్రవర్తి' (1914). మొదటిది నెల్లూరుమాండలికములో వెలువడగా, రెండవది విశాఖమాండలికములో వెలువడినది. ఈ అల్పారంభము గోదావరిమాండలికములో భమిడిపాటివారి కలములో పరాకాష్ఠకువెళ్ళినది. వీరందరును తమ అనువాదములకు దేశీయతాముద్ర వేసియున్నారు. భమిడిపాటివారు మోలియర్ రచనలను అనువదించుటయేకాక, వానితోసమానములైన పెక్కుస్వతంత్ర ప్రహసనములనుకూడ రచించియున్నారు. తెలుగుసాహిత్యమున, ప్రహసనమునకు, స్వతంత్రస్థాయిని కల్పించినకీర్తి భమిడిపాటివారికే చెందును. ఈ సందర్భమున విశ్వనాథ కవిరాజుగారి రచనలుకూడ స్మరణీయములు. శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు భారతీయభాషలనుండి కొన్ని ప్రహసనముల ననువదించియున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంస్కృతమునుండి భగవదజ్జువము (1924), మత్తవిలాసము (1935) అను ప్రహసనములను ఆంధ్రీకరించియుండుట పేర్కొనియున్నాను.

పేర్కొనుట స్మరింపదగును—"ఈర్ష్యనుకాని, క్రోధమునుకాని సూచించునది; పరులను ఉపాలంభించుటతో కూడినది; వంచనాపూర్వకముగా పరులహృదయమును గ్రహించుటకు ప్రయుక్తమైనది" (నా.శా. పుట 617). పైనపేర్కొన్న భగవదజ్జుకప్రహసన సన్నివేశమువంటి కల్పనలు సన్నివేశగతహాస్యమున కుదాహరణములు.

తెలుగులో ప్రహసనరచన కాద్యులు కందుకూరివారు. వారు బ్రాహ్మవివాహాది పెద్ద ప్రహసనములనేకాక పెక్కు చిన్నచిన్న ప్రహసనములనుకూడ రచించియున్నారు; కొన్నిటికి సూత్రప్రాయముగా ఆంగ్లమాతృకలుకూడ కలవు. పంతులుగారి ననుసరించి చిలకమర్తివారు కూడ చాల ప్రహసనములను రచించియున్నారు. కాని, ఈ యిరువురి రచనలయందును కొన్ని లోపములున్నవి — హాస్యముకంటె వ్యంగ్యమధికము; పాత్రలు సార్వజనీనములుకావు (ఎవరినోదృష్టియందుపెట్టుకొని వ్రాసినట్లు కన్పట్టుచుండును). వచనరచనలో జిగిబిగువులులేవు; కేవలము సంఘదురాచారములను దూషించునుద్దేశముతో సంవాదాత్మకముగా రచింపబడిన వగుటచేత రూపకమున కావశ్యకమైన ఇతివృత్త సంగ్రథనముకాని, పాత్రపోషణముకాని కన్పట్టదు; కాగా, వీనిలో నిర్మాణశిల్పము కొరవడినది. ఈ ఇరువురిలోను చిలకమర్తివారి రచనలలో కొంత చమత్కారమధికము. బళ్ళారికవిద్వయముకూడ రెండుమూడేసి ప్రహసనములను రచించియున్నారు. శ్రీయుతులు మంత్రిప్రగడ భుజంగరావు, సెట్టి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కాళ్ళకూరి నారాయణరావు ప్రభృతులుకూడ చాల ప్రహసనములను రచించియున్నారు; కాని, అవియెల్ల తత్కాల సామాన్యవిషయములతోకూడినవై సంస్కారదృష్టితోనో లేదా కేవలపరిహాసదృష్టితోనో రచింపబడిన వగుటచేత వానియందు కళాసంపద అంతగాకన్పట్టదు. ఇట్టివే 'లొడారి బుచ్చిగాడు', 'తవిటిరొట్టె' మున్నగు రచనలు.

కాని, తెలుగులో ఉత్తమప్రహసనములుకొన్ని లేకపోలేదు; అట్టివానిలో పానుగంటివారి "కంఠాభరణము" (1917) అగ్రస్థానమును వహించును. ఈ రచనకుముందే మోలియర్ ప్రహసనములు రెండు తెలుగులోకి అనూదితములైనవి — 'విధిలేకవైద్యుడు' (1912), 'లుబ్ధాగ్రేసర చక్రవర్తి' (1914). మొదటిది నెల్లూరుమాండలికములో వెలువడగా, రెండవది విశాఖ మాండలికములో వెలువడినది. ఈ అల్పారంభము గోదావరిమాండలికములో భమిడిపాటివారి కలములో పరాకాష్ఠకువెళ్ళినది. వీరందరును తమ అనువాదములకు దేశీయతాముద్ర వేసియున్నారు. భమిడిపాటివారు మోలియర్ రచనలను అనువదించుటయేకాక, వానితోసమానములైన పెక్కుస్వతంత్ర ప్రహసనములనుకూడ రచించియున్నారు. తెలుగుసాహిత్యమున, ప్రహసనమునకు, స్వతంత్రస్థాయిని కల్పించినకీర్తి భమిడిపాటివారికే చెందును. ఈ సందర్భమున విశ్వనాథ కవిరాజుగారి రచనలుకూడ స్మరణీయములు. శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు భారతీయభాషలనుండి కొన్ని ప్రహసనముల ననువదించియున్నారు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంస్కృతమునుండి భగవదజ్జుకము (1924), మత్తవిలాసము (1935) అను ప్రహసనములను ఆంధ్రీకరించియుండుట పేర్కొనియున్నాను.

నాటకప్రదర్శనాదులలోని అవకతవకల నాక్షేపించుచు కొన్ని ప్రహసనములు బయలు దేరుట స్మరణార్హము—బి. టి. రాఘవాచార్యులవారి సంగీతఇంద్రసభ (1925 ప్రాంతములు), చింతా దీక్షితులు, గుడిపాటి వెంకటచలం, వేదుల సత్యనారాయణశాస్త్రిగార్లు కలిసి వ్రాసిన 'నాటకప్రహసనము' (మదనసాయకా కార్తవీర్యము - 1941), తిరుపతి వేంకటకవుల 'రసాభాసము' మొదలగునవిందుల కుదాహరణములు. ఇందు మొదటిది సంగీతనాటకములపై దాడి; రెండవది కాంట్రాక్టునాటకములపై దాడి; ఇంక మూడవది నాటకసమాజములపై దాడి; ఇట్టిదే డా. చిలుకూరి నారాయరావుగారి 'నాటక నాటకం'. (సంగీతఇంద్రసభకు వ్రాయబడిన పీఠిక, నాటకప్రహసనమునకు వ్రాయబడిన 'ఉపోద్ఘాతము' తప్పక పరిశీలింపదగినవి).

1910_20 ప్రాంతముల 'నాటకము ఫార్సులు' అను పేర పెక్కు ప్రహసనములు వెలువడినవి. పెద్దఎత్తున రంగాలంకరణముచేయవలసిన రంగములను తీర్చిదిద్దుటకు కొంత వ్యవధి కావలసివచ్చెడిది. ఆ వ్యవధికాలములో ప్రేక్షకులను వినోదపర్చుటకు ఒకరిద్దరు తెరముందుకు వచ్చి చమత్కారసంభాషణములు చేయుచుండెడివారు. ఇట్టి చమత్కారసంభాషణములు తొలుత తత్కాలకల్పితములుగా ఆరంభమైనను, పిమ్మట రచయితలు ఇట్టి ప్రత్యేకరచనలు చేయసాగిరి. (ద్రోణంరాజు సీతారామారావు ప్రభృతుల ఇట్టిరచనలు ముద్రింపబడినవి).

సమకాలీన రచయితలలోకూడ చక్కని ప్రహసనకర్తలుకలరు. విశ్వనాథ కవిరాజు గారి కుమారులు మల్లాది అవధానిగారు (అసంపూర్ణరామాయిణము మొ॥), తమ్ములు మల్లాది వేంకటకృష్ణశర్మగారు (వారసత్వం మొ।), భమిడిపాటి కామేశ్వరరావుగారి కుమారులు రాధాకృష్ణగారు మొదలగువారు ప్రముఖముగా పేర్కొనదగినవారు. ఒకతరములోని ఆస్తివలె ఈ రచనాసంపద తరువాతి తరమువారికికూడ సంక్రమించుట చిత్రము! పులుగుండ్ల రామకృష్ణయ్యగారి 'తుఫాను' పరిషత్తు బహుమతిపొందిన రచన. బుద్ధవరపు నాగరాజామాత్యుని 'పిచ్చివాండ్ల పంచాయతీ' మొదలగునవికూడ పేర్కొనవలసిన రచనలు.

## నాటికలు

వివిధరచయితల ఉత్తమనాటికలను, ఏకాంకికలను సంకలనముచేసి, ప్రచురింపవలెనని చేసిన ప్రయత్నఫలముగా తెలుగులో మూడుసంపుటములు వెలువడినవి—స్వామి శివశంకరులు సంపాదించిన 'ఏకాంకికలు' (నవంబరు, 1943); డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు సంపాదించిన 'నేటి ఉత్తమనాటికలు' (జనవరి, 1944); కూర్మా వేణుగోపాలస్వామిగారు సంపాదించిన 'ప్రసిద్ధనాటికలు' (మే, 1957). శివశంకరుల ఏకాంకికాసంపుటములో నాటికలును, తక్కినవారి నాటికాసంపుటములలో ఏకాంకికలును ఉండుట గమనార్హము. కాగా, ముప్వురును కూడ నాటికా_ఏకాంకికాపదములకు భేదమును పాటించినట్లు కన్పట్టదు; వారు వానిని పర్యాయపదములుగానే వాడియున్నారు.

సంస్కృతమునందలి 'నాటిక' చతురంకపరిమితము. అది నాటకముకంటె వైశాల్యమున చిన్నది. కాని, నేడు 'నాటిక' లనబడువానికి ఆ సంస్కృత నాటికాలక్షణములు పట్టవు.

(నాటికలకే కాదు, నాటకములనబడువానికిని సంస్కృతనాటకలక్షణములు పట్టుటలేదని గుర్తించి యున్నాము). ఇట్లు, ఈపదములను అవ్యవస్థముగా వాడుచుండుటకంటె ఆధునికలక్ష్యము లను పరిశీలించి, క్రిందివిధముగా నిర్వచించుకొనుట ఆవశ్యకమేకాక సమంజసముకూడను—

ఏకనాయకమును, ఏకవస్తుకమును, విధిగా ఏకరంగమును అయి, స్థల-కాలైక్యములు పాటింపబడి, ప్రదర్శనము 30 నిమిషములు లేదా 45 నిముషములలోపల ముగిసినచో దానిని 'ఏకాంకిక' అనవచ్చును. నాటికకు ప్రదర్శనకాలపరిమితి సుమారు గంట; ఇదియును ఏక నాయకము, ఏకవస్తుకమును కావలసినదే. కాని, ఇందు, రెండుమొదలు ఐదారురంగములుండ వచ్చును. ఇతివృత్తమున స్థల-కాలైక్యములను విధిగా పాటింపనక్కరలేదు. ఇంక, బహు పాత్రకము, సప్రాసంగికము, రంగబాహుళ్యముకలదై, ప్రదర్శనము రెండు మూడు గంటల లోపల ముగియునది 'నాటక' మనబడును. సంస్కృతములోని నాటక-ప్రకరణములు 5 మొదలు 10 అంకములు కలిగియుండెడివి. షేక్స్పియరు నాటకములు పంచాంకపరిమితములు. పిమ్మట చతురంకనాటకములు వ్యాప్తిలోనికి వచ్చినవి. అటుపిమ్మట మూడంకముల నాటకములు ప్రసిద్ధి కెక్కినవి. ఇప్పుడు రచయితలు 'అంక' (act) పదమునకు ఇంచుమించుగా స్వస్తిచెప్పి, నాట కము నంతటిని కొన్నిరంగములుగా విభజించుచున్నారు. ఇట్లు, రంగవిభజనకే ప్రాముఖ్య మిచ్చువారి కొన్నిరచనలలో నాటికా-నాటకముల భేదమునుకూడ గుర్తించుట కష్టమగుచున్న దన్నచో అతిశయోక్తికాదు.

'ఏకాంకరూపక' మని పేర్కొనబడిన అబ్బూరి రామకృష్ణారావుగారి 'నదీసుందరి' తెలుగులోని చక్కని నాటికలలో నొకటి. విశ్వనాథవారి 'అనార్కలి' కూడ నాటికయే; కాని ఇందు రంగబాహుళ్యము కలదు. పైన పేర్కొన్న మూడుసంపుటములందును మొత్తము ఇరువదిముగ్గురు రచయితల ఇరువది ఎనిమిది రచనలున్నవి— "ఏకాంకికలు"లో పన్రెండు; "నేటి ఉత్తమ నాటికలు"లో తొమ్మిది; "ప్రసిద్ధనాటికలు"లో ఏడు. వీనిలో, ఒకేరంగము కలవి పదునొకండు రచనలు. నిషల్పం, భానుమతి, ఏమిమగవాళ్ళు, ప్రారబ్ధం, శివం, అల్లీ ముతా, మల్లమ్మదేవి ఉసురు, స్త్రీవిరోధి, గ్రీష్మఋతువు, శిల్పనిద్ర, మధురప్రియ—ఇవి యన్నియును పూర్ణముగా 'ఏకాంకికలు'. వీనిలో వైశాల్యమున చాల పెద్దరచన 'శివం'. రెండు రంగములుకల రచనలు మూడు—సముద్రతీరము, ప్రభువాక్యము, మొక్కుబడి. మూడురంగ ములు కల రచనలు పదునొకండు కలవు—మాయపెళ్ళి, గజ్జెలమొలత్రాడు, పరివర్తనము, శ్రీకృష్ణుడు, అపవాదు, సౌందర్యోపాసి, భిక్షాపాత్ర, సిద్ధౌషధం, దూరతీరాలు, అనార్కలీ, ఒమర్ ఖయామ్. స్థల-కాల-సన్నివేశభేదముల ననుసరించి చేయబడిన రంగవిభజన యిది. కాగా, ఇవియన్నియును నాటికలపట్టికలో చేరవలసిన రచనలే. ఈ సంపుటములలో మూడు రంగములనుమించిన రచనలుకూడ మూడుకలవు—రాధాకృష్ణుడు (7 రంగములు); తిష్యరక్షిత (6 రంగములు); విధినిర్వహణం (4 రంగములు).

నేడు నాటికలను, ఏకాంకికలను కూడ సమానశక్తితో నిర్వహింపగల రచయితలు పలువురున్నారు. ఇతివృత్తభేదము ననుసరించి నాటికలు పౌరాణికములు, చారిత్రకములు,

సాంఘికములు మొదలగు భేదములను కలిగియుండును. ఇతివృత్తభేదముననుసరించి భాష లోను భేదములను పాటించుట న్యాయ్యము.

నాటికలలో బాలనాటికలశాఖ యొకటి కలదు. ఇందు క్లిష్టకల్పనలుకాని, శిల్పచాతురి కాని ఉండుట కవకాశములేదు; చమత్కారసంభాషణలు, అద్భుతసన్నివేశములు ప్రాధాన్యము వహించును. శ్రీయుతులు చింతా దీక్షితులు, బాలన్నయ్య_బాలక్కయ్య, చెరుకుమిల్లి భాస్కర రావు, నార్ల చిరంజీవి ప్రభృతులు ఈశాఖలో బాగుగాకృషిచేసియున్నారు.

## ఏకాంకికలు

సంస్కృతాలంకారికులు వివరించిన రూపకోపరూపకములలో ఐదు రూపకములును (వ్యాయోగ_ఉత్సృష్టికాంక_ప్రహసన_భాణ_వీథులు), పదునాలుగు ఉపరూపకములును (రాసకము, గోష్ఠి మొ॥) ఏకాంకపరిమితములని గుర్తించియున్నాము. 'అంక' లక్షణములలో ప్రధానమైనది అందలికథ ఏకదివస ప్రయోజ్యమగుట; అనగా, ఇరువదినాలుగుగంటలలోపల జరిగినకథనే అంకమందు కూర్పవలెను. అంకమంతయును ఏకరంగమేయగుటచేత స్థలైక్యము కూడ విధిగా పాటింపబడును. ఈ ఏకాంకరూపకములకు భాసుని కర్ణభారాదులు ప్రాచీనోదాహరణములు; అటుపిమ్మటివి భగవదజ్జుక - మత్తవిలాసప్రహసనములు. వీథికి ప్రాచీనోదాహరణములు లభ్యముకాలేదు. ఇంక ఉపరూపకములకు ప్రాచీనోదాహరణములపేర్లు అలంకార శాస్త్రములందు కన్పట్టుచున్నవి; కాని, అవియేవియును లభ్యముకాలేదు.

ఆంగ్లనాటకారంభదశలోని మిష్టరీ_మిరకిల్ రూపకములు, ఇంటర్‌లూడ్స్ ఏకాంక ప్రాయములే. 18, 19 శతాబ్దములలో బయలుదేరిన కర్టెన్‌రైజర్స్, ఆఫ్టర్‌పీసెస్, స్కెచెస్ అనునవికూడ ఏకాంకరచనలే. కాని, ఇవియేవియును శిల్పసమ్మతములై, సాహిత్యపు విలువ గల రచనలుకావు. ఇంక పాశ్చాత్యదేశములందు, ఏకాంకరూపకము కళాత్మకమైన రూపక శాఖగా స్పష్టముగా రూపొందుట ఈ యిరువదియవశతాబ్ది ప్రారంభమందే జరిగినదని తెలియ వలెను (గత శతాబ్దిలోనే జరిగినదని కొందరి మతము); ఈ ఏకాంకరూపకములను ఆంగ్లమున 'One act plays' అనియు, తెలుగులో 'ఏకాంకికలు' అనియు అందురు.

సాహిత్యమున మహాకావ్యమునకు 'ఖండకావ్యము', నవలకు 'కథానిక' ఎట్టివో నాటకమునకు 'ఏకాంకిక' అట్టిది. అసలు, వైశాల్యమున చిన్నవియైన ఇట్టిరచనలు బయలుదేరుటకు ముఖ్యకారణములు—ప్రజలలో ఓపికతగ్గుట; విశ్రాంతి తక్కువయగుట. పట్టుమని కూర్చుండి ఒక మహాకావ్యమునుకాని, నాటకమునుకాని, నవలనుకాని చదివెడి ఓపిక, విశ్రాంతి నేడు ప్రజలకు కఱవైనవని చెప్పవచ్చును. ఇంక, నాటకములను, ఏ నాలుగైదుగంటలపాటో, లేదా తెల్లవారువరకునో చూచెడి ఓపిక ప్రజలకు పూర్తిగా పోయినది. ఇదివరకు, ఏ ఉత్సవ సమయములలోనో, ఏ సంవత్సరమునకో ఒకసారి నాటకప్రదర్శనమును చూచుట తటస్థించెడిది. అట్టిదానిని తెల్లవారువరకును చూచినకాని ప్రజలకు తృప్తియుండెడిదికాదు. మరి, ఇప్పు

డట్టి బాధలేదు. నేటివారికి పెద్దనాటకమన్నచో ప్రదర్శనము రెండు, లేదా మూడుగంటలలోపల ముగియునదన్నమాట. కాగా, నేడు నాటికలకును, ఏకాంకికలకును మాత్రమే విశేషవ్యాప్తి కలుగుట కవకాశమేర్పడెను; వీని వ్యాప్తికి మాస-పక్ష-వార-దినపత్రికలును, ఔత్సాహిక సమాజముల ప్రదర్శనములును ఎంతయేని దోహదము చేయుచున్నవి. మరియు, ఏకాంకికల రచనా-ప్రదర్శనముల పోటీలుకూడ ఈజాతిరచనకు మరింత దోహదకారులగుచున్నవని చెప్పవచ్చును.

ఏకాంకికారచనకు, ప్రత్యేకించి, లక్షణగ్రంథమని చెప్పదగినదిలేదు. కాని, ఆయా విమర్శకవాక్యములను, ఉత్తమరచనలను (లక్ష్యములను) ఆధారముగా చేసికొని ఏకాంకికా రచనకు, క్రిందివిధముగా, కొన్నిలక్షణములను చెప్పుకొనవచ్చును—

1. రచన వైశాల్యమున చిన్నదియును, ప్రదర్శన మల్పకాలమున ముగియునదియును అగుట అత్యావశ్యకము (అంతమాత్రమున, పెద్దనాటకమును సంక్షేపించినచో 'ఏకాంకిక' కాజాలదు). అనగా ప్రదర్శనము 20 నిముషములకు తగ్గక, 45 నిముషములలోపల తప్పక ముగియునది కావలయును. వస్తువు ఏకనాయకమును, ఏకదివసప్రయోజ్యమును కావలయును. పాత్రలసంఖ్య ఎంత తక్కువగానున్నచో అంతమంచిది.

2. ఏకాంకికయందలి వస్తువు ఏదైననుకావచ్చును. కాని, జీవితమునకు అత్యంతము సన్నిహితముగా నున్నచో ఎక్కువగా రాణింపగలదు. వస్తువులో ఏదో ఒక సంఘర్షణము, ఏదో ఒక చమత్కారము ప్రధానముగా నుండవలయును. ముందేమి జరుగునో అనెడి ఉత్సుకతను కలిగించుట ముఖ్యము. మరియు, దానిని అద్భుతాంతముచేయుట మరింత ఆకర్షణీయముకాగలదు.[1]

3. రచన జిగిగాను, సంభాషణలు సూటిగాను, కథాగమనము వేగముకలదిగాను ఉండవలయును. ప్రవేశించిన ప్రతిపాత్ర, పలికిన ప్రతిపలుకు కథాగమనమునకు దోహదకారి కావలయును. ఇందు స్వగతాదులకు తావులేదు. కథయందుకాని, పాత్రపోషణయందుకాని, నాటకమునందువలె, క్రమోల్మీనమున కవకాశము ఉండదు; రచయితలో శక్తి ఏమాత్రము లోపించినను ఏకాంకిక చప్పగా తయారగును. కాగా, ఏకాంకికానిర్మాణశిల్పము కష్టతరమైనదని తెలియవలెను. ఇందు కథాకాలమును, ప్రదర్శనకాలమును సమానములగుట సమంజసము కాగలదు.

4. ఇందు ఏదోయొక సందేశమో, లేదా ఏదోయొక జీవితాంశమునకు వ్యాఖ్యానమో ఉండవలయును. అంతమాత్రమున అది నీత్యుపదేశాత్మకము కాని, వాఖ్యానవ్యాసతుల్యము కాని కారాదు; శిల్పసమ్మతముగానే అవి వ్యంజితములు కావలయును. కొన్ని కేవలము వినోదాత్మకములే కావచ్చును. కాని, మొత్తముమీద, రచన మనస్సునకు వికాసమును కలిగించునది కావలయును.

5. ఏకాంకికను విధిగా ఏకరంగముగానే రచింపవలెను (కాని, ఆవశ్యకమైనచో గృహ-ఆరామాది భేదములను సూచించుటలో దోసగులేదు).

6. మొత్తముమీద ఏకాంకిక స్వయంసమగ్రమైన శిల్పకళాఖండముగా నుండవలెను.

పై లక్షణములను వ్యాకరించిచూచినచో, కథానికారచనవలెనే, ఏకాంకికారచనకూడ మూడువిధములుగా జరుగునని చెప్పవచ్చును.

1. రచయిత ఒక విలక్షణమైన సన్నివేశమునుకాని, విశిష్టభావమునుకాని ఊహించినచో దానిని నిశితముగా, నిష్కర్షగా ప్రదర్శించుటకై పాత్రలను కల్పించుకొనును.
2. విశిష్టము లేదా విలక్షణము అయిన పాత్ర నూహించినచో తచ్చిత్రణమునకై సన్నివేశాదులను కల్పించుకొనును.
3. ఏదేని ఒక సందేశమునొసంగుటకు కాని, లేదా ఒక సమస్యాపరిష్కారమును సూచించుటకు గాని, లేదా జీవితాంశమును వ్యాఖ్యానించుటకుకాని, లేదా గృహస్థాదివాతావరణ నిరూపణమునకుకాని పూనుకొన్నచో పాత్రలను, సన్నివేశమును కల్పించుకొనును.

ఇతివృత్తమునుబట్టి నాటికా–నాటకములవలెనే ఏకాంకికలుకూడ పౌరాణిక–సాంఘిక–చారిత్రకాది భేదములతో కూడియుండును.

తెలుగుసాహిత్యమున లభ్యమైనంతలో తొలి సంస్కృతరూపకాంధ్రీకరణమైన 'క్రీడాభిరామము'ను, ఆధునిక కాలమున తొలి సంస్కృతరూపకాంధ్రీకరణమైన "నరకాసుర విజయవ్యాయోగము"ను ఏకాంకరూపకలేయగుట గమనింపదగినది. కాని, నేటి తెలుగు ఏకాంకికలకు ఆ సంస్కృతరూపకములు కాని, ఈ అనువాదములు కాని మూలములు లేదా మార్గదర్శకములుకాలేదు. నవల, కథానిక మొదలగు పెక్కు సాహిత్యశాఖలవలెనే ఇదికూడ పాశ్చాత్యసాహిత్యప్రభావమున తెలుగులోనికి వచ్చి, వ్యాప్తిచెందినది. తెలుగులో ఏకాంకికారచనకు శ్రీకారముచుట్టినవారు కందుకూరివారే. కాని, వారి రచనలన్నియును ప్రహసనజాతిలో చేరినవి. నిజమున కప్పటికి పాశ్చాత్యదేశములందు కూడ కళాత్మకమైన ఏకాంకికావికాసము జరుగలేదు. 1926 ప్రాంతములో, ఇంగ్లాండులో, ప్రప్రథమముగా ఏకాంకికాసముచ్చయము ప్రకటితమైనది, అటుపిమ్మటనే తెలుగులోకూడ ఏకాంకికారచన విరివిగా జరిగినది. పాశ్చాత్యదేశములందు, బయలుదేరిన కొలదికాలములోనే, ఏకాంకికారచన బాగుగా వికసించి, ఉత్తమ సాహిత్యశాఖగా స్థానము సంపాదించుకొన్నది. పాశ్చాత్యదేశములందుకంటెకూడ శీఘ్రతరముగా తెలుగులో ఏకాంకిక కళాత్మకరూపమును తాల్చినదనుట అతిశయోక్తి కాదు. మరియు, సమగ్రరూపకరచనయెడ ఉదాసీనులైన కొందరు భావకవులుకూడ చక్కని ఏకాంకికలు రచింపసాగిరి. ఆరచనలకు ఇంచుమించుగా 1925 ప్రాంతముల బయలుదేరిన సాహితి, సఖి, జయంతి, ఉదయిని, కళ, జ్వాల, వీణ, శారద, ప్రతిభ, భారతి మొదలగు పత్రికలు విశేషప్రచారము నొసంగినవి — "సాహితీపత్రికతో ప్రారంభమై, సఖిలో ప్రవృద్ధమై, ప్రతిభలో పరాకాష్ఠకు వెళ్ళింది ఏకాంకిక" అన్నారు స్వామీ శివశంకరులు ("ఏకాంకికలు" — పీఠిక–పుట–21).

ఏకాంకికాసంపుటములలో వెలువడిన ఏకాంకికలనుగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను. తెలుగులో, కళాత్మకములైన చక్కని ఏకాంకికలను వ్రాసినవారిలో రాజమన్నారు

గారు ప్రథములు, ప్రధానులు కూడను. సంఘముదృష్టిలో పతిత అయిన స్త్రీని నాయికగాచేసి వీరు చక్కని ఏకాంకికలను రచించినారు (ఏమిమగవాళ్ళు, నిష్ఫలం). వీరితో సమానప్రతిభతో ఏకాంకికలను రచించినవారు మరికొందరు కలరు. దీక్షితులవారి 'శర్మిష్ఠ' మొదలగునవి, చలం గారి 'భానుమతి' మొదలగునవి ఉత్తమ ఏకాంకికలలో పేర్కొనదగినవి. గ్రామీణజీవనము ఆలంబనముగా చక్కని ఏకాంకికలను రచించినవారు నార్లవారు. మధ్యతరగతి ప్రజలసమస్య లను చిత్రించెడి ఏకాంకికలను రచించినవారు ఆత్రేయగారు—ఈ రెండుపద్ధతులలో అనేకులు అనేక ఏకాంకికలను రచించియున్నారు.[2]

నేడు ఏకాంకికలు పుంఖానుపుంఖములుగా వెలువడుచున్నవి; అందు చాలవరకు మంచి రచనలే కలవని చెప్పవచ్చును.

## పద్యనాటికలు

కావ్యభేదములను హేమచంద్రుడు తన కావ్యానుశాసనమందు క్రిందివిధముగా వివ రించెను (8 వ అధ్యాయమున)—"కావ్యముప్రేక్ష-శ్రవ్యభేదములచేత రెండువిధములు. అందు ప్రేక్ష్యము పాఠ్య-గేయభేదములచే మరల రెండువిధములు. దశరూపకములును, సట్టక-తోట కాది జన్యరూపకములును పాఠ్యములు; డోంబికా-భాణ-ప్రస్థానాదులు గేయములు". ప్రాచీన కాలమున సంస్కృతభాషలో కేవల పద్యకావ్యములు, లేదా కేవల గద్యకావ్యములుమాత్రమే బహుళముగా వెలసినవి. ఇంక పాఠ్యములైన రూపకాదులు గద్య-పద్య సమ్మిశ్రితములై చంపూకావ్యజాతిలోనికి చేరును. ఉదాత్తభావవ్యక్తీకరణమందును, వర్ణనలందును పద్యములు ప్రయుక్తమగును. రంజనార్థమెచ్చటనేని చాల అరుదుగా గేయములుకూడ కన్పట్టుచుండును. కేవలము పద్యమందుకాని, కేవలము గద్యమందుకాని ఉండెడిరూపకములు సంస్కృతభాషలో కన్పట్టవు.

గ్రీకుల విషాదరూపకములన్నియును పద్యమునందే (Iambic metre లో) ఉన్నవి. నాటి కాలపరిస్థితులనుబట్టి వారు వచనమును గ్రహింపలేదు; కోరస్‌కు గేయములుకూడ నుండెడివి. షేక్స్పియరు ప్రభృతుల రూపకములలో వచనముకంటె పద్యమునకు (Blank Verse) ప్రాధాన్యమెక్కువ; సంభాషణలుకూడ పద్యములోనే సాగుచుండును; ఎడనెడ గేయ ములుకూడ కన్పట్టుచుండును. అటుపిమ్మట కేవలగద్యనాటకములు ప్రచారములోనికి వచ్చినవి. ఆదిలో కేవలము పద్యనాటకములు కేవల శ్రవ్యరూపకములుగానే తలంపబడినను, పిమ్మట వానిని రంగస్థలమున జయప్రదముగా ప్రదర్శింపసాగిరి. గద్య-పద్యములకు తత్త్వములలో, రీతులలో భేదమున్నను నటుల పఠనములోమాత్రము వానిమధ్య అంతగాభేదము కన్పట్టెడిదికాదు; అనగా పద్యభాగమునుకూడ వారు ఇంచుమించుగా గద్యమునువలెనే పఠించెడివారన్నమాట. అందుచేత వారి దృష్టిలో రంగస్థలప్రయోగమునకు సంబంధించినంతవరకు, గద్య-పద్యముల కంతగా భేదములేదు.

తెలుగులోకూడ సంస్కృతరూపకానువాదములు, మూలమునందువలె, యథాతథ ముగా గద్య-పద్యములందే వెలసినవి. కాని, ఆంగ్లరూపకముల ననువదించుటలో వావిలాలవారు

క్రొత్తమార్గమునుత్రొక్కి 'సీజరుచరిత్రము'ను కేవలపద్యనాటకమునుగానే అనువదించినారు; పిమ్మట, స్వతంత్రసృష్టియైన 'నందకరాజ్యము'నుకూడ వారు అట్లే కేవలపద్యమునందే రచించియున్నారు. ఈవిధముగా తెలుగులోని పద్యనాటకములకు వావిలాలవారే మూలపురుష లగుచున్నారు. కాని, అటుపిమ్మట వారినెవ్వరును అనుసరించినట్లు కన్పట్టదు — మరల వారే, ఉత్తరరామచరితను గద్య-పద్యములలోనికే అనువదించినారు! ధర్మవరమువారితో తెలుగు నాటకరంగమున ఒక విచిత్రపరిణామమువచ్చినది; వారుపద్యములనుకూడ పాడుటకారంభించిరి. ఆపద్ధతిని గ్రహించి, ఆరీతిని హరి ప్రసాదరావుగారు సర్కారుజిల్లాలయందు ప్రచారమొనర్చి నారు. అది క్రమముగా విస్తరించి తెలుగునాటకరంగము సంగీతరంగముగా మారిపోయెడి పరిస్థితులు ఏర్పడినవి. ఇట్లు పద్యములను పాడెడి సంప్రదాయము, తెలుగునాటకరంగమున తప్ప, తక్కిన భారతీయభాషానాటకములం దెచ్చటను కన్పట్టదు; ఇది తెలుగునాటకరంగము నకు మాత్రమే పరిమితమైన విచిత్రవిషయము!

పాశ్చాత్యదేశములందు పద్యనాటికారచయితలలో క్రిష్టోఫర్ ఫ్రై, టి. ఎస్. ఇలియట్‌లు సుప్రసిద్ధులు. కేవల పద్యరూపకరచనను పునరుద్ధరించి, తెలుగులో పద్యనాటిక లను విరివిగావ్రాసినవారు తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు. వారి ప్రథమపద్యనాటిక 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' - 1933 లో వెలువడినది.

## గేయరూపకములు

సంస్కృతమునందలి ఉపరూపకములకు 'గేయకావ్యము'లనియు, 'నృత్తప్రకారము' లనియు, 'రాగకావ్యము'లనియు పేర్లుకలవు. నృత్యమొక ప్రత్యేకకళగా రూపొందినతరువాతనే ఉపరూపకసృష్టి జరిగియుండునని ఇంతకుముందే తెలిపియున్నాను. ఉపరూపకములు, స్వరూప మున గేయాత్మకములైనను, అవి ముఖ్యముగా నృత్యప్రధానములు — "గీతేనరంజనం ప్రాధా న్యేనవిధాయ, తదుపయోగినం చాంగవ్యాపారంప్రదర్శ్య, నృత్తేన పునశ్చిత్తగ్రహణంకుర్వతీ; నృత్తంప్రధానభావం, గీతంచ తదుపసర్జన భావం నయంతీ" అని హేమచంద్రుడు పేర్కొని యుండుట పరిశీలింపదగును. (కావ్యానుశాసనము-పుట-448). 12వ శతాబ్దినాటి జయదేవుని 'గీత గోవిందము'ను, తరువాతి నారాయణతీర్థులవారి 'కృష్ణలీలాతరంగిణి'యును నృత్యప్రధానము లైన గేయకావ్యములు. కూచిపూడివారి 'భామాకలాపము'ను, దక్షిణదేశమందలి "యక్షగాన నాటకము"లును నృత్యప్రధానములైన రచనలే. పాశ్చాత్యుల 'బ్యాలేలు'ను ఇంచుమించుగా ఇట్టివే.

తెలుగునాటకములందు పాటలనుచేకూర్చిన ప్రథములు ధర్మవరమువారు. అటుపిమ్మట పలువురు తెలుగునాటకకర్తలు ముప్పది నలువదికి తక్కువకాకుండ తమతమ నాటకములందు పాటలను చేర్చుచువచ్చిరి. పద్యములతోపాటు ఈ పాటలును, ఒకవిధముగా, తెలుగునాటకము లకు ప్రాధాన్యమును తెచ్చిపెట్టినవి.

పాశ్చాత్యదేశములందు ఆధునికగేయనాటికారచయితలలో మారిస్ మేతర్‌లింకు, డబ్లియు.బి. యేట్సు ప్రభృతులు ప్రసిద్ధులు. భారతదేశమున గురుదేవులు రవీంద్రులు ప్రసిద్ధులు. ఇంక తెలుగులో సంపూర్ణగేయ (లేదా సంగీత) రూపకముల రచనకు పూనుకొన్నవారిలో శివ శంకరస్వామి, బాలాంత్రపు రజనీకాంతరావుగార్లు ప్రథములు. చిత్రముగా ఇరువురును, 'చండీ దాసు' అనెడి వంగకవి రామమణియనెడి రజకస్త్రీని ప్రేమించినగాథనే స్వీకరించి, 1939 లో సంపూర్ణగేయరూపకములను రచించినారు; అవి రెండును ఒకే 'ప్రతిభ'సంచికలో ప్రకటితము లైనవి. 15-2-1941 తేదీన శివశంకరుల 'సహజయానపంథీ' మద్రాసులోని గోక్లేహాలులో రంగస్థలమున ప్రదర్శితమైనది. (దర్శకులు మొక్కపాటి నరసింహశాస్త్రిగారు). ఇంక రజని గారి "చండీదాసు", అదేమాసమున, 22 వ తేదీనాడు మద్రాసు రేడియోనుండి ప్రసారితమైనది. అటుపిమ్మట శివశంకరులును, రజనిగారును పెక్కుగేయరూపకములను రచించియున్నారు.[1]

ఈ గేయరూపకములు రంగస్థల ప్రదర్శనములకేకాక, రేడియోప్రసారములకుకూడ చాల అనువుగానుండును. నృత్యములేని కేవలగేయరూపకములు రంగస్థలమునందంతగా రక్తి కట్టవు; కాని, అవి రేడియోప్రసారమున జయప్రదములగును. రేడియోప్రసారమునుపొందిన తొలుతటి సంపూర్ణగేయరూపకము మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'బిల్హణీయం' (1939). కేవలము రేడియోప్రసారమున కుద్దేశించి వ్రాయకపోయినను, ఈ సందర్భమున కొప్పరపు సుబ్బారావుగారి 'అల్లీముతా'ను పేర్కొనవలసి యున్నది. ఇది రంగస్థలమున విజయవంత మైన రచన.

కేవలము రేడియోప్రసారమునుద్దేశించి పలువురు గేయనాటికలను రచించియున్నారు. (కొందరు, అసలు రేడియోప్రేరణముచేతనే నాటికారచయితలైనారన్నను అతిశయోక్తికాదు). మల్లవరపువారు షెల్లీ రచించిన "ప్రొమిథియస్ అన్‌బౌండు"ను సంపూర్ణగేయరూపకమునుగా ఆంధ్రీకరించినారు. అదియును వారి శారదోత్సవాదులును చక్కని గేయరూపకములు. వేమూరి వేంకటరామనాథం, శ్రీశ్రీ (మోహినీరుక్మాంగద మొ॥), సి.నారాయణరెడ్డి (వెన్నెలవాడ మొ॥) ప్రభృతులు గేయనాటికా రచనలో పలుప్రయోగములను చేసియున్నారు. దేవులపల్లి కృష్ణ శాస్త్రి (ఊర్వశి, శర్మిష్ఠ, విద్యాపతి, ఏడాదిపొడుగునా, వేణుకుంజం, ధనుర్దాసు మొ॥) ప్రభృతి భావకవులు గేయనాటికారచనతోనే రూపకరంగమున అడుగుపెట్టినారు. ఈ సందర్భమున కాటూరి వేంకటేశ్వరరావుగారి 'మువ్వగోపాల', 'శ్రీనివాసకల్యాణము'లుకూడ పేర్కొన దగినవి. సూరంపూడి భాస్కరరావుగారి ఆమ్రపాలి, కవి, శునశ్శేపుడు రేడియోలో ప్రసారితము లైనవి. విశ్వనాథవారి గౌతమి, కిన్నెరసాని ప్రభృతిరచనలు ప్రసిద్ధములు. పాలగుమ్మి పద్మ రాజుగారి "వానకారుకథ" తప్పక పేర్కొనవలసిన రచన. చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారి "మహోదయం" ఇటీవలవచ్చిన చక్కని నేపథ్యగేయరూపకము.

ఈమధ్య గేయనాటికారచనలో ఒక క్రొత్తప్రక్రియ వెలువడినది. ఆరుద్ర (సీతాకోక చిలుక), కుందుర్తి ఆంజనేయులు (ఆశ); సోమసుందర్ (మందీ-మనిషి) మొదలగువారు

'ఫ్రీవెర్సు'అను పేర వచనగేయమున (heightened prose) నాటికలు రచించినారు. దీనినే గురుదేవులు రవీంద్రులు 'ముక్తచ్ఛంద'మనినారు. ఈ రచనలయందలి భాషలో పదప్రయోగ వైచిత్రియందుకంటె ప్రాసమీద అధికముగా ధ్యాసకనబడును. కాగా, రచనలో ఒకవిధమైన కృత్రిమత్వము కనబడుచుండును. ప్రదర్శనమందు ఈ వచనగేయములను, కేవలము వచనముగా చదివినచో రక్తికట్టదు. కుందుర్తివారు తమ 'ఆశ'లో 'సింబాలిజమ్'కుకూడ అధిక ప్రాధాన్యమొసంగియున్నారు.

గేయరూపకము నాటకరంగస్థలమున జయప్రదముకావలయునన్నచో నటులు నాట్యవేత్తలు కూడ కావలసియున్నది. ఇంక, నాటకరంగస్థలమందేకాక రేడియో ప్రసారమందుకూడ సంగీతదర్శకుని బాధ్యత చాల గురుతరమైనది. దేశకాలములనుబట్టి, పాత్రల స్థితినిబట్టి, భావ భేదమునుబట్టి వేర్వేరుసంగీతబాణీలను కూర్చుకొనవలసి యున్నది. మరియు ఇందు నేపథ్య సంగీతమునకుకంటె వాచికమునకే ప్రాధాన్యము ఉండవలెనన్నవిషయమును విస్మరింపరాదు. మరియు గేయమునంతటిని వెనుక వేరొకరుపాడుచుండగా నటులు రంగస్థలముమీద మూకాభినయము చేయుటకూడ గేయనాటికాప్రదర్శనమున ప్రచారమునందినది.

## శ్రవ్య (రేడియో) రూపకములు[1]

రూపకము విధిగా ప్రేక్ష్యము లేదా ప్రదర్శనప్రధానము అనెడి సిద్ధాంతమునకు అపవాదము 'శ్రవ్య (రేడియో) రూపకము'. ప్రదర్శనమున కనుపయుక్తములైన నాటకములను 'శ్రవ్యరూపకములు' (closet dramas or literary plays) అనుట పరిపాటి. లాటిన్‌భాషలోని సెనీకారూపకములు, సంస్కృతమునందలి మురారి "అనర్ఘరాఘవము" మొదలగునవి ఈ కోవకుచెందిన రచనలు. కాని, నేటి శ్రవ్యరూపకము లిట్టివికావు; ఇవి ఇంకొకజాతికిచెందిన 'శ్రవ్యరూపకములు'. ఈజాతిరూపకముల నిర్మాణశిల్పము ఒక విచిత్ర సాహిత్యప్రక్రియ; ప్రయోగమంతకంటెను విచిత్రమైనది.

మామూలు రంగస్థలరూపక ప్రదర్శనములలోవలెనే రేడియోలో ప్రసారము చేయబడెడి ఈ శ్రవ్యరూపకముల ప్రయోగములందును ఒక్కొక్కభూమిక కొక్కొక్కపాత్రయుండును. కాని ఇందు ప్రేక్షకులకును నటులకును ప్రత్యక్షసంబంధము ఉండదు, అసలు ఇందలి ప్రేక్షకులు ప్రేక్షకులేకారు; వారు 'శ్రోతలు'మాత్రమే. ఈశ్రోతలు, నటుల ఆహార్య-ఆంగిక-సాత్త్వికాభినయములను ప్రత్యక్షముగా అనుభవింపలేరు. ఇంక నటులు ప్రదర్శించునది, శ్రోతలు వినునది శబ్దమును (వాచికాభినయమును) మాత్రమే. ఇట్టిరూపకములు శబ్దప్రధానములగుటచేత వీనిని 'శబ్దరూపకము'లనికూడ అందురు. ఇందువలన ఈ రూపకరచనలోను, ప్రదర్శనములోను కొన్ని సులువులు, కొన్ని బాధలుకూడ కలవు.

శ్రవ్యరూపకమున 'కాల-స్థల' ఐక్యములను పాటింపవలెననెడి బాధలేదు. శ్రవ్యకావ్యమునందువలెనే శ్రవ్యరూపకమునందుకూడ కాల-స్థలములను విస్తృతముచేసి, రంగస్థల

ఎన ప్రదర్శించుటకు సాధ్యముకాని వానితోసహా, చేతనాచేతనమైన సమస్తప్రపంచమును దర్శించుటకు అవకాశముకలదు. కాని, రూపకనిర్మాణశిల్పదృష్టితో వస్త్వైక్యమును పరిశీలించుకొనుట రచయితవిధి. కథకు కాలపరిమితి లేకపోయినను ప్రయోగమునకు మాత్రము లపరిమితి యున్నది.

ఒక చూపులో, ఒక కదలికలో, ఒక అంగవిన్యాసములో రంగస్థలమునందు నటుడు గాపెడి హావ–భావాదులన్నియును శ్రవ్యరూపకమున నటులవాచకము మూలముననే స్పష్టములు కావలసియున్నవి. కాగా, శ్రవ్యరూపకములందలి సంభాషణలు రచయితశక్తికి గీటురాళ్ళు అన్నమాట! రచనలో కవివలెనే ప్రయోగమునందు నటులును బహుశ్రద్ధాళువులు కావలసియున్నది. అంతియేకాదు, వినుటలో శ్రోతలుకూడ చాల శ్రద్ధవహింపవలసియున్నది. వినిపించిన ప్రతిమాటను, శబ్దమును వానివాని హెచ్చుతగ్గు స్వరాదులనుబట్టి చక్కగా శ్రోతలు గ్రహింపగలిగినప్పుడే ఆ రూపకప్రసారము జయప్రదము కాగలదు.

శ్రవ్యరూపకప్రయోగములో వాద్యసంగీతము విరివిగా ఉపయోగపడుచున్నది. సన్నివేశముల మార్పులు, పాత్రల భావభేదములు, కాలభేదము మొదలగువానిని సూచించుటకు వాద్యసంగీతము నేపథ్యసంగీతముగా నుపయుక్తమగుచున్నది. సంస్కృతరూపకములందలి ధ్రువాగానమును ఇంతియే.[2] మరియు గ్రీకురూపకములలో కోరస్‌కు ఎంత ప్రాధాన్యమున్నదో శ్రవ్యరూపకములందు ఈ వాద్యసంగీతమున కంతటి ప్రాధాన్యమున్నది. వాస్తవభ్రాంతిని కల్పించుటకొరకు గాలి, వాన, రైలునడక, తలుపుచప్పుడు మొదలగు ధ్వనులను సమయోచితముగా కల్పించుటకూడ శ్రవ్యరూపకప్రయోగమునకు వన్నెపెట్టగలదు. శ్రవ్యరూపకప్రయోగమున ప్రధానసాధనము 'మైక్'. దీనిని సుష్ఠుగా నుపయోగించుకొనుటలో క్రొత్తక్రొత్త ప్రయోగము లింకను సాగుచునే యున్నవి.

శ్రవ్యరూపకమునకు ఒక నిర్దిష్టస్వరూపములేదని చెప్పవచ్చును—పెద్దనాటకమును, నాటికను, ఏకాంకికను, పద్యరూపకమును, గద్యరూపకమును, గేయరూపకమును—దేనినైనను సరే, మార్పులుచేర్పులు చేసికొని, రేడియోలో ప్రసారము చేయవచ్చును.[3] కాని, ఏకాంకికలే రేడియోప్రసారమునకు ఎక్కువగా తగియుండునని అంగీకరింపక తప్పదు. రేడియోకేంద్రములందు బహిరంగ నాటకప్రదర్శనముల నేర్పాటుచేసి, ఏకకాలమున ప్రత్యక్షప్రదర్శనమును, వాయుప్రసారమునుకూడ జరిపించుచున్నారు.

ఈ శ్రవ్యరూపకరచనకుకూడ పాశ్చాత్యులే మనకు మార్గదర్శకులు, రేడియో అవతరణముతోనే ఈ రూపకరచనయును ఆరంభమైనది. మార్గదర్శకులు పాశ్చాత్యులే అయినను తెలుగు రచయితలు గ్రహించిన, లేదా సృష్టించుకొన్న కథలలో, నూటికినూరుపాళ్ళు, జాతీయతయే—అందున ముఖ్యముగా తెలుగుదనమే—ప్రతిబింబించుచుండుట విశేషము.

రేడియోలో ప్రసారముచేయబడిన తొలి తెలుగురూపకము ముద్దుకృష్ణగారి 'అనార్కలి' (1937). ఇందు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పాటలు జోడింపబడినవి; నాడు సలీము

పాత్రను పఠించినవారుకూడ కృష్ణశాస్త్రిగారే. శ్రవ్యరూపకరచనలో ప్రసిద్ధులు, నిష్ణాతులు అయినవారు పలువురుకలరు. శ్రవ్యరూపకరచనలో అగ్రతాంబూలము నందవలసినవారు వింజమూరి శివరామారావుగారు. వీరు సుమారు వేయి శ్రవ్యరూపకములను రచించియున్నారన్నచో అత్యుక్తికాదు. కేవలము శ్రవ్యరూపకములనే వ్రాసి క్రొత్తక్రొత్త ప్రయోగములను చేసినవారు కొడవటిగంటి కుటుంబరావుగారు—"భార్యారూపవతీ", "కొరరానికొయ్య" మొదలగు వీరి రచనలు ప్రసిద్ధములైనవి. ఉత్తమ శ్రవ్యరూపకరచయితలలో శ్రీయుతులు గోరాశాస్త్రి (కొమ్మసంపెంగ, ఆనందనిలయం మొ॥), జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, జనమంచి రామకృష్ణ, అమరేంద్ర, దాశరథి, శ్రీవాత్సవ, బుచ్చిబాబు, నాగభూషణ్ ప్రభృతులు ముఖ్యముగా పేర్కొనబడవలసినవారు. అమరేంద్రగారు టాగూరు రచనలను తెలుగులోనికి తెచ్చినవారు. శ్రీ నాగభూషణ్‌గారు రేడియోనాటికలపోటీలలో బహుమతి నందికొన్నారు; కల_కాపురం, వడ్డించినవి స్తరి మొదలగునవి వీరి ప్రసిద్ధరచనలు. ఈ వ్యాసరచయిత రచన 'మంత్రి తిమ్మరుసు' 1948 జనవరి 26 వ తేదీన (రిపబ్లిక్ దినమున) రేడియోలో ప్రసారితమైనది.

## మరికొన్ని ప్రక్రియలు

నేడు రేడియోలో ప్రచారమునందుచున్న ఒక సాహిత్యప్రక్రియ 'స్కెచ్'; దీనిని రేడియోవారు తెలుగులో 'వాక్చిత్ర' మనుచున్నారు. సంస్కృతరూపకములందలి భాణస్వరూపమిట్టిదే కావున దీనిని 'భాణ' మనినారు గోరాశాస్త్రిగారు. ఆంగ్లమునందలి 'మోనోలోగ్'ను ఇట్టిదే. ఒకేఒకవ్యక్తి వివిధములైన స్వీయమనోభావములను కాని, ఇతరుల భావములను కాని (ఏకపాత్రాభినయము లేదా బహుపాత్రాభినయము) కాకుస్వరాదులతో వ్యక్తముచేయుట ఇందు ప్రధానము. ఇది బహురూపాభినయములోని ఒక భేదమనవచ్చును. ఈ బహురూపాభినయము నేడు అనేకవిధములుగా ప్రచారములోనికి వచ్చినది. ఆచార్య చంద్రశేఖరంగారిని గూర్చి ఇంతకుముందే వివరించియున్నాను; ఈకళలో వీరిశిష్యులు రమణారెడ్డిగారుకూడ ప్రసిద్ధులు. బళ్ళారి రాఘవాచార్యులవలె అభినయకళమూలమున ఆత్మోన్నతిని పొందుటకు ప్రయత్నించుచున్న యోగితుల్యులు ఆచార్య చంద్రశేఖరంగారు.

చంద్రశేఖరంగారి ప్రదర్శనములందు వేషము, స్వరము, అనుకరణము, అభినయము అన్నియును సమ్మేళనముపొందియుండును. ఇంక నేరెళ్ళ వేణుమాధవ్ ప్రభృతులు వేషధారణము లేకయే స్వర_ముఖరాగ_ అంగవిన్యాసవైచిత్రితో జనరంజకములగు ప్రదర్శనముల నొసంగుచున్నారు. దీనిని "వెంట్రిలోక్విజమ్" అందురు. ఇందు అనుకరణము_ ముఖ్యముగా స్వరవిన్యాసముల అనుకరణము_ప్రధానము. ఈమధ్య ధారా రామనాథశాస్త్రిగారు 'నాట్యావధానము' అనెడి నూత్నప్రక్రియను రూపొందించినారు. అష్టావధానాదులందువలెనే, పృచ్ఛకులు కొందరు కూర్చుండి, ఏవోకొన్ని విచిత్రసన్నివేశములను ప్రదర్శించుడని కోరుదురు; అంతట ఈ నాట్యావధాని, ఆ సన్నివేశముల నూహించుకొని, సాహిత్యమును కల్పించుకొని అవసరమైనచో_ఇరువురిముప్పుర్రి కంఠస్వరవైవిధ్యముతో_వానిని అభినయించిచూపును. వివిధ వేష

ధారణ సహితముగా, ఈ నాట్యావధానమును రంగస్థలమునందే కాక, రేడియోలోను ప్రదర్శించి విజ్ఞుల ప్రశంసలందినారు రామనాథశాస్త్రిగారు; ఈ నాట్యావధానమందు సాత్త్వికాభినయమునకు ప్రాధాన్య మధికము.

## సంస్కృత రూపకానువాదములు

1. చూ. సుప్రసన్నగారివ్యాసము — "సంస్కృతరూపకములు - అనువాదములు" — జయంతి-అక్టోబరు. 1959. వీరివ్యాసమునకు జోడించిన 'అనుబంధము'నుబట్టి 35 గురు సంస్కృత రూపకకర్తల 56 సంస్కృతరూపకములు పలువురుకవులచేత ఆంధ్రీకృతములైనవి: ఈ తెలుగు అనువాదముల మొత్తము 225. (కాని ఈ పట్టిక సమగ్రముకాదు. ఈ అనుబంధమున చేరని మరికొన్ని అనువాదములుకూడ కలవు).

2. యథాతథానువాదవిషయమున కొందరు సంశయగ్రస్తులై యున్నారు. ఈ సందర్భమున రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి వాక్యములు పరిశీలనార్హములు—"మక్కికిమక్కి-పరివర్తనము చరిత్రదృష్టి కలవారికి, అదితప్పు వేరుదృష్టిలేనివారికితప్పు తక్కినవారికి నిష్ఫలమైనబరువు. ఈపరివర్తనము కేవల మాధునికమైన ఆంగ్లసాహిత్యపుసహవాసముచే మనకు దాపురించినదేకాని ప్రాచీనులిట్టి దాస్యమెరుంగరు. మూలగ్రంథమహత్త్వము మరుగుపడుట, అందలి లోపము లనావశ్యకముగా ప్రకటింపబడుట, భాషాంతరీకర్తస్వత్వము పూర్తిగా నంతరించుటయను త్రిదోషములు ప్రాప్తమగును."

శర్మగారి పైఅభిప్రాయము సమంజసముకాదు. 'అనువాద'మన్నప్పుడు మూల విధేయముగా నుండకతప్పదు. ఇంకఅనుకరణము, అనుసరణము అన్నప్పుడు ఎన్నిమార్పులు చేసి కొన్నను చేసికొనవచ్చును; అది వేరువిషయము. ఈ భేదము నందరును గుర్తించుట యావశ్యకము.

## ఆంగ్ల రూపకానువాదములు

1. ఆంగ్లరూపకముల అనువాదవిషయమున డా. ఆర్.కె. యాజ్ఞిక్ వాక్యములు గమనార్హములు—

"While summing up the argument for Shakesperean adaptations, one may recall Dryden's observations on poetic translation (preface to Ovid's ‹Epistle'). He carefully distinguished between metaphrase, paraphrase and imitation. A mere verbal copier 'dances on ropes with fettered legs'. In order to avoid obscurity in literal translation and to secure perspicuity and gracefulness, he recommends the gifted 'later poet to write like one, who has written before him, on the same subject; that is, not to translate his words or to be confined to his sense, but only to set him as a pattern, and to write, as he supposes that the author would have done, had he lived in our age, and in our country'. These remarks especially fit in with stage-versions of foreign plays. Even ‹customs and ceremonies of another age and place will have to be modified so that the play may be fully enjoyed by the audience."

—The Indian Theatre - pp. 128-29.

2. యథాతథముగా ఆంగ్లీకరింపబడిన సంస్కృతరూపకములు పాశ్చాత్యులను ఆకర్షింపలేక పోయినవనేడిసత్యమును మరచిపోరాదు: అట్టిప్రదర్శనము లొకటిరెండు లండనునగర నాటక రంగమున జయప్రదములు కాలేదని తెలియవలెను.

3. మారిస్ మేతర్లింకు రచనలు అన్నింటిని తెలిగించెడి ప్రపంచపు కాపీరైటు భమిడిపాటివారి కుండెడిది. అందుచేత భమిడిపాటివారు ఆచంట జానకిరామ్‌గారికి నోటీసుఇచ్చుటకూడ జరిగినది.
చూ. జానకిరాంగారి "నా స్మృతిపథంలో...." – పుటలు 153–54.

## తెలుగురూపకములపై ఆంగ్లరూపకముల ప్రభావము

1. "Influence of English on Telugu Literature" అనెడి విషయముపై జి.నారాయణస్వామి రెడ్డిగారును (మద్రాసు విశ్వవిద్యాలయము), కొత్తపల్లి వీరభద్రరావుగారును (ఆంధ్రవిశ్వవిద్యాలయము) పరిశోధనావ్యాసములను రచించి క్రమముగా ఎమ్.లిట్; డాక్టరేట్ పట్టములను పొంది యున్నారు. చూ. "ఆంధ్రనాటకరంగముపై పాశ్చాత్యప్రభావం"—శ్రీ నాగభూషణ్– ఆంధ్రప్రభ (ఆదివారం సంచిక) 25–5–1958; 1–6–1958.

## విషాద రూపకములు

1. సంస్కృతమునందలి భాసుని "ఊరుభంగము"ను విషాదరూపకమునుగా కొందరు పేర్కొందురు. కాని, అందు దుర్యోధనుడు నాయకుడేకాదని కొందరందురు; అంతియేకాదు, ఆతడు ధర్మాధర్మ నిర్ణయము కుదురని సంకటపరిస్థితులలో పతనమైనవాడును కాదందురు. ఈ వాదోపవాదములను విడిచిపుచ్చి క్రిందివిధముగా సమాధానముచెప్పుకొనుట సమంజసముకాగలదు–భరతాదుల నిషేధము ప్రధానముగా నాటక–ప్రకరణపరమైనది. తక్కిన రూపకములనుగూర్చి ఆలంకారికులేమియును చెప్పలేదు. ఊరుభంగము నాటక–ప్రకరణేతరమైనదికాన భాసుడు నిజముగా నాయక మరణమునే చిత్రించినాడన్నను దోషము కాజాలదు.

2. ఈసందర్భమున ఇంకొకవిషయమునుకూడ గుర్తింపవలసియున్నది. మనపూర్వులు "కరుణము' నొకరసముగా పరిగణించియున్నారు. తక్కినరసములవలెనే అదియును ఆనందావహమే: కానిచో, మనము దానిని చూచుట కంగీకరింపము. అయినను, ప్రతిరసమును ఒక హద్దుమీరిన తరువాత అసహ్యమగును. శృంగారవిషయముకూడ ఇంతియే. నాయికా–నాయకుల సరససల్లాపములను, వారి పెండ్లిజరుగువరకును ప్రదర్శించి, వారి తరువాతి శృంగారచరిత్రపై తెర వైతుము. శోకమునకు ఫలముగా మరణమును చిత్రించినట్లే, శృంగారమునకుఫలముగా వారి తరువాతి చరిత్రను చిత్రించినచో...? రసము ననుభవించి యానందించు మన సత్త్వముకూడ తక్కిన ప్రకృతిధర్మములకు లోపడినదేకాని కేవలము స్వతంత్రముకాదు. రసమేదియైనను మనము సహజముగా నేర్పరచుకొన్న నీతి, ధర్మము, ఆనురూప్యము. సౌమనస్యము మొదలగు హద్దులను మీరిపోయినచో దాని ఫలమగు ఆనందము దూరమగును. రాళ్ళపల్లివారి 'నాటకోపన్యాసములు' (1935) చూడవలయును. పుటలు 87–94.

1. విషాదనాయకుని సర్వనాశము పైకిచాల అన్యాయముగా, ఘోరముగా కన్పించును. కాని, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పేర్కొన్నట్లుగా అధర్మసంహరణములో ధర్మము కొంతవరకు త్యాగము కావలసివచ్చుట తప్పదు. సత్యసమ్మతము లేదా కావ్యసత్యములయిన ఇట్టి కల్పన విషాదత్వమునకు మరింత దోహదకారియగును. "కింగ్‌లియర్"లోని కార్డీలియా మరణమును, "విషాద సారంగధర"లోని సారంగధర మరణమును ఇట్టి ఘట్టములే,

4. భారతీయులవలెనే గ్రీకులును, షేక్స్పియరునుకూడ ఉత్తములనే నాటకనాయకులనుగా స్వీకరించియుండుట గమనార్హము. ఇప్పట్ల నాయకులను ఆదర్శవ్యక్తులుగా చిత్రించుట భారతీయులదృష్టి. కాని, విషాదత్వమును పరాకాష్ఠపొందింపవలెననెడి దృష్టితో తక్కినవారు తమ నాయకులను స్వీకరించినారు. నాయకుని మహాపురుషత్వమునుబట్టి అతని స్వల్పదోషమో, ప్రమాదమో ఘోర పరిణామమునకే దారితీయును. సాధారణముగా అల్పులదోషములు ఘోరపరిణామములకు దారి తీయవు. కాని ఒక్కొక్కప్పుడు మహాపురుషుల అల్పదోషములుకూడ భూకంపములను పుట్టింప సమర్థములగును. అట్లే ఉదాత్తనాయకుని విషాదపరిస్థితియే మానవహృదయమును సంపూర్ణముగా కదలింపగలదు.

వ్యాపారమున, గుగ్గిళ్ళసెట్టి లాభనష్టములు లోకముదృష్టిలో అంతగా పరిగణనీయములు కావు, కాని, ఒక రత్నాలవర్తకుని ఓడ సముద్రగర్భములో మునిగిపోయినదన్నచో కలిగెడి సంచలనమును ఇప్పట్ల ఊహించుట సమంజసముకాగలదు.

## ప్రహసనములు

1. "Farce, an extreme form of comedy in which laughter is raised at the expense of probability, particularly by horse-play and bodily assault. It, must, however, retain its hold on humanity, even if only in depicting the grosser faults into travesty and burlesque. Its subject is the inherent stupidity of man at odds with his environment, and it belongs in its origins to the great submerged stream of folk drama of which little written record remains . . . . In modern usage the farce is applied to a full-length play dealing with some absurd situation lingering generally on extra-marital relations–hence the term bed-room farce. Farce has small literary merit, but great entertainment value, and owing to its lack of subtlety can be translated easily than comedy." —The Oxford Companion to the Theatre—P. 255.

2. "లంబోదరప్రహసన"మనుపేర ఇంకొకటి కలదు. కాని, అది బూతులతో నిండినది; ప్రహసన మని చెప్పదగినదికాదు.

3. ఆత్మస్థపరస్థభేదములచేత హాస్యము రెండువిధములని భరతుడు పేర్కొనెను—దానిపై వ్యాఖ్యానించుచు అభినవగుప్తుడు క్రిందివిధముగా పేర్కొనెను—

"ఒకడు నవ్వుచున్నప్పుడు, హాస్యకారణమును మనము గుర్తింపలేకపోయినను, వానిని చూచి మనమును నవ్వుచుందుము. కారణమును ప్రత్యక్షముగా చూచినను గాంభీర్యముచే ఒక్కొక్కప్పుడు మనము నవ్వును అణచిపెట్టుకొందుము: అయినను నవ్వుచున్న ప్రక్కవానినిచూచి మనమును హాసన్ముఖుల మగుచునేయుందుము. కాగా, హాస్యము సంక్రమణస్వభావముకలదని తెలియవలెను. ఇట్టిది పరస్థమగును. ఇంక తాను ప్రత్యక్షముగా హాస్యకారణమును గుర్తించి నవ్వుట ఆత్మస్థమగును." (అభినవభారతి-1వ సం. పుటలు 318-14).

4. "Laughter makes good blood" అనెడి ఇటాలియన్ సామెత ఇప్పట్ల స్మరణీయము. నవ్వించుటయనగా దివ్యత్వమిచ్చుటయని యర్థము. ఆరోగ్యవంతుడు, శిష్టుడు, సంస్కారి అయిన

వాడే హాస్యవిషయమున ప్రమాణమని చెప్పవలెను. హాస్యము అతిగానున్నచో అది జుగుప్సావహ మగుట తథ్యము.

## ఏకాంకికలు

1. "ఖండకావ్యాల్లో ఒకవ్యక్తిభావాలేవుంటాయి. కథానిక ఒకవ్యక్తి కల్పననిచూపిస్తుంది. ఏకాంకికలో కవి వ్యక్తులభావాలూ, ఆశయాలూ, ఆశలూ ఊహించి వాటికి జగడంపెట్టి మనకి విస్మయం కలిగేటట్టుగా పరిష్కారంచేస్తాడు".

—డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి — "తెలుగుఏకాంకిక" - భారతి-విరోధి పుష్యము.

2. ప్రహసనములు, పద్యనాటికలు, గేయనృత్యనాటికలు, శ్రవ్యనాటికలు 'ఏకాంకిక'జాతిలోనివే అయినప్పటికిని, అవి ప్రత్యేకవ్యక్తిత్వముగల శాఖలుకాన వానిని 'ఏకాంకికలు'అనెడి ఈ శీర్షికలో చేర్పలేదు.

## గేయరూపకములు

1. చూ. రజనీకాంతరావుగారి వ్యాసము "సంగీతనాటకాలు"—నాట్యకళ-మార్చి, 1959.

గేయరూపకములనే వీరు "సంగీతనాటకాలు" అని పేర్కొనినారు. గేయనాటికలను "గీతి నాటికలు" అనినారు సూరంపూడి భాస్కరరావుగారు.

## శ్రవ్య (రేడియో) రూపకములు

1. చూ. నాగభూషణ్‌గారి వ్యాసము—"శ్రవ్యరూపకం" -'నవోదయ' 1-11-1959; 1-12-49 తేదీలు.

2. సంస్కృతమునందలి ధ్రువాగానప్రయోజనము క్రిందివిధమున. ఐదువిధములుగా నుండును—

(1) ప్రవేశగానము—రంగమునందుప్రవేశించు పాత్రయొక్క భావమును, ప్రకృతిని అవస్థానమును సూచించుగానము.

(2) ప్రసాదగానము—రంగస్థలమందున్న పాత్రయొక్క చిత్తవృత్తిని సామాజికులకు తెలియజేయు గానము.

(3) ఆక్షేపగానము—రసాంతరమును సూచించుటకు చేయబడు గానము.

(4) అంతరగానము—గతి-పరిక్రమ నిరూపణాద్యవసరములందు చేయబడుగానము.

(5) నిష్క్రామగానము—పాత్ర నిష్క్రమించునప్పుడు చేయబడుగానము.

బాలరామాయణ ప్రస్తావనలో రాజశేఖరుడు ధ్రువగానమును నాటకమునకు తొలిప్రాణ మునుగా పేర్కొనియుండుట స్మరణీయము.

3. పెద్దపెద్ద రంగస్థలనాటకములను సంక్షేపించి, గంట గంటన్నరసేపటిలో రేడియోప్రసారము చేయుచున్నారు. విశ్వనాథవారి "వేయిపడగలు", అడివి బాపిరాజుగారి "నారాయణరావు"వంటి పెద్ద నవలలుకూడ రేడియోవారిచేతులలో శ్రవ్యరూపకరూపమును తాల్చినవి: ఇంక కిన్నెరసాని పాటలవంటివానికి లెక్కయేలేదు.

## ద్వితీయాధ్యాయము

# నాటకప్రయోగ సమీక్ష

### భూమిక

భారతదేశమునందలి ప్రధానవిశ్వవిద్యాలయములు మూడును (కలకత్తా, బొంబాయి, మద్రాసు) 1857 లో స్థాపింపబడినవి. ప్రథమస్వాతంత్ర్యసమరము అణగద్రొక్కబడుటతో దేశమున తాత్కాలికమైన ఒకవిధమగు శాంతినెలకొన్నది. నాగరకులు, ముఖ్యముగా పట్టణ వాసులు, ఆంగ్లమున ఉన్నతవిద్య నభ్యసించుట కారంభించిరి. ఒకప్రక్క భారతీయులు ఆంగ్ల విద్యాపాటవమునకు పాటుపడుచుండగా, వేరొకప్రక్క పాశ్చాత్యపండితులు ఆయా భారతీయ భాషావాఙ్మయముల పునరుద్ధరణమునకు, వ్యాప్తికి, అభివృద్ధికి ఎంతయో తోడుపడసాగిరి. ఇది కొందరు భారతీయులకు బాగుగా కనువిప్పు అయినది. కాగా 1880_90 ప్రాంతములనాటికి ఆంగ్ల విద్యాభ్యాసముతోపాటు సంస్కృత_భారతీయ భాషాసాహిత్యముల వ్యాప్తికి కృషిచేయు వ్యక్తులు అధికసంఖ్యాకులైరి. విద్యావిషయకమైన యీ మార్పు రాజకీయములందుకూడ ప్రతి ఫలించి 1885 లో భారతజాతీయకాంగ్రెసు సంస్థాపనమునకు దారితీసినది. ఆ యా పరిస్థితుల ప్రభావము ఆంధ్రదేశమునందేకాక తదితరరాష్ట్రములందును ఇంచుమించుగా సమానముగానే కన్పట్టగలదు.

తెలుగుదేశమున ఆధునికమార్గరూపకరచనకు దారితీసినవారు ముఖ్యముగా కళాశాలల యందలి, ఉన్నతపాఠశాలలయందలి ఉపాధ్యాయులు (ప్రధానముగా తెలుగుపండితులు). ఇంచు మించుగా వారే ఆ సమాజముల కధ్యక్షులు, దర్శకులుకూడను. తొలిసమాజములలోని నటులు ప్రధానముగా విద్యార్థులు. అటుపిమ్మట ఉద్యోగస్థులుకూడ చేరసాగిరి. రచయితలకు అటు పాశ్చాత్యనాటకములు, ఇటు సంస్కృతనాటకములు మార్గదర్శకములైనవి. నటులకు ఇతర రాష్ట్రములనుండి వచ్చిన సమాజముల ప్రదర్శనములు మార్గదర్శకములైనవి. ఇంక నాడు ఒక వెల్లువగా వచ్చిన ఉత్సాహమునకు మేరయేలేదు. ఈవిధముగా తెలుగుదేశమున నాటక_రచనా ప్రదర్శనములు నిరంతరముగా సాగిపోవుట కవకాశ మేర్పడెను.

భారతీయభాషలలోని ఆధునికనాటకప్రదర్శనముల యారంభమునుగూర్చి శ్రీ ఆర్.కె. యాజ్ఞిక్ సంక్షిప్తముగా పేర్కొన్న క్రింది అంశములు ఇప్పట్ల పరిశీలనార్హములు—

1. The English merchants and officials brought the contemporary European theatre with them, and held it as a model before the high-class and educated Indian audiences. It fired the imagination of a people who had the rich heritage of the past, which had, however, grown faint during the Moslem rule. The fascination of the novel spectacle and admiration for the rulesled to imitation.

2. The new theatre came full-fledged. There was no question of the model to be followed. India simply adopted the mid-victorian stage with all its accessories of painted scenery, costume and make-up.

3. The greatest service which the British theatre did was to create a genuine love of amateur acting as an art. This was a new idea and came with a magical effect when high officials and eminent professors were seen in several roles on the stage. Consequently, the new theatre acquired a dignity and a status which could not have been achieved otherwise.

4. Not only this, but the presence of distinguished women on the stage and in the auditorium opened a great vista before India, which had the Purdah System of the Moslems. This made possible the appearance of several good actresses on the one hand, and of advanced ladies in the auditorium on the other.

5. Along with the marvellous theatrical appeal came the deep and abiding influence of the richest dramatic literature to the young and eager minds of the college students, in the true spirit of the renaissance. Shakespeare, with his universal appeal and many features in complete harmony with the spirit of the ancient Hindu Drama, was loved and admired, passionately studied and enthusiastically produced on the college stage first in English and, later on, in the vernacular.

6. In such productions the aid of several English actors and actresses was sought, and a spirit of co-operation resulted. On many occassions, the Anglo-Indian press also paid a glowing tribute to vernacular productions, play-wrights and actors, one of the latest being a chorus of encomiums on the death of Amrit lal Bose in 1929. Distinguished Europeons were often entertained at

Indian theatres with English translations or synopsis of Vernacular plays.

7. European scenic artists have also been invited to help and Anglo-Indian girls have figured on the Indian stage.

8. For the evolution of the new theatre, some of the educated actors visited England and other countries and brought back novel ideas and stage technique.

9. So far as the professionals are concerned, spectacular shows have played the most important part.

10. Light operas and loose farcial productions were eagerly seized from European example in order to attract the crowd. Such pieces stimulated the performance of several medieval skits with a few changes.

11. But the English theatre also handed the legacy of shrewd comedies of manners which pointedly drew attention to glaring evils.

12. The greatest service to the Indian stage was the gift of Romantic tragedy. This idea came from Shakespeare, as the widespread production of Hamlet in India proves.

13. Once tragedy was accepted, exaggeration of certain elements was bound to creep in, as one may notice especially on the Urdu stage.

14. The English tragi-comedy intensified the love of this type of play ingrained in the Indian mind, and let to its full cultivation.

15. The types of plays produced on the stage have generally followed the order of the development from mythological and saint plays to historical and social tragedies and farcical andsatirical sketches of contemporary manners and customs, passing through the middle stages of Sanskrit translations and English adaptations and patriotic historical plays (praising heroism, self-sacrifice, chastity, and love of the motherland).

16. In the spirit of the renaissance, not only Sanskrit and English, but Persian, Arabic, Spanish, and French materials were exploi-

ted for stage purposes, the distant time and place lending peculiar charm.

17. There was never a real conflict between the Sanskrit classical model and the English dramatic model, for translation of ancient master pieces were frequently produced along with clever Shakespearean adaptations on the Indian stage with remarkable success, due to the many links of inner harmony existing between the two.

18. Lastly, the Indian theatre could not grow naturally on its own lines, as was the case with some other countries. The full-fledged foreign theatre came to a subject nation and overawed it completely, with the obvious result that many efforts were made simultaneously for a commercial success, and the several types had not the necessary period and atmosphere to grow in due course to fulness, beauty and strength.[1]

తెలుగుదేశమందలి నాటకసమాజముల చరిత్రయందు మొత్తముమీద ఐదు స్థూలదశలు గోచరించుచున్నవి—

ప్రథమదశ లేదా ఆరంభయుగము (1880_1886) : కేవలము విద్యార్థులు, ఉపాధ్యాయులు (ప్రధానముగా తెలుగుపండితులు) కలిసి ఉత్సాహమే ప్రధానముగా పనిచేసిన కాలమిది. సమాజముల స్థాపనకు మూలకారకులైన తెలుగుపండితులే నాటకకర్తలుగాకూడ నుండెడివారు. దేశికులుకూడ వారే. ఈ సమాజములకు ఊరిలోని పెద్దలతోడ్పాటు మృగ్యమని చెప్పవచ్చును. ఇంక తల్లిదండ్రులు తమపిల్లలు నాటకములందు వేషములువేయుట కంగీకరించెడివారుకాదు; చాటుమాటుగానే విద్యార్థు లిందు వేషములు వేయవలసివచ్చెడిది.

ద్వితీయదశ లేదా వికాసయుగము (1886_1912): ఈదశలో కులీనులు, ఉద్యోగస్థులు సమాజములను ఆదరింపసాగిరి; కవులేకాక ఉన్నతోద్యోగులుకొందరు వేషధారణము చేయసాగిరి. కాగా. అంతకుముందే ఏర్పడిన సమాజములు బలపడినవి; మరికొన్ని క్రొత్తసమాజములు కట్టుదిట్టమైన పునాదులమీద వెలసినవి. నాటకములు విరివిగా బయలుదేరినవి; ఒక్కొక్క సమాజమునకు ఒక్కొక్కకవి స్థిరపడెను; ఆ కవి నాటకములు ఆ సమాజమునకు 'సొంత సొత్తు'. 1900 ప్రాంతముల పెక్కుసమాజములవారు సొంతనాటకశాలలను (Pucca Theatres) నిర్మించుకొనినారు. ఆదిలో అందరును ఔత్సాహికనటులే అయినను క్రమముగా వృత్తినటు లేర్పడసాగిరి. దేశమున అందరకును నాటకరంగమన్నచో అమితమైన అభిమాన మేర్పడినది.

తృతీయదశ లేదా స్వర్ణయుగము (1912_1928) : ఈదశలో పెక్కునాటకసమాజములు వ్యాపారసంస్థలవలె నడచినవి. వారివారి యోగ్యతలనుబట్టి నటులకు జీతము లేర్పడినవి. కొన్ని

కొన్ని నాటకములకు, కొందరు కొందరు నటులకు ఎనలేని ఖ్యాతి వచ్చెను. ఒక్కొక్క ప్రదర్శనమునకు వేలకువేలు ఖర్చుపెట్టి బ్రహ్మాండమైన సీనరీలు తయారుచేసిన కాలమిది. 1900 పూర్వమే బళ్ళారి, మద్రాసుసీమలలో పద్యములకు పాటలకు వ్యాప్తియుండెను. 1900 తరువాత సర్కారు జిల్లాలలో పద్యములకుప్రాధాన్యమువచ్చెను; ఇంక ఈవ్యాపారదశలో పాటలకు(హార్మోనియం-తబలాలకు)కూడ ప్రాముఖ్యము హెచ్చినది. ఇంచుమించుగా మంచికంఠమున్నవాడే ఉత్తమ నటుడుగా చలామణియైన దశయిది.

చతుర్థదశ లేదా సంధియుగము (1928-1944); 1928 నాటికి పై వ్యాపారసమాజములన్నియును సన్నగిలి యదృశ్యమైపోయినవి. నటులు చెల్లాచెదురైనారు. అంతటితో తెలుగు నాటకరంగమున నాటకముల కాంట్రాక్టుశక మారంభమైనది; ఇదినాటకకళకు ఒకవిధముగా క్షీణదశ. కాని, ఒకమూల బళ్ళారి రాఘవాచార్యులుగారును, ఇంకొకమూల క్రొత్తగానేర్పడిన ఆంధ్ర నాటక కళాపరిషత్తును తెలుగునాటకరంగమున క్రొత్తపోకడలను ప్రవేశపెట్టుటకును, నాటక కళోపాసకులను అభిమానులను సంఘటితపర్చుటకును ప్రయత్నములుచేసిన మంచికాలమును ఇదియే; అందుచేత దీనిని 'సంధియుగ'మనుట లెస్స.

పంచమదశ లేదా నవ్యయుగము (1944-1960); ఇది ఔత్సాహికనాటకసమాజముల కాలము; ప్రాతపద్ధతి యంతయును మారిపోయిన కాలమును ఇదియే. అందుచేత దీనిని నవ్య యుగమనవచ్చును.

పై దశలను వివరించుటకుముందు క్రింది రెండు నాటకసమాజములనుగూర్చి కొంత తెలిసికొనుట యవసరము. వానితోబాటు తెలుగుదేశములోని తొలి ఆంగ్లనాటకప్రదర్శముల విషయమును తెలిసికొనవలయును. అంతియేకాదు—తెలుగుదేశమున ఆధునికనాటకసమాజములు వెలయుటకు ప్రేరకమైన ధార్వాడ నాటకసమాజమునుగూర్చికూడ ప్రత్యేకముగా తెలిసికొనవలసి యున్నది.

జగన్నాథ విలాసినీసభ (విజయనగరము) :

1883 వ సంవత్సరమునకుముందే విజయనగరములో ఒక నాటకసమాజము ఏర్పడి యున్నట్లు వావిలాలవారి ఉత్తరరామచరిత పీఠికనుండి తెలియుచున్నది. నాటకములందాదరముగల మహారాజా శ్రీ విజయరామగజపతివారి ఆదరణములో "జగన్నాథ విలాసినీసభ" అనెడి నాటకసమాజము 1874 లో స్థాపింపబడినట్లు తెలియుచున్నది.[2] 1879 లో శ్రీ విజయరామ గజపతిమహారాజావారు మరణించినారు. అటుపిమ్మట మహారాజైన శ్రీఆనందగజపతివారి ఆదరణములో ఈ సమాజము మరింత అభివృద్ధికివచ్చెను. ఇందు గంటి బుచ్చిశాస్త్రిగారు ప్రధానవ్యక్తి; (అందుచేతనే దీనిని 'బుచ్చిశాస్త్రికంపెనీ' అనికూడ అనెడివారట). ఈ సమాజమువారు శాకుంతలము, ఉత్తరరామచరితము మొదలగు కేవలసంస్కృతనాటకములనే ప్రదర్శించెడివారు; అందుచేత దీనికి 'సంస్కృత అకాడెమీ' అనెడి పేరుకూడ వచ్చినది.

శ్రీయుతులు బుచ్చిశాస్త్రి, చొప్పల్లి నరసింహం, కణ్ణా పేరయ్యశాస్త్రి, కణ్ణా పాపయ్యశాస్త్రి, పప్పు వెంకన్న, ఆదిభట్ట జగ్గావధాన్లు (నారాయణదాసుగారి అన్న) మొదలగువారిందలినటులు. బుచ్చిశాస్త్రిగారు నాయకభూమికలను (దుష్యంతుడు, పురూరవుడు మొ॥) ధరించెడివారు. వీరు శాస్త్రీయసంగీతమును, భరతమునుకూడ అభ్యసించినవారు; అంగసౌష్ఠవము, దానికితగిన గాత్రము కలవారగుటచేత పాత్రపోషణ మద్భుతముగా నుండెడిదట. చొప్పల్లి నరసింహం (సూర్యనారాయణ భాగవతార్ గారి జనకులు) గారు నాయికాభూమికలను ధరించెడివారు. వీరి 'శకుంతల'వేషము ఒకసారి మద్రాసులో మహారాజావారినే భ్రమింపజేసినదట. పప్పు వెంకన్నగారు గొప్ప వైణికులు, మంచి పాటకులు. విరామసమయములలో వీరి సంగీతము పట్టణమున కంతటికిని మైమరపు కలిగించెడిదట. కణ్ణా పాపయ్యశాస్త్రిగారు 'సూత్రధారు'లై ప్రదర్శనమును సరళముగా నడిపించుచుండెడివారు. ఇంక పేరయ్యశాస్త్రిగారు విదూషకభూమికలకు పెట్టినదిపేరు; వీరి కణ్వభూమికాధారణముకూడ చక్కగానుండెడిదట. జగ్గావధాన్లుగారు రాక్షసవేషములకు ప్రసిద్ధి; వీరి వేషములనుచూచి చిన్నపిల్లలు జడుసుకొనెడివారట. ఆంగ్లహరిశ్చంద్రాదులను రచించిన గోమఠం శ్రీనివాసాచార్యులుగారు తరువాతి కాలములో ఈ సమాజములో దుష్యంత–హరిశ్చంద్రుల భూమికలను ధరించుచుండెడివారు; అంతియే కాక వీరు ఈ సమాజమునకు దేశికులుగాకూడ నుండెడివారు.

ఇది మహారాజావారి ఆదరణములోని సమాజమగుటచేతను, ఇందలినటులు నిజముగా పండితులగుటచేతను ఈ సమాజమునకు దేశములో అధికగౌరవము ఉండెడిది. 23–5–1897 తేదీన ఆనందగజపతి మహారాజావారు చనిపోవుటతో ఈ సమాజము సన్నగిల్లిపోయినది.[3]

అసలు ఈసమాజమే తెలుగుదేశమున ఆధునిక కాలమున మొదటి నాటకసమాజమగుచున్నది. కాని అప్పుడిది కేవలము సంస్కృతనాటకములకే పరిమితమై యున్నది.

## ది ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ (మద్రాసు) :

దృశ్యప్రబంధములైయుండియు, శ్రవ్యప్రబంధములుగానే పండితోత్తములనైత మనేకశతాబ్దములుగా వినియోగించుచున్న సంస్కృతనాటకములను దృశ్యప్రబంధములుగాఁజేయ నుద్యమించి 1879–80 ప్రాంతముల శ్రీమాన్ గోమఠము సి. వి. శ్రీనివాసాచార్యులుగారు మద్రాసులో "ది ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ" అనెడి నాటకసమాజమును స్థాపించిరి. దానికి వారధ్యక్షులేకాక, స్వయముగా ప్రధానభూమికలనుకూడ ధరించెడివారు. 1880 నవంబరులో మద్రాసు గవర్నరు, విజయనగరం మహారాజా శ్రీమదానందగజపతి ప్రభృతులయెదుట శాకుంతలములోని దుష్యంతపాత్రను అపూర్వముగా నటించి 'ది ఇండియన్ గారిక్' అనెడి బిరుదమును పొందినవారాచార్యులుగారు.[4]

కందుకూరివారి బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మబోధిని అను రూపకములనుగూర్చి నాడు 'హిందూపత్రిక' ఒక సమీక్ష వ్రాయుచు "By the way we may mention that these prose dramas like Brahma Vivaham will be most acceptable to the

Oriental Dramatic Co,. as they are in sore want of popular dramas adopted to the stage" అని పేర్కొనియుండుట గమనార్హము (వివేకవర్ధని-3వ సం. 12వ సంచిక). అనగా ఈ సమాజమువారు దేశభాషలలో, అందున తెలుగులోకూడ, నాటకములను ప్రదర్శించెడివారన్నమాట. అర్వాచీనకాలములో శ్రీనివాసాచార్యులవారు కమలాపహరణము మొదలగు కొన్ని తెలుగునాటకములనుకూడ వ్రాసియుండుట స్మరింపదగినది.

### ఆంగ్ల నాటకప్రదర్శనములు :

ఆంగ్లదేశమునుండి మనదేశమునకువచ్చిన డైరెక్టర్లు, గవర్నర్లు, ఇతర సైనికాధికారుల కాలక్షేపముకొరకు ఈస్టిండియాకంపెనీ రోజులలోనే మనదేశమున ఆంగ్లనాటకప్రదర్శనములు ప్రారంభమైనవి. ఆ నాటకప్రదర్శనములవలన ఉత్తేజితులైన వంగదేశీయులు, పార్శీలు దేశీయనాటకసమాజములను స్థాపించియున్నారని ఇంతకుముందే తెలిపియున్నాను. ఈ దేశీయ నాటకసమాజములలో కొన్ని భారతీయభాషారూపకములనేకాక ఆంగ్లరూపకములనుకూడ ప్రదర్శింపసాగెను. ఈ ప్రదర్శనములందు పాల్గొన్నవారిలో కళాశాలవిద్యార్థులు, ఉపన్యాసకులు ముఖ్యులు.

1875 ప్రాంతముల మద్రాసులో "ది మద్రాస్ డ్రమాటిక్ సొసైటీ" స్థాపింపబడినది. ఇందు ఆంగ్లేయులాంగ్లనాటకములను ప్రదర్శించుచుండెడివారు (దీనికి ప్రతిస్పర్థిగా బయలుదేరినదే 'ది మద్రాసు ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ'). ఈ సొసైటీ ప్రదర్శనములందు 1885 ప్రాంతముల యూరోపియన్ హార్మోనియం, హిందూస్తానీ గజల్సు, ఆంగ్ల హాస్య గేయములు ప్రవేశించినవని శ్రీ ఆర్. కె. యాజ్ఞిక్ పేర్కొనియున్నారు. (The Indian Theatre—P.99).

1879 లో బళ్ళారిలో ధర్మవరమువారు మిత్రులతోకలసి కొన్ని ఆంగ్లేయనాటకములను ప్రదర్శించినట్లు చెప్పుకొనియున్నారు. 1887 సెప్టెంబరులో రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో ప్రథమశాస్త్రపరీక్షకు చదువు విద్యార్థులచేత ఆ కళాశాలప్రిన్సిపాలగు మాసుదొర 'మర్చంట్ ఆఫ్ వెనిస్' నాటకమును ప్రదర్శింపజేసెను. దొరగారు విద్యార్థులకు రెండుమూడుమాసము లుచ్చారణను, అభినయమును నేర్పిరి. ఈ నాటకపాత్రధారులలో పారుపల్లి అచ్యుతరామయ్య, చిలకలపూడి సీతారామయ్య, తల్లాప్రగడ చలపతిరావు, సత్యరాజు మృత్యుంజయరావు ప్రభృతులుగలరు. నాటకప్రదర్శనము నవాబుదేవిడీలోజరిగెను. అందు షయిలాకు వేషము వేసినవానిని సభాసదులు చాల మెచ్చుకొనిరట. రాజమహేంద్రవరములో నింగ్లీషునాటకములాడుట కదియేమొదలు (చిలకమర్తివారి స్వీయచరిత్ర—పుట 60). "నేను రాజమహేంద్రవరం చేరే సరికే (1889కి ముందే) కుందూరి వెంకటరత్నం, దాసు మాధవరావు ప్రభృతులు ఇంగ్లీషులో షేక్స్పియరు నాటకాలు ఆడుతూవుండేవారు" అని ప్రకాశంపంతులుగారుకూడ తెలిపియున్నారు. (నా జీవితయాత్ర-పుట 42).

విశాఖపట్టణములోని జగన్మిత్ర నాటకసమాజమువారు ఆదిలో కేవలము షేక్స్పియరు నాటకములనే ప్రదర్శించెడివారు. నెల్లూరి అమెచ్యూర్ నాటకసభవారు 1891 నుండి 1897 వరకు ప్రధానముగా షేక్స్పియరునాటకములనే ప్రదర్శించిరి. పై విధముగానే తక్కిన పట్టణములలో కూడ ఆంగ్లనాటకప్రదర్శనములు జరిగినవని తెలియుచున్నది.

## ధార్వాడ నాటకసమాజము

తెలుగుదేశములో ఆధునికనాటకప్రదర్శనములకు మార్గదర్శకులైనవారు ధార్వాడ నాటకసమాజమువారని తెలిపియున్నాను. ఈ సమాజము తెలుగుదేశమునకు రాకపూర్వమున్న స్థితిని, నూత్నముగా వారొసంగిన ప్రదర్శనముల పద్ధతిని దేశభక్త కొండా వేంకటప్పయ్యా పంతులుగారు క్రిందివిధముగా వర్ణించియున్నారు—"ఆదినములలోనే (1880 ప్రాంతముల) ధార్వాడ నాటకసంఘము గుంటూరులో నాటకములను ప్రదర్శించి, ప్రేక్షకులనెక్కువగ నాకర్షించుచు గొప్ప ధనము నార్జించెను. వీరు వీథులలో నాటకములు ఆడక, పెద్దపాక వేసి, ఆ పాకలో నాటకరంగమేర్పరచి, దానిలో పలురంగుల తెరలమర్చి అలంకరించి, ఆకర్షణీయముగ జేసియు, నాటకపాత్రలకు వీథినాటకములలోవలె మోటుగ కిరీటములు, భుజకీర్తులు మొదలగు నలంకారములుచేయక వారివారి స్థితులననుసరించి సహజముగ ప్రజలు ధరించు దుస్తులను ధరింపజేసి, వచనశైలిని సామాన్యముగ నొకరితో నొకరు మాట్లాడినట్లే నాటకప్రదర్శనమును గావించుచుండిరి. ఇందులో శృంగారము, క్రోధము, శోకము మొదలగు రసములు మిక్కిలి నిపుణముగ ప్రకటితమగుచుండెను. శోకమును పాడుచు ప్రదర్శించుట సహజానుభవమునకు విరుద్ధముగ దోచకమానదు. కాబట్టి సహజమార్గమున శృంగారాదిసరములను ప్రదర్శించుటయను నూతనపద్ధతి పలువురకు ఆనందమును గొల్పుచుండెను." (స్వీయచరిత్ర—పుటలు 22—23).

కాగా, తెలుగుదేశమున ఆధునికపద్ధతిలో నాటకమును ప్రదర్శించు విధానమునకు ధార్వాడవారే పునాదులువేసినారనుట స్పష్టము. ఈ విషయమునుగూర్చి పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి గారు వ్రాసిన వాక్యములుకూడ పరిశీలనార్హములు (ఆంధ్రనటప్రకాశిక - పుటలు 302 - 304)-

"ధార్వాడవారు మన జిల్లాలలో సంచారముచేసి వెళ్ళినతరువాత వీని (ప్రస్తుతం మనం చూచే నాటకాల) ప్రచారం క్రమంగా విస్తరించింది. అప్పటినుంచే కాగడాలూ, అర్ధశాలూ, బాడిదచెక్కనగలూ అదృశ్యమయినాయి. గాజుదీపాలూ, నాజూకువర్ణాలూ, హారాలూ, చెమికీలూ ప్రసన్నమయినాయి. ఇంకా ప్రక్కతెరలూ, పైతెరలూ, ఎక్కెతెరలూ, దిగేతెరలూ ఆరంభమైనాయి.

"ధార్వాడవారి నాటకాలు హిందీభాషలో ఉండేవి. సూత్రధారనటీసంభాషణలూ, విదూషకుని హాస్యాలూ, గజానన సరస్వతీసందర్శనాలూ, మధ్యమధ్య కథాప్రకటనలూ వారి నాటకాల్లో ముఖ్యంగాఉండేవి. ఇలా ఆడబడేవి కంపెనీడ్రామాలని అనిపించుకునేవి. ఒక డప్పు వాద్యంతో నాటకాన్ని చాటించడం, ఒకటిరెండు అణాలకు టిక్కెట్లు అమ్మడం మొదలైన ఆచా

రాలుకూడా వాటితోకలిసిఉండేవి. ఇంకా ధార్వాడనటుల్లో మంచిశిక్షణ, కట్టుబాటు, ప్రౌఢమయిన అభినయం, దానికితగినవేషం, వేషాల్ని బోలినరూపం, చక్కనిపాట, మంచిమాట మొదలైన సుగుణాలెన్నో కనిపించేవి. అవి మనవారిని బాగా ఆకర్షించాయి. ఆకర్షించడమేకాకుండా ఎంద రెందర్నో హిందీభాషాభిమానులుగాకూడ చేశాయి.

"హిందీనాటకాలాడాలనే ఉద్దేశంతో బందరులోనూ, మఱికొన్నిపట్టణాల్లోను, ఆవెంటనే చాలా సమాజాలు వెలశాయి. అలా యేర్పడి, ఇంతవరకూ నిలిచియున్న సమాజాల్లోకనిపించే నాట్యసంబంధమైన భక్త్యనురాగాలూ, గురుశిష్యన్యాయాలూ, అభ్యాసాలూ, ఆచారాలుకూడా ధార్వాడవారినుండి సంక్రమించినవిగానే బోధపడతాయి. ముఖ్యంగా అభ్యాససమయంలోకాక, ఇతరసమయాల్లో 'నటులైనా రంగంలో కాలుపెట్టనియ్యకపోవడం, నాట్యాధిదేవతను ప్రతిష్ఠించు కోవడం, ప్రతిరోజూ దాన్నిపూజించడం, సంస్కారినటులను మాత్రమే సేకరించడం, వారి నందర్నీ చక్కని కట్టుదిట్టాల్లో ఉంచడం, నటులందరూ భయభక్తులతో పాత్ర్యాంశాల్ని చెప్పు కోవడం, చెప్పుకున్నట్టు పరిశ్రమించడం, నాటకంనాడు శ్రద్ధగా పనిచెయ్యడం, ఇంకాపదిమంది వలన తమదోషాల్ని తాముతెలుసుకుంటూ ఉండడం, క్రమంగా ఆదోషాల్నన్నింటిని సవరించు కొంటూ ఉండడం, నమ్మకాన్ని చెడగొట్టుకోకుండాఉండడం, నాట్యసమయంలో క్షురకాదికర్మలూ, చుట్టాబీడీ సిగరెట్లూ, తేలికప్రసంగాలూ చేయకుండా ఉండడం, ఎంతవచ్చినా ఇతరసంఘాల్లోకి పోకుండాఉండడం మున్నైనవెన్నో మూర్తీభవిస్తూఉంటాయి..."

ముందుతెర పైకిచుట్టుకొనుచుండగా ప్రేక్షకులు అత్యంతాశ్చర్యముతో కళ్ళప్పగించి చూచెడిరోజులవి. ఇంక క్రొత్తరకపువేషాలు, సీనరీలు మొదలగునవి తెలుగుప్రజలను ముగ్ధులనుజేసినవనుటలో ఆశ్చర్యములేదు. అంతియేకాక నాదెళ్ళ పురుషోత్తమకవి చెప్పినట్లు వారి నాటకభాషయగు హిందీకూడ సంస్కృతసమ్మిశ్రితమై తెలుగువారికి సుబోధకముగనే యుండెడిది. దానితో తెలుగుప్రజలు వారికి సొమ్మువిరజిమ్మినారు. కావుననే ఈ ధార్వాడ సమాజమువారే మరల 1885 లో రెండవసారి తెలుగుదేశము వచ్చినారు. తెలుగుదేశమున టిక్కెట్లపద్ధతిని అమలులోనికితెచ్చినది ధార్వాడసమాజమువారే. ధార్వాడవారు తెలుగునాటక సమాజములవారికి నేర్పినవానిలో ముఖ్యమైనది సుశిక్షణము. సమాజమునకు ఎవరునాయకులో వారి అదుపాజ్ఞలలో తక్కిన సామాజికులందరును నడచుకొనవలసినదే. ఉదయమున లేచినది మొదలు రాత్రి పడుకొనువరకును జరుగవలసిన పనులన్నియును ఆయావేళలకు ఖచ్చితముగా జరిగిపోవలసినదే. అట్లే నాటకప్రదర్శనముకూడ ప్రకటింపబడినవేళకు ఖచ్చితముగా ప్రారంభ మయ్యెడిది. ఇందు వామన్‌భట్‌జోషీ, సీతారాంజోషీ అనువారు ప్రముఖులు.

ఇందలి నటులందరును సుశిక్షితులగుటయేకాక స్ఫురద్రూపులుకూడను; నాయికపాత్ర ధరించిన యువకుడు, వేషములో, రంగస్థలముమీద మెరిసిపోయెడివాడు. ఈసమాజములోని వారందరు పురుషులే. ధార్వాడసమాజమువారు స్త్రీలను సామాజికులనుగా చేర్చుకొనలేదు. స్త్రీ పాత్రలను స్త్రీలే వేయవలెననెడు వాదమును వారెరుగరు; అసలు సమర్థులగు నటులుండగా స్త్రీలే

కావలసిన అవశ్యకమును వారికిలేదు; పైగా స్త్రీలనుచేర్చుకొన్నచో సమాజమున అవినీతి పెరుగునేమోయని వారిభయము. మొత్తమునకు వీరిపద్ధతియే తెలుగుసమాజములవారికి చాల కాలమువరకును ఆదర్శముగానుండెను.

ప్రదర్శనప్రారంభమునకు 15 నిముషములున్నదనగా ఒకగంటమ్రోగెడిది. అప్పుడు సాంబ్రాణిధూపమువేసి అందరునుకలసి ప్రార్థనచేసెడివారు. అది అయినపిమ్మట రెండవగంట మ్రోగగానే తెరలేచెడిది. అప్పుడు సూత్రధారుడు (సాధారణముగా సమాజాధిపతి లేదా మేనేజరు) నాట్యాధిష్ఠానదేవతయొక్క లేదా ఇష్టదైవముయొక్క విగ్రహముతో ప్రవేశించి, పూజచేసి, ఆ విగ్రహమును ఒకమూలగా స్థాపించెడివాడు. అది నటులకు ప్రేక్షకులకుకూడ రక్ష. పిమ్మట సూత్రధారుడు నటిని పిలిచెడివాడు. ఆమె పాడుచు ప్రవేశించెడిది. మధ్యలో విదూషకుడు వికృతవేషముతో ప్రవేశించి, హాస్యసంభాషణలు సాగించెడివాడు. చివరనాటకోచితమైన ఋతువునుగూర్చి గానముచేసినపిమ్మట నటి నిష్క్రమించెడిది. అప్పుడు సూత్రధారుడు గజానన ప్రార్థన చేసెడివాడు. తుండాదులతో గజాననవేషధారి రంగస్థలముమీద ప్రత్యక్షమై ప్రదర్శనము నిర్విఘ్నముగా కొన్నసాగగలదని అభయమిచ్చి అదృశ్యమయ్యెడివాడు. పిమ్మట సూత్రధారుడు సరస్వతీప్రార్థనచేసెడివాడు. అంతట ఆమె వీణాపాణియై పైవిధముగానే ప్రత్యక్షమై అభయ ప్రదానముచేసెడిది,[1] అప్పుడు సూత్రధారుడు నిష్క్రమించును; పిమ్మట నాటకప్రారంభము. రంగమునకు రంగమునకుమధ్య ఖాళీసమయములలో కథాప్రకటనలు లేదా విదూషకుని హాస్య ప్రసంగములు, లేదా ఇద్దరుముగ్గురు వేషధారుల వినోదప్రసంగములు జరుగుచుండెడివి.

వీరి ఈ పద్ధతులనెల్ల తెలుగునాటకసమాజములవారు ఇంచుమించుగా 1920 వరకును అనుసరించిరనియే చెప్పవచ్చును. వారొకపద్ధతిని తెలుగువారికి నేర్పిపోయినారు. మంచికో చెడ్డకో వారిప్రభావము తెలుగుగడ్డమీద చిరకాలము వెలసినది. తెలుగులో నాటకరచన ఆరంభ మైనది; ఇంక ప్రదర్శనారంభముకూడ అయ్యెడికాలములో ఈ ధార్వాడసమాజమువారు వచ్చి నారు. అంతకుముందు వీథిభాగవత ప్రదర్శనములపద్ధతితప్ప ఇంకొకపద్ధతి తెలుగువారెరుగరు. కాని, ఉత్సాహముమాత్రము పెల్లుబుకుచున్నది. అట్టిస్థితిలో ఇంక ఏఇతరసమాజమువారైనను వచ్చి ఇంకొకవిధముగా ప్రదర్శనములొసంగియున్నచో, తెలుగునటులును, ప్రజలును అటే మొగ్గియుండెడివారు; అప్పుడు తెలుగునాటకరంగచరిత్రను ఇంకొకవిధముగా వ్రాయవలసి వచ్చెడిది.

తెలుగుదేశమున ధార్వాడనాటకసమాజమువారు వారి నాటకములను ప్రదర్శించిన ప్రతి యూరిలోను ఒకటికిమించిన నాటకసమాజములు బయలుదేరినవన్నచో అతిశయోక్తిలేదు. సహజముగా కళాభిమానులైన తెలుగుప్రజలలో నాటకాభిమానము వెల్లివిరిసినది; అదిఒక ఉప్పెన వంటిదన్నను దోసగులేదు.

# ఆరంభయుగము (1880-1886)

## వీరేశలింగం పంతులుగారు స్థాపించిన సమాజము[1] :

ధార్వాడవారి ప్రభావమునకులోనైన ప్రథములు రాజమహేంద్రవరమువారుగానే కన్పట్టు చున్నారు. మిత్రుల ప్రోత్సాహముతో 1880 సంవత్సరం నవంబరు, డిశంబరు ప్రాంతములలో పంతులుగారు స్థాపించిన కళాశాలావిద్యార్థుల సమాజము ధార్వాడవారు నాటకములు ప్రదర్శిం చిన పాకలోనే తమ ప్రథమప్రదర్శనము లొసంగుట గుర్తించియున్నాము. వావిలాలవారి ఉత్తరరామచరితానువాదముకూడ ఈ సమాజము కొరకే ఉద్దిష్టమైనది. ఈ సమాజములోని సోమంచి శంకరమనెడి కళాశాల విద్యార్థి, అడివికొల్లు కనకరాజు అనునతడు రత్నావళీ-చమ త్కార రత్నావళీ ప్రదర్శనములలో పాల్గొనినట్లు తెలియుచున్నది. కాని, ఈ సమాజము ఎక్కువ కాలము సాగినట్లు కన్పట్టదు. "ఈ నాటకప్రయోగమువలన సహితము పట్టణములో సంక్షో భము కలుగకపోలేదు. ఆ నాటకములయందలి పాత్రములు విస్తారముగా పాఠశాలలోని విద్యా ర్థులు. నాటకములలో వేషములువేయుట గౌరవహానికరమని యనేకుల యభిప్రాయమగుటచేత విద్యార్థుల సంరక్షకులు తమ బాలురచేత వేషములు వేయించినందుకయి నామీద నభియోగము తెచ్చెదమని నన్ను బెదరించిరి. నాటకప్రదర్శనమువలన విశేషలాభము కలుగుననియు, నీతి వృద్ధియగుననియు నేను దలఁచియుండినను విద్యార్థులు నాటకములాడుటయందలి యుత్సాహము చేతఁ దమ పాఠములయందశ్రద్ధను జూపునట్లు కనఁబడినందున నాటకసమాజముల యం దటు తరువాత నే నంతగా నాదరము చూపుచు రాలేమ." అని పంతులుగారు పేర్కొనియున్నారు. (స్వీయ చరిత్ర - 1వ భా. పు. 175-76) ఈ ప్రథమనాటకసమాజమునుగూర్చిన వివరము లింతకంటె అధికముగా తెలియుటలేదు[2].

## గుంటూరు హిందూనాటకసమాజము[3] :

ఆధునికకాలములో తెలుగుదేశమున ప్రథమదశలో స్థాపింపబడిన నాటకసమాజము లలో దీనికి విశిష్టస్థానము కలదు. సంచారముచేసి ఇతర పట్టణములలోకూడ విజయవంతముగా ప్రదర్శనములొసంగిన ప్రథమనాటకసమాజ మిదియేయని చెప్పవచ్చును. ధార్వాడవారు వచ్చి వెళ్ళిన వెంటనే తోలేటి అప్పారావు, పాతూరి శ్రీరాములు, బోలూరి హనుమంతరావు ప్రభృతి మిత్రులతో శిష్యులతో కలిసి కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1880-81 ప్రాంతముల ఈ సమాజమును స్థాపించిరి. శాస్త్రిగారే దీనికి కవులు, దేశికులును. ఈ సమాజమును గూర్చిన మరి కొన్ని వివరములు దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులుగారి స్వీయచరిత్రనుండి లభించు చున్నవి (పుటలు 23-24).

"...తగిన స్థలములో పాకలు వేయుట, తెరలు సిద్ధముచేయుట, నాటకపాత్రలకు కావలసిన దుస్తులు, అలంకారములు మొదలగు పనులు సర్కారు కచ్చేరీలలో గుమాస్తాలుగ నుండిన పొత్తూరు కృష్ణయ్య, భువనగిరి హనుమద్దీక్షితులు. భాగవతుల రాఘవయ్యగార్లును గుంటూరు ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉన్న భాగవతుల చెన్నకృష్ణయ్యగారును

చాల శ్రద్ధతో జరుపుచుండిరి. శ్రీ మల్లాది సోమయాజులు, ఇవటూరి వియన్నగార్లు విదూషక వేషమున మిక్కిలి సమర్థులు; ప్రతినాటకమునందును నాయకపాత్రకు కలగటపు నరసింహం అను నొక విద్యార్థి సమర్థుడుగ నుండెను. ఈయన బందరులో పిమ్మట కొంతకాలమునకు సెకండుగ్రేడు ప్లీడరుగ పనిచేసిరి. నాకు ప్రతినాటకమునందును ముఖ్యమగు స్త్రీ పాత్ర నియమించిరి. చెన్నూరి సూర్యప్రకాశరావు, భువనగిరి సూర్యనారాయణ అను మరి యిరువురుకూడ స్త్రీ వేషములు వేయుచుండిరి. వారి వేషములు ఎక్కువ అందముగ నుండెడివి. కాని, వారిలో కథ నడిపించు సామర్థ్యము కొంత కొరవడియుండుటచేత నన్నే ప్రధాన స్త్రీ పాత్రగా నేర్పరచవలసి వచ్చినది. ఆకృతికూడ పాత్రోన్నతికి అనుకూలముగనే ఉండి ప్రసంగములలో సందర్భోచితముగ రసపోషణ చేయుచు ప్రేక్షకుల హృదయముల నాకర్షించుచుంటినని పలువురు నన్ను మిక్కిలి అభినందించుచుండిరి. మంగళంపల్లి శాస్త్రియను నొకరు నాటకములలో విశ్వామిత్ర వేషములను వేయుచుండిరి. ఇతని ప్రసంగములు మిక్కిలి శ్లాఘ్యములుగ నుండెడివి. మొత్తమున ఈ నాటకసంఘమున చేరినవారందరును సమర్థులని పేరుపొందినారు.

"ఈ నాటకసంఘము గుంటూరులో 'ఫస్టు కంపెనీ' అని పిమ్మట కొన్ని సంవత్సరములకు పేరుగాంచెను. పిమ్మట మరియొకసంఘ మేర్పడుటచేత దీనిని ప్రజలట్లు పిలువజొచ్చిరి. మేము ఈ సంఘమును నడిపినంతకాలము (బహుశః నాలుగైదు సంవత్సరములు మాత్రమే) ద్రవ్యాపేక్షలేక కేవలము వినోదముగనే నడిపించియుంటిమి. ఒక్కసారి రాజమహేంద్రవరములో మా నాటకసంఘము హరిశ్చంద్రనాటకము ప్రదర్శించెను. మొదటిసారి నాటకము వేసినరోజున ఎవ్వరో పాకపై నిప్పు వేయుటచేత ప్రేక్షకులలో కలవరము కలిగి పాకలోనుండి వెలుపలకు తప్పించుకొని పోవలెనను తొందరలో నొకరి నొకరు త్రొక్కుకొనుట, కొందరికి గాయములగుట మొదలగు ప్రమాదములు సంభవించెను. కాని, రెండవసారి వేసిన నాటకము (బహుశః 1884 డిశంబరులో) చాల జయప్రదముగ నడచెను. అక్కడ ప్రధాన న్యాయవాదులలో నొకరైన మాకర్ల సుబ్బారావునాయుడు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదలగు పురప్రముఖులు నాటకమును దర్శించి, పాత్రల సామర్థ్యమును మిక్కిలి పొగడిరి."

ఈ నాటక సమాజమునుగూర్చి ప్రశంసించుచు "చక్కగా భాగములు చదివి ప్రయోగించిన పక్షమున పద్యనాటకములకంటె వచననాటకములే యెక్కువ మనోహరముగ నుండును...ఈ యభిప్రాయము గలుగుటకు గుంటూరు మొదటి నాటకసమాజము కారణము." అని చిలకమర్తివారు పేర్కొనియుండుట స్మరణీయము (స్వీయచరిత్ర–పుట–83). సర్కారు జిల్లాలలో వచననాటకములకు వరవడి దిద్దినవారు ఈ సమాజమువారే అని చెప్పవచ్చును.

## బందరు నేషనల్ థియేట్రికల్ సొసైటీ :

1880–82 ప్రాంతముల "జువెనైల్ హిందూ థియేటర్" అను పేరుతో బందరులో దేవరసు వేంకట శివరావు, బాలకృష్ణయ్యగార్ల ప్రోత్సాహముతో ఒక నాటకసమాజము స్థాపింపబడెను. మొదట తెలుగు నాటకములాడినారుకాని, ధార్వాడవారివలె హిందూస్థానీ

నాటకముల నాడవలెననెడి యభిలాష వారికి నానాటికి మిక్కుటమయ్యెను. అంతట మేనేజరు అయిన దాసాని వేంకటస్వామినాయుడుగారు శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ కవిని అర్థించి, వారిచేత 32 హిందూస్తానీ నాటకములు రెండేండ్లలో వ్రాయించెను (1884–86). అంతట ఈ సమాజము 'నేషనల్ థియేట్రికల్ సొసైటీ' అను పేరుతో 1884 నుండి నిర్విరామముగా నాటకప్రదర్శనములను జరిపెను. దీనికి కవియేకాక ఆచార్యుడు, సూత్రధారుడుకూడ శ్రీ పురుషోత్తమ కవియే. ధార్వాడవారు రెండవసారి బందరు వచ్చినప్పుడు వారి యెదుట ఈ సమాజమువారు ప్రప్రథమముగా "కళావతీపరిణయము" అనెడి నాటకమును 1884 ఈష్టరు సెలవులలో ప్రదర్శించిరి. నాటకాంతమున ధార్వాడవారు వీరిని చాల కొనియాడిరి. అంతటితో ఊరిలోని పెద్దలకు ఈ సమాజముపై ఆదరము ఏర్పడెను. ఈ సామాజికులు తామాడు నాటకములు పరభాషయగు హిందూస్తానీలో ఉన్నను, తమ ఉచ్చారణ నైపుణ్యముతో, అభినయ సామర్థ్యముతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను కావించెడివారట. వీరి బిల్హణీయనాటకప్రదర్శనమును కాంచి, అభినవపండితరాయ బిరుదాంకితులగు మాడభూషి వేంకటాచార్యులుగారు ఆనందభరితులై వారిని కీర్తించుచు పదముకట్టి పాడిరట. ఇట్టి సమాజము దినదినాభివృద్ధినొంది, స్వస్థలమున రాణించి, భద్రాద్రి, ఏలూరు, నూజివీడు, తిరువూరు, బాపట్ల, పెదకళ్ళేపల్లి గ్రామములందు శాఖాసమాజములనుగూడ స్థాపించి, యెంతెంతగనో గడించి, మరి యెంతెంతగనో వెచ్చించియుండిరి. ఈ సమాజమున పాటకులుగా కుందుర్తి ఆదినారాయణగారును, నాయకవేషధారిగా మొగిలిగిద్దల రామానుజరావుగారును సుప్రసిద్ధులైరి. రామానుజరావుగారు ఆజానుబాహువులట. "ఈయన అన్ని యవస్థలయందును అల రామదాసును మరపించెడివార"ని శ్రీ పురుషోత్తమకవి వీరిని ప్రశంసించియున్నారు[4].

ఈ సమాజపు రెండవదశలో ఈమని లక్ష్మణస్వామిగారు ప్రసిద్ధికెక్కినారు—వీరు హిందీనాటకములలో మంచి గద్యనటులు, "అప్పటికీ ఇప్పటికీకూడా ఇట్టి నటుణ్ణి మనం చూడబోము. నాట్యవిషయంలో ఒక్క బందరుకేకాక ఆంధ్రదేశానికంతా వీరు వెలలేని గౌరవాన్ని సంపాదించారు" అని పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి ప్రభృతులచే అమితముగా పొగడ్తలందినారు లక్ష్మణస్వామిగారు. వీరి సహచరులు వడ్డి రామయ్య మంచి హాస్యనటులేకాక ప్రధానభూమికలనుగూడ ధరించెడివారు. వీరి దుష్యంతపాత్ర చాల ప్రశంసనీయమట; వేషరచనకూడ ప్రశస్తముగా నుండెడిదట. శ్రీ జోస్యుల శేషయ్య లక్ష్మణస్వామిగారి ప్రక్క హిందీ స్త్రీ భూమికలను (ఆనందబాయి మొ॥) ధరించుచు ఉభయభాషలలో సమర్థులగు నటులుగా వినుతికెక్కిరి; వీరి "రంభానృత్యము" రమణీయముగా నుండెడిదట.

ఈ సమాజమువారు 1900 ప్రాంతములనుండి తెలుగు నాటకములనుకూడ ప్రదర్శింపనారంభించిరి. శ్రీయుతులు వెంపటి వెంకటేశ్వర్లు (నాయిక), వంగల ఆంజనేయులు, గుర్తి రామమూర్తి, తాడేపల్లి వెంకట కృష్ణయ్య (యుగంధరుడు మొ॥) మొదలగువారు తెలుగు నటులుగా ప్రసిద్ధులు. 1900 పూర్వమే ఈ సమాజమువారు 'శారదా విలాస్' అనెడి నాటకశాలను నిర్మించుకొనిరి. కాని, అది బుట్టయ్యపేటలో నుండుటచే దానికి 'బుట్టయ్యపేట హాలు' అనియు, ఆ సమాజమునకు 'బుట్టయ్యపేట కంపెనీ' అనియు పేర్లు ప్రచారములోనికి వచ్చెను.

### జగన్మిత్రసమాజము (విశాఖపట్టణము) :

ధార్వాడ నాటకసమాజముచే ప్రభావితులైన శ్రీ రాజా అంకితం జగ్గారావుగారు తాము విద్యార్థులుగా నున్నప్పుడే 1882 ప్రాంతముల ఈ సమాజమును స్థాపించినారు. ఆదిలో షేక్స్పియరు నాటకములనే ప్రదర్శించెడివారు; తరువాత కొన్ని సంస్కృత నాటకములను కూడ ప్రదర్శించినట్లు తెలియుచున్నది.

1890 ప్రాంతముల మొసలికంటి వేంకట సూర్యనారాయణరావు పంతులుగారి ప్రోత్సాహముతో జగన్మిత్రసమాజము చాల ఉన్నతస్థితికి వచ్చినది. తెరలు, దుస్తులు ఆయా నాటకములకు తగినట్లు వ్రాయించుకొనెడివారు. ప్రతినాటకప్రదర్శనమునందును విరామసమయములలో నీతిబోధకములును, హాస్యప్రధానములును అయిన ఫార్సులను ప్రదర్శించుచుండెడివారు. శ్రీయుతులు తెన్నేటి జగన్నాథరావు, గోపేటి కామేశ్వరరావు (స్త్రీ పాత్రలు), కాదంబరి జగన్నాథరావు, సెట్టి లక్ష్మీనరసింహం, నీలమణి పాణిగ్రాహి (నాయికా పాత్రధారి) మున్నగువారు ఇందలి నటులు. వీరందరు విద్యావంతులు, ధనవంతులు, పెద్దపెద్ద ఉద్యోగస్థులు. అందరును మంచి సుశిక్షణతో మెలగుచుండెడివారు. అందుచే ఈ సమాజమన్నచో నాడు దేశములో గొప్ప గౌరవ ముండెడిది. అర్వాచీన కాలములో టిక్కెట్లుపెట్టి, వచ్చిన సొమ్ముతో పెక్కు ధర్మకార్యము లాచరించినారు. 1900 ప్రాతములలో శ్రీ రాజా విక్రమదేవ వర్మగారు ఈ సమాజభారమును వహించి విజయవంతముగా నడిపించియున్నారు (అంతకు ముందు వీరి అన్నగారు, రఘునాథవర్మగారుకూడ, జగన్మిత్రసమాజస్థాపకులలో ముఖ్యులు).

### ప్రియసల్లాపనాటకసమాజము (అల్లిపురము - విశాఖపట్టణమునకు సమీపమున) :

ధార్వాడవారు వచ్చివెళ్ళిన వెంటనే ఈ సమాజము స్థాపింపబడినది. ఈ సమాజము వారు హిందీనాటకములనే ఆడుచుండెడివారు. నటులు ఉద్యోగస్థులును, ధర్మపరులును అగుట చేత ప్రజల గౌరవాదరములను సులువుగానే పొందినారు. గోవిందరావు అనువారు ఇందు ప్రముఖనటుడు. శంకరమనెడి యువకుడు స్త్రీవేషములను ధరించుచు, పాటలను, పద్యములను, పార్శీమట్లను మనోహరముగా పాడుచుండెడివాడు. ఈ సమాజమువారు తరువాతి కాలములో తెలుగునాటకములనుకూడ ప్రదర్శించిరి (చూ. పురాణం సూరిశాస్త్రిగారి 'ఆంధ్రనాటక సంస్కరణము'—పుట 84).

### హిందూనాటకోజ్జీవకసమాజము (రాజమండ్రి) :

ఈ సమాజమును స్థాపించినవారు శ్రీవసురాయకవియని గుర్తించియున్నాము. వీరి ప్రదర్శనములను ప్రత్యక్షముగా చూచిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఈ సమాజప్రదర్శనములను ప్రశంసించియున్నారు (స్వీయ చరిత్ర—150-151).

"నేను రాజమహేంద్రవరము వచ్చినక్రొత్తలో (ఫిబ్రవరి 1884 ప్రాంతముల)... సుబ్బారాయుడుగారు 'హిందూ నాటకోజ్జీవక సమాజ'మని యొక నాటకసమాజమును స్థాపించి

నాటకములాడించుచుండిరి; వారొకసారి వేణీసంహారమును నాడిరి. ఆనాడు కనుపర్తి శ్రీరాములుగా రశ్వత్థామ పాత్రను, వడ్డాది సుబ్బారాయుడుగారు ధర్మరాజు పాత్రను, సుసర్ల శ్రీనివాసరావుగారు ద్రౌపది పాత్రను, సుసర్ల అనంతరావుగారు దుర్యోధనుడు పాత్రను ధరించిరి. ఆనాడు నేనీ నాటకమునకు వెళ్ళితిని. శాంతము, కరుణరసము నుట్టిపడునట్లు సుబ్బారాయుడుగారు ధర్మరాజుపాత్ర నభినయించిరి. ఇదియేగాదు సుబ్బారాయుడుగా రొకమారు తమ నాటకములో నశ్వత్థామపాత్రనుగూడ ధరించిరి. అశ్వత్థామపాత్ర ధరించినపుడు వీర-రౌద్ర రసములను, ధర్మరాజుగ నున్నప్పుడు శాంత-కరుణరసములను నానాటి ప్రేక్షకులు మరువరు. నేను జూచిన వేణీసంహార నాటక ప్రదర్శనములో నాటకాంతమున గ్రంథములోలేని యొక దండకముతో శ్రీకృష్ణుని స్తవము చేసిరి. ఆ దండకము ముక్కు తిమ్మన్నచేసిన పారిజాతాపహరణములోనిది. పద్యములు చదువుటలోను, దండకములు చదువుటలోను మిక్కిలి నేర్పుగల సుబ్బారాయుడుగారి నోటనుండి వినినప్పుడు నా యొడలు పరవశమైనది.”

ఈ సమాజమువారు వసురాయకవి నాటకములనేకాక ఇతర కవుల నాటకములను కూడ ప్రదర్శించియున్నట్లు తెలియుచున్నది; వావిలాల వాసుదేవశాస్త్రిగారి ఉత్తరరామ చరితానువాదమును ఈ సమాజమువారే ప్రదర్శించిరి. వీరేశలింగం పంతులుగారి ప్రహ్లాద, హరిశ్చంద్ర నాటకములు ఈ సమాజమువారి కొరకే రచింపబడెను. సుసర్ల అనంతరావుగారి పాండవాజ్ఞాతవాసమునుకూడ ఈ సమాజమువారే ప్రదర్శించియుందురు; అనంతరావుగారీ సమాజమునందు నటులుకూడను.

### బందరు హిందూథియేటరు :

ఒక ప్రక్క నే. థి. సొ. వారు హిందీ నాటకములు ప్రదర్శించుచుండగా, ఇంకొక ప్రక్క కేవలము తెలుగు నాటకములను ప్రదర్శింపవలెననెడు ఆశయముతో 1884 లో ఇది స్థాపింపబడినది. శ్రీయుతులు దేవరసు సుబ్బారావు, తురగా పురుషోత్తం, రామిని బ్రహ్మయ్య నాయుడు, చివుకుల కృష్ణయ్యపంతులు ఈ సమాజసంస్థాపకులలో ముఖ్యులు. ఇందులోని నటులందరును ఉద్యోగస్థులే. వీరు ప్రాచీన నాట్యలక్షణములనెల్ల చక్కగా, శ్రద్ధతో పాటించెడివారు. ఆనాడు వీరాడిన నాటకములను చూచినవారికి, ఇప్పటి నాటక ప్రదర్శనములలో విశేషమేమీ కన్పట్టదందురు. ఇందులో ఇవటూరి నాగభూషణముగారు గద్యనటులు; హరిశ్చంద్రాది పెక్కు భూమికల నద్భుత నాట్యక్రియా వైదుష్యముతో నిర్వహించుచు తిరుపతి వేంకట కవుల ప్రశంస పడసినారట. గండికోట నరశింగరావుగారు అర్జునుడు, అశ్వత్థామ, కృష్ణుడు మున్నగు భారతవీరుల పాత్రలను అర్థజ్ఞానసంపత్తితో అభినయించెడివారు; దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు (1862-1938) గారు విద్యార్థిదశలో ఈ సమాజమందు స్త్రీ వేషములను ధరించినారట. బేతపూడి ప్రకాశం, చల్లా రామనాథశాస్త్రి ప్రభృతులు ఇందు దేశికులు. ఇంచుమించుగా ఊరిలోని పెద్దలందరును ఈ సమాజకార్యక్రమములందు పాల్గొనుచు విశాఖలోని జగన్మిత్రసమాజమున కున్నంత గౌరమును దీనికి కలిగించినారు.

కాకినాడ హిందూనాటకసమాజము :

"కాకినాడలో 1885 సంవత్సరమునందే దినవహి హనుమంతరావుగారను సంపన్న గృహస్థు లొకరు మిత్రుల ప్రోత్సాహముచేత నొక నాటకసమాజమును స్థాపించిరి. దాని తెర లకు నలంకారములకు నైదువేలు వ్యయపరచిరి. ఆ సమాజములో వైజర్సు అప్పారావుగారని యొక్క పట్టపరీక్షాసిద్ధుడు, జయంతి భావనారాయణగారను నొక యాంధ్రకవియు, మరియు ననేకులు పాత్రలను ధరించుచుండెడివారు. దానికి సింగితపు అబ్బాయిగారను మాధ్వబ్రాహ్మ ణుడు మేనేజరుగ నుండెడివారు. ఆ సమాజములో ఆనేసాలు భీమసేనరావుగారు, కంచి ఆనంద రావుగారు, వల్లూరి సూర్యప్రకాశముగారు, కోపల్లి రమణారావుగారు, రాయవరపు హనుమంత రావుగారు మొదలగువారుకూడ పాత్రలు ధరించియు, హాస్యమును జెప్పియు ప్రేక్షకులను రంజింపజేసెడివారు" అని చిలకమర్తివారు ఈ సమాజమునుగూర్చివ్రాసి యున్నారు (స్వీయ చరిత్ర-పుటలు. 84-85). వైజర్సు అప్పారావుపంతులుగారు ధర్మరాజుగను, సూర్యప్రకాశము గారు కీచకునిగాను ప్రసిద్ధికెక్కిరి.

జయంతి భావనారాయణగారు 1885 నుండి 1890 వరకును ఈ సమాజమున పాత్ర ధారణము చేసినారు. 1885 లో ఈ సమాజమున చేరుటకుముందు జగన్నాథపురములో ములుకుట్ల వారి యావరణములో నాటకప్రదర్శనముల నొసంగుచుండిన యువకులకు భావనారాయణగారు పద్యములు, పాటలు నేర్పుచుండెడివారట; అనగా, 1885 ప్రాంతములందే కాకినాడలో "యువ కుల నాటకసమాజ" మొకటి పనిచేయుచున్నదన్నమాట.

హిందూసమాజమునకు మేనేజరు అగు సింగితం అబ్బాయిగారు గొప్ప వస్తాదు; పెద్ద శిష్యగణము కలవారు. వారికి ఎవరిమీదనైనను కోపము వచ్చినచో పట్టపగలు, నడిరోడ్డుమీద విరోధుల బుఱ్ఱలు పగులగొట్టెడివారు; కాని, వారికి వ్యతిరేకముగ ఒక్కరైనను సాక్ష్యము చెప్పెడివారుకారట. కాకినాడలో ఎవరైన నాటకము లాడవలెనన్నచో ముందుగా అబ్బాయిగారి దయ సంపాదింపవలయును. ఆ కాలములో ఇంచుమించుగా ప్రతి సమాజమునకును అబ్బాయి గారివంటి వస్తాదు ఒకరు అండగా నుండెడివారు. ఆ ఆచారము తెలుగు నాటకరంగమున చాల కాలము సాగినది. ఆ రోజులలో ప్రదర్శనముల శాంతిభద్రతలు ఇట్టివారిమీదనే ఆధారపడి యుండెడివి.

ఈ సమాజముయొక్క రెండవ దశలో దినవహి కృష్ణమూర్తి (భీముడు మొ॥), ఆలమూరు పట్టాభిరామయ్య (దుర్యోధనుడు మొ॥), వెదురుమూడి శేషగిరిరావు, ముప్పిడి జగ్గ రాజు ప్రభృతులు చక్కని నటులుగా ప్రసిద్ధికెక్కినారు. ఈ సమాజమువారుకూడ ఇతర పట్ట ణములలో వేణీసంహారాదులను ప్రదర్శించినారు. శేషగిరిరావుగారు సమర్థులగు నటులేకాక కవి కూడనై ఆంధ్ర హిందీ భాషలలో నాటకములువ్రాసి, ఆడెడివారట. ముప్పిడి జగ్గరాజుగారు స్త్రీ పాత్రలకు సుప్రసిద్ధులు.

## ఏలూరు కంపెనీ :

1880_81 ప్రాంతముల తెలుగు జిల్లాలలో విజయయాత్ర సాగించిన ధార్వాడ నాటక సమాజమువారు 1884 లో మరల తెలుగుదేశము వచ్చి నరసాపురము, ఒంగోలు, నెల్లూరు మొదలగుచోట్లకూడ ప్రదర్శనము లొసంగినారు. వీనిచే ప్రభావితులైన మరికొందరు ఆయా పట్టణములందు మరికొన్ని క్రొత్త సమాజములను స్థాపించిరి. ఈసారి కేవలము నృత్యములు చేయుటకు ఎనమండుగురు యువతులనుకూడ వీరు తీసికొనివచ్చిరని వినికిడి. ప్రతి శని వారము, బుధవారము, నాటకములను ప్రదర్శించెడివారు. ఏలూరులో ప్రదర్శనము లొసంగు చున్న సమయములో వీరిలో చీలికలేర్పడి, వామనభట్ జోషీ సమాజమునుండి చీలిపోయెను[5]. (అంతట కాశీనాథపంత్ అనునతడు దానికి మేనేజరయ్యెను). అట్లు మాతృసమాజమునుండి చీలిపోయిన జోషీ ఏలూరులోని కొందరు యువకులను చేరదీసి 'ఏలూరు కంపెనీ' అను క్రొత్త సమాజమును స్థాపించెను. వీరధికముగా హిందీనాటకము లాడెడివారు. పాలకోడేటి వేంక ట్రామయ్య, కాదంబరి కుటుంబం, సుబ్బారాయుడు (నాయకవేషధారి), తాడేపల్లి వేంకటరత్నం మొదలగువారు వివిధ పాత్రలను కందర్ప గౌరీపతి, కొండలరావు అనువారు స్త్రీ భూమికలను ధరించెడివారు. దినవహి శరభయ్య ఇందు పాటకుడు.

## నెల్లూరు నాటకసమాజములు :

ధార్వాడవారు రెండవసారి తెలుగుదేశమునకు వచ్చినప్పుడు నెల్లూరులో ప్రదర్శనము లొసంగినారు. అప్పుడచ్చటి ప్రజలలో కొంత సంచలనము కలిగినది; అంతట రెండుమూడు నాటకసమాజములు స్థాపింపబడినట్లు తెలియుచున్నది. లక్ష్మీవిలాసనాటకసభవారు తిప్పరాజు సుబ్బయ్య సత్రముయొక్క ఆవరణలో పందిరివేసి, నాటకములాడిరి. శ్రీయుతులు గడ్డం శేషయ్య, న్యాపతి కృష్ణస్వామిరావు, న్యాపతి వాసుదేవరావు, మధ్వపతి సత్యసంధరావు ప్రభృతులీ సమాజమందలి నటులు. నెల్లూరు సంతపేట ఏటికట్టవద్ద శీనయ్య-పురుషోత్తము లనెడి సోదరులు 'గూడూరు కంపెనీ' అనెడి పేరుతో నాటకములు ప్రదర్శించుటయేకాక ఇతర పట్టణములలోకూడ ప్రదర్శనములొసంగిరి. వీరి 'బాణాసురనాటక' ప్రదర్శనము చాల బాగుండెడిదట. ఆ కాలములోనే "సుజనమనోరంజన సమాజ" మనుపేర ఇంకొక నాటక సమాజముకూడ నెల్లూరులో పనిచేయుచున్నట్లు తెలియుచున్నది (చూ. శ్రీ కొమండూరు పార్థ సారథి అయ్యంగార్ "నెల్లూరు_నాటకకళ" (1952_పుటలు_1, 2, 9).

## ఒంగోలు నాటకసమాజము :

ధార్వాడవారు రెండవసారివచ్చి ప్రదర్శించిన ప్రమీలాస్వయంవరము, పీష్వా నారాయణరావు వధ, ఉషాపరిణయము, కీచకవధ మొదలగు నాటకములనుచూచి అప్పుడు ఒంగోలులో చదువుకొనుచున్న టంగుటూరి ప్రకాశంపంతులుగారు (అప్పటి వయస్సు 13 సం॥) మొదలగు యువకులు అట్టి నాటకములనే ఆడవలెననెడి ఉత్సాహముకలవారైనారు. ఉండదల్లీ సాహెబు అనెడి ఉర్దూ పండితుడు, ఇమ్మానేని హనుమంతరావునాయుడుగారనెడి ఉపాధ్యా యుడు వారలకు ప్రోత్సాహ మొసంగినారు. ప్రకాశంపంతులుగారు స్త్రీ భూమికలనేకాక, పీష్వా

నారాయణరావు మొదలగు భూమికలను ధరించి కొంతపేరు సంపాదించినారు. ఉండదల్లీ సాహెబు ఉర్దూలో నాటకములను వ్రాయగా, వీరందరు తెలుగు లిపిలో తమ భాగములను వ్రాసికొని, కంఠస్థము చేసెడివారు. ఈ సమాజము 1886 వరకును సాగినది. ఆ సంవత్సరమే హనుమంతరావునాయుడుగారును, ప్రకాశంపంతులుగారును రాజమహేంద్రవరము వచ్చినారు. (పంతులుగారి "నా జీవితయాత్ర" 1946_పుటలు_21_22).

## వికాసయుగము (1886-1912)

### సరసవినోదినీసభ (బళ్ళారి) :

రెండు సంవత్సరములపాటు (1871_73) దేశమును అల్లకల్లోలపరచిన కఱవు సమయములో ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారును, వారిమిత్రులును ఒకవీరసంఘముగా నేర్పడి ప్రజలకు కొంత సేవచేసినారు. అటుపిమ్మట అది 'డిబేటింగుసొసైటీ'గా మారినది; దీని ఆధ్వర్యములోనే 1879లో రెండు ఆంగ్లనాటకములును, కృష్ణమాచారిగారి రెండు చిట్టినాటకములును ప్రదర్శింపబడెను. చివర ఈ సొసైటీ 1886 లో 'సరసవినోదినీసభ'[1]గా అవతరించినది. నాటకసంఘముల వారన్నచో నాడుదేశమున గౌరవములేదు. అయిననుసాహసించి ఈ సంఘమున ప్రప్రథమముగా 30 మంది సభ్యులుచేరినారు. ఆచార్యులుగారే అధ్యక్షులు. సభ్యులందరును గౌరవకుటుంబములకు చెందిన ఉద్యోగస్థులు; అంతియేకాదు బ్రాహ్మణులు. ఇందు ముప్పది సభ్యులేకాక మరిముప్పదిమంది అభిమానులుకూడ నుండెడివారు.[2] ఆదర్శవంతముగా చక్కని నాటకప్రదర్శనము లొసంగి నాటకకళను, నాటకరచనను, తద్వారా ప్రజల నైతిక స్థితిని అభివృద్ధి చేయవలెననెడి ఆశయముతో[3] ఆరంభమైన ఈ సమాజము అర్వాచీన కాలములో ధర్మకార్యము లాచరించుటయందును, పేదవిద్యార్థులకు చదువుచెప్పించుటలోను కూడ ముందంజ వేసి కీర్తిగాంచుట ప్రశంసనీయమైన విషయము. ఆదిలో బళ్ళారి ప్రజలు ఈ సభయెడ విముఖులై, పెక్కువిఘ్నములు కలిగించుటకు ప్రయత్నించినను, సభ్యులందరును పట్టుదలతో పని చేసి, బాలారిష్టములను గడచి, అచిరకాలములోనే బళ్ళారి ప్రజలనేకాక రాష్ట్రీ, రాష్ట్రేతర ప్రజలనందరను తమకు సుముఖులను చేసికొన గల్గినారు.

ఈ సమాజమువారు 1886లో ఆచార్యులవారి 'స్వప్నానిరుద్ధ నాటకము'ను రెండుసార్లు ప్రదర్శించినారు. 1887 ప్రారంభములో ఆచార్యులవారి చిత్రనళీయమును, 1889 ప్రారంభములో విషాదసారంగధరమును ప్రదర్శించిరి. (ఈలోపల మరికొన్ని నాటకములుకూడ ప్రదర్శింపబడెను). దీనితో సరసవినోదినీసభకీర్తి మిన్నుముట్టినది. కృష్ణమాచార్యులవారు తమ నాటకములనెల్ల ఈ సమాజము వారికొరకే రచించిరి. చిత్రనళీయము ప్రప్రథమముగా ప్రదర్శింపబడినప్పుడు ఆచార్యులవారే 'నలుడు'; భూస్వామియును, పెద్ద వర్తకుడును అగు కొరివి శేషశాస్త్రి 'దమయంతి'; మ్యునిసిపల్ ఛైర్మన్ హనుమంతగౌడు 'కలిపురుషుడు'; ఇంక తక్కిన పాత్రలను ప్రసిద్ధన్యాయవాదులు, ఉపాధ్యాయులు, గుమస్తాలును ధరించిరి. ఈ సమాజమున ఆచార్యులవారి శిక్షణావిధానము నిదివరకే వివరించియున్నాను. ఆచార్యులవారి సోదరులు

గోపాలచార్యులుగారు, వేంకటకృష్ణమాచార్యులుగారు కూడ ఈ సమాజపు నటులే. కృష్ణమాచార్యులుగారి తరువాత నాయకపాత్రధారి వేంకటకృష్ణమాచార్యులుగారే. గోపాలాచార్యులుగారు స్త్రీ పాత్రలను కూడ ధరించిరట; ముఖ్యముగా 'భరత' భూమికకు వీరు సుప్రసిద్ధులు. పడసాల శ్రీరాములు (తరువాత సబ్ మేజిస్ట్రీటు)గారు శ్రీరాముడు మున్నగు ఉపనాయకభూమికలను, రాయచూరు భీమారావుగారు (వీరు తబలిష్టు కూడను) రత్నాంగి మొదలగు భూమికలను ధరించెడివారు.

తరువాతి కాలములో హోశగంజి రామచంద్రరావు (రాములు) అనెడి విద్యార్థి నాయికాభూమికలను నిర్వహించెడివారు. ఇతడు స్ఫురద్రూపి, రంగస్థలముమీద అచ్చముగా స్త్రీ పుట్టువుగానే కన్పించెడివాడట: చిత్రాంగి, కైకభూమికల నిర్వహణములో అట్టివాడు మరియొకడు లేడని అచ్చటి పెద్దల విశ్వాసము; ఆచార్యులవారి తర్ఫీదు అట్టిది.[4] కూనూరి నరసింగరావు, హొబ్బళి మాధవరావు, నాగేశ్వరశాస్త్రి, బాదనహట్టి శ్రీనివాసరావు, బాదనహట్టి మాధవరావు (వీరు హాస్యనటులేకాక సభకు మేనేజరు కూడను), జోష్గిరి ఆచారి, కర్నూలు విశ్వనాథరావు మొదలగు వారిందలి ఇతరనటులు. ఈ సమాజమువారు అనేక స్థలములలో నాటకప్రదర్శనము లొసంగి విపులయశస్సు నార్జించినారు. వారి సమాజనిర్వహణపద్ధతిని ప్రదర్శనపద్ధతిని మద్రాసు సుగుణవిలాససభవారేకాక పెక్కు ఇతరసమాజములవారుకూడ అనుసరించుటయే ఆ సభకీర్తికి తార్కాణము. ఈ సమాజమువారు 1907లో బళ్ళారిలో శాశ్వతమైన నాటకశాలను నిర్మించుకొనిరి.

## హిందూనాటకసమాజము (రాజమహేంద్రవరము):

ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు ప్రకాశంపంతులుగారితో కలిసి ఒంగోలు నుండి వచ్చి, రాజమండ్రిలో స్థిరపడిన తరువాత 1889లో ఈ సమాజమును స్థాపించిరి. ఇది ఇంచుమించుగా వడ్డాదివారి 'హిందూనాటకోజ్జీవక సమాజము'నకు పుత్రికాప్రాయము. వీరి ప్రథమప్రదర్శనములు తోలేటి వేంకట సుబ్బారావుగారి 'హరిశ్చంద్ర', చిలకమర్తివారి కీచకవధ.[5] ఇవి రెండును వచననాటకములే. ఇందలి సభ్యులలో అధికులు పద్యములను చదువలేని వారగుటచేత వీరు వచననాటకములనే అధికముగా ఆదరించెడివారు. ఈ సమాజమువారు టౌను హాలుకు ప్రక్కనున్న ఒకదొడ్డిలో గట్టి తాటియాకుల పాకవేసి, అందు ప్రదర్శనము లొసంగిరి. క్రమముగా చిలకమర్తివారు 'సమాజపుకవి' యైనారు. ప్రతిసాయంకాలమును, శలవుదినముల లోను సామాజికులందరును నాటకశాలలో కలిసికొనుచుండిరి; వారికందరికిని నాటకశాలయే ఇల్లుగా నుండెడిది—ఆనాడు ప్రతినాటకసమాజసభ్యుల విషయమును ఇంతియే.

ఇందలి నటులలో హనుమంతరావు నాయుడుగారు ముఖ్యపాత్రధారి. ప్రకాశం పంతులుగారు నాయికాపాత్రధారియే కాక నాయకపాత్రధారియును. సాతాని రామానుజయ్య 'సూత్రధారి'; ఇతని గానము వినుటకే కొందరు వచ్చెడివారనుట అతిశయోక్తికాదు. వల్లూరి సూర్యప్రకాశరావు గారు హాస్యములో మిగులగట్టివారు; అది జనరంజకముగ నుండెడిది.[7] మద్దూరి నాగభూషణము గారు పద్యములు శ్రావ్యముగ చదివెడి వారట. దుర్గిగోపాలకృష్ణరావుగారు[8] చిలకమర్తి వారి

శిష్యులు; వీరు దుర్యోధన-నల-కృష్ణపాత్రలకు ప్రసిద్ధులు. ఐనవోలు తాతయ్యానాయుడుగారు హాస్యరస మొప్పించుటలో మిక్కిలి ప్రజ్ఞకలవారు శ్రీ యరగర్ల సత్యరాజు ప్రకాశంగారి ప్రక్క-చిత్రాంగి మొదలగు పాత్రలు ధరించెడివారు; వీరి ఆకారమే స్త్రీత్వసహజముగా ఉండెడిదట. బందరు గాయకులు రాజగోపాలముగారు తరువాతికాలములో సూత్రధారి. నెప్పల్లిబుల్లికృష్ణయ్యగారు స్త్రీపాత్రలను ధరించుటయే కాక మనోహరముగ నృత్యము చేసెడివారు. (మొత్తము మీద ఈ సమాజములో నాయుళ్ళసంఖ్య అధికము; అందుచే దీనిని 'నాయుడుల కంపెనీ' అనెడివారట!). ఈ సమాజమువారు పైఊళ్ళలోకూడ ప్రదర్శనములిచ్చిరి; కాకినాడలో ప్రదర్శనము లొసంగెడి సమయములో అచ్చటినటులతో తగవులు కూడపడి, కొట్టుకొనుట కూడ జరిగినది. సామాజికులందరును ఉద్యోగములలో చేరిపోవుటచేత 1894 నుండి ఈ సమాజకార్యక్రమములు కుంటుపడినవి.

1901 లో ఈ సమాజము పునరుద్ధరింపబడెను. శ్రీ చిలకమర్తివారు అధ్యక్షులైరి. ఈసారి పద్యనాటకములను కూడ ప్రదర్శింప నారంభించిరి. మొదట ఇన్నీసు పేటలోని కుమ్మరిగుంట (నేటి ట్రెయినింగు కాలేజి ఆవరణము) యొద్దగల పాకలో నాటకము లాడెడివారు. ఈ సమాజమువారు 1902-03లో ఇన్నీసుపేట నాగులచెరువు వీధిలో సత్యవోలు లక్ష్మీపతిగారి స్థలములో పెంకుటి నాటకశాలను నిర్మించుకొనిరి. స్త్రీపాత్రధారణమునకు అవతారమూర్తిగా తలంపబడిన ముప్పిడి జగ్గరాజుగారు ఈ సమాజమందు పాత్రధారణము చేసిరి. ఇట్లిది 1908 వరకును సాగెను. అటుపిమ్మట సత్యవోలు గున్నేశ్వరరావుగారును, కృత్తివెంటి నాగేశ్వరరావుగారును ఈ సమాజమును స్వాధీనము చేసికొనిరి. వీరు దీనిని 1912 వరకునునడిపిరి. అంతట వారిరువురికి పడలేదు. నాగేశ్వరరావుగారు ఈ"హిందూనాటక సమాజము" అనెడి పేరుతోనే కొంతకాలము నడిపిరి; గున్నేశ్వరరావుగారు మాత్రము వేరే సమాజమును, నాటకశాలను నిర్మించుకొనిరి. ఆ చరిత్రను తరువాత వివరింతును.

### సుగుణవిలాససభ (మద్రాసు) :

సరసవినోదినీ సభవారి ప్రదర్శనములను గాంచి ఉత్తేజితులై, సరిగా అట్టి సభనే స్థాపింపవలెనని తలపెట్టి (పేరులోకూడ సామ్యమే—S. V. S.) శ్రీ పి. సంబందం మొదలియార్ నాయకత్వమున 1-7-1891 తేదీన ఈ సభ స్థాపింపబడెను. ఇందు తెలుగు, ఇంగ్లీషు, అరవము, సంస్కృతము భాషలలో నాటకములను వేయుటకు ప్రత్యేక శాఖలుండెడివి. షేక్స్పియరు ఉత్సవములవారములోను, దేవీనవరాత్రములు,క్రిష్టమసు సెలవులు మొదలగు సమయములలోను ఇంచుమించుగా పైభాషలన్నింటిలోను నాటకములను ప్రదర్శించెడివారు. సభాసభ్యుల ప్రవర్తన యెంత సుశిక్షితమో, వారి ప్రదర్శనములును అంత సుశిక్షితముగా జరిగెడివి. ఆనాడు మద్రాసులో కల్యాణరామయ్యరు, బాలామణి మొదలగువారు నాటకములను ప్రదర్శించెడివారు. కాని అవియన్నియును పామరజనరంజకములు; నాగరకనాటకప్రదర్శనములని చెప్పదగినవికావు. సుగుణవిలాససభ ఇట్టి సమాజములకు పూర్తిగా భిన్నమైనది. అంతవరకు పామరజనుల అంతస్తును దాటిపోని అరవనాటకరంగము ఈసుగుణవిలాససభస్థాపనముతో ఒక

ఉన్నతస్థాయిని అందుకొనుటకు అవకాశ మేర్పడినది. నాడు, ధర్మవరము వారి ప్రదర్శనముల ప్రేరణము ధర్మమాయని ఈ సుగుణవిలాససభ యేర్పడినదిగాని లేనిచో అరవనాటకరంగ మీనాటికిని అట్లేయుండి యుండెడిదనుట అతిశయోక్తి కాదందురు. ప్రదర్శనములలో సాత్త్విక వాతావరణమును తెచ్చిపెట్టిన ఖ్యాతి ఈ సుగుణవిలాససభవారిదే. తెలుగునాటకశాఖలో శ్రీ వేదము వేంకటాచలఅయ్య ప్రభృతులుండెడివారు; శ్రీ వేంకటాచలఅయ్య నాటకకర్తలే కాక గొప్ప "మేకప్ ఆర్టిష్ట" కూడను.

ఈ సమాజమువారు తమ ప్రదర్శనములందు నాందీ-ప్రస్తావనాది పూర్వకమైన పూర్వ రంగమునకు బదులు, నటులందరును కలిసి, తెరవెనుకనుండి ఒకే ఒక ప్రార్థనగీతమును పాడుట కారంభించినారు. ఈ పద్ధతియే నేటికిని తెలుగునాటకములందు నిలిచియున్నది. ధర్మ వరము వారి అర్వాచీన నాటకములు కొన్నింట నాందీ-ప్రస్తావనలు కన్పట్టుటలేదు; బహుశః వారు కూడ నాడీపద్ధతిని స్వీకరించి యుండవచ్చును. ఈ సమాజప్రదర్శనములందు సంగీతము కూడ బాగుగాతగ్గించి వేయబడెను. "The Indian stage" అనెడి ప్రత్యేకపత్రికను ఈ సభ వారు కొంతకాలము నడిపినారు. ఈ సభవా రొక గొప్ప నాటకపుస్తకభాండాగారమును కూడ నిర్మించుకొనినారు; నేడు తెలుగుదేశమున కన్పట్టని పెక్కు తెలుగునాటకముల ప్రథమముద్రణ ములు ఈ గ్రంథాలయమున కలవు[9].

గుంటూరు ఫస్టు కంపెనీ:

1895 ప్రాంతముల గుంటూరులో రెండవ నాటకసమాజము (సెకండు కంపెనీ) ప్రారంభమగుటతో గుంటూరు హిందూనాటకసమాజమునకు 'ఫస్టుకంపెనీ' అనుపేరు వచ్చెను. ఈ దశలో ఈ సమాజమున సుప్రసిద్ధులైనవారు శ్రీయుతులు బాబూనౌషర్వాంజీ, హరి ప్రసాదరావు, కోపల్లెహనుమంతరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం ప్రభృతులు. నౌషర్వాంజీ కవిశేఖర-గాయకశిరోమణి బిరుదాంచితులు; అంతియేకాదు నటులును. వీరి రంభపాత్ర ధరించి నృత్యము చేసెడివారట. ఇంక హరి ప్రసాదరావుగారు 'ఆంధ్రనటపితామహులు'; నాయక పాత్రధారి. సర్కారు జిల్లాలలో ధర్మవరంవారి నాటకములకు ప్రచారము తెచ్చిన ప్రథములు వీరే. ఈమని లక్ష్మణస్వామిగారిచేత బందరు, హరి ప్రసాదరావుగారిచేత గుంటూరు ధన్యమైన వని పొగడ్తకాంచినవి. కోపల్లె హనుమంతరావుగారు ప్రసాదరావుగారి ప్రక్క నాయికాపాత్ర ధారి. వీరిరువురును పూర్వజన్మములో దంపతులా అన్నంత అనుకూలతను రంగస్థలము మీద ప్రదర్శించెడివారట. ఇంక బలిజేపల్లివారు నాటకరచయితలేకాక నక్షత్రకాది పాత్రలకు సుప్ర సిద్ధులు. పత్రి గోపాలరావుగారు భీమాదిపాత్రధారులు. అధరాపురపు గోపాలాచార్యులుగారు హాస్యనటులు. ఈ సమాజమువారు ఆదిలో అద్దనూరి శ్రీనివాసరావుగారి ఆవరణములో నిర్మింప బడిన నాటకశాలలో ప్రదర్శనములొసంగెడివారు. తరువాత. నేడు దేరాహాలు ఉన్నప్రదేశములో ఈ సమాజమువారు సొంతముగా నాటకశాలను నిర్మించుకొనిరి. బహుశః తెలుగు దేశములో సుస్థిరమైన నాటకశాలను నిర్మించుకొన్న ప్రథమసమాజమిదియే కావచ్చును. వీరి ప్రదర్శ నములు బళ్ళారివారి ప్రదర్శనములవలె గద్య-పద్య-గేయ సమన్వితములై యుండెడివి. ఇటు

మద్రాసునుండి, అటు విజయనగరము వరకును గల పట్టణములన్నింటను ఈ సమాజమువారు ప్రదర్శనముల నొసంగిరి. ఈ కాలములో శ్రీయుతులు వోలూరు హనుమంతరావు, పాతూరి శ్రీరాములు ప్రభృతులు ఈ సమాజమునకు యాజమాన్యమును వహించిరి. 1912 వరకును ఈ సమాజము సాగినది. దీనికి అనుబంధముగా "ది ఇంగ్లీషు డ్రమాటిక్ అసోసియేషన్" 1901_1903 ప్రాంతముల ఆంగ్లనాటకములను ప్రదర్శించెడిది.

### కలాభిలాషకనాటక సమాజము (విశాఖపట్టణము):

1895 లో మారేపల్లి రామచంద్రకవిగారు మిత్రులు సెట్టి లక్ష్మీనరసింహం, ఆకెళ్ళ సత్యనారాయణ ప్రభృతులతో కలిసి ఈ సమాజమును స్థాపించిరి. కవిగారును, సెట్టివారును నాటకరచయితలేకాక చక్కనినటులు కూడను; ఇరువురును ప్రముఖపాత్రలను ధరించెడివారు. ఇరువురును చక్కని దేశికులు; వీరిరువురి వల్లను ఈ సమాజము బాగుగా రాణించి, సుస్థిరమైన జగన్మిత్రసమాజముయొక్క పోటీని తట్టుకొన గలిగినది. ఈ సమాజమునందు తడకలూరి కుప్పుస్వామి ప్రముఖపాత్రధారియేకాక నాటకములలోని పాటలకు మట్టులువేయుచుండెడివారు; శ్రీయుతులు చిల్లా నారాయణస్వామి, కట్టె సూర్యనారాయణమూర్తి, శివకోటి అప్పలరాజును స్త్రీపాత్రధారులు. నారాయణస్వామిగారి పాత్రధారణ మద్భుతముగా నుండెడిదట. ఎమ్. రత్న వేలు మొదలియారుగారు జానపదుల వేష_భాషణముల నతిసహజముగా నిర్వహించెడివారు; అంతియేకాదు వీరు ఆరితేరిన చిత్రకారులు. ఈ సమాజమునకు వలసిన తెరలు మొదలగు వాని నెల్ల వీరే వ్రాసెడివారు. కవిగారు ప్రస్తావనను మానిపించివేసి, ఆ నాటకమునుగూర్చి ప్రదర్శ నమునకు ఆరంభమునను; అంతమునను చిన్న ఉపన్యాసము లొసంగెడివారు. పూర్వులు నిషే ధించిన శయ్యాగార_భోజన_యుద్ధాదులను కవిగారు స్వతంత్రించి రంగస్థలమున ప్రదర్శింపజేసి నారు. ఈ నాటకములందు కత్తియుద్ధములు, రాజదర్బారులందు నృత్యములు ప్రదర్శింప బడెడివి. 1906లో సెట్టివారు జగన్మిత్రసమాజములో చేరినారు; ఇంక కవిగారొక్కరే ఈ సమాజమును 1912 వరకును నడపినారు.

చోడవరములో 1896 కు పూర్వము నుండియు "శ్రీనివాసవిలాసనాటకసమాజము" ఉండెడిది. బీదవిద్యార్థులకు చదువు చెప్పించుట, పేదలకు అన్నదానము అనునవి యీ సమా జాశయములు. ఈ సమాజమువారు కట్టుకొన్న భవనమే నేటి 'ప్రేమసమాజ' భవనము. తరు వాతి కాలములో వీరధికముగా చారిత్రకనాటకములను ప్రదర్శించినట్లు తెలియుచున్నది; వీనిలో చాలవరకు అముద్రితములే.

### గుంటూరు సెకండు కంపెనీ:

ఈ సమాజస్థాపకులు చేగుకనకరత్నం శ్రేష్ఠిగారు (షేక్ కనకరత్నం). ఇది 1895 లో ప్రారంభమైనది; దీని అసలు పేరు "విబుధరంజనీ శృంగార హిందూ నాటక సమాజము." ఈ కంపెనీ స్థాపనముతో 1880 ప్రాంతములనుండియు పనిచేయుచున్న హిందూ నాటక సమాజ మునకు "ఫస్టుకంపెనీ" అను పేరు ప్రచారములోనికి వచ్చినది. ఇది సెకండుకంపెనీ

అయినది. మొత్తముసకు అసలు పేర్లు రెండును మూలపడినవి. ఈ సమాజమునకు పత్రి శేషగిరిరావుగారు కార్యదర్శి; పొన్నాడ చంద్రధరంగారు అధ్యక్షులు. మంచి చిత్రలేఖకులైన మేడిసెట్టి సుబ్బారావుగారు తెరలు మొదలగు వానిని వ్రాసెడివారు. ఫస్టుకంపెనీ నాటకశాలకు దగ్గరలోనే ఈ సెకండు కంపెనీవారి కొరకు కనకరత్నంగారు చక్కని నాటకశాలను నిర్మించి నారు. ప్రఖ్యాతనటులు మల్లాది గోవిందశాస్త్రిగారు 1902_04 ప్రాంతముల ఈ సమాజములో చేరి నాయికాభూమికలను చక్కగా నిర్వహించెడివారు. అటుపిమ్మట తిరుపతి వేంకటకవుల పాండవవిజయములో శ్రీకృష్ణపాత్రను ధరింప నారంభించినారు. గోవిందశాస్త్రిగారి శ్రీకృష్ణ భూమికా నిర్వహణము అతిసహజమై శ్రీ తిరుపతివేంకటకవుల ప్రశంసకు పాత్రమైనది. గోవిందశాస్త్రిగారి వలన ఈ సెకండు కంపెనీ మిగుల ప్రఖ్యాతికి వచ్చినది. అటు ఫస్టుకంపెనీలో ప్రసాదరావుగారు, ఇటు సెకండు కంపెనీలో గోవిందశాస్త్రిగారు నాడు గుంటూరు పట్టణమునకు ఎనలేనిఖ్యాతిని చేకూర్చినారు. మేడిసెట్టి సుబ్బారావు, ఉలిగుండం వెంకటరమణయ్య, కోటం రాజు లక్ష్మీకాంతం (వీరిది స్వతస్సిద్ధమైన స్త్రీరూపమట) గార్లు ఇందు స్త్రీపాత్రధారులు. పత్రి వెంకటరమణరావుగారు గయోపాఖ్యాననాటకపు పోటీలలో ప్రథమబహూమతి నందిన ప్రసిద్ధ నటులు. ఈ సమాజము ఇంచుమించుగా 1920 వరకును సాగినది.

## సురభి నాటకసమాజము (సురభి) :

సురభినాటకసమాజసంస్థాపకులు వనారస గోవిందరావుగారు. మహారాష్ట్ర సామ్రా జ్యము విచ్ఛిన్నమైన తరువాత అచ్చటి సైనికులలో పలువురు ఇతర రాష్ట్రములకు జీవనో పాధికై వలసపోయిరి. వారిలో 'ఆరెకావులు,' లేదా 'ఆరె మరాటీలు' అనువారు 1850 కి పూర్వమే తెలుగుదేశములో స్థిరపడి ఆంగ్లప్రభుత్వమునుండి కడపమండలములో ఈనాములను సంపాదించిరి. అట్టివారిలో వనారస సంజీవరావుగారొకరు; వారు అకాలమృత్యువువాతపడగా వారి పదిమంది పిల్లలును నిరాధారులైనారు. అప్పుడు అందరికంటె పెద్దవాడగు రామయ్యగారు జీవనోపాధికై తోలుబొమ్మల ప్రదర్శనమును నేర్చుకొని సోదరులతో కలిసి ప్రదర్శనము లొనంగ సాగిరి. ఆసోదరులలో నొకరగు వెంకప్ప (వెంకోజీరావు)గారి దత్తపుత్రులే వనారస గోవిందరావుగారు. వీరిపూర్వులు కడపజిల్లా రాయచోటి తాలూకా సురభిగ్రామమున స్థిరపడుట చేత వీరికి 'సురభివారు' అను పేరువచ్చినది. వారిసమాజమునకును అదియే పేరు. తమపూర్వులు ప్రదర్శించెడి తోలుబొమ్మలాటలను మాన్పించి వారందరితో కలిసి, గోవిందరావుగారు 1895లో ప్రప్రథమముగా "కీచకవధ" నాటకమును ప్రదర్శించిరి. అది చక్కగా నుండుటచేత సంపన్నగృహస్థులైన రామిరెడ్డి, చెన్నారెడ్డి అనెడివారు ఒక నాటకసమాజమును స్థాపింపవలసి నదిగా వారిని ప్రోత్సాహించిరి; హరికథాపితామహులన దగిన రాప్తాటి సుబ్బదాసుగారు దేశికత్వ మును వహించిరి. అంతట "శ్రీ శారదామనోవినోదినీసంగీతనాటకసభ" అనునది ఏర్పడెను; అదియే నేటి సురభినాటకసమాజములకు మూలకందము. ఇందు పురుషులు పురుషవేషము లను, స్త్రీలు స్త్రీవేషములను ధరించెడివారు. ధర్మవరమువారి నాటకముల ప్రభావము కార ణముగా నాడు తెలుగుదేశమున పాటలమీద మోజుహెచ్చు. సుబ్బదాసుగారు స్వయముగా

పాటల నాటకములను రచించి, సురభివారికి నేర్పి, తాముస్వయముగా ప్రముఖ భూమికలను ధరించి పెక్కు ప్రదర్శనముల నిప్పించిరి. నానాటికి వీరిప్రదర్శనములు ఉన్నతస్థాయిని అందు కొన సాగినవి. అటుపిమ్మట ఈ సమాజమువారు దేశమంతయును తిరిగి ప్రదర్శనముల నొసంగిరి (1901_1903). ఈ సమాజసభ్యులలో కొందరు బందరులోని సుప్రసిద్ధకర్ణాటక సంగీతవిద్వాంసులైన గరికిపర్తి కోటయ్యదేవరవారి శుశ్రూషచేసి, తమపూర్వపు తోలు బొమ్మలాటల సంగీతపు కత్తునకు స్వస్తిచెప్పినారు.

1910 ప్రాంతములలో అన్నదమ్ములు విడిపోయి వేర్వేరు సమాజములను స్థాపించు కొనిరి. ఇవి శాఖోపశాఖలై నేటికి సుమారు నలుబది సమాజములుగా అభివృద్ధి చెందినవి. ఇందులో సుమారు పదిసమాజములు ఆధునికరంగపరికరములు కలిగి, స్వయంసమగ్రములై మంచి ఉన్నతస్థితిలో నున్నవి. ఈమధ్య ఈ సురభి సమాజముల వారందరును "సురభి నాటకకళాసంఘము" అనుపేర ఒక సమాఖ్యగా ఏర్పడినారు. దీనికి కార్యదర్శి అవేటి నాగేశ్వర రావుగారు.[10]

తెలుగుదేశమున ప్రప్రథమముగా కులస్త్రీలను రంగస్థలముమీద ప్రవేశపెట్టిన ఖ్యాతి సురభినాటకసమాజమువారిదే.[11] స్త్రీ పురుష నటులందరును ఒకే కుటుంబములోని వారగుటచేత స్త్రీలరంగప్రవేశము వారికి ప్రత్యేకసమస్య కాలేదు.[12] (ప్రాచీన సంస్కృత నాటకప్రస్తావన లందిట్టి సత్యమే గోచరించును). సింధే, అవేట్, అటోక్, రేకందార్ అను ఇంటిపేర్లు గలవారు అన్నదమ్ముల వరుసవారు. బహుసంతాన వంతులైన వనారస గోవిందరావుగారు ఇంచుమించు వీరందరితోను వియ్యమందినారు. అందువలన వీరందరును ఏకకుటుంబముగా కలసి మెలసి యుండుటకు అవకాశ మేర్పడినది. పురుషులు పురుషభూమికలను, స్త్రీలు స్త్రీ భూమికలను, బాలబాలికలు బాలబాలికా భూమికలను, వృద్ధులు వృద్ధభూమికలను వయోరూప గుణానుసారముగా ధరించుచుందురు. భార్యాభర్తలే నాయికా_నాయక భూమికలను ధరింపవలె ననెడి నియమము లేదు, స్త్రీలు పురుషభూమికలనుకూడ ధరించుటకద్దు. మేకప్ విషయములో చిన్నపిల్లలకు కూడ ఇంకొకరి సాయమక్కరలేదు. నిర్దిష్టసమయమునకు ముందే ఎవరిమేకప్ వారు చేసికొని సిద్ధముగా నుందురు; వారి సుశిక్షణ అట్టిది. ఇంక వీరియందలి ఐకమత్యము అపూర్వమైనది. రాబడి విషయములో ఎట్టితగవులును రాకుండుటకై 'షేర్ల' పద్ధతిని పెట్టుకొని నారు. సమాజమునకు ఎవరిని 'పెద్ద' అని అనుకొందురో, వారి అడుగుజాడలలో తక్కిన వారందరును విధిగా నడతురు.

"సురభినాటక సమాజ" మనగా స్వయంసమగ్రమైన, నాట్యశాస్త్రలక్షణవిహితమైన నాటకసమాజమునకు ఉదాహరణమని చెప్పుట అతిశయోక్తి కాజాలదు, కిరాయి నాటకముల రోజులలో నాటకకళ స్వచ్ఛతను కాపాడినది చాలవరకు ఈ సురభినాటక సమాజముల వారే. మొదటి రెండు తరములలోను సుప్రసిద్ధులైన సురభినటీనటులు___వెంకోజీరావు, వారి భార్య చినసుబ్బమ్మ; పెద్దరామయ్య, వారిభార్య రామాబాయి; సురభిపాపాబాయి; జంఝూటి

వెంకూబాయి; సురభికమలాబాయి; చిన్నరామయ్య; గోవిందరావు, వారిభార్యలు పెద్దసుబ్బమ్మ. లక్ష్మీబాయి; అవేటి వెంకటస్వామి మొదలగువారు. ఇప్పటివారిలో శ్రీ అవేటి నాగేశ్వరరావు, శ్రీమతి అవేటి పూర్ణిమ, శ్రీ బాబూరావు ప్రభృతులు ప్రసిద్ధులు. ఈ సమాజములవారు పెక్కు నాటకములను సొంతముగా వ్రాయించుకొని యున్నారు. శ్రీయుతులు రాప్తాటి సుబ్బదాసు, విశ్వనాథకవిరాజు, కొప్పరపు సుబ్బారావు, మల్లాది వేంకటకృష్ణశర్మ ప్రభృతులు ఈ సమాజములకొరకు ప్రత్యేకముగా నాటకములు వ్రాసియిచ్చియున్నారు.

సురభినాటకసమాజస్థాపకులగు వనారస గోవిందరావుగారు 'ఆంధ్రనాటక రంగోద్ధారక' బిరుదాంచితులు; గజారోహణాది సన్మానము లందినవారు. ఆంధ్రనాటకకళాపరిషత్తు స్థాపనములో వీరిపాత్ర అనుపమానము.

## మానేపల్లి కంపెనీ (రాజమహేంద్రవరము):

మానేపల్లి వాస్తవ్యులగు ధరణీప్రగడ సూరయ్యగారు 1898 ప్రాంతములలో రాజమహేంద్ర వరములో "నేషనల్ థియేటర్" అనెడి నాటకసమాజమును స్థాపించుటయే కాక అదే పేరున ఇన్నీసుపేటలో నాటకశాలను కూడ కట్టించినారు. సూరయ్యగారి ఊరిపేరును బట్టి ఈ సమాజమునకు "మానేపల్లి కంపెనీ" అనెడి పేరే స్థిరపడినది. వీరు నటులందరకును జీతములను ఏర్పాటు చేసినారు; కాగా తెలుగదేశమున బహుశః ఇదియే ప్రథమ "వృత్తినట సమాజము" (Professional Theatre) కావచ్చును. ఈ సమాజములో అంబడిపూడి కోటయ్యగారు నాయకభూమికాధారి; ముప్పిడి జగ్గరాజగారు నాయికాభూమికధారి. కోటయ్యగారిది కంచువంటి గాత్రము. ఫిడేలు బహునాజూకుగా వాయించెడివారట. రూపములో, పాటలో, ఆటలో వీరిది అచ్చు బలిజేపల్లివారి పద్ధతియట. ఇంకజగ్గరాజుగారి అభినయమునకు వంకపెట్టే వారానాడు లేనేలేరట. క్రొత్తవారు నిజముగా స్త్రీయే నటించుచున్నదని అనుకొనెడివారట. అంబడి పూడి వారిపాటతోను. జగ్గరాజుగారి ఆటతోను ఈ సమాజము ప్రసిద్ధికి వచ్చినది. కందుకూరి వారి హరిశ్చంద్రలో వీరిరువురి దాంపత్యాభినయము అపూర్వముగా నుండెడిదట. 1911–1912 ప్రాంతముల వరకే సమాజము సాగినది. ఈ సమాజము వారి తొలినాటకప్రదర్శనములలో కాళ్ళకూరి సాంబశివరావుగారి "రంగరాయకదనసమవకారము'' ప్రజలను బాగుగా ఆకర్షించినది.

## ఆంధ్రభాషాభిమాని సమాజము; వర్ధమాన సమాజము (నెల్లూరు):

1891 ప్రాంతముల 'అమెచ్యూర్ నాటకసభ' అనెడి నాటకసమాజ మొకటి నెల్లూరులో స్థాపింపబడెను. ఈ సమాజమువారు 1897 వరకు ఆంగ్లనాటకములనే ప్రదర్శించు చుండిరి. వదాన్యులైన శ్రీమంతుల సాయముతో వీరు సుమారు 15 ఆంగ్లనాటకములను టిక్కెట్లు లేకయే ప్రదర్శించినారు. ధర్మవరంవారి నాటకములను తెలుగు జిల్లాలలో ప్రదర్శించిన ప్రథమసమాజమిదియే అందురు; అటుపిమ్మటనే హరి ప్రసాదరావుగారు గుంటూరులో ప్రదర్శించినారట. ఈ సభాసభ్యులలో కందాడై శ్రీనివాసన్‌గారు (దొరస్వామి అయ్యంగార్) నాయకపాత్రధారి (వీరి దుష్యంతభూమికా నిర్వహణము అపూర్వముగా నుండెడిదట);

కందాడై శఠగోప రామానుజంగారు నాయికాభూమికలను (శకుంతలమొ॥) నిర్వహించుటలో ప్రఖ్యాతి వహించినారు. ప్రతాపరుద్రీయ ప్రథమప్రదర్శనము విజయవంతము కాకపోవుటతో వీరిలో చీలికలు బయలుదేరినవి. అట్లు చీలిపోయిన కొందరు దొరస్వామి అయ్యంగార్ నాయకత్వమున, శ్రీవేదంవారు అధ్యక్షులుగా, 1899 ఏప్రిలులో 'ఆంధ్రభాషాభిమాని సమాజము'ను స్థాపించుకొనిరి. కేవలము వేదంవారి నాటకములను మాత్రమే ప్రదర్శించుటకీ సమాజమేర్పడినది. (1925 ప్రాంతములలో ఇది నెల్లూరు 'ఆంధ్రసభ'లో కలిసిపోయినదట). ఆంధ్ర భాషాభిమాని సమాజమునకు పేరుతెచ్చిన నటులలో దొరస్వామి అయ్యంగార్, నందగిరి హనుమంతరావుగార్లు ప్రముఖులు. దొరస్వామి అయ్యంగార్ సుప్రసిద్ధులైన నటులు. హనుమంతరావుగారు శకుంతల, ఉషవేషములలో అచ్చముగా అచ్చరవలెనే ఉండెడివారట.

ఆంధ్రసభలో శ్రీయుతులు తూములూరి శివరామయ్య, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగార్లు నాయకులు. దొరస్వామి అయ్యంగార్ నెల్లూరు సుగుణవిలాససభ అనుపేర ఒకసమాజమును కొంతకాలము నడిపినారు.

1899 నాటి నుండియు అమెచ్యూర్ సభవారు వేదంవారి నాటకములను ప్రదర్శించుట మానివేసిరి. నాటి కార్యదర్శి నేలటూరి సింగరాచార్యులుగారును, స్టేజిడైరెక్టరు వంగవోలు వెంకటరంగయ్యగారును ఈ సమాజమును 1906 వరకు నడిపిరి. ప్రసిద్ధ సినీమాదర్శకులు వై. వి. రావుగారి తండ్రి యరగుడిపాటి గోపాలకృష్ణారావుగారు అమెచ్యూర్ నాటకసభలో నాడు చాల ప్రముఖులుగా నుండెడివారు. అటుపిమ్మట ఇది నెల్లూరు "వర్ధమాన సమాజము"తో కలసి పోయినది. నెల్లూరులోని నాటక సమాజములన్నింటిని ఏకము చేయవలెనన్న దృష్టితో ఏర్పడిన దీ వర్ధమానసమాజము (Progressive Union). "రంగోద్ధారక" బిరుదాంచితుడగు సుప్రసిద్ధనటుడు నెల్లూరి నగరాజారావుగారు ఈ యూనియన్‌కు సంబంధించినవారే. ప్రఖ్యాత నాటకరచయిత ముత్తరాజు వేంకటసుబ్బారావుగారు, కళాపోషకులు తూములూరు శివరామయ్య పంతులుగారు కూడ ఈ యూనియన్‌తో సంబంధమున్నవారే. "ఆంధ్రభాషాభిమాని" వారు మాత్రము యూనియన్‌తో కలియలేదు. రెండుసమాజములవారికి మనస్పర్థలుండెడివి. ఎవరో అసూయాపరుల దౌష్ట్యమువలన 1906లో యూనియన్‌వారు వేసికొన్న నాటకశాల పరశురామ ప్రీతియైనది. పోటీ సమాజములున్నచోట ఆనాడిట్టివి సాధారణముగా జరుగుచుండెడివి.

## సుమనోరమసభ (బళ్ళారి) :

బళ్ళారి వంటి పెద్దపట్టణమునకు ఒక్క 'సరసవినోదినీసభ' చాలదనిపించినది. అంతట 1900 ప్రాంతముల 'మనోరమ సభ' యమనది వెలసినది. శిక్షణసమయములోను, ప్రదర్శన సమయములోను ధర్మవరమువారు అమలుపరచెడి నిబంధనలు కొందరికి సహ్యములు కాలేదు; "నీవు నాటకము వేయుటకు పనికిరావు'' అని కొందరిని ఆచార్యులవారు తరిమివేసిరి. ఇట్టివారెల్ల ఈ క్రొత్తసభలో చేరినారు. 'మనోరమసభ'ను ప్రారంభించినవారు పద్మనాభి వెంకోబాచార్య ప్రభృతులు. మొదట ఏవియో రెండుమూడునాటకములను ప్రదర్శించిరి; కాని అవి జయప్రదములు కాలేదు. ధర్మవరంవారివంటి ఉత్తమకవి, దేశికుడు లేని వెలితి వారికి కానవచ్చెను.

అంతటవారు కోలాచలము శ్రీనివాసరావుగారిని అర్థించి తమ సభకు అధ్యక్షుని చేసికొని 1902 ప్రాంతములనుండి తమసభకు 'సుమనోరమసభ'యను పేరుపెట్టుకొనిరి[12]. కోలాచలమువారి రాకతో ఈ సభాకార్యకలాపములు పెంపొంది, క్రమముగా ఉన్నతస్థితికివచ్చి, 'సరసవినోదినీసభ'తో పోటీచేయగల స్థైర్యమును పొందినది. ఆరోజులలో ఈ సభకు ప్రఖ్యాతిని తెచ్చిపెట్టిన నటశిరోమణి తాడిపత్రి రాఘవాచార్యులుగారు; అందులకు కోలాచలము వారి నాటకములు కూడ తోడ్పడినవి; కేవలము ఈ సభ్యుల బలవంతముచేతనే వీరుకొన్ని నాటకములను రచించుట జరిగినది—శిరోమణి, కీచకవధ, శ్రీరామజననము. లంకాదహనము, ప్రహ్లాద మొ॥

సుమనోరమసభవారు తొలుత సరసవినోదినీసభవారి తాటియాకుల హాలులోనే రెండుమూడు ప్రదర్శనములు చక్కగా వేసినారు; కాని అసూయచేతనో, మరియేలనో తరువాత సరసవినోదినివారు తమహాలు నిచ్చుట కంగీకరింపలేదు; అందుచే సుమనోరమసభవారు వేరే పాకను వేసికొనవలసి వచ్చెను. దీనితో క్రమముగా ఈ రెండు సభలవారికి మనస్పర్థలు పెరిగినవి. యీ స్పర్థల ఫలముగా ఒకసారి ఒకరిహాలు పరశురామప్రీతి అయినదని కూడ చెప్పుదురు. అంతట కోలాచలమువారు ప్రయత్నించి, సుమనోరమ సభవారికి ప్రత్యేకించి 'వాణీవిలాస్' అనుపేర చక్కని నాటకశాలను కట్టించిరి; బళ్ళారిలో ఇదియే తొలినాటకశాల. (దీనికి బాలగంగాధరతిలక్ మహాశయుడు 1905లో ప్రారంభోత్సవము జరిపెను). దీనితో సరసవినోదిని వారుకూడ మేల్కొని 1907లో "రామకృష్ణవిలాస్'' నిర్మించుకొనిరి[13] ఆంతరంగికముగా స్పర్థలున్నను, అసలు పెద్దలుమాత్రము పెద్దమనుష్యులుగానే ప్రవర్తించెడివారు. కోలాచలమువారును, ధర్మవరము వారును అప్పుడప్పుడు సుహృద్భాషణము లొనర్చుచున్న విషయము కోలాచలమువారి ప్రహ్లాదచరిత్రనాటకపీఠికను బట్టి తెలియుచున్నది. ఇంక రాఘవాచార్యులుగారు ధర్మవరమువారికి స్వయముగా మేనల్లుడే కాక, వారియొద్ద విశ్వాసపాత్రులైన జూనియర్ వకీలు కూడను.

## హిందూ థియేట్రికల్ నాటకసమాజము (పిఠాపురము):

కోలంకవీరవరము ఎస్టేట్ల జమీందారిణి శ్రీ రావు చెల్లాయమ్మరావుగారు 1900 ప్రాంతములో పై నాటకసమాజమును స్థాపించి, కోటలో ఒక నాటకశాలను వేయించినారు (దీని పేరు 'సత్యనారాయణ కంపెనీ' అని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసినారు. చూ. 'అనుభవాలూ-జ్ఞాపకాలూను-పు-412). దీనికి పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు కవులు; ఇతర కవుల నాటకములు కూడ ప్రదర్శింపబడెడివి. శ్రీయుతులు వెదురుమూడి శేషగిరిరావు, దేవరకొండ కృష్ణమూర్తి (నాయికా భూమికలు), ఆలమూరి పట్టాభిరామయ్య, కలగాని రామయ్య ప్రభృతులిందలి ప్రముఖనటులు. వెదురుమూడివారు ప్రధానపాత్రధారులే కాక సమాజనిర్వాహకులు కూడను. వెదురుమూడి శేషగిరిరావుగారు సుభద్రాపరిణయము, కన్యకావిజయము, సుయోధన ఘోషయాత్ర మొదలగు తెలుగునాటకములను; శివాజీచరిత్ర, పీష్వానారాయణరావువధ మున్నగు హిందీనాటకములనుకూడ వ్రాసినారు. శేషగిరిరావుగారి హైదరుజంగు పాత్రాభినయమును చూచిన తరువాతనే ఈమనివారు దానిని సాధనము చేసిరట. ఆ రోజులలో తెలుగు నాటకము

లకు హరి ప్రసాదరావుగారు హిందీనాటకములకు ఈమని లక్ష్మణస్వామిగారు సుప్రసిద్ధులు. శేషగిరిరావుగారు వారితో సమానులై రెండుభాషల నాటకములలోను సుప్రసిద్ధులగుటయేకాక నాటకకర్తలుకూడ అయినారు. వాచికాభినయములో వీరిని మించినవారు లేరట. శేషగిరిరావుగారి యాజమాన్యములో ఆనాడీ సమాజము అసమానఖ్యాతి నార్జించినది. ఈ సమాజము పెద్ద పట్టణము లన్నింటను ప్రదర్శనము లొసంగెను; ఒకేచోట ఐదారేసి మాసముల పర్యంతమును ప్రదర్శనము లొసంగుట కద్దని చెప్పుదురు.

**సంగీతమానినీసమాజము (విశాఖపట్టణము) : ఇతరస్త్రీసమాజములు :**

పడుపువృత్తి మానివేసిన వేశ్యల జీవనాధారము కొరకు మారేపల్లి రామచంద్రకవిగారు ఈ సమాజమును 1902 లో స్థాపించి, పెట్టుబడిపెట్టి, ఆ స్త్రీలకు నాటకములాడ నేర్పిరి. వీరు కలాభిలాషకనాటకసమాజము వారాడిన నాటకములనే ఆడుచుండెడివారు. ఈ సమాజమువారికి కవిగారొసంగిన శిక్షణ చాల ఆదర్శనీయమైనదని చెప్పుదురు. ఈ సమాజమువారు తడకలూరి కుప్పుస్వామిగారి ఆధ్వర్యములో విశాఖపురియందేకాక పెద్దపెద్ద పట్టణములన్నింటను ప్రదర్శనముల నొసంగియున్నారు. ఇందు పురుషభూమికలనుకూడ చాలవరకు స్త్రీలే నిర్వహించెడివారు. కాని తామనుకొన్న సంఘసంస్కరణము సరిగా కొనసాగకపోవుటచేత కవిగారీ సమాజమును అచిరకాలములోనే నిలిపివేసిరి; కవిగారికిమాత్రము మూడువేలరూపాయల నష్టము మిగిలెను !

ఈ సంగీతమానినీసమాజపు నటులలో ప్రసిద్ధి వహించినవారు :

శ్రీమతి మద్దెల సూర్యనారాయణ—సత్యవంతుడు, కృష్ణుడు, అర్జునుడు, విక్రమార్కుడు, బిల్హణుడు మొ.

శ్రీమతి కొంకిపూడి చినచిట్టి—చంద్రమతి, సావిత్రి, సత్యభామ, యామినీపూర్ణతిలక, సుభద్ర మొ.

శ్రీమతి కొంకిపూడి పెదబుల్లి—అశ్వపతి, మదనాభిరాముడు మొ.

శ్రీమతి కొంకిపూడి చినబుల్లి—సూత్రధారుడు మొ.

ఈ కాలములో కేవలము స్త్రీల సమాజములు కొన్ని బయలుదేరినవి. బళ్ళారిలో రెండు స్త్రీ సమాజములుండెడివి; ఒకదానికి సరసవినోదినీసభవారి ప్రోత్సాహమును, ఇంకొకదానికి సుమనోరమసభవారి ప్రోత్సాహమును ఉండెడిదట. ఈ సభలలోనివారందరును స్త్రీలే; అందున, కళావంతులే. స్త్రీలే పురుషవేషముల నన్నింటిని ధరించెడివారు. అసలు సభలవారికి వైరమున్నట్లే ఈ సభలవారికికూడ వైరముండెడిదని తెలియుచున్నది. ఈ స్త్రీల సభలు ధర్మవరంవారి మరణానంతరము బయలుదేరినవని కొందరును; ఆచార్యులవారి కాలములోనే బయలుదేరినవనియు, వీరిలోని ఒక స్త్రీ బాహుకభూమికను ధరించి ఆచార్యులవారి మెప్పును పొందెననియు కొందరును చెప్పుదురు.

బందరులోకూడ రెండుమూడు స్త్రీ నాటకసమాజము లుండెడివి. "ధీరామోదిని" (జగన్నాథపురములో) అనెడి సమాజములో 'రామాబాయి' అనునామె ప్రముఖురాలు. "జగ

న్మోహినీ సమాజము"లో 'అంకాలు' అనునామె ప్రముఖురాలు; ఇందులో 'కోయిల' అనునామె అద్భుతముగా పాడెడిదట. గుడివాడ తాలూకా 'సుబ్బిచెరువు' గ్రామవాసిని 'రాముడు' అనునామె హరిశ్చంద్రాది భూమికలకు ప్రసిద్ధివహించినదై పురుషులను సవాలుచేసినదట.

మానూరు హనుమంతరావుగారు అనునటుడు "సుధీజనసమాజ" మనుపేర గుంటూరులో 1907_08 ప్రాంతముల ఒక సమాజమును స్థాపించెను. ఇందులో స్త్రీలుకూడ నుండెడివారు. ఈ ప్రాంతములలో స్త్రీ పురుషులు కలిసివేయుట కిదియే ప్రారంభము. హనుమంతరావుగారు నాయకపాత్రధారి; నాగమణి, నాగరత్నం అనువారు ప్రముఖనాయికాభూమికలను ధరించెడివారు. (వీరి నాటకశాల చుట్టును గోనెపట్టాలు కట్టియుండుటచేత దీనికి 'గోనెపట్టాల కంపెనీ' అనియే పేరట).

1915_16 ప్రాంతముల గూడూరులో వెంకమ్మ, రాజమ్మ అనువారలు ఒక స్త్రీ నాటక సమాజమును ప్రారంభించి కొన్ని ప్రదర్శనము లొసంగినారట; వీరందరును గౌరవ కుటుంబములలోనివారేయని చెప్పుదురు.

1919 ప్రాంతముల బయలుదేరిన "విజయరామ డ్రమెటిక్ అకాడెమీ"లో కూడ పురుషుల ప్రక్క ముగ్గురువేశ్య యువతులు నాయికాభూమికలను ధరించెడివారు; వీరికి జీతములుకూడ నుండెడివి.

1928 ప్రాంతముల గుంటూరులో శ్రీ దంటు వేంకటకృష్ణయ్యగారు "నవలా నాటక సమాజము" ప్రారంభించినారు; శ్రీమతులు పసుపులేటి కన్నాంబ, దాసరి కోటిరత్నం, దాసరి యామినీపూర్ణతిలక ప్రభృతు లిందులో నటించినారు.

### రమావిలాసినీసమాజము (శ్రీకాకుళము):

ఇది 1906_07 ప్రాంతములలో ప్రారంభమై ఐదారు సంవత్సరములపాటు మాత్రమే పనిచేసి, మరల 1921 ప్రాంతములలో 'రమా విలాస అమెచ్యూర్స్' అనుపేర పునరుద్ధరింపబడెను. పై సమాజము పనిచేసినకాలము తక్కువైనను, అది ఒక మహానటుని తెలుగు దేశమునకు ప్రసాదించినదని చెప్పవచ్చును. వారే చట్టి చినపూర్ణయ్యపంతులుగారు. వీరు కళాశాలలో చదువుకొనెడి రోజులలో ఆంగ్లనాటకములలో నటించియున్నారు. ఆ అనుభవముతో వీరు రమా విలాసినీ సభ్యులను తీర్చి దిద్దినారు. వీరు ధరింపని ప్రముఖపాత్ర లేదనియే చెప్పవచ్చును. వీరికి 'శివాజీ' అభిమానపాత్ర; దానిని నిర్వహించుటలో ప్రత్యేకత సాధించినారు. ప్రథమాంధ్ర నాటకకళాపరిషత్సభల రెండవనాటి సభకు వీరధ్యక్షులు. వీరిప్పుడు 80 సంవత్సరముల వృద్ధులు. 1928 లో ఒక ఫ్రెంచి విశ్వవిద్యాలయమువారు వీరిని Honorary Professor of Indian Dramaturgy' గా నిర్దేశించుకొనియున్నారు.

### పర్లాకిమిడి నాటకసమాజము:

పార్శీ కంపెనీల ప్రభావముతో 1897 లో విద్యార్థులందరును కలిసి ప్రారంభించిన "అమెచ్యూర్ డ్రమెటిక్ అసోసియేషన్" ఇంచుమించుగా 1929 వరకు సాగినది. ఇందులో

శ్రీయుతులు గిడుగు వేంకటసీతాపతి, చిలుకూరి బుచ్చన్నపంతులు, పంతుల రామమూర్తి ప్రభృతులు ప్రముఖులు. వీరికి దుప్పట్లే తెరలు. రెండు ఇత్తడి బిందెలలో నీళ్ళుపోసి, వాటి అంచుల మీద లావుపాటి చీపురుపుల్లలను నిలబెట్టి ఆ పుల్లలను పాలుపితికినట్లుగా చేసెడివారట; అట్లువచ్చెడి శబ్దమే వారికి శ్రుతి. నీళ్ళు నిండుగా ఉన్నచో శ్రుతి తగ్గిపోవునట. పాటకుల కంఠములనుబట్టి శ్రుతులమార్పు అవసరముకాన నీళ్ళను హెచ్చించుట తగ్గించుట చేయుచుండెడివారు. హార్మోనియము 1906_07 ప్రాంతములలో మాత్రమే వీరికి లభించినది. 1903_04 లో పర్లాకిమిడి రాజావారు "పద్మనాభథియేటర్" కట్టించినారు. రాజావారి ఆదరణలో నున్న ఒరియా నాటక సమాజముతోపాటు, తెలుగు నాటకసమాజమువారుకూడ ఈ నాటకశాలనే ఉపయోగించెడివారు. వీరు 1926_27 లో మద్రాసులో గవర్నరు సమక్షమున ప్రదర్శనములొసంగి మెప్పు పొందినారు. 1929 లో గిడుగువారు రాజావారితో తగవుపడి పర్లాకిమిడి విడిచివచ్చిన తరువాత మరల అచ్చట తెలుగు నాటకసమాజము పనిచేయనేలేదని చెప్పవచ్చును.

## స్వర్ణయుగము [1912–1928]

ఇంతవరకును ఔత్సాహికమార్గమున సాగిపోవుచున్న ఆంధ్రనాటకరంగము ఆకస్మికముగా వ్యాపారపద్ధతులకు దిగిన కాలమిది. అంగబలము, ఆర్థికబలముకల సమాజములవారు మేటినటులనందరిని జీతములనిచ్చి ఆకర్షించెడివారు. కాగా ఔత్సాహిక నాటకసమాజములు చాల వరకు సన్నగిలిపోయినవి.

**హిందూ నాటకసమాజము (రాజమహేంద్రవరము):**

శ్రీ చిలకమర్తివారు అధ్యక్షులుగా 1901 లో పునరుద్ధరింపబడిన హిందూ నాటక సమాజమును 1908 లో కృత్తివెంటి నాగేశ్వరరావుగారును, సత్యవోలు గున్నేశ్వరరావు గారును స్వాధీనము చేసికొనిరని తెలిపియున్నాను[1]. వారిరువురును కలిసి 1912 వరకును ఆ సమాజమును నడిపిరి. శ్రీ కృత్తివెంటివారు ఉత్తమనాట్యాచార్యులు; సుశిక్షణతో రిహార్సల్సు జరిపించి, నటులను ప్రదర్శనమునకు సిద్ధముచేయుట వీరివంతు. పై హంగులన్నియును సమకూర్చుట గున్నేశ్వరరావుగారివంతు. సమాజకార్యకలాపములు పెద్ద ఎత్తున ఆరంభమైనవి. వ్యయప్రయాసలకు లెక్కచేయక ఆధునికరంగపరికరములను చేకూర్చుకొని, తమ సమాజమును వీరు స్వయంసంపూర్ణసమాజముగా రూపొందించుకొనినారు; ఇందులకై సుమారు లక్ష యేబదివేల రూపాయలను వ్యయముచేసిరని చెప్పుదురు (ఒక్క గయోపాఖ్యానమునకే రెండు రైల్వే వాగన్లకు సరిపడెడి సామాను ఉండెడిది. సమాజములో నటులు ఎనుబదిమందివరకుండెడివారు. పొరుగూరి ప్రదర్శనములకు ఇంతమందియును, అంతసామానుకూడ కదలవలసినదే!), తెరలు మొదలగునవి వ్రాయుటకు శ్రీ ఎ. ఎస్. రామ్[2] అనువారిని, పాటలు వ్రాసి నేర్పించుటకు శ్రీ పాపట్ల కాంతయ్య[3] అనువారిని ఏరికోరి రప్పించినారు; ఈ ఇరువురి వలనను ఈ సమాజమువారి ప్రదర్శనముల కెంతయో వన్నెచేకూరెడిది. ఈ సమాజమును గూర్చి పసుమర్తివారు వ్రాసిన వాక్యము లిచ్చుట స్మరణార్హములు—"......అక్క

డక్కడ సమాజాల్లో ఏదోవిధంగా అక్కఱకు వచ్చేవారూ, అభిమానంతో పనిచేస్తూ ఉండేవారూ, అందమైనవారూ, పాడగలవారూ, అభినయచాకచక్యం కలవారూ యీ సమాజంవల్ల కళ్ళు తెరచారు. 'నాటకోద్యోగం తమ జీవనానికి సాధనంగా ఉపయోగపడే దారిని కనిపెట్టారు. ఇంకేముంది! పక్షుల్లాగే పదిదేశాల్నుంచీ వచ్చిపడ్డారు ఆగోదావరితీరంలో!...ఆంధ్రదేశంమొత్తం మీద నాటకసమాజానికి వర్తకమర్యాదను తెచ్చితెట్టినవారు మనగున్నేశ్వరరావు, నాగేశ్వరరావు గార్లే. ఎక్కువగా ద్రవ్యాన్ని ఆవిషయంలో ఖర్చుపెట్టిన వారుకూడా ఒకవిధంగా వీరే. వందలకు వందలు నటులకు అడ్వాన్సులుగా ఇవ్వడం, పది మొదలు వందరూపాయల వరకూ జీతాలేర్పఱచడం, కార్ఖానాలోని పనివాండ్రువలె ప్రొద్దుటినుంచి సాయంతనం వఱకూ నటులంతా నాట్యవిషయంలో యజమానులు చెప్పినట్లుగా కన్పిస్తూ ఉండడం ఈ మొదలైన ఆచారాలన్నీ వీరిసమాజంతోనే ప్రారంభమయినాయి. ఇక ఇక్కడినుంచీ ఆంధ్రనాటకప్రపంచానికి ఒక క్రొత్తరూపం తటస్థించింది. క్రొత్తపద్ధతులు బయలుదేరాయి......

"......పాడగలవారికి పద్యాలూ, పాడలేనివారికి గద్యాలూ, ఆటాపాటా రెండు వచ్చిన వారికి పార్శీదేశపు పసందు పాటలూ ముఖ్యంగా కనిపిస్తూ ఉండేవి. నాలుగు గంటల కాలంలో ఆటముగియడానికి వీలుగాకూడా ఉండేవి......పాపట్ల కాంతయ్యగారు ప్రత్యేకంగా ఒక్కొక్క నాటకానికి పార్శీపద్ధతి కీర్తనలువ్రాసి, ఆవ్రాసిన వాన్ని నటులందఱకూ నేర్పి, వందోయాభైయ్యో జీతం పుచ్చుకొనేవారువీరు. అవసరం అయినప్పుడు హార్మనీనికూడా వాయిస్తూ ఉండేవారు...ఇంకా యవనాంధ్రసంగీతలక్షణాలు రెండింటినీ జోడించి, ఒక క్రొత్త నడకలో, ఒక క్రొత్తరూపంలో, ఒక క్రొత్తరుచిలో, ఎన్నివందల కీర్తనలనైనా సృష్టించగలరు. ఆకాలంలో ఇట్టి ప్రజ్ఞగలవారు మరియొకరు లేరు. ముందు నాటకం ఎట్లాయున్నా వీరి కీర్తనలు మాత్రం నాట్యపట్టాభిషేకాన్ని చేసుకొనేవి. మూడువంతులు నాటకాదాయానికి ఈ కీర్తనలు కారణంగా ఉండేవి. అదొకశకంగా వెలిగిపోయింది. ఆకారణంచేత 'నాటకవాగ్గేయకారకు' లంటాను నేనీ పాపట్ల కాంతయ్యగారిని.

"......ఎ. ఎస్. రామ్ రెండుమూడు వందలజీతం పుచ్చుకునేవాడు. కుంచెచేత పుచ్చుకొంటే ఏడేడు పధ్నాల్గులోకాలూ రంగంలో మొలిచినట్లు చేసేవాడు. ఈయన చేతికి కుదిరిన పాకం ఎంత విశేషమయిందో చెప్పలేంకాని ఆ దృశ్యాలకిచ్చే రంగుల్లో జీవకళలన్నీ ఉట్టిపడుతూ ఉండేవి. కావలసినంత ఖర్చుపెట్టి సమాజంవారు ఈయనచేత ఎప్పటి కప్పుడు ఆయా నాటకాలకు తగిన యవనికాది దృశ్యాలను అన్నిటినీ వ్రాయించేవారు. దుస్తులుకూడ వీరిసలహాను బట్టి బొంబాయి, కలకత్తాలనుండి దిగుమతి చేసుకొనేవారు.

"తెలుగు నాటకాల్లో డ్యాన్సులు అనేవికూడా యీ సమాజంవల్లనే ప్రవేశమయినాయి. కొంచెె మించుమించుగా అందఱూ ఒక్కవయస్సులో ఉండే బాలురు బాలవేషాల్లోనూ, బాలికా వేషాల్లోనూ అధమం ఒక ఇరవైముప్పై మందైనా, ఏదర్బారుసీనులోనో ప్రత్యక్షమయ్యేవారు. మనోహరంగా, లక్కబొమ్మలల్లే ఉండే ఆలేతముఖాలూ, ఆచూపులూ, ఆపాటలూ, ఆగంతులూ అంతా ఒక అపూర్వమయిన అందాన్నీ, ఆనందాన్నీ ఇచ్చేవి......మధ్యమధ్య రామ్‌గారు తన అనుపమాన హాస్యవైదుష్యాన్ని కూడా ప్రదర్శిస్తూ జనులను అమోఘంగా సంతోషపెట్టేవారు.

"ఆయాటలో కూడా మంచి ఆరిందాతనం కనిపించేది. స్టైం ప్రకారంనడిచేది వ్యవహార మంతాను. ఎంతపెద్ద సీనైనా తెప్పపాటులో ప్రసన్నమో, అంతర్ధానమో కావలసిందే. పాతాలకు తడుముకోవడం కాని, అసందర్భప్రదర్శనాలు కాని, అల్లర్లూ ఆకతాయితనాలు కాని, ఏమాత్రమూ కనిపించేవికావు. ఎంత అల్లరిలోనైనా గున్నేశ్వరరావుగారు హాలులోకి వచ్చారంటే అంతా గుప్‌చుప్." (ఆంధ్రనటప్రకాశిక—పుటలు—323-25).

రెప్పపాటులోమారే సీన్సును 'ట్రాన్సఫర్‌మేషన్‌సీన్లు' అందురు. హరిశ్చంద్ర నాటకములోని శ్మశానఘట్టములో విశ్వామిత్రుడు హరిశ్చంద్రునితో "నీవున్నది శ్మశాన భూమి కాదు; యజ్ఞవాటిక..." అనుచు చెప్పును. అంతవరకును శ్మశానముగా నున్న దృశ్యమంతయును నిముషములో యజ్ఞవాటికగా మార్పు చెందిపోయెడిది; ఇట్టివే ఇంకను అనేకఘట్టములు కలవు. ఇది 'bits work' వలన సాధ్యమగును. దీనిని ప్రవేశపెట్టినవారు ఎ. ఎస్. రామ్ గారే. ఈ సమాజములో "దర్బారుసీను" చాల అద్భుతముగా నుండెడిదట. రంగస్థలము చాల పెద్దది (అనగా depth చాల ఎక్కువ). అయినను వారికి శబ్దవిపులీకరణయంత్రావసరమెన్నడును కలుగలేదు. 'పూలతోట భవనం సీను' ఇంకొక ప్రత్యేకత. తెరలు సోపానపంక్తి విధముగా నుండెడివి; అందులో రంధ్రములు ఉత్తరోత్తరాధికములుగా నుండెడివి. వానికి పలుచని కాగితము లంటించి, వెనుక పెద్ద దీపము పెట్టెడివారు. అప్పుడు దూరము నుండి చూచువారికి లెక్కలేనన్ని దీపములు కన్పట్టెడివట ! ఆ దీపములను లెక్కపెట్టినవారికి రు. 116 లు బహుమతియని ప్రకటించెడివారట కూడను.

ఈ సమాజమువారి నాటకములకు టిక్కెట్లు 'అడ్వాన్సు బుకింగ్' అటు బరంపురంనుండి ఇటు మద్రాసునుండి కూడ చాలరోజులు ముందుగానే జరిగెడిదట; ఆరోజులలో వీరినాటకము లన్నచో అంతటిమోజు ప్రజలకు! పైగా, చిలకమర్తివారి గయోపాఖ్యానాదులు ముద్రితములైన తొలిరోజులవి! నిజముగా, ఆంధ్రనాటకరంగ చరిత్రలో అది ఒక విశిష్టమైన కాలము.

### చింతామణినాటకసమాజము (రాజమహేంద్రవరము) :

శ్రీయుతులు నాగేశ్వరరావు, గున్నేశ్వరరావుగార్ల మైత్రి చిరకాలము సాగినదికాదు. గున్నేశ్వరరావుగారు 1912 ప్రాంతములలో విడిపోయినారు. నాగేశ్వరరావుగారు ఒక్కరు మాత్రమే 'హిందూనాటకసమాజము'ను మరికొంత కాలము నడపినారు; వీరు ఏలూరులో నాటకములు ప్రదర్శించుచుండగా ఆ నాటకపుహాలు పరశురామ ప్రీతియై, చిరకాలార్జితమగు రంగస్థలపరికర మంతయు భస్మీపటలమై పోయినది. అయినను నాగేశ్వరరావుగారు క్రుంగిపోలేదు. కొణితివాడ జమీందారుగారి సాయముతో మరల సర్వమును పునర్నిర్మించుకొనినారు. రంగూనువరకు సమాజమును తీసికొని వెళ్ళినారు. ప్రత్యేకముగా డేరాహాలును ఏర్పాటు చేసికొని డైనమోసెట్టును తెప్పించుకొనినారు.

ఇంక గున్నేశ్వరరావుగారు ప్రత్యేకముగా 'చింతామణీనాటకసమాజము'ను స్థాపించినారు; కాని దీనికి 'గున్నేశ్వరరావుగారి కంపెనీ' అనియేపేరు. వీరు ప్రత్యేకముగా 'చింతామణీ

థియేటర్'ను నిర్మించినారు (నేటి జయాటాకీస్). అంగబలము, ఆర్థికబలము కలవారు కాబట్టి అన్నిచోట్ల నుండియు ప్రసిద్ధనటులను తమవైపు ఆకర్షించు కొనినారు. ఇది 1927 ప్రాంతముల వరకు అనగా వారి మరణపర్యంతమును సాగినది.

## మైలవరం కంపెనీ (బెజవాడ):

మైలవరం రాజావారు, శ్రీ రాజాసూరానేని వేంకటపాపయారావు బహద్దరు జమీందారు గారు, మైలవరములో 1913లో 'బాలభారతీ సమాజము'ను స్థాపించినారు ('మైలవరం కంపెనీ' అనునది వ్యవహారనామము). 1916_17లో బెజవాడలో "మైలవరం థియేటర్" కట్టిన తరువాత యీ సమాజము బెజవాడకు తరలినది. పెద్ద పెద్ద జీతాలిచ్చుటచేత చాలమంది పెద్దనటులు ఇటు ఆకర్షింపబడినారు. పాపట్ల కాంతయ్యగారు రాజమండ్రి వదలి ఇచ్చట చేరినారు. హైదరాబాదు నుండి ఎ. టి. రామాంజులు అనువారిని హార్మోనిష్టుగాను, బగ్గన్న అను వారిని తబలిష్టుగాను తీసికొని వచ్చినారు. ఈ ముగ్గురి సమ్మేళనము మైలవరం కంపెనీకి అపూర్వమైన ఖ్యాతిని తెచ్చిపెట్టినది.

'ఆర్కెష్ట్రా'ను రంగస్థలమునకు ముందున్న 'పిట్' (గొయ్యి)లో ఏర్పాటు చేసిన ప్రథమ సమాజము మైలవరం కంపెనీయే అని చెప్పుదురు. అంతియేకాదు కేకులు, క్రీప్ హెయిర్ మొదలగువాని వాడకమును ప్రారంభించిన వారును వీరే. ఇంతకుముందు హార్మోనీ మొదలగునవి 'సైడువింగ్స్'లోనే ఉండెడివి. 1904_05 ప్రాంతముల తెలుగు దేశములో హార్మోనియమును వాయించుట కారంభము చేసినవారు కృత్తివెంటి సుబ్బారావుగారు (బందరు). దానికి ప్రసిద్ధిని, ప్రత్యేకతను చేకూర్చినవారు రామాంజులుగారు; హార్మోనియం వాద్యములో నాటికి నేటికి వీరిని మించినవారు లేరని చెప్పుదురు. కపిలవాయి రామనాథశాస్త్రిగారి ప్రసిద్ధమైన పాటలవెంట గ్రామఫోను రికార్డులలో వీరి కమ్మని హార్మోనియం సంగీతమును నేడుకూడ వినవచ్చును.

ఈ సమాజమున సుప్రసిద్ధులైన నటులెందరో ఉండెడివారు—శ్రీయుతులు యడవల్లి సూర్యనారాయణ, జొన్నవిత్తుల శేషగిరిరావు, దైత గోపాలం, ఉప్పులూరి సంజీవరావు, గురజ నాయుడు, పారుపల్లి సుబ్బారావు, అద్దంకి శ్రీ రామమూర్తి, కుంపట్ల సుబ్బారావు, గోవింద రాజుల వెంకట్రామయ్య మున్నగువారు.

పుట్టుకతో వచ్చిన రాచఠీవితో ధీరోదాత్తనాయకపాత్రములను—ముఖ్యముగా దుష్యంత, సత్యవంతాది పాత్రములను—అద్భుతముగా అభినయించిన నటాగ్రేసరులు యడవల్లి సూర్యనారాయణగారు. సహజముగా గంభీరమూర్తి యగుటచేత భీమ, యమ, కంసాది ధీరోద్ధత పాత్రములను కడునేర్పుతో నిర్వహించినవారు గురజ(గూడపాటి నరసింహారావు) నాయుడుగారు. ఆటలో, పాటలో, రూపములో సాటిలేనివారై అట్టి స్త్రీపాత్రాభినయము నభూతోనభవిష్యతి అను ప్రసిద్ధి పొందినవారు ఉప్పులూరి సంజీవరావుగారు. రాధ పాత్రధారణమున సుప్రసిద్ధులు పారుపల్లి సుబ్బారావుగారు. సత్త్వగుణప్రధానములగు పాత్రలకు పెట్టినది పేరైన దైత గోపాలంగారు 'ఆంధ్ర గంధర్వ'గా ప్రసిద్ధి పొందినవారు, కర్ణాటక సంగీతవిద్వాంసులై, దశరథ,

ధర్మరాజ, కర్ణాది ధీరప్రశాంత పాత్రములను నేటికిని విజయవంతముగా అభినయించుచున్న వారు అద్దంకి శ్రీరామమూర్తిగారు; ఇట్టి మహామహులైన నటులవలననే యీ సమాజమున కంత ఖ్యాతి లభించినది.

డబ్బుకు లెక్కచేయక ఆధునికరంగపరికరము లన్నియును సమకూర్చుకొనుటచేత ఈ సమాజపు ప్రదర్శనములు అపూర్వముగా నుండెడివి. ఈ సమాజమువారి ప్రత్యేకత శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి సావిత్రి, మల్లాది అచ్యుత రామశాస్త్రిగారి ద్రౌపదీ వస్త్రాపహరణము. ఇందులో 'సినీమా ట్రిక్కులు' కూడ వీరు చూపించెడి వారు.

"ఆదినాల్లో వీరు వేసిన ఆ బ్రహ్మాండమైనహాలూ, అందులో అమర్చబడిన అశోక సింగు ఎలక్ట్రిక్ దీపాలూ, ఆ పరిపరి విధాలైన పార్షీదుస్తులూ, ఆతెరలూ, ఆపాటలూ, ఆపాపట్ల కాంతయ్యగారి హార్మోనీ (తరువాత శ్రీ రామాంజులుగారు), బగ్గన్నగారి తబలా, ఆయన్నిటిలోచేరి తాలకరించే మనయడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావుగార్ల చిత్రవిచిత్రమైన బోజువొలుపులూ, ఆసావిత్రిలోని "పోవుచున్నాడే," "చూపులూ, తూపులూ" ఎన్నెన్ని జిల్లాలవారినో ఆకర్షిస్తూ ఉండేవి. టెలిగ్రాములమీద జరుగుతూ ఉండేది సీట్లు రిజర్వు చేసేపని అంతాను"—(ఆంధ్రనట ప్రకాశిక–పుట 347.)

ఇంచుమించుగా ఈ సమాజనిర్వహణములోనే శ్రీరాజావారి ఆర్థికస్థితి దెబ్బతిన్నదని చెప్పుదురు; 1924లో వారు తప్పుకొనినారు. అటుపిమ్మట కూడ అదేపేరుతో, ఒక కమిటీ యాజమాన్యమున, ఈ సమాజము కొనసాగినది; ఇందు ముఖ్యులు కపిలవాయి రామనాధశాస్త్రి. కుంపట్ల సుబ్బారావు ప్రభృతులు. ఈ సమాజమునకు శ్రీ మరుపిళ్ళ చిన్న అనెడి వస్తాదు అండగా నుండెడివారు. మద్రాసు పార్థసారధి, చాపల రాజారావు అను వారలు చిత్రకారులు. దోరడ్ల వెంకటరత్నం 'మేకప్‌మాన్'. ఈ సమాజమువారు 1918 ప్రాంతముల సొంత ఎలక్ట్రిక్ డైనమోసెట్టును ఏర్పాటు చేసికొనినారు. 1930–31 ప్రాంతముల ఈ బాలభారతీ సమాజపు నటులతోను, శ్రీమతి దాసరి కోటిరత్నంతోను ఈస్టిండియా కంపెనీవారు (కలకత్తా) 'సావిత్రి' సినిమా తీసియున్నారు.

## సికిందరాబాదు–హైదరాబాదు నాటకసమాజములు :

1912–13 ప్రాంతముల సికిందరాబాదులో సి. టి. మోహనరంగం పిళ్ళె అనువారు 'వాణీ విలాస సభ'ను స్థాపించినారు. రాజానాగన్న దేవిడిలో (నేటి చిత్రాటాకీసు ఉన్నస్థలము) నాటకప్రదర్శనములు జరిగెడివి. పిళ్ళెగారే నాయకపాత్రధారులు. కె. శేషయ్య అనువారు నాయికాభూమికలను ధరించెడివారు. మైలవరం కంపెనీలో చేరుటకు పూర్వము ఎ. టి. రామాంజులుంగారిదే పనిచేసినారు. ఈ సమాజమువారు గుంటూరు మొదలగు ప్రదేశములలో కూడ ప్రదర్శన లొసంగినారు. వాణీవిలాససభకు వ్యతిరేకముగా "సరస్వతీసభ" అనెడి సమాజ మొకటి వెలసినది. 1919లో "శ్రీకష్ణమనోల్లాసినీ సభ" అనునదింకొకటి బయలుదేరినది; కాని 1928–29లో ఈ రెండును ఏకమైనవి; ఇదిచాలకాలము వరకు సాగినది. ఈసమాజములలోని

నటులందరును ఔత్సాహికులు; ఉద్యోగస్థులు; నాటకకళోపాసకులు. ప్రదర్శనములవలన వచ్చిన రాబడితో ధర్మకార్యము లాచరించెడివారు. వీరిలో సుప్రసిద్ధనటులు పి. ఎమ్. వేణు గోపాలస్వామిగారు నటులుగానేకాక ఉత్తమనాట్యాచార్యులుగా చక్కనిఖ్యాతి గడించినారు. సికిందరాబాదులో 'నటపితామహు'లనదగినవారు వీరే. విశ్వనాథశాస్త్రి అనువారు కొన్ని నాట కములు రచించి ప్రదర్శింపజేసినారు; వీరి మేనకావిశ్వామిత్రము ముద్రితము.

ఇంక హైదరాబాదులో ధర్మవరం గోపాలాచార్యులుగారు 1906_07 ప్రాంతముల లోనే "కృష్ణవిలాసినీ సభ" యను దానిని స్థాపించి కొంతకాలము నడపినారు. 1910 ప్రాంత ముల "హైదరాబాద్ అమెచ్యూర్స్" అను సమాజము ప్రారంభమైనది. ఇందులో డా. ఎన్. ఎన్. ఇనుగంటి (శ్రీమతి సరోజినీదేవినాయుడు మేనల్లుడు) ప్రసిద్ధనటులు. వీరిలోనుండి చీలి పోయిన కొందరు 1915లో "ఫ్రండ్సు యూనియన్" అను సమాజమును స్థాపించిరి; వీరెక్కు వగా ఆంగ్లనాటకములనే ప్రదర్శించెడివారు; దీనిరికి పెద్దపెద్ద జాగీరుదార్లు పోషకులుగా నుండెడి వారు. ఈ సమాజపు నటులలో ఎన్. నారాయణదాస్‌గారు సుప్రసిద్ధులు. అటుపిమ్మట "కళా మండల్" (మహారాష్ట్రసమాజము) మొదలగు పెక్కు సమాజములు బయలుదేరినవి.

## విజయరామ డ్రమాటిక్ అకాడెమీ (విజయనగరము):

1910 ప్రాంతములనుండి విజయనగరములో "అమెచ్యూర్ థియాట్రికల్ కంపెనీ" అనునది పనిచేయుచుండెను. అటుపిమ్మట విజయనగరం మహారాజా శ్రీ విజయరామగజపతి వారు 8_2_1919 తేదీన "విజయరామ డ్రమాటిక్ అకాడెమీ"ని స్థాపించినారు. (పై సమాజము వారందరును ఇందులో చేరినారు). దీనికి తాతా ఉమామహేశంగారు నాయకులు (వీరు విలన్ పాత్రలకు ప్రసిద్ధి). ఇందులో ముగ్గురు స్త్రీలు కూడ నుండెడివారు; మద్దెల అప్పడు, మద్దెల లక్ష్మీనారాయణ, పొడుగు సుందరి. వీరికి ఒక్కొక్కరికి నెలకు 50రూ॥ జీతము. అందుచే వీరిని "మూడేభైలు" అనెడివారట. పైరెండు సమాజములలోను రామాయణం సర్వేశ్వరశాస్త్రి, అనాసపురపు (జగన్నాధ) గోపాలరావుగార్లు సుప్రసిద్ధనటులు—శాస్త్రిగారు రామదాసు, హరి శ్చంద్ర పాత్రలకు పెట్టినదిపేరు; ఇంక గోపాలరావుగారు దుర్గాదాసు, పఠాన్‌పాత్రల విషయ ములలో ప్రత్యేకత సాధించినవారు. విజయరామ డ్రమాటిక్ అకాడమి కూడ 1935తో ఆగి పోయినది.

## మోతేవారి కంపెనీ (ఏలూరు):

వామనభట్ జోషీ నెలకొల్పిన ఏలూరు సమాజము తరువాత పేర్కొనదగిన సమాజ మేదియును చాలకాలమువరకు ఏలూరులో బయలుదేరలేదు. బుద్ధిరాజువారు వేయించిన నాటక శాలలో తరచు ప్రదర్శనములు మాత్రము జరుగుచుండెడివి.

1920_21 ప్రాంతముల ఏలూరులో ఒకపెద్ద సమాజము బయలుదేరినది. దీని అసలు పేరు "శ్రీ సీతారామాంజనేయనాటకసమాజము." దీని వ్యవస్థాపకులు మోతే నారాయణ రావు జమీందారుగారు. పాశ్చాత్య నాటకరంగ పరిస్థితులను స్వయముగా పరిశీలించివచ్చిన వీరు

కూడ చాలపెద్దఎత్తున సన్నాహము లారంభించి "ఆంధ్ర నాటకప్రపంచంలో పెద్దపేరు ప్రతిష్ఠలు కలిగిన నటవతంసుల నందర్నీ చాలవరకు సమకూర్చారు. అప్పటి ఆచారాల ప్రకారం వారివారి సమర్థతలకు తగినటుల అడ్వాన్సులు ఇచ్చారు. పదిమొదలు వందరూపాయల వరకు జీతాలు ఏర్పఱచారు. ఏలూరులోనూ బెజవాడలోను నాటకభవనాల్ని నిర్మించారు. దేశికులూ, కార్యనిర్వాహకులూ, కవులూ, చిత్రలేఖకులూ, సహాయులూ మున్నగువారెందటికో జీవనాలు కల్పించారు. చక్కని కట్టుబాట్లలో నాట్యశిక్షణ ఇప్పించారు. ఆంధ్రీకృత సంస్కృతనాటకాలూ, స్వతంత్రనాటకాలూ, సాంఘిక నైతిక వివిధ రూపకాలూ మొదలైనవెన్నో చదివింపించారు. కొంచె మించు మించుగా తెలుగు జిల్లాలన్నిటిలోనూ ప్రజలకు వివిధనాటకాభిరుచులను చవి చూపించారు. వెళ్ళిన ప్రదేశాలందంతటా ఉండే పండితులయొక్కయూ, ప్రభువులయొక్కయూ, అధికారులయొక్కయూ సన్మానాల్ని చూరగొన్నారు." (ఆంధ్రనటప్రకాశిక_పుటలు_355_56).

శ్రీయుతులు యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, కడియాల రత్తయ్య, ఆరణి సత్యనారాయణ, ఆలమూరి పట్టాభిరామయ్య, కొచ్చర్లకోట రంగారావు, పంచాంగం వేంకటరామానుజాచార్యులు, కపిలవాయి రామనాథశాస్త్రి, అద్దంకి శ్రీరామమూర్తి, బుద్ధిరాజు లక్ష్మణరావు, ముంజులూరికృష్ణారావు, జొన్నవిత్తుల శేషగిరిరావు, ఓలేటి నారాయణ మూర్తి మున్నగు ప్రసిద్ధనటు లందరును ఇందు పనిచేసిరి. ఇంక కవులలో శ్రీయుతులు శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, బలిజేపల్లిలక్ష్మీకాంతము, మల్లాది అచ్యుతరామశాస్త్రి ప్రభృతు లిందు పనిచేసినవారే.

తెలుగు దేశములోనేకాదు, బహుశః ఆధునికకాలమున భారతదేశములోనే ప్రప్రథముగా మృచ్ఛకటికమును ప్రదర్శించినఖ్యాతి ఈ సమాజమువారికి దక్కినది. 20_9_1924 తేదీన వారొసంగిన ప్రదర్శనమునకు సమ్మోహితులై పురాణం సూరిశాస్త్రిగారు విపులమగు విమర్శను ప్రకటించియున్నారు. (నాట్యాఽలోకము_పుటలు_26_66)—

"నాటకకళపాలిటి కృష్ణరాయలనందగు శ్రీ మోతే నారాయణరావుగారీ యపూర్వ ప్రాచీనరూపకము నభిమానించి ప్రదర్శింపజేసి నందున కెంతయు మెచ్చుచున్నాము. జిడ్డు లింగయ్యగారిని, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారిని సామాజికులకు నిర్దుష్టమగు శిక్షనొసంగి సర్వాంగసుందరమగు ప్రదర్శన మేర్పరచినందునకును, రంగపరికరాదుల గడుంగడు నేర్పుతో సమకూర్చినందుకు శ్రీ సీతారామాంజనేయనాటకసమాజము శిల్పకులను బహుభంగుల నుతింప వలసియున్నది. ప్రదర్శనమందు శ్రీ కొచ్చర్లకోట రంగారావుగారు శకారపాత్రమును, లక్ష్మీ నారాయణగారు చారుదత్త భూమికను, ఆరణి సత్యనారాయణగారు వసంతసేనగను, పట్టాభి రామయ్యగారు మైత్రేయుడుగను. ఆంజనేయులుగారు విటుడుగాను నేర్పొప్పనభినయించిరి. ముంజులూరి కృష్ణారావుగారు చందనకద్యూతకారుల భూమికల దాల్చిరి. రంగపరికరములు, దుస్తులు సింహళనాట్యమందిరము లందువలె చిత్రసామంజస్య మేపారఁ గూర్చబడినవి."

ఈ సమాజమునకు యడవల్లి సూర్యనారాయణగారు మేనేజరుగా కూడ పనిచేసెడివారు. వీరు మంచి కట్టుదిట్టములతో సమాజమును నడిపించెడి వారట. యడవల్లివారి ఉన్నతదశలో

సగము మైలవరం సమాజములోను, తక్కినసగము ఈ సమాజమందును గడచినది. ఈ సమాజమునకు తన్నేరు రామయ్య అనెడి వస్తాదు కాపుదలగా నుండెడివాడు.

**రామవిలాసనభలు (చిత్తూరు: తెనాలి):**

చిత్తూరు : 1-8-1920 తేదీన రావుబహదూరు టి. వి. రంగాచార్యులుగారు అధ్యక్షులుగాను, బ్రహ్మాండం నరసింహారావుగారు కార్యదర్శిగాను ప్రారంభమైనది చిత్తూరు 'రామవిలాససభ'. ఇందులోని సభ్యులందరును న్యాయవాదులు, ఉద్యోగస్థులు. శ్రీయుతులు ఎమ్. అనంతశయనం అయ్యంగార్, ఆర్. బి. రామకృష్ణరాజు, బి. మునుస్వామినాయుడు (మాజీ మద్రాసు ముఖ్య మంత్రి) ప్రభృతు లిందలి సభ్యులే. చిత్తూరు వి. నాగయ్యగారీ సమాజములో సుప్రసిద్ధ నటులే కాక గాయకులు, హార్మోనిష్టులు కూడను. నెల్లూరు వారైన రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు (సుప్రసిద్ధ నటులు, గాయకులు) ఈ సమాజమున బహుకాలము 'కండక్టరు'గా పనిచేసినారు. కె. రాఘవేంద్రరావు, పి. నరసింహయ్యగార్లుకూడ ఇందు పేర్గాంచదగిననటులు. ఈ సమాజము వారుకూడ పలుతావులలో ఉత్తమప్రదర్శనము లొసంగియున్నారు. వీరు మొదట రామమందిర మొకటి కట్టుకొని, పిమ్మట పెద్దనాటకశాలను నిర్మించుకొనిరి.

తెనాలి : 1920లో తెనాలిలోని వైశ్యులు కొందరుచేరి చల్లా ఆంజనేయులుగారి నాయకత్వములో 'శ్రీకృష్ణా హిందూథియేటర్'ను స్థాపించినారు. గుంటూరు సెకండ్‌కంపెనీలోనుండివచ్చి, నెలజీతముమీద మల్లాది గోవిందశాస్త్రిగారిందులో చేరినారు. స్థానం నరసింహారావుగారి ప్రథమ రంగస్థల ప్రవేశమిందులోనే. తరువాతవారు 'రామవిలాస సభ'లోనికి వెడలిపోగా ఇందులో స్త్రీ పాత్రధారణమునకు జగ్గయ్యపేట సమాజమునుండి శ్రీపాద రంగయ్యగారు వచ్చినారు. రంగయ్యగారు తులసిగా, గోవిందశాస్త్రిగారు జలంధరుడుగా ఈ సమాజమువారు చందాల కేశవ దాసుగారి 'సతీ తులసి నాటకము'ను చక్కగా ప్రదర్శించుటలో ప్రసిద్ధి వహించినారు.

ఇంక సుప్రసిద్ధమైన 'రామవిలాససభ' 1921 లో స్థాపింపబడినది. దీని అభివృద్ధికి భాగవతుల రాజగోపాలముగారును, నాట్యశిక్షణకు త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారును పూనుకొనినారు. "ఆ శిక్షావిధానం ఏలాటిదోకాని పుట్టిన మఋనాటినుండీ ఎన్నికలోకి వచ్చింది ఈసభ. క్రమశిక్షణ అనేదాన్ని పొందడం వల్ల సమాజాలు ఎంతత్వరలో కీర్తిని గడించగలవో నిదర్శనంగా చూపించింది ఈసభ. పదార్థభిన్నమయిన భావాభినయప్రాముఖ్యాన్నీ, పాత్ర తత్త్వచిత్రీకరణవిధానాన్నీ ప్రధానంగా అభినయించాల్సి ఉంటుందనే అభిప్రాయాన్ని ఋజువు చేసింది ఈసభ." (ఆంధ్రనటప్రకాశిక-పుట 342). శ్రీయుతులు పెద్దిభొట్ల చలపతి రావు, డా॥ గోవిందరాజుల సుబ్బారావు, మాధవపెద్ది వేంకట్రామయ్య, పిల్లలమర్రి సుందర రామయ్య. పులిపాటి వేంకటేశ్వర్లు, తంగిరాలఆంజనేయులు, ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి, లక్క రాజు విజయగోపాలరావు, పాతూరి సూర్యనారాయణ, రావూరి రంగారావు, స్థానం నరసింహా రావు ప్రభృతు లిందలి ప్రసిద్ధనటులు. వీరు ఒక్కొక్కరు ఒక్కొక్క నాటక ప్రదర్శనము నకు సూత్రధారులు కాదగిన అర్హతలు కలిగినవారు. ఒక్కొక్కరు ఒక్కొక మహా సంస్థవంటి

వారు. ఈ నటులందరును చేరి, ఈ సభలో, ఒకేనాటకములో ఒకే దేశికుని శిక్షణములో కలిసి కట్టుగా పనిచేయుటవలన అచిరకాలములోనే ఈ సమాజము అపూర్వ్వయశస్సు నార్జించినది. వీరి ప్రసిద్ధప్రదర్శనములు రోషనార, ప్రతాపరుద్రీయము, కన్యాశుల్కము, బొబ్బిలి. ఈ నాటకముల ప్రసిద్ధికి స్థానంవారి నాయికావేషధారణము సగము కారణమని చెప్పుట అతిశయోక్తికాదు. పద్మశ్రీ బిరుదాంచితుడైన తొలిభారతీయ నటుడు స్థానంవారే. వడ్డి బాబూరావుగారీ సమాజమునకు చిత్రకారులు. మయినేపల్లి బసవలింగంగారు కూడ ఇందు స్త్రీపాత్రలను ధరించేవారు. గ్రీజ్ పెయింట్లను సమ్మేళనసౌష్ఠవముతో ఉపయోగించిన ప్రథమసమాజమిదియే యని చెప్ప వచ్చును.

## మరికొన్ని ప్రసిద్ధనాటకసమాజములు

### బరంపురము :

శ్రీయుతులు బూర్ల సోదరుల "జగన్నాథ విలాసినీ నాటకసమాజము" చెప్పుకొనదగినది. ఇందులో నాయికాపాత్రధారులలో మద్దూరి అప్పారావు పంతులుగారు ప్రముఖులు. వీరు పానుగంటివారి నాటకముల నెక్కువగా ఆడెడివారు. 1920 ప్రాంతములనుండి 'మిత్రమండలి' అనెడి నాటకసమాజము న్యాపతి నారాయణమూర్తిగారి ఆధ్వర్యములో చక్కగా పనిచేసినది. శ్రీ వెలివెల వీర రాఘవస్వామి ప్రభృతులిందలి ప్రసిద్ధనటులు.

### టెక్కలి :

ఇచ్చటి 'ఆంధ్ర ప్రచారక సంఘము'లో జయంతి వేంకట జగన్నాధరావుగారు ప్రముఖనాయకపాత్రలను, వినుకొండ జోగారావుగారు ప్రముఖనాయికాపాత్రలను ధరించెడివారు. "టెక్కలిలో నొకవిచిత్రమైన కళింగ వైశ్యకుటుంబమున్నది. టంకాల సాంబయ్యగారు స్త్రీ పురుష వేషాలు వేసేవారు. వీరితమ్ములొకరు హార్మోనీ వాయిస్తూ, యింకొకరు తపలా మోదుతూ, మరియొకరు ఇంద్రుడు మొదలైన వేషాలు వేస్తూ యున్నారు. సాంబయ్యగారి కొడుకులిద్దరూ బాలకపాత్రల నభినయిస్తారు. వీరల వుచ్చారణ, సంగీతము, కులనియమముల నతిక్రమించి యసాధారణ విస్పష్టమాధుర్యములతో చెన్నారు తున్నది. అపశబ్ద మెక్కడా రాదు. ఇందులో పెద్దవాడు, శశిభూషణరావు, అపూర్వనటనాచాతుర్యమును కనుపర్చినాడు" (నాట్యాలోకము—పుట 236).

### ఛత్రపురము :

ఇంచుమించుగా 1885 ప్రాంతముల నుండియు "హిందూథియాట్రికల్ క్లబ్" ఇచ్చట పనిచేయుచు వచ్చినది. పట్టణములోని ఉన్నతప్రభుత్వోద్యోగు లందరును ఇందు సభ్యులై దీని నత్యున్నతస్థితికి తీసికొని వచ్చినారు. 1936 లో ఒరిస్సారాష్ట్ర మేర్పడువరకును ఇది చక్కగా సాగినది. ఇందు గోవిందు సూర్యనారాయణగారు నాయికాపాత్రధారి. ప్రసిద్ధనాటక

కర్తలు గుండిమెడ వేంకటసుబ్బారావుగారు దీనికి కార్యదర్శులుగా, దేశికులుగా చాలకాలము పని చేసినారు.

విజయనగరము :

విజయనగరమున 1924లో అనాసపురపు గోపాలరావు, చట్టి సత్యనారాయణగార్లు కలసి 'వాణీ విలాససభ'ను స్థాపించినారు. ఇందలి నటులందరును విద్యాధికులే. నిండైన విగ్రహము, విశాలమైన నేత్రములు కలిగి గోపాలరావుగారు వీరరసప్రధానములైన పాత్రలను చక్కగా అభినయించెడివారు. రంగపరికరాదులను వీరే నిర్ణయించి, సమకూర్చెడివారు. ఇందు నందగిరి శ్రీనివాసరావుగారు కూడ పాత్రలు చక్కగా నిర్వహించెడివారు. ఈ సమాజమువారు ఆంగ్ల నాటకములను కూడ ప్రదర్శించుచుండెడివారు.

విశాఖపట్టణము :

ప్రసిద్ధచారిత్రకనాటకకర్తలు ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి ఆధ్వర్యములో "హితకారిణీ సమాజము"ను, పార్థీ రామారావు పంతులుగారి యాజమాన్యములో "కారొనేషన్ హిందీ అమెచ్యూర్స్'' సమాజమును ప్రసిద్ధి పొందినవి. విద్యాధికులైన నటులతో కూడిన హితకారిణీ సమాజము యజ్ఞనారాయణగారి రసపుత్రవిజయమును సుప్రసిద్ధము చేసినది. 1911 ప్రాంతముల స్థాపింపబడిన అమెచ్యూర్స్ సమాజములో శ్రీయుతులు పార్థీరామారావు, ముప్పిడి జగ్గరాజు (స్త్రీ వేషములు), పార్థీ శేషగిరిరావు, పొడుగు విశ్వనాథాచారి, బాలిసెట్టి వెంకటస్వామి నాయుడు (స్త్రీ వేషాలు) ప్రభృతులు ముఖ్యనటులు. ఇది పిమ్మట 'ఆంధ్ర అమెచ్యూర్స్' అను పేర ప్రసిద్ధికి వచ్చినది. సుప్రసిద్ధ విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజుగారు ఈ ఆంధ్ర అమెచ్యూర్స్‌లో సభ్యులై, నటించినారు. పైరెండు సమాజములేకాక 1900 ప్రాంతముల రాగటి వెంకటసుబ్బయ్యగారు హిందీ నాటకప్రదర్శనముల కొరకు స్థాపించిన సుజనరంజనీ నాట్యమండలి, 1924 ప్రాంతముల ఎం. నటేశ మొదలియార్ స్థాపించిన రాజరాజేశ్వరీసమాజము, 1931లో ఏర్పడిన నాట్యకలాభిలాషులసభకూడ పేర్కొనదగిన నాటకసమాజములు. నాట్యకలాభిలాషుల సభకు భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మ, పురిపండాఅప్పలస్వామిగార్లు కార్యదర్శులుగా పనిచేసినారు.

కాకినాడ :

పిఠాపురం రాజావారి కళాశాలలోని "ఎక్సెల్షియర్ సొసైటీ" వారు నాటకములాడుచుండెడివారు, అందులో వేషములు వేసినవారే 1-11-1916 తేదీన "యంగ్‌మెన్స్‌హేపీక్లబ్" స్థాపించినారు. ఇందులో 'హాస్యనట చక్రవర్తి' బిరుదాంచితులు గండికోట జోగినాధంగారు ప్రముఖులు; పామర్తి బుచ్చిరాజు నాయకపాత్రలకు, దేవినేని జగన్నాయకులు, ఏలూరుపాటి వెంకటరత్నంగార్లు నాయికాపాత్రలకు ప్రసిద్ధులు. జగన్నాయకులుగారి చింతామణి అభినయము ప్రసిద్ధిగన్నది. పేదబాలుర విద్యాభివృద్ధి, ధర్మకార్యనిర్వాహణ—ఈ సమాజధ్యేయములు. ప్రసిద్ధ సినీనటులు శ్రీయుతులు రేలంగి, నల్లరామూర్తి, ఎస్. వి. రంగారావు, శ్రీమతి అంజలీదేవి ప్రభృతులీ సమాజమున తయారైనవారే.

1935 నుండియు సామర్లకోటలో డా. చాగంటి సన్యాసిరాజుగారు చిరకాలము నాటకరంగములో నటులుగా, దేశికులుగా నిరంతరకృషి చేసియున్నారు. వీరు నాట్యవిషయములో ఒకమహాసంస్థ అన్నచో అతిశయోక్తి కాజాలదు.

1918లో 'ఆంధ్రసేవా సంఘ'మనెడి నాటకసమాజమింకొకటి అవతరించినది. (అసలు దీనిని 'ఆంధ్రనాటక సమాజ'మను పేర 1916లో పళ్ళె వేంకట హనుమంతరావుగారు స్థాపించినారు). ఇందులో నాట్యాచార్య కిళాంబి కృష్ణమాచార్యులుగారు, జోస్యుల కృష్ణమూర్తి గారు ప్రముఖులుగా నుండెడివారు. ధర్మకార్యనిర్వహణమే ఈ సమాజధ్యేయము. ఇందు అవసరాల సూర్యనారాయణ (స్త్రీ వేషములు), కస్తూరి శివరావు అనెడి విద్యార్థులు ప్రశంసనీయముగా నటించెడివారు.

1921 ప్రాంతములలో నందికోళ్ళ గోపాలరావుగారు శ్రీ కృష్ణవిలాససభను నడిపి, చక్కని నాటకశాలనుకూడ కట్టించినారు.

పెద్దాపురములో ప్లీడర్లు "విద్యావినోదినీ సంఘము"ను స్థాపించి, 1914-18 మధ్య కాలములో చక్కగా నడపినారు. ఇందలి కల్లూరి సుందరరామయ్య పంతులుగారి యుగంధర పాత్రాభినయము ప్రసిద్ధి నందినది.

పిఠాపురములోని "శ్రీ సూర్యరాయాంధ్రనాటకసమాజము"లో (1908-14) వారణాసి భద్రాద్రి ప్రముఖులుగా నుండెడివారు; ఈ సమాజనిర్వహణములో భద్రాద్రిగారు 40 ఎకరముల సుక్షేత్రమును అమ్ముకొని నిర్ధనులైనారట. వీరి సహనటులు ద్విభాష్యం సుబ్బారావు, శొంఠినారాయణమూర్తిగార్లు; ఈ ముగ్గురిని త్రిమూర్తులనెడి వారట!

## రాజమహేంద్రవరము :

1908లో శ్రీయుతులు శ్రీపాదకామేశ్వరరావు, అంకరాజు రామారావు ప్రభృతులు "రాజమండ్రి అమెచ్యూర్స్" అనెడి సమాజమును స్థాపించినారు. కామేశ్వరరావుగారి సుశిక్షణలో ఇదిమంచిపేరు పొందినది. సుప్రసిద్ధ నటులగు అంకరాజు రామారావుగారు నాయక పాత్రలు ధరించెడివారు. ఏలూరుపాటి వెంకటరత్నంగారు నాయికాపాత్రలను ధరించెడివారు. ఇందలి నటులందరును కామేశ్వరరావుగారి సుశిక్షణలో చక్కగా తయారయ్యెడివారు.

ఈ అమెచ్యూర్స్ 1920 ప్రాంతముల కేసరీ సమాజముగా మార్పునొందినది. డా. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, పెమ్మరాజు రామారావు ప్రభృతుల నాయకత్వములో కేసరీ సమాజము చక్కగా నాటకములు ప్రదర్శించెడిది. ధర్మకార్యాచరణమే వీరిధ్యేయము. శ్రీయుతులు పోణంగి శరభరాజు, పోణంగి జోగిరాజు (నాయికాపాత్రధారికూడ) అనుసోదరులిందు ముఖ్యనటులు. సంపన్నగృహస్థులైన ఈ సోదరులు తమ సర్వస్వమును నాటకకళకు అర్పించి, చివరకు నిర్ధను లైనారు. శరభరాజుగారు 1935 ప్రాంతముల నుండియు హరికథకులై, ఆ కళకు గౌరవమును చేకూర్చినారు. జోగిరాజుగారి జీవితము కేవలము నాటకకళకే అంకితమైనది.

ప్రభుత్వకళాశాలప్రిన్సిపాలుఅయిన కూల్డ్రేగారు అప్పుడప్పుడు ఆంగ్లనాటకములను ప్రదర్శింప జేసెడివారు; శ్రీయుతులు జయంతి గంగన్న ప్రభృతులు ఇందులో పాల్గొనెడి వారు.

1935 నుండియు సామర్లకోటలో డా. చాగంటి సన్యాసిరాజుగారు చిరకాలము నాటకరంగములో నటులుగా, దేశికులుగా నిరంతరకృషి చేసియున్నారు. వీరు నాట్యవిషయములో ఒకమహాసంస్థ అన్నచో అతిశయోక్తి కాజాలదు.

1918లో 'ఆంధ్రసేవా సంఘ'మనెడి నాటకసమాజమింకొకటి అవతరించినది. (అసలు దీనిని 'ఆంధ్రనాటక సమాజ'మను పేర 1916లో పళ్ళె వేంకట హనుమంతరావుగారు స్థాపించినారు). ఇందులో నాట్యాచార్య కిళాంబి కృష్ణమాచార్యులుగారు, జోస్యుల కృష్ణమూర్తిగారు ప్రముఖులుగా నుండెడివారు. ధర్మకార్యనిర్వహణమే ఈ సమాజధ్యేయము. ఇందు అవసరాల సూర్యనారాయణ (స్త్రీ వేషములు), కస్తూరి శివరావు అనెడి విద్యార్థులు ప్రశంసనీయముగా నటించెడివారు.

1921 ప్రాంతములలో నందికోళ్ళ గోపాలరావుగారు శ్రీ కృష్ణవిలాససభను నడిపి, చక్కని నాటకశాలనుకూడ కట్టించినారు.

పెద్దాపురములో ప్లీడర్లు "విద్యావినోదినీ సంఘము"ను స్థాపించి, 1914_18 మధ్య కాలములో చక్కగా నడపినారు. ఇందలి కల్లూరి సుందరరామయ్య పంతులుగారి యుగంధర పాత్రాభినయము ప్రసిద్ధి నందినది.

పిఠాపురములోని "శ్రీ సూర్యరాయాంధ్రనాటకసమాజము"లో (1908_14) వారణాసి భద్రాద్రి ప్రముఖులుగా నుండెడివారు; ఈ సమాజనిర్వహణములో భద్రాద్రిగారు 40 ఎకరముల సుక్షేత్రమును అమ్ముకొని నిర్ధనులైనారట. వీరి సహనటులు ద్విభాష్యం సుబ్బారావు, శాంతినారాయణమూర్తిగార్లు; ఈ ముప్వురిని త్రిమూర్తులనెడి వారట!

## రాజమహేంద్రవరము :

1908లో శ్రీయుతులు శ్రీపాదకామేశ్వరరావు, అంకరాజు రామారావు ప్రభృతులు "రాజమండ్రి అమెచ్యూర్స్" అనెడి సమాజమును స్థాపించినారు. కామేశ్వరరావుగారి సుశిక్షణలో ఇదిమంచిపేరు పొందినది. సుప్రసిద్ధనటులగు అంకరాజు రామారావుగారు నాయక పాత్రలు ధరించెడివారు. ఏలూరుపాటి వెంకటరత్నంగారు నాయికాపాత్రలను ధరించెడివారు. ఇందలి నటులందరును కామేశ్వరరావుగారి సుశిక్షణలో చక్కగా తయారయ్యెడివారు.

ఈ అమెచ్యూర్స్ 1920 ప్రాంతముల కేసరీ సమాజముగా మార్పునొందినది. డా. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, పెమ్మరాజు రామారావు ప్రభృతుల నాయకత్వములో కేసరీ సమాజము చక్కగా నాటకములు ప్రదర్శించెడిది. ధర్మకార్యాచరణమే వీరిధ్యేయము. శ్రీయుతులు వోణంగి శరభరాజు, వోణంగి జోగిరాజు (నాయికాపాత్రధారికూడ) అనుసోదరులిందు ముఖ్యనటులు. సంపన్నగృహస్థులైన ఈ సోదరులు తమ సర్వస్వమును నాటకకళకు అర్పించి, చివరకు నిర్ధనులైనారు. శరభరాజుగారు 1935 ప్రాంతముల నుండియు హరికథకులై, ఆ కళకు గౌరవమును చేకూర్చినారు. జోగిరాజుగారి జీవితము కేవలము నాటకకళకే అంకితమైనది.

ప్రభుత్వకళాశాలప్రిన్సిపాలుఅయిన కూల్డ్రేగారు అప్పుడప్పుడు ఆంగ్లనాటకములను ప్రదర్శింప జేసెడివారు; శ్రీయుతులు జయంతి గంగన్న ప్రభృతులు ఇందులో పాల్గొనెడి వారు.

"ఛత్రపూర్ (గొడుగుపేట) జగన్మోహన్‌థియేటర్ 1890 ప్రాంతములందే బయలుదేరినది. శ్రీయుతులు వడ్లమన్నాటి నాగభూషణం, వేమవరపు రామదాసుపంతులు, దీనికి నాయకులు. శ్రీయుతులు మాగంటి సుబ్బారావు (వీరు హరిశ్చంద్రాది ప్రధాన భూమికాధారులేకాక నాటకకర్తలుకూడ), లింగమూర్తి, దామరాజు వీరేశలింగం, కారుపర్తి నాగలింగం, మల్లెల శేషయ్య, వడ్లమన్నాటి కుటుంబరావు ప్రభృతులిందలి ప్రసిద్ధనటులు. ఇది 1910 ప్రాంతముల వరకు సాగినది.

"రామమోహన్‌థియేటర్"లో గురజనాయుడుగారు సుప్రసిద్ధులు. మద్దాలి శేషగిరి రావుగారిందులో స్త్రీపాత్రలు వేసెడివారు. నాయుడుగారు గురజలోని ఉప్పలపాటి బుల్లినాగయ్యగారి కంపెనీకి 'కండక్టరు'గా వెళ్ళినతరువాత ఇది ఆగిపోయినది.

"రాయల్‌థియేటర్" 1904 ప్రాతముల బయలుదేరినది; ఇందులో శ్రీయుతులు ముంజులూరి కృష్ణారావుగారు, పింగళి నర్సయ్య, పింగళి లక్ష్మీకాంతం, బుర్రా రాఘచారి (గొప్పగాయకులు), వేమూరి రామరావు, శ్రీపతి పట్టాభి రామయ్య ప్రభృతులు ప్రసిద్దినటులు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి ధర్మరాజు_రాజసింహుడు_మంత్రి రాక్షసుడు మున్నగుపాత్రల నిర్వహణము అపూర్వముగా నుండెడివనియు, వీరు శ్రీయుతులు ఈమని లక్ష్మణస్వామి_బళ్ళారి రాఘవాచార్యులగార్లతో సమానమైన నటులనియు పురాణం సూరిశాస్త్రిగారు పేర్కొనియున్నారు. (నాట్యాంబుజము_పుట_173). ఇంక ముంజులూరి కృష్ణారావుగారు సుప్రసిద్ధులైన నటయోగి. మంత్రాల పరదేశి అనువారు ఇందు స్త్రీవేషములను ధరించెడివారు. తిరుపతివేంకట కవుల నాటకములను ప్రసిద్ధిలోనికి తెచ్చిన ప్రథమ సమాజమిదియే. వీరి ప్రతాపరుద్రీయ ప్రదర్శనము కూడ ప్రసిద్ధికెక్కినది.

'బాలభరతసంఘము'నందు శ్రీయుతులు పారుపల్లి సుబ్బారావు. అద్దంకి శ్రీరామమూర్తి, ఉప్పులూరి సంజీవరావు మున్నగువారు నటించినారు.

"ఇండియన్‌డ్రమెటిక్ కంపెనీ" 1910 ప్రాంతముల నల్లూరి బ్రహ్మానందంగారి ఆధ్వర్యములో బయలుదేరినది. డి. వి. సుబ్బారావుగారు చిన్ననాడే ఇందుప్రవేశించి స్త్రీ వేషములు వేసినారు. చిరకాలమువరకు వారే దీనిని నడిపినారు. సుబ్బారావుగారు "బాల వేషాలు, స్త్రీవేషాలు, ప్రధానవేషములు వయోధర్మానుగుణ్యంగా ఎన్నిటినో వేస్తూవచ్చిన వారవడంచేతనూ, అనేకదేశాల్లో తమ నాట్యాన్ని ప్రదర్శించినవారవడంచేతనూ వీరియందు కనిపించే రాంగిక అనుభవం అనేది అంతగా యింకెవరియందు కనిపించదు". (ఆంధ్ర నాటక ప్రకాశిక_పుట_361). ఒకేఒక వ్యక్తిచేతిమీదుగా చక్కని సుశిక్షణతోసాగిన వృత్తినాటక సమాజ మిదియొక్కటే. ప్రసిద్ధనాటకర్తలు పింగళి నాగేంద్రరావుగారు ఈ సమాజములో సుబ్బారావుగారికి చేదోడువాదోడుగా చాలకాలము పనిచేసినారు. సుబ్బారావుగారి ప్రసిద్ధనాటకములు హరిశ్చంద్ర, వింధ్యరాణి మొదలగునవి. ఈసమాజమునకు తోట వేంకటేశ్వరరావుగారి నాయికా వేషధారణము చాల వన్నెపెట్టినది.

1906 ప్రాంతములలో మానికొండ వెంకట్రామయ్యగారొక సమాజమును ఆరంభించి నారు. ఉప్పులూరి సంజీవరావుగారి నటజీవితప్రారంభ మిందులోనే జరిగినది.

ప్రసిద్ధసినీనటుడు అక్కినేని నాగేశ్వరరావుగారు చిన్నతనములో స్త్రీపాత్రధారణము చేసినది ముదినేపల్లిలోని "ఎక్సెల్షియర్ డ్రమెటిక్ క్లబ్"లో.

బెజవాడ :

పూలబావిసందులో 'స్టార్ థియేటర్' అనునది ఉండెడిది. అటుపిమ్మట ఇస్లాంపేటలో 'హిందూథియేటర్' బయలుదేరినది—మొదటిదానికి "బెజవాడ ఫస్టుకంపెనీ" అనియు, రెండవ దానికి "బెజవాడ సెకండు కంపెనీ" అనియు పేరు. 'హిందూథియేటర్'లో శ్రీయుతులు కాశీనాథుని వీరమల్లయ్య (నటులేకాక నాటకకర్తలు కూడను), సుబ్బయ్యనాయుడు (హరిశ్చంద్రాది వేషములు), కారుపర్తి నాగలింగం (రంగరాయాది వేషములు) ప్రభృతు లింద లినటులు.

గుంటూరు :

1960 లోపల గుంటూరులో ఏబదియారు సమాజములు పనిచేసినవి. ఫస్టు, సెకండు కంపెనీలనుగూర్చియు, నవలానాటకసమాజమునుగూర్చియు ఇంతకుముందే వివరించియున్నాను. మిగిలినవానిలో సంఘసేవా నాట్యమండలి, మూన్‌థియేటర్, సీనియర్ హిందూథియేటర్, అమెచ్యూర్స్‌డ్రమెటిక్ క్లబ్, బాలమిత్ర నాటకసమాజము. నాట్యసమితి మొదలగునవి ప్రసిద్ధములు.

"మూన్‌థియేటర్" (1912_36) నిర్వాహకులు శ్రీయుతులు పొత్తూరు హనుమంతరావు, బండారు రామస్వామి నాయుడు[1]గార్లు, శ్రీయుతులు ఆరణి సత్యనారాయణ, కడియాల రత్తయ్య (వెంకటరత్నం) గార్లు ఇందలి ప్రసిద్ధ స్త్రీ పాత్రధారులు.

గుంటూరు ఫస్టుకంపెనీ ఆగిపోయిన తరువాత హరి ప్రసాదరావుగారు స్థాపించిన సమాజము "సీనియర్ హిందూథియేటర్" (1912_19). శ్రీయుతులు కోపల్లె హనుమంతరావు, పిల్లలమఱ్ఱి సుందరరామయ్య, పర్వతనేని వీరయ్యచౌదరి, బెల్లంకొండ సుబ్బారావు ప్రభృతు లిందులో పనిచేసియున్నారు. కోటంరాజు లక్ష్మీకాంతంగారు స్త్రీపాత్రలను ధరించెడివారు.

నాట్యాచార్య యడవల్లి సూర్యనారాయణగారి నటజీవితారంభము జరిగినది "అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్"లో (1912_15). వీరు బెజవాడ మైలవరం సమాజములో చేరగానే ఇది నిలిచి పోయినది.

"బాలమిత్రనాటక సమాజము" కొప్పరపు సుబ్బారావుగారి ఆధ్వర్యములో నడచిన సంఘము (1925_30). శ్రీయుతులు పి. సూరిబాబు, కె. రఘురామయ్య, మాష్టర్ అంజి ప్రభృతులిందలి నటులు.

1920 ప్రాంతముల సంఘసేవానాట్యమండలి దామరాజు పుండరీకాక్షుడుగారిచే స్థాపింప బడినది. వీరిదేశభక్తి నాటకములను శ్రీయుతులు పత్రి శీనప్ప (శ్రీనివాసరావు), జగర్లపూడి

లక్ష్మీనరసింహారావు, వింజమూరి నరసింహాచారి, బసవరాజు సుబ్బారావు, నిడుముక్కల సుబ్బారావు ప్రభృతులు సాటిలేని విధముగా ప్రదర్శించియున్నారు.

1938 ప్రాంతముల సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు గుంటూరులో ఒక నాటక సమాజమును స్థాపించి, నాటకములను సుశిక్షణముతో ప్రదర్శించెడివారు. వీరి తుకారాం ప్రదర్శనము సుప్రసిద్ధమైనది.

ఇంకనాట్యసమితి కూర్మా వేణుగోపాలస్వామిగారు అధ్యక్షులుగా 1943 లో ఆరంభమైనది. శ్రీయుతులు తోట రత్తయ్య, పాతూరి శ్రీరామశాస్త్రి ప్రభృతులిందలి నటులు. వీరి 'నాయకురాలు' చాలప్రసిద్ధినందినది. ప్రసిద్ధసినీనటులు శ్రీయుతులు యన్. టి. రామారావు, కె. జగ్గయ్య, శ్రీమతి టి. కనకం ప్రభృతులు ఈ నాట్యసమితి ప్రదర్శనములలో పాల్గొనినారు.

## నర్సారావుపేట :

"విక్టోరియా మెమోరియల్‌థియాట్రికల్ కంపెనీ" అనెడి సమాజమిచ్చట 1900 లోనే బయలుదేరినది. ప్రసిద్ధ కృష్ణవేషధారి పెల్లంకొండ సుబ్బారావుగారు, శ్రీయుతులు వంగల ఆంజనేయులు, పిల్లలమర్రి సుందరరామయ్య ప్రభృతు లిందలి నటులు. సుబ్బారావుగారు పైకి నీరసముగా కనిపించినను, తెల్లవారుజామువరకు వందలకొలది పద్యములను చక్కని వాచకముతో, కమ్మగా పాడెడివారట ! ఆరోజులలోనే బాపట్లలో "బాలాత్రిపురసుందరీ" నాటక సమాజమనునది బయలుదేరి కొంతకాలము నడచినది. శ్రీ పాలపర్తి రామమూర్తి ప్రభృతు లిందలి నటులు.

దుగ్గిరాలలో 1918 లో కొంగర సీతారామయ్య (ప్రసిద్ధ సినీనటుడు కె. జగ్గయ్యాగారి తండ్రి) గారు "కృష్ణవిలాస సభ"ను స్థాపించి నడిపినారు. 1922 లో దానిని తెనాలికి తరలించినారు. ఒక చక్కని హాలునుకూడ నిర్మించుకొనినారు.

## అల్లూరు :

నెల్లూరుకు పదిమైళ్ళదూరములోనున్న అల్లూరులోని "కృష్ణవిలాససభ" పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారి వలన చాల ప్రసిద్ధిపొందినది. రామదాసు ప్రదర్శనములో వీరు కబీరు పాత్రకు సుప్రసిద్ధులు. ఆపాత్రకు తగిన అంగసౌష్ఠవము, ఆధ్యాత్మికచింతన, హిందీ భాషా ప్రవేశము, సంగీతాభినయములందలి ఔచిత్యము వీరిని ఉత్తమనటునిగా తీర్చిదిద్దినవి. ఇందలి లచ్చారెడ్డిగారి హాస్యప్రసంగములు ప్రసిద్ధి పొందినవి. చక్కని సుశిక్షణముతో కూడిన రామదాసు నాటకప్రదర్శనము ఈ సమాజమునకు ఎనలేని ఖ్యాతిని తెచ్చిపెట్టినది.

## మద్రాసు :

మద్రాసులో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఆంధ్ర నాటక కళాభివృద్ధినికోరి, "ఆంధ్రసభను"ను స్థాపించినారు. తెలుగుదేశములోని ప్రసిద్ధనాటక సమాజముల వారందరును మద్రాసులో ప్రదర్శనములనొసంగిరి; వారందరికిని దేశోద్ధారకుని

సహాయసంపత్తులు లభించెడివి. వీరు బెజవాడలో నిర్మించిన "దుర్గాకళామందిరము" ఆదిలో కేవలము నాటకముల నిమిత్తముద్దిష్టమైనదే. మద్రాసులోని "నటేశంకంపెనీ"కూడ తప్పక పేర్కొనవలసిన సమాజము. సి. యస్. నటేశంగారు ఆంజనేయపాత్రనిర్వహణమున సుప్రసిద్ధులు; అందుచే ఇతనికి "ఆంజనేయ నటేశ"మనియే పేరువచ్చెను. నటేశముగారు చిన్ననాటినుండియు సహజముగా రామోపాసకులు. ఇంక రంగమునందు తన్మయులై నటించెడివారట. ఈ సమాజములో నాగుమణియనునామె మోహిని మున్నగు పాత్రలనద్భుతముగ నిర్వహించెడిదట.

## రాయలసీమ నాటకసమాజములు :

1890_1910 ప్రాతముల అనంతపురంజిల్లాలో కల్యాణదుర్గము తాలూకా 'తూముకుంట' కరణము గుండూరావుగారు "శ్రీహరిహరేశ్వరసహాయనాటకకంపెనీ" అనుపేర ఒక సమాజమును స్థాపించి, అనంతపురంజిల్లాలో పలుతావులందు నాటకములను ప్రదర్శించిరి. గుండూరావుగారు చక్కని శాస్త్రీయసంగీతజ్ఞులు. నటులకందరకును వారే శిక్షణనొసంగెడివారు. ఇట్టిసమాజములు రాయలసీమలో పలుతావులందు వెలసినవి. వీనిలో సుప్రసిద్ధమైన చిత్తూరు రామవిలాససభనుగూర్చియు, సురభిసమాజమునుగూర్చియు ఇంతకుముందే వివరించియున్నాను.

## సికిందరాబాదు, హైదరాబాదు సమాజములు :

సికిందరాబాదులో బుచ్చయ్యగారు (లాలగూడా రైల్వేలోని యుద్యోగులు) మిత్రులతో కలిసి 'జగదీశనాట్యమండలి'ని స్థాపించిరి. వీరు సురవరం ప్రతాపరెడ్డిగారి 'భక్తతుకారాం'ను 1932 ప్రాంతముల 12 సార్లు మద్రాసు, గుంటూరు, బెజవాడ, సికింద్రాబాదు మున్నగుతావులలో ప్రదర్శించియున్నారు. ఇందు బుచ్చయ్యగారే తుకారాం. ఆయన ఉత్తమనటవర్గమున చేరదగినవారు.

అడిగ్‌మెట్‌లో 1930 ప్రాంతములనుండి "ఆంధ్ర మిత్రమండలి" అనెడి సమాజము పనిచేయుచుండెడిదట. కరీంనగరుజిల్లా ధర్మపురిలో శ్రీ కాసర్ల వేంకటరామయ్యగారి ఆధ్వర్యములో "లక్ష్మీనరసింహ నాట్యమండలి" అను సమాజము 1920 ప్రాంతముల బయలుదేరినది; దీనికి చక్కని నాటకశాల, మంచి పరికరములు ఉండెడివి. ఈసమాజములో నారదపాత్రకు సుప్రసిద్ధులైన లక్ష్మీనరసింహశాస్త్రిగారు 1955 లో హైదరాబాదులో జరిగిన ఆంధ్రనాటకకళాపరిషత్తులో సన్మానితులైనారు. నిజామాబాదుజిల్లా మోర్తాడలోకూడ ఇంకొకసమాజము చక్కని సుశిక్షణముతో పనిచేయుచుండెడిది. నవాబుపేట జాగీర్దారు బెల్లంకొండ రాఘవేంద్రరావుగారొక సమాజమును హైదరాబాదులో నడిపినారట.

# తెలుగునాటక రంగము (1880-1928)

తెలుగునాటకరంగములోని తొలిమూడుదశల నింతవరకు వివరించియున్నాను. నాలుగవదశనుగూర్చి వివరించుటకుముందు తెలుగునాటకరంగమున ఇంతవరకును వ్యక్తమైన నటనారీతులనుగూర్చి సమీక్షించుట ఆవశ్యకము.

మొదటిదశలో బయలుదేరిన సమాజములన్నియును ఔత్సాహికసమాజములు. విద్యార్థులు నటులు; ఉపాధ్యాయులు నాటకకర్తలేకాక దేశికులును. ధార్వాడనాటకసమాజప్రదర్శనములవలన దేశములో నాటకకళాభిమాన మంకురించినమాట వాస్తవమేకాని, తమపిల్లలు సమాజ కార్యకలాపములలో పాల్గొనుటకుకాని, వేషములు ధరించుటకుకాని తల్లిదండ్రు లంగీకరించుటకు జంకుచుండిరి. అయినను విద్యార్థులు తల్లిదండ్రులకు తెలుపకయే చాటుమాటుగావేషధారణము చేసెడివారు. తెలిసినచో ఇంటిలో రగడ జరిగినదన్నమాటయే. ఈ పరిస్థితులలో వీరేశలింగం పంతులుగారు తాముస్థాపించిన సమాజమును అచిరకాలములోనే మూసివేయవలసివచ్చుట గుర్తించియున్నాము.

ఆ సంవత్సరమున కాసంవత్సరము విద్యార్థులవయస్సుతోపాటు వారినాటకకళాభిమానమును పెరుగజొచ్చినది. వారికి ఈ కళపైగల అభినూనము పెద్దలనెదిరించెడి స్థైర్యమును కలుగజేసెడిది; చేయునదిలేక తల్లిదండ్రులను చూచీచూడనట్లూరకొనెడివారు. క్రమముగా కొంద రుద్యోగులు పూర్వపుసమాజములలో చేరుట లేదా క్రొత్త సమాజములను ప్రారంభించుట మొదలుపెట్టిరి. ఇది ద్వితీయదశారంభమునందలిస్థితి.

ఈ రెండవదశలోని వారికి నాటకశాలయే ఇల్లుగానుండెడిది; సమాజమే జీవితసర్వస్వముగానుండెడిది. నాడు ప్రతిసమాజమునకు ఒక కవి ప్రత్యేకముగా నుండెడివారు. వారు వ్రాసిననాటకములనే ఆ సమాజమువారు ఆడెడివారు; ఆనాటకములు ఆ సమాజమునకు "సొంత" మన్నమాట. అవి ఇంకొకరికి లభించెడివికావు. అందుచేత ఎన్నిసమాజములు బయలుదేరినవో అంతమంది లేదా అంతకుమించి నాటకరచయితలు బయిలుదేరినారు. సాధారణముగా ఈ కవులే కొన్నిసమామాజములకు సర్వాధికారులును; కొన్నింటిలో దేశికులుగా నుండెడివారు. కొన్నింటిలో కవులుకూడ పాత్రధారణము చేసెడివారు. ఒకసమాజములోని నటులు ఆ సమాజమునకే కట్టుబడియుండెడివారు. ఇంకొకసమాజప్రదర్శనములలో పాల్గొనుట యెరుగురు; పాల్గొనిరా, ఈ సమాజమునకు నీళ్ళువదులు కొనినారన్నమాటయే.

ఇంచుమించుగా 1897 వరకును తెలుగుదేశమందలి సమాజములలో అధికభాగము కేవలము వచననాటకములనే ప్రదర్శించినవి. (ఈ సత్యమును ఆధునికులలో పలువు రెరుంగరు. అందుచేతనే పూర్వపుతెలుగు నాటకప్రదర్శనములన్నియును పద్యమయములేయని విమర్శించుట జరుగుచున్నది). సుస్పష్టమైన, అర్థవంతమైన వాచికాభినయవిషయములో ఆనటులు, ఆదేశికులు శక్తివంచనలేని కృషిచేసినారు. ఈ సందర్భమున ముఖ్యముగా పేర్కొనవలసినవి రాజమహేంద్రవరము, గుంటూరులలోని హిందూనాటకసమాజములు. ఆ నాటినటులకు మార్గదర్శకము కాదగిన ప్రసిద్ధమార్గము లేదు; నాటకకళలో ఆరితేరినదేశికులు లేరు (నటులట్టి ఔత్సాహికులో దేశికులును అట్టి ఔత్సాహికులే). చదివితెలిసికొనుటకు నేడున్న విమర్శగ్రంథములు నాడు లేవు. దేశవిదేశనటనారీతులు తెలిసికొనుటకు సాధనములైన సినీమాలులేవు; వీటి అన్నింటికి తోడునటులకు సంఘమున గౌరవములేదు. ఇంక స్త్రీవేషధారుల యవస్థలు మరియు శోచనీయ

ముగా నుండెడివి. అయినను నాటినటులు స్వయంకృషిపై ఆధారపడి, కష్టనష్టములకోర్చి, నాటకకళ నుపాసించిరి. మనమందరము వారికి ఋణపడియున్నామనుట అతిశయోక్తికాదు.

ఆనాడేకాదు, చిరకాలమువరకును తెలుగుదేశమున స్త్రీలు రంగస్థలము నెక్కలేదు. పురుషులే, అందున యోగ్యులైన యువకులే స్త్రీవేషములను ధరించెడివారు. ఆ విధముగా నాడు చురుకైనయువకులెందరో ప్రసిద్ధిలోనికివచ్చినారు; అంతియేకాదు స్త్రీవేషముధరించి మెప్పించి నప్పుడే ఆతడుత్తమనటుడుగా, పెద్దవేషములకు తగినవాడుగా తలంపబడెడివాడు. అదియొక ప్రవేశపరీక్షయన్నమాట. ఆవిధముగా నాడు స్త్రీవేషములుధరించి, నాటకరంగమున నాయికలుగా ప్రఖ్యాతినందిన వారెందరో తరువాతికాలములో రాజకీయాదిరంగములందు 'నాయకు' లగుట స్మరింపదగినది—ఆంధ్రకేసరి–దేశభక్త–దేశోద్ధారకాదులందరును ఇందులకుదాహరణమే. అట్లే సుప్రసిద్ధులైన నటులందరిలోను నూటికి తొంబదిమంది ఆదిలో స్త్రీవేషములనుధరించి, ఈప్రవేశ పరీక్షలో నుత్తీర్ణులైనవారే.

నాటకప్రదర్శనము లాదిలో ప్రత్యేకముగావేసికొన్న తాటియాకుల పాకలలో జరిగెడివి. 1900 ప్రాంతములకు అచ్చటచ్చట సుస్థిరమైన నాటకశాలలేర్పడినవి. అటుపిమ్మట చాల నాటకశాలలు నిర్మితములైనవి. నాటకసమాజములమధ్య స్పర్ధలుండెడివి. ఆ స్పర్ధల ఫలముగా తాటియాకులపాకలు పరశురామప్రీతియై వ్యయప్రయాసలతో కూర్చుకొన్నరంగపరికరము లన్నియును బూడిదపాలయ్యెడివి. (ఈ విషాదవిషయమును ఏలూరు, బళ్ళారి, నెల్లూరు సమాజములవిషయమున గుర్తించియున్నాము). సుస్థిరమైన నాటకశాలలేర్పడుటతో ఈ బెడద తప్పినది. చివరకీనాటకశాలలన్నియును 1930 తరువాత 'సినీమాహాల్సు' అయిపోయినవి. నేడు తెలుగుదేశములో చెప్పుకొనదగిన నాటకశాలయేలేదు (ఇటీవల వెలసిన హైదరాబాదులోని 'రవీంద్రభారతి' తప్ప).

1890–1900 ప్రాంతముల తెలుగుదేశములోను, మద్రాసులోను ప్రదర్శనములొసంగిన పార్శీనాటకసమాజముల—ముఖ్యముగా తూంతి–బాలీవాలా సమాజముల—యొక్క ప్రభావము చేత 'సీనరీ' విషయములలో తెలుగుసమాజములవారికి మోజుఎక్కువైనది. అంతవరకును సాధారణములగు దుస్తులతో, సాధారణములగు తెరలతో నాటకములాడుట కలవాటుపడిన తెలుగుసమాజములవారు దుస్తులకొరకు, వైరువర్కులకొరకు వేలకువేలు ఖర్చుపెట్టసాగిరి. బ్రహ్మాండమైన 'సీనరీ'లు తయారుఅగుటచేత రంగస్థలము చాల పెద్దదిగానుండెడిది. (పొడుగు 40 లేదా 50 అడుగులు). శబ్దవిపులీకరణ యంత్రము నిన్నమొన్నటిది; అంతకుముందు వారు దాని నెరుగరు. రంగస్థలములో 30, 40, అడుగులలోపల నున్నవారు మాటాడినను చివరనున్న ప్రేక్షకునకు కూడ సుస్పష్టముగా వినిపించెడిది; నాటి శిక్షణయట్టిది (తరువాతి కాలములో కొందరు రంగస్థలమునకు పైన కుండలు బోర్లించి కట్టెడివారు; దానివలన శబ్దవిపులీకరణము జరుగును). ఆదిలో మృదంగము, ఫిడేలు 'సైడువింగ్సు'లో నుండెడివి; అదియే నాటివారి 'ఆర్కెస్ట్రా'. 1898 ప్రాంతములలో హార్మోనియం వచ్చినది; కాని అది శ్రుతిగామాత్రమే ఉపయుక్తమయ్యెడిది. 1904 ప్రాంతములలో బందరువాస్తవ్యులు కృత్తివెంటి సుబ్బారావుగారు

హార్మోనియంను పాటలకు పద్యములకు నుపయోగించుట కారంభముచేసినారు. (వారికి చాల మంది శిష్యులు బయలుదేరినారుకూడను). అంతటితో ఒక్కొక్కసమాజమున 'హార్మోనిష్టు' సిద్ధమయ్యెను; దానితోపాటు 'తబలా' కూడ ప్రాముఖ్యమునకు వచ్చినది. ఈ రెండింటికిని (హార్మోనియం, తబలాలకు) తెలుగుదేశమున విశేషప్రచారము తెచ్చినవారు శ్రీయుతులు రామాంజులు, బగ్గన్నగార్లు.

నాడు నటులు, వేషధారణసమయములో జింకుపౌడరు, ఎఱ్ఱ-నల్లపౌడర్లు, అర్ధళం మొదలగువానిని ఉపయోగించెడివారు. నాడు క్రేపుహెయిర్, గమ్, గ్రీజ్‌పెయింట్, కేకులు మొదలగునవిలేవు. వీనిని విరివిగా ఉపయోగములోనికి తెచ్చినవారు మైలవరంకంపెనీ వారని చెప్పవచ్చును. దీనితో ప్రతిసమాజమునకు "మేకప్ ఆర్టిస్టు" అవసరము ఏర్పడినది. నాడు ఎలక్ట్రిసిటి లేదు. ముఖ్యముగా 'లష్టర్లు' అనెడి కిరొసనాయిల్ దీపములనే ప్రదర్శనములకు ఉపయోగించెడివారు.

సాధారణముగా నాడు ఒక్కొక్క భూమికకు ఒక్కొక్కరు ప్రసిద్ధికెక్కెడివారు. సూత్రధారిత్వమునకు, హాస్యమునకు కొందరుండెడివారు. అందరును ఒక దేశికుని అడుపాజ్ఞలలో మెలగి, సుశిక్షితు లయ్యెడివారు. నా డాయా సంఘములలో గల ఐకమత్య మపూర్వమైనది. నాటి శిక్షణవిధానమును, పూర్వరంగనిర్వహణవిధానమును ఇదివరకే సూచించియున్నాను. (ధర్మవరం, చిలకమర్తిగార్లను గూర్చియు, ధార్వాడ నాటకసమాజమును గూర్చియు వివరించిన సందర్భములలో).

తరువాతికాలములో సమాజమునకు అధ్యక్ష-కార్యదర్శులు కేవలము నాటకాభిమానులు మాత్రమే ఉండెడివారు. అప్పుడు ప్రతిసమాజమునకును 'కండక్టర్', 'స్టేజిమేనేజర్' అను వారలు అవసరమైనారు. రిహార్సల్సువేయించి, నటులను ప్రదర్శనమునకు సిద్ధముచేయునతడు 'కండక్టర్'; ఇంక రంగస్థలాలంకరణమును, అసలు ప్రదర్శనమును నడిపించునతడు 'స్టేజిమేనేజరు'. ఆదిలో ఎవరి 'పోర్షను'లు వారికి కంఠస్థముగా వచ్చెడివి. తరువాతికాలములో ప్రతిసమాజమునకు 'ప్రోంప్టర్' అవసరము ఏర్పడినది. వీరందరితోపాటు ప్రతిసమాజమున కును ఒక వస్తాదు కాపుదలకూడ ఆవశ్యకమైనది.

ఇంక పద్యములవిషయము. ఆదిలో వేణీసంహారాది సంస్కృతానువాదముల ప్రదర్శనములందే పద్యములు కన్పట్టెడివి; వారైనను పద్యములను కొంచెము రాగధోరణిలో చదువుటయే కాని సాగదీయుట యెరుగరు. స్వతంత్రనాటకములలో పద్యములనే కాక పాటలనుకూడ ప్రవేశపెట్టినవారు ధర్మవరమువారు. హరి ప్రసాదరావుగారి పుణ్యమాయని 1900 నాటికి సర్కారు జిల్లాలలోకూడ పద్యములు, పాటలు విరివిగా ప్రచారములోనికి వచ్చినవి. ప్రసాదరావుగారు తగుమాత్రముగనే సంగీతము నుపయోగించెడివారు. కొంతకాల మావిధము నందరనుకరించిరి. అట్టికాలములలో కూడ ఈమనివారు హిందీలో కేవలము గద్యనాటకములనే ప్రదర్శించి 'నాట్యయోగి' అనిపించుకొనినారు. అటుపిమ్మట సంగీతపుమోజు ముదిరి వెఱ్ఱిగా మారినది; "సంగీతనాటకములు"[1] బయలుదేరినవి. శ్రీయుతులు నాగేశ్వరరావు, గున్నేశ్వర

రావుగార్ల ధర్మమ్మాయని ప్రతిసమాజములోను ఒక్కొక్క పాపట్ల కాంతయ్యగారు వెలసినారు. ఇంక నటులలో కపిలవాయి, జొన్నవిత్తుల వంటి వారొకవెలుగు వెలుగుటకు అవకాశము ఏర్పడినది. ఈ సమస్యనుగూర్చి 1924 లో బందరులో జరిగిన 'నటసభల'లో తర్జనభర్జనలు జరిగినవి. ఐనను ఫలము కానరాలేదు.[2]

విదేశమునుండి బళ్ళారి రాఘవాచార్యులుగారు తిరిగివచ్చి నాటకోద్యమము ప్రారంభించువరకును ఈ విపరీతరాగపద్ధతికి అడ్డుకట్టయే లేకపోయినది. 1940 ప్రాంతములనుండి ఆంధ్రనాటకకళాపరిషత్తువారి ప్రోత్సాహముతో ఔత్సాహికసమాజములవారు కేవలము గద్య నాటకములనే ప్రదర్శింప నారంభించినారు. నాటకపద్యపఠనములో మధురములైన క్రొత్త క్రొత్త తెన్నులను చూపినవారు శ్రీయుతులు రాఘవ, దైతగోపాలం, మాధవపెద్ది, బందా, పీసపాటి అని నిస్సంశయముగా పేర్కొనవచ్చును. ఇచ్చట ఇంకొక విషయమును కూడ పరిశీలింప వచ్చును; పద్యమునుపాడుట యనునది తెలుగువారి ప్రత్యేకత. ఇతర భారతీయభాషల వారి నాటకములలో పాటమాత్రమే పాడబడును. అందు పద్యములుండవు. ఉన్నను అర్థయుక్తముగా చదువబడును; అంతియేకాని పాడబడవు.

వర్తకసరళి నాటకసమాజముల ప్రారంభదశలోనే తెలుగునాటకరంగములో ఒక క్రొత్తపరిణామము వచ్చినది—అదియే 'నాటకాలపోటీలు'. "The Northern Circars Medal Awarding Society" ఆధ్వర్యములో (శ్రీయుతులు ఐ. వి. ఆర్. గోపాలరావు, డి. వి. నరసింహారావుగార్లు–అధ్యక్ష–కార్యదర్శులు) ప్రప్రథమముగా బెజవాడలో 13–6–1913 తేదీనుండి 5 రోజులపాటు గయోపాఖ్యానములోని "అర్జున" పాత్రకుపోటీ జరిగినది. ఇందులో బెజవాడ, గుంటూరు, తెనాలి, విశాఖపట్టణములలోని సమాజములవారు పాల్గొనిరి. శ్రీయుతులు హరి ప్రసాదరావు, హరి నాగభూషణము, దొరస్వామి అయ్యంగార్, వ. సు. రాయకవి, వేలూరి శివరామశాస్త్రి, పాతూరి కామయ్య, చిలకమర్తి, ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, పాపట్ల కాంతయ్యగార్లు న్యాయనిర్ణేతలు (Judges). ఇందులో ప్రథమబహుమతి గుంటూరు వాస్తవ్యులు పత్రి వేంకటరమణరావుగారికి, రెండవబహుమతి యడవల్లి సూర్యనారాయణగారికి లభించినది. యడవల్లివారికే ప్రథమబహుమతి లభింపగలదని తలంచి వారి అభిమానులందరును పెద్ద ఉత్సవమును తలపెట్టిరట; కాని, అట్లు జరుగకపోవుటచేత అసూయాదు లుత్పన్నములైన వని చెప్పుదురు. అదియెట్లున్నను మొత్తముమీద ఈ పోటీ తెలుగుదేశములో ఒక సంచలనమును కలిగించి ఒక నూత్నోత్సాహమును రేకెత్తించినదని చెప్పకతప్పదు.

అటుపిమ్మట 1915 డిసెంబరు నెలలో బందరులో "ఆంధ్రనాటకప్రోత్సాహకసంఘ" మొకటియేర్పడి "చిత్రనళీయము" పోటీనేర్పరచినది. 1916 లో గుంటూరులో ఏకా సుబ్బారాయుడు (సంగీతదర్పణకర్త) గారి యాజమాన్యమున 'ప్రసన్నయాదవ' నాటకపుపోటీ జరిగినది. 1916 లో కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు స్వయముగా పూనుకొని "బొబ్బిలియుద్ధ" నాటకపు పోటీ నేర్పరచిరి. 1917 లో గుంటూరులో "ఆంధ్రనాటక పరిషత్" వారును, 1918 లో బెజవాడలో గుండిమెడ సోదరులును "సత్యహరిశ్చంద్రీయ"

నాటకపుపోటీలు జరిపిరి. ఏలూరులో మోతేవారు ప్రసన్నయాదవ (1919)-చిత్రామణి (1921) పోటీలు జరిపిరి. ఈ పోటీలలో ఆయాపాత్రముల నుత్తమముగా నటించినవారికే కాక మొత్తము మీద నాటకము నుత్తమముగా ప్రదర్శించిన సంఘమువారికికూడ బహుమతులొసంగబడినవి. బెజవాడలో సత్యహరిశ్చంద్రీయనాటకపుపోటీలు జరుగునప్పటి నాటకకళాభిమానుల కోలాహలము చెప్పనలవికాదందురు. రాత్రి నాటకమైనవెంటనే విమర్శకులు ఆయా నటుల నటనారీతులనుగూర్చి విమర్శలువ్రాసి తెల్లవారుసరికి ముద్రింపజేసి ఊరంతయును పంచిపెట్టెడివారట! ఇంక ఉదయము, సాయంకాలము సమావేశముల నేర్పరచి చర్చలు చేసెడివారట!

ఈ పోటీలఫలముగా చాలమందినటులు సన్మానితులగుట సంభావ్యమైనది; నటులన్నచో ప్రజలకు, అధికారులకుకూడ గౌరవభావ మేర్పడినది. నటులపై అట్లేర్పడుచువచ్చిన గౌరవభావమునకు పరాకాష్ఠయే స్థానం నరసింహారావుగారి కొసంగబడిన 'పద్మశ్రీ' బిరుదము. భారతదేశమున ఉత్తమరాజసన్మానమును పొందిన ప్రథమనటుడు 'తెలుగునటుడు' అగుట గర్వకారణము.

తెలుగునాటకరంగమున స్త్రీ పాత్రధారణమునకు ప్రసిద్ధులైన నటులెందరో కలరు; వారిలో ఇంకను సుప్రసిద్ధులైనవారు శ్రీయుతులు ముప్పిడి జగ్గరాజు, ఉప్పులూరి సంజీవరావు, కె. శ్రీనివాసన్ (నెల్లూరు), స్థానం నరసింహారావుగార్లు. సాధారణముగా మన నాటకములలో రెండురకముల స్త్రీభూమికలు కన్పట్టును—మొదటిరకమువారు సాధువర్తనముగల పతివ్రతలు; ఇంక రెండవరకమువారు గర్వితలు, వేశ్యలు, వీరనారీమణులు. మొదటిరకపు పాత్రలను నిర్వహించుటలో శ్రీయుతులు జగ్గరాజు, సంజీవరావుగార్లును, రెండవరకపు పాత్రలను నిర్వహించుటలో శ్రీ స్థానంవారును సిద్ధహస్తులైనారు. అసలు స్థానంవారు ప్రసిద్ధికివచ్చినది "రోషనారా" పాత్రనిర్వహణలో. అటుపిమ్మట వారిని నటావతంసులను చేసినవి మధురవాణి, దేవదేవి, సత్యభామ, చిత్రాంగి పాత్రనిర్వహణములు. 'పద్మశ్రీ' బిరుదప్రదానానంతరము మద్రాసులో జరిగిన సన్మానసభలో "నే నీ బిరుదమును మధురవాణికే యొసంగుదు"నని పి. వి. రాజమన్నారుగారు పేర్కొనియుండుట గమనార్హము.

తెలుగుదేశమున బయలుదేరినన్ని నాటకసమాజములు మరియేరాష్ట్రమునందును బయలుదేరలేవని చెప్పవచ్చును. కళాభిమానులు తాముగాకాని, శ్రీమంతులను ప్రేరేపించికాని క్రొత్త సమాజములను లేవదీసెడివారు. సాధారణముగా ఒక్కొక్కసమాజములో ఒక్కొక్కనటునకు ప్రసిద్ధి ఉండెడిది; అందులో ఇంకొక నటుడుకూడ ప్రసిద్ధికివచ్చినచో ఆ యిరువురిలో ఎవరో ఒకరు చీలిపోయి ఇంకొక సమాజమును బయలుదేరదీసెడివారు. కొన్నిసమాజములు బుబ్బలో పుట్టి మఖలో మాడిపోయినను పెక్కుసమాజములు స్థిరముగానిలబడి కళాసేవ చేసిన విషయమును గుర్తించియున్నాము. ఇందు పేర్కొనబడిన సమాజములు, నటులేకాక, ప్రసిద్ధికెక్కిన సమాజములు ఇంకను ఎన్నియో కలవు; ప్రసిద్ధికెక్కిన నటు లింకను ఎందరో కలరు. మరియు 1914 లో బయలుదేరిన గ్రంథాలయోద్యమము కారణముగా ప్రతియూరను ఒక్కొక్క గ్రంథాలయ మేర్పడుటయేకాక, వాని కనుబంధములుగా నాటకశాఖలుకూడ నేర్పడుచువచ్చినవి.

వ్యాపారసరళిలో బయలుదేరిన పెద్దపెద్ద సమాజములు దేశములోని పెద్దపెద్ద నటుల నందరిని ఏకత్ర చేర్చుటలో కొంత తోడ్పడినవి; కాని, కలయికలు అనతికాలములోనే విచ్ఛిన్నమయ్యెడివి; ఇంక కేవలము కలతలు, అసూయలు మాత్రమే మిగిలెడివి. ప్రదర్శనములవలన వేలకువేలు వచ్చినను ఈ పెద్దపెద్ద సమాజములను స్థాపించినవారెవ్వరును బాగుపడినట్లు కన్పట్టదు. ఇంచుమించుగా అందరును చితికిపోయినారు; అంతటితో ఆసమాజము లంతరించినవి. కాని, కేవలము నాటకసమాజస్థాపనమువలననే వారు చితికిపోయినారని చెప్పజాలము. కేవలము ఉత్సాహముచేతను లేదా తక్కిన సమాజములను మించవలెననెడి పట్టుదలచేతను మితిమీరిన వ్యయముచేయుటవలనమాత్రమే వారి కాస్థితి పట్టినది. ఈ విషయములో కళది దోషముకాదు; వ్యాపారపద్ధతులు తెలియకపోవుటయే ప్రధానకారణమని చెప్పవచ్చును. ఇంతకును ఒక అర్ధశతాబ్దము కాలముపాటు క్రమాభివృద్ధినంది, మహావైభవముతో సాగిపోయిన తెలుగునాటకరంగము 1930 నాటికి ప్రముఖసమాజము లంతరించుటతో క్షీణదశలోపడినదని చెప్పవచ్చును.

## సంధియుగము (1928-1943)

### కాంట్రాక్టునాటకములు :

ఇంచుమించుగా 1928_30 నాటికి ప్రసిద్ధనాటకసమాజము లన్నియును అంతరించినవని చెప్పవచ్చును. స్వాతంత్ర్యోద్యమసమరములో పాల్గొని, చదువుసంధ్యలుమాని, ఉన్నది ప్రభుత్వపరముకాగా అంగ_ఆర్థికబలములు క్షీణించి ఎండిన చెరువులోని చేపలవలె బయటపడినారు దేశభక్తులు. అదేవిధముగా చిన్ననాటినుండియు నాటకరంగమునకు జీవితముల నంకితముల నొనర్చిన వృత్తినటులందరును సమాజము లంతరించుటతో కాందిశీకులవలె నైపోయినారు. వచ్చినదెల్ల ఖర్చుపెట్టుటయే జరిగినదికాని, సంపాదించిన ఆస్తులులేవు. ఇంకేపనిచేయుటకును వారు శక్తులు కాకుండిరి. అట్టిస్థితిలో కాంట్రాక్టు నాటకయుగ మారంభమైనది. ('కాంట్రాక్టు', 'కాంట్రాక్టర్' మొదలగు ఆంగ్లపదములు బహుళ వ్యాప్తినొందినవి; వానిని అట్లువాడిననే సుబోధకము లగును. కావున ఆపదముల నట్లే వాడుచున్నాను).

ఒకవిధముగా "నాటకములకాంట్రాక్టు" అనునది ఇంచుమించుగా 1913 లోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. 1912 అక్టోబరులో కృత్తివెంటి నాగేశ్వరరావుగారి సమాజపరికరములు_50 వేల రూపాయలు విలువగలవి_ఏలూరులో పరశురామప్రీతికాగా వారు క్రుంగిపోయినారు. వారికి కొంత ప్రోత్సాహమొసంగుటకు వడ్లపట్ల రామయ్య అనువారు నాటకమునకు వెయ్యి రూపాయలు చొప్పున పదునొకండు నాటకములకు పదునొకండువేలరూపాయ లొసంగుటకు 'కాంట్రాక్టు' వ్రాసి, సుబ్బారావుగారి సమాజమును మద్రాసు తీసికొనివెళ్ళి 1913లో ప్రదర్శనము లిప్పించినారు. ఆ 'కాంట్రాక్టు' సవ్యముగానే, జయప్రదముగానే ముగిసినది; అంతటితో అది ఆగిపోయినది కూడను.

1929_30 ప్రాంతములలో కోటమర్తి పూర్ణచంద్రరావుగారు (మైలవరం కంపెనీ నటులు) ప్రప్రథమముగా ఇంకొకరకమైన 'నాటకముల కాంట్రాక్టు' ప్రారంభించిరని తెలియుచున్నది. ఈపద్ధతి 'కాంటాక్టు'లో 'కాంట్రాక్టర్' ఏదో ప్రసిద్ధనాటకమును ఎన్నుకొని, తేదీ

నిర్ణయించి, ఎక్కడో ఒక ఊరిలో ఒక హాలును నిశ్చయించుకొని, ఆ నాటకములోని ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క ప్రసిద్ధనటుని ఆహ్వానించును. ఆ ఒక్కరాత్రికి ఒక్కొక్కరికి ఇంత అని 'కిరాయి' నిర్ణయించును. పెద్దనటులైనచో కొంతగాని, అంతయుకాని ముందుగానే పంపి వేయును; తక్కినవారికి నాటకప్రదర్శనమైనంతనే ఇచ్చును. నిర్ణీతమైన తేదీనాటికి కొంతముందు గానే నలుమూలలనుండి నటులు ఆయూరు వత్తురు; ఎవరి ఆహార్యమును వారే తెచ్చుకొన వలయును. ఎవరి పోర్షనులు వారికి ఇంతకుముందే క్షుణ్ణముగా వచ్చునుకాన రిహార్సల్సు ఆవశ్య కము లేదు. నాటకము పూర్తి అయినవెంటనే మరల ఎవరిత్రోవ వారిదే. ఇది 'కాంట్రాక్టునాటక ముల' ప్రథమదశ. ఆరోజులలో నటులు పూర్ణచంద్రరావుగారియింట పడిగాపులు పడియుండెడి వారట!

మరికొంతకాలమునకు 'కాంట్రాక్టరులు', నటులుకూడ తెనుగుమీరినారు. 'కాంట్రాక్టరు'కు ఆదాయముమీదనే దృష్టి ఎక్కువైనది: నటులకు తమ 'కిరాయి'మీద మమత ఎక్కువైనది. నటులు పలు సమాజములకు చెందినవారగుటచేతను, రిహార్సల్సుకు అవకాశము లేనికారణము చేతను—ఫలాని 'హరిశ్చంద్ర' నాటకమని 'కాంట్రాక్టరు' ప్రకటించినప్పటికిని—హరిశ్చంద్రుడు బలిజేపల్లివారిపాఠమును, చంద్రమతి పానుగంటివారి పాఠమును, విశ్వామిత్రుడు కందుకూరివారి పాఠమును తక్కినవారు తక్కినకవుల పాఠములను చదువుట సంభవించెడిది. నటులు పలు తావులకు చెందినవారగుటచేతను దురాశతో ఒకేరోజున రెండునాటకములలో కాంట్రాక్టుకు అంగీక రించుటచేతను సకాలమునకు రాలేకపోయెడివారు; వచ్చినను కొందరు 'మత్తు'లో వచ్చెడివారు. అట్లు వచ్చినవారు అసలు కవులువ్రాసిన వాక్యములను విడిచిపెట్టి స్వీయకవితావిన్యాసచమత్కార ములకు, సహనటులను అడగుదొక్కుటకు ప్రయత్నించెడివారు. నటులరాక ఆలస్యమయినచో ప్రదర్శనప్రారంభము చాల ఆలస్యముగా జరిగెడిది. అనుకొన్ననటుడు అసలురానిచో ఎవరినో ఒకరిని బతిమాలి బలవంతముగా ఆపాత్ర వేయించెడివారు; ఎవరును లభింపనిచో ప్రధానమైన రంగములనుకూడ కొన్నింటిని తగ్గించివేసి, నాటక మైనదనిపించెడివారు. నాటకశాలలన్నియును 'సినీమాహాల్సు'గా మారిపోవుటచేత ఆ లొడితెడు రంగస్థలముమీద రంగాలంకరణమునకు అవ కాశమే ఉండెడిదికాదు. వీటి అన్నింటిఫలము—రసాభాసము: ప్రేక్షకుల అల్లరి!!

ఒక్కొక్కప్పుడు ప్రధాననటులే 'కాంట్రాక్టు' ప్రకారము వచ్చెడివారుకాదు; ఎవరినో ఒకరిని బతిమాలివేయించినచో ప్రేక్షకు లంగీకరించెడివారు_అట్టిసమయములందును, 'కలెక్షను' పరిగారానప్పుడును 'కాంట్రాక్టరు' మాయమైపోయెడివాడు. ఇంక ప్రేక్షకు లాగ్రహావేశముతో, పాపము మిగిలిననటులకు 'దేహశుద్ధి' అంతటిపని చేసెడివారట; అప్పుడు పోలీసులుకూడ కలుగజేసికొనక తప్పెడిదికాదు.

ఇంక ప్రేక్షకుల రుచులుకూడ అంతంతమాత్రముగానే ఉండెడివి. నాటకశాలలో అధి కారము 'గ్యాలరీ'లో కాని, నేలమీదకాని కూర్చుండువారు చేబట్టినారు. ఒక్కొక్కనాటకములో ఒక్కొక్కరికి ఒక్కొక్క పద్యముపై మోజు ఉండెడిది. ఆ పద్యమువచ్చినప్పుడు ఆనందము పట్టజాలక 'వన్సుమోర్' అని కేకవేసెడువాడు. పూర్వకాలములో, వస్తాదుల కాపుదల ఉన్న రోజులలో, ఎవరైనను 'వన్సుమోర్' అనగానే 'ముయ్యినోర్' అని ఆ వస్తాదు గర్జించెడివాడు;

అంతే_అంతా గప్ చిప్. మరి యిప్పుడట్టిది లేదు. అందుచే 'వన్సుమోర్' అనగానే చనిపోయిన సత్యవంతుడో, లేదా దశరథుడో_చచ్చినట్లు_మరల లేచి. పద్యముపాడి, మరల చావవలసినదే: కొందరు నటుల నేడ్పించుటకు 'వన్సుమోర్' అనెడివారు. అది గ్రహింపలేక_నిజముగా తమ్ము ప్రశంసించుచున్నట్లు నమ్మి_కొందరు మరల పాడెడివారు. చివరకు నాటకప్రదర్శనము వేళా కోళముగా మారి అదియంతయును సహృదయులకు, విజ్ఞులకు తలనొప్పి కలిగించెడిది.[1] ఇచ్చట ఇంకొక సత్యమునుమాత్రము అంగీకరింపకతప్పదు. ప్రేక్షకులలో చాలమందికి నాటక పద్యములు నోటికి వచ్చెడివి; లేదా పుస్తకములు తెచ్చుకొని హాలులో కూర్చుండెడివారు. నటులు కప్పదాటులువేసినచో ఇంకేమున్నది ? ... ఈవిధముగా ప్రేక్షకులు కొంతవరకు నటులకు చెలియలి కట్టవలె పనిచేసెడివారుకూడను.

ఈ కాంట్రాక్టునాటకయుగములోని ఇంకొక పరిణామము ఒకేనాటకములో ఒకేపాత్రను ఒకేరాత్రి ముగ్గురు, నలుగురు నటులు వేయుట : పూర్వముకూడ ఒకేపాత్రను ఇరువురు నటించుట కలదు___చిత్రనళీయములో నలుడు షట్చక్రవర్తులలో ప్రముఖుడు; మహారాజు; తేజోరాశి. కాని సర్పదష్టుడై, నన్నయ్యగారు చెప్పినట్లు, "అబిపొఅడు కుఱుచచేతులు........." అను విధముగా వికృతాకారుడైనాడు. కాగా బాహుకవేషమున కింకొకరు తప్పక కావలసివచ్చెడిది. అటులనే సంపూర్ణరామాయణాది నాటకములలో బాలరామున కొకనటుడు, పెద్దరామున కింకొక నటుడు కావలసివచ్చెడివారు. ఇంక పద్యనాటకములలో___ముఖ్యముగా పాండవోద్యోగవిజయాదులలో___ప్రధానపాత్రధరించెడి ఒకనటుడు మూడునాలుగు గంటలకాలములో వందలకొలది పద్యములను చదువవలసియున్నది. కాగా 'దమ్ము' చాలనివారు సగములో ఇంకొకరికి విధిగా అవకాశము ఇవ్వవలసివచ్చెడిది. ఒకే నాటకములో ఒకే పాత్రను ఇద్దరు ముగ్గురు సుప్రసిద్ధ నటులచే నటింపజేయుట 'కాంట్రాక్టర్'కు కూడ లాభసాటిగా కన్పట్టినది. అంతటితో ఇద్దరు ముగ్గురేకాదు, ఆరుగురు కృష్ణులవరకు పెరిగిపోయినది 'డిమాండు'. నాటకములందు పద్యములకు ప్రాముఖ్యము హెచ్చు అగుటచేతను, పలువురుప్రేక్షకు లందుకొరకే వచ్చుచుండుటచేతను హార్మోనిష్టుకు ప్రాముఖ్య మధికమైనది. నటుడు హార్మోనిష్టు ముఖముచూచియో, సైగచేసియో, ఈలవేసియో తాను పాడవలసిన పద్యమునుగూర్చి సూచనచేసి అతడు 'బాంయి' మనిపించిన తరువాత తాను 'కంయ్' మనుట కారంభముచేసెడివాడు; ఈపరిస్థితి చివరకు గిరికీల సంగీతమునకు దారితీసినది. ఈ కాంట్రాక్టునాటకయుగములో ఈ 'హార్మోనియం' వాద్యము ఒక బెడదగా తయారైనది (అసలిది మన శాస్త్రమునకు విరుద్ధమైన వాద్యమని విజ్ఞులు చెప్పుదురు).

ఇట్లీవిధముగా 'కాంట్రాక్టు' నాటకముల ప్రదర్శనములొకవంకసాగినను, డి. వి. సుబ్బారావు, పి. సూరిబాబు, పీసపాటి నరసింహమూర్తి ప్రభృతులు కొందరు 1913 నాటి కాంట్రాక్టు పద్ధతిలో, తమసమాజములతో చక్కని నాటకములను ప్రజలకందించుట విస్మరింపరాదు. ఇంక సురభిసమాజములవారు మామూలు పద్ధతిలోనేటివరకును ప్రదర్శనములనొసంగుచునే యున్నారు. ఈ యుగములో కొందరు పెద్దనటులు మాత్రము నిజముగా బాగుపడినారు; ఇది వరకు నెలకు ఏవందయేబదియో జీతమైనచో, ఈయుగములో ఒక రాత్రికే అంత

సొమ్మును వచ్చెడిది! ఇచ్చట ఒక సత్యమును మాత్రము విస్మరింపరాదు; పెద్ద పెద్ద సమాజము లంతరించుటతోపాటు తెలుగునాటకరంగముకూడ అంతరించిపోకుండ కాపాడినవారు 'కాంట్రాక్టర్లే'!

కళాప్రపూర్ణ (బళ్ళారి) శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులు :

తాడిపత్రి రాఘవాచార్యులుగారు 1902 ప్రాంతముల బళ్ళారి సుమనోరమసభలో నట జీవితమారంభించినప్పటికిని ఇంచుమించుగా 1920 ప్రాంతములవరకును సర్కారుజిల్లాలకు రాలేదు. అందుచేత వారి అభినయరీతులు వీరికి తెలియుటకవకాశము కలుగలేదు. అయినను వారి పద్ధతిని గూర్చి శ్రుతపాండిత్యముతో చర్చలు సాగుచునేయుండెడివి. ఇంతలో 1921 ప్రాంతముల సహాధ్యాయులగు గూడూరి లక్ష్మణరావుగారి ఆహ్వానముపై రాఘవాచార్యులుగారు ప్రప్రథమముగా బెజవాడలో ప్రదర్శన మొసంగిరి (మోహినీరుక్మాంగదలో నారదుడు వేసినారని చెప్పుదురు). కాని, పద్యనాటకముల కలవాటుపడియున్న బెజవాడసామాజికులకు వారి అభినయ విధానముకాని, పద్యపఠనారీతికాని నచ్చలేదు. కొంతఅల్లరి జరిగినది. రాఘవాచార్యులుగారు చాలనిరాశపడినారు. తిరుగుప్రయాణములో గుంటూరులో కొప్పరపు సుబ్బారావుగారు సమాద రించెడి వరకువారు తేరుకొనలేదనియే చెప్పుదురు. అదియెట్లున్నను కొప్పరపువారు, శ్రీరాఘవ మాత్రము ముఖ్య స్నేహితులైనారు. పైఅపజయమును లెక్కచేయక మిత్రులప్రోత్సాహముతో శ్రీరాఘవ జిల్లాలో విరివిగా ప్రదర్శనములొసంగెను. క్రమముగా వారి ప్రభావము అచ్చటి నటులపై ప్రసరించి, అనేకులు వారి ననుకరింపసాగిరి; అంతటి నటుడు లేడని ప్రజలు, కళాభి మానులు, విమర్శకులు, తోటి నటులు వారికి బ్రహ్మరథము పట్టినారు.

రాఘవాచార్యులుగారు 1928 ఏప్రిలు నెలలో విదేశయాత్రకు బయలుదేరివెళ్ళి ఇంగ్లండు, ఇటలీ, స్విట్జర్లాండు, ఫ్రాంసు, జర్మనీ, హాలండు దేశములలో పర్యటించి, 1928 అగష్టులో స్వదేశమునకు తిరిగి వచ్చిరి. రాగానే వారు రెండు నినాదములు చేసినారు —

1. స్త్రీలే స్త్రీ వేషములు ధరింపవలెను—పురుషులు స్త్రీవేషములువేసిన ప్రదర్శనము లందు పాల్గొనని వారిప్రతిజ్ఞ. "Why do boys play the roles of girls in India? Are your girls so bad looking?" అని బెర్నార్డుషా వీరిని ప్రశ్నించినదాని ఫలమిది.

2. ప్రదర్శనమందు అభినయము—అందున సాత్త్వికాభినయము—ప్రధానము. చిత్ర విచిత్రములైనవస్తువులు, సీనరీలు అక్కరలేదు, బెర్లిన్‌లోని ఒకసమాజమువారు కేవలముఒక తెల్లని గోడను వెనుకదృశ్యముగా చేసికొని నాటకమంతయును చక్కగా నిర్వహించినారట; అది వీరిని బాగుగా కదలించినది.[2]

రంగస్థలమనునది పవిత్రమైన ఆశ్రమప్రదేశమువంటిదనియు, ఉత్తమనటుడు యోగి తుల్యుడనియు రాఘవాచార్యులవారివిశ్వాసము. అందుచేత అవి వేశ్యలు పురుషులతోకలిసి రంగ స్థలమునెక్కుటకు ముందుకు వచ్చెడిరోజులే అయినను, కులస్త్రీలనే వేషధారణమునకు ఆహ్వానించి

నారు రాఘవాచార్యులుగారు. ఆ ఆహ్వానమును పురస్కరించుకొనియే శ్రీమతులు కొమ్మూరు పద్మావతీదేవి, మాడపాటి సరోజినీదేవి, అన్నపూర్ణ ప్రభృతులు ఉత్సాహముతో, సంతోషముతో ముందునకువచ్చి రాఘవాచార్యులుగారి సుశిక్షణములో ఉత్తమనటీమణులుగా రూపొందినారు. ఈ విధముగా కులస్త్రీలను రంగస్థలముమీద ప్రవేశపెట్టి పరాయిపురుషులతో నటింపజేసిన ప్రథములు రాఘవాచార్యులుగారే.

రాఘవాచార్యులుగారి ఉద్యమఫలముగా, ఈకాలమున కొందరు స్త్రీలు వృత్తినాటక రంగమున కూడ ప్రవేశించి, ప్రసిద్ధికెక్కినారు; అట్టివారిలో శ్రీమతులు రామతిలకం, శ్రీరంజని, కన్నాంబ, రాజేశ్వరి ప్రభృతులు ముఖ్యులు.

చక్కనివాచికము, ముఖరాగము, భావవ్యక్తీకరణసామర్థ్యము, జ్ఞాపకశక్తి, సమయస్ఫూర్తి-ఇవియైదును అభినయము విషయములో రాఘవాచార్యులవారి మూలసూత్రములు. ఇవి కలవాడే నటనామార్గుడని వారినిర్ణయము. "పుస్తకములో నున్నమాటలను ఏవిధముగా అనవలెనన్నదొక్కటే నటునిధ్యేయము కారాదు; అందులోలేని ఇతరసందర్భములలో అతడెట్లు ప్రవర్తించుననికూడ నటుడూహింపగలవాడైయుండవలెను" అని వారు నొక్కివక్కాణించుచుండెడివారు. వారి యీ దృక్పథము ప్రచారము నందుటవలన బాహ్యాడంబరములపై మమకారమునువిడిచి నటులలో కొందరైనను తమధ్యేయమును అభినయముపై మరల్పసాగిరి. వాద్యములకు, రాగాలాపమునకు, సీనరీలకు, ట్రిక్కులకు ప్రాముఖ్యము తగ్గినది. రూపకగత పాత్రల గుణగణపరిశీలన మధికమైనది. ప్రహ్లాదనాటకప్రదర్శనములో హిరణ్యకశిపుని పరమదుర్మార్గునిగా, దయా-వాత్సల్యాదిగుణహీనునిగా, రాక్షసునిగా చూపించుట ఆనాటివరకును సర్వసాధారణము. కాని, రాఘవాచార్యులవారి దృష్టిలో హిరణ్యకశిపుడు కూడ వాత్సల్యాది గుణములుకలవాడే; వానికిని పితృహృదయమున్నది. కాని, ఏకైకపుత్రుడు తన కాజన్మశత్రు వగువానితో కలిసి పోయినప్పుడాత డేమిచేయగలడు? ఈభావసంఘర్షణమునకే వారు ప్రాధాన్యమొసంగెడివారు. వీరిలో ఈ విధమైన పాత్రపరిశీలనాజిజ్ఞాస రామకృష్ణమఠమునకు చెందిన ఒకస్వాములవారి విమర్శవలన రేకెత్తినదని చెప్పవచ్చును[3] అప్పటినుండియు రాఘవాచార్యులుగారు జిజ్ఞాసాదృష్టితో పరిశీలించి. విమర్శించుకొని, బహువారములు మననము చేసి తాము ధరించిన ప్రతి పాత్ర నిర్వహణములోను ఒకక్రొత్తపద్ధతినిచూపి, ఆపాత్ర శీలమున కొకనూత్నవ్యాఖ్యానము చేయుట జరిగినది. 1930 లో సంక్రాంతిరోజున రాఘవాచార్యులుగారు మద్రాసు 'మ్యూజియంథియేటర్' లో సరోజినీ-అన్నపూర్ణలతోకలసి పి. వి. రాజమన్నారుగారి "తప్పెవరిది" అనెడి సాంఘికనాటకమును ప్రప్రథమముగా ప్రదర్శించినారు. తెలుగునాటకరంగచరిత్రలో ఈ ప్రదర్శన మొక క్రొత్త శకమును ఆరంభించినదని చెప్పవచ్చును.

రాఘవాచార్యులుగారు 'మైక్'ను ఎన్నడును ఉపయోగింపలేదు. 'ప్రాంప్టింగ్' అసలేపనికిరాదు వారికి. 'వన్సుమోరు' లకు వారెన్నడును జంకలేదు. నిజజీవితములో వారెంత సాధువులో రంగస్థలమందు వారంత తీవ్రస్వభావులు. తక్కిన నటులేమాత్రము అజాగ్రత్తగా

మన్నను, ఎచ్చట ఏమిలోటువచ్చినను వారు ఉగ్రులయ్యేడివారు. నటుడు పాత్రలో లీనమై తన్నుదామరచిపోవుటను వారంగీకరింపకున్నను, రంగస్థలమెక్కిన తరువాత నటుడు ఆద్యంతము పాత్రగానే జీవించవలెననివారి ఆశయము. రంగస్థలముమీద అట్లులేనివారిని చూచినచో వారికి ఒడలు మండిపోయెడి దన్నమాట.

మొత్తముమీద 1929 తరువాత తెలుగునాటకరంగచరిత్రలోనే కాక దక్షిణదేశ నాటకరంగచరిత్రలోనే రాఘవాచార్యులుగా రొకనూత్నయుగస్థాపకులైనారు. ఒకసారి ఒక తెలుగు జిజ్ఞాసువు "What about Bahaduri ?" అని రవీంద్రనాథటాగూరుగారిని ప్రశ్నించెను. అంతట రవీంద్రుడిట్లు సమాధానము చెప్పెను — "He is most certainly Bengal's great actor, but for an all India claim I should give my palm to your Andhra actor Raghava."

ఆంధ్రనాటకకళాపరిషత్తు :

1919 లో విశాఖపట్టణమున రాజా శ్రీ విక్రమదేవవర్మగారి అధ్యక్షతలో 'విశాఖపట్టణాంధ్ర నాటక పరిషత్తు' ఏర్పడినది; దానికి మారేపల్లి రామచంద్రకవిగారు కార్యదర్శులు. విశాఖపట్టణములోని సమాజముల నొక్క త్రాటిమీద నడపవలయునన్న యాశయముతో నిది ప్రారంభమైనది. అటుపిమ్మట మల్లాది విశ్వనాథకవిరాజుగారు మిత్రుల ఆదరాభిమానములతో 1923 జనవరినెలలో 'పోలాకి' అనెడి గ్రామములో "గంజాం మండల ఆంధ్రనాటక కళాపరిషదుత్సవములు" అనుపేర ఒక సభను సంసారపక్షముగా జరిపించినారు; అంతియేకాదు, 'నాటక కళ' అనుపేర ఒక మాసపత్రికనుకూడ ప్రారంభించి, ఒక సంవత్సరముపాటు ప్రచురించినారు. 1924 లో బందరులో "నాటకసభలు" జరిగినవి. నాటక సమస్యలనుగూర్చి నాలుగు రోజులపాటు చర్చలు జరిపినారు. 1927 లో నెల్లూరి నగరాజరావుగారి ఆధ్వర్యములో నొక సభ జరిగినదని తెలియుచున్నది. 1923 నుండియు "అఖిలాంధ్ర నాటకకళా పరిషత్తు"ను స్థాపింపవలెనని విశ్వనాథకవిరాజుగారు కనిన కలలు ఎట్టకేలకు 1929 లో ఫలవంతములైనవి. "ఆంధ్రనాటక కళోద్ధారక" బిరుదాంచితులును, సురభిసమాజవ్యవస్థాపకులును అగు వనారస గోవిందరావుగారును, వారి కార్యదర్శి కొత్త లక్ష్మయ్యగారును పూనికవహించిన హేతువుగా ప్రథమ "ఆంధ్రనాటకకళా పరిషత్తు" 1929 జూన్ నెలలో మూడురోజులపాటు తెనాలిలో జరిగినది. విశ్వనాథకవిరాజుగారే దీని ఆహ్వానసంఘాధ్యక్షులు.

19-6-1929 తేదీన తెనాలిలో నిర్మింపబడిన గోవిందరాయ నాట్యమందిరమున తొలిరోజు సమావేశము జరిగినది. దేశము నలుమూలలనుండియు ప్రసిద్ధులైన రచయితలు, నటులు విచ్చేసినారు. మహామహోపాధ్యాయ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు తొలిరోజున అధ్యక్షతవహించిరి; నాడు 'నాటక రచన'నుగూర్చి చర్చలు జరిగెను. రెండవరోజు సభకు చట్టి చినపూర్ణయ్యపంతులుగా రధ్యక్షులు; నాడు 'నటన'నుగూర్చి చర్చలు జరిగినవి. మూడవరోజు సభకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారధ్యక్షులు; నాడు 'నాటకప్రయోగము'ను గూర్చి చర్చలు జరిగినవి. ఆ సంవత్సరమే పరిషత్తు 'రిజిష్టరు' చేయబడెను.

అటుపిమ్మట సంవత్సరమున కొకసారి ఏదో ఒక పెద్ద పట్టణములో ఈ పరిషత్సభలు జరుగసాగినవి. ప్రసిద్ధులైన నాటకకర్తలో, విమర్శకులో, నటులో, శ్రీమంతులైన నాటక కళాభిమానులో అధ్యక్షులుగా ఎన్నుకొనబడెడివారు. మూడునాలుగు రోజులపాటు పెద్దలందరును చేరి సుహృద్భావముతో వివిధనాటకసమస్యలపై చర్చలు సాగించెడివారు. రాత్రులందు ప్రసిద్ధ నటులచే నాటకప్రదర్శనములు జరిగెడివి. పరిషత్తు పక్షమున ఒక త్రైమాసిక పత్రికను నడప వలయునని 1933 లో మద్రాసులో జరిగిన సభలలో నిర్ణయింపబడెను. నీలంరాజు వేంకట శేషయ్యగారు సంపాదకులుగా "నాట్యకళ" అనుపేర ప్రథమసంచిక 1934 డిసెంబరులో వెలువడినది. పిమ్మట కొన్ని సంచిలు మాత్రమే వెలువడి ఇది నిలిచిపోయినది. ఇప్పుడిది మరల శ్రీనివాసచక్రవర్తిగారి సంపాదకత్వమున వెలువడుచున్నది; కాని పరిషత్తుతో సంబంధములేదు (ఇటీవల ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీవారు దీని ప్రచురణమును చేపట్టినారు).

1937 ప్రాంతముల జరిగిన నాటకకళాపరిషత్సభలకు వచ్చిన హరీంద్రనాథ చటోపాధ్యాయ తెలుగు నాటకసమాజములవారికి ఒక ఉద్బోధ చేసియుండెను—సమష్టికృషితో నాటకమును రక్తికట్టింపవలసిన ఆవశ్యకమునేకాక, తెరల విషయములో అవలంబింపవలసిన నూత్నవిధానమునుకూడ నాడాయన ప్రబోధించెను. ఇది 1923 లో 'నాట్యాంబుజ'మున సూరి శాస్త్రిగారు చేసియున్న సూచనయే అయినను నాటి హరీంద్రుని ప్రబోధమే తెలుగు నాటక సమాజములవారికి కొంత కనువిప్పు కలిగించినది. ఆ మరుసంవత్సరమే బందరులో వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' పై పద్ధతిలో ప్రదర్శితమైనది. ఆ ప్రదర్శనమునందు పాల్గొన్న శ్రీయుతులు కందికొండ సత్యనారాయణశాస్త్రి, దాడి గోవిందరాజులు ప్రభృతులు విద్యావంతులు (దాడివారు 'మధురవాణి' పాత్రకు ప్రసిద్ధులు). ప్రసిద్ధ నాటకకర్తలు, దేశికులునైన పింగళి నాగేంద్రరావుగారు దీని నిర్వహణభారమును వహించినారు. ఇంక కళాదర్శకులు అమృతమూర్తి అడివి బాపిరాజుగారు. ఆయా రంగములలో ప్రధానరసములకు అనుగుణములైన రంగుతెరలు మాత్రము వాడబడినవి. ఆహార్యములో, రంగాలంకరణములో దేశకాలపాత్రౌచిత్యాదులు గమనింపబడినవి. కాగా, సమష్టికృషియు, ప్రయోగములోని క్రొత్త పోకడలును ఆ ప్రదర్శనమును విజయవంతము కావించినవి. అప్పటినుండియే తెరల ప్రాముఖ్యము తగ్గిపోయినదని చెప్పవచ్చును. 1941 లో మద్రాసులో జరిగిన 11 వ ఆంధ్రనాటకకళా పరిషత్సభలో ఆచార్య ఆత్రేయ పై విధముగానే కేవలము రంగుతెరలతో 'శాంతి' అను నాటకమును విజయవంతముగా ప్రదర్శించెను.

ఆంధ్ర నాటకకళా పరిషత్తువారు జరిపిన ఆందోళన ఫలితముగానే నాటకప్రదర్శనముల మీది 'వినోదపుపన్ను'ను ప్రభుత్వము రద్దుచేసినది. ప్రసంగాంతరమున శ్రీ హెర్బర్టుమార్షల్ చెప్పినట్లు ఈ వినోదపుపన్ను రద్దుచేసి ప్రభుత్వము వేలపుటలకొలది వ్యాసములు, ఉపన్యాసములు చేయజాలని మహోపకారమును నాటకకళకు కావించినదని చెప్పవచ్చును. మరియు, ఆంధ్రనాటకరంగ పునరుద్ధరణమునకు సూచనల నొసంగుటకై పరిషదధ్యక్షులు రాజా శ్రీ రంగయ్యప్పారావుగారి అధ్యక్షములో ఉమ్మడి మద్రాసు ప్రభుత్వమొక సంఘమును నియ

మించెను. ఈ సంఘసభ్యులు తెలుగుదేశమునందంతటను పర్యటించి, కళాకారులను, విమర్శకులను కళాపోషకులను, రచయితలను కలిసికొని, వారివారి అభిప్రాయములను సేకరించి, ప్రభుత్వమునకొక నివేదికను సమర్పించిరి. కాని, ప్రభుత్వము దానిపై సమగ్రమగు చర్యను తీసికొన్నట్లు కన్పట్టదు. (ఈ నివేదికను ఈమధ్యనే ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీవారు ప్రకటించినారు).

1943_44 సంవత్సరమునుండి పరిషత్తు చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయము ఆరంభమగును. ఆ చరిత్రను తరువాత వివరింతును.

## నవ్యయుగము (1943-1960)

1943 _ 44 సంవత్సరమును ఆంధ్రనాటకరంగచరిత్రలో నవ్యయుగారంభమునకు చిహ్నమునుగా పేర్కొనవచ్చును. ఒకప్రక్క కె. వి. గోపాలస్వామిగారి ఆధ్వర్యవములో ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో అనుబంధ కళాశాలల నాటకకళోత్సవములు ప్రారంభమైనవి. ఇంకొకప్రక్క రాజా శ్రీ రంగయ్యప్పారావుగారి అధ్యక్షములో ఆంధ్రనాటకకళాపరిషత్తువారు ఔత్సాహికసమాజములను ప్రోత్సహించుటకై నాటికా, నాటకపు పోటీలను నిర్వహించుట కారంభించినారు. మరియొకప్రక్క తెలుగుప్రజాసామాన్యమునందు అపూర్వమైన చైతన్యమును కలిగించిన ప్రజానాట్యమండలి అవతరించినది. ఈ మూడు సంస్థల కృషియును నాటకకళను, ముఖ్యముగా ఔత్సాహిక నాటకరంగమును, పునరుజ్జీవింపజేసెను. ఈ కారణముచేత ఈ నవ్యయుగము 'ఔత్సాహికనాటకసమాజ యుగము' అగుచున్నది.

### ఆంధ్ర విశ్వవిద్యాలయము :

1938 లో ఆంధ్రవిశ్వవిద్యాలయమున 'ఆంధ్రా యూనివర్సిటీ డ్రమాటిక్ అసోసియేషన్' స్థాపింపబడెను. ఈ సమాజమువారు కొన్ని చక్కని ప్రదర్శనముల నొసంగియున్నారు. యుద్ధసమయములో ఆంధ్రవిశ్వవిద్యాలయము నాలుగు సంవత్సరములపాటు గుంటూరులో నుండెను. అప్పుడచ్చటి మూడు అనుబంధ కళాశాలల పూర్తి సహకారముతో విశ్వవిద్యాలయమున 1943 లో యూనివర్సిటీ 'ఎక్స్‌పెరిమెంటల్ థియేటర్' స్థాపింపబడెను. అప్పుడు గుంటూరులోను, అటుపిమ్మట వాల్తేరులోను 'ఓపెన్ ఎయిర్ థియేటరులు' నిర్మింపబడినవి; 1957 లో కేంద్రప్రభుత్వ సహాయముతో 'ఎర్‌స్కిన్ స్క్వేర్' (వాల్తేరు)లో విశ్వవిద్యాలయ రంగస్థలమును, బహిరంగ నాటకశాలయును నిర్మింపబడినవి.

1943_46 సంవత్సరములలో గుంటూరులో, ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థిబృందము 'కన్యాశుల్కము'ను (మూడు గంటలకు సంక్షేపించి), చిలుకూరి నారాయణరావుగారి 'అశ్వత్థామ'ను, ముద్దుకృష్ణగారి 'అనార్కలీ'ని, భమిడిపాటి కామేశ్వరరావుగారి 'ఎప్పుడూ ఇంతే', అబ్బూరి వరదరాజేశ్వరరావుగారి 'ప్రతిమాసుందరి', త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'ఖూనీ' మున్నగు నాటకములను విజయవంతముగా ప్రదర్శించెను. ఈ ప్రదర్శనములు సుశిక్షణతో కూడినవై, సహృదయుల మన్ననలను పొందినవి.

ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి 'ఎక్స్‌పెరిమెంటల్ థియేటరు' అచిరకాలములోనే నాటకకళాకేంద్రముగా పేరుపొందినది. 1943 నుండియు విశ్వవిద్యాలయమున నాటకకళోత్సవములు జరుగుచున్నవి. ఆంధ్రప్రదేశ్‌లోని కళాశాలలవారేకాక భారతదేశములోని ఏ కళాశాలవారైనను ఈ ఉత్సవములలో తెలుగు నాటకములను ప్రదర్శింపవచ్చును; ఉత్తమప్రదర్శనమునకు, ఉత్తమనటులకు బహుమతులీయబడును.

విశ్వవిద్యాలయములోని నాటక కార్యకలాపములన్నింటికిని అధినేతలు కూర్మా వేణుగోపాలస్వామిగారు. వీరు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుకూడ నగుటచేత రంగస్థలమునకు, ప్రదర్శనమునకు వలసిన సర్వసన్నాహములును ప్రయాసలేకుండ సమకూరగలవు. ఇట్టి సదుపాయము మరి యే యితర భారతీయవిశ్వవిద్యాలయమునకును లేదనిచెప్పుట అతిశయోక్తి కాజాలదు. గోపాలస్వామిగారు ప్రాచ్య పాశ్చాత్య నాటకకళారీతులను సమగ్రముగా పరిశీలించిన విజ్ఞులు. వీరు ఆయా శాఖలలోని ఉత్సాహవంతులైన యువకులను చేరదీసి, నాటకకళ వివిధశాఖలలో సాంకేతికములైన పరిశోధనలు చేయించినారు. మొత్తముమీద ఈ 17 ఏండ్లలోను వీరు వందకుపైగా నాటకములను ప్రదర్శించినారు. వీనిలో ఒక్కొక్క నాటక మొక్కొక్క క్రొత్త ప్రయోగమునకు ఉదాహరణమని చెప్పవచ్చును. నేడు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి 'డ్రమాటిక్ అసోసియేషను'కు సుమారు రెండు లక్షలు విలువచేసెడి ఆధునికరంగస్థలపరికరములున్నవన్నచో, అది అంతటి అభివృద్ధిని సాధించినదన్నచో—అది అంతయును గోపాలస్వామిగారి దీక్ష, కృషిఫలమే.

అనుబంధకళాశాలలలోని నాటకసమాజములవారికెల్ల విశ్వవిద్యాలయములోని కార్యకలాపములే మార్గదర్శకములు. ప్రతి అనుబంధకళాశాలలోను ఒక్కొక్క ఓపెన్ ఎయిర్ థియేటరును నిర్మింపజేయుటకు గోపాలస్వామిగారు ప్రయత్నము చేసియున్నారు. అప్పుడే కార్యక్రమమారంభమైనది కూడను. గోపాలస్వామిగారి దీక్షకు పరాకాష్ఠ విశ్వవిద్యాలయమున నాటకకళకుకూడ ప్రత్యేకశాఖ యేర్పడుట; ఇది ముదావహమైన విషయము.

## ఆంధ్రనాటకకళాపరిషత్తు (ద్వితీయదశ) :

ఔత్సాహికనాటకరంగమునకు ప్రోత్సాహమీయవలసిన ఆవశ్యకమును గుర్తించిన ఆంధ్రనాటకకళాపరిషత్తు అధిపతులు వార్షికసభల సందర్భమున నాట్యగోష్ఠులు, చర్చలు జరుపుటతోపాటు 1944 నుండి ఔత్సాహికసమాజములమధ్య నాటికా-నాటకముల పోటీలను నిర్వహించుట కారంభించిరి[1]. దీనితో పరిషత్తు చరిత్రలో రెండవదశ ఆరంభమైనదన్నమాట. పరిషత్తు జరిపెడి పోటీలకు ఒక ప్రణాళికను సిద్ధముచేసిన ఉపసంఘములో శ్రీయుతులు దుక్కిపాటి మధుసూదనరావు, యత్తిరాజు మాధవాచార్యులు, కొండముది గోపాలరాయశర్మ సభ్యులు (పోటీలలో ఉత్తమములుగా ఎన్నికైన నాటకములను ప్రచురింప వలయుననెడి నిర్ణయముకూడ జరిగినది. కాని ఒక్క 'ఎదురీత' ప్రకటనముతో ఇది ఆగిపోయినది. పరిషత్తునకు ఉపశాఖలను నెలకొల్పవలయునన్న సంకల్పముకూడ ఫలింపలేదు). ఈ నాటకపు పోటీలకు పరిషత్తువారు

కొన్ని నిబంధనలను విధించినారు—1. సాంఘికేతివృత్తములకే ప్రాధాన్యము; 2. పద్యములకు పాటలకు అవకాశములేదు; 3. స్త్రీ పాత్రలను స్త్రీలే ధరింపవలెను; 4. ఐదేండ్లలోపల రచింపబడిన నాటికా-నాటకములే పోటీల ప్రవేశమున కర్హములు.

పరిషత్తువారు విధించిన పై నియమముల వలన తెలుగు నాటకరంగమునకు రెండు లాభములు కలిగినవి. అందు మొదటి లాభము క్రొత్త నాటకములు, క్రొత్త నాటకరచయితలు బయలుదేరి వెలుగులోనికి వచ్చుట; ఈ క్రొత్త నాటకముల నభినయించుటకు క్రొత్తనటులే అవసరముకాగా ఔత్సాహికనటవర్గము వెలుగులోనికి వచ్చుట. ఇంక రెండవ లాభము. రాఘవాచార్యులుగా రెంత ప్రచారము, ప్రబోధము చేసినప్పటికిని ఆ సమయములో ఏ ఐదారుగురు స్త్రీలుమాత్రమో నాటకరంగమున ప్రవేశించుటకు ముందునకు వచ్చినారు; ఆ తరువాత మరల ఎప్పటిస్థితియే యేర్పడినది. కాని, పరిషత్తువారి నిబంధనముతో ఔత్సాహికసమాజముల వారు విధిగా క్రొత్తవారి నెన్నుకొని, వారిని నటీమణులనుగా తీర్చి దిద్దుకొనవలసి వచ్చినది. ఆ విధముగా చాలమంది స్త్రీలు రంగస్థలమున ప్రవేశించుట కవకాశము కలిగినది.

నేడు సినీమారంగమున ప్రముఖులుగా నున్న పలువురు రచయితలు, నటులు, నటీమణులు ఈ పరిషత్తు నడిపిన పోటీలలో ప్రథమబహుమానములను పొందినవారేయన్నచో ఈ పోటీ లెట్టి సత్ఫలమును సాధించినవో సుస్పష్టము కాగలదు. ఈ పరిషత్తునకు బహుకాలముగా రాజా శ్రీ మేకా రంగయ్యాప్పారావుగారు (అధ్యక్షులు), కాజ వెంకట్రామయ్యగారు (ఉపాధ్యక్షులు); పసల సూర్యచంద్రరావుగారు (ప్రధానకార్యదర్శి) పట్టుగొమ్మలు. పరిషత్తు ఇప్పుడు చారిత్రక-పౌరాణిక నాటకములకు, ఏకపాత్రాభినయములకుకూడ పోటీలను నిర్వహించుచున్నది. పరిషత్పక్షమున, బసవరాజు సుబ్బారావుగారి ఆధ్వర్యములో గుడివాడ కళాశాలలో ఒక నాటకకళాశాల నిర్వహింపబడుచున్నది. శ్రీ రాజా రంగయ్యాప్పారావుగారు పితృపాదుల నాటకకళాభిరుచిని పుడికిపుచ్చుకొన్నవారేకాక స్వయముగా నాటకకళావేత్తలు. ప్రాచ్య-పాశ్చాత్య నాటకసారస్వతమును, విమర్శనవిధానములను అవలోడనముచేసిన విజ్ఞులు. ఇంక పసల సూర్యచంద్రరావుగారు తెలుగు హిందీ నాటక రంగస్థలములందు ఆరితేరిన నటులు. (చిన్నతనములో స్వయముగా ఒక నాటకసమాజమునుకూడ నడిపియున్నారు).

పరిషత్తు పోటీలలో పాల్గొన్న సమాజములలో ప్రముఖముగా పేర్కొ_నదగినవి వెంకటగిరి అమెచ్యూర్ ఆర్టిస్టుఅసోసియేషను, విజయవాడ రాఘవకళాకేంద్రం, బాపట్ల జాతీయకళామండలి, విజయవాడ ఆంధ్రాభ్యుదయనాట్యమండలి, పాలకొల్లు ఆదర్శనాట్యమండలి, రాజమండ్రి రాఘవకళాసమితి, గుడివాడ ప్రభాకరనాట్యమండలి. ఈ సమాజములమధ్య ప్రతి సంవత్సరము తీవ్రమయిన పోటీ ఉండెడిది. చివరి ప్రదర్శనము పూర్తి అగువరకును ఎవరు గెలుపొందగలరో ఊహించుట కష్టముగా నుండెడిది[2].

## ప్రజానాట్యమండలి :

1943 లో బొంబాయిలో "ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్" కాన్ఫరెన్సు జరిగినది. దానికి ఆంధ్రప్రతినిధిగా డా. గరికిపాటి రాజారావుగారు వెళ్ళినారు. అప్పుడా అసోసియేషను

నాటకశాఖలో కలసికొన్న శ్రీయుతులు డా. రాజారావు, కె. అబ్బాస్, అనిల్ డిసెల్వా—ఈ ముప్వురును ఆలోచించి "Indian People's Theatres Association"(Ipta) అనుదానిని అఖిలభారతస్థాయిలో స్థాపించినారు. దానికి తెలుగుదేశపు శాఖగా "ప్రజా నాట్యమండలి" బయలుదేరినది. దీనికి కేంద్రము బెజవాడ; ప్రధాన కార్యదర్శి డా. రాజారావుగారు. వీరు తమ ప్రాక్టీసునుకూడ విడిచివేసి తమ కాలమంతయును ప్రజానాట్యమండలి నిర్వహణములోనే గడపసాగిరి. దీనికి తెలుగుదేశమందంతటను పెక్కు శాఖాసమాజములు బయలుదేరినవి. 1945 లో శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు రచించిన "ముందడుగు"ను ప్రజానాట్యమండలివారు ప్రదర్శించినారు. 12 ప్రదర్శనములైనను జరిగినవో లేదో ప్రభుత్వమువారు దానిని నిషేధించినారు. వెంటనే ఆ యిరువురు "మాభూమి" (1946) అను నాటకమును రచించినారు. దీనిని వివిధప్రాంతములలో ప్రదర్శించుటకు పల్లెలలో 650 (1945-46 లో) శాఖాసమాజములు (దళములు) బయలుదేరినవి. ఇందులో కొన్ని దళములవారికి జీతములుకూడ కలవు. రాష్ట్రదళమునకు (అనగా ప్రజానాట్యమండలికి) డా. రాజారావుగారు నాయకులు; కృష్ణాజిల్లా దళమునకు కోడూరి అచ్చయ్యగారు నాయకులు. ఈ రెండు దళములవారును దేశమందంతటను సంచరించి, ప్రదర్శనము లొసంగినారు.

ప్రజానాట్యమండలివారి ప్రదర్శనములన్నియును చక్కని సుశిక్షణముతో జరిగి విరోధులనుకూడ ఆకర్షించెడివన్నచో అతిశయోక్తిలేదు. 1948 లో 'మాభూమి' కూడ నిషేధింపబడినది. అంతటితో ప్రజానాట్యమండలి కార్యకలాపములు సన్నగిలిపోయినవి. ఇచ్చట గమనింపవలసిన విచిత్రమేమనగా ప్రజానాట్యమండలిలోని కొందరు ప్రముఖ వ్యక్తులమీదను, వారు ప్రదర్శించెడి నాటకములమీదను ఆంక్షలు విధింపబడినవికాని, "ప్రజానాట్యమండలి" మీద మాత్రము నిషేధములేదు!

ప్రజానాట్యమండలి పల్లె ప్రజలలో కలిగించిన సాంఘిక, రాజకీయ చైతన్యము అపూర్వమైనది; అందులకువారు చేపట్టని జానపద కళారీతియే లేదని చెప్పవచ్చును—వీధి భాగవతములు, బుఱ్ఱకథలు, పగటివేషములు, డప్పుల వేషములు—ఒక్కటి అన్నమాట యేమిటి? అన్ని రకములును. 1945 లో కూచిపూడినుండి వేదాంతం వేంకటేశ్వర్లుగారిని పిలిపించి డా. రాజారావుగారును, నాజర్‌గారును ప్రత్యేకముగా నాట్యశిక్షణమును పొందినారు. నాజర్‌గారి బుఱ్ఱకథదళ మాకాలములో అవతరించినదే. వీరు వీథిభాగవతపద్ధతిలో క్రొత్త కథలు—హిట్లరు భాగవతం, బద్మాష్ పాదుషా మొ॥—ప్రదర్శించెడివారు. ఇవి గ్రామీణులను బాగుగా ఆకర్షించెడివి. నాటకకళను—కళాదృష్టి తొలగిపోనీయకయే—ప్రచారసాధనముగా నొనర్చుకొనుటయేకాక, దానిని పల్లె పల్లెకును వ్యాపింపజేసినది 'ప్రజానాట్యమండలి'. ఇంతకు ముందు నాటకప్రదర్శనములను చూడవలెనన్నచో పల్లెప్రజలు పనిగట్టుకొని పట్టణములకు రావలసి వచ్చెడిది; కాని, ప్రజానాట్యమండలివారు పల్లెలకేపోయి, అచ్చటనే నాటకములను ప్రదర్శించుట విశిష్టవిషయము.

వీరు ప్రదర్శించిన నాటకములన్నింటను భూస్వామి లేదా జమీందారునకు, రైతు-కూలీలకు మధ్య జరిగెడి సంఘర్షణమే ప్రధానేతివృత్తము. కాని ప్రదర్శనవిషయమున నివి ఎంత విజయవంతములో, సాహిత్యపరముగా రచనలో అంతటి జిగికలవికావు[3].

## నేటి కొన్ని సమాజములు :

ఆంధ్రనాటకకళాపరిషత్తువారి నాటక పోటీల ఫలితముగా కొన్ని ఔత్సాహిక నాటక సమాజములు వెలుగులోనికి వచ్చినవి. అట్టి వానిలో మొదట పేర్కొనదగినది వెంకటగిరి 'అమెచ్యూర్ ఆర్టిస్టుస్ అసోసియేషను'. ఈసమాజమువారు ఆచార్యఆత్రేయ ఆధ్వర్యమున 'ఎదురీత' నాటకమును గుడివాడలో జరిగిన 13 వ వార్షికసభలో ప్రదర్శించి ప్రథమ బహుమతి పొందినారు. ఇందులో శ్రీ ఆత్రేయకూడ నటించెను. శ్రీ ఆత్రేయ ఈ సమాజమువారికా రోజులలో దేశికుడుకూడను. తుఫాను, ఎదురీత మొదలగునవి ఈ సమాజమువారి ప్రసిద్ధప్రదర్శనములు. 'ఎదురీత' నాటకమును పరిషత్తువారే ప్రకటించియున్నారు. అటుపిమ్మట ఆచార్య ఆత్రేయ రచనలు పరివర్తన, ఎన్. జి. ఓ. మొదలగునవి పరిషత్తులో ప్రథమబహుమానములను పడసినవి. 1930 లో రాజమన్నారుగారి 'తప్పెవరిది' ప్రదర్శనముతో తెలుగు నాటకరంగ చరిత్రలో ఒక క్రొత్త శకము ఆరంభమైనదని పేర్కొనియున్నాను. అట్లే 1949 లో పరిషత్తులో ప్రథమబహుమానమును పడసిన గుమాస్తా (ఎన్. జి. ఓ.) ప్రదర్శనముకూడ ఒక క్రొత్త శకారంభమునకు చిహ్నమని చెప్పవచ్చును.

1895 లో మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిచేత స్థాపింపబడిన కలాభిలాషక సమాజము బెజవాడలో పునరుద్ధరింపబడినది. దీనిలో వెంపటి రాధాకృష్ణగారు ప్రముఖులు; ప్రయోక్తలు.

1950 ప్రాంతముల కొన్ని క్రొత్త సమాజములు బయలుదేరినవి. వానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి—రాఘవకళాసమితి, రాజమహేంద్రవరము; కళావని, బాపట్ల; రసనసమాఖ్య, విజయవాడ మొ॥ ఇవియేకాక జమ్‌షెడ్‌పూరు, కలకత్తా, బెంగుళూరు, ఖర్గపూరు, బొంబాయి మొదలగుచోట్లకూడ తెలుగునాటకసమాజములు చక్కగా పనిచేయుచున్నవి.

20-10-1950 తేదీన రాఘవకళా సమితి ప్రారంభమైనది. ప్రజానాట్యమండలి కార్యకలాపములలో కాకలుదీరిన యోధుడు డా. గరికిపాటి రాజారావుగారు ఇందలి ప్రముఖ నటులు, ప్రయోక్తలు. యాసంరెడ్డి వెంకటరావుగారు ఈ సమాజ కార్యదర్శి. ఈ యిరువురి వలనను ఈ సమాజము ప్రఖ్యాతికి వచ్చినది. వీరి ప్రసిద్ధనాటకములు 'రాం రహీం', 'పరివర్తన', 'భయం' మొదలగునవి. ఇందులో కుమారి లక్ష్మి వర్ధిష్ణువైన నటి.

కళావనికి డా. కొర్రపాటి గంగాధరరావుగారు మూలవిరాట్టు. వారు ప్రఖ్యాతనాటక రచయితలేకాక, చక్కని నటులుకూడను. (అసలు విద్యార్థిదశలో స్త్రీవేషములకు పేరువడసిన వారుకూడను). మరియు నటభీష్ములు సింగరాజు నాగభూషణరావుగారు ఈ సమాజమునకు పెట్టనికోట. ఈ సమాజమువారు డాక్టరుగారి నాటకములనే అధికముగా ప్రదర్శింతురు.

ఇంక ర. స. న. సమాఖ్య. అంతకుముందు "ఉదయనీ రాఘవ కళాకేంద్రము" అనెడి పేరుతో శ్రీయుతులు రామన్నపంతులు, రామచంద్రకాశ్యప్, కె. వేంకటేశ్వరరావు ప్రభృతులు చక్కని నాటకములను ప్రదర్శించెడివారు (డి. వి. నరసరాజుగారి 'నాటకము' మొ॥). నేటి ఔత్సాహికనటవర్గములో ఈ ముప్పురును మూడు నక్షత్రములవంటివారు. కొంత కాలమునకు వీరు విడిపోయినారు. వేంకటేశ్వరరావుగారి ఆధ్వర్యమున ప్రస్తుతము ర. స. న. సమాఖ్య సాగుచున్నది. వేంకటేశ్వరరావుగారు మంచి మేకప్ ఆర్టిస్టుకూడను. ఈ సమాజము వారు దొంగవీరడు, రాగరాగిణి మొదలగు నాటకములకు ప్రసిద్ధికెక్కిరి.

అనంతపురములో రొద్దం హనుమంతరావుగారి ఆధ్వర్యమున ఒక ఔత్సాహిక నాటక సమాజము పనిచేయుచున్నది. హనుమంతరావుగారు బళ్ళారి రాఘవాచార్యులవారి సహనటులు. ఈ సందర్భమున శ్రీకాకుళమునందలి నటరాజ కళామండలి, పాలకొల్లులోని ఆదర్శనాట్య మండలి మొదలగునవికూడ పేర్కొనదగిన సమాజములు.

నేటి నాటకకళోపాసకులలో ముఖ్యముగా పేర్కొనవలసినవారు బహుపాత్రాభినయ బ్రహ్మ ఆచార్య వి. చంద్రశేఖరంగారు. నాటకకళకు సర్వస్వమును నిష్కామముగా అర్పించిన వారు చంద్రశేఖరంగారు. పెద్దపెద్ద రంగాలంకరణలు, దుస్తుల తళతళలు, సంగీతపుహంగులు లేకయే ప్రేక్షకులను సమ్మోహితులను చేయవచ్చునని నిరూపించినారు చంద్రశేఖరంగారు. వీరి బృందములో ముఖ్యులు ముగ్గురు—ఆచార్య చంద్రశేఖరం (ది డ్రామా అకాడెమి, నెల్లూరు) గారు బృందనాయకులు; శ్రీమతి లక్ష్మీకాంతంగారు (లక్ష్మీకళాసమితి. ఏలూరు) నాటకనిర్మాత; శ్రీ డి. లోకాభిరామ్ (శ్రీ లలితకళామందిరం, బళ్ళారి) మేనేజరు. వీరు ఇద్దరు ముగ్గురు స్థానికుల సహకారముతో ఎన్నియోగ్రామములు పర్యటించి, గ్రామప్రజలను వారివారి ముంగిళ్ళ లోనే ప్రహసనములతో, హాస్యప్రసంగములతో, బహుపాత్రాభినయములతో వినోదింపజేసెడి వారు. వీరి రంగస్థలము ఊరిలోని మంటపము, లేదా ఇంటివరండా, లేదా రెండు లారీలను కలుపగా ఏర్పడిన వేదిక!

తెలుగు లిటిల్ థియేటర్ సంస్థాపకులగు కొప్పరపు సుబ్బారావుగారు 1953 లో సేక రించిన సమాచారమునుబట్టి నాటికి తెలుగుదేశమున ఐదువందలకుపైగా ఔత్సాహికసమాజము లున్నవి. అట్లే పులిపాటి వేంకటేశ్వర్లుగారు జిల్లాలవారీగా నటులపేర్లను సేకరించి, ప్రకటించి యున్నారు. నటులుకూడ వందలకు మించియున్నారు. నేడు తెలుగుదేశమున బాగుగా పని చేయుచున్న ఔత్సాహికనాటకసమాజములు వందకుపైగా నుండును; ప్రతిభావంతులైన ఔత్సాహికనటులు వేయికిపైగా నుందురు.

ఈ ఔత్సాహికనాటకసమాజముల మధ్య ఇంకను పూర్వపద్ధతిలో నడచుచున్న పీసపాటి నరసింహమూర్తిగారి "ఆంధ్రా ఆర్టిస్టు అసోసియేషన్", పి. సూరిబాబుగారి "రాజరాజేశ్వరీ నాట్యమండలి" తప్పక పేర్కొనదగియున్నవి. ఆంధ్రా ఆర్టిస్ట్సు అసోసియేషన్ ప్రప్రథమ మున మాధవపెద్ది వేంకట్రామయ్యగారి యాజమాన్యమున తెనాలిలో 1950 ఏప్రిలులో

ప్రారంభమైనది. వారియందలి గౌరవముతో పీసపాటివారీనాటికిని ఆ పేరుతోనే నాటకములను ప్రదర్శించుచున్నారు. పీసపాటివారు కృష్ణపాత్రకు సుప్రసిద్ధులు. నాటకపద్యపఠనములో క్రొత్త దారి త్రొక్కినవారు. వీరి సమాజములో శ్రీ పెళ్ళూరి శేషగిరిరావు అను యువనటుడు మాధవ పెద్దివారి పోకడలలో చక్కగా అభినయించెడివాడు. ఈ సమాజమున నిలుకడగలవారు ఇంచు మించుగా నరసింహమూర్తిగారొక్కరే. తక్కినవారందరును అప్పటికప్పటికి వచ్చెడివారే. ఇంక శ్రీ రాజరాజేశ్వరీ నాట్యమండలిలో ప్రధానభూమికలను ధరించువారు సూరిబాబుగారును, వారి సహధర్మచారిణి శ్రీమతి రాజేశ్వరిగారును అగుటచేత ఈ సమాజము ప్రాచీనసంప్రదాయ బద్ధమై మరింత ఆత్మీయతతో కట్టుదిట్టముగా సాగుచున్నదని చెప్పవచ్చును. ఈ సమాజము 1944 లో ఆరంభమైనది; నాటినుండి నేటివరకును నిర్విరామముగా నాటకములను ప్రదర్శించు చునే యున్నది. వీరి నాటకములలో, కొప్పరపు సుబ్బారావుగారి "తారాశశాంకము", వారణాసి సీతారామశాస్త్రిగారి "భూకైలాస్" సుప్రసిద్ధములు; ఇవి వారి కాణాచి.

తెలుగు నాటకరంగములో ఏవేవో క్రొత్తక్రొత్త మార్గములను నిర్మింపవలెననెడి ఆశయముతో కొందరు నాటకకళోపాసకులు ప్రయత్నించినారు. అబ్బూరి రామకృష్ణారావుగారు 1940 ప్రాంతముల ఒక నాట్యోద్యమమును తలపెట్టినారు. కొప్పరపు సుబ్బారావుగారు 1945లో కూర్మా వేణుగోపాలస్వామిగారు అధ్యక్షులుగా "తెలుగు లిటిల్ థియేటర్"ను స్థాపించిరి. 1954 లో "ఆంధ్రనాటకసంఘసమాఖ్య" (Andhra Theatres Federation) ఏర్పడినది. కాని, ఈ ప్రయత్నము లేవియును ఫలవంతములు కాలేదు.

1954 లో భారతీయ నాట్యసంఘమునకు శాఖగా వెలసిన "ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘము" ప్రస్తుతము చేయుచున్న కృషి ప్రశంసనీయమైనది. "ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ" అవతరణము (1957) వలన తెలుగు నాటకరంగమున క్రొత్త మార్పులకు అవకాశము కలుగవచ్చునని యూశింపబడుచున్నది.

తెలుగుదేశమున ఒక "జాతీయ నాటకశాల" (National Theatre)ను నిర్మించుటకు పూర్వకాలమున పలువురు ప్రయత్నించియున్నారు; కాని, ఆ ప్రయత్నములుకూడ చిరకాలమువరకు ఫలింపలేదు. ఇప్పుడు హైదరాబాదులో "రవీంద్రభారతి" అనుపేర కేంద్ర రాష్ట్రప్రభుత్వముల ఆర్థికసహాయముతో, రాష్ట్ర సంగీతనాటక అకాడెమీ సహకారముతో ఒక చక్కని జాతీయ నాటకశాల నిర్మింపబడుట ముదావహము. ఇది 'తెలుగు నాటకకళ'కు ముఖ్య కేంద్రము కాగలదని విశ్వసింపవచ్చును.

## భూమిక

1. "The Indian Theatre" (Its origins and its later developments under European influences) - 1933 - pp. 103-105

2. ఈ సమాజమును శ్రీ మదానందగజపతి మహారాజావారే స్థాపించిరనియు, దివాణములో మాత్రమే ప్రదర్శనములు జరిగెడివనియు, మహారాజావారే స్వయముగా ప్రదర్శనమును నడిపించెడివారనియు పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు వ్రాసియున్నారు (ఆంధ్రనటప్రకాశిక-పుట-319). అది సత్యము కాదనియు, శ్రీ విజయరామగజపతివారి కాలములోనే (1874 లోనే) ఆసమాజము స్థాపింపబడెననియు వసంతరావు బ్రహ్మాజీరావుగారు (వకీలు. విజయనగరము) తెలిపియున్నారు.

3. కోటప్రక్కను, మూడుకోవెలల కెదురుగానున్న ఖాళీస్థలములో, ఒక పెంకుటిల్లు ఉండెడిది; ఈ సమాజమువారికి అదియే నేపథ్యగృహముగాను, రంగస్థలముగాను ఉపయుక్తమయ్యెడిదట; ఇంక ప్రేక్షకులకొరకు తాటియాకుల హాలును నిర్మించెడివారు. ఈప్రదేశమునకు శివదృష్టిదోష ముండుటచేత ఆ తాటియాకులహాలు తరచు కాలిపోవుచుండెడిదని చెప్పుదురు. ఈసమాజమువారు విజయనగరములోనే కాక పిఠాపురము, మద్రాసు మొదలగుచోట్లకూడ తమ నాటకములను ప్రదర్శించియున్నారు.

4. శ్రీనివాసాచార్యులుగారు రచించిన కమలాపహరణమునందు శ్రీనివాసాచార్యులుగారు క్రింది విధముగా వర్ణితులైనారు :

"దృశ్యప్రబంధములై యుండియు, శ్రవ్యప్రబంధములుగానే పండితోత్తములు సైతమనేకశతాబ్దములుగాఁ వినియోగించుచున్న సంస్కృత నాటకములను దృశ్యప్రబంధములుగాఁ జేయ నుద్యమించి, నలువదిసంవత్సరములకు ముందు 'ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ కంపని' (The Madras Oriental Dramatic Company) యను నాటకసమాజమొకటి స్థాపించి, దానికగ్రాసనాధిపతిగానుండి, స్వయమే నాటకనాయకభూమికల వహించి, సంస్కృత శాకుంతలము, ఉత్తరరామచరితము, విక్రమోర్వశీయము, మఱికొన్నినాటకములను బ్రథమమునఁ బ్రయోగించినవాఁడును, ఆకాలములో చెన్నపురి రాజధాని గవర్నరుగానుండి యిటీవల స్వర్గస్థులైన హిస్ గ్రేస్ ది డ్యూక్ ఆఫ్ బక్కింఘాం అండ్ ఛాండాస్ (His Grace The Duke of Buckingham & Chandos) అను నాంగ్లేయప్రభువువారు సంస్కృత నాటకముఁ జూడవలయునని స్వాభిలాషం దెలిపినందున వారు సభానాయకులైయుండ, కీర్తిశేషులైన హిస్ హైనెస్ శ్రీ విజయనగరమహారాజులుంగారగు శ్రీ మదానందగజపతి మహాప్రభువువారును, అపుడు కౌన్సిల్ మెంబరుగానుండిన ది ఆనరబిల్ కార్మైకల్ దొరవారును, మఱికొంద ఱాంగ్లేయదొరలును, చెన్నపురి మహిళాజనమహాజనమువారిలో ననేకులును సభ నలంకరింప, స్వయమే దుష్యంతభూమికను వహించి 1880 సంవత్సరము నవంబరుమాసములో శాకుంతలమును బ్రయోగించినవాఁడును, ఆ నాటకప్రయోగము మిగుల నాహ్లాదకరముగ నుండినందునఁబై గవర్నరువారివలనను, మహారాజువారివలనను, కౌన్సిల్ మెంబరువారివలనను, ఆంగ్లేయదొరలవలనను 'ది ఇండియన్ గారిక్' (The Indian Garrick) అను పట్టముం బొందినవాఁడును, హరిశ్చంద్రోపాఖ్యానము నాంగ్లేయభాషలో నాటకముగ రచించి స్వయమే హరిశ్చంద్రభూమికను వహించి యిరువది సంవత్సరములకు మునుపు గవర్నరుగానుండిన లార్డు వెన్లాక్ (Lord Wenlock) వారి యెదుటఁ బ్రయోగించినవాఁడును, ఈ చెన్నపురి రాజధానిలో నాటకప్రయోగపితామహుఁ డను ఖ్యాతిఁ బొందినవాఁడు నగు— గోమఠము. సి. వి. శ్రీనివాసాచార్యుఁడు".

## ధార్వాడ నాటకసమాజము

1. కొన్ని సమయములలో ఈ గజానన-సరస్వతీ వేషములను వైరువర్కుతో పైనుండి క్రిందికి దింపెడివారట! విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమైనసమయములో, పల్లెటూళ్ళనుండి వచ్చిన ప్రేక్షకులు కొందరు, నాటకపు పెండాలులోనే కొబ్బరికాయలుకొట్టి హారతి యిచ్చెడివారట!!

శ్రీయుతులు మల్లాది గోవిందశాస్త్రి, దాసరి లక్ష్మణస్వామి ప్రభృతులు తెలుగు సమాజములలో సరస్వతీవేషమును చిన్నతనములో వేసినారట. సరస్వతి సూత్రధారునితో చెప్పెడివాక్యములను లక్ష్మణస్వామిగారు వారి 'నా జీవితయాత్ర' (1956) లో పేర్కొనినారు (పుట, 19)—"భోసూత్రధార! పరిజ్ఞాత సకలకలాసార! లలితపదకవితావాగ్ధార! నాటక ప్రయోగాధార! యదభిలషితంత్వయా, తత్తదాభవతు. అపిచ, బాలక! సాత్త్వికవ్యభిచారీ సామగ్రీసముల్లాసితరసప్రదర్శనసమయే అనపాయం యథాభవతి తథానుగృహ్ణామి. అద్య, సత్యలోకం ప్రతియామి".

## ఆరంభ యుగము

1. వావిలాల వాసుదేవశాస్త్రిగారి ఉత్తమరామచరితానువాదపీఠికను చూడవలయును (9-11-1883)-

"It must, of course, be a source of pleasure to all workers in this field and to those interested in their success, that under the auspices of Mr. Veeresalingam Pantulu, a dramatic company was formed by the students of our College, who performed on the stage his Ratnavali, and Comedy of Errors; that at Vizagapatam and Vizianagaram, similar societies have been formed with practical success, and that at Guntur, Brahmasri Kondubhotla Subrahmanya Sastrigaru, the Telugu Pandit in the American Mission School, has with the co-operation of his learned friends founded a like institution......"

2. ఈ పరిశోధనావ్యాసమునందలి 228-29 పుటలనుకూడ కూడ చూడవలెను.

3. గుంటూరు సమాజము ముందా? బందరు సమాజము ముందా అనెడి వివాదముకలదు. వావిలాలవారి వాక్యములలో బందరు ప్రసక్తియేలేదు. అసలు ఈ ముందువెనుకల నిర్ణయము చేయుటకంటె ఆనాడు పెక్కు పెద్ద పట్టణములలో ఇంచుమించుగా ఒకే కాలములో సమాజములు బయలు దేరిన వని తలంచుట సమంజసము. అందరికిని ధార్వాడవారి ప్రదర్శనములే ప్రోత్సాహకములు. (అయినను తెలిసినంతవరకును కాలక్రమమునుకూడ పాటించుచున్నాను).

4. కేవలము హిందీనాటకప్రదర్శనముల నిమిత్తమే బయలుదేరిన ఇంకొక సమాజము భీముని పట్నములోని "భక్తవిలాసినీ సమాజము". దీని స్థాపకులగు మింది రామచంద్రరావుగారు గద్య నటులు. వీరి వాచికాభినయమద్భుతముగా నుండెడిదట.

5. తెలుగుదేశమున ప్రదర్శనముల నొసంగిన మరికొన్ని ఇతర సమాజములు—

| | |
|---|---|
| పూనా సాంగ్లీ కంపెనీ (బలవంతరావు) | 1893 |
| బాలీవాలా కంపెనీ (బ్రహ్మాండమైన సీనరీలతో) | 1897-1900 |
| జంఖండీ కంపెనీ | 1905- 1906 |
| దాదాభాయితూంతీ కంపెనీ | 1911-1912 |
| రిప్పన్ థియేటర్ | 1912 |

| | |
|---|---|
| సర్వియా కంపెనీ | 1912 |
| దొరాబ్జీ కంపెనీ | 1917 |
| షొరబ్ మోడీ కంపెనీ | 1918 |
| ఖటావ్ కంపెనీ | |
| కన్నయ్య కంపెని | 1929 |
| గుబ్బి వీరన్న కంపెనీ | 1940 |
| పృథ్వీ థియేటర్సు | 1952 |

## వికాస యుగము

1. "సరసవినోదిని" అను పేరునుగూర్చి ఆచార్యులవారు చమత్కరించుచుండెడివారట— 'సరస వినోదిని"లోని మొదటి మూడక్షరములను క్రమముగా విడిచివేసినను భావార్థము మారదని— సరసవినోదిని, రసవినోదిని, సవినోదిని, వినోదిని.

2. ఈ అరువదిమంది పేర్లుగల ముద్రిత కరపత్రము నాయొద్దనున్నది. ప్రథమదశలోనివిగా పేర్కొనబడిన సమాజములలో చాల వరకు విద్యార్థులే నటులు. ఈ దశలో ఉద్యోగస్థు లెక్కువగా సమాజసభ్యులైనారు. అందుచే సమాజములకు కొంత స్థైర్యము చేకూరినదని చెప్పవచ్చును.

3. సరసవినోదినీసభవారి ఆశయములు క్రిందివిధముగా పేర్కొనబడెను—

(1) To raise the moral standard of the stage which had fallen very low in public estimation;

(2) To afford recreation to the people and thus make them forget awhile the toils and worries of life;

(3) To inculcate homely morals in the most agreeable form; and

(4) To raise the drama on which the vernacular literature has been lamentably poor.

4. శ్రీ హొళగంజ రామచంద్రరావు ఆచార్యులవారితో దేశమంతయును తిరిగివచ్చెను. ఇతనికి వచ్చిన మెడల్సుతో ఒక అంగడి పెట్టుకొనవచ్చునని చెప్పుదురు. కాని, చివరకు మిక్కిలి పేదస్థితిలో, 60 సం॥ల వయస్సులో స్వస్థలమైన మంత్రాలయములో చనిపోయెనట.

5. వీనినేకాక హిందూనాటకసమాజమువారు ముడుంబై రామానుజాచార్యులుగారి 'సిరియాళరాజు చరిత్ర'ను, 'పాండవాశ్వమేధమును'; వీరేశలింగముగారి 'చమత్కారచంద్రిక'ను ఇంకొక సారంగధరనుకూడ ఆ కాలములోనే ప్రదర్శించిరి. 1885 ప్రాంతములలో ముడుంబై రామానుజాచార్యులుగారు (తరువాత డిప్యూటీ కలెక్టరు చేసినారు) 'బాలా త్రిపురసుందరీ సమాజము' స్థాపించి, స్వయముగా నాయకభూమికలను ధరించెడివారట.

6. వచననాటకములను 'స్పీచ్ డ్రామా' లనెడివారు. ఇట్టివానికి వీరేశలింగముగారి నాటకములే ఆద్యములైనను. గుంటూరు హిందూనాటకసమాజమువారు ప్రదర్శించిన కొండుభొట్లవారి నాటకములే అధికప్రసిద్ధినందినవి.

7. "ఇద్దరు ప్రకాశముల (టంగుటూరి ప్రకాశం, వల్లూరి సూర్యప్రకాశం) వలనను నాటక సమాజము ప్రకాశించె"నని చిలకమర్తి వారు పేర్కొనియున్నారు. (స్వీ. చ. పు-77). వల్లూరి సూర్యప్రకాశరావుగారు హాస్యము చెప్పుచు నాటక మెవరు రచించిరని సూత్రధారునిచేత నడిగించుకొని చమత్కారముగ "Parrot baniyan tree riches Manly Lion(చిలకమర్రి లక్ష్మీనరసింహము) అని సమాధానము చెప్పుచుండెడివారట.

8. దుగ్గి గోపాలకృష్ణారావు (1872-1921) గారు చక్కని నటులేకాక నాటకకర్తలుకూడను. వారి 'చంద్రమతీ పరిణయము' 1899 లో రచింపబడి 1909 లో ప్రచురింపబడినది.

9. మద్రాసు సుగుణవిలాససభవారి ఆశయములు నాలుగు:

(a) The study and cultivation of the histrionic and other fine arts.

(b) The raising of the standard of the Indian Stage.

(c) The improvement of the vernacular dramatic literature ; and

(d) The helping of charitable institutions as far as funds permit.

10. సురభినాటకసమాజ సప్తతిస్వర్ణోత్సవము జనవరి 1960లో తెనాలిలో జరిగినది. ఆ సందర్భమున వారొక ప్రత్యేక సంచికను ప్రచురించియున్నారు. ఈ సమాజముల పుట్టుపూర్వోత్తరములను వివరించుచు ఈ వ్యాసకర్త వ్రాసిన సమగ్రవ్యాసముకూడ ఆ సంచికలో ప్రకటింపబడినది. (ఇది ఇంతకుముందు 'తెలుగు స్వతంత్ర'లో ప్రప్రథమముగా ప్రకటితమైనది)

11. 1890 ప్రాంతముల నంద్యాలలో జ్యోతి సుబ్బయ్య అను నతడు నడుపుచుండిన ఒక నాటక సమాజములో స్త్రీలుకూడ నుండెడివారట. వారెట్టివారో తెలియరాలేదు. స్త్రీలను రంగస్థల మెక్కించిన మొదటి సమాజము తెలుగు దేశములో బహుశః ఇదియే కావచ్చును!

13. సుమనోరమ సభ కధ్యక్షులైన తరువాతనే కోలాచలంవారు నాటకరచనకు పూనుకొన్నట్లు కొందరు తెలిపినారు. అది సరికాదు. వీరి సుఖమంజరీపరిణయ పీఠిక 20-12-1895 తేదీన వ్రాయబడినది. ఇది వీరి రెండవ నాటకము, కాగా మొదటి నాటకమగు సునందినీ పరిణయ మంతకంటెను ముందే వ్రాయబడినది. కావున నాటకకర్తగా ప్రసిద్ధులైన కోలాచలమువారినే సుమనోరమసభవారు అధ్యక్షులనుగా వరించిరనుట సత్యము.

13. ఈ 'వాణీ విలాస్' నేడు 'ప్రభాత్ టాకీస్' అయినది. అట్లే సరసవినోదినివారు 1907 లో నిర్మించుకొన్న 'రామకృష్ణ విలాస్' నేడు 'స్టార్ థియేటర్'గా రూపొందినది. నాటి పద్ధతి విచిత్రముగా నుండెడిది. ఒకరు ఒక నాటకమును ప్రదర్శింపదలచిన వెంటనే రెండవవారుకూడ ఆ నాడే ఇంకొక నాటకమును ప్రదర్శించెడివారట. ఒక నాటకశాలకు వెళ్ళదలచిన ప్రజలను దారిలో చిత్రవిచిత్రములైన వినోదములను కల్పించి రెండవనాటకశాలకు మరలునట్లుగా చేసెడివారట. ఇంకొకచిత్ర మేమనగా ఇంచుమించుగా ప్రతి పట్టణములోను పోటీ నాటకశాలలు ఒకే పేటలో దగ్గర దగ్గరగా నుండుట!

## స్వర్ణయుగము

1. సత్యవోలు గున్నేశ్వరరావుగారు రాజమహేంద్రవరమునకు కరణము. మెట్రిక్యులేషను వరకు చదువుకొన్నారు. మంచి పలుకుబడిగల వ్యక్తి. అంతియేకాదు గొప్ప 'ఆర్గనైజర్'. స్వయముగా నటులుకాకపోయినను నాటకములయం దభిమాన మధికము.

కృత్తివెంటి నాగేశ్వరరావుగారు జమీందారీ కుటుంబములోనివారు. స్వయముగా నటులు. టంగుటూరి ప్రకాశంపంతులుగారి ప్రక్క స్త్రీ వేషములనుకూడ వేసినారు. తన జీవిత సర్వస్వమును నాటకకళలోనే వెచ్చించిన నాటకకళోపాసి వీరు. అసలు నాటక కళకోసమే వీరు పుట్టిరనిపించెడిదట. ఉత్తమ శిల్పి చేతులలో బండరాళ్ళు మైనపుముద్ద లగునట్లే వీరి సుశిక్షణలో ఎట్టివాడైనను ఉత్తమ నటుడుగా రూపొందెడివాడట. కాని నాటకరంగాభివృద్ధిని గూర్చి వీరు కనిన కలలు కాల మనుకూలింపమిచే ఫలింపలేదు.

2. ఎ. ఎస్. రామ్‌గారి అసలుపేరు ఎ. శ్రీరాములునాయుడు. బొంబాయిలో శ్రీ హసన్‌బక్షీ అనెడి ప్రసిద్ధచిత్రకారుని శిష్యులు. అంతియేకాదు. వీరు చక్కని నటులుకూడను (బొబ్బిలిలో బుస్సీ. హాస్యప్రదర్శనములో హాస్యపాత్రలు). గోదావరి మండలములో రంగస్థల చిత్రణమునకు వీరే పితామహులు. పూలతోట చిత్రణములో వీరిది అందెవేసిన చేయియట. (ఇంతటి ప్రతిభావంతులే సురభినాటక సమాజములలోని హనుమంతరావుగారు కూడను). నాడు శ్రీ కూల్డ్రే ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు. శ్రీయుతులు రామ్. కూల్డ్రేలు నివసించిన ఆ కాలము తెలుగుదేశపు చిత్ర కళా చరిత్రలో స్వర్ణయుగమందురు.

3. పాపట్ల కాంతయ్యగారు కృష్ణాజిల్లా జగ్గయ్యపేట నివాసులు. కుటుంబములో సంగీతము కులవిద్య. అగ్రసోదరులు రామయ్యగారు హైదరాబాదులో గొప్ప సంగీతవిద్వాంసులు. బాల్యమునుండియు కాంతయ్యగారు అన్నగారి శుశ్రూషచేసి, నిపుణులైనారు. హిందూస్తానీ, పార్శీకత్తులు కాంతయ్యగారికి అచ్చటనే అలవడినవి. అచ్చట ఒక పోటీ సభలో గంటలతరబడి పాడి, విజయము సాధించినారట. ఆప్రసిద్ధి వినియే హిందూనాటకసమాజమువారు వీరిని రాజమండ్రి రప్పించుకొనిరి. ఆంధ్రదేశమున హిందూస్తానీ పడికట్టులలో తెలుగు కీర్తనలు వ్రాసిన ప్రథములు వీరే. ఆంధ్ర గంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావు ఈ కాంతయ్యగారి ప్రియశిష్యులు. కాంతయ్యగారు నలుబది యేండ్లు నిండకముందే చనిపోయినట్లు తెలియుచున్నది. వీరికి 'స్వరసింహ' అనెడి బిరుదు కలదు.

## మరికొన్ని ప్రసిద్ధ నాటకసమాజములు

1. బండారు రామస్వామిగారు 'నటకాగ్రణి' బిరుదాంచితులు. ప్రసన్నయాదవ - గయోపాఖ్యానములలో 'కృష్ణుడు', బొబ్బిలిలో 'రంగారాయుడు' వీరి అభిమాన పాత్రలు. నాయుడుగారు 'గుంటూరు నాటకసమాజముల చరిత్ర' అనుపేర నూరుపుటల గ్రంథమును వ్రాసి నాకు దయతో పంపియున్నారు. తరువాత ఈ వివరములను సంపూర్ణముగా సేకరించి 'నటమిత్రమ్' అను పేరుతో గ్రంథరూపముగా ప్రకటించినారు (1964). వీరి ఈ కృషిని ఆదర్శముగా గ్రహించి, పెద్దలైనవారు తమ పట్టణములలోని నాటకసమాజముల చరిత్రలను తయారుచేసినచో దేశమునకు మహోపకారము కావించినవారగుదురు.

## తెలుగునాటకరంగము

1. "సంగీతనాటకము"లను వేళాకోళము చేయుచు బి. టి. రాఘవాచార్యులుగారు 1920 లో "సంగీత సభ" యను హాస్యరచనను ప్రకటించియున్నారు.

2. "ఆ రోజుల్లో అగ్రనటులనేపేరు పొందినవారిలో ఏ ఐదారుగురో తప్ప మిగతావారి అగ్రత్వం గాలిపాటుగా వచ్చిందేకాని అర్హతవల్ల వచ్చిందికాదు. సంగీత వ్యామూఢులైన ప్రేక్షకవర్గాల

పెంపుడు బిడ్డలు వీరు. వీరికి సంగీతమే నటన. గాత్రమే ఆస్తి. హార్మోనియం తబలాలు ఆయుధాలు. నేను సంగీత విరోధినికాను. సంగీతం నాటకానికి ఉపాంగం మాత్రమే కావాలి. అది దురాక్రమణ చేయరాదు. కొందరికి నాటకం ఒక వాకిరేవు. పద్యాలు బండలు. రాగాలను ఉతకడమే రక్తి రహస్యం"—కొప్పరపు సుబ్బారావుగారి అముద్రిత స్వీయచరిత్రనుండి.

## సంధి యుగము

1. కాంట్రాక్టు నాటకముల హాస్యస్థితిని నిరూపించుచు శ్రీయుతులు చింతా-గుడిపాటి-వేదుల—ఈ ముగ్వురు కలిసి "నాటకప్రహసన" మను పేర ఒక వ్యంగ్య రచన ప్రకటించియున్నారు (1930 ప్రాంతముల). తిరుపతివేంకటకవుల "రసాభాస" మిట్టిదే. ఇట్టివింకను చాల రచనలు కలవు. ఇటీవల సురభి సమాజములవారి "సప్తతి స్వర్ణోత్సవ సంచిక"లో మల్లాది వేంకట కృష్ణశర్మగారి రచన మొకటి ప్రకటితమైనది.

2. ఈ సందర్భమున 1923 లోనే ప్రకటింపబడిన "నాట్యాంబుజము"లో పురాణం సూరిశాస్త్రిగారు చేసిన ఉపదేశము స్మరణీయము (పుటలు 300-301)"...రంగ పరికరములలో తెరలు మొదలగు ప్రకృతి యనుకరణములను సంపూర్ణముగ విసర్జించి తెల్లతెర యెదుట నాటకాభినయ మొనర్చి ప్రేక్షకుల భావనకారంగరూపమును విడువవచ్చును. "అహో! ప్రశాంత రమణీయతా ఆశ్రమ పరిసరస్య"; "ఈ పురవైభవ మెన్న నద్భుతము, కాపురము శ్రీకాంతకు సతతము"; "అదుగో భద్రాద్రి గౌతమి యిదుగో చూడండి...." అను వాక్యముల వినునప్పు డుదయించు సంపూర్ణ గిరి వన నగర విన్యాస రసానుభవము, సంపూర్ణ సర్వాంగ సుందర భావచిత్రము, గుడ్డపేలికల యసంబద్ధచిత్రము లందమగునా? వాక్యార్థము ప్రేక్షకునకే వదలినప్పుడు, వాని భావానుభవముల కొలది రంగవైభవ మేర్పడును. ఎవరికేమేడ రుచించునో, యెవరికే వనసీమ ప్రశాంతముగ దోచునో, దానినే భావించి సంతసించుచుందురు. తాలూకా కచ్చేరీలలో నాలుగు జాములు కలమాడించు పేదగుమాస్తాను సకల దిగ్దేశరాజన్యపూజితుడైన రాజసూయాధ్వరాధి పునిగ భావించు శక్తిగల ప్రేక్షకులు, బక్కచిక్కిన యెంపు కొయ్యను రవిదీధితు లొలికించు కర్ణునిగ నెంచగలిగిన సరసులు వాక్య సూచనలందికొని వన నగర రూపముల నూహింపజాల కుందురా?"

3. "ఒకసారి నేను శివాజీపాత్ర ధరించి, రామకృష్ణమతానికి చెందిన ఒక స్వాములవారిని వచ్చి చూడమని ఆహ్వానించాను. ఆయనచూచిన తర్వాత మరునాడు నాతో శివాజీ అభినయం ఏమీ బాగుండలేదు పొమ్మన్నాడు. "శివాజీ మాటలపోగుకాదు. కార్యశూరుడు, యోధుడు—శివాజీని నీవు నీచేతల్లో ప్రత్యక్షం చెయ్యవలసివుంది ప్రేక్షక జనానికి. కాని, అదేమిటి, చేతులు అలా ఝాడిస్తూ నడిచావు—రణతంత్ర శిక్షితుడైన క్షత్రియునికి ఎడమచెయ్యి కదలదు. నీవు చేతులు త్రిప్పడం ఖద్ద వై దీకి త్రిప్పినట్లుగావుంది— అన్నాడు. తెల్లబోయాను నేను."

—"శ్రీ డి. వి. సుబ్బారావు సన్మానసంఘసంచిక"

—రాఘవాచార్యులుగారి అధ్యక్షోపన్యాసము (2-5-1943).

## నవ్యయుగము

1. "ఏకాంకిక రచయితల సమావేశాలూ, ఏకాంకికా వార్షిక ప్రదర్శనోత్సవాలూ జరపడము సముచితము" అని నవంబరు, 1943 లో శివశంకరశాస్త్రిగారు తాము సంపాదించిన "ఏకాంకికలు" సంపుటమునకు వ్రాసిన పీఠికలో పేర్కొనుట స్మరణార్హము.

2. ఆంధ్రనాటకకళాపరిషత్తువారు ఆయా పట్టణములో జరిపిన పోటీలలో గెలుపొందిన సమాజముల, నాటక-నాటికల వివరములు కొన్ని. (సేకరణ డి. మధుసూదనరావుగారు).

గుడివాడ:

ఎదురీత: కొండముది గోపాలరాయశర్మ-అమెచ్యూర్ ఆర్టిస్టు అసోసియేషన్. వెంకటగిరి

విజయవాడ:

ఈనాడు: ఆత్రేయ-అమెచ్యూర్ ఆర్టిస్టు అసోసియేషన్, వెంకటగిరి.

ఉత్తమ రచన: మా భూమి—సుంకర, వాసిరెడ్డి.

చేసిన పాపం (నాటిక): కొప్పరపు సుబ్బారావు—ఆంధ్రప్రజానాట్యమండలి, కృష్ణలంక.

ఉత్తమ రచన: తుఫాన్—పులుగుండ్ల రామకృష్ణయ్య.

ఏలూరు:

ఎన్. జీ. ఓ.: ఆత్రేయ—అమెచ్యూర్ ఆర్టిస్టు అసోసియేషన్, వెంకటగిరి.

తారాబలం (నాటిక): వడ్లమూడి సీతారామారావు—జాతీయ కళామందిర్, బాపట్ల.

కాకినాడ:

పల్లెపడుచు: పినిశెట్టి శ్రీరామమూర్తి—ఆదర్శనాట్యమండలి, పాలకొల్లు.

ఉత్తమ రచన: ఆత్మవంచన—బుచ్చిబాబు.

ప్రగతి (నాటిక): ఆత్రేయ—ఆంధ్రాఆర్ట్ థియేటర్సు, విజయవాడ.

ఉత్తమ రచన: ఆడది—పినిశెట్టి శ్రీరామమూర్తి.

తెనాలి:

నాటకం: డి. వి. నరసరాజు—ఉదయినీ రాఘవ కళాకేంద్రం, విజయవాడ.

ఎవరు దొంగ (నాటిక): ఆత్రేయ—ప్రభాకర నాట్యమండలి, గుడివాడ.

మచిలీపట్నం:

ఆసామి: నాజర్—ఆంధ్రా ఆర్టు థియేటర్సు, విజయవాడ.

ఉత్తమ రచన: విశ్వశాంతి—ఆత్రేయ.

హైదరాబాదు:

కాళరాత్రి: ప్రఖ్య శ్రీరామమూర్తి—నటరాజ కళాసమితి, శ్రీకాకుళం.

ఉత్తమ రచన: పునర్జన్మ—బెల్లంకొండ రామదాసు.

దిష్టిబొమ్మలు (నాటిక): సి. వేణు—కల్చరల్ ఆర్టు థియేటర్, వెంకటగిరి.

ఉత్తమ రచన: ప్రార్థన—కొర్రపాటి గంగాధరరావు.

హైదరాబాదు:

తస్మాత్ జాగ్రత్త: కొర్రపాటి గంగాధరరావు—కళావని, బాపట్ల.

ఉత్తమ రచన: నేరమూ-శిక్షా—శివం.

దంతవేదాంతం (నాటిక): భమిడిపాటి రాధాకృష్ణ—నవ్యకళామండలి, విజయవాడ.

గుడివాడ:

దొంగవీరుడు: కొడాలి గోపాలరావు—ర. స. న. సమాఖ్య, విజయవాడ.

ఉత్తమ రచన: పంజరం—అవసరాల సూర్యారావు.

చావకూడదు (నాటిక): ఆత్రేయ-ప్రభాకర నాట్యమండలి, గుడివాడ.

ఉత్తమ రచన: మన స్తత్వాలు—భమిడిపాటి రాధాకృష్ణ.

గుడివాడ:

రంగస్థలం: కోడూరుపాటి రామారావు—మహాత్మా ఆర్ట్సు థియేటర్స్, ఏలూరు.

ఉత్తమ రచన: దైవశాసనం—భమిడిపాటి రాధాకృష్ణ.

సుల్తానీ (నాటిక): వేలూరి శివరామశాస్త్రి—మ్యునిసిపల్ ఎంప్లాయీస్ క్లబ్, గుడివాడ.

ఉత్తమ రచన: పుణ్యస్థలి—ఎన్. ఆర్. నంది.

తణుకు:

కీర్తిశేషులు, భమిడిపాటి రాధాకృష్ణ—నవ్యకళామండలి, విజయవాడ.

ఉత్తమ రచన: చిల్లరకొట్టు చిట్టెమ్మ—దాసరి గోపాలకృష్ణ.

చరమాంకం (నాటిక):

ఉత్తమ రచన: కుక్కపిల్ల దొరికింది—రావి కొండలరావు.

హైదరాబాదు

ఆరణి: ఎన్. ఆర్. నంది—విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్, హైదరాబాదు.

ఉత్తమ రచన: నాలుగిళ్ళ చావిడి—రావి కొండలరావు.

వాన వెలిసింది (నాటిక): ఎన్. ఆర్. నంది—విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్, హైదరాబాదు.

ఉత్తమ రచన: చీకటి తెరలు—గన్నిశెట్టి వేంకటేశ్వరరావు.

అనంతపురం:

మాట తప్పకు: ఆర్. వి. చలం—ఆంధ్రా డ్రమెటిక్ లిటరరీ సొసైటీ, జెమ్‌షెడ్‌పూర్.

ఉత్తమ రచన: మాట తప్పకు—ఆర్. వి. చలం.

జ్వలితజ్వాల (నాటిక): చింతపల్లి హనుమంతరావు—అరుణోదయ నాట్యమండలి: విజయవాడ.

ఉత్తమ రచన: చిట్టి—కమలాకాంత్.

హైదరాబాదు:

పట్టాలు తప్పిన బండి: రావి కొండలరావు—ఆంధ్రాఆర్ట్సు, మద్రాసు.

ఉత్తమ రచన: నటనాలయం—మోదుకూరి జాన్సన్.

ఉలిపికట్టె(నాటిక): ఎ. శ్రీనివాసరావు—వెంకటరమణ ఆర్ట్సు అసోసియేషన్, విజయవాడ.

ఉత్తమ రచన: మనిషి చావకూడదు—ఎన్. ఆర్. నంది.

3. వీరి ప్రదర్శనములు ఎంత నిరాడంబరముగా జరుగునో తెలియుట కొరకు 'ముందడుగు' నాటకమునకు వ్రాయబడిన "స్టేజికి సూచనలు" పరిశీలింపదగును.

"నాటకాలు వేయడానికి ప్రతివూళ్ళోను నాటకశాలలుండవు. కాబట్టి బహిరంగ ప్రదేశాల్లో వేయవలసి వుంటుంది. అందుకు స్టేజి నిర్మాణాన్ని గురించి తెలుసుకోవడం అవసరం.

స్టేజి ఎత్తు $1\frac{1}{2}$ అడుగులుండాలి. బల్లలతోటిగాని, వెదురు వాసాలతోటిగాని, మట్టితోగాని నిర్మించవచ్చు. వెడల్పు 15 అడుగులు, పొడవు 9 అ॥ ఎత్తు $7\frac{1}{2}$ అ॥ సైడు కర్టెనులు ఒక్కొక్కటి 3 అ. వెడల్పు చొప్పున $7\frac{1}{2}$ అ. యెత్తు ఉండాలి. శబ్దం హెచ్చు చేయడానికి నాలుగు కుండలు పందిరిమీద బోర్లించాలి; ముందు ప్రేక్షకులకు కన్పించకూడదు.

తెరలు సీనరీతో అద్దెకు తేవడం కష్టం. తెచ్చినా ప్రతి దృశ్యానికి సరిపోయే తెరలు లభ్యంగావు. అందుచేత ఆయా దృశ్యాలలోని ప్రధానభావాలను, రసాలను ద్యోతకం చేసేవిగా మాత్రమే రంగుల తెర లుండాలి.

ఎర్రతెర—యుద్ధం. క్రోధం. వైరం;
తెలుపు—శాంతం; గులాబీ—శృంగారం,
పసుపు—కల్యాణం; నలుపు—దుఃఖం, కుట్ర,"

### తృతీయాధ్యాయము

# విమర్శలు : సమస్యలు

## నాటకవిమర్శ చరిత్ర

ప్రాచీనకాలమున తెలుగులో మార్గనాటకములులేకపోవుటచేత (అనగాలక్ష్యములేక పోవుటచేత) నాటకలక్షణముకూడ జనింపలేదని గుర్తించియున్నాము. ఒక్కచిత్రకవి పెద్దన (1550 ప్రాంతముల) తప్పతక్కినవారెవ్వరును సంస్కృతమునందలి లక్షణమునైన అనువదించుటకు ప్రయత్నింపలేదు. 1880 లో నాటకప్రదర్శనములు ప్రారంభమైన తరువాత నాటి మాసపత్రికలలో ఆయానాటకములను, ప్రదర్శనములను గూర్చిన స్థూలప్రకటనములో, వివరణములో వెలువడుచుండెడివి. అంతియేకాదు, వ్యక్తిగతద్వేషములు, తదితరములు కారణములుగా నాటకములందలి దోషములను వెదకిచూపించుటకు కొందరు ప్రయత్నించెడివారు. అట్టివ్యాసములు కొన్నిపత్రికలలో వెలువడెడివి. ఇంక 1898 లో వేదం వేంకటరాయశాస్త్రి గారు కొక్కొండవారి ఆంధ్రీకృతప్రసన్నరాఘవమును విమర్శించుచు మూలమునకు మూడింతలు పెరిగిన విమర్శగ్రంథమును ప్రకటించినవిషయమును పేర్కొనియేయున్నాను.

ఇట్లు క్వాచిత్కముగా వెలువడెడివిమర్శలేకాక నాటకకర్తలు తమ తమ నాటకములకు పీఠికలను వ్రాసికొనుచు నాటకసమస్యలను గూర్చి కొంతవిమర్శనమును వెలయించుచు వచ్చిరి. శ్రీయుతులు ధర్మవరం, గురజాడ ప్రభృతుల పీఠికలిందుల కుదాహరణములు. ఇట్టి పరిస్థితియే 1900 దాటువరకును కొనసాగినదని చెప్పవచ్చును. 1900 లో వెల్లాల సదాశివశాస్త్రి గారు భట్టుమూర్తి కావ్యాలంకారసంగ్రహమందలి రస–నాయికా–నాయక ప్రకరణములను సహేతుకముగా విమర్శించుచు నొక గ్రంథమును ప్రకటించియున్నారు. బహుశః ప్రాచీన లక్షణ గ్రంథములపై తెలుగులో ఇట్టిసమీక్ష వెలువడుటకిదియే ప్రారంభమని చెప్పవచ్చును. 1903 లో శృంగారకవి సర్వారాయడుగారు "నాటకలక్షణము"ను ప్రకటించినట్లు ఆంధ్ర వాఙ్మయసూచిక తెలుపుచున్నది. ఇంచు మించుగా ఇదేకాలములో కొమాండూరు అనంతాచార్యులుగారు విద్యార్థులయుపయోగార్థము దశరూపకమును సంగ్రహించి 'దశరూపక సంగ్రహము' అనుపేర బాలురకు సులభముగా తెలియదగిన తేటమాటలలో అనువదించి, ప్రకటించియున్నారు.

1906 లో రెంటాల వేంకట సుబ్బారావుగారు షేక్స్పియరు ఒథెల్లో నాటకముపై ప్రశంసనీయమైన ఆంగ్లవిమర్శను ఆంగ్లమూలముతోసహా ప్రకటించి యున్నారు (Othello Unveiled). ఇదే విధముగా వీరు హేమ్లెట్ నాటకమును గూడ 1909లో ప్రకటించియున్నారు. ఇవి ఆనాడు బహుళ ప్రశంసల నందినవి.

1908 లో కోలాచలం శ్రీనివాసరావుగారు ఒక అపూర్వమగు గ్రంథమును "The Dramatic History of the World" ఆంగ్లమున ప్రకటించియున్నారు. ప్రపంచ నాటక చరిత్రను వ్రాయుటకు పూనుకొనినవారిలో బహుశః శ్రీనివాసరావుగారే ప్రథములై యుండ వచ్చును. ఇది ఆంధ్రులకు నిజముగా గర్వకారణము. దీనికి అనుబంధముగా వీరు కొన్ని సూచనలను చేసియున్నారు. అవినాటకరచయితలకు, నటులకు, నాటకసమాజములకు, విమర్శకులకు, ప్రేక్షకులకు సంబంధించిన సిద్ధాంతసూత్రములు. నాటకరచనా-ప్రయోగవిజ్ఞులైన శ్రీనివాసరావుగారు స్వీయానుభవమును జోడించి పైసూత్రములను చక్కగా కూర్చియున్నారు. (ఇవి ఆంధ్రీకరింపబడి, ఉగాదిసంచికలోకూడ ప్రకటితములైనవి.)

1910 లో "నాటకసంఘమార్గప్రదర్శిని" అనుదానిని కొండిపర్తి సూర్యనారాయణగారు ప్రకటించినట్లు 'ఆంధ్రవాఙ్మయసూచిక'నుబట్టి తెలియుచున్నది. 1912 లో తోలేటి వేంకట సుబ్బారావుగారి "ఆంధ్రశాకుంతలవిమర్శనిరసనము", "చిత్రనళీయ నాటకప్రదర్శనము" అను విమర్శవ్యాసములు వెలువడినవి. మొదటిది కందుకూరివారి శాకుంతలానువాదముపై చేయ బడిన విమర్శకుసమాధానము. ఇట్టి విమర్శలు, ప్రతివిమర్శలు ఆనాడెక్కువగానే బయలు దేరినవని చెప్పవచ్చును.

1913 (ప్రమాదీచ) లో తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రికలో' "ఆంధ్రనాటకములు" అనుపేర ఒక పెద్ద వ్యాసమును ప్రకటించి యున్నారు. తెలుగునాటకముల పూర్వపరిస్థితులపై వెలువడిన ప్రథమసమీక్ష ఇదియేయని చెప్పదగును.

1913 లో ప్రారంభమై 1915-18 మధ్యకాలములో అన్నియెడలను వ్యాపించిన నాట కపు పోటీపరీక్షలు కొంతవరకు తెలుగుదేశమున నాటకవిమర్శకు వేరులు ప్రాకించినవి. ప్రజలు, విమర్శకులు నాటకాభినయలక్షణములనుగూర్చి కొన్ని ఊహలు చేయసాగినారు— సంగీత మభినయమున కవకాశ మొసంగదు; హార్మోనియం, తబలాలు నాటకకళకు విరోధులు; విషాదనాటకములు ఆదరణీయములా? నాటకమున వ్యావహారికభాష స్థానమేమి? మొదలగు నవి. ఈ సందర్భమున పానుగంటివారి సాక్షి ప్రథమసంపుటమునుగూర్చి కూడ పేర్కొనవలసి యున్నది. ఇది 1913 లో ప్రకటితమైనది. (వ్యాసములు 1912 లోనే వ్రాయబడినవి—సాక్షి సంఘనిర్మాణము పరీధావిలో అనగా 1912 లో జరిగినదట!). ఇందులో తెలుగులో నాటకముల రచనా-ప్రదర్శనములనుగూర్చి నాలుగు వ్యాసములున్నవి. (సారంగధర నాటక ప్రదర్శనము, నాటకప్రదర్శనము-1, నాటకప్రదర్శనము-2, నాటకీయపద్యరచన). నాటకశైలి యెట్లుండ వలెనో, పాత్రౌచిత్యమనగా నేమియో, యుక్తిప్రతియుక్తివైఖరి యెటులుండవలయునో, నాటక మున పద్యము లుండవచ్చునో లేదో, ఉండిన నెట్టి పద్యములుండవచ్చునో, సుఖాంత కష్టాంత నాటకముల తారతమ్య మెట్టిదో మొదలగు నంశములిందు చర్చింపబడినవి. వీరు తమ నాటకము లందుకూడ పాత్రవశమున నచ్చటచ్చట నాటకలక్షణములను సూచనామాత్రముగా సూత్రీక రించుచు వచ్చిరి. అట్టివానికి రాధాకృష్ణనాటకమందలి "పాత్రమున కంత రసోదయముండునా?"

అనెడి విదూషకుని ప్రశ్న యొక్క చక్కని తార్కాణము. (ఈ విషయమునుగూర్చి మరల చర్చింతును).

1914 లో పింగళి సూరనార్యుని కృతుల నాధారముగా చేసికొని కట్టమంచి రామలింగా రెడ్డిగారు తమ "కవిత్త్వతత్త్వవిచారము"ను ప్రకటించినారు. తెలుగులోని సాహిత్య విమర్శకు నూత్నదృక్పథమును కలిగించిన ప్రథములు రెడ్డిగారే యనుట నిర్వివాదము. అంత వరకును కావ్యగత గుణ-దోష-అలంకారాది విచారణలకు మాత్రమే తమ విమర్శలను పరిమితము చేసికొనుచున్న తెలుగు విమర్శకులు నాటినుండి ఒక్కొక్క కావ్యమును అఖండ స్వరూపముగా భావించి, ఆ దృష్టితో పరిశీలించి, కావ్యైక్యము, పాత్రపోషణ, శైలి మొదలగు విషయములపై దృష్టి సారించుటకు ప్రారంభించినారు.

1915 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ఆచార్య తణికెళ్ళ వీరభద్రుడుగారి "చిత్రాంగి పాత్రపోషణము" అనెడి వ్యాసము ప్రకటితమైనది. ధర్మవరమువారి చిత్రనళీయములో 'చిత్రాంగి' పాత్ర పరిపోషితమైన విధానమును వీరభద్రుడుగారు చాల విపులముగా, తార్కికముగా, హృదయంగమముగా చిత్రించియున్నారు. రెడ్డిగారి గ్రంథమును, వీరభద్రుడుగారి వ్యాసమును తెలుగు కావ్య-నాటక విమర్శనములకు క్రొత్తబాటల నేర్పరచినవి. కాగా, ఆ రచనలు తెలుగు విమర్శసాహిత్యచరిత్రలో చిరస్మరణీయములగుచున్నవి.

1915 ప్రాంతములలో మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ధనంజయుని దశరూపకము (నాటకలక్షణగ్రంథము)ను సమగ్రముగా వచనములో నాంధ్రీకరించి ప్రకటించియున్నారు. దీనివలన ప్రాచీనలక్షణముల నెరుంగుటకు చాలమంది కవకాశము కలిగినది. ఈ అనువాదముపై 1917 లో శ్రీ వెల్లాలవారి విమర్శన మొకటికూడ వెలసినది. ఇంక సంస్కృతములోని ప్రాచీన నాటకలక్షణగ్రంథములు ముమ్మరముగా తెలుగులోనికి అనూదితములగుట కారంభించినవి.

అటుపిమ్మట ప్రముఖముగా పేర్కొనబడవలసినవారు పురాణం సూరిశాస్త్రిగారు. వీరు బందరు నివాసులు. ఆగర్భశ్రీమంతులు, రసాయనశాస్త్రములో పట్టభద్రులు, 1911-15 లో చెన్నపురిలో చదివెడి కాలములో ఆంధ్రసారస్వత ప్రయత్నములలో పాల్గొనినారు. తమిళ, కర్ణాటక, పారశీక నాటకములను, బళ్ళారి, రాజమండ్రి మున్నగు ప్రదేశములందలి ప్రసిద్ధాంధ్ర నాటకసమాజములవారి యాటలను, బయస్కోపులో జూపబడిన జగద్విఖ్యాతనటుల అభినయములను, కొన్ని ఆంగ్లనాటకములను, అన్నికత్తుల సంగీతరీతులను అనుభవించియున్నారు. అటుపిమ్మట బందరులో ఏదియోయొక నాటకసమాజమున కెల్లప్పుడు సంబంధియై యుండుటయేకాక హిందూదేశమందెల్లడలగల వివిధభాషలనాటకప్రదర్శనములు చూచియున్నారు. వీరు నటులు కాదు; కవులుకాదు; సంగీతాలాపముచేయగల శక్తిగలవారునుగారు. అయినను పైకారణములచేత కావ్య సంగీతాభినయముల రసస్వరూపమును సరసముగ ననుభవించు విమర్శకవిచక్షణ మొదటినుండియు వీరి కలవడినది. అన్నిరకముల మనుష్యుల జీవితాంశములను లక్ష్యముతో సానుభూతితో విచారించుటవలనను, ప్రకృతిని కనులు తెరచుకొనిచూచి, అందలి రసభావములను లోతుగ ననుభవించుటచేతను కళారహస్యముల గుర్తింపగలిగిరి. ప్రకృతియే వారుపయో

ఒకప్రక్క సినీమాలవలనను, మరియొకప్రక్క విదేశీయనటుల నాటకప్రదర్శనముల వలనను, ఇంకొకప్రక్క పత్రికలవలనను గ్రంథములమూలమునను దేశవిదేశీయుల నాటక కళాభివృద్ధులను తత్త్రద్రీతులను అవగాహన చేసికొనుట కవకాశము కలుగుటతో తెలుగు దేశమున నూత్నభావతరంగము లుత్పన్నములు కాసాగినవి. అంతియేకాదు, భరతశాస్త్రి దర్శముల ననుసరింపవలెననెడి జాతీయాభిమానమొకటి యేర్పడి నాటకకవులను, విమర్శకులను కలవరపెట్టసాగెను. ఈభావసంక్షోభము హిందూదేశములోని తక్కిన రాష్ట్రములందుకంటె ఆంధ్రరాష్ట్రములోనే మిక్కిలి ప్రబలముగా కన్పట్టినది. అప్పటికింకను భరతశాస్త్రపారంగతు లగు భాగవతులు తెలుగుప్రజల ఆదరాభిమానములను పొందుచునేయుండుట ఇందులకు ప్రధాన హేతువు. కాగా, హైందవకళల సాంకేతిక–ఆధ్యాత్మికతత్త్వములు నవ్యభావోదయముతోపాటు ఆంధ్రులలో సమ్మేళనము పొందియున్నవను సత్యమును విస్మరింపరాదు. 1922 లో శ్రీమద జ్ఞాడాదిభట్ట నారాయణదాసుగారిచే రచింపబడిన "నవరస తరంగిణి" వెలువడినది. ఇది షేక్స్పి యరు, కాళిదాసుల కవితావిశేషముల కనువాదము. ఇరువురి రచనలలోని రసవద్ఘట్టములనేరి రసవిభాగమొనర్చి (9 రసములుగా విభజించి), మూలములతోపాటు అనువాదములనుగూడ ప్రకటించిరి. ఇదియొక అపూర్వప్రయత్నము. ఇందు దాసుగారు సఫలీకృతులైనారని చెప్ప వచ్చును. ఈ గ్రంథమునకు వీరు విపులమైన పీఠికను సంతరించి అందనేక సమస్యలనుగూర్చి చర్చించియున్నారు.

1923 తెలుగునాటకవిమర్శ చరిత్రలో స్మరణీయమైన సంవత్సరము. ఆ సంవత్సర ప్రాంతములోనే (జనవరిలోనే) కవిరాజ మల్లాది వేంకట విశ్వనాథశర్మగారి సంపాదకత్వమున "నాటకకళ" యనెడు మాసపత్రిక కేవలము నాటకకళావిమర్శకొరకు బయలుదేరినది. తెలుగులో ఇట్టి పత్రికల కిదియే ప్రారంభము. (కాని ఇది చిరకాలము కొనసాగకపోవుట విచారకరము). "సారస్వత చరిత్రమున నాటకయుగమారంభమైనది. కొన్ని మంచినాటకములు బయలువెడలకపోలేదు. కాని పెక్కులు నాటకనామానర్హములైనవి యున్నవి. సలక్షణములగు నాటకరంగస్థలములు లేనినాడు నాటకవాఙ్మయము వర్ధిల్లనేరదు. రూపకగ్రంథములకును నాటకసమాజములకును అవినాభావసంబంధమున్నది. వీనిరెంటిని సంస్కరించి యభివృద్ధి పరచు నుద్దేశముతో నీపత్రిక వెలిబుచ్చుచున్నాము" అని శర్మగారు ప్రథమ సంపాదకీయ ములో ఈ పత్రికయొక్క ఆశయమును విశదీకరించియున్నారు. అదే సంవత్సరమున, అనగా 27–1–1923 వ తేదీన, పోలాకి గ్రామమున గంజాంమండల ఆంధ్రనాటకపరిషదుత్సవము బుఱ్ఱా శేషగిరిరావుగారి అధ్యక్షతలో జరిగినది.

1923 లోనే పురాణం సూరిశాస్త్రిగారు తమ చిరకాల నాట్యవ్యాసంగఫలముగా 'నాట్యాంబుజము'ను 'విద్యాలయ కుసుమాంజలి' ప్రథమకుసుమముగా ప్రకటించినారు—ఇందు 1. నాటకానుభవములు, 2. ఆంధ్రనాటకములు, 3. నాటకసమాజములు, 4. ప్రసిద్ధనటులు, 5. ప్రదర్శనవిమర్శనము, 6. ఆంధ్రనాటకవిమర్శనము, 7. నాటకసమస్యలు. 8. నాటకవిమర్శ నము అను ఎనిమిది దళములున్నవి, ఇందులో ప్రధానముగా నాటి ప్రసిద్ధసమాజముల ప్రదర్శనా

ఒకప్రక్క సినీమాలవలనను, మరియొకప్రక్క విదేశీయనటుల నాటకప్రదర్శనముల వలనను, ఇంకొకప్రక్క పత్రికలవలనను గ్రంథములమూలమునను దేశవిదేశీయుల నాటక కళాభివృద్ధులను తత్తద్రీతులను అవగాహన చేసికొనుట కవకాశము కలుగుటతో తెలుగు దేశమున నూత్నభావతరంగము లుత్పన్నములు కాసాగినవి. అంతియేకాదు, భరతశాస్త్రి ధర్మముల ననుసరింపవలెననెడి జాతీయాభిమానమొకటి యేర్పడి నాటకకవులను, విమర్శకులను కలవరపెట్టసాగెను. ఈభావసంక్షోభము హిందూదేశములోని తక్కిన రాష్ట్రములందుకంటె ఆంధ్రరాష్ట్రములోనే మిక్కిలి ప్రబలముగా కన్పట్టినది. అప్పటికింకను భరతశాస్త్రపారంగతు లగు భాగవతులు తెలుగుప్రజల ఆదరాభిమానములను పొందుచునేయుండుట ఇందులకు ప్రధాన హేతువు. కాగా, హైందవకళల సాంకేతిక_ఆధ్యాత్మికతత్త్వములు నవ్యభావోదయముతోపాటు ఆంధ్రులలో సమ్మేళనము పొందియున్నవను సత్యమును విస్మరింపరాదు. 1922 లో శ్రీమద జ్జాడాదిభట్ల నారాయణదాసుగారిచే రచింపబడిన "నవరస తరంగిణి" వెలువడినది. ఇది షేక్స్పి యరు, కాళిదాసుల కవితావిశేషముల కనువాదము. ఇరువురి రచనలలోని రసవద్ఘట్టములనేరి రసవిభాగమొనర్చి (9 రసములుగా విభజించి), మూలములతోపాటు అనువాదములనుగూడ ప్రకటించిరి. ఇదియొక అపూర్వప్రయత్నము. ఇందు దాసుగారు సఫలీకృతులైనారని చెప్ప వచ్చును. ఈ గ్రంథమునకు వీరు విపులమైన పీఠికను సంతరించి అందనేక సమస్యలనుగూర్చి చర్చించియున్నారు.

1923 తెలుగునాటకవిమర్శ చరిత్రలో స్మరణీయమైన సంవత్సరము. ఆ సంవత్సర ప్రాంతములోనే (జనవరిలోనే) కవిరాజ మల్లాది వేంకట విశ్వనాథశర్మగారి సంపాదకత్వమున "నాటకకళ" యనెడు మాసపత్రిక కేవలము నాటకకళావిమర్శకొరకు బయలుదేరినది. తెలుగులో ఇట్టి పత్రికల కిదియే ప్రారంభము. (కాని ఇది చిరకాలము కొనసాగకపోవుట విచారకరము). "సారస్వత చరిత్రమున నాటకయుగమారంభమైనది. కొన్ని మంచినాటకములు బయలువెడలకపోలేదు. కాని పెక్కులు నాటకనామానర్హములైనవి యున్నవి. సలక్షణములగు నాటకరంగస్థలములు లేనినాడు నాటకవాఙ్మయము వర్ధిల్లనేరదు. రూపకగ్రంథములకును నాటకసమాజములకును అవినాభావసంబంధమున్నది. వీనిరెంటిని సంస్కరించి యభివృద్ధి పరచు నుద్దేశముతో నీపత్రిక వెలిబుచ్చుచున్నాము" అని శర్మగారు ప్రథమ సంపాదకీయ ములో ఈ పత్రికయొక్క ఆశయమును విశదీకరించియున్నారు. అదే సంవత్సరమున, అనగా 27_1_1923 వ తేదీన, పోలాకి గ్రామమున గంజాంమండల ఆంధ్రనాటకపరిషదుత్సవము బుఱ్ఱా శేషగిరిరావుగారి అధ్యక్షతలో జరిగినది.

1923 లోనే పురాణం సూరిశాస్త్రిగారు తమ చిరకాల నాట్యవ్యాసంగఫలముగా 'నాట్యాంబుజము'ను 'విద్యాలయ కుసుమాంజలి' ప్రథమకుసుమముగా ప్రకటించినారు—ఇందు 1. నాటకానుభవములు, 2. ఆంధ్రనాటకములు, 3. నాటకసమాజములు, 4. ప్రసిద్ధనటులు, 5. ప్రదర్శనవిమర్శనము, 6. ఆంధ్రనాటకవిమర్శనము, 7. నాటకసమస్యలు. 8. నాటకవిమర్శ నము అను ఎనిమిది దళములున్నవి, ఇందులో ప్రధానముగా నాటి ప్రసిద్ధసమాజముల ప్రదర్శనా

విధానములును, నాటి సుప్రసిద్ధనటుల అభినయకౌశలములును హృదయంగమముగా విమర్శింపబడినవి. "నేను ఎంతో రసవంతమైన నాటకాన్ని రసానుభవముండగానే వర్ణిస్తాను. భావపోషణ చేయవలసినవాటిని బాగుగా మరుపుతగిలేదాకా యెత్తుకొనను. అప్పుడు తప్పిళ్ళు మరుగుపడి, తాత్కాలికవిశేషజ్ఞానమంతరించి, నిక్కంపుటందములే స్మృతియందు నిలిచియుండును. అదికాక చూచిన ఆటలో యేదోయొక ప్రధానధర్మము మనస్సుకు తట్టాలి. ఈ ధర్మము కనిపిస్తే దానిని జ్ఞాపకముంచుకొని స్మృతిస్థిరములైన రసానుభవములతో జోడించి, చక్కని విమర్శ వ్రాయగలము. ఈ ధర్మము నాటకకల్పనమందుగాని, నటులొసంగిన సరసవ్యాఖ్యానమునందుగాని పొడగట్టును. అది దొరకకపోతే విమర్శన బాగుండదు. రసావస్థలుకూడ రుచించవు. నాట్యవృత్తాంతములుమాత్రమే వ్రాయువారికి ఈ ధర్మము లగుపడ లేదన్నమాట" (నాట్యోఒశ్లోకము-పు. 58-59) అని సూరిశాస్త్రిగారు తమ విమర్శనాపద్ధతిని వివరించియున్నారు.

ఈ సందర్భమున సద్విమర్శకుని లక్షణమును వారు ప్రపంచించినవిధానము పరిశీలనార్హము (నాట్యోఒశ్లోకము-పు. 59-64)—

"ఆట చూచేటప్పుడు నా చిత్తము మూడు ప్రత్యేకవ్యాపారములతో మూడు కోశములుగా విభక్తమై వుంటుంది. ఒకటి కథామొత్తమును, రామణీయకమును, అందున జనించు రసమును, అనుభవించుచూ, విమూఢతదేకచింతతో నిస్తబ్ధమైయుండును. నటవర్తనమందలి రసభావతరంగములన్నీ యీ కోశమును గదలించుచు, అనురూపవికాసమును నా ముఖనేత్రములందు పుట్టించుచుండును. ఏనటుడైనా, నావంక చూచినయెడల నప్పట్టున నతని యభినయవిశేషము నావిశుద్ధ నిశ్చంచల రసగ్రహణ పారవశ్యములో ప్రతిబింబితమై కన్పడుచుండును. రెండవకోశము, నా సంకల్పములేకుండానే, జరుగుతున్న నటనను చూస్తూ మాటలువింటూ అందులో వెలుగొందువానిని ధారణచేయుచుండును. దాని వ్యాపారము స్వతంత్రము. నాకు తెలిసి జరిగేదికాదు. నా సంకల్పమువల్ల నడిచేదికాదు. ఎందుచేతనంటే నేను రసానుభవపారవశ్యముతో మైమరచియున్నాను. అట్టి మైమరపులేకుంటే రససమాధిలేదన్నమాట; రమ్యవస్తువునందు ఏకాగ్రత కుదరలేదన్నమాట. వ్యభిచరించి, బహిర్గతమయ్యే బుద్ధికి, అఖండరసానుభవములేదన్నమాటే. అందుకోసము నాకు తెలియకుండా ధారణచేసే కోశము వేరేయున్నదని నిశ్చయము. కాని, యీ కోశము రికార్డుచేసిన విషయాలు ఆవల సంకల్పప్రభావమున నా యుల్లమునకు దట్టి కట్టెదుటవచ్చి నిలచును. విమర్శన రచించెడివేళ నే నొందెడి రసానుభవము తొల్లి నేను నాటకశాలలో పొందిన దాని శేషముకాదు. అది అప్పటితోనేసరి. అప్పటి రసానుభవము, నాకు తెలియకుండ యేదోయొక విధముగ స్మృతిస్థిత భావములకు వన్నె గలిగించి, యంతటితోపోవును. నాటకశాల వెడలిరాగానే మామూలుమనిషి నగుదును. కాని, మళ్ళా వ్రాయవచ్చుసరికి ధారణగ్రస్తములైన దృశ్యశ్రావ్యవిషయములు సాక్షాత్కరించి నప్పుడు వాని మూలమున గ్రమ్మర రసావేశమేర్పడును. ఈ రెండుకోశాలూ కళావిమర్శనకు సంబంధించినవి. ఇవికాక, మూడవకోశము ఇటూ అటూ చూచుచు, ప్రక్కవారితో మాట్లాడుచు, లౌకికవ్యాపారముల జరుపుచుండును. ఇదే నా అనుభవం. నాటకం చూచేటప్పుడు

మాత్రము నా బుద్ధిలో రెండు భాగములు—ఒకటి తెలిసియు, ఒకటి తెలియకనూ, కథా వ్యవహారముతో నైక్యమైయుండును. ఏకాగ్రతవల్ల వ్యక్తి చాంచల్యము నశించును. తన్మయత్వ మేర్పడును, చూస్తున్నాను, వింటున్నాను అనే కర్తృత్వ మస్తమించును. ఆనంద మనుభవించుటయే మనపని. కాని అది ఎందువల్ల కలుగుతోందో అప్పుడు ఆలోచించము...

"తన బుద్ధిలో జరిగే నాటకమంతా చూడనేర్చినప్పుడే నాట్యరంగాల యాటలు సార్థకంగా చూడగల్గుతాడు. రసమందరూ ఆస్వాదిస్తారు. జీవితానుభవాలు అందరికీవుంటవి. బుద్ధిని, మూడుపాయలుగచీల్చి, వ్యావహారికంలో భోక్తృత్వ కర్తృత్వముల కొకదాన్ని నియమించి, రెండవదానితో జగన్నాటక విలాసశోభలను, నిత్యానంద తూష్ణీంభావమున అనుభవించుచూ, మూడవదాన్ని సాక్షీభావమున ఏకాగ్రధారణలో వర్తింపజేయగలిగినవాడే రసరహస్య మెరింగిన విమర్శకుడగును. విమర్శక వ్యాపారమంతా లోకజ్ఞానముమీద నిలచియున్నది. లోకానుభవానికి జ్ఞానరూప మొనగూర్చుటకు, పైనచెప్పిన సాక్షీభావము, యోగసాధన అలవడవలెను."

పై వాక్యములందు ఉత్తమవిమర్శకుడు చేయవలసినపనియేమో సువ్యక్తము కాగలదు. శాస్త్రిగారు తాము చెప్పిన విధముగానే తమ నాటకవిమర్శల నన్నింటిని వెలయించియున్నారు. తెలుగునాటక విమర్శకులలో వారు ప్రథములగుటయేకాక ప్రధానులుకూడనని చెప్పుట కెట్టి సందియమునులేదు. "ఈ పద్ధతిలో నాంధ్రదేశపు నలుదెసలనుండి నాలుగైదు పుస్తకములిట్టివి వెలువడినగాని ఆంధ్రనాట్యరంగము సంపూర్ణముగ తెలియనేరదు." అని సూరిశాస్త్రిగారు నాట్యాంబుజాపత్రికలో పేర్కొనియున్నారు. వారాసించినట్లుగానే ఆ తరువాత పెక్కు విమర్శ గ్రంథములు తెలుగులో బయలుదేరినవి. ఇట్టివానిలో కొన్నింటినిగూర్చి యిచ్చట ప్రసంగింతును.

శాస్త్రీయదృక్పథముతో నాటకములు ప్రదర్శింపవలెననెడి దృష్టి నటులకు లేకపోవుటయు, సంగీతపు మోజు అటు నటులకు, ఇటు ప్రజలకు మితిమీరుచుండుటయు గమనించి, నటులకు శాస్త్రీయశిక్షణము నొసంగవలెననెడి ఆశయముతో శ్రీయుతులు బి. టి. రాఘవాచార్యులుగారు, గూడవల్లి రామబ్రహ్మంగారు "భరతముని బృందం" అనెడి పేరుతో 1924 లో బెజవాడలో ఒక నాటకపాఠశాలను స్థాపించి చాలమంది యువకులకు శిక్షణ యిచ్చినారు. ఆంధ్రదేశమునందేకాక బహుశః భారతదేశమునందే ఇది మొట్టమొదటి నాటకపాఠశాల: కాని ఇందులో శిక్షణపొందిన నటులు, పాఠశాల వదలిన తరువాత మరల వ్యామోహములోపడి, పాతబాటనే నడవసాగినారు. వారిమాట యెట్లున్నను, ఆ పాఠశాలలో శిక్షణపొందిననటుల యుపయోగార్థము రాఘవాచార్యులుగారు "నాటకదీపిక" యనెడి చిన్ని గ్రంథమును సూత్రప్రాయముగ రచించి ప్రకటించినారు. వైశాల్యమున చిన్నదైనను ఎనిమిది అధ్యాయములుగల ఈ చిన్ని గ్రంథము సూత్రపద్ధతిలో నటులకు, సమాజములకు, రచయితలకు పెక్కువిషయములను బోధించుచున్నది[2].

రాఘవాచార్యులుగారు మరి రెండు విమర్శ గ్రంథములనుకూడ రచించి ఆ కాలమందే ప్రకటించియున్నారు—మొదటిది బలే చింతామణి; ప్రథమప్రకరణమని పేరువడసిన 'చింతా

మణి' నాటకమును గూర్చియు, చింతామణినాటకపుపోటీలను గూర్చియు, అందలి నటులను గూర్చియు వ్రాయబడిన విమర్శయిది. ఇంక రెండవది "సంగీత ఇంద్రసభ" యనెడు మూడంకముల ప్రహసనము. "దైవానుగ్రహము కలిమిని, ఇంచుకంత గానమున కనుకూలమైన కంఠనాదము నాడింత కూడుపెట్టుచుండగా దాని గౌరవమును పాడుచేసి "నటన" మను క్రొత్తదాని నాశ్రయించుటకు నటులొల్లకుండిన దినములవి; ఇంక ప్రేక్షకుల యభిరుచులును అట్లేయున్నవి. నటులొక పద్యముపాడి యిది శృంగారము, ఒక గంతువేసి ఇది రౌద్రము, ఒక కులుకుకులికి ఇది శోకము అని భావింపుడనగా నసమర్థులగు ప్రేక్షకులు కాబోలునని సంతసించి వారికి సన్మానాదు లొనరించుచున్నకాలమది." రాఘవాచార్యులుగారు వీరిరువురిపై ధ్వజమెత్తి సంగీత నాటకములవలన తెలుగు నాటకరంగ మెట్లు చెడుచున్నదో నిరూపించుటకై ఈ ఇంద్రసభను రచించియున్నారు. ఇట్లు నాటి నాటకప్రదర్శనరీతులను నాటకరూపమున విమర్శించిన ప్రథములలో రాఘవాచార్యులుగారు రెండవవారని చెప్పవచ్చును. కె. చినరఘుపతిరావుగారి "నాటక కోలాహల" మనెడి ప్రహసనము 1921 లోనే ప్రకటితమైనది.

1924 లో బయలుదేరిన ఇంకొక విమర్శగ్రంథము గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారి 'ఆంధ్రనాటకరంగము'. శ్రీరామశాస్త్రిగారు చిత్తూరు రాజకీయోన్నత పాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులు; అచ్చటి 'రామవిలాస సభ'లో ప్రముఖ సభ్యులు. ఉగాది సంచికలలో ప్రకటితములైన శ్రీపాద కామేశ్వరరావుగారి నాటకవిమర్శలు వీరికి ప్రేరకములైనవి. రామవిలాస సభ్యులు ప్రోత్సహించినారు. అంతట 660 పుటల గ్రంథమును మూడు భాగములుగా రచించినారు. వానిలో మొదటిభాగము "ఆంధ్రనాటకరంగము". ఇంక తక్కిన రెండుభాగములును అనగా 'నాటక జిజ్ఞాస' (నాటకరచనా విమర్శ), 'కావ్యనాటక మీమాంస' (కావ్యనాటక వివేచనము) అనెడివి ప్రకటితములైనట్లు కన్పట్టవు. అవికూడ వెలువడి యుండినచో నాటక విమర్శ కెంతేని లాభకారులై యుండెడివి; శ్రీరామశాస్త్రిగారు 'ఆంధ్రనాటకరంగము'లో చతుర్విధాభినయ స్వరూపమును, పలు నాటకసమస్యలను ప్రాచ్య-పాశ్చాత్యదృక్పథసమన్వయపూర్వకముగా చర్చించియుండుట పరిశీలింపవచ్చును.

బందరులో 4-6-1924 తేదీ మొదలు నాలుగురోజులపాటు జరిగిన 'ఆంధ్రనట సాహిత్య సభలు"ను గూర్చి తప్పక పేర్కొనవలసియున్నది. ఇందు కాశీ కృష్ణాచార్యులుగారు సాహిత్యపర్యాలోచనమందును, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు నాట్యసమస్యా విచారణమందును బ్రహ్మత్వము వహించిరి. చర్చలలో శ్రీయుతులు నెల్లూరు నగరాజారావు, ఉమ్రాలీషా, వెదురుమూడి శేషగిరిరావు, హరి నాగభూషణం ప్రభృతులు పాల్గొనిరి. నాడు జిజ్ఞాసువులను కలవరపెట్టుచున్న నాటకరంగసమస్యలను పెద్దలందరునుచేరి ముఖాముఖిగా చర్చించుకొనుట కవకాశముకల్పించినవీ సభలు. ఈ సభలలోనే భమిడిపాటి కామేశ్వరరావుగారు "నాటకములు వచనములోనుండవలయుననియు, సంగీతమనవసరమనియు, ఉన్నపద్యములను వచనధోరణిలో రసవంతముగ నభినయవిస్పష్టతతో జదువవచ్చుననియు సప్రయోజనముగ నుపన్యసించి తమ సిద్ధాంతమును నిదర్శించి చూపిరి." వారి యీ యుపన్యాసము 1957 లో "ఆంధ్రనాటక పద్య

పఠనం" అను పేర గ్రంథరూపమున వెలువడినది. సభలయంతమున సభాభిప్రాయమీ క్రింది విధముగా వ్యక్తమైనది—"సంగీతము చాలవరకు తగ్గిపోవలెను. నాటకరచనయందు వచన మధికముగ నుపయోగించవలెను. అభినయమును భావప్రకటానురూపముగ నభివృద్ధిచేయ వలెను. పాత్రౌచిత్యమైన దుస్తులు ధరింపవలెను. (ఆంధ్రనాటక సంస్కరణము—పుట-11).

సూరిశాస్త్రిగారు 1924 లోనే తమ 'నాట్యోత్పలము'ను ప్రకటించియున్నారు. 12 అధ్యాయములతోడి యీ గ్రంథము పాశ్చాత్యదేశములందలి నాటకోత్పత్తి వికాసములను జిజ్ఞాసా దృష్టితో వివరించుచున్నది. శాస్త్రిగారి "ఆంధ్రనాటక సంస్కరణ-విమర్శక పారిజాతము"లు 1925 లోను, "నాట్యాఽశోకము" 1927 లోను వెలువడినవి. నాట్యాఽశోకమందు "తాటాకులలో పచార్లు" అనెడిపేర తంజావూరు యక్షగాననాటకములను గూర్చిన వ్యాసము కలదు. ఈ వాఙ్మయమునుగూర్చి పరిశ్రమించిన ప్రథములలో శాస్త్రిగారొకరనెడి విషయము పెద్దలకు చాలమందికి తెలియదు; తెలుగులోని విమర్శన గ్రంథముల రచనారీతులను శాస్త్రిగారు ముత్త్రివిధములుగా విభజించియుండుట పరిశీలనార్హము (విమర్శక పారిజాత పీఠిక—2-3)—

1. స్వీయ ప్రపంచానుభవమును, కళాపరిజ్ఞానమును, భావములను, రుచులను విస్తరించుచు, ఆత్మీయానుభవనిరూపకములగు స్వతంత్రగ్రంథములను రచించుట. (రామలింగారెడ్డి ప్రభృతుల రచనలిట్టివి. సూరిశాస్త్రి ప్రభృతుల నాట్యాంబుజాదులును ఇట్టవే.)

2. ప్రామాణిక లాక్షణికుల గ్రంథములను జదివి, అందలి ప్రమాణములను వాద ప్రతివాదములను విస్తరించుచు, తానభిమానించెడి సిద్ధాంతములకు అనుకూల ప్రతికూలముల నేర్పరచి చూపుచు నేదోయొక్క సిద్ధాంతమును తేల్చవచ్చును. (గొల్లపూడి శ్రీరామశాస్త్రి ప్రభృతుల రచనలిట్టివి.)

3. ఇట్టివేమియునుచేయక ప్రామాణికలాక్షణికుల, రసికవిమర్శకుల భావములను వివిధాంశములపట్ల విభజించి, సంతరించి చూపుట. (సూరిశాస్త్రి ప్రభృతుల విమర్శకపారిజాతాదులిట్టివి.)

ఈ మూడునుకాక, మరికొన్నిరీతులుకూడ కలవు—

• 1. ఆంధ్రేతరభాషలలోని విమర్శనముల యథాతథానువాదములు; లేదా 2. అనుసరణములు, ఇందు విమర్శలను తెలుగులోని కావ్య-నాటకరీతులకు సమన్వయించెడి ప్రయత్నముకూడ నుండును.

1926 లో ఏకుమళ్ళ అచ్యుతరావు పంతులు (1880-1947) గారు "ఆంధ్రనాటకములు" (Andhra Dramas and Andhra Stage) అనెడి చిన్న విమర్శన గ్రంథమును ప్రకటించిరి. ఇందు స్థూలముగా నాటకతత్త్వము, కథానిర్మాణము, పాత్రముల శీలప్రతిష్ఠాపనము, సుఖాంత దుఃఖాంత విభాగ విచారము, ప్రదర్శనపక్కియను నైదంశములు చర్చింపబడినవి. దీనికి మానవల్లి రామకృష్ణకవిగారు చక్కని 'ప్రస్తావన' రచించియున్నారు. రామకృష్ణ

కవిగారు సంపాదించుచున్న బరోడావారి నాట్యశాస్త్ర ప్రథమసంపుటము ముద్రింపబడుచున్న కాలమది. అసలు సర్వసమర్థులగు కవిగారు ఆనాడే నాట్యశాస్త్రానువాదమునకుకూడ పూనుకొనియున్నచో తెలుగుదేశమున కెంతయో యుపకారము జరిగియుండెడిది.

ఇంతవరకును కేవలము వ్యాసములనే ప్రకటించుచున్న శ్రీపాద కామేశ్వరరావుగారు 1926 లో 'సాహిత్య మీమాంస' యను గ్రంథమును, 1927 లో 'నాటక మీమాంస' యను గ్రంథమును ప్రకటించియున్నారు. ఇందు మొదటిది శ్రీ పండితరామదహినమిశ్రుని హిందీ గ్రంథమున కనువాదము. ఇందు కావ్య_నాటకసమస్య లనేకములు చర్చింపబడెను. ఇంక రెండవది శ్రీ ద్విజేంద్రలాల్‌రాయ్ "కాళిదాస భవభూతు"లనెడి గ్రంథమున కనువాదము. శాకుంతలోత్తరరామ చరితముల నాధారముగాగొని ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంత చర్చలకు దొడగిన గ్రంథమిది. ద్విజేంద్రుని భావములతో తామంగీకరింపలేని ఘట్టములనేరి కామేశ్వరరావుగారు గ్రంథాంతమున 'సింహావలోకన' మనుపేర పెద్ద అధ్యాయము నొకదానిని చేర్చినారు. నాటక రచనకు సంబంధించిన మూలతత్త్వములను కూలంకషముగా చర్చించిన తెలుగువారిలో శ్రీపాదవారే ప్రథములని చెప్పవచ్చును. నాటకమందు పద్యములనురచింపరాదు, రచించినను పాడరాదు అనునది వీరివాదము.

నాటకరచనా_ప్రయోగములనుగూర్చి తెలుగుభాషలో అధికారికమైన నవ్యగ్రంథము నొకటి వెలువరింపవలెనని తీవ్రప్రయత్నము లొనరించి కృతకృత్యులైనవారిలో ప్రథములు పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు. వీరు కవులు, పండితులు, భరతవిదులు, సంగీతజ్ఞులు. చిన్నప్పటినుండియు అనేక సమాజములలో సభ్యులై వేషధారణము చేసినవారు. కొన్ని సమాజములకు దేశికులుగానుండిరి. లంకాదహనము, రామరావణసంగ్రామము, సావిత్రి మొదలగు నాటకములువ్రాసి ప్రదర్శింపజేసినారు. వీరి లంకాదహన మాకాలములో మంచి ప్రచారము నొందినది. అందులో శాస్త్రిగారే ఆంజనేయభూమికను ధరించి, ప్రశంసాపాత్రముగ అభినయించిరి. తెలుగుదేశపు నాట్యచరిత్రమంతటిని లక్ష్యలక్షణ సమన్వయపూర్వకముగా ఉద్గ్రంథరూపమున వెలువరింపవలెనని వారి తలంపు. అందుకొరకు అందరునటుల అభినయ విశేషములను, అన్ని నాటకప్రదర్శనములను చూడవలెననెడి తలంపుతో ప్రసిద్ధులను చాలమందిని బందరు రప్పించి, "నాట్యవిద్వత్ప్రదర్శనము" లనుపేర కొన్నింటి నేర్పాటుచేసినారు. తత్ఫలితమే 1930 లో వెలువడిన వారి "ఆంధ్రనటప్రకాశిక". ఇందు పదిప్రకరణములున్నవి— 1. గాంధర్వము, అభినయము, ఆహార్యము; 2, సంగీతము, 3. నాయికా_నాయకులు; 4. రసములు; 5. రూపకలక్షణము; 6. ప్రయోగము; 7. రంగము (తెలుగు సమాజముల చరిత్ర); 8. కావ్యము (తెలుగు కవుల నాటకములు); 9. నటుడు (వివిధనటుల అభినయరీతులు); 10. పాత్రము (కొన్నినాటకములలోని ప్రసిద్ధనాయికా_నాయకుల విమర్శ). ఆహార్యవిషయమున ఆధునికమైన 'మేకప్' విధానమంతయును ఇందు వివరింపబడుట పరిశీలింపదగిన విషయము. తెలుగునాటకవిమర్శకులలో సూరిశాస్త్రిగారికివలెనే యజ్ఞనారాయణశాస్త్రిగారికిని విశిష్టమైన స్థానముకలదు. ఈ ఇరువురిలో సూరిశాస్త్రిగారి విమర్శ ఎక్కువగా సహృదయరంజకమని చెప్పవచ్చును, ఆంధ్రనటప్రకాశిక సచిత్రమగుట ప్రత్యేకముగా పేర్కొనవలసిన విషయము.

1929 లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రకటించిన "ఆంధ్రవాఙ్మయ సూచిక" (ముద్రితాముద్రిత గ్రంథముల పట్టిక) వలన తెలుగులో వెలువడిన నాటకవాఙ్మయమును గూర్చి తెలిసికొనుట కవకాశమేర్పడినది.

మద్రాసు విశ్వవిద్యాలయము స్థాపింపబడినప్పటినుండియు దక్షిణదేశమందలి ఆంగ్ల విద్యావంతులందరకును బాగుగా తెలిసినవి షేక్స్పియరు నాటకములే; అటుపిమ్మట షెరిడన్ ప్రభృతుల నాటకములుకూడ కొంత ప్రచారమునందినవి. అవి తెలుగులోనికి అనువదింపబడుట కూడ గుర్తించియున్నాము. అంతియేకాని ఇబ్సెన్, షా ప్రభృతుల ప్రభావము మనవారిమీద సోకినట్లు కన్పట్టదు. గోమఠంవారి ఆంగ్లహరిశ్చంద్ర ప్రస్తావనలో గురజాడవారు ఇబ్సెను సిద్ధాంతప్రసక్తి తెచ్చినను వారు దానియందాదరము కలిగియున్నట్లు కన్పట్టదు[3]. 1927 లో పోణకా పిచ్చిరెడ్డిగారు 'ది బ్రాండ్' అనెడి ఇబ్సెను నాటకమును 'భీష్ముడు' అనుపేర అనువదించియున్నారు. ఇబ్సెను సాహిత్యము తెలుగుభాషలోని కనూదితమగుటకిదియే ప్రారంభమను కొందును. ఆ మరుసటి సంవత్సరమే ఇబ్సెను శతసంవత్సర జన్మదినోత్సవము జరిగినది. ఆ సమయమున కూర్మా వేణుగోపాలస్వామిగారు "హిందూ" పత్రికలో 'Ibsen Centinary Estimate' అనుపేర ఒక ఆంగ్ల వ్యాసమును ప్రకటించిరి (26-4-1928). అప్పటినుండియే 'ఇబ్సెను సొసైటీ' మద్రాసులో ఆరంభమైనది.

మొత్తముమీద 1930 నాటికి తెలుగునాటక రచయితలలో ఒకవిధమైన సంచలనము కలిగినది. ప్రాచీన సంప్రదాయములపై తిరుగుబాటు ఆరంభమైనది. వాస్తవికతకు ప్రాధాన్యము వచ్చినది. సోషలిష్టు సిద్ధాంతములు వ్యాప్తిలోనికి రాసాగినవి. జాతీయోద్యమము మంచి ఉచ్చదశలో నున్నది. ఈ పరిస్థితులన్నియును తెలుగు నాటకరంగములో ఒక నూతనాధ్యాయమునకు దారితీసినవి. సరిగా ఆ సమయములో బయలుదేరినదే పాకాల వెంకట రాజమన్నారుగారి మూడంకముల సాంఘిక-వచననాటకము 'తప్పెవరిది'. రచనాశిల్పమున క్రొత్తదారులుత్రొక్కిన ఈ రచనను అసమాననటుడు బళ్లారి రాఘవాచార్యులుగారు చేపట్టి విజయవంతముగా పలుతావులందు ప్రదర్శించినారు. దీనితో వచననాటకరచయితలకు, క్రొత్తపోకడల నటులకు స్థైర్యము చిక్కినది.

కాంట్రాక్టు నాటకయుగ మారంభమగుటతో ఫలాని సమాజమువారి ఫలాని నాటకమును చూడవలెననెడి భావము ప్రజలలో నశించిపోయినది. ఫలాని నటుని ఫలాని వేషము చూడవలెననెడి భావము బలసినది. నటుల నామములను విని నాటకప్రదర్శనములకు పరుగెత్తుట, వెఱ్ఱిమొఱ్ఱి అంగికాభినయములనుచూచి అదియే నటన అనుకొనుట అధికమైనది. ఆ స్థితిలోని నటులను, సమాజములను, ప్రేక్షకులను పరిహసించుచు పోరంకి వెంకట సుబ్బారావుగారు "నాటకమర్మము" అనెడి గ్రంథమును 1933 లో వెలువరించినారు.

1934 లో ఆంధ్రనాటక పరిషత్తు పక్షమున నీలంరాజు వేంకటశేషయ్యగారి సంపాదకత్వమున "నాట్యకళ" త్రైమాసికపత్రిక ప్రారంభమైనది. ఇది విజయవంతముగా చిరకాలము కొనసాగకపోయినను, వెలువడిన సంచికలలో మంచిమంచి వ్యాసములు ప్రకటితములైనవి. ఇది నాటకరచనా-ప్రయోగములనుగూర్చివిమర్శవ్యాసములను ప్రకటించువారికి మంచి

ప్రోత్సాహమిచ్చినదన్నచో అతిశయోక్తిలేదు. దీనితోపాటు మరికొన్ని సాహిత్య పత్రికలుకూడ నాడు నాటకవిమర్శకు దోహదము చేసినవన్నసత్యమునుకూడ విస్మరింపరాదు—భారతి, శారద, జయంతి, సఖి, ఉదయని, వీణ, జ్వాల, కళ, ఆంధ్రపత్రిక వార ఉగాది సంచికలు మొ.

1935 లో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి "నాటకోపన్యాసములు" వెలువడినవి; బళ్ళారిలో మునిసిపలు హైస్కూలువారి యాజమాన్యమున జరిగిన కృష్ణమాచార్య-శ్రీనివాస రాయల స్మారకోత్సవముల సందర్భమున చదువబడిన రెండు వ్యాసములివి. మొదటి వ్యాసమున నాటకసమస్యలును, రెండవ వ్యాసమున ఆ ఇరువురు నాటకకర్తల రచనారీతులును చర్చింపబడినవి. శర్మగారు లక్షణవిషయమున అధికారికముగా మాటాడగలిగిన సమర్థులు. సంస్కృతాంధ్రాంగ్లసాహిత్య పరిశీలనాదక్షులైన వీరి విమర్శలు ప్రత్యేక విశిష్టత కలిగినవై సహృదయాకర్షకములుగా నుండును. ఇట్లు సంయమనములో చేయబడినవై సాహిత్యస్థాయి నందుకొనెడి విమర్శలను వెలయింపగలవారు తెలుగుదేశములో చాల తక్కువగా నున్నారని చెప్పవచ్చును. అట్టివారిలో ఇంకొకరు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్రశాఖా ప్రధానాచార్యులై సాహిత్య విమర్శను ప్రాచ్య-పాశ్చాత్య సిద్ధాంతసమన్వయ పూర్వకముగా బహువర్షములు శిష్యగణములకు బోధించియున్నారు (వీరు ఉత్తమ నటులనెడి విషయముకూడ స్మరణీయము). 1937 లో 6 వ ఆంధ్రనాటకకళాపరిషత్తున కధ్యక్షులై వీరొసంగిన ఉపన్యాసము నాటక జిజ్ఞాసువులందరును పఠింపదగియున్నది (చూ. గౌతమ వ్యాసములు). వీరి పర్యవేక్షణలో దివాకర్ల వేంకటావధానిగారు "ఆంధ్రనాటక పితామహుడు" అను విషయముపై పరిశోధనముచేసి ఎమ్. ఏ. (ఆనర్సు) పట్టమును పొందియున్నారు; ఒక తెలుగు నాటకకర్తనుగూర్చియేకాక ఆంధ్రనాటకోత్పత్తి చరిత్రమును, విషాదాంత నాటక స్వరూపమునుగూడ వివరించియున్నారు (ఈ పరిశోధనావ్యాసము ఇటీవలనే గ్రంథరూపమున వెలువడినది). 1935 ప్రాంతముల వెలువడిన దువ్వూరి రామిరెడ్డిగారి వ్యాసములుకూడ ఇప్పట్లు పేర్కొనదగినవి (నాటకకళా సంస్కరణము; నాటకము, చరిత్ర).

జయంతి రామయ్యపంతులు (1860-1941) గారి "ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి" 1937 లో ప్రకటితమైనది. 1934 లో ఆంధ్ర విశ్వవిద్యాలయాదేశమున నొసంగబడిన ఉపన్యాస సంపుటియిది. ఇందలి రెండవ అధ్యాయమున తెలుగునాటక వికాసము చర్చింపబడెను. ఇందు చిలకమర్తివారి గయోపాఖ్యానముపై విపులమగు విమర్శకలదు. ఈ సందర్భమున పేర్కొనవలసినది శ్రీ వేదమువారి "భారతాభారత రూపకమర్యాదలు". ఇందు నాటకసమస్యలు సప్రామాణికముగా చర్చింపబడినవి. శిష్టా రామకృష్ణశాస్త్రిగారి "నాటక విమర్శ" ప్రసిద్ధ సంస్కృత నాటకములనుగూర్చి వివరించుచున్నది (ఇటీవల వీరు మద్రాసు విశ్వవిద్యాలయ పత్రికలో నాటకములనుగూర్చి మరికొన్ని వ్యాసములను ప్రకటించియున్నారు).

వివిధనాటికారచయితల రచనలను సంపుటీకరించి, 1943 లో శివశంకరస్వామిగారును (ఏకాంకికలు), 1944 లో డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును (నేటి ఉత్తమనాటికలు) రెండు నాటికాసంపుటములను వెలువరించినారు. 1957 లో గోపాలస్వామిగారింకొక సంపుటిని

ప్రకటించియున్నారు (ప్రసిద్ధ నాటికలు). ఈ సంపుటములకు ఈ సంపాదకులు ముప్పురును వ్రాసిన పీఠికలు ఉదాత్తములుగా, ఆలోచనాప్రేరకములుగా నున్నవి. అట్లే కొందరు రచయితలుకూడ తమ రచనలకు అప్పుడప్పుడు చిన్నిచిన్ని ఉపోద్ఘాతములు వ్రాసికొనుచు వచ్చినారు. ఈ సందర్భమున 1952-53 లో కిన్నెర పత్రికలో వరుసగా వెలువడిన భూపతి లక్ష్మీనారాయణ రావుగారి వ్యాసములు స్మరింపదగినవి; ఇందు ప్రాచీననాటకలక్షణములు మంచి సమన్వయ దృక్పథముతో వివేచింపబడినవి (ఇవికూడ ఇటీవల గ్రంథరూపమున వెలువడినవి). విశ్వనాథ సత్యనారాయణగారు సంస్కృతనాటకములపై ఆధికారికమైన విమర్శలు వెలయించియున్నారు.

ఈ సందర్భమున తెలుగునాటకచరిత్ర-విమర్శ అనెడి విషయములపై కృషిచేయుచున్న మరికొందరిని పేర్కొనవలసియున్నది. నాటకకళాభ్యుదయముపట్ల ప్రగాఢమైన విశ్వాసముగల శ్రీనివాసచక్రవర్తిగారు బి. టి. రాఘవాచార్యులుగారి అంతేవాసులై నాటక రహస్యముల నవగాహనచేసికొన్నవారు. నాట్యశాల (1946), నటన (1953) అనునవి వీరి తొలిరచనలు ఇంక 'అభినయం' (1958) అనునది వీరి కృషికిపతాక. "యాన్ యాక్టర్ ప్రిపేర్స్" అనెడి స్టానిస్లావిస్కీ రచన కిది అనుసరణము. స్టానిస్లావిస్కీ రచనలో క్రొత్తక్రొత్త విషయములు, క్రొత్తక్రొత్త భావములతో క్రొంగ్రొత్త పరిభాషతో ప్రత్యక్షమగుచుండును. అయినను ఆ సిద్ధాంతములు చాలవరకు భారతీయతాత్త్వికదృక్పథమునకు సన్నిహితములుగానే ఉండును. ప్రాచ్య పాశ్చాత్య నాటకరంగములు రెండింటికిని సంబంధించిన సిద్ధాంతపరిజ్ఞానముతో శ్రీనివాసచక్రవర్తిగారీ గ్రంథమును తెలుగు పాఠకులకు సుబోధమొనర్చియున్నారు. తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులవారి "గీర్వాణరూపకము" 1952 లో వెలువడినది. ఆ సంవత్సరమే "నెల్లూరు: నాటకకళ" అనుపేర కొమాండూరు పార్థసారథి అయ్యంగార్‌గారు ఒక చిన్న గ్రంథమును ప్రకటించియున్నారు. ఒక ప్రత్యేక ప్రదేశమునకు చెందిన నాటక రంగస్థల చరిత్రను తెలుపుటకు ప్రయత్నముచేసినవారిలో శ్రీ అయ్యంగార్ ప్రథములని చెప్పవచ్చును. (గుంటూరుపట్టణ నాటకరంగమునుగూర్చి వెలువడిన బండారు రామస్వామిగారి 'నటమిత్రమ్' కూడ ఇట్టి రచనయే). ఇట్టి రచనలు ఇంకను అనేకములు తెలుగులో వెలువడవలసియున్నవి.

"నాటక పద్యపఠనం" విషయములో ఒక ఉద్యమమే ప్రారంభించిన భమిడిపాటివారి వాదము 1957 లో "ఆంధ్రనాటక పద్యపఠనం" అనుపేర గ్రంథరూపమును తాల్చినది. 1957 లోనే "ఆంధ్రనాటక కర్తలు" ప్రథమభాగము వెలువడినది. ప్రసిద్ధనాటకకర్తల జీవిత చరిత్రలను, వారి రచనారీతులను, తద్విశిష్టతలను తెలుగు ప్రజల కందింపవలెననెడి ప్రయత్నమున కిది తొలిఫలము.

ప్రజానాట్యమండలి కార్యకలాపములలో సుప్రసిద్ధులై, నాటకరంగానుభవము గడించిన మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు "నాటకకళ" అనెడి బృహద్గ్రంథమును రచించి 1957 లో 'తెలుగుభాషాసమితి' వారి బహుమతిని పడసినారు. ఇందు ప్రాచీనాధునాతన నాటకరంగ స్వరూపనిర్ణయమునకు ప్రయత్నము జరిగినది. (ఇది ఇంకను అముద్రితము).

ఆంధ్రనాటకసమాఖ్యవారు 1956 లో విజయవాడలోను, 1957 లో రాజమండ్రిలోను నాటకకళాశిక్షణ తరగతులను (ప్రయోగనాటకపాఠశాలలను) నిర్వహించి, ఉపన్యాసముల నిప్పించియున్నారు. వీనిలో ముద్రణభాగ్యమును పొందినది ప్రసిద్ధ మేకప్ ఆర్టిస్టు కుమార్ గారి ఉపన్యాసము "ఆహార్యం" (Make-up). దీనినే బాగుగా విస్తరించి 1958 లో మేకప్ అనుపేర మరల ప్రకటించినారు కుమార్‌గారు. 'ఆంధ్రనట ప్రకాశిక'లోని ఆహార్యప్రకరణము తరువాత తెలుగులో ఇట్టి రచన వెలువడుట కిదియే ప్రారంభమని చెప్పవచ్చును. నాటకప్రయోగ మునుగూర్చిన 'రోహిణి'గారి వ్యాసములు కృష్ణాపత్రికలో 'సీరియల్'గా వచ్చినవి. ఇందు నాటకసమస్య లనేకములు చర్చింపబడెను. ఇవి ఇటీవలెనే 'నాటకశిల్పం' (1960) అనుపేర గ్రంథరూపమున వెలువడినవి.

1958 నవంబరులో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారి పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖవారు 'రూపక సమాలోచనము' జరిపించి ఎమ్. ఏ. విద్యార్థులచే 17 ఉపన్యాసముల నిప్పించియున్నారు. విశ్వవిద్యాలయములవారిట్టి పనికి పూనుకొనుట కిదియే ప్రారంభమని చెప్పవచ్చును. ఇందలి కొన్నివ్యాసములు పత్రికలలో వెలువడినవి. ఇప్పట్ల ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీవారి రెండు ప్రచురణములను పేర్కొనవలసియున్నది— 1. 1944 లో రాజా శ్రీ మేకా రంగయ్యప్పారావుగారి అధ్యక్షతలో పనిచేసిన నాటకపునరుద్ధరణ సూచనసంఘమువారురచించిన 'రిపోర్టు' (1959); 2. కూచిపూడి నాట్యసదస్సుసంచిక (1960).

1957 లో శ్రీనివాసచక్రవర్తిగారి సంపాదకత్వమున 'నాట్యకళ' పునరుద్ధరింపబడినది. ఇందు చక్కని వ్యాసములు వెలువడుచున్నవి. ఆయా నాటకోత్సవములను పురస్కరించుకొని ప్రత్యేక సంచికలుకూడ ప్రకటింపబడుచున్నవి. ఆయా నటులకు, రచయితలకు సన్మానములు జరుగునప్పుడుకాని, సమాజముల వార్షికోత్సవాదులు జరుగునప్పుడుకాని ప్రత్యేక సంచికలు వెలువడుచున్నవి. ఇట్టివానిలో "ఆంధ్రనాటకరంగ అభ్యుదయ వజ్రోత్సవ సంచిక" (1957–గుంటూరు), "సురభి సప్తతి స్వర్ణోత్సవ సంచిక" (1960) ముఖ్యముగా పేర్కొనదగినవి. ఈ సందర్భమున 1948 లో పి. యస్. రామాచారిగారి సంపాదకత్వమున వెలువడిన 'నటన' కూడ తెలుగునాటకరంగవిషయమున చేసినసేవ స్మరింపదగినది. మరియు "పరిశోధన" సంపాదకులు వెలువరించిన "ఆంధ్రనాటకపితామహ సంస్మరణసంచిక"యు, "శ్రీ గురజాడ అప్పరాయ సంస్మరణ సంచిక"యు ప్రత్యేకముగా పేర్కొనదగియున్నవి.

1950 తరువాత తెలుగునాటకవిమర్శలో ఒక క్రొత్తశక మారంభమైనదని చెప్ప వచ్చును. పాశ్చాత్యవిమర్శలను తెలుగులోనికి తెచ్చినవారి విషయ మింతకుముందే తెలిపి యున్నాను. తెలుగునాటకచరిత్రను సమగ్రముగా వ్రాయవలెనని కొందరు తలపెట్టిరి. వారిలో కీ. శే. కొప్పరపు సుబ్బారావుగారు ముఖ్యులు: రచన పదియవవంతు అయినను పూర్తికాకుండ గనే వీరు మరణించుట దురదృష్టము. అటుపిమ్మట చెప్పదగినది మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారి కృషి. డా. చాగంటి సన్యాసిరాజుగారి ప్రయత్నమిప్పుడు తుదిమెరుగుల నందుకొనుచున్న దని తెలియుచున్నది. వీరి 'కళ–స్వరూప నిర్ణయము' అనునది ఈ మధ్యనే ప్రకటితమైనది.

ఇది సమగ్రచరిత్ర కుపోద్ఘాతము వంటిది. (ఈ సమగ్ర చరిత్ర సమాప్తము కాకుండగనే వీరు పరమపదించుట విచారకరము).

కె. వి. గోపాలస్వామిగారి సంపాదకత్వమున ఇటీవలనే దక్షిణదేశ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహమున వెలువడిన "తెలుఁగు వాఙ్మయము" (సంగ్రహ చరిత్ర) అను గ్రంథములో గోపాలస్వామిగారే రచించిన 'తెలుగు నాటకాలు' అనెడి వ్యాసమును ఈ సందర్భమున తప్పక పేర్కొనదగియున్నది. శ్రీనివాసచక్రవర్తిగారు రంగస్థల ప్రయోగయోగ్యములైన తెలుగు నాటకముల వివరములను సేకరించియున్నారు. (ఇది త్వరలోనే ప్రకటింపబడగలదు). ఢిల్లీలోని 'ఏషియన్ థియేటర్ ఇన్స్టిట్యూట్'లో కొందరు శిక్షణ పొందియున్నారు. వీరిలో పేర్కొనబడవలసిన ప్రముఖులు శ్రీ కె. వెంకటేశ్వరరావు (ర. స. న., బెజవాడ). శ్రీ బక్షీ శ్రీరాం (హైదరాబాదు). మరికొందరు విదేశములలో శిక్షణ పొందుచున్నారు. వీరిలో పేర్కొనబడవలసినవారు శ్రీ రాజారాందాస్; వీరు అమెరికాలోని 'ఊటా' విశ్వవిద్యాలయములో 'నటన'లో పి. హెచ్‌డి. పట్టము కొరకు కృషిచేయుచున్నారు. పి. యస్. రామారావుగారు కలకత్తాలో మూడేండ్లు శిక్షణపొంది, తూర్పు జర్మనీ వెళ్ళియున్నారు. వీరిరువురు తిరిగివచ్చిన తరువాత తెలుగుదేశమున కెంతయో ఉపయోగపడగలరని ఆశింపవచ్చును. (రామారావుగారిప్పుడు కేంద్రప్రభుత్వోద్యోగములో నున్నారు).

ఇంతవరకును తెలుగునాటక విమర్శలో అచ్చటచ్చట భరతుని నాట్యశాస్త్ర శ్లోకములు కొన్ని ఉదాహృతములగుచుండెడివి. అంతటితో తృప్తిపడని కొందరు నాట్యశాస్త్ర సమగ్ర స్వరూపమును తెలుగు ప్రజల కందింపవలెనని ప్రయత్నించిరి. డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నాట్యశాస్త్రానువాదము ఆంధ్రభారతీసహితముగా 6 అధ్యాయములు తెనాలిలో 1951లో ముద్రితములైనవి. అవి అంతటితో ఆగిపోయెను. భాగవతుల కుటుంబరావుగారి అనువాదములోని రెండధ్యాయములు మాత్రము త్రిలింగలో ప్రకటితములైనవి. జమ్మలమడక మాధవ రామశర్మగారు 'నాట్యవేదము' అనుపేర 1-7-, 18-21 అధ్యాయములను అభినవభారతీ సహితముగా ననువదించి గ్రంథరూపమున ప్రకటించినారు. ఇది కేంద్ర సంగీతనాటక అకాడెమీ సహాయమును పొందినరచన. ఇంక నా 'నాట్యశాస్త్రానువాదము' సంపూర్ణమై, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయమునుపొంది 1959 లో వెలువడినది. మన ప్రాచీన సంప్రదాయ సమగ్రతను, సౌష్ఠవమును విశదీకరించుచున్న ఈ నాట్యశాస్త్రానువాదములు నటులకు, నాటకరచయితలకు, విమర్శకులకు కనువిప్పై, వారి ఆలోచనలను రేకెత్తించుచున్నవనుట అతిశయోక్తికాదు.

యక్షగానములనుగూర్చిన డా. యస్వీ జోగారావుగారి పరిశోధనా వ్యాసము 1961 లో వెలువడినది. 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' (1960) అను తమ పరిశోధనా వ్యాసములో డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు తొలిరోజులలో వెలువడిన ఆంగ్లనాటకానువాదములనుగూర్చి విపులముగా చర్చించియున్నారు.

ఈ కాలమున గుర్తింపవలసిన ఇంకొక విశేషము కలదు. పలువురు యువకులు శాస్త్రీయపద్ధతులలో నటన, నాటకప్రయోగము, సాంకేతికకార్యకలాపములు మొదలగువాని

ఇది సమగ్రచరిత్ర కుపోద్ఘాతము వంటిది. (ఈ సమగ్ర చరిత్ర సమాప్తము కాకుండగనే వీరు పరమపదించుట విచారకరము).

కె. వి. గోపాలస్వామిగారి సంపాదకత్వమున ఇటీవలనే దక్షిణదేశ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహమున వెలువడిన "తెలుఁగు వాఙ్మయము" (సంగ్రహ చరిత్ర) అను గ్రంథములో గోపాలస్వామిగారే రచించిన 'తెలుగు నాటకాలు' అనెడి వ్యాసమును ఈ సందర్భమున తప్పక పేర్కొనదగియున్నది. శ్రీనివాసచక్రవర్తిగారు రంగస్థల ప్రయోగయోగ్యములైన తెలుగు నాటకముల వివరములను సేకరించియున్నారు. (ఇది త్వరలోనే ప్రకటింపబడగలదు). ఢిల్లీలోని 'ఏషియన్ థియేటర్ ఇన్స్టిట్యూట్'లో కొందరు శిక్షణ పొందియున్నారు. వీరిలో పేర్కొనబడవలసిన ప్రముఖులు శ్రీ కె. వెంకటేశ్వరరావు (ర. స. న., బెజవాడ). శ్రీ బక్షీ శ్రీరాం (హైదరాబాదు). మరికొందరు విదేశములలో శిక్షణ పొందుచున్నారు. వీరిలో పేర్కొనబడవలసినవారు శ్రీ రాజారాందాస్; వీరు అమెరికాలోని 'ఊటా' విశ్వవిద్యాలయములో 'నటన'లో పి. హెచ్‌డి. పట్టము కొరకు కృషిచేయుచున్నారు. పి. యస్. రామారావుగారు కలకత్తాలో మూడేండ్లు శిక్షణపొంది, తూర్పు జర్మనీ వెళ్ళియున్నారు. వీరిరువురు తిరిగివచ్చిన తరువాత తెలుగుదేశమున కెంతయో ఉపయోగపడగలరని ఆశింపవచ్చును. (రామారావుగారిప్పుడు కేంద్రపభుత్వోద్యోగములో నున్నారు).

ఇంతవరకును తెలుగునాటక విమర్శలో అచ్చటచ్చట భరతుని నాట్యశాస్త్ర శ్లోకములు కొన్ని ఉదాహృతములగుచుండెడివి. అంతటితో తృప్తిపడని కొందరు నాట్యశాస్త్ర సమగ్ర స్వరూపమును తెలుగు ప్రజల కందింపవలెనని ప్రయత్నించిరి. డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నాట్యశాస్త్రానువాదము ఆంధ్రభారతీసహితముగా 6 అధ్యాయములు తెనాలిలో 1951లో ముద్రితములైనవి. అవి అంతటితో ఆగిపోయెను. భాగవతుల కుటుంబరావుగారి అనువాదములోని రెండధ్యాయములు మాత్రము త్రిలింగలో ప్రకటితములైనవి. జమ్మలమడక మాధవ రామశర్మగారు 'నాట్యవేదము' అనుపేర 1–7–, 18–21 అధ్యాయములను అభినవభారతీ సహితముగా ననువదించి గ్రంథరూపమున ప్రకటించినారు. ఇది కేంద్ర సంగీతనాటక అకాడెమీ సహాయమును పొందినరచన. ఇంక నా 'నాట్యశాస్త్రానువాదము' సంపూర్ణమై, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయమునుపొంది 1959 లో వెలువడినది. మన ప్రాచీన సంప్రదాయ సమగ్రతను, సౌష్ఠవమును విశదీకరించుచున్న ఈ నాట్యశాస్త్రానువాదములు నటులకు, నాటకరచయితలకు, విమర్శకులకు కనువిప్పై, వారి ఆలోచనలను రేకెత్తించుచున్నవనుట అతిశయోక్తికాదు.

యక్షగానములనుగూర్చిన డా. యస్వీ జోగారావుగారి పరిశోధనా వ్యాసము 1961 లో వెలువడినది. 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' (1960) అను తమ పరిశోధనా వ్యాసములో డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు తొలిరోజులలో వెలువడిన ఆంగ్లనాటకానువాదములనుగూర్చి విపులముగా చర్చించియున్నారు.

ఈ కాలమున గుర్తింపవలసిన ఇంకొక విశేషము కలదు. పలువురు యువకులు శాస్త్రీయపద్ధతులలో నటన, నాటకప్రయోగము, సాంకేతికకార్యకలాపములు మొదలగువాని

యందు శిక్షణ పడయుట కవకాశములు కలిగినవి[4]. ఈ సందర్భమున పేర్కొనవలసిన విశేషము లింకొక రెండు కలవు—డా. ఐ. పాండురంగారావుగారు తెలుగు-హిందీ రూపకము లనుగూర్చి పరిశోధనచేసి 'ఆంధ్ర-హిందీరూపక్' అనుపేర నాగపూరు విశ్వవిద్యాలయమునకు హిందీలో పరిశోధనావ్యాసమును సమర్పించి, డాక్టరేటుపట్టమును పొందియున్నారు. చాలకాలము క్రిందట శ్రీ పి. వి. పతి (మద్రాసు) అనువారు "Telugu Stage" అను విషయముపై ఫ్రెంచిభాషలో పరిశోధనావ్యాసమును వ్రాసి Sorbonne విశ్వవిద్యాలయమునుండి పి. హెచ్‌డి. పట్టమును పొందియున్నారు. అది ఇంకను ఆంగ్లభాషలోనికిగాని, ఇతర భాషలలోనికిగాని అనూదితమైనట్లు కన్పట్టదు.

ఇంతవరకును పేర్కొనబడినవారేకాక ఇంకను పలువురు ఆయా అవకాశములను పురస్కరించుకొని పెక్కు వ్యాసములను పత్రికలమూలమున వెలయించియున్నారు. వీరందరును యథాశక్తిగా తెలుగులోని నాటకవిమర్శనావాఙ్మయము అభివృద్ధి పొందుటకు దోహదము చేసినవారే.

ఈ సందర్భమున తెలుగులో వెలయుచున్న నవ్యనాటకములు ప్రజాదరణమును పొందుటలేదన్న విమర్శనుగూర్చి వివరింపవలసియున్నది. ఈ విమర్శ కొంతవరకును సత్యమే. అసలు నాటకరచన చాల క్లిష్టమైనది. అందుచేతనే మన పూర్వులు 'నాటకాంతం హి సాహిత్య' మన్నారు. కాని నేడు 'నాటకాది సాహిత్యము'గా నున్నది. ప్రతిభకాని, అనుభవముకాని సంప్రదాయజ్ఞతకాని లేకయే కొందరు నాటకరచనకు పూనుకొనుచున్నారు. అట్టి రచనలు అటు సాహిత్యమునకుకాని, ఇటు రంగస్థలప్రదర్శనమునకుకాని పుష్టిని చేకూర్పజాలవు. నవ్య నాటకములలో కొంతభాగము పాశ్చాత్యరూపకములకు అనువాదములో, అనుసరణములో అగుచున్నవి. కథ, అందలిపాత్రలు, అందు వ్యక్తమయ్యెడి భావములు మనకు అపరిచితములు. అంతియేకాదు, ఇట్టి నాటకములు బుద్ధికి పనిచెప్పినంతగా హృదయమును కదలింపలేవు. దీనికి తోడు మరికొన్ని నాటకములందు స్వభావవాదము ముదిరి భాష, పాత్రలు, భావములు పేలవములై నాటకప్రదర్శనములలోని అభినయముల విశిష్టత నశించి, దైనందిన వ్యవహారప్రాయ మగుటచేత అవి ఆకర్షణమును కోల్పోవుచున్నమాట నిజము.

నాటకము, ముఖ్యముగా నాటకప్రదర్శనము, లోకమున కెంత సన్నిహితముగా నుండునో లోకమునకంత భిన్నముగాకూడ నుండునని గుర్తించియున్నాము. అయినచో కేవల స్వభావవాదమునకు నాటకప్రదర్శనమందు స్థానములేదనుట స్పష్టము. భాషలో, పాత్రల సృష్టిలో, భావవ్యక్తీకరణములో, ఆదర్శగ్రహణములో కవి విశిష్టత చూపవలయును. అట్లే ప్రదర్శన విధానములో, అభినయముల రీతులలో (నడకలో, చూపులో, వాక్కులో, ఆహార్యములో), సాత్త్విక ప్రదర్శనములో నటులు విశిష్టత చూపవలయును. ఈ రెండింటి సమన్వయము నాటకసిద్ధికి హేతువు. మనమిప్పుడు సంధికాలములోనున్నాము. ఈ స్థితి కడచి నేడు జరుగుచున్న వివిధప్రయోగముల ఫలముగా, ఇతోఽధికముగా ఉత్తమ రచనలు వెలసి, ఉత్తమప్రదర్శనలు వెలయగలవని విశ్వసించుచున్నాను.

# నాటక రచన

## ఇతివృత్త నిర్మాణము :

నాటకరచన యనునది ఇతివృత్త నిర్మాణమునకును, భాషకును సంబంధించియున్నది: అనగా ఇది కవికి సంబంధించిన విషయమన్నమాట. ఇది కేవలము కవికిని, సాహిత్యమునకును సంబంధించిన విషయమే అయినను రూపకము ప్రదర్శనప్రధానమైనదికాన రచనా సమయమున రంగస్థలప్రయోగ సౌలభ్యమునుకూడ కవి దృష్టియందుంచుకొనవలసియున్నది. ఏకావ్య రచనకైనను మూలభూతమైనది కథ (Story). ప్రసిద్ధమైన కథనే గ్రహించినచో రచయితకు కొంతశ్రమ తగ్గును; లేదా కథను కల్పించుకొన్నచో కవి మరింత శ్రద్ధతో పరిశ్రమింపవలసియుండును.

అన్ని కథలును యథాతథముగా నాటకీకరింపబడుటకు తగియుండవు. నాటకీకరించుటకు యోగ్యమైన కథయందు ప్రధానముగా ఒక సాధ్యఫలముండును; అనగా త్రివర్గమనబడు ధర్మ-అర్థ-కామములలో ఏదియోయొకదానిని ప్రధానముగా సంపాదింపవలెననెడి దృష్టియుండును. (లక్ష్యవిహీనమైన కార్యమేదియును ఉండదని మనకు తెలిసిన విషయమే. ఒకవేళ ఉన్నచో అది ఉన్మత్తుని పనిమాత్రమేయగును). ఈ ప్రధానఫలమును సాధించువాడు లేదా పొందునతడు ఆ కథయందు ప్రధానపురుషుడగును; అతడే నాయకుడు. వాని చరిత్రము, వాని స్వభావము, ఫలసాధన కాతడుచేయు ప్రయత్నము చిత్రితమగు కథాభాగము ప్రధానకథయగును; దానినే ఆలంకారికముగ 'ఆధికారిక'మందురు. ప్రధానఫలమును సాధించుటలో నాయకునకు కొందరి సహాయ మవసరమగుటకద్దు; అట్లు నాయకునకు సహాయపడువారిని 'ఉపనాయకు'లనవచ్చును. వీరిలో ఎవరిచరితమైనను ప్రధానకథకు పోషకముగానున్నచో అదికూడ తదనుగుణముగా స్వీకరింపబడును; ప్రసంగవశమున ప్రసక్తమగునుకాన ఇది 'ప్రాసంగిక' మనబడును; ఇట్లు కవి స్వీకరించిన కథ ద్విధావిభక్తము కావచ్చును.

ఇతివృత్తములో, సంవాదములలో 'సంక్షిప్తత' రూపకమునకు జీవము. ఒక్కొక్క కథలో పెక్కు సన్నివేశములుండును. ప్రధానఫల సంపాదనదృష్టితో చూచినచో ఆ సన్నివేశములందు కొన్ని అనావశ్యకములుండవచ్చును; కవి ఆ సన్నివేశములను విడిచివేయవలెను. అనగా ఆవశ్యకములైన సన్నివేశములేవియో నిర్ణయించుకొని, తక్కినవానిని పరిహరింపవలయును. ఆవశ్యకములైన సన్నివేశములలోకూడ కొన్నిమాత్రమే రంగమునందు ప్రదర్శించుటకు యుక్తములు; మరికొన్ని ప్రదర్శించుటకు యుక్తములుకావు. అనగా అవి నీరసములగుటచేత ఆకర్షణీయములుగానుండవు. కాని, అందలివిషయములు కథాగమనమునకు ఆవశ్యకములు; అందుచేత ఆ సన్నివేశములు అపరిహార్యములు. అట్టి నీరససన్నివేశములకు సంబంధించిన విషయములను రంగమునందు ప్రత్యక్షముగా ప్రదర్శింపక (అనగా అంకములందు నిబంధింపక) విష్కంభ-ప్రవేశకాదులయందు కేవలము సూచింపవలెను. నీరసములైన సన్నివేశములనేకాక ఆవశ్యకములైనవానిని (యుద్ధాదులు); అనుచితములైనవానిని (ఆలింగన చుంబనాదులు) కూడ ప్రత్యక్షముగా ప్రదర్శింపరాదు; ఆవశ్యకములైనచో వానినికూడ పై విధముగానే సూచింపవలయును.

ఇంక ప్రదర్శనీయములు, ఆకర్షణీయములు అగు సన్నివేశములుమాత్రమే మిగులును; వీనియందు కూడ ఔచిత్యదృష్టితోకాని. రసపోషణదృష్టితోకాని, నాటకీయతాదృష్టితోకాని ప్రదర్శనా సౌలభ్యమును వాంఛించి కొన్ని సన్నివేశములందు కవి మార్పులు చేయవలసియుండును; అంతియేకాదు, సన్నివేశములందు కార్య-కారణసంబంధమును నిరూపించుటకై కొన్ని క్రొత్త కల్పనలను చేయవలసియుండును. ఇట్లు ఔచిత్యదృష్టితో మార్పులను, చేర్పులను చేసికొనుటకు కవికి స్వేచ్ఛయేకాదు, అధికారమును కలదు. ఇట్లు సిద్ధములైనసన్నివేశములే అంకములందు నిబంధింపబడును. అంకసంఖ్యను కథావిస్తృతిని బట్టియు, రూపకస్వరూపమును బట్టియు నిర్ణయించుకొనవలసియున్నది. (ఆ యా సన్నివేశముల సమాప్తియందుకాని. నటుల ప్రేక్షకుల విశ్రాంతికొరకుగాని చేయబడెడి విచ్ఛేదములు 'అంకములు' అనబడును). ఈవిధముగా ప్రణాళిక సిద్ధముచేసికొన్న తరువాత కేవలము రసవంతములైన సన్నివేశములు మిగులును.

అయినచో, సారభూతములగు ఈ సన్నివేశములను ఏ విభాగములో, ఏ క్రమములో అంకములందు నిబంధింపవలెను ? ఆనెడి ప్రశ్నకు సంధివిభాగవివరణము సమాధానము కాగలదు. సంధివిభాగమును అర్థముచేసికొనుటకుముందు కార్యావస్థల, అర్థప్రకృతుల స్వరూపము తెలిసికొనవలసియున్నది. అవస్థలనునవి ఫలసాధనమందు నాయకుడుకావించు ప్రయత్నమునకును, అప్పటి వాని మనోగతభావములకును సంబంధించిన క్రమదశలు.[1] వేర్వేరు స్వభావములు కల ఈదశలు పరస్పరసంబద్ధములై యుండుటకు కారణములు లేదా హేతువులు అగునవి 'అర్థప్రకృతు' లనబడును ; అనగా అవస్థలనునవి కథాగమనమునకు సంబంధించిన క్రమదశలుకాగా, అర్థప్రకృతులనునవి కథాగమనమునకు హేతువులగుచున్నవన్నమాట. ఇట్లు అవస్థావిభాగము కథాగమనమునకు సంబంధించిన విభజనముకాగా, కథకుసంబంధించిన విభజనమింకొకటికలదు; అదియే సంధివిభాగము. అవస్థావిభజనమున కనుగుణముగానే ఈ సంధివిభజనమును ఉండును. (అవస్థలైదు; అర్థప్రకృతులైదు లేదా మూడు; సంధులైదు).

అంకములందు నిబంధింపబడు సన్నివేశములన్నియును ఏకసూత్రముకలవియై పరస్పరసంబంధము కలిగియుండునట్లుగా కూర్చుకొనుట కవియొక్క ప్రథమ కర్తవ్యము. 'ఈ సన్నివేశమునుండి ఈసన్నివేశమువరకును ఒకభాగము'; తరువాత 'ఈసన్నివేశమునుండి ఈసన్నివేశమువరకును రెండవభాగము' అని ఇట్లు నిర్ణయించుకొనుచు కవి ముందుగా కథను విభజించుకొనవలెను. ఇట్లు కవి కథను సమ్యగ్విభజనము చేసికొనునప్పుడు, ప్రారంభము మొదలు ఫలయోగమువరకును వ్యాపించియుండెడి ఏసమగ్రకథలోనైనను ఐదుభాగములు తప్పక ఉండును—

1. అభిలాష జనించి మనస్సున నెలకొనెడి కథాభాగము మొదటిది; 2. ఆ అభిలాషను వ్యక్తముచేసి దానిని సిద్ధింపజేసికొనుటకు ప్రయత్నము మొదలుపెట్టెడి కథాభాగము రెండవది; 3. ప్రయత్నము తీవ్రతరమై, ఫలమువిషయమున ఆశా-నిరాశలు రెండును కలిగెడి కథాభాగము మూడవది; 4 ప్రయత్నము ఫలించుననెడి నిశ్చయజ్ఞానము కలిగెడి కథాభాగము నాలుగవది; 5. ఫలము సిద్ధించెడి కథాభాగము ఐదవది. ఈ అయిదు కథాభాగ

ములను ఆలంకారికముగా 'పంచసంధులు' అందురు; వీనికి క్రమముగా ముఖ-ప్రతిముఖ-గర్భ-అవమర్శ-నిర్వహణము లనిపేరు.

కావున, నాటకరచనా ప్రారంభమునకుముందు కవి కథను విభజించుకొనగా ఏర్పడిన కథాభాగములే, అనగా కథాఖండములే నాటకపరిభాషలో 'సంధులు' అనబడినవని సారాంశము. పంచాంకపరిమితమైన రూపకమందు ఈ ఐదు సంధులును ఐదు అంకములందు నిబంధింపబడును, లేదా అంకసంఖ్యనుబట్టి ఒకే సంధిని రెండేసి అంకములందుకాని, రెండేసి సంధులను ఒకే అంకమునందుకాని నిబంధించుటకద్దు. కాగా, అంకవిభాగము కథకు సంబంధించిన బాహ్య విభాగమనియు, ఇంక సంధివిభాగము కథకు సంబంధించిన ఆంతరవిభాగమనియు తెలియవలెను.

కథ ఐదు సంధులుగా విభజింపబడినప్పుడు అందలి సన్నివేశములుకూడ ఐదు భాగములుగా విభజింపబడిపోవునని వేరుగా చెప్పనక్కరలేదు. అనగా కథ ప్రారంభమునందలి కొన్ని సన్నివేశములు కలిసి ముఖసంధియగును. తరువాతి కొన్ని సన్నివేశములుకలిసి ప్రతి ముఖ సంధి అగును; ఇట్లే ఇతర సంధులును ఏర్పడును. ఆయా సన్నివేశములు ఆయా సంధుల యందలి భాగములగుచున్నవి. ఇంకను సూటిగా చెప్పవలెనన్నచో ఆ సన్నివేశములు ఆ సంధికి 'అంగములు'; వీనినే ఆలంకారికముగా 'సంధ్యంగములు' అందురు (మొత్తము సంధ్యంగ ములు 64). కాగా సంధ్యంగములనునవి కథలోని సారవంతములగు సన్నివేశములే అనియు, సర్వసాధారణములైనవానిని గుర్తించి ఆలంకారికులు సార్థకములగుపేర్లు పెట్టిరనియు, ఇవి ఆలంకారికుల అభూతకల్పనలు కావనియు తెలియవలెను. ఉత్తమకవి, ప్రధానఫలసిద్ధికి అను కూలముగా సారభూతములైన సన్నివేశములను నిబిడబంధముతో సమకూర్చుకొనునప్పుడు అవసరమునుబట్టి ఈ సంధ్యంగములన్నియునుకాని, కొన్నికాని అచ్చట ప్రత్యక్షమగుచునే యుండును[2]. సంధులయందు, సంధ్యంగములేకాక 21 సంధ్యంతరములు, అనుసంధులు, 4 పతాకా స్థానములు నుండునని భరతాదులు పేర్కొనియున్నారు (వివరములకు నా నాట్యశాస్త్రానువాదము నందలి 18 వ అధ్యాయమందున్న విశేషాంశములను చూడవలయును).

ఇట్లు రచనాప్రణాళికను సిద్ధముచేసికొని కవి రచనకు పూనుకొన్నప్పుడే ఆ రూపక కథ 'ఇతివృత్తము' (well-knit Plot) అనబడును. కవి మొదట గ్రహించినది కేవలము 'వృత్తము' (కథ = Story) మాత్రమే. "ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికీర్తితమ్" అని భరతుడు 'ఇతివృత్త' ప్రాధాన్యమును స్పష్టముచేసియుండెను; భరతుడు పేర్కొనిన 'ఇతి వృత్త' పదములో ఇంత మహార్థ మిమిడియున్నదన్నమాట । "రస-భావములను దృష్టియం దుంచుకొని కావ్యకుశలురైన కవులు నాటకమునందాయా సంధులలో యోగ్యములగు సంధ్యంగ ములను కూర్పవలె"నని సంధ్యంగ వివేచనాంతమున భరతుడు హెచ్చరిక చేయుటయు, దానిపై "కావ్యకుశలుడనగా ప్రబంధనిర్మాణదక్షుడగు కవియని యర్థము. ఒక్కొక్క పద్యమును లేక పదేసి పద్యములను అల్లెడి ముక్తకకవి ప్రబంధనిర్మాణదక్షుడు కాజాలడు। వానికి సంధి-సంధ్యంగ విన్యాసచమత్కారము తెలియనేతెలియదు. ఇంక ప్రబంధయోజనాసమర్థుడగు

కవియే సంధ్యంగసంయోగయోగ్యతను గుర్తింపగలడు" అని అభినవగుప్తుడువ్యాఖ్యానించుటయు గమనార్హములు. (ఇచ్చట 'ప్రబంధ' పదమునకు నాటక-ప్రకరణములని అర్థము).

"పొయెటిక్సు"లో అరిష్టాటిల్, విమర్శనదృష్టితో, రూపకమును ఆరుభాగములుగా విభజించి, ఆ ఆరింటిలోను 'ఇతివృత్తము' (Plot) ప్రధానమని నిర్దేశించెను. అంతియేకాదు; రూపకమున కదియేప్రాణమని ఆతని అభిప్రాయము[3]. ఇతివృత్తమునుగూర్చి ఆతడుచేసిన వివరణమును పరిశీలించినచో బాహిరమైన అల్పాంశములందుతప్ప అంతస్సారమున గ్రీకు-భారతీయ లక్షణములకు భేదములేదని స్పష్టపడగలదు. ఒకరోజులో జరిగిన కథను ఒక అంకమందు కూర్పవలెనని భరతుడుచెప్పగా, మొత్తము రూపకమందలి కథయంతయును ఒక రోజులో జరిగినది కావలెనని అరిష్టాటిల్ నిర్దేశించెను (నాడు గ్రీకు రూపకములలో అంకవిభజనమేలేదు; episodes అనుపేర కథ విభజింపబడెడిది). అరిష్టాటిల్ ఇతివృత్తమును 'ఆది-మధ్య-అంతము'లని మూడు భాగములుగానే విభజించెను. కాని అర్వాచీనకాలమందు పాశ్చాత్యవిమర్శకు లితివృత్తమును ఐదు భాగములుగానే విభజించియున్నారు—1. Initial incident; 2. Rising action or Growth or Complication; 3. Crisis or Climax or Turning point; 4. Falling action or Resolution or Denoument; 5. Catastrophe or conclusion. ఒక్కొక్కప్పుడు ప్రదర్శన ప్రారంభమందు కొంత వివరణము చేయబడనిచో ప్రేక్షకులకు కథ అర్థమగుటకష్టము. అట్టి వివరణమునకు సంబంధించిన భాగమును Introduction or Exposition అందురు. ఇది కొన్ని సంస్కృత నాటకములందు ప్రథమాంక ప్రారంభమందుండెడి విష్కంభతుల్యము. తక్కిన ఐదుభాగములును పంచకార్యావస్థలతో లేదా పంచసంధులతో సంవదించును.

పాశ్చాత్యుల ప్రతిరూపకమునందును ఏదియో ఒక సంఘర్షము (Conflict) ప్రాధాన్యము వహించుచుండును (సంస్కృత నాటకములందు దీనికి అంతటి ప్రాధాన్యములేదు). ఇతివృత్తమునందు సంఘర్షము అసలు లేకపోయినను, లేదా తక్కువగా ఉన్నను, ఆ రూపకమును పాశ్చాత్యులు ఉత్తమరూపకమునుగా పరిగణింపరు. ఈ సంఘర్షము మంచికిని మంచికిని మధ్య రావచ్చును; లేదా మంచికిని చెడుగునకును మధ్య రావచ్చును. అట్లే వ్యక్తులమధ్య, భావములమధ్య, ఆశయములమధ్య సంఘర్షము చెలరేగవచ్చును. గ్రీకు రూపకములందు వ్యక్తి జీవితమునకును, విధి లేదా దైవికశక్తికిని (fate) మధ్య సంఘర్షము ప్రాధాన్యము వహించినది (నేటి రూపకములందు ఆర్థిక సాంఘిక వ్యత్యాసముల మధ్య సంఘర్షము ప్రాధాన్యమును వహించుచున్నది; తత్ఫలముగా నాయకులును సామాన్యులగుచున్నారు). ఈ విధముగా సంఘర్షమే రూపకేతివృత్తమునకు వెన్నెముకయని పాశ్చాత్యుల అభిప్రాయము. ఈ సంఘర్షము ఎప్పుడు ప్రారంభించునో అప్పుడే అసలు ఇతివృత్తము (real plot) ప్రారంభమైనదన్నమాట; అంతకుముందున్న రూపకభాగమంతయును exposition అనబడు భాగము మాత్రమే. ఎప్పుడు ఈ సంఘర్షము అంతమగునో అప్పుడే అసలు ఇతివృత్తము సమాప్తమగును. ఈ రెండింటిమధ్యనున్న ఇతివృత్తమే పై విధముగా ఐదుభాగములుగా విభజింపబడును. ఈ యైదు భాగములందును ఒక క్రమము పూసలలోని దారమువలె అంతర్గతమై అను

స్యూతముగానుండును. ఈ క్రమమే 'డ్రమాటిక్‌లైన్' అని ఆంగ్లమందును, 'సంధి-సంధ్యంగ సంయోజన'మని సంస్కృతమునందును పేర్కొనబడినది.

పై పంచావస్థావిభాగమువలననే రూపకములను పంచాంకములుగా విభజించుట జరిగియున్నది. పంచాంకపరిమితి అనునది ఒకనాడు విశ్వవ్యాప్తమైన రూపకధర్మముగా పాటింపబడినదని చెప్పవచ్చును. షేక్స్పియర్ రూపకములు పంచాంకపరిమితములే. గ్రీకు విషాద రూపకములలో మొదట 'ప్రోలోగ్', తరువాత మూడు 'ఎపిసోడ్సు', అంతమున 'ఎక్సోడస్' అను భాగములుండెడివి—అనగా మొత్తముమీద ఐదుభాగములన్నమాటయే; ఇవి ఐదును సెనెకా రూపకములందు స్పష్టముగా ఐదు 'ఎపిసోడ్సు' అనబడినవి. ఈ పద్ధతియే ఆంగ్లదేశమందును పునరుజ్జీవన కాలమందలి రూపకములందును పాటింపబడెను. షేక్స్పియర్ నాటకములందుకూడ ఈ విభాగములు మొదట 'అంకము'లనుపేర వ్యవహృతములు కాలేదు: వానిని ఐదుభాగములు (parts) అనెడివారు. తరువాత అనగా మొదటి ఫోలియో కాలమున, ఈ విభజనము అంకములనెడిపేర ప్రచారములోనికి వచ్చెను. ఆధునికకాలములో ఈ పంచాంకపరిమితికి ప్రాధాన్యము పోయినది. నేడు ఇంచుమించుగా అందరును మూడు అంకములలోనే రూపకములను రచించుచున్నారు (కొందరంకములమాట తలపెట్టకయే రంగములుగా రచించుచున్నారు). అంకములసంఖ్య హెచ్చినను, లేదా తగ్గినను. 'డ్రమాటిక్‌లైన్' అనునదిమాత్రము ఉత్తమ రూపకములందన్నింటను ఉండుటతప్పదు[4]. ఇది ఆసాంతమును, కవికి స్మృతిపథము నందుండవలెను; లేనిచో రచనలో హెచ్చుతగులు సంభవించి, నిబిడబంధము చెడిపోవును. (ప్రతాపరుద్రీయము, కన్యాశుల్కము మొదలగువాని యందలిలోపమిట్టిదియే).

## పాత్రపోషణము :

అరిష్టాటిల్ మొత్తము రూపకమును ఆరు భాగములుగా విభజించెనని పేర్కొనియున్నాను—1. Plot (ఇతివృత్తము). 2. Character (పాత్రపోషణము); 3. Thought or Sentiment (భావములు). 4. Diction (శైలి); 5. Song (సంగీతము); 6. Spectacle (రంగాలంకరణాదులు-దృశ్యము లేదా సీనరీ). ఈ ఆరింటిలోను మొదటి మూడును రూపకమునకు ఆంతరములైన అంశములు; తరువాతి మూడును బాహిరములైన అంశములు—ఈ ఆరే రూపకగుణమును నిర్ణయించును. ఈ ఆరింటిలోను ప్రధానస్థానము ఇతివృత్తమున కీయబడినది. ఇంక రెండవస్థానము 'పాత్రపోషణము'న కీయబడెను[5]. చక్కగా సమకూర్చుకొన్న ఇతివృత్తమునందు నాయకుడు, నాయిక, తత్సహాయకులు, ఉపనాయకులు, ప్రతినాయకులు మొదలగువారు ప్రకృతులు. నానాశీలములుకల ఈ ప్రకృతులు తదనుగుణముగా వివిధమనోభావములుకలవారై యుందురు. ఈ ప్రకృతులను ఆసాంతమును చక్కగా తీర్చిదిద్దుటనే 'పాత్రపోషణము'(ప్రకృతిపోషణము = characterisation)అందురు. పాత్రపోషణ విషయములో కవి గుర్తుంచుకొనవలసిన అంశములను నాలుగింటిని అరిష్టాటిల్ పేర్కొనెను.

1. ఏ ప్రయోజనముకొఱకొక పాత్ర రూపకమున గ్రహింపబడినదో ఆప్రయోజనమున కనుగుణముగా వారి గుణశీలము లుండవలయును; 2. ఆ గుణశీలము లాపాత్రకు సహజము లైనను; అవి ఔచిత్యపరిధిని దాటినవి కారాదు; 3. అంతియేకాదు, ఆ గుణశీలములు లోక స్వభావమునకు భిన్నములుగా నుండరాదు; 4. ఒక పాత్రయొక్క మాటలలో, చేష్టలలో, నడవడికలో ఆసాంతమును ఏకసూత్రత కన్పట్టవలెను; అంతియేకాదు, అవి ఆవశ్యకము లును, సంభావ్యములును అయియుండవలెను.

ఇతివృత్తము నిబిడబంధముగానున్నచో పాత్రపోషణము సుకరమగును; కానిచక్కని పాత్రలనుసృష్టించుకొన్నంతమాత్రముననితివృత్తము నిబిడబంధము కలదగునని చెప్పజాలము. ఈ దృష్టితోనే అరిస్టాటిల్ పాత్రపోషణమునకు ద్వితీయస్థాన మొసంగియుండెను. ఈ సత్య మును గుర్తింపని కవి ఉత్తమరూపకనిర్మాణమున కృతకృత్యుడు కానేరడనుట అతిశయోక్తి కాజాలదు. కావ్యమున కవి తానుగా పాత్రలగుణశీలాదులను వ్యక్తముచేయుట కవకాశమున్నది. అట్టి అవకాశములేని రూపకరచనలో పాత్రపోషణవిషయమున కవి రెండు పద్ధతులనుమాత్రమే అవలంబింపవలసియున్నది— 1. ఒకపాత్ర గుణశీలములు ఆపాత్రయొక్క చేష్టలవలన, మాటలవలన, నడవడికవలన వ్యక్తముచేయుట; 2. లేదా ఇతరపాత్రల ప్రాసంగిక సంభా షణములవలన వ్యక్తముచేయుట. ఈ రెండుపద్ధతులలో మొదటిది ఉత్తమము; అందున, చేష్టలలో వ్యక్తముచేయుట ఉత్తమోత్తమము.

## రసపోషణము :

ఇతివృత్తనిర్మాణము, పాత్రపోషణము అనెడి రెండంశములందును ప్రాచ్య-పాశ్చా త్యుల దృష్టి సమానమే. అయినను, ప్రధానభేద మొకటికలదు—పాశ్చాత్యుల రూపకములందు కన్పట్టునంతటి action[6] (చలనము = కథాగమనమందలి వేగము) సంస్కృతనాటకములందు కన్పట్టదు. ఇందులకు ముఖ్యకారణములు— 1. సంఘర్షమునకు పాశ్చాత్యులొసంగునంతటి ప్రాధాన్యమును భారతీయు లొసంగకపోవుట; 2. అంకమునంతటిని పాశ్చాత్యులు పెక్కు రంగములుగా విభజింపుచుండ భారతీయులు అంకమునంతటిని ఒకేరంగముగా చేసియుండుట; 3. పాశ్చాత్యులకు భావవ్యక్తీకరణమే ప్రధానముకాగా, భారతీయులకు రసదృష్టిధ్యేయ మగుట.

పై కారణములు మూడింటిలోను మొదటిదానినిగూర్చి ఇంతకుముందే వివరించి యున్నాను. పాశ్చాత్యులు అంకమును రంగములుగా విభజించుకొనుటచేత ఎక్కువ వివరము లను రంగమునందు ప్రదర్శించుట కవకాశముకలుగుచున్నది. అట్టి అవకాశము లేకపోవుటచేత భారతీయులు వర్ణనలను, సంభాషణలను పరిగ్రహించియున్నారు. దీనివలన కథ 'తాపీ'గా జరుగుట కవకాశ మేర్పడుచున్నది. పాశ్చాత్యులకు సంఘర్షమే ప్రధానమగుటచేత కల్లోల పరిస్థితులలోనే రూపకము నధికభాగము నడిపింతురు. భారతీయులదృష్టిలో సంఘర్షము తాత్కాలికము. ఉత్తరరామచరితలోని 'సీతాపరిత్యాగ' ఘట్టముతో తుల్యమైన సంఘర్షణప్రధాన

ఘట్ట మింకొకటి యుండజాలదు. అయినను నాటకకర్త దానిని ప్రధానముగా స్వీకరింపలేదు; తత్ఫలితమునే ఆత డధికముగా నిరూపించెను. కావుననే తరువాతి అంకములో రాలుసైతము కరగునట్లుగా పుటపాకప్రతీకాశమైన రామశోకమును చిత్రించియున్నాడు (ఇట్లు చేయుటవలన కథాగమనవేగము మందగించుట తప్పదు).

భారతీయు లిట్లేల చేసిరను ప్రశ్న కలుగవచ్చును. మానవునిలోని పాశవికప్రవృత్తిని రెకొ్కల్పి తచ్ఛాంతిని కల్గించుట, కల్లోల పరిస్థితిని కల్పించి తత్పరిష్కారమును చేయుట అనునవి పాశ్చాత్య నాటకకర్తల ధ్యేయములని స్థూలముగా చెప్పవచ్చును. వారి నాయకులకు కూడ సాధింపవలసిన ఫలమొకటి తప్పక ఉండును. కాని అది విధిగా పురుషార్థమని చెప్ప జాలము—రక్తపాతమొనర్చి అధర్మమార్గమున రాజ్యమును సంపాదించెడి యత్నము, పగ దీర్చుకొనుట, అనుమానముతో ఆత్మవినాశమును తెచ్చిపెట్టికొనుట మొదలగువానిని మనవారు పురుషార్థసాధనములనుగా గ్రహింపలేదు. భారతీయుల 'నాటక' నాయకులు త్రిపురుషార్థసాధకులు; మరియు లోకకళ్యాణముకొరకు స్వార్థత్యాగ మొనర్చి, మానవాళికి మార్గదర్శకులుగా నుండగలవారు. కావుననేవారిలో 'లోపము' (tragic flaw) చిత్రితముకాదు. ఎంతటిఉన్నతుడైనను, స్వీయదోషోపహతుడై, పాశ్చాత్య 'నాటక' నాయకుడు వినాశమొందుట ఎట్లు సంభావ్యమో అట్లే కళంకరహితుడై, ఉన్నతాశయ సిద్ధికొరకు ప్రయత్నించెడి భారతీయ "నాటక" నాయకుడు విధిగా జయమొందుటయును సంభావ్యమే (అందుచేతనే సంస్కృత నాటకములందు విషాద రూపకములకు తావులేకపోయినది; కాని భారతీయ నాటకములందలి ప్రతినాయకులు పాశ్చాత్య విషాదనాయకులవంటివారగుట గమనింపదగును), అట్టి నాయకునితోనే సహృదయ ప్రేక్షకులకు తాదాత్మ్యము కలిగి, రసానుభూతిచేకూరును. అట్టి నాయకులు కల్లోల పరిస్థితులందును ప్రశాంతచిత్తతను విడనాడరు; అట్టి ధర్మమే సంస్కృతనాటకములందును కన్పట్టును. ఇట్టి నాటకములను పాశ్చాత్యులూహింపనేలేదనుట నిర్వివాదము.

ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసియున్నది. 'Action' ప్రధానమైన సంస్కృత 'నాటకములు' లేనేలేవని తలంపరాదు; అట్టివికూడ కొన్ని కలవు, అట్టి నాటకములకు 'ముద్రారాక్షసము' ప్రథమోదాహరణము. ఇంక ప్రకరణాదులందధికముగా అట్టివి కన్పట్టగలవు. అట్టివానికి 'మృచ్ఛకటికము' ప్రథమోదాహరణము. ఈ మృచ్ఛకటికము action ప్రధానమైన రూపకమనియు, అదియొక అపూర్వసృష్టియనియు, అట్టిది పాశ్చాత్యదేశములందుకూడ కన్పట్టదనియు విజ్ఞుల ప్రశంసలకు పాత్రమైన ఉత్తమరూపకము. పేరుపెట్టి ప్రత్యేకముగా నిర్దేశింపబడకపోయినను ఇందు ప్రతి అంకమునందును రంగములు కన్పట్టగలవు. Action అధికముగా కన్పట్టుటకిది దోహదకారియైనదని చెప్పుట అసమంజసము కాజాలదు.

రూపకప్రయోజన మానందమని ప్రాచ్య-పాశ్చాత్యులిరువురును అంగీకరించిన విషయమే. కాని తత్సాధన విషయమునమాత్రము వారు భిన్నమార్గములను ద్రొక్కిరి. పాశ్చాత్యులకు విషాదరూపకము ఎట్లు ఉత్తమసృష్టియో భారతీయులకు 'నాటక' మట్లుత్తమమైనది. ఆనందము అఖండస్వరూపమైనప్పటికిని, మార్గములు భిన్నములగుటచేత ఈ రెండింటి

వలనను కలిగెడి ఆనందములోకూడ భేదములున్నవని చెప్పకతప్పదు—విషాదరూపక నాయకునితో సహృదయ ప్రేక్షకునకు తాదాత్మ్యసిద్ధి కలుగదు. కాన ఆతడు తన్నుదాను మరచి బ్రహ్మానంద సబ్రహ్మచారియైన ఆనందానుభూతినిపొందుట కవకాశములేదు. అనగా 'ఎంతటివానికెంతటి గతి పట్టిన'దనెడి సానుభూతి వాని యంతరంగమును వీడదు. ఇంక కళకు సహజమైన ఆనందానుభూతిని మాత్రమే ఆతడు పొందును. భారతీయులవలె సమగ్రరసస్వరూపమును పాశ్చాత్యు లూహింపలేకపోవుట కిదియే హేతువు[7].

## ధర్మప్రతిపాదనము :

కథ యేనాటిదైనను, కవికాలమునాటి పరిస్థితులు కొన్ని కథాంశములతో మిశ్రితములై రచనలో చేరిపోవుచుండును. అట్లే కథకు మానవజీవితముపైగల దృక్పథముకూడ సందేశరూపమున రచనలో అంతర్వాహినిగా చొచ్చుకొనియుండును. అదికాని, ఇదికాని అన్నింటను విధిగా ఉండితీరవలెననెడి నియమములేదు; కాని ఉండుట సర్వసాధారణము, ఈ ఉండుటయు ఇతివృత్త స్వభావముపై కొంత ఆధారపడియుండును. పాత్రపోషణలోని నైశిత్యమును, కవి కాలమునాటి పరిస్థితులను, కవి ప్రతిపాదించెడి సందేశమును, రసపోషణ వైశిష్ట్యమును నిరూపింపవలసినవాడు విమర్శకుడు. కవి హృదయపు లోతులను కనుగొన గలిగినప్పుడే ఆతడీపని చేయగలడు. తక్కినవానిమాట యెట్లున్నను, కవి యొసంగెడి సందేశమును, అనగా కవిచేసెడి ధర్మ ప్రతిపాదనమును గ్రహించుట చాలకష్టము. పాత్రవశమున అయా సన్నివేశములబలమున రూపకమందు అనేకవిషయములు ప్రతిపాదితములగుచుండును, అంతమాత్రమున అవియెల్ల కవి హృదయమునకు తార్కాణములేయని భ్రమింపరాదు. (ఈ భ్రమవలననే ఒకే కవినిగూర్చి పలువురు పలువిధముల వ్యాఖ్యానించుట జరుగును).

ఇంకొక విషయముకూడ ఇక్కడ గ్రహింపవలసియున్నది. కవిచే ప్రతిపాదితమగు ఈ ధర్మసందేశము పారలౌకికమైనదికాదు; అది ఇహమునకు సంబంధించినదిగానే యుండును. (ప్రాచీనులు రూపకమును త్రివర్గఫలసాధనమేయనుట స్మరణార్హము). అందుచేతనే దానిని 'కవికి మానవజీవితముపైగల దృక్పథము' అని పేర్కొనుట. మానవజీవితమునుగూర్చి వివిధకవులకు వివిధాభిప్రాయములుండుట సంభావ్యము; ఆ కారణమువలననే ఒకేకథ, కవుల నిర్వహణములలో' పలువిధములుగా చిత్రింపబడుట జరుగును.

మరియు, ఈ ధర్మప్రతిపాదనమును 'నీతిబోధ'తో జమకట్టుట కూడదు. 'కళ కళ కొరకే' అనెడి వాదమున నీతిబోధకు స్థానమేలేదు. కాని అందుకూడ 'లోకమునుగూర్చి కవి దృష్టియేమి'? అనెడి విషయమునకు మాత్రము స్థానమున్నది. తాను విశ్వసించిన ధర్మమునే కవి ప్రతిపాదించుట న్యాయ్యము. ఆ ధర్మముపై వానికిగల అభినివేశమునుబట్టియే వాని రచనకు జిగివచ్చును. ఆతడు ప్రతిపాదించిన ధర్మము సర్వజనాంగీకారమును పొందవలయునన్న నియమములేదు; కాని సార్వజనీనములును, సార్వకాలికములును అయిన వేదాకాగలిగిన ధర్మములను ప్రతిపాదించిన రచనలే ఉత్తమములుగా నేటికిని పరిగణింపబడుచున్నవని తెలియవలెను.

ఇట్టి కట్టుదిట్టములతో రచన సాగినప్పుడే అది ఉత్తమరూపకము కాగలదు. నిర్మాణ శిల్పమున పరిణతబుద్ధియైనవానికే అది సాధ్యము. అందుచేతనే ప్రాచీనులు "నాటకాంతంహి సాహిత్యమ్" అని పేర్కొనియున్నారు. మనలో ప్రతిభాశాలురైన నాటకరచయితలు చాలమంది కలరు. కాని వ్యుత్పత్తి లోపముచేతను, సంప్రదాయాభిజ్ఞతచేతను, శ్రద్ధాలోపముచేతను పలువు రుత్తమరూపకములను వెలయింపలేకున్నారు.

ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గ్రహింపవలసియున్నది. పైన చెప్పినవన్నియును ఉత్తమరూపకభేదములైన నాటక-ప్రకరణములకు విధిగా వర్తించును. తక్కిన చిన్న రూపకములందు యథావకాశముగా వర్తించును.

## ధర్మి

నాట్య మొకప్రక్క లోకస్వభావమున కనుకరణమగుచునే ఇంకొకప్రక్క అభినయముల వలన లోకస్వభావమునకు భిన్నమగుచున్నదని గుర్తించియున్నాము. నాట్యము లోకస్వభావమున కనుకరణము లేదా సన్నిహితము అయినప్పుడు ఆ ధర్మమును నాట్యపరిభాషలో 'లోకధర్మి' అందురు; మరి లోకస్వభావమునకు భిన్నముగానున్నప్పుడు ఆ ధర్మమును 'నాట్యధర్మి' అందురు. ఇవి రెండును, పరస్పరవిరుద్ధములుగా పైకి గోచరించుచున్నను, నాట్యమందు మాత్రము చక్కని సమ్మేళనమునుపొంది ఉత్తమనాట్యసృష్టికి హేతువులగుచున్నవి. నాట్యము లోకానుసారిగానుండుట ఎంత ముఖ్యమో, నాట్యలక్షణలక్షితమగుటయు అంతియే ముఖ్యము. కేవలము లోకధర్మియే ప్రాధాన్యము వహించి నాట్యము లోకానుసారిగా నుండవలెనన్నచో అది యింక మన దైనందినవ్యవహారరూపము—అనగా రాకపోకలు, ఇష్టాగోష్ఠులు, కాలకృత్యములు, ఉద్యోగ నిర్వహణములు, సాంఘిక మర్యాదలు మొదలగువానితో కూడినది మాత్రమే అయిపోవును; అప్పుడు నాట్యములోని విశిష్టతయే నశించును. కావున లోకధర్మి సర్వాధికారమును వహించి నాట్యమును పేలవము చేయరాదు. అట్లే నాట్యధర్మియును సర్వాధికారమునువహించి, నాట్యమును లోకమునకు కేవలము భిన్నమైన ఊహాప్రపంచములో నిలబెట్టరాదు.

ధర్మి, ధర్మము, స్వభావము అనునవి పర్యాయపదములు. ద్వివిధమైన యీ నాట్యధర్మము రచనయందేకాక అభినయమందును ప్రాధాన్యమును వహించుచున్నది. కాగా రచనాసమయములో కవులును, ప్రయోగసమయములో నటులును ఈ ధర్మముల హద్దులను గుర్తెరింగి తమతమ రచనలను, అభినయములను నిర్వహింపవలసియున్నది.

### లోకధర్మి[1] :

"నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితం" అనుచు భరతముని 22, 23, 24, 26, 35 అధ్యాయములలో ప్రకృతివివేచనమును అత్యద్భుతముగా చేసియుండెను. లోకములోని మనుష్యులవలెనే రూపకములలోని ప్రకృతుల శీలములును అనేక విధములుగా నుండ

వలయును. అట్లు వివిధములైన శీలములను లోకస్వభావానుగుణముగా చిత్రించుటయే నాట్యమునకు జీవము. ఒక్కొక్క దేశమందు ఒక్కొక్క విధముగా వేష-భాషా-ఆచార (లోక-శాస్త్ర వ్యవహారము)- వార్తలు (కృషి-పాశుపాల్యాది జీవికలు) ప్రసిద్ధములై యుండును. ఏదేశస్థుడు ఏ వయస్సులో, ఏ అవస్థలో, ఏవిధముగా వేషముధరించునో, మాటాడునో, నడచునో, కూర్చుండునో, శయనించునో భరతుడు విపులముగా వివరించియుండెను (6, 7, 8, 9, 12, 13, 17, 21 అధ్యాయములలో). ఇంత వివరించియు "లోకమునందలి స్థావర-జంగమముల భావ-చేష్టావిధిని శాస్త్రముచేత నిర్ణయించుటకు శక్యముకాదు. కావున, నేనిచ్చటచెప్పక విడిచినవాని నెల్ల లోకమునుండి గ్రహింపవలెను. నాట్యమునకు లోకమే ప్రమాణము" అని స్పష్టము చేసి యుండుట మరచిపోరాదు.

కావున లోకశాస్త్ర పరిశీలనాదక్షుడైన కవియే రూపకమును నిర్మింపవలసియున్నది. నాట్యమున సగపాలు రూపకరచన; ఇది కవిపని. ఇంక తక్కినసగపాలు ప్రయోగము; దీనిని నటులు నిర్వహింతురు. కాగా, కవివలెనే నటులును, ముఖ్యముగా దర్శకులును, లోక-శాస్త్ర పరిశీలనాదక్షులు కావలసియున్నది. నటుడువేసిన వేషము, నడిచెడితీరు, ఆడెడిమాట, చూచెడి చూపు, వ్యక్తముచేసెడిభావము రూపకగతపాత్రకు అర్హమైనదిగానుండవలెను. మరియు వయస్సునకు, ఆకారమునకు, గుణమునకు తగినట్లుగా స్త్రీలు స్త్రీ భూమికలను, పురుషులు పురుషభూమికలను ధరించినప్పుడే అది 'లోకధర్మి' కాగలదు; అదియే ఉత్తమపద్ధతి. దీనిని గూర్చి మరల ప్రసంగింతును.

**నాట్యధర్మి :**

నాట్యమెంత లోకసన్నిహితమని చెప్పినప్పటికిని, రచయితకు కొన్ని విధినిషేధము లున్నవనెడి విషయమును విస్మరింపరాదు. నాటకరచయితకున్నది సుమారు మూడుగంటల కాలము. అందుచేత సంక్షిప్తత వానిరచనకు జీవము. రూపకము ప్రదర్శనప్రధానమైనదికాన ప్రయోగసౌలభ్యమును గుర్తుంచుకొనవలెను. నిర్మాణశిల్పములోని క్లేశము నిదివరకే వివరించి యున్నాను. ఇంక నటులు ఎంతసేపు తిరిగినను ఎన్నిదేశములు తిరిగినను, ఒక చిన్న రంగస్థలముమీదనే. నాలుగుగోడలమధ్య జరిగెడి విషయములనుకూడ బహిరంగముగనే ప్రదర్శింపవలసియున్నది. చిమ్మచీకటిలో జరిగెడిదానినికూడ అంతయో ఇంతయో వెలుతురులోనే ప్రదర్శింపవలెను. తనలోతాను గొణుగుకొనుదానినికూడ నాటకశాలలోని చివరిప్రేక్షకునకుకూడ వినబడునట్లు బిగ్గరగా పైకి అనవలయును—ఇట్టివియే ఇంకను పెక్కు ఇబ్బందులు కలవు. ఈ ఇబ్బందుల నధిగమించుటకొరకు రచయితయును, నటులును కొన్ని నియమములను, సంకేతములను ఏర్పాటు చేసికొనవలసివచ్చినది. ఆ నియమముల, ఆ సంకేతముల సమన్వయ రూపమే నాట్య పరిభాషలో 'నాట్యధర్మి' అనబడినది.

లోకమునందు సవిలాసముగా నడచెడివారిని, భావావేశముతో మాటాడెడివారిని "ఇది నాటకమనుకొంటున్నావా ?" అని అనుట పరిపాటియే. నాట్యము కళాప్రపంచమునకు సంబంధించినదికాన అందలి ఆంగికవిన్యాసములు, భాషణములు లోకమునందుకంటె భిన్నములుగా,

ఉదాత్తములుగా నుండుట నాట్యధర్మిలో ప్రథమాంశము. భావోత్తేజనము మరింత అధికముగా నున్నపుడు అది పద్యములో వ్యక్తమగుచుండును. రంజనార్థము, భావోద్దీపనార్థము, నేపథ్యము నుండి పాత్రల మనోభావములను వ్యక్తముచేయుటకు ధ్రువాగానము అనగా పాటలు స్వీకృతములైనవి. ఈ విధముగా నాట్యమున సంగీతము స్వీకృతమగుట నాట్యధర్మిలో ద్వితీయాంశము.

ప్రయోగసౌలభ్యముకొరకు అమూర్తపదార్థములును, జడపదార్థములును మానవ స్వరూపమును తాల్చినట్లును, పశుపక్ష్యాదులు మానవభాషలో మాటాడినట్లును కవి కల్పించును. నటులుకూడ నట్లే ప్రదర్శింతురు (రెండవపద్ధతిని ఆధునికాలములో పునరుజ్జీవింపజేసినవాడు మారిస్ మేతర్‌లింకు. విశ్వనాథవారు తమ 'అనార్కలీ'లో వానినను సరించియున్నారు). ఇదియును నాట్యధర్మియే.

సౌలభ్యార్థము రచనలో కవి జనాంతికములను, అపవారితకములను; స్వగతములను గ్రహించుటయు, నటులు ప్రదర్శించుటయుకూడ నాట్యధర్మియే.

సమర్థులు, అర్హులు అయిననటులు లభింపనప్పుడు అంతయో, ఇంతయో ఆను రూప్యముగల పురుషులు స్త్రీ వేషములను, స్త్రీలు పురుషవేషములను ధరించుట తప్పనిసరియగును, అట్లే ఒక్కరే ఒకేనాటకములో ఒకటికిమించిన వేషములను ధరించుటకూడ జరుగుచుండును. ఈ రెండు పద్ధతులును నాట్యధర్మికి చెందినవియే.

నాట్యములో ఆంగికాభినయమునకు, ముఖ్యముగా హస్తాభినయమునకు ప్రాముఖ్యము కలుగుట నాట్యధర్మియే. ఈ హస్తాభినయము ప్రధానముగా రెండు ప్రాతిపదికలపై కల్పితమైనది. మొదటిది— వాస్తవముగా లోకములో జనులు నిత్యకృత్యములలో చూపెడి హస్త విన్యాసములు (మెడబట్టి గెంటుటకు 'అర్ధచంద్రప్రయోగము' చేయుదురు; శాస్త్రములలో చెప్పబడిన అర్ధచంద్రహస్తప్రయోజనములలో నిదియొక ప్రయోజనము). ఇంక రెండవది— రూపసాదృశ్యము ననుసరించి అనగా వస్తువుయొక్క రూపము జ్ఞప్తికి వచ్చునట్లుగా అంగుళీ విన్యాస మొనర్చుట; ఆ విధముగా నాట్యార్థములను ప్రేక్షకులకు బోధపర్చుట. ఇవి ఆయా సందర్భములందు ఔచిత్యమునుబట్టి ప్రయుక్తములగుచుండును.

రంగస్థలమునకు సంబంధించిన కక్ష్యావిభాగమంతయును నాట్యధర్మియే. దీని సాహాయ్యమున పదునాలుగు లోకములను ఒక చిన్ని రంగస్థలమునందే చూపించుటకు సాధ్యమగుచున్నది.

పై వివరములను పరిశీలించినప్పుడు లోకధర్మికిని, నాట్యధర్మికిని నాట్యములో సమప్రాధాన్యము కలదని స్పష్టమగుచున్నది. ఈ రెండింటిలో లోకధర్మి మూలభూతమగుటవలన అది 'భిత్తి' వంటిదనియు, దానిమీది చిత్రమే నాట్యధర్మి అనియు అభినవగుప్తుడు చక్కని వ్యాఖ్యానమొనర్చుట స్మరణార్హము. ఉత్తమనాట్యప్రదర్శనము ఈ రెండింటి సమన్వయము వలననే సిద్ధించునని మహర్షి క్రిందిశ్లోకములో స్పష్టము చేసియుండెను—

"వయోఽనురూపః ప్రథమస్తువేషః వేషానురూపశ్చ గతిప్రచారః
గతిప్రచారానుగతంచపాఠ్యం పాఠ్యానురూపోఽభినయశ్చకార్యః".

ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గమనింపవలసియున్నది. నృత్య-నాట్యములు రెండింటిలో నృత్యము కేవలము నాట్యధర్మీమయము; దానితో పోల్చినప్పుడు నాట్యము లోకధర్మికి సన్నిహితముకాగలదు. ఇంక నాట్యములోని నాటకప్రకరణములను రెండింటిని పోల్చి చూచినప్పుడు నాటకము నాట్యధర్మిబాహుళ్యము కలదై ఒప్పుచుండుట గుర్తింపగలము. ప్రకరణమునందు రెండింటికిని సమప్రాధాన్యము కలదు. ఇంక పద్యనాటికలు, గేయనాటికలు నాట్యధర్మికి సన్నిహితములుకాగా నేటి సాంఘికప్రహసనములు, రేడియో నాటికలు మొదలగునవి లోకధర్మికి సన్నిహితములగుచున్నవి. ఈ విధముగా కొన్ని రూపకములందు నాట్యధర్మికి ఎక్కువ ప్రాధాన్యమును, మరికొన్ని రూపకములందు లోకధర్మికి ఎక్కువ ప్రాధాన్యమును, తక్కినవానియందు రెండింటికిని సమప్రాధాన్యమును కలవని తెలియవలెను.

## స్వభావవాదము :

ప్రథమభాగమందలి ప్రథమాధ్యాయములో 'సీనరీ' అనెడి శీర్షికక్రింద 'కక్ష్యావిభాగము'నుగూర్చి వివరించియున్నాను. నాట్యము సర్వలోకానుకరణమును, సర్వభావానుకరణమును అగుటచేత ఒకే కథ వీథిలో, ప్రాసాదములో, అడవిలో, పర్వతముమీద, సముద్రమధ్యమున, ఆకాశములో, పాతాళములో, ఇంకను ఎచ్చటనైనను జరుగవచ్చును. వీనిని రంగస్థలముమీద ప్రత్యక్షముగా చూపింపవలసిన అవసరములేదు. ఇవియెల్ల రంగస్థలమును కక్ష్యలుగా విభజించుకొనుటచేత నిర్దేశింపబడును. ఇందు బాహ్య-మధ్యమ-ఆభ్యంతరములనెడి భేదములను, దూర - సన్నిహితములనెడి భేదములనుకూడ కల్పించుకొనవలయును.

ఈ కక్ష్యావిభాగము క్లిష్టతరము కాకుండుటకై భారతీయులు అంకమునందు రంగవిభజనముమాని స్థలైక్యమును పాటించినారు. కొంతవరకు తత్తన్నిర్దేశము ప్రసంగవశమున చేయబడెడి వర్ణనలలో, పాత్రల సంభాషణలలో, ధ్రువాగానములో జరుగుచుండును. ఇంక తక్కినదానిని నటులు అభినయముల మూలమున సూచించుచుందురు. మరియు వారి ప్రవేశ-నిష్క్రమణములు నియమబద్ధములుగా జరుగుచుండును. ఒకవ్యక్తి అంతకుముందున్న ఒక కక్ష్యనుండి కదలి ఈవలకు వచ్చినచో అతడింకొక కక్ష్యలోనికి వచ్చినట్లుగా ప్రేక్షకులూహింపవలెను. ఈ కక్ష్యలు ఖచ్చితములైన హద్దులులేనివై, ఊహామాత్రములేయగుటచేత ఇందు ప్రేక్షకుల ఆలోచనకూడ కొంత పనిచేయవలసియుండును. కొంత కవి నిర్దేశించును; మరికొంత నటుడు సూచించును; తక్కినది ప్రేక్షకులచే నూహింపబడవలెను, కాగా నాట్యప్రదర్శనము 'వడ్డించిన విస్తరి' వంటిదికాదని తెలియవలెను. భారతీయులు ప్రేక్షకుల ఆలోచనాశక్తిమీద విశ్వాసముంచి, నాట్యధర్మి సాహాయ్యముతో చక్కని ప్రదర్శనముల నొసంగియున్నారు.

పాశ్చాత్యసంస్కృతీ సంపర్కమువలన ఇప్పుడు అనేక 'మతములు' (isms) ప్రచారములోనికి వచ్చినవి, వానిలో 'రియలిజమ్', 'నాచురలిజమ్', 'సింబాలిజమ్' అనునవి ప్రధానములు. 'రియలిజమ్' అనగా స్వభావవాదము; ఇది లోకధర్మియే. నాట్యమున దీనికే సంపూర్ణముగా ప్రాధాన్య మొసంగినవాడు ఇబ్సెన్ (19 వ శతాబ్ది రెండవభాగము). కథలో,

సంవాదములో, సీనరీలో, నటనలో వాస్తవికతకు సన్నిహితత్వమును తెచ్చిపెట్టినవాడీతడే. ఇట్టి క్రొత్త నాటకమును ప్రదర్శించుటకు తగిన నటులను నాటి కవులు వలవేసి పట్టుకొనవలసి వచ్చెడిదట. స్వభావవాదము మితిమీరి 19 వ శతాబ్ది చివరిభాగములో 'యథార్థతావాదము' (Naturalism) బయలుదేరినది. స్వభావవాదము సంభావ్యతకు కొంతలోకొంత స్థాన మిచ్చు చుండగా ఈ యథార్థతావాద మట్టిదాని నేమాత్ర మంగీకరింపదు. లోకవ్యవహారమును ఉన్న దాని నున్నట్లుగా ప్రదర్శింపవలెనని ఈవాద సారాంశము. పాత్రలను ప్రేక్షకులమధ్య కూర్చుండ బెట్టుట, ప్రేక్షకులతో సూటిగా మాటాడించుట మొదలగునవి ఇందలి కొన్ని విశేషములు. లోకధర్మి ఇందు మితిమీరినదన్నమాట. భారతీయుల దృష్టిలో ఈవాదము నిర్వీర్యమైనది; అంతియేకాదు కొందరు పాశ్చాత్యుల దృష్టిలోకూడ ఈ వాదము నిర్వీర్యమైనదే. ఇప్పట్ల గొథే (Goethe) వాక్యములు పరిశీలనార్హములు—

"It is only to the entirely uncultured spectator that a work of art can appear as awork of nature...It is the uncultured lover of art who demands that the work should be natural, so that he too may be enabled to enjoy it in a natural, yet often crude and vulgar way...Spectators are of two types-the cultured and the amateur; the former enjoys a piece of art on grounds of 'its own laws' and according to its own properties, while the latter demands things on the stage to be natural" (Criticisms, Maxims and Reflections-Scot library edition).

ఇంక 'ప్రతీకవాదము' (Symbolism) అనుదానిని యథార్థతావాదమునకు వ్యతిరేకముగా ప్రచారములోనికి తెచ్చినవాడు మారిస్ మేతర్‌లింకు. ఆతడు సృష్టించిన పాత్రలకు ప్రత్యేకించి వ్యక్తిత్వముండదు. అవి వాని అంతరజీవితమునకు సంబంధించిన ప్రతీకలు మాత్రమే. చైనీయుల నాటకరంగమందుకూడ ఈ ప్రతీకవాదమునకు ప్రాముఖ్య మధికము. ఒక విధముగా ఆలోచించినచో, అసలు నాట్యము పుట్టినప్పుడే ఈ వాదము పుట్టినదని చెప్పవచ్చును. రంగస్థలమున ఒక ఉన్నతాసనమును, పది కుర్చీలనుపెట్టి అదియే దర్బారు అనుట, ఒక గుడారమును చూపెట్టి అదియే యుద్ధభూమి అనుట మొదలగునవి ఈ వాదమునకు సంబంధించినవే. ఇవి యన్నియును నాట్యధర్మిలోని యంశములే.

ఎవరెన్ని వాదములను లేవనెత్తినప్పటికిని నాటకప్రదర్శనము లోకతుల్యమెన్నటికిని కాజాలదనియు, అయినచో అది కళయే కాజాలదనియు మరువరాదు. ఈ సత్యము రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి క్రిందివాక్యములలో మరింత స్పష్టము కాగలదు—"...నాట్య మొక్కటియేకాదు, కళాసామాన్యపు మూలవస్తువును అనుకరణమే. ఉండునది, ఉండవచ్చునట్టిది, ఉండవలయునట్టిదియునగు వస్తువును ప్రదర్శించుటతోడనే కళలన్నియును మొదలుపెట్టును. కాని సంపూర్ణముగా ఏవస్తువునైనను అనుకరించుట యసాధ్యము. ఒక మల్లిపూవును కాగితము వస్త్రము మొదలగువానిని కత్తిరించి చేయవచ్చును. లోహములతో పోతపోయవచ్చును. మ్రాను దంతము మొదలగువానిని చెక్కి చేయవచ్చును. పటముపై వన్నెతో వ్రాయవచ్చును.

వేళ్ళుముడిచి చూపవచ్చును. దానిపై పద్యమువ్రాసి వర్ణింపవచ్చును. కాని యిన్నిటిలో దేని యందుగాని తుద కన్నియును కలిపి చూచినగాని నిజమైన మల్లిపువ్వునందలి వన్నె, స్పర్శము, కొలత, సుగంధము, రూపము మొదలగు సర్వాంగములును మనమనుకరించినట్లగునా? రంగస్థలముమీద ఒక డొకనిని పొడిచిచంపు సన్నివేశము వచ్చినప్పుడు నిజముగా పొడిచి చంపిననే తప్ప వాడు చంపినట్లగునా, వీడు చచ్చినట్లగునా? ఇట్లు అసాధ్యము, అనర్థదాయకమును అగుట యట్లుండగా సంపూర్ణానుకరణము కళపని కనావశ్యకముగూడ........" (నాటకోపన్యాసములు—పుట 14-15).

## నటుడు : రసానుభూతి :

కావ్యనిర్మాణసమయములో కవి ప్రకృతుల సుఖ-దుఃఖములను భావించి తాను అనుభవించును. ఆ అనుభవమునే అక్షరరూపమును పొందించును. దానినే నటుడు భావించి, అనుభవించి, అభినయము మూలమున ప్రదర్శించును. దానినే ప్రేక్షకులు చూచి, భావించి అనుభవింతురు. ఇట్లు కవియును, నటుడును, ప్రేక్షకుడును, సమానానుభవము కలవారగుచున్నారని అభినవగుప్తుని గురువగు భట్టతోతుడును, అరిస్టాటిల్ గురువగు ప్లేటోయును స్పష్టము చేసియున్నారు. ఈ ముప్వురును పరగతసుఖదుఃఖములను తమవిగా భావించుటకు కారణభూతమైనదానిని 'సత్త్వము' అందురు. దానివలననే వారికి ఏకాగ్రత సిద్ధించును. నటుని సాత్త్వికాభినయమునుగూర్చి ప్రథమాధ్యాయములో కొంత వివరించియున్నాను. నటులు రామాదుల ఆకార-కరణ-స్వభావములను పూర్తిగా తమయందారోపించుకొని, రామాదులుగా రూపాంతరమంది, వారి సుఖదుఃఖములను నిజముగా తామే అనుభవించుచున్నట్లు కన్పట్టుచు ప్రేక్షకులను తన్మయత్వము నొందింతురు. అయినచో ప్రేక్షకులవలె నటులుకూడ తన్మయులై రసానుభూతి పొందుదురా! అనెడిప్రశ్న జనించుచున్నది.

అభినయసమయములో నటుడు తన్మయుడు లేదా పరవశుడు అయినట్లు కన్పట్టవలయునేకాని నిజముగా కారాదని శాస్త్రకారుల యభిప్రాయము[2]. పరవశుడైనచో అభినయము సాగదు; కావున నటబుద్ధి వానికి అంతర్గతముగా ఉండక తప్పదు (సామాజికులకు మాత్రము నటునియందు నటబుద్ధి నశించి నిజముగా 'రాముడే' అనెడిబుద్ధి కలుగవలెను). అది ఉన్నప్పుడే అతడు రంగస్థలమర్యాదలను పాటింపగలడు[3]; మరి అట్లు రెండు విధములుగా అతడెట్లు ప్రవర్తింపగలడన్నచో "శిక్షా-అభ్యాసపాటవముచే సాధించిన సత్త్వబలముచేత" అని చెప్పవలసియున్నది.

ఆధునికులలో కొందరీవిషయమున కొంత భిన్నాభిప్రాయములు కలిగియున్నారు. ఈ విషయమున మనవారిలో ముఖ్యముగా పేర్కొనదగినవారు బళ్లారి రాఘవాచార్యులుగారు. రామాదుల సారూప్యమును సాధించుటకంటె రామాదులుగానే రంగస్థలముమీద జీవించుట ప్రధానమని వారి యాశయము. అంతియేకాదు "నాటకములో జీవితాంశములన్నియు 'కొండ యద్దమందు కొంచమై' దోచినట్లు కాలనియమమున క్లుప్తముగ చిక్కగ కూర్పబడియున్న

వనియు నటుడు నాటకప్రయోగకాలము మూడుగంటలుకాక తన యావజ్జీవపరిణామమున నూహించియు, రంగస్థలమును రంగస్థలముగగాక తా సంచరించిన విశాలప్రపంచముగ భావించియు. పాత్ర జీవించిన జీవితమునెల్ల ననుభవించుచు, రససమాధినొంది, యభినయింప వలెనని వారి యభిప్రాయము...కాగా పాత్రముయొక్క కాలము, పరిస్థితులు, శారీరక, మానసిక లక్షణములు అంతలోతుగ నేర్పరచనవసరములేదనియు, కథలోజేరినపాత్ర జీవితాంశమును టూకీగా నెరిగి అట్టి జీవితమునే నటుడూహించి ఆ యవస్థలలో తాను జీవించునప్పుడు తన భావానుభవములేగతి నడచునో, తనకెట్టి రసోదయ మేర్పడునో దానినే అభినయింపవలెననియు తేలుచున్నది".... అందుచేతనే వారు తమనిత్యస్వభావమున కనురూపమయిన వేషములనే ధరించుచు, దానిలో తమ ప్రపంచానుభవమును వెల్లడించుచుందురు. పాత్రజీవితము కథా సందర్భము అభినయించవలసిన పట్టుల నేర్పరచునవియేకాని అభినయించెడి భావమంతయును, ప్రకటించెడి రసమంతయును రాఘవాచారిగారి స్వానుభవమే; అనగా వారు పాత్ర జీవితాంశములకు స్వీయజీవితానుభవములనుండి సర్వస్వతంత్రులై రసవ్యాఖ్యాన మొనర్చినారన్నమాట" (చూ. నాట్యాంబుజము—పు. 165-73). "An actor must live on the stage" అనెడి స్టానిస్లావిస్కీ ఆదర్శముకూడ ఇట్టిదే అగుట పరిశీలనార్హము.

కాని, ఇచ్చట ఒక సత్యము విస్మరింపబడినదని చెప్పకతప్పదు. నాట్యమున నటునకు నటస్వభావమంతరించుట ప్రధానము. రాఘవాచారిగారి రీతిలో నటస్వభావమంతరించుటకు బదులు అదియే ప్రధానాంశమైయున్నది. నటసిద్ధులైన రాఘవాచారివంటివారియెడ ఇది జయప్రదమగునే కాని, తక్కినవారియెడ నిది వెఱ్ఱితలలువేయుట కవకాశమున్నది.

## కొన్ని సమస్యలు

ఆధునికరూపకరచనలలో కన్పట్టు కొన్ని సామాన్యధర్మములను క్రిందివిధముగా పేర్కొనవచ్చును—1. విషాదరూపకముల నధికముగా నభిమానించుట; 2. రూపక స్వరూపమెట్టిదియైనను దానిని 'నాటక' మనియే వ్యవహరించుట; 3. ఇతివృత్తము సామాన్యము (సాంఘికము)ను, నాయికానాయకులు సామాన్యులును అగుట; 4. ప్రస్తావనా-విష్కంభ-జనాంతికాది ప్రాచీననాటకసమయములను విడనాడుట; 5. అంకములను రంగములుగా విభజించుట లేదా అంకముల ప్రసక్తిలేకయే మొత్తము నాటకమును కొన్ని రంగములుగా రచించుట; 6. స్వభావవాదము (realism)నకు అధికప్రాధాన్యము వచ్చుట; 7. రూపకమునంతటిని వ్యావహారికభాషలోనే వ్రాయుట; 8. రూపకమునంతటిని వచనములోనే వ్రాయుట; 9. స్త్రీ పాత్రలులేని నాటికలు, నాటకములు వ్రాయబడుచుండుట; 10. ఏకాంకికలు, నాటికలు పుంఖానుపుంఖములుగా వెలువడుచుండుట; 11. ఇతివృత్తములందు ఏదియోయొక సంఘర్షము (conflict) లేదా సమస్య (problem) ప్రాధాన్యము వహించుచుండుట; 12. హాస్యమునకు ప్రాధాన్య మధికమగుట మొదలగునవి.

పై అంశములలో పెక్కింటి ఔచిత్యానౌచిత్యములనుగూర్చి ఆయా సందర్భములందింతకుముందే వివరించియున్నాను. కొన్ని అంశములు నేటికింకను సమస్యలుగానే నిలిచి

యున్నవి. అట్టివానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి—1. నాటకమున సంగీతముయొక్క (పాటల, పద్యముల) స్థానము; 2. నాటకసమయములు; 3. పాత్రోచితభాష; 4. వృత్తి నటన; 5. నటీమణుల ఆవశ్యకము; 6. నాటకపు పోటీలు; 7. ప్రయోగపురీతి; 8. నటులకు శిక్షణ మొ. పై వానిలో మొదటి మూడును ఎక్కువగా రచనకు సంబంధించినవి. తక్కినవి ప్రదర్శనమునకు సంబంధించినవి. ఈ సమస్యలనుగూర్చి ఇప్పుడు దిఙ్మాత్రముగా వివరింతును; వీనినెల్ల రూపకరచనా ప్రదర్శనముల నెడి కళాప్రపంచమునకు సంబంధించినవనెడి దృష్టితోడనే పరిశీలింపవలసియున్నదనెడి సత్యమును విస్మరింపరాదు.

## సంగీతము :

కేవలము గేయనాటికలనో లేదా కేవలము వచన నాటికా-నాటకములనో వ్రాయువారి కిదియొక సమస్యకాదు; మొదటి రకమువారికి సంగీతము విధిగా కావలెను; రెండవరకమువారికి దాని ఆవశ్యకమేలేదు. ఇంక గద్య-పద్య-గేయ సమ్మిశ్రితములుగా వ్రాయువారి విషయముననే ఇది సమస్యయగుచున్నది. రూపకమున వచనముతోపాటు పద్యములను, పాటలను ఎచ్చ టెచ్చట వ్రాయవలెనో నిర్ణయించి చెప్పుట శక్యముకాదు; ఇతివృత్తమునుబట్టి. సన్నివేశ సందర్భములనుబట్టి దక్షుడగు కవియే నిర్ణయించుకొనవలసిన విషయమది. రూపకములందు పద్యములుండుటయనునది ప్రాచీనసంప్రదాయమే. నాట్యశాస్త్రమున రెండధ్యాయములు (14, 15 అధ్యా.) ఛందోవివరణమునకు వినియుక్తములైనవి. సంస్కృతకవులందరును తమతమ రూపకములందు పద్యములను వ్రాసియున్నారు. సాధారణముగా సంభాషణలును, కథా సూచనాభాగములును వచనమందేయుండును. ఇంక భావ ముత్తేజనము పొందినప్పుడును, వర్ణనలందును వారు పద్యములను వ్రాసినారు. ఇట్టి పద్ధతి సహృదయామోదమును పడసినది[1];

సంస్కృతరూపకములందు పాత్రలకు సాధారణముగా పాటలుండవు. వారు గ్రహించిన ప్రక్రియ ధ్రువాగానము. ఇది నేపథ్యగానముమాత్రమే. సంస్కృతనాటకముల నాంధ్రీకరించినవారు మూలపద్ధతినే అనుసరించి వచనమునకు వచనము, పద్యమునకు పద్యమును తెలుగులో వ్రాసియున్నారు. ప్రాచీన పద్ధతిని తెలుగులో స్వతంత్రరూపకములను వ్రాసిన వారుకూడ తమ రూపకములందు పద్యములను, పాటలను రచించినారు; పాడగలిగిన నటులు పాడినారు. నాటి ప్రేక్షకులు రంజిల్లినారు.

కాని తరువాతి కాలములో, అనగా స్వభావవాదము తలయెత్తినది మొదలు నాటకము లందలి పద్యములపై, పాటలపై దండయాత్ర ప్రారంభమైనది. లోకమున నెవ్వరును పద్యములలో సంభాషించుటలేదు. పాటలలో ఏడ్చుటలేదు. అట్టియెడ లోకావస్థానుకరణము లగు రూపకములలో వీనినేల యుపయోగింపవలెనని స్వభావవాదుల ప్రశ్న. ఈ ప్రశ్న బయలు దేరుట కింకొక ప్రబలకారణమున్నది. సంస్కృతమున పద్యముల విషయమునకూడ 'పాఠ్య' మను పదము ప్రయుక్తమైనది; అనగా పద్యములను పఠింప (చదువ) వలయునేకాని పాడ రాదని దాని యర్థము. ఆనాటినటులట్లే వానిని చదివియుందురు. కాని తెలుగునటులుమాత్రము

పద్యములనుకూడ పాడుట కారంభించిరి. అది రానురాను చివరకు వెఱ్ఱితలలువేసి నాటక రంగస్థలము 'సంగీత కచేరీ' క్రిందికి దిగనారంభించెను; ఇది నాటకకళాభిమానులకు అసహ్యముగా పరిణమించినది. కాగా, ఈ వ్యతిరేకత పలువిధములుగానున్నది—పద్యములుకాని పాటలుకాని అసలే ఉండరాదు; పద్యములుండవచ్చునుకాని పాటలు అసలుపనికిరావు; పద్యములను అర్థవంతముగా చదువుచు కొంచెము రాగమునుచేర్చి మనోహరముగా చదువవచ్చును; పద్యమును కేవలము వచనమువలెనే చదువవలెను మొదలగునవి.

రూపకములందు వృత్తములసలే యుండరాదని పానుగంటివారి అభిప్రాయము (నాటకీయ పద్యపఠనము—సాక్షి ప్రథమసంపుటము). నడకయందు వచనముకంటె విశేష భేదము కన్పట్టని సీస-గీత-ఆటవెలదులను మాత్రమే నాటకరచయిత వ్రాయవలెనవియు, ప్రాచీనరూపకకర్తలు గ్రహించిన అనుష్టుప్-ఆర్యావృత్తములు (సంస్కృతము), అయాంబిక్ ఛందము (గ్రీకుభాష), బ్లాంక్‌వెర్సు (ఆంగ్లము) ఇట్టివియే అనియు, భక్తిరసమునకు చోటున్నప్పుడుమాత్రమే పాటలను వాడవలెననియు వారు నిరూపించియున్నారు. ఇంక 'పద్యమును పాడరాదు' అనెడి వాదమునకు భమిడిపాటివారి "ఆంధ్రనాటక పద్యపఠనం" శాస్త్రి గ్రంథమని చెప్పవచ్చును. పితృపాదులు శ్రీపాద కామేశ్వరరావుగారిలెనే డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారుకూడ ఈ వాదమునకు చెందినవారే; ఈ విషయమునుగూర్చి వారుకూడ చాల ప్రచారమొనర్చియున్నారు[2].

కాగా మొత్తముమీద పద్యములను, పాటలను రూపకప్రపంచమునుండి పూర్తిగా బహిష్కరింపవలెనని పట్టుబట్టువారు చాల అరుదుగానుందురని చెప్పవచ్చును; వీని ఆవశ్యకమే లేని రూపకములుకూడ నుండవచ్చును. కాని ప్రయుక్తములైనచో ఏయే సందర్భములందేయే విధములుగా ప్రయుక్తములు కావలెననెడి విషయమున మాత్రము భిన్నాభిప్రాయములుకలవు. రూపకము కళ కావున, ఇతివృత్తస్వరూపమును, సన్నివేశప్రాబల్యమును దృష్టియందుంచుకొని ఔచిత్యమే ప్రమాణముగా, కవులు తమ రూపకములందు పద్యములను, అవసరమైనచో పాటలను నిబంధించుటలోదొసగులేదు[3]. ఇంక నటులు పద్యములను అర్థప్రధానముగా చదువుటయే ఉత్తమము; పాటలనుకూడ రంగస్థలము 'సంగీత కచేరీ' కాదనెడి దృష్టితోనే పాడవలయును. ఈ సందర్భమున, రాఘవాచార్యులుగారు ప్రవేశపెట్టిన పద్ధతి చాలవరకాదరణీయమని చెప్పవచ్చును.

### నాటకసమయములు :

నాటకప్రారంభమునకుముందు విపులమైన పూర్వరంగప్రయోగమును భరతాదులు విధించియున్నారు. దేవతాపరితోషణార్థమే ఇది ప్రధానముగా ఉద్దిష్టమైనను దీనికి లౌకిక ప్రయోజనముకూడ కలదు. ప్రారంభసమయమునకుముందు వచ్చినవారికి ఇందలి నృత్య-వాద్యములు వినోదమును చేకూర్పగలవు. అర్వాచీనకాలములో ఈ విధానమంతయును సంక్షిప్తమై నాందీ-ప్రస్తావనలు అనెడి రెండంగములు మాత్రమే మిగిలినవి. ఆధునికులు ఏదోయొక పాట రూపమున నాందిని నిర్వర్తించుచున్నారు. చాలమంది ప్రస్తావనను వదలివేసిరనియే చెప్ప

వచ్చును. కొందరు నాటకమునంతటిని ఒకపాత్ర ఇంకొక పాత్రతో వర్ణించి చెప్పుచున్నట్లు కల్పన చేయుచున్నారు. మరికొందరు ప్రారంభమందు ఉపోద్ఘాతపూర్వకముగా ఉపన్యసించు చుందురు; లేదా నేపథ్యగానముతో నాటకము ప్రారంభమగును; ఇట్టివన్నియును స్థూలముగా ప్రస్తావనాతుల్యములే. పంచసంధులకు బదులుగా అరిస్టాటిల్ చెప్పినట్లు మూడే అవస్థలను లేదా సంధులను (ఆది-మధ్య-అంతములు అనగా ముఖ-గర్భ-నిర్వహణములను) వాడు చున్నారు. అంకమును రంగములుగా విభజించుటమాని, సినీమాపద్ధతిలో 'ఫేడిన్', 'ఫేడౌట్'లు వాడి కాలగమనమును సూచించుచున్నారు. ఇట్టివే అనేకములగు మార్పులు రచనలోను, ప్రయోగమునందును వచ్చినవి. ఈ సందర్భమున ముఖ్యముగా పేర్కొనదగినది స్వగతాదుల విషయము[4].

స్వగతము లేదా ఆత్మగతము (Soliloquy) నాటకాదులందుపయుక్తము కాదగునా ? కారాదా ? అనెడి విషయము పాశ్చాత్యదేశములందు తీవ్రసమస్య అయినది. పిచ్చివారుతప్ప లోకమునందింకెవ్వరును తమలోతాము బిగ్గరగా మాటాడుకొనరు. అట్టి అసహజత్వమును నాటకాదులందేల ప్రయోగింపవలెనని కొందరివాదము.

గ్రీకు రూపకకర్తలు మొదలగువారు స్వగతమును స్వేచ్ఛగావాడినారు. ఫ్రెంచి రూపకకర్తలుమాత్రము కొందరు స్వగతములకు బదులుగా విదూషకునివంటి నాయక సహాయులను సృష్టించినారు. లోకమున తనలోతాను మాటాడుకొనువాడు లేకపోయినను తనలో తాను తలపోసికొనువాడుండుటమాత్రము సర్వసామాన్యము. నాటకమున ముఖ్యపాత్రల కొన్ని మనోభావములు, అనగా తలపోతలు, ప్రేక్షకులకు తెలియనిచో కథాగమనము అర్థముకాదు. మరి కవికి ప్రవేశములేని నాటకరచనలో అట్టివానిని వెల్లడిచేయుటకు స్వగతమొక సాధనముగా గ్రహింపబడినది. ఆ అంతరభావములు వెల్లడియగుటకొరకే ఫ్రెంచి రూపకకర్తలు నాయక సహాయములనుపయోగించిరి. కాని ఈ పాత్రలు కేవలము పేలవములుగా తయారగుటచేత మోలియర్, షేక్స్పియర్ ప్రభృతులు మరల స్వగతములనే వాడియున్నారు.

ఆధునికులు స్వగతమును పూర్తిగా పరిహరించుచున్నారు. కొందరు నేపథ్యగానముతో ఈ మనోభావములను వెల్లడిచేయుచున్నారు. కాని అసహజమన్న పేరుతో స్వగతమును నిరాకరించుటపాడిగాదు. 'నాట్యధర్మి' పేరుతో ఎన్ని అసహజత్వములు నాటకమున స్వీకరింపబడుట లేదు ? అనవసరముగా పాత్రలను సృష్టించుటకంటె నాటకనిర్మాణములో ఆవశ్యకమై, కవిచే 'మోతాదు'లో చక్కగా ప్రయుక్తమైనచో స్వగతాదులు ఆదరణీయములగుట న్యాయ్యము.

**పాత్రోచితభాష :**

నాట్యము త్రైలోక్యభావానుకీర్తనమనియు, నానావస్థాంతరాత్మకమైన లోకవృత్తమునకు అనుకరణమనియు, నాట్యమునకు లోకమే ప్రమాణమనియు భరతుడు చాలసార్లు స్పష్టము చేసియుండెను. స్త్రీ పురుషులు ఉత్తమ-మధ్యమ-అధమ భేదములచే స్థూలముగా ముచ్విధములుగానుందురు. అందు మరల అనేక శీలభేదములు కలవు. ఆయాశీలములుగల ప్రకృతులను

తత్తదనుగుణములగు వాక్_అంగ_లీలా_చేష్టలచే నటుడు నిరూపించినప్పుడే ఆప్రయోగము సిద్ధి పొందగలదు. నాట్యశాస్త్రమందలి 17 వ అధ్యాయమున రూపకములందు ప్రయుక్తములు కాదగిన వివిధభాషల వివరణములు కలవు— లౌకికసంస్కృతమును, సంస్కృతవికారమైన ప్రాకృతమును, శౌరసేన్యాది సప్తదేశభాషలను, ఆంధ్రాది సప్తవిభాషలను భరతుడు పేర్కొని, అవి ఏయే పాత్రలకు ఏయే స్థితులలో ప్రయుక్తములు కావలయునో విశదీకరించెను.[5] భాస_కాళిదాసాది ప్రాచీనసంస్కృతనాటకకర్త లందరును సంస్కృతముతోపాటు ఈభాషలలో కొన్నింటిని వాడియున్నారు. కాగా. ప్రాచీనకాలమున 'పాత్రోచితభాష' యనునది యొక సమస్య కాలేదనియే చెప్పవచ్చును.

ప్రాచీనకాలమున తెలుగులో మార్గరూపకమని చెప్పదగిన క్రీడాభిరామమందు భాష యంతయును ఒకేవిధముగా నున్నది. కాని, యక్షగాననాటకములందు మాత్రము భాషావైవిధ్యము పాటింపబడినది—శుద్ధగ్రాంధికము, శిష్టవ్యావహారికము, సామాన్యుల వ్యావహారికము, తమిళాదిభాషలవారి 'యాసతెలుగు' మొదలగు వివిధస్వరూపముల నందుచూడవచ్చును. ప్రసిద్ధలాక్షణికుడైన అప్పకవికూడ కావ్యనాటకములందు పాత్రౌచిత్యముపేర భాషావైవిధ్యము నంగీకరించియుండుట పరిశీలనార్హము(చూ.అప్పకవీయము).[6] కాని వల్లభరాయడు తప్ప తక్కిన ప్రాచీనులెవ్వరును మార్గరూపకరచనకు పూనుకొనకపోవుటచే, ఈ సమస్య తెలుగుసాహిత్యమునకు సంబంధించి ఉత్పన్నమే కాలేదు.

తొలి తెలుగుమార్గరూపకకర్తయగు కోరాడవారికి, వీరగ్రాంధికవాదులగు కొక్కొండవారికి ఈసమస్యపై దృష్టి పోనేలేదు. 'రిఫార్మర్ పండిట్' అనిపించుకొన్న పరవస్తువారు మాత్రము సంస్కృతరూపకానువాదములో ప్రాకృతభాషాస్థానమున అచ్చతెనుగును ప్రవేశ పెట్టినారు; కాని అది సరిగా సాగినట్లు కన్పట్టదు. వావిలాలవారు తెలుగులో ప్రాకృతమునకు బదులుగా గొల్లమాటలో, కోయమాటలో లేక గ్రామ్యభాషయో వాడుకచేయవలసియుండుననియు, అట్టిపని చేయుటకు మనసొప్పకయు ఆప్రయత్నము విరమించినారు; కాని అచ్చటచ్చట వాడుకమాటలు (బాహ్మలు, వెళ్లడము మొ॥) మాత్రము స్వబుద్ధితోనే వాడియున్నారు. ఇంక వీరేశలింగం పంతులుగారు తమ వ్యవహారధర్మబోధినియందును, చమత్కారరత్నావళిలోను సాహసించి వ్యావహారికభాష నుపయోగించినారు. వీరును. చిలకమర్తివారును వ్యావహారిక భాషావాదులు కాని, పాత్రోచితభాషావాదులు కాని కాకపోయినను వీరిభాషమాత్రము సరళమును, నాటకోచితమును అయియున్నదని మాత్రము చెప్పకతప్పదు. నాదెళ్ల పురుషోత్తమకవిగారు తమ హిందీ_తెలుగు నాటకములలోకూడ భాషావైవిధ్యమును చూపించియుండుట గమనించి యున్నాము. ఇదియంతయును 1891 వ సంవత్సరమునకు పూర్వపువిషయము; నాటివరకును పాత్రోచితభాషావిషయము నొకసమస్యగా పాటించినవారు లేరనియే చెప్పవచ్చును.

1891 లో వేదమువారు 'నాగానందము'ను ప్రకటించి, పాత్రోచితభాషావాదమునకు పునాదులు వేసినారు; అంతియేకాక 'గ్రామ్యభాషాప్రయోగ నిబంధన' మనెడి ఒక విమర్శ వ్యాసమునుకూడ వెలయించినారు. వీరిందు ప్రాకృతము సంస్కృతభాషా గ్రామ్యమనియు,

ఇంక దేశభాష లంతకంటెను గ్రామ్యములనియు నిరూపించియున్నారు; కావున తెలుగులో సంస్కృతస్థానమున గ్రాంధికమును, ప్రాకృతస్థానమున గ్రామ్యమును వాడవలెనని వారు సిద్ధాంతించినారు.

ఈ సందర్భమున రెండు అంశములను పరిశీలింపవలసియున్నది—1. సంస్కృత భాషాదృష్టితో ప్రాకృతము గ్రామ్యమని అంగీకరించినప్పటికిని, అది వ్యాకరణసంస్కారము కలదని మాత్రము మరచిపోరాదు; మరి తెలుగుగ్రామ్య మట్టిదిగాదు; అట్టియెడ ఇది రూపకములం దాదరణీయమా ? 2. నాట్యమెంతగా లోకవృత్తానుకరణమైనప్పటికిని, అనేక అంశములలో అది లోకముకంటె భిన్నమనికూడ గుర్తించియున్నాము. అట్టియెడ పాత్రోచితభాషా ప్రయోగవిషయమునమాత్రమే లోకసహజత్వ మేల కావలయును ? రూపకమునంతటిని వ్యావహారికభాషలోనే—అందుకూడ వైవిధ్యమునుచూపుచు—వ్రాసినవారికి పై ప్రశ్నలతో పనిలేదు[7]. కాని సంస్కృతస్థానమున గ్రాంధికమును, ప్రాకృతస్థానమున గ్రామ్యమును వాడవలెననువారు మాత్రము ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. అంతియేకాదు, పెట్టుకొన్న నియమమును కడవరకును చక్కగా నిర్వహింపవలసియున్నది[8].

నాట్యము లోకవృత్తానుకరణమేకాక ప్రదర్శనప్రధానముకూడను. నాటకమును చూచుచున్నంతకాలమును రూపకగతపాత్రలు సజీవులుగా మనయెదుట కన్పట్టుదురు; సంభాషింతురు; అందుచేత మనము శీఘ్రముగా వారిపైపు ఆకర్షింపబడుదుము. అట్టియెడ వారి భాషణములు లోకసహజములుగానున్నచో మనకు వారు అత్యంతము సన్నిహితులు కాగలరు. ఒకవేళ రాజు సేవకునివలెను సేవకుడు, రాజువలెను మాటాడినచో అది మనకు హృదయావర్జకముకాదు. వారు తత్తత్సంస్కారబలానుగుణముగా భాషించినప్పుడే మనకందు తాదాత్మ్యమేర్పడును. (ఈ విషయమున కావ్యము నాట్యమునుండి భేదించుచున్నదని తెలియవలెను. అట్లు భాషింపనిచో దానిని అనౌచిత్యముగా పరిగణింపవలసియున్నది. ఇట్టి అనౌచిత్యమునే రుద్రటుడు తన కావ్యాలంకారమందు గ్రామ్యత్వ మనినాడు—"గ్రామత్వ మనౌచిత్యం వ్యవహారాకారవేష వచనానామ్ దేశ-కుల-జాతి-విద్యా-విత్త-వయః-స్థాన-పాత్రేషు". దీనిని వ్యాఖ్యానించుచు 'వచనమనగా భాష' యని నేమిసాధువు నిర్దేశించియుండెను. కాగా వ్యవహార-ఆకార-వేషాదులందువలెనే భాషయందును దేశ-కుల-జాతి-విద్యా-విత్త-వయః-స్థాన-పాత్ర వివేకముతో ఔచిత్యమును పాటించుట ముఖ్యమని తేలుచున్నది[9]. మరియు, భరతుడు 19వ అధ్యాయము చివర స్పష్టీకరించినట్లుగా "లోకభాషల బలాబలములను పరిశీలించి మృదుశబ్దమును, సులభార్థమును అగునట్లుగా" నాటకమును రచింపవలసియున్నది.

ఈ సందర్భమున నాటకశైలినిగూర్చికూడ రెండుమాటలు చెప్పవలసియున్నది. పౌరాణిక-చారిత్రక నాటకములు సాంఘికనాటకములకంటె పూర్తిగా భిన్నములు. ఆ పాత్రలు వారి రోజులలో ఏవిధముగా మాటాడెడివారో మనకు తెలియదు; కాని ఒక దేవతామూర్తియో, ఒక చక్రవర్తియో నేటి సాంఘికనాయకునివలెనే ప్రసంగించియుండునని తలంచుటమాత్రము సమంజసము కాజాలదు. కాగా వారి భాషణము కొంత ఉదాత్తముగానుండుటయే సమంజసము ; అసలు

మొత్తముమీద ఆ నాటకములశైలి సాంఘికనాటకములశైలికంటె కొంత గంభీరముగా నుండుటయు (heightened language) సమంజసమే కాగలదు. ఇచట ఒక ముఖ్యవిషయమును గుర్తింపవలసియున్నది. పౌరాణిక-చారిత్రక కథలలోని పాత్రలు వర్తమానకాలమునకును, మన నిత్యజీవనవిధానమునకును సుదూరగులైనవారు. అటువంటి పాత్రలు గ్రాంధికములో మాటాడినను, పద్యములలో సంభాషించినను, పాటలలో దుఃఖపడినను మనకును వారికిని మధ్య గల కాలభేదమును దృష్టిలో పెట్టుకొన్నచో మనకది విడ్డూరముగా కన్పించుట కవకాశ మేర్పడదు. గురజాడవారు పౌరాణికకథనే స్వీకరించి వ్యావహారికభాషలో "బిల్హణీయము" నురచించినారు. ఇది గ్రాంధికవాదులమీద సవాలుగాచేయబడిన రచన. కాని కన్యాశుల్కమున ప్రయుక్తమైన వ్యావహారికభాషకును, ఇందు ప్రయుక్తమైన వ్యావహారికభాషకును భేదమును సహృదయులు సులువుగా గ్రహింపగలరు. ఇతివృత్త స్వరూపమే ఆ తరతమభేదములను తప్పక తెచ్చిపెట్టునని గ్రహింపవలెను.

స్త్రీలు : రంగస్థలము :

కేవలము నాట్యప్రదర్శనముకొరకే 24 గురు అప్సరసలు సృష్టింపబడినట్లు నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమందు కలదు. 26 వ అధ్యాయమందు చెప్పబడిన త్రివిధములగు వేషధారణములలో 'అనురూప' వేషధారణమొకటి[10]; అనగా పురుషులు పురుషభూమికలను, స్త్రీలు స్త్రీభూమికలను ధరించుట; ఇదియే ఉత్తమపద్ధతియట. దీనినిబట్టి నాట్యశాస్త్ర రచనాకాలమునాటికి స్త్రీలు పురుషులతో కలిసి నాటకములాడుచున్నట్లు స్పష్టమగుచున్నది. సంస్కృతనాటక ప్రస్తావనలందు కన్పట్టు 'నటి' సూత్రధారుని పత్ని. సూత్రధారుడామెను 'ఆర్యరాలా !' అని సంబోధించును; నటి సూత్రధారుని 'ఆర్యపుత్ర' అని సంబోధించును. ఇవి నాటకమున భార్యాభర్తలు పరస్పరము చేసికొనెడి సంబోధనలు. పత్ని అనగా సహధర్మచారిణియనియు, నాట్యవేద మహాసత్ర దీక్షితుడైన సూత్రధారుడు నటిని 'ఆర్యరాలా !' అని సంబోధించుననియు అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండెను. సాధారణముగా సూత్రధారుడు నాయకభూమికలను, వాని భార్యయగు నటి నాయికాభూమికలను ధరింతురు. నటి కేవలము నటిగానేకాక ఆదర్శ గృహిణిగా కూడ కొన్ని సంస్కృతరూపకప్రస్తావనలందు చిత్రింపబడుట పరిశీలనార్హము. ఆమె సూత్రధారునియందు కడు అనురక్త; ఇంటిని చక్కదిద్దుకొనుటలో ఆసక్తిమెండు. సంతాన యోగక్షేమములందు శ్రద్ధ అధికము. (కుమార్తెవివాహమునుగూర్చి నటి తాపత్రయపడుట కొన్ని ప్రస్తావనలందు వర్ణితమైనది).

ఇట్లు భారతదేశమున స్త్రీల రంగప్రవేశమున కాదికాలములో ఎట్టి నిషేధమునులేదు; అంతియే కాదు వారి ప్రవేశము ఆవశ్యకముగా పరిగణింపబడినదికూడను. కాని, స్మృతుల కాలమునాటికి స్త్రీలు రంగమునుండి బహిష్కరింపబడిరి: అసలు నటులందరును పంక్తిబాహ్యులైరి. పాశ్చాత్య దేశముల విషయము ఇందులకు వ్యతిరేకము. గ్రీకురూపకప్రదర్శనములందు కాని, షేక్స్పియరునాడుకాని స్త్రీలు నాటకప్రదర్శనములందు పాల్గొనలేదు; యువకులే స్త్రీభూమికలను ధరించెడివారు. రెస్టోరేషన్ కాలములోనే స్త్రీలు రంగస్థలము నెక్కుట ఆరంభమైనది; క్రమముగా విస్తరించి, పాశ్చాత్యదేశములందు నేడది సర్వసామాన్యవిషయమైనది.

కృష్ణదేవరాయల కాలములో స్త్రీ పురుషులు కలిసి నాటకప్రదర్శనము లొసంగినట్లు ఒకటిరెండు ఆధారములున్నను, అది సర్వసామాన్యముగా అంగీకరింపబడినట్లు కన్పట్టదు. కూచిపూడివారు మొదలగువారు దీనినాదరింపలేదు. ఆధునికకాలమున తెలుగు నాటక ప్రదర్శనము లారంభమైన కాలములో పురుషులే నాటకసమాజములందుచేరి, వారే స్త్రీ భూమికలనుకూడ ధరించిరి (ఇందులకు సురభిసమాజము లపవాదము). 'విజయరామ డ్రమాటిక్ కంపెనీ'లో వేశ్యలు పురుషులతో కలసి నటించినారు. ఇంక రాఘవాచార్యులుగారు బెంగుళూరులో 'ఆమెచ్యూర్ నాటకసమాజము' స్థాపించి, కొంతమంది స్త్రీలను చేర్చుకొని నాటకములాడ నారంభించెను. 1928 లో విదేశయాత్ర చేసివచ్చినతరువాత రంగస్థలమున కులస్త్రీలు పాల్గొనవలెననెడి యుద్యమమును ఆయన ప్రారంభించెను. అప్పుడా నినాదము లోకమున నొక కల్లోలమును రేపినది; పెద్దలు పత్రికలలో వాదోపవాదములు చేసినారు. "స్త్రీ భూమికలను స్త్రీలే నిర్వహింపవలెనా? అక్కరలేదా?" అనునది నేడొక తీవ్రసమస్యకాదు; తగినంతమంది ఉత్తమ నటీమణులు లభింపకపోవుటయే నేటి సమస్య.

పురుషుడు స్త్రీ భూమికను ధరించి, ఉత్తమముగా నిర్వహించుటలో ప్రతిభ అధికముగా వ్యక్తమగుట సత్యమే. శ్రీయుతులు ముప్పిడి జగ్గరాజు, ఉప్పులూరి సంజీవరావు, స్థానం నరసింహారావు ప్రభృతులు పురుషుల స్త్రీ పాత్రధారణమునకు బద్ధవిరోధియైన రాఘవాచార్యుల వారి మెప్పునుకూడ పొందియున్నారు. కాని స్త్రీలే స్త్రీ భూమికలను నిర్వహించుటలో సౌలభ్యమధికము. పురుషులు స్త్రీల వన్నెచిన్నెలను అనుకరింపగల్గినను స్త్రీకి తన బిడ్డలయందుండు మాతృవాత్సల్యమునుకాని, భగ్నప్రేమియైనప్పుడు కలుగు తీవ్రప్రతీకారవాంఛనుకాని యెన్నడును సంపూర్ణముగా చూపెట్టలేరు. ఇది నిరూపింపనక్కరలేని సత్యము. అయినను పురుషులు స్త్రీ భూమికలను అత్యుత్తమముగా నిర్వహించినకాలము గడచిపోయినదని చెప్పవచ్చును. ఇందులకు తగిన దోహదము చేసినవి ఆంధ్రనాటకకళాపరిషత్తువారి పోటీలు. నేడీ విషయమున ప్రావీణ్యమును సంపాదించుట కుత్సహించెడి యువకులే లేరని చెప్పుట అతిశయోక్తి కానేరదు. (తప్పనిసరిగా విశ్వవిద్యాలయాదులయందలి విద్యార్థులుమాత్రము నేడీ పద్ధతి యింకను కొనసాగించుచున్నారు). ఔత్సాహికనాటకసమాజములవారు, వృత్తి నాటకసమాజములవారుకూడ స్త్రీలచేతనే స్త్రీ పాత్రలను నిర్వహింపజేయుచున్నారు. కాని, నీతి నియమముల విషయమున హద్దులు మీరకుండ చూచుకొనుట వారి ధర్మమైయున్నది.

### నాటకపు పోటీలు :

నాట్యశాస్త్రమందు 'నాట్యసిద్ధి' యనుపేర ప్రత్యేక మొక యధ్యాయము కలదు (27 వ అధ్యా). అందు నాటకపు పోటీల విషయము, ఆ సందర్భమున న్యాయమూర్తులుగా వ్యవహరింపవలసినవారి లక్షణములు,[11] ఉత్తమత్వనిర్ణయ విధానము అనునవి విపులముగా వర్ణితములైనవి. గ్రీకు విషాదరూపకముల వికాసమునకు నాటకపు పోటీలు దోహదము చేసినవనెడి విషయమును గుర్తించియున్నాము. నాడాదేశమున నాటకకర్తలకును, నటులకును సంఘములో మంచి పలుకుబడి, గౌరవము ఉండెడివి. 1913_20 మధ్యకాలములో తెలుగు

నాటకరంగమున ప్రభవిల్లిన నాటకపుపోటీల సంరంభము నింతకుముందే వివరించియున్నాను. ఈ సందర్భమున శ్రీపాద కామేశ్వరరావుగారి విమర్శవ్యాసములు స్మరణార్హములు (ఈ పరిశోధనావ్యాసమున 327_28, 337 పుటలు కూడ చూడవలెను).

1913_20 మధ్య జరిగిన పోటీలలో ఒకకవి రచించిన ఒకేఒక నాటకమును పెక్కు సమాజములవారు ప్రదర్శించెడివారు. అందు మొత్తము ప్రదర్శనమునకు, ఆయా పాత్రలను ఉత్తమోత్తమముగా నిర్వహించినవారికి బహుమతులు లభించెడివి. కాని 1931 ప్రాంతములలో నాడు ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగానున్న డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు, రాజా విక్రమదేవవర్మగారు మున్నగు పెద్దలు ఒక సంఘముగా నేర్పడి నాటకపు పోటీలను జరుపుటకు ప్రయత్నించినారు. ఇంతకుముందువలె పోటీలో పాల్గొనెడి ఆయా సమాజములవారెల్ల ఒకేఒక నాటకమును ప్రదర్శింపవలెననెడి పద్ధతిని సడలించి, పోటీలో పాల్గొనెడి సమాజములవారు తమ కిష్టమువచ్చిన నాటకములను ప్రదర్శింపవచ్చునని పై సంఘము నిర్ణయించినది. రాజకీయాది కారణముల మూలముగా పై పోటీల నిర్వహణము ఆగిపోయినను ఆనాడు ఆ పెద్దలు తలపెట్టిన పద్ధతిలోనే 1943_44 నుండి ఆంధ్రనాటకకళాపరిషత్తువారు పోటీలను నిర్వహించుచున్నారు.

పై పద్ధతినే అనుసరించి నేడించుమించుగా 20 సంస్థలవారు ప్రతిసంవత్సరమును నిర్ణీతకాలములలో నాటకపుపోటీలు జరిపించుచున్నారు. ఇందులో ముఖ్యముగా పేర్కొనదగినవి—నాట్యకళాప్రపూర్ణ బళ్లారి రాఘవ స్మారక పరిషత్తు, విజయనగరము (ఏప్రిలులో); సంస్కృతీ సమ్మేళనము, గూడూరు (మే నెలలో); కొప్పరపు సుబ్బారావు స్మారక నాటక కళా పరిషత్తు, గొల్లప్రోలు (జనవరిలో); రాయల నాటకకళాపరిషత్తు, ప్రొద్దుటూరు (అక్టోబరులో); నరసాపురం నాటకకళాపరిషత్తు, నరసాపురం (జనవరిలో); శ్రీ వేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు, తిరుపతి (నవంబరులో); లలితకళాపరిషత్తు, రాజమండ్రి (అక్టోబరులో).

ఈ పోటీలొకప్రక్క క్రొత్తనటులకు, క్రొత్త రచయితలకు, క్రొత్త నాటకములకు క్రొత్త ప్రదర్శనపద్ధతులకు దోహదకారులుగా నున్నప్పటికిని ఇంకొకప్రక్క అసూయా వైషమ్యములను పెంచునవిగానున్నవి. మూడునాలుగు రోజులపాటు దీక్షగా కూర్చుండగలిగిన 'జడ్జీలు' ఉత్తములు లభించుటలేదు. అసలు, నేడు పోటీలు నిర్వహింపబడెడు పద్ధతియే కొందరికి అసంతృప్తికరముగానున్నది. "నాటకకళ అమెచ్యూర్ స్థితిలో నున్నప్పుడు పోటీల అవసరము కలిగినది; ఇప్పుడు వాని అవసరమేలే"దని కొందరందురు (నాటకపు పోటీలకు బళ్లారి రాఘవాచారిగారు బద్ధవిరోధులు). ఈ విషయమును కూలంకషముగా చర్చించి, నిర్ణయమునకు రావలసిన అవసరము నేడెంతయేనియు కలదు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ ఈ సమస్యను చేపట్టగలదని ఆశింపవచ్చును.

### నాటకము : సినీమా :

తెలుగుదేశములోని పెద్దపెద్ద నాటకసమాజము లంతరించి కొంట్రాక్టు నాటకములారంభమైన సమయములోనే తెలుగు సినీమా పరిశ్రమ ఆరంభమైనది. అంతకుముందే

సి. పుల్లయ్యగారు 'మార్కండేయ' మూకీ చిత్రమును నిర్మించియున్నప్పటికిని, 1931 లో హెచ్. ఎమ్. రెడ్డిగారు నిర్మించిన తొలి తెలుగు టాకీ చిత్రము 'భక్త ప్రహ్లాద' తరువాతనే తెలుగు సినీమాపరిశ్రమ అభివృద్ధి ఆరంభమైనదని చెప్పవలసియున్నది. ఎక్కువరాబడికి అవకాశముగల సినీమాపరిశ్రమ నటుల నాకర్షింప నారంభించినది. శ్రీయుతులు డి. వి. సుబ్బారావు, బళ్లారి రాఘవాచార్య ప్రభృతి ప్రసిద్ధనటులుకూడ తరువాతి కాలములో సినీమాలయందు పాల్గొనియుండుట స్మరణార్హము. 1944 నుండి ఆంధ్రనాటకకళాపరిషత్తువారు జరుపుచువచ్చిన నాటికా-నాటకపు పోటీలలో ప్రథములుగా ఉత్తీర్ణులైన నటులు, నటీమణులు, నాటకరచయితలు అందరును సినీమా పరిశ్రమలో చేరిపోయినారు. అసలు వారికందు ప్రవేశము కలుగజేయుటకు నాటకరంగమే పునాదియైనదనుట నగ్నసత్యము. కాగా, సినీమా పరిశ్రమ ఉత్తమనటీ-నటులను, నాటకరచయితలను ఆకర్షించివేసి, నాటకరంగమును ఎప్పటికప్పుడు బలహీనపర్చుచున్నస్థితి ఏర్పడుచు వచ్చినది. ఈ స్థితిలో సినీమాపరిశ్రమ నాటకకళకు ప్రబల విరోధికాగల యవకాశమున్నది.

కాని సినీపరిశ్రమ నాటకకళకు వ్యతిరేకముగాని, దానిని బలహీనపర్చునదికాని కానక్కరలేదు. నాటకరంగమున ప్రతిభావంతులైనవారందరును సినీరంగమునకూడ రాణింపగలరని చెప్పజాలము. బళ్లారి రాఘవాచార్యయంతటి ఉత్తమనటుడే సినీరంగమున రాణింపలేదనుట స్మరణీయము; మరియు వారు తమ జీవితమునంతటిని నాటకకళకే అంకితముచేసిరి. కాగా, నాటకరంగము నంటిపెట్టుకొని కొందరు ప్రసిద్ధనటు లెల్లప్పుడును తప్పక ఉండనే ఉందురు. అట్టివారు కేవలము ప్రోత్సాహికులుగానే యుండిపోవుటకంటె వృత్తినటులుగా స్థిరపడుట వారికిని, నాటకరంగమునకును శ్రేయస్కరము. మరియు, నాటకరంగమునుండి సినీమారంగమున ప్రవేశించినవారందరిపైనను తమ పూర్వాశ్రమమును విస్మరింపక తదభివృద్ధికై పాటుపడవలసిన బాధ్యతకలదు. కొన్నిరాష్ట్రములందు కొందరు నటులావిధముగా చేయుచునేయున్నారు. బొంబాయిలో ప్రసిద్ధ పాశ్చాత్య సినీదర్శకుడు ప్రొఫెసర్ హెర్బర్టు మార్షల్ కొందరు ప్రసిద్ధ సినీకళాకారులను కూడగట్టుకొని ఉత్తమసంప్రదాయములతో చక్కని నాటకప్రదర్శనము లిప్పించుచుండుట స్మరణీయము. ఆవిధముగా ప్రసిద్ధ సినీకళాకారులు కూడ ముందునకువచ్చి తెలుగునాటకరంగాభివృద్ధికి పాటుపడినచో యీ రెండుకళల మధ్యగల వైరుధ్య మంతరించుటయేకాక రెండును పరస్పరసహకారమున మరింత వర్ధిల్లగలవు.

సినీమా పరిశ్రమయా, లేదా కళయా యను వాదము ప్రస్తుతముకాదు. కాని నాటకరంగమునందలి నటనకును, సినీమారంగమునందలి నటనకును చాల భేదముమాత్రము కలదు. నటనలో దోషము దొరలినచో, సినీమారంగమున, సరిదిద్దుకొనుట కవకాశముకలదు; కాని నాటకరంగమునందట్టి యవకాశములేదు. కావున, నాటకనటుడు ఎక్కువ సుశిక్షితుడు కావలసియున్నది. అయినను రెండును ప్రత్యేక వ్యక్తిత్వములు గల్గియున్నవనియు, అవి పరస్పర విరుద్ధము లగుటకంటె, పరస్పరపోషకములగుటకే ఎక్కువ యవకాశము కలదనియు తలంచుట సమంజసము.

### వృత్తినటులు : ఔత్సాహికనటులు :

సంస్కృతనాటకముల ప్రస్తావనలనుబట్టి, ఆనాడు నటు లొకకుటుంబమునకు చెందిన వారుగా కన్పట్టుచున్నారని తెలిపియున్నాను. ఇంచుమించుగా ఒక్కొక్కకుటుంబ మొక్కొక్క సమాజమని చెప్పవచ్చును. వీరందరును నటనయే వృత్తిగా స్వీకరించినవారు. క్రీ. శ. 13వ శతాబ్ది ప్రాంతములనుండియు కూచిపూడివారట్టివారు. అర్వాచీనకాలములో సురభినాటకసమాజములవా రట్టివారు. కూచిపూడివృత్తి మేళము లించుమించుగా నామావశిష్టములై నటులు తలకొకదారి పట్టినారు. పిచ్చుకకుంట్ల, యానాదుల, గొల్లల వృత్తి మేళములుకూడ నేడు కన్పట్టుటయే లేదనిచెప్పవచ్చును. ఆధునికకాలమున తెలుగునాటకప్రదర్శనము లారంభమైనది మొదలు 1912 ప్రాంతములవరకును తెలుగునాటకరంగమున నటించినవారందరును ఔత్సాహికనటులే; వృత్తినటులు లేరనియే చెప్పవచ్చును. 1912 ప్రాంతముల వ్యాపారసరళిలో ప్రారంభములైన సమాజముల కాలములో వేరువేరునటులు నటనను వృత్తిగా స్వీకరించుట జరిగినది. ఆ సమాజముల ప్రభ యంతరించుటతో కొందరు మరల ఇతర ఉద్యోగములను వెదకుకొనవలసివచ్చినది. ఇంక తక్కినవారు కంట్రాక్టర్ల దయాదాక్షిణ్యములపై ఆధారపడవలసివచ్చినది. చివరకు జీవితమంతయును నటులుగానే బ్రతికిన కొందరు దుర్భరదారిద్ర్యముతోనే చివరిరోజులు గడపి, శోచనీయమైనస్థితులలో తనువులను విడిచినారు. కాగా, తెలుగునాటకరంగమున వృత్తినటులలో లేదా, నటనను వృత్తిగా స్వీకరించినవారిలో బాగుపడినవారిని వ్రేళ్ళమీదమాత్రమే లెక్కింపవచ్చును. ఈపరిస్థితులు నేటికింకను అట్లేయున్నవి.

ఔత్సాహికనటులందరును, ఏదోయొక వృత్తిలో నిమగ్నులైయుందురు; పగలంతయును ఆయావృత్తులలో పొట్టపోసికొనుటకు పనిచేయవలసినదే. ఇంక రిహార్సలు సాయంసంధ్యాసమయములలో, రాత్రివేళలలో జరుగును—అనగా పగలంతయును పనిచేసి, అలసివచ్చినస్థితిలో నన్నమాట ! ఇట్లు వచ్చినవారికి రిహార్సలువేసికొనుటకు తగిన స్థలములుకాని. ఇతరములైన అవసరపరికరములుకాని అందుబాటులో నుండవు. ప్రదర్శనమునాటిరాత్రికి మాత్రము ఏదోవిధముగా, అద్దెకుతెచ్చియో. అరువుతెచ్చియో పరికరములను కొన్నింటిని కూర్చుకొని, అతుకుపెట్టుకొని, ప్రదర్శన మైనదనిపింతురు. ఇన్ని అవస్థలు పడుచున్నను, కొన్ని సమాజములవారు మంచి క్రమశిక్షణతో ఉత్తమనాటకప్రదర్శనముల నొసంగుచుండుట తప్పక ప్రశంసనీయము; అది నిజముగా ఔత్సాహికోద్యమమునకు గర్వకారణము.

కాని నిజమాలోచించినచో ఔత్సాహికనటులవలన నాటకకళ ఉన్నతస్థితికి రాగలదని చెప్పజాలము. వారిప్రదర్శనములు ఉన్నతపాఠశాలలకు, కళాశాలలకు, విశ్వవిద్యాలయములకు, వార్షికోత్సవములకును పరిమితములై యుండుట సమంజసము. ఇంక తక్కిననాటకరంగమును వృత్తినటు లాక్రమింపవలయును. కాని, వారు కేవలము జీవనోపాధికొరకే గాక, నటనను ఉపాసనాదృష్టితో స్వీకరించెడివారు కావలయును.[12] ఇట్టివారినెల్ల చేరదీసి, బృందములనేర్పరచి, చక్కనిపద్ధతులమీద నడిపింపగల సమర్థులువెలయవలయును. అనగా వృత్తినటులేకాక, వృత్తి నాటకసమాజములుకూడ నేర్పడవలెనన్నమాట. అప్పుడే ఏనాటకరంగమైనను బాగుపడును;

కళాత్మకములైన ఉత్తమప్రదర్శనములు సాధ్యములగును. ఇట్టి బృందములలోని నటుల కందరకును వారివారి యోగ్యతలకు, శ్రమకు తగిన ప్రతిఫలము లభించుటకూడ ముఖ్యము.[13] జీవికకు భద్రతయేర్పడి, జీవనము సుస్థిరమైనప్పుడు కళోపాసియును, కళాభిజ్ఞుడును సాధింప జాలనిదేముండును? ఇది నాటకకర్తవిషయమునకూడ అన్వితమయ్యెడి సత్యమే. ఉత్తమ నాటకములు బయలుదేరవలెనన్నచో కవికిని జీవికవిషయమున భద్రత యావశ్యకము.

**నాటకశాలలు : నాటక కళాశాలలు :**

వృత్తినటులు, వృత్తినాటకసమాజములు ఏర్పడి ఉత్తమప్రదర్శనములు జరుగవలయు నన్నచో ముందుగా ఉత్తమ నాటకశాలలు కనీసము ప్రతిపట్టణమందైనను ఏర్పడవలయును. 1930కి పూర్వము, అనగా సినీమాలు రాకపూర్వము తెలుగుదేశమున లెక్కకుమించిన నాటక శాల లుండెడివి; కాని, సినీమాలరాకతో, అవి యన్నియును సినీమాశాలలుగా మారిపోయినవి. నేటి నాటకసమాజములవారు ఆ సినిమాశాలలలోని చిన్నిచిన్ని రంగస్థలములందో, లేదా సమా వేశముల 'హాల్సు' లోనో నాటకప్రదర్శనముల నొసంగవలసివచ్చుచున్నది. అందుగల క్లేశము అనుభవించినవారికే తెలియగలదు. ఈ బాధలుపడలేక కొందరు బహిరంగ నాట్యప్రదర్శనముల నాదరించి, ప్రోత్సహించుచున్నారు; ఇట్టి ప్రదర్శనములలో ప్రజానాట్యమండలివారు మంచి విజయమును సాధించినారు. ఇందు రంగస్థలము తాత్కాలికముగా నిర్మింపబడును; ప్రేక్షకులు ఆకాశముక్రిందనే కూర్చుందురు. ఈ తాత్కాలిక రంగస్థలనిర్మాణము చాల తేలిక. స్థిరమైన నాటకశాల లేకపోవుటచేత వలసిన రంగపరికరములను సమకూర్చుకొనుటయేకాదు; దాచు కొనుటయు కష్టమే. అందుచేత వారు 'సీనరీ' కొరకు, 'సెట్టింగు'ల కొరకు ప్రయాసపడక సూరిశాస్త్రిగారు, శ్రీహరీంద్రనాథచటోపాధ్యాయ సూచించినట్లుగా రంగుతెరలతోనే ప్రదర్శన ముల నొసంగి రక్తికట్టించినారు.[14]

నాట్యశాస్త్ర ద్వితీయాధ్యాయమందు నాటకకళాశాలనిర్మాణము చాలవిపులముగా వివరింప బడెను. నేటి ఆనుకూల్యములనుకూడ దృష్టిలోపెట్టుకొని చక్కని నాటకశాలలను నిర్మించుట ఆవశ్యకము. బహిరంగనాటకశాలలకంటె సమగ్రనాటకశాలలే (closed theatres) ఉత్తమ ప్రదర్శనముల కెక్కువ దోహదకారులగుట నిస్సంశయము.

వృత్తినటులు ముందుకువచ్చి, వృత్తినాటకసమాజము లేర్పడి, చక్కని నాటకశాలలు నిర్మితములైనప్పుడుకూడ పరిష్కరింపవలసిన ప్రధానసమస్య యింకొకటి మిగిలియేయుండును— నటుల కొసంగవలసిన శిక్షణ. బి. టి. రాఘవాచార్యులుగారు, బందా కనకలింగేశ్వరరావుగారు, ఆంధ్రనాటకసమాఖ్యవారు నడపిన పాఠశాలలనుగూర్చి వివరించియున్నాను. క్రిందటిసంవత్స రము ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘమువారు ఐదునెలలపాటు శిక్షణతరగతులను నడిపినారు. ఈసారి ఒకసంవత్సరముపాటు నడపవలయునని ప్రయత్నములు జరుగుచున్నవి. గుడివాడ కళాశాలలో ఆంధ్రనాటకకళాపరిషత్తుపక్షమున నాటకశిక్షణతరగతులు సాగుచున్నవి, ఇట్లు అచ్చటచ్చట చెదురుగా జరిగెడి ప్రయత్నములు ఫలవంతములగుట కష్టము. ఇందులకు విదేశములలోవలెనే ఇచ్చటకూడ విశ్వవిద్యాలయములు పూనుకొని, నాటకశిక్షణకు ప్రత్యేకశాఖలనేర్పాటుచేయవలెను.

1943 లో ఆంధ్రవిశ్వవిద్యాలయమున పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలో నాటకశాఖ నేర్పాటుచేయ వలెననెడి తలంపొకటి మెరపు వలె మెరిసినది; అప్పుడు బళ్లారి రాఘవాచార్యులుగారొక ప్రణాళికను సిద్ధముచేసి విశ్వవిద్యాలయమునకు సమర్పించియున్నారు. కాని అది కొనసాగలేదు. ఆంధ్రులందరును ఐక్యకంఠ్యముగా అట్టిదానిని నేటికిని వాంఛించుచున్నారు.

పాశ్చాత్యదేశములందలి విశ్వవిద్యాలయములలో 'నాటకశాఖలు' కలవు. వానిని Departments of Drama and Speech అందురు; దీనినిబట్టి పాఠ్యమునకు (Speech) వారెంత ప్రాముఖ్యమిచ్చుచున్నదియును తెలియగలదు. నాట్యశాస్త్రమందలి 17 వ అధ్యాయములో 'కాకుస్వరవ్యంజన' మనెడి భాగముకలదు. ప్రేమ, శోకము, భీతి మొదలగు భావవిశేషముల వలన కంఠస్వరమున ఏర్పడు వికారము లేదా మార్పు 'కాకువు' అనబడును. దీనినే ఆంగ్లమున 'modulation of voice' అందురు. పద్య-గద్య సంయుక్తమైన పాఠ్యమునకు ఈ 'కాకువు' ప్రాణము. అట్టిదానివిషయమున చక్కని శిక్షణము, అభ్యాసము అత్యవసరములు. అభిమానము, ఉత్సాహము ఉన్నంతమాత్రమున అందరును నటులు కాజాలరు. విద్యావివేకములు, సహజప్రతిభకలవారుకూడ సుశిక్షణములేనిదే రాణింపజాలరు. మరి అట్టివారికి, విశ్వవిద్యాలయ నాటకశాఖలలోనో, మరి యితర ప్రత్యేకనాటకకళాశాలలలోనో అనుభవజ్ఞుల శిక్షణము లభించినచో ఎంతయేని వన్నెకెక్కుదురనుట సత్యసమ్మతమైన విషయము. అట్లు నటనా శిక్షణములో పలువురు తీర్ణులైనప్పుడే సుశిక్షితులైన వృత్తినటులు తయారగుట కవకాశమేర్పడును. అది జరిగిననాడే తెలుగునాటకరంగమునకు మంచి భవిష్యత్తుకలదని చెప్పగలము.[15]

ఉత్తములైన దర్శకుల (=సూత్రధారుల), నటుల, నటీమణుల, న్యాయమూర్తుల, ప్రేక్షకుల లక్షణములేవియో భరతాదులు స్పష్టీకరించియేయున్నారు. నటులకు చక్కని శిక్షణ మొసగుటయేకాక, ఉత్తమనాటకప్రమాణము లెవ్వియో గుర్తింపగలిగినజ్ఞానము ప్రేక్షకులకుకూడ గలిగించుట యావశ్యకమనెడివిషయమును విస్మరింపరాదు.[16] ఇందులకు కళాశాలలను స్థాపింపవలసిన యవసరములేదు కాని ఉపన్యాసములమూలమున, వ్యాసములమూలమున. శాస్త్రగ్రంథములను సరళభాషలో వ్రాయుటమూలమున ఎంతయేని ప్రచారమును చేయవచ్చును.

# భరత వాక్యము

ఇంతవరకును చేసిన విషయవివరణమునుబట్టి, తెలుగునాటకసాహిత్య మెంత విశాలమైనదో, అచిరకాలముననే అది ఎంత సత్వరాభివృద్ధిని పొందినదో, తెలుగు నాటకరంగ మెట్లు పరిణామశీలమును, ప్రగతిశీలమును అయినదో సుస్పష్టము కాగలదు. రచనలో, విమర్శలో, ప్రయోగములో, నటనలో తెలుగువారు భారతీయు లందరకును తలమానికముగా నున్నారనుట నిస్సంశయము.

నాటకరచనావిషయమున తెలుగువారు పెక్కు పోకడలను పోయినారు; వారు ప్రయత్నించిచూడని ప్రయోగరీతి లేదన్నచో అతిశయోక్తి కాజాలదు; నేడు ఇంకను విరివిగా ప్రయోగములు జరుగుచున్నవి.

ఇంక నాటకప్రయోగవిషయము—విదేశములవారి వివిధనటనారీతులను పరిశీలించివచ్చిన బళ్లారి రాఘవాచార్యులుగారు తెలుగు నటుల నటనాకౌశలము మరి యే దేశమువారి నటనా కౌశలమునకును తీసిపోదని పలుసార్లు పేర్కొనియున్నారు. విదేశములలో నాటకప్రయోగ శిక్షణము పొంది, ఇటీవలనే స్వదేశమునకు తిరిగివచ్చిన పి. ఎస్. రామారావుగారుకూడ ఇదే అభిప్రాయమును వ్యక్తము చేసియున్నారు. పద్మశ్రీ బిరుదముతో రాజసన్మానమును పడసిన తొలి భారతీయనటుడు తెలుగునటుడే యగుట గుర్తించియున్నాము. నాటకప్రయోగవిజ్ఞానమున అపారమగు కృషి సల్పుచున్న భారతవిశ్వవిద్యాలయములలో ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రథమగణ్యమని చెప్పక తప్పదు.

ఇట్టివి ఇంకను యెన్నియో కలవు. ఇవియెల్ల తెలుగువారికే చాలమందికి తెలియవు; తెలిసికొనవలెననెడి ప్రయత్నమునుకూడ వారు చేయరు। అంతటితో నూరకుండక, తెలుగులో నాటకము లేమున్నవి, నటు లెవ్వరున్నారని యీసడించుచుందురు; పెద్దలలోని ఇట్టి ఔదాసీన్యము భాషకును, ప్రజకును, రాష్ట్రమునకునుకూడ శ్రేయోదాయకము కాజాలదు.

తెలుగు దేశమందలి పెద్దలలో చాలమందికి నాటకములు, నాటకరంగములు అన్నచో అభిమాన మధికమేకాని అభినివేశము తక్కువ; కొందరిలోని ఈ అభిమానముకూడ 'మాట వరుస'కన్న పద్ధతిలోనేయుండును. ఈ ఔదాసీన్యము పెద్దలలో తొలగినకాని, తెలుగు నాటక సాహిత్యమును, తెలుగు నాటకరంగమును సర్వతోముఖాభివృద్ధిని పొందజాలవు.

తెలుగులో ఉత్తమ నాటకములు, నాటికలు, ఏకాంకికలు బయలుదేరినవి; ఇంకను బయలుదేరుచున్నవి. మహానటులు వెలసినారు; ఇప్పుడును కలరు. ప్రయోగ విజ్ఞులైనవా రెందరో అవతరించినారు; ఇప్పుడును ఉన్నారు.........ఈ సంపదయెల్ల సద్వినియోగము కావలయునన్నచో దేశము నలుమూలల నాటకశాలలు వెలయవలెను; నటులకు, నాటక రచయితలకు సుశిక్షణము లభింపగల నాటకకళాశాలలు వెలయవలెను; విదేశములందువలె నాటక కళకు విశ్వవిద్యాలయ గౌరవము (academic status) లభింపవలయును. నటులకు, నాటక రచయితలకు నాటకకళవలననే జీవనము గడచెడిస్థితి రావలయును. ఇది జరిగిననాడు తెలుగు నాటకరంగము ప్రపంచమునకే మార్గదర్శకము కాగలదనుట అతిశయోక్తి కాజాలదు—అట్టి శుభముహూర్త మాసన్నమగునుగాక ! ఇందులకు చిత్తశుద్ధితో కావించిన ఈ నా కృషి (నాట్య శాస్త్రానువాదము, ఈ పరిశోధనావ్యాసరచన) ఏ మాత్ర ముపయోగపడినను, నేను కృత కృత్యుడనే; ధన్యుడనే.

నటరాజు అనుగ్రహించునుగాక !

## నాటకవిమర్శ చరిత్ర

1. 1960 నాటికి 37 గ్రంథములు తెలిగింపబడినవి. ఇందులో కొన్ని గ్రంథములను పలువురు అనువదించియున్నారు. ఉః భానుదత్తుని రసమంజరికి ఎనిమిది అనువాదములు కలవు. చూ. చెలమచెర్ల రంగాచార్యులుగారి ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణమునకు ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారి "సాహిత్యకుసుమాంజలి" (పుటలు 92-95).

2. బి. టి. రాఘవాచార్యులుగారు నటులకు శిక్షణ ఇచ్చుటలో తమ జీవితమంతయు ధారపోసినారు. ఎట్టి మొద్దునైనను రాపాడి రత్నముగా తయారుచేయుటలో వీరు సిద్ధహస్తులు. బందరు రామమోహన్ థియేటరు, ఇండియన్ డ్రమాటిక్ కంపెనీ, బాలభరతసంఘాలలోను, బెజవాడ మైలవరం కంపెనీలోను, ఏలూరు మోతేవారి కంపెనీలోను నాట్యాచార్యులుగా పనిచేసినారు. ప్రసిద్ధనటులు శ్రీయుతలు డి. వి. సుబ్బారావు, పారుపల్లి సుబ్బారావు, జొన్నవిత్తుల, అద్దంకి, పంచాంగం, గురజనాయుడు, సంజీవరావు, తుంగల ప్రభృతులందరును వీరికి శిష్యులు.

3. "......though the Ibsenian doctrine of Heridity and environment as determinants of character and condition, would seem, from our present state of knowledge, to be most rational, no theory or belief, ancient or modern, furnishes better justification for the inequalities of life than the law of karma".

—Gurajada's preface to 'Harischandra'
(English) by Sri G. C. V. Srinivasachari.

4. ఢిల్లీలోని "ఏషియన్ థియేటర్ ఇన్స్టిట్యూట్"లో కొందరు శిక్షణ పొందియున్నారు. వీరిలో పేర్కొన వలసిన ప్రముఖులు శ్రీ కె. వెంకటేశ్వరరావు (రసన-బెజవాడ), శ్రీబకి శ్రీరాం (హైదరాబాదు): మరి కొందరు విదేశములలో శిక్షణ పొందుచున్నారు; వీరిలో పేర్కొన బడ వలసిన వారు శ్రీ రాజారాందాస్ అమెరికాలోని "ఊటా" విశ్వ విద్యాలయములో "నటన"లో పి. హెచ్ డి. పట్టముకొరకు కృషిచేయుచున్నారు. పి. యస్. రామారావుగారు కలకత్తాలో మూడేండ్లు శిక్షణపొంది, తూర్పు జర్మనీ వెళ్ళియున్నారు. వీరిరువురు తిరిగివచ్చిన తరువాత తెలుగు దేశమున కెంతయో ఉపయోగపడగలరని ఆశింపవచ్చును.

## నాటక రచన

1. లోకమున ఎవరేని ఏదేని ఒక ఫలమును సాధించుటకు పూనుకొని, దానిని సాంతముగా, అనగా ఫలము సిద్ధించు పర్యంతమును కొనసాగించినచో, ఆకార్యాచరణమందు ప్రధానముగా 5 అవస్థలు మనకు గోచరించును—

(1) ఏదేని ఒకదాని మీద ఒకనికి అభిలాష జనింపగానే అతడు దాని మీదనే తన దృష్టిని కేంద్రీకరించును. దానిని మననముచేసి, తత్సాధనోపాయముల నాలోచించి, ఒక నిర్ణయమునకు వచ్చును.

(2) సాధనోపాయములు నిర్ణయము కాగానే వానిని ఆచరణలో పెట్టును; అనగా కార్యాచరణమునకు పూనుకొనును.

(3) కొంత ప్రయత్నము జరిగిన తరువాత ఫలము లభించునని కొంత ఆశపొడముట సహజము. కాని ఆశతో పాటు ఆటంకములును ఎదురగుచుండును. ఫలము చేతికందినట్లే

కన్పించి మరల మాయమగుచుండును; అయినను దానిని సాధించుటకు పట్టుదలతో ప్రయత్నము నిరంతరముగా సాగుచునే యుండును.

పై మూడు అవస్థలును సర్వకార్యములకును సహజములు. సాధింప దలచుకొన్న ప్రతి ఫలమును విధిగా చేతికందునని చెప్పజాలము. ప్రయత్నము సఫలమైనచో అది సుఖాంతమగును: కాని విఫలమైనచో అది దుఃఖాంతమగును. అందుచేత తరువాతి రెండు అవస్థలును రెండేసి విధములగుచున్నవి.

(4) (అ) కలిగిన ఆటంకముల నెల్లస్వశక్తిచే కాని, దైవబలముచే కాని క్రమముగా తొలగించుకొనుటతో ఫలము తప్పక లభించునను నిశ్చయము కలుగును.

(ఆ) స్వశక్తికి మించిన ఆటంకము లెదురై, దానిని తొలగించుటకు సమర్థుడు కాలేనిచో అతనికి ఫలము దూరమగుచుండును.

(5) (అ) ఆటంకము లన్నియును తొలగిన తరువాత ఆతడు ఆసించిన సమగ్రఫలమును పొందును.

(ఆ) ఆటంకములను దాటలేనివాడై, చివరకు వానికి లొంగిపోయి శత్రువులచే చంపబడును. లేదా, తానుగా మరణమును తెచ్చి పెట్టుకొనును.

సమగ్రములగు సర్వకార్యములును పై విధముగా 5 అవస్థలను కలిగి యుండును. అవ్యవస్థితములైన లౌకిక కార్యములందివి యొకవేళ స్పష్టముగా కన్పట్టకపోయినను రూపకేతివృత్తమందు మాత్రము ఇవి సువ్యవస్థితములు కావలయును.

2. సంధిఅనునది మొత్తము కథలోఒకభాగముకాగా(a unit of plot)సంధ్యంగములనునవి ఆసంధిలోనివేర్వేరు సన్నివేశములగుచున్నవి.(different actions and incidents)ఆలంకారికులు సంధ్యంగములకు ఆరు ముఖ్యప్రయోజనములను చెప్పియున్నారు—.

(1) ఇష్టార్థరచన (అభీష్టమైన ప్రయోజనములను విస్తరింపజేయుట);
(2) వృత్తాంతానుపక్షయము (ఇతివృత్తము క్షయము నొందక చక్కగా కొనసాగునట్లు చేయుట);
(3) ప్రయోగమునందు రాగప్రాప్తి (ప్రయోగమును రక్తి కట్టించుట);
(4) గుహ్యగూహనము (గోప్యార్థములను గోపనము చేయుట);
(5) ఆశ్చర్యాభిఖ్యానము (సన్నివేశముల నాశ్చర్యకరముగా నొనర్చుట);
(6) ప్రకాశ్యప్రకాశనము (ప్రకాశ మొనర్పదగు అర్థములను ప్రకాశింపజేయుట).

3. "The plot is the first principle, and as it were, the soul of tragedy; character holds the second place".

—(Butcher's translation of the Poetics Pp. 28-29).

4. ఇచ్చట ఇంకొక విషయమును కూడ గమనింపవలసియున్నది. ఐదు అంకములున్నపుడు, ఒక్కొక్క అవస్థ ఒక్కొక్క అంకమునందు నిబంధింపబడుట న్యాయ్యమే అయినను కొందరు దానిని పాటించుటలేదు. ఇట్టి వ్యత్యాసములు, భారతీయరూపకములందు 3, 4 అంకములు కలవానియందే కన్పట్టును,

5. ........Dramatic action, therefore, is not with a view to the representation of character. Character comes in as subsidiary to the action......... Again, without action there cannot be a tragedy, there may be without character......... A further proof is, that novices in the art attain to finish of diction and precision of portraiture before they can construct the plot".

—(Butcher's translation of the Poetics - P. 27.)

6. 'action'అను పదమునకు రూపకపరముగా రెండర్థములున్నవి—
(1) రచనకు సంబంధించినప్పుడు "కథాగమనవేగ"మని యర్థము.
(2) ఇంక ప్రదర్శనమునకు సంబంధించినప్పుడు "నటన"అని యర్థము.

7. ఈ సందర్భమున ఒక విషయమును గుర్తింప వలసియున్నది. ఇచ్చట ప్రాచీన భారతీయులు "విషాదరూపకము"లను రచింపకపోవుటకు హేతువులూహ చేయబడినవి; అంతియేకాని, ప్రాచ్య-పాశ్చాత్య రూపకముల తరతమభేదనిరూపణము చేయబడలేదని తెలియవలెను. విషాద రూపక మొక ఉత్తమకళా సృష్టియనుట నిర్వివాదము. పాశ్చాత్యులు విషాదమును వేరుగాను, ఆహ్లాదమును వేరుగాను వేర్వేరు నాటకములందు చిత్రించిరి; భారతీయులు మాత్రము ఆహ్లాద విషాదములను రెండింటిని సమ్మిశ్రితముచేసి, నాటకములను శుభాంతములను చేసియున్నారు.

## ధర్మి

1. సహజముగా జనించునట్టి స్థాయి-వ్యభిచార్యాది భావములతో కూడినదియును, కవిబుద్ధి కృతరంజనావైచిత్రిలేనిదై శుద్ధముగా నున్నదియును, లోకప్రసిద్ధములైన వ్యవహారములతో కూడినదియును, అంగలీలావివర్జితమును, స్వభావాభినయముతో కూడినదియును, నానాస్త్రీ-పురుషాశ్రయమును అగు నాట్యము 'లోకధర్మి'కి చెందినదగునని భరతుడు పేర్కొనెను (13 వ. అధ్యా).

2. "నటునియందు రసానుభూతి ఉండరాదు. అతడు ఆస్వాదనోపాయము మాత్రమే; కావుననే 'పాత్రము' అనబడినాడు. పాత్రము మద్యాది రసాస్వాదనమున ఆస్వాదయితకు తోడ్పడునేకాని దానికి తదను భూతియుండదు; అది కేవలము ఒక సాధనము మాత్రమే. అట్లే నటుడు ప్రేక్షకుల రసాస్వాదనమునకు ఒక సాధనము మాత్రమే" (అభినవభారతి-1సం-పు. 291)

3. నటులు రసపరవశులైనప్పుడు రంగస్థలమున ప్రవర్తిల్లెడి అనేకానౌచిత్యములను గూర్చి మనము వినుచునేయుండుట ఇప్పట్లస్మరణార్హము. అంతమాత్రమున వానికి రసానుభూతి అసలే యుండదని చెప్పరాదు; రసానుభూతియే లేనిచో వానినటన సహజముగా నుండుట సంభవింపదు. కాని, అభ్యాసపాటవమున నిగ్రహించుకొనుచుండును. పానుగంటివారి 'రాధాకృష్ణ నాటకము'లో మధురకృష్ణాభినయమును గాంచి "పాత్రత్వము ముదిరి పతిత్వములో, బడుచున్న"దని శ్రీకృష్ణు డన్నప్పుడు విదూషకుడు "పాత్రకంత రసోదయముండునా"?యని ప్రశ్నించుట ఇప్పట్ల స్మరణార్హము. మరియు వారి "ప్రచండ చాణక్యము"లో "ఇంతలోన నవ్వి యంతలో నేడ్వని చెనటి నటుడు రంగుచేటు కొఱకె" అనియనుటయు పరిశీలనార్హము.

## కొన్ని సమస్యలు

1. ఆధునికపాశ్చాత్యవిమర్శకశ్రేష్ఠులలో నొకరగు ఏబర్‌క్రోంబీ నాటకములందు పద్యముల యొక్క అవశ్యకమును గూర్చి ఒక ఉత్తమమైన వ్యాసమును వ్రాసియుండుట ఇప్పట్ల స్మరణార్హము. పతితలకును, ముఖ్యముగా ప్రేక్షకులకును మైమరపు కలిగించి, అతిలోకమైన అనుభూతి కలిగింపగల శక్తి పద్యమునకున్నది. అందుచేతనే, కళయైన నాటకమందు పద్యము అవ

